# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్




ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 29 జూలై, 1952 సంచిక

విడిప్రతి వెల ఒకరూపాయి.



# విషయానుక్రమణిక

## జూలై 1952



త్రివర్ణ చిత్రము—'కృషీవలులు' చిత్రకారుడు : ఎ. పైడిరాజుగారు

త్వరలో వస్తుంది



ఈస్టిండియా ఫిలిం కంపెనీ వారి

# సంక్రాంతి

డైరెక్టర్:
సి. పుల్లయ్య





నందన
ఆషాఢము

# భారతి

సంపుటము 29
సంచిక 7

# నా ఉద్వేగము



కీ. శే. చిలుకూరి నారాయణ రావు

జగజ్జ్యోతియని
సర్వసాక్షియని
జనములు నమ్మే
సూర్యుండే తెరు -
వాటుకాడగుచు
దిశా వీథులను
నిశాసుందరిని
నిర్బంధింపగ
నేడ్చితి ; - పద్మున
కలువ కన్నెకును
వలపుల మొగమది
వాడిపోయె ; - నా
యశ్రుధారలను
నానవమల్లిక
నిద్దురయెల్లను
ప్లావితమయ్యెను :
నా విలాపమున
శాద్వలములు ప
చ్చగ నేల్కొనియెను.
తోటమాలి నా
గీతికా బలము
మాత్రగా గొనుచు
నా పద్యములను
వెదజల్లంగా
వెడలిన దచ్చట
విద్యుల్లత ; - నా
యశ్రుబిందు బీ -
జములనాటి నా
విలాపమును బీ -
గాపడుగుచే -
కగా తోటతో
నల్లుకొనియె ; - నే
నణురేణువనై -
నా వెలుగు తోడునా
వాడే ; - నామెద
లో నూర్లకొలది
నుషస్సు లున్నవి ;
తిక్కన త్రాగిన
సోమపాత్రలో
స్వర్గవిషయమే
స్మరణకురా, నా
ఘూర్ణి యనంత -
ప్రభావంతమై
యజాత సృష్టికి
నద్దంబైనది.

చిగురుటాకులే
చిగుర్పకుండా
నాయుద్యానము
వదనవలాడెను. –

పుట్టపు చెఱగున
బుట్టని పూవుల
గట్టి యుంచితిని. –
గాయకులందఱు
గలసినచోటను
నా పాటకు సభ
మూకంబయ్యెను. –

నా ప్రతిభావీ –
ణా మృదురవముల
విశ్వహృదయతం
త్రీ సంతానము
పులుక్కుమనియెను. –

నా మిత్రులకే
నా పాటలు పిం –
తలుగదోచు – నే
ప్రపంచ వీథిని
ప్రభవించిన నవ –
భాస్కరమూర్తిని.

ఆకాశములో
నప్పటి కప్పటి
కావిర్భావము
నొందే గ్రొమ్మా –
ర్గములే నెఱుగను.
నా వెలుగులలో
జుక్కల వెలుగులు
స్రుక్కలేదు. – నా
పాదరసము తర –
లంబై చెదరదు. –

అంబుధిపై నా
నృత్యోత్కరములు
తాండవమాడవు.

కొండలపై నా
యరుణకాంతులు స్పృ –
శింపవించుకయు. –
"అహమస్మి" యనెడి
యహంకార మిం –
కా నాకుదయిం
పంగలేదు. –

కనబడ భయపడి
గడగడ వడకుచు
లేచెద; దూర్వస
నాయుషస్సు రా –
త్రిని దఱిమెడు, – నీ
ప్రపంచమనియెడి
పద్మినిపై గ్రొ –
మ్మంచునిలిచినది. –

బ్రాహ్మీముహూర్త
మునలేచెడి యా
భక్తులకొఱకై
యెదురుచూచెదను.

నాలోనియగ్ని
నారాధించే
భక్తులె ధన్యులు
నా గీతములను
నేటివారు విన
బాడగలే, దీ
గీతికా కుహూ –
ధ్వానము రేపటి
జగత్తుకోసము.

నా గభీర భా
వాంబుధిలోతును
గనుగొనలేకు
న్నది యీ లోకము.

నా యగాధ గా
నము నడి సంతల
లో నమ్మగ సృజి;
యింపలేదు. – నా
ప్రాత చెలులు నా
తోనెగురగ తే
రీ నా శిఖరము
వచ్చే యుగముల
కోసము జ్వలించు!

వారి సముద్రము
మంచువలెను మా
టాడక నిద్రిం
చును; – నా మంద్రో!
త్క్షుబ్ధ మహాంబుధి
వీచీ తాండవ
విలయోపేతము.

నా యీ గీతము
నవనవలోకా
విర్భూతము. – నా
ఘంటాఘోషము
క్రొత్త పథికులను
క్రొత్త వీథులను
సంచరింపగా
రండోరండని
యాహ్వానించును.

వచ్చినతరువా
తే కవులెల్లరు
బుట్టిరి; తమక –

న్నులను మూసికొని
జగముల కన్నుల
మూతలు విప్పుచు
తమ సమాధిపై
మంటిలో విరియు
మల్లియలట్లే
శూన్యము వెడలుచు
శూన్యము జొచ్చిరి.
ఈ యెడారిలో
బిడారులెన్నో
యేగెను జడిచ
ప్పుడు లేకుండా
ఒంటెలవలెనే.

*   *   *

నేనొక ప్రేమిని. –
వాపిడుచుచు నే
డ్పుటయే నా తీ –
వ్రతపము. – మరణది –
నపు విలాపమే
నా గీతములకు
సమ్యోపశ్రుతి. –
నా గీతాలా –
పములకు నా వీ –
ణా తంత్రులు చా –
లకయున్నా, యా
తంత్రులు ప్రిదులవు. –
ఈ నా భావ –
ప్రవాహాలహరీ
ప్రపాత వేగము
జలధుల నుల్లో –
లకల్లోల –
ప్రపూర్ణములుగా
జేయును ; – నావె –
ల్లువకు బిల్లకా –
ల్వాలు పట్టవు; – తీవ్ర
భ్యన్మదీయ భా –
వార్భటీ దుర్భ –
రోదకపూరము
లకు మహోద్ధులే
కావలె ; – మొగ్గలు
విరియుచు మల్లెల
వసమే కాకుం –
టే యీ నా తొ –
ల్కరిధారలు ని
ష్ప్రయోజనంబులు ; –
తటిత్ప్రభలు నా
హృత్కుహరములో
నిద్రిస్తున్నవి. –
కొండలపై, లో –
యలపై, విశాల
భూములపై వి –
చ్చల విడిగానే
బరుగువాతెదను ; –
నాసంద్రములో
బారసాచి యీ
దగాగలుగుతా –
వా ? రా, అయితే !
నాదంభోళికి
తాళగలిగితే
నిలుమెద బెదరక !
నా దప్పిక గీ
ర్పగా జీవిత –
స్రవంతి యున్నది.
జీవితరహస్య –
ముల దెలిసికొన్న
జ్ఞానిని ; – జ్వలించు
నా గానముచే
ధూళీరేణువు
ప్రాణవంతమై
పరుగిడుచున్నది.
ఱెక్కచాచి మి –
న్నారు పురైవ్వనది, –
నే జెప్పబోవు
స్వరహస్య మది
యకథితపూర్వము!
నా యూహా మా –
త్రీక మపూర్వ సూ –
త్రగ్రథితము ; – రం –
డోయీ ! రండీ !
శశ్వజ్జీవ ర –
హస్యము దెలిపెద !
రండో ! రండీ !
స్వర్గ మర్త్యముల
రెంటిని గెలువగ !
స్వర్గము తెలిసిన
తలపుల దెలిపెద ;
జెలులకు దెలుపక
నాయెదలోనే
పదిలపఱుపగా
లేనొక యింతయు.

*   *   *

రావోయీ ! యా –
జీ ! రా ! యీనా
హృత్పాత్రను సో –
మంబున నింపగ
దోయీ ! మృత్యువు
దరించి యమృత –

త్వము పొందగ దో
ర్పడ గదవోయీ !
కాలపుగలతను
గడగా ద్రోయగ -
దోయీ ! యాజీ !
నీ హృదయాం త
ర్యాంతర్మథితా
గ్నిస్ఫులింగతే
జస్స్థగితో
జ్జ్వలద్వారి పూ
రములను నాకును
బంచగదోయీ !
ఆజలముల గ్రో
లగా నెట్టియం -
దేదమైన స -
మ్రాట్టు గాకపో ;
డాతని తలపులు
జ్ఞానదీప్తములు
గాకపోవు; - నిశి -
తదృష్టియది మ
ఱింతనిశితమై
మెసగకపో; - దాక
తృణముగూడ బ -
ర్వత భారము గాం -
చును ; - నక్కలకును
సింహబలముచే -
కూడును ; - ధూళియు
దారాపథమున
కెగయును ; జలబిం -
దువు జలధి విశా -
లత నొందును ; ఆ
నిశ్శబ్దతయును
ప్రలయదినపుహో -

హాకారార్భటి
రేగును ; గాజుల
కాళ్లకు జేగల
రక్తము లంటును !
లే ! లే ! లే ! లే
వోయీ ! యాజీ !
నా యీ పాత్రను
నింపగదోయీ !
తలపుల నిశినా
ధవళజ్యోత్స్నా
పూరము నింపుము.

పథికుని బదలము
గా నిలుసేర్చెద !
ఉబుసుపోక చూ -
చే వారికి దహ -
నహ పుట్టించెద.

నూత్నాన్వేషణ
యత్నత్వరతో
సాగెద ! నవీన
శక్తి ద్రష్ట్ర -
ప్రథా ప్రభోద్య -
ద్భానుడ నయ్యెద !
జ్ఞానులకెల్లను
జక్షుర్గత బిం -
బ ప్రతిమానుడ
నయ్యెద ! - జగతీ
శ్రోత్రాంతరమున ఘో -
షించెద : - భా
రతికి నూత్నర ..
త్ననూపురములను
ఘటియించెద ! త -
త్కింకిణి మృదుల

మోహనగాన
స్వరపూరములను
రోదసీ కుహర
మందు ప్రతిధ్వను
లీనునట్లుగా
జేసెద నందును
భగవద్గీతా
లాపములట్లో
స్మలన మొందగ
విశ్వానందము
వెలయించెద ! - నా
యెంతు టాకులను
కరుణార్ద్రాశ్రూ
త్కరముల గడిగెద !
నన్నయగురులస -
మాన ప్రతిభా —
దివ్యజ్ఞానర —
హస్యగ్రంధము
విప్పుచు బునరు —
ద్ఘాటించెద ; — నా
జ్వల ద్వహ్ని రా -
శిలోని ఝణిక
స్ఫులింగమను ! - సే
నాతని ప్రభలో
బడి లీనమైన
పతంగమను ! ఆ
మధుపూరమునా
యెదలో బొంగుచు
బారలం బారెను !
నన్నయ గురువరు
స్పర్శవేదిచే
హేమీకృతమ -
య్యెన్నా మృద్దే -

హాము ! - నాబూడిద
జ్వలించి మండెను !
ఎడారిలో నొక
సైకత రేణువు
ఎగసి పడుచు భా -
స్కరదీప్తికి నా
శించెను ! - నన్నయ
మహాబ్ధిలో నొక
చిన్ని తరగనై
యగాధ జలముల
నిగారించునొక
ముత్తెము జేకొని
యందే యడగెద ! -
గీతామధువును
గేరుచు నవశత
నొందిన నేనా
వాఙ్నిశ్శ్వాసో -
జ్జీవితుడ నగుదు !
అంధకారబం -
ధురనిశీథమున
నొంటిగా నేడ్చు -
చుంటి ; నీశ్వర -
ప్రార్థన నాఘోష
చే నిశ్శబ్దత
నిండి యుండె; - నీ
దుఃఖపూర్ణమగు
ప్రపంచమునకై
విలపించితి ! - నా
సోమపాత్ర మధు -
హీనమై యున్కి -
కిని శోకించితి.
కన్నులు వ్యథచెం -
దెను; - దేహము బడ -
లెను; - నేనల్లే
కూర్కితి; - నంతట
నెన్నడో భారత -
సంహిత వ్రాసిన
నాగురూత్తముడు
సత్యమూర్తియై
చక్షుల యెదుటను
సాక్షాత్కరించి, యీ
విధమున నుచ్చై -
స్స్వనములు బల్కెను;
"ప్రేమ జ్వరార్తుడా
బెగ్గిలెద వేల ?
ప్రేమ మధువును గ్రోలి
ప్రీతిబొందగ దోయి !
నీయనాహత హృదయ—
తంత్రులను మీటుచును
పలికింపు మా గాన
ఘూర్ణిత ధ్వానముల
ఆసోమ యాగమున
నవభృథంబును సల్పి
యాచక్షువుల జాలి
కాగ్రముల నిల్పుకొని
నీ హాసమున వేయి
నిట్టూర్పులే పుట్టి
నీయశ్రువుల లోక
హృదయంబు కంపింప
ప్రేమజ్వరార్తుడా !
బెగ్గిలెదవేల ?
ప్రేమ మధువును గ్రోలి
ప్రీతినొందగ దోయి !
పూమొగ్గయును బోలె
విరియకుండగ నెన్ని
నాళ్లిట్లు పడియుంట ?
లెమ్మోయి ! వికసించి
నీపరిమళ రాశి
నవమల్లికయు బోలె
దిగ్దిగంతరా—
ళముల బర్వగనిమ్ము !
ప్రేమజ్వరార్తుడా !
వాకట్టుచే బాధ
పడనేల ? యగ్నిలో
గుగ్గిలమువలె బడుచు
నానాదిశల దివ్య
ధూపముల నెగజిమ్ము !
ఘంటానినాద సదృ—
శంబుగా నిశ్శబ్ద
తను భంగ మొనరింపు ;
మంగాంగములనుండి
యొక యార్తనాదంబు
బుట్టింప గదవోయి !
ప్రేమజ్వరార్తుడా !
జ్యోతివోయీ ! నీవు
ఖ్యాతిగా నీవెల్గు
లోకాలలో నించి
నీతోడ తోడివా
రలువెల్గగా జేసి
యానాటి మధువణిగ్
హృద్రహస్సుల దెల్పు
ప్రేమ జ్వరార్తుడా !
మధు పూరమవు కమ్ము
మధుపాత్ర మవుకమ్ము
భయ దర్పణము నేల
బడగొట్టి, ప్రాతపా—
త్రముల నవ్వల విసరి

వేణువనమును వెదకి
వేణువొక్కటి బట్టి
గోపికా గీతికా—
కల్యాణ మోహనో—
త్సాహగానము చేత
సందేశమును బంపు
ప్రేమ జ్వరార్తుడా !
నీగీతికకు గ్రొత్త
సీటులను గల్పింప,
నీగానమున సభను
మోహితముగా జేయ
లెమ్మోయి ! ప్రాణంబు
గల జీవులకు నెల్ల
కొత్త జీవముపోసి
"ఉత్తిష్ఠ ! జాగృహి !"
అని మేల్కొలుపుమయ్య!
ప్రేమ జ్వరార్తుడా !
లేలెమ్ము పూర్వంపు
దిగులు దిగవిడుచుచును
గీతికానందంబు
నందోలలాడుచును
ఘంటాఘనధ్వాన
ముల బర్వచేయుచును
ప్రేమజ్వరార్తుడా ! "
అనుపలుకులకును
నెద రవులుకొనెనె
వేణుగానమా
ధురితో భావము

గుబులు గుబులుమని
యుబుకుచు బొంగుచు
బొరలిపాఱె ; - శ్రో
త్రమునకు స్వర్గము
గల్పించుటకై
తంత్రినుండి సం -
గీతపు తీవిని
లేచితి ; - నాత్మను
గప్పినయవనిక
కడలకు దొలగెను.

భావనాద్భుతర
హస్యము వ్యక్తము
చేసితి ; - నఱమఱ -
చిన నా దేహము,
వికారమై కొఱ -
గాకయున్న నా
దేహము ప్రేమపు
టులితో మలచిన
యట్లయ్యెను! - నే
మానవుడనైతి ! -
విశ్వతత్త్వమది
విశదంబయ్యెను
నభోగామినై
జ్యోతిర్మండల -
గత రహస్యములు
చంద్రమండలాం -
తర్గతనాడులు

విస్పష్టములై
వెలసెను నామది !
నిశీథినికి జం -
ద్రునివలె నందము
గూర్చెను ; - నేనీ
జీవిత రహస్య
ములపై గల తెర
లను దొలగింపగ
ప్రకృతిలోన నొక
భాగమై వెలయు
మానవ నిర్మితి -
మర్మము దెలియగ
మాపులనెంతో
మదియోచించితి
నేనొక నిష్ఫలా -
ర్పను ! స్వర్గంబున
కెగబ్రాకెద !
ధూమమనైనా
యగ్నిజాతుడను
ఉన్నతభావో -
న్మీలితమానా
లేఖిని జీవ ర -
హస్యంబుల లో -
కాలకు జాఱెను !
జలబిందువొకటి
జలధిగమాఱెను !
ఇసుకరేణువే
యిలగా బొదలెను!



# బద్దెన కవికాలము



శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

నీతిశాస్త్రముక్తావళియను బద్దెననీతులను రచించిన బద్దెననన్నెచోడుడు—కుమార సంభవ కావ్యకర్త కాడు. కాని వీరిరువురు కరికాల చోడవంశజులు.

ఈ బద్దెనకవికాలమును నిర్ణయించుటకు కీ. శే. జయంతి రామయ్య పంతులుగారు కృష్ణజిల్లా, గన్నవరంతాలూకా, కొండనాయని వరశిలా శాసనములను ప్రకటించియున్నారు.

'బద్దిగ *I*
|
(చో) పెదోరయ
|
చోడబద్దిగ *II*'[1]

—క్రీ. శ. 1261

ఇది ఇమ్మడి బద్దెనకాలమునాటిదానశాసనము. ఈ చోడవంశములో ఇరువురు బద్దెనలున్నారు. కాని, ఇద్దరిలో కవిబద్దెన యెవరో? తెలియదు. బద్దెన నీతులలో కవి తండ్రిపేరు చెప్పకొనలేదు. కాబట్టి శిలాశాసనములో తండ్రిపేరు చెప్పని మొదటి బద్దెనయే కవిబ్రహ్మయనునన్నచో అప్పుడీతని పురుషాంతర కాలము క్రీ. శ. 1171—1201 ప్రాంతమగుచున్నది.

'నీతిశాస్త్రముక్తావళి కర్తయగు బద్దెనృపాలుడును, ఈ (కొండనాయనివర) శాసనకర్తయగు బద్దెనృపాలుడును నొక్కవ్యక్తియేయనుట కాధారములు లభించునంతవఱకును బద్దెనకాలము క్రీ. శ. 1160 ప్రాంతమని యంగీకరింతము.'[2] అను శ్రీ చాగంటి శేషయ్యగారి సందేహము నిక్కముగ గమనింపక తప్పదు.

పోతే, మద్రాసు ఓరియంటల్ లైబ్రరీస్థానిక చరిత్రయందలి యొకానొక చిత్తుశాసన ప్రతిలో 'సన్నగంధవారణ నామాది ప్రశస్తి సహితంశ్రీ మహామండలేశ్వర బద్దచోళ నరేంద్ర.'[3] కవి నామము కలదనుటయేకాక, ఇతను 'కర్నూలు జిల్లా ప్రాంతమున బరిపాలించుచుండినట్లు తోచుచున్నది. ఈ శాసనము పాశ్చాత్య చాళుక్యులైన భువనైకమల్లుని కాలములోనిది. కావున నీతడు క్రీ. శ. 1150 లో నుండెనని యూహింపవచ్చును. అయినపట్టి బిరుదులుకలవాడు కేవల సామంతరాజా లేక స్వతంత్రుడాయని సందేహింపవలసియున్నది. ఈ శాసనము చెన్నపట్నపు లైబ్రరీలోని చరిత్రములలోనిది కావున నమ్మదగినదికాదు.'[4] అను శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి తీర్మానము పరిశీలింపదగియున్నది.

కళ్యాణి చాళుక్యవంశజులలో 'భువనైకమల్ల' బిరుదాంకితుడు క్రీ. శ. 1068—76 మధ్య 'ఇమ్మడి సోమేశ్వరు' డొక్కడేకలడు. కాబట్టి, ఈ చిత్తు శాసనకాలము క్రీ. శ. 1150 ప్రాంతముదని చెప్పటకు వీలులేదు. అది క్రీ. శ. 1068 ప్రాంత కవి చరిత్రయగుచున్నది.

ఇక నీ రెండు శాసనములలో నేది కవికాలమును నిర్ణయించుటకు పనికివచ్చునో? గ్రంథాధారముతో నిర్ణయింపవచ్చును.

'నన్నెచోడనరేంద్రా (1—18), కొమరుర భీమా (8—5), సన్నగంధవారణా (1—33), వివేక చతురాననుడా (1—11), రాజరాజమనోజా (1—87), రాజమనోజ భూభుజా (1—9), బద్ది

1. 'స్వస్తిసమస్త ప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వర వీరనారాయణ చోడబద్దిగ దేవరాజులు శకవరుషంబులు 1183 గునేంటి కర్కాటక సంక్రాంతినాండు...'

—ఆం. క. త., భా. 3, పు. 23

2. ఆం. క. త., భా. 3, పు. 21. 22

3. *Meconji Local records*.

4. ఆం. క. త., భా. 3, పు. 21—22

లి. గా. రా. న., పు. 106—107.

నరేంద్రా (1—7)' రాజమనోజ రాజాంకబద్దెన (గద్య).'

శతకమందలి 'రాజరాజ మనోజా, బద్దె నరేంద్రా' అనుమకుట చరిత్రకును, చిత్తుశాసన ప్రతియందలి 'కృష్ణవేణానదీతీర దక్షిణ షట్సహస్ర విషయాధీశ్వర...వేంగి చాళుక్య మూలస్తంభ... నన్నగంధవారణ...బద్దెచోళ నరేంద్ర' 6 చరిత్రకును సంబంధము కలిపినచో. క్రీ. శ. 1083—84 మధ్య వేంగి చాళుక్య 'రాజరాజు' 7 సామంతుడీబద్దెనకవియని భావించవచ్చును. ఇతను వేంగి ప్రభువగు ఒమ్మడి రాజరాజు సామంతుడు కాకపోయినను, ఇతని మనుమడు ఇమ్మడి రాజరాజు సామంతుడు కాకపోడు.

తెనుగు భారతకృతి పతియగు వేంగి చాళుక్య రాజరాజునకు 'రాజమనోజ (ఆది., 8—323)' బిరుదమున్నట్లే, తత్పౌత్రుడగు వేంగి చాళుక్య రాజరాజునకును 'రాజమనోజ (భూభుజ)—రాజరాజ మనోజ' అను బిరుదముండి యుండును. తాత బిరుదమును మనుమడు ధరించుట కులాచారము

తచ్చాళుక్య ప్రభు బిరుదమును బద్దెన తాను '(రాజ) రాజమనోజ రాజాంక (ము)' గాసరించి నాడనుట సామంతకవి లక్షణము. ఈ 'రాజరాజ మనోజ' బిరుదము 'రాజరాజ' ప్రభువునుగూడ వ్యంజకము చేయుచున్నది.

చిత్తుశాసన ప్రతి చరిత్రనుబట్టి చూచినచో' బద్దెనకవి క్రీ. శ. 1068—76 మధ్య పడమటి చాళుక్య 'భువనైకమల్లు' కాలములోను, క్రీ. శ. 1083—84 మధ్య ఇమ్మడి తూర్పు చాళుక్య 'రాజరాజు' కాలములోను సమకాలిక సామంతుడుగా క్రీ. శ. 1068—84 ప్రాంతమున గుంటూరుజిల్లా కమ్మనాటిని—'షట్సహస్ర విషయ' మును పరిపాలించినట్లు సమన్వయము కుదురుచున్నది. శతకమందలి 'నన్నగంధవారణ (1—33)' బిరుద మీ చిత్తుశాసన ప్రతియందలి 'నన్నగంధవారణ' ప్రశస్తితో సరిపోవుచున్నది.

పశ్చాత్పరముగా శిలాశాసన చరిత్రనుబట్టి చూచినచో, మొదటి బద్దెన క్రీ. శ. 1150—65 మధ్య పడమటి చాళుక్య 'త్రైలోక్యమల్లు' కాలములోను, క్రీ. శ. 1172 నాటి ముమ్మడి తూర్పు చాళుక్య 'రాజరాజు' కాలములోను సమకాలిక సామంతుడుగా క్రీ. శ. 1150—72 ప్రాంతమున కృష్ణజిల్లా రాజ్యమును పరిపాలించినట్లు చెప్పబడున్నది. కాని ఆ త్రైలోక్య మల్ల తైలపునికి 'భువనైక మల్ల' బిరుదము లేదు. కావున, శిలాశాసన చోడవంశము కవివంశము కాదనవచ్చును. కాగా, చిత్తుశాసనమందలి చోళవంశమే కవి వంశముగా నున్నది.

ఇంతకు, గ్రంథాగార సాక్ష్యములనుబట్టి క్రీ. శ. 1054 తేది కుమారసంభవ కావ్యకర్త నన్నిచోడ కవిబ్రహ్మయు, క్రీ. శ. 1083—84 నాటి నీతిశాస్త్రముక్తావళికర్త బద్దెన నన్నెచోడకవి బ్రహ్మయు క్రీ. శ. 11 శతాబ్ది తెనుగు కవులుగా కనబడుచున్నారు.

బద్దెన 'కావ్యకమలాసనుడు' సుమతి శతకము వ్రాసినపిమ్మట నీ బద్దెన నీతులు రచించినట్లు పీఠిక పద్యములు తెల్పుచున్నవి.

---

6. *Meconji Local Records.*

7. చేకిశిలాశాసనము. *Epi., Ind., VOL. VI.* 'శాకాబ్దేర సఖాంబరేందుగణితే (వేంగీ)... రాజ్యాభిషిక్తో...శ్రీ రాజరాజో విభుః.'

8. *Mecomji Local records.*

# యజ్ఞము



శ్రీ వంగోలుముని సుబ్రహ్మణ్యం

ధ్యాయన్ కృతే। యజన్ త్రేతాయాం। ద్వాపరే అర్చయన్। కలౌ సంకీర్త్య కేశవం॥ అనగా కృతయుగమునందు ధ్యానమును, త్రేతాయుగమునందు యజ్ఞమును, ద్వాపరయుగమునందు అర్చనయు, కలియుగమునందు కేశవసంకీర్తనమును ప్రాముఖ్యము నెందియుండును. ఇది యొక ప్రమాణము. దీనింబట్టి త్రేతాయుగమునందు యజ్ఞము విశేషప్రాముఖ్యము నెందియుండెనని తెలియును. దశరథుడు ఆ యుగమునందు అశ్వమేధమును పుత్రకామేష్టియాగము జేసియుండెను. శ్రీమద్రామాయణము జదివినయెడల ఆ యుగమునందు మహర్షులు యజ్ఞములజేసి వారి ఆశ్రమములందు అగ్నిహోత్రాదికములు జరుపుకొనుచుండినట్లు మనకు విశదమగుచున్నది. విశ్వామిత్రుడు మహారాజుగా నుండిన కాలములో వసిష్ఠుని యాశ్రమమునకువచ్చి "తపోగ్నిహోత్రశిష్యేషు కుశలం పర్యపృచ్ఛయత్॥" అనగా "మీ తపస్సు బాగుగా జరుగుచున్నదియా, అగ్నిహోత్రములు బాగుగా జరుగుచున్నవియా, మీ శిష్యగణము కుశలముగ నున్నదా," అని యోగక్షేమవిచారణ జేసినట్లు జెప్పియున్నది. జనకమహారాజు అనేక యాగములుజేసి అగ్నిహోత్రములు జరుపుకొనుచుండెను. శ్రీరాములు శివధనుర్భంగము జేసినవెనుక జనకుని దూతలు దశరథునివద్దకు బోయి, వివాహమునకు తరలిరమ్మని వేడుటకు ముందు "జనకమహారాజు సాగ్నిహోత్రపురస్సరముగా క్షేమముగా నున్నారు. తమతో ఇట్లు మనవి జేయమన్నారు" అని జెప్పినట్లున్నది. ఇట్లు త్రేతాయుగమునందు బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు యజ్ఞములుజేసి ఆహితాగ్నులై యుండిరి. ద్వాపరయుగమునందును ధర్మరాజాదులు యజ్ఞముల జేసియుండిరి. కలియుగమునందును నేటివరకు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు యజ్ఞయాగాదుల జేయుచున్నారు. ఇట్లు అనుస్యూతముగ మనదేశమునందు జరుగుచున్న యజ్ఞమనుసంస్థయొక్క పుట్టుకయు, కాలానుగత పరిణామమును, ఇట్టి యజ్ఞములయొక్క సాంఘిక నైతిక రాజకీయ ప్రయోజనమును నీ వ్యాసమునందు విమర్శింపబడును.

## యజ్ఞముయొక్క పుట్టుక

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః॥ అని గీతలయందు జెప్పబడియున్నది. ఇందువల్ల సృష్టి యెప్పుడు బుట్టియుండెనో అప్పుడే యజ్ఞముగూడ బుట్టెను అను సిద్ధాంతము యేర్పడుచున్నది. కావున త్రేతాయుగమునకు బూర్వము గూడ యజ్ఞమను వ్యవస్థ యుండెనని మనము నమ్మవలసియున్నది. వేదభాగమగు పురుషసూక్తమునందు దేవతలు యజ్ఞముజేసియుండినట్లును అట్టి యజ్ఞమునందు వసంతఋతువు ఆజ్యముగను, గ్రీష్మర్తువు సమిధలుగను, శరదృతువు హవిస్సుగను వారుపయోగించియున్నట్లును విరాట్పురుషుని యజ్ఞపశువుగ వారు బంధించియున్నట్లును అట్టి యజ్ఞఫలితముగ నీ సృష్టియంతయు అవిర్భవించియున్నట్లును జెప్పబడియున్నది. పురుషసూక్తమను శ్రుతివాక్యము, "సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా" యను గీతావాక్యమును దృఢపరచుచున్నది. కావున సృష్టియు, వేదమును, యజ్ఞమును, ఈ మూడునుగూడ అనాదివ్యవస్థలని మనము నమ్మవలసియున్నది.

## యజ్ఞము వేదమయము

వేదమునందు విశేషభాగము యజ్ఞముల గూర్చి జెప్పుచున్నది. యజ్ఞములజేయు విధానమును, యజ్ఞములకు గావలసిన పరికరములును యజ్ఞనిర్వాహకులగు ఋత్విజుల కర్తవ్యములును, దేవతలకు నివ్వవలసిన నానావిధములగు హవిస్సులును, యజ్ఞమునకు మూలాధారమగు అగ్నిహోత్రమును దాని నిర్వహణమును, ఇట్టి విషయము లనేకములు వేదమునందు జెప్పబడియున్నవి. ఆయా భాగములకు గావలసిన మంత్రములన్నియు వేదమునందున్నవి. యజ్ఞమునందు

వేదచోదితము గాని ప్రసంగము గాని ప్రస్తావము గాని లేదు.

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః॥ అని గీతలయందు జెప్పబడియున్నది. పూర్వయుగములందలి ప్రజలకు యజ్ఞమనునది దక్క వేరొండు కార్యము గాని వేరొండు భావము గాని యుండినట్లు గనబడదు. వారెట్టి కర్మము గాని కార్యము గాని జేసినయెడల దాని ప్రయోజనము యజ్ఞము కొరకే గాని మరియొక కార్యార్థము గాదు. ఇందు కుదాహరణము వేదభాగమగు చమకము. ఇందు 5 వ అనువాకము మొదలు చివర అనువాకమువరకు ప్రతి అనువాకమునకు చివరన "యజ్ఞేనకల్పేతాం" అనియు "యజ్ఞేనకల్పంతాం" అనియు నుండుటంబట్టి చమకమందు కోరబడియుండు ప్రతివస్తువును యజ్ఞమునం దుపయోగించుకొరకేనని స్పష్టపడుచున్నది. ఆ యుగముల ప్రజలకు ఇంద్రియగోచరములు గాని ఇంద్రాది దేవతల నారాధించుటకు సాధనము యజ్ఞము. ఈ యజ్ఞమును సాధించునది వేదము. కావున యజ్ఞము వేదమయము. వేదము యజ్ఞమయము.

## భగవద్గీత

యజ్ఞఫలిత మెద్దియో యజ్ఞ మెందుకొఱకు జేయవలెనో భగవద్గీత 3 వ అధ్యాయమునందు జెప్పబడియున్నది.

శ్లో॥ అన్నాద్భవంతి భూతాని
పర్జాన్యా దన్నసంభవః
యజ్ఞాద్భవతి పర్జన్యః -
యజ్ఞః కర్మ సముద్భవః ॥ 3—14

అనగా "అన్నమువల్ల ప్రాణులు బుట్టుచున్నారు. పర్జన్యునివల్ల అన్నము కల్గుచున్నది. యజ్ఞమువల్ల పర్జన్యుడు వర్షము గురిపించుచున్నాడు" అని యర్థము. ఈ విధముగ వర్షమునకును ఆహారమునకును ఆధారభూతములు యజ్ఞములని యెంచి జనులు యజ్ఞముల జేయుచుండిరనుటయం దెట్టి ఆశ్చర్యమును లేదు. యజ్ఞశిష్టమగు నాహారమును భుజించుటవల్ల అన్ని పాపములు బోవుననియు, అట్లుగాక కేవల ముదరపోషణార్థమై ఇతర అన్నముల దినువారు దొంగలవంటివారనియు గీతలయందు జెప్పబడియుండుటవల్ల యజ్ఞమున కెంత ప్రాముఖ్యత నిచ్చియుండిరో మన మూహింపదగియున్నది.

## పశువిశసనము

వేదచోదితమగు క్రతువులయందు పశువిశసనమును వపాహోమమును జరుగుచున్నవి. పురుషసూక్తమునందు దేవతలు జేసినట్లు జెప్పబడియుండు యజ్ఞమునందు, విరాట్పురుషుడు యజ్ఞపశువుగ బంధింపబడి యున్నట్లును, వసంత గ్రీష్మశరదృతువులు వరుసగ ఆజ్యము, సమిధలు, హవిస్సుగ నుపయోగపరచబడియున్నట్లును జెప్పినది యొక రమ్యమగు రూపకము (*Metaphor*)గ భావించవచ్చును, గాని యజ్ఞమునందు పశుబంధమును వపాహోమమును కడు ప్రాముఖ్యములని జెప్పుటకు పురుషసూక్తమే ప్రమాణము. ఇంద్రాది దేవతలకొరకు మనము యజ్ఞముల జేయుచున్నాము. పితృదేవతలకొరకు మనము శ్రాద్ధాదుల జేయుచున్నాము. దేవతలకును పితృదేవతలకును మాంసమునందు ప్రీతియని వేదమునందును స్మృతులయందును జెప్పబడియుండుటంబట్టియు, వెనుకటి యుగములందు అన్ని వర్ణములవారును మాంసాశనులయి యుండినట్లు అనేక దృష్టాంతము లుండుటంబట్టియు, వేదచోదితమగు యజ్ఞకర్మమునందు పశువిశసనము జరుగుటను మనము యెక్కువగ విమర్శించి, ఆ కారణముచే యజ్ఞమునం దసూయయును నిరాదరణమును జూపుట భావ్యము గాదు. ఈ విషయమును విజ్ఞులు చారిత్రక దృష్టితో జూడవలసియున్నది. పూర్వయుగములలో ఇతర దేశములందలి జనులుగూడ దేవతలను మాంసాహుతులతో నారాధించుచుండిరని వారి గ్రంథముల వల్ల మనకు దెలియుచున్నది. అట్టివారి యజ్ఞములందు కంటె మన వేదచోదిత యజ్ఞయాగాదులందు అనేక విధములగు సాంఘిక ఆధ్యాత్మిక నైతిక రాజకీయ వ్యవస్థలు గనబడుచున్నవని యీ విషయము విమర్శించిన విద్వాంసుల వ్రాతలవల్ల మనకు దెలియుచున్నది. అనాదినుండియు భారతదేశమునందు జరుగుచున్న పలువిధములగు యజ్ఞయాగాదుల విమర్శించి చూచినయెడల భారత విజ్ఞానమునకును, నైతిక ఆధ్యాత్మిక జీవితమునకును, యజ్ఞయాగాదులు పలువిధముల దోడ్పడియుండెనని మనకు సుబోధకమగుచున్నది. ఇట్టి సన్నివేశముల విమర్శించి నిరూపించుటయె ఈ వ్యాసముయొక్క యుద్దేశ్యము.

## యజ్ఞమువల్ల వైజ్ఞానికాభివృద్ధి

భూగోళ ఖగోళ శాస్త్రములును గణిత శాస్త్రము, జ్యోతిషశాస్త్రము, వాస్తుశాస్త్రము, పదార్థ విజ్ఞానశాస్త్రము, శారీరశాస్త్రము, మున్నగు అనేకశాస్త్రములు యజ్ఞకర్మకు దోడ్పడవలసి యున్నది. కావున ఆయా శాస్త్రములు అభివృద్ధి జెందుటకు పూర్వయుగములలో శ్రౌతయాగములు మిక్కిలిగ నుపయోగపడి ఆర్యసంఘమహోన్నతికి గారణములైయున్నట్లు మనము అంగీకరింపవలసి యున్నది. ప్రాచీనకాలములో విద్యాభివృద్ధికిగాని శాస్త్రాభివృద్ధికిగాని అవసరములగు వైజ్ఞానిక సమావేశములు జరుపుటకు అవకాశములు లేకుండెను. ఇట్టి పరిస్థితియందు యజ్ఞయాగాదులవల్ల అట్టి వైజ్ఞానిక ప్రయోజనములు గలుగుచుండెడివి యని శ్రీ వాల్మీకి రామాయణమున దశరథుని అశ్వమేధయాగ వర్ణనలోని ఈ క్రింది శ్లోకమువల్ల విశదమగుచున్నది.

"కర్మాంతరే తదా విప్రాః,
హేతువాదాన్ బహూనపి
ప్రాహుస్స్మ వాగ్మినో ధీరాః,
పరస్పర జిగీషయా॥" బాల: 14-17

అనగా, అశ్వమేధయాగమున విరామకాలములందు (*During intervals*), ప్రేక్షకులుగ వచ్చిన విప్రులలో ధీరులును, వాక్పటిమగలవారును నగు తర్క మీమాంసశాస్త్రపండితులు, ఒండొరుల జయించవలెనను నుత్సాహముతో బహువిధములగు హేతువాదముల జరుపుచుండిరి—

ఇట్లు తర్కవ్యాకరణ మీమాంసాది శాస్త్రముల అభివృద్ధికి పూర్వయుగములనుండియు యజ్ఞయాగాదులు ఎక్కుడు సహకారము జేసియుండినట్లు మన మూహింపవలసియున్నది. పరిపాలనా సౌష్ఠవమును, రాజధర్మముల నిరూపణమును, శత్రురాజుల దాడిని తప్పించి సామ్రాజ్యనిర్వహణము ద్వారా దేశమునందు శాంతి నెలకొల్పుటయు, మున్నగు ప్రయోజనములు రాజసూయము అశ్వమేధము మున్నగు యాగములవల్ల గలుగుచుండెడివి. రాజసూయాశ్వమేధములు ప్రత్యేకముగ మరియొక వ్యాసమునందు విమర్శించబడును.

## చారిత్రక దృష్టితో విమర్శించవలయును

యజ్ఞమునందలి నైతికభాగముయొక్క ప్రాముఖ్యమును చక్కగ గమనింపక, అనేకమంది యజ్ఞముల నిరసించుచున్నారు. తృణీకరించుచున్నారు. దూషించుచున్నారు. పూర్వయుగమునం దాచరణలోనుండి ఇప్పు డాచరణలో లేని, కొన్ని వ్యవస్థలను మాత్రము విమర్శించియు, నిరసించియు, యజ్ఞకర్మయందుండు సుప్రసిద్ధ నైతికభాగమును గమనింపక త్రోసిపుచ్చుచున్నారు. ఇట్టి ప్రాచీన వ్యవస్థలను చారిత్రక దృష్టితో జూడవలయును. ఆకాలపు సంఘపరిస్థితుల ననుసరించి విమర్శింపవలెను. కడు ప్రాచీనములగు సన్నివేశములయందు ఇప్పటి నాగరికతానురంజకములగు భాగములున్నయెడల వాటిని బయల్పరచి మనదేశమునకే గాక ప్రపంచమునందలి అన్నిదేశములవారి వైజ్ఞానికాభివృద్ధికి దోడ్పడుట మన విద్యాధికులకు విధియైయున్నది. వేదమును, అందు ముఖ్యముగ యజ్ఞయాగాదులకు సంబంధించిన భాగములను జదివి, విమర్శించి, గొప్పగ్రంథములు వ్రాసిన, ఫ్రెంచిపండితులును జర్మన్ పండితులు నున్నారు. వార లెట్టిదృష్టితో విదేశవ్యవస్థలను బరీక్షింపుచున్నారో మనము గమనింపవలసి యున్నది.

## యజ్ఞమునందలి నైతికభాగము

యజ్ఞపరికరములను స్రుక్స్రువాదులతోను, అధ్వర్యుడు, హోత, ఉద్గాత, మున్నగు ఋత్విక్కులతోను జేయబడుయజ్ఞము బహిరంగయజ్ఞము. ఈ యజ్ఞమునందు ప్రతిఫలించుచు గోచరించు అంతరంగికయజ్ఞము మరియొకటి గలదు, అని యజ్ఞపురుషుడు హెచ్చరికజేయుచున్నాడు. సోమయాజి నిత్యాగ్నిహోత్రము చేయుటకు ప్రారంభించినంతటనే ఈ క్రింది మన్త్రమును జెప్పుచున్నాడు.

శ్రుతి॥ వాచా త్వా హోత్రా ప్రాణేనో
...ద్గాత్రా చక్షుషాధ్వర్యుణా।
మనసా బ్రహ్మణా శ్రోత్రేణాగ్నీధ్రేణ త్వా
పంచభిర్దైవ్యైః ఋత్విగ్భిరుద్ధరామి॥

అర్థము = వాక్కును హోతగాను, ప్రాణమును ఉద్గాతగాను, కనులు అధ్వర్యుడుగాను, మనసు బ్రహ్మగాను; చెవులు అగ్నీధ్రుడుగాను ఇట్లు నా

పంచేన్ద్రియములు నాకు ఋత్విక్కులుగా నెంచు కొని (ఈ గార్హపత్యమునుండి) నీ యగ్నిని నే సద్ధరించుచున్నాను.

ఇక్లే—"చిత్తస్రుక్ చిత్తమాజ్యం వాగ్వేదిః" ఇత్యాది మన్త్రములున్నవి. ఇట్లు జేయబడు యజ్ఞము ఆంతరంగిక యజ్ఞము. ఇదియే మానసికయజ్ఞము. ఇదియే ఆత్మయజ్ఞము. స్రుక్ స్రువాది పరికరములతో జేయబడు బహిరంగ యజ్ఞమునకు ని మానసిక యజ్ఞము తోడునీడ (*Counter-part*) గ నుండవలసియుండు నని యజ్ఞేశ్వరుని భావము. దీని వివరము భగవద్గీత యందు గలుగబడియున్నది.

### భ గ వ ద్గీ త

వేదవిహిత బహిరంగకర్మయజ్ఞమును శ్రీకృష్ణుడు గీతలయందు కఠినమగు నైతికపరీక్షకు గురిజేసియున్నాడు. యజ్ఞసందర్భమున గీతలయందు శ్రీకృష్ణుడుజేసిన యుపదేశము లన్నియు వరుసగ నీ క్రింద వివరించుచున్నాము.

(1) ప్రప్రథమమున, శ్రౌతయజ్ఞమునందు సోమపానముజేసిన పుణ్యాత్ములకు తప్పక పాపములు పోవుననియు వారు స్వర్గము జేరుదురనియు జెప్పి, అట్టివారు సంపాదించుకొనియుండు పుణ్యము, కొంత నియమిత పరిమితి గలిగియుండుననియు, అట్టి పుణ్యఫలితము నిశ్శేషమై క్షీణించిన వెంటనే వారు తిరిగి భూలోకమునందు బుట్టి వారి సత్కర్మలవల్ల తిరిగి యుత్తమలోకములకు జేరవలసియుండుననియు జెప్పియున్నాడు. యజ్ఞకర్తలకు స్వర్గలోకమందు శాశ్వతి పట్టాలు ఇత్తురనునది భ్రమయే గాని నిజముగాదు.

"త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్యమాసాద్య సురేంద్రలోకం
అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్
తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి"

గీత 9—20

(2) పైన వివరించిన బహిర్గత కర్మయజ్ఞమువల్ల కష్టమునకు దగిన ఫలితము లేదని మనము దలతుమేమో యని యూహించి, శ్రౌతయజ్ఞముకంటె సులభసాధ్యములగు మరికొన్ని యజ్ఞములున్నవని భగవంతుడు చెప్పుచున్నాడు.

"ద్రవ్యయజ్ఞాః తపోయజ్ఞాః
యోగయజ్ఞాః తథాపరే
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ
యతయః సంశితవ్రతాః
ఏవం బహువిధా యజ్ఞాః
వితతా బ్రహ్మణోముఖే" 4—(28—32)

(3) ఇట్లు బహువిధములగు యజ్ఞము లున్నవని చెప్పి, ఇట్టి అన్నివిధములగు యజ్ఞములలో జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది అని జెప్పియున్నాడు, గాని గాని పశుయజ్ఞము శ్రేష్ఠమైనదని జెప్పియుండలేదు.

"శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్
జ్ఞానయజ్ఞః పరంతప" 4—33

(4) తన విభూతులు జెప్పు 10 వ అధ్యాయము నందు "యజ్ఞములలో జపయజ్ఞము నేను" అని జెప్పియున్నాడు, గాని ఇక్కడను కర్మయజ్ఞమునకు తన ఓటు నిచ్చినవాడుగాడు.

"యజ్ఞానాం జపయజ్ఞోస్మి" 10—25

(5) కర్మయజ్ఞమునందలి నైతికవిమర్శ ఇంకను జేయదలంచి భగవంతుడు దైవాసుర సంపద్విభాగ యోగమునందు కొన్ని యజ్ఞములు నామమాత్ర యజ్ఞములని జెప్పియున్నాడు. అట్టి యజ్ఞములు తాంత్రిక యజ్ఞములనియు నాటకయజ్ఞములనియు శ్రీకృష్ణుని యభిప్రాయము. అట్టి యజ్ఞము లెట్టివి యన-స్వోత్కర్షకొరకును, దంభముకొరకును, ఆడంబరముకొరకును, ప్రదర్శనముకొరకును, జేయబడు యజ్ఞములు. ఇట్టి యజ్ఞములు జేయువారు ధనమాన మదాన్వితులు. వారు విధిని లక్ష్యపెట్టక విధి విరుద్ధముగ యజ్ఞములు జేయుదురు. ఇట్టి యజ్ఞములు అసుర యజ్ఞములు.

"ఆత్మసంభావితాః స్తబ్ధాః
ధనమాన మదాన్వితాః
యజన్తే నామ యజ్ఞైస్తే
దంభే నావిధి పూర్వకం" 16—17

(6) ఇట్టి యజ్ఞవిమర్శతో శ్రీకృష్ణుడింకను తృప్తిజెందక, యజ్ఞములను సాత్వికయజ్ఞములు రాజస యజ్ఞములు, తామసయజ్ఞములు అని మూడువిధములుజేసియున్నాడు. ఫలాపేక్షరహితముగ విధిమాత్రము దృష్టియందు నిలిపి జేయబడు యజ్ఞములు సాత్విక యజ్ఞములు. ఫలాపేక్షతో గూడుకొనినట్టియు, దంభ

ును ఆడంబరమును ప్రదర్శించుటకొరకును జేయబడు యజ్ఞములు రాజసయజ్ఞములు. శాస్త్రవిధిని నిరసించి, అన్నదాన లోపముగను, మన్త్రలోపముగను, దక్షిణ లోపముగను, శ్రద్ధలోపముగను జేయబడు యజ్ఞములు తామసయజ్ఞములు.

"అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్య మేవేతి మనః సమాధాయ స సాత్త్వికః"
"అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసం"
"విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణం
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే"
17—(11, 12, 13)

(7) భగవద్గీతయందు అన్ని యోగములు సంపూర్ణముగ నర్జునున కుపదేశించి భగవంతుడు అంత్యవాక్యమునందు జ్ఞానయజ్ఞమును దృఢపఱచి యున్నాడు.

"అధ్యేష్యతే చ య ఇమం
ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞానయజ్ఞేన తేనాహ
మిష్టస్స్యా మితి మే మతిః" 18—70

(8) గీతలయందు శ్రీకృష్ణుడు యజ్ఞములపట్ల ఇంత దూరము నైతికవిమర్శ జేసియుండియు శ్రౌత యజ్ఞమునందు నిరసనజూపియుండలేదు. అట్టియజ్ఞముల జేయవలదని జెప్పియుండలేదు. అట్టి యజ్ఞములవల్ల ఫలితములేదని జెప్పియుండలేదు. తాను గీతలయందు నిర్ణయించిన నిష్కామకర్మసూత్రము యజ్ఞములకు కూడ నన్వయించునని నొక్కి వక్కాణించియున్నాడు. దైవసంపదరూపమగు నైతికదృష్టితోను శ్రద్ధతోను సాత్త్వికప్రవృత్తి గలిగి యజ్ఞముల జేయవలయునని హెచ్చరిక జేసియున్నాడు. మఱియు యజ్ఞము దానము తపస్సు అను నీ మూడు కర్మలు త్యజించరాదనియు ఈ కర్మలు మానవుని జీవితమును పావనము జేయగలవనియు భగవంతుడు కడపటి అధ్యాయమునందు గీతలయొక్క సంగ్రహోపన్యాసము జెప్పియున్నాడు.

"యజ్ఞ దాన తపః కర్మ
న త్యాజ్యం కార్య మేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ
పావనాని మనీషిణాం 18—5

అన్ని విధములగు కర్మములందుకంటె శ్రౌత యజ్ఞము విధ్యుక్తముగ జేయుటయందు యెక్కువ *disciplinary value* యున్నదని పై శ్లోకమువల్ల దేటపడుచున్నది. ప్రజలను మోసపుచ్చి ఆత్మవంచన జేసికొను యజ్ఞములు ప్రయోజనరహితములని గీతమన కుపదేశించుచున్నవి. ఇవియే అసురయజ్ఞములు.

### అసురుల పుట్టుక

రావణాదులు అసురులు. వారును యజ్ఞముల జేసిరి. వారుజేసిన యజ్ఞములు గీత 16 వ అధ్యాయమునందు జెప్పిన నామమాత్ర యజ్ఞములును 17 వ అధ్యాయమునందు జెప్పిన రాజసతామస యజ్ఞములును నైయున్నవి. ఇట్టి యజ్ఞముల విమర్శకుపూర్వము అసురులను వారియొక్క పుట్టుక యెట్టిదో కొంత విచారింపవలసియున్నది.

కశ్యపప్రజాపతికి దితి యను నొక భార్య యుండెను. కశ్యపప్రజాపతి ఆహితాగ్ని. ఒకనాటి సాయంసమయమున కశ్యపుడు అగ్నిహోత్రాదికము జరుపుకొనుచున్న సమయమున ఆతని భార్య యగు దితి కడురయమున నాతని సమీపించి హోమాదికముల నిల్పివచ్చి తన కోరిక దీర్పుమని కోరెను. భర్త యెంత జెప్పినను నామె వినియుండలేదు.

"తరుణీ యొక్క ముహూర్త ముండు,
మిది సంధ్యాకాల, మిక్కాలము
చరయక్ష భూతగణావృతుం
డసచు గామారాతి యిచ్చున్ వృషే
శ్వరయానంబున సంచరించుట
నభావ్యంబయ్యె నీ యుగ్రుపే
శ రమింపంగ నిషిద్ధకర్మమగు,
నేలా ధర్మముల్ వీడఁగన్."
—ఆంధ్రభాగవతం - 3 వ స్కంధం

దితికి ఇందువల్ల హిరణ్యకశిపుడు హిరణ్యాక్షుడను లోకకంటకులగు నిద్దరు కుమార్లు గల్గిరి.

రావణాసురుని పుట్టుకగూడ నిట్టిదియే. రావణుడు విశ్రవసువుయొక్క కుమారుడు. విశ్రవసువు పులస్త్యబ్రహ్మ కుమారుడు. సుమాలియను రాక్షసుని కుమార్తెయగు కేకసియను నామెను విశ్రవసువు వివాహమాడెను. ఆమెయు సంధ్యాకాలమందు భర్తను గూడగా రావణుడు బుట్టియుండెను.

"దారుణాయాస్తు వేళాయా -
నాగతాని సుమధ్యమే
ఉపస్థే దారుణో ప్రత్రా -
రాక్షసో సంభవిష్యతః."
—అధ్యాత్మ. ఉ. కాం. 1 సర్గ.

రావణుడు పులస్త్యబ్రహ్మవంశమున బుట్టిన బ్రాహ్మణోత్తముడు. విద్వాంసుడు. వేదాధ్యయన పరుడు. మహాతపస్వి. అనేక యజ్ఞయాగాదులు చేసిన యాహితాగ్ని. వీనిగురించి వాల్మీకి ఇట్లు జెప్పియున్నాడు.

"వివహితాగ్నిశ్చ మహాతపాశ్చ
వేదాంతగః కర్మసు చాగ్ర్యవీర్యః"
—యుద్ధ. (112 - 28)

లంకయందలి రాక్షసులును వేదవేదాంగ సంపన్నులును అనేక క్రతువులు జేసిన ఆహితాగ్నులని హనుమంతుడు జెప్పియున్నాడు.

"షడంగ వేదవిదుషాం
క్రతుప్రవర యాజనాం
శుశ్రావ బ్రహ్మఘోషాంశ్చ
విరాత్రే బ్రహ్మరక్షసాం"
—సుందర. 6-12

## నైతిక వైపరీత్యము

మానవునియొక్క నైతిక చరిత్రయందు రావణాది అసురుల జీవితము ఒక క్లిష్టమైన ఘట్టమై యున్నది. సత్కార్యాచరణమును అవినీతి జీవనమును పరస్పర విరుద్ధములుగదా? రావణాది అసురుల జీవితములయందు ఇట్టి పరస్పరవిరుద్ధ మనోభావములు కడు స్నేహముతో మెలగుచుండుటకు కారణమేమి? లంకయందు తిరిగి రాక్షసుల స్థితిగతుల బరీక్షించిన హనుమంతునికిగూడ నిట్టి శంకయే దోచి ఆ శంకను హనుమంతు డిట్లు సరిపుచ్చుకొనియున్నాడు.

"అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ
రాక్షసానాం గృహే గృహే
దయా సత్యంచ శౌచంచ
రాక్షసానాం న విద్యతే."
—సుందర. 8-17

రాక్షసుల ఇండ్లయందు అగ్నిహోత్రములు వేదములు విలసిల్లియున్నవి. కాని దయా సత్య శౌచములు రాక్షసులయందు గానరావు అని హనుమంతుడు జెప్పియున్నాడు. మానవుని నిజమైన నైతిక జీవనమునకును నిశ్చలమగు సాత్వికప్రవృత్తికిని అవినాభావసంబంధముండి తీరవలెను. అట్లుగాక బహిరంగముగ సకల విద్యలయందు పాండిత్యమును సదాచార సత్కార్యానుష్ఠానచిహ్నములను ప్రదర్శించుచు, అంతరంగమున అవినీతిపరులై రజస్తమో గుణములు గలవారు సృష్ట్యాదినుండియు నేటివరకు అనుదినమును మనకు గన్పట్టుచున్నారు. ఇట్టివారల వృత్తియే (*Ethical Paradox*) నైతిక వైపరీత్యమై యున్నది. వేదాంత ఉపన్యాసములు గాని రాజశాసనములు గాని ఇట్టి **వ్యవస్థను** నివారింపజాలవు. ఇట్టి వ్యక్తులను గీతయందు భగవంతుడు మిథ్యాచారులు (*Hypocrites*) అని జెప్పియున్నాడు.

"కర్మేంద్రియాణి సంయమ్య
య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా
మిథ్యాచార స్స ఉచ్యతే" —గీత 3-6

## అసురుల యజ్ఞములకు శ్రుతిప్రమాణము

శ్రుతి:—"సహవై దేవానాం చాసురాణాంచ యజ్ఞౌ ప్రతతా వాస్తాం
వయగ్ం స్వర్గంలోక మేష్యామో వయ మేష్యామ
ఇతి తేఽసురా స్సన్నహ్య సహైవ చరన్
బ్రహ్మచర్యేణ తపసైవ దేవాః తేఽసురాః
అముహ్యన్ తేన స్వర్గం లోకమాయన్
ప్రసృతేనవై యజ్ఞేన దేవాః స్వర్గంలోక మాయన్
అప్రసృతే నాసురాన్ పరాభావయన్."

అర్థము:—"దేవతలొక యజ్ఞము జేసిరి. అసురులు మరియొక యజ్ఞము చేసిరి. మీరెందులకీ యజ్ఞము జేయుచున్నారు" అని యొకానొకడు దేవతల నడిగెను. "మేము స్వర్గప్రాప్తికొరకు యజ్ఞము జేయుచున్నాము" అని దేవతలు బదులు జెప్పిరి. అట్లే మరియొకడు అసురులవద్దకు బోయి "మీ రెందులకీ యజ్ఞమును జేయుచున్నారు" అని యడిగెను. వారును "మేము స్వర్గప్రాప్తికొరకీ యజ్ఞమును జేయుచున్నాము" అని బదులు జెప్పిరి. అసురులు సాహసముతోను దంభముతోను యజ్ఞము జేసినందున వారు మోహముజెందినవారై స్వర్గమును జేరలేక పోయిరి. దేవతలు బ్రహ్మచర్యముచేతను తపస్సుచేతను

చిత్తవృత్తిని బలపరచుకొని యజ్ఞమును జేసియున్నం దున వారు స్వర్గలోకముం జేరిరి. పైవిధముగా అసురులు పరాభవముబొందిరి."

ఈ శ్రుతి గీతలయందు జెప్పబడియుండు నామమాత్ర యజ్ఞములకును, రాజస, తామస, యజ్ఞముల కును సుబోధకముగ వివరణమైయున్నది.

రావణాసురుడు యెన్ని యజ్ఞములు జేసినను బ్రహ్మచర్యము పాటింపజాలనందున శ్రీరాముల నెదుర్కొని గెలువలేకపోయెను. రావణాసురుని కుమారుడను ఇంద్రజిత్తు శ్రీరాములమీదికి మూడు మార్లు యుద్ధమునకు వెళ్ళియుండెను. ప్రతిమారును నొక యజ్ఞముజేసి బయలు్వెడలెను. అతని యజ్ఞము యొక్క ప్రభావముచేత వేదికలోనుండి అగ్నిహోత్రుడు లేచి ఇంద్రజిత్తు ఇచ్చిన హవిస్సు తన చేతులతో స్వయముగ నందుకొనియుండెను ఇట్లు మూమ్మారును జరిగియుండెను.

"జుహోవ రాక్షసశ్రేష్ఠః మన్త్రవద్విధివత్తదా।
భాగస్యకృష్ణవర్ణస్యగళం జగ్రాహ జీవతః।
హవిః తత్ప్రతిజగ్రాహ పావకః స్వయముత్థితః॥
యుద్ధ: 73-16

ఇంద్రజిత్తు దుష్కామప్రేరితుడై యజ్ఞము చేసెను. అతనియందు రాజస తామస గుణములు ప్రకోపించియుండెను. పావకుడు స్వయముగ దర్శనమిచ్చి తన హవిస్సు స్వీకరించినందుకు పట్టరాని గర్వము జెందియుండి యుద్ధమునకు వెళ్లియుండెను. ఇంద్రజిత్తు యజ్ఞము రాజసతామసయజ్ఞమై, యాతని మరణమునకు గారణమయ్యెండెను.

## బ్రహ్మరాక్షసులు

శ్రౌతయజ్ఞమును కడుశ్రద్ధతోను భక్తితోను భయముతోను జేయవలెను. "శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే" అన్నారు. యజ్ఞమునందు స్వల్ప లోపములకును గొప్పలోపములకును గూడ ప్రాయశ్చిత్తములు విధింపబడియున్నవి. హోమము చేసిన యన్నముగాని తండులములుగాని సంపూర్ణముగ హుతము గాక నిలిచియుండుట యొక లోపము. హోమద్రవ్యము స్థానమునుంచి దొరలి క్రిందికి జారిపోవుట మరియొక లోపము. ఇట్టి స్వల్పలోపములకు ప్రాయశ్చిత్తములు విధింపబడియున్నవి. దశ—

రథుడు జేసిన అశ్వమేధయాగమునందు ఇట్టి స్వల్పలోపములు జరిగియుండలేదని వాల్మీకి రామాయణమునందు చెప్పబడియున్నది.

నచాహుత మభూత్తత్ర స్ఖలితం వాపి కించన॥
బాల: 14-8

దశరథుని యాగమందు అహుతముగాని స్ఖలితముగాని జరిగియుండలేదట. ఇట్టి స్వల్పలోపములు లేవన్న, గొప్పలోపములు అసలే లేవని యర్థము. యజ్ఞము చేసినవాడు దశరథుడు. యజ్ఞము చేయించినవాడు వశిష్ఠుడు. ఉభయులు శ్రద్ధాళువులుగనుక ఎట్టిలోపమును జరుగకుండ యజ్ఞము నిర్వహించిరి. నిర్విఘ్నముగ యజ్ఞము జరిగియుండెను.

విశ్వామిత్రుడు జేసిన యజ్ఞములు రాజసయజ్ఞములు. అట్టి రాజసయజ్ఞములందు శ్రద్ధ తక్కువగనుక ఇట్టి స్వల్పలోపముల కవకాశముండెను. అట్టి స్వల్పలోపములు సామాన్యులు గనిపెట్టజాలరు. విద్వాంసులగు బ్రహ్మరాక్షసులు కాచియుండి ఇట్టి ఛిద్రములు గనిపెట్టి రక్తవర్షములు గురిపించియుండిరి. ఇట్టి విఘ్నములు జరిగినందున యజ్ఞము నాశనమగుచున్నది. యజ్ఞకర్తయు నశించుచున్నాడు.

"ఛిద్రంహి మృగయన్తే౽త్ర
విద్వాంసో బ్రహ్మరాక్షసాః।
నిహతస్యచ యజ్ఞస్య
సద్యః కర్తా వినశ్యతి॥" బాల: 8-17.

ఈ శ్లోకమునందు జెప్పబడిన బ్రహ్మరాక్షసు లెవ్వరు? శ్రీమద్రామాయణవ్యాఖ్యానకారు లిట్లు బ్రహ్మరాక్షసశబ్దమునకు నిర్వచనము జెప్పియున్నారు. "అకృతప్రాయశ్చిత్తాః, అప్రతిగ్రాహ్య ప్రతిగ్రహాః, అయాజ్యయాజనాః, ఇత్యాది పాపైః రాక్షసత్వం ప్రాప్తాః బ్రాహ్మణాః." అనగా "ప్రాయశ్చిత్తము చేయవలసినచోట్ల చేయించనివారు, దానము పట్టరానిచోట్ల దానములు పట్టినవారు, యాజ్ఞికము చేయించరానిచోట్ల చేయించినవారు, ఇట్టి బ్రాహ్మణులు బ్రహ్మరాక్షసు లయ్యెదరు."

రాజసతామస యజ్ఞములందు బ్రహ్మరాక్షసులు రక్తవర్షము గురిపించినారుగాని, సాత్వికయజ్ఞయాలం దట్లు జేయజాలరు. కనుకనే దశరథుని యాగము నిర్విఘ్నముగ జరిగినది.

## పరమావధి, జ్ఞానయజ్ఞము

శ్రౌతయజ్ఞముల జేయునారు పైవిధమగు ప్రమాదములు జరుగునేమో యను భయముతో యజ్ఞములు చేయవలెను. భయమున్నచో శ్రద్ధాభక్తులు వెనువెంట నే వచ్చును. కలియుగమునందు భక్తి, శ్రద్ధలు తక్కువగ నుండునని యెరిగియుండి భగవంతుడు గీతలయందు బహువిధములగు యజ్ఞము లున్నవనియు, ఇట్టి యజ్ఞములు శ్రౌతయజ్ఞములకంటె తీసిపోవనియు, అన్ని యజ్ఞములలో జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమనియు ఉపదేశించియున్నాడు. గీతలయందు జెప్పిన ఇతర యజ్ఞములు ద్రవ్యయజ్ఞములు, తపోయజ్ఞములు, యోగయజ్ఞములు, స్వాధ్యాయయజ్ఞములు, జ్ఞానయజ్ఞములు. ఈ యైదు రకములగు యజ్ఞములు ఉదాహరణముకొఱకు చెప్పియున్నాడుగాని ఇటువంటి యజ్ఞములు బహువిధములైయున్నవనియు, ఇవన్నియు బ్రహ్మముఖము నుండియో అనగా వేదమునుండియో వెలువడినవనియు భగవంతుడే చెప్పియున్నాడు. ఇట్లు జెప్పినందున యజ్ఞశబ్దముయొక్క నిర్వచనము కడు విశాలమై ఇప్పుడు జరుగుచుండు రామయజ్ఞము మున్నగు భక్తి యజ్ఞములకును, గాంధిమహాత్ముని సత్యాగ్రహ యజ్ఞము మున్నగు రాజకీయయజ్ఞములకును గూడ నన్వయించుటకు అవకాశములున్నవి. ఎట్టి యజ్ఞమైన, స్వఫలాపేక్షరహితమై త్యాగయుక్తమై సాత్త్విక ప్రవృత్తితోను ఆధ్యాత్మిక దృష్టితోను జరుపబడిన యజ్ఞమే గీతలయందు ప్రతిపాదింపబడిన యజ్ఞమగును, గాని లౌకికఫలితములకొఱకు తాత్కాలికముగ గను బరుచు త్యాగముతో గూడిన యజ్ఞము, యజ్ఞముయొక్క పరిమావధియగు జ్ఞానయజ్ఞము గా నేరదు.

"ఏవం బహువిధా యజ్ఞాః
వితతా బ్రహ్మణోముఖే
కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్
ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥" 4-32.

శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్
జ్ఞానయజ్ఞః పరంతప॥ 4-33.

## యజ్ఞేశ్వరుడు విష్ణువు

యజ్ఞములవల్ల నైతిక, సాంఘిక రాజకీయ ప్రయోజనము లున్నవియని పైన జెప్పియున్నాము. యజ్ఞముయొక్క పరమావధి జ్ఞానయజ్ఞమనిగూడ జెప్పియున్నాము. కావున యజ్ఞమునందు పారలౌకికమగు ఆధ్యాత్మికస్థితియే ముఖ్యమని యేర్పడుచున్నది. ఇట్టి సందర్భమునందు యజ్ఞాధిపతి, యజ్ఞేశ్వరుడు అను దైవము ఎవరు? అను ప్రశ్న రావచ్చును. అట్టి దైవము మహావిష్ణువు. సర్వవ్యాపియని చెప్పుటకు ప్రబలమైన ప్రమాణములున్నవి.

1. శృతి:—యజ్ఞోవై విష్ణుః యజ్ఞ ఏవాన్ తతః ప్రతితిష్ఠతి విష్ణవే స్వాహా, యజ్ఞాయ స్వాహా,

2. భగవద్గీత:— అహంహి సర్వయజ్ఞానాం
భోక్తాచ ప్రభురేవ చ।
అహం క్రతు రహం యజ్ఞః
స్వధాహ మహ మౌషధం।
మన్త్రోహం అహ మేవాజ్యం
అహ మగ్ని రహం హుతం॥

3. భాగవతం—ఏకాదశస్కంధం 3 వ అధ్యాయం: శ్లో 5 "విష్ణుః స్థితో క్రతుపతిః ద్విజధర్మసేతుః"॥

(4) విష్ణు సహస్ర నామస్తోత్రం:—[శ్లోక సంఖ్యలతో]

1 విశ్వం విష్ణుర్వషట్కారః
47 మహాతపా మహామఘః
48 అనంతహుతభుగ్భోక్తా
54 సోమపో అమృతపః
72 మహాక్రతుః మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః
104 యజ్ఞోయజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః
105 యజ్ఞభృత్, యజ్ఞకృత్, యజ్ఞీ, యజ్ఞభుక్, యజ్ఞసాధనః

యజ్ఞాంతకృత్, యజ్ఞగుహ్యం..........ఇట్టి ప్రమాణములవల్ల యజ్ఞమనునది ఎట్టి యజ్ఞమైనను, గీతలయం దుపపాదింపబడిన పరీక్షకు లోబడియున్న యెడల, అట్టి యజ్ఞము మహావిష్ణుస్వరూపమని యెఱుంగునది. ఇట్టిది సగుణోపాసనము, కేవలము జ్ఞానయజ్ఞము నిర్గుణోపాసనము.

# ఇవాన్ ఇలియిచ్ మృతి

మూలం  అనువాదం

లియో టాల్‌స్టాయ్ — శ్రీ పి. గణపతిశాస్త్రి

[గత సంచిక తరువాయి]

## 4

ఆ కుటుంబంలో అందరు బాగా ఆరోగ్యంగా ఉన్నారు. ఇలియిచ్‌కి అప్పుడప్పుడు నోరు కొంచెం చేదుగా ఉన్నట్లుండేది; ఎడమ పార్శ్వంలో ఏదో కొంచెం నెప్పిగా ఉండేది. అంతమాత్రంచేత అతనికి జబ్బు చేసిందని చెప్పలేము.

అయితే ఈ నెప్పి కొంచెం ఎక్కువయింది. అది అంతగా బాధపెట్టేదికాదు గాని, ఆ పార్శ్వం అంతా పట్టి వేసినట్లుండేది. దీనితో అతనికి చికాకు ప్రారంభమయింది. క్రమ క్రమంగా అది శ్రుతి మించిపోయింది. ఇటీవల కుటుంబంలో అన్యోన్యత ఏర్పడ్డా—ఇలియిచ్‌లో బయలుదేరిన విసుగుదలవల్ల—దానికి విఘాతంకలిగింది. క్రమంగా దంపతులిద్దరి మధ్యా తగాదాలెక్కువయ్యాయి; ఆ పూర్వపు సమోధ్యలన్నీ అంతరించిపోయాయి; ఇక సామాన్య సాంసారిక మర్యాద దక్కడం కూడా కరువైపోయింది. ఆ యిద్దరు చీటికీ మాటికీ దెబ్బలాడుతూండేవారు. ప్రశాంతంగా ఉండడం బాగా అరుదైపోయింది. ఇప్పుడే ప్రస్తావన వచ్చినా చివరకది చిలికి చిలికి గాలివాన కావలసిందే. ఇలియిచ్‌తో వేగడం చాలా కష్టంగా ఉందనడానికిప్పుడు ఫెడరోవ్నా కెన్నో దాఖలాలు కనిపించాయి. ఉన్నదానికి ఎదికలిపించి చెప్పడం ఆమెకొక అలవాటు. అందుచేత ధుమధుమలాడుతూండడం ఆయనకెప్పుడూ అలవాటే అనీ, నా ఓరిమివల్లనే ఈ ఇరవై ఏళ్లు, ఈ కాపరం ఇలాగ ఈడ్చుకవచ్చాననీ, చెబుతూ ఉండేది. ఈ మధ్యన ఇలియిచ్చే ఈ తగాదాలు లేవదీస్తున్న మాట నిజమే. అసలివన్నీ భోజనాలవేళ — అందులోను అతను చారు తాగే సమయంలో—ప్రారంభమయ్యేవి. అప్పుడతను—ఫలహారం పళ్లెం అంచు విరిగిపోయిందనో, వంటకాలు బాగా లేవనో, కుర్రవాడు బల్లమీద మోచెయ్యి మోపాడనో, పిల్లకి తల తిన్నగా దువ్వలేదనో—ఏదో ఒకటి అంటూండేవాడు. వీటికన్నింటికి ఫెడరోవ్నాయే కారణమని అస్తమానము ధుమ ధుమలాడేవాడు. మొదట్లో ఆమె ఆమె అతనన్న మాటలన్నీ తిరిగి అప్పజెపుతూండేది. ఒకటిరెండు సారులతను మరీ మండిపడ్డాడు. అయితే ఆ తరవాత తరవాత ఆమె అది ఒంట్లో బాగుండకపోవడం వల్లను, నాలుగుముద్దలు లోపలికి వెళ్లడం వల్లను బయలుదేరే కోపమని గ్రహించుకుని, భోజనం అయ్యేదాకా దేనికీ సమాధానం చెప్పకుండా మాట్లాడకూరుకునేది. ఈ విధంగా ఓరిమి వహించి ఉండడం ఎంతో ఎన్నదగ్గ సుగుణం. అని లోలోపల మురిసిపోయేది. ఈ మొహం చెండుకోడం ఈయనకు మొదటినించీ ఉన్నదే అనీ, దీనివల్ల బతుకంతా ఒక యాతనకింద తయారయిందనీ ఒక నిశ్చయానికి వచ్చేసింది. ఇందుచేత తన మీద తానే జాలిపడడం ప్రారంభించింది. ఇలాగ జాలిపడుతూన్నకొద్దీ ఆమె కతనిమీద ఉండే అక్కసు పెరిగిపోతూండేది. చివరికతను చచ్చిపోతే ఈ శని విరగడైపోతుందని అనుకునేది. అయితే తీరా అతను చచ్చిపోతే ఆ జీతంరాళ్లు ముట్టవుకనక చచ్చిపోకూడదనీ అనిపించేది. అందువల్ల అతనిమీద మరింత ఉక్రోషం పెరిగేది. ఈ విధంగా అతను చచ్చిపోయినా తన కష్టాలు గట్టెక్కకపోవడంవల్ల తనంతటి దౌర్భాగ్యురాలింకెవరు ఉండరని లోలోపల కుమిలిపోతూ ఉండేది. ఇది పైకి కనబడకుండా గుంభనగా కనిపించేదిగాని, ఈ గుంభన చూసినప్పుడల్లా అతను అట్టుడికిపోయినట్లు మరీమరీ మండిపడేవాడు.

ఒకసారి ఆ యిద్దరికీ పెద్ద తగాదా వచ్చింది. ఇందులో తప్పంతా ఇలియిచ్‌దే. అందుచేత అతను, కోపం వచ్చినప్పుడు తనకు ఒళ్ళు, పైన తెలియక

పోవడం తప్పకుండా నిజమేననీ, ఆరోగ్యం తిన్నగా ఉండకపోవడమే దీనికి కారణమనీ సమాధానం చెప్పాడు. ఆపైన ఆమె ఆరోగ్యం తిన్నగా ఉండకపోతే అశ్రద్ధ చెయ్యకూడదనీ, వెంటనే ఒక పెద్ద డాక్టర్ని ఎవరినైనా చూడవలిసిందనీ పట్టుపట్టింది.

ఇలియిచ్ డాక్టరు దగ్గిరికి వెళ్ళాడు. అది అంతా అప నుకున్నట్లే జరిగింది. అది ఎప్పుడు అల్లాగే జరుగుతూంటుంది. సరే, సామాన్యంగా జరిగేటట్లే పడిగాపులు పడి కూర్చోడము, డాక్ట రెక్కడి నుంచో ఊడిపడ్డట్లు మాట్లాడడము మొదలైన తతంగం అంతా అతనికి కొట్టినపిండే. అంతా అతను కోర్టులో వ్యవహరించినట్లుగానే ఉంది. ఆ డాక్టరు మొట్టమొదటగా అతని రోగాన్ని గురించి కొంచెం చూచాయగా అడిగి, అతను చెప్పేదంతా ఆలకించాడు. ఆపైన అతి నడిగిన ప్రశ్నలు, ఇతను చెప్పిన సమాధానాలు, అన్నీ సామాన్యంగా అందరికీ బాగా అలవాటే. నిజానికీ ప్రశ్నలన్నీ అనవసరమే. ఇక ఆ డాక్టరు ఆర్భాటం అంతా చూస్తే—ఇదంతా నాకు వదిలిపెడితే ఆ గొడవంతా నేను చూసుకుంటానయ్యా! నీ రోగం నాకు క్షుణ్ణంగా తెలిసిపోయిందిలే. ఇలాంటివి లక్ష కేసులు కుదిర్చాను!—అన్నట్టుంది. అదంతా అచ్చంగా కోర్టులో నడిచినట్టుగానే నడిచిపోయింది. ఇలియిచ్ తన ఎదురుగా నిలబడ్డ ముద్దాయీ లందరి యెడల అలాగే వ్యవహరించాడు. ఇప్పుడా డాక్టరతన్ని అచ్చంగా అల్లాగే చూశాడు.

"భలానా లక్షణాలనిబట్టి చూస్తే ఇది భలానా రోగమైనట్టు కనబడుతున్నదనీ, అయితే మళ్ళీ భలానావిధంగా పరీక్షచేసిచూసి అది ఋజువు కాకపోతే మళ్ళీ అది భలానా రోగమేమోనని అనుకోవాలనీ, మళ్ళీ దానికికూడా భలానావిధంగా ఋజువు కావాలనీ, అయితే అది జరిగేటప్పటికి కేనేదో తేలిపోతుందనీ" ఆ డాక్ట రేదేదో చెప్పుకు పోయాడు. "ఈవ్యాధి అపాయకరమైనదా? కాదా?" అన్నదే ఇలియిచ్ తెలుసుకోవాలనుకున్న ముఖ్య విషయం. అయితే డాక్ట రిది అనవసరమైన విషయమని కొట్టి పారవేశాడు. అసలతనీ గొడవే పట్టించుకోలేదు. ఆ డాక్టరు దృష్టిలో ఇది మూత్రకోశపు జబ్బా? లేక ఎపెండిసైటిస్సా? అన్నదే అతి ముఖ్యమైన విషయం. ఇలియిచ్ చావుబతుకుల సంగతి కాదిప్పుడు తేలవలసింది! అసలిది ఎపెండిసైటిస్సా? కాదా? అన్నదే తేలాలి! మొట్ట మొదటగా ఆ డాక్టరిది ఎపెండిసైటిస్సని అన్నాడుగాని, మూత్రపరీక్ష జరిగినతరవాత కొత్తవిశేషాలేమైనా బయటపడితే మళ్ళీ ఈ అభిప్రాయం మార్చుకోవాలని చెప్పాడు. ఇలియిచ్ కీ పరిశీలన అద్భుతంగా ఉన్నట్టు కనబడింది! కోర్టులో ఉన్నప్పుడు అతను అనేకవేలసారు లిల్లాంటి నిర్ణయాలు చేశాడు ఆ డాక్టరు కళ్లద్దాలపైనించి చూస్తూ హుందాగా ఆడుతూ పాడుతూన్నట్టే, ఆవిషయం అంతా, అత్యద్భుతంగా తేల్చి పారేశాడు. అతను చెప్పిన దానినిబట్టి తన ఆరోగ్యపరిస్థితి అధ్వాన్నంగా ఉన్నదని ఇలియిచ్ ఊహించుకున్నాడు. ఆ డాక్టరు, అక్కడె ఉన్నవాళ్ళు, ఆ విషయం అంతగా పట్టించుకోలేదు ఇదంతా తలుచుకుంటూ ఇలియిచ్ లోలోపల బాగా బాధపడి, తన విషయంలో చాలా జాలిపడ్డాడు. ఇలాంటి అతి ముఖ్యమైన విషయంమీద ఆ డాక్టరు చూపించిన వైఖరివల్ల అతనికి ఒళ్ళు తెలియనికోపం వచ్చింది.

అయితే అతనీ విషయాలేవీ పైకి వెల్లడించలేదు. లేచి నిలబడి, ఫీజు బల్లమీద పెట్టి, ఒక నిట్టూర్పువిడిచి ఇలా అన్నాడు.

"మేము జబ్బుమనుషులం. ఏవో అసందర్భంగా ప్రశ్నలడుగుతూంటాము.—ఒక విషయం చెప్పండి! మొత్తంమీద ఇదేమన్నా ప్రాణాపాయమైన జబ్బా? లేక సామాన్యమైనదేనా?"

ఆ డాక్టరు కళ్ళద్దాలపైనించి అతి తీవ్రంగా చూశాడు. అదైనా ఒంటికంటి చూపే! "ఖైదీ! మేమువేసిన ప్రశ్నలకు సరిగ్గా సమాధానా లివ్వకపోతే నిన్నీకోర్టులోనించి పంపించివేస్తాము." అనే ఠీవి ఆ కనుచూపులో సాక్షాత్కరించింది! ఆ పిమ్మట డాక్టరు "చెప్పవలసిందంతా నేనింతకు పూర్వమే చెప్పివేశాను. అయితే కొత్తగా పరీక్షచేసిన తరవాత ఇంకా కొన్ని విశేషాలేమైనా బయటపడ వచ్చును." అన్నాడు.

అటుపిమ్మట ఇలియిచ్ మెల్లిమెల్లిగా ఇవతలికి వచ్చి, ఆదరాబాదరాగా స్లెడ్జిబండిలో కూర్చుని

ఇంటికి వెళ్లిపోయాడు. ఇంటికి వెళ్ళేదారిలో ఆ డాక్టరన్నమాటలు, అయోమయంగా అతను ప్రయోగించిన ఆ వైద్యశాస్త్రపదాలు మొదలైనవాటి కన్నిటికీ అర్థమేమైఉంటుందా? అని మథనపడ్డాడు. "పరిస్థితి పాడుగా ఉందా? లేకపోతే మరీ ప్రాణాపాయకరంగా పరిణమించిందా? లేక ప్రస్తుతానికి భయపడవలసిన అవసరమేమీ లేదా?" అని ఈ విధంగా అతని ఆలోచనాపరంపర సాగిపోయింది. ఆ డాక్టరు చెప్పినవన్నీ జాగ్రత్తగా ఆలోచిస్తే ఆరోగ్యపరిస్థితి అధ్వాన్నమైపోయినట్లే కనిపించింది. అతని కా వీధిలో పోతూన్న బండి వాళ్లు, ఇళ్లు, దుకాణాలు, మనుష్యులు, సమస్తమూ శూన్యంగా కనిపించాయి. డాక్టరావిధంగా సందిగ్ధంగా మాట్లాడిన తరవాత అల్లాగే బాధపెడుతూన్న అతని పార్శ్వంనెప్పి అంతలోనే భయంకరంగా మారిపోయినట్లు కనబడింది. ఇప్పుడతనికా బాధ అనుభవిస్తున్నకొద్దీ లోలోపల దిగులు, బెంగ ఎక్కువయ్యాయి.

ఇలియిచ్ ఇంటికి వచ్చినతరవాత భార్యతో ఆ విషయాలన్నీ ప్రస్తావించాడు. ఆమె అవ్వన్నీ వింటూ కూర్చున్నది. ఇంతలో తల్లితో కలిసి షికారు వెళ్లడానికి ముస్తాబైన కుమార్తె టోపీ మొదలైనవన్నీ ధరించి అక్కడికి వచ్చింది. తీరా అక్కడికి వచ్చాక కొంతసేపా ఇలియిచ్ చెప్పేవన్నీ అయిష్టంగా విన్నది కాని ఆమె కవ్వన్నీ చాలా విసుగుగా ఉన్నాయి. ఆ పైన మరి వినలేకపోయింది. ఇలియిచ్ భార్యకూడా ఆ చెప్పేదంతా పూర్తిగా వినిపించుకోకుండా ఇలా అన్నది:

"సరే! ఇదంతా బాగానే జరిగింది. ఇక మీరు మందులు అవ్వీ జాగ్రత్తగా పుచ్చుకుంటూఉండండి. ఆ మందుచీటీ ఇలా ఇస్తే జిరాసిమ్ కిచ్చి, మందు తెప్పిస్తాను."

అని చెప్పి షికారుసన్నాహంమీద లోపలికి వెళ్లిపోయింది.

ఆమె అక్కడ ఉన్నంతసేపు ఇలియిచ్‌కి తిన్నగా ఊపిరి విడవడానికి అవకాశమే లేకపోయింది. ఆమె అక్కడినించి కదలగానే ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టి, లోలోపల "బహుశః వ్యాధి ఇంకా చెయ్యి దాటిపోలేదనే తోస్తుంది." అనుకున్నాడు.

డాక్టరు మూత్ర పరీక్ష చేసినతరవాత మందులన్నీ మార్చిఇచ్చాడు. ఇలియిచ్ సరిగ్గా ఆ డాక్టరు చెప్పినట్లే ఆ మందులు పుచ్చుకుంటూ ఉండేవాడు. అయితే—మూత్రపరీక్షవల్ల తేలిన రోగలక్షణాలు ఒక విధంగా ఉన్నాయి. రోగిని పరీక్షించినప్పుడు కనిపించిన గుణాలు మరి ఒక విధంగా ఉన్నాయి. డాక్టరిచ్చిన మందు పుచ్చుకున్న తరవాత ఫలానా విధంగా గుణం కనిపిస్తుందని చెప్పాడుగాని, మందు దొకదారి, రోగాని దొకదారి అయింది. దీనిబట్టి చూస్తే డాక్టరు పొరబాటైనా పడి ఉండాలి. లేకపోతే ఏదేనా మరిచిపోయి ఉండాలి. లేక ఉన్నసంగతి ఇలియిచ్‌తో చెప్పకుండా దాచి వేసైనా ఉండాలి. అయినా ఈవిషయంలో డాక్టరు చేసినది తప్పనడానికి వీలులేదు. అందుచేత ఇలియిచ్ అక్షరాలా అతను చెప్పినవన్నీ చేశాడు. 'డాక్టరు చెప్పినట్లు నడుచుకుంటున్నాను గదా!' అని లోలోపల సంతోషపడ్డాడు.

డాక్టరు దగ్గిరికి వెళ్లిన మరుక్షణంనించీ ఇలియిచ్ అతను చెప్పినవన్నీ తూచా తప్పకుండా చేస్తూ, ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకుంటూ మందులు అవ్వీ జాగ్రత్తగా పుచ్చుకుంటూ, తన పార్శ్వంనెప్పి హెచ్చుతగ్గులు గమనిస్తూ ఉండేవాడు. ఇప్పుడెవరికైనా జబ్బుచేసినా, ఎవరైనా పోయినా, వారికి సంబంధించిన విశేషాలన్నీ కనుక్కుంటూ ఉండేవాడు. ఒకవేళ తనకు వచ్చిన జబ్బు మరెవరికైనా వచ్చిందని తెలిస్తే లోలోపల బాగా కంగారుపడి, వారికి సంబంధించిన వివరాలన్నీ గుచ్చిగుచ్చిఅడిగేవాడు. అవ్వన్నీ తన రోగలక్షణాలతో సరిపోల్చుకుని, తారతమ్య పరీక్ష చేసేవాడు. కాని పైకి మాత్రం ఏమీ చెక్కుచెదరకుండా ఉన్నట్లుండేవాడు.

పార్శ్వంలో బయలుదేరిన బాధ ఏమీ తగ్గకపోయినా ఇలియిచ్ మాత్రం అది తగ్గిపోతున్నదనుకోవాలని ప్రయత్నించేవాడు. పరిస్థితులన్నీ బాగా ఉన్నంతవరకు అతని కాబ్బే బాధకనిపించేది కాదు. కాని భార్య. తను మాటమాట అనుకున్నా, ఆఫీసు వ్యవహారం తిన్నగా నడవకపోయినా, పేకాటలో మంచిముక్కలు కలవకపోయినా, అతనికా బాధ శూలంలా పొడుచుకునేది. పూర్వపు రోజుల్లో

ఇల్లాంటి ఇబ్బంది లైమైనావస్తే ఇలియిచ్ ధైర్యంగా నిలబడి అవ్వన్నీ దాటి ఇవతల పడుతూండేవాడు. ఇప్పుడే ఇబ్బంది వచ్చినా కంగారుపడిపోయి, దిసలుగా కూర్చునేవాడు. ఇప్పుడు—"ఈ మందు పుచ్చుకున్నాక కొంచెం గుణం కనిపించిందనుకున్నాను. ఇంతలోనే ఇంకొకటి ముంచుకొచ్చింది." అని బాధపడుతూండేవాడు. తన కిల్లాంటి ఆపత్తులు వస్తున్నాయని అట్టుడికిపోయిన ట్టుడికిపోయేవాడు. ఇక చుట్టూరా ఉన్నవాా ళ్ళెవళ్లయినా కొంచెం ఇబ్బంది కలిగిస్తే వాళ్ళంతా కలిసి తన ప్రాణాలు తోడేస్తున్నారని మండిపడుతూండేవాడు. ఇలాంటి ఒళ్లు తెలియని కోపంవల్ల తన ఆరోగ్యం మరింత అధ్వాన్నమై పోతున్నదని అతనికి తెలుసును. అయినా అతనా కోపం దిగమింగుకోలేక పోయేవాడు. మరెవరికైనా—ఈ పరిస్థితుల్లో సాధ్యమైనంతవరకు తగాదాలు అవ్వీ లేకుండా జాగ్రత్తపడాలనీ, కొంచెం తమాయించాలనీ, లేకపోతే రోగం ముదిరిపోతుందనీ తెలిసి తీరుతుంది. అయితే ఇలియిచ్ మాత్రం కేవలం దీనికి తల్లక్రిందులుగా నడుచుకునేవాడు. పైకిమాత్రం ప్రశాంతంగా కాలక్షేపం చెయ్యాలని అంటూండేవాడు. కొంచెం ఇబ్బంది కలిగించేదేదైనా వస్తుందా అని కనిపెట్టుకుని ఉండేవాడు. అది రాగానే ఒళ్లు తెలియకుండా కేకలు పెట్టేవాడు! ఆపైన తన రోగానికి సంబంధించిన వైద్యగ్రంథాలు చదువుతూ ఆ విషయంలో డాక్టర్లతో సంప్రతిస్తూండేవాడు. దానాదీనా రోగం మరింత ముదిరిపోయినట్లుండి, పరిస్థితి మరింత అధ్వాన్నంగా తయారయ్యేది. శరీరంలో రుగ్మత కనబడీ కనబడనట్లుగా ముదురుతూండేది. కాని ఇలియిచ్ మాత్రం మొన్నటికీ, నిన్నటికీ గల తారతమ్యాన్ని బట్టి కొంచెం నయమవుతూన్నదని భ్రమపడేవాడు. ఆ రోగ స్వభావాన్ని బట్టి అతని కల్లాంటి భ్రమ కలుగుతూండేది. కాని మళ్లీ డాక్టర్లతో సంప్రతిస్తేమాత్రం రోగం జోరుగా ముదిరిపోతున్నదనీ, పరిస్థితి నానాటికీ అధ్వాన్నమై పోతున్నదనీ అనిపించేది. అయినా అతనా డాక్టర్లని సంప్రతించడం మానలేదు.

ఇలియిచ్ ఆ నెలలో మరి ఒక పెద్దడాక్టరుతో సంప్రతించాడు. ఇతనుకూడా ఆ మొదటి డాక్టరులాగే మాట్లాడాడు.

అయితే ఇతని ప్రశ్నల ధోరణి వేరుగాఉంది. ఈ డాక్టరుదగ్గిరికి వెళ్ళివచ్చిన తరవాత అతనికి అనుమానాలు, సందేహాలు మరింత ఎక్కువయ్యాయి. అటుపిమ్మట ఇలియిచ్ మరి ఒక డాక్టరుదగ్గిరికి వెళ్లాడు. ఇతడు ఇలియిచ్ స్నేహితునికి స్నేహితుడు. ఈ డాక్టరు ఇలియిచ్‌కి వచ్చినది మరేదో కొత్తరోగమని అన్నాడు. అయితే రోగం నయమవుతుందని చెప్పాడు. కాని ఈ డాక్టరు వేసిన ప్రశ్నలు, చెప్పిన రోగనిదానము విని ఇలియిచ్ ఇంకా కంగారుపడ్డాడు దీనితో అతనికి కలిగిన అనుమానాలు మరీ ఎక్కువయ్యాయి. ఆ తరవాత ఇంకొక హోమియోపతీడాక్టరు ఇతని రోగానికి ఇంకొక పేరుపెట్టి, ఏదో ఇంకొక మందిచ్చాడు, ఇలియిచ్ ఒక వారంరోజులపాటూ మందు సేవించాడు కాని అది ఎవ్వరికీ తెలియనీయలేదు. ఏమీ గుణం కనబడలేదు. దీనితో ఇతనికి యిద్దరు డాక్టర్లమీద నమ్మకం పోయింది. దానాదీనా మరింత కంగారుపడిపోయాడు. ఒకనాడు అతనెరిగిన ఒక ఆవిడవచ్చి ఒక క్రీస్తువిగ్రహంవల్ల ఒకరికి వచ్చిన జబ్బు అత్యద్భుతంగా కుదిరిపోయిందని చెప్పింది ఇవాన్ ఇలియిచ్ ఆమె చెప్పిందంతా విన్నాడు. అతని కా వైద్యంమీద కొంత నమ్మకం కలిగినట్లనిపించింది. వెంటనే తన పరిస్థితి తలుచుకుని లోలోపల కంగారుపడిపోయి, "ఇదేమిటి నేనింత బెంబేలుపడిపోతున్నాను! అనవసరంగా భయపడిపోయి నేనిల్లాంటి తలాతోకా లేని విషయాలు నమ్మకూడదు. ఒక డాక్టర్ని పిలిపించాక ఇక ఆ డాక్టరు చెప్పినట్టే నడుచుకుంటూ ఉండాలి. ఇక్కడినించి ఇదొక్కటే మార్గం. ఇక అటూ ఆటూ ఊగిసలాడడం మానివేసి వేసంకాలందాకా ఈ వైద్యమే చేయిస్తాను. అప్పటిపరిస్థితులనుబట్టి ఆ తరవాత సంగతి ఆలోచించుకోవచ్చును." అనుకున్నాడు. అయితే ఇలాగ అనుకోవడం తేలికేగాని, చిక్కంతా ఆచరణదగ్గిరే వస్తుంది. ఈ పక్కన పార్శ్వం నెప్పివల్ల బాధ బాగా ఎక్కువైంది. అది రాత్రింబవళ్లల్లాగే ఉంటేదిగాని ఇక తగ్గడమే లేదు. నోటిరుచికూడా మరీ వికారంగా తయారవుతూంది. అంతకంత కది దుర్భరంగా ఉంటున్నదనీ, ఆకలికూడా తగ్గిపోతున్నదనీ, ఒంట్లో శక్తి తగ్గిపోతున్నదనీ అనిపించింది. ఇలియిచ్ ఇందులో అనుమానమేమీ లేదనీ భయంకరమైన వ్యాధి ఏదో

లోపల ప్రవేశించిందనీ, ఈ విషయం తన కొక్కడికే తెలిసిందనీ అనుకున్నాడు. ఇక ఆ కుటుంబంలో ఉండేవారెవరికీ ఈవిషయం తెలియనూలేదు. వారికిది తెలుసుకోవాలనీ లేదు. అందుచేత అన్నీ సవ్యంగానే జరిగిపోతున్నాయని అనుకున్నారు. ఇది ఇలియిచ్‌ని మరింత బాధపెట్టింది. ఇల్లాగ ఉన్నా అతని భార్య, కుమార్తె ఇద్దరూ పొద్దస్తమానమూ పేరంటాల్లో మునిగి తేలుతూండేవారు. అతని జబ్బు సంగతి వారికేమీ తెలియనే తెలియదు. అతనెంతసేపు దిగులుగా ఉండటము, కస్సు బుస్సు మనటము చూసి చిరాకుపడేవారు. వారు పైకి కనబడకుండా ఎంత నటించినా, తనువారిదారికి అడ్డుతగులుతున్నాననీ, భార్య తన జబ్బువిషయంలో ఒక నిశ్చయానికి వచ్చివేసిందనీ, తను ఏమి చెప్పినా ఏది చేసినా, తటస్థంగా ఉంటున్నదనీ అతడు గ్రహించుకున్నాడు. ఇలియిచ్ భార్య తన సన్నిహితులతో మాట్లాడే తీరునుబట్టి ఆమె ధోరణి గ్రహించవచ్చును. ఆమాట లివి: "ఎవరైనా డాక్టరు చెప్పినట్లు నడుచుకుంటారుగాని, ఆయనకది సరిపడదు. ఒకనాడు ప్రొద్దున్నే లేచి సరిగ్గా వేళకి మందు పుచ్చుకుంటారు. జాగ్రత్తగా పథ్యంచేసి, సరిగ్గా డాక్టరుచెప్పిన వేళకి నిద్రపోతారు. నేను కనిపెడితే సరేసరి. లేకపోతే ఆ మర్నాడు ఆ మందుమాటే మరిచిపోతారు. ఇష్టంవచ్చిందల్లా తిని అర్ధరాత్రిదాకా పేకాడుతూ కూర్చుంటారు."

ఇవాన్ ఇలియిచ్ ఈ మాటలు విని, విసుక్కుంటూ "మొన్న ఇవానోవిచ్ ఇంటికి వెళ్ళినప్పుడే కొంచెం అపథ్యం జరిగింది. అంతేగాని ఇంకెప్పుడైనా అపథ్యం చేశానా?" అన్నాడు.

"నిన్న షెబెక్ ఇంటికి వెళ్లినప్పుడో!"

"సరే! నేను మేలుకోకపోయినా—ఈ నెప్పి నన్ను నిద్రపోనిస్తుందా?"

"—ఏమయితేం! ఇలా చేస్తే మీ జబ్బు కుదరనే కుదరదు. దీనిమూలాన ఇంటిల్లిపాదీ ఇలాగే నానా అవస్థలు పడుతూంటారు." పెడగోన్నా ఇలియిచ్‌తోటీ, ఇతరులతోటీ మాట్లాడిన తీరును బట్టి చూస్తే ఈజబ్బుకంతటికీ ఇలియిచ్చే కారణమనీ, దీనివల్ల తను నానా ఇబ్బందులు పడవలసి వస్తున్నదనీ తేలింది. ఇవి [illegible] అన్నమాటలుగాని ఆమె నిజంగా అనాలని అనలేదని ఇలియిచ్ సమాధానపడ్డాడు. అయితే దీనివల్ల మనస్సుకు మాత్రం సంతృప్తి కలగలేదు.

ఇక అతనికి ఆకోర్టులో ఉన్న మనుషులుకూడా తనకేసి వింతగా చూస్తున్నట్టు కనబడింది. వారంతా తన స్థానం కాళీ కాగలదనే దృష్టితో చూస్తున్నారని అనిపించేది. లోలోపల అతనికి తానొక అగాధపాతాళంలోకి పడిపోతున్నట్లుండేది. అయితే స్నేహితులందరు, అతని దిగులుపడడంచూసి "అబ్బే! ఇందులో ఏమీ లే"దన్నట్లు వేళాకోళాలాడుతూండేవారు. వారికి అపంత వట్టి వేళాకోళంగా కనబడింది. అందులోను ప్యారెన్ ఫలోకస్తులకింక అంతూదరీ ఉండేది కాదు ఇవి వింటూంటే ఇలియిచ్‌కి చిరాకుగా ఉండేది. అతను "పదేళ్ళకు పూర్వం నేనూ ఇల్లాగే ఉండేవాణ్ణి." అనుకున్నాడు.

స్నేహితులంతా కలిసి బ్రిడ్జిఆట ఆడుతూండేవారు. ఒక్కొక్కప్పుడతనికి ఒకే రంగులో ఏడు ముక్కలు కలిసేవి. తనతో కలిసిఆడే అతనికి ఆ మిగిలిన రెండుముక్కలు కలిసేవి. వెంటనే అతను 'ఆట' అనేవాడు! ఆ ఆటకంతకన్న కావలసిందేముంది? ఇక ఆటంతా అత్యద్భుతంగా గెలుచుకుపోవచ్చును! కాని ఇంతలోనే ఇలియిచ్‌కి పార్శ్వంలో బల్లెంపోటు పొడిచినట్లుండేది. నోటి రుచి అదోకవిధంగా మారిపోయేది. పరిస్థితు లీవిధంగా ఉంటే తనేదో పేకాటలో పొడిచేద్దామని అనుకోవడమూ, ఆ ఉత్సాహము — అవ్వన్నీ తలాతోకా లేనట్టు కనిపించేవి. అతనికి ఎదురుగా కూర్చున్న మిఖేయిలోవిచ్ ముక్కలు కలుపుతూ పట్లు అతిజాగ్రత్తగా అతని దగ్గిర పడేటట్లు వేసేవాడు. దీనివల్ల ఇలియిచ్‌కి ముక్కలకోసం ముందుకు చేతులు చాపవలసిన అవసరం తప్పిపోయేది. కాని ఇలియిచ్ "నేనంత మరీ నీరసపడిపోయాననుకుంటున్నాడా?" అని లోలోపల మథనపడేవాడు. అయితే ముందు వెనకలు చూడకుండా ఆటలు చెప్పి మూడుపట్లలో ఓడిపోతూండేవాడు. మిఖేయిలోవిచ్ ఇది చూచి బాగా విసుక్కుంటూ ఉండేవాడుగాని, ఇలియిచ్ దీని కేమీ లక్ష్యపెట్టేవాడు కాదు. తరవాత ఇదంతా తెలుసుకొని ఇలియిచ్ మరింత బాధపడేవాడు,

మిగిలినవారంతా అది కనిపెట్టి "మరీ ఆయాసంగా ఉంటే ఆట మానేద్దాం. లోపలికి వెళ్ళి పడుకో" అనేవారు గాని, ఇలియిచ్ "నాకేమీ ఆయాసం లేదు." అని చెప్పి ఆ ఆట పూర్తి అయ్యేదాకా అల్లాగే కూర్చునేవాడు. దీనికి వారేమీ అనేవారు కారు గాని అల్లాగే నిరుత్సాహంగా ఆటలాడుతూండేవారు. ఇలియిచ్ తన మూలాన్ని వారు కూడా నిరుత్సాహంగా ఉన్నారనీ, తానది పోగొట్టలేకపోయాననీ బాధపడేవాడు. తరవాత వారంతా వెళ్ళిపోయేవారు. ఇక ఇలియిచ్ ఒక్కడూ అక్కడ కూర్చుని తన జీవితం అంతా విషమయమైపోయిందనీ దీని మూలాన మిగిలినవారి బ్రతుకులుకూడా విషపూరితాలైపోతున్నాయనీ, ఈ విషం ఇంకా లోపలికంటా ఎక్కిపోతున్నదనీ అనుకునేవాడు.

దీనితోబాటు బాధకూడా ఎక్కువైపోతూండేది. ఇదంతా అతనికి చాలా భీతావహంగా ఉండేది. అలాగే తప్పనిసరిగా పడుకోవాలని ప్రయత్నించేవాడు గాని, రాత్రంతా చాలాభాగం మేలుకునే ఉండేవాడు. మళ్ళీ మర్నాడు ప్రొద్దున్నే లేవాలి. వేషం వేసుకుని, కోర్టుకి వెళ్ళి రాతకోతలన్నీ సాగించాలి. ఒకవేళ కోర్టుకు వెళ్ళకపోతే ఇరవైనాలుగు గంటలు ఇంటిదగ్గిరే పడిఉండాలి. అతనికి అది అంతా ఒక పెద్దయాతనగా ఉండేది. ఇలాగ ఒక అఖాతంలో పడిపోతున్నట్లతని జీవితం సాగిపోతూండేది. ఆ ఇంటిలో అతని పరిస్థితి అవగాహన చేసుకుని కాస్త ఆప్యాయంగా మాటాడేవారు ఒక్కరు లేరు.

## 5

ఇలాగ కొన్ని నెలలు గడచిపోయాయి. క్రిస్మస్‌కు పూర్వం ఇలియిచ్ బావమరిది అక్కడికివచ్చి వారింట్లో దిగాడు. ఇలియిచ్ కోర్టుకు వెళ్ళాడు. ఫెదరోవ్నా ఏదో పనిమీద బజారుకు వెళ్ళింది. ఇవాన్ ఇలియిచ్ ఇంటికివచ్చి తన చదువుకునే గదిలో ప్రవేశించేసరికి బావమరిది కనిపించాడు. అతను మంచి జమాజట్టీలా ఉన్నాడు. తన పెట్టెలు తానే సర్దుకుంటున్నాడు. ఇలియిచ్ లోపలికి వస్తూంటే అడుగుల చప్పుడు విని తల పైకెత్తిచూశాడు గాని ఆపైన అతనికి నోట మాట పెగల్లేదు. ఆ చూపులో ఇవాన్ ఇలియిచ్‌కి అంతా బోధపడిపోయింది. బావమరిది అతన్ని చూస్తూ అత్యాశ్చర్యంగా ఏదో అనబోయాడు గాని మళ్ళీ తమాయించుకున్నాడు. దానితో ఇలియిచ్‌కి అతని అభిప్రాయం అంతా బోధపడిపోయింది.

"నేను బాగా మారిపోయానా?"

"అవును! నీలో కొంచెం మార్పు కనిపిస్తూంది."

ఆ తరవాత ఇలియిచ్ ఆ విషయంలో బావమరిదిని కదిపి చూడాలని ప్రయత్నించాడు గాని ఎంత కదిపినా మళ్ళీ అతని ఆ విషయం ప్రస్తావించనే లేదు. ఫెదరోవ్నా ఇంటికి తిరిగివచ్చిన తరవాత బావమరిది ఆమెతో మాట్లాడడానికి లోపలికి వెళ్ళిపోయాడు. ఇలియిచ్ తనగదిలో తలుపులు బిగించుకుని కూర్చుని అద్దంలో తనముఖం పరిశీలించుకున్నాడు; మళ్ళీ చెంపలకేసి చూసుకున్నాడు. తరవాత తను, భార్య కూర్చున్న రూపచిత్రం తీసుకువచ్చి, నాటికీ నేటికీగల తేడాలన్నీ గమనించాడు. అవన్నీ చూసుకుంటే తనలో బాగా మార్పు వచ్చినట్టు కనిపించింది. తరవాత చొక్కా మోచేతులదాకా మడిచి, వాటికేసి చూసి చొక్కా జార్చివేశాడు; ఒక సోఫామీద కూర్చుని తన పరిస్థితి తలుచుకుని లోలోపల కుమిలిపోయాడు.

అటుపిమ్మట "ఇక ఇల్లాగ బెంగపెట్టుకుని కూర్చుంటే లాభంలేదు!" అనుకుని ఒక్క అంగలో తను చదువుకునే బల్లదగ్గిరికి వెళ్ళి కోర్టు కాగితాలు చదవడం మొదలుపెట్టాడు గాని ఒక్క అక్షరమైనా ముందుకు నడవలేదు. తరవాత గడియపెట్టిన గది తలుపులు తెరిచి, నలుగురు కూర్చునేగదిలోకి వెళ్ళదామనుకున్నాడు. కాని ఆ గదితలుపులు వేసి ఉన్నాయి. అందుచేత చప్పుడు కాకుండా తలుపు దగ్గిరికి వెళ్ళాడు. అతనికి క్రింది సంభాషణ వినిపించింది. "అబ్బే! నువ్వనవసరంగా గోరంతలు కొండంతలు చేస్తున్నావు" అన్నది ప్రస్కోవ్యా ఫెదరోవ్నా.

"సరిసరి! గోరంతలు కొండంతలు చేస్తున్నానా? నీమట్టుకు నీకు కనబడడంలేదూ? మనిషి శవమైపోయాడు గాని మరేమన్నా ఉందా? ఆ కళ్ళకేసి చూడు! వాటిల్లో ప్రాణాలున్నాయా? అయితే ఇంతకీ జబ్బేమిటి?"

"ఏమో! ఎవరికి తెలుసును! నికోలావిచ్ (ఇతడింకొక డాక్టరు) ఏదో అన్నాడుగాని ఆయన

చెప్పినది నాకేమీ బోధపడలేదు. ఇంకొక డాక్టర్నడిగితే ఆయన ఇంకేదో చెప్పాడు. ఆయన చెప్పినదాన్నికీ ఈయన చెప్పినదానికీ ఎక్కడ తాను, బొంగరము అందడం లేదు.

ఇలియిచ్ గబగబా తన గదిలోకి నడిచివెళ్లి సోఫామీద పడుకుని "డాక్టరు మూత్రపిండం పైకీ కిందికీ ఎగురుతున్నదన్నాడు!" అనుకున్నాడు. తర్వాత దాన్ని గురించి డాక్టర్లు చెప్పినవన్నీ జ్ఞాపకం తెచ్చుకున్నాడు. వారు దానంతట అది విడిపోయి పైకీ కిందికీ ఎగురుతున్నతీరంతా కళ్లకు కట్టినట్టు వర్ణించిచెప్పారు. ఇలియిచ్ తన భావనాబలం వల్ల అది ఎగిరిపోకుండా ఒకచోట నిలబెట్టడానికి ప్రయత్నించాడు. దీనికోసం డాక్టర్లు తలలు బద్దలు కొట్టుకోవడం ఎందుకో అతనికి బోధపడలేదు. తరవాత "నేనొకసారి ఇవానోవిచ్ దగ్గిరికి వెళ్లివస్తాను." అనుకున్నాడు. ఆ డాక్టరు ఇవాన్ విచ్‌కి స్నేహితుడు. ఇలియిచ్ వెంటనే బండి సిద్ధం చేయించి ప్రయాణానికి తయారయ్యాడు.

భార్య అతన్ని చూసి ఎంతో జాలిపడి "ఎక్కడికి వెళుతున్నారు:" అని అడిగింది. ఆమె జాలి చూపులవల్ల అతను మరింత చిరచిరలాడి, విసుగ్గా "నేనొకసారి ఇవానోవిచ్‌ని కలుసుకోవాలి." అన్నాడు.

తరవాత ఇవానోవిచ్ ఇంటికి వెళ్ళి అతను, తను కలిసి ఆ డాక్టరు దగ్గిరికి వెళ్లారు. ఆ డాక్టరు ఇంటిదగ్గిరే ఉన్నాడు. ఇలియిచ్ అతనితో చాలా సేపు మాట్లాడాడు.

ఆ డాక్టరు అతని శరీరంలోపల వచ్చినమార్పులన్నీ సోదాహరణంగా వివరించి చెప్పాడు. ఇలియిచ్‌కి అదంతా చక్కగా బోధపడింది.

వర్మిఫారమ్ ఎపెండిక్స్‌లో ఉండలాంటి ఒక పదార్థం ఉన్నది. బహుశః దానంతట అదే దారిలోకి రావచ్చును. ఒక అవయవానికి కొంచెం సత్తా కలిగేటట్లు చేస్తే రెండోది కదలడంమానివేసి దానంతట అదే హరించిపోతుంది. అది జరిగిందంటే ఉన్న జబ్బంతా ఒక్క నిమిషంలో కుదిరిపోతుంది. ఉన్న పరిస్థితి అది. ఆ తరవాత ఇలియిచ్ కొంచెం ఆలస్యంగా ఇంటికివచ్చి భోజనంచేసి, చాలా కులాసాగా కబుర్లు చెప్పాడు. అటుపిమ్మట చాలాసేపటికి తనగదిలోకి వెళ్లాడుగాని, ఇక వా కోర్టుపనే చూడలేకపోయాడు.

చిట్టచివరికి మళ్లీ ఎల్లాగో అల్లాగ తన గదిలోకి వెళ్లి కూర్చుని ఆ కోర్టుకాగితాలన్నీ చదివాడు. అయితే ఆపని చేస్తూన్నంతసేపు తాను చెయ్యవలసిన పని ఏదో పూర్తిచెయ్యకుండా విడిచిపెట్టినట్లేఉంది. అది అత్యంత ముఖ్యమైన విషయం. ఆ కోర్టుపని పూర్తికాగానే తటాలున ఆ విషయం జ్ఞాపకం వచ్చింది. అది తన జబ్బుసంగతి! అయితే ప్రస్తుతానికి ఆ విషయాన్ని గురించి ఆలోచించడం మానివేసి టీ తాగడానికి ఆ పక్కగదిలోకి వెళ్లాడు. అక్కడ చూడడానికి వచ్చినవాళ్లెవళ్లో ఉన్నారు. వారిలో తనకు కాబోయే అల్లుడుకూడా ఉన్నాడు. ప్రస్తుతం అతడు మేజిస్ట్రేటుగా పనిచేస్తున్నాడు. అతడు కుమార్తెకు అన్నివిధాలా తగిన వరుడు. అక్కడ ఉన్నవారందరు ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. మధ్యమధ్య పియానోసంగీతము, పాటలు వినిపిస్తున్నాయి. ఫెడరోవ్నా అన్నట్లు ఇవాన్ ఇలియిచ్ ఆ రోజంతా కులాసాగానే ఉన్నాడు. అయితే అతనికి ఆ ఎపెండిక్స్ సంగతి మాటిమాటికీ జ్ఞాపకం వస్తూనేఉంది. రాత్రి ఒంటిగంట అయిన తరవాత పడకగదిలోకి వెళ్లి పడుకున్నాడు. జబ్బు చేసినప్పటినించీ అతను చదువుకునే గదికి పక్కగా ఉన్న ఆ చిన్నగదిలోనే పడుకుంటున్నాడు. అటుపిమ్మట దుస్తులు మార్చుకుని జోలా వ్రాసిన నవల తీసి చదువుతూ కూర్చున్నాడు. నవల నడవలేదు. తన ఎపెండిక్స్ సంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే భావనాబలంవల్ల అదంతా నయమయిపోయిందని అనుకున్నాడు. "అంతే! శరీరం సహజంగా దాని దారిని అది నడిచిపోతుంటే రోగాలన్నీ వాటంతట అవే నయమయిపోతాయి! అంతే." అనుకున్నాడు. ఆ తరవాత అతనికి మందుమాట జ్ఞాపకంవచ్చింది. వెంటనే లేచి కూర్చుని, మందు తీసుకుని, ఆ మందు పని చేసేదాకా అల్లాగే వెల్లకిలా పడుకుని నెప్పి తగ్గిపోతుందేమోనని చూశాడు. పిమ్మట "జాగ్రత్తగా మందుపుచ్చుకుంటూ అపథ్యాలు చెయ్యకుండా ఉంటే అన్నీ చక్కబడిపోతాయి. అప్పుడే మందు కొంచెం గుణం ఇస్తూంది." అనుకుని నెప్పి పెట్టేచోట మెల్లిగా నొక్కిచూశాడు. అప్పు డది

నొప్పి పెట్టలేదు. "ఇహా నేం! ఇక్కడ నొప్పిలేదు. అప్పుడే గుణం కనబడుతూంది......ఎపెండిక్సు క్రమక్రమంగా హరించిపోతూంది." అనుకున్నాడు. ఇంతలో నే తిరిగి హఠాత్తుగా ఆ శూలంతో పొడిచే నొప్పి ప్రారంభమయింది. అది క్రమంగా బాగా ఎక్కువయిపోయింది. అంతలో నే నోరంతా వికారంగా తయారయింది. గుండె ఆగిపోయినట్లయింది. కళ్లు తిరిగాయి. "అమ్మో! అమ్మో! మళ్లీ వచ్చింది. ఇది ఇంక తగ్గనే తగ్గదు" అనుకున్నాడు. అంతలో నే ఈ సమస్యఅంతా అతనికి కేవలం మరొక విధంగా కనబడింది. తనలో తాను ఇలాగ అనుకున్నాడు. "ఎపెండిక్సా! మరొకటా!...ఇప్పుడిది ఎపెండిక్స్ అయితేం! మరిఒకటి అయితేం! అసలిదంతా నా ప్రాణాలమీదికే వచ్చేటట్లుంది. ఇప్పటికి బతికేఉన్నానుగాని, ఈపైన ఇక జీవించడం కష్టం. దీనికి నేను చెయ్యగలిగినది ఏమీ లేదు. ఊరికే లేనిపోని ఆశలు పెట్టుకుంటే ఏం లాభం? అందరు అప్పుడే ఇంకేమీ లాభంలేదని అనేస్తున్నారు. వారం పది రోజుల్లో నే నెల్లాగా చచ్చిపోతాను......ఏమో! ఇప్పుడే ప్రాణం పోవచ్చును. ఇంతకు పూర్వం కొంచెం ఆశ ఉండేదిగాని ఇప్పుడంతా అంధకారబంధురం అయిపోతూంది. ప్రస్తుతానికి ఇక్కడే ఉన్నానుగాని ఆ తరవాత అక్కడికి వెళ్లిపోతాను!...ఎక్కడికి?"

అతనికి ఒళ్లంతా వాతం కమ్మినట్లయింది. ఊపిరి ఆగిపోయింది. కాని గుండె కొట్టుకుంటూన్నట్లు వినబడుతూంది.

"నేను చచ్చిపోయాక ఇక మిగిలేదేమిటి? ఏమీ మిగలదు. చచ్చిపోయాక నే నేమైపోతాను? చచ్చిపోవడం అంటే ఇదేనా? కాదు! నాకు చావాలని లేదు!" అనుకుని ఒక్క అంగలో లేచి నుంచుని కొవ్వొత్తి వెలిగించాలని అనుకున్నాడు. వణుకుతూ వణుకుతూ ఆ కొవ్వొత్తి చేత్తో పట్టుకోబోయి, అది నేలమీదికి జారవిడిచి తలగడమీద వెల్లకిలా పడిపోయాడు.

ఆ తరవాత లేచి నుంచుని, బాగా కళ్లు తెరిచి ఆ చీకటికేసి చూస్తూ ఇలా అనుకున్నాడు! "చావు! అవును చావే! వాళ్లెవళ్లకీ దీని గొడవ తెలియనే తెలియదు! అదంతగా తెలిసికోవాలనీ లేదు! ఒక్కళ్ళకీ నామీద జాలిలేదు! ఇలాంటి సమయంలో వాళ్లంతా ఆటపాటలతో కాలక్షేపం చేస్తున్నారు! (అతనికా తలుపుసందులోనించి వాళ్ల ఆటపాటలు వినిపించాయి.) నే నేమయితే వాళ్లకేం? అయినా వాళ్ళూ చస్తారు! దౌర్భాగ్యులు! ముందు నేను! ఆ తరవాత వాళ్లు! అయితే సరిగ్గా వాళ్లకీ ఇల్లాగే జరుగుతుంది! ఇప్పుడు మాత్రం ఎగిరి గంతు వేస్తున్నారు. పశువులు!"

ఆ పైన ఒళ్లు తెలియని కోపంతో గిజగిజలాడిపోయి యమయాతన అనుభవించాడు. తరవాత "ప్రపంచంలో మనుష్యులందరూ ఈ నరకయాతన అనుభవించవలసిందే! ఎంత దారుణం!" అనుకొని మళ్ళీ కొంచెం శాంతం తెచ్చుకొన్నాడు.

అటుపిమ్మట "నేనెప్పుడో కంగారుపడి పోతున్నాను. కొంత తమాయించాలి. మొదటినించీ జరిగినదంతా ఒకసారి జ్ఞాపకం చేసుకోవాలి." అనుకుని ఆ రోగం సంగతి అంతా జ్ఞాపకం తెచ్చుకున్నాడు. "ఆ వేళ గోడతగిలినప్పుడు పార్శ్వానికి దెబ్బతగిలింది. ఆవేళ, ఆ మర్నాడు కులాసాగానే ఉన్నాను. కొంచెం గట్టిదెబ్బ తగిలితే తగిలిఉండవచ్చును. ఆ తరవాత కొంతనుంచి డాక్టర్లను చూశాను. తరవాత తరవాత ఆందోళన, మనస్తాపము ఎక్కువయ్యాయి. ఆ పైన మరి కొంతనుంచి డాక్టర్లని చూశాను. చివరికీ అఘాతంలో పడిపోయాను. క్రమక్రమంగా బాగా నీరసించిపోయాను. ఒళ్ళంతా సుళ్లయిపోయింది. మొహంలో ప్రేతకళ పడింది. నేనేదో ఎపెండిక్సును గురించి ఆలోచిస్తున్నానుగాని అసలు ప్రాణాలకే మోసంవచ్చింది. నిజంగా ప్రాణాలకే మోసం వస్తుందా?"

అలాగనేసరికి అతనికి విపరీతమైన భయంవేసి ఊపిరాడనట్లయింది. తన పరుపు పక్కనున్న బల్ల గట్టిగా ఆనుకుని అగ్గిపెట్టెకోసం వెతకబోయాడు. ఆ బల్ల మరీదగ్గరగా ఉండడంవల్ల అతనికి తగిలి దెబ్బతగిలింది. అందుచేత ఇంకా మండిపడిపోయి ఆ బల్లమీద మరింత గట్టిగా ఆనుకున్నాడు. దానితో అది తల్లకిందులయింది. అమాంతంగా వెనక్కి పడిపోయి కంగారువల్ల ఊపిరాడక తన కప్పుడే అవసానకాలం

దగ్గిరికి వచ్చిందని అనుకున్నాడు. ఆ యింటికి చూడడానికివచ్చిన వారంతా వెళ్ళిపోతున్నారు. ఫెదరోవ్నా వారినందరినీ సాగనంపుతున్నది. ఏదో పడినచప్పుడు కాగానే వెంటనే ఇలియిచ్ గదిలోకి వచ్చింది.

"ఏమిటిది! ఏమి జరిగింది!"

"ఏమీలేదు. జారిపడ్డాను. దెబ్బతగిలింది."

ఆమె వెంటనే ఇవతలికివచ్చి ఒక కొవ్వొత్తి చేత్తో పట్టుకుని తిరిగి లోపలికి వెళ్ళింది. ఇలియిచ్ వెయ్యిగజాలమేరం పరుగెత్తిన మనిషిలాగ గట్టిగా వగరుస్తూ వెల్లకిలా పడుకుని, రెప్పవాల్చకుండా ఆమెకేసి చూశాడు.

"ఏమిటిది?"

"ఏ...మీ లేదు. బల్ల తిరగబడి పోయింది."

అతను లోలోపల "చెప్పడం ఎందుకు? ఆమెకివన్నీ అక్కర లేదు." అనుకున్నాడు.

నిజాని కామె జరిగినదేమిటో బోధపరుచుకోనే లేదు. మళ్ళీ ఆ బల్ల తిన్నగా నిలబెట్టి, కొవ్వొత్తి వెలిగించి, ఇంకొకర్ని సాగనంపడానికని తొందర తొందరగా అక్కడినించి వెళ్ళిపోయింది. ఆమె తిరిగివచ్చిన తరవాతకూడా అతనల్లాగే వెల్లకిలా పడుకుని పైకి చూస్తున్నాడు.

"ఏమిటిది? బాగా బాధగా ఉందా?"

"అవును."

"అయితే మిమ్మల్ని చూడడానికిప్పుడు డా. పెద్దడాక్టర్ని పిలవాలనుకుంటాను."

ఈమాటవల్ల ఖర్చులెంతైనా ఆలోచించకుండా ఆ పెద్దడాక్టర్ని పిలవాలని తేలిపోయింది. అతను లోలోపలి అక్కసుతో ఒక చిరునవ్వు నవ్వి "వద్దు" అన్నాడు. ఆ తరవాత ఆమె అక్కడే కొంచెంసేపుండి, అతని దగ్గిరికి వెళ్ళి నుదురు ముద్దు పెట్టుకుంది.

అలాగామె ముద్దుపెట్టుకుంటూంటే అతనిలో నఖ శిఖపర్యంతము ద్వేషాగ్ని ప్రజ్వలించింది. అతికష్టంమీద ఆమెను గెంటివెయ్యకుండా నిలవరించుకోగలిగాడు.

"సరే నేను వెళుతున్నాను. భగవంతుడి దయవల్ల నిద్రపడుతుంది లెండి."

"సరే!"

## 6

ఇలియిచ్‌కి తానింక జీవించడం కష్టమని తోచింది. అందుచేత రాత్రింబగళ్ళలాగే దిగులుగా పడి ఉండేవాడు. లోలోపల పూర్తిగా జీవితాశ నశించిపోయినా, అతని కీ కొత్త పరిస్థితి అలవాటు కాలేదు; అసలీవిషయమే అతనికి బోధపడలేదు.

చిన్నప్పుడతను కళాశాలలో తర్కం చదువుకున్నాడు. అందులో "కైయస్ మానవుడు; మనుష్యులు మరణిస్తారు: కనక కైయస్ మరణిస్తాడు" అనే తర్కవాక్యం చదివాడు. ఆ కైయస్‌కి సంబంధించినంతవరకు నిజమే అనుకున్నాడు. కాని అదితనకన్వయిస్తుందని అనుకోనేలేదు. కైయస్ అంటే ఎవరో మానవమాత్రుడన్నమాట! అతడు చచ్చిపోతాడన్న సంగతి అక్షరాలా నిజమేకావచ్చును! కాని తను కైయస్‌వంటి మానవమాత్రుడుకాడు; అందరికన్నా విభిన్నుడయిన ప్రత్యేకవ్యక్తి! చిన్నతనంలో అమ్మా నాన్న ఉండేవారు. ఎంతో ముద్దుగా, "చిట్టి వాన్యా" అని పిలిచేవారు. ఆడుకోడానికి ఎన్నో బొమ్మలుండేవి. ఇంకా ఒక సుర్రపుబండీ ఉండేది. దాది అవన్నీ అన్ని విధాలా కనిపెట్టి చూస్తూండేది. తరవాత కొంచెం పెరిగి పెద్దవాడై యువకుడైనాడు. ఆరోజుల్లో అనేక విధాలుగా కష్టాలు, సుఖాలు అనుభవించాడు. వాన్యా చిన్నప్పుడు రబ్బరుబంతితో ఆడుకునేవాడు. ఆ కొత్తబంతి సువాసన కైయస్ కేమి తెలుసును? కైయస్ చిన్నప్పుడు తల్లి చేతులంత ఆప్యాయంగా ముద్దుపెట్టుకున్నాడా? ఆమె సిల్కు దుస్తులెంతో ఆప్యాయంగా అవన్నీ అలముకొన్నాయా? స్కూల్లో తినుబండారాలు బాగుండకపోతే కైయస్ ఎప్పుడైనా హంగామా చేశాడా? అసలు కైయస్ ఎప్పుడైనా ప్రేమించాడా? కోర్టులో న్యాయాధిపతిగా వ్యవహరించాడా?

"కైయస్ ఎలాగైనా చనిపోయే వ్యక్తే. కనక అతడు చచ్చిపోవడం సహజమే. కాని చిన్నప్పుడు వాన్యానై, ఇప్పుడు ఇలియిచ్‌నైన నాకు

అటనికీ చాలా తేడా ఉంది. నా ఆలోచనలు, కష్టసుఖాలు వేరు. అందుచేత నేను చచ్చిపోవడానికి వీల్లేదు. మృత్యు వెంత భీభత్సంగా ఉంది!" ఇదీ అతని ధోరణి.

"నేనుకూడా కైయస్‌లాగ చచ్చిపోవడం తప్పనిసరి అయితే నాకా విషయం ఇంతకు పూర్వమే తెలిసిఉండవలిసింది. ఏదో అంతర్వాణి నన్ను ప్రబోధించి ఉండవలసింది. నేను ఎరిగిఉన్నంతవరకు నాకు, నా స్నేహితులకు అలాంటి దేదీ జరగనేలేదు. అదీగాక మేమందరము కైయస్‌కి మాకు చాలా తేడా ఉందనుకున్నాము. అయితే వ్యవహారంఅంతా ఇలా మారిపోయిందేమిటి? ఆఁ! భయంలేదు! అలా నెప్పుడు జరగదు! కాని ప్రస్తుతపరిస్థితి ఇలాగ మారిందేమిటి? ఇదంతా అగమ్యగోచరంగా ఉంది!"

ఇలాగ ఎంత ప్రయత్నించినా అతనికి సమస్య బోధపడలేదు. కనక తల తోక లేకుండా రాత్రింబగళ్లు పట్టుకుని పీడిస్తున్న ఈ ఆలోచనలన్నింటినీ దగ్గిరికిరాకుండా తరిమివెయ్యాలనీ, మంచి విషయాలతో తలపెడుతూ ఉండాలని అనుకున్నాడు. కాని అస్తమానము అతన్ని ఆ వెనకటి ఆలోచనలే పట్టుకుని వెంటాడేస్తూండేవి. అంతేకాదు; ఆ ఆలోచనలేకాక ఆ ఆలోచనల వెనకొలఉన్న నిజస్వరూపమే అతన్నెదుర్కొంటూండేది.

అయినా ఆ ఆలోచనలు తరిమివెయ్యడానికి మరికొన్ని విషయాలు జ్ఞాపకం చేసుకున్నాడు. వాటివల్ల మనస్సుకు కొంచెం ఊరట కలుగుతుందని అనుకున్నాడు. తరవాత జబ్బుచెయ్యకపూర్వం తన కలవాటయిన ధోరణిలో పడ్డాడు. ఇంతకుపూర్వం ఆ ధోరణివల్ల మృత్యువునుగురించిన ఆలోచనలు దగ్గిరికివచ్చేవి కావు. కాని అదేమి చిత్రమోగాని ఇప్పుడా ధోరణులన్నీ బొత్తిగా పనిచెయ్యడం మానివేశాయి. అయినా ఇప్పుడెంతసేపూ అతనా పూర్వధోరణి బలవంతంగా అలవాటు చేసుకోవాలని ప్రయత్నించేవాడు. తనలో తాను "పూర్వం నేను ఆఫీసుపనులు చూసుకుంటూ సుఖంగా ఉండేవాణ్ణి. మళ్ళీ ఇప్పుడా ఆఫీసుపనిలో పడతాను." అనుకునేవాడు. తరవాత తటపటాయించడం మానివేసి, కోర్టుకు వెళ్లి తోటివారితో బాతాఖానీ వేస్తూండేవాడు. పూర్వం మాదిరిగానే ఆదరా బాదరాగా కూర్చుని, ఆ చిక్కిపోయిన చేతులు కుర్చీమీద వేళ్లాడవేసి, జనంకేసి చూస్తూ ఏదో ఆలోచిస్తూండేవాడు. అప్పుడప్పుడు బల్లమీద పడిఉన్న కాగితాలు దగ్గిరికి లాక్కుని తోటివారితో గుసగుస లాడుతూండేవాడు. మళ్ళీ అంతలోనే నిటారుగా కూర్చుని, కనురెప్పలు పైకెత్తి, కోర్టుతాఖీదులు జారీచేస్తూ విచారణ ప్రారంభించేవాడు. అయితే ఆ విచారణ సగం నడిచేసరికి ఆ పక్కలో నెప్పి కళుక్కున పొడిచేది! ఇలియిచ్ అది కనిపెట్టి, మరిచి పోవాలని ప్రయత్నించేవాడు. కాని ఏమీ లాభం లేకపోయేది. ఆ నెప్పి ఎదురుగావచ్చి నిలబడి, అతనికేసి చూస్తున్నట్టుండేది. అతను నిర్ఘాంతపడేవాడు. కళ్లు చీకట్లుకమ్మేవి. ఆ సంఘటన నిజమేనా అని అనుమానం కలిగేది. అంతటి ప్రతిభావంతుడిల్లాంటి అనుమానాల్లో పడి పొరబాట్లు చేస్తూండడం చూసి, తోటివారంతా ఆశ్చర్యపడి బాధపడుతూండేవారు. ఇలియిచ్ అతి కష్టంమీద మనస్సు నిబ్బరంచేసుకుని, కోర్టువ్యవహారాలు ఎలాగో అలాగ ముగించుకుని, ఎంతో బాధపడుతూ ఇంటికి జేరుకునేవాడు. కోర్టు పనివల్ల మనస్సులో బెంగపోతుందనీ, పూర్వం మోస్తరుగా చీకు, చింత లేకుండా గడిచిపోతుందనీ అనుకున్నాడుగాని అది జరగలేదు. ఆ మృత్యుభయం ఇప్పుడస్తమానము వెంటాడుతూనే ఉంది. ఎదురుగావచ్చి కనురెప్పలు వాల్చకుండా తనకేసి చూడమని బెదిరిస్తున్నది. దిక్కులేనట్లుగా అల్లాగే చూస్తూ యమయాతని అనుభవించవలసిందని ఆదేశిస్తున్నది.

ఇలియిచ్ ఈ పరిస్థితుల్లోనించి తప్పించుకోడానికి కొన్ని కొన్ని కొత్తమార్గాలన్వేషించేవాడు. వాటివల్ల అతనికి కొంచెం ఉపశమనం కలిగేదిగాని, కొద్దికాలంలోనే అవ్వన్నీ ఎందుకు పనికిరాకుండా పోయేవి. చివరికి ఆ పార్శ్వంనెప్పి ఒక్కటే అతి భయంకరంగా సాక్షాత్కరించేది.

ఇలాగ కొంతకాలం జరిగినతరవాత ఇలియిచ్ తాను మొట్టమొదట సర్దిన గదిలోకి వెడుతూండేవాడు. ఆ గదిలోనే అతను పడిపోవడం జరిగింది. చివరికి ఆగది సర్దడంకోసం అతని జీవితం అంతా

ఆహుతి అయిపోయేట్లుంది. అదంతా ఎంత అసంబద్ధంగా తయారయింది! ఆ దెబ్బ తగిలినతరవాతే అతని శరీరంలో ఆ రోగం అంకురించింది. ఆగదిలోకి వెళ్లి అక్కడివస్తువులన్నీ పరిశీలించేవాడు. అక్కడ ఉన్న బల్లపైభాగం మెరుగు పాడయిపోయింది.

అది బాగా మెరుగుపెట్టి శుభ్రం చేయించిన బల్ల. ఇలియిచ్ ఆ బల్లపాడవడానికి కారణమేమా అని పరిశీలించాడు. దానిమీద అమర్చిన ఆల్బం తాలూకు ఇత్తడిపువ్వు వంకరపోయింది. అతను ఆ ఆల్బం అందంగా అమర్చడానికి చాలా డబ్బు ఖర్చు పెట్టాడు. ఆ ఏర్పాట్లన్నీ స్వయంగా చేసుకున్నాడు. అది పాడైపోయినందుకు కూతురిమీద, ఆమె చెలికత్తెలమీద విసుక్కున్నాడు. ఆ ఆల్బం ఒక పక్క చిరిగిపోయింది. అందులో అమర్చిన కొన్ని ఫోటోలు తల్లకిందులుగా తిరిగాయి. అతను అవన్నీ యథాప్రకారంగా అమర్చి, ఆ ఇత్తడిపువ్వు కొంచెం వంచాడు. ఆ తరవాత ఆ బల్ల, దానిమీద అమర్చిన వస్తువులు మరో మూల పెడితే బాగుంటుందని అనిపించింది. వెంటనే నౌఖర్ని పిలిచాడు. ఆకేక విని భార్య, కుమార్తె అక్కడికి వచ్చారు. వారిద్దరు ఆ బల్ల మార్చడం బాగుండదని అన్నారు. భార్య మాట, తనమాట కలవలేదు. దానిమీద బాగా కోపం వచ్చింది. అంతవరకు అతనికా నొప్పిమాట జ్ఞాపకం లేదు. ప్రస్తుతానికది పైకి కనబడకుండా అణిగిపోయినట్లుంది.

ఒకప్పుడెప్పుడైనా ఇలియిచ్ అక్కడి వస్తువులక్కడ పెడుతూంటే ఫెదరోవ్నా చూసి "ఆపని నౌఖర్లు చేస్తారులెండి! మళ్లీ దెబ్బ తగులుతుందేమో!" అనేది. ఆ మాటనేసరికి అతని కాబాధ కళుక్కుమన్నట్లుండేది. ఇలియిచ్ దానంతట అదే పోతుందని అనుకునేవాడు. కాని తెలవని తలంపుగా మళ్లీ ఆబాధని గురించే ఆలోచించేవాడు. తన పార్శ్వంకేసి చూసుకుంటూ "ఇది ఇక్కడే మకాం వేసి నా ప్రాణాలు తోడేస్తూంది." అనుకునేవాడు. ఎంత ప్రయత్నించినా అతనా బాధగోడవ మరిచిపోలేకపోయేవాడు. అది ఎదురుగా ఉన్న పువ్వుల వెనకాలనుంచి తనకేసి చూస్తూన్నట్లుండేది. ఇలియిచ్ తనలో "ఇంతా చేస్తే ఇదంతా ఎందుకు జరిగింది? ఏదో యుద్ధానికి వెళ్లినట్లు తెరకోసం వెళ్ళాను. చేతులారా ప్రాణాల మీదికి తెచ్చుకున్నాను! తలుచుకుంటే ఇదంతా ఎంత అసంబద్ధంగా తయారయింది! నిజంగా ఇది ఇల్లాగ జరుగుతుందా? అనిపిస్తుందిగాని, చివరికిది అక్షరాలా నిజమైకూరుకుంది." అనుకునేవాడు.

ఇలియిచ్ చదువుకునే గదిలోకి వెళ్ళి పడుకుని ఒంటరిగా ఆ నొప్పితో సతమతమవుతూ ఉండేవాడు. ఆ నొప్పిసంగతి తెలుసుకుని కుమిలిపోవడం తప్ప మరేమీ చెయ్యలేకపోయేవాడు.

## 7

మొత్తంమీద చివరికి ఇదంతా ఎల్లా పరిణమించిందో చెప్పడం కష్టమే. కాని ఆ రోగం చాపకిందనించి నీరు పాకినట్లు అలాగలాగ పెరిగిపోయింది. మూడు నెలలు గడిచేసరికి, అతని భార్యకు, కుమార్తెకు, డాక్టర్లకు, నౌఖర్లకు — ఇంటిల్లపాదికీ, చివరికి ఇలియిచ్‌కి — ఒక విషయం స్పష్టపడిపోయింది. అతనివల్ల ఆ ఇంటిల్లపాదీ నానా ఇబ్బందులు పడటంవల్ల, అతని ప్రాణాలెప్పుడు హరీ అంటాయా, యావన్మందికీ ఆ అవస్థలెప్పుడు తప్పిపోతాయా అని అందరు కనిపెట్టుకుని కూర్చున్నారు.

క్రమక్రమంగా అతనికి నిద్రపట్టడం మానేసింది. నిద్రపట్టడానికి కొన్ని ఇంజెక్షను లిచ్చేవారుగాని, వాటివల్ల గుణం కనబడలేదు. మొట్టమొదట అతనికి కొంచెం మగత కమ్మినట్లుండి బాధ తగ్గినట్లు కనబడేది. కాని చిట్టచివరికి ఆ మగతే మరింత బాధకరంగా పరిణమించింది.

డాక్టర్లతనికోసం ప్రత్యేకంగా కొన్ని ఆహార పదార్థాలు తయారుచేయించేవారు. క్రమక్రమంగా అరుచి, ఎక్కువైపోవడంవల్ల అవ్వికూడా నోట్లో పెట్టుకోవడం దుర్ఘటమైపోయేది.

చివరికి అవతలికీ, ఇవతలికీ వెళ్ళడానికికూడా కొన్ని ప్రత్యేకమైన ఏర్పాట్లు చెయ్యవలసివచ్చింది. ఎవరో ఒకరు పక్కని నిలబడటంవల్ల, ఇంకా అనేకమైన ఇబ్బందులవల్ల అతని కదంతా ఒక పెద్దఅవస్థగా ఉండేది.

కాని ఈ అవస్థద్వారానే అతనికి సౌఖ్యం కలిగింది. వంటమనిషిదగ్గర అసిస్టెంటుగా ఉంటున్న

జెరాసిమ్ ఆతని కీ విషయంలో బాగా ఆసరాగా ఉండేవాడు. ఇతడు రైతుబిడ్డ. బస్తీతిండి తిని లావెక్కాడు. ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ మంచి ఉత్సాహంగా ఉండేవాడు. పరిశుభ్రమైన రష్యా రైతు వేషం వేసుకున్న జెరాసిమ్ ఈ అసహ్యకరమైన పనులు చేస్తూంటేనే చూస్తే మొట్టమొదట ఇలియిచ్‌కి కొంచెం ఇబ్బందిగా ఉండేది.

ఒకసారి ఇలియిచ్ బాగా నీరసపడిపోయాడు. కమోడ్ మీదనించి లేచినతరవాత పంట్లాముకూడా పైకి లాక్కోలేనంత నీరసంతో దగ్గరలోనే ఆపక్కనే ఉన్న పడకకుర్చీలో కూలబడ్డాడు. బాగా చిక్కిపోయి నగ్నంగాఉన్న తన శరీరంకేసి చూసుకుంటే అతనికి ముచ్చెమటలు పోశాయి.

కాని జెరాసిమ్ గట్టిగా అడుగులు వేసుకుంటూ ఒక్క నిమిషంలో అక్కడికి వచ్చేశాడు. అతని కాలిజోళ్లలోనించి పరిశుభ్రమైన శీతగాలి పరిమళం బయలుదేరుతోంది. దానితో కలిసిన తారువాసన హృదయాని కెంతో ఉల్లాసకరంగా ఉన్నది. జెరాసిమ్ కొత్తనారతో తయారుచేసిన బనియను తొడుక్కున్నాడు. చొక్కా చేతులు మోచేతుల దాకా మడిచివేశాడు. ఆడుతూ పాడుతూన్నట్టు అతి హుషారుగా ఆ కమోడ్ దగ్గిరికి వచ్చాడు. ఇలియిచ్ మొహమాట పడతాడేమో అని అతనివైపు చూడకుండా నిలుచున్నాడు. ఇలియిచ్ నీరసంగా 'జెరాసిమ్!' అని పిలిచాడు.

మొట్టమొదట జెరాసిమ్ ఏదో తప్పుపని చేసిన వాడిలాగ కొంచెం ఉలిక్కిపడ్డాడు. కాని కనురెప్పపాటులో ఎంతో ఆప్యాయంగా ఇలియిచ్ వైపు చూశాడు. యౌవనోల్లాసంతో కిలకిలలాడు తున్న అతని ముఖంమీద చిరుగడ్డం బయలుదేరే సూచనలు కనిపిస్తున్నాయి.

జరాసిమ్ "ఏంబాబూ!" అన్నాడు. "నిన్ను చాలా ఇబ్బంది పెడుతున్నాను, ఏమీ అనుకోకు. నేను బొత్తిగా నీరసంగా ఉన్నాను."

జెరాసిమ్ కళ్లు కలకలల్లాడుతున్నాయి. నోరు తెరిచేసరికి పళ్లు తళతళా మెరుస్తున్నాయి.

"అదేటిబాబూ అలాగంటారు! ఇందులో ఇబ్బందేముంది! పుట్టెడు జబ్బుచేసి పడిపోయారు బాబూ!"

ఆ తరవాత జెరాసిమ్ అతి చాకచక్యంతో తన పని అంతా ముగించివేసి, మళ్ళీ వెంటనే లోపలికి వచ్చి నిలుచున్నాడు.

ఇవాన్ ఇలియిచ్ ఆ పడకకుర్చీలో అలాగే కూర్చునిఉన్నాడు.

జెరాసిమ్ కమోడ్ శుభ్రంగా కడిగివేసి మళ్ళీ ఇంకొకటి సిద్ధంచేసి ఉంచాడు. ఇలియిచ్ "జెరాసిమ్! ఇలాగ ఒకసారివచ్చి కాస్త చెయ్యి అందిస్తావా?" అన్నాడు. వెంటనే జెరాసిమ్ అతనికి దగ్గిరిగావచ్చి నిలబడ్డాడు. ఇలియిచ్ "నాదగ్గర పని చేసేవాణ్ణి పంపించివేశాను. బొత్తిగా లేచి నిలబడ లేకుండా ఉన్నాను. కొంచెం లేవదీస్తావా?" అన్నాడు.

జెరాసిమ్ అతనికి ఆయాసం రాకుండా అతి జాగ్రత్తగా రెండుచేతులతోను లేవనెత్తి, ఒక చెయ్యి ఆసరా ఇచ్చి, రెండవచేత్తో పంట్లాము సరి చేశాడు. ఆ తరవాత మళ్ళీ అతన్ని ఆ కుర్చీమీద కూర్చోబెట్టాలని అనుకున్నాడుగాని, ఇలియిచ్ ఆ పక్కనే ఉన్న సోఫాదగ్గిరికి తీసుకువెళ్ళమని అడిగాడు. జెరాసిమ్ ఇలియిచ్‌కి ఏమీ ఆయాసం కలగకుండా అతి జాగ్రత్తగా నడిపించుకువెళ్ళి ఆ సోఫామీద కూర్చోబెట్టాడు.

ఇలియిచ్ "అమ్మయ్యా! ఇవన్నీ నువ్వు ఎంత తేలికగాచేసి పారేస్తున్నావు!" అన్నాడు.

జెరాసిమ్ ఒక చిరునవ్వు నవ్వి అక్కడినించి బయలుదేరబోయాడు. ఇలియిచ్‌కి అతనక్కడే ఉంటేనే, ఎంతో సుఖంగా ఉన్నట్టు కనబడింది. అందుచేత జెరాసిమ్‌ని దగ్గరగా అట్టేపెట్టుకోవాలని నిశ్చయించి "ఇంకొక్క చిన్నపని! ఆ కుర్చీ నా కాళ్లకింద పెట్టు. కాళ్లు ఎత్తుగా ఉంటే ప్రాణానికి సుఖంగా ఉంది." అన్నాడు. జెరాసిమ్ ఆ కుర్చీ పట్టుకువచ్చి, అక్కడ పెట్టి, కాళ్లు కుర్చీమీద పెట్టడానికి కొంచెం పైకెత్తాడు. జెరాసిమ్ అలాగ కాళ్లు పైకెత్తుతున్నప్పుడు ఇలియిచ్‌కది ఎంతో సుఖంగా ఉన్నట్లనిపించింది. "కాళ్లు పైకెత్తు తూంటే ప్రాణానికి హాయిగాఉంది. కాస్త ఒక

తలగడా తెచ్చి కాళ్లకింద పెట్టు" అన్నాడు. జెరాసిమ్ ఆపని చేశాడు.

తలగడామీద పెట్టడానికి కాళ్లెత్తినప్పుడు ఇలియిచ్‌కి మళ్ళీ అది సుఖంగా ఉన్నట్టు కనబడింది. తలగడామీద కాళ్ళు ఉంచిన తరవాత ఆ సుఖం కనబడలేదు. పైగా బాధ ఎక్కువయింది. ఇలియిచ్ "జెరాసిమ్! నువ్విప్పుడేదైనా పనిచేస్తున్నావా?" అన్నాడు. జెరాసిమ్ బస్తీకి వచ్చిన తరవాత ఇక్కడి పెద్దమనుషులతో మాట్లాడేతీరు నేర్చుకున్నాడు. అందుచేత "అబ్బే! ఏమీపనిలేదు బాబూ!" అని అతి మర్యాదగా జవాబుచెప్పాడు.

"ఇంకా ఏదైనా పనిచెయ్యాలా?"

"అన్నీ చేసేశాను బాబూ! ఇంక రేపటికి కర్రలు కొట్టాలి అంతే."

"కొంచెం కాళ్ళు పైకెత్తి పట్టుకుంటావా?"

"అల్లాగే పట్టుకుంటాను బాబూ!"

జెరాసిమ్ అతని కాళ్లు బాగా పైకెత్తి పట్టుకున్నాడు. ఇలియిచ్‌కి అప్పుడు ఏమీ బాధలేదనిపించింది.

"అయితే కర్రల మాటేమిటి?"

"పరవాలేదు బాబూ! ఇంకా చానా పొద్దుంది."

ఇలియిచ్ కాళ్లు పైకెత్తి పట్టుకోమని చెప్పి, జెరాసిమ్‌తో కబుర్లు మొదలుపెట్టాడు. జెరాసిమ్ అలాగ కాళ్ళెత్తిపట్టుకున్నంతసేపు ఇలియిచ్‌కి నెప్పి బాగా తగ్గిపోయినట్టనిపించింది.

ఆతరవాత ఇలియిచ్ జెరాసిమ్‌ను అప్పుడప్పుడు పిలిచి, అతనిన్ని కాళ్ళు పైకెత్తిపట్టుకోమని చెప్పి, ఏవేవో మాట్లాడుతూండేవాడు. అలాగ కబుర్లు చెబుతూంటే అతనికి బాగా సుఖంగా ఉండేది. జెరాసిమ్ ఇలియిచ్ చెప్పినవన్నీ ఎంతో అప్యాయంగా చేసిపారేస్తూండేవాడు. అతని అమాయికత, మంచితనము చూస్తూంటే ఇలియిచ్‌కి కళ్ళు చెమ్మగిల్లేవి. ఎవరైనా మంచి ఆరోగ్యంగా ఉంటే ఇలియిచ్‌కింతకు పూర్వం కన్నెఱ్ఱగా ఉండేది. కాని జెరాసిమ్ ఆరోగ్యము, ఉత్సాహము చూస్తే ఇలియిచ్‌కి ప్రాణాలకు హాయిగా ఉండేది.

ఆ యింట్లో జనాభా అంతా ఇలియిచ్‌కి ఏదో కొంచెం జబ్బు చేసిందనీ, అది అంత ప్రాణాపాయకరమైనది కాదనీ, కళ్ళు మూసుకుని నాలుగురోజులపాటు మందు పుచ్చుకుంటే ఆ జబ్బు నిమ్మళించిపోతుందనీ అంటూండడం ఒక పరిపాటిగా తయారయింది.

ఇదంతా కట్టినటన అని వారందరికీ తెలుసును. అయినా అందరు ఈవిధంగా అంటూండడం చూస్తే ఇలియిచ్‌కి ఒళ్లు మండిపోయేది. వాళ్ళేమి చేసినా ఇక జబ్బు ముదరటం కల్లో వాస్తవనీ, అలాగలాగ యమయాతనపడుతూ ఎప్పుడో ఒకప్పుడు ప్రాణాలు విడవడం తప్ప గత్యంతరం లేదనీ అతనికి తెలిపోయింది. ఇలాగ తెలిసినా ఇంటిలోవాళ్ళందరు ఇలియిచ్‌కి ఆ విషయమే తెలియలేదన్నట్లు మాట్లాడేవారు. పరిస్థితి ప్రమాదకరంగా ఉన్నా అబ్బే ఏమీ లేదని ధరవసా ఇచ్చి, అతనిని నమ్మించడానికి ప్రయత్నించేవారు. ఇలియిచ్ ఇదంతా చూసి లోలోపల కుమిలిపోయేవాడు. అతడు ఈక్షణంలోనో మరుక్షణంలోనో చావడానికి సిద్ధంగా ఉన్నాడు. వారంతా ఈ సంఘటన ఏదో నిత్యకృత్యం క్రింద జమకట్టి వేస్తున్నట్లు కనబడింది. పైగా ఆ నటనకు అంతుదరి ఉన్నట్టు కనబడలేదు. దానితో అతను ఒక్కసారిగా వారిమీద విరుచుకుపడి "చాలెండి ఈ దొంగనటన! నేను చచ్చిపోతున్నానని మీకూ నాకూ కూడా తెలుసును! అందుచేత ఆనవుపక్షం ఈ దొంగనాటకమైనా కట్టిపెట్టండి!" అని గట్టిగా దులిపివెయ్యాలని అనుకున్నాడు. కాని చివరికా మాటలు నోటిచివరదాకా వచ్చి ఆగిపోయాయి. మృతి అంటే అత్యంత భయంకరమైన విషయం! కాని ఆ యింట్లో ఉన్నవాళ్ళది అమర్యాదకరంగా పరిణమించిన ఒక చిన్న ఇబ్బందికింద జమ జట్టేశారు. తన విషయంలో ఎవరు బాధపడడం లేదన్న విషయం ఇలియిచ్‌కిప్పుడు స్పష్టపడిపోయింది. అసలా ఇంట్లోవాళ్ళకతని విషయం తెలుసుకోవాలన్న ఘోషే లేదు. ఒక్క జెరాసిమ్ మాత్రం అతనిపరిస్థితి గ్రహించుకుని జాలిపడేవాడు. ఒక్కొక్కప్పుడు రాత్రి తెల్లవార్లు అల్లాగే కూర్చుని అతని కాళ్లు ఎత్తి పట్టుకునేవాడు. వెళ్లి పడుకోమని చెబితే "నాకేమీ ఇబ్బంది లేదు బాబూ! ఇప్పుడు కాకపోతే ఇంకా

స్నేహపూర్వకంగా నిద్రపోతాను." అనేవాడు. తరవాత మరింత ఆప్యాయంగా "మీకు ఒంట్లో బాగోనప్పుడు మాత్రం చెయ్యకపోతే ఎలాగ బాబూ!" అనేవాడు. ఆ యింట్లో నటించనివాడు జిరాసిమ్ ఒక్కడే. అతని ధోరణినిబట్టి చూస్తే అతనొక్కడే ఆ పరిస్థితులన్నీ పూర్తిగా గ్రహించినట్టు, ఇక దాచడం లాభం లేదనుకున్నట్టు తెలిపోతున్నది. జిరాసిమ్ అంతమాత్రంతో ఊరుకోక బాగా బక్కచిక్కిన యజమానిమీద జాలిపడి అన్నివిధాలా ఆసరాగా ఉండేవాడు. ఒకసారి ఇలియిచ్ అతన్ని వెళ్లిపడుకోమని బలవంతపెట్టాడు. జిరాసిమ్ ఇంక ఉండబట్టలేక "ఈయాలో రేపో అంతా ఎల్లిపోవాలిగందా! బాబూ! ఈమాత్రం కష్టమేనా ఓర్చుకోకపోతే ఎలాగ బాబూ!" అని సమాధానం చెప్పాడు. అతని కా పని ఏమాత్రము భారమనిపించలేదు; తానీవేళ ఆపత్తులో ఉన్న ఒక మనిషికి సాయపడుతున్నాననీ, ఇల్లాంటి పరిస్థితుల్లో రేపెవరైనా తనకు సాయపడగలరనీ అనుకున్నాడు.

ఈ నటన మాట ఇలాగ వదిలివేసినా, ఇంకొక విషయం ఇలియిచ్‌ని బాగా బాధపెట్టింది. అల్లాంటి పరిస్థితుల్లో కుటుంబంలోవారంతా తన్నెంతో ఆప్యాయంగా చూస్తారని అనుకున్నాడు గాని, అది జరగలేదు. చాలాకాలం ఆ జబ్బుతో తీసుకున్నాక అతనికి అందరు తన్నొక జబ్బుపడిన పిల్లవాడిని చూసిన ట్లాప్యాయంగా చూడాలని అనిపించింది. ఆ అభిప్రాయం పైకి చెప్పడానికి సంకోచిస్తే సంకోచించి ఉండవచ్చును గాని, తన్నందరు పసిపిల్లవాడిని బుజ్జగించినట్లు బుజ్జగించాలని కోరుకునేవాడు. తానొక పెద్దఉద్యోగంలో ఉన్నాననీ, తనకప్పుడే గడ్డాలు మీసాలు నెరుస్తున్నాయనీ, తనది చాలా అసందర్భమైన కోరికనీ అతనికి తెలుసును. అయినా ఆ విధమైన ఆప్యాయతకోసం తహతహలాడిపోయేవాడు. అయితే జిరాసిమ్ అతనికి అంతటి ఆప్యాయతతోను పరిచర్య చేస్తూ ఆదరంగా చూస్తూండడంవల్ల ఇప్పుడు కొంచెం సుఖంగా ఉంది. ఇవాన్ ఇలియిచ్‌కి ఒక్కసారిగా బావురుమని గొంతెత్తి ఏడవాలనీ, తన్నందరు బుజ్జగించాలనీ ఉండేది. కాని అంతలోనే షెబెక్ అక్కడికి వచ్చేవాడు. అతన్ని చూడగానే ఇలియిచ్ ఒక్కసారిగా మారిపోయి, ముక్కు బిగించుకుని కూర్చుని, ఒక గొప్ప వ్యక్తిలాగ మాట్లాడడం మొదలుపెట్టేవాడు. ఆపైన అలవాటునుబట్టి ఆనాటి కోర్టుకేసులలో ఇచ్చిన తీర్పు తప్పని వాదించేవాడు. దానిమీద షెబెక్ ఏమైనా అంటే తను పట్టినకుందేటికి మూడే కాళ్ళంటూ కూర్చునేవాడు. ఈవిధమైన అసత్యపరిసరాల ప్రభావంవల్ల అతని కా చివరిరోజులన్నీ —అతి దుర్భరంగా గడిచిపోయాయి.

[ఇంకా ఉంది]



# కృష్ణదేవరాయలు

## కళింగ జైత్రయాత్ర ౪*







శ్రీ నేలటూరు వెంకటరమణయ్య

ఇంతవఱకు కృష్ణరాయల కళింగ జైత్రయాత్ర యేకధాటి కాదనియు నందాఱుఘట్టములు గలవనియు నిశ్చయించితిని. ఇక నాయాఱుఘట్టము లందును నడచినయుద్ధవిశేషములను వివరింపవలసి యున్నది. ఉదయగిరి ముట్టడితో గళింగదండయాత్ర ప్రారంభమైనది. శకాబ్దము 1434 ప్రజోత్పత్తి పుష్య మాసమున రాయలు సైన్యముతో వచ్చి యుదయగిరికి ముట్టడివేసెను.[1] రాయవాచకమునందు కృష్ణరాయలు ఉదయగిరి దుర్గమునకువచ్చిన 'హుటాహుటిన దుర్గములపై లగ్గయెక్కగా దుర్గములోనివారు తమ చేతనైనట్లు సమరంచేసి పుండ్లుపుండ్లు శిలనై నిర్వహించలేక కొలిచినారు' అని యున్నది. ఇది వాస్తవమును గప్పిపుచ్చెడి యతిశయోక్తి. ఈ ముట్టడి సుదీర్ఘకాలము నడచినది. ఉదయగిరి తీరాంధ్రదేశ దుర్గములందు బలవత్తమమైనది,—దానిని సాధించుట సులభసాధ్యమైన కార్యముగాదు. దాని పరిసరములు పర్వతమయములగుటచేత దుర్గమమై శత్రుజన దుర్భేద్యముగ నుండెను. దానిని చొచ్చుట కొక్కటి దప్ప మార్గాంతరము లేదాయె. అదియు మిక్కిలి యిఱుకైనది. మనుష్యులు సైతము ఒకరివెనుక నింకొకఱుగనె నడచి పోవలసియుండెను. ప్రకృతిచే నింత బలిష్ఠమైనందువలన దానిని సంరక్షించుట కల్పసంఖ్యాకులు చాలియుండిరి. కొద్దిజనులు కొండలసందునను బండలు వెనుకను దాగి యెంతటి ప్రబల శత్రువునైనను ధిక్కరించుటకు జక్కనియవకాశముండెను. వీరి నాకటిచే మాడ్చినతప్ప కోటను వశపఱచుకొను నుపాయమన్య మెద్దియు లేదు.[2]

కృష్ణరాయ లసామాన్య ప్రజ్ఞాశాలియైన దళనాయకుడు. దళములను కూర్చుటయందు విప్పుట యందును యుద్ధరంగమున శత్రులపై బురికొల్పుట యందుమాత్రమే కాదు అతని ప్రజ్ఞ వికసించినది. అసాధ్యమనుమాటను అతడెఱుగడు. ఎట్టి యాటంకమైననుసరే—మానుషము గాని యమానుషము గాని—అతనిమార్గమునుండి తొలగిపోవలసినదే. కావున దుర్గమమైనకోటను సుగమము సేయుటెట్లు? అని యతడు చింతించి చింతించి దాని పరిసరములనుండెడి బండలను కొండలను పిండిగొట్టుటయొక్కటియే దుర్గమును జయించుటకు సరియైన యుపాయమని నిశ్చయించెను. కాని యది సులువైన కార్యముగాదు; రాయలా పనినెట్లు నిర్వహించెనో తెలుపు సాధనములు లేవు. కాని దాని నెగవేర్చుటకు వలసిన మనుష్యబలగము కొంచెనంచెమని యెంచుటకు వీలులేదు ధనవ్యయమును తక్కువయైయుండదు. జనస్తోమమును ధనసంపత్తిగలిగియుండినను దానిని కొనసాగించుటకు రాయలకు పదునెనిమిది మాసములు పట్టినవి. ఈకాలమంతయు కృష్ణరాయ లుదయగిరియందు స్థిరముగ నుండలేదు. రాజధానికి పోవుచువచ్చుచునుండెను. పుణ్యక్షేత్రములకు యాత్రపోవు నెపమున రాజ్యమున జాలభాగములను ద్రొక్కిచూచుచుండెను. తుదకు ఉదయగిరి దుర్గమును సుగమము సేయు మార్గనిర్మా

(* వికృతి జ్యేష్ఠ భారతి పుటలు ౬౧౮-౨౨ తరువాయి)

1. శకాబ్దము 1436 మీద చెల్లు భావసంవత్సర జ్యేష్ఠ బ 2 నాడు ఉదయగిరి కృష్ణరాయలకు వైవసమాయెనని యతడచట నెలకొల్పిన జయశాసనములవల్ల దెలియుచున్నది. (*N D I. III. U. 40*) ఉదయగిరి ముట్టడి యొకటిన్నరసంవత్సరము పర్యంతము సాగెనని న్యూనిజు చెప్పుచున్నాడు. (*Forgotten Empire, p. 316*) కావున పైజెప్పినట్లు శ. 1434 ప్రజోత్పత్తి పుష్యమందు ప్రారంభమాయెనని తెల్లముగుచున్నది.

2. *Forgotten Empire, p. 316.*

ణము ముగిసెను. తనభటులు కోటబురుజుల సమీపించుటకొఱకు నచటిగండ శిలల ననేకములను జిగుగ గొట్టి వాని మీదుగ పెక్కుమార్గముల నేర్పఱచెను ఒకరి వెనుక నొక్కరుగ నడచిపోవలసియుండిన ఇఱుకుదారిని విశాలముజేసి వెడల్పైన బాటగ మార్చెను. ఇట్టివానినిసే మఱికొన్నింటిని గూడ నిర్మాణము గావించి కోటక్రిందికి బోవుటకు వసతి చేసికొనెను. ఇంతశ్రమపడినను కోటస్వాధీనమున నట్లగపడలేదు. దుర్గాధిపతియు ప్రతాపరుద్ర గజపతి పినతండ్రియునగు తిరుమల కాంతరాయడు కోటను గడు జాగ్రత్తతో కాపాడుచుండెను[3].

కృష్ణదేవరాయ లిట్లుదయగిరి దుర్గమును జయించుటకు భగీరథ ప్రయత్నము సేయుచుండ దాని జూచుచు ప్రతాపరుద్ర గజపతి మిన్నకుండలేదు; అత డొక గొప్పసైన్యమును వెంటబెట్టుకొని రాయల నోడించి ముట్టడిని లేవదోలుట కొఱకు తరలివచ్చెను. కాని రాయ లాతని నిజసైన్యముతో నెదుర్కొని పరాభూతుని గావించెను. కృష్ణరాయవిజయ మీయంశము ప్రస్తావించలేదు; కాని యుదయగిరి తిరుమల శాసనములందు 'ప్రతాపరుద్ర గజపతిని కొండవీడుపర్యంతం విరుగ దోలిచి' యని సంగ్రహముగ సూచింపబడియున్నది. ఇందువల్ల కృష్ణదేవరాయ లుదయగిరివద్ద ప్రతాపరుద్ర గజపతిని పరాజితుని సేయుటయే కాక కొండవీడు పర్యంతమును నతని వెన్నంటి తఱుముకొని పోయెనని విదితమగుచున్నది.

గజపతి ప్రతాపరుద్రుని నిట్లోడించి తఱుమ గొట్టి కృష్ణదేవరాయలు ననుదిరిగివచ్చి ఉదయగిరిని జేరి దుర్గము నెట్లైన స్వాధీనపఱచుకొనవలయునని పట్టుపట్టెను. మొట్టమొదట దుర్గమునకు వేణతె (మేనత) వేయించెను[4]. వేణతె యనగా కోటకు రాకపోకలను సంపూర్ణముగ నాపివేయుటకు చుట్టును పెట్టిన గోడ. వేణతె వేయించిన పిమ్మట బయటినుంచి కోటలోనికి పదార్థము లెవ్వియుబోక నిలిచిపోయినవి; కాని కోటకావలిదండు ధైర్యసాహసములను జూపి మెండుగ పెక్కుదినముల పర్యంతము బోరాడెను. ఈ యుద్ధము కృష్ణరాయ విజయమునందు వర్ణింపబడియున్నది.

"కోటలు దుర్గముల్ గొనుచు దోఃపటుబల
ధాటిచే మించు నార్వీటవారు
కంట కాహిత కంఠలుంఠనోద్ధతి లీల
దంటలైతగు తొంగంటివారు
నిబ్బరంబుగ శత్రునికరంబు నణగించి
ధీరులై మించు గొబ్బూరివారు
చాల దోర్బలలీల సమదారిసంఘంబు
దూలించి వెలయు నందెలవార

3. ప్రతాపరుద్రగజపతి పినతండ్రి పేరు వాస్తవముగ తిరుమలకాంతరాయలని దృఢముగ జెప్పుటకు వీలులేదు. దీని విషయమైన సాక్ష్యము ఒక్కరీతిగ నుండలేదు. కొన్ని శాసనము లితని తిరుమలకాంతరాయలని పేర్కొనుచున్నవి (*NDI. III. U.* 38 40, *TTDI. III.* 77) మఱికొన్నిటియందు తిరుమలరాహుత్త లేక రౌతరాయలని యున్నది (*TTDI III.* 76, 80, 81); ఒకానొక శాసనము నితని నామధేయము (*U.* 37) తిరుమలరాఘవరాయ యని యున్నది. ఇట్లు శాసనసాక్ష్యమే భిన్నమైయుండ వాఙ్మయము దీనికి విరుద్ధముగ నతని మఱియొకవిధముగ బేర్కొనుచున్నది. ఆముక్తమాల్యద ప్రథమాశ్వాసాంత పద్యమునందు 'ఇభరాడుదయోర్వీధర తత్పితృవ్యకృత' అను వాక్యమునకు వ్యాఖ్యాతలు పరంపరగ 'ఇభరాట్=గజపతియైన ప్రతాపరుద్రునియొక్క, ఉదయ ఉర్వీధర=ఉదయగిరి దుర్గమందు, తత్=ఆ గజపతికి, పితృవ్య=పినతండ్రియైన ప్రహరేశ్వర పాత్రునిచేత' అని యర్థవివరణము వ్రాసియున్నారు. కాని ఇది తప్పు. ప్రహరేశ్వరపాత్రునికి ఉదయగిరితో నెట్టి సంబంధ ముండినట్లును అగపడదు. ఇతడు కొండపల్లి దుర్గాధ్యక్షుడనియు నచట రాయల కతడు పట్టువడెనని యు నాముక్తమాల్యద తృతీయాశ్వాసాంత మందలి 'ఇది పాత్రప్రహరేశ్వర' అను పద్యమువలన విదితమగుచున్నది. ఇతని సంపూర్ణ నామధేయము ప్రహరరాజు శిరశ్చంద్రపాత్రుడు. ఇతని బోడజన మహాపాత్రి బిజిలీఖానులతో గూడ రాయలు జీవగ్రాహముగ కొండపల్లియందు పట్టుకొనినట్లు శాసనములు జెప్పుచున్నవి. (*TTDI. III.* 80) కావున లభ్యమైన సాక్ష్యము నాధారపఱచుకొని యుదయగిరియందు కృష్ణరాయల చేజిక్కిన ప్రతాపరుద్ర గజపతి పినతండ్రియొక్క వాస్తవ నామధేయ మిది యని నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు.

4. *NDI. III U* 38, 40.

లాదిగా గల్గు రాజులు మేదురగతి
తుళువవీరులును బోయలు గుఱుసుగాఁగ
ప్రతిదినంబును ఘోరమౌ రణమొనర్ప
నిలిచిపోరాడె గజపతి బలములపుడు."

"శివిగ నొకవాఁడను కడిందిరహిన్
వెలుఁగోటివారలా
రావెలవారు గూడుకొని రాత్రిబగల్
చతురంగసేనతో
సేవగఁ జూచినన్ వెలియ నెంతయు
శక్యముగాని దుర్గమున్
భూవరమౌళి గాంచి యొకపూటనె
దీసెద నంచు దుగ్రుఁడై.

దిగ్గున లేచి సాహసము తేటపడన్
మును మున్నుగాఁగదా
నగ్గలికన్ జెలంగు విభమంతయు
గన్గొని రోషచిత్తుఁడై
లగ్గలకెక్కి రంపెలు బలంబు చలం
బలరన్ రవంబులన్
దిగ్గజముల్ వడంక బలు తెంపున
గుంపులు గూడియుద్ధతిన్ 5."

ఈ విషయమునె తెల్పు ప్రాచీనగాథ యొకటి యాముక్తమాల్యద వ్యాఖ్యాలం దుదాహరింపబడియున్నది. 'కృష్ణదేవరాయల దిగ్విజయములలో ఉదయగిరి దుర్గమును ముట్టడించినప్పుడు అందు ప్రహరేశ్వర పాత్రుడనువాఁడు గజపతికి పినతండ్రి కాపుండి కడు సమర్థుఁడై ఎన్నాళ్ళకును దుర్గమును లో బడనీయక పోరాడుచుండెను. అంత నొక నాఁడు కృష్ణరాయఁడు 'ఈ దినము ప్రహరేశ్వరుని తల ద్రొక్కనిది స్నానము చేయనని ప్రతిజ్ఞ చేసి స్వయముగా ముట్టడి నడపగా ప్రహరేశ్వరుఁడు భయపడి లోబడెనట. ఈ యైతిహ్యమున ప్రహరేశ్వరుఁడనుట తప్పైనను తక్కిన విషయము సత్యదూరము గాదు. కృష్ణరాయల కంటిక్రింద పోరాడ దొడఁగిన రాయరాణువ యసాధారణ పరాక్రమముఁజూపి నలు ప్రక్కలను లగ్గలకెక్కెను. ఎంత సామర్థ్యము గలవాఁడైనను తిరుమలకాంతరాయఁడు ప్రబల శత్రుదళమును మార్కొనజాలక రాయలతో సంధిఁ గోరెను; అతఁడు కోరిన మేరకు సమాధానమున కొడంబడుటకు రాయలు సంకోచించెను. ఏలన యొక ధర్మసందేహ మాతని చిత్తమును కలఁతపెట్టినది. తిరుమలకాంతరాయని శిరము ద్రొక్కనిది ఆ దినము మజ్జనము సేయనని ప్రతినవట్టెఁగదా; మఱి యతఁడు కోరినట్లు సంధి ననుగ్రహించిన ప్రతిజ్ఞాభంగమగును. శరణార్థియగు శత్రుని రక్షింపక నిరాకరించుట రాజధర్మము గాదు. ఏమిసేయుటకును తోఁచక సంకటపడుచుండ రాయలకు సర్వశిరః ప్రధాని యప్పాజి యొక యుపాయమును జెప్పి మనశ్శాంతిని గలిగించెను. తలపాగ ద్రొక్కిన తల ద్రొక్కినట్లే యగును; తిరుమలకాంతరాయఁడు తన యుష్ణీషమును రాయల పాదములకడ నుంచుట కంగీకరించిన ప్రతిజ్ఞయు భంగముగాదు; శరణార్థులను సంరక్షించుటకును వలనుపడును. తిరుమలకాంతరాయలు రాయలు కోరినట్లు పాగ నతని పాదముల క్రింద నైచెను; రాయ లందులకు సంతసించి యతనిని చంపక విడిచిపెట్టెను. ఈ సంధివృత్తాంతము జాలవఱకు పరంపరగ వచ్చు నైతిహ్యములనుండి సంగ్రహించినది. ఇది సత్యమని ఆముక్త ప్రథమాశ్వాసాంతపద్యము రుజువుసేయుచున్నది.

'ఇది కర్ణాట ధరాధృతిస్థిరభుజాహేవాక లబ్ధోద్ధరా
ఢుదయోర్వీధర తత్పితృవ్యకృత సవ్యోపాయ
నోష్ణీషర
త్నదృగంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోదితా
ముక్తమా
ల్యదనాశ్వాసము హృద్య పద్యముల నాద్యం
మహింబొల్పుగన్.'

ఇట్లుష్ణీషము నుపాయన మొసగిన తిరుమలకాంతరాయనికి కృష్ణరాయలు ప్రాణదానము జేసెనే గాని విడిచిపెట్టలేదు; బందీకృతుని గావించెనని పోర్చుగీసు రచనలును, సమకాలిక వాఙ్మయమును, రాయల శాసనములును సాక్ష్యము బల్కుచున్నవి.6 కోటను స్వాధీనపఱచుకొని దుర్గసంరక్షణకు సాళువ

5. కృష్ణరాయ విజయము 3 : 58–60.

6. '...and in it he captured an aunt (some say an uncle) of the king of Oriya who was taken captive and carried off—with all courtesy that he could show her (him), having her (his) liberty; and he took her (him) along with himself.'—

—*Nuniz, Forgetten Empire, p. 317.*

'దుర్గం జిత్వాఽథ సోఽసావుదయగిరివరం తత్ర
రాహుత్తరాజం

కంపరాజును నియమించెను.7 తరువాత సాళువ తిమ్మరుసయ్యను పిలువనంపి సాళువ నరసింగ రాయల యాదేశమును దానెంతో చక్కగ నిర్వహించి నదియు వివరించి తనకంతటితో దృష్టికలుగ లేదనియు, సరియా రాజ్యములోనికి నూఱుయోజనముల పర్యంతము గూచిచేసి పోవలెయునినియు, నందుకు వలసిన వస్తుసామగ్రిని తయారుచేసి సైనికులకెల్ల జీతమును సంపూర్ణముగ నిచ్చివేయవలసినదనియు నాజ్ఞాపించెను. 8 తిమ్మరుసయ్య రాయల యాజ్ఞానుసారము సేనలను ప్రయాణమునకు సంసిద్ధము సేయగడంగెను. కృష్ణదేవరాయలంతట సైన్యముతో గదలిపోయి కొండవీటిని సాధింపుమని తిమ్మరుసున కాజ్ఞచేసి దేవేరులతోగూడ 'తిరిగి విజయనగరం రాజధానికి విచ్చేస్తున్నా తిరుమలమీందికి విచ్చేసి తిరువెంగళనాథుని దర్శించి తిరువెంగళనాథ దేవునికి కనకాభిషేకం చేసిరి. మఱియు, 'తధాతిథి (శకవర్షంబులు 1436 మీదనడచే భావసంవత్సర ఆషాఢ శు. 15. గు) మన్వాది పుణ్యకాలమందు ధారాపూర్వకంగాను' 'పాత్రపినాంటి సీమలోని తాళ్ళపాక గ్రామం 1' 'సమర్పించిరి. 'కృష్ణరాయలదేవులు చిన్నాదేవమ్మంగారు'ను, 'తిరుమలదేవమ్మంగారు'ను తిరువేంగళనాథదేవునికి కంఠమాలయు పదకమును సమర్పించిరి.9 విజయము ప్రసాదించినందులకు ఇష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరస్వామికి కృతజ్ఞతాపూర్వకముగ సమర్పణచేసిన కానుకలు గాబోలును. ఇట్లు భగవత్కైంకర్యమును ముగించుకొని రాయలు రాణివాసముతో గూడ విజయనగరమునకు దరలెను.

కొండవీడు:— రాయలయాజ్ఞ చొప్పున సాళువ తిమ్మరుసదండనాథుని యాధిపత్యముక్రింద రాయ సేనలు కొండవీడు దుర్గముపై కూచిచేసెను. ఆంధ్రదేశమునందు గజపతి సామ్రాజ్యములోని ముఖ్య ఆయపట్టు స్థానములలో నది యుదయగిరికి తుల్యమైనది. కొండవీటి దండపాటకు రాజధాని. చుట్టుపట్టులనుండు అద్దంకి యమ్మనబ్రోలు మొదలగు దండపాటల నేలు సర్దారులు కొండవీడు దుర్గాధ్యక్షునికి లోబడియుండిరి. ఈ దండపాటలలో దుర్గము లనేకములుండినవి. దక్షిణదిశనుండి గజపతి సామ్రాజ్యముపై నెత్తివచ్చు శత్రువీదుర్గముల నన్నిటిని మొట్టమొదట సాధించుట యత్యంతావశ్యకము. వానిని విడిచిపెట్టి కొండవీటి నొకవేళ జయింపగల్గినను అచ్చట నతనికి స్థిరముగ నన యధికారమును నెలకొల్పుటకు వీలుగాదు. ఈ మర్మమును జక్కగ గుర్తించినవాడగుటవలన తిమ్మరసయ్య వీని నన్నిటిని జయించి స్వాధీనపఱచుకొనిన పిదపగాని కొండవీటిజోలి యెత్తుకొనలేదు. ఇవి వరుసగ 'అద్దంకి, వినికొండ, బెల్లంకొండ, నాగార్జునికొండ, తంగెడు, కేతవరం మొదలయిన గిరిదుర్గ స్థలదుర్గములు10.' ఇవిగాక రాయవాచకమును కృష్ణరాయవిజయమును కందుకూరును గూడ జయించినట్లు తెల్పుచున్నవి11. ఇది సుసంగతమే. గజపతి సామ్రాజ్యమప్పుడు నెల్లూరుమండలములో ఆత్మకూరు పర్యంతము వ్యాపించియుండినది11a; కావున కందుకూరు గజపతి సామ్రాజ్యాంతర్గతమై యుండెననుటకు సంశయములేదు అది క్రీ. శ. 1422 వఱకును రెడ్డిరాజ కుటుంబమునం దొక శాఖకు ముఖ్యస్థానమై యుండెను.

---

బన్నికృత్వా...' — సంగీతసూర్యోదయము.
*Further Sources of Vijayanagara History. I. No 16. (a).*
'ఉదయగిరి దుర్గమును పుచ్చుకొని ప్రతాపరుద్ర గజపతివారి పిన్నతండ్రి తిరుమలకాంతరాయనిని పట్టుకొని...' *NDI. III. N. 40.*

7. రాయవాచకమున 'కంపన్నను దుర్గమందు తాణ్యం వుంచ్చి' అని యున్నది. మనుమంచి భట్ట కృత అశ్వలక్షణసార మను గ్రంథము సాళువయక్కా భళరాజ ధమాంబికా పుత్రుడగు కంపరాజున కంకిత మీయబడినది. ఈతడు కృష్ణరాయల సిద్ధకృపాణుడట (3 : 1). ఇతడే రాయవాచకము పేర్కొను కంపన్న కావచ్చును.

8. *Nuniz Forgotten Empire, p. 317.*

9. *TTDI. III* 66, 67, 68. 70, 71, 72, 73, 74, 75.

10. *TTDI. III.* 76.

11. రాయవాచకము, పుట. 91. 'కందూర్కి పోగా' 'కంమూర'ను నది పొరబాటు. 'కందుకూర్కి' అని యుండవలయును. చూ. కృష్ణరాయవిజయము 3 : 63 'అట కందుకూరు బిట్ట దిరెకాహాళ శంఖ భేరీవిరావముల్ భోరుకలగ' అని.

11a. కాళహస్తి మొదలు జగన్నాథం పర్యంతం గజపతిసీమ. రాయ. పుట 97.

అప్పుడది యెట్టి స్థితియందున్నను క్రీ. శ. 16 వ శతాబ్ద పూర్వార్థమున దాని ప్రాముఖ్యత నింకను గోల్పోలేదు; కావున రాయరాణువ ఉదయగిరి నుండి బయలువెడలిన పిమ్మట కందుకూరిని వశపఱచుకొనిరనుట విశ్వసింపదగిన విషయమే. పై జేర్కొనిన దుర్గములలో గజపతివారి పక్షమున నెవ్వ రెచట కాపుండిరో వా రెట్లు పోరాడిరో తెలియదు. కాని కృష్ణరాయలచే గొండవీడునందు వీరభద్రగజపతితో గూడ పట్టువడిన పాత్రసామంతులై యుండురనుటకు గొంత యవకాశము గలదు. పట్టుపడిన పాత్ర సామంతుల సంఖ్యయేడు, కందుకూరితో గూడ రాయరాణువ జయించిన దుర్గముల సంఖ్యయు నేడే. మఱియు ఆముక్తపీఠికయందు ఉత్కలక్షత్రియ పాత్రులెల్లను కొండవీటియందుండినట్లు కృష్ణరాయలు వ్రాసియున్నాడు. నూనిజుకూడ గజపతి రాజ్యమందలి దొరలెల్ల నందుకూడి యుండిరని చెప్పియున్నాడు. మఱియు రాయవాచకమున పైజేర్కొనిన దుర్గములందలి ప్రజలు తమ తమ దొరలున్న తావుకు అనగా కొండవీడునకు పోయినట్లు చెప్పియున్నది11b. కావున రాయలకు గొండవీటియందు పట్టువడిన ఏడుగురు పాత్రసామంతులును పైజెప్పిన దుర్గముల కధిపతులై యుండురని ఊహించెడను గల్గుచున్నది. ఈ యూహ సరియైనదేని, రాయశాసనాదులందు పేర్కొనబడిన దుర్గములయొక్కయు పాత్ర సామంతులయొక్క వరుసయు నొక్కటియె యగునేని కందుకూరికి కుమారహంవీరుని కొడుకు నరహరిదేవుడును, అద్దంకికి రామారి మల్లూఖానుడును, వినికొండకు ఉద్దండఖానుడును, బెల్లంకొండకు జన్యాలకసువాపాత్రుడును, నాగార్జుని కొండకు పూసపాటి రాచిరాజును, తంగేడుకు శ్రీనాథ రాజు లక్ష్మీపతిరాజును కేతవరమునకు పశ్చిమ బాలచంద్ర మహాపాత్రుడును దుర్గాధిపతులై యుందురు. రాయవాచకమున కొండవీటి దండయాత్ర కొంచెము విపులముగ వర్ణింపబడియున్నది. రాయసైన్యము 'కొండ్డె వీటకి కదలిపోగా దుర్గములలో నున్న వూడెములవారు సముద్రంపొంగి వచ్చేరీతిని సేనా సముద్రం కదలివచ్చేది కని కాలిఘూళిమిన్ను ముట్టి సూర్యరశ్మి గప్పినగని స్థలములు విడిచి పొయ్యేవా గున్ను కొహాళస్వనివిని పారే వారున్ను యీరీతున కొండవీడుసీమకోటలు దుర్గాలలోనున్న వారలు సరాళ భ్రష్టులై తమ తమ దొరలున్న తావుకు పోసాగిరి. బోయకొరలు పదునెనిమిది కప్ప కాల వారున్ను మూకులకులపాయ పెళ్ళమున్ను కొండవీడు కొండపల్లె, బెల్లంకొండ్డ, విని కొండ్డ, నాగార్జునం కొండ్డ మొదలయిన దుర్గాలకు దేలు బడయైన శీము లాద్యంత్రం నిపాలం చేస్తావున్నారు. గనక ఆయాశీమలలో గల ప్రజలందర్ను సకలమును కొల్లయిచ్చి మిక్కిలి అంద్దుపడి అయిన దుర్గాలు చేరినారు.'12

ఇందువల్ల కృష్ణరాయల కొండవీడు దండయాత్ర స్వభావము బక్కగ దెలియవచ్చుచున్నను యుద్ధాంశ మొక్కటియైనను విశదముగుటలేదు; కాని సర్వత్ర రాయలకు జయము చేకుఱెననియు, పైచెప్పిన దుర్గములందు రాయలు నిజదళములను కాపుంచి దుర్గ సంరక్షకులను నియమించెననియు నీ క్రిందివాక్యములు దెలుపుచున్నది.

'కందూర్కి పోగా డమామిస్వని విన్న క్షణాన్నె ఆ స్థలంవారు వళ్ళిపోయిరి. గనక ఆస్థలం తొక్కిచూచి అచ్చట ఠాణ్యాం వుంచి' 'యచటి నుండి వినికొండ్డకై నడవంగా వారు యీ వార్తలు విని స్థలం నిర్వహింప నేర మని యెంచి మునకలుగా వెళ్ళిపోయిరి. అక్కడ భాస్కరయ్యను వుంచ్చి బెల్లకొండ్డకై నడవగా వారు పిరంగ్గినాదం విని బెల్లంకొండ్డ వారు పారిపోయిరి. యిచ్చట వీరభద్రయ్యను ఠాణ్యాముంచ్చి నాగార్జునం కొండ్డకై నడవగా వారు నానా ప్రయత్నముల నాట మర్నాట పోరాడి చేతగాక తమనాటికి పోయిరి. గనక అయ్యలయ్యను వుంచి...'

ఇందు వివరింపబడిన యుద్ధసమాచారము కడు సంగ్రహము. మఱియు సంపూర్ణము గాదు. అద్దంకి తంగేడు కేతవరములమాట బొత్తిగ లేదు. కందుకూరు ఠాణ్యామున కధిపతి యెవ్వరో పేర్కొనలేదు. కొండవీటి దండయాత్రకు సంబంధింపని కొండపల్లి దుర్గవిషయమిందు ప్రస్తావింపబడినది. ఈ యుద్ధచరిత్రను పరామర్శించునపుడు రాయవాచకము కేవలము నిష్పక్షపాతముగ విరచితమైన చరిత్రగ్రంథము

---

11b. ఆముక్త 1 : 37, *cf*
*Nuniz*, *p.* 318.

12. రాయ. పుట 92.

గాదని స్మరణయందుంచుకొనవలసియున్నది. కృష్ణదేవరాయల యశస్సును ప్రకటించుటకై విరచింపబడినది; కాని న్యూనిజు మొదలగు విదేశచరిత్రకారులును, రాయలశాసనములును నతని యాస్థానమందలి కవులును విద్వాంసులును నేకకంఠముగా రాయల విజయముల నే వర్ణించియుండుటవల్లను, గజపతులపక్షమును వివరించు గ్రంథములుగాని శాసనములుగాని లేకపోవుటవల్లను, నీదండయాత్ర యనంతరము కృష్ణానదికి దక్షిణమున గజపతుల యధికారము నామరూపములలేక నశించిపోవుటవల్లను, వారిస్థానమున కృష్ణరాయల యధికారము చెల్లుచుండినందువల్లను, రాయవాచకమునందలి యుద్ధవృత్తాంతము సత్యమైనదని నమ్మవలసియున్నది.

కృష్ణానదికి దక్షిణమందుండిన గజపతుల దుర్గములను వానికి జెల్లుచుండిన రాష్ట్రములను జయించి స్వాధీనపఱచుకొని చిట్టచివర తిమ్మరసయ్య కొండవీడు దుర్గమునకు ముట్టడివేసెను. కొండవీడు బలిష్ఠమైన గిరిదుర్గము; సులభముగ సాధ్యమగునదికాదు. దాని ప్రాముఖ్యమును గుర్తించి ప్రతాపరుద్ర గజపతి దాని సంరక్షణను మఱి యెవ్వరికిని ఒప్పజెప్పక తన కుమారుడును రాజ్యమునకు వారసుదారుడునైన వీరభద్ర గజపతిని రాజప్రతినిధిగ నియమించి కొండవీడు దుర్గాధిపత్యము నొసగి యచటి కంపెను.[12a] అదిమొదలు వీరభద్రుడు శక్తిసామర్థ్యములను జూపి యచటి రాజకార్యములను నిర్వహించుచువచ్చెను. కృష్ణరాయలు కళింగ దిగ్విజయయాత్రను ప్రారంభింపగనె ప్రతాపరుద్ర గజపతి దన రాజ్యములోని దక్షిణ దుర్గములను బలపఱచెను.[13] ఉదయగిరికడ తన యోటమియు, శత్రువు వెన్నంటితఱుము కొండవీటి పర్యంతము దన పలాయనమును, ఉదయగిరి పతనమును తాను డీకొన్న శత్రువు సామాన్యుడుగాడని యతనికి దెల్లముచేసియుండెను; కావున నతడు కొండవీటిని సంరక్షించుటకు విశేష ప్రయత్నముల నొనర్చియుండెను; కృష్ణకు దక్షిణరాష్ట్రములను పాలించుచుండిన యుత్కలక్షత్రియ ప్రాభవమెల్లను కొండవీటియం దేకమైయుండిన దీ కార్యము కొఱకేమొ?[14]

కొండవీడు ముట్టడి రెండుమూడు నెలల పర్యంతము సాగినది. ముట్టడియందు నడచిన యుద్ధవివరము స్పష్టముగ దెలియవచ్చుటలేదు; కాని రెండుమూడంశములు మాత్రము శాసనములందును వాఙ్మయమునందును సూచింపబడియున్నవి.[15] ముట్టడి

12a. కొండవీటి ముట్టడి యప్పటికి వీరభద్రగజపతి కనీసము పదునెనిమిది యేండ్లు రాజ్యమొనరించియుండెను. ఇతడిచ్చిన భూదానమును దెల్పునది ఇతని 23వ అంకశ్రాహి కుంభ శుక్ల 15 గు నాడు వ్రాయించినది తామ్రశాసన మొకటి కలదు. (*NDI. I. cp. 21*) 23వ అంకము 18వ రాజ్యవర్షమునకు సరిపోవును. ఇది యతని కడపటి రాజ్యవర్షమని యెంచినచో, కృష్ణరాయలు కొండవీటిని జయించినది క్రీ. శ. 1514 సంవత్సరమునందగుటచే, నతని ప్రభుత్వము (1514—18=) 1496 సంవత్సరమున అనగా నతని తండ్రియగు ప్రతాపరుద్ర గజపతి రాజ్యాభిషిక్తుడైన సంవత్సరమున ప్రారంభమై యుండవలయును. మఱియు నితని బిరుదావళిని జూచ నితడు కేవలము రాజప్రతినిధి మాత్రుడాయను సంశయము కలుగుచున్నది. రాజ్యాధిపతియైన గజపతివలె నితడును పరమభట్టారక పరమవైష్ణవ పరమమాహేశ్వరుడే. 'నవకోటి కర్ణాట కలుబర్గేశ్వర మహారాయ' బిరుదము లితనికి గలవు. ఉపరి, 'ద్రావిడ మండలేశ్వరు'డనని చెప్పుకొని యున్నాడు—ఇందు 'పరమభట్టారక, నవకోటి కర్ణాట కలుబర్గేశ్వర' బిరుదులు ముఖ్యముగ గమనింపదగినవి—ఇవి కపిలేశ్వర, పురుషోత్తమ, ప్రతాపరుద్ర గజపతులకు మాత్రమే చెల్లుచుండెనని వారి శాసనములవల్ల దెలియుచున్నది. కపిలేశ్వరుని పక్షమున దక్షిణాంధ్రము నంతటిని పాలించుచుండిన అతని పుత్రుడగు హంబీరునికి సైతమీ బిరుదులు లేవు. మఱియు సామంతరాజులవలె గాక రాజ్యాభిషిక్తుడైన గజపతివలె 'నిజరాజ్యాంక శ్రాహి' ని శాసనమున నమూదు చేసియున్నాడు. మఱియు నితని దానశాసనమందలి సంకేత సంతకమునకును ప్రతాపరుద్ర గజపతి తామ్రశాసనములు కొన్నిటియందు గానవచ్చు సంతకమునకును నించుకయేనియు భేదము గానరాదు.

13. రాయ. పుటలు 73–74.

14. ఆముక్త. 1 : 37.

15. *Forgotten Empire*, pp 317–18. కృష్ణరాయలు కొండవీటి కోటను ముట్టడించియుండగా గజపతి సైన్యముతో గూడ నతని దిఱుసుటకు వచ్చెననియు నా విషయ మెఱుకపడినతోడనే [illegible]

కొంతకాలము నడిచినపిమ్మట కృష్ణరాయలు విజయనగరమునుండి మరల వచ్చి సైన్యమును గలసికొనెను. కోట దుర్భేద్యమై లొంగునట్లు కానరాలేదు; దాని పతనము వస్తుసామగ్రి యభావమగుటచేత తప్పనిసరియైనది. కోటలో సేకరింపబడియుండిన ఆహారపదార్థములు జనసమ్మర్ద మధికమగుటచేత సత్వరము ముగిసెను; అన్నకఱవు సంప్రాప్తమాయె. ఈయంశము శాసనములందును వాఙ్మయమందును సూచింపబడియున్నది 16 ఇట్లు క్షుత్పిపాసలకోర్వలేక కోటకాపరులు మృతినందుచుండినను, దుర్గములో బహుచిహ్నములు గానరాకపోగా కృష్ణరాయ లెట్లయినదాని శీఘ్రము సాధించుటకు నిశ్చయించి యున్నతమైన గోడల నెక్కి లోపల బ్రవేశించుటకొఱకు వాని చుట్టును నడచప్పరములను బెట్టించెను. తరువాత రాయదళములు లగ్గలు వట్టికోటను బ్రవేశించెను. దుర్గాధ్యక్షుడైన వీరభద్రగజపతియు, కుమారహంవీరుని పుత్రుడు నరహరిదేవుడు, రాచూరి మల్లాఖానుడు, ఉద్దండఖానుడు, జన్యాల కసనాపాత్రుడు, పూసపాటి రాచిరాజు, శ్రీనాథ రామరాజు లక్ష్మీపతిరాజు, పశ్చిమ బాలచంద్ర మహాపాత్రుడు మున్నగు నేగురు పాత్రసామంతులను మన్నెవారును పట్టుపడిరి. రాయలు వారికి అభయదానము జేసినను

---

సైన్యమును కోటముట్టడిని గావుంచి, తిక్కనదండుతో నాతని నెదుర్కొనుటకు నాలుగు 'లీగుల' దూరము బోయి యచట నొక పెద్ద యుప్పనీటినదిని దాటి యతని నోడించి తఱుమగొట్టెనని న్యూనిజు వ్రాసియున్నాడు. 'లీగ' యనగా '*varying measure of road-distance usually about three miles.*' అని ఆక్స్‌ఫర్డు డిక్షనరీ నిర్ణయము. నాలుగు లీగులనగా పండ్రెండుమైళ్ళ దూరమగుచున్నది. కాని సూయెల్ గారన్నట్లు 'కొండవీటికి పండ్రెండుమైళ్ళ దూరముననుగాని యాప్రాంతముననుగాని నట్టినది యొద్దియును లేదు' 'ఉప్పనీళ్ళను' మాటను ఉప్పచప్పలగు మధ్యస్థమైన (*brackish*) నీరని యర్థము చేసికొనవలయును. (*For. Em. p. 317. n. 4*). కొండపల్లె దుర్గవిజయమును వర్ణించుచు, నచట రాజ్యములోని సామంతులెల్ల గూడియుండిరనియు, కోట రాయలకు హస్తగతమైనపుడు గజపతి కుమారుడును రాజ్యములోని ముఖ్యదళనాయకు లేగురును రాయలచే బట్టువడిరనియు, వారి నందఱ నతడు విజయనగరమునకు (బందులజేసి) బంపెననియు న్యూనిజు వ్రాసియున్నాడు. (*For. Emp. pp 318-19*). ఉత్కలక్షత్రియ పాత్రులందఱును గూడియుండినది కొండవీటియందని ఆముక్తమాల్యదయందు (1: 37) చెప్పయున్నది. రాయలశాసనములలో నతనికి గజపతి పుత్రుడును మఱియేగురు సామంతపాత్రులును కొండవీటియందు పట్టువడిరని చెప్పియున్నది. మఱియు పైజెప్పినట్లు కొండవీటికి నాలుగు లీగులదూరమున నది యొద్దియును లేదుగాని కొండపల్లెకు దక్షిణమున పది పండ్రెండుమైళ్ళదూరమున కృష్ణానది ప్రవహించుచున్నది. ఈయంశములను జక్కగ విచారించి చూడగా న్యూనిజు చరిత్రయందు కొండవీడు కొండపల్లెల ముట్టడివృత్తాంతము తారుమారుగ వర్ణించినట్లు తోచగలదు. కొండవీటియుద్ధాంశములు కొండపల్లెకును కొండపల్లియందు నడచిన విశేషములను కొండపల్లెకును అంటగట్టినాడు న్యూనిజు. న్యూనిజు చరిత్రకంటె వాఙ్మయశాసనాదులధిక విశ్వాసపాత్రములు. కావున వానినే యనుసరించుచున్నాడను; కాని న్యూనిజు వ్రాసిన విషయములను సంపూర్ణముగ త్యజింపక వినియోగపరచుకొన్నాడను.

16. *EI VI: pp 128-9*

సప్తాఙ్గోపేతశక్తిత్రితయ
చతురుపాయైక మన్త్రీశసాత్వ
తిమ్మాఖ్యే కొండవీట్యామ్ గజపతి
విహితాన్ రాజహంసాన్ గృహిత్వా
ధాత్రీమాటీక మాసే పరనృపతి
ఖగాః క్షుత్పిపాసాతిఖిన్నాః
శాకాబ్దాన్ మార్గయనే గిరిపురజ
లధిష్మ్రసుగూఢాః ప్రలీనాః.

ఆముక్తమాల్యదయందును (1 : 37) ఈ విషయము గూఢముగ సూచింపబడినది.

చిత్రము కృష్ణరాయనృపశేఖర
నీదగుధాటి కోడి స
ర్వత్ర నిలింపకామినుల
వాడకుగాపులువోయిరుత్కల
క్షత్రియపాత్రులెల్ల గసుగందని
మేనుల దొంటి పెద్దలే
సూత్రముపన్నినారో బలసూదను
వీటికి గొండవీటికిన్.

ఈపద్యములోని 'కసుగందని మేనులు' వ్యాఖ్యాతలను త్రిప్పటపెట్టినది. బుద్ధి చాతుర్యము కొలది యెవ్వరికి దోచినట్లువారు అర్థము వివరించిరి. ఉత్కలక్షత్రియపాత్రులు యుద్ధమునగాసిపడి చావలేదు; ముట్టడియం దాహారపదార్థములు లభింపకపోవుటచేత ఆకటికి మాడియసువులను విడిచిరి కావున కసుగందని మేనులతో స్వర్గమున కతిథులైరి.

విడిచిపెట్టలేదు17. వీరితోపాటు ప్రతాపరుద్రగజపతి రాణులలో నొక్కతె బందీకృతురాలైనట్లు న్యూనిజు చెప్పుచున్నాడు18. పెద్దనయు 'మాద్యత్కళింగాంగనా బందిగ్రాహ' యను వాక్యమునందు ఈయంశమునే సూచించియున్నాడు.19

కొండవీడు స్వాధీనమైనది. సాళువ నరసింగరాయల యాదేశము మూలాన రెండువంతులు నెఱవేఱినది. ఇమ్మడి దేవరాయల కాలమునందువలె మరల విజయనగర సామ్రాజ్యపు టీశాన్య సరిహద్దులు కృష్ణయు సాగరమునైనవి. కృష్ణరాయలవంటివి ప్రి పడి ఖడ్గము నొఱయందు పెట్టలేదు. గజపతి యుద్ధమునవోడి యతని పూర్వికులు విజయనగర చక్రవర్తుల కడనుండి నాచికొన్న రాజ్యము నంతటిని గోలుపోయెను; కాని యతని బలమింకను నిశ్శేషముగ నశించిపోలేదు. మరల నాతడు విజయనగరముపై నెత్తిరావచ్చును; కావున బలము చక్కగ క్షీణించి యతడు నమ్రుడై సంధిని కోరువరకును యుద్ధము జరుపుటకు నిశ్చయించి సైనికులను ముందుకు నడువ నాజ్ఞ యిచ్చెను. క్రొత్తగ గెల్చిన రాష్ట్రములను రాయ సామ్రాజ్యమున గలుపుకొని, కొండవీటి రాజ్యమును నందలి దుర్గములను సర్వశిరః ప్రధాని సాళువ తిమ్మరసయ్య పరాక్రమమువలన సాధింపబడినవగుటచేత నాతనికే కొండవీటి దుర్గాధిపత్యము నొసగెను. తిమ్మరసయ్య తాను దండుతో గూడ నడచి కళింగ దండయాత్రను జయప్రదముగ సంపూర్తిచేయవలసి యుండుటచేత నతడు తన యల్లుడగు నాదెండ్ల గోపమంత్రిని తనకు ప్రతినిధిగ నచట నిలిపి సైన్యముతో గూడ తరలెను. 20

---

17. *TTDI. III. Nos* 76, 77, 78, 80, 81 ప్రతాపరుద్ర గజపతి కుమారుడు వీరభద్రగజపతిని బందీకృతుని గావించిన సంగతి యనేకుల ప్రశంసకు పాత్రమైనది.

'ఇన భూమండన కొండవీడు
ధరణీభృద్దుర్గ పూర్వాద్రి భా
స్వదిభేశాత్మజ వీరభద్రజన
జీవ గ్రాహ రాహూయమాణ'

అని యాముక్తమాల్యదయందు కృష్ణరాయలు.

'ఘనుడా కొండవీటికడ
మూషిత రుద్రుడు కృష్ణుడంచును
మనసిజునిన్ జయించె, నరె
మానుష మే నరసేంద్రు కృష్ణరా
యనృపతి కొండవీటి
కడనాహవభూమి బ్రతాపరుద్ర నం
దనుడగు వీరభద్రు గరుణామతి
గాచె జగత్ప్రసిద్ధిగన్.'

అని పారిజాతాపహరణమున నంది తిమ్మన.

'...యుధినగరవరే కొండవీట్యాం క్షణపత్యా
జీవగ్రాహం గృహీత్వా గజపతితనయం...'

అని సంగీత సూర్యోదయమున బండారు లక్ష్మీనారాయణ. (*Further Sonces.* 116-(*a*)

18. *Forgotten Empire p.* 318.

19. మను. 3 ; 142.

20. 'సాల్వతినియ (సాల్వతిమ్మయ) రాయలతో గూడ తాను ఉత్తరదేశమునకు పోవుటకొఱకు తన సైన్యమునందే తన సోదరు నొక్కని దళనాయకునిగ నియమించి యచట (కొండవీటియందు) నిలిపిపోయెను' అని న్యూనిజు వ్రాసియున్నాడు. (*Forgotten Empire, p 318*) కాని ఇది పొరబాటు. మనకు తెలిసినంతమట్టుకు సాళువ తిమ్మయకు సాళువ గోవిందరాజొకడు దప్ప యన్యసోదరులు లేరు. సాళువ గోవిందరాజు రాయల కళింగ దండయాత్రలో పాల్గొననని చెప్పుటకే యాధారమును లేదు. మరియు క్రీ. శ. 1514 వ సంవత్సరమున కొండవీటిని సాధించినప్పటినుండి క్రీ. శ. 1525 వఱకును తిమ్మరసు పక్షమున నాదెండ్ల గోపయ దుర్గాధిపతియై యుండినట్లు శాసనములు దెల్పుచున్నవి. రామరాజు రంగప్పరాజ కృతమైన సాంఖ్యోపాఖ్యాన పీఠికయందు ఆరవీటి పినకొండరాజు 'కృష్ణరాయ రాజ్యలక్ష్మీ నిరీక్షాపక్ష్మలంబగు కొండవీటిదుర్గాధ్యక్షము' అని చెప్పియున్నది. (*Further Souces of Vijayanagar History Vol II No 122*). రాయవాచకమున జెప్పినట్లు కృష్ణరాయలు కొండవీటియందు తాళ్యము నుంచిన కొండయ్య ఇతడే కావచ్చును. కాని ఇతనికి దుర్గాధ్యక్షుడైన సాళువ తిమ్మరసయ్యతోడను, అతని ప్రతినిధియైన నాదెండ్ల గోపమంత్రితోడను గల సంబంధ మెట్టిదో తెలియదు.

సైన్యమును తిమ్మరసయ్యతో గూడ తరల్చి కృష్ణరాయలు విజయనగరమునకు చిన్నాదేవి తిరుమల దేవులతోగూడ బయలువెడలెను; కాని యతడు పుణ్యక్షేత్ర సందర్శనలాలసు డగుటచేత సూటిగ రాజధాని మార్గమునుబట్టక మొట్టమొదట కృష్ణాతీర మందలి యమరావతికిబోయి దేవులతోగూడ నమరేశ్వరస్వామిని సేవించి తులాపురుషదానము జేసెను; తన దేవుళ్లు చిన్నాజిదేవమ్మ తిరుమల దేవమ్మగారిచేతను మహాదానాలు సేయ నొనరించెను[21]. తరువాత శ్రీశైలమునకు విచ్చేసి మల్లికార్జునస్వామిని సేవించి తేరువీధి కిరుప్రక్కలను మంటపశ్రేణుల నిర్మించి, నిత్యనైవేద్యపూజాపురస్కారముల నడుపుటకొఱకు కొన్ని గ్రామములను దేవాలయమునకు సమర్పించి, సత్రములు యెద్దులు గాడిదలు మున్నగువానిపై గొనివచ్చు సామానులపై జెల్లింపవలసిన సుంకమును సర్వమాన్యము జేసెను[22]. రాజ్యకార్యములను విచారించుటకై 'తిరిగి విజయనగరానకు విచ్చేసి రత్నసింహాసనమునుండి సామ్రాజ్య'పాలనము సాగించుచు కొన్ని దినములు గడపెను. మరల కళింగదేశమునకు దిగ్విజయార్థము బయలువెడలి మొట్టమొదట ఇష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరులను సేవింప శా. శ. 1437 యువ కార్తిక బ. 3 గురువారమునాడు తిరుపతికి విజయముజేసి 'తిరువేంగళనాథునికి నవరత్న ప్రభావళి 1' మకరతోరణం 1' సమర్పించెను[23]. అచటినుండి బయలుదేరి యుత్తరముగ శేషాచలపర్వతము వెంబడి ప్రయాణముజేసి శా. శ 1438 యువ పుష్య శు. 15. శుక్రవారమునా డహోబలముజేరి చెంచులక్ష్మీ సహితుడైన నారసింహుని సేవించి వజ్రపతకముతోటి రత్నహారమును రత్నకంకణములను చాంగలమఱ్ఱిసీమలోని మదూరుగ్రామమును దానముజేసెను[24].

కృష్ణదేవరాయ లిట్లు విజయనగరమునకు పోవునప్పుడును వచ్చునప్పుడును దారిపొడుగునను గల పుణ్యక్షేత్రములను సేవించి సావధానముగ బెజవాడకువచ్చి చేరెను; అంతకుముందె బెజవాడ రాయరాణువకు గైవసమైనట్లున్నది. బెజవాడ విజయప్రస్తావము శాసనములలో నెందును గానరాదు; కాని కృష్ణరాయల పూర్వదిగ్విజయమును వర్ణించుచు సమకాలికుడగు నజ్ఞాతకవి యొక్కడు 'కూలె బెజవాడ' యనివచించి యున్నాడు. కాని యప్పుడు గజపతిపక్షమున నా పట్టణము నెవ్వరు పాలించుచుండిరో యెట్లది రాయలకు హస్తగతమాయెనో తెలియదు; ఎట్లు స్వాధీనమైన నేమి? తరువాతి కళింగయుద్ధ యాత్రయందు విజయనగర సేనలకు జాల ననుకూలమైన పెంకి యాయెను.

## కొండపల్లె.

ఇదియొక బలిష్ఠమైన గిరిదుర్గము. గజపతి సామ్రాజ్యములోని ముఖ్యమైన ఆయపట్టు స్థానములలో నిది యొక్కటి. తెలంగాణమునకు బోరు తలుపు; అది హస్తగతమైన తెలంగాణమును జయించుట బహు సులభము. ఈ విషయమును జక్కగ గుర్తించినవా డగుటచేత ప్రతాపరుద్రగజపతి దాని సంరక్షణకు దగిన యేర్పాటులను గావించెను. ప్రహరేశ్వరపాత్రుడు మున్నగు పెక్కుండ్రు ఉత్కలక్షత్రియుల నచట గాపుంచెను. శత్రుజన భయంకరములైన మారణయంత్రముల నచట నెలకొల్పెను. దుర్గగ్రహణమున నేర్పఱులైన రాయసేనాధిపతులు జంకుదురా? ఉదయాద్రి కొండవీడులకు మించినదా కొండపల్లె? ముట్టడి ప్రారంభమై కొంతకాలము నడచినది; కృష్ణరాయలే స్వయముగ ముట్టడి కార్యములను నిర్వహించుచుండెను. దాదాపు రెండునెలలు గడచినవి. అంతట ప్రతాపరుద్రగజపతి తన దుర్గములను రాజ్యమును సంరక్షించుటకొఱకు 1300 యేనుగులు 20000 గుఱ్ఱములు 500000 కాల్బలమునుగల ప్రచండ సైన్యముతో కృష్ణరాయలను దఱుమగొట్టి ముట్టడిని లేపవలయునను నుద్దేశముతో వచ్చెను. అతడు తెలంగాణ ప్రాంతమునందెచ్చటనో కృష్ణను దాటివచ్చి నదీ దక్షిణతీరమున రాయలసైన్యమునకు బిఱుదున విడిసి, వెనుకటినుండి తాకుటకు ప్రయత్నము సేయ దొడగెను. యుద్ధదృష్టినిచూచిన ప్రతాపరుద్రగజపతి యొక్క యెత్తుగడ ప్రశంసనీయమైనదే. రాయసైన్య

---

*21. ARE 266 of 1897 (EI. VI pp 17 22)*

*22. ARE, 18 of 1915, Part I Para 16.*

*23. TTDI. III. No 76.*

*24 ARE 64 of 1915, LR. 15 pp 431-33.*

నును వారి మూల పీఠస్థానమునుండి వేర్పఱచి వస్తు సామగ్రిని వారి కందనీయకుండ ఇడుములపాలు జేసి వెనుకనుండి తాను గవిసిన ముంగలనుండి కోటలోని శాత్ర్యముపైబడిన వారిని నాశముసేయుట సులభమని తలచెను; కాని కృష్ణరాయలయుద్ధ కౌశల్యము నతడు గణుతికి దేడాయె. ప్రతాపరుద్రుని ప్రయత్నములు రాయలకెఱుక పడెగనె శత్రువును నదిని దాటిరానిచ్చుట క్షేమకరముగాదని యెంచి స్వయముగ తానే నది నుత్తరించి యచటనె మార్కొనుటమేలని యతడు నిశ్చయించెను. కావున కోటలోనివారిని వెలుపలికి పోనీయక బలిష్ఠమైనదళమును కోటచుట్టునుగా నుంచి, తక్కినదండును వెంటబెట్టుకొని నాలుగు మైళ్ళదూరము కూచిచేసి కృష్ణయొడ్డునకువచ్చి చేరెను. నది కావలిగట్టున విడిసియుండిన ఒడ్డెదండును జూచి యచ్చటనె యాగి ప్రతాపరుద్రగజపతి కిట్లు సందేశమంపెను: 'మీరూ నామీద యుద్ధకార్యమునకుప నిశ్చయించిన నేను నదీతీరమునుండి రెండు మైళ్ళదూరము వెనుకకు జరిగిపోయెదను; మీరు నిరాటంకముగ నదిని దాటిరావచ్చును; మీరు దాటిన వెంటనె యుద్ధముసేయుదము.' ఈ సందేశమునకు గజపతి ప్రత్యుత్తరమీయక యుద్ధప్రయత్నములు సేయగడగెను. దానిని పొడగని కృష్ణరాయలు దినమూవత్తు దళములతోడను ఏనుగులతోడను నదిని దాట నారంభించెను. రాయలదండు నదిని దాటునపుడు శత్రువులతో సంఘర్షణగలిగి ఘోరపోరాటము నడచెను; ఇరుపక్షములను అనేకులు మడిసిరి. శత్రులను సరకుసేయక కృష్ణరాయలు నది నుత్తరించి, యావలి గట్టుజేరి మహాపరాక్రమముతో గజపతిని పోరనిర్జించెను; గజపతిరాయల ప్రతాపమున కోర్వజాలక పలాయితుడాయెను; అతని గుఱ్ఱములును ఏనుగులును రాయలకు హస్తగతమైనవి.[25] ప్రతాపరుద్ర గజపతినోడించి పాఱద్రోలి కృష్ణదేవరాయలు మరల కొండపల్లెను జేరి తన శక్తి సామర్థ్యములను వినియోగపఱచి కోటను స్వాధీనము జేసికొనెను. దుర్గాధ్యక్షుడైన ప్రహరేశ్వరపాత్రుడు (ప్రహరరాజు శరశ్చంద్రమహాపాత్రుడు)ను నతని సహాయులైన బోడజన మహాపాత్రుడును బిజిలిఖానుడును జీవగ్రాహముగ పట్టుకొనబడిరి[26].

## తెలంగాణ దుర్గములు :

కొండపల్లెను జయించినపిమ్మట కృష్ణరాయలు తెలంగాణముపై దండునడపెను. తీరాంధ్రదేశమువలె తెలంగాణమును గజపతుల యేలుబడి క్రిందనుండెను; క్రీ. శ 1484 ప్రాంతమున పురుషోత్తమ గజపతి మహమ్మదీయులను బాఱద్రోలి కొండవీటి నాక్రమించినప్పుడు కొన్నిటిని సాధించెను; క్రీ. శ. 1500 వ సంవత్సరమున ప్రతాపరుద్ర గజపతి దక్షిణ దిగ్విజయమునకు బయలువెడలినప్పుడు తెలంగాణమున జాల భాగమును జయించినట్లున్నది. ఈ విజయయాత్రయందు భోగివంశజుడును మానఘూపాలుని పుత్రుడునునగు చిత్తాంబులేక సిత్తాపఖాను డను నతడు ప్రతాపరుద్రునికి సహాయపడినట్లు తోచుచున్నది. ఏలన నితడు క్రీ. శ. 1504 వ సంవత్సరమున వ్రాయించి యోరుగంటి కోటయందు నిల్పిన శిలాశాసనమునందు తాను మహమ్మదీయులను అనగా బహమనీ సుల్తానును జయించి యోరుగంటిని సాధించితినని చెప్పుకొనియున్నాడు.[27] ఇతని యాధికారముక్రింద కంభముమెట్టు రాజాద్రి మున్నగు పెక్కు దుర్గములుండెను; మఱియు గొండవీటిసీమకు జెల్లుచుండిన బెల్లముకొండసైతము ఇతని ఏలుబడి క్రింద నుండెనని మహమ్మదీయ చరిత్రలవలన దెలియుచున్నది.[28] చిత్తాంబుఖానుని కుటుంబముయొక్క పూర్వచరిత్ర తెలియదు. అతని పెద్దలు నామనిశానులు లేనివారు. స్వశక్తి సామర్థ్యములవల్లనే యాతడు ప్రఖ్యాతుడాయెను; కావున బహమనీ సుల్తానుల బలము నత డన్యసహాయములేక ప్రతిఘటించి రాజాద్రి యోరుగల్లు మొదలగు దుర్గములను సాధింపజాలెననుట యంత విశ్వాసపాత్రముగ గనప

---

25. ఈ యుద్ధము కొండవీటికడ జరిగెనని మ్యానిజు వ్రాసియున్నాడు; కాని ఇది పొరపాటనియు వాస్తవముగ జరిగిన స్థలము కొండపల్లె పరిసరములందని ఇంతకుముందు సూచించియున్నాడను. (*See N. 15*) ఆ విషయము నిచట మరల జర్చింపవలసిన యవసరములేదు.

26. *TTDI III. 80.*

27. *Memoirs of the Hyderabad Archaeological Department*, No. 9.

28. *Briggs Ferishta*, *III*, *p* 360.

ట్టిదు. అటను గజపతికి సామంతుడై యుండవచ్చును. కాకేని యతని మైత్రిని సంపాదించి తన్మూలమున బహమనీ సుల్తానుల యధికారము దొలగద్రోసి యోరుగల్లు మున్నగు స్థలములను సంపాదించియుండును.

ఈ కారణమున కృష్ణరాయలు కొండపల్లెను సాధించిన వెనుక కళింగరాజ్యముమీద ముందు సాగిపోవక పశ్చిమముగ తెలింగాణ భూములవంక దన సైన్యములను ద్రిప్పెను. పార్శ్వమున నిన్ని ప్రబలదుర్గములు గజపతి యాధీనమున నుండ, ముందుకు నడచుట క్షేమకరము గాదని యతడెంచెను. కృష్ణరాయలు జయించిన తెలింగాణదుర్గము లతని శాసనములందును, సమకాలికాంధ్ర వాఙ్మయమునను జేర్కొనబడియున్నవి. 'అనంతగిరి, ఉండ్రుగొండ, అరువపల్లి, జల్లిపల్లి, కందికొండ, కప్పలువాయి, నల్లగొండ, కంభంమెట్టు, కనకగిరి, శంకరగిరి ఇవి మొదలైన తెలింగాణ్య దుర్గాలు ఏకధాటిని కైకొని' నట్లు శాసనములు దెల్పుచున్నవి[29]. ఇవిగాక 'దేవరకొండ యుద్వృత్తి భంగముజేసె' నని ముక్కుతిమ్మన్నగారు చెప్పుచున్నారు[30]. అనుమకొండ కైఫీయతులో ఓరంగల్లు దుర్గమునుండి తురుష్కులను బాఱదోలినట్లు చెప్పియున్నది[31]. ఇది సంశయాస్పదమే కాని యసంగతముకాదు. ఈ దుర్గము లన్నియు నిప్పటి హైదరాబాదు రాజ్యములోని మహబూబు నగరు నల్లగొండ వరంగల్లు జిల్లాలయందున్నవి. వీనిని పాలించుచుండిన శత్రు లెవ్వరో యవి రాయల కెట్లు వశపడెనో తెలుపు నాధారము లెవ్వియు లేవు; కాని కంభముమెట్టును ఒరుగల్లును సితాపుఖానుని రాజ్యమందలి ముఖ్యస్థానములు. మహమ్మదీయ చరిత్రకారులు చెప్పినట్లు బెల్లంకొండ దుర్గమును అతనిదె యగునేని అతనికి రాయలతోడ కొండవీటి దండయాత్రయందె ఘర్షణ కలిగియుండవలయును. అతని యునికిపట్టైన కంభముమెట్టును రాయలు గొనవచ్చినప్పు డతడు రాయల నెదుర్కొని యుండునని మనము దృఢముగ జెప్పవచ్చును; కాని యప్పటి శాసనములందుగాని వాఙ్మయమునగాని సితాపఖానుడు రాయలను డీకొన్న ట్లెచ్చటను లేదు. రాయవాచకమునను కృష్ణరాయవిజయమునను చితాపఖానుడు కొండభూమియందు కనుమలలో నెచ్చటనో సింహాచలమునకుబోవు మార్గమున విజయనగర సైన్యమును నడ్డగించి పరాభూతు డాయెనని చెప్పియున్నది.

"అందుండి గజపతి రాజ్యానకై నడవగా అప్పాజీ రాయలవారితో మూడుతెగల తురకల రాజ్యమంతా కపోలంచేశి వారి దుర్గాలున్న స్థలాలున్న కట్టుకొని అహమదానగరం అమిద్యాలు విత్తించి గజపతివారి గిరిదుర్గం జలదుర్గం స్థలదుర్గం వనదుర్గం యివి అన్నియు ఆక్రమించినట్టాయను. ముందర కదలి పొయ్యేది కార్యంగాదు. కనుమలు దాటి పోవలెను. కనుమలలో నున్న గజపతి తెగవారు సామగ్రీ రానియ్యరు' అని మంత్రాలోచనగా విన్నపం చేశినందులకు ఆ విశేషం రాయవారు చిత్తాన వుంచ్చుక ముందర కదలిపోవలెనని దృష్టిని యెదురులేదని యెంచ్చి అప్పాజీగారు విన్నపం శేశి సందుంకు అవుగాములు ఉత్తరవియ్యక కదలిపోగా,

గజపతివారి కనుముల నడుమ పొయ్యేటప్పుడు చితాపుఖాను అనేవాడు అరవై వేల శింగ్గాణి రౌతులతోడట్టు కనుమమార్గమున పొయ్యే రౌతు (రాయ ?) రాణువమీద చిత్తవానసుకిశిన రీతి అమ్ముల గురియించ్చగా అంమ్ములనుండి తప్పించ్చుకొనువారున్ను ఆ యంమ్ముల యెదుకై నిలిచినవారున్ను ముందువెనుక తెలియక నిలిచినవారున్ను ఆడాడ దిగ్భ్రమపడి వున్నవారున్ను యీ రీతిన వుండ్డగా చితాపుఖానునికి యెదురు లేదు గనుక జగడెంశాయగా,

ఆ సమయాన కర్నాటకం కైజీతం రౌతులు చితాపుఖానునికి పెడతలపోట్టుగా యిరు పార్శ్వాల కనుమలపొడవున నెక్కి చితాపుఖానుని వెనక దిక్కులకైవచ్చి శింగ్గాణులచేతనున్ను ఖడ్గములచేతనున్ను బరిజీలచేతనున్ను వేటూరు తునకలుగా నరకగా చితాపుఖానుని తెగలకు కనుమలలో నిలువ కూడక విరిగిపారగా వెంబ్బడించ్చి తరుముకబోయి వారిని దుర్గం చొరనోలి తిరుగా వచ్చిరి. గనక అప్పుడు చిత్తాపుఖానుని తెగలో యిరుపైమూడు వేల స్తోమమున్ను నాల్గువేలగుఱ్ఱములున్ను వఖితా వున్నె మడిసి అటుతర్వాత సముదళం ఆద్యంతమున్ను

29. *TTDI. III. 80.*

30. పారి. 1 : 23.

31. *Further Soveres II No. 124.*

ముందర కదలిపోయిరి. గనుక ఆ కనుమల్లో ముప్పై వేల స్తోమాన్ని ఠాణ్యం వుంచ్చి అవతల గజపతివారి సీమాద్యంత్రం నిపాతం చేసుకపోయి"రి32.

## సింహాద్రి:

ఇందువలన కృష్ణరాయలకు తెలుంగాణ్యము నుండి తీరదేశమునకు బోవుమార్గమందు చిత్తాపఖానునితో యుద్ధము సంఘటిల్లెనని తెలియుచున్నది. శత్రురాజ్యములోని కింకను చొచ్చుకొనిపోవలదనియు నది క్షేమకరము గాదనియు వారించు తిమ్మరసుమంత్రి సలహా నంగీకరింపక ముందు సాగినందుకు ప్రథమప్రతిఫలమిది; కాని సామాన్య దండనాయకుల కది దుర్లంఘ్యమే కాని యసాధారణ మేధాసంపదగల కృష్ణరాయల నది యాపజాలకపోయెను. చిత్తాపఖానుడు కనుమమార్గము నరికట్టిన రాయలు నిజసైనికులను కొంప లెక్కించి యతని పుచ్ఛమునుండి మారొక్కన జేసి మార్గమును నిర్విబంధము గావించెను. ఈ కనుమ మార్గమె గాబోలు నల్లసాని పెద్దనగారు పేర్కొన్న 'జమ్మిలోయ.' అగునేని, 'జమ్మిలోయబడి వేగి దహించె'నని పెద్దనగారు చెప్పియుండుటచేత నది తెలింగాణమునుండి వేంగిదేశమునకు ననగా కృష్ణా గోదావరుల మధ్యతీరదేశమునకు బోవుదారిలో నుండెనని యనుకొనవలసియున్నది. శాసనములందును, న్యూనిజు చరిత్రయందును, మఱికొన్ని సమకాలిక రచనలయందును, రాయవాచక కృష్ణరాయ విజయములందును తెలింగాణ దుర్గములను సాధించిన పిమ్మట కృష్ణరాయలు సూటిగ సింహాచలముపై నడిచినట్లు చెప్పియున్నది; కాని కృష్ణరాయలు శకాబ్దము 1438 ధాతుచైత్ర బ. 12. వడ్డవారమునాడు సింహాచలమున నిల్పిన రెండు శిలాశాసనములందును 'ఉద్దగిరి కొండవీడు కొండపల్లి రాజమహేంద్రావరం మొదలైన దుర్గాలు సాధించి సింహాద్రికి విచ్చేసి' యని చెప్పియున్నది33. ఇందువలన కృష్ణరాయలు సింహాద్రికి విచ్చేయుటకుముందు రాజమహేంద్రవరమును జయించెనని తెల్లమగుచున్నది. రాజమహేంద్రవరము వేంగిదేశమునకు రాజధాని. కావున సింహాద్రికి విచ్చేయుటకుముందు కృష్ణరాయలు వేంగిదేశమును జయించుటయే కాక యాముక్తమాల్యద మనుచరిత్రల పీఠికయందు చెప్పినట్లు 'కోనబిట్టేర్చి కొట్టాన వగిలెను.'

అవల పొట్నూరి సింహాద్రిని జేరెను. తరువాతి వృత్తాంతమును న్యూనిజిట్లు వివరించియున్నాడు: ప్రతాపరుద్రగజపతి వెరుగుచూచుచు కృష్ణరాయలచట నాఱుమాసములాగెను. 'నేను యుద్ధరంగమున తమ రాకను నిరీక్షించుచున్నానను' అని సందేశము నంపెను; కాని యతడు రాడాయె. ఆ పట్టణమున రాయలు పెక్కు ధర్మకార్యముల నొనర్చెను; దేవాలయములకు దానము జేసెను; ఒక గొప్ప దేవాలయమును నిర్మించి దాని కధికముగ వయింబడివచ్చు నేర్పాటులను గావించెను; దానిపై నీ క్రింది యర్థముగల శాసనమును జెక్కించెను. 'ఒకవేళ నీ యక్షరములు మాసిపోయిన పిమ్మట ఒడ్డెరాజు విజయనగర భూపాలునితో సమరమునకు వచ్చునేమొ. ఈ యక్కరముల నొడ్డెరాజు తుడిపించెనేని విజయనగర భూమీశ్వరుని గుఱ్ఱములకు లాడములుగొట్టు కమ్మరుల కతని భార్య యీబడును34.' ఈ జయస్తంభ స్థాపనను సమకాలికులనేకులు ప్రశంసించియున్నారు; కాని దీని బోది శాసనతాత్పర్యమును పెద్దనగారును కృష్ణరాయలును వేఱువిధముగ వర్ణించియున్నారు.35

'అభిరతి కృష్ణరాయ విజ
యాంకము లీవు లిఖించి తోళస
న్నిభముగ బొట్టనూరికడ
నిల్పిన కంబము సింహభూధర
ప్రభుతిరునాళ్ల కుండిగుసు
రప్రకరంబు కళింగ మేదినీ
విభు నపకీర్తికజ్జలము
వేమఱు పెట్టి పఠించు నిచ్చలున్.'

ఇది న్యూనిజు చెప్పినదానికంటె గడు సభ్యముగ నున్నది. రాయ లచట నిర్మించిన దేవాలయమును దానితో గూడ నతడచట నిల్పిన జయస్తంభమును రూపు చెడిపోవుటచేత వాస్తవమైన శాసనార్థమేదియో నిశ్చయించుటకు వీలులేకున్నది.

---

32. రాయ. 93-5, కృష్ణ. విజ 3 : 70-73.

33. *SII. VI Nos. 694, and 696.*

34. *Nuniz, Forgotten Empire, p. 318.*

35. *Further Sources II Nos 116, (a), (e),* మను. 1 : 39; ఆముక్త 1 : 40.

## కటకము:

సింహాద్రియందు జయస్తంభమునునిల్పి కృష్ణరాయలు విజయనగరమునకు మరలిపోయెను; మార్గమున రాజమహేంద్రవరమునం దాగి యతఁడును దేవేరులు చిన్నాదేవియు తిరుమలదేవియు మహాదానములను జేసిరి.36 శా. శ. 1438 ధాతు ఆషాఢ బ. 15 అమావాస్య, కటక సంక్రాంతి పుణ్యకాలమున కృష్ణవేణీతీరమున కృష్ణరాయలు గజపతిమీద దండయాత్ర చేసి జయస్తంభము నెత్తించి వచ్చునప్పుడు అతని దండనాయకులలో నొకఁడగు కుమార ధనంజయుఁ డొక యగ్రహారమును బ్రాహ్మణులకు దానము జేసెను.37 కావున నప్పుడు కృష్ణరాయలు బెజవాడ యందో తత్పరిసరములందో విడిసియుండెనని మనము నిశ్చయముగ జెప్పవచ్చును. ఆ సంవత్సరపు పుష్య శుద్ధ 10 శుక్రవారమునాఁడు విజయనగరమునుండి తిరుమలకు విచ్చేసియుండుటవలన ధాతు ఆషాఢ బ. 15 అమావాస్యకును పుష్య శుద్ధ 10 కి మధ్య నొకనాఁ డతఁడు విజయనగరమునకు జేరియుండును. మరల దాదాపు ఒక సంవత్సరకాలము దక్షిణరాజ్యములందు సంచరించుచుండినట్లున్నది. చిదంబర దేవస్థాన గోపురముపై జెక్కియుండు నొక శిలాశాసనమున నతఁడు సింహాద్రికడ జయస్తంభము నెత్తించి పొన్నంబలము (చిదంబరము)నకు వచ్చినట్లు చెప్పియున్నది.38 కాని మరుసటియేఁ డతఁడు మరల కళింగమునకు బయలు వెడలెను. అప్పుడు కృష్ణాతీరమున బెజవాడలో మల్లికార్జునస్వామిసన్నిధిని శా. శ 1440 బహుధాన్య వైశాఖ శుద్ధ 15 చంద్రగ్రహణకాలమున గృష్ణరాయలు అల్లసాని పెద్దనగారికి కోకటగ్రామము నగ్రహారీకరించి దానముజేసెను.39 కృష్ణరాయలు శా. శ 1438 ధాతు వైశాఖమునుండి శా. శ 1440 బహుధాన్య వైశాఖమువఱకును మధ్య దాదాపు రెండేండ్లకాలము సైన్యముతో గజపతి నుండక సామ్రాజ్యమున సంచరించుచుండినను, కళింగమున యుద్ధ మాగలేదు. అతని సేనాధిపతులీ మధ్యకాలమున గజపతిరాజ్యముపైని ఎడతెఱపిలేక దండయాత్ర సేయుచుండిరి. శా. శ. 1438 ధాతు ఫాల్గుణ బ. 5 బుధవారమునాటికే రాయరాణువ కటకమువఱకు కూచిచేసియుండెనని తిప్పరసయ్యకుమారుడు లక్ష్మీకాంతరసయ్య వ్రాయించిన కొమ్మూరు శాసనమువల్ల విదితమగుచున్నది40. ఈ ధాటియందే మనుచరిత్ర, ఆముక్తమాల్యద పీఠికలందు జెప్పినరీతిని, ఒడాదిని మసి యొనర్చి మాడెములు గాల్చినది.41: ఒడ్డాది ప్రస్తుత విశాఖపట్టణమునందలి వీరవల్లి తాలూకాలో నున్నది. ఒడ్డాది మత్స్యవంశ క్షత్రియులకు రాజధాని. కృష్ణరాయల దండయాత్ర యప్పుడచట నెవ్వరు రాజ్యము సేయుచుండిరో తెలియదు. 'రాయరావుతగండ రాచయేనుగు వచ్చె' జీరాడిన యారట్లకోటయు నీ ప్రాంతములోనిదే. మాడెములు బహువచనమున నుండుట గమనింపదగినయంశము. వాని సంఖ్య యేడు. శ్రీనాథకవి వర్ణించిన సప్తమాడెయము లివియే గంజాము మండలమున తూర్పుకనుమల పాదమువనుగల పర్వత ప్రదేశమున వెలసిన యేడు చిన్నరాజ్యములకు పూర్వ మీనామము చెల్లుచుండినది కావున కృష్ణరాయల సైన్యము గంజాము మండలమునెల్ల ద్రొక్కి చూచి గజపతిరాజ్యముయొక్క హృదయమును భేదించుకొని పోయినది. ఈ సందర్భముననె రాయసము కొండమరసయ్య శ్రీకూర్మమున జయస్తంభము నిల్పినది42; కటకమును గాల్చినదికూడ నప్పుడే కాబోలు.

కాని ఈ దండయాత్రతో కళింగయుద్ధము తుదముట్టలేదు; బహుధాన్య వైశాఖ శుద్ధ 15 చంద్రగ్రహణకాలమున గృష్ణరాయలు బెజవాడకు వచ్చెనని పైజెప్పియున్నదికదా. మఱియు నాముక్తమాల్యదపీఠికయందు 'మున్నే కళింగదేశవిజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపబోయి హరివాసరోపవాసం బచ్చట గావింప నప్పుణ్యరాత్రి చతుర్థయామంబున' యనియున్నది43. ఈ హరివాసరము శా. శ. 1440 బహు

36. *Nuniz, Forgotten Empire, p 319, TTDI. III. 80.*

37. *EC. V. Hn 13.*

38. *378 of 1913, ARE, 1914 part II, Para 30.*

39. *LR. X. The Kaifiyat of Kokatam.*

40. *894 of 1922.*

41. మను ౧ : ౩౯ ఆముక్త. ౧ : ౪౦.

42. *SII. IX, Part II. 507.*

43. ఆముక్త. 1 : 11.

ధాన్య ఫాల్గుణ శుద్ధ 11 శుక్రవారమని యచట కృష్ణరాయలు చెక్కించిన శిలాశాసనమువల్ల దెలియుచున్నది44. కావున అప్పటివఱకును (శా. శ. 1440 బహుధాన్య ఫాల్గుణశుద్ధ 11 వఱకు) కళింగయుద్ధము సమాప్తము గాలేదు. కృష్ణరాయ లింకను కళింగదేశ విజిగీషామనీషం దండెత్తిపోవుచునే యుండెను. ఈ ధాటియందు నడచిన యుద్ధవృత్తాంత మెచ్చటను వర్ణింపబడియుండలేదు. బండారు లక్ష్మీనారాయణ మాత్రము సింహాద్రిని జయస్తంభమును నిల్పిన పిమ్మట.

> సోఽయం కృష్ణ నృపేశ్వరో గజపతిం
> జిత్వా తదీయాం శ్రియా
> సాకం తస్య సుతా ముదూహ్య,'

అని చెప్పియున్నాడు; కాని ఆ యుద్ధము కొండ మరసు లక్ష్మీకాంతరుసులదాడికి జెల్లవచ్చును. రాయవాచకమున కృష్ణరాయల కటకపటి దండయాత్ర విపులముగ వర్ణింపబడియున్నది.

సింహాద్రినుండి ముప్పది యామడలదూరము కూచిచేసి పోయి కటకమునకు నాలుగు క్రోశములలో వచ్చి పాళెము డిగెను45. గజపతి ప్రతాపరుద్రునికి తహ తహ పుట్టినది. కటకమును విడిచిపోవుట కాతని కిష్టములేదు. ఎట్లయినను కృష్ణరాయలను బాఱదోలి దానిని సంరక్షించుట యుక్తము. కావున తన రాజ్యమూలస్తంభప్రాయులైన షోడశ మహాపాత్రులను సముఖమునకు రప్పించి రాజధానిని శత్రుహస్తగతము గానీయక కాపాడవలసిన భారము వారిపైనున్నదని తెల్పి వారి సలహా నడిగెను. అందుకు వారు కృష్ణరాయ'లాయు'లనియు తాము 'స్థాయు'లనియు, 'నట్టిపట్ల యెదురు యెంచ్చక లోతు యెరుగక గనక లోజొచ్చివచ్చినారు. మంత్రాలోచన మీద వచ్చిన కార్యం గాదు, హామీకమీద కార్యం, గనక వారికే ముప్పు మన కార్యం జయమౌను'; 'మన సీమప్రజలకు వారిలవింగతోలి స్థలాలున్ను నిలుపవలెనన్ను ఉత్సాహ పుష్టి గనక ఇట్టపట్ల మనం కనుపించుకొంటేను కర్ణాటకం వారు నిలువలేక తమసీమకు పొయ్యేమని బోదురు' అని వారు బదులుచెప్పిరి. ప్రతాపరుద్ర గజపతి సంతసించి వారికి 'వక్కలాకు లిప్పించి' మరునటి యుదయమున విజయనగర స్కంధావారముపై బడుటకు నిశ్చయముజేసి వారిని వారివారి విడిదలకంపెను.

అప్పటికి సూర్యు డస్తంగతుడాయెను; కాని గజపతి యాస్థానమందుండిన కర్ణాటకం వారి స్థానాపతి కమలనాభయ్య పై విషయమునంతటిని 'సత్కృచ్ఛముగా కాకితము వ్రాయించి ముద్రబడి జేసి గోప్యముగా రాయలవారు అంతఃపురాన వున్నప్పటికిన్ని ఆయన చేతనే కాకితములు యిమ్మని చెప్పి' అంపెను. ఆ కాకితము చదువగనే రాయలకు కళవళము గలిగినది. తాను 'యాయు'వే, 'స్థాయు'లతో పోరాట సుకరము గాదు. షోడశ మహాపాత్రులేకమై గజపతిసీమప్రజల కగ్నికి వాయువువలె దోడ్పడిన, దనజయముమాట నటుండనిచ్చి సైన్యముతో గూడ క్షేమముగ మరలిపోగల్గుటగూడ సంశయాస్పదమే. 'కార్యం బిసతప్పె'నని గుర్తెఱిగి 'తబ్బిబ్బాయెను'. సైన్యము స్థితినారయుటకు కృష్ణరాయలు 'దివిటీ కోలుపై విచ్చేసినట్టుగా నడిపించ్చి

---

44 చూ. లక్ష్మణరాయవ్యాసావళి పుటలు 33–34.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు 1440 అగు నేటి శుద్ధ 11 శుక్రవారం శ్రీకాకుళపు తెలుగురాయలకు శ్రీ మన్మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ కృష్ణదేవ మహారాయలుంగారు దక్షిణం సమర్పించి యిచ్చిన ధర్మశాసనం॥ స్వామికి కుంభసంక్రమణ పుణ్యకాలమందు సందర్శించి...ఇత్యాది.

45. కటకము రాయవాచకమున పేర్కొనబడియుండలేదు; కాని 'పొట్నూరి సింహాద్రివద్ద శిబిరం దిగినారు. యిక్కడికి నాలుగుక్రోశముల మేర వచ్చి వున్నారు.' ఎక్కడికి? పట్టంసమీపానకు వచ్చినారు.' ఆ పట్టం గజపతి రాజ్యములో మొదటి స్థలం' (పుట 97). 'అనింన్ని విచారించుకోక ముప్పై యామడదూరం గజపతిసీమలో జొచ్చి మొదటిస్థలంవద్ద దిగినందువల్ల వారికి ఆలోచనబుట్టి యింత్తకార్యాలకు తెగవేసినారు.' (పుటలు 101-102). సింహాద్రికి ముప్పదియామడలదూరమున నుండిన రాజ్యమున మొదటిస్థలమగు పట్టము కటకము గావలయును గాని యన్యము గాజాలదు.

నగరశోధనగా పాళ్యాలు' చూచుచువచ్చిరి. గజపతి వారు మరుసటి ఉదయము దమస్కంధావారముపై నెత్తిరాగలరను వార్త యెట్లో పొక్కినది. 'పాళ్యములో ఆడాడ గలిబిలి'యాయెను. 'మూకలు గుమిగూడి గుసగుసలుగా మాట'లాడ దొడగిరి; 'కొందరికి భయోత్పాతముగా తోచినది. 'ఉదయమైతే గజపతివారి పాళ్యం మనపాళ్యంమీద పడుతొవున్నారనిన్ని ఆరీతే అయితే కర్నాటకంవారి బలం నిలువ దనిన్ని రాయలవారు అప్పాజీమాటలు వినక లోబొచ్చి వచ్చినందువల్ల అపాయం వచ్చెననిన్ని యిందుకు యిప్పుడైనా అప్పాజి చెప్పినట్టువింటే ఆయన అపాయానకుతగ్గ ఉపాయం చింతించగలడనిన్ని అక్కడక్కడ పిన్నలు పెద్దలు రౌతులు గాణువవారు ఆ సకలమున్ను ఉత్సాహమున్నలై ఆతురో నే మాటలున్ను వార్లు భీతి జెందినవార్లునున్ను చూచినవారై రాయలవారు అప్పాజి గుడారమునకు పోయివారు.' అదిరాత్రివేళ. రాయలదేవుడు ఒంటరిగ మంత్రి గుడారమునకు వచ్చుట అరుదు. ఆయన అట్లు వచ్చుటను జూచి ఆశ్చర్యపడినాడు అప్పాజి. తనయొద్ది వారలను వారి వారి గుడారములకు అంపి రాయలవారిని విచ్చేసి కూర్చుండవలయునని మనవిచేసి అడిగెను, 'పిలువనంపిస్తే నేను వచ్చి విన్నపం శాయనా? ఏకదేశాన విచ్చేశేటంత కార్యం యేంద్ది?' అని. రాయలవారు 'ఏకదేశాన రాలగ్గ కార్యం గనక వస్తిమి' అని బహులు చెప్పి కమలనాభయ్య పంపిన కాగితమును అప్పాజి చేతి కిచ్చెను. జాబును చదువుకొన్నాడు అప్పాజి. కొంతసేపు వితర్కించి దానమువలన శత్రువులలో భేదము పుట్టించి కార్యము సాధింపవచ్చును. రాయలదేవుడు యెంత ధనమైనను వెచ్చపెట్టుటకు సెలవీయక యనుజ్ఞయిచ్చిన కార్యము జయప్రదమగునని విన్నవించెను. రాయలవారు 'యింతకు వచ్చిన వ్యయప్రయాసములకు నిలుచునా?' అని చెప్పి వలసినంత ధనమును వెచ్చపెట్ట సెలవిచ్చి తన గుడారమునకు వెడలిపోయెను.

అంతట తిమ్మరుసు మంత్రులను అవసరికులను వ్రాయసమువారిని పిల్పించి పదునార్గురు పాత్రులకును పదునాఱులక్షలు వారు కోరినంత ధనము నంపుచున్నామనియు, వారు చెప్పినట్లు గజపతిని రాయలకు బట్టియీవలసినదని వ్రాసి యమూల్యమైన రత్నాభరణములు పదునాఱు పెట్టెలయందిడి వానిని నమ్మిన భటులచే పట్టణములోనికంపెను. తరువాత విజయనగరస్కంధావారమున నుండిన గజపతివారి స్థానాపతి సుబుద్ధి తన ప్రభువును హెచ్చరించుచు, షోడశమహాపాత్రుల 'మాట విరసమై వారు కార్యముఖానకు వస్తావున్నారు, గనక కర్నాటకం పాళ్యానుండి మన పాళ్యానకు వచ్చే మార్గాన అస్త్రలయిన వాళ్లను ఉంచ్చి నియోగులున్ను పెట్టెలున్ను సముఖానకు తెప్పించుక జాగ్రతగా నివన్నసైనేను అందుకు తగిన ఆలోచన కనేది' వ్రాసి' అంపెను. ప్రతాపరుద్రగజపతి తన స్థానాపతి వ్రాసిపంపిన కాకితము జూచుకొని యూతీరున నెమ్మనము కొప్పించి షోడశమహాపాత్రులకు తిమ్మరసు పంపిన నియోగులను దారి కాచుకొని పోవుచుండిన పెట్టెలతో గూడ పట్టుకొని పెట్టెలను తెరిపించి యందుండిన నగలను రాయలపేరట తిమ్మరసయ్యవారికి వ్రాసిన లేఖలను గాంచి వారు తనయెడ ద్రోహము దలపెట్టినారని యెంచి 'పదారు నియోగులనున్ను పట్టం విడిచి యేకదేశాన అవ్వలవీడతోలి గజపతివారు యేడెనిమిరి అనుపహాడవు ఉత్తరంగా పారిపోయిరి. మరుసటి ఉదయము షోడశ మహాపాత్రులు.యుద్ధమునకు సంసిద్ధులై గజపతినగళ్ళకు వచ్చిరి. గజపతి వారి పలాయనమును విని వారు తమ స్వస్థలములకు బోయి చేరిరి. ఈ వృత్తాంతము రాయలవారి కెఱుకపడగనె జయభేరి వేయించి కటకమును బ్రవేశించిరి.[46]

ఇది రాయవాచకమున వర్ణింపబడిన రాయల కటకదండయాత్ర వృత్తాంతముయొక్క సారాంశము. ఇందు అసంగత మేమియు లేదు. రాజపుత్రులతో గూడి తనపై దిరుగబాటు గావించిన యక్బరు రాకుమారుని వారినుండి వేర్పఱచుటకు మొగలాయి చక్రవర్తి యౌరంగజీబు యిట్టి యుక్తినే అవలంబించినాడు; కాని రాయలవాచక వృత్తాంతమును రుజువు సేయగల యన్యసాక్ష్య మెద్దియు గానరాదు; కావున దాని నుపయోగించుకొనునప్పు డీ యంశమును స్మరణయం దుంచుకొనుట మేలు. రాయవాచకమందు కృష్ణరాయలు పైజెప్పినట్లు కటకమును బ్రవేశించిన

46. రాయ. 95-109.

పిమ్మట ప్రతాపరుద్రగజపతి యతనితో సంధి గావించుకొని తన కూతు నతని కిచ్చి యుద్వాహము గావించెనని చెప్పియున్నను పోర్చుగీసు చరిత్రకారు డగు న్యూనిజ్ ఈ విషయము నింకొకవిధముగ వివరించి యున్నాడు.

కృష్ణరాయలు సింహాద్రినుండి విజయనగరమునకు విచ్చేసిన తరువాత 'మొదటిదుర్గమున దనచే బట్టుబడి (గజపతి) రాజకుమారుని47 తన సముఖమునకు రప్పించి, యతడు లఘువుగల పోటరి యనియు, గత్తికటారుల సామున గడు నేర్పరియనియు, జనశ్రుతిచే దెలియవచ్చుచున్నందున నతని ఖడ్గవిద్యానైపుణ్యమును జూడ వేడుకపడుచుంటి ననియు' జెప్పెను. 'పిలిచినవారు నన్ను రప్పించితిరి కావున నా శక్త్యనుసారము (నా నేర్పును) జూపెదను' అని యా యువకుడు బదులు చెప్పెను. మరుసటిదినము రాగనే రాయలు అతనిని మరల పిలిపించి, యప్పుడు ఖడ్గవిద్యావిశారదుడని పేరందిన తన యనుచరులలో నొక్కనితో గూడ పోట్లాడుమని కోరెను. తన యంతస్తుకు దగిన యొక రాజకుమారునితోగాక యొక యధమపురుషుని దనతో పోట్లాడ నియోగించినందులకు గినిసి, 'దైవనిర్ణయము, రాచపుట్టువుగాని వాని స్పృశించి నా చేతులను మలినపఱచుకొనజాలను' అని రాయలతో సాక్రోశించి చెప్పి యాత్మహత్య గావించుకొనెను. తన కుమారు డెట్లు మృతినందినదియు దెలియగనె యతని తండ్రి సాల్వతినియ (సాళువ తిమ్మయ్య)కు-కుమారుడు గతించిపోయెగనుక—యేమి ప్రత్యామ్నాయముగొని రాయల చెఱయం దుండు తన రాణివాసమును బంధవిముక్తను గావింతురో తెలుపవలయునని లేఖ వ్రాసెను అందుకతడు 'రాయలకతని (గజపతియొక్క) కుమార్తెనిచ్చి వివాహము సేయుట కేర్పాటుగావించిన యెడల రాయ లతని రాణిని చెఱనుండి వదలిపెట్టుటయేగాక యతని రాజ్యమును గైతము అతనికే ఇచ్చివేయగల'డని బదులు వ్రాసెను. అతడు (గజపతి) ఈ సలహా నంగీకరించి తన కుమార్తె వివాహవిషయమును సంప్రతించుటకు రాయబారులను విజయనగరమున కంపెను. కృష్ణరాయలు సంతృప్తి నందెను. ఈవిషయమై యతని అభిప్రాయము దెలియగనె ఉరియ నరపాలుడు తన పుత్రిక నతనికడ కంపెను. ఆమె రాకతో వారిరువురికి (గజపతికిని రాయలకును) సఖ్యము కుదిరినది. కృష్ణరాయలు నది (కృష్ణ) కవ్వలివైపు రాష్ట్రము నాతని కిచ్చివేసి యీవలివైపు భూములను దా నుంచుకొనెను48.

న్యూనిజుగాథ యథార్థమైనదని పయసు సాక్ష్యము వలన రుజువగుచున్నది. కృష్ణరాయలు తఱచుగ నురియాదేశపు రాజుతో గయ్యము సేయుచుండెననియు, నతని రాజ్యమును జొచ్చి పెక్కుపట్టణములను నాశమొనర్చి సాధించి యతని భటుల ననేకులను వారణములను నిర్జించెననియు, నతని పుత్రుని చెఱవట్టి చిరకాలము విజయనగరమున కారాగారమం దుంచగా నతడచటనె మృతినందెననియు, నతనితో సంధిచేసికొని దేశమున శాంతిని నెలకొల్పుటకొఱకు ఉరియారాజు తన కొమార్తె నొక్కతె నతని కిచ్చెననియు నామె నాతడు విజయనగరమున బెండ్లాడి తన ధర్మపత్నిగ గైకొని యున్నాడనియు పయసు వ్రాసియున్నాడు49.

కృష్ణరాయలచే బట్టుబడిన యురియరాజకుమారుడు వీరభద్రగజపతియని యింతకుముందే చెప్పియున్నాడను. ఇతని మరణమునుగూర్చి న్యూనిజు ప్రభృతులగు సమకాలిక పోర్చుగీసు చరిత్రరచయితలు వచించుగాథ విశ్వాసపాత్రము గాదని యాధు

---

47. ఇందు 'మొదటి దుర్గమున' అను మాట ప్రమాదజనితము. న్యూనిజు చరిత్రప్రకారము ప్రతాపరుద్ర గజపతి పుత్రుని కృష్ణరాయలు చెఱగొన్నది కొండపల్లె దుర్గమునందు. అతని లెక్కననుసరించి యది మూడవదుర్గమగును గాని మొదటిది కాజాలదు. రాయలు సాధించిన మొదటిదుర్గము ఉదయగిరి. అచట బందీగావింపబడినది గజపతి 'ఆంటో లేక అంకులో' (పినతల్లిగాని మేనత్తగాని లేక పినతండ్రిగాని మేనమామగాని) కృష్ణరాయల శాసనములును అప్పటి యాంధ్రవాఙ్మయమును ప్రతాపరుద్ర గజపతి కుమారుడు రాయలచే బట్టుబడినది కొండవీటి దుర్గమందని తెల్పుచున్నవి.

*48. Nuniz,*
*Forgotten Empire, pp 319–20.*

*49. Paes :*
*Forgotten Empire p. 247.*

నిక పరిశోధకులు గొందఱు నిరసించుచున్నారు. వారి యభిప్రాయమునకు గారణము లేకపోలేదు. విజయనగర చక్రవర్తి యేలుబడి క్రింద నుండిన రాష్ట్రమున వీరభద్రగజపతి శాసనములు మూడు గలవు. దీని మూలమున నతడు కృష్ణరాయలపక్షమున కొన్ని సీమలను బరిపాలించుచున్నట్లు తెలియవచ్చుచున్నది; ఇట్లు తనక్రింద మాండలికుని గావించి గౌరవించిన కృష్ణరాయలు వీరభద్రగజపతి నవమానపఱచి యతని యాత్మహత్యకు కొంతమాత్రమును గారణభూతుడు గాజాలడని వీరి వాదమందలి సారాంశము[50]

చక్కగ విచారించి చూచిన వీరి యాక్షేపణ సదాధారమైనది కాదు. వీరభద్ర గజపతిశాసనము లన్నియు శా. శ. 1437 యువసంవత్సర కార్తికమాస శుక్లపక్షమున వ్రాయించినవి. ఒకటి ద్వాదశినాడును తక్కినవి రెండును పౌర్ణమాస్యనాడును జెక్కించినవి[51]. అప్పుడు వీరభద్రగజపతి కృష్ణరాయలక్రింద మాండలికుడై సీమల నేలుచుండినది వాస్తవమే; కాని న్యూనిజు జెప్పునది యవ్వలిచరిత్ర—శా. శ 1438 ధాతు చైత్ర బ 12 నాడు రాయలు సింహాద్రియందుండెను[52] శా. శ 1438 ధాతు అషాఢ బ. 15 నాడు తిరిగివచ్చుచు బెజవాడలో మకాముజేసెను.[53] అచటినుండి బయలుదేరి విజయనగరమునకు వచ్చి శా. శ. 1438 ధాతు పుష్య శుద్ధ 10 నాడు తిరుమలకు విచ్చేసెను.[54] కావున శా.శ. 1438 ధాతు అషాఢ బ. 15 కును పుష్యశుద్ధ 10 కిని నడుమ నేదో యొకదినమున నతడు విజయనగరమును జేరియుండవలయును. న్యూనిజు చెప్పు వృత్తాంత మనంతర మెప్పుడో జరిగియుండవలయును. కాబట్టి శా. శ. 1438 యువ సంవత్సర కార్తికమాస శుక్లపక్షమున వ్రాయించి నిల్పిన వీరభద్ర గజపతిశాసనములు న్యూనిజు గాథయందలి నిజానిజములను నిశ్చయించుటకు ఆధారము గాజాలవు.

మఱియు వీరభద్రగజపతిని బుద్ధిపూర్వకముగ కృష్ణరాయ లవమానపఱచెనని తలంచ నావశ్యము లేదు. ఖడ్గవిద్యానైపుణ్యము ప్రదర్శనమునందే దృష్టియుంచి యేకాంగి పోరు మర్యాదలను మనసునకు దెచ్చుకొనక విస్మరించి వీరభద్రునికి పుట్టుకయందు గాకున్నను విద్యాధికారపతియందు సగముద్దియైన మాదునితో బోర గోరియుండవచ్చును. పోర మర్యాదలను జక్కగ నెఱిగిన వీరభద్రుడు కావలెనని దన్నవమానపఱచుటకొఱకు కృష్ణరాయలు ఒక యధమ పురుషునితో బోర నాజ్ఞాపించెనని యెంచి యా యవమానమును కోర్వజాలక ఆత్మహత్య గావించుకొని యుండవచ్చును. ఇందలి నిజానిజము లెట్లున్నను వీరభద్రగజపతి యంతటితో పొడగానరాక పోయెను. శాసనములం దెచ్చటను నతనిజాడ గానరాదు తండ్రికి వారసుడైనను, రాయలతో సంధి గావించుకొన్న పిమ్మట గజపతి రాజ్యపాలన కార్యముల కన్యులు దక్షులైరి; శా. శ 1447 ప్రాంతమున గజపతి రాజ్యముపై నెత్తివచ్చిన సుల్తాన్ కులీ కుతుబుశాహును బ్రతిఘటించినవాడు ప్రతాపరుద్రుని పుత్రుడు రామచంద్రగజపతిగాని వీరభద్రుడు గాడు. ప్రతాపరుద్రుని యనంతరము గజపతి పట్టమున కభిషిక్తుడైన వాడతని కుమారులలో మఱి యొకడగు కులుఅదేవుడుగాని వీరభద్రుడు గాడు. కావున న్యూనిజు పయాసులు వ్రాసినట్లు వీరభద్ర గజపతి శా. శ. 1439 ఈశ్వర సంవత్సర ప్రాంతమున విజయనగరమున మృతినందెనని యెంచుట యుక్తము.

కృష్ణరాయల రెండవ కటకదండయాత్రతో కళింగయుద్ధము సమాప్తమైనది. రాయవాచకమున జెప్పినరీతిని సర్వస్వమును గోలుపోయి శరణాగతుడైననేమి న్యూనిజు వక్కాణించినట్లు పుత్రమరణము వలన జడిసి భార్యయొక్క క్షేమము నపేక్షించిననేమి ఎట్లైననేమి గజపతి సంధిని కోరెను. అతడు రెండు షరత్తుల కొడంబడిన రాయలు సమాధానపడుట కొప్పుకొనెను. గజపతి తన కూతును రాయల కిచ్చి వివాహము సేయవలయును. మఱియు కృష్ణానదికి దక్షిణమున పూర్వము విజయనగర రాయలకడనుండి గజపతులు జయించి కైకొన్న రాష్ట్రమునంతటిని మరల నిచ్చివేయవలసినది. ఇందులకు ప్రతాపరుద్ర గజపతి సమ్మతించినయెడల కృష్ణకుత్తరమున కృష్ణ

---

*50. ASIAR. 1908-19, P. 178, The Yet remembered Ruler of a Long Forgotten Empire, p. 11.*

*51. EC. XI. Dg. 107, XII Pg. 62 ARE 744 of 1917.*

52. *SII. VI.* 694 *and* 696.

53. *EC. V, Hn.* 13.

54. *TTDI III.* 80.

రాయలు జయించిన యావద్రాష్ట్రము నతనికి మరల నిచ్చి వేయుట కొప్పుకొనెను. ప్రతాపరుద్రగజపతి యీ షరతుల నంగీకరించెను. అంతట సంధి కుదిరినది. ఇరుపక్షములవారును సమాధానపడిరి. ఇందుకు దార్కాణముగ కృష్ణదేవరాయలు శా. శ. 1441 ప్రమాది సంవత్సర శ్రావణశుద్ధ 13 సోమవారము నాడు 'విజయనగరం సింహాసనారూఢుడై సింహాద్రినాథునికి తను పేరింటిభోగను నడచేఅందుకు ప్రతాపరుద్ర గజపతిమహారాయలచాతను పుచ్చుకొన్న గ్రామాలు కళింగదండపాటలోని గ్రామాలు' రెంటిని దానముచేసెను.55

## గజపతి యోటమికి గారణములు :

ఈ యుద్ధమున ప్రతిరణక్షేత్రమునను, ప్రతి ముట్టడియందును, గజపతియు నతని బలములును బరాజయమునందుటకు గారణమేద్దియో విచారింతము. సుప్రసిద్ధపరిశోధకులైన రఖాల్ దాసు బెనర్జీ గారా సమయమున నొరిస్సా సత్వము క్షీణించుటకును, ప్రతాపరుద్ర గజపతి మరణానంతర మిగువ దిరిమి దేండ్లకు దాని స్వతంత్ర వినాశమునకు మూలకారణము శ్రీకృష్ణచైతన్యులని చెప్పియున్నారు. ప్రతాపరుద్రగజపతియు నాతని యధికారవర్గమున బెక్కండ్రును చైతన్యుని శిష్యులు. మతదృష్టిని జూచిన చైతన్యు లుపదేశించిన భక్తిమార్గము మహనీయమైనదే; కాని దాని నవలంబించుటవలన ఒరిస్సా సామ్రాజ్యము పాడగుటయేగాక రాజకీయముగ దాని ప్రతిష్ఠయంతయు రూపుమాసిపోయినది. సర్వసమత్వమును ప్రేమను ఉపదేశించుమతము మనుజులహృదయములందు కైతవాదర్శములను నమ్మకములను నుప్పతిలజేసి సంఘబంధములను నిర్మూలము గావించును; వాస్తవముగ సర్వవిషయములందును సమానులగు మనుష్యులిరువురెందును గానరారు; రాజ్యతంత్రము సర్వత్ర బలముమీదనే యాధారపడియున్నది. చైతన్యమతము నవలంబించుటవలన ప్రతాపరుద్రుడును నతని యధికారవర్గమునందనేకులు యుద్ధమునందభిరుచిని గోల్పోయిరి. ఇదియే ఒరిస్సా వినాశమునకు గారణభూతమైనది56.

ఇది యహోహము ప్రతాపరుద్రగజపతియు నతని యధికారులలో కొందఱును వైష్ణవమతమును స్వీకరించినది వాస్తవమే. చైతన్యస్వామి సర్వసమత్వమును ప్రేమను ఉపదేశించుటయును నిజమే. అందువలన ప్రతాపరుద్రగజపతి యుద్ధాభిరతికి వీడుకోలిచ్చెనుట కల్ల. అతని క్షత్రియధర్మము నొకప్పుడును త్యజించలేదు. కళింగయుద్ధము శా. శ. 1434 ప్రజోత్పత్తిసంవత్సరమునుండి శా. శ. 1441 ప్రమాదివఱకును దాదాపు యేడేండ్లకాలము నడచినది. ఈ యేడేండ్లును ప్రతాపరుద్రుడు కృష్ణరాయలతో నెదుర్చి పోరాడెను. సమయము వచ్చినప్పుడు శత్రువుని మార్కొనుటకు జంకి వెనుదీయలేదు. యావచ్ఛక్తిని వినియోగించి తుదవఱకును పోరాడక విడిచిన దున్నదు లేదు. అతని కుటుంబమున పిరికిపందలు లేరు; అతని పినతండ్రి తిరుమలరాహుత్తరాయకును, నమాసుకాంచిభద్రుకును శూరాగ్రేసరులు; అధికారులలో గసహాపాత్రుడు, ప్రహరేశ్వరపాత్రుడు, చిత్తపఖానుడునున్నవారు పేరెక్కిన యోధులు. కావున వైష్ణవమతావలంబనముచే గాని మఱియే కారణముచే గాని ప్రతాపరుద్రుడును నతని సేనాధిపతులును యుద్ధమునందు విరక్తులని యెంచుట కవకాశము లేదు. ప్రతాపరుద్రుని పరాజయమునకు నిజమైన కారణ మతని ప్రతిపక్షియొక్క యద్వితీయ సమరనిర్వహణశక్తియే. కృష్ణరాయలు సామాన్య సేనాధిపతి గాడు, అతనికి సరియుద్ధియని పేర్కొనదగిన దండనాయకు డెవ్వడును భరతఖండమున దప్పుడు గానరాడు. కృష్ణరాయల సెదుర్కొని యోడినవారు గజపతి యొక్కడే కాదు. ఏదులఖాను లిద్దఱును, బరీదుకుతపమల్కలును అతని కత్తిపోటు రుచిజూచి పాఱినవారే; వారు శౌర్యహీనులగుటవలన గాదు, అత డసాధారణ ప్రజ్ఞావంతుడగు సేనానాయకు డగుటవలన. ఈ యంశమును దృష్టియందుంచుకొనిన గాని ప్రతాపరుద్ర గజపతి యోటమికి వాస్తవమైన కారణమును గ్రహింపజాలము

## కళింగయుద్ధ ఫలితార్థము :

కళింగయుద్ధమువల్ల కృష్ణరాయల కీర్తి భారతావనియంతటను బర్వినది; అతని శౌర్య

---

55. 599. *VI.* 695.

56. *Indian Antiquary, 1929 (April) p. 67.*

ప్రతాపములు ప్రకటితమైనవి; అతఁ డసాధారణ ప్రతిభాసంపన్నుఁడైన దండనాయకాగ్రేసరుఁ డని తెల్లమైనది. రాయరాణువ ప్రతిష్ఠ యతిశయించినది. లుప్తమైన రాయసామ్రాజ్యభాగములు మరల స్వాధీనపడినవి. ఇవి తాత్కాలికఫలములు. దీర్ఘ దృష్టి దిలకించిన గళింగయుద్ధము దక్షిణభారత భూమికి అనర్థకరమని చెప్పవలసి యున్నది. చిర కాలమునుండియు దక్షిణహిందూదేశమును యవనా క్రాంతము గానీయక హిందూస్వాతంత్ర్య ధర్మ ముల సంరక్షించుచుండిన హిందూసామ్రాజ్యములలో నొక్కటియగు గజపతి సామ్రాజ్యపతనమున కీ యుద్ధము మూలకారణ మాయెను. విజయనగర చక్ర వర్తులును గజపతులును సుహృద్భావముతో నేకీభ వించి పూనుకొనియుండిన మహమ్మదీయుల యధి కారమును సమూలముగ బెకలించి యుండవచ్చును. వారి పరస్పర వైషమ్యము మహమ్మదీయులకు లాభ కారియైనది. మొదట బహమనీసుల్తానులును వారి యనంతరము గోలకొండ కుతుబుశాహులును తీరాంధ్రమున ప్రవేశించుటకీ వైరము జాల యను కూలపడెను. ప్రకృతము గజపతికి సంధిషరతుల ప్రకారము కృష్ణకవ్వలి భూముల నన్నిటిని కృష్ణ రాయ లిచ్చివేసినను నది యిడియబడిన యింటిదానము వలె ప్రతిగృహీత కుపభోగ్యము గాదాయె. ఈ యుద్ధానంతరము ప్రతాపరుద్ర గజపతి తన స్థితిగతుల నిట్లు చెప్పుకొని యున్నాఁడు.

'నష్టంకులం భిన్నతటాక కూపాః
విభ్రష్టరాజ్యం శరణాగతంచ' అని.

కావున సంధిమూలమున లభ్యమైన రాజ్యమును సంరక్షించుకొనుటకు గజపతికి తగిన బలము లేదు; బలమును గూర్చుటకు ధనము లేదు. దీర్ఘయుద్ధముచే నవసిన ప్రజలను, పాడువడి బీడువడిన దేశమును పోషించి సంరక్షించు శక్తి యతనికి లేదాయె. ఈ కష్టములను గడకొత్తి రాజ్యమును బునరుద్ధరింప జాలు నాయకుడును గానరాడాయె. కావున ప్రతాపరుద్ర గజపతిరాజ్యకాలముననే గోలకొండ కుతుబుశాహు తెలింగాణ దుర్గములను శ్రమ లేక సాధింపగల్గెను; అతని మరణానంతర మచిరకాలముననె కుతపన ముల్కు పుత్రుఁడగు మల్కిభరాము గజపతిరాజ్యమును గూలద్రోసి తీరాంధ్రకళింగప్రాంతములను స్వాధీన పఱచుకొనగల్గెను; కావున కృష్ణరాయల కళింగ జైత్రయాత్ర గజపతిసామ్రాజ్యనిర్మూలనకును దేశ పారతంత్ర్యమునకును హేతుభూతమాయెనని చెప్ప వలసియున్నది.



# దళిత కుసుమము



శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

లేవయసు దాన! పూవు రాలినది నేల
నివిసీల భుజంగ వేణికను వీడి,
యే దిశావలయితమయి యెగసిపోవు!
ఈ పరిమళ వ్యాప్తులింత టంత—

అదిగో! పుష్పమ్ము నవవిలాసాత్త మధురి
మా భరమ్ము, క్రమవిముగ్ధ మానవతియు
బోలె, సౌరభము నిలుపు మునిచె దళము,
తత సమాయాత వాయు దూతలకు వెఱచి

నవమోహన గాత్రి! యిది
నవకమ్మైన ఘూర్ద్ధ నహి ఫణామణి రోచిః
భవదుజ్జ్వల వేణికి బటు
శివాప్రభ వెలుంగు జగము; సిగదాల్చవటే!

వసివాడిన దీకుసుమము
కసుగందెను కోమలాంగి కన్ తుదలను, నీ
వ, సుధా పూరము నింపిన
పస దక్కెను లేపసందు పసగుల్కెను లే!!

నీ చెలువు 'మహో ఘనము' కానిమ్ముగాక
అతడు రసికుడౌ నంటె! నియద్ధు నీవి
కచనవీన సౌరస దివ్య గంధ మొసగు
సుమము నిద్దానిలేక నిగ్గు సాగయువాడు;

ఓ చెలీ! త్వత్ప్రియ పరి రంభోత్సవమున
నైన నీ బాహులత చిక్కి యాడునపుడు
తలపునకు వచ్చు నెమ్మి లతాంతమిద్ది
భవదుపేక్షిత మన్మథ బాణమిద్ది—

[రసజ్ఞశకు పేర్వశపిన భ్రమరమూ పూవు
చెంతకు వచ్చెను. అదియు నూరక ఝుం
కారములు పలుకును.]

ఓరి మధువ్రతా! నిలుము
రోరి యమంద మరంద వాహిని
పూరిత మీసుమమ్ము నవ
మోహన రాగవిరాజితమ్ము
సంసార సుఖమ్ము గ్గ మనసా
గిలిగింతలు పెట్టుచాఁ గ,
నీవే రసమూర్తి వివె పదవీ
భ్రమచే భ్రమియించు బోవ్వగా!
ఓరి రసావగాహన మహోత్సుక
మూర్తి! సుఖాను భూతికై
దారులు చూచు పేశల
లతాంత మొకించుక ధూళిధూసరం
బై రహియించెబో భవ
దనాదర పూర్ణ కఠోర మత్తఝుం
కారము లివ్వి పుష్ప
లలనా హృదయ ప్రతి ఘాతదశముల్

---

# కోతి



## శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

### ౧

రైలు యింకా రాలేదు. ఆకాశం ముసురేసేట్లుగా వున్నది. రివ్వుమని గాలి వుండి వుండి వీస్తూంటే స్టేషనులోని చెట్లన్నీ దేన్నో చూసి జడుసుకుంటున్నట్లుగా కంపించి 'జుంయ్' మంటే 'జుంయ్' మని గోలచేశాయి.

దుమ్ము రెండు మూడు నిలువుల యెత్తున లేచి సుళ్లుగా తిరుగుతోంది.

చినుకు యింకా భూమ్మీద పడలేదు. పడకుండానే రైలు వచ్చి ప్లాటుఫారంమీద నిల్చుంది

స్టేషనులోకి త్రోసుకుంటూ వచ్చిన శాస్త్రి, కొంచెం చిరాగ్గా ముఖాన విసురుతూన్నట్లున్న దుమ్ముకు చేయి అడ్డుగా పెట్టి, అప్పటికప్పుడు ఏర్పడ్డ ఆ తొడత్రొక్కిడిలో పరుగెత్తుతూ, ఇటూ-అటూ తిరిగి మొత్తానికి ఆడవాళ్ళ పెట్లన్నీ గాలించేశాడు.

తనకు కావలసిన మనిషి రాలేదు.

బెల్లం చుట్టూ చీమలు ముసిరినట్లుగా ప్రయాణీకులు రైలును చుట్టుముట్టి సామానులు తోచినట్లుగా లోపలకు విసరటంవల్ల నేమి, దిగే జనాభాయొక్క కుమ్మోత్తు మొర్రోలవల్ల నేమీ, యావత్తు ప్లాటుఫారమూ మహాగందరగోళంగా వుంది. ఆ గొడవలోనుంచి యీవలకు వచ్చాక, చినుకులు పడుతున్నట్లుగా తోచి మూసిన గొడుగును విప్పాడు శాస్త్రి.

అతను చిన్నప్పట్నుంచీ దేనికోసమో ఎదురు చూస్తున్నట్లుండేవాడు. ఆ ఎదురుచూడ్డం సెలయేటి కెరటాల తరగల పొంగుల్లో పడి పార్లిపోదామనీ కాదు, నీలిరంగు మబ్బుల్లోకి నిరడుగా హృదయాన్ని విసిరి రోజాపువ్వుల గుత్తులలోకి ముఖాన్ని దాచుకుందామనీ కాదు, మల్లెలు సన్నజాజుల వాసనలకు మత్తిల్లి ఆదిన్మశిఖరాల అంచుల్లో వూహలకుమాత్రమే అందే అప్సరసతో సుఖిద్దామనీ కాదు—ముంగిసలా కాలం మెలితిరిగిన తన జీవిత సర్పాన్ని రాచి రాచి నేలను వొత్తి కొరుకుతూన్నకొద్దీ—ఒక చల్లని చూపు ఒక తియ్యని మాట వినాలని కోరేది మనస్సు. అంతే! అంతకన్నా పెద్ద ఆశ లేవీ పెట్టుకోలేదు. అతని వివాహం కూడా అంతంతమాత్రంగానే జరిగింది. శిథిలావస్థలో వున్న జీర్ణగేహాన్ని ఏవో నాలుగు తాళపత్రాలతో కప్పుకుని అందులో సుఖిద్దామనుకున్నాడు గాని అంతస్తులు మిద్దెలు విలాసాల కోసం అతను అర్రులు చాచలేదని మొదటే చెప్పాలి. డబ్బుకోసం పెళ్ళిచేసుకోవటం సుతరామూ శాస్త్రికి అప్పట్లో యిష్టంలేదు. పిల్ల నచ్చటం, మనస్సు కలిసిందా లేదా—యివి అన్నీ వున్నవాళ్లకు గాని తనకేమిటి అనిపించింది. తను విరహవ్యథలు అభినయిస్తూ యింట్లో కూర్చుంటే తనమీద పంచప్రాణాలు పెట్టుకున్న తల్లిదండ్రు లేమికాను? అందుచేతే ఎవరో ఒకర్తి ఆడది—అని చేసేసుకున్నాడు సరస్వతిని. అనుకున్న కండిషను ప్రకారం డబ్బుయిచ్చి చదువు చెప్పించాడు మామగారు. సరస్వతి కాపురానికి వచ్చాక క్రొత్తలో కొంత పెట్టుబడి కూడా తనేమీ కోరకుండానే సర్దుబాటు చేయటం జరిగింది.

ఇప్పుడు శాస్త్రి సంపాదనాపరుడు కాగానే సరస్వతి కంఠాన్ని పొడిగించి—ఆ యావత్తు అర్జనా నిజంగా అనుభవించవలసిన హక్కు తనది గాని అంతర బొంతరవాళ్ళను తెచ్చి మేపటం సమంజసం కాదని వాదిస్తూ వచ్చేది.

మొదట్లో శాస్త్రి సరస్వతిని చూచినప్పుడల్లా కొద్దిగా గర్వపడేవాడు లోపల్లోపల. ఆమె గుర్రెడటి

లేతచేతులు, రోజారంగు చెక్కిళ్ళు, నవ్వినప్పుడల్లా సొట్టలుపడే బుగ్గలు, మధ్యపాపిటి, వొత్తైన నొక్కు నొక్కుల జుట్టు జడతో ఎంతో ఆకర్షణీయంగా వుండేది. తరువాత పిల్లలు వాళ్ళతో ఆఫీసునుంచి రాగానే ఆడుకోవటంలో ఎంతో హాయి సుఖమూ లభించేవి.



ఆ పొంగుల్లో తనకు తెలియకుండానే సరస్వతి సంసారక్రమాన్ని క్రొత్తమార్పులలో సవరణలతో ఎన్నిమాట్లు బిగించాలని ప్రయత్నించినా, అదొక తమాషాగానే మాసిమాడినట్లు వూరుకున్నాడు గాని, ఆమెలో అవ్యక్తభావనారూపమై నెలకొన్న అధికారవాంఛా మేఘ మొకనాడు ఝుళిపించి విస్సురుగా యెడాపెడా వర్షిస్తుందనీ, ఆ తుఫానులో ఇక తన ఒక్కగాని ఒక్క చెల్లాయిని రక్షించుకోవన్నా, రక్షించుకోలేనని, యిల్లాలు అడ్డుగోడల్ని బాగా పెరుగనిచ్చి 'యిది నా యిల్లు—యిందులోకి మరెవ్వరికీ ప్రవేశార్హత లేదని' నిక్కచ్చిగా కట్టుదిట్టాల్ని చేస్తుందనీ శాస్త్రి బహుశా కలలో కూడా వూహించియుండడు.

వాన ముదరసాగింది. కాళ్లీడ్చుకుంటూ పొడుగ్గా కొల్లేటిచేంతాడులావున్న బేడారారోడ్డును దాటివస్తూంటే, ఎక్కడా చెట్టూ చేమా అన్నది లేక చుట్టూ డబ్బ లేసుకుపోయిన యిసుక మైదానాలలో - వానకు వరదకు, ఎండకు గాలికి అన్నింటికీ ఎదశరీరాన్ని వప్పగించు కదలక మెదలక అట్లానే పడివున్న ఆ రోడ్డు వొంటరితనానికి కూడా శాస్త్రి జాలిపడసాగాడు.

అతనికి మరొక్క విషయం స్ఫురణకొచ్చింది. తను చిన్నతనాన్ని దాటుతున్నానని క్రమేపి యింకొక పదేళ్ళకు అంటే నలభై మేళ్లోకి వచ్చే సరికి, యవ్వనంలో చేసుకోవలసిన పెండ్లి లభించక హతాశయులై హాస్యాలకు అపహాస్యాలకు యత్నిస్తుంటారో, సరిగా అటువంటి స్థితే తనకూ వచ్చినా— ఆ వయస్సులో అప్పుడిక స్త్రీకోసం జీవితాన్ని పాడు చేసుకుని పంచప్రాణాల్నీ వొడ్డేటంత తెలివితక్కువ మనిషిగా తను మారడని. ఇంకిప్పుడు యిప్పుడే బహుశా వుండొచ్చు. తల అక్కడక్కడ నెరుస్తోంది. యిప్పుడే యేళ్ళకే పెద్దమనిషా—

శరీరంయొక్క భౌతికమైన పెరుగుదలను గుణించటానికి వయస్సు సాయపడుతుంది. కాని మనస్సుయొక్క పరిపక్వత జీవితంలోని దుఃఖాల నుంచి యేర్పడ్డ వొత్తిడి వల్లయిస్తుంది. అందువల్లనే కొంతమంది వయస్సు మళ్లినవాళ్లు కూడా చిన్నపిల్లల మాదిరే వుంటారు. ఆకారణాన్నే వైనాకి డిటెక్టివ్ నవలలు, పిల్లల పత్రికలు చదివే పెద్దవాళ్ళు తారసపడ్తూంటారు. ఒక్కొక్కప్పుడు వ్యాఖ్యపడనవసరం లేదు వాళ్ళనుగూర్చి.

శాస్త్రికి అనుభవమైతే వుండకపోయినా పదిపదే హేడేండ్ల వయస్సుకు ముందు, బచ్చాలు, చెడుగుడు, గూటిబిళ్ళ బంతి ఆటలు ఆడుకొంటూ తిరిగే వెనగ వలసిన వయస్సులో సుఖదుఃఖాల్ను తూచుకుందుకు వలసినంతగా శక్తి లేదు. తను లేని కుటుంబానికి చెందానని, పేదతనంవలన జీతెం కట్టుకోలేకరాదా

వున్నానని పలకో పాటలా అర్థాసాయం చెయ్యవల సినదిగా, పెద్దమనుష్యుల యెదుట నిలబడి అర్థించాల్సి వచ్చేది. అట్లా వినయవిధేయతలుగల్గిన ఒక బీదకుర్ర వాడుగా వుంటూ పరిమితావకాశాల సుడిగుండంలో పడ్తూ లేస్తూ నుసిలి పెరిగిన వ్యక్తికి స్వేచ్ఛ నియమ బద్ధమైన జీవితం, నన్ను ముట్టుకోకు నా మాలకాకి అన్నట్లుగా తన వర్గంలో కూడా జీవించవల్సివస్తే ఎట్లా గుంటుంది? అందుచేతే ఆ సంసారం సుఖజీవనసారం కాలేదు.

'ఆ చెల్లెలు—అదే నాకు మిగిలివుంది.' అనే వాడు అర్థం చేసుకోమన్నట్లు.

ఇంకా ఒకప్పుడు ప్రాణం విసిగి కసిరేవాడు సరస్వతిని.

'నువ్వు వచ్చి పెడబొబ్బలు పెట్టనక్కర్లేదు. ఇక్కడ వుండటం యీ నౌకిరీ చెయ్యటం నీవల్ల కాకపోయినా, నీ కిష్టం లేకపోయినా నిక్షేపంగా మీయింటికి నువ్వు వెళ్లొచ్చన్నా నిన్నేమీ అనే వాణ్ణి కాను.'

ఈ ముక్కలు విన్నప్పుడల్లా సరస్వతి ముఖం అగ్నిగోళమయ్యేది.

అట్లా చిరకాలం రెండు సమానశక్తుల తీవ్రమైన విజృంభణనాగ్యాద పోరాటాలకు ఆ యిల్లు నిలయమై కూర్చుంది.

సరస్వతి యిలా అనేది.

'నేను మీ ఒక్కగాని ఒక్క చెల్లెలుకు రాకూడని జబ్బేదో ఆమెకే వచ్చింది. వస్తే చేసే దన్నా నా? అంటువ్యాధికదా క్షయ. మన ఇంట్లోనూ చంటిపిల్లలు. ఎందు కిక్కడకని ఆ వుద్దేశ్యంతో అన్నాను గాని, మీకు లేని అభిమానం నాకుంటే మట్టుకు యీ కొంపమీద-అది ఎందుకు చెల్లుతుంది? నీరసస్థురాలినని చేసుకోలేనని మీకేమన్నా వున్నది గనుక నా? లోకం దీనికి పొడా పొబ్బా గిట్టదని అను కుంటుంది. దానికితగ్గట్టే మీరూ నన్ను అవమానించా లనే వుంది వుండబట్టే పుట్టింటికి పొమ్మని అంత తేలిగ్గా అనగలిగారు. నాకు మట్టుకు ఏమిలేడిసింది యిక్కడ—కానీండి? చెట్టుకు కాయలు బరువా? నా వాళ్ళకు నేను బరువు కావటానికి వాళ్ళ కేమీ తక్కువ లేదు.'

శాస్త్రి అప్పటికే గొంతు చించుకుంటూ నాలు గూళ్ళకు వినిపించేలా—'నువ్వు నన్ను ఎవ ర్నుద్ధ రిస్తా విక్కడ.' అన్నాడు చిరాగ్గా.

అన్నట్లుగానే ప్రయాణమై వెళ్తూ 'అంతా నన్ను వొంటెత్తు మనిషని చిన్నప్పట్నుంచీ వెక్కిరిస్తూ వచ్చారు. ఆ మాటే మీరూ రుజువు చెయ్యాలని వుంది. నేను ఏమైనా సహిస్తాను కాని అవమానాన్ని మాత్రం సహించను.' అంది సరస్వతి.

శాస్త్రి ఊరుకోలేదు.

'నీ మాట చెల్లకపోతే నీకేదో అవమానం జరిగి నట్లే వుంటుంది. నా సహజధర్మాలన్నింటినీ నీకోసం వదిలేసుకుని గోగినై గంగిగోవులా డూడూ డూడూ బసవన్నా అంటే ఎగిరి గంతెయ్యకపోతే యింత రభసా చేసేదానివేనా?'

సరస్వతి తన సుందరముఖారవిందాన్ని మాటి మాటికి వొత్తుకుంటూ—'మీ ధర్మాలన్నీ మీరు సక్ర మంగానే నిర్వర్తించుకోండి. ఐతే ఆ ధర్మపరిపాల నలో కాస్తనాకుకూడా మిగిల్చి న్యాయం చెయ్యండి. ఎంతచెడ్డా మీ కంటె కొంత దుష్టస్వభావురాలిలా ఉన్నా నా మెళ్లోనూ ఒక పెద్ద పెయ్య కట్టుత్రాడు మంగళసూత్ర మనే పేరిట బిగించారు. అదైనా వూరికేమాత్రం కాదు......'

శాస్త్రి కాలుకాలిన పిల్లి లాగున నిప్పు త్రొక్కిన కోతిలా అయి—'మరి అందుకా నన్ను కొనుక్కున్నట్లు మాట్లాడుతున్నది. విను—మీ యింట్లో అస్తమానూ పూజలు నోములు వ్రతాలని ఎంతో హడావిడి చేస్తాంటారే ఇంత కోపాగ్ని చల్లార్చుకోలేనిదానివి—ఎందుకు? ఎట్లా సాగించాల నొచ్చావు జీవితం? నీ మాట చెల్లకపోతే ప్రపంచ మంతా తలక్రిందులు కావలసిందేనా—ఛో—ఛో— నా కక్కర్లేదు.' అనేసి చరచరా యింట్లోంచి చెప్పులు వేసుకుని నడిచాడు బయటికి.

శాస్త్రిది క్షణికమైన కోపమని తెలిసీ కూడా అభిమానంకొద్దీ ఆగకుండా పిల్లల్ని తీసుకుని పుట్టిం టికి ప్రయాణమై ఆ రోజే వెళ్ళిపోయింది ఆ మహా యిల్లాలు.

చెల్లాయి వచ్చాక—రాజుకున్న అగ్గి ఆరిందను కుని ఫలానా బండికి వస్తాను పంపమని బావమరదికి

కబురు చేశాను. మంత్రాలకు చింతకాయలు రాల్తాయా? ఆశకొద్దీ స్టేషనుకు వచ్చాడు. సరస్వతి రాలేదు. కాని రైలు వచ్చింది.

౨

జీవించటం, జీవితము—అందులో సుఖపడ్డం వేరుగా వుంటుంది కష్టసుఖాలను పునరాలోచన చేసుకుంటూ నడుస్తున్న శాస్త్రికి అప్పుడే నెత్తి మీద ఏదో బరువుగా కదిలినట్లయింది ఆలోచనల బరువేమీ కాదు.

పిల్లలు విరగబాటుగా నవ్వుతున్నారు. కొంత మంది చప్పట్లు తరుస్తూ సంబడించబోతున్నారు.

వాన కురవటం మానిందిగదా అని తీగ నొక్కబోతే, గొడుగు వున్నట్టుండిగా ఒక్క కుదుపు కుదిపి నట్లయి తేలికపడింది. ఏమిటాని చూడబోతే—గొడుగు కామమీదుగా లంఘించిన ఆ కోతి, నేలమీదుగా పరుగెత్తుకుంటూ వెళ్ళి ప్రక్క గోడను ఎక్కి, తీరిగ్గా కూర్చోనబోతోంది.

పిల్లలంతా కోతి కోతి అంటూ రాళ్ళను గోడ మీదకు విసర నారంభించారు. బయట వర్షం ఆగి పోక రాళ్ళవర్షం ఆరంభమయిందా అన్నట్టుంది. అది కూడా పండ్లికిలిస్తూ, రోమాలన్నీ నిలబడగా, భయంతో కిచకిచలాడుతూ స్వప్రాణరక్షణకోసం ఆ కొమ్మమీదనుంచి యీ కొమ్మమీదకు, యిక్కడ్నుంచి పెంకులమీదకు ఎగురుతూ నానా అల్లరి ఆరంభించింది.

అక్కడో పెద్దగుంపు ప్రోగయింది. అందులో అన్ని వయసులవాళ్ళూ వున్నారు. అందులో పిల్లలకు వేట సరదా హెచ్చింది. అది చేసే అల్లరికి వీళ్లు కూడా వెర్రులెత్తిపోయారు.

శాస్త్రికి తానుగా అడ్డువెళ్ళి ఆ కోతిని కాపాడాలనిపించింది. ఎందుకో కోతిమీదకు రాళ్లు విసురుతారు ఆ గండడని మాటలతో వారించబోతే, పెద్ద చెప్పొచ్చావు వెళ్ళవయ్యా నీకెందుకన్నట్లు చూశారు అక్కడి పిల్లమూక. శాస్త్రి వూరుకునే మనిషి కాదు. ఒకరిద్దరి చేతుల్లోని బెడ్డముక్కలను లాక్కుని నేల మీద పారేశాడు.

కోతి చూస్తూనే వుంది—శాస్త్రి బెడ్డలు పిల్ల ళ్ళలోంచి లాక్కుని నేలమీదకు విసరటం. అంతలోనే పిల్లమూక ఎదురు తిరిగి శాస్త్రిమీదకు బెడ్డలు విసరసాగారు. ఒకటి నుదుటిమీదా, ఒకటి గుండెల మీదా ఒకటి ముక్కుమీదా బలంగా తగిలింది.

శాస్త్రికి వుప్పూ పులుసూ తినే మనిషికి వచ్చేటంత కోపం వచ్చింది. గొడుగు ముడిచి కుర్రమూకను తరిమి తరిమి చావగొట్టాడు. ఆ ఘట్టం అభిమన్యుడు పద్మవ్యూహాన్ని ఛేదించిన దాని కేమీ తీసిపోదు. కాని చిన్న తేడా వుంది. అక్కడ ఒక కుర్రవాడు అతిరథుల్ని మహారథుల్ని గాభరా పెట్టి చాడు. ఇక్కడ ఒక పెద్దవాడు కుర్రసంఘాల్ని కూడా లెక్కతీసి పరుగులెత్తేట్లు చేశాడు.

‘చచ్చాంరా బాబో...’ అంటూ కాలికొద్దీ దూసుకున్నారు.

అట్లా శాస్త్రి వాళ్ళని తరుముతూంటే పరుగు పరుగున వెనుకనుంచి సంబడిస్తూ వచ్చిన కోతి అమాంతం కంఠ నలిపివచ్చేంగా అతడి పిక్క పట్టేసుకుంది

శాస్త్రి పెద్ద కేక పెట్టి, అమాంతం ఆ కోతి పీకను రెండు అరచేతుల్లోకి తీసుకుని, నలిపి చంపేద్దామన్నంత ప్రకోపంతో పైకెత్తాడు. అంతే—అది తన పొడుగాటి సన్నటి చేతుల్తో కళ్ళు తుడుచుకోసాగింది. అది చూసే చూపులు ‘నన్నెందుకు చంపుతావు—’ అని జాలిగా అడుగుతున్నట్లున్నై.

శాస్త్రి జ్ఞానమున్న మనిషితో మాట్లాడినట్లుగా పళ్లు పటపటలాడిస్తూ—‘యింతసేపూ నా నెత్తిమీద కెక్కి సవారీలు చేస్తివే? ఛవా—ఇప్పుడు నిన్ను కొట్టొద్దామని పిల్లని తరుముతూంటే నన్నే పీకుతావూ? చూడు నిన్నేం చేస్తానో...’

అది అంతకన్నా తమాషాగా రెండు చేతుల్నీ ఎత్తి దండం పెట్టింది.

శాస్త్రి పెద్దగా అవులించి, ‘హాసి—నీ యమ్మ కడుపు బంగారం కానూ—ఎన్ని లయలే—’ అంటూ చెవిమీద గిల్లాడు.

దాన్ని ఎత్తుకుని వస్తూంటే యింటికొచ్చే దారిలో, రెండుమార్లు అతని అరచేతులవరకూ జారి, గిల్లి తప్పించుకోవాలని చూసింది. శాస్త్రి దాన్ని

యింకా హృదయానికి దగ్గరగా తీసుకుంటూ యిలా అన్నాడు — 'చేసుకున్న ప్రేయసి చెప్పినా వినకుండా లేచిపోయింది. నువ్వు కూడా అలాగే చేస్తావా—' ఈ ముక్కలు అన్నాక కోతి మెడలోని వొంటి మువ్వ కళకళలాడగా ఘల్లుమంది. శాస్త్రి బిగ్గరగా నవ్వాడు

అతనికి ఆకలి వేసినట్లుగా అనిపించి కోతికేసి చూశాడు. అది బద్ధకంగా ఆవులించింది.

'సరే పద—నీకిక్కడ విందు. నేను యింటి దగ్గర నీకు పెళ్ళికూతురి నిస్తాను-సరేనా,' అంటూనే శాస్త్రి మర్కట సమేతుడై హోటలు ప్రవేశించాడు. యథాప్రకారం బిళ్లేలా యిద్దరూ తినుబండారాలమీద కలియబడ్డారు. కొంతవరకూ మచ్చికైనట్లే మసలుతున్నది బల్లమీద యిటో చెయ్యి అటో చెయ్యి పడేసి, మధ్యగా సాసరులో శాస్త్రి వూది చల్లార్చిన కాఫీని వుంచగా — అమృతం త్రాగినట్లుగా ఎత్తి గొంతులో పోసుకున్నదై పెదవుల్తో చప్పరించుకుంటూ నాలికంతా బయటపెట్టి తెగసంభ్రమంగా నాక్కుంది మూతి.

ఇట్లా అరగంట కాలక్షేపమయ్యేవరకూ, ఇంటి దగ్గర చెల్లాయి సరస్వతి రాకనపేక్షిస్తూ, వక్క శ్రీ కూర్చునివుంటుందన్న విషయం అతనికి గుర్తురాలేదు.

'ఇక పోదాం యింటికి—' అంటూ లేచాడు. దాని దృష్టి వేనవైపు లేదు. ఒదులొదులుగా పట్టుకుని పెద్ద పెద్ద అంగల్ని వేస్తూ యీవలకొచ్చి చూశాడు. భూమి అక్కడా అక్కడా గుంటలుపడ్డచోట్ల నీళ్లను నిలవేసుకుని నడవటానికి కష్టమనిపించేలాగుంది రిక్షా కోసం పరధ్యానంగా అటూ యిటూ కాస్త చూశాడు. కోతి అదే సందనుకుని తన్ను దూసుకుని వుడాయించేసింది. శాస్త్రి విస్తుపడి నిల్చుండిపోయాడు. చీకట్లో మరొకవైపునుంచి అరిటిపళ్ళ అత్తాన్ని లంకించుకుని పరుగు పరుగున ఎగురుకుంటూ తన కాళ్ళ మేరకు వచ్చి నిలబడ్డది.

శాస్త్రి ముక్కుమీద ప్రేలుమోపి కసిరంగా —

'తప్పు తప్పు. ఇట్లాటి వెధవ పెంకిపనులు చేస్తే నిన్ను ప్రేమించేదనున్న. పెండ్లికూతుర్ని చేసేది లేదు.'

దుకాణం వదిలిన ఒక ఆడమనిషి లబో దిబో మంటూ వచ్చింది.

'పొరబాటున వదిలేశాను. ఎంత కొచ్చేసింది.' అని క్షమార్పణలు చెప్పుకుని వెల యిచ్చేసి తనూ సర్దిపంపాడు.

ఏకాయెకీ యింటికి చేరుకున్నాక చెల్లాయి గుమ్మంలోనే ఆదుర్దాగా 'యింత రాత్రేమూ—' అంది, వెనక మరో బండి గాని రిక్షావంటిది గాని వస్తూ వుండకపోవటాన్ని చూసి.

'వచ్చింది. పారిపోయిన నీ వదినెను పట్టి తెచ్చాను' అన్నాడు మందహాసంగా.

'ఏది—'

శాస్త్రి కోతిని ఎత్తి చూపించాడు.

'ఇదేమిటి? యిదెక్కడ్నుంచి—'

చెల్లాయి అడుగు వెనక్కు వేసి దూరి యిస్తూండగా — క్రొత్తమనిషిని చూడ్డంచేత కోతి కంగారుగా అరటిపండ్ల అత్తాన్ని దాచుకోబోయింది.

శాస్త్రి 'ఏమిటి? యిప్పుడు దీనికేమి లోటని—అన్నంగా నీ వదినే—శాపవశాన—ఎందుకే అమ్మాయి నవ్వుతావు? అహల్య రాయై పోలేదా? వుద్దాలకుడు చండికను శాప మివ్వలేదా? నేనేమి తక్కువా—శాప మిచ్చేశాను.'

చెల్లాయికి నవ్వాగింది కాదు. పొట్ట చేత్తో పట్టుకుని—'భలే—అన్నయ్యా! భలే!'

శాస్త్రి చంకనుండి జాగ్రత్తగా నేలకు దింపాడు. చెల్లాయి సోద్యంగా చూస్తూ—'పీకుతుందేమో అన్నయ్యా—' అడుగు వెనక్కు వేసి 'మా ఆసుపత్రిలో నువ్వు ఒక్కరోజు వున్నావంటే మమ్మల్నందర్నీ పొట్టలు చెక్కలయేలా నవ్వించి తీస్తావు. ఇదివరకు డాక్టరు 'నవ్వాలమ్మా—నవ్వితేనే గాని వూపిరితిత్తులు శుభ్రపడవు' అంటూండేవాడు.'

శాస్త్రి చొక్కా విప్పుకుంటూ - 'భయం లేదు. ఎందుకైనా మంచిది. నీ వదినెను రెండు రోజులు కట్టిపడెయ్యాలి ఎక్కడికైనా వుడాయించగలదు.' అని తాడుకోసం వెతికి ప్రాతనులక మంచంనుంచి బాగా రెండు మూడు మూరల త్రాడును జమిలివేసి కోతి మెడలోని పట్టాకు కట్టి తన గది లోని కిటికీవూచకా త్రాడును ముడేసి వచ్చాడు.

అతనూ యిటు తిరగ్గానే అది కిటికీలోకి ఎగిరి కూర్చుంది. శాస్త్రి తీరిగ్గా స్నానానికని లేచాడు.

చెల్లాయి జిహ్వాచాపల్యంకొద్దీ అర్టిపండుకోసం అత్తంమీదకు వంగి ఒక కాయ త్రుంపబోయింది. అది ఎట్లా పసిగట్టిందో కిటికీలోంచి మీదకు దుమికి చెంప ఛెళ్ళుమనేలా వాయించేసింది.

భయంతో మంచంవరకూ వెంతి 'రారో అన్నయ్యా. ఈ వదిన పీకుతుంటేమో—బాబో...' అంటూ దుప్పటి లాక్కుని వళ్ళు కప్పుకు మంచం ఎకుమెక్కి కూర్చుంది.

శాస్త్రి వచ్చి దాని రెండు చెవులూ పుచ్చుకుని మెలేసి 'జాగ్రత్త' అని వురిమాడు.

సరస్వతి అని దానికి నామకరణం చేయటం జరిగాక ఒక వారంరోజులు అహర్నిశలూ తిప్పలు పడి దాని కా పేరు అలవాటుచేయటం జరిగింది.

పెంపుడుకూతురుకు జరిగే గౌరవ మర్యాదలన్నీ దానికి జరుగ నారంభించాయి. ఒక యినపగొలుసు, ఒక పింగాణీకంచం యిత్తడి సూ ప్రత్యేకంగా కొనటం జరిగింది. ఇక్కడకు వచ్చాక మంచి పోషణా అదీ వుండేమో బంతిలా తయారైంది.

శాస్త్రి ఆఫీసుకు వెళ్ళగానే చెల్లాయి కూడా కూడా తిరిగేది. రేగిపళ్ళు వస్తే రేగుపండ్లు, జామి కాయలు ఒకటేమిటి ఏది పడితే అది పుష్కలంగా దానికి పడేసేవారు.

చెల్లాయి వొదినా అన్నా అది వెనుదిరిగి ఎగురుకుంటూ వచ్చి ప్రక్కను కూర్చునేది. దానికి శాస్త్రి రాక కూడా తెలుసును.

'అన్నయ్య వస్తున్నాడేమో చూడు......' అనటం తడవుగా మెట్లన్నీ ఎక్కి అతని గది కిటికీలోకి ఎగిరి కూర్చొని, వచ్చేపోయే గొడుగుల్నీ, ముఖాల్నీ పరిశీలిస్తూ ఆతృతగా చూసేది.

శాస్త్రి గొడుగు దానికి బాగా గుర్తు. చెల్లాయికి దాన్ని ముఖంలోని సంతోషాన్ని చూస్తూంటే, అతని రాకకు సూచనగా ఆ గొడుగును పీధిమలుపులో చూడ్డంతో దాని కిచకిచల హడావిడికి ఎంతో ఆశ్చర్యం వేసేది.

అతను గడపదాకా రావటంతడవు ఆ గొడుగును లాక్కుని యీడ్చుకుంటూ యిల్లంతా అలంగం తిరిగేది. శాస్త్రి దాన్ని విడిచి ఒక్క నిమిషం కూడా వుండేవాడు కాదు.

స్నానాలగదిలోకి వెళ్ళితే అక్కడకూ, దుస్తులు మార్చుకుంటూంటే ఆ చోటుకీ, వ్రాసుకుంటున్నప్పుడు బల్లమీదా కూర్చునేది.

ప్రత్యేకంగా పువ్వుల సిల్కు జుబ్బాలు ఎన్నో కుట్టించాడు అతను దానికోసం. చెల్లాయి చిన్న చిన్న గళ్ళ పరికిణీలు తయారుచేసి వాటిని తొడిగి అతను వచ్చే సమయానికి ముస్తాబు పూర్తిచేసి తీగ్గా వుంచేది.

తీరికసమయాల్లో దానికి కొన్ని మనుష్యుల అలవాట్లను నేర్పారు. ఏదన్నా తిన్నాక చేతుల్తో మూతి తుడుచుకుంటుంది. తన వస్తువుల్ని యితరులను వాడనివ్వదు. తనవి కానివి ముట్టుకోదు. పరికిణీ చొక్కా అసహ్యంగా మాపుకోదు.

శాస్త్రి స్నేహితు లెవరైనా వస్తే వాళ్ల వళ్లో వరకూ కూడా వుండేది. రాను రాను సాయంత్రాలు బీచికి షికారుకు వెళ్ళటం కూడా అలవాటయింది.

సబ్బుబిళ్ళ తువ్వాలు చేతికిస్తే అది శాస్త్రికి పట్టుకెళ్ళి యిచ్చేది.

ఒకరోజున శెనగలు, ఒకరోజున అరిటిపళ్లు, కారప్పూసలాటి వస్తువుల్ని రోజూ ఎవరో వకరు తెచ్చి బీచ్చిలో తినిపిస్తూండేవారు. శాస్త్రికి కోపం రావటం కూడా దానికి తెలుసు.

పెద్ద పెద్ద కెరటాలు ఎగురుకుంటూ కట్టను డీకొంటున్నప్పుడల్లా కుప్పించి కుప్పించి యిసుకలో ఎన్నిరకాల ఆటలలో ఆడేది.

శాస్త్రి మిసెస్ను బీచ్చికి రాకపోతే, ఆ రోజు మాత్రం ఎవరిళ్ళకు వాళ్లు పెందరాళే చేరుకునేవారు.

తరువాత చెలాయిని జెజ్ దొరికినందున ఆసుపత్రిలో చేర్పించటం జరిగింది. ముగ్గురికీ కొరియరు వచ్చేది. శాస్త్రి పుష్కలంగా డబ్బు ఖర్చుపెట్ట నారంభించాడు. స్వయానా రెండు చేతులా చాకిరీకి దిగాడు. కొరియరు తీసుకెళ్ళటంనుంచి నీళ్లుతోడ్డం యిల్లు సర్దుకోవటంవరకూ పైనే పడింది. ఒక్కొక్క రాయి చొప్పున తీస్తుంటే కొండైనా తరుగుతుంది యిదొక లెక్కా అనుకున్నాడు లోపల.

## 3

ఒకమారు నిత్యజీవితము, అందులోని యాతనలు తాపత్రయాలనుంచి బైటకు వచ్చిపడ్డాక—ఊపిరి పీల్చుకుంటును స్వేచ్ఛగా, యేమేమి చేతామని లోపల వుంటుందో, వాట్నన్నిటిని ఆచరణలో పెట్టుకుందుకు సరస్వతికి యిప్పుడు వీలు చిక్కిందనే చెప్పాలి.

ఆలోచనలు పరుగెత్తినంత వేగంగా మనుష్యులు కూడా పరుగెత్తటానికి వీల్లేని గట్టి చిక్కొచ్చి పడింది.

సరస్వతికి చేతిలో డబ్బు లేదు. పది రూపాయలు వుంటేమాత్రం—అది ఏ మూలకూ చాలదు.

మాటమీద మాట అనుకున్న తరువాత 'శాస్త్రి' మాత్రం ఏ సౌకర్యమూ, మంచీ–చెడ్డా అన్నది చూడకుండానే వీధిలో కెళ్ళిపోయాడు.

అట్లాటి మనిషిని ఏమని అడుగుతుంది? ఎంత పరాధీనపు బ్రతుకైనా—తానుగా యిప్పుడు సకిలించి సింహగర్జనలు చేసింది!

వాల్తేరు స్టేషనులో పెట్టి, హోల్డాలు, మర చెంబు, సజ్జబుట్ట రైలులోకి స్టేషనుకూలీ ఎక్కిస్తూన్నప్పుడు 'సరస్వతి' యిలాగనుకున్నది—'ఆయనకు ఆ వచ్చే కోపం ఎల్లానూ వచ్చింది. పోతే పొమ్మని విసురుగా అనేవాడు జేబులోంచి పదో పదిహేనో తీసి నా మొహాన ఎందుకు కొట్టలేదూ' అని.

ఆ వెళ్ళటం తిన్నగా ప్రసాదరావు దగ్గరకు—ఒక్కగాని ఒక్క చెల్లెలు తను. చూసి కూడా ఎన్నో రోజులయింది. అక్కడ వుంటే దేనికీ అంతగా యిబ్బంది వుండదు. ఈ తిక్క కుదిరాక అప్పుడు చూసుకోవచ్చును. అంతగా కుదరక, అన్నగారి యింట్లో వుండటం యిష్టం లేకపోతుందీ, ఒక కార్డుముక్క గిలికిపారేస్తే తండ్రి వచ్చి పువ్వుల్లో పెట్టినట్లు తీసికెళ్ళడూ—

సరస్వతి ఆలోచించినట్లు వర్తించినట్లు ప్రాజ్ఞురాలైన స్త్రీ ఎవ్వతీ ఆలోచించదు.

స్వర్గం కానీ, నరకం కానీ, సుఖం కానీ, దుఃఖం కానీ—తనూ, తన యిల్లు తన సంసారమే, తనది కాని—యిది కాదని మరోకచోట, అది కాదని యింకొకచోటకూ, కుప్పిగంతులు వేస్తూ—పరుగెత్తటం వానర వనితలకే చెల్లుతుంది కాని మనుష్యులకు సామాన్య సంసారులకూ కాదు.

అట్లా అని సరస్వతిని పూర్తిగా కోతిని చేసి వదలటానికి వీల్లేదు. ప్రపంచంలో ఒక రకం స్త్రీలున్నారు వారికి తమ యిల్లు తమ సంసారము తమ చుట్టూ మనుష్యులు నచ్చారు. అదుగో వాళ్ళ మనషి చేత కట్టెలు తెప్పించుకున్నారు అవి ఎంతకట్టెలు—మరి మీరు పెట్టే పచ్చిమొద్దులు—ముఖాన్ని బట్టి అమ్మతారు కాబోలు అరిపిలో—యిట్లాటి మాటలాడే వ్యక్తులు అస్తమానూ పొరుగింటి పుల్లకూర రుచి అనుకుంటారు.

చంటిపిల్లడ్ని తీసుకుని బెజవాడ వచ్చాక అనుకున్నట్లుగానే తన జీవితపు ఆరుకాయలు పూవు పువ్వులుగా సాగుతున్నట్లు సరస్వతికి తోచింది.

ప్రసాదరావుకు రెండు చేతులా గట్టి సంపాదన వుంది. తినటానికి వెనుక పదిమంది ఎవ్వరూ లేరు. లింగూ లిటుకూ మంటూ యిద్దరు.

తీగల తంపరలాగ పిల్లలా—లేరు.

అదృష్టవంతులైన జొన్నున మాణిక్యం పెట్టుకు పుట్టిన స్త్రీ ఎంత సుఖపడ్తుందో—ఆ యింట్లో ఆ వదినగార్ని చూసి తెల్సుకోవచ్చును అనుకుంది సరస్వతి.

ఆవిడకు రవ్వల ముక్కుపుడక – రెండు జతల రవ్వల దుద్దులు వున్నాయి. సాయంత్రం కట్టిన చీర మళ్ళీ వుదయం కట్టదు. ముద్దులేని ముక్కారు నగలు. కోరిన బట్టా కోరిన నగా తెస్తాడు అన్నయ్య.

సరస్వతి తన వదినగార్ని తెల్సుకున్నప్పుడు ఆవిడ వైభోగాన్ని గుణించుకుంటున్నప్పుడు—తన విశాఖపట్నంలోని రెండుగదుల డాబాయిల్లు—ఒకటి క్రింద, ఒకటి పైన—నల్లగా మాసిన కిటికీలు, గళ్ళు లేని తలగడాలు, ఒకటి వుంటే ఒకటి లేని సంసారం—యిందుకు పైగా ఏ నాలుగు రూపాయలన్నా జాగ్రత్త చేసుకుందామనే ఆలోచనే లేని తన భర్త అన్నీ జ్ఞాపకానికొచ్చేవి.

చక్కగా వీధినుంచి ఏ వస్తువు కావల్సినా తెచ్చిపడేసేందుకు నవుకరు కుర్రవాడున్నాడు. వాడే చంటిపిల్లడ్నికూడా ఎత్తుకుని ఆడించసాగాడు.

రోజూ సాయంకాలం ఏ సినిమాకో పాటకచ్చేరీకో లేడీస్ క్లబ్బుకో పోతూండవచ్చు.

ఈ సౌఖ్యాన్ని కొద్దికొద్దిగా అనుభవిస్తూ మధ్యమధ్యన, చెమటలు కారే ముఖంతో ఎడా పెడా మూటలు సంచులు మోసుకుంటూ యింటికి వచ్చే శాస్త్రి ముఖం, గుర్తుకువచ్చినప్పుడల్లా ఎవరో ఎక్కడ్నుంచో బలంగా విసిరిన రాయి వచ్చి గుండెలకు తగిలితే ఎలా వుంటుందో, అంతకన్నా ఎక్కువే బాధపడాల్సివచ్చేది.

వచ్చిన వారం రోజులకు పిల్లడికి సుస్తీచేసింది. డాక్టరు వచ్చి మందిచ్చాక పదిరోజులకు తగ్గింది. ఎంత పోషణ బాగున్నా వాడు ఎండలకు తట్టుకోలేక నీరసిల్లాడు. వాడికి తగ్గిందో లేదో రెండు రోజులు తలనొప్పి—ఎల్లాగో అనిపించి లేచి కూడా పడకెయ్యాల్సొచ్చింది. సరస్వతి కూడా పది పదిహేను లంఘనాలు చేసి పూచికపుల్లయి కూర్చుంది. ప్రసాదరావు అవీ యివీ తెస్తున్నాడు. జాగ్రత్తగానే చూస్తున్నారు. ఇట్లా రెండువారాలు కూడా పూర్తికావచ్చింది. కాని యిట్నుంచీ అట్నుంచీ కాకి కూడా కదల్టం లేదు. జ్వరం తగ్గింది. అస్తమానం డీలయిపోయినట్టుగా అనిపించేది లోలోపల.

లంఘనాలు చేశాక జుట్టు కూడా రాలిపోతూంటే బక్కపలచగా అంటుకుపోయినట్లున్న ముఖాన్ని మాటిమాటికి అద్దంలో చూసుకుంటూ 'ఎంత వికృతంగా వున్నానూ—' అనుకోసాగింది సరస్వతి.

ప్రసాదరావు స్నేహితుల్తో ముందు వరండాలో పెద్దగా నవ్వుతూ పిచ్చాపాటీ ఆడుతున్నాడు.

చంటిపిల్లవాడు మధ్యగదిలో చాపమీద పడుకున్నవాడల్లా వున్నట్లుండి లేచి పెద్దపెట్టున రాగాలాపనకు లంకించుకున్నాడు.

వదిన కాఫీకుంపటి దగ్గర కూర్చుని తెల్లారిలేచాక మూడోమారు అతిథులకోసం కాఫీ సరంజామాలో మునిగి తేలుతున్నట్లుంది.

సరస్వతి అంతక్రితమే తలంటిపోసుకుని దొడ్లో అరుగుమీద కూర్చుని తలకు చిక్కు తీసుకుంటున్నది పిల్లడి బాకాగొంతుక వినిపించి కూడా నీరసంతో లేవలేక ఏడవనీ అనుకుని మళ్ళీ దువ్వెన జుట్టులోకి పోనిచ్చి ఒక్కొక్కమారు ఎంత జుట్టు నష్టమవుతున్నదో చూసుకుంటూ దిగులుగా చతికిలబడిపోయింది.

అంతక్రితమే ప్రసాదరావు సిగరెట్లు కిళ్ళీలు తెమ్మని పురమాయించటంవల్ల వెళ్ళిన నౌకరు కుర్రాడు లేడు ఏడిచే పిల్లవాడ్ని ఎత్తుకునేటందుకు.

ఎవరో ఒకరు ఎత్తుకుంటారులే అనుకుని వూరుకుంది సరస్వతి. మధ్యలో కాఫీ కాస్తున్న వదిన 'రావమ్మా—ఆకలికి కాబోలు పిల్లవాడేడుస్తున్నట్లున్నాడు' అని ఒక చిన్న కేక కూడా వేసింది.

సరస్వతికి లేవక తప్పింది కాదు. లేచి అలమార్లో పాలడబ్బా యివతలకు లాగి మూత తెరిచింది. దానినిండా చీమలు. కాస్తో కూస్తో మిగిలివున్న పాల గుండను కాస్తా అవి కాజేసినై. నాలిక కర్చుకుంటూ చాపవద్దకు వచ్చింది.

పిల్లవాడు పెద్దపుక్క పట్టాడు. ఎత్తుకుని దొడ్లోకి వద్దామనుకుంటోంది.

'ఇంట్లో ఎవరూ లేరా — అవతల పెద్ద మనుష్యులు మాట్లాడుతూంటే—యీ గోల యిదేమిటి? కాస్త ఎత్తుకోలేరూ ఏడ్చే పిల్లవాడ్ని?' అంటూ వచ్చాడు ప్రసాదరావు.

పాలడబ్బా అయిపోయిందని చెప్పటానికి సరస్వతికి నోరు రాలేదు. చెప్పరాని భయం వేసింది. కాఫీకప్పుల్ని ట్రేలో వుంచుతూ వదిన 'ఏమిటి చెయ్యమంటారు మధ్యాహ్నానికి. రెండు కూరలూ ఒక పచ్చడి చాలనా—'

'సగ్గుబియ్యపు పరమాన్నం చేసి వడలు చెయ్యి. అమ్మాయీ నీకు వడలు చెయ్యటం బాగా వచ్చు గదుటే—'

సరస్వతి గడప దాటుతూ 'అట్లాగే—' అన్నది.

'ఏవిటా—ఆవిడవల్ల యేమవుతుంది?' అన్నట్లు ప్రసాదరావు ముఖంలోనికి చూసింది వదిన.

సరస్వతి తనదగ్గర పాలు యిచ్చి వూరుకోబెట్టడానికి ప్రయత్నించి విఫలురాలైంది. తన దగ్గర కూడా లేవు. ఎండిన తన రొమ్ములను కాస్సేపు చప్పరించిన కుర్రకుంక కోపంగా అంగుటి బిగించి నముల్తూ మళ్ళీ బాకా ఎత్తాడు.

సరస్వతికి బక్క కోపం వచ్చి నాలుగు మొత్తింది.

'ఎందుకమ్మా వదినా—దేనికట్లా వాణ్ని బాదుతావు? నీకేమన్నా మతిపోతోందా?' అంటూ వచ్చింది నవ్వుతూ వదినె.

అల్లాగే వుంది అన్నట్లుగా దీనంగా చూసింది.

సరస్వతికి ఏమీ పాలుపోలేదు. ఆత్మాభిమానం అడ్డువస్తున్నా తెగేసి చెప్పింది—'పాలడబ్బా ఆఖరయిందని.'

'ఐతే వుండు. మీ అన్నయ్యను పంపిస్తాను.' అని చక్కా వెళ్లిపోయింది ఆవిడ వాకిట్లోకి.

సరస్వతికి మొదటిసారి కన్నీరు చెంపలమెంబడి కారింది. చెప్ప నవుసరం లేకుండా ఎక్కడో అప్పన్నా పుట్టించి పాలడబ్బాలు తెచ్చే శాస్త్రి చేతులు—అవి ఎంతదూరాన వున్నాయో జ్ఞప్తికొచ్చి బెంబేలు పడ్డది మనస్సు.

అభిమానం - దేనికోసమైతే యింతవరకూ గ్రంథాన్ని పెంచుకునివచ్చిందో అది కాస్తా బుగ్గయేలా 'అది కావాలి – యిది కావాలని యితరులను అడగాల్సి వస్తోంది.'

వొదిన చెప్పాలనే వెళ్లిపోయింది కాని తీరా చెప్పటానికి వీల్లేకుండా చుట్టూ ఎవరెవరో మనుష్యులూ – ఏవేవో వ్యవహారాలు మాట్లాడుకుంటున్నారు. మళ్ళీ వుత్తచేతుల్తో వెనక్కు వచ్చింది.

ఏడిచి ఏడిచి పిల్లవాడు వుత్తమాపులు. చూస్తున్నాడు. కాస్త కాఫీ పట్టారు ఎల్లాగో వాడికి. నౌకరు కుర్రాడు సరిగ్గా పన్నెండు కొట్టాకవచ్చాడు 'అన్నానికెళ్తా వండమ్మగారూ—' అంటూ.

'పాలడబ్బా తెచ్చి వెళ్ళమని' డబ్బులిచ్చింది వదినె.

ఆ డబ్బు లుచ్చుకుని అదేపోతాన పోయాడు. వాడు మళ్ళా రాలేదు. పాలడబ్బా లేదు. పిల్లవాడి కడుపు వెన్నునంటుకుపోయింది. వాడు ఆకలితో అఘోరిస్తూంటే సరస్వతికి అన్న మెట్లా వెళ్తుంది లోపలికి. ఆమె భోంచెయ్యలేదు. అందుకని వదినె కూడా మానింది.

ప్రసాదరావూ అతిథులూ టంచనుగా పన్నెండున్నర కొట్టాక పీటలమీదకు దిగారు. వదినే వడ్డనంతా చేసింది. సరస్వతి బయట మంచాలు పరిచి పక్కలు వేసింది.

భోజనాలయాక రికార్డులు పెట్టటంకోసం పడకగదిలోని రేడియోవద్దకు వచ్చాడు ప్రసాదరావు. అప్పుడు యావత్తు కథా వదినె అతడి చెవిని వేసింది. అతను మండిపడ్డాడు. ఇంటికి వెళ్లి నౌకరు వెధవను జుట్టుపట్టుకు తంతా నన్నాడు. తన్నడం కాదు మనకు కావలసినది ముందు పాలు అని చెప్పాక ఎకాఎకీ మధ్యాహ్నపు టెండలో బజారుకు పోయాడు. కొట్లన్నీ కట్టేసి వున్నాయి. అటూ యిటూ తిరిగి పిల్లలుగల ఒక స్నేహితుడియిల్లు పట్టుకుని ఒక చిన్న సంచీలో కాస్త రెండుపూటలకు సరిపడ్డ పాలపిండి ముష్టెత్తి తెచ్చియిచ్చాడు అప్పుడతని వాలకం చూడ్డానికి సరస్వతికే భయం వేసింది. ఇద్దర్నీ కలిపి చెడామడా నాలుగు దులిపాడు.

అప్పుడే కొద్దిగా కోలుకుంటున్న వైశాఖ మాసం. ఎడగాడ్పూ పెడగాడ్పూనూ. వుండివుండి ఆ కాలంలో వానకూడా కురవసాగింది. సరస్వతికి ఏమీ తోచలేదు. నీరసంగావుండి యేపనీ ముట్టుకుందామనే అనిపించేదికాదు.

పాలుత్రాగాక కాస్సేపు యేడ్చి అట్టే నిద్రపోయాడు పిల్లవాడు. నెమ్మదిగా వోపిక చేసుకుని మెట్లన్నీ యెక్కి డాబామీదకు వెళ్లింది. అక్కడా ఎండకు గచ్చంతా మాడివుందేమో భగభగమంటోంది.

పిట్టగోడవారనే నెమ్మదిగా నడుస్తూ, ఆకాశాన యిళ్ళకు మళ్లిపోతూ గోలచేసే పక్షులగుంపులు, చెట్టాపట్టాలు వేసుకుని వూసులాడుకుంటూ షికార్లు కొట్టే స్నేహితుల్లా అక్కడక్కడ జంటలు జంటలుగా మేఘాలు—అంతకు తప్పించి యేమీలేదు. పశ్చిమాద్రిని ఎర్రటి సూర్యబింబం మునిగిపోతున్నది. దూరాన రోడ్డుమీది మనుష్యులు, వాహనాలు చిన్న చిన్న బొమ్మల్లా అగపడసాగారు. సరస్వతి మెల్లగా పిట్టగోడ అంచుమీద శరీరాన్ని మోపి రవికలో దాచిన చిన్న వుత్తరాన్ని మడతలువిప్పి చదువ సాగింది. మధ్యమధ్యలో నిదానంగా యిటూ అటూ చూస్తూ, మళ్ళీ వుత్తరం చదవటాన్నిబట్టి అది ఆమె యే మూడవసారో నాలుగవసారో అయివుంటుంది—ఆమె ముఖం కొద్దిగా కుంచించుకుంది. అటు తరువాత కాస్త ఎర్రబడ్డది. మళ్ళీ కొంచెం యావ

లకువచ్చి రెండు చేతులూ వెనక్కు మడిచి ఆలోచిస్తూ నిలబడ్డది. ఒకటికి రెండుమార్లు క్రింది పెదిమను కొరుకుతూ వెనక్కు విరిచిన చేతుల్తోనే పచార్లు చేయ నారంభించింది.

ఆ అవస్థలో ఆమె వదినరాకను గుర్తించివుండ లేదు. ఆవిడ కాఫీకలరు కోయంబత్తూరు చీర నాజూగ్గాకట్టి తలలో చిన్న సన్నజాజిచెండును వుంచి మిగతా పూలను యివ్వటంకోసమంటూ, సరస్వతికోసం యిక్కడా అక్కడా వెతుకులాడి, చివరకు డాబామీద ఎవరో మనుష్యుల చప్పుడుకాగా ఆ అలికిడికి పైకి చప్పుడవచ్చింది.

సరస్వతిని దూరాన్నుంచి చూడగానే చిన్న తమాషా చేయాలని ఆవిడ పిల్లిలా అడుగులో అడుగులు వేసుకుంటూవచ్చి వెనుకనుంచి చేతిలోని కౌగిలిన్ని చప్పున లాక్కుంది.

సరస్వతి తెల్ల తెలబోతూ 'నువ్వా వదినా... ఎవరో అనుకుని ఎంత హడిలిపోయాను—' ఆ అనటంలో లోపల ఏదో దాపరికం వున్నట్లు తేలిగ్గా యివతలవాళ్ళకు తెలిసిపోతోంది.

'ఈ కౌగిలం విప్పనా.'—

సరస్వతి నేరస్థురాలిలా చూస్తూ వూరుకుంది. పులక లేదు. పలక లేదు.

వొదిన లేనిచొరవను తెచ్చుకుంటూ—'ఎందుకు నువ్వు అస్తమానూ వొంటరిగా ఉసురుగా ఆలోచిస్తూంటావు? నీ కేదన్నా, కావలిస్తే నాతో జెప్పవు... నాకు తెలుసులే—నీకు యిక్కడే యింత మొహమాటం...'

సరస్వతి యీ మాటలాడే మనిషి అంతస్సులోకి చూడాలనుకుని పరిశీలనగా—'అదికాదు వదినా—నా కిక్కడేంలోటు? అడక్కుండానే అన్నీ అమర్చే వదినె... నాకోసం ముస్తైత్తడానికి కూడా వెనుదీయని అన్నగారూ... యింకా ఏమన్నా వుంటే నావల్లేవుండాలి లోసుగు...'

'అడిగినదానికి. సూటిగా జవాబుచెప్పు? నీ మనస్సులో ఏదో కదుల్తూవుంటుంది అస్తమానూ—అవునా...'

సరస్వతి, పిట్టగోడమీద చేతులాన్చుతూ—'ఏం చెప్పగలను—ఏం చెప్పమంటావు వదినా—' అంటూ శూన్యంలోకి చూసింది.

'పిచ్చిదానా—నాకు తెలుసు. ఇవ్వాళ అన్నయ్య నాకంతా చెప్పారు.'

సరస్వతి చప్పున వెనుదిరిగి 'అన్నయ్యా...' అని నోరు ఆవులించి పిచ్చిగా అథఃపాతాళానికి కృంగిపోతున్నట్లు అయోమయపు చూపులు చూసింది.

వొదిన సన్నజాజిచెండును మడిచి తల్లో వుంచుతూ బుజంమీద చిన్న చిటికె వేసి—'ఐతే నువ్వు పచ్చిదొంగవు సుమా—నీకు జ్వరంకూడా ఎందుకువచ్చిందో నా కిప్పుడిప్పుడు కొంచెం మర్థమవుతూవుంది. అట్లాటి దేదైనావుంటే నకన్నా కాస్త పెద్దగదా యింతముక్క నా చెవిని ఎందుకు వేశావు కాదూ?'

'ఏముక్క—' సరస్వతి అసంబద్ధమైన ఆలోచనల కూడికలోంచి తెప్పరిలలేక తలనుదించుకునే అనేసింది.

'అదే—నాకు తెలీదనుకున్నావా ఏం? అతను నిన్ను పెళ్ళిచేసుకుంటానని గసిరిన సంగతీ అదీను.'

పెళ్ళిచేస్తానా—అప్పను అన్నారు. అంటే వచ్చేశాను.'

'పోనీ స్టేషనుకు వచ్చినా టెకట్టూ అదీ కొని యిచ్చాడా—'

నాదగ్గరే పదరూపాయలుంటే, పోర్టర్ని బ్రతిమాలి కొనిపించుకున్నాను.'

చీకటి మసగ్గా అలుముకొంటున్నది. ఆకాశంలో కూడా, ఆలస్యంగా వెళ్ళే ఏ ఒకటిరెండు పక్షులో మినహా అంతా సంచారశూన్యంగా వుంది.

వొదిన ప్రశ్నాపత్రంలో కొన్ని చిక్కు ప్రశ్నల్ని వదిలేసి అడగటంవల్ల సరస్వతి తేలిగ్గా సమాధానాల్ని యివ్వగలిగింది.

చాలా నెమ్మదిగా—

'ఐతే యీ వుత్తరంకూడా చదవనా—'

సరస్వతికి 'యీ వుత్తరంకూడా—' అన్న లౌక్యపుపాడి—మెలిక విప్పుకోలేక బిత్తరపోతూ—ఇంకా యేమన్నా వున్నాయా జాబులు—'అని

ఆగింది. తన సంశయానికి అవతలి మనిషి తప్పుతీసుకుని నొచ్చుకుంటుందేమో అనుకుని.

'మా అన్నకు వ్రాసినవుత్తరం—అదే దాని మాటే,' సరస్వతి సగం ఆశ్చర్యాన్ని లోపలే అణచివేస్తూ—'ఈ వుత్తరం ఆయన వ్రాసింది కాదు' అనేసి ఆ అనటంలోనే తనకేమీ అభ్యంతరం లేనట్లు సూచించింది.

అటుతర్వాత యిద్దరూ డాబామీద కూర్చున్నారు. వొణికిన అనునయ కంఠంతో—తూచినట్లుగా 'నీవల్ల తప్పుంటదని నే నన్ను. కాని చటుక్కున అంత పేలిగ్గా వెళ్ళి పొమ్మని అనటం వుంటే, అగ్ని అభిమానముష్న ఆడదానికి ప్రాణం తీసేసినట్లే'

'వూఁ.. '

'అదీగాక నీలో మీకు యింత వైముఖ్యం రావటానికి తగినంత పెద్దకారణం నా కేమీ గోచరించటం లేదు కూడాను.'

సరస్వతి వూగాడ్తోంది కాని ఆ పెద్దకారణ మేదో బయటపెట్టలేక పోతోంది 'వొణికిన చాకచక్యంగా మళ్లీ అందుకుంది—

'అం తెందుకు? మా అన్నయ్య వున్నారా—అంతంగా చనువుయిస్తూన్నట్టగపడ్తారు కాని, అబ్బో సమయంవస్తే ఆయనముట్టుకు ఎంత మగతనం చలాయిస్తారని ?'

'అల్లాగా—' అని యింకా చెప్పమన్నట్లు చూసింది సరస్వతి 'మావంశంలో వున్నదే ఒక గుణం, నీకు కోపం రాదంటే చెబుతాను.' సరస్వతి మందహాసంగా 'చెప్పు. నాకు కోప మెందుకు ?'

'మొండిపట్టుదల. కోపం. అవతలివాళ్ళ పరిస్థితీ మంచిచెడ్డ—కూడా ఆలోచించకుండా తామనుకోరినట్లే ఎందుకు జరక్కపోవాలీ అని పంతగించుకోవటం మామూలే—'

సరస్వతి లోపల యిలా అనుకోసాగింది—యీ వరసను తన్ను దెప్పటం లేదుకదా, ఏమో! అవును వున్నమాటంటే తనెందుకు వులికులికి పడాలి!

'అది కాదమ్మా—ఆరోజు ఆయనగారికి తలనొప్పి జ్వరమట. ఆ సంగతి నాకెలా తెలుస్తుంది చెప్పు. మధ్యాహ్నం వెళ్లేముందు క్లబ్బుకు యివ్వాళ వెళ్తున్నానని చెప్పి మరీ స్త్రీ సమాజానికెళ్ళాను. ఆరోజు చాలామంది కలియటంవల్ల ఆమాటా యీమాటా చెప్పుకుంటూ కూర్చుండి పోయాం బయట చల్లగావుంటే కొంత్సరి చెట్లనీడను పేము కుర్చీలు లాక్కుని. నా చిన్ననాటి స్నేహితులు ఒకరిద్దరు కలిశారు. చెప్పొద్దూ—ఆరోజు బాగా తొమ్మిది దాటాకే యింటికొచ్చాను. తప్పల్లా కొంచెం ఆలస్యంగా యింటికి రావటం—తను అంత క్రితం ఎన్నిమాట్లో రెండో ఆట సినిమాకు వెళ్ళి కూడా అర్ధరాత్రి అపరాత్రి రావటం లేదూ—అవన్నీ పట్టించుకుంటామా ? దాన్తో మొదలెట్టారు ఎక్కసక్కాలు—మగవాడు తిరక్క చెడితే తిరిగి చెడిందట. నాకు వొళ్లు మండి నాలుగురోజులు యేడుస్తూ పడుకున్నాను. ఎందుకులే అన్న మాటక్క అనలేదు. పలకరించిన పాపాన పోలేదు. అంతటితో వూరుకోవచ్చునా వుండనీయక కారం జల్లినట్లు అమ్మకు పనివేళా ఒక కొంటెవుత్తరం రాశారు. అసలే ఆవిడ అంతమాత్రం. అల్లుడు కూడా వ్రాశాక నాకు హితోపదేశాలు చెబుతూ చాట భాగతమంత జాబు వ్రాసింది. ఇదేమిటని ఆయన్ను అడిగితే వకవకా పకపకానవ్వు—మంచీ చెడ్డా వుంటేనా... వూరుకోలేను. కోపం కొద్దీ అనేశాను. నేనేమి కాపురాలు త్రవ్వుకుని లేచిపోయే మనిషి ననుకున్నారా—యింత కుళ్లు మీ కడుపులో పెట్టుకుని ఎందుకొచ్చినట్టు కారమని—'

సరస్వతి సావధానంగా విన్నాక తన కథతో పోల్చుకోకుండా వుండలేకపోయింది. ఎంత వద్దనుకున్నా తన విషయానికొచ్చేసరికి తప్పంతా అవతలి వ్యక్తిదైనట్టుగా వాదించటానికి అంతరాత్మ సమ్మతించటం లేదు. మిరా రావప్పటం లేదు.

'లేద్దామా సరూ...' అంటూండగానే 'అమ్మో—పిల్లాడ్ని వొక్కడ్ని వదిలేసి వచ్చామర్రా', అంటూ సరస్వతి గబాగబా మెట్లు దిగింది.

లోపల అన్నగారు ఎత్తుకుని ఆడిస్తున్న వాడల్లా సరస్వతిని చూడ్డంతో 'యింకే—అమ్మొయ్యా' అని అందవ్వపోయాడు.

సరస్వతికి నవనాడుల్నా కృంగినట్లయి తలకాయ వాల్చి తప్పుచేసిన మనిషిలా పిల్లడ్ని అందుకుని

అక్కడ నిల్చోకుండా నాలుగంగల్లో దొడ్లోకిపరు గెత్తుకొచ్చేసింది.

వొదిన సరస్వతి చేతులోంచి లాక్కున్న కాగితం ముక్క ను చదవాలనే కుతూహలంతో నేరుగా పడకగదిలోకి వెళ్ళి బెడ్ లైట్ స్విచ్చి నొక్కి తలుపు వేసుకొని మెల్లగా కాగితపు మడ తలను విప్పసాగింది. ఆ రావటంలో మ ధ్య గదిలో కుర్చీలో కూర్చున్న ప్రసాదరావును కూడా ఆమె గమనించ లేదు.

ఎటువైపునుంచి వచ్చాడో ప్రసాదరావు గ్రద్దలా ఆ వుత్తరాన్ని కొట్టేసుకున్న కర్చుకుని నిశ్చలంగా వుడాయించే యత్నంలో వున్నాడు.

ఆమెకు చాలా కోపంవచ్చిందనే చెప్పాలి. పరుషంగా—'నామీద వొట్టే అని మీరు గనుక చదివితే...'

'ఇందులో యేమిటి వుంది?'

'నాకు తెలీదు.'

'ఇది పచ్చిఅబద్ధం. కానీ ఎక్కడ్నుంచి...'

ఆమె యింకా కోపంగా—' ఎక్కడ్నుంచా నా శ్రాద్ధంనుంచి'

'అదికూడా నేనే పెట్టాలి. నాకు శ్రాద్ధం పెట్టే వాడు కలిగేవరకూ నీకు శ్రాద్ధం కావాలనుకోకు.'

'ఏమిటి సంధమంటూ లేని కూర్చుని చావుల మీదకు పోతున్నారు' అంటూ వచ్చింది సరస్వతి. ఈ ముక్కలు అనే ధైర్యం ఎట్లా వచ్చిందో ఆ నకు అర్థంకాలేదు. ఆశ్చర్యంతో— 'ఏదీ ఆవిడ వుత్తరం ఆవిడ కిచ్చెయ్యండి.' ప్రసాదరావు రూక్షంగా— 'ఐతే ఆవిడ వుత్తరం నువ్వెందుకు తీసుకుని చక్కగా మడతల్ని విప్పి కులుకుతూ చదువుతున్నావు?'

'నేనేమీ చదవలేదు.'

సరస్వతి యిద్దరితగూ తీక్ష్ణ ధోరణిలో— 'నేనే యిచ్చానురా బాబూ—అందులో యేమీ లేదు. మా ఆడబడుచు చెల్లాయి వ్రాసింది.'

కథ అడ్డం తిరిగిందేమనుకుని—

'చెల్లాయా...యింకా మీ ఆయన చార్జిషీటు యిచ్చాడేమో ననుకున్నాను నేను.'

ప్రసాదరావు మెల్లగా జారుకోబోతున్నాడు. వదిన గమనుతినంగా 'పాపం! ఎందుకు జారు కుంటున్నారు. ఏమి వ్రాసిందో మీరు కూడా వినండి. ఆనక మళ్ళీ నేను ఫలానా అని చెబితే సమ్మేస్థితిలో వుండరు.' అనేసి నవ్వుతూ 'చిన్న వుత్తరమ్మురా— పెదసలుతో వ్రాసింది పాపం, చదువుతాను—ము ల.స, వొదినకు చెల్లాయి నమస్కా రములు. అంతా క్షేమం. మీ క్షేమం, చంటివాడి క్షేమం జాబ్తిగా తెలియటంలేదు. అన్నయ్య రోజు రోజుకీ మారిపోతున్నాడు. నాకు భయం వేస్తున్నది. ఈ మధ్యన నువ్వు వస్తావనుకుని స్టేషనుకు వెళ్ళాడు. సరే—తవేం వస్తూ దారిలో ఒక కోతిని పట్టు కొచ్చాడు. దానికోసం ఎంత డబ్బు ఖర్చు పెడు తున్నాడో చెప్పటానికి వీల్లేదు. నేనూ మొదట్లో కాలక్షేపంగా ఎంతో సరదాపడ్డాను కాని ఆ ప్రవ ర్తన చూస్తున్నకొద్దీ ఎందుకో నాకే దిగులు వేస్తున్నది. ఆ కోతి తెచ్చాడన్నా నా— దానికి నీ పేరు పెట్టాడు. అందరితో అది నా భార్య —చాలా విశ్వాసంగా వుంటుంది. అని చెబుతూంటాడు. ఇదంతా చూస్తూంటే నాకు నువ్వు ఎంత చప్పనవ సే అంత మంచిదని తోస్తోంది. నా ఆరోగ్యం కొంచెం బాగు. నావలన తప్పుంటే క్షమించివస్తావని తలుస్తాను. చిన్నవాన్నకు ముద్దులు. చెల్లాయివ్రాలు.

వుత్తరం చదివాక వొదిన ఏమీ మాట్లాడలేదు. సరస్వతి తలవాల్చి నేల చూపులు చూడసాగింది. ప్రసాదరావు స్తబ్దతను భంగపరుస్తూ—

'బావ రోజురోజుకీ అచ్చం కోతిలా మారి పోతున్నాడే—'

ఈ హాస్యానికి ఎవ్వరూ నవ్వలేదు. వదినె కఠినంగా చూసింది. ప్రసాదరావు సర్దుకుని 'వెళ్తావా—' అని సరస్వతికేసి చూశాడు.

ఆ వెళ్తావా అనటంలో దిగబెట్టివస్తాననే అర్థం ఎక్కడా సరస్వతికి తట్టలేదు. గ్రహించిన వదిన భర్త వాక్యాన్ని సర్దుతూ 'నీకు వెళ్ళటం యిష్టంగా వుండకపోతే ఎందుకు ఆయన్నే యిక్కడికు రప్పించే యేర్పాటు చేస్తేసరి!'

సరస్వతి వెంటనే 'వారు' అనేసి మళ్ళీ చప్పున సిగ్గుపడిపోయింది.

ప్రసాదరావు నవ్వాడు. 'నే నతను పంపమని వ్రాసినదానికి సమాధానం వ్రాయలేదు కూడా.'

సరస్వతి గాబరాగా తలెత్తింది. అంతవరకూ తన్ను పంపమంటూ జాబు వచ్చినట్లే ఆమెకు తెలియదు. చెల్లాయి వుత్తరం పూర్తిగా యిప్పుడు బోధ పడినట్లైంది.

ఆ రాత్రి పసిపిల్లణ్ని పక్కలో పెట్టుకుని యేడ్చినది యేడ్చినట్లే వుంది సరస్వతి. అప్పుడు యిల్లా అనుకోసాగింది—'నేనే పాపిష్టిదాన్ని. చేతులారా నా కష్టాలు నేను కొనితెచ్చుకున్నాను. మా అన్నయ్యా వదినా నన్నెంత గౌరవంగా చూస్తున్నారో చెల్లాయిని ఆయనట్లా చూసుకోవటం సహించలేకపోయాను. నా అసహనం నన్ను కోతిని చేసి పారేసింది. ఆయన కోతినితెచ్చి దానికి నా పేరెట్టారని అభిమానపడి యేం ప్రయోజనం? ఎవరు విన్నా చివరకు నేను చేసింది కోతిపని అంటారు? ఏ మొహం పెట్టుకుని నేను ఆ మహారాజు పంచలకు చేరుకునేది?' సరస్వతి ఆలోచనల బరువులో గొర్లిన గంటలను గుర్తించలేక, కోడికూతవిని అప్పుడే తెల్లారిందా అనుకోసాగింది.

# 4

బండీవచ్చి గుమ్మంముందు ఆగింది. చదువుతున్న పత్రిక పుటల్ని త్రిగించి ప్రసాదరావు ముందుకు చూశాడు. అప్పుడే ముగించి విడచిన కాఫీకప్పు నొత్తిగించటంకోసమని ప్రత్యేకంగా వచ్చిన వొదిన నోరు తెరచి విస్తుబోయి చూస్తున్నది.

మెట్లదాకా వచ్చాక — 'మేమేనర్రా—ఏవిటట్లా గుడ్లప్పగించి చూస్తున్నారు?' అంటూ పైకి రావటంకోసం వ్రూతకర్రను బలంగా నేలకు అదిమి చెనుకకు వినిపించేలా—

'అమ్మో—నువ్వుకూడా నాతో లుడుంగున యింట్లోకి జారబడకు. పడుచుదానివి యింకా, కొత్త సామాన్ను లోపలకు జేరవేయించు.'

వాక్యం ముగియకుండానే అవతల చేతులోని సిగరెట్టును బహు చాకచక్యంతో నులిమేసి లేస్తూ ప్రసాదరావు వాకిట్లోకి గబగబా నాలుగడుగులు వేశాడు.

గుమ్మంలో నిల్చున్న పార్వతమ్మ—'ఏంరా నాన్నా—కులాసా? కాశీ వెళ్దామని బయల్దేరదీక్షిస్తే పున్న పాళాన యిలా వచ్చేశాం. మీ నాన్న గారితో ఏదొచ్చినా నోట్లోమాట నోట్లో వుండగానే కావాలి పనులు. లేడికి లేచిందే పరుగు.'

'నువ్వు లోపలికి నడు—నేం చూస్తాన్లే...'

తరువాత జట్కావాలాతో చిన్న యుద్ధకాండ పావుగంటసేపు జరిపి డబ్బులు మొహాన్న విసిరి గొట్టాక, మెల్లగా లోనికి వచ్చారు ప్రబుద్ధుడు ప్రసాదరావు.

అప్పటికే తల్లీకూతుళ్ళ సాశ్చర్యసంభ్రమాభిమానాల్ని ప్రకటించుకోవటం కుశలప్రశ్నలవరకూ సంభాషణ రావటం జరిగింది.

ప్రసాదరావు వచ్చిచూసిన దృశ్యంయొక్క సందర్భం యిది.

సరస్వతి తల్లిని రెండుచేతుల్తో పట్టుకొని వెక్కి వెక్కి యేడుస్తున్నది. ముసలాయన చంకలోని పిల్లవాడు పండిన ఆయన మీసకట్టును చూసినంతసేపు చోద్యంగా చూసి, చేతుల్తో అందుకోవటంకోసం విశేషించి యత్నిస్తున్నాడు.

ప్రసాదరావు భార్య వూరంత గొంతుకతో వార్తల్ని చదువుతున్న రేడియోగొంతు నొక్కివచ్చి, మెల్లగా సరస్వతిని దొడ్లోకి నడిపించుకువెళ్లింది. ఆడవాళ్లు ముగ్గురూ విడిపోగానే ముసలాయన కళ్ళజోడును మనుమడి బారినుంచి భద్రంగా రక్షించుకొంటూ కొడుకు నుద్దేశించి 'ఏవిటి కథ?' అన్నారు.

ప్రసాదరావు తనకేమీ తెలియనట్లు 'ప్చ్' అనేసి వూరుకున్నాడు.

'ఎప్పుడు రావటం?'

'నెల్లాళ్ళయి—'

'నాకు తెలియలేదే...'

కొడుకేమీ జవాబివ్వకపోవటం చూసి—'యిదా...నాకేమీ క్షేమసమాచారాలు తెలియక పోవటంచేత ఒకమారు అట్లా వెళ్లిరానా అని కూడా అంటూవచ్చాను మీ అమ్మే—వట్టి చండాడిమనిషి ఎద్దు ఎండకు లాగితే దున్న నీడకులాగుతానంటుంది.'

'వెళ్ళిరావలసింది. కథంతా అర్థమయేది—' చెప్తో చిన్న పూచికపుల్లను విరిచి పళ్లుకుట్టుకుంటూ నసిగాను కుర్చీతోసహా వెనక్కి నడుం విరుచుకుంటూ.

'హాఁ, హాఁ—ఏదో వుంది.' అన్నారు ముసలాయన.

పూచికపుల్లతో గాలిలో సూచిస్తూ 'ఇప్పుడేం లాభం అనుకుని—అటువంటి సంబంధం చేశాక—'

ముసలాయన ఒక్కమాటు బుజాల్ని దులుపుకుని చేతిలోని కర్రను కుర్చీవెనుక వ్రేలాడేస్తూ—'ముసలాడి కబుర్లు నీకు పచ్చిపచ్చిగా వుంటాయిగాని, యీతల పూర్తిగా పండేదాకా నౌకరీచేశానా, దేశంకాని దేశం అక్కడా యిక్కడా వుంటూ వచ్చానా, ఎన్నిరకాల మనుష్యుల్ని చూడలేదు? అంతా ఒక్కలా వుండరు. అదలావుంచు. ఎప్పుడూ మనమే నెగ్గాలనుకునే మనస్తత్వంకల మనుష్యుల్ని చూశాను. కొన్ని సందర్భాల్లో గెలుస్తూ మళ్ళీ వోడుతూ జీవితంసాగించే వ్యక్తుల్ని చూశాను. పట్టూ విడుపూ అన్నదుండాలి. అదిలేని వ్యక్తుల్తో అందులో హమేశా మనమే ముందుండాలి మనమాటే నెగ్గాలి అనుకునేవాళ్ళతో జీవించటం ప్రమాదకరం. మీ అమ్మవుందా — అది కాపురానికొచ్చిన క్రొత్తల్లో వట్టి అడివిగొడ్డు. మొరాయించటం కరవటం వుండేదికాదు. ఆఖరికి నాకు తెలియకుండా అణా అర్థాతీసి యే పోపులపెట్టెలోనన్నా జేరేసి ఒక పదిరూపాయలు చేస్తుందేమో అని చూశాను, ఆ తెలివితేటలుకూడా లేవు. కాని అట్లాంటి మనిషితో కాపురం నాకేమీ కష్టమనిపించలేదు. కాని మళ్లీ మీ చిన్నత్త— చచ్చిపోయిందిలే, నువుపుట్టాక. అంచేత తెలీదు. ఆవిడ మొగుడ్ని రాచి రంపాన పెట్టేదని నలుగురూ అనుకునేవారు. నాకేం మొహమాటం లేదు. అడిగేద్దామా అన్నంతవరకూ వచ్చింది. కాని చూస్తూచూస్తూ అడబిడ్డని నేనేమన్నా. ఒకమాటు దాన్ని పుట్టింటికి తీసుకరమ్మంటే నేనే బయల్దేరి వెళ్లాను. గుమ్మంప్రక్కనే స్కూలు. ఆ బడిపిల్లలు కిటికీదగ్గరకువస్తే పల్లంలో వీళ్ళ దొడ్లో అంతా కనబడ్తుంది. అప్పుడు వాళ్లేదో అంటున్నారు. ఇది వాళ్ళను చెరిగేస్తోంది తిట్లతో. ఏవిటే ఆ పిల్లలు అంటున్నది అని అడిగాను రావటంతో, దానికి నా మీద కూడా కోపమొచ్చింది. తరువాత తెలిసింది 'అయినకాడికి అణాపరక—' అని పిల్లలు పిలుస్తారని. బజారుకి ఆ వూళ్లో పనిమీద బయలుదేరితే ఏ గోడమీద చూసినా అయినకాడికి అణాపరకా. ఒక గుంటవెధవని పిలిచి 'ఏంరా—ఆమాట' అన్నాను. వాడు నవ్వుతూ పరుగెత్తుకుపోయాడు. నేను స్వతహా కొంటిమనిషిని—ఆరోజు దీపాలుపెట్టాక దార్లో ఎదురైతే 'ఏవిటి బావా—అయినకాడికి అణాపరక అని రాసుంది మీ యింటిమీద—' అని ఖర్మంజాలక నోరుజారాను. అగ్గిరుద్రుడయాడు. ఎట్లాగో తెలుసుకున్నాను. ఒకరోజున వుదయం 8 గంటలకు బజారుకని బయల్దేరి, ఏవో ఒక తోటకూరకట్ట కాసిని పచ్చిమిరపకాయలతో అరుగుపెట్టాట్ట యింట్లో. స్కూల్లో ఒకటికి బెల్లుకొట్టారు. అప్పుడు మీ చిన్నత్త చింత రుప్పులాటి తలేసుకుని తడిసిన చీరతో వురుముకుంటూవచ్చి 'ఏవిటి తగలేశావు?' అందిట. 'ఫలానా—' అన్నాక 'ఎంతయింది?' అని గర్జించిందిట. 'అణాపరక—' అన్నాక అలస్యమయిందని శాపనార్థాలు పెడుతూ 'ఇంతేనా అయినకాడికి అణాపరక' అంటూండగా స్కూలు పిల్లలువిని ఆ ముక్క పుచ్చుకున్నారు.

ఇంత కథా నీ కెందుకు చెప్పానంటే, ఆవిడ పోలికే అచ్చంగా మన సరస్వతి.'

ప్రసాదరావు యీతుంగా—'మీ కసలు ఏం తెలీదు. మీరు దానికి చాలా అన్యాయం చేశారని చెప్పనబోతున్నందుకు ముందుగా యింత చరిత్ర చెప్పుకొచ్చారు. నాకు తెలుసు నాన్నా—ఇంకా ఏం కావాలి? నిల్చున్నపాళాన చంటిబిడ్డతో యింట్లోంచి పొమ్మని అన్న మనిషికి ఏపాటి సంస్కారం వుంటుందనుకునేది?'

'అతనలాటి మనిషి కాడు.' ముసలాయన సమర్థిస్తూ గట్టిగా అన్నారు.

ప్రసాదరావు క్షణంసేపు లేచి నిలబడి పరుషంగా—'మీరు చేసింది తప్పుకాదని సమర్థించుకోవటంకోసమే చూస్తున్నారుగాని మన గౌరవం ఏమాత్రం అతగాడు నిలబెట్టాడో ఆ విషయం ఆలోచించటం లేదు.'

ముసలాయన యీలోగా 'అమ్మో కొంచెం 'టీ' పట్రా. సుపుత్రుడు దేవతలకు పంచాంగాలు

చెబుతున్నాడు.' అనేసి 'కూర్చోరా నాన్నా— కూర్చో...' అని ప్రసాదరావునుద్దేశించి అన్నారు.

ప్రసాదరావుకు కోటమి యిష్టం లేదు. ఆయన వాదించి తనచేత అవుననిపిస్తాననే భయం లేకపోలేదు లోపల. అదికాక స్వయానా కూతురి విషయంలో ఆయన అల్లుడిపక్షం తీసుకోబోవటం చూస్తే తనకే ఎల్లానో కచ్చగావుంది. అందుచేతే లేచి తప్పుకుపోవాలని చూశాడు.

ముసలాయన అన్నారు.

'ఈ ఒక్కమాట విను. నీకు తెలిసింది, చాలామంది అనుకునేది మనుష్యులంతా డబ్బుగలవాళ్ళు, లేనివాళ్లుఅనే. ఈ రెంటి మధ్యా సంబంధబాంధవ్యాలు పొసగవనే. పైగా యీ విభజనలో తప్పుందంటాను నేను. మనుష్యుల్ని తత్వాలవారీగా విభజించి పరీక్షించాలంటాను. శాస్త్రిని నేను అట్లానే కొల్చి చూశాను. అతను యితరులకు కష్టం గలిగించడు. ఇతరులు తనకు కలిగిస్తే ఓపికతో సహించి వూరుకుంటాడు. బస్. యిక నీవు వెళ్లొచ్చు.'

'మరి యీ జరిగిన రాద్ధాంత సిద్ధాంతాలన్నీ'

'ఏ రాద్ధాంత సిద్ధాంతాలు...?'

'ఇదిగో ప్రత్యక్షంగా కనబడుతున్నదే పుట్టింటికి తోలెయ్యటం—'

'హా! అదా - ఏదో మాటామాటా వస్తే అమ్మాయే వచ్చేసుండచ్చు. మన బంగారమే మంచిదని అస్తమానూ అనుకోవడం తప్పురా. ఎదటివాడి కంట్లో దూలం వెతికేముందు మన కంట్లో నలుసు అఘోరించిందేమో చూసుకోవద్దూ.'

'చూసుకోవాలి—' అని కోపంగా అనేసి ప్రసాదరావు చరచరా వీధిలోకి నడిచాడు. సరిగా అదే సమయానికి ప్రక్కగదిలోనే వుండి యావత్తూ కాకపోయినా కొంత కొంత విన్న ప్రసాదరావు తల్లి యీవలకు వస్తూ—'ఇంకా కొంపలో అడుగుపెట్టి పది నిమిషాలు కాలేదు. ఏమిటి వాడినల్లా వెర్రెక్కిస్తున్నారు? ఏదో మర్యాదగా వచ్చాం—నాల్రోజులుండి మర్యదగా వెళ్ళాలని లేదా మీకు?'

'హుష్. వూరుకోవే—తగుదునంటూ వచ్చావు నడాన. నేను ధర్మంకోసం పాటుపడుతాను. ఎప్పుడు ఎక్కడెక్కడ ధర్మం నశిస్తుందో అక్కడల్లా పుట్టుకొస్తానని కృష్ణపరమాత్మ చెప్పలే. గీతల్లో...'

'ఓహో - యిదే కామోసు ఆ అవతారం. చాల్లెండి. అనవసరంగా పిల్లల మనస్సులు నొచ్చుతాయి. వాళ్ళేం అజ్ఞానులు కారు. ఎవళ్ళ వాళ్ళంత వాళ్లు వాళ్ళయారు. మీ రూరికే నోటికొచ్చినట్లల్లా.....'

'నువ్వు పో—ముందు అవతలకి...' ముసలాయన గర్జించారు. మధ్యలో కోడలు వచ్చి-'మావయ్యగారూ మీకు పోల్టీను తెచ్చేదా......' అని సమాధానంకోసం నిలబడ్డది.

'ఏవి మర్యాద? ఏవి మర్యాద? మాకు పిల్లలంటే అలా వుండాలి.' ఆవిడకు వినిపించలేదు ఆ మాటలు. మళ్ళీ అందుకుంది.

'ఐతే మీరు ఏమిటి అమ్మాయిని దాన్ని కొత్త పలకరించారూ?' ఆయన ముఖం కుంచించుకుని 'పోదూ—నీ తెలివికి సంతోషిస్తున్నాను. నేను ఆ విషయం ఎత్తితే అది చిన్నబుచ్చుకుని ఏడవదూ—'

ఇంతలో పోల్టీను పుచ్చుకునివచ్చిన కోడలును పరామర్శగా 'నీ అమ్మ అంతా బాగున్నారా? జాబు లొస్తున్నాయా?'

తల వూపుతూ కప్పును బల్లమీద వుంచి—'అత్తయ్యా...మీరు...' అంది. ఆవిడ అధికార పురస్సరమైన ధోరణిలో—'నాకేం అక్కర్లేదమ్మా. అబ్బ! అందులో ఏదో కోడిగుడ్డుసొన కూడా వేస్తారట. రామ! రామ! ఆ పోల్టీన్లూ అవీ అట్లాటి సూకరాలు బస్తీవాళ్లూ నాగరికులు మీకు గాని...'

ముసలాయన లేచారు. మీది సిల్కు కండువాని ఎక్కడ తగిలించటమా అని యిటూ అటూ చూస్తున్న ఆయనకు ముసలావిడ మాటలు వినిపించాయి. చేతిలోని కండువాని అందుకోవటంకోసం వస్తున్న కోడల్నుద్దేశించి—పద్యం చదివే ధోరణిలో 'రుచి పాకము నాలుకగా కెరుంగునే, తెడ్డది కూరలో కలియ' అని వూరికే అన్నాడు భాస్కరశతకకర్త.

ఆ అమ్మాయి కండువా వంకీని తగల్చటం కోసం అక్కడనుంచి నిష్క్రమించాక ఆవిడ యీ అన్న ముక్కలకు వూరుకోలేదు.

'పిల్లలదగ్గర అట్లా తీసిపారేస్తూవస్తే నేనంటే యేమన్నా చీమకొలంత గౌరవం వాళ్లకిక ఎందు కుంటుంది?'

'అందుకే అన్నారే వెర్రిదానా—మొగుడు తిడితే మొగసాలవాడూ తిట్టాడని.'

'నాకు గౌరవం అనేది లేదని ఎల్లానూ తెలుసు. మీతో దేనికి గాని వాదన—అమ్మాయి సంగతి కాస్త కనుక్కోండి మీరు వెళ్లటమో, అతగాడికి కబురు చెయ్యటమో—'

'ఏమని? నువ్వు కాస్త నోరు మూసుకుంటే అన్నీ అవుతాయి. కాశీనుంచి వచ్చేప్పుడు చూద్దాం లే.'

'దారిలో పనిగదా—'

ముసలాయన క్రుద్ధులై నిస్సాకారంగా—'ఇప్పుడు నావల్ల కాదు. వచ్చేటప్పుడు చూద్దామన్నానుగా.'

ఆవిడ ప్రక్కకు తిరిగి చెంగుతో కళ్లు నొత్తుకుంటూ బొంగురు చేసుకున్న గొంతుకతో 'అంతే దాని ఖర్మ. రేపు ప్రొద్దున్న నలుగురూ ఏవమ్మా మీ అమ్మాయి యింకా యిక్కడేవుందేమంటే నేనేమని చెప్పేది? నలుగురూ నన్ను దుయ్యబట్టుకుంటారు గాని...'

ఆయన ఒక్కమారు లేచినిల్చొని—'చాల్చాలు యింక అధికప్రసంగం చెయ్యకు. ముందు నువ్వే మా అమ్మాయిని వొదిలేశావని నలుగుర్లోనూ చాటాచ్చేటట్లున్నావు.'

'హవ్వ! రామ! రామ!' అనేసి ఆవిడ నెమ్మదిగా అక్కడ్నుంచి నిష్క్రమించేలోపున ఆయన నున్నటి తలను పదేపదే రాసుకుంటూ పచార్లకు ప్రారంభించారు. దూరంగా నేలమీదకు గంటన్నర క్రితమే వదలి వేయబడ్డ మనవడు అక్కడే నిద్ర తీసి అప్పుడే లేచి మెడను రిక్కించి తాతగారి పచార్లను బుర్ర రాసుకోవటాన్ని పరిశీలనగా చూడసాగాడు. కాని అట్లా వాడు ఎంతోసేపు పెద్దమనిషి తరహా అభినయించలేదు. చరచరా మోకాళ్లతో ప్రాకి ఆయన అప్పటివరకూ కూర్చున్న కుర్చీముందు వుండే విరుగుడుచావ గుండ్రబల్ల క్రిందకుచేరి, అంతక్రితము ప్రసాదరావు వలిసె విసిరేసిన సిగరెట్టు ముక్కలను సునాయాసంగా ప్రోగుచేసి వాటితో ఆడుకోవటంలో నిమగ్నుడయాడు.

తాతగారు ఆలోచనామగ్నులై యిట్నుంచి అటూ అట్నుంచి యిటూ వోవర్లీను అరిగేలాగా పచార్లు చేశారు కాని బల్లక్రింద ఆడుకుంటున్న మనుమణ్ని పోల్చుకోలేకపోయారు.

ముసలావిడ వంటలోకి దిగింది. కోడలు బహు జాగ్రత్తతో మడిగట్టుకుని ఆవిడకు అదీయిదీ సరఫరా చేస్తున్నది. కాని యీ వ్యవహారంలో ఏమాత్రం హెచ్చుతగ్గులు వచ్చినా అత్తగారు సహించి వూరుకోరు—'నేను కాపురానికొచ్చిన క్రొత్తల్లో...' అంటూ ప్రారంభిస్తుంది.

ఇదివరకే అంతమాత్రపుపని—సరస్వతి కిప్పుడు చేతికి నిండా తీరిక. గంటసేపు కూర్చుని తీరిగ్గా జడ అల్లుకున్నది. తరువాత తువ్వాలు సబ్బుబిళ్ళ పుచ్చుకుని స్నానాలగదిలోకి వెళ్లింది. అమ్మో యింత నిదానంగా పనులు చేసుకుంటూ కూర్చుంటే అవతల వంటా అదీ చూసుకోవాలి, యిల్లు చక్కబెట్టుకోవాలి అనటానికి యిది తన యిల్లుకాదు. ఈ పనులు పూర్తిచేసిన కాలంలో అదెంచవలసిన ఆ బాధ్యత, అదీ తనకు లేదు.

అది చాలా చిన్నగది. ఒక ప్రక్కంతా పొగతో నల్లగా మసిబారిపోయింది. క్రిందగా ఒక పెద్ద పొయ్యిలో భగభగా మండుతున్నవి నాలుగు పెద్దకట్టెలు. ఆపైన వెడల్పైన నల్లటి రాగిగాబు. అందులో రెండుమూడు బిందెలనీళ్లు ఏకధాటిన సలసలా మరుగుతాయి. కట్టెలు బాగా మండుతున్నవేమో, ఒక వైపునుంచి శెగలు వస్తూంటేగా, సరస్వతి తలుపులు బిగించి, కుర్చీపీటను లాక్కుని, అందుమీద ఒక కాలునుంచి పోసుకుంటూ నీళ్లు—మెత్తమెత్తను వొళ్లు రుద్దుకున్నచోటే మళ్ళీమళ్ళీ రుద్దుతూ గంటన్నరసేపు జలకమాడింది. అంతసేపూ తన వొళ్లు తాను చూసుకుంటూనే వుంది. చేతులు వొళ్లను పాళంగా తోముతూనే వున్నాయి. స్నానం పూర్తవుతూనే వుంది. కాని మనస్సు మనస్సులో లేదు. ఇప్పుడు తన బ్రతుకు పరీక్ష తప్పిన కుర్రవాడి మోస్తరయింది.

అంత వేడినీరు శరీరంమీదుగా పరుగెడుతూన్నప్పుడు సరస్వతికి తన కాపురం మొదటి దినాలు

గుర్తుకొచ్చాయి. ఆ ఆలోచనలు గూడా 'సంబంధపు చర్చలు—' అట్నుంచి 'పెండ్లిచూపులు'— 'పీదా గొప్పా తారతమ్య వివరణ'—పలువురూ పలు విధాలుగా చేసిన సూచనలు, ఎల్లాగో అయిన పెండ్లి, మధుపర్కాలు, దండాడింపు అన్నీ చకచకా తిరిగిపోయాయి.

అటుతరువాత శాస్త్రిని గురించి తియ్యగా వూహించటానికి మొదలు పెట్టిన రోజునుంచి, అతణ్ని చూడగానే ఎవరో వనుకనుంచి వచ్చి గిలిగింతలు పెట్టినంత వుత్సాహంతో పులకలెత్తిన తను—ఏరోజు కోసం యువతీ యువకులు రాత్రిళ్ళు పగళ్ళు వువ్విళ్లూరుతూ ఆలోచిస్తూంటారో, ఆ దినం—తను ఎట్లా వర్తించింది? ఏమేమి చేసింది ఒక్కమాటు గుర్తుకు తెచ్చుకోకుండా వుండలేకపోయింది సరస్వతి.

సరస్వతి కప్పటికి యింకా పదహారేళ్లు నిండలేదు. వోణీలు మానేసి కూడా ఏడాది పూర్తయిందో లేదో—యింటికి వచ్చిన అమ్మలక్కలంతా 'పిల్ల ఎత్తరి—మనిషవుతుంది.' అంటూంటే ఆ ముక్కలు బోధపడకపోయినా వాటివెనుక ఏదో తీయటికల వున్నట్టు అనిపించేది తనమటుక్కు. ఆ రోజుల్లో ఎంతసేపూ దృష్టి ముస్తాబుమీదే వుండేది.

పండుగలకు పిల్చినప్పుడల్లా శాస్త్రి వస్తూండే వాడు. మొదటిసారి చెల్లెల్ని కూడా వెంటబెట్టుకొస్తే, ఆ పిల్లను తాను ఎంత వేళాకోళం చేసింది—ఏదో వంకను ఆమె బట్టలనో అలవాట్లనో హేళనగా తీసి కట్టుగా విమర్శించినదీ, అవన్నీ గుర్తుకొస్తున్న కొద్దీ సరస్వతి యిప్పుడు విచారించకుండా వుండలేక పోతున్నది. ఒక్కతేని తనాన్ని మాత్రమే శాస్త్రి తమ యెదుట విధిలేక ప్రదర్శించవలసి వచ్చినపుడు అతను బికారిలా వుంటాడని, మావగారివద్ద నుంచి వచ్చినప్పుడల్లా డబ్బు గుంజుకుపోవటమే ప్రధానాశయంగా పెట్టుకున్నాడని తనవారు ఆఖరికి తల్లికూడా ఆ నోటా ఆనోటా తనముందరే అంటూ వచ్చినప్పుడు అభిమానవతియైన మరొక స్త్రీ యేం చేసేది? తనుమాత్రం యువతిలిగట్టునే నిలబడి చేతుల్ని కట్టుగుని నలుగురూ తిరస్కారంగా అనుకునే మాటలకు వూతాన్ని యిస్తూ ఎంత ముభావం నటించలేదు? ఆరోజున అమ్మలక్కలు తాంబూలాలు తీసుకున్నాక కొంగున కాసు ముడివెయ్యలేదని, అంతమాత్రం లేకపోయిందా అన్న భావంతోనే తెల్లవార్లూ తలుపు నానుకునే నిలబడి వెడముఖంగా వుంటే అలనే మన్నాడు? పల్లెత్తుమాట అనకుండా గుపచుప్ గా మూడురోజులూ ఖైదులో కూర్చున్నట్లు గడిపి మళ్ళీ వచ్చాక తీసుకవెళ్తానని అనేసి దాటుకున్నాడు తన బారినుంచి. అవతలవాళ్లు తీసుకెళ్ళటంకోసం మనిషిని పంపినప్పుడుకూడా యేడ్చి యమలోకానికి పోతున్న దానిలా పెద్దపెద్ద రాగాలతో వెళ్లినప్పుడు స్టేషనులో అతను ఎదురువచ్చి ఎంతో మర్యాదగా యింటికి తీసుకవెళ్ళాక కూడా మూడు నెలలు తను ఎన్ని చెరువుల నీళ్లు త్రాగించినా పైకి ఏమన్నాడు తేలాడా! అటువంటి శాస్త్రిని తిరిగి నలుగురూ కోతి అంటూండటాన్ని తను యీమాత్రం పరిజ్ఞానం వచ్చాక కూడా వింటూ సహించి ఎంతకాలం ఎట్లా వూరుకోగలదు? ఇప్పుడు పిచ్చివాడుకూడా అవుతాడేమోనని చెల్లాయి వ్రాసింది. ఎవరు కారణం! తనే. తనే. తనే. తన మూలకంగా అతడు సర్వనాశన మవుతాడు.

డేగిసాలోని నీళ్లన్నీ కర్చయాక యివతలకు వచ్చిన కూతుర్ని వుద్దేశించి—'ఎక్కడున్నావే యింతసేపూ న్నానమేనా...' అంది తల్లి.

'ఆఁ' అనేసి గడపదాటుతుండగా చంటివాడు ఉడుకుని వదిలేసిన గిలక్కాయి ఎర్రగా దృష్టిని పడ్డంతో సరస్వతికి ఒక్కమాటు వొళ్లు ఝల్లుమంది. 'పెల్లవాడు ఏమైనట్లు—'

చిన్నగుస్తతోనే నాలుగు గదులూ అలంగం తిరిగి వంటయింట్లోని వదినగారివద్దకు వచ్చి తడబడుతూన్న గొంతుకతో 'నానిగాడేడి?' అంది.

ఆవిడ చెంబును క్రింద వుంచుతూ 'వాకిట్లో లేడా—యిందాక చూశానే...'

'ఏమోనమ్మా...' అంటూ మళ్లీ దొడ్డంతా కలయతిరిగింది.

పొయ్యిదగ్గర కూర్చొని సంతనాగా వండుతున్న ముసలావిడ పాపుకోసం మాడబెట్టిన బాణల్ని యిటుకముక్కలతో గమ్మున దింపి 'అయ్యో నా కూతురా—ఎక్కడ వదిలేశారర్రా బిడ్డను—చప్పున వెతకండి. చప్పున వెతకండి.' అంటూ ముందరగా నూతి దగ్గరకు పరుగెత్తింది. తల్లి నూతిదగ్గరకు దారి తియ్యటంతో బెంబేలు పడి సరస్వతి గుడ్లనీరు గ్రుక్కుకుంటూ అనుసరించసాగింది.

ఆశ్చర్యంగా వుందే—' అంటూ వదినగారు యిల్లంతా చుట్టివచ్చి, అంతక్రితమే పచార్లను సాగించి మధ్యగదిలో నరసారావుపేట కుర్చీలో పడుండి అర్థనిమీలిత నేత్రాలతో ఆలోచిస్తూన్న ముసలాయన్ను అడిగింది— 'పిల్లవాడ్ని ఎక్కడేనా చూశారా' అంటూ.

ఆయన హఠాత్తుగా విన్నారేమో ఆ లేవటంలో టప్పుమని ముక్కుమీదనుంచి కళ్లజోడు జారి గచ్చుమీద పడి బ్రద్దలయింది. కోడలు ఆ ముక్కల్ని ఏరటంకోసం నేలను వంగినప్పుడు టేపాయిక్రింద చేరి ఆడుకొని అలసి నిద్రపోతున్న పిల్లకుంక ఒక మూలను సాక్షాత్కరించాడు.

'ఇదుగోనర్రా యిక్కడున్నాడు—'

గుమ్మందాకా నడిచి ఎండలోకి గాబరాగా చూస్తున్న ముసలాయన 'యేడి యేడి' అంటూ వచ్చి 'అమ్మదొంగా – యిందాక నేనే అబ్బాయితో మాట్లాడుతూ మాట్లాడుతూ నేలకు వదిలేస్తే దీని క్రిందకు జేరాడు గావును.' అని పూర్తిచేశారు.

ఎరుపెక్కి ధారలుగట్టిన కన్నీళ్ళతో తడిసిన సరస్వతి ముఖాన్ని చూడగానే తండ్రి హృదయం చప్పున కరిగి—'యిదుగోనమ్మా—' అంటూ అందిచ్చిన చేతుల్తో తలమీద నెమ్మదిగా నిమిరి 'ఎంత గాబరా పెట్టేశాడో యింటిల్లపాదినీ వీడు. అమ్మ ముండా! కళ్ళజోడుకూడా విరిగిందిరా నీమూలాన.'

మాటలో అడ్డువస్తూ అమ్మమ్మ—'ముండాగిండా అనకండి వాడిని – వాడికి మీ పేరే పెట్టారు కూడా.'

సరస్వతి చెంగుతో నీళ్లు వొత్తుగుంటూ పిల్లవాడ్ని తీసుకుని వెళ్లబోతోంది. గొంతు సవరించుకుని అన్నారు తండ్రి—'ఏమే అమ్మాయీ మాతో కాశీ వస్తావా—యాత్రలు చేసొద్దుగాని.'

మడిలో వున్న పెద్దావిడ నోరు నొక్కుకుంటూ—'దానెందుకండి కాశీ ప్రయాణం చేస్తారు?' అంటూ అడ్డుపుల్ల విసిరింది.

'అది కాదే భడవా—ఏమన్నా పాపాలు చేసుంటే అవన్నీ గంగలో కడిగేసుకోటానికి.'

'అది కుర్రపిల్ల — దానివల్ల ఏయే పాపాలు జరిగుంటాయని—'

'ఏయే పాపాలా - మొగుళ్ళను యేడిపిస్తే వచ్చే పాపాలు.'

'చాల్లెండి. ఎవరైనా వింటే నవ్విపోతారు?'

'అయ్యొ ఖర్మవా—అస్తమానూ ఎవరో వింటారు. ఎవరో ఏదో అంటారు అని ఎవరికోసమో బ్రతుకుతున్నట్లు ఆఘోరిస్తావేమిటె? మీ ఆడజాతి చేసే ఘోరాల్లో భర్తలను క్షోభపెట్టి అలోలక్షణా మనేట్లు చెయ్యటంవుందే—దానికోసం కాశీ వెళ్తే జీవితంలో ఒకమాటు మంచిదంటాను నేను.'

'మరి మీరెందుకు అయితే—'

'అల్లా అడుగు లెక్క చెబుతాను. మీరు చేసే దరిద్రగొట్టు పనులన్నిటికీ చిత్రగుప్తుడి దగ్గర జవాబుదారీ వహించేది మేము. అంటే మేం చేసుకున్న పుణ్యమేదన్నా వుంటే అది కాస్తా మీమూలంగా బ్యాంకులో డబ్బులాగా హరించిపోకుండా వుంచేందుకు.'

'అయ్యొ బాబో—మీరు దేవుడితో కూడా గీచి గీచి బేరవాడేటట్లున్నారు పాపపుణ్యాల విషయంలో.'

'బేరవా—నా ఎదురుగుండా వచ్చి నిలబడితే భగవంతుడ్ని కూడా లెక్కల్లోకి సిద్ధాంతాల్లోకిదింపి చివరకు కొసరు వేయించుకుంటాను. రాధే శ్యామ్. రాధే శ్యామ్. వెళ్లండి వెళ్లండి. నా కళ్ళజోడు ఆయువు మట్టం కావటానికొచ్చింది యీ హడావిడి. లేకపోతే నిక్షేపంలా యింట్లోవున్న బిడ్డడికోసం— ఒకరు వీధిలోకి ఒకరు నూతిలోకి పరుగులుచ్చుకున్నారు. ఛీ! ఛీ!'

సరస్వతి యీ సందట్లో నెమ్మదిగా జారుకుని మరో చీర మార్చి పిల్లడికి పాలు గిట్రాపట్టి చాప పర్చుకుని నెమ్మదిగా చిన్న కునుకు తీయటానికారంభించింది. ఆ పసివెధవ కాళ్ళను తపాతపా కొడ్తూ కేకలు పెడ్తూ కేరింతలు గొడ్తున్నాడు.

ఆ గోజురాత్రి వున్నట్లుండి సరస్వతి హఠాత్తుగా ఒక నిర్ణయాని కొచ్చేసింది. తెల్లవారి లేచాక ఎందరు చెప్పినా వినలేదు. ఎదురు మాట్లాడిన వారందరితో చెడామడా తగూలాడేసింది. ప్రసాదరావు అధికారంకూడా పని చెయ్యలేదు. బలవంతాన తండ్రి జేబులోని పర్సు లాక్కుని పది రూపాయలు చేత్తో

పుచ్చుకుని నే నివ్వాళే వెళ్తానని మంకుపట్టు పట్టి ప్రయాణమయింది. ముసలాయన తప్పనిసరిగా స్టేషనుకు వెళ్ళి టికెట్టు కొనియిచ్చి వచ్చారు. ఆ రాత్రి వదిన 'నేను చెప్పానా మీ చెల్లెలు కోతి—' అని భర్తను గేలిచేసింది నవ్వుతూ.

## 5

సాయంత్రం ఎర్రబడ్డది. సరస్వతి ముఖాన కూడా, కారే చెమటలకు అలుముకుపోయిన కుంకుమ రక్తిమను, చూసి కూడా చూడనట్లు తప్పుకు నిల్చున్నాడు శాస్త్రి.

మళ్ళీ సజ్జబుట్ట—మరచెంబు, ప్లాస్కు ట్రంకు పెట్టె ఒక్కటొక్కటే రిక్షావాలా తెచ్చి యింట్లో పడేస్తున్నాడు.

వెలిగిస్తున్న బుడ్డి దీపాన్ని గోడనున్న మేకుకు చేర్చి మసకచీకట్లో 'ఎవ న్నయ్యా—' అంటూ వచ్చింది చెల్లాయి.

క్షణంసేపు మాట్లాడకుండా చూస్తూ నిలబడ్డ మానవాకారం నిశ్శబ్దంగా అక్కడనుంచి నిష్క్రమించింది.

సరస్వతి పోల్చుకో పోలేదు. బికారిలా పెంచిన గడ్డంతో నల్లటి మురికితుండు నొకదాన్ని చుట్టుకుని స్తంభంవారనుంచి మిడిగుడ్లు పెట్టుకుని చూస్తున్నది ఆ మనిషే—అతగాడేనని.

సరస్వతి చంకనుండి పసికూన నేలకు జారబోతున్నాడు. చెల్లాయి చప్పున అందుకుంటూ '—నువ్వా వదినా—యిల్లు ఎటా పోల్చుకున్నావు?'

సరస్వతి కొంగునున్న ముడివిప్పి మూడు పావలా కాసులు యివ్వబోయింది. రిక్షావాడు తలను పంకిస్తూ 'ఏం దమ్మగోరూ—ఆయీది కాదని యీ యీది, యీ యీది కాదని అది పూరు సంగానికి తిప్పిస్తివే — ముప్పావులా డబ్బులేనా, రూపాయన్నర బేరం. నా నుచ్చుగోనంటె వుచ్చుగోను.'

సరస్వతి నీరసంగా—'అంతే—నాదగ్గర అంతకన్నా లేదు. వెళ్ళు వెళ్ళు. ఇచ్చిన డబ్బుల్తో తృప్తి లేకపోయాక, అందుకనే మీకు కూడూ గుడ్డా వుండదు.'

ఇచ్చిన ముప్పావులాను గడపమీద వుంచి—'అమ్మగోరూ—నాకాడ తిరకాసు పనికిరాదండీ. మీ డబ్బులు మీరు యిచ్చేస్తేనే సంతోసు దక్కుతుంది.'

అంతసేపూ కావడి బుజాన్నేసుకుని సందు మార్గాన నీళ్ళను తెచ్చి జేర వేస్తున్న శాస్త్రి ఎదురు రొమ్ము ముచ్చెమటలు కారుతూండగా కావడిబద్దను పుచ్చుకుని నేలను పొడుచుకుంటూ 'ఎవరి సంతోసరా దక్కుంది?' అని పళ్ళు పటపటా పిండి వురిమినట్టు చూశాడు. అంతవర — యింట్లో మగవాళ్ళు కూడా వున్నారనే జ్ఞానంతో లేని రిక్షావాలా 'ఇసుమంటి బేరాలు నాంకుతగిల్తే నోజుకి నా సామిరంగా! గంజిమెతుకులు కూడా పోవునోపలికి' అని నెమ్మదిగా తోక ముడిచాడు.

'ఇదిగో మంచినీళ్ళు వదినా—'

సరస్వతి గుటగుటా రెండు చెంబులెత్తి నోట్లో పోసుకుని—

'అమ్మయ్యా'—అనుకున్నాక—'ఇప్పుడు నీ వంట్లో ఎట్లాగుంది?'

'ఫరవాలేదు. ఇంటికి వెళ్ళమన్నారు. శుక్రవారం శుక్రవారం రిక్షామీద వెళ్లి యింజక్షనులు తీసుకుంటున్నాను.'

చెల్లాయి చంకలోని కుర్రకుంక నెమ్మదిగా బాకాపట్టి యేడుపుకు లంకించుకున్నాడు.

'పాలు కలపాలి కామోసువీడికి—'

'ఆఁ యిందాక రైల్లో యివ్వటమే మళ్ళీ పట్టలేదు.'

'ఆ బుట్టలో వున్నాయా పాలడబ్బా—సీసా అవీను...'

'ఆ... నేనిస్తాలే. నువ్వెందుకు లేవటం.'

'పాపం యేడుస్తున్నాడొదినా—'

'ఏడవనీ వెధవేడుపు...'

'వేడినీళ్ళు కావాలి కాబోలు. కుంపటి అంటించనా.'

'నాకు చెప్పు. నేనే అన్నీ చూసుకుంటాను. నీకు తెలీదమ్మా నీకు కూడా వరసాగ్గా పిల్లలు కలిగితే...యిట్లాంటివన్నీ...అప్పుడు అలవాటవుతాయి'

'ఫో...వదినా. సరదాకు పిల్లడికి పాలుపడతానంటే—'

'అదే'—మొదట్లో సరదా ఆ తరువాత బుగవ...యిందులోంచి పీక్కుందామన్నా తెరిపి వుండదు. చూద్దాంలే...'

చెల్లాయిలేచి బొగ్గులు కుంపటిచేర్చి నిప్పు వెలిగిస్తూ

'చాలా చిక్కావే వదినా...'

సరస్వతి తనదగ్గర పాలు కలుపుతున్నది నెమ్మదిగా తలెత్తి 'ఏదో నువ్వైనా అడిగావు అమాత్రం—అందుకే సంతోషిస్తున్నా.'

చెల్లాయి 'అన్నయ్య వస్తున్నాడు...' అని గొంతు కుంచించి—

'ఈ యిల్లు నీకెట్లా తెలిసింది చెప్పు...యింత మూల డాబా గార్డెను లోంచి సెంగ్రాపు పేటకు వచ్చేశామే...'

'నోట్లో నాలికుంటే అన్నీ తెలుస్తాయి... నాకేం సిగ్గు మొహమాటం ఓడియంలేవు. ఇదివరకేమన్నా వుంటే ఆ కొస్తా యిప్పుడు హరించుకు పోయాయి. ఎవర్నన్నా అడిగలను-ఏవిధంగానన్నా యీ యిల్లుపట్టుకోగల్ను అనుకున్నాను. అంతే—'

'పోనీలే—ఎల్లా వుంది ?'

సరస్వతి నాలుగుమూలలా పరిశీలనగా చూసింది. అది ఘనపటివాటాకన్నా చిన్న—(అద్దె భరించలేక కాబోలు) గూఛ్యంలా మూసుకు పోయి నేలబారున వుంది. గాలి వెల్తురూ తక్కువ. ఇహ లోపల, ఎక్కడి సామాను అక్కడే—నానా చిందరగానూ వుంది. గుమ్మం ఎదురుగుండా పెద్ద వేప చెట్టు. నిత్యమూ జోలెడు రొట్టరాల్తుంది. దారినంట బస్సులు బళ్లూ మనుష్యుల కొలిదుమ్మో అంతా యీ యింట్లోనే వుంటుంది.

సరస్వతిలేచి దొడ్లోకి వెళ్లింది అక్కడ ఎల్లా వుందో చూడామని. అటువైపు నొక పెద్దబాదం చెట్టు.

అప్పుడే మెరుపు మెరిసినట్లు తన అన్నగారి యింట్లోని సౌకర్యాలు అన్ని హంగులూ, విరుగుడు చావ టీషాయి దగ్గర్నుంచి ఫిలిప్సు రేడియో సెట్టు వరకు జ్ఞాపకంవచ్చాయి.

మరైతే అక్కడే ఎందుకు వుండలేదు ? ఇక్కడికి యీ ఎత్తు పల్లాలు గతుకుల్లోకి దేనికిగాను తిరిగి వచ్చింది ?

సుఖాన్ని కాని దుఃఖాన్ని కాని కలిగించేది పొందేది మనస్సు. ప్రాపంచికమైన యీ యీవస్తువుల్నుండి వచ్చేవి అనుభూతులే—ఫిలుప్సు రేడియో సెట్టు, వాక్సుహాలు చిన్నకారు, నాలుగంతస్తుల మేడ—మనుష్యులు కోరదగ్గవే—కాని పూరికొంప యింటినిండా దుమ్ము గతుకులు పల్లాలు, ఒకటి వుంటే ఇంకొకటి లేని సంసారం—యిందులోనే గడుపుకుంటూ కూడా మనస్సు దివ్యమైన అనుభూతుల్ని రుచిమాపగలదు. మనుష్యుల్ని వాళ్ళ సంస్కారము మనస్సుయొక్క అంతస్తుల్ని బట్టిగాని కొలిచేది, బ్యాంకు ప్యాసుబుక్కు బ్యాలెన్సునుంచి కాదు. లోకం అనుకున్నట్లు వుత్తమతరగతి జీవితం వున్నత భోగాల్ననుభవించటమే ఐతే—సరస్వతి నిస్సార ణంగా నిలుచున్నచోటున ఎందుకు విశాఖపట్నం ప్రయాణం కట్టింది ? ఏదివున్నా యేదలేకపోయినా నాది అని చెప్పుకునే హక్కుకోసం అడమగా పోరాడ్డాన్ని బట్టిచూస్తే స్వేచ్ఛకోసం స్వాతంత్ర్యం కోసం అన్ని రంగాల్లోనూ పెనుగులాట సాగించటం మనుష్యులకి ఎంత సహజమో చప్పున తెలుస్తుంది.

సరస్వతి ఏమీ వులక్కుండా పలక్కుండా ఆ గొడ్డివమ్మ న్నానుకుని అట్లా ఎంతిసేపో నిల్చుండి పోయింది.

పిల్లడికి పాలుపట్టూన్న చెల్లాయి అన్నయ్యతో మాట్లాడుతున్నది కాబోలు అని అనుకుని తృప్తిపడసాగింది. గుంటూరు 'తా... త్తి... త్తి... త్తా...త్తా' అని చేతుల్ని తడుస్తూ గచ్చుమీద నీపం పైపుకు వురుకుతున్నాడు హడావిడిగ.

అంతసేపూ సరస్వతి చూడలేదుగాని బాదం చెట్టు క్రింద రాతిమీద కూర్చుని చిన్నచూసిన కొల్ల్మాయి గుడ్డతో శాస్త్రి ఏదో ఆలోచిస్తున్నాడు.

ఆకాశంలో అంతవరకుండు గుంపులు గుంపులుగా చేరిన నీలిరంగు మబ్బులమధ్య నుంచి త్రోవను చీల్చుకుంటూ చందమామ పైకిపైకి వస్తున్నాడు. ఆ వెన్నెల ఒక్కసారిగా వచ్చినట్లయింది బాదంచెట్టు కొమ్మలమధ్యనుంచి శాస్త్రిపైమీద కూడా వెన్నెల పడుతోంది. పగలల్లా ఎండలకు మాడిపున్న నేల నెమ్మదిగా చల్లబడ్తోంది. బాదంచెట్టు క్రిందనుంచి

చూస్తే పల్చనిశరీరం—తెల్లటి నీలిరంగు అంచుల చీరలో గుమ్మంవద్ద నిలబడ్డ సరస్వతి చాలా మనోహరంగా అగపడొచ్చు.

హఠాత్తుగా ఆమె దృష్టి శాస్త్రిమీద పడ్డది. తక్షణం చెట్టునీడకు నెమ్మదిగా అడుగులేసుకుంటూ వినీవినిపించకుండా అంది—'ఇక్కడ కూర్చుని వొక్కరూ ఏంచేస్తున్నారు?'

'...........'

'అదంతా నామీద కోపమేనా...'

ఒకటి రెండు బాదంకాయలు పుటుక్కున విరిగి నేలపడ్డ శబ్దం వినా అతడివద్దనుండి సమాధానం లేదు.

వెనకనే నిల్చున్న సరస్వతి—కఠినంగా, నే నసలు అన్నింటికీ తెగించివచ్చాను. నాదగ్గర మంచితనం లేదు. అనవసనవేమైనా వుంటే నా ముఖాన్నే అనెయ్యండి. అంతేకాని...'

శాస్త్రి మోకాలు క్రిందకుదింపి 'హుఁ' అని మూలిగాడు.

'అన్నట్లు చెల్లాయి వుత్తరం వ్రాసింది. మీరు శాంతిని వుంచుకుని దానికి నాపేరు పెట్టారని...'

శాస్త్రి చప్పున అక్కడ్నుంచి లేచి వెళ్లిపోబోయాడు. అతని ఎడమచేతిని చప్పున అందుకుని వెనక్కు లాగుతూ—

'ఆ వ్యవహారమంతా నలుగురినోట్లోనూ పడింది. మీకేమో మతి చలించిందని...నా కొక్క దానికే తెలుసు. ఈ తంతంతా ఎందుకు జరిపిస్తున్నారో.'

చేతినిగట్టిగావిదల్చి శాస్త్రి లోపలికి దూసుకున్నాడు. చప్పున సరస్వతి బిక్కమొహంపెట్టి రెండుచేతుల్లో ముఖం కప్పుకుని వెక్కివెక్కి యేడువ నారంభించింది. బాదంచెట్టుమీద కాకి ఒంటకాలుమీద కునుకుతూ హఠాత్తుగా లేచి 'కా...కా' అని అరవటంతో, సరస్వతి యేడుపు మాని గూటిమీదకు ప్రాకబోతున్న గండుపిల్లిని చూసి రాయితీసుకుని వేసింది. అంతే...మళ్లీ యిది వరకు శాస్త్రి కూర్చున్నచోటే కూలబడి మోకాలు మీద ఆన్చిన తలతో ఆలోచిస్తూ యేడుస్తూ కాలక్షేపం చేయసాగింది.

చెల్లాయి కొంతసేపటికి వెతుక్కుంటూ వచ్చి—'ఏమిటక్కా ఇది...ఎందుకు ఏడుస్తున్నావు వదినా...' అంటూ భుజంమీద చేయివేసి కుదిపింది.

అంతక్రితమే మబ్బుల్లోకి వెళ్లిన చందమామ మళ్లీ యివతలకొచ్చి తొంగితొంగి చూస్తున్నాడు.

'నాకు చెప్పవు వదినా...నే నన్నయ్యను పిలుచుకొస్తానుండు' అని వెళ్ళి నులకమంచం కుక్కిలో వూగుతూ అర్ధనిమీలిత నేత్రాలతో గతించిన మర్కట సుందరిని తల్చుకుంటూ పడున్న శాస్త్రి నుద్దేశించి,

'అన్నయ్యా వదిన యేడుస్తోంది?' అంది చేతులు నలుపుకుంటూ.

'ఏ వదిన...' అంటూ అయోమయంగా ప్రశ్నించాడు.

ఈమారు చెల్లాయి కూడా సరస్వతిపక్షం తీసుకోక తప్పిందికాదు.

'వదినంటే—ఆ డాబా యింట్లో ఆవాళ మేడమీద ఎలక్ట్రిక్‌తీగను ముట్టుకుని చనిపోయిన శాంతేననా నీ అభిప్రాయం.'

'అంతే... అసలైన వదిన ఎప్పుడో యిక్కడ్నుంచి వెళ్ళిపోయింది.'

'లే అన్నయ్యా. నువ్వు ఒక్కమాటు వచ్చి చెబితే వదిన తప్పకుండా వచ్చి అన్నం తింటుంది.'

శాస్త్రి మూర్ఖంగా 'నావల్ల కాదు...' అనేశాడు.

చెల్లాయి వెంటనే దొడ్లోకి పరుగెత్తి తెగించి ఆడదల్చుకున్న అసత్యం వొదిన ఎదుటను పెట్టింది.

'అన్నయ్య పిలుస్తున్నాడు నిన్ను—'

సరస్వతి ముడుకులమీద ఆన్చిన తల నెత్తి 'నన్నా...'

గుండెలు కొట్టుకుంటుంటే చెల్లాయి 'అవును. నిన్నే...' అని చీకట్లోకి ముఖం త్రిప్పుకుంది.

ఆ అమాయకురాలు యీ మాటలను నమ్మిని చెంగుతో ముఖం తుడుచుకొని నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ పడకగది చేరింది.

దాన్ని పడకగది అని అనటంకంటే కలకత్తా చీఁటికొట్టు అనటం యుక్తమనిపించుకొంటుంది.

గదినిండా డబ్బాలు—నానా చెత్తాను. మధ్యగా నులక కుక్కిలో శాస్త్రి మాగన్ను మీదున్నాడు. సరస్వతి ఒక అడుగు ముందుకువేసి గడ

పసు దాటిందో లేదో అవతలివైపు కిటికీదగ్గర వూపిరి బిగబట్టుకుని నిలుచున్న చెల్లాయికి యీ క్రింది మాటలు వినిపించాయి.

సరస్వతి—'పిలిచారట...'

నిశ్శబ్దం.

'యిమ్మతే...ఎందుకని అడుగుతున్నాను.'

'నువ్వు నిలువు నిలువంతా అబద్ధాలకోరువి. నీఅంతట నువ్వు వచ్చి నేను పిలిపించానని దబాయిస్తున్నావు.'

'పిలవలేదూ...చెల్లాయి వచ్చి చెప్పింది మీరు పిలిచారని.'

'ఇది వుంకో అబద్ధం—'

'సరే—నేనన్నీ అబద్ధాలే ఆడుతాను. మీరింకా ఎందుకు నన్నిల్లా యేడిపిస్తారు?' శాస్త్రి మాటలు వినిపించలేదు. సరస్వతి గొంతుకే తెమ్పుగున్న వుద్రేకంతో—'కానివ్వండి. మగ మహారాజులు. మీ యిష్టమొచ్చినన్ని ఆటలు మీరు ఆడవచ్చు. ఎల్లా యేడిపించదల్చుకుంటే అల్లా యేడిపించండి.' మళ్ళీ గొంతుకలో వొణుకు...దుఃఖంతో మిళితమైన మాటలు వెంటవెంటనే దొర్లాయి—'నేను మొండిపీనుగను. మీరు వెళ్లమన్నా వెళ్ళను. ఇదే నా యిల్లు......యిక్కడ్నుంచి నన్ను ఎక్కడికీ ఎవరూ వెళ్ళగొట్టలేరు. మీరు నాతో మాట్లాడక పోయినా నేను యిందులోనే వుంటాను. ఆఖరికి మీ చేతుల్తో ఏ రోజో మీరే యీ నా కాస్త గొంతూ...'

శాస్త్రి వున్నమాటున ఛెళ్లుమని చెంప పెట్టులా తగిలిన మాటలకు వులిక్కిపడిలేస్తూ—గోడను వ్రేలాడుతున్న దీపంబుడ్డివత్తి పెద్దదిచేసి చేత్తో పట్టుకుని సరస్వతి ముఖాన ధారలుగట్టి స్రవిస్తూన్న కన్నీటి దొంతరలను వింతగా చూస్తూ—'నీ హృదయం రాయి రా పాషాణమనుకున్నాను. కాని యింత జేల వసుకోలేదు.' అని పకపకా నవ్వాడు. ఒక్కమాటు దించిన తలను కాస్త యెత్తి కోపంగానే అంది—'నేను అలోలక్షణామని యేడుస్తూంటే మీకు హాయిగా కడుపునిండుగా వున్నట్లుందే—'

'అవును.'

'అల్లాగే వుంటుంది లెండి. సుమ్మంలోకి అడుగుపెట్టే చేసుకున్న దాన్ని కదా ఏమని నోటినుంచి మాట పెగిలిందా మీకు? ముత్యాలు రాలిపోతాయనుకున్నారు.'

'అంతే—ముత్యాలు రాలిపోతాయనుకున్నాను.'

'పోనీ—కన్న పిల్లవాడినన్నా దగ్గరకు తీశారూ?'

'వాడూ నీ పిల్లాడేగా...'

'అదీ...కోతుల్లో ప్రేమలు వెలిగించే సుఖాలకు అంతకన్నా ఏమిటి తెలుస్తుంది.'

'కోతులే నయమంటాను నేను మనుష్యులకన్నా. ఒక పొరబాటు చేశాడు భగవంతుడు. అందరికీ తోకలు లేకుండా మనుష్యుల్ని చేసేశాడు కాని, కొంత కొంతమందికి—ఆ స్వభావంకల వాళ్లను, తేలిగ్గాపోల్చుకునేందుకు వీలయేటట్లు తోకలువుంచితేనే బాగుండిపోయేది?'

'ఏయే స్వభావం కలవాళ్లకు?'

'అదే—నీకు మల్లే, చీటికీమాటికీ తగూలాడి తెగించి పుట్టిళ్ళకు మా కేమని పోతూంటారే...'

'మాటలు తిన్నగా రానియ్యండి.'

'ఏం—యీమాటు చీపురుకట్ట తిరగేస్తావా?'

'ఆ ముక్క ముందుగా మీ నోటినుంచే వచ్చింది. నేనన్నేదు. మీరు వెళ్ళమంటేనే వెళ్లాను.'

'మళ్ళీ ఎందుకొచ్చావు? ఏ సుఖం పెట్టుగుని.'

'మీకు ఆ వెళ్ళమనే అధికారం లేదని తెలుసుకున్నాక వచ్చేశాను.'

తరువాత శాస్త్రి నవ్వు వినపడ్డది. మళ్ళీ మాటలు—'నువ్వు యీమారు రెండాకు లెక్కువ చదువుకొచ్చినట్లున్నావు. యిసొక్కమంటే యిసొక్కమంటున్నావు.'

'మీరు మాత్రం—కోతుల్లో కాపురం వెలిగించి రాలేదూ—' శాస్త్రికి మిసెస్సు జ్ఞాపకానికొచ్చింది. నెమ్మదిగా అనదల్చుకున్న మాట పైకనేశాడు—'చెల్లాయిని రేపువారం యిక్కడ్నుంచి తోలేస్తాను.'

సరస్వతి 'మీ కాళ్ళు పట్టుకుంటాను—ఆ ముక్క మళ్ళీ అనకండి.' శాస్త్రి నవ్వి 'నీ ధోరణి చూస్తూంటే అంతా కోతిచేష్టలకు మల్లే అనిపిస్తోంది. వెళ్ళేముందు తెచ్చినందుకు తగూలాడావు. ఇప్పుడు పంపేస్తానంటూంటే యిట్నుంచి మళ్ళీ వద్దంటున్నావు. ఏమిటిది?' సరస్వతి గోడను జారగిలబడి 'మీరు ఒక్కమాటు గాదు, వెయ్యిమాట్లు గాదు, లక్షసార్లు అనండి. నేను కోతినే...కోతినే......కోతినే...' అని ఫక్కుమని నవ్వేసింది.

---

# సుద్యుమ్నరాజ చరిత్రము



శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

మనోజ్ఞము లయ్యును అజ్ఞాతముగానుండి రచ్చకెక్కని కొన్ని యాధునిక ప్రబంధములలో "సుద్యుమ్నరాజు చరిత్ర" యొక్కటి. ఇరువదవ శతాబ్దారంభమున వెలువడ్డ రసవత్తరములగు ప్రౌఢ ప్రబంధములలో నిది ప్రథమశ్రేణికి జెందును. ముప్పది సంవత్సరముల నాడే చెన్నపురియందలి వావిళ్ళవారి "ఆదిసరస్వతీ నిలయ ముద్రాక్షరశాల"లో ముద్రింపబడి యీనాడొక్క ప్రతియైనను లభించుట కష్టమైన యీ సుందర కావ్యము నొక మిత్రునివద్ద చూచి యాశ్చర్యపడితిని. ఇరువదవ శతాబ్దారంభమున— పెద్దన, రామరాజభూషణుడు, రుద్రకవి, ముక్కుతిమ్మన, కూచిమంచి తిమ్మయ మొదలగు మహాకవుల కావ్యముల ధోరణిలో అనవద్యముగను, అనర్గళముగను ఈ కావ్యము సాగిపోవుట పండితులకును, పామరులకును విస్మయావహము. ఈ సుద్యుమ్నరాజ చరిత్ర మైదాశ్వాసముల ప్రబంధము. అష్టాదశ వర్ణనములతో గూడిన మహాకావ్యముగా కవి దీనిని నిర్వహించినాడు.

## కథా సంగ్రహము

మనుపుత్రుడగు సుద్యుమ్నుడు వేటకై పోయి కుమారవనములోని యొక కొలనులో మునుగగా కామినిగా మాఱిపోయి "యిల" యను పేర బరగును. ఆతని పరివారముగూడ సరస్సున జలక్రీడల దేలిన కారణమున, నాడువారై యిలాదేవిని సేవించుచు వనములో విహరించుచుండ చంద్రసూనుడగు బుధుడు తపముసేయుచు వారికి గాన్పించును. బుధుని గాంచి యిలాదేవి మోహించి తపసి గావున శాపభీతిచే మిన్నక చెంతనున్న మేరుపర్వతమున కేగి వేదనపడుచుండును. తరువాత శిష్యునివలన నిలా వృత్తాంతము నెఱింగిన బుధుడు ఆమె కలయికకై పరితపించును. కడకు ఇల చెచ్చెలివల్లను, బుధుని శిష్యునివల్లను నాయికానాయకులకు సమాగమము కలిగి చంద్రవంశ వర్ధనుడగు పురూరవు డుదయించును. ఇది యిందలి కథ. పురూరవుని పుట్టుక యిందు వర్ణింపబడినది గావున "పురూరవోదయ" మనియు దీనికి నామాంతరము. ఇతరములగు యితర ప్రబంధముల వలె ఈ కావ్యమునందును కథాభాగము విరివిగా లేకున్నను, ఒక పురుషుడు స్త్రీగా మాఱి అనురూప వరలాభము నంది సంతానమును గనుట యనునది యిందు విశేషము.

ఈ కథాంశము వేదవ్యాసవిరచితమగు శ్రీ భాగవతమునందును, వాల్మీకిరామాయణమునందును సంగ్రహముగా నున్నది. రామాయణస్థ కథను కంకంటి పాపరాజు తన యుత్తర రామాయణమున నించుక పెంచి వ్రాసెను. భాగవతేతివృత్తమును మనోజ్ఞమగు శృంగార ప్రబంధముగా కొట్టిపాటి (కడప జిల్లా) సంస్థాననివాసుడగు కొట్టిపాటి సురవయ్య కవి రచించెను.

## కవిచరిత్రము

ఈ కొట్టిపాటి సురవయ్య విశ్వబ్రాహ్మణ కులోద్భవుడు. సానగర్షి సగోత్రుడు. మునిమాంబకు పిన్నసురువప్పకు బుత్రుడు. శేషాచార్యునకు ముఖ్య శిష్యుడు. కాళికాంబా వరప్రసాదాంచితుడు. పురహరాంఘ్రియుగళ పూజాభిరతుడు. సహజ దరిద్రుడగు నీ కవిని గొంద ఱాప్తమిత్రు లాతనియందలి కవిత్వ పాండిత్య శక్తు లుడిగిపోవుటకు నోపక, ప్రేరేపించి ప్రోత్సహింపగా దా నీ ప్రబంధమును వ్రాసితినని గ్రంథావతారికలో జెప్పుకొనుచున్నాడు—

"అనుపమ విద్యానిలయుం
బనెడు సభికు నాదు మిత్రు లంచితగతితో
...నను. రావించి దయామతి.
గని యిట్టుల బల్కి రధిక గౌరవ మొప్పన్."

"ప్రతి పద్య రసాస్పదముగ
గృతి రచియింపంగవలయు గీర్తి చెలంగన్;
క్షితి సప్తసంతతుల ద
త్కృతియే శాశ్వతము మిగుల శేవలమగుచున్."

"కావున నీవొక సత్కృతి
గావింపుము శక్తికొలదిగా గవిజనసం
భావిత కవితాచాతురి
భావించుచు వేత్తలెల్ల బొండితి మెచ్చన్."

"శ్రీ కొట్టపాటి పురీవర సంస్థాన
సంవాసుడవు బ్రహ్మ సంతతియగు
సౌనగ ఋషిగోత్ర సంజాతుడగు ముస
లాచార్య పౌత్రుడవార్య వినుతు
డగు పిన్నగురువప్ప కాత్మజుడవు కాళి
కాంబా వరప్రసాదాంచితుడవు
గురువయాఖ్యుడవు సద్గురువు శేషాచార్య
ముఖ్య శిష్యుడవు సమోగ్రమతివి
సభ్యుడవు గ్రంథసృష్టి కుశలుడ వరయ
బుధజన విధేయుడవు భక్తి బురహరాంఘ్రి
యుగళపూజాభిరతుడవు నుచితగతిని
మాకు 'నాచారి' వత్యంత మహిత గుణివి."

అని బహూకరింపగా పురాతన కథావిసరంబుల నెమకి తా నీ కావ్యమును శ్రీ చెన్న కేశవాంకితముగా వ్రాసినాడట. ఈ చెన్న కేశవు డే గ్రామమున వెంచేసియున్న స్వామియో గ్రంథ కర్త యెచ్చటను సూచించలేదు. కొట్టపాటిలో నే చెన్న కేశవాలయ మున్న దేమో మఱి. ఎట్లైనను చెన్న కేశవానుగ్రహము తనకు బూర్తిగానున్నట్లు గ్రంథాంత గద్యములోగూడ గవి చెప్పకొనినాడు—

"ఇది శ్రీ మచ్చెన్న కేశవస్వామికృపాలబ్ధ సరస కవితా చాతురీధురీణ త్రిభువన నిర్మాణోద్ధారక మను వంశపయోదధిరాకా సుధాకర సౌనగర్షి సగోత్ర శ్రీ కాళికాంబా పాద పద్మారాధనాసక్త చేతోవిరాజమాన ముసలాచార్య పౌత్ర పిన్నగురు మూర్త్యాచార్యపుత్ర సదమలగుణ భాసమాన మునిమాంబా గర్భ శుక్తి శౌక్తికాయమాన బుధజన విధేయ గురువయ నామధేయకవిప్రణీతంబైన పురూరవోదయంబను నామాంతరంబుగల సుద్యుమ్న రాజచరిత్రము..."

పై గద్యమునుబట్టియు గవిచరిత్రము సువ్యక్త మగుచున్నది. తన వంశకర్తనుగూర్చి "త్రిభువన నిర్మాణోద్ధారక" అని చెప్పకొనుట తన వంశపు శిల్పప్రతిభకు నిదర్శకము.

## కథాసంవిధానము.

పుణ్యముల కునికియైన ప్రతిష్ఠానగరమును సుద్యుమ్న మహారాజు పాలించుతఱి, నొకప్పుడు మధుమాస వాసరములు భాసురములై చెలంగెను. ఆ సమయమున నింతకొలువున్న శైనివద్దకు కుమార వనమున కావలనున్న మలల చాలు సెలవుగా జేసికొని కాపురము నడపు చెంచుల గుంపు వచ్చి, అడవి మెకముల బెడద బడజాలకుంటిమని, తమ నేగిని రాజునకు విన్నవించి వంతదీర్ప వేడుకొనెను. చెంచుదొరల పలుకులు వేట తమకమును రెట్టింప జేడాలెయి గడపె, మఱునాడు వేటకై కట్టాయిత మయ్యెను. వేటకరుగబోవు పుడమిఱేడు ఎట్టి గుఱ్ఱము నెక్కుచున్నాడో చూడుడు—

పొన్నతంతియల ముప్పనివాగెకలియమ్మ
మందంపుమడికాసు బొందళమ్మ
అపరంజిపోసముత్తెపు గుట్టుపనిజీను
తళుకురానిగ్గుల తంగువారు
డాతట్టునసరాజిడాలు వాబరిచియు
బొన్నీరుబచ్చన పాదువువిల్లు
ప్రక్కలకోలల బిత్తళికలదంప
రహిమీఱరాణించు రవలపిడెము
బచ్చమానికముల ముఖపట్టకెంపు
రాలుదాపిన కలికి తురాయమర్చి
తనరబడివాగె సవరించి ధనికి నెదుట
జవమనోజ్ఞాతిపీత వేసాదిదెచ్చె.

అచ్చతెనుంగుపదములతోడి యీపద్యము అశ్వవేగమువలె మన కందుకొనగాకయున్నది.

ఇట్లు బహురాణము నెక్కి పయనమైపోయిన రాజు విచ్చలవిడిగా సకానన గిరి మృగఖగముల గడపి, చెంచుల వాంఛ దీర్చినాడు. వేట ముగిసిన పిమ్మట ఆ ఖేటకులు చెంచులును నానావిధ మాంసములను గమ్మగావండుకొని మెసవి, రాజుతోగూడ హాయిగా విశ్రమించినారు. సుద్యుమ్నుడు కుసుమ శయ్యాతలమున బర్యుండి నెలమోటి తామరల సువా

సనల గలసివచ్చు పిల్లతెమ్మెరల శ్రమ దేరుచుండెను. అయ్యడవిలోని ప్రాణుల మాంసముల చేత కుక్షి నిండ్లు మాన్పుకొనుచు సమీప పర్వతప్రాంతమున నున్న జీవాంతకుడను నిశాటుడు, పక్వమాంసముల పరిమళములచే ప్రేరితుడై తన సేవకునివలన "సుద్యుమ్నుడు వేట కరుదెంచి వనములోని మృగఖగముల మట్టుపెట్టినాడ" ని విని యమ్మానుషాధము రూపుమాప దానవులతోఁగూడ గదలెను. మానవదానవపతులకు పోరు ఘోరముగా జరిగెను. అటు రక్కసులు, ఇటు చెంచులు, రాజసైన్యములు పెక్కండ్రు గూలిరి. ఇంత భయంకరరణము జరుగుచున్నను దానవు డెంతసేపటికిని చావకుండుటను గాంచి, రాజు సానలదీరిన యొక్క శితసాయకము నేసి యాతని చేతిని గ్రుంచి అగ్నిబోలు బాణము నొక్కటి వైవ—

అక్కటినపు దివ్యాస్త్రం
బక్కలింపంగ గుండియలదిర వేలన్
నక్కొల్లు గడిసి దానవు
డుక్కు దొరగి గ్రుక్కి గ్రుక్కి యుర్విన్ బడి—
యొక్క దివ్యపురుషుఁడైనాడు.

కోటి వెన్నెలలుఁగూడిన చోటునా
రత్నకిరీటంబు రాజిలంగ,
బదియారుకళలుండు పట్టునా నొప్పారు
మురిపపుముద్దు నెమ్మోము వెలుగ,
బండువెన్నెలపట్టపవలు కొనెనొ నాగ
జిన్నారి లేనవ్వు వన్నెగుల్క,
రిక్కలచాలొక్క చక్కినిల్చెనొ నాగ
నురముపై ముత్తెపు సరులు మెఱయ,
నలదు జవ్వాదిగమగమ లాడ, జెలులు
రవణములు మోయ వలిచామరములువీవ,
గందుమబ్బులలోనీడ గానిపించు
ఖచరవరు గాంచి దొర వెఱగంది..."

యాతని యాత్మచరిత్ర నెఱుగగోరెను.

"ఈతడు చిత్రుడను గంధర్వరాజుకొడుకు చతురుడు. ఇతనికి విశారదుడను చెలికాడు గలడు. వీరిరువురు నొకసారి దేవేంద్రుని సభలో నారదుడు నాతని శిష్యులును గావించు గానము నాలించుచు గురుశిష్యులలో నెవ్వ రధికులని వాదమునకు దిగిరి. అభిప్రాయములు కలియక గురు పెక్కుడని యొకడును, శిష్యు డెక్కుడని యొకడును వాదులాడి చివరకు "సిగపట్ల గోత్రము"వారైరి. అది ముష్టియుద్ధములోనికి మారినది. "పిల్లజెద్దుల"కు చేగి పోరుచున్న వీరి సందడికి సభ కొల్లాపెవరుగుడు గాన భంగమయినది. ఇంద్రుడు సడికట్టి వీరినిబట్ట భటులకు ముదలయిడెను. ఇది యెఱిగి విశారదుడు డీడ నాడ బడుచు పాఱిపోయినాడు. పిమ్మట నింద్రుని యాజ్ఞచే నారదుడు చతురుని నిశాచరుడవు గమ్మని శాపమిచ్చి, యుద్ధములో నడిసినలుడి రాకొని తనము పోయి ఖచరభావము వచ్చునని యానతిచ్చెను."

చిత్రు డిట్లు తన వృత్తాంతము నెఱింగించి రాజునకు గృతజ్ఞతదెలిపి, తన గీమున కేగెను. ఈ కథాక్రమముతో రెండాశ్వాసములు ముగిసినవి.

లోగడ నీ దానవుడు పెట్టుచున్న బాధలకు దల్లడిల్లుచున్న మునులు మనుసుతునిచే రక్కసి పొలియుటను గాంచి, తమ కష్టము తీఱెనని రాజును దీవించి యగ్గించిరి. వేటపేరను, రక్కసులతోడి కదనముచేతను డస్సి, విశ్రాంతినిగోరిన భూపునికి ఒక చెంచు కనకాద్రికి చేరువనున్న కుమారవనమును జూపించి, యద్దాని భోగ్యత్వమునుగూడ వర్ణించి, యందు హాయిగా విహరింపవచ్చునని చెప్పినాడు. రానికి కుమారవనమును జూడ వేడుక చెంగలించినది.

"భూమిరుహ శీతలచ్ఛాయా సుఖాసీన
గంధర్వ కామినీ గానయుతము
నవ్యపల్లవ ఖాద నప్రహృష్టోన్మత్త
పికపంచమస్వర ప్రకటనంబు
సరసఫలాహార సంతతామోద వి
స్తార శుకాలాప సంకలితము
సూనమరంద పానానంద సంభ్రమ
ద్రోలంబ ఝంకార రుతమహితము
నటనకృద్బర్హి షడ్జమనాదఘనము
రాజహంసాది జలపక్షి రాజకమల
కైరవాంచితసార సాకర కలితము..."

నగు కుమారవనంబును గాంచిన భూకాంతు డందలి నానావిధ వృక్షమ్ముల సింగారము మనమ్మున కానందము గలిగింప నయ్యైవిశేషంబులు చూచుచు నొక్కచోట

"అలివేణిక, వికచోత్పలాక్షి, గమ
లాస్యక, హంసవాణిక, దరో
జ్జ్వలకంఠిక, బిసబాహా, జక్రకుచ, నా
వర్తోపమనాభిక, సుశ్రై

కలరోమావళి, వీచికాత్రివళి, దీ
   వ్యత్సైకతశ్రోణి, బు
ష్కల శోభన్, సరసిన్, లసన్మకర జం
   ఘన్, హల్లకాంఘ్రిన్ గనెన్."

ఈ పద్యమునందలి రూపకము కవిసమయ సంవాదియై కడునింపు నింపుచున్నది. కడవఱకు విన్నను నాలోచింపక రాజు చూచినది సరస్సో సారసాక్షియో నిర్ణయింపలేము.

పతగసువాసినీపరివృతయైన యా సరోవర లక్ష్మి మీననేత్రముల ధాళధళ్యముల నెఱపుచు, కుచ కమలకోరకముల యొప్పిదము చూపుచు, మృణాల బాహుల నాహ్వానించుచు, మిళిందీకలనాద మంగళారవముల దన్నెదుర్కొనుచున్నదని సంతసించి జల క్రీడాభిలాషియై సుద్యుమ్నుండా జలంబుల డిగినాడు.

"భ్రమరకంబుల నోర బఱనొత్తుచును గేశ
   శైవాలముల గేల జఱిమి జఱిమి
పాణిహల్లకముల బాణి దెమల్చుచు
   దమ్మిమోమున మోము దార్చి తార్చి
నురువు దువ్వలువ పొంపిరి బాపి వళి తరం
   గముల బెడంగుల గాంచి కాంచి
పత్త్రభంగములుగా బాహుయుగ్మంబున
   జటువు చన్మొగ్గల బట్టిపట్టి
లీల నధరామృతంబులు గ్రోలి గ్రోలి
యూరు బిసములతో నూరువులు పెనంచి
హంసికానాద మణితమ్ము లమరదేలె
రాజు లావణ్యసరసి దా బ్రథమకేళి."

సరసీలలామతోడి యీ ప్రథమకేళి యెంత మనోహరముగను శ్లేషసహితముగను నున్నదో పరికింపుడు.

ఇక సేన పరివారముగూడ నీట దిగిజల్లులాడ జొచ్చినది.

సుద్యుమ్నుడు శ్రమాపనోదనమునకు కుమార వనమునకు వచ్చినాడు. అదృష్టముకతననో, దురదృష్టమువలననో కమలాకరము గానవైనది. జల క్రీడారతి పెడరేప స్వేచ్ఛగా మజ్జనమాడినాడు. ఫలితము ? అంతయు తాఱుమాఱగుట !

"తన వితరణ ఘనత్వము వేణిభరమందు
   దనరు రాజత్వ మాననమునందు,
దన పుండరీకశోభనత కన్నులయందు,
   దన సువర్ణసమృద్ధి తనువునందు,
దన శ్రీ స్వరూపమంతయు గర్ణములయందు
   దనయశంబు దరస్మితంబునందు
దనరత్నసౌభాగ్య మొనరు వాతెరయందు
   దన చక్రభావంబు చనులయందు
దనకుశాగ్రబుద్ధి దనుమధ్యమంబందు
దనగుణాయతత నితంబమందు
దనసుప్తినాభితలమందు నెలయ భూ
పాలుడిప్పుడొక్క బాలయయ్యె"ను.

ఆయనతో బాటు బండలును సుందరులై దరికి జేరిరి. ఇక నేమి చేయగలరు పాపము! "ఐన మరణమైన నట్టె రాళ్లను గాని చెట్లు గాని యైన చింతలేదు అట్లు గాక స్త్రీల మనదలమైతిమిం కెట్లు పోవనొప్పు నింట్లకడకు" నని చింతాభరము పెల్లుగ గ్రమ్ముకొన విలపించినాడు భూపునితో గూడ. బంధువులను, ప్రజలను, రాజ్యమును దలచి రాజు పెల్లు గురపిల్లినాడు. ఇట్లు రాజు చింతిలుచుండ గొందఱు కన్యకలువచ్చి వీరి కష్టమునకు విచారము నెఱపి "ఒకసారి పార్వతీ పరమేశ్వరు లీవనిలో విహరించి జలకేళి దేలుచుండ, క్రూరదానవులు కోక లపహరించుకొనిపోయిరి. అందు కీశ్వరుడలిగి యీ కుమారవనములో దిరుగుచు నిందు స్నానమాడువారాడువారగుదురని శపియించెను. అదిమొదలు యిందెవ్వరును మెదలుటలేదు. మీ రెఱుగకవచ్చి భంగపడితిరి" అని చెప్పి వనములో గౌరీ సహితుడైయున్న శంకరుని వేడుకొమ్మని చెప్పి పోయిరి.

రుద్రకన్యలు చెప్పిన యీ సంగతి కలరి సుద్యుమ్నుడు మహేశ్వరుని సన్నుతించి తన స్త్రీత్వము నుడుపుమని ప్రార్థించెను. శివుడు స్త్రీత్వము పోవు కోర్కి దక్క వెఱకోర్కి లేదైన దీర్చునన్నాడు. పాపము! మన రాజున కది తిప్ప యన్నిగమును గలవాయెను! శివునిచే లాభము లేదని భవాని చెంతకేగి "వాడిన మోముదామరకు వారక పయ్యెదజాటుచేసి," భూమిధరపుత్రిక యుల్లము నీరుకాగా నీవె యేను గడయని, చెక్కుల బాష్పములు డిగజాఱ భోరున నేడ్చినది యిల చందురునితోడ గూడిన చంద్రిక వలె, శివుని చేరవెన సెనసిన శివను గాంచి, తన కథ నెఱింగించి నుతించి, తన మహిళాత్వము వ యనుగ్రహింపుమన్నది.

అనవిని దుర్గ యిప్పగిది
   వర్థము పౌరుషి వర్థ మిర్థతిసై.

తనరెడుదాన నొట సత
  తంబును బౌరుష మీయనోప, నీ
మనియెడుదాక నీకు నొక
  మాసము స్త్రీత్వము నొక్కమాసమం
దనుపమ పూరుషాకృతిని
  నందగజేసితి గొమ్మ..." అన్నది.

ఆమె కరుణచే సుద్యుమ్నున కొకనెల యాడు రూపును, ఒకనెల మగరూపును జేపడినది. కొంతకు కొంత మేలు. సగము మగతనముగల పార్వతి యింతకన్న నేమి చేయగలదు? ఇక దక్కిన పరివారమును దమకు కామినీత్వము తప్పదనుకొని యందఱును పెళ్లు పెట్టుకొని, రాజున కిలయని నామకరణము చేసిరి. అందొక్క శుకవాణి యను బుసుపోకకు వనిలోని వింతల నారయ బ్రేరేచెను. ఇలాదేవి నెచ్చెలి పింఛగూడి వనవిహారము నెఱపుచు బంగారుకొండ దరినున్న యొకవనిలో చక్కని పద్మాకరము కానరాగా జలకేళికి బూనుకొనెను. అందు సలిలాస జలక్రీడల దేలివచ్చుచున్న సమయమున, ఆ కమలాకర మధ్యమునందలి నీట "కిసలయాయుధునితోదుల తూగు సోయగము గలిగి, మొలకమీసము లొప్పారు మోమునందలి చెక్కుటద్దముల తళతళలతో రుచిరమ్యుడై తపము సేయుచున్న సౌమ్యుని గాంచినది యిల. సంభ్రమము మీఱ నాతని రూపరేఖా విలాసములకు ముగ్ధురాలై మరులుకొన్నది. ఇంక నేమి? మరున కిదియొకదా సందు! కుచదుర్గములు పగులగొట్టి, వక్షఃకవాటమును వ్రచ్చి, హృత్పీఠముపై నాసీనుడై ప్రభుత్వము సేయ దివిరినాడు కామయ్య.

ఇలాదేవి బుధుని గాంచి మదనపీడితయైనదని యెఱింగిన చెలి శుకవాణి సమాధిస్థితి నున్న సౌమ్యు డాని యిలా హృదయము నెఱింగిన కినిసి శపించునని, ఎచ్చటకైనను బోదమని యుత్తరదిక్కుగా ద్రోవదీసినది. ఎదురైన సిద్ధసాధ్య స్త్రీలను గనకాద్రికి త్రోవలడిగికొనుచు, మార్గములోని ప్రకృతి దృశ్యముల నారయుచు, గంధర్వికల గానపాండితుల కచ్చెరువడుచు బోయి పోయి—

అటజని కాంచి రబ్జముఖు
  లగ్రచరత్సుర కామినీపదో
త్కటకమలాంక లక్షణని
  ధానమహోన్నత శృంగజాలమున్,
రటదుగావీచి నిర్ఝరవి
  రవఘూర్ణిత దిగ్విలాసమున్,
స్ఫుటఘనగైరికద్యుతి వి
  భూషితసాలము స్వర్ణశైలమున్.

ఈ పద్యము పెద్దనగారి "అటజని కాంచె భూమిసురు"డను పద్యమున కనుంగుబిడ్డ. కవియిందు గెలుపొందినాడు.

శుకవాణి బంగరుకొండకు దీసికొనిపోయి యామె మనసు త్రిప్పజూచినది కాని, యిలకు గావలసిన బంగారుకొండ మఱొకటిగదా! ఆ కొండచే కూరిననే యాయండజయానకు మనశ్శాంతి. కనుకనే పాపమామె—మునుపటివలె మాటాడదు. అప్పుడప్పుడు చనుదోయి చెమర్చుచుండును. మేన బులకలు పుట్టుచుండును. మైనుఱచుచుండును. ఇట్లామెకు కామఘాతపు కళావేశించినది. ఆమె మోహమగ్గల మగుడు గాలికి గూలు నరటిబోదవలె సమ్మూర్ఛితయైనది. చెలులందఱామెను ముసరుకొని యెత్తి, శైత్యోపచారములు చేసిరి. ప్రౌఢయగు శుకవాణి యిది మనసిజుని చేత యని గ్రహించి మన్మథరోగము కుదుర్చు మందులన్నియు వాడినది. కొందలపడక నీవు వలచిన సుందరుని వచింపుమని చెలులు గ్రుచ్చి గ్రుచ్చి యడుగగా—

పరగమామకదహారనభస్థలమున
కలితదరహాసచంద్రికాకందళంబు
లోలయ మునిచంద్రు డెవ్వడోయువిదలార
యొక్కరుండుండి నన్నిట్లు స్రుక్కజేసె.

అని తన మనోగతము నెఱింగించినది. ఆ పల్కు లాలించిన శుకవాణి "కొలకొలని కోవలలు గూయుతావున, పలపలని చిల్కలు పల్కుచోట. తుమ్మెదలు జుమ్మని మ్రోగు నెలవున, నెమ్మి గుంపులు కేకలు వేయు చక్కి" నీ యువతినుంచరాదని యొక కోనలోని దివ్యమణి భాస్వన్మంటపముమధ్య వీణాగాన వైఖరులతో దఱిద్రోయుచుండెను.

ఇచ్చట వారివిహారములు చేసిపోయిన కామినుల శరీర సుగంధవాసనలు నాసాపుటముల బ్రవేశింప, ముని దిగ్భ్రాంతుడై లేచి, "ఈ కొలంకున నెవ్వతో యెమ్మెలాడి జలవిహారంబు గావించి చనియె" నని నీటగలిసిన కుంకుమాదులను బట్టి యూహించి, యోగదృష్టితో జూచెను. ఇక నేమి? మన్మథుని నిశాతబాణమువలె నిలయాతని మనోనేత్రమునకు దోచినది. ఆమె చక్కదనము, లేబ్రాయము నీతని మన్మథపరతంత్రు నొనర్చెను. ఇలమీది విరాళిచేత దాపపడుచున్న సమయమున, పత్రకుశ పుష్పఫలాదుల కేగిన శిష్యుడు శారద్వతుడు వచ్చి కనకనగప్రాంతమున నున్న కోనలలో దాను గన్న సుందరిని ఆమె వీణాగానచాతుర్యమును వర్ణించి వర్ణించి బుధునికి నోరూరించి,

'ఇలయను నామము గలయా
జలజానన వారికేళి సలిపెడు వేళన్
వలచినదట నిన్ను,'

అని యాతని యభిలాషమునకు సాయము చేసినాడు. ఇలహృదయము నెఱింగిన బుధునికి మఱీ వలపు రెట్టించినది. అయిన సమాగమ మెట్లు సాధ్యము? ప్రొద్దు పోక బుధు డామె సౌందర్యమునుదన కవితా చాతురి మీఱ వర్ణించుకొని కోకి నెడబాసిన కోకమురీతి గుందుచుండెను.

అక్కడ నిలయవస్థను జూడలేక కీరవాణి యామెను జెలుల కప్పగించి, మునివృత్తాంతము నరయబోయెను. పాప మా చెలియ పోయిపోయి తుదకు బుధాశ్రమమును జేరి "అందున నొక సరసీతట మందు శశిగావ వేదికాయుత సుమశయ్యం దన తనువుం జేరిచి యింగునికరకంతిహతుల కెడపడు మాని"ని గాంచి తొంటిమాని యితడేయని భావించి వాని మనసు నెఱుగగోరి మాటున నిలబడియుండెను. చంద్రసూనునికి మన్మథావస్థలు మితిమీఱగా నుస్సురని యూర్చుచు నిలనుగూర్చి పలురీతుల బలవించుచుండెను. ఈ సందు గనిపట్టి కీరవాణి చాటున నుండియే "ఓ నిశాపుత్ర! యే యండజయానయైనను దనంతట దానె వరించునే పతిన్? దండిగ దూరె జేల నెలి తప్పదియేమి కొలంకునీట నుద్దండ తపోమిషన్ వలచు తన్వినిజూడని తప్పటుండెగన్!" అని నొవ్వనాడినది. ఆ పలుకులువిని యిలాదేవి తనకై యెంత కుందుచున్నదోయని నొచ్చుకొనుచు బాధపడుచున్న బుధుని గాంచి, కరుణించి సుకవాణి యిల పంపిన ముత్యాలహారము నాతని కంఠమున వేసినది. ప్రేయసీప్రేషితమగు నా రత్నహారము తాపము మాన్ప, ముని తేరుకొని, కన్నులు విప్పి "హారమురా గతమెద్ది? దీని నే దయావతి దెచ్చె? ఇది మేను సోక దీఱని తాపము తీఱెగదా యని—

"ఏ నొకసారి యెచ్చటనో
యీ మణిహారము గాంచినట్లు నా
మానసమందు దోచెడిని;
మామకయోగ విలోకనస్థయా
మానిని హార మీ విమల—
మౌక్తికహారము సూడనొందెడున్;
గాన నిలావధూటి మణి
కల్పితహారము గాక యన్యమే!"

అనుకొనుచు హారము ననేకరీతుల గౌరవించుచు దానితో సల్లాపములు జరపి, తనప్రేమాంగి సేమములు సందేశములు నడిగెను. బుధునికి సగము తరుణీ సమాగమము జరిగినట్లైయైన దీ హారమురాక.

సంగతి ఇంతవరకు వచ్చినపిమ్మట కీరవాణి దాగనేల? బుధునికి దన్నెఱుకపఱచుకొని, సఖీవృత్తాంతమును నుడివి, "గోలను బచ్చవిల్తు విరికోలల పాలు సేయుట న్యాయము కాదనియు, ఇది మీవంటి బుధులకు పాడిగాదనియు" జమత్కరించినది. బుధుడును అరలేని మనసుతో శిష్యుడగు శాగద్వతునిచే నిలోదంతము కొంత వినుట జేసియే ప్రాణములు భరించితినని చెప్పి, సఖీజనులతో గూడ నిలను దన యాశ్రమంబునకు దిసికొని రమ్మని స్ఫటికాక్షమాలను గుఱుతుగా నిచ్చి శుకవాణి నంపెను.

తరువాత నెలుల పేరంటమున నిలా బుధుల వివాహమంగళము వైభవముగా జరిగెను. చివరకు

"క్రొన్నెలరాల తిన్నెపయి
గ్రొత్తమెఱుంగుల మేలుకట్టునన్
గ్రొన్ననపాన్పు నంగువలి
కూర్చనివీవన యయ్యు వీవగా
జన్నగశాయి తుల్యుని సు
ధాకరసూనుని నయ్యిలాసతిన్
దిన్నగగూర్చి నెచ్చెలులు
దీవనగా బనినాకున" పోయిరి.

సకి మావల్గోగహ చక్రవాకములకు
బత్రరచనసొంపు పాయకుండ
సుహాసీసులతి కౌంగి మధుగోష్ఠఫలముల
కలిశయద్విజహంతులంటకుండ
గగనమన్యకచాంధకారంబునకు విభా
కరయుక్తినిబిడతి కదలకుండ
విదితయౌవనయాగు కదళుల కాట్లోర్మరు
కరికరంబులబాధ గలుగకుండ
కరపుటంబులలాలించి, కాంతి నించి,
చక్కసారించి, స్నిగ్ధతసంఘటించి,
యిలను నూతనసంభోగకల దన్పె
నభినవాలోకజితవిధుడైన బుధుడు.

ఆహా! ఎంత లలితమైన సంభోగము. ఈ లాలిత్యములోని యుచితానుచితములు పాఠకులే నిర్ణయించుకొనవలెను. సంభోగవర్ణనములోని యీ పద్యమున శ్లేష, రూపకము, యథాసంఖ్యము నను మూడలంకారములు గూడ నికట్లోత్తర ప్రతిభను జాటుచున్నవి. ఇట్లు కనకశైల శిరోభాగముల నయ్యిలాబుధు లనురాగరసమున దేల్చిరి. విహారము లొనర్ప పురూరవుడను పుత్రరత్న ముదయించి "పురూరవోదయము" రసవత్తర ప్రబంధముగా రూపొందినది.

"లక్స్ టాయిలెట్ సబ్బు
నాచర్మమును అందముగా నుంచుచున్నది"
అని ఎ. ఆర్. శకుంతల చెప్పుచున్నది




సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

LTS. 332-X30 TL

## కథాకల్పనము

మూలమున భాగవత రామాయణములందున్న కథలకు గొంచెము భేదము కలదు. భాగవతము సుద్యుమ్నుడు మనుపుత్రుడని చెప్పినది. రామాయణమున సుద్యుమ్నుడను పేరే లేదు. పైపెచ్చు కర్దమప్రజాపతి కొడుకు ఇలుడని చెప్పబడెను. చిన్ని కథను కావ్య వ్యాప్తముగా పెంచి వ్రాయుటలో రసానుగుణముగా నలతి ఘటనములు సంఘటించుట కవి కనివార్యమైనందున, నట్టివానిని విడిచిన నిందు గంధర్వశాపనివృత్తి వృత్తాంతము కవికల్పితముగా దోచుచున్నది. కాని ప్రధానకథకిది యేరీతిగను నుపకరించినట్లు లేదు. మఱి వేటకేగనలసిన రాజునకు యుద్ధశ్రమనుగూడ గూర్చి విశ్రాంతికోసము కుమారవనమునకు బంపుటకు మాత్రమిది పనికి వచ్చుచున్నది. రామాయణములో శివుడు శివను సంతోషింపజేసి విహరించుటకు దాను స్త్రీరూపమును దాల్చి కుమారవనము లోనికి వచ్చిన ప్రాణులన్నియు స్త్రీ భావమును బొందునట్లు సంకల్పించును. భాగవతములో, దిగంబరయైన శివ శివుని యుత్సంగముపై నున్నతఱి, మునులాయనను దర్శింపవచ్చి శివాశివులు కేళీలోలురై యున్నారని వెడలిపోవ, శివుడా వనమున బ్రవేశించిన పుంల్లింగ నపుంసకులు స్త్రీలౌనట్లు శపించెనని కలదు. మన కావ్యకర్త రక్కసులు వస్త్రము లపహరించినందున శివుడు శపించెనని కల్పించెను. ఇంకను కావ్యనిర్వహణమునకును, రసపోషణమునకును నవసరములగు కొద్దిమార్పు లావశ్యకములే కావున వానిని వివరింపను.

## వర్ణనాదికము

ఇటీవలి కాలమున వెలువడిన పెక్కు కావ్యములు చిత్ర కథా మహనీయములు కాక, వర్ణనభూయిష్ఠము లనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కారు. ఆ రీతిగ నీ సుద్యుమ్నచరిత్రముగూడ వర్ణనములలో జాల ముందంజ వేసినది. ఇందు నగరము, చతుర్వర్ణములు, పుష్పలావికలు, వసంతము, వేట, యుద్ధము, వనము, వనవిహారము, జలక్రీడ, నాయికా నాయకులు, సూర్యచంద్రుల ఉదయాస్తమయములు, ఆశ్రమము, నాయికా నాయకుల విరహము, చంద్ర మన్మథాద్యుపాలంభనములు—

అను విషయములు కూలంకషముగా వర్ణింపబడినవి. శబ్దార్థములపై పూర్ణ ప్రభుత్వముగల కవి పై వర్ణనములం దెక్కడను వెనుక బడలేదు. ఈతడు మను, వసు చరిత్రముల నాదర్శముగా దీసికొని తన కావ్యమును నిర్వహించినాడని కథా సంవిధానమును బట్టియు, ఆయా వర్ణనములను బట్టియు బాగుగా నిర్ణయించుకొనవచ్చును. రాక్షసరూప గంధర్వ శాపవిమోచనము మనుచరిత్రను బట్టి కల్పించినదే యనవచ్చును. కవికిగల వర్ణనావ్యసనముచేతను, శబ్దార్థాలంకారతత్పరత్వముచేతను అటనట రసప్రతీతి భంగమగుట తప్పలేదు. నాయికా నాయకుల నొక్క రంగముపై నన్యోన్యము మాట్లాడించిన బాగుండెడిది. ఈ కార్యమంతయు కేవలము చెలికత్తెయే నిర్వహించుట రసజ్ఞులు తలలూపలేరు. అయినను కావ్యము మనోహరత్వమునకు దూరము కాక కవిని చిరంజీవిని జేయగల్గియున్నది. పురవర్ణనములో—

"కాలగళుడు దక్క, గాముని గెలిచిన
వారలెవ రటంచు వసుధలోన
జక్కదనముచేత నిక్కుచునవ్వీట
మరుని గెలువనట్టి మనుజుడెవడు ?"

అని పురుషసౌందర్యము నొక్కమాటలో జెప్పినాడు—వనవర్ణనములో—

"జోకనుయౌవనంపువటి
సొంపలరన్ హిమవారిదోగి, కా
రాకులమైల లూడ్చి బెడ
గైన గుళుచ్ఛకుచంబులందు మా
వాకుల కావికోక లల
రారగ దాల్చిన కీరభూషణా
స్తోకలు గొమ్మలయ్యనిలు
తోదనిసెన్గొనసాగు కోర్కెలన్"

ఇందలి శ్లేషరూపక సంపత్తితో సొంపైయున్నది. తాపసుల ధైర్యము తరుణులచే దూలిపోవు ననుటకు—

భామరో కూర్చుమన్ ప్రమిదకాధేయమై
వరసత్త్వగుణమను వత్తిగలిగి,
ముక్తికాంతాస్నేహమున బ్రజ్వలించుచు
ఘనతరమాయాంధకారమడచి,

యరివర్గశలభ సంహారంబొనర్చుచు
నాత్మీయదేహాలయాంతరమున,
నలసప్తభూమికలను మెట్లపై బున
రావృత్తివిరహితం బనెడిపదుట
ప్రళయజంఝానిలంబున మలగనట్టి
దివ్యయోగీంద్రసుజ్ఞానదీపకళిక
పొలతి నెమ్మేనిగాలి చేమలగుకతన
నారి మునికి దపోవిఘ్నకారిణిగద!

"కచ్చుడాల్గట్టు నీ మునిముచ్చులెల్ల దాపురస నేత్రలింద్లె బందాలుగారె" అను పెద్దన్నగారి భావమిందు సుందరముగా పరిపుష్టమైనది. సందర్భమును బట్టి రెండును రెండుత్రోవలు త్రొక్కినవి.

"అసురాకెంజిగురాకుల
నగు రాకొమరితె పదమ్ము నఖరుచికల్మిన్
దగురా నీలపు రాజిగె
తగురా సుతవాలుకురుల తతులకు సరిరా."

ఈ పద్యము చేమకూరవారి "అన్నన్న మొగము వెన్ననియున్నన్న" అను దానిని బోలియున్నది.
చంద్రోదయవర్ణనము

"పూర్ణశృంగభరము బూని యకస్మానగాబు
వలయజంద్రపాండు వృషము వెడలె
గగనకాననమున గన్పడుచుక్కల
మందగలియుటకు నమందలీల."
"తగకరస్పృష్ట సత్కైరవస్థానయైవి
లీనతారకయై విగళితతమోవి
నీలకచపాశయై యతిలోలచక్ర
కుచయయిచెలంగె నిశి రాజు గూడుకతన."

పై వర్ణనము లెంతయు సుందరములుగదా! ఇంత వర్ణించియు దనగోత్ర ఋషులకు జనకుడగు సృష్టికర్త విశ్వకర్మను ప్రశంసింపకుండుట కవి కిష్టము కాలేదు కాబోలు! మన్మథ దూషణములో నాకో అత దీర్చుకొన్నాడు—

"అరసియ కారణంబయిన
యాగ్రహ మూనెదవంచు నీకుగా
విరులశరమ్ము, లిక్షువున
విల్లును, నారిని జేటిబారుచే,
విరహుల పాలి దైవమయి
విష్టపసన్నుతి విశ్వకర్మతా
బరగ సృజించె నాతనికి
బ్రాంజలిసేయగవచ్చు మన్మథా!"

కవి శృంగారప్రబంధమును వ్రాసినను వేదాంతపరత్వ మెక్కుడుగా గలవాడు. కావున వర్ణన సందర్భముల నయ్యెయెడల నది వ్యక్తమగుచున్నది. ముక్తాహారము మెడలో బడినపిదప దాని నుద్దేశించి ఋషుడు—

"తారకసాంఖ్యయోగముల
దాల్చుసుమాత్రము నీత దాటి సం
సారపయోధి గాంతకుడ
సంతతసౌఖ్యము గాంచితీవు నీ
భూరికృపావిశేషమును
బొందక తాదృశభూతియబ్బునే
తారక సాంఖ్యయోగముల
దాల్చినయంతనె తారహారమా!"

అని శ్లేషించి చాతుర్యముగా బలికినాడు. ఈతడీరీతి వర్ణించిన యద్భుత వర్ణనములు పెక్కులు గలవు. విస్తరభయమున నొండురెం డుదాహరించి విరమింతును. అంధకార వర్ణనము—

"తనరత్నమట్టిజాఱెనని కోకిలమిన్ను
సరి నేల జీరాడు కురుల గుమియొ,
పుడమి పాంసుల నేచ పడలమారుడు త్రుప్పు
దుడిచి పెట్టిన నల్లతొగలరుచియొ,
యపరాహ్ణమున మకరాలయేశుడు వ్రేల్చు
మహిత నిత్యాగ్నిధూమవ్రజంబొ"

చుక్కల వర్ణనము—
"కడలు మిన్నంటి పెంపమరు చీకటిమ్రాను
చివరబుట్టిన వెల్లపువులనంగ,
ఆకసం బరయ శ్రీహరి పదాబ్జ్యవహించు
కతమున వెలుగునఖరములనగ
రిక్కగమి రొప్పె కాంతులు పిక్కటిల్ల."

కథాప్రకల్పనాచాతుర్యమునకన్న నిందు వర్ణనల మహిమము మిన్నుముట్టుచున్నది. ఎంత వర్ణించినను విసుగు బుట్టనీయక పాఠకు నాకర్షించి క్రొత్తత్రోవల ద్రిప్పుటకతఁడు నేటియందును. దీర్ఘసమాస రచనము సేయుటకుగాని, అలతిపదములతో పద్యముగూర్చుటకుగాని యాతడు చాలినవాడు. సీసముల నొయ్యారముమీర, సమతాగుణముతో సరసంబు

తూఁగు నడకలో నడిపించుట కీతనిని చెప్పి తీఱవల యును—

"అమితాభికాలాప శమితాభినవకోప
రమితాంగనాటోప రాజితములు,
ఫలసూనభర చూత దళపీనపికజాత
కలమానమృదుగీత కలయితములు"
"నెగ్గునిగ్గుల కెగ్గు నుగ్గడించెడి మేని
కాఱుచీకటి గమి కడలుముట్ట"
"మదమెత్తి కరమెత్తు మత్తనాగమువోలె
బరువడిచేసాచి బాదిబాది"
"క్షాత్త్రరుహశీతల చ్ఛాయాసుఖాసీన
గంధర్వకామినీ గానయుతము."

రసాలంకార భావబంధురములగు నిట్టి పద్యములు లెక్కకు మిక్కిలిగా గలవు.

కావ్యము కైశికీవృత్తి భరితమై ద్రాక్షాపాకముతో సాగినది. కవితాధార అడ్డుమాకలు లేక ప్రవాహమువలె నడచినది. కవితా శిల్పములో నీ శిల్పియెందును వెనుకబడలేదు. వ్యవహారమున నుపయోగించు జాతీయములు, సామెతలు: కాలము మసలించు, మడమద్రొక్కుచు, వంచెనికాడు నేయని వస్త్రములు, ముక్కుసూటిగా, పొడయెండ, కుదురుగా వచ్చెను, త్రుప్పుతుడిచిపెట్టు, కుందకము లేక, మున్నగునవి—భాషకు జీవములవంటివి సమయానుకూలముగా నీ కవి పెక్కులు వాడినాడు. బిగువుగల మనోహర రచనము. వ్యర్థపదముల నుపయోగింపడు. కథాగమనములోగాని, వర్ణన ఘట్టములందుగాని ఔచిత్యము, సారస్యము లవమాత్రమును దీసిపోవు. సందర్భోచితములగు పదజాల మీతనికి దాస్యము చేయుచుండును. ఆయా పాత్రల స్వభావములను జిత్రించుటలో నీతడు దొడ్డవాడు. బుధుడు నాయిక నుద్దేశించి పల్కిన యీ మాటలు స్త్రీ స్వభావ వ్యంజకములు—"మును తమి గొల్పి సుందరతముందున కేగుదు రెండమావులే వనితలు మీ మనుష్యగను వారు హరింగనువారు కోమలీ!"

ఇక నీ కవి తన నాయికానాయకుల సృష్టిలో గూడ వారిని మహనీయ పాత్రములుగనే దిద్దినాడు. ఇలావధూటి "అందముల యిక్క తళతళలాడు రిక్క, వలపుల కొటారు, వరదలిపతికటారు." ఆమె యందమునకు బ్రకృతియంతయు జతమైనది. ఇక బుధుడేక లెక్క? తపస్వియైనను నామె సంగమునకు దాపపడక తప్పలేదు. ఈమె హృదయ మహనీయతకు బుధునికోసమై తాను స్వయముగా బ్రయత్నింపక నెచ్చెలిని సైతము దాను బ్రేరేపక కార్యసిద్ధి నందుటయే సూచకము. ఈ గాంభీర్యము, ఉదాత్తత మెచ్చుకొనదగినవే.

ఇక నాయకుడో "విభునితో గిసలయాయుధునితో విధునితో దులదూగు సోయగంబులకు" మొలక మీసలవాడు. చంద్రవంశ వర్ధనుడు. అందున సవాధ నియతుడగు తాపసి. అంతస్సంస్కారము వలసినంత యున్నది. ఇట్టి యుదాత్త పాత్రములను తన కావ్యమున వర్ణించుకొని రససిద్ధుడైన కవి ధన్యుడైనాడు. సుద్యుమ్నరాజ చరిత్ర—మాంధ్రవాఙ్మయమున నాచంద్రార్కముండు మధుర శృంగార కావ్యమైనది.

"జయన్తి తేరససిద్ధాః కవీశ్వరాః"

---

# నిష్ఠ - సంభూతి మొగ్గల్లానయోగి



శ్రీ పారనంది జగన్నాథస్వామి

కపిత్థ దేశం: రాజగృహ-గృధ్రకూటపర్వతము-అశోకవనం-స్తూపం. సంభూతి మొగ్గల్లాన యోగి.

గుణభద్రడు: సర్వశాస్త్రవిదుడు, శిష్యుడు,

శ్రావస్తి ఓంబ్యసేన: యాత్రికభిక్షు-యువకుడు-విభక్తముఖము-ముతకకంబళి వేసుకొని యున్నవాడు.

విరూఢకుడు: రాజు.

చాటుపదుడు: రాజు అనుచరుడు.

సందరానంది: రాణి-అపరిమితంగా ఆకర్షించే సౌందర్యం. సౌందర్యాన్ని మించిన శరీరసుగంధం.

చందమనా; రాణి సేవకురాలు.

మారమోహకజీ: పాపాలకు పేరుపడ్డవాడు. సన్నంగా పొడుగ్గా అందంగా ఉండే యువకుడు. చక్కని దుస్తులు.

కోకాళికుడు: మార అనుచరుడు.

రాజగృహంలో గృధ్రకూటపర్వతమువద్ద సుకార్యుడు నిర్మించిన* విశాల—అశోకవనం, దానిమధ్య ఒక పెద్ద కోనేరు. ఒడ్డున ఒక ఎత్తైన స్తూపం. స్తంభం యొక్క శిఖరము, చుట్టూ నున్న చెట్ల కొమ్మలకు మీదుగా అంది, అరుణోదయాది సూర్యకిరణాలలో ప్రక్షాళిత మవుతున్నది. డెబ్బై అడుగుల ఎత్తు, ఇరవైఅడుగుల వెడల్పు గలది ఆ స్తంభం. ఆ ఎత్తున సమతలము, ఒక కొసను చిన్న దేవాలయము, అందున్న బుద్ధ భగవానుని కంచు విగ్రహము సూర్యకాంతిలో ప్రజ్వలిస్తూ ఉన్నది. ఆ నిర్మాణమంతా చెక్కబడి నునుపు చేయబడిన నీలలోహితశిలతో గొప్ప నేర్పుగా కట్టబడియున్నది. దక్షిణభాగంనుండి నల్లచలువరాతులతో అమర్చబడిన మెట్లు ఆ స్తంభము మీది భాగానికి అందుకొని యున్నవి. సమతలముచుట్టూ చిన్న పిట్టగోడ శిల్పి యొక్క చిత్రనైపుణ్యాన్ని ఉద్ఘాటిస్తూ ఉన్నది.

బుద్ధవిగ్రహమునకు ఎదురుగా ధ్యానంలో నిమగ్నుడై పద్మాసనంలో సంభూతి మొగ్గల్లానయోగి అధిష్ఠించి యున్నాడు. అతని చేతులలో విప్పియున్న ధాతుకీయ పారాయణ గ్రంథము వుంది. ఒక ప్రక్కను నికాయ సూక్తము, బ్రాహ్మచోలసూక్తము, ప్రజ్ఞామితాశాస్త్రము పడియున్నవి; రెండో ప్రక్క కమండలము, భిక్షకపళ్ళెబుట్ట, ఛత్రము ఆహారము గల పళ్లెము మెరుస్తున్నవి.

మధ్య కళ్ళు విప్పి గ్రంథం చూసి మొగ్గల్లాన యోగి:

"అభిక్కంతం భోగోతమ. అభిక్కంతం భోగోతమ. సెయ్యథాపి భోగోతమ నికుజ్జితంవా ఉక్కుజ్జేయ్య—పతిచ్ఛన్నం వా వివరేయ్య, మూళ్హస్సవా మగ్గం ఆచిక్ఖేయ్య, అంధకారేవా తేలపజ్జోతం ధారెయ్య; చక్ఖుమంతో రూపాణి దక్ఖింతీతి; ఏవం ఏవం భోతా గోతమేన అనేక పరియాయేన ధమ్మోపకాసితో. ఎతేమయం భవంతం గోతమంశరణం గచ్ఛామి, ధమ్మంచ భిక్ఖుసంఘంచ ఉపాసకెనోభవం గోతమో ధారెతు. అజ్జతగ్గే పానుపెతె శరణం గతేతిం అతి శ్రేష్ఠగోతము, ఓ అతి శ్రేష్ఠగోతము!" 'ఉన్మూలమైన వాటిని నిలపెట్టే, ఆచ్ఛాదితమైన వాటిని ప్రకటింపజేసే, భ్రమలో చిక్కుకున్న వారికి మార్గంచూపే, అంధకారములో నున్న వారికి దీపముజూపే, నీవు నేత్రములు ఉన్నవారు చూడగలిగేటట్లు, అనేక పర్యాయములు, శ్రేష్ఠతముడైన నీవు ధర్మమును ప్రకాశింపజేశావు. నిన్ను, గోతముని, శరణం వేడుకొంటున్నాను; నీ ధర్మాన్ని, నీ సంఘాన్ని, శరణం వేడుకుంటున్నాను. నన్ను నీ భక్తునిగా ఆశీర్వదించు. శరణం.'

అని అంటూ ధ్యానంలో కళ్లు ముకుళించినాడు.

## 1

[గుణభద్రుడు శిష్యునితోకలిసి మెట్లుఎక్కి మీదికివచ్చును]

---

* *St. Simeon Styllites* అనే ఆంగ్లనాటిక దీనిని రచించడానికి ప్రోత్సహించింది. అందుకు నా కృతజ్ఞతావందనములు.

శిష్యుడు : భిక్షూ, సంభూతిభిక్షూ. మొగ్గల్లానభిక్షూ, సకలశాస్త్ర పారంగతులు గుణభద్రదేవులు, మిమ్ము దర్శనము ప్రసాదింప వచ్చియున్నారు. కళ్లువిప్పి లేచి సత్కరించండి.

[సంభూతి మొగ్గల్లాన కన్ను విప్పలేదు.]

శిష్యుడు : యోగిభిక్షూ, మహాపండితుల దర్శనభాగ్యం మీకు లభిస్తూంటే, ఇటు చూడరేమి!

మొగ్గల్లాన : (కళ్లు మెల్లగ విప్పుతూ, అదే వారివైపు చూస్తూ, మీరెవరు అనే అర్థము ఇచ్చునట్లు తల ఒకమారు కంపించి, కళ్లుమూసాడు)

శిష్యుడు : ఇదేమి ? ఒకనటనా ! గుణభద్ర పండితుల ప్రఖ్యాతి నీ శ్రోత్రములవరకు పోలేదని నమ్మించడానికా ! మీ స్తంభం దాటి నక్షత్రమండల పర్యంతం వారి ఖ్యాతిచేరగా, వారిని అచ్చటి శాస్త్రమండలివారు "దేవులు" అని బిరుదాంకితులుగా చేశారు. ఆవాణి మీ చెవులకు సోకదనా ! (అని బిగ్గరగా గర్జించాడు).

మొగ్గల్లాన : (ఈ గర్జన ప్రారంభమంటే ఉలుక్కుపడినట్లు కళ్లువిప్పి చూచి కూర్చొని శిరస్సు కంపించాడు.)

గుణభద్రుడు : సంభూతి మొగ్గల్లాన యోగీ, నీవు నిజముగా నా పేరు వినియుండలేదా.

మొగ్గల్లాన : విన్నాను కాబోలు.

గుణభద్రుడు : (శిష్యునివైపు చూస్తూ) ఆ! (కొంచెముసేపు నిశ్శబ్దం)

మొగ్గల్లాన : మీ అఖండపాండిత్యంవల్ల మీరు సాధించినది ఏమిటి !

గుణభద్రుడు : శబ్దవిద్య. శిల్పస్థానవిద్య, చికిత్సావిద్య. హేతువిద్య,—అన్ని విద్యలలో పారంగతుడనైన నన్ను నీవు అధిక్షేపిస్తున్నావా ? ఊహ్! వీటి జ్ఞానము లేనివానికి ధర్మగ్రంధావబోధన ఎక్కడిది !

మొగ్గల్లాన : జ్ఞానము, ముఖ్యముగా శాస్త్రముల జ్ఞానము, వాదప్రతివాదాలకు, ఆచరణకు కాదుగదా! తథాగతుని ఉపదేశము ఆచరణ.

గుణభద్రుడు : "అంధకార నాశనాద్ధంవిద్యా." అనిగదా సూత్రం," శిష్యులకు శబ్దార్థనిర్వచనములు తెల్లగ తెలిస్తేనే, వారు బోధనలను బోధపరచుకోగలరు. విద్య పూర్తి జేసుకొన్నవారే అర్హులు కాగలరు. వివేకముంటేనే వైరాగ్యము. అప్పుడు తపశ్చర్యకు పూనుకోగలరు. అట్టివారిని పూజానిందలు స్పృశించలేవు." ఇదీ తథాగతుని శాసనము. నీవు అందుచేత విద్యను గర్హించరాదు.

మొగ్గల్లాన : "కామములను విసర్జించి కృతకృత్యుడవుకమ్ము. సర్వదుఃఖాలకుమూలము కోరిక. కోరికలను త్యజించినవాడే నిర్వాణాన్ని పొందగలడు." ఇది నిర్వాణ వచనము. (అని ప్రక్కన ఉన్న గ్రంథమువిప్పి చేతిలో స్థిరముగా ఉంచాడు.)

గుణభద్రుడు : ఆ నిర్వాణప్రాప్తికే జ్ఞానబోధన. నా శిష్యుడవుకా. క్రిందికి దిగివచ్చి శిష్యులకు జ్ఞానమును వెదజల్లి సంఘాభివృద్ధిచేయి. అది జ్ఞానతపస్సు. నిజమైనసేవ. అందుకే సంఘంగచ్ఛామి.

మొగ్గల్లాన : అందుకా యింత శ్రమపడి వచ్చావు. నేను ఇక్కడనే ఉంటాను. అనేక సంవత్సరాలనుండి ఇక్కడనే ఉన్నాను. దీనిని విడవజాలను. నాకు అలవడిన ఈ తపస్సు నీవు చెప్పిన శాస్త్రాధ్యాపనకంటె చాలా రెట్లు ఉత్తమము.

గుణభద్రుడు : నాది పెద్ద పాఠశాల. సుమారు రెండువందల విద్యార్థులతోడను, పదియుంది పండితులతోను కలకలమంటూ ఉంటుంది. మా శాస్త్రబోధనలకు నీ ఆచరణబోధన మేళవింపుజేసి లోకకళ్యాణము చేయగలవు. నాతో సాహచర్యముచేసి నీ ప్రక్కపడియున్న గ్రంథములలోని సూక్ష్మవిశేషాలను గ్రహించగలవు. ఈ ఏకాంతతపస్సు చాలించు. దిగిరమ్ము యోగీ.

మొగ్గల్లాన : శాస్త్రచర్చ అనే మోహములో నన్ను దించ ప్రయత్నించవద్దు. పొమ్ము బ్రాహ్మణదేవా. ఆ గురుకులవాసము నాకు వలదు. సమ్యకత్వన్యాయము నా మార్గము. పొమ్ము. (అని కళ్లు మూసుకొన ప్రయత్నించును.)

గుణభద్రుడు : జ్ఞానాన్ని నిరసించినవానికి సమ్యకత్వము ఎట్లు కుదరగలదు. సమ్యకత్వము అనే పదానికి నిర్వచన తెలుసునా నీకు. సమ్యకత్వసూత్రం అర్థమైనదా నీకు. హీనయాన మహాయాన భేదాలు తెలిస్తేగదా, సమ్యకత్వాచరణకు యోగ్యత సిద్ధిస్తుంది. జ్ఞానంవినా ఆచరణే మౌఢ్యం అని ప్రవచనము. రా నాతో.

మొగ్గల్లాన : పొమ్మంటే పోకపోవడము జ్ఞానమా? నా తపస్సును విఘ్నముచేయడానికి వచ్చిన పిశాచమా నీవు ! నేను సంపాదించిన తపశ్శక్తి నాకు చాలును. నాకు ఇంకేమీ అవసరము లేదు. నీవు వెళ్ళవా ! (అని పలికి కళ్లు మూసివేశాడు.)

శిష్యుడు : ముక్కు లేనివానికి మల్లి పువ్వా? తప్పు మనది. పదండి గురువర్యా పోదాం. (అని వారు పోగడానికి లేచారు.)

మొగ్గల్లాన : (ఒక గ్రంథాన్ని విప్పుతూ). అన్నం జీవం. అన్నం శరీరం. అంతవాల్లో అన స్తతోల్లోన్లో. (అని చదివిస్తూ) "ప్రపంచ నిస్సారత తెలుసుకోలేనివానికి అనుత్పాదజ్ఞానము ఎక్కడిది? జలముతో నెట్లు బ్రాహ్మణుడు రెండు వేళలందు ప్రక్షాళనము చేయునో, తాపసు డట్లు ఉదయాధి యోగజలములతో ఇంద్రియాలను కడిగి మనోవికారా లను వశపరచుకొని ధర్మమార్గాన్ని నడవవలెను." ఈ ప్రమాణములో విద్యాశాస్త్రిలను చెప్పలేదే. (అని కళ్లు మూసుకొంటాడు.)

## 2

[క్రిందినుంచి కేక] - మొగ్గల్లానా, సంఘభూతీ (అది ఇంకా యోగి చెవులకు చేరకముందే మరియొక మారు కేక) "మొగ్గల్లానా, మొగ్గల్లానా" (ఇంకా మొగ్గల్లాన కళ్ళు విప్పకముందే మెట్లుమీదికి వచ్చి)

శ్రావస్తి : నేను శ్రావస్తిని, నేను, అయ్యా, శ్రావస్తి వీర్యసేనను.

మొగ్గ : ఏమీ భిక్షు.

శ్రావస్తి : (ఒక బుట్ట జామిపళ్ళు ఎదుటవుంచి ఆశ్చర్యాదరములు సూచిస్తూ సాష్టాంగము వేశాడు. లేచి) అయితే మీరేనా సంఘభూతి మొగ్గల్లాన యోగి, ఇదేనా నీ దివ్య స్తంభ శిఖరము. మీ దర్శనము లభించిన ఈ క్షణము నా జీవితము పవిత్రమైనది. ఇందుకే ఇన్నాళ్ళు జీవించాను. ఇంత దేశము తిరిగాను.

మొగ్గ : (ఆ పళ్ళవైపు జూచి) ఇవేమిటి ?

శ్రావస్తి : అత్రంజిన జామితోటలకు ప్రసిద్ధి. మీ దర్శనము ఫలవంతముగా ఉండాలని ఈ పది పళ్ళను తెచ్చాను. పరిగ్రహించండి. మీ ఫలహారానికి ఉపచరించగలవు.

మొగ్గ : పది లేవే. ఆరే ఉన్నాయే. రెండు పూటలకు సరిపడిన భోజనమైనా ఇవ్వలేదే.

శ్రావస్తి : (ఆ కొంతకు ఆశ్చర్యపడుతూ) క్షమించండి. ఇక నేను వెళ్తాను.

మొగ్గ : ఎందుకు ఆ తొందర ?

శ్రావస్తి : అహ చిత్రచైత్యంలో మూడేండ్ల నుండీ ఒక పండైనా తినకుండా తపస్సు సమాధిలో ఉన్న ఆ మహాభిక్షుణీ ఉత్పలవర్ణను దర్శించాలి. విలంబం చేయరాదు అని లోకం ఘోషిస్తున్నది. ఆమె నిర్వాణస్థాయిలో ఉన్నదట.

మొగ్గ : (కొంచెము విసుగు కనబరుస్తూ) అయితే దారితప్పి ఇక్కడికి వచ్చావా. పో. ఉ. ఇక వెళ్లు. నీవు చేరేలోపున ఆమె కళ్లు మూసివేస్తే—

శ్రావస్తి : నాకు ఆమెకంటె ఎక్కువ విఖ్యాతులు గదండీ.

మొగ్గ : ఆమె కొరకు ఏమి తీసుకొని వెళ్లుతున్నావు ?

శ్రావస్తి : ఈ రేగుపళ్ల పొట్లము.

మొగ్గ : ఈ నిముషమో ఆ నిముషమో ప్రాణం విడవడానికి సిద్ధంగా ఉన్నదానికి ఆ పళ్ళు ఎందుకు ?

శ్రావస్తి : నా భక్తి స్వామీ.

మొగ్గ : ఛీ. ఆ మాట వింటే అసహ్యంగా ఉంది.

శ్రావస్తి : అర్హత్, కోపగించకండి. మీ దర్శనానికని చాలా దూరమునుండి నడచుకొని వచ్చాను.

మొగ్గ : దారిలో ఎంతోమంది అర్హులను, మునులను, యోగులను భిక్షుణీలను దర్శించినావు గదా.

శ్రావస్తి : లభించినవారి కందరికీ ప్రణామములు చేసే ప్రయాణము చేస్తూండేవాడినండి. అందుకే ఇన్నాళ్ళు అయింది ఇక్కడికి వచ్చేసరికి.

మొగ్గ : బోధపడింది. వాళ్లందరిలో నేను ఒకడిని. అంతేగదూ.

శ్రావస్తి : అందరికంటె మీరు ఉత్తములు. మీ కొరకే బయలుదేరినాను. బుద్ధం శరణంగచ్ఛామి. ధమ్మం శరణంగచ్ఛామి, సంఘం శరణంగచ్ఛామి.

మొగ్గ : నాకు ముఖస్తుతి అక్కరలేదు.

శ్రావస్తి : (తదేక దృష్టితో అతని ముఖమువైపు చూస్తూ) నేను చెప్పినది నిజము. ఈ లోకమంతా మీ ఉగ్రతపస్సు గురించి అద్భుత గౌరవముతో ప్రశంసిస్తున్నారు. సంఘం శరణం గచ్ఛామి. మీ దర్శనలాభము ఈ శరణ. మీ నేత్రములనుండి ప్రసరిస్తున్న తేజఃకిరణాలలో ఒక్కటి చాలు. ఈ శ్రావణుని పవిత్రపరచడానికి. పరివ్రాజకులు ఆ పవిత్రతా ప్రాప్తికి ఏమైనా సమర్పించగలరు.

మొగ్గ : అందుకా నాలుగు జామిపళ్లు..

శ్రావస్తి : నేను భగవంతుడిని కాను బోధి సత్వా.

మొగ్గ : ఆ, డబ్బు లేనివానికి దేశపర్యటన ఏలాగో కదా.

శ్రావస్తి : అదా మీరు అనేది. ప్రపంచము అంత సుమనోహరము, శోభస్కరమున్నూ. దానిలో స్వేచ్ఛావిహారమండీ నేను చేసినది.

మొగ్గ : దానికి ఈ శ్రావక వేషము ఎందుకు ?

శ్రావస్తి : డబ్బుకు బదులు ఈ వేషము. ఈ రోజులలో పరివ్రాజకునికి ఉచితముగా అన్నీ అందరూ ఇస్తారు.

మొగ్గ : అలాగే సంపాదించిన వేనా ఈ జామి పళ్లు.

శ్రావస్తి : డబ్బు ఉంటే ఇంతకంటె మంచివి గొనుకును.

మొగ్గ : అయితే పనికిమాలిన చెత్త తెచ్చావు నాకు. (అని ఉద్వేగముతో నేలపోస్తూ ఉంటే)

శ్రావస్తి : వద్దు ఉద్వేగము యోగీ.

మొగ్గ : (సర్దుకొని) నాకు నిరోధము లేదు అను కొన్నావా ? నీవలె పరివ్రాజకబ్రువుడను కాను నేను! చవకఅయిన ఆతిథ్యము దొరకడానికి వేసిన వేషము కాదు ఇది.

శ్రావస్తి : న్యాయమా ఇట్లు నిరసించడము. ఎంత కాంక్షతో వచ్చానండీ మీ దర్శనానికి.

మొగ్గ : నా దర్శనము అంత సులభమైనది అనా నీవు అనేది !

శ్రావస్తి : మీరు చాలా కఠినులే.

మొగ్గ : కుర్రవాడా. నాపైనే నేను దయ ఎర గను. నా తపస్సు కాఠిన్యము సంపాదించడానికే. దయ ఉండదు తపస్సులో.

శ్రావస్తి : అందుకనేనా అన్ని కాలాలలోనూ ఇక్కడనే ఉండగలుగుతున్నారు.

మొగ్గ : అవును.

శ్రావస్తి : వర్షించినా, ఎండకాసినా, మంచు పడినా...

మొగ్గ : ఎందుకు ఆ ఆశ్చర్యము.

శ్రావస్తి : ఎట్లు సహించగలుగుతున్నారో తాప సోత్తమా.

మొగ్గ : చేతగాని పెద్దమనిషులు మీరు. నీటిలో కరిగిపోయే ఉప్పుగడ్డ అనుకొన్నావా? ఎండలో వాడిపోయే తోటకూర అనుకొన్నావా ? మీరు ఇంద్రియవశులు.

శ్రావస్తి : సవినయంగా ప్రణమిల్లుతున్నాను యోగివర్యా.

మొగ్గ : పో. ఆ ఉత్పలవర్ణ దగ్గరికి. అక్క డికి వెళ్ళడానికి కదూ బయలుదేరావు. (చీదరతో) పో. దిగు మెట్లు. దానిని చూస్తూ అక్కడే ఉండ వచ్చు. కదల వేమి ?

శ్రావస్తి : (చేతులు జోడించి) మీరు రావాలి కదూ.

మొగ్గ : ఏమిటి ఆ ఉత్పలవర్ణను చూడడా నికా ?

శ్రావస్తి : ప్రపంచాన్ని చూద్దురు గాని స్వామీ.

మొగ్గ : నా తపస్సు భంగపరచడానికి వచ్చావా.

శ్రావస్తి : ప్రపంచము పచ్చగా నినదిస్తూనానికి నూలనాలంకారాలను ధరిస్తూ, తాజాగా తయారైనదే పరిమళాలతో ఆకర్షిస్తూ ఉంటుంది బాటసారులను. దిగివస్తే ఆ వసంతశోభలో తాండవమాడవచ్చును. ఇక్కడ ఒక్క సూర్యకాంతే; లేదా నక్షత్ర పరి వృతుడైన చంద్రుడే. ఈ దేవాలయము, ఈ విగ్ర హము, ఈ వసారా ఇదేగదా నిత్యమూ కనబడే దృశ్యాలు. అక్కడో ఆ విశాలప్రపంచములో క్రొత్త క్రొత్త నిర్మాణాలు, ఆ పచ్చపచ్చ తోరణాలు, పసుపుకుంకుమ రంగులతో ప్రజ్వలించే మానవ రచ నలు, వజ్రవైడూర్యాలతో అమర్చబడిన దేవాల యాలు, వివిధ వస్తుజాలముతో క్రిక్కిరిసియున్న దుకాణాలు, ఘుమఘుమ మనే పుష్ప-ఆరామాలు...

మొగ్గల్లాన : (కొంచెము వివర్ణమైన ముఖముతో) ఆ చెత్త నాకు ఎందుకయ్యా.

శ్రావస్తి : పట్టణాలే కావు. పాడి పంటలతో మత్తు ఎక్కిన పల్లెలు, స్వచ్ఛమైన నీటితో ప్రవహి స్తున్న చిన్న నదులు, పచ్చగా పండిన పళ్ళతో వంగిన చెట్లు, ఆకులతోను, పువ్వులతోను అల్లబడిన తివాసీలుగల గిరిసానువులు, సూర్యనమ స్కారాలు చేస్తూ మీదికి పెరిగిపోతున్న వృక్ష శాఖలతో చీకటిగల అడవులు, ఎన్నెన్ని చిత్రాలు! నేత్రానందము, హృదయంగమము.

మొగ్గల్లాన : నా కెందుకు ఈ ఆనందము, ఈ రంగులు !

శ్రావష్టి : తిన్నగా దిక్కులు చేరాలని పరుగెత్తుతున్న ఆ వెడల్పు రాజమార్గాలు, అనంతంగా ఆ పొలాలమధ్యను ఆ చెట్లబారులుగుండా సాగుతున్న ఆ రోడ్లు, అడవులగుండా, కొండలమీద, సాగరాల ప్రక్క, నదులు దాటి పోతున్న బాటలు ఎంత భావనోద్రేకములుగా ఉంటవి. రమ్మని ఈ ఊహలు ఎట్లు వాటిని అనుసరించునో చూడు గాని.

మొగ్గల్లాన : పోతావా పోవా. నాకు ఎందుకయ్యా ఈ బాధ, ఈ అల్లరీ.

శ్రావష్టి : మీ ఇంద్రియనిగ్రహము నన్ను జయించింది. ఎక్కడనుంచిగదా మీకు ఈ బలము ?

మొగ్గల్లాన : నీకు ఎందుకు ఆ రహస్యము ?

శ్రావష్టి : తెలుసుకోవాలని తపిస్తున్నాను.

మొగ్గ : నీవు కుర్రకాయవు, నీకు చెప్పను.

శ్రావష్టి : మీకున్న ధర్మనమ్మకమా ఈ శక్తిని ప్రసాగించింది ?

మొగ్గ : నా నిష్ఠ.

శ్రావష్టి : అంటే ? అభ్యాసమేనా ?

మొగ్గల్లాన : పో, ఆ ఉత్పలవర్ణను అనుసు. పో.

శ్రావష్టి : మీ దర్శనమువలన నాకు కొంత బలము కలిగింది, తపస్వీ.

మొగ్గల్లాన : అలాగే అయితే నీవు కూడా ఒక స్తూపశిఖరము చేరుకో.

శ్రావష్టి : నేను అలాగు చేయను. చేయలేను. నా అలవాటు తిరగడము. నా శరీరము సహించునంత వరకు పర్యటనమే నా జీవయాత్ర.

మొగ్గల్లాన : పోతావేమో. పో.

శ్రావష్టి : మీ ఆశీర్వాదము నాకు ప్రసాదించండి.

మొగ్గ : నీవు అందుకు అర్హుడవు కావు.

శ్రావష్టి : అది దొరకనిదీ ఇక్కడనుండి కదలను. ఏమి అన్యాయ్యము. ఇందుకొరకేగదా ఇన్నాళ్ళు తిరిగి తిరిగి వచ్చాను.

మొగ్గల్లాన : అయితే ఆ ఉత్పలవర్ణ దర్శనము నీకు మరి లభించదు.

శ్రావష్టి : ఆమె పేరు ఎందుకుగదా అలాగు జపము చేస్తారు మీరు.

(బాకా ధ్వని వినబడింది)

మొగ్గల్లాన : ఆ ధ్వని ఏమిటో చూడు.

శ్రావష్టి : (పిట్టగోడమీదనుంచి వంగి జూచి) ఏదో పెద్ద ఉత్సవము. గుఱ్ఱాలు, సవారీలు, సైనికులు, ఎవడో రాజు వస్తున్నట్లు ఉంది.

మొగ్గ : సరే, నా కెందుకులే. వాళ్ళ దారిని వాళ్ళు పోతారు. నీవు కూడా వాళ్ళతో పో.

శ్రావష్టి : ఇక్కడికి వస్తున్నట్లు ఉంది. చూచి వస్తాను.

మొగ్గ : రాకు. ఉత్పల దర్శనమో మరి.

శ్రావష్టి : (వెళ్ళిపోతాడు)

మొగ్గ : ఆ ఉత్సవముతో కలిసి నూతన ప్రపంచము చూస్తాడు. ఉత్పలదర్శనము చేస్తాడు కాబోలు. నా కెందుకు. (పుస్తకము విప్పి చదువుతూ) మానవుని గోషాన్ని ఎవడు పరిగణించగలడు. వాని అంతఃకలుషాన్ని ఎవడు గ్రహించగలడు. ప్రాకారము చుట్టూ తిరిగినంత మాత్రాన ప్రాకారములోని రహస్యము తెలియదే.

నమః బుద్ధాయ నమః బోధిసత్త్వేభ్యః
నమః ముక్తాయ నమః పురుషోత్తమాయ.

(అని ప్రార్థనచేసి చేతులు విరుచుకొంటూ, ఆ శ్రావష్టి ఇచ్చిన జామిపండు నొకటి తీసి, చుట్టూ తిప్పి పరీక్షించి వాడు వెళ్ళినవైపు విసిరి) పచ్చ, ఎరుపు ; బంగారం వెండి ; వజ్రం వైడూర్యం ; పువ్వులు పళ్ళు; పర్యటనము, చూపులు; జ్ఞానము విద్య;—ఏమి సిగ్గుమాలిన గాడిదలు !

ప్రజ్ఞప్తిసూక్తం విప్పి చదువుకొని, ధ్యానంచేసి "విసుగు చెందరాదు. ప్రపంచములో మూర్ఖులు అధిక సంఖ్యాకులు. మౌనమే ప్రతీకారము." "శరణం బుద్ధంగచ్ఛామి. శరణం ధమ్మంగచ్ఛామి." (బాకా బిగ్గరగా వినబడింది) "ఏమి బోధన. ఏమి తత్త్వము" (చాలా దగ్గరనుంచి వచ్చింది ధ్వని). "ఎందుకు ఈ అల్లర ! ఈ మూర్ఖులు ఎందుకు నన్ను బాధిస్తారో" (కళ్లు మూసుకొని, కళ్లువిప్పి) "హృదయంలో మంట పెట్టినది వనిత" (అని చదివి) "ఇక్కడ కూడా స్త్రీల గురించేనా" "మానవుని వెంటపెట్టే మృగాలు అడవిలోనే ఉండిపోవు. స్త్రీ రూపంగా బయటకు వచ్చి విచ్చలవిడి పురుషుని పడవేస్తవి. మోహము పాతకము. జాగ్రత్త." (అని చదివి) "ఎప్పటికిగదా పురుషునికి ముక్తి!" "ధమ్మం శరణంగచ్ఛామి" (తిరిగీ బాకాధ్వని) "నన్ను ధ్యానంలోనికి పోనీయదు కాబోలు ఈ బాకా."

# 3

మేట్లమీదనుండి కేకలు "అహిచ్ఛత్ర చక్రవర్తికి జై. విరూధక రారాజుకు జై" అని.

"స్తూపశిఖరాన్న ఉన్నా శాంతి లేదే" (అని కళ్లు మూసుకొనును)

(రాజు, అనుచరుడు చాటుపదుడు సమస్థలానికి వచ్చి)

చాటుపదుడు : తాపసీ, విరూధక మహాచక్రవర్తి నీకు గౌరవము చూపే అవకాశము కలుగజేయ ఇదే వస్తున్నాడు.

మొగ్గల్లాన : (కళ్ళు విప్పి చూస్తున్నాడు)

చాటుపదుడు : మహారాజాధిరాజ సార్వభౌమ చక్రవర్తి అహిచ్ఛత్ర భూమీశ్వరుడు విరూధక సామ్రాట్.

విరూధకుడు : నోరు మూయి. మునివర్యుని తపస్సు భంగపరచకు. (యోగిని అదే పరికించి చూచి) మీరేనా ఆ ప్రఖ్యాతయోగి, సంభూతి మొగ్గల్లాన యోగివర్యులు!

మొగ్గల్లాన : (అవును అన్నట్లు తలవూచెను.)

విరూధక : మీ తపోనిష్ఠక్లేశాలు జగత్తునంతా మీ గౌరవార్థం మీ దర్శనానికి ఆకర్షిస్తున్నవి.

మొగ్గల్లాన : (అర్థాంగీకార సుఖముతో చూస్తూ) ఊ!

విరూధక : ఐహికకాంక్షలను పారద్రోలిన తాపసులు మీరు ఒక్కరే అని ప్రపంచఖ్యాతి. దివ్యజ్ఞానసంపన్నులు, బ్రహ్మసహతా సాధకులు, బోధిసత్వులు, తథాగతసములు. లోకానికి అతీతులై లోకము ఎట్లు తిరుగుచున్నదో దాని స్థితిగతులు ఎట్టివో కనిపెట్టేవారు మీరు. శరణం గచ్ఛామి.

మొగ్గ : నన్ను చూడడానికి రావడములో ఉద్దేశమేమిటి?

విరూధక : మీ ఖ్యాతి విని మీ దర్శనముచేసి మీ తపోవిశేషాలు గ్రహించగలనా అని వచ్చాను.

మొగ్గల్లాన : అయితే ఏమిటి గ్రహించావు.

విరూధక : ఆశ్చర్యము తీరలేదే ఇంకా. గ్రహించడము ఎక్కడ.

మొగ్గల్లాన : అయితే, ఈ స్తంభం ఎక్కి ముక్కు మూసుకో.

విరూధక : నేను ఇక్కడ కూర్చుంటే, నాకు అది సాధ్యము కాదు సరే, కూర్చుంటే అక్కడ రాజ్యం చేసేవారో!

మొగ్గ : అయితే, కుతూహలంకోసము ఇక్కడికి వచ్చావా?

విరూధక : మీవంటివారి సలహా నాకు చాలా అవసరము నా రాజ్యపరిపాలనా నిర్వహణములో. నా రాజ్యప్రజలకు ధర్మము బోధపరుస్తూ వారిని ఉద్ధరించి నన్ను తరింపజేయండీ స్వామీ. దుష్కృత్యాలను చేయించే మనోవికారాలనుండి వారిని మరలించండి. లోకములోని అంధకారాన్ని మీ జ్యోతిః ప్రసారముచేత పారద్రోలండి.

మొగ్గ : నీ దేశము పెద్దదేనా?

విరూధక : చాలా విస్తృతి కలది.

మొగ్గ : ఇంత విశాలదేశంలో నీవు కోరిన ప్రబోధము చేయడానికి ఒక్క జ్ఞానవంతుడైనా లేడా?

విరూధక : మీవంటివాడు లేడు—నా దేశములోనే కాదు ఈ ప్రపంచమంతటిలో ఎక్కడా లేడు.

మొగ్గల్లాన : ఎందుకు ఆ స్తుతిపాఠము.

విరూధక : ఈ నిష్ఫలమైన కఠిన తపశ్చర్య ఎందుకు ఇక్కడ? నా రాజ్యము, నా ప్రజలు అన్నీ మీ ఆధీనము. రండి నాతో.

మొగ్గల్లాన : నేను రాను. నేను ఇక్కడనుండి కదలను.

విరూధక : ఎక్కడినుండి వచ్చిందండీ ఇంత నిష్ఠాబలము?

మొగ్గల్లాన : నీ ఊహ?

విరూధక: అమానుషమైన తపశ్చర్యవలనగదా?

మొగ్గ : అలాగే అనుకో. నన్ను విడిచిపెట్టు.

(అని చెప్పి, కళ్లు మూసుకొనెను. విరూధకుడు లేచి నిలబడి ఉన్నాడు.)

వీళ్ళంతా—ఎందుకుగదా—ఒకడు తరువాత ఒకడు—గ్రంథాలు జ్ఞానం; పళ్లు పువ్వులు; రాజ్యం ప్రచారము; వీళ్ళందరికీ కొరడాదెబ్బలు కావాలి.

(కళ్లు విప్పి, సూతనిపాతాన్ని తీసి, చదివి)

"వస్తువుకు అయిదింతలు దాని బరువు
దానిని మోసేవాడు నరుడు
అదే ప్రపంచము దుఃఖమున్నూ
దానిని విడిచేవాడు ధన్యుడు
ఒక బరువును దింపి మరొక బరువును
మోయడ మెందుకోగదా ఏదీ వలదు."

(కళ్ళు మూసి) "శరణంగచ్ఛామి." (కళ్ళు తెరచి మరొక పుస్తకము విప్పి చదివి)

నారీగోష్ఠి స్థిరబుద్ధిని ఉంచదు
స్త్రీలు ధర్మానికి ఉత్పాతకాలు
పురుషునికి పాపాలకి మూలకారణాలు

(కొంతసేపు ఆలోచించి) "ఈ సూత్రకారుని కాలంలో స్త్రీలు అంత దుష్టలా? నాకే అట్టివారు కనబడితే, ధర్మం నచ్చచెప్పనూ" తిరిగీ చదివి

"శాంతి కోరితే మహామారిని చూచి పారిపోయేటట్లు స్త్రీ కనబడితే పారిపో. పరుగెత్తు. నీ శక్తి అంతా నీ పాదాలలో పెట్టి పరుగెత్తు. పరుగెత్తి పరుగెత్తి సురక్షితమైన శరణ చేరుకో" "మళ్ళా అదేనా!" సంఘం శరణంగచ్ఛామి. అంతకంటె శరణ ఏది ఉన్నది గదా. కాని స్త్రీల గురించి ఇంత కాఠిన్యం ఎందుకు ఆ సర్వకర్తలకు? వారు నిజమైన స్త్రీని చూచి ఉండరు. సహృదయముగల స్త్రీతో మాట్లాడి ఉండరు అదే కారణము."

[విరూపాక్షక మహారాజా, వాని అనుచరులు ఈ ప్రమాణవాక్యాలను, అంతకంటె ఎక్కువగా సంఘాతియోగి వ్యాఖ్యానాలను వింటూ ఆశ్చర్యము భయము, జుగుప్స భావాలను వ్యక్తపరచే దృష్టులతో నిలబడ్డారు. వెళ్ళడానికి సిద్ధపడుతున్నారు.]

# 4

[క్రింద స్త్రీకంఠము వినబడ్డది. "సంఘాతి మొగ్గల్లానా"

మొగ్గల్లాన: (కళ్ళు విప్పి) "ఒక్కరోజైన, ఇంత స్వల్పవిరామములో, ఇంతమంది నుండా ఇంతే బాధ ఈ పరివ్రాజకునికి. బుద్ధం శరణంగచ్ఛామి."

స్త్రీకంఠము: కష్టం మీద మెట్లు ఎక్కుతున్నాము.

మొగ్గల్లాన: ఈ వసారాలో మరి స్థలం లేదు. రావద్దు.

స్త్రీ: మా రాణిగారు ఇదిగో వచ్చారు మీ దర్శనార్థమై యోగీ.

మొగ్గ: రావద్దు అని చెప్పు. ఇక్కడ స్థలం లేదు. బరువుకి ఈ వసారా కూలిపోగలదు.

స్త్రీ: పసివా. అబలలు నిన్ను చూడవస్తే కూలిపోమంటావా?

విరూపాక్షుడు: మేము దిగుతాము. దారి కావాలి. ఆమెను దిగమను.

చాటుపదుడు: అహో చిత్ర సార్వభౌములుంగారు దిగుతారు.

స్త్రీ: నా రాణిగారు వెనకకు మరలరు. ఒక సార్వభౌముడు కాదు. వెయ్యిమంది కానీ. మా రాణిగారు నీ రాజుగారికి తీసిపోరు.

చాటుపదుడు: చూదాము ఎవరు క్రిందికి పడతారో.

విరూపాక్షుడు: అవకాను. ఇక్కడ స్థలం కుశలం. మేము దిగితే మీ రాణిగారు రావచ్చును.

స్త్రీ: నేను ఈ తాపసుని దగ్గరగా వెళ్తాను. మీరు ఇటు రండి. మా రాణిగారు వచ్చివేస్తే మీరు దిగిపోండి. (అని మొగ్గల్లానకు తగులుతూ కూర్చుంది చందమనా.)

మొగ్గల్లాన: ఇదేమి దుష్కృతము. వనితాస్పర్శ నాకు? బుద్ధం శరణంగచ్ఛామి.

విరూపాక్షక: (మీది మెట్టుమీద నిలబడియున్న రాణీని చూచి) శ్రీమతి రాణిగారు దయచేసి మీదికి వచ్చివేస్తే, మేము దిగడానికి మార్గము దొరుకుతుంది.

మొగ్గ: నీకు ఏమి అధికారం ఆమెను ఇక్కడికి రమ్మని పిలవడానికి? ఇది నా దేశం.

(సుందరానంద మీదికి వచ్చివేసింది. అవరణము అంతా ఆమె శరీరమునుండి ప్రసరిస్తున్న సువాసనతో నిండిపోయింది.)

మొగ్గల్లాన: (తలయెత్తి చూచి) ఓ లావణ్యవతీ! ఈ పరిచారికయొక్క అత్యాచారము చూశావా.

చందమనా: యోగిన. శరణంగచ్ఛామి. అమ్మగారు లేకపోతే, మెట్లమీదనుంచి దొర్లి మీ పాదాలమీద పడవలసి వచ్చి ఉండును.

సుందరానంద: (చిన్న మందహాసముతో) మీ ఇద్దరిస్థితి ఒక చిన్న దృశ్యంగా ఉంది.

చందమనా: స్పర్శసుఖం కాదు అమ్మగారూ స్థానచరణం.

మొగ్గల్లాన: ఇన్నాళ్ళ నా తపస్సు ఈరోజున ఈ తిరస్కారంగా ఫలించింది. ఏమి ప్రారబ్ధం.

రాజు: తాపసీ, నేను వెళ్తున్నాను. ఇప్పుడు బోధపడిందా ఆ ప్రమాణగ్రంథాలు ఎందుకు వారించినవో. ఈ అసభ్యస్త్రీల అగౌరవం నాకు సిగ్గే పుట్టిస్తున్నది. పురాతనమునుండీ యోగులకు ఈ తిరస్కారము సంప్రదాయమైనదే గదా. ఇప్పుడైనా గ్రహించండి. ఈ నిష్ఠుర తపస్సు మిమ్ము తరింపజేయదు. లోకసేవ కళ్యాణకరము. నాతో రండి.

సుందరానంద: నేను మేనకను గాను రంభను గాను. పురాణ సంప్రదాయస్మరణము. చందమనా ఇటు రా. రాజా మేము అసభ్యులమా. మొగవారి అహంకారము నిన్ను అలాగు పలికించింది. మమ్ములిని తిరస్కరించిన నీవు వనితాకుటుంబాన్ని అంతను అవమానపరిచినట్లు సుమా. నీ తల్లిని నీ భార్యను నీ సోదరిని గౌరవించు. స్త్రీలు సాధువులు. పురుషులే అనార్యులు. ఏమంటారుగదా యోగివర్యులు.

రాజు: క్షమించవలెను. మీవంటి సుందరాంగనలు సౌజన్యులుగానే ఉంటారు. పొరబడినాను.

(దిగిపోయినాడు)

సుందరానంద: యోగివర్యా ప్రణామము. హృదయపూర్వకపూజను సమర్పిస్తున్నాను. మీదర్శనార్థము ఎంతో దూరమునుండి ఎంతో ప్రయాసపడివచ్చాను. మీతో కొంతసేపు సంప్రతించాలి.

చందమమా : అమ్మా, యోగిగారి కొరకు తెచ్చిన కానుకలు క్రిందను ఉండిపోయినవి. వాటిని తేవడానికి నేను వెళ్తాను.

మొగ్గల్లాన : నన్ను అవమాన పరిచేందుకా దీనిని తీసుకొని వచ్చావు.

సుందరానంది : అది చిన్నది. దానికి లోకము తీరు తెలియదు గదండీ.

మొగ్గల్లాన : ఛీ. చిన్నదా అది. పడుచుదాని పొగరు అది. దానిని తేకుండా ఉంటే—

సుందరానంది : పిల్లా క్రిందికి పో. అక్కడే ఆడుకొంటూ ఉండు, నేను కేక వేసేదాకా.

చందమమా : (వెళ్ళింది)

మొగ్గల్లాన : నీకు దానివల్ల అంత భయము ఎందుకు ?

సుందరానంది : (చిన్న హాసము చేసి) మీరేనా ఆ జగద్విఖ్యాత సంభూతి మొగ్గల్లానగారు?

మొగ్గల్లాన : నేను మరొకడిని అని అనుమానిస్తున్నావా?

సుందరానంది : నా పని వారితోనే. వృధా ప్రయత్నము ఎందుకని ఆలాగు ప్రశ్న వేశాను.

మొగ్గల్లాన : ఏమిటి ఆ పని?

సుందరానంది : మానవాతీతమైన తపః కార్యాన్ని సాధించినవారు మీరు. మీతో సంభాషణ ఎట్లు ఉపక్రమించవలెనో తెలియక—

మొగ్గల్లాన : చాలాదూరమునుండి వచ్చావా.

సుందరానంది : చూడండి. కొంచెము ముఖము ఎత్తి, నేత్రములు సారించి మీకు ఎదుటను కనబడుతున్న ఎత్తైన కొండలమధ్య నా రాజ్యము.

మొగ్గల్లాన : ఆఁ—

సుందరానంది : కనబడుతున్నవి కావండీ. బాగా కళ్లు విప్పి చూడండి. ఆ కనబడుతున్న వాటి వెనక—వాటి వెనక—వెనక—వెనక...

మొగ్గల్లాన : సరే—అయితే—ఊఁ...కానీ...

సుందరానంది : కొండల వెనక—అడవుల మధ్య—చక్కని మేడ - పువ్వులతోట – నావైపు చూడండి. నా పేరు వినియుండలేదూ

మొగ్గల్లాన : నీ పేరా...

సుందరానంది : నేనే ఆ సుందరానంది.

మొగ్గల్లాన : అదా నీ పేరు.

సుందరానంది : విని ఉండలేదూ ?

మొగ్గల్లాన : అంటే !

సుందరానంది : నేను చక్కగా ఉన్నాను కాను.

మొగ్గల్లాన : అంటే—

సుందరానంది : అంటేనా—చాలామంది స్త్రీలు పురుషులు నన్ను నా సౌందర్యాన్ని శ్లాఘించారు. ధనవంతులు, రాజులు, వీరాగ్రేసరులు, దూతలు, దూతికలు, నా ప్రజలు, నా సేవకత్తెలు—పిల్లలు వాళ్లు ఏమిటి, అందరూ స్తోత్రాలు చేసేవారే- ఆ మూకలలో మునులు యోగులు తాపసులు లేరు. వారి అనుభవము ఎట్లుండునో తెలుసుకొన కుతూహలము కలిగింది. వారి అందరిలో ప్రఖ్యాతి గడించినవారు మీరు. మీరు చక్కగా నన్ను చూచి మీ అభిప్రాయము చెప్పండి.

మొగ్గల్లాన : (చక్కగా ఆమె చూస్తూ ఉన్నాడు.)

సుందరానంది : నేను ఆకర్షించగలదాననేనా? ...నేను ఆనందింప చేయగలదాననేనా ?...

మొగ్గల్లాన : (నేత్రములు నిగుడించి) నీవు సుం...ద...రి... వే. నేను చక్కని స్త్రీలను కొందరిని చూచియున్నాను. నీవు చక్కని చుక్కవు.

సుందరానంది : కృతార్థురాలను.

మొగ్గల్లాన : సంతుష్టి అయిందా.

సుందరానంది : నీకు కోపము వచ్చిందా.

మొగ్గల్లాన : ఆలాగు కనబడుతున్నానా ?

సుందరానంది : నీవు మహాకోపివి అని అందరూ చెప్పారుగదా.

మొగ్గల్లాన : కావాలంటే కటువుగా ఉండగలను.

సుందరానంది : అయితే నా అదృష్టమే.

మొగ్గల్లాన : అదా...నీవు...మరి...కులాసా చేశావు తే...

సుందరానంది : నీ అలవాటును నీకు ఇష్టమైతే మార్చుకోగలవు అయితే.

మొగ్గల్లాన : అదా...

సుందరానంది : అవును......

మొగ్గల్లాన : నా అభ్యాసము కాఠిన్యమే.

సుందరానంది : అయితే నాలో ఏమిఉందని ఆ కాఠిన్యము వదిలివేశావు ?

మొగ్గల్లాన : నీవు ఆకర్షించగలవు నిజంగా చెప్పాలంటే.

సుందరానంది : నా యౌవనమా నీవు అన్నది.

మొగ్గల్లాన : అంత యువతివి కావే నీవు.

సుందరానంది : అయితే ?

మొగ్గల్లాన : నీ హృదయము...

సుందరానంది : అంటే...

మొగ్గల్లాన : నీవు సహృదయురాలవు.

సుందరానంది : నీవు అనుకొన్నంత అవివేకరాలును కాను నేను.

మొగ్గల్లాన : అదా నీవు అనేది

సుందరానంది : మరి.

మొగ్గల్లాన : నన్ను వశపరచుకోవాలని నీవు కోరుతున్నావు. అది వివేకమేనా ?

సుందరానంది : నీవు నిజంగా మోటుమనిషివి.

మొగ్గల్లాన : గౌరవించబడాలని వచ్చావా.

సుందరానంది : నీ గౌరవాన్ని నేను ఏమి చేసుకొంటాను.

మొగ్గల్లాన: విదిలిన్నా కొరుఅంటావే. మరి...

సుందరానంది : (చిన్ననవ్వులో అదే చూసింది)

మొగ్గల్లాన : మరి ఎందుకు వచ్చావు ఇక్కడికి.

సుందరానంది : చెప్పింది మరచిపోయినావా.

మొగ్గల్లాన : ఏమిటి చెప్పావుగదా.

సుందరానంది : (మందహాసంతో) నన్ను కలిసినవాళ్ళు అందరూ నా సౌందర్యానికి భ్రమచెంది నన్ను అదే పొగడాలని ప్రయత్నించినవారే. ఉస్తోత్రాలతో నాకు విసుగు ఎత్తింది. నా సౌందర్యానికి వశను కానివానిని కలిసి ఆనందించాలని ఇంతదూరం వచ్చాను.

మొగ్గల్లాన : ఎందుకు ఆవేశం ! నన్ను వశపరచుకోవడానికి వచ్చావు. అబద్ధం ఎందుకు ? నీ ముఖవిలాసాన్ని, నీ చూపు రేఖలన్ని...

సుందరానంది : నీవూ ఆరంభించావా. నేను వెళ్తాను.

మొగ్గల్లాన : విజయధ్వని వినందే?

సుందరానంది : ఇది చాలదూ...

మొగ్గల్లాన : విజయశ్రీ అని బిరుదు నేను ప్రసాదించవద్దూ. నీ జితులలో నేనుకూడా ఒకడిని అని నేను ఒప్పుకోవద్దూ.

సుందరానంది : అన్నట్లేగదా.

మొగ్గల్లాన : నీ శక్తిని పరీక్షించుకోవాలని వచ్చావా.

సుందరానంది : అది నిజమే అనుకో ; అలాగు పైకి అనవచ్చునా.

మొగ్గల్లాన : నాకు అబద్ధము ఎందుకు?

సుందరానంది : ఎందుకౌ నటన? నీహృదయం ఏలాగు చలిస్తున్నదో నీ రక్తము ఆ నరాలలో ఏలాగు స్పందిస్తున్నదో నా కండ్లకు స్పష్టముగా కనిపిస్తూ ఉంటే?

మొగ్గల్లాన : ఏమిటి ఆ సిగ్గులేకపోవడము?

సుందరానంది : పోనీకాని, నేను నీకు కనబడడమువల్ల నీకు సంతోషం కలిగిందని ఎందుకు ఒప్పుకోవు.

మొగ్గల్లాన : నా నిష్ఠాభంగకరము.

సుందరానంది : అయితే నేను వెళ్తాను. (అని నవ్వింది)

మొగ్గల్లాన : ఎందుకు ఆ ఆనందం.

సుందరానంది : నిన్ను ఒక్క నిముష మాత్రమైనా సుఖపెట్టగలిగానని.

మొగ్గల్లాన : అయితే.

సుందరానంది : అయితేనా? నేను జయించని వాడు ప్రపంచములో ఎవడూ లేడు అని నాగర్వము.

మొగ్గల్లాన : ఆ అభాగ్యుడను నేను!

సుందరానంది : రా నావెంట. నా కోసకు రా.

మొగ్గల్లాన : అది అసంభవము.

సుందరానంది : సంభూతి కాదు అనకు.

మొగ్గల్లాన : (నవ్వాడు)

సుందరానంది: ఎందుకు ఆమోసం. దా...రా...

మొగ్గల్లాన : నా జీవితమంతా శ్రమపడి సంపాదించిన ఈ స్వాధీనతను మంట కలపమంటావా. నీ విలాసాలకి బానిసగా చేసుకోవాలనా నీ పన్నాగము !

సుందరానంది : నాతో రావాలని ఇప్పుడు నీ మనస్సులో లేదని అనగలవా ?

మొగ్గల్లాన : (ఆమెపైపు కళ్లు బాగా సారించి) కృతజ్ఞుడను. నాకు నూతనలోకాన్ని ప్రదర్శించావు.

సుందరానంది : అందుకే రా నాతో. ఆ క్రొత్త వాసము చేదువుగాని.

మొగ్గల్లాన : ఇంద్రియవశుడను కానేరను. ఇక్కడనే ఉండాలి.

సుందరానంది : నాకు ఆశాభంగము చేయవద్దు సుమా.

మొగ్గల్లాన : ఎందుకు అలాగు కలతపడుతున్నావు. వద్దు కంటనీరు పెట్టుకోకు. మనము స్నేహితులముగా విడిపోదాము.

సుందరానంది : నాపై నీకు ఇష్టములేదా.

మొగ్గల్లాన : చాలా యిష్టము కలిగింది.

సుందరానంది : నాపై నీకు ప్రేమ పుట్టలేదా.

మొగ్గల్లాన : ప్రేయసీ!...సరా...ఇక వెళ్ళు.

సుందరానంది : ఏమి దారుణాము ఇది. చక్కని సమయంలో నా ప్రేమభాండాన్ని బ్రద్దలుకొట్ట ప్రయత్నిస్తున్నావు. ఈ పనికిమాలిన నైష్ఠుర్యమునుంచి నిన్ను రక్షించి, పునర్జన్మ కల్పించి నిన్ను మానవు

నిగా చేయ అభిలషించి వచ్చినాను. నీ సాహచర్యం వల్ల నా సంతుష్టి అనుకొన్నావా? నీవు సంపాదించిన శక్తిని ఈ మానుషత్వం మేళవింపుజేసి నీ సత్తను లోకానికి అప్పజెప్పాలని నా సంకల్పం. నా ఆశ నెరవేర్చి ఏ కోరికకూడా తీర్చుకొనగలవు. నీ హృదయము విశాలము కాగలదు. రా.

మొగ్గల్లాన: (ప్రక్కనున్న జామిపండు తీసి) ఇది పరిగ్రహించి ఇక వెళ్లు. ఇదే నా ప్రసాదము.

సుందరానంది: (పండు చేతులారా అందుకొని, వాసనజూచి) ఇది చప్పనిది.

మొగ్గల్లాన: జగత్తే చప్పన లలనా. కాబట్టే, మీరు వదలి నీవు అని నన్ను సంబోధించినా చలించలేదు.

సుందరానంది: వివేక రహితుడైన నపుంసకుడు తప్ప మరి యెవను ఈలాగు ఎంత వాచ అనకుండా, ఒక భయంకరమైన దిష్టి బొమ్మలాగు భూమిని విడిచినట్లు జైపైట్ట అడుగుల ఎత్తున కూర్చోగలడు? చలించినా చలించలేదని భ్రమపడగలడు?

మొగ్గల్లాన: నామార్గం నాది నీమార్గం నీది. నా నడవడి నీకు ఎంత విపరీతంగా కనిపిస్తున్నదో, నీది కూడా నాకు ఆలాగే వ్యక్తమవుతున్నది ఇక వెళ్ళు.

సుందరానంది: నిన్ను తోడుకొనిగదా వెళ్తాను.

మొగ్గల్లాన: వీగిపోయానని సిగ్గపడుతూ పైకి ఈ ఉద్రేకము ఎందుకు.

సుందరానంది: నిజమే. నా ప్రయత్నం అంత సులువైనది కాదని నాకు తెలియకకాదు. ఒకొక్కప్పుడు అలసిపోయినా, తుదకు జయిస్తునాదే. నా బిరుదు జయశ్రీ. నన్ను మరవలేవు.

మొగ్గల్లాన: నీకు ఆశాభంగము కలిగినందుకు ఈ భిక్కుని మరచిపో.

సుందరానంది: నిన్ను మరవను. నన్ను మరవక.

మొగ్గల్లాన: ఈ కృశించిన హృదయపీఠములో నీవు నాటిన బీజము అంకురించినది. చందమునా (పరుగెత్తుకొని వచ్చి) చాలా వేళ అయింది అమ్మా. పని పూర్తికాలేదూ.

సుందరానంది: (పియునా, వెళ్తున్నాను

మొగ్గల్లాన: (ఆమెవైపు అదే చూసి, అవె పాదధ్వని నశించగా కళ్లు నములుకొని, సూర్యభగవానుని కిరణాలలో వాటిని కడిగి)

నమో భగవతే బోధిసత్వాయ.
అనేకపరియాయేన ధమ్మో పకాశితో
భగవంతంగోతమం శరణంగచ్ఛామి.
భిక్కుసంఘంచ శరణంగచ్ఛామి.

(అని ధ్యానములో నిలపడినాడు. కొంతసేపైన తరువాత లేచి సూర్యుని నమస్కరిస్తూ) కొంగ మేఘాలనుండి వెలిలిన భానుడేగదా తీక్షణముగా ప్రకాశిస్తాడు. (గ్రంథాన్ని విప్పి పఠనము చేస్తూ)

గజమెట్లు శరవర్షాలను సహిస్తుందో
విద్వేషులవాక్కులను భిక్కు సహించాలి.
ప్రపంచము కలుషమైనది విశ్వసింపు.
స్వాధీనతఒక్కటే నిర్వాణమార్గము.
ప్రశస్తమువికొంత జీవనము.
వనమధ్యగతమైన ఒంటరిగజమువలె
జీవనయాత్రను నడపవలెను.

కొంతసేపు ధ్యానముచేస్తూ "ఎందరు నన్ను ఇట్లు భ్రమింప ప్రయత్నిస్తారో. జ్ఞానము అని ఒకడు, దేశయాత్ర అని ఒకడు, రాజ్యపాలన అని ఒకడు, ప్రేమ అని ఒకర్తె ఇట్లు నన్ను ఎందుకు బాధపెట్ట ప్రయత్నిస్తారో. నా నిష్ఠపై అసూయా?"

(అని ఇట్లు తలపోస్తూ ఉంటే, మెట్లమీద నుండి పాదధ్వని వినబడింది.)

## 5

ఒకధ్వని: సంభూతీ ప్రార్థన చేస్తున్నావా

మొగ్గల్లాన: సూర్యాస్తమానం అవుతూ ఉన్నా నన్ను వదలరా ఈ పాపాత్ములు. బుద్ధం శరణంగచ్ఛామి.

ఒకధ్వని: మారమోహక్ జీ వస్తున్నాడు.

మొగ్గల్లాన: వచ్చివెళ్లినవారు చాలలేదనా ఇతడు వస్తున్నాడు.

మారమోహకుడు: నేను రావద్దా.

మొగ్గల్లాన: వచ్చి వెళ్ళినవారు ఏమిచేశారో నీవూ అంతేచేస్తావు ఎందుకు వచ్చావు.

మారమోహకుడు: నేను అంటే జంకు లేదా.

మొగ్గల్లాన: బోధించారు. ఆశపెట్టారు. మోహింపజేశారు—కాని అందరూ వీగిపోయారు. నీవు భయపెట్టడానికి వచ్చావా.

మార: ఎందుకు ఈ తపస్సు?

మొగ్గ: నా అలవాటు

మార: వార్ధక్యంలో చేతగాక—

మొగ్గ : అందరిని తిరస్కరించగల శక్తి

మార : ఎందుకు ఆ అబద్ధం. మెట్లదిగువ ఆ సుందరానంది నీ రహస్యము చెప్పింది.

మొగ్గ : ఆమె పవిత్రనామము స్మరించ నీకు హక్కు లేదు. నీవు పాపివి.

మార : పవిత్రత ఒకటూ. ఓహో నీ పవిత్రత వంటిదే. నీవు యువకుల నెందరినో పాడుచేస్తున్నావు. నీ తపస్సుకు భ్రమపడి వారందరూ నీవలెనే గుడ్డలు మూసుకొంటున్నారు. అందరూ నిన్ను సత్కరిస్తున్నారు. సత్కరించాలంటే సంఘారి అని పిలుస్తున్నారు. అందరూ మాడాలనే ఈ ఎత్తైన స్తూపాన్ని ఆక్రమించావు. గా క్రిందికి రా. వ్యర్థము, నిస్సారము, కృత్రిమము, భ్రాంతి దాయకము అయిన ఈ వేషము ఇక మానాలి.

మొగ్గల్లాన : నీవు ఎవడవురా నామీద అధికారం చేయడానికి. లోకములోని బలహీనుల చేత పాపకార్యాలు చేయించే అధికారం నీకు ఉంటే ఉండనీ. నామీద చెల్లదు. పో ఇక్కడనుంచి. నా అజేయమైన ఈ నిష్ఠకు ఆశ్చర్యపడి వచ్చావా. ఈ స్తంభం, ఈ నిష్ఠ నేను ఏకమైనాము. ఒకటిని విడిచి ఒకటి ఉండదు. దిగాలన్నా దిగలేను. పండితుని పాఠశాల నిర్వహణము, శ్రావణితో దేశపర్యటనము, రాజుతో రాజ్యమేలడం నాకు కోరికలేక కాదు నిరాకరించడము.

మార : దాచావు, ఆ సుందరానందితోనో

మొగ్గ : అదా, ఎందుకు దాచడం. నీకు తెలిసిందేగదా. అది అమాయకురాలు. నిర్వ్యాజ్యమైన ఆనందము ప్రసాదించగల సుందరి.

మార : వీటి నన్నిటినీ ఎందుకు పోగొట్టుకొన్నావు.

మొగ్గ : యావజ్జీవము పాటుపడి సంపాదించిన ఈ అలవాటు నాకు ఆ శక్తిని కలిగించింది. ఈ నిష్ఠను వదలలేను.

మార : నిష్ఠ నిష్ఠ అంటావు. మరి వేరెవరికి నిష్ఠ లేదా.

మొగ్గ : జీవితమే నిష్ఠ. నిరాపేక్షతో విద్యాదానము చేస్తున్న ఆ పండితుని నిష్ఠ అపారమైనది. అది జ్ఞానతపస్సు. రోగులకు అహర్నిశము చికిత్స చేసే ఆ గౌతమిది నిజమైన తపస్సు. ప్రొద్దున్ననుండి సాయంకాలంవరకు పనిచేసి పిల్లలను పెంచే ఆ కూలిదానిది నిష్ఠ కాదా. ప్రజలకొరకు పాటుపడున్న ఆ రాజు పని తపస్సు కాదా. సౌందర్యము నిలుపుకొన ప్రయత్నిస్తున్న ఆ రాణిది నిష్ఠ కాదా. ఈ రోజున సంపాదించినది ఈ అనుభవము. ఎవరి మార్గము వారిది. నాది నేను వదలుకోలేను. అభ్యాస శృంఖలములచే బంధింపబడ్డాను.

మార : ఈ తత్త్వానికి వచ్చావూ! నామాటో'.

మొగ్గ : నీది సేవ కాదు. లోకహితము కాదు. పాపివి నీవు. పో.

మార : నీ నిష్ఠ లోకహితమా?

మొగ్గ : నిష్ఠ నిష్ఠే. విషయమేదైనా ఒక్కటే.

మార : మంచి హితము విషయముగా చేసుకో.

మొగ్గ : అసంభవము. బాగా ఎండిపోయిన కర్రను వంచలేము. నా అలవాటులో పచ్చి లేదు; ఇక వంగను. ఆ శ్రావణిని గౌరవించ మానను. ఆ పండితుని అధ్యాపనము గానము. రాజును పరిపాలన మానను. సుందరానందిని సౌందర్యసేవ మాననును. నీవు నీ పాపకర్మలను మానగలవా.

మార : నీవు ఈ స్తంభం దిగివస్తే సన్యాసిని అవుతాను.

మొగ్గ : నేను దిగలేను. నీవు మారితే సంతోషము.

మార : భూకంపము వచ్చి ఈ స్తంభం విరిగితే.

మొగ్గ : మరియొక స్తంభం - ఇక పో.

మార : (బుర్ర వంచుకొని వెళ్ళిపోవును) నీ తత్త్వము అందరికీ చల్లకే చేస్తాను.

మొగ్గ : (ఒక గ్రంథాన్ని తీసి చదువుతాడు)

నిరశనము గాని అశయనము గాని
కాయక్లేశము గాని ఆసనయోగము గాని
పురుషుని సంశయాలను ఛేదించలేవు.
శాంతియుక్తమై స్వాధీనగతమై
చరించు జీవనమే ముక్తిసాధకము.

నిజమే. అదే ధర్మచోదితమార్గము. కాని ఈ రోజు ప్రేక్షకులు నా నిష్ఠారంభములోనే వచ్చి ఉంటే! ఆ సుందరానంది అప్పుడు రాకేపోవునేమో. నిష్ఠ నిష్ఠే.

నమస్తే శాంతాయ సర్వాస్త్ర సాధకాయ
నమస్తే బుద్ధాయ సర్వగమన బోధకాయ
బుద్ధం శరణంగచ్ఛామి. సంఘం శరణం గచ్ఛామి.

# గ్రంథవిమర్శనము

## అధ్యాత్మ సంకీర్తనలు

తాళ్ళపాక అన్నమాచార్యులు. ప్రతులకు: డైరక్టరు, యస్. వి. ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్, తిరుపతి. చిత్తూరుజిల్లా. వెల: రెండు రూపాయలు.

వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం వారింతకు పూర్వం అయిదు అన్నమాచార్య సంకీర్తనసంపుటాలు ప్రచురించారు ఇది ఆరవసంపుటము. ఈ సంపుటంలో 50 రేకులమీద చెక్కిన పాటలున్నాయి.

సంకీర్తన సంగీత సాహిత్యాల సమసమ్మేళనం చక్కగా అమరిన గేయకృతి.

అన్నమాచార్యుల రచనలీజాతి రచనలలో ఉత్తమోత్తమమైనవి. ఈ కృతులలో అంతటు పరిణతమైన ఆధ్యాత్మికత, భక్తిభావము కలిసి మెలిసి గేయధోరణిలో జాలువారుతూంటాయి.

త్యాగరాజు రచించిన కృతులలో సంగీతానికున్నంత ప్రాధాన్యం సాహిత్యానికి లేదు. కాని అన్నమాచార్యులు రచించిన సంకీర్తనలలో సంగీత సాహిత్యాలు రెండు సమానమైన పోష్యపోషక భావంలో సాగిపోతూంటాయి. ఈ సంపుటిలో సంగీత విద్వాంసులే కాక సాహిత్య పరులచేత కూడా తల యూపించగలిగిన సంకీర్తనలనేకం ఉన్నాయి. ఈ విషయంలో భగవద్భక్తులను మహావీరులతో పరిపోల్చే ఈ క్రింది సంకీర్తన ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"అదివో నిత్యశూరులు అచ్యుతునిదాసులు
యెదురు లేనివారు యేకాంగవీరులు
రచ్చల సంసారమనే రణరంగములోను
తచ్చి కామక్రోధాల తలలుగొట్టి
అచ్చపు తిరుమంత్రపు టారుబొబ్బలతోడి
యిచ్చలనే తిరిగేరు యేకాంగవీరులు
మెరసి పుట్టుములనే ముచ్చు బోజుల కలికి
తెరలి నడుములకు బిగనేసి
పొరిగర్మము బొడిచి పోటుగంటుల దూలి
యెరగొని తిరిగేరు యేకాంగవీరులు.
వొడ్డిన దేహములనే వూళ్ళలోపల చొచ్చి
చెడ్డ యహంకారమను చెరలు వట్టి
అడ్డమై శ్రీ వెంకటేశునండనుండి లోకులనే
యొడ్డల జూచి నవ్వేరు యేకాంగవీరులు"

అయితే ఈ పుస్తకంలో 67 పేజీలోం

"హరి యవతార మతడు అన్నమయ్య. అరయమా గురుడితడన్నమయ్య. వైకుంఠనాథునివద్ద వడె పాడుచున్నాడు, 'కరమై తాళ్లపాకన్నమయ్య"

అని ఈ విధంగా తాళ్ళపాక అన్నమాచార్య స్తుతి పరమైన ఈ కీర్తన అన్నమాచార్యుని కీర్తనలా కనబడదు. బహుశః ఇది ఆయన శిష్యులెవరైనా వ్రాసి ఉండవచ్చును. ఈ విధంగా అన్నమాచార్య ప్రశంసాపరమైన ఈ కీర్తన పుస్తకంలో చేర్చడం సముచితంగా లేదు.

పుస్తకాకారము మొదలైన వాటిలో ప్రశంసనీయంగా ఉన్న ఈ సంపుటం చివర తప్పొప్పుల పట్టిక చేర్చడం బాగా లేదు. ఇకముందైనా సంపాదకులీ విషయంలో శ్రద్ధవహించగలరని ఆశిస్తున్నాము.

---

## కీలుబొమ్మలు

నవల. రచన— శ్రీ జి. వి. కృష్ణరావు. ప్రకాశకులు —ప్రజాసాహిత్య పరిషత్తు, తెనాలి. వెల రు 2-8-0.

'కీలుబొమ్మలు' మొదట సీరియల్‌గా 'స్వతంత్ర' వారపత్రికలో ప్రచురితమైనది.

స్థూలంగా నవలలను రెండు రకాలుగా విభజించవచ్చు. వినోదింపచేయడమే పరమార్థంగా కలిగినవి. వినోదంతోపాటుగా జిజ్ఞాస రేకెత్తించేవి. అదేవిధంగా రచనగురించి కూడా రెండు రకాలుగా చెప్పవచ్చు. వాస్తవ పరిస్థితులతో నిమిత్తం లేకుండా కేవల ఊహాకల్పితమైనవి. వాస్తవపరిస్థితులు ఆధారంగా కల్పనా ప్రతిభతో సృష్టింపబడిన విశిష్టమైన కళాఖండాలు. ఈ నవల మొదటినుంచి చివరివరకు ఏకాగ్రంగా చదివిస్తుంది. పాఠకుల హృదయాలలో జిజ్ఞాస రేకెత్తిస్తుంది. అన్నిటినిమించి ఒక విశిష్టమైన కళాఖండం. ఇటీవల తెలుగువాఙ్మయంలో ఇంతగా మనలను సంతృప్తి పరచగలిగిన నవల వెలువడలేదంటే ఈ మాటలు అప్రస్తుతంగా తోచవు.

'కీలుబొమ్మలు' నవలలో ఇతివృత్తం సంక్షిప్తంగా ఇది:—గ్రామంలోకల్లా మోతుబరి రైతు అయిన పుల్లయ్య అదే గ్రామంలో కాగితాల మిల్లు పెట్టి నడుపుతున్న చంద్రశేఖరానికి మారువాడి వద్ద

అయిదు వేలకు అడ్డం ఉన్నాడు. అప్పట్లో ఆ సంగతి తన భార్య లక్ష్మమ్మకు చెప్పలేదు. ఆతరువాత పరిస్థితులు తారుమారైనవి. చంద్రశేఖరం దివాలా తీశాడు. తన సిరిసంపద లన్నిటికి కారణమైన భార్యతో చెప్పకుండా అంత పెద్ద మొత్తానికి ఒకరికి అడ్డం ఉంటే, తీరా నష్టపోవలసిన సమయం వచ్చేసరికి ఆ సంగతి భార్యకు తెలియపరచడానికి సాహసించలేకపోయాడు పుల్లయ్య. అతడు ఈ విషయంలో మౌనం దాల్చేసరికి అసలు పుల్లయ్య చంద్రశేఖరానికి అడ్డమే ఉండలేదేమో అనే ప్రవాదం పుట్టింది. పైగా ఒకరివలలో పడేవాడు కాడనే ప్రతీతి ఉన్నప్పుడు తను చేసినపని పదిమందిలోకివస్తే తలవంపులు అవుతుందేమోనని కూడా అతడు భయపడ్డాడు. మౌనంవహిస్తే చంద్రశేఖరం పట్ల అన్యాయం చేసినట్లవుతుందేమోననే భయం కూడా ఉంది. ఈలోగా చంద్రశేఖరానికి పుల్లయ్య అడ్డంఉన్న సంగతి అతని భార్య లక్ష్మమ్మకు తెలియడం జరిగింది. ఆతని మౌనం కారణంగా తన భర్త అసలు అడ్డమే లేడని ఆమె అనుకుంది.

తన భర్తను మోసంచేయడానికి ప్రయత్నం చేస్తున్నాడనే కోపంకొలది ఆమె భర్తసంతకం ఫోర్జరీ చేసిన నేరం చంద్రశేఖరంమీద మోపించింది. పుల్లయ్య ఆటకట్టువడింది. ఆత్మవంచనతోపాటు పరవంచన కూడా ప్రారంభం కాగా పుల్లయ్య జీవితం సుడిగుండంలో పడిపోయింది. చివరికి తాను నిర్ధారించుకున్న మార్గానికి అనుగుణంగానే తన మాట బోటు కాకుండా చేసుకోనడానికి కొడుకు రామారావుని కమ్యూనిస్టు [illegible]గా నిర్బంధంలో పెట్టించాడు పుల్లయ్య. మరొకవంక పరిస్థితులు ఎదుర్కొనలేక చంద్రశేఖరం తన తగాదాలోకి కూలి జనాన్ని కూడా ప్రవేశపెట్టడానికి ప్రయత్నించాడు. వేరొకవంక భార్యజీవితం చేజేతులా తగులబెట్టాడు. ఈ సుడిగుండంలో చిక్కుకున్న ప్రముఖులు షావుకారు మల్లయ్య, డాక్టర్ శాస్త్రి, పుల్లయ్యగుమాస్తా సత్యనారాయణ, అతని భార్య పద్మ, అమ్మాయమ్మ, పోలయ్య, ఇంకా మరికొందరు ఈసుళ్ళకు లోబడ్డారు. గ్రామంలో భీభత్సం చెలరేగింది. చివరికి చంద్రశేఖరానికి కారాగారవాస ప్రాప్తి లభించింది. అతని భార్యా బిడ్డలకు తిన తిండి, కట్టబట్ట, తలదాచుకోనడానికి ఒక ఆస్థారం లేకుండాపోయాయి. భార్యచేసిన అవినీతికరమైన పనికి సత్యనారాయణకు మతిపోయింది. పద్మ జీవితంలో చిచ్చుపెట్టిన డాక్టర్ శాస్త్రి గ్రామం విడిచి

వెళ్ళిపోయాడు. పుల్లయ్య సర్దార్ పుల్లయ్యఅయి గ్రామంచేత మన్ననలు పొందాడు. తండ్రిచేసిన పనికి రామారావు కూడా ఊరువిడిచి వెళ్ళిపోయాడు.

పుల్లయ్య, డాక్టర్ శాస్త్రి, పోలయ్య, పద్మ, సావుకారు మల్లయ్య కొడుకు గంగాధరం, పోలయ్య విశిష్టమైన వ్యక్తిత్వం కలిగిన వ్యక్తులు. ఈ పాత్రల పోషణలో రచయిత విశేషమైన ప్రతిభ చూపాడు. ఆయాపాత్రల మనస్తత్వ చిత్రణం కూడా ఉదాత్తంగా ఉంది. ముఖ్యంగా తనను రక్షించడంకోసం ప్రాణాలు బలిఇచ్చిన పోలయ్య కుటుంబానికి డాక్టర్ శాస్త్రిగారు దానంచేసిన ఇంటిలో ఆ హరిజన కుటుంబం జీవించకుండా చేయడానికై దానిని పుల్లయ్యగారే కొనుక్కోడం ఆయన పాత్రపోషణకు మకుటాయమానంగా ఉంది.

గ్రామాలలోని పరిస్థితులు, అక్కడివారి మనస్తత్వాలు, కక్షలు, మూర్ఖత్వాలు, వారిలో నిద్రాణమై ఉన్న నిస్వార్థ సేవాభావం (ఉదా— పోలయ్య) ఘనత, పైశాచికత్వం అన్నీ చాల సహజంగా చిత్రించబడ్డాయి. నవలలో అనేక రసవత్తరమైన ఘట్టాలు ఉన్నాయి. డాక్టర్ శాస్త్రిగారిని రక్షించడానికి పోలయ్య చేసిన సాహసం, శాస్త్రి, పద్మల మధ్య నడచిన గాథ ఇట్టి వాటిలో కొన్ని. కథాప్రారంభంలో ఎక్కువ ప్రాధాన్యం వహించిన పుల్లయ్య కుమార్తె సీతకు ఆతిరువాత ఎట్టి ప్రాధాన్యము లేకపోగా మరొక్క పర్యాయం కనపడి నవలనుంచి నిష్క్రమిస్తుంది. పుల్లయ్య పెద్దకోడలు రంగమ్మ విషయం కూడా అంతే. విశేషమైన ప్రాధాన్యం ఉండవలసిన స్థితిలో ఉన్నప్పటికీ ఆమెకు తనచుట్టూ జరుగుతున్న కథతో ఏమంత ఎక్కువ సంబంధం లేకపోయింది. కథాగమనంపై ఏ విధమైన ప్రభావంలేని వ్యక్తులు చాలమంది కథలో గోచరిస్తారు. మరొక విషయమేమంటే కొంచెం ఇంచుమించు నవలలో వచ్చిన ప్రతి వ్యక్తి జీవితానికి ఏదో ఒకవిధంగా భరతవాక్యం చెప్పడానికి ప్రయత్నం జరిగింది. లోపాలు అనలేకపోయినా వీటివల్ల నవల గొప్పతనం కొంతవరకు తగ్గినదనే చెప్పాలి.

ఈనాడు సమాజంలో అవ్యవస్థ ఏర్పడిఉన్నది. ఈ అవ్యవస్థా స్వరూపం స్పష్టంగా తెలుసుకొనడం ఎంతటి ప్రధానమో, దానిని తొలగించి పటిష్టమైన నూతనసామాజికవ్యవస్థనునిర్మించడానికి మార్గంచూపడము, అట్టి కృషికి ప్రజలను ప్రేరేచడము కూడా అంతే ప్రధానం. పూర్వం ఒకరు శాసించకుండానే ప్రజలు తమంతతాము అనుష్ఠిస్తూవచ్చిన నైతికసిద్ధాంతాలకు ఈనాడు విలువలేదు. అలాఅని నైతికసూత్రాలే అవసరం లేవని విజ్ఞులు ఎవరూ తలచరు, చెప్పరు కూడా. అయితే వాటికి కొత్తపడికట్లు తయారు చేసుకోవాలి. తప్పదు. లేకపోతే సమాజం అభ్యుదయం చెందడానికి మారుగా మరింత పతనమౌతుంది. ఈ స్థితిలో గ్రామాలలోని పరిస్థితులు అర్థం చేసుకొనగలిగి, ప్రజాసేవ చేయాలనే ఆవేదన ఉండి, అట్టిమార్గం అనుసరించడానికి శక్తి సామర్థ్యాలు కలిగిన డాక్టర్ శాస్త్రి, రామారావులు పరిస్థితుల ప్రభావానికి ఎదురీదలేక గ్రామమే విడిచిపోయారంటే అది మానవస్వభావానికి ఎంత సహజమైన పరిణామమైనప్పటికీ ఆశాభంగం కలిగిస్తున్నది. ఏదైనా గ్రామాలలోనేమి, ప్రజలలోనేమి మరొక నూతన చైతన్యం కలగనిదే కొద్దిమంది వ్యక్తుల సేవాత్యాగాలు కూడా నిరర్థకం కావచ్చు. అట్టి చైతన్యం కలిగించడానికి ఈ నవల కూడా దోహదమిస్తుందనీ రచయిత సిద్ధాంతాలతో కాని, దృక్పథంతో కాని, ఏకీభవించనివారు కూడా దీనిని చదివి ఆనందించగలరనీ నా అభిప్రాయం.

మరొక విషయం. పార్టీ ఆవేశాలు వేరు. సిద్ధాంత విభేదాలు వేరు. రాజకీయాలు సామాజిక జీవితంలోనేమి, వ్యక్తిజీవితంలోనేమి ఒక ప్రధానమైన అంతర్భాగం. ఆయా సిద్ధాంతాలకు అనుగుణంగానే దృక్పథాలు కూడా మారుతూ ఉంటాయి. అంతమాత్రంచేత ఒక నవల మంచిచెడ్డలు నిర్ణయించలేకపోవడం ఉండదు. ఉదాత్తమైన భావాలు, ఏకాగ్రంగా చదివించగలిగిన బలమైన ఇతివృత్తము, హృదయంగమమైన పాత్రపోషణ, చక్కని శైలి ఉన్న 'కీలుబొమ్మలు' తెలుగు వాఙ్మయంలో ఒక సుస్థిరమైన స్థానం ఏర్పరచుకొనగలదు.

---

## హరి వినోదము

[మున్నగు నైదుపొత్తములు]

శ్రీ కవికొండల వెంకటరావు. వెల : రూపాయిన్నర. ప్రాప్తిస్థానము కవికొండల వెంకటరావు రాజమహేంద్రవరము. ఇది హరివినోదము, మఱొక దైవసంప్రార్థనము, శతథా, కందకుక్షి, ద్విపదలాడు అనే అయిదు ఖండకావ్యాల సంపుటి. వీటిలో

మొదటి మూడు భక్తిపరమైన కావ్యాలు. మూడిటిలోను దశావతార వర్ణనము, దేవుసు—మతము మొదలైన శీర్షికలతో కవిత కేవలము సాంప్రదాయికమైన వర్ణనా మార్గంలోనే నడిచిపోతుంది.

పైమూడింటిలోను ఉత్తమభక్తి భావం చక్కని కవితా స్థాయి అందుకున్న వృత్తాలు చాలాచోట్ల కనిపిస్తాయిగాని, ఈ స్థాయి ఖండకావ్యాలలో అంతటా నిలబడక చాలాచోట్ల పేలవంగా జారిపోతూంటుంది. వీరి ఉత్తమ కవిస్థాయికి ఈ క్రింది వృత్తాలు ఉదాహరణలుగా ఇవ్వవచ్చును:

"జపమేలా? తపమేల? నీకొరకునై,
సంసిద్ధుఁడన్; సత్కృతిన్;
వప్రపున్ మాలఁగ్రథిస్పెదన్; మనమునన్
బంధింపఁజేదన్ జిత్ప్రభూ!
త్రిపలేదా క్రమము లేదు; రాత్రిపవలం
నా స్తైజము ల్లేవు; నీ
కృపయే లక్ష్యము నీదుకీర్తనమె నన్
కరింపి కొట్టించెడిన్"

* * *

"పలుకను నేను, పాడనిక,
భావనసేయను గూడ నమ్ము, నీ
నిలుకడ, నీదు నీరవపు
నిగ్గును జగ్గును చాదుకన్నులన్
సలకుచు మూసికొందును:
నవేయముగా గనుగొందు నుల్లముం
దలుకొనంగ జేసి కొని
హాయిగ దన్మయదీప్తి నొప్పెదన్!"

మున్నెక దైవసంప్రార్థనంలో, అయిదవ నవకంలో ఉన్న ఈ పద్యం కూడా ఇక్కడ పేర్కొనదగినదే.

"వినబడు విశ్వనాదమొక
వింతగ నంబుధిలోన [illegible]
కొమ్మను, ననిలాన, బక్షియసమానపు
టెక్కల విప్పునాదు, మిం
టను, మొగిలందు, వానపడుటన్
మనుజుండ్రు పల్కుటన్!
నిను వినునట్లె సంతతము
నెక్కొను సంతసమాత్మ నీశ్వరా!"

ఇక కందకుక్షి. దీనిలో కవిగారనేకమైన విషయాలపై రచించిన ప్రాస్తావిక పద్యాలున్నాయి.

ద్విపదలాత్మలో అన్నీ ద్విపదలే. ఇందులో చిన్నచిన్న నీతులు మొదలుకొని తలలూగించే చక్కని సూక్తులవరకు—అన్నిరకాల రచనలు కనిపిస్తాయి.

కవికొండలవారి కవితాభిమానుల కివి తప్పక చదవవలసిన కావ్యసంపుటి.

---

# గ్రంథస్వీకృతి

## శ్రీ గురుదేవతాస్తవము

కంచి వేంకట రామన 1/12 తైయప్ప మొదలి వీధి, జి. టి. మద్రాసు. వెల : 8 అణాలు.

దీనిలో రాజరాజేశ్వరీ స్తవరాజదండకము, శ్రీచక్రలేఖనక్రమము, అపరాధపంచదశి, దయాంకుర షోడశి అనే అయిదు విభాగాలున్నాయి. ఇవి మంత్రశాస్త్ర విషయాలు చూచాయగా తెలిసికొనే వారికి ఉపయోగించే పుస్తకము.

## పతిత

గోపరాజు రామారావు, గోపీపల్లి కేశవస్వామి సత్యనారాయణపురం, విజయవాడ. వెల : 8 అణాలు.

విద్యాసంస్కారం ఉండి వివాహం కాక, జీవితంలో చెడ్డమార్గాలు పట్టిన స్త్రీజీవితమే దీనిలో కథావస్తువు. కథ అంతా సామాన్యంగా నడిచిపోతుంది.

---

Printed & published by S. Sambhu Prasad at the No. 7, Thambu Chetty Street, Madras. Editor :



# భారతి

[సచిత్ర మాసపత్రిక]



సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్.



★

ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 29 ఆగష్టు, 1952 సంచిక 8

విడిప్రతి: వెల ఒకరూపాయి.



# విషయానుక్రమణిక

## ఆగస్టు 1952



త్రివర్ణ చిత్రము—'బిడ్డ తల్లి-కాశ్మీర్': చిత్రకారిణి: శ్రీమతి సరళా రామన్.

ఆగస్టు 7 వ తా॥ ఆంధ్రదేశమంతటా విడుదల




జెమినీ చిత్రము


త్వరలో వస్తోంది!
ఈస్టిండియా
వారి
సంక్రాంతి
ప్రేక్షకులు ఆనందముతో యెదురు చూచు
చున్న మహత్తర సాంఘిక చిత్రము.....
డైరెక్టర్: సి. పుల్లయ్య
ప్రొడ్యూసర్: సుందర్‌లాల్ నహతా







నందన
శ్రావణము

# భారతి

సంపుటము 29
సంచిక 8

# స్త్రీ



శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

## 1

కవి :

**ఆకాశమే తండ్రి-అవనియే తల్లి**
తోబుట్టువులు, గిరులు తరులు, నిర్ఝరులు-
గిరుల తరువుల పళ్లు, ఝరుల తియ్యనినీళ్లు
కూడుగా, గూడు, గుహగా బ్రతికెనరుడపుడు.

ఆజానుబాహు డుజ్జ్వలమూర్తి మానవుడు
మేథావి, వాగ్మి-గజ, సింహ సంహననుండు
సృష్టికర్త త్వష్ట పాదసన్నిధి వ్రాలి
విన్నవించెను మనసులోని కనలు వీరాళి.

పురుషుడు :

అవధారు దేవ! ధాత! విధాత! త్వష్టా!
ఈ సుందరాతి సుందరలోక స్రష్టా!
నీ ప్రతిరూపమున సృష్టించి నన్ను
కానుకగా నిచ్చితివి ప్రకృతినే మున్ను!
శాద్వలస్థలులు, వెన్నెలువ్రాలు వరిచేలు
చేల కెలకుల వికాసించు తామరపూలు
కడలిహోరుకు మారుమ్రోగు చీకటిరేలు
ధునులు వనులూ ప్రతిధ్వనులు-నాకిక చాలు!
ఓపజాలను-ఒక్కడను-సంపదను, వ్యథను
తోడుగా నీడగా దయచేయుమా-జతను!
కొండకొమ్ముకు ఒక్కడను నేను పోలేను
ఏ ఆశతో తిరిగి నాగుహకు నే రాను?
ఉన్న వాక్కుకు ప్రయోజనము లేనే లేదు
నా ఘోష భాషగా మెరిసి రక్తికి రాదు!
తోడుగా నీడగా దయచేయుమా జతను
జోడుకలసినచో విదారించెదము వెతను!

త్వష్ట :
సాష్టాంగ సాశ్రుకంపము లేల మానవుడ !
అతినిరంతర నదత్ భీతికింకరుడ !
చేయవలసినసృష్టి చేసితిని నాకూన !
ఐన తాళుమొకింత - చేతు నీకొకచాన !

కవి :
నరుని సన్ననియేస్పులకు గుండె దిగలాగి
సరికొత్తసృష్టికై మనసెల్ల చెలరేగి
మాట మనసూ జపముజపము ధ్యానములెల్ల
ఏకాగ్రమైనూ చెన్నతనసృష్టి కోకొల్ల!
జరిగినసృష్టి పరికింప నిస్సారమ్ము
కానున్న స్త్రీసృష్టి కాంతిపూరమ్ము
అని తలపోసి వెంటనె ఆ విధాత
సర్వసారము రంగరించె తన చేత.
లీలారవిందముల బాలింత పులిగుండె
నెమలినడలందు పన్నీటినదులు
అరటిబోదెలయందు అద్రికాఠిన్యమ్ము
పిడికిటిపట్టులో పడకుమిన్ను
విలయ కుంభములందు విద్యామృతమ్మును
తామరతూడుల దావకీల
పసిడి శంఖమ్మున పంచాస్యగర్జన
పారిజాతములందు పాముకాటు
కమలదళములలోపల కడలి—చంద్ర
పూర్ణబింబమ్ములో ప్రళయార్ణవమ్ము—
లలన సృష్టించి పూజ్యురాలనుచు చెప్పి
నరున కాశీస్సుతోపాటు నామె నొసగె!

పురుషుడు
పదవే చెలి! శంఖపీఠికిన్
పులకింపంగ శిశల్, పవల్, దెనల్—
చివురాకుల చిందులాడగా
హరుమంజీ దయసేయవే! శివే!

స్త్రీ :
హృదయ దహారములోన వెలిగే
ప్రేమదీపమ! మహాదేవా!
మీ మధురచరణాబ్జ సన్నిధి
నా మనఃకుసుమాంజలి!

పురుషుడు :
ఇదె మోదుగ పూలు పూసెనీ
పెదవుల్ రక్తిమనీయ, ప్రేయసీ!
ఇవె గోవుల లోలనేత్రముల్
త్వదపాంగమ్ముల తోడబుట్టువుల్
అవె తారలు; వచ్చువేళ, సుధా
కిరుడింకన్ —నినుజూచి మెచ్చులే-
సరియౌదునో, కానో ? యంచు సి
గ్గిలనేలా విపులాక్షి చూడుమా!

స్త్రీ:
గెలుచుకోర్కెతో వచ్చునా ? తా
రలతో చంద్రుడు డంబముగ, ఈ
పొల్తి నఖదీప్తులకు చాలక
వెల్తిపడి యేమౌనోకో?

పురుషుడు :
ధ్రువబిందువు కింద ప్రేయసి
మనమున్నాము తపస్స్వరూపమా!
గృహిణిన్, సచివన్, సఖిన్, రహః
ప్రియశిష్యన్ కరుణించుమో ప్రభూ!

## 2

కవి :
ఆకెరట మీకెరట మంచునాకా వచ్చి
ఏకమై పోయినట్లయిరి ప్రేమలు హెచ్చి
తరుణుండుతరణియును తరలినారలు-గుహాకు
తరుణిరాకతో మారి గుహాగృహాముగా

నవ్య

కొండలను పిండిచేయించి గుహాముందు
ముగ్గులుపెట్టి నా తరుణి అందందు
రాళ్ల రాపిడిలోన రవనిప్పుపొర తీసె
దీపాలు వెలిగించి దీపమాలిక చేసె
జాతవేదుడు తోడు చానకౌనెపుడు
ఆబాల ఆముగ్ధ అపుడన్నపూర్ణ
తన్ను తాను నివేదనము చేయు సతి చెంత
నరుడు నిలబడినాడు నమ్రుడై ఒక్కింత

పురుషుడు:

నవసూర్యుల వోలె దీపముల్
నిలువంబెట్టిన దేవివే ప్రియా!
చిరుజోతులమధ్యనో మహా
జ్యోతీ! నీకిదె కేలుమోడ్తునే!
నువుచాలు సుగాత్రి! నీదు వా
క్కులు చాలున్, మనసింత చాలు, నీ
నఖదీప్తులె చాలు నాకు, ది
గ్విజయ మ్మెంతది? చూడుమింక నన్.

కవి:

తరలిపోయినవి పున్నమిరేలు కొనసరి
కలిసి పైబడెను చీకటి-జాలు విసరి!
ఎడమొగము పెడమొగముగా వారలున్నారు
మౌనముగ త్వష్టసన్నిధి కిపుడు వెళ్ళారు.

## 3

పురుషుడు:

ఇది రాక్షసి! దీని కన్నులన్
మదిరాగ్నుల్ గమనించుమా-ప్రభో
కనిపెట్టెను నిప్పు - అంది లో
పడవేయున్నను, లీల - నెన్నడో.
మురిపింపగ లేగదూడనా?
పనులం జేయగ దీని లెంకనా?
వినుముల్ ప్రభు! దీని హావ భా
వములున్, నవ్య వనోవిలాసముల్.
పులిగుండెలగోవు! చూడనో
స్వామీ, భ్రమింగెడిశక్తి!! దీనితో
తగులాటము పోయి - నేను, నా
ప్రాణాల్ నిల్వగ చూడుమో ప్రభూ.

త్వష్ట:

సర్వసారమయమ్ము స్త్రీరత్న మన్న
తెలివిలేకనె నడచుకొన్నావు, చిన్న!
నాతల్లి నిక్కడనె నిలిపి పోవోయి
దక్కిన పొందుమా బ్రతుకంతహాయి!
కన్నతల్లీ! కన్నుల న్నీరు తేకు
కలకంఠి కన్నీరు కాల్చును జగతి
ఆవేశపరుడు వాడల్లాడిపోయి
తిరిగి రాగలవాడు, దేవి నీకొరకు!

[గుహాలో -] పురుషుడు:

ఒకకేల ప్రదీపమాల, వే
రొకకేలన్ విధృతాన్నపాత్రతో
సరసన్ సరసోక్తులాడుతూ
తినిపించే కరుణాత్మ! లేవటే?
మనసేమొ విఘూర్ణమానమై
దరిజేరన్ చిరునవ్వు వెల్గులన్
నవజాగృతి నింపి - ముందుకున్
నడిపించే పరదేవి! లేవటే?
అనుగైన కదంబజాల నో
అతివా! నీవు గినా - కుటుంబి!
సచివా! సఖి! శిష్యురాల! నా
గుహలో దీపముపెట్ట రావటే?

కవి :

మగవాడు తల్లడిలి స్త్రీకడకు కదిలె
మగువపేరే మంత్రమై బాధ్రపిదిలె-
తన గాయపడిన గుండెల నదిమిపట్టుకొని
మగువ లోలోకుమిలె గిలగిలా కొట్టుకొని-

స్త్రీ :

పొలిమేరలు లేని ప్రేమయే
విషమైపోయె మహాప్రభో! హృదం
తర మెప్పుడు ప్రేమ తక్కువై
పడిపోదెన్నడు పాశబద్ధమై
తనభర్తయె స్త్రీకి ప్రేమలో
శిశువై తోచు నొకొక్క వేళలన్
ప్రభు వుక్కిరిబిక్కిరయ్యే - నే
తెలియ న్నేరక గ్రుడ్డినైతినే!

[పురుషుడు వస్తాడు.]

పురుషుడు :

లలనా! క్షమియింపుమింక నన్
గతమైపోయె గతంబు చూడగా
నిను వీడితి పిచ్చుకుంటునై
తిని, రారమ్మ, దయాస్వరూపమా!
సగమెవ్వారో కోసుకొన్నటుల్
సగమైపోతిని నీవులేక-నీ
ఉనికే పరిపూర్తి-రావె! సుం
దరి! రావే ప్రకృతిస్వరూపమా!

త్వష్ట :

ఆమె రాక్షసి ఆమె చూపుల విషము
మాటలో మనసులో తోణకును విషము
విషకన్యకొరకు తెంపరలాడ నేల?
నరుడ! సుఖియింప కెందుకు నీకు గోల?

పురుషుడు :

మృగమైతిని పిచ్చితొందరగా
దరిరానిండు మృగేంద్రవాహనగా

స్త్రీ :

నిను మూపున మోతు పూరుషా
ప్రకృతి నన్నడిపించుమో ప్రభూ!

స్త్రీ : ఓం

పురుష : ఓం

త్వష్ట : ఓం

కవి:

కల్లోలమైన సాగరగర్భమందు
జనియించె సంపూర్ణ చంద్రుడు-కడలి
కోటినవదీపాల కొమరొప్ప లేచి
ప్రకృతిపురుషులకు నీరాజన మ్మిచ్చె!!



# శ్రీ కవికొండల వెంకటరావుగారు



### శ్రీ నండూరి బంగారయ్య

శ్రీ కవికొండల వెంకటరావుగారు ఆధునికాంధ్ర సారస్వతోపాసకులలో గణనీయవర్గమునకు చెందినవారు. నవలలు నాటకములు పొట్టికథలు గీతికలు మున్నగు నెన్నో శాఖలలో వీరు పెక్కు గ్రంథములు రచించి బహుముఖముల భాషాసేవ చేసినారు. అన్నిటిలోను ముఖ్యముగ వీరి గీతికలు ప్రశస్తతరములయి హృదయము నలరించుచున్నవి.

వీరి రచనలలో గనవచ్చు ప్రధానగుణము స్వతంత్ర సంస్కృతి. వీరి గురువు ఆస్వాల్డుశాస్త్రి. సహజముగ నున్న వీరి శక్తులు ఈ శాస్త్రిద్వార సాంగత్యము లభించిన వెనుక నూతన చైతన్యమును గాంచినవి. నర్సువర్తి మున్నగు పాశ్చాత్య రచయితల ప్రోద్బలము వీరికి లేకపోలేదు కాని వీరి గీతికలను కేవలము పాశ్చాత్యవాఙ్మయ ప్రోద్బలములుగనే గణించుటకు వల్లపడదు. ఇతర ప్రోద్బలము లేవి వచ్చినను అవి వీరి సహజశక్తిలో లీనమయి స్వతంత్ర వికాసమును నిరూపించు కొనుచున్నవి.

వీరి గీతికలను చదివినప్పుడు మున్ముందు పొడకట్టు గుణము కాని వస్తుబాహుళ్యము. వీరికున్న వస్తువైవిధ్యము ఆధునిక రచయితలలో నరుదుగ గనవచ్చుచున్నది; పావలితీగ, పశువుల కాపరి, బొమ్మలనోము, పసరికపాము, సుకారిపిల్ల ఇట్లా ఒకటే రెండూ కాదు. ఏ వస్తువు కనబడినను అది వీరి హృదయమును కదలించి రచనకు పురికొల్పుచున్నదా అనిపించును. అల్పములు నిరాడంబరములు సామాన్యములుగా మనకు గనవచ్చు వస్తువులు వీరికి అందముతో నిండియుండును. ఆ యందమును అనుసంధించిన ఆహ్లాదమును సహృదయులకు వీరు పంచిపెట్టుచుందురు.

వీరి గీతికలకు రెండు విశిష్టలక్షణములు. (1) జానపద జీవితమునందు ప్రత్యేకపక్షపాతము. (2) ప్రకృతిరామణీయకమును పాలించుటలో నపూర్వమైన శ్రద్ధ. వీరి కథలలోను నవలలలోను కూడ పల్లెటూరి జీవితము చక్కగ ప్రతిఫలించుచును కాని అన్నిటికంటెను ఈ యంశమున వీరి గీతికలు ముచ్చట గొలుపుచుండును. రోడ్డుపయి గుంటలు లాగువారు, కాలవలో పడవనడపువారు, సముద్రములో చేపలుపట్టువారు మున్నగు కష్టజీవుల జీవితమును పరిశీలించి వారి ప్రత్యేక ఆశయములను లక్షణములను వీరు చిత్రించుచుందురు. 'భక్తతుల్యగాథ' అను గీతికలో అంతర్వేది ప్రాంతములనున్న పల్లెలకు కూర్మమూర్తి నరసింహామూర్తి ఎట్లు లభ్యమైనదియు వీరు చక్కగ గానము చేసిరి.

> "ముత్యాలశాలా రాలు మన నిత్తిపంట
> మనకు లేనివి కూర్మ నరసిమ్మములుగ
> అవి దొఱకినా" యంచు నానందపడిరి.
> కొపనాతి కిట్టమ్మ గొప్ప సంబరము
> సేయించు వాయించు చిఱుతలూ మువలు."

అన్నాడు నరసింహు డందరూ వినగ.

ఇట్లనే "సుకారిపిల్ల" "దారిగాదిది" ఇత్యాది గీతికలు పఠించినచో మనము దానివైపు దృష్టినైనా పరుపని సామాన్య జీవితముపయి వీరి కెంత మొగ్గరమో విస్పష్టమగును.

కొన్ని కొన్ని ప్రబంధములలో ప్రకృతివర్ణనలు గతానుగతికములుగ నుండును. ఈ కవులు ప్రకృతి నెన్నడయినను చూచి ఎరుగుదురా అనిపించును. శ్రీ వెంకటరావుగారి ప్రకృతివర్ణన మట్టిది గాదు. ప్రకృతి వీరికి ప్రత్యేకము ఉపాస్యదేవత. గోదావరీ తీరమున వీరి జీవితము చాలకాలము నడచినదేమో పాపికొండలు గోదావరి బ్రిడ్జి పట్టిసపు దేవాలయము కోరుకొండ సీమలోని కొలనులు అంతర్వేదిసాగర సంగమము వీని నన్నిటిని చక్కగ వీక్షించి ఆ రామణీయకము తమ గీతికలలో ప్రతిబింబించునట్లు చేసిరి.

"నల్లన్ని మట్టికీ తెల్లన్ని
సురువుతూ సయ్యాటలా!
పదిపిల్ల పాయతూ
ఉదధి కెరటానకూ తియపాట!

* * * *

చికిలి బంగరు అంచు
చేల మట్లున్న దోయి
మేఘాన్ని అలముకొని
మెఱయు చరమార్క జిగి

* * * *

నీలాల కొండల నడుమ
తాజెత్తు లేచిపోయి
కొదమ వరద వానకాళ్ల
కెదురేగి ముద్దెట్టేన?

గోదావరినీటి తెల్ల జోహారు నీకు తల్లి.

* * * *

లంకముంచిన లంకమీద డొంకముంచిన
డొంకప్రక్కన పొంకముగు పేదిచెట్టుముంచిన
ప్రళయగౌతమి వాహినీబలమందు
పసరికపాము నడిచిన వెలిక లేమరెదు?

ప్రకృతిని కేవలము దూరమునుండె చూచుట గాక ఆయాదృశ్యములందు తమ హృదయమును లీనము చేసిరా అనిపించుచుండును వీరి ప్రకృతి వర్ణనలు.

వీరి గీతికలలో నున్న శైలి చాల భాగము వ్యవహారమునకు సన్నిహితముగ నుండును. భావమునకు భాషయునకు మంచిపొత్తు కుదురుచుండును. అక్కడక్కడ కొన్ని కేవల గ్రంథస్థములయిన పదములు వాడుట కలదుగాని అవికూడ కళాప్రయోజనమునకు పోషకముగ నున్నప్పుడే వాడుచుందురు. ఈ గీతికల వరుసలలో నున్న వైవిధ్యము ప్రత్యేక ప్రశంసార్హము.

నూనె రాచేము నున్నగ
గురులను మన్నన దువ్వేము;
సిగ లేచుట్టేము, సిగలను
సొగసుగ చేమంతి చెరికేము;
నగలే తాల్చేము, ధగధగ
తళతళ నగలే నవ్వేము.

అను బొమ్మల యొాలలాడింపు గీతికయును.

మువ్వ మెళ్లో కట్టినిడిచిన
తువ్వ పెనకొ లున్న కృష్ణా!
నవ్వవోయి నాకేసిచూచీ
పువ్వు లిస్తున్నా!

అను బాలకృష్ణుని గూర్చిన గీతికయును వస్తువునకు అనుగుణమయిన వరుసభేదము చూచి ఆనందించవచ్చును. ఇట్లే "మూర్ఖహాస్" అను గీతికలోని

అరువెల్లగుదాక నతివతన్నె పరు
చేరరాదని రాజ శేఖరుననిపె

గ్రాంథిక శైలికిని

'కొపనాతి వారింటి కోపలే లాగే
కొపనాతి కిట్టమ్మ కోమలే దీసె
కిట్టమ్మ నేవేడి కీర్తింత' మనిరి

అను రక్తకుల్యాగానములోని వ్యావహారిక శైలికని ఎంత వ్యత్యాస మున్నది! రెండింటిలోను కూడ ఔచిత్యము ప్రత్యక్షమగుచున్నది.

అతివిస్తృతమగు శ్రీ వెంకటరావుగారి వాఙ్మయమునంతను ఆపోశనము పట్టగల యవకాశము నాకు లేదు. చదివినంతలో వీరి గీతికలు సహజలావణ్యము నన్ను చకితుని జేయుచుండును. ఇప్పటికి పదునైదేండ్లకు పైగా వీరి సాంగత్యము కూడ నాకనుభవనీయమగుచున్నది వాదభేదముల పొంతకు బోక వాఙ్మయసేవయే ప్రధానముగ నెంచుకొని రచనాకళకు వీరు తమ జీవితము నంకితమొనర్చిరి. అపురూపమయిన గీతికల నెన్నటినో ఆంధ్రుల కనుగ్రహించిరి. వీరు చేసిన వాఙ్మయసేవకు దగిన సత్కార మాంధ్రము లింతవరకు వీరికి చేయలేదు. కవిత్వము పేరు చెప్పగనే ఒక వైముఖ్య మేర్పడిన ఈ దినములలో స్వార్థమును త్యజించుకొని ఇహభోగములపయి నిస్పృహవహించి అంతర్వాణి ప్రోద్బలమును కాదనలేక ఆంధ్రవాణిని సేవించుచున్న ఈ వాఙ్మయోపాసకుడు మనకు మార్గదర్శకుడు. నన్నయ భట్టు మొదలుకొని నేటివరకు ఆంధ్రసారస్వతమునకు గురుపీఠమని ప్రఖ్యాతి వడసిన రాజమహేంద్రమున నివాస మేర్పరచుకొని నగరగౌరవమునకు అలంకారభూతులుగ నున్న శ్రీ వెంకటరావుగారిని ఈ షష్టిపూర్తిసందర్భమున సన్మానింప నోచిన ఆంధ్రులు ధన్యులు. ఈ యుత్సవమూలముగ నాంధ్రదేశము—ముఖ్యముగ రాజమహేంద్రము—కేవలము నిర్జీవమై పోలేదని మనము నిరూపించుకొనుచున్నాము. ఎంత నిరుత్సాహకరమైన పరిస్థితు లేర్పడినను నిగ్రహించుకొని నిశ్చలదీక్షతో వాఙ్మయసేవావ్రతము కొనసాగించుకొన్న శ్రీ వెంకటరావుగారు ప్రత్యేకముగ అభినందనార్హులు.

# ఇవాన్ ఇలియిచ్ మృతి

మూలం  అనువాదం

లియో టాల్‌స్టాయ్ — శ్రీ పి. గణపతిశాస్త్రి

[గత సంచిక తరువాయి]

## 8

తెల్లవారింది. జిరాసిమ్ వెళ్లిపోయాడు. ఇలియిచ్ దగ్గర పనిచేసే పీటర్ వచ్చి, కొవ్వొత్తులు ఆర్పివేసి, తెరలు తొలగించి, గది అంతా తుడుస్తున్నాడు. ఇందువల్ల ఇలియిచ్ కిప్పుడు తెల్లవారిందని తెలిసింది. తెల్లవారినా, పొద్దుపోకినా ఆదివారమైనా, సోమవారమైనా అతనికి ఏమీ తేడా కనిపించడంలేదు. ఆ నెప్పి అలాగే ప్రాణాలు తోడికివేస్తూంది. ఒక్క నిమిషమైనా తగ్గడంలేదు. క్రమేపీ అతనిలోని జీవచైతన్యం సన్నగిల్లి పోతూంది. కాని అలాగే కొట్టుకుంటూ ఉంది. ఇక అత్యంత భయంకరమైన ఆ ఆసన్నమృత్యువొక్కటే నిజంలా కనిపిస్తూంది. మిగిలినవన్నీ పచ్చి అబద్ధాలలా కనిపిస్తున్నాయి. అల్లాంటప్పుడు రోజులైనా వారాలైనా, గంటలయినా తేడా ఏమి ఉంది?

"కొంచెం టీ పుచ్చుకుంటారా? బాబూ."

ఇలియిచ్ ఇది విని "జిరాసిమ్‌పనులన్నీ సక్రమంగా జరిగించాలనీ, పెద్దతరహా మనుష్యులు పొద్దున్నే టీ పుచ్చుకోవాలనీ అనుకుంటున్నాడు." అని గ్రహించుకుని పైకి "అక్కరలేదు" అన్నాడు.

"ఆ సోఫామీద కూర్చుంటారా?"

ఇలియిచ్ "జిరాసిమ్‌గది బాగుచెయ్యాలని అనుకుంటున్నాడు. నేనతనిపనికి అడ్డు వస్తున్నట్టున్నాను. నా పరిస్థితి అంతా చిందరవందరగా తయారయింది." అనుకున్నాడు, తరవాత "నామాన్న నన్ను వదిలేయ్. వెళ్లు" అన్నాడు. జిరాసిమ్ అదీ ఇదీ సర్దుతూ అక్కడే కూర్చున్నాడు.

ఇవాన్ ఇలియిచ్ ఏదో కావాలని చెయ్యి చాపాడు. పీటర్ అతనికి సాయపడడానికి చటాలున దగ్గిరికి వచ్చాడు:

"ఏం కావాలి బాబూ!"

"నా వాచీ"

వాచీ దగ్గిరగానే ఉంది. పీటర్ అది పట్టుకు వెళ్లి యజమాని కిచ్చాడు.

"ఎనిమిదిన్నర. వాళ్ళంతా లేచారా?"

"లేదు బాబూ! అబ్బాయిగారొక్కరే పెంద్రాళే లేచి స్కూలుకి వెళ్ళిపోయారు. అడిగితే అమ్మగారు లేపమన్నారు. లేపమన్నారా?"

"వద్దు! అవసరంలేదులే!" అన్నాడు. తరవాత "నేను కొంచెం టీ పుచ్చుకుంటే బాగుండును." అనుకుని పట్టిగా "సరే! కొంచెం టీ తీసుకురా!" అన్నాడు.

పీటర్ గుమ్మందాకా వెళ్లాడు. అంతలోనే ఇలియిచ్ తను ఒక్కడు ఒంటరిగా ఉండడానికి భయపడిపోయి, తనలో "పీటర్‌ని ఇక్కడ అట్టే పెట్టడం ఎలాగ? అవునవును, అన్నట్టు మందు సంగతి మరిచిపోయాను." అనుకుని "పీటర్! ఆ మందిలాగ పట్టుకురా. ఏమో! కొంత పని చేస్తుందేమో!" అన్నాడు.—చంచాతో మందు నోట్లో వేసుకుని గుటక వేశాడు. మళ్లీ యథాప్రకారంగా నోటిలో ఆ అరుచి, వికారము ప్రారంభించాయి. దానితో "ఏమీ లాభంలేదు. ఇదంతా పచ్చిమోసం, నాకిదిఅంటే నమ్మకం పోయింది! అయితే— అబ్బా! ఈబాధ మాటేమిటి? ఇది ఒక్క నిమిషం అయినా రాకుండా ఉంటే బాగుండును." అని గట్టిగా మూలగడం మొదలుపెట్టాడు. అది కని పెట్టి పీటరు అతని కేసి తిరిగాడు. ఇలియిచ్ "సరేలే! వెళ్ళి కొంచెం టీ తీసుకురా!" అన్నాడు.

పీటర్ వెళ్ళిపోయాడు. ఇలియిచ్ ఒంటరిగా మిగిలిపోయాడు. ఎంత భయంకరంగా ఉన్నా

అతడా మనోవ్యాధివల్ల బాధపడినంతగా ఆ నెప్పి వల్ల బాధపడనేలేదు. పుండుసలిపినట్లది రాత్రింబగళ్లలాగే బాధపెట్టేది. ఆ వచ్చేదేదో పెంద్రాళే వచ్చివేస్తే బాగుండును! ఏమిటా వచ్చేది? మృత్యువా? అంధకారమా?...కాదు! కాదు! మృత్యువుకంటె మరేది వచ్చినా నయమే!

పీటర్ టీ పట్టుకువచ్చాడు. ఇలియిచ్ ఆ వచ్చినవా రెవరైనదీ తెలియనట్లుగా కొంతసే పతనికేసి కంగారుగా చూశాడు! అతని వెర్రిచూపులు చూసి పీటర్ మొదట కొంచెం గాభరాపడ్డాడు. ఆ కంగారు అదీ చూసేసరికి ఇలియిచ్‌కి ఆ నాటి జ్ఞాపకంవచ్చింది.

"ఒహో! టీ ఆఁ సరే! అది అక్కడ పెట్టు! మొహం కడుక్కొని బట్టలు మార్చుకుందామని ఉంది. కాస్త సాయం చేస్తావా?"

ఇవాన్ ఇలియిచ్ మధ్య మధ్యని ఆగుతూ చేతులు, మొహము కడుక్కొని, తల దువ్వుకుని అద్దంలో చూసుకున్నాడు. తలవెండ్రుకలు తెల్లగా పాలిపోయిన నుదుటిమీద అలుముకుపోయినట్లు వేళాడుతున్నాయి. ఆ ముఖకవళిక చూసుకుని అతను హడలిపోయాడు.

షర్టు మార్చుకునేటప్పుడు తన ఒంటికేసి చూసుకుంటే మరీ భీభత్సంగా ఉంటుందని ఇలియిచ్‌కి తెలుసును. అందుచేత శరీరంకేసి చూసుకోవడమే మానివేశాడు. దుస్తులు మార్చుకున్న తరవాత టీ పుచ్చుకోడానికని ఆ పక్కగా ఉన్న పడకకుర్చీ మీద కూర్చున్నాడు. ఒక క్షణంసేపు సుఖంగా ఉన్నదని అనుకున్నాడు. కాని టీ తాగడం మొదలు పెట్టేసరికి ఆ నోటివికారము, ఆ బాధ మళ్లీ ప్రారంభించాయి. అతికష్టంమీద ఆ టీ కాస్త తాగి, పడకకుర్చీమీద కాళ్లు చాపుకుని కూర్చుని, పీటర్‌తో వెళ్లిపొమ్మని చెప్పాడు.

రాత్రింబగళ్ళతని పరిస్థితి అల్లాగే ఉన్నది. అప్పుడప్పుడతని కళ్ళలో ఒక ఆశాజ్యోతి మెరిసినట్లుండేదిగాని వెంటనే నిరాశా సముద్రం గర్జిస్తూన్నట్లుండేది. ఆ నెప్పి అస్తమానము అలాగే సలుపుతూ ఉండేది. నైరాశ్యంతో అతడలాగే కుములుతూండేవాడు. ఒంటరిగా ఉన్నప్పుడాతనిల్లో ఇంకొకరిని పిలవాలనే భయంకర కాంక్ష బయలుదేరేది. వాళ్లు వచ్చినతరవాత తన బాధ మరింత ఎక్కువైపోతుందని అతనికి తెలుసును. అయినా "స్పృహతప్పి పోవడానికి ఇంకా కొంచెం మత్తుమందు పుచ్చుకుంటాను. ఈసారి డాక్టరుతో ఈ విధంగా ఇది భరించడం దుర్భరంగా ఉందనీ, మరొకటి ఏదైనా ఆలోచించాలనీ చెబుతాను." అనుకునేవాడు.

అలాగ ఒక గంటో రెండుగంటలో గడిచిపోయేవి. ఇంతలో ద్వారపుగంట గణగణ మోగింది. బహుశః అది డాక్టరు మోగించిన గంటేమో! అవును! ఆ వచ్చింది డాక్టరే! ఆ డాక్టరు లావుగా చలాకీగా ఉన్నాడు. అతని ముఖవైఖరి చూస్తే—"ఏమిటయ్యా! అలాగ కంగారు పడిపోతున్నావు! ఆ వ్యవహారం అంతా నేను రైటు చేసేస్తానుగా!" అన్నట్టుంది. కాని ప్రస్తుత పరిస్థితుల్లో ఆవిధమైన ధోరణి నప్పదని అతనికి తెలుసును! అయితే నలుగురు పెద్ద మనుషుల్ని చూడడానికి పొద్దున్నే ఒక పెద్ద కోటు వేసుకుని మళ్ళీ విప్పివేసినట్లే—ఆ పనిఅంతా అయిపోగానే మళ్ళీ ఈ ధోరణి సులభంగా మార్చివెయ్యగలడు!

డాక్టరు బాగా వేడెక్కేదాకా చేతులు రెండూ రాసుకుంటూ "అబ్బా! ఏమి చలి! ఒళ్లంతా కరిచివేస్తోంది. కాస్త ఒళ్లు వేడెక్కనివ్వండి" అన్నాడు. అతని మాటలుపట్టిచూస్తే—"కాస్త అంతవరకు ఓపిక పడితే ఈ సమస్యలన్నీ చక్కబరిచేస్తాను!" అన్నట్టు కనబడింది.

డాక్టరు "ఏమిటి! ఎల్లాగున్నారు?" అన్నాడు.

"ఏమిటి కథ! మన వ్యవహారాలెల్లా ఉన్నాయి" అన్నట్టుగా ఆ డాక్టరు మాట్లాడాలనుకున్నాడనీ, అయితే అవిధంగా అడగడం బాగుండదని "రాత్రంతా ఎల్లా గడిచింది!" అనే ధోరణిలో మాట్లాడాడనీ ఇలియిచ్ గ్రహించుకున్నాడు. ఇలియిచ్ ఏమీ అనకుండా అదేమాదిరిగా అతనికేసి చూశాడు. ఆ చూపులో "ఎందుకిలాగ అబద్ధాలాడడం! కాస్త సిగ్గు, లజ్జ ఉండక్కరలేదూ?" అనే భావం స్ఫురించింది. అయితే ఆ డాక్టరిదేమీ బోధపరుచుకోవాలనే ధోరణిలో లేడు. ఇలియిచ్ "అల్లాగే నాన్నా

యాతనగాను ఉంది! ఆ బాధ నన్నొదిలేటట్లే కనబడటం లేదు. పిసరంతైనా తగ్గడం లేదు. మరేదైనా...” అని ఏదో చెప్పబోయాడు.

అంతలోనే డాక్టరు అందుకున్నాడు.

“అవునవును! జబ్బుపడిన మనుషులంతా ఇలాగే మాట్లాడతారు...అమ్మయ్యా! ఇప్పటికి నాఒళ్ళు కొంచెం వేడెక్కింది.” అని, రోగి చెయ్యి ఆప్యాయంగా అందుకున్నాడు.

తరవాత సాఫీధోరణి విడిచిపెట్టి, అతి తీవ్రంగా ముఖం పెట్టి, రోగిని పరీక్షించటం మొదలుపెట్టాడు. నాడి, ఉష్ణత మొదలైనవన్నీ పరిశీలించి హృదయపరీక్ష కుపక్రమించాడు.

ఇలియిచ్కి ఇదంతా వట్టి బూటకమని తెలుసును. డాక్టరు మోకాళ్ళమీద ఆనుకుని అతని హృదయధ్వను లతిజాగ్రత్తగా వింటున్నాడు. కోర్టులో ఉన్నప్పుడు లాయర్లేవేవో వాదోపవాదాలు సాగించేవారు. అవన్నీ వట్టి అబద్ధాలనీ, వారలాగ మాటలాడడానికి కొన్ని ప్రత్యేక కారణాలున్నాయనీ ఇలియిచ్కి తెలుసును. అయినా ఇలియిచ్, అవన్నీ భరించి ఊరుకునేవాడు. ఇప్పుడు ఈ డాక్టరు చేసేవన్నీ అలాగే భరించాడు.

డాక్టరలాగే మోకాళ్ళమీద ఆనుకుని హృదయపరీక్ష చేస్తూంటే ద్వారందగ్గిర ఫెడరోవ్నా సిల్కుదుస్తులు రెపరెపలాడాయి. ఆమె ఆ డాక్టరు వచ్చిన సంగతి తన కెందుకు చెప్పలేదని పీటర్ మీద కేకలు వేసింది.

ఫెడరోవ్నా లోపలికి వస్తూనే ఇలియిచ్ని ముద్దుపెట్టుకుని తాను లేచి చాలా సేపైందని బుజువు పరచడానికి ప్రయత్నించి, పీటర్ చెప్పకపోవడం వల్లనే అక్కడికి రాలేకపోయినట్టు మాట్లాడింది.

ఇవాన్ ఇలియిచ్ నఖశిఖపర్యంతము ఆమె వేషం పరిశీలించాడు. ఆమె మంచి ఆరోగ్యంగాను ఉల్లాసంగాను కనిపించింది. కళ్లు కలకల నవ్వుతున్నట్లున్నాయి. ఆ ధోరణి చూసేసరికి ఇలియిచ్కి ఒళ్లంతా తుకతుక మండిపోయింది. ఆమె అతని ఒంటిమీద చెయ్యివేసేసరికి అతనికి ఒంటిమీద చంద్రనిప్పులు గుమ్మరించినట్లయింది.

అతన్నిగురించీ ఆ రోగాన్నిగురించి ఆమె అవలంబించిన ధోరణే అలాగే ఉంది. ఆ డాక్టరు రోగివిషయంలో ఒక ప్రత్యేక దృక్పథం అలవాటు చేసుకున్నాడు. ఆ ధోరణి నతడు మార్చుకోలేకపోయాడు. ఫెడరోవ్నా కూడా ఆ రకమైన ధోరణే అలాగే పట్టుకుని కూర్చున్నది. ఇలియిచ్ రోగం విషయంలోను మందులవిషయంలోను జాగ్రత్తపడటం లేదనీ, దాని బాధ్యత వహించవలసిన వ్యక్తి అతనేననీ, అందువల్లనే ఈ బాధలు అనుభవించవలసివస్తున్నదనీ ఆమె చెబుతూంటుంది, మళ్ళీ ఇప్పుడూ అదే ధోరణి.

“ఆయన నామాటంటే బొత్తిగా చెవికెక్కనియ్యరు. సరీగ్గా వేళకి మందు పుచ్చుకోరు. ఆ కాళ్లలాగే పైకెత్తి పెట్టుకుని పడుకుంటారు. దానివల్ల రోగం మరింత ముదిరిపోతుంది. ఏమీ అనుమానం లేదు.”

అని చెప్పి జెరాసిమ్ అతని కాళ్లు పైకెత్తి పట్టుకునే తీరుఅంతా వర్ణించి చెప్పింది.

డాక్టరు వెటకారంతోను కొంచెం ఆప్యాయతతోను ఒక్క చిరునవ్వు నవ్వి “ఏంజేస్తాం! జబ్బు చేసినవాళ్లకి కొన్ని లలితక్కులు బయలుదేరుతూంటాయి. అవన్నీ మనం కడుపులో పెట్టుకోవాలి.” అన్నాడు.

డాక్టరు పరీక్ష ముగించి వాచీ చూసుకుంటున్నాడు. ఫెడరోవ్నా ఇలియిచ్ దగ్గిరికి వచ్చి, “నే నింకొక పెద్ద డాక్టరుగారిని పిలిపిస్తున్నాను. ఆయన ఈవేళ వచ్చి పరీక్షచేసి మన డాక్టరు గారితో సంప్రతిస్తారు. దీనికి మీరేమీ అడ్డుచెప్పవద్దు. ఇదంతా నాసంతృప్తికోసమే” అంది. ఈమాట లామె వ్యంగ్యపూర్వకంగా ఉచ్చరించింది. నిజాని కివన్నీ అతనికోసమే జరుగుతున్నా తనమాట కడ్డుచెప్పకూడదనడానికే ఆమె ఈవిధంగా మాట్లాడింది. ఇలియిచ్ కనుబొమ్మలు ముడిచి అలాగే నిశ్శబ్దంగా ఉన్నాడు. ఇదంతా ఒక కపటనాటకంకింద తయారయిందనీ, ఇందులోనించి తప్పించుకుని ఇవతల పడడం తన కిక సాధ్యంకాదనీ నిశ్చయించివేశాడు.

ఇక ఫెడరోవ్నా ధోరణి చూస్తే ప్రతీదీ ఆమెకోసమే చేయిస్తున్నట్లు, మరొకవిధంగా అనుకోడానికి అవకాశమే లేనట్టు మాటాడుతున్నది.

పదకొండున్నర అయ్యేసరికి ఆ కొత్తడాక్టరు వచ్చి గుండెపరీక్ష ప్రారంభించాడు. ఆ డాక్టరు, ఫెడరోవ్నా అతని సమక్షంలో కొంతసేపు సంప్రతింపులు జరిపి, తరవాత ఆ పక్క గదిలోకి వెళ్ళి ఎపెండిక్సును గురించీ, కిడ్నీని గురించీ ఏవేవో రహస్యంగా మాట్లాడుకున్నారు. ఇలియిచ్ కిప్పుడు తేలవలసినది చావుబతుకుల సమస్య! వారంతా ఎపెండిక్సు, కిడ్నీ తిన్నగా పనిచేయడంలేదనీ, ఇప్పుడు డాక్టర్లిద్దరు కలిసి వాటినీ తిన్నని దారిలో పెట్టాలనీ అతితీవ్రంగా చర్చించుకుంటున్నారు

ఇలియిచ్ చావుబతుకుల సంశయావస్థలో పడి "రోగం నయమయ్యే ఆశ ఏమైనా ఉన్నదా?" అని అడిగాడు. కొత్తడాక్టరు తీవ్రంగా ముఖం పెట్టి హామీ ఇవ్వలేననీ, అయితే నయమయ్యేటట్లే కనిపిస్తున్నదనీ చెప్పి వారిదగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. పాపం ఇలియిచ్ అలా వెళ్ళిపోతున్న ఆ డాక్టరు ముఖంకేసి ఎంతో ఆత్రంగా చూశాడు. ఫెడరోవ్నాకు అతని ఆత్రత చూస్తే గుండె తరుక్కుపోయింది. ఆమె డాక్టరుకు ఫీజు ఇవ్వడానికి వెడుతూ ఒక్కసారి లోలోపల బావురుమని ఏడ్చింది.

ఆ కొత్తడాక్టరు కొంతకాలంపాటు ఆశాజ్యోతి వెలిగించాడుగాని, అది ఆట్టే కాలం నిలబడలేదు. ఇలియిచ్‌కి రోజురోజు ఆ గది, ఆ తెరలు, మందుల సీసాలు, ఆ బాధ అలాగే ఉండిపోతున్నట్లు కనిపించాయి. మరి ఇంకా బాధ భరించలేక అతను గట్టిగా మూలిగేవాడు. డాక్టరు చర్మం లోపల కంటా పొడిచి ఒక కొత్త ఇంజెక్షను ఇచ్చాడు. దానితో అతనికి చాలాసేపటివరకు స్మారకం తప్పిపోయింది.

తెలివి వచ్చేసరికి సాయంకాలం కావచ్చింది. పరిచారకులు భోజనం పట్టుకువచ్చి అక్కడపెట్టారు. ఇలియిచ్ అతికష్టంమీద కొంచెం మాంసము, టీ పుచ్చుకున్నాడు. మళ్ళీ అతని కళ్ళకి అక్కడ ఉన్నవన్నీ అల్లాగే కనిపించడం ప్రారంభించాయి. ఇంతలో చీకటిపడింది.

సాయంత్రం భోజనం అయినతరవాత ఏడు గంటలయ్యేసరికి ఫెడరోవ్నా సాయంకాలం దుస్తులు ధరించి లోపలికి వచ్చింది. ఆమె తొడుక్కున్న జాకెట్టువల్ల హృదయం ఉన్నత్తంగా పైకి పొంగింది. ముఖంమీద రంగు నాటుగా పూసుపూసినట్లు కనిపిస్తున్నాయి. నాటకానికి వెడుతున్న సంగతి ఆమె పొద్దున్నే అతనితో చెప్పింది. సారాబెర్న్‌హార్ట్ అనే ప్రఖ్యాత నర్తకి ఆ పట్టణంలో ప్రదర్శనాలేర్పాటు చేసింది ఇలియిచ్ ఆ సంగతి విని ఫెడరోవ్నా అది తప్పకుండా చూసితీరాలని పట్టుపట్టాడు. కొన్ని సీట్లుకూడా రిజర్వు చేయించాడు. కాని ఇలియిచ్ ఆమాటే మరిచిపోయాడు. అందుచేత మొట్టమొదటగా ఆమె వేషం చూసేసరికి అతనికి లోలోపల చిరచిరలాడింది. అయితే మళ్ళీ అంతలోనే తనే ఆ ప్రదర్శనానికి వెళ్ళమన్న మాట జ్ఞాపకంవచ్చి ఆ కోపం అంతా లోలోపలే తమాయించుకున్నాడు.

ఫెడరోవ్నా లోపలికి వచ్చేటప్పుడు చాలా ఉల్లాసంగానే కనిపించింది కాని లోపల తానేదో తప్పు చేశానని పశ్చాత్తాప పడుతూనే ఉన్నది. మెల్లిగా అతని పక్క నేకూర్చుని ఒంట్లో ఎలాఉన్నదని అడిగింది. అతను "ఆం ఇందులో అంతగా అడిగి తెలుసుకోవలసింది ఏమి ఉన్నది! ఏదో ఒక మాట అనాలిగదా!" అని ఆవిధంగా అడిగి ఉంటుందని అనుకున్నాడు. అటుపిమ్మట ఆమె ఇలాగ అన్నది: "అసలు నేనక్కడికి వెడదామనే అనుకోలేదు! అమ్మాయి, ఆమె స్నేహితురాలు బయలుదేరారు; సీట్లు అవీ ఇంతకుపూర్వమే రిజర్వు చేయించాము గదా! అల్లుణ్ణో, (ఇతను కాబోయే అల్లుడు) అమ్మాయినీ ఒంటరిగా పంపిస్తే బాగుండదని నేనూ బయలుదేరాను. లేకపోతే ఆ కాస్సేపు మీదగ్గిరే కూర్చుందును. నేను వెళ్ళాక మీరు మందులు అవీ సరిగ్గా వేళకి పుచ్చుకుంటూండండి."

అటుతరవాత ఒక్కనిమిషం ఊరుకుని "అమ్మాయి, అల్లుడు లోపలికి వచ్చి మిమ్మల్ని చూడాలని అనుకుంటున్నారు! రమ్మన్నారా?" అని అడిగింది.

ఇలియిచ్ సరే రమ్మనమన్నాడు.

ముందుగా ఇలియిచ్ కుమార్తె లోపలికివచ్చింది. ఆమె సాయంకాలం ముస్తాబుతో తళతళలాడుతూ

లోపల ప్రవేశించింది. నవయౌవనంతో నవనవలాడుతున్న ఆమె శరీర కాంతులు దుస్తులలోనించి పైకి తొంగిచూస్తున్నాయి. ముఖభంగిమ చూస్తే ప్రేమభావంతో మురిసిపోతున్నట్లున్నది. హాయిగా కాలక్షేపం చేసే ఆ అమ్మాయి కీ జబ్బు, బాధలు ఈ గొడవలు చాలా చిరాకెత్తిస్తున్నాయి.

ఇంతలో అల్లుడు కూడా లోపలికి వచ్చాడు. సాయంకాలం సూటు వేసుకుని జుట్టు ఉంగరాలు తిరిగేట్టు దువ్వుకున్నాడు. అతని కోటు పంట్లాము మొదలైనవన్నీ శరీరానికి గట్టిగా అంటిపెట్టుకున్నట్లున్నాయి. హాట్ చేత్తో పట్టుకుని నిటాగ్గా నిలబడ్డాడు.

ఇలియిచ్ చిన్నకొడుకు కూడా ఎవరికీ కనబడకుండా అతని వెనకాలే వచ్చి లోపల దూరాడు. ఆ పిల్లవాడి కనురెప్పలకింద నల్లని మచ్చలున్నాయి. ఆ మచ్చల అర్థమేమిటో ఇలియిచ్‌కి పూర్తిగా తెలుసును!

ఆ పిల్లవాడిని చూడగానే ఇలియిచ్ గుండె జల్లుమంది! భయంవల్ల దిగాలుపడిపోయిన వాడి ముఖం చూస్తుంటే - పాపం ఇలియిచ్ గుండె తరుక్కుపోయింది జెరాసిమ్ తరవాత ఈ పిల్లవాడొక్కడే తనవిషయంలో బెంగపెట్టుకున్నాడని ఇలియిచ్‌కి తెలుసును.

తరవాత అందరు అతని చుట్టూరా కూర్చుని ఒంట్లో ఎలాగున్నదని అడిగారు.

కొంతసేపటిదాకా ఎవరూ ఏమీ మాట్లాడలేదు. కుమార్తె తన కంటిజోడు ఎక్కడున్నదని తల్లిని అడిగింది. అది ఎవరు తీసుకున్నదీ ఎక్కడపెట్టిందీ తెలియలేదు. దానిమీద తల్లి కూతురు మాట మాట అనుకున్నారు

ఇంతలో అల్లుడు ఇలియిచ్‌కి దగ్గరగా కూర్చుని "మీ రెప్పుడైనా సారాబెర్న్‌హార్ట్‌ను చూశారా?" అని అడిగాడు. ఇలియిచ్‌కి మొదట ఈ ప్రశ్న వినబడలేదు గాని, కొంతసేపటికి గ్రహించుకొని "లేదు! నీ వెప్పుడైనా చూశావా?" అని తిరిగి అడిగాడు. అల్లుడు "వనక ఒక నాటకంలో చూశాను." అన్నాడు. ఫెడరోవ్నా కొన్ని కొన్ని వేషాల్లో సారాబెర్న్‌హార్ట్‌తో సమానమైనవారింకెవరు లేరంది. కాని కుమార్తెకి అభిప్రాయం నచ్చలేదు. అటు పిమ్మట సంభాషణ ఆ నర్తకి వాస్తవికాభినయపద్ధతి మీద, హుందాతనంమీద నడిచింది. ఇందులో విశేషం ఏమీ లేదు. నలుగురు కూర్చున్నప్పుడిటువంటి బాతాఖానీ నడుస్తూండడం మామూలే.

ఈ సంభాషణమధ్య అల్లుడొకసారి మామగారివైపు చూసి ఏమీ అనకుండా మాట్లాడకూరుకున్నాడు. మిగిలినవాళ్ళుకూడా ఇలియిచ్‌కేసి చూసి మాట్లాడడం కట్టిపెట్టేశారు. ఇలియిచ్ అందరిమీద ధుమధుమలాడుతూ మూతి బిగించుకుని కూర్చున్నాడు. ఇలియిచ్చే ఈ పరిస్థితి ఎలాగో అలాగ సర్దుకుంటే బాగుండిపోయేది గాని అది జరిగేమార్గం కనబడలేదు. అందరు మాట్లాడకూరుకోవడం ఇబ్బందిగానే ఉంది. ఎవరో ఒకరు సంభాషణ ఉపక్రమించాలి. ఒక్కరికీ ధైర్యం చాలలేదు. తీరా ఎవరైనా మొదలుపెడితే అందరు ఆడుతూన్న ఆ కపటనాటకం కాస్తా బయటపడిపోతుందేమోనని భయం! కూతురే మొట్టమొదటగా ధైర్యం చిక్కబట్టి మాట్లాడాలని నిశ్చయించింది. కాని అందరు పైకి కనబడకుండా దాచివేద్దామనుకున్న ఆ విసుగుదల కాస్తా బయటపడిపోయింది.

"ఇదిగో! మనం నాటకానికి వెళదామనుకుంటే వెంటనే బయలుదేరడం మంచిది" అన్నది వాచీకేసి చూస్తూ. అది తండ్రి బహూకరించిన వాచీ. ఇలాగ మాట్లాడేటప్పుడు పెట్రోవిచ్‌కేసి చూస్తూ ఒక చిరునవ్వు నవ్వింది. దాని అంతరార్థం ఆ యిద్దరికే తెలుసును! ఇలాగన్న తరవాత కుమార్తె తటాలున లేచి నిలబడింది. ఆమె దుస్తులు తళతళలాడాయి.

ఇక మిగిలినవారందరు కూడా లేచి, ఇలియిచ్ దగ్గిర సెలవుతీసుకుని వెళ్ళిపోయారు.

వారందరు వెళ్ళగానే ఇలియిచ్ "అమ్మయ్య!" అనుకున్నాడు. అతనికి ఒంట్లో కొంచెం తేలికగా ఉన్నట్లు కనబడింది. వారు వెళ్ళడంతోబాటు కపటనాటకం కూడా ముగిసిపోయినట్లు కనబడింది. అయితే—ఆ బాధమాత్రం అలాగే ఉండిపోయింది. ఆ బాధవల్ల, ఆ భయంవల్ల ప్రతీదీ స్తబ్ధంగా ఉండిపోయినట్లు కనబడింది. ఇది తగ్గిందనిగాని, ఎక్కువైందనిగాని అనుకునే ఆస్కారం కనబడలేదు.

అన్ని బాధలు క్రమక్రమంగా ముంచుకొస్తున్నట్లే ఉన్నాయి.

నిమిషాల వెంబడి నిమిషాలు, గంటల తరబడి గంటలు అలాగే స్తబ్ధంగా, దిగులుగా గడిచిపోతున్నాయి. ఎక్కడా బాధలు తగ్గేసూచనలే కనబడడం లేదు. ఇక వాటి పరిణామం మరింత భయంకరంగా మారిపోయేటట్లుంది.

పేటర్ వచ్చి "జరాసిమ్‌ని పంపించనా? బాబూ!" అన్నాడు. 'సరే!' అన్నాడు ఇలియిచ్.

## 9

ఫెదరోవ్నా రాత్రి ఇంటికి తిరిగివచ్చేసరికి బాగా ఆలస్యంఅయింది. ఆమె అతి నెమ్మదిగా చప్పుడు కాకుండా ఇలియిచ్ గదిలోకి వచ్చింది. కాని ఇలియిచ్ ఆమె అడుగుల చప్పుడు విని కళ్ళు తెరిచి వెంటనే మూసివేసుకున్నాడు. ఫెదరోవ్నా జెరాసిమ్‌ని అక్కడనించి పంపించి వేసి తానే అతని పక్కని కూర్చోవాలని అనుకున్నదిగాని ఇలియిచ్ కళ్లు తెరిచి "అక్కరలేదులే! నువ్వు వెళ్లిపో!" అన్నాడు.

"ఏం, బాధ బాగా ఎక్కువగా ఉందా?"

"ఎప్పుడూ ఒకలాగ ఉంది."

"కొంచెం నల్లమందు తీసుకోండి."

'సరే' అని అతను కొంచెం నల్లమందు పుచ్చుకున్నాడు. ఆ తరవాత ఆమె వెళ్ళిపోయింది.

ఆ తరవాత తెల్లవారగట్ల మూడుగంటలదాకా అతనల్లాగే నానా యాతన అనుభవిస్తూ మందకొడిగా పడిఉన్నాడు. అతనికి తాను, తన యాతనలు కలిసి ఒక నల్లని ఇరుకు గోనెసంచీలో కూరుకుపోతున్నట్లనిపించింది. అలాగ కూరుకుపోతూన్నా ఆ సంచీకిక ఒక అంతు, దరీ ఉన్నట్లు కనబడడంలేదు. ఇదీ అతని పరిస్థితి. అసలే ఈ పరిస్థితి నిత్యము సంగె మీద కుంపటిలా తయారయింది. ఆపైన భరించరాని యమయాతన. అతనీ పరిస్థితి తలుచుకుని హడలిపోయేవాడు. అయినా ఆ సంచీలోంచి అల్లాగే కిందికి జారిపోతూండేవాడు. చివరికి ఒకసారి స్పృహతప్పిపోయి, మళ్ళీ కొంతసేపటికి తెలివి వచ్చింది. జెరాసిమ్ అతని కాళ్లు ఒళ్ళో పెట్టుకుని కునికిపాట్లు పడుతున్నాడు. అతని ఒళ్లో ఇలియిచ్ కాళ్ళు కలపకాడల్లా వేలాడుతున్నాయి. మందకొడిగా వెలుగుతున్న ఆ కొవ్వొత్తిదీపాలు, ఆ బాధలు అల్లాగే ఉన్నాయి.

ఇలియిచ్ "జెరాసిమ్! ఇక నువ్వు వెళ్లిపో!" అన్నాడు.

"మరేం పరవాలేదు బాబూ! నేనింకా కొంచెంసేపుంటాను."

"వద్దులే. వెళ్ళిపో!"

ఇలాగ అని ఇలియిచ్ జెరాసిమ్ ఒళ్లోనించి కాళ్ళు తీసివేసి పక్కకు ఒరిగి పడుకుని తన పరిస్థితి తలుచుకుంటూ లోలోపల కుమిలిపోతాడు. జెరాసిమ్ ఆ పక్క గదిలోకి వెళ్ళిపోయేదాకా ఎల్లాగో అల్లాగ లోలోపలి దుఃఖం ఆపుకుని పసిపిల్లవాడిలా ఒక్కసారిగా బావురుమని ఏడ్చాడు. ఇలియిచ్‌కి బొత్తిగా దిక్కులేనట్లు కనబడింది. ఆపైన అతనికి తనొక్కడు ఒంటరిగా ఉన్నట్లనిపించింది. పైగా దైవమానవుల క్రౌర్యము స్పష్టంగా కనబడిపోయింది. చివరికి భగవంతుడే లేడనిపించింది. ఇవన్నీ తలుచుకుని తలుచుకుని అతను లోలోపల మరీ మరీ కుమిలిపోయాడు.

"ప్రభూ! దీనికంతటికి అంతరార్థం ఏమిటి? నన్ను ప్రపంచంలో ఎందుకు సృష్టించావు? నాకీ విధంగా యమయాతనలనెందుకు కల్పించావు?"

అని ప్రశ్నించాడు. దీనికొక సమాధానం వస్తుందని అతడాశించలేదు. సమాధానం రానూలేదు; కనక ఇలియిచ్ పసిపాపలా మరింతగా వెక్కివెక్కి ఏడ్చాడు. క్రమంగా బాధ బాగా ఎక్కువైపోయింది. అయినా అతడు చలించలేదు; ఎవరినీ పిలవనులేదు. లోలోపల ఇలాగ అనుకున్నాడు. "ప్రభూ! నాకింకా యమయాతనలు కల్పిస్తున్నావు. కానీ! ఇంకా బాధించు! అయితే ఇదంతా ఎందుకోసమని? నేను నిన్నేం చేశాను? ఇదంతా ఎందుకు?"

తరవాత బాగా తమాయించుకున్నాడు. ఏడుపు తగ్గిపోయింది. మనస్సుకు క్రమంగా ఏకాగ్రత వచ్చింది. అతని కేదో వినిపిస్తూంది. కాని అది సామాన్యధ్వని కాదు. అంతరాంతరాల్లోనించి వస్తున్న ఆత్మవాణి! అది అతనికి వినిపిస్తున్నట్లనిపించింది.

ఇలియిచ్‌లో లోపలినించి ప్రవహిస్తున్న ఆలోచనాంతరంగధ్వని ప్రశాంతంగా వింటున్నాడు.

ఆ అస్పష్టమైన ఆలోచనలన్నీ విమర్శించి అవగాహన చేసుకుంటే వాటిలోనుంచి "ఇంతకీ నీకు కావలిసిందేమిటి?" అనే ప్రశ్న ప్రతిధ్వనించింది. అతను లోలోపల "నీకు కావలసిందేమిటి? నీకు కావలిసిందేమిటి?" అనే మళ్ళీ మళ్ళీ ఉట్టంకించుకున్నాడు.

"నాకేం కావాలా?" "బాధలు లేకుండా జీవించాలి" అని సమాధానం ఇచ్చుకున్నాడు.

మళ్ళీ అతి శ్రద్ధగా ఆ అంతరాత్మ ప్రబోధం విన్నాడు. ఆ విన్న ఏకాగ్రతలో అతనికి ఇంతవరకు పీడించిన బాధకూడా మటుమాయమైపోయినట్లు కనబడింది.

"జీవించాలా? అయితే ఎలాగ?" అని అంతరాత్మ ప్రశ్నించింది.

"ఏముంది? నే నిన్నాళ్ళనించీ బతికినట్లుగా నే హాయిగానూ, సుఖంగానూ జీవించాలి."

"ఇన్నాళ్ళనించీ బతికినట్లుగా నే హాయిగానూ సుఖంగానూ కాలక్షేపం చెయ్యాలి గాదూ?" మళ్ళీ అంతరాత్మ ప్రశ్నించింది.

ఇలియిచ్ అటుపిమ్మట తన జీవితంలో హాయిగా గడిపివేసిన మధురక్షణాలన్నీ స్మరించుకున్నాడు. అయితే విచిత్రమేమిటంటే—ఇన్నాళ్ళనించీ హాయిగా కనబడిన ఆ మధురజీవనస్మృతులన్నీ ఇప్పుడంత హాయిగా ఉన్నట్లు కనబడలేదు. కాని బాల్యస్మృతులు మాత్రం అతని భావనాపథంలో అలాగే మనోజ్ఞంగా నిలిచిపోయాయి. ఆ బాల్యస్మృతులెంత మనోహరంగా హృదయదర్పణంలో ప్రతిఫలించాయి! ఆ బాల్యజీవితధోరణిలో మళ్ళీ జీవించగలిగితే ఎంతో బాగుండిఉండును. అయితే ఆ శైశవజీవితం అనుభవించిన శిశు వప్పుడే కాలగర్భంలో విలీనమైపోయాడు. ఇప్పుడతనికా స్మృతులన్నీ ఎవరో మరిఒకరికి సంబంధించినట్లు కనిపించాయి.

అటుపిమ్మట ఇలియిచ్ తనకు ప్రాయం వచ్చినప్పటినించీ తటస్థపడిన మధుర ఘట్టాలన్నీ జ్ఞాపకం చేసుకున్నాడు. అవ్వేవీ ఇప్పుడంత ముఖ్యమైనవిగా కనపడలేదు. పైగా ఆలోచించినకొద్దీ బాగా అసంవర్ణ్యంగా ఉన్నట్లు కనిపించాయి.

ప్రాయం వచ్చింది మొదలుకొని ప్రస్తుతకాలం దాకా జరిగిన సంఘటనలన్నీ జ్ఞాపకం చేసుకుంటూంటే-క్రమంగా వయఃపరిణతి వచ్చినకొద్దీ సంఘటనలలోని మాధుర్యం మటుమాయం అయిపోవడం మొదలుపెట్టింది. కొంత వయస్సు వచ్చినతరువాత లా స్కూలులో చదువుకునేరోజులు కొంతవరకు బాగానే గడిచిపోయాయి. మొత్తంమీద ఆ రోజులన్నీ కులాసాగా గడిచిపోయినట్లే. చాలామంది స్నేహితులుండేవారు. ఏదో పైపైకి పోవాలనే ఆశలుండేవి. క్రమంగా పై క్లాసుల్లోకి వెళ్ళినకొద్దీ ఈ ఉత్సాహం తగ్గిపోయేది. తరవాత గవర్నరుదగ్గర కార్యదర్శిగా పనిచేసినప్పుడు మళ్ళీ కొన్ని మంచి సంఘటనలు జరిగాయి. అప్పుడు ఇలియిచ్‌కి ఒక స్త్రీతో ప్రేమవ్యవహారం నడిచింది. అందుచేత అతనికా స్మృతులన్నీ మధురాతిమధురంగా ఉండిపోయాయి. ఆ తరవాత జరిగినవన్నీ చాలా గందరగోళంగా ఉన్నాయి. వాటిలో మంచివని చెప్పదగ్గవేవీ లేవు. ఇక ఆపైన జీవితం గడిచినకొద్దీ అంత సంతోషప్రదమైన పరిస్థితులేవీ రానేలేదు. తరవాత వివాహం జరిగింది. అది అతిసామాన్యంగా జరిగిపోయిన వ్యవహారమే గాని దానిలో విశేషం ఏమీ లేదు. ఆపైన భార్య తగాదాలు, కేవలం లాలసతో కూడిన సంసారం—ఆత్మవంచన, మొదలైనవన్నీ ప్రారంభమైనాయి. ఉద్యోగం కేవలం చచ్చుదైనిక సంఘటనగా మారిపోయింది. తరవాత డబ్బు చికాకులు, యావజ్జీవమూ-అంటే ఇంచుమించుగా నేటివరకు అల్లాగే ఉండిపోయాయి. ఇంక ఆ జీవితం అలాగ గడిచినకొద్దీ భయంకరంగానే పరిణమించింది. అదంతా పర్యాలోచన చేసుకుంటూ ఇలియిచ్ తనలో తను ఇలాగ అనుకున్నాడు. "నేనేదో పైపైకి వెళ్ళిపోతున్నానని అనుకున్నాను గాని క్రిందకే దిగజారిపోతున్నా నన్నమాట! నిజంగా జరిగిందింతే. నలుగురు నన్ను చూసి ఘనుడంటే ఘనుడని మెచ్చుకున్నారు గాని నా జీవితం కొస్తా హారతికర్పూరంలా హరించిపోయింది. ఇప్పుడిక ఈ తర్జన భర్జనలవల్ల ప్రయోజనం ఏమి ఉంది? అంతా సమాప్తమయిపోయింది. ఇక మిగిలింది మృత్యువే."

హఠాత్తుగా అతని కొక ఆలోచన తట్టింది. "బహుశః నా జీవితం తిన్ననైన దారిలో నడిచి ఉండకపోవచ్చును" అనుకున్నాడు. కాని వెంటనే "ప్రతీదీ నేను జాగ్రత్తగా చేసుకుపోయినప్పుడు జీవితం సరియైనదారిలో నడవలేదని ఎలాగనగలను?" అని సమాధానపడ్డాడు. వెంటనే ఈ సమస్య తన మనస్సు దరిమానానికిరాకుండా తరిమివేశాడు. నిజానికిదే జనన మరణ జటిల సమస్య సాధించే ప్రశ్న. కాని అతడిది తన తలకుమించిన ప్రశ్న అనుకుని చల్లగా జారవిడచి వేశాడు.

మళ్లీ అతని మనస్సులో తర్జనభర్జనలు ప్రారంభమైనాయి. "అయితే నాకిప్పుడు కావలసిందేమిటి? బతకడమా? అయితే ఆ బతకడం ఎలాగ? కోర్టులో గడిపివేసినట్టు జీవితం గడిపివెయ్యడమేనా? కోర్టులో పారాహుషారు లిస్తూ కేకలు పెడుతూంటే తను దర్జాగా నడచిపోయేవాడు. అందరు అదిగో! జడ్జీగారంటే అదిగో జడ్జీగారనేవారు. అవన్నీ జ్ఞాపకం చేసుకుని ఇలియిచ్ లోలోపల "నేను నేరం చెయ్యలేదు." అని గట్టిగా అనుకున్నాడు. తరవాత 'ఇదంతా ఎందుకు?' అనుకుని విచారించడం మానివేసి, గోడకేసి తిరిగి పడుకుని ఆ సమస్యని గూర్చి అల్లాగే ఆలోచించాడు. మనస్సులో మళ్లీ "ఈ బీభత్సాని కంతటికీ ఉద్దేశ్య మేమిటి?"అని ప్రశ్నించుకున్నాడు. ఎంత ఆలోచించినా అతనికి సమాధానం దొరకలేదు. అప్పుడప్పుడు అతనీ సమస్యనుగురించి ఆలోచించేవాడు. అలాగ ఆలోచించినప్పుడు జీవితం తిన్ననైనదారిలో నడవకపోవడంవల్లనే ఇది ఇల్లాగ పరిణమించిందని తట్టుతూ ఉండేది. కాని వెంటనే తన జీవితం అంతా తిన్నగానే నడిచిందని సమాధానపడి, ఆ సమస్య తలెత్తకుండా చేస్తూండేవాడు.

## 10

ఇలాగ ఒక పక్షంరోజులు గడిచిపోయాయి. ఇలియిచ్ ఇక ఆ సోఫా విడిచి ఇవతలికీ, అవతలికీ కదిలేవాడు కాడు. పరుపుమీద పడుకోవడం మానేసి ఆ సోఫామీదే ఉండి, అల్లాగే ఆ గోడకేసి చూస్తూ కూర్చునేవాడు. అతని బాధలు అంతకంతకి ఎక్కువయ్యేవి కాని ఏమీ తగ్గేవి కావు. అతను అలాగే ఒంటరిగా కూర్చుని ఆ గడ్డుసమస్యనిగురించి అలాగే తర్జన భర్జనలు చేస్తూండేవాడు. ఒకసారి తనలో "ఏమిటిది? మృత్యువంటే ఇదేనా?" అనుకున్నాడు. అతని అంతరాత్మ "అవును! మృత్యువంటే ఇదే!" అని సమాధానం చెప్పింది. మళ్ళీ ఈ యాతనలకన్నిటికీ ప్రయోజనం ఏమిటి?" అని ప్రశ్నించాడు. అంతరాత్మ "ఏమీ కారణంలేదు. ఇది ఇంతే!" అని సమాధానం చెప్పింది. అంతే! అంతకంటె వేరే విశేషం ఏమీ లేదు.

ఇలియిచ్ మొట్టమొదట డాక్టర్ని చూడడానికి వెళ్లినప్పటినించీ రోగవ్యవహారం అటూ ఇటూ ఊగిసలాడుతూ ఉండేది. ఒకప్పుడు బాగా ఆశ కనిపిస్తూ ఉండేది. గర్భావయవాలు సరియైన దారిలో పడితే వ్యవహారం అంతా తిన్నబడేటట్లే కనబడింది. కాని క్రమక్రమంగా రోగం బాగా ముదిరిపోయి చెయ్యిదాటిపోయినట్లు కనబడింది. ప్రస్తుత పరిస్థితిలో ఆ అనూహ్యమైన మృత్యుబీభత్సం తప్ప మరి వేరే గత్యంతరం ఉన్నట్లు కనబడలేదు. క్రమంగా మూత్రకోశానికి సంబంధించిన వ్యవహారం అంతా బాగా గందరగోళంగా తయారయింది. మృత్యువొక్కటే కళ్లకుకట్టినట్టు స్పష్టంగా కనబడుతున్నది.

మూడు నెలలకు పూర్వంఉన్న పరిస్థితికీ, ఇప్పటి పరిస్థితికీ గల తేడా చూసుకునేటప్పటికి అతనికి తన పరిస్థితిఅంతా అథఃపాతాళంలోకి పడిపోతున్నట్లు కనిపించింది.

తరవాత సోఫామీద కూర్చున్నప్పుడు అతనికి తానీ ప్రపంచంలో కేవలం ఒంటరిగా ఉండిపోయినట్లు కనబడింది. తానున్న ఆ పట్టణం జనసమ్మర్దంతో కిటకిటలాడుతూంది. అదీగాక ఆ ఊళ్లో అతనికి బంధువులు, మిత్రులు అసంఖ్యాకంగా ఉన్నారు. అయినా అతనికి అక్కడ తానొక్కడు కేవలం ఏకాకిగా జీవిస్తూన్నట్లు కనిపించింది. ఏ సముద్ర గర్భంలోనో, భూగర్భంలోనో ఉండిపోయినట్లనిపించింది. ఆ భీకరమైన ఒంటరితనంలో ఇలియిచ్ తన గతకాలపు సంగతులన్నీ నెమరు వేసుకుంటూ కాలక్షేపం చేసేవాడు. గతకాల స్మృతి పరంపరలన్నీ అతని కళ్లయెదట ప్రత్యక్షమౌతూ కదలిపోతూ

ఉండేవి. బాగా బాల్యానికీ, ఇటీవలి కాలానికీ సంబంధించిన స్మృతులే ఎక్కువగా అతని మనః ఫలకంలో ప్రతిబింబించేవి. సామాన్యంగా బాల్య స్మృతులే బాగా అతని మనస్సు ఆకర్షిస్తూ ఉండేవి. మొట్టమొదట అతనికి చిన్నతనంలో తిన్న తీయతీయని తినుబండారాలన్నీ జ్ఞాపకం వచ్చేవి. వాటితోబాటు ఆ చిన్నతనంలో నర్సులు, నాకిచ్చిన రంగురంగుల ఆటబొమ్మలు మొదలైనవన్నీ స్మృతిపథంలో మెరుస్తూండేవి. కాని ఇలియిచ్ లోలోపల "నే నిప్పుడా విషయాలేవీ తలపెట్టకూడదు ఇదంతా మనస్సుకి చాలా బాధగా ఉంది" అనుకుని మళ్లీ ప్రస్తుతకాలపు వ్యవహారాలను గురించి ఆలోచించేవాడు. ఈ ఆలోచనలలో అతని కా సోఫా, దాని మీద కుట్టించిన విలువైన చర్మాలు మొదలైనవన్నీ జ్ఞాపకం వచ్చేవి.

"అబ్బో ఈ చర్మాలకోసమని చాలా డబ్బు ఖర్చుపెట్టాను. దీని మన్నికకూడా తక్కువే. దీని మూలాన్ని పెద్దతగాదా వచ్చింది......చిన్నప్పుడు నాన్నగారి తోలుసంచీ చింపేశాను. ఆ సంచీ చర్మానికీ దీనికీ చాలా తేడా ఉంది......అప్పుడు బాగా దెబ్బలు తగిలాయి. ఏడుస్తూంటే అమ్మ మిఠాయి తెచ్చిపెట్టింది." అని పరిపరివిధాలుగా ఆలోచనలు సాగించాడు. మళ్ళీ అతని ఆలోచన ఆ బాల్యస్మృతుల్లో ప్రవేశించింది. అయితే వాటి వల్ల అతనికి బాగా బాధ కలిగింది. అందుచేత ఆ విషయాలు విడిచిపెట్టి వేరే మరికొన్నింటిమీద మనస్సు నిలపాలని అనుకున్నాడు.

ఈ స్మృతులతోబాటు మరికొన్ని స్మృతులతని మనస్సులో ప్రవేశించాయి. అవన్నీ అతని రోగానికి సంబంధించినవి. మొట్టమొదట అతనికి రోగప్రారంభము, క్రమక్రమంగా అది ఎక్కువైపోయిన పరిస్థితులు జ్ఞాపకం వచ్చాయి. బాల్యంవైపు వెళ్లినకొద్దీ జీవిత నిర్ఝరిణి విశాలంగా ప్రవహిస్తున్నట్టు కనిపించింది. ఇలియిచ్ తనలో "ఈ బాధ ఎక్కువైనకొద్దీ జీవితప్రవాహం సన్నగిలిపోయింది. అలాగలాగ ముందుకు వెళ్ళినకొద్దీ జీవితం అంతా అంధకారబంధురం అయిపోయింది" అనుకున్నాడు. అతనికి తన జీవితం అంతా బరువుగా కిందికి పడిపోతున్న బండరాయిలా కనిపించింది.

ఇలియిచ్ మనస్సులో "జీవితం ముందుకు వెళ్లినకొద్దీ క్రమక్రమంగా బాధ లెక్కువౌతూ ఉంటాయి. చివరికి జీవితం భయంకరమైన యాతనాభారంతో అంతమైపోతుంది. నేను గబగబా కిందికి పడిపోతున్నాను." అనుకున్నాడు. వెంటనే పడిపోకుండా నిలవదొక్కుకోవాలని అనుకున్నాడు. కాని ఇంక నిలవదొక్కుకోడం కలలోని వార్త అని తేలిపోయింది. అందుచేత అలాగే ఆ సోఫామీద పడుకుని ఆ భయంకర మృత్యువుకోసం నిరీక్షిస్తూ కూర్చున్నాడు.

మళ్ళీ అతని మనస్సులో ఈవిధంగా ఆలోచనలు తట్టాయి. "ఇక నిలవదొక్కుకోడం అసంభవం...అయితే ఈ యాతనల కన్నిటికీ ఉద్దేశ్య మేమిటో తెలిస్తే బాగుండును! ఆ తెలుసుకోవడం మాత్రం అంత తేలికా? నేను సరియైన మార్గంలో నడవలే దనుకున్నప్పుడు దీనికంతటికీ కారణం కనుక్కోవచ్చును. నా ప్రవర్తనలో ఎక్కడా నాకి కనబడదే!"

ఈవిధంగా అనుకుని తను ఉద్యోగవిధులన్నీ అతిజాగ్రత్తగా సక్రమంగా నిర్వర్తించిన విషయం జ్ఞాపకం చేసుకున్నాడు. ఇలాగనుకుంటూంటే అతని పెదవులమీద అవహేళనాత్మకమైన ఒక చిన్న చిరునవ్వు తాండవించింది! చివరికి లోలోపల "దీనికెక్కడా కారణం కనబడదు. యమయాతన అనుభవించడం, చివరికి చచ్చిపోవడము!—అంతే! అయితే ఇదంతా ఎందుకు?" అనుకున్నాడు.

# 11

అటుపిమ్మట మళ్ళీ ఒక పదిహేనురోజులు గడిచిపోయాయి. ఈ సమయంలో ఒక సంఘటన జరిగింది. ఇది ఇవాన్ఇలియిచ్చీ, అతని భార్య మనసారా కోరుకున్నదే. పెట్రిషెవ్ స్వయంగా వివాహంమాట ఎత్తి, వివాహనిశ్చయం చెయ్యవలిసిందని కోరాడు. ఇది సాయంత్రంవేళ జరిగింది. ప్రెస్కోవ్యా ఫెడరోవ్నా మర్నాడు ప్రొద్దున్నే ఈ వర్తమానం భర్తకు తెలియజెయ్యడం ఎల్లాగా అని ఆలోచిస్తూంది. కాని ఆ గతరాత్రినించీ ఇలియిచ్ రోగం బాగా ముదిరిపోయింది. అతను ఆ సోఫామీద అల్లాగే పడుకుని ఉన్నాడు. వెల్లకిలా

పశువుని వెర్రిగా చూస్తూ భరించలేని బాధతో మూలుగుతున్నాడు.

ఫెడరోవ్నా అతనికి మందుమాట జ్ఞాపకం చేసింది. అతనేమీ మాట్లాడకుండా అల్లాగే ఆమె వైపు చూశాడు. ఆ చూపుల్లో ఆమె యెడలగల ద్వేషము, నిరసన బుసకొడుతున్నట్లున్నాయి.

ఇలియిచ్ "అబ్బబ్బా, ఏమిటీ గొడవ! నన్నిల్లా సుఖంగా చావనివ్వూ!" అన్నాడు.

ఆమె క్షణం అక్కడనించి వెళ్ళిపోయింది. కాని ఇంతలో ఇలియిచ్ కుమార్తె ఇలియిచ్‌ని పలకరించడానికి అక్కడికి వచ్చింది. ఇలియిచ్ కుమార్తె కేసి కూడా భార్యకేసి చూసినట్లే చూశాడు. కుమార్తె ఒంట్లో ఎలాగ ఉన్నదని అడిగింది. ఇలియిచ్ అంతే అంటున్నట్లుగా ఇక అందరికీ తన బాధ వదిలిపోతుందని చెప్పాడు. తల్లీ, కూతురు మరి మాట్లాడలేదు. కాస్సేపు పక్కన కూర్చుని మెల్లిగా లోపలికి వెళ్ళిపోయారు.

కుమార్తె తల్లితో ఇలాగ అన్నది. "అయితే ఇదంతా మన తప్పా? నాన్నగారు దీని కంతటికీ మనమే కారణం అన్నట్లు మాట్లాడుతున్నారు. నా కాయనసంగతి తలుచుకుంటే చాలా కించగా ఉంది. దీనికోసం మనల్ని అందరినీ ఇంత బాధ పెట్టడం ఎందుకు?"

డాక్టరు కూడా యథాప్రకారంగా వచ్చి ఇలియిచ్ పక్కని కూర్చున్నాడు. ఇలియిచ్ అతని కేసి చురచురా చూస్తూ అతనడిగిన ప్రశ్నల కన్నిటికీ అతిముక్తసరిగా 'అవును' 'కాదు' అని మాత్రమే సమాధానం చెప్పాడు. ఒక్క నిమిషం ఊరుకుని "ఇక మీరేమీ చెయ్యలేరు; ఇది మీకూ తెలుసును. కనక నా మానాన్ని నన్నొదిలి వెయ్యండి!" అన్నాడు.

"మేము మీ బాధలు కొంతవరకు తగ్గించగలము."

"మీరు అది కూడా చెయ్యలేరు. మరి నన్నొదిలి వెయ్యండి!"

ఆ డాక్టరు పక్కగదిలోకి వెళ్ళి ప్రెస్కోవ్యా ఫెడరోవ్నాతో పరిస్థితి బాగా విషమించిపోయిందనీ, రోగి అమితంగా బాధపడుతూండడంవల్ల నల్లమందు ఇస్తూండడం తప్ప మరి వేరే గత్యంతరం లేదనీ చెప్పాడు.

డాక్టరు చెప్పినట్లు ఇలియిచ్ బాగా దుర్భరంగా ఉన్నమాట నిజమే. ఇలియిచ్ శరీరయాతనకంటె మానసిక వేదన మరింత భయంకరంగా ఉన్నది.

ఇలియిచ్ ఇలాగ ఈ మానసిక వేదన అనుభవించడానికి ఒక కారణం ఉన్నది. జిరాసిమ్ అమాయికంగా అల్లాగే అతని కాళ్లు ఒళ్ళో పెట్టుకుని కునికిపాట్లు పడుతున్నాడు. ఆ సమయంలో ఇలియిచ్ మనస్సులో తటాలున ఒక ప్రశ్న బయలుదేరింది. అతను లోలోపల "ఒకవేళ నా జీవితం అంతా తప్పుదారినే నడిచిందేమో?" అనుకున్నాడు.

ఇలియిచ్ ఇంతకుపూర్వం తను తప్పుదారిని నడవడమనేది కేవలం అనూహ్యమే అనుకున్నాడు. కాని ఇప్పుడతనికి తన జీవితం అన్నగా నడవలేదన్న విషయం నిజమే కావచ్చునని తట్టింది. వెనక ఉద్యోగంచేసే కాలంలో ఏదైనా ఒక పని చేయవలసివస్తే నలుగురు పోనన్న దారినే నడిచిపోతూండేవాడు. కాని మనస్సులోమాత్రం అల్లాగ నడవడం తప్పని అనిపిస్తూ ఉండేది. కాని ఆ అభిప్రాయం పైకి రాకుండా తొక్కిపెట్టివేస్తూ ఉండేవాడు. ఇప్పుడు ఆ తొక్కిపెట్టివేసిన అభిప్రాయాలే నిజమైనవనీ, మిగిలినవన్నీ అబద్ధమేననీ తోచింది. అంతే కాదు. తన ఉద్యోగవిధులు, సంఘమర్యాదలు, స్నేహసంబంధాలు మొదలైనవన్నీ కేవలం పచ్చి అబద్ధాలు కావచ్చునని భాసించింది. అయితే ఇంతవరకు సరియైన మార్గాన్నే నడుస్తున్నానని సమర్థించుకున్నాడు. కాని ఇప్పుడా సమర్థన అంతా తాడు, బొంగరము లేనట్టు కనిపించింది. మరి ఇప్పుడిక సమర్థించవలసిందేదీ కనబడలేదు.

ఇలియిచ్ మళ్లీ మనలో ఇలాగ అనుకున్నాడు. "ఒకవేళ అదే నిజమయితే—నేను నాకిచ్చిన సదవకాశాలన్నీ జారవిడిచివేసి వెళ్ళిపోతున్నాను. ఇక ఇప్పుడీ జీవితం తిన్ననైన దారిలో పెట్టడం అసాధ్యమైన పని—అయితే మరి ఇప్పుడు కర్తవ్యమేమిటి?"

ఇలియిచ్ వెల్లకిలా పడుకుని మళ్లీ కొత్త పద్ధతిలో జీవితంఅంతా పునర్విమర్శ చెయ్యడం మొదలు

పెట్టాడు. తెల్లవారేటప్పటికి మొట్టమొదటగా నౌఖరు కనిపించాడు. తరవాత భార్య, కుమార్తె, డాక్టరు మొదలైనవారంతా కనిపించారు. వా రందరినీ చూస్తూంటే అతనికి ఆ రాత్రి భాసించిన సత్య స్వరూపం నిజమని తేలిపోయింది. వారందరికోసము తన యావజ్జీవము ధారపోశాడు. అందరిలోను అతనికి తన స్వరూపం ప్రత్యక్షమైంది. వారందరినీ తలుచుకుంటూంటే అతనికి తన జీవితంఅంతా కేవలం అత్యంత వంచనే అనీ, ఒక భయంకరమైన కపటనాటకమనీ, ఆ నాటకం తెరమరుగులో జీవనమరణాలు రెండూ మరుగుపడిపోయాయనీ అనుకున్నాడు. ఇది స్పష్టపడిపోగానే అతని బాధ పదిరెట్లెక్కువైపోయినట్లు కనబడింది. ఇలియిచ్ గట్టిగా మూలుగుతూ అటు ఇటుదొర్లడం ప్రారంభించాడు. కప్పుకున్న దుప్పటి వల్ల అతనికి ఊపిరాడడం మానివేసింది. ఇక ఇంటిల్ల పాదిమీద పట్టరాని ద్వేషం బయలుదేరింది.

అతనికి మళ్ళీ నల్లమందిచ్చారు. అది బాగా పెద్ద మోతాదు. దానివల్ల స్పృహ తప్పిపోయింది. ఒంటిగంట అయ్యేసరికి మళ్ళీ బాధ ప్రారంభించింది. అతను ఇటు అటు దొర్లుతూ పక్కనున్నవాళ్ళనందరినీ దూరంగా పొమ్మని కసిరికొట్టేశాడు.

ఇంతలో భార్య అతనిదగ్గిరికి వచ్చి "నే నొక్క కోరిక కోరుకున్నాను. నాకోరిక మన్నించండి! దానివల్ల అపకారం ఏమీ జరగదు. జరిగితే ఉపకారం జరుగుతుంది. ఆరోగ్యంగా ఉన్నవాళ్లు కూడా దీనికి అంగీకరిస్తారు." అంది.

ఇలియిచ్ కళ్లు పెద్దవి చేసి చూసి, "ఏమిటది? ప్రార్థనా? ఎందుకు? ఇప్పుడు దానివల్ల ప్రయోజన మేమీ లేదు. అయినా..."అన్నాడు.

ఫెడరోవ్నా ఏడవడం మొదలుపెట్టి "ఈ మాట కాదనకండి! నేను మతగురువుకోసం కబురు పంపిస్తాను. ఆయన చాలా మంచివాడు." అంది.

"సరే! బాగుంది!" అన్నాడు ఇలియిచ్.

మతగురువు వచ్చి ప్రాయశ్చిత్తం జరిపించాడు.

ఇలియిచ్‌కి సందేహాలు, అనుమానాలు తగ్గిపోయాయి. తద్వారా అతని బాధకూడా కొంత తగ్గింది. మనిషి కొంచెం కుదురుకున్నట్లు కనిపించాడు. మళ్లీ ఆశాజ్యోతి వెలిగింది. మళ్లీ ఇలియిచ్ ఆ ఎపెండిసైటిస్‌నుగురించీ దాన్ని దారిలో పెట్టడాన్నిగురించీ ఆలోచించడం మొదలుపెట్టాడు. ప్రార్థన వింటూంటే అతనికి కళ్ళు చెమ్మగిల్లాయి.

ఇది అంతా అయిపోయాక ఇలియిచ్ యథాప్రకారంగా పడుకున్నాడు. అతనికి కొంత నింపాదిగా ఉన్నట్టనిపించింది. మళ్ళీ తాను జీవించగల నేమో అనే ఆశకూడా బయలుదేరింది. డాక్టర్లు చెప్పిన ఏదో శస్త్రచికిత్స చేస్తామన్నారు. ఆ శస్త్రచికిత్సనుగురించి ఆలోచించి "నే నింకా జీవిస్తాను." అనుకున్నాడు.

ప్రార్థనాదికం అయిన తరవాత భార్య అతన్ని అభినందించడానికని లోపలికి వచ్చి—"మీ వంట్లో కొంచెం నయంగా ఉంది కాదూ?" అని అడిగింది.

అత డామెకేసి చూడకుండానే 'అవును' అని సమాధానం ఇచ్చాడు.

అత నామె దుస్తులు, ముఖవైఖరి, వాలకం మొదలైనవన్నీ అతిపరిశీలనగా చూశాడు. అవన్నీ పరిశీలిస్తూంటే అతనికి లోలోపల "ఇదంతా తప్పు దారిని పడిపోయింది. నడవవలసి నవిధంగా నడవలేదు. నీవిన్నాళ్ళూ బ్రతికినదంతా కేవలం కపటనాటకం. ఈ కపటనాటకంవల్ల జీవన మరణాలు రెండు మరుగు పడిపోయాయి." అనే అభిప్రాయం తట్టింది. ఇలాంటి అభిప్రాయం తట్టగానే అతనిలోని ద్వేషాగ్ని, శరీరయాతనాగ్ని ఒక్కసారిగా ప్రజ్వరిల్లాయి. దానితో అతనికి తన చివరిదశ సమీపిస్తున్నదని తోచింది. ఇది ఇల్లాగ ఉండగా బల్లెంతో పొడిచినట్టుగా పోట్లు, భరించలేని ఉక్కకూడా ప్రారంభమైనాయి.

భార్య "వంట్లో బాగా ఉన్నదికాదూ?" అని అడిగినప్పు డతను "సరే!" అన్నాడు. అల్లాగన్నప్పు డతని ముఖకవళిక బాగా భయంకరంగా తయారయింది. ఆ మాట అన్న తరవాత ఇలియిచ్ సూటిగా భార్య కళ్ళల్లోకి చూశాడు. వెంటనే నీరసంగా వేళ్లాడుతూన్న మొహం తిప్పివేసుకుని "ఫో! ఇక్కడినించి లేచిపో! నామానాన్ని నన్ను వదిలెయ్!" అని గట్టిగా అరిచాడు.

# 12

ఇలియిచ్‌కి అంటుపెట్టకుండా మూలుగులు, అరుపులు ప్రారంభించాయి. అవి ప్రారంభించిన తరవాత అవి అల్లాగే ఉండిపోయాయిగాని మరి తగ్గడం అనేది కనపడనేలేదు. అవి అల్లాగ ఏకధాటిని మూడు రోజులదాకా ఉండిపోయాయి. మూగాన్నించి ఆ అరుపులు చిన్నవాళ్ళుకూడా హడలిపోయి చెవులు మూసుకున్నారు. బాధ్యలో 'అవును' అని అన్న ముగుస్తుండగానే అతనికి జీవితాశ పూర్తిగా నశించి పోయింది. అయితే అతని అనుమానాలు, సందేహాలు అల్లాగే ఉండిపోయాయి.

రాత్రింబగళ్ళల్లాగే ఓ ఓ ఓ అని అరుస్తూ మూలుగుతుండేవాడు. మొట్టమొదట "వద్దు వద్దు" అనేమాట గట్టిగా అరవటం ప్రారంభించాడు గాని క్రమంగా అది "ఓ ఓ" కింద మారిపోయింది

రాత్రింబగళ్ళల్లాగ గడిచిపోతున్నా ఇలియిచ్‌కి ఒంటిమీద స్మారకమే లేదు. అతని కేదో చీకటి కోణంలోకి బలవంతంగా నెట్టివేస్తున్నట్టుండేది. ఇలియిచ్ ఉరిశిక్ష వేసిన మనిషిలాగ కాయ శకలా పెనగులాడేవాడు. అయినా ప్రతిక్షణమూ అతనికో అంత్యదశ సమీపిస్తున్నట్లుండేది. ఆ చీకటి కోణంలోకి సరిగా ప్రవేశించలేకపోవటంవల్లనే తనకీ బాధ కలుగుతున్నదని ఇలియిచ్ గ్రహించుకున్నాడు. తన జీవితంఅంతా సరిగానే నడిచిందనే గట్టినమ్మకం ఒకటే అతని అనాయాస మరణానికి అడ్డు తగిలింది. దానివల్లనే అతనికీ యాతనలన్నీ తటస్థించాయి.

హఠాత్తుగా అతనికి గుండెమీద సమ్మెటపెట్టు పెట్టినట్టనిపించింది. ఆపైన అతనికి ఊపిరి పీల్చుకోవటంకూడా కష్టమైపోయింది. హఠాత్తుగా అతడా చీకటికోణంలో పడిపోయాడు. కాని ఆ అట్టడుగున అతనికొక వెలుగు కనిపించింది అతివేగంగా రైల్లో ప్రయాణం చేసేవారికి ముందుకు నడుస్తున్నా వెనక్కి వెళ్ళిపోతున్నట్లుంటుంది. ఇలియిచ్‌కి కూడా సరిగ్గా అల్లాగే అనిపించింది.

వెంటనే అతను మనస్సులో "సరే! నా జీవితం తిన్నైన దారిలో నడవకపోయినమాట నిజమే. కాని ఇప్పుడా విషయం అప్రస్తుతం. మరింక తిన్నైన మార్గమేది?" అని ప్రశ్నించుకున్నాడు. కొంతసేపటికతని మనస్సులో అంతర్వేదన తగ్గింది.

ఈ పరిణామం బాహాబాహాగా ఎక్కువైన మూడోరోజున సాయంత్రం మరణానికి పూర్వం రెండు గంటలు ముందు కలిగింది. సరిగా ఆ సమయానికి అతని ఆఖరి పిల్లవాడు బడిలోనించి ఇంటికి వచ్చి వెంటనే అతని మంచందగ్గిరికి వెళ్ళాడు. ఇలియిచ్ అప్పుడు మరణవేదన పడుతూ ఇటూ అటూ దొర్లుతూ కేకలు పెడుతున్నాడు. ఆ సమయంలో అతని చెయ్యి ఆ పిల్లవాడి తలమీద పడింది. ఆ పిల్లవాడా చెయ్యిపట్టుకుని ముద్దుపెట్టుకుని ఏడవటం ప్రారంభించాడు.

ఆ సమయంలోనే ఇవాన్ ఇలియిచ్ కళ్ళకు వెలుగు కనిపించింది. అప్పుడతనికి జీవితం ఇంతకు పూర్వం సరియైన మార్గంలో నడవకపోయినా, ఇకముందైనా తిన్నైన దారిలో పెట్టవచ్చునన్న ఆశ కలిగింది తనలో తను "ఋజువైన మార్గమేది?" అని ప్రశ్నించుకున్నాడు. అంతరాత్మ ప్రత్యుత్తరం కోసం అల్లాగే నిరీక్షిస్తున్నాడు. ఇంతలో అతనికి తన చెయ్యి ఎవరో ముద్దు పెట్టుకుంటున్నట్లనిపించింది. కళ్ళు తెరిచి చూస్తే ఎదురుగా ఆ చిన్నపిల్లవాడు కనిపించాడు. అతన్ని చూడగానే అతని కళ్ళు చెమ్మగిల్లాయి. మనస్సు ద్రవించింది. ఇంతలో అతనిభార్య దగ్గిరికి వచ్చింది. ఇలియిచ్ ఆమెకేసి చూశాడు. ఆమె నోరు తెరుచుకుని రెప్పవాల్చకుండా అతి బెంగగా అతనికేసి చూస్తున్నది. చెంపలమ్మట కన్నీళ్ళు కాలువలు కడుతున్నాయి. ఆమెమీద కూడా అతనికి జాలికలిగింది.

ఇలియిచ్ లోలోపల "పాపం వీళ్ళందరినీ నేను నానాబాధలు పెడుతున్నాను. వాళ్ళందరు లోపల చాలా బాధపడుతున్నారు. నేనుపోతే వాళ్ళకీ బాధలన్నీ పోతాయి." అనుకున్నాడు. కాని అతనికీ మాటలు పైకనడానికి తగిన ధైర్యం చిక్కలేదు. తరవాత "పైకి చెబితే లాభమేమిటి? నేనా విధంగా ప్రవర్తించాలి" అనుకున్నాడు. తరవాత భార్యకా చిన్నపిల్లవాడిని చూపించి "వాణ్ణి ఇవతలికి తీసుకొనివెళ్లు పాపం పసివాడు. ఇంతకుపూర్వం చాలాపరుషంగా మాట్లా

డాను. నిన్ను కూడా చాలా బాధపెట్టాను..." అన్నాడు. ఆటుపిమ్మట "నన్ను క్షమించు" అని అనబోయాడు గాని "నన్నొక్క" అన్నంతవరకే అనగలిగాడు. తరవాత అన్నీ తెలుసుకోగలిగిన పరమేశ్వరుడా విషయం తెలుసుకోగలడనే ధీమాతో మెల్లిగా చెయ్యి ఆడించాడు.

ఇంతట్లో హఠాత్తుగా అతనికి సమస్తమైన బాధలు తన దగ్గరనించి దూరదూరంగా తొలగిపోతున్నట్లనిపించింది. ఇలియిచ్‌కి అక్కడ ఉన్న అందరి మీద జాలి కలిగింది. వారికిక ఏ విధంగానూ బాధ కలిగించకూడదని అనుకున్నాడు. ఈ అభిప్రాయం వెంటనే కార్యరూపం ధరించాలని కూడా అనుకున్నాడు.

"ఇది ఎంతటి సత్కార్యం! ఇది ఎంత తేలికపని!" అని లోలోపల అనుకున్నాడు. తరవాత ఇలియిచ్ "మరి నా బాధ ఏమైంది? అది ఎక్కడ ఉంది?" అని ప్రశ్నించుకున్నాడు.

తరవాత ఆ బాధ ఉన్న వైపు చూశాడు. తరవాత "ఇది ఇక్కడే ఉంది. ఉంటేం? ఉండనీ!" అనుకున్నాడు. తరవాత "మృత్యువు ఏది? ఎక్కడ ఉంది? అని అనుకున్నాడు.

ఆ తరవాత పూర్వంనించీ పట్టుకుని పీడిస్తున్న ఆ మృత్యుభయం ఎక్కడ ఉందో? అని వెతికాడు. ఎక్కడా అతనికా భయమే కనబడలేదు. పిమ్మట 'మృత్యువంటే ఏమిటి?' అది ఎక్కడ ఉంది?' అని ప్రశ్నించాడు. అతనిలో భయమే అదృశ్యమై పోయింది. దానితోపాటు మృత్యువుకూడా అంతర్థానమైపోయింది!

మృత్యువుస్థానంలో వెలుగు ప్రత్యక్షమైంది. ఇలియిచ్ "ఓహో! 'అదా ఇది'" అని మనస్సులో అనుకుని, అత్యాశ్చర్యంతో "ఏమి దివ్యానందం!" అని గట్టిగా అరిచాడు.

ఇలియిచ్‌కి ఇవన్నీ ఒక క్షణంలో జరిగిపోయాయి. ఆ క్షణంలో ప్రత్యక్షమయిన ఆ ఆనందజ్యోతి అతని మనస్సులో అలాగే ఆరని దివ్వెలా వెలిగింది!

ఆ చుట్టూరా ఉన్నవారందరికీ మరి రెండు గంటలదాకా ఆ శరీరం అలాగే గిజగిజ తన్నుకుంటున్నట్లే కనిపించింది. అతని గొంతులో గురగుర శబ్దం వినిపించింది. క్రమంగా ఆయాసం అదీ తగ్గిపోవడం ప్రారంభించింది. కొంతసేపటికి అదికూడా తగ్గిపోయింది.

పక్కనే ఉన్నవారొకరు "అంతా అయిపోయింది!" అన్నారు.

ఇలియిచ్‌కి ఈ మాటలు వినిపించాయి. అంతరాత్మలో అతను ఈ మాటలే రెట్టించుకుంటూ "మృత్యువు నశించిపోయింది. ఇక దీని గొడవ లేదు!" అనుకున్నాడు. అతను లోలోపలికొక దివ్య శ్వాసం పీల్చుకున్నాడు. ఒక నిట్టూర్పు మధ్యభాగంలో మరణించాడు.

(సమాప్తము)



# అ రు ణ రే ఖ లు



శ్రీ బొడ్డు బాపిరాజు

అందవి చిన్ననాటి కలలై, మధుముగ్ధకపోలపాళి రూ
పందిన జాను సిగ్గుటలలై యుదయాచల సానుమూలముల్
సుందర వర్ణకల్పనల సొంపులు పొంపిరివోవ సుప్తని
స్పందిత భావనా శిశిర వల్లికకున్ గిలిగింత వెట్టుచున్.

తూరుపు కొండ క్రొక్కనుమ త్రోవల ప్రోవులు వర్ష దేవ మం
దారములో? సురేశ్వరసుతా చరణారుణ సంభృతార్ద్రలా
క్షారస రేఖలో? మొదట కమ్మని యూహాలు నించు, కావ్యక
న్యారమణీయ దృఙ్మధుర హాససమున్మిషితాసితద్యుతుల్

అరుణ గభీరనీల జలదావరణోజ్జ్వల రూపరేఖలే
తరుణ కళాతపస్వి నవదర్శన రమ్యరసానుభావముల్?
తరళసుహృద్యవ ప్రణయ తంత్రుల తేల్చునో గానవాహినుల్
విరహివిశీర్ణహృద్గహనవీథుల వ్రేల్చునో యగ్నిశైలముల్ !

ఈ యుదయప్రభల్ చదలనెత్తిన రక్తపతాకలేలయ
స్థాయికొ? ఉషాదేవత విప్రసరద్రసనాంచలోచ్చల
చ్ఛాయ లవెల్ల కాంక్షిత సుశాంతికపోతపదారుణ ప్రభా
శ్రీయువు ఉన్నదో పులకరింపతదు జ్వలకాంతి లోకముల్

అరుణరేఖలు జగదీశు కరుణరేఖ
లెల్ల జగముల వెలుగు ఎల్గెత్తి పిలుచు
లేచి రండోయి శోభా దరిద్రులార !
హృదయ దీపిక లిపుడె వెల్గించుకొనుడు.

---

# రాజకీయ యజ్ఞము



శ్రీ వంగోలు మునిసుబ్రహ్మణ్యం

శ్రౌతవాఙ్మయమునందు అనేక యజ్ఞములు చెప్పఁబడియున్నవి. అందులో రాజసూయము అశ్వమేధము అను రెండు యజ్ఞములును ప్రత్యేక విశిష్టత గలిగియున్నవి. సామాన్యముగ అన్ని యజ్ఞములును వేదచోదితములు. అన్ని యజ్ఞములయందును అనుసరింపబడు కర్మ వైదికము. అన్ని యజ్ఞములును జేయుటకు బ్రాహ్మణులును క్షత్రియులును అర్హులైయుందురు. కాని రాజసూయమును అశ్వమేధమును మాత్రము బ్రాహ్మణులు జేయరాదు. దిగ్విజయము జేసిన రాజన్యులు మాత్రము నీ యజ్ఞముల జేయగలరు. ఈ రెండు యజ్ఞములును రాజకీయయజ్ఞములు. ఈ రెండు యజ్ఞములయందలి ప్రయోజనము యెక్కువగ లౌకికము. దేశమునందలి ప్రజలకు శాంతి సౌభాగ్యములు నెలకొలుపవలసిన బాధ్యత రాజుయందుండును. సార్వభౌముఁడొకఁడు శౌర్యతేజోబలసంపన్నుండై యుండి, సామంత రాజులను తనకు లోబడియుండునట్లు జేసికొని, శత్రురాజుల దాడికి దేశము పాల్పడకుండ గాపాడవలయును. దేశమునందలి ప్రజలకు అన్నవస్త్రాది లోపములు లేకుండజేయవలయును. ప్రజలయందు రాజభక్తి నిలిచియుండునట్లుజేసి వారి ప్రేమానురాగములకు రాజు పాత్రుడు గావలయును. ఇట్టి లౌకిక ప్రయోజనము నుద్దేశించి వేదములందును శ్రౌతసూత్రములందును రాజసూయ అశ్వమేధ యాగముల ప్రణాళికలు నిర్మింపబడియున్నట్లు తోచుచున్నది. హరిశ్చంద్రుడును ధర్మరాజును రాజసూయయాగముల జేసియుండిరి. దశరథుడును, శ్రీరామచంద్రుడును, ధర్మరాజును అశ్వమేధయాగముల జేసియుండిరి. ధర్మరాజు తరువాత నెవ్వరును రాజసూయము జేసినట్లు గనపడదు. అశ్వమేధము చారిత్రకయుగమందు గూడ ననేకమంది చక్రవర్తులు జేసియుండినట్లు తెలియుచున్నది. క్రీస్తుశకము 100 A. D. ప్రాంతమున ఆంధ్రచక్రవర్తి, వేద శ్రీశాత కర్ణిమహారాజు, అశ్వమేధయాగము జేసెను. 210 A. D. ప్రాంతమున ఆంధ్రచక్రవర్తి, ఇక్ష్వాకు స్వామి వసిష్ఠీ పుత్రశాంతమూల మహాచక్రవర్తి, అశ్వమేధయాగము జేసెను. విష్ణుకుండిన వంశమునకు మూలపురుషుడగు మాధవవర్మ మహారాజు 430 A. D. ప్రాంతమున పదునొకండు అశ్వమేధములు జేసియుండినట్లు ఈ క్రింద వివరించిన శాసన దృష్టాంతం వల్ల తెలియుచున్నది.

"ఏకాదశాశ్వమేధావభృథావధూత జగ
త్కల్మషస్య—అగ్ని మ సహస్రయాజినో
ఽనేక సామంత మకుటమణిఖచిత
చరణయుగళ కమలస్య—మహారాజస్య—"

ఇంకను అనేకమంది మహారాజులు దక్షిణాపథమున అశ్వమేధ యాగములు దాదాపు 10 వ శతాబ్దమువరకు జరిగించియుండిరని తెలియవచ్చుచున్నది.

## రాజసూయము

రాజసూయ యాగవిధానము శుక్లయజుర్వేదమునందును ఐతరేయ బ్రాహ్మణమునందును వివరింపబడియున్నది. రాజసూయము జేయదలచిన మహారాజు సామంతరాజులను జయించి దేశమంతటను శాంతి నెలకొల్పి ప్రజలకు అన్నవస్త్రాది కొరంతలు లేకుండ జేయవలెను. రాజసూయయాగసంకల్పమునకు ముందు యజమానుడు ఇష్టాపూర్తయాగములను జేయవలెను.

1. ఇష్టి యనగా యాగము. రాజు వేదములకును వేదధర్మములకును నిర్వహణకర్త (*trustee*) గనుక అట్టి ధర్మములు నిర్వర్తించుటకొరకు ఇష్టియను యాగము జేయవలెను.

2. పూర్తము సగా వనములు, చెరువులు, జలాశయములు, సత్రములు, చలివేంద్రలు, అన్నదానములు ఇత్యాది ధర్మకార్యములు జేయుట. ఇట్టి పూర్తములు జేసినందులకు దృష్టాంతముగ రాజు పూర్తమను యాగము జేయవలెను.

శృతి — ఇష్టాపూర్తే సంగ్ంస్ప జె ధామయంచ. రాజసూయయాగము జేయుటకు అధికారము పొందుటకై అత్యంత విశాలమగు ధర్మకార్యములను రాజు జేయవలసియున్నాడు. రాజకీయదృష్టితో ఇట్టి అనుశాసనము వేదమునందు జేయబడియున్నదనుట ఆధునిక లౌకికపండితులు గమనింపదగియున్నది.

రాజసూయయాగమునందు ప్రథమదివసమునందు, ఇష్టాపూర్తహోమములు జేయుదురు. ద్వితీయ దివసమునందు, దక్షిణ ఇష్టి జరుగును. మూడవ దినమునందు ఉదవసాన ఇష్టి జరుగును. దీనియందు పశువిశేసనము జరుగును. జయింపబడిన రాజులలో నొకనిని పశువుగ నుపయోగింతురని హరిశ్చంద్రుని చరిత్రమువల్లను శునశ్శేఫుని కథవల్లను దెలియుచున్నది *Colebrook* అను ఆంగ్లేయ పండితుడు ఇది యొక సాంకేతికమే గాని నిక్కముగ నరమేధము జరిగియుండలేదని దృష్టాంతములున్నవి యని జెప్పియున్నాడు. నాల్గవ దినమందు మరికొన్ని యాగములను హోమములను జరుగును ఐదవ దినమందు మహారాజు పట్టాభిషిక్తుడగును. అట్టితఱి, రాజు ఈ మన్త్రము జెప్పి సింహాసన మెక్కును.

శృతి॥ (1) రాజ్యాయ, సామ్రాజ్యాయ,
(2) భోజ్యాయ, స్వారాజ్యాయ, వైరాజ్యాయ, పారమేష్ట్యాయ రాజ్యాయ,
(3) మహారాజ్యాధిపత్యాయ,
(4) స్వావశ్యాయ, ఆతిష్టాయారోహామి॥

అర్థము॥ (1) రాజ్యముకొరకును, రాజధర్మ సంరక్షణకొరకును, సత్పరిపాలనాభివృద్ధికొరకును, ప్రజలయొక్క క్షేమాభివృద్ధికొరకును,

(2) నా రాజ్యమునందు భోజనసామగ్రి నిరంతరము అభివృద్ధిజెందియుండుటకొరకును, సామ్రాజ్యముయొక్క గౌరవము శాశ్వతముగ నిలిచియుండుటకొరకును,

(3) అందరు రాజులకును యజమానిగ చక్రవర్తిత్వసిద్ధికొరకును,

(4) నాయొక్క ఇంద్రియనిగ్రహప్రాప్తికొరకును నే నీ సింహాసన మెక్కుచున్నాను.

ఇప్పటికిని, ఇంగ్లండురాజు గాని రాణి గాని పట్టాభిషేకసమయమున *Oath of office* ప్రమాణము జేయుచున్నారు. ఇండియాలో గవర్నర్లును మంత్రులును ప్రమాణములు జేయుచున్నారు. సందర్భానుసారముగ, దేశకాలములను గమనించి, చదువరులు వేదోక్తప్రమాణమునందలి భావమును చక్కగ గమనింపగలరు.

## అశ్వమేధము

దిగ్విజయముజేసి చక్రవర్తి గాదలచిన మహారాజు అశ్వమేధము జేయును. ఇందు ఉత్తమాశ్వము నొక్కదానిని ఇచ్చవచ్చినట్లు దిరుగుటకు విడిచిపెట్టుదురు. అట్టి అశ్వము ముందుప్రక్క నలుపును వెనుకప్రక్క తెలుపును రంగులుండి లక్కడక్కడ నల్లమచ్చలు గలిగియుండవలెను. దానివెనుక 100 గుసలి గుర్రములును అస్త్రకవచధారులగు 400 యోధులును నుండుదురు. ఇతర ఆడుగుర్రములను దాటకుండ వక సంవత్సరపర్యంతము ఆ గుర్రముయొక్క బ్రహ్మచర్యమును గాపాడవలెను. శత్రురాజుల దేశములలో నా గుర్రము దిరుగును. సంవత్సరమైనపిదప అశ్వము నిరపాయముగ యజమానునివద్దకు జేరును. దీనివల్ల సామంతరాజులందరు యజమానుని చక్రవర్తిత్వము నంగీకరించినట్లు భావింపబడుదురు.

అశ్వమేధయాగము మూడుదినములు జరుగును. (1) మొదటిదినము అధ్వర్యుడు ప్రైష నిచ్చినంతనే వీణాగాయకుడను నొక బ్రాహ్మణుడు రాజుగారు జరిగించిన ఇష్టాపూర్తములను గొనియాడు పాటలను గీతములను పద్యములను వీణయుక్తముగ గానము జేయుచు యజ్ఞశాలయందు దిరుగును. దేశమునందన్ని ప్రాంతములలోను, రాజుగారు జరిగించియుండు సేవకార్యములను, ధర్మకార్యములను వివరముగ సర్వజనులకు ప్రకటించుటయే (*Proclamation*) దీని భావమని మన మూహింపవలసియున్నది. మరియొక రాజన్యుడు నటువలెనే రాజుగారియొక్క దిగ్విజయ

గులను గూర్చి దెలుపునట్టి గాథలును, పాటలును వీణ యుక్తముగ బాడుచు యజ్ఞశాలయందు దిరుగును. మహారాజు యేయే దేశముల జయించి యేయే రాజులను వశపరచుకొని ఆయా దేశముల కార్య నిర్వాహమునకు యెట్టియెట్టి యేర్పాట్లు జేసియుండెనో సర్వజనులకు దెలియుటకు ఇది యొక (*military proclamation*)గా నుండునని మనము భావింపవలసియున్నది. ఇట్టి వివరణమంతయు శతపథ బ్రాహ్మణమునందున్నది. (2) రెండవదినము అశ్వమేధపశువును జంపబడును. వపాహోమము జరుగును. ఈ ఘట్టము యొక్క వివరణమంతయు శ్రీ వాల్మీకి రామాయణము బాలకాండ 14 సర్గయందు దశరథుని అశ్వమేధయాగ సందర్భమున జెప్పబడియున్నది. మూడవదినమందు పట్టాభిషేకము జరుగును. ఇందును రాజసూయయాగమందలి పట్టాభిషేకమునందువలెనే చక్రవర్తి వేదవిహిత ప్రమాణముల జేయును.

## యజ్ఞదక్షిణలు.

యజ్ఞమునందు ఋత్విక్కుల కివ్వబడు దక్షిణలు కడుప్రాముఖ్యము జెందియున్నవి. అందెట్టి లోపముగాని నుండరాదు. భగవద్గీత 17—13 నందు దక్షిణా లోపమైన యజ్ఞము తామసయజ్ఞమని చెప్పబడియున్నది. అశ్వమేధయాగమునందు భూమిదానము కడు శ్రేష్ఠమని జెప్పబడియున్నది.

అశ్వమేధే మహాయజ్ఞే
పృథివీ దక్షిణా స్మృతా॥ భారతము

దశరథుడు జేసిన అశ్వమేధయాగమునందు ఆమహారాజు తన రాజ్యమును నాలుగు భాగములుగా విభజించి, అందు తూర్పుదిశ భాగము హోతకును, పశ్చిమదిశ భాగము అధ్వర్యునకును, దక్షిణదిశ భాగము బ్రహ్మకును, ఉత్తరదిశ భాగము ఉద్గాతకును యాగదక్షిణగ ధారవోసెనని శ్రీమద్రామాయణమునందు జెప్పబడియున్నది ఇట్లు జరిగించిన తరువాత ఋత్విజులు రాజునుగూర్చి ఇట్లు జెప్పుచున్నారు. "రాజా, మేము బ్రాహ్మణులము. వేదాధ్యయనము జేసికొనుచుండువారలము. భూభారము వహింప శక్తిగలవారము కాము. మాకు యేదేని మరియొకరూపమున, అనగా గోవులుగాని, రజతముగాని, సువర్ణముగాని దక్షిణగ నిచ్చి మీరొక్క రాజ్యము మీరే తీసికొందురుగాక." అని బ్రాహ్మణులు చెప్పగా దశరథుడు నట్లె చేసియుండెను.

పైవిధముగ తన రాజ్యమునంతయు ఋత్విజులకు దక్షిణగ నిచ్చిన దశరథమహారాజు—తన భార్యలను నలుగురిని అనగా—మహిషి, వావాత, పాలాకలి, పరివృత్తి అను భార్యలను వరుసగ బ్రహ్మ, హోత, ఉద్గాత, అధ్వర్యులు అను నలుగురు ప్రధాన ఋత్విక్కులకు ధారాదత్తము చేసియున్నారు. పిదప ఋత్విక్కులకు ధనమిచ్చి రాజు తన భార్యలను తిరిగి తీసికొనియున్నారు. (శ్రీమద్రామాయణం బాల—14 సర్గ)

ఇదే విధముగనే ధర్మరాజు తన రాజ్యంబంతయు అశ్వమేధయాగదక్షిణగ వ్యాసునికి నిచ్చి అనంతరం ఆయనకు కోటిపేలు ధనమిచ్చి తిరిగి రాజ్యమును దీసికొనియున్నట్లు భారతమునందున్నది. (అశ్వమేధికపర్వం 89. అధ్యాయము)

మరియు భారతమునందలి ఈక్రింది శ్లోకము వల్ల దక్షిణలు త్రిగుణముగ నిచ్చినయెడల మూడు అశ్వమేధములు జేసిన ఫలితము వచ్చునని చెప్పబడియున్నది.

"ఏవ మత్ర మహారాజ
దక్షిణాం త్రిగుణం కురు
త్రిత్వం వ్రజతు తే రాజన్
బ్రాహ్మణా హ్యత్ర కారణం
త్రీ నశ్వమేధా నత్రత్వం
సంప్రాప్య బహుదక్షిణాన్"

ఏకాదశాశ్వమేధములు జేసినట్లు జెప్పబడియుండు మాధవవర్మ పదునొకండు రెట్లు దక్షిణల నిచ్చి అట్టి ఫలితముల బొందినట్లు తోచుచున్నది.

ధర్మరాజు అశ్వమేధసందర్భమున తిక్కన భారతమందలి పద్యములు ఈ భావములను దెలుపుచున్నవి.

"ఇలకు వెలగా హిరణ్యం
బలఘుమతీ మాకు నొసగు మనుటయు ధరణీ,
శులు విన గా నశ్వారవ
కులపతి యా వేదరక్షకున కిట్లనియెన్"

"అశ్వమేధమునకు నాధ్వర్యులు దక్షిణ
ధరణియంత్రగు గాన వరుని చేత,
విజితమైన ధరణి ప్రజనితప్రీతిమై
ఋత్విగర్చనముగ నిచ్చినాడు"

"కోటికోటులు మాడలు కుప్పవోసి
ధరణి వెలయని జెప్పి యాప్పరమసంయ
మాధిపతికి సమర్పించె, నతడు ఋత్వి
గావలికి బంచిపెట్టె నయ్యతులధనము"

"అతుల కనకమయములైన యజ్ఞవాట
వేదికాయూపతోరణ వివిధభాండ,
దంపశోభ్యాసనాదుల ధరణినాథు
డోసగె విప్రచయంబుల కుల్లమలర"

"అట్లు విప్రులకిచ్చి యనంతరంబ
రాజులకు వైశ్యులకు శూద్రరాజికన్య
జాతులకు మ్లేచ్ఛులకు బ్రమాతగనను
ద్రవ్యతంసంబు లిచ్చెనా ధరణివిభుడు"

"ఇట్లెయి సకలజనులు క్షీరా
ముముక్షవ బరితృప్తులై యమందనుతసహా
దయాత్ర జేలుచు నిజవా
సముల్లకుం జని రహాతిస్త్రు బొగడుమన్"

అన్ని వర్ణములవారికి అన్ని జాతులవారికి సువర్ణరాసులు అశ్వమేధయాగమున బంచిపెట్టిరనుట *Social State* ఆవునో గాదో యోచించదగి యున్నది.

## అన్నదానము

యజ్ఞమునందు అన్నదానముగూడ కడుప్రాము ఖ్యము జెందియున్నదని జెప్పుటకు ముందు జెప్పిన భగవద్గీత (17-13) యే ప్రమాణము. అన్నదాన లోపముగల యజ్ఞము తామస యజ్ఞము.

దశరథుని అశ్వమేధమునందు అన్నదానము గూర్చి బాల—14 సర్గయందు జెప్పబడియున్నది. బ్రాహ్మణులు క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, తాపసులు సన్యాసులు వృద్ధులు వ్యాధిగ్రస్తులు, స్త్రీలు బాలురు బాలికలు, ఇట్లు అన్నిరకములవారికిని అన్ని దేశములవారికిని మృష్టాన్నభోజనములును వస్త్ర దానమును గూడ దశరథుని యజ్ఞమునందు జరిగి యుండెనని జెప్పబడియున్నది. ఇదేవిధముగ ధర్మరాజు అశ్వమేధమునందును అన్నిజాతులవారి కిన్ని అన్ని దేశములవారికిని "బహ్వన్న ధన రత్నౌఘ"ములు పంచిపెట్టి సంతృప్తుల జేసిరని భారతమునందున్నది.

ఈవిధముగ చక్రవర్తి ప్రజలను సంపూర్ణముగ సంతృప్తిపరచి సర్వసామ్రాజ్యము భార్యలను సహా త్యజించునంత వైరాగ్యముగల్గి, ప్రజలయొక్క ఆమోదముతో రాజ్యభారము వహించి ప్రజల క్షేమము కొరకు రాజ్యము చేయవలసినట్లు, రాజనీతి వేద విహిత అశ్వమేధయాగమునందు ప్రదర్శింపబడియున్నది.

## అశ్వమేధయాగాంగ లౌకిక ప్రదర్శనములు

దశరథుని అశ్వమేధయాగమునకు అనేక కోట్ల జనము వచ్చియుండిరి. వారికందరికి భోజనములు, వస్త్రములు, వాసగృహములు నిర్మింపబడి యుండి నవి. ఇంకను వారి ఆనందమును వారి లోకజ్ఞానమును వృద్ధిపఱచునిమిత్తము అనేక విధములగు లౌకిక ప్రద ర్శనములు ఏర్పాటు చేయబడియుండెనని తెలియు చున్నది.

అశ్వమేధయాగమునందు ప్రధానాశ్వము గాక ఇంకను ఇతర పశువులు 300 లు, ఇంకను గ్రామ్య పశువులును, అరణ్య పశువులును, సర్పజాతులును, జలచరములును, అనేక విధములగు పక్షిజాతులును, యాగశాలయందు యూపస్తంభములకు బంధింపబడి యున్నట్లు శ్రీమద్రామాయణమునందు జెప్పబడియు న్నది కొన్ని అరణ్య పశువులు సర్పజాతులు మున్న గునవి పంజరములందు నిలిపియుంపబడినట్లు జెప్పబడి యున్నది. జలచరము లనగా కూర్మాదులు. మొసళ్లు, తిమింగిలములు అందులకు నిర్మించబడిన జలాశయము లందుంచబడియుండును. ఇట్టి జంతువు లన్నియు వపాహోమము నిమిత్తం సంహరింపబడిన వనుటకు ఆధారము లేదనియు, సాంకేతికముగ యూప స్తంభ విక్షేపముజేసి సర్వవిధ జంతుప్రదర్శనశాలగ నిర్మించి యుండురనియు *Colebrook* పండితుని అభిప్రా యము. ఇప్పటి కాలమునందు మనము *Zoo*, *Aquariam*, *Museum*, *Cattle-show* అను పేర్లతో జరుపు ప్రదర్శనములవలెనే దశరథ మహా రాజు అశ్వమేధయాగ సందర్భమున ప్రజల వినోదార్థ

మును విజ్ఞానాభివృద్ధికొరకును నట్టి ప్రదర్శనములు జరిపియుండిరనుట ఆకాలపు నాగరికతా విశిష్టతను జూపును. వేదమునందును నిట్టి ప్రదర్శనములు జరుప వలసినట్లు విధినిర్మాణములుండుట ఆత్యాశ్చర్యము ను బురిగొల్పుననుటకు సందియము లేదు. ఈ వివరములన్నియు ధర్మరాజు అశ్వమేధ సందర్భమున అశ్వమేధిక పర్వము, 89 అధ్యాయమునందు గూడ చెప్ప బడియున్నవి.

## శాస్త్రములు, కళలు

1. యజ్ఞకర్మ నిర్వహణమునకు అనేక శాస్త్రములు, కళలు, విద్యలు పరిశ్రమలు అవసరము. దశరథుని అశ్వమేధయాగశాల నిర్మాణమునకు కర్మాంతికులు, శిల్పకరులు, వర్ధకులనగా వడ్రకమ్మర పనివారలు, గుంటలు చెరువులు త్రవ్వువారు, గణికులు, శిల్పులు, నటులు, నర్తకులు, ఇటుకలు జేయువారు, మున్నగు అనేకవిధములగు చేతిపనులు జేయువారు నియోగింపబడి యుండిరని శ్రీ మద్రామాయణమునందు జెప్పబడియున్నది.

2. అశ్వమేధమునకు అంగభూతములగు ఇతర యాగములు కొన్ని గలవు. అవి జ్యోతిష్టోమము, ఆయుర్ధర్వము, అతిరాత్రము, అభిజిత్తు, విశ్వజిత్తు, అప్తోర్యామము, వాజపేయము, గరుడచయనము ఇత్యాదులు. యజ్ఞవేదికల నిర్మాణమునకు కొన్ని కొన్ని ఆకారములు (*designs*) నిర్ణయింపబడియున్నవి. ముఖ్యముగ గరుడచయనమునకు—గరుడాకారముగ వేదికలు నిర్మింపవలయును. రెక్కలును తోకయును విస్తరించి, తూర్పుముఖముయి, భూమిని జూచుచు, నాకాశగతుండగు గరుత్మంతుని యాకారమున వేదికలు నిర్మించవలయును. వేదికలయొక్క ఆయా భాగముల కొలతలును కోణములును వలయములును నిరూపింపబడియున్నవి. ధర్మరాజు జేసిన యశ్వమేధమునందు జరిగిన గరుడచయనమునకు వేదికల నిమిత్తం బంగారు ఇటికలు తయారుచేయించి అట్టి ఇట్టికలతో వేదికలు నిర్మించియున్నట్లు భారతమునందు జెప్పబడియున్నది. ఇటికలయొక్క పొడవు, వెడల్పు, మందము వేదమునందును శ్రౌతసూత్రములందును జెప్పబడియున్నది. ఇటుకలసంఖ్య సంవత్సరమునందలి దినములు దినమునకు ముహూర్తములతో హెచ్చవేయగా వచ్చు సంఖ్య 360 × 30 = 10,800. ఇటుకలలో వేదికల నిర్మించవలెనని జెప్పియున్నది. ఈ కారణములవల్ల యజ్ఞకర్మయందు (*Arithmetic, geometry, Drawing, Building*) మున్నగు విద్యలు కావలసియున్నది.

3. ప్రాచీనకాలమునందు సంవత్సరమునకు నెలలును, నెలకు దినములును దినమునకు గడియలును, మరియొక విధముగ నుండెననియు అట్టి లెక్క కాలక్రమమున మారియుండెననియు, ఆ కాల నిర్ణయములనుబట్టి చయనఇటుకల సంఖ్య 360 × 30 = 10,800 గ, శ్రౌతకాండమునందు నిర్ణయమై యుండెననియు కొందరు పండితులు జెప్పియున్నారు. ఇదియునుగాక యజ్ఞకర్మయందనేక సందర్భములయందు జ్యోతిషశాస్త్రపరిచయము మవసరమై యున్నది. సూర్యోదయ సూర్యాస్తమయములును, దర్శపూర్ణిమాసలును, ప్రతిపత్తులును, సూర్యోపరాగ, చంద్రోపరాగ, చాతుర్మాస్య, అగ్రయణాది, కాలనిర్ణయములును ఇట్టి అనేక సంఘటనలు జ్యోతిశ్శాస్త్రపరిచయమువల్లనే జరుగవలసియున్నది. ఆ శాస్త్రములు యజ్ఞకర్మల మూలముగనే అభివృద్ధి జెందియున్నవి.

4. యజ్ఞకర్మయందనేక వృక్షజాతులు కావలసియున్నందున అందులకు సంబంధించిన వృక్షశాస్త్రపరిచయము అత్యవసరమై యున్నది. యూపస్తంభములకు కొన్ని రకములగు కర్రలు అనగా చంద్ర, బిల్వ, మోదుగు, దేవదారు విరిగి, మున్నగు కర్రలు కావలసియున్నవి. వపాపచనమునకు కొన్ని యజ్ఞములందు వేతస = ప్రబ్బలి, కొన్ని యజ్ఞములందు రావికొమ్మలు నిర్ణయమై యున్నవి. సోమతీగెయు, మరికొన్ని ఓషధులను లభ్యపరచుకొను సందర్భమునగూడ వృక్షశాస్త్ర పరిచయము గావలసియున్నవి. ఆ శాస్త్రము యజ్ఞకర్మల మూలముగనే అభివృద్ధి జెందియున్నది.

5. పశువిశసనముపట్ల శారీరశాస్త్రము. (*Physiology and anatomy*) శాస్త్రముల విజ్ఞానము కావలసియున్నది. పశువుయొక్క దేహమునందు పైభాగమున వేదమునందు జెప్పబడిన ప్రకారము అంగుళములు అరత్నులు కొలతలతో వపయుండు స్థలనిర్ధారణజేసి అక్కడ కోతపెట్టి వపతీయవలసి

యున్నది. అంగహోమమునందును, అన్ని అంగములను ప్రత్యేక నిరూపణముఁజేసి హోమము చేయబడుచున్నవి. వపయను పొరను దీసి దానిని రావికొమ్మలమీద పరచి పచనము జేసి వ్రేల్తురు. ఈ వపయను పొర అశ్వమునందు గానరాదు. దాని బదులు "తేజని" యను పేరుగల హృదయమాంసమును ఖడ్గమునుండి దీసి వ్రేల్తురు. శ్రీమద్రామాయణమునందు దశరథుని విషయమున "ధూమగంధం వపాయాస్తు జిఘ్రతిస్మ, నరాధిపః" యని గుర్రము యొక్క వపాహోమము జరిగినటు చెప్పబడియున్నది. ఇందువల్ల వాల్మీకి పొరబడినట్లు తోచును గాని అట్లుగాదు శ్రుతియందును సూత్రమునందును "అశ్వమునందు వప యుండదు" అను విషయము చెప్పబడియున్నది.

"నాశ్వస్య వపా విద్యతే" అని సూత్రము

"నాన్యేషాం పశూనాం తేజన్యా అవద్యంతి. అవద్యత్యశ్వస్య" అని శ్రుతి. ఇందువల్ల యజ్ఞకర్మయందు, (*Physiologv-anatomy*) శాస్త్రపరిజ్ఞానము అభివృద్ధియగుచున్నట్లు విశదమగుచున్నది.

6. యజ్ఞశాల నిర్మాణమునందును, యూపస్తంభముల నిక్షేపమునందును, గరుడచయన వేదికల నిర్మాణము మున్నగు అనేక సన్నివేశములందు వాస్తుశాస్త్ర పరిజ్ఞాన మవసరము (*architecture*)

7. అశ్వమేధారంభమునందు వీణాగాథుడను వాడు వీణాపురస్సరముగ గానముజేయును. అన్ని యజ్ఞములందు సామగానము కడు ప్రాముఖ్యము జెందియున్నది. ఇత్యాది కారణములవల్ల సంగీతశాస్త్రము గూడ యజ్ఞకర్మమూలమున అభివృద్ధి జెందియున్నట్లు తెలుపనగును.

ఇట్లనేక శాస్త్రములు కళలు యజ్ఞకర్మవల్ల అభివృద్ధి బొందదగియుండి, చిరకాల అభ్యాసమువల్ల దేశముయొక్క నాగరికతకు యజ్ఞకర్మలు దోడ్పడియుండినవని మనకు తెలుపగుచున్నది. ఇవ్విధమున పైన వివరించిన అన్ని శాస్త్రములును కళలును యజ్ఞములకు సంబంధించిన ఆయా శ్రౌతభాగముల యందును శ్రీమద్రామాయణము మహాభారతము మున్నగు గ్రంథములందును వివరించియుండినందున మన దేశమునందు నాగరికత ఎంత ప్రాచీనమో మన మూహింపవచ్చును. రాజసూయము అశ్వమేధము అను నీ రెండు రాజకీయ యజ్ఞములవల్ల మన దేశమునందు రాజనీతి యెట్లు అభివృద్ధి జెందియుండెనో, ప్రభుత్వము నిర్వహించు అధికారుల ఆదర్శములు ఎట్లు ప్రజల యోగక్షేమములే పరమావధిగా నుంచుకొని యుండెనో మనము గమనింపవలసియున్నది.

# ఆశయము!



శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ఈ శరీరము బూదిగా ఎగసినపుడు
ఎదయు బూడిదగా మారి చెదరు నేమి?
ఇంత లోతుగ ఇది కదలింప బడెడు
ఖేద మోదాది భావ సంకీర్ణమగుచు!
ఇపుడు కలగనుచున్నదీ ఎడద: అపుడు
మేలుకొను అనంతపు మన్కి మెలగుకొఱకు-
వెలుగు నీడల నిండిన కలల స్మృతులె
ఆ అమర కాంతి ఆధారమౌనో ఏమొ!

అందుకే నేను మఱిలేని యపుడు నీవు
పాడకుము నాకొఱకు జాలిపాటలేని—
విరుల దండలు నా ప్రతిబింబమునకు-అ
లంకరింపకు అశ్రులు రాల కనుల!
తేనె నగవుల రాణిగా తిరుగు నీవు
కలతపడుదువన్ తలపున్న నిలువగలనె?
కలల నాదు సంపర్కము గన్న 'ప్రతిది'
హాయి నుండవలెనని నా ఆశయమ్ము!

# కుంభకారిణి కుంభకోణము



శ్రీ కవికొండల వేంకటరావు

"మారమూం పల్లెటూళ్ళల్లో భాగ్యానికి అంతూపొంతూ వుండక పోను ఈ దొంగలంటూ లేకపోతే! ఎవరి మీదయ్యా! నీ కనుమానం!" అని అడిగాడు సర్కిల్ శంభారావు నాయుడు.

"ఇప్పుడు నా కెవ్వరిమీదా అనుమానం లేదు. నే నెవ్వరికీ అయిష్టుణ్ణి కాదు. నా డబ్బు పాపిష్టిదీ కాదు." అన్నాడు గృహస్థు కేదారసింగ్

"అంటే మా డబ్బు పాపిష్టిదన్న మాటా?"

"ఆ మాట చేసన్నానా? తమ విధ్యుక్తధర్మం, చాకచక్యం, తమ హోదా చూపిస్తే ఈ పల్లెటిప్రజలు హడలి పోకమానరని నా నమ్మకం. ఈ కేసు తమరు బయటపెట్టగలిగారా, తప్పకుండా తమకు సూపరెండెంటు ప్రొమోషన్ కాగలదట!"

"నాకు సూపరెండెంటుగిరీ సూచించింది ఎవరయ్యా?"

"మా వూళ్ళో ఒక కుంభక రేచక పూరా మాహాత్మ్యంగల మహానుభావు లొకరున్నారు. ఆయన్ని ప్రశ్న అడిగితే, మా పోయిన సొత్తును గురించి చెప్పలేకపోయినారు గాని, "మీ కేసు పట్టుకున్న పోలీసుసర్కిల్ వెంటనే పై హోదాకు ప్రొమోషన్ కాగల"దని చెప్పారు."

"ఈ చచ్చు ప్రశ్నరాయళ్ళని నమ్ముకుంటే కేసులు మేం పట్టుకున్నట్టే! మాకు ప్రొమోషన్ వచ్చినట్టే! అయినా ఆ మహాత్ముడు ఎక్కడున్నాడు?" అని సర్కిల్ అడిగాడు.

"ఆముక్క చెప్పి తిరోహితుడైనాడు!"

"ఏమయ్యా! నీవు ఏం మాట్లాడినా క్రీస్తు యావలి యిరవైయో శతాబ్దిలోనివానిలాగు మాట్లాడాలి! ఇరవైయొకటవ శతాబ్దాలో. వానిలాగు ఆలోచించాలి! అంతా శాస్త్రీయంగా, హేతువాద బద్ధముగాను ఇప్పటి పద్ధతి. ఇవేం కనికట్టు రోజులు కావు. కాళ్ళూ చేతులూ కత్తెట్టి పొడిచి బ్రతికించే ప్రభావాల్ని నమ్మే యుగం కాదిది. అయితే ఆయన కుంభక రేచక పూరా మహాత్మ్యముగలవాడనా? అన్నావు! నీ నోటంట అప్రయత్నంగా వచ్చిన శబ్దాన్ని పుచ్చుకుని ముందు కేసు కూపీతీయడానికి యత్నిస్తాను"

అని సర్కిల్ తనకూడా మఫ్టీలోవున్న జవాన్ కేసిచూసి "ఓయి జవాను!"-అని ఏదో దివ్యదృష్టి పట్టినట్టు అభినయించి, "కుంభక" "కుంభక" అని రెండుమాట్లుచ్చరించి "తిన్నగా ఈ వూళ్ళోవున్న కుమ్మరివాళ్ళ యిళ్ళు సోదాచేసి చూదాం" అన్నాడు. కేసు దొరికితే తనకు ఇంతోధికాభివృద్ధి కాకుందనేదానికన్న కీర్తి ఇనుమడిస్తుంది అని అనిపుండవలసినది ఆ మహాత్ముడు అని

లోలో కొంచెంసేపు వితర్కించాడు. "ఈ
లాంటి మహాభాగ్యాలమీద కేసులు దొరక
గలవా? అయినా కేవలం పురుష
ప్రయత్నం పనిచేయదు. దైవబల
ముండాలి ఏ పనికైనా. అందులోనే
మన తెలివితేటలు ప్రకాశించాలి. మన
తెలివితేటలకు వెనుక హంగుగా దేవుడు లేని
నాడు మనకళ్ళు వొట్టి గాజుకళ్లు" అని
స్వగతంగా తీర్మానించుకున్నాడు.

కేదారసింగున్న వూరు అదో మారు
మూల పల్లెటూరని అన్నాగా! అల్లాంటి
వూళ్ళల్లో నివాసంవున్న వాళ్ళవద్ద ఒకా
క్కప్పుడు తెలియరాకుండా కాసులు,
కాసులపేర్లు, వరహాలు, వరహాలపేర్లు,
ముత్యాలు, ముత్యాలపేర్లు కుప్పతిప్ప
లుగా ఇనప్పెట్టెల్లో ఇంగువమూటల్లా కట్ట
బడి పెట్టబడి వుంటాయి. ఈ సంగతి ఇతరు
లకు తెలియడమంటే ఇహలోకమాత్రు
లకు సాధ్యంకాదనే మనం అనుకోవాలి.

అయితే ఇంటిగుట్టు లంకకు చేటని
కేదార్ సింగ్ ఇంట్లో వున్న వంటలక్కకి
సంగతి తెలుసు. ఆ వంటలక్క రోజూ
మూకుడుకనో మూతకనో, కడవకనో, కడ
ముంతకనో, కుమ్మరాళ్ళ యింటికి వెడుతూ
వస్తూవుండడం పరిపాటి. కుమ్మరిదాని పేరు
పద్మాలమ్మ. ఆ పద్మాలమ్మ యీ వంట
లక్కా కలుసుకొన్నప్పుడల్లా లోకంలోని
లోభత్వా, శోకం శోభనం, ప్రభుత్వం
ఇలా అన్నింటినిగురించి చెప్పుకుంటూ
తుదకు చర్చలోకి దిగి పిచ్చాపాటీగా ఒక
ముక్క అనుకొని మరీ విడిపోయేవారు.
ఏమిటా ముక్క అంటే-కుంభకారిణి అనేది
"కుండవంటి పదార్థం లేదు. అది రూపం
దాల్చాక కాల్చబడి గట్టిపడుతుంది. కుందనం
అలాకాదు. అది ఆదిలో కరగింపబడి అటు
తరువాత రూపం తాలుస్తుంది. మళ్ళీ
కాలిస్తే కరిగిపోతుంది ఛెస్" అనేది. వంట
లక్క ఏమన్నా "ఎన్ని చెప్పు! బంగారం
బంగారమే. మట్టి మట్టే! కేదారసింగుగారి
ఇనుపపెట్టె తీసినప్పుడల్లా నా కళ్ళు మిఱు
మిట్లు మంటాయి ఆ నగలు నాణాలు
చూసి" అనేది.

ఇలా వీళ్ళిద్దరు అనుకుంటూనే
వున్నారు. ఓనాడు ఊరంతా పొక్కింది.
కేదారసింగుగారింట్లో దొంగలుపడి యిల్లు
దోచుకుని ఉన్న లొద్దు లొసుకు అంతా
పట్టుకుపోయినారని. వెంటనే పోలీసుకు
రిపోర్టు వెళ్ళింది. ఆ రిపోర్టుమీద తిన్నగా
సర్కిలే వచ్చి దర్యాప్తు చేయసాగాడు.

కేదారసింగును "మీ యింట్లో వండి
పెట్టే వంటలక్క ఇప్పుడు వుందా?" అని
అడిగాడు. "ఉండకేం? ఉండకేం? ఆ
ముండ ననుమానించబోకండి. అది ఉత్తి
నత్తెకాలపు మనిషి" అన్నాడు కేదార
సింగు. "ఇప్పుడామె ఏమి చేస్తూవుందో?"
అన్నాడు సర్కిల్. వెంటనే వంటలక్క
కోసం ఇల్లంతా వెతికారు. ఇంట్లో
ఎక్కడా కనిపించలేదు.

"మరి ఇంట్లో వంట చేస్తూ
వుంది అన్నారే?" అని ముదల
కించాడు సర్కిల్. ఈ వస్తువులు పోయే
దాకా ఆమె మా యింట్లోనే వుంది!
ఇంకా కాస్సేపటికో కూస్సేపటికో
రాగలదు. అని అనుకుంటాను" అన్నాడు
కేదారసింగు. 'ఆమెగానీ సన్యాసివేషం
వేసుకుని కుంభకరేచకపూరా మహాత్మ్యం
అంటూ ఈ వస్తువులతోటి అవతలకు జారిం
దేమో?" అన్నాడు సర్కిల్. "అలాంటి

దుర్బుద్ధిగల మనిషి కాదండీ. అది! గుణం మంచిది కాకపోవచ్చుగాని బుద్ధి మంచిదే నండి దానిది". అని కళ్ళనీళ్ళెట్టుకుంటూ— వస్తువులు తనవి ముక్కుపుడక కాడనుంచి పోయినందుకు—ఏడుస్తూ సర్కిల్కు విన్న వించుకుంది కేదారసింగు భార్య. "గుణ" శబ్దానికి "బుద్ధి" శబ్దానికి భేదం ఏమా అని యోచిస్తూ, "అయితే సన్యాసి మహా మనిషి అంటారు" అన్నాడు సర్కిల్, ఆలోచన తెగక నెత్తిమీద జరీపాగా తీసి కొద్దిగా తల గోకికొంటూ. అంతలో మరో జవాన్ వచ్చి "వీరి వంటలక్క కుమ్మరివాళ్ల గోడను వెలుపలతట్టు పిడకలు తరుస్తూ వుంది" అన్నాడు. "పిడకలు పిడకలు— మనకి పిండా కూడు వండి పడెయ్యడం మానేసి—పిడకలు, పిడకలు—ఆ ముండ చేసిన దురంతమే ఇది" అన్నాడు కేదార సింగు ఉగ్రుడై. "ఆ కుమ్మరి మనిషికి మా వంటలక్కకి చిరకాలంనుంచి నేస్తం అండి బాబుగారు! అందుకుగాను వాళ్ళ గోడను పిడకలు తఱచబోలు ఈ పొద్దు" అంది విచింతనం లేకుండా ఇల్లాలు.

"మీ యింట ఘనమైన చోరీ జరిగినప్పుడు ఆమె అంత స్థాయిగా పిడకలు తరవడం ఆలోచనీయమే" అన్నాడు సర్కిల్. అంటూ వెంటనే జవానుతో "నీవు ఆమెను ఆలా కనిపెట్టివుండు. పిడకలు తఱచి అవతలికి సాగేటప్పుడు ఈలెయ్యి. మేము ఈలోగా వీధి గుమ్మంలోంచి ఆ కులాల గృహంలో ప్రవేశించి సోదా చేస్తాము. ఆ కుమ్మరిస్త్రీకి పెనిమిటి వున్నాడా?" అని అన్నాడు సర్కిల్. "పెనిమిటి లేకేం?" అంటూ కేదారసింగు, కొంతమంది ఊరి జనం సర్కిల్‌ను అనుసరించారు. ఇంకా వీళ్ళందఱూ తన యిల్లుచొఱబడకుండానే పద్మాలమ్మ ఇల్లు వెలువడి "మా యింట బూడిద తప్ప మఱేం దొరికేను" అంది, బుగ్గలు ముద్దుకిచ్చినట్లు తిప్పుకుంటూ. "నీ పెనిమిటి?" అన్నాడు సర్కిల్. "అతగాడు సారె తిప్పుతూ తిప్పుతూ నిన్న సందెవేళ సన్యసించినాడు. ఎక్కడికి పోయినాడో తెలియదు" అంది పద్మాలమ్మ. "తెలియదూ? తెల్లియదూ?" అని ఊచిపుచ్చుకు ఒక్క లెంప కాయ తియ్యబోయాడుగాని సర్కిల్! మళ్ళీ ఆడదనో ఏమో ఎత్తిన చేయిదింప కొన్నవాడై-జవాన్ చేత చెప్పించి ఆమెను త్రోవలో ఉండకుండా తప్పించాడు. ఆమె యున్నా ఆ యింటిలో గోడ నొకానొక చోట జేర్లబడి ఊరుకొన్నట్లు ఊరుకుంది. ఏ చోట ఆమె గోడను జేర్లబడి వుందో సరిగా ఆ గోడయొక్క ఆవలితట్టున కేదార సింగుగారి వంటలక్క పిడకలు తరుస్తూ వుంది తీరుబడిగా!

"తన మగడు కడచిన మాపులు సన్యసించాడంటుంది ఈ ఆడ మనిషి! మీకు సన్యాసి కనబడ్డ దెప్పుడు?" అని అడిగాడు సర్కిల్, కేదారసింగు కేసి తిరిగి. సింగు "ఇప్పుడేనండి! తమరు వచ్చే ముందండి! స్వామీ తమ ప్రభావం ఎట్టిదో వినవలతునంటే కుంభక రేచక మహాత్మ్యము గలవాణ్ణి అని చెప్పి తిరోహితుడై నాడు!" అన్నాడు కేదారసింగు. "తమమీద గాని తమ భార్యగారిమీదగాని మందేమైనా చల్లాడా సన్యాసి?" అని అడిగాడు సర్కిల్. "అంత తెలివే మాకుంటే మా వస్తువులు పోనేపోవు. కుంభకర్ణుని నిద్రలో వుంటాం

ఎప్పుడూ కూడా నేనూ నా పెళ్లాం, ఇంటిల్లిపాదీ అందరం."

"బలే కుటుంబం!" అని కేదారసింగు కేసి ఒక చిరునవ్వువదలి, ఆలస్య మమృతం విషం అని సర్కిల్ పద్మాలమ్మచర్యను పలువిధాల పరికించజొచ్చాడు. పద్మాలమ్మ ఎంతసేపూ తా నిలబడ్డ గోడనుండి బెసక్కుండా అదే తావున నిలుచుండి, వీపుకు మూపుకు గోడ తెల్ల రాసుకుపోయేలా రాపాడుతూ "నావొంక అలా చూస్తారెందుకు? దొరగారూ! ఆవల పిడకల తరుపికి గోడ ఊ అదిరిపోతుంటే నా నూగిపోతున్నాను" అని మూర్ఛిల్లింది.

ఎప్పుడైతే పద్మాలమ్మ మూర్ఛిల్లిందో సర్కిల్ ఆమెమీదను చన్నీళ్లు జల్లమని ఒక జవానుకు పురమాయించి, రెండో జవాన్ని గోడ బెల్లూడతీయమన్నాడు. పద్మాలమ్మవీపు రాపాడిన పొడుగునా బెల్లు కొంచెం పచ్చిపచ్చిగా కాపడింది. తవ్విన ఒక అడుగు లోతు మేరలో గోడలోపట పచ్చికుండ ఒకటి కనిపించింది. "ఆ కుండమాం ఆవలో కాల్చడానికి పెట్టుకున్నాం" అంది పద్మాలమ్మ కొంచెం తెప్పరిల్లి.

అంతలో ఆ కుమ్మరి యిల్లు అంటుకుంది. అంటుకుంది అనేకన్న సన్యాసివేషాన్నవున్న పద్మాలమ్మ మొగుడు తన యిల్లు తానే ఎక్కి అంటించుకున్నాడని చెప్పొచ్చు.

అయితే ఆ యిల్లు అంటుకున్న దాని పర్యవసానం యీావల రావిచెట్టుకింద నిలబడి ఆజ్వాల, ఆ వెలుగు, ఆ వేడి, ఆవిసురు చూచినవాళ్లకుగాని అవగాహన కాదు.

గోడలో వున్న పచ్చికుండకు, ఆ యిల్లు పరశురామప్రీతి కావడమే ఆవ అయి, రంగుమార్చి గట్టి చేకూర్చింది; కాని ఆ కుండ వొరిగి దానినుండి తప్త కాంచనం ధారగా ధాతుగా, వొలకపోసినట్టు వెలికి వెల్లువకట్టింది.

వచ్చిన పోలీసులు ప్రజలు యావన్మంది నీళ్ళు ఇసక బెండడి చేటలతోటి, చిమ్మటి గొట్టాలతోటి పోసి అగ్ని హోత్రం ఆరిపేసరికి సమస్తం తగులడిపోయింది. ఒక్క మనుష్యులు వాళ్లు కట్టుకున్న బట్టలు మాత్రం మిగిలాయి.

"పచ్చిపిడకలు కూడా భస్మం అయిపోయినాయి" అని వంటలక్క ఆశ్చర్యపోతూ చూస్తూవుంటే, పద్మాలమ్మ "పచ్చికుండ పగిలిపోకుండాగట్టిపడింది చూచావా వొలే?" అని అతి అమాయకురాలిగా అడజొచ్చింది.

కరిగిపోయిన బంగారాన్ని గుర్తుపట్టించడమెల్లా అని పోలీసులు మెల్లమెల్లగా వెళ్లిపోయినారు. ఎంత దొంగతనంచేసినా సొంతయిల్లు తగలబెట్టుకునే సన్యాసుండరా అని కుంభకారుని ఒకపిచ్చివానిగా పరిగణించి ఊరినుండి గ్రామస్థులు వెడలగొట్టారు. దానితో బేడీమూక వేడుకా వింతా మరింత హెచ్చయిపోయింది.

కొందరు కోడిగుడ్డంత బంగారం లేనివాళ్లుంటారా అని అంటే కొందరు దంతా కుంభకారిణి కుంభకోణం అన్నారు.

కథ కంచికి వెళ్ళింది. మనం మసింటికి వచ్చేశాం.

# తమసి



శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

చీకటి కోణముల్ మలచి చిత్రిక బట్టిన ఏ నిశీథినీ
లోకము దూకెడో నిదురలో, కలలో, కథలోని మత్తులో
శోకసుఖాస్త విశ్వహార సుందరనాట్య మహోపదంబులన్
మోకరిలంగ భయాంధమయిపోయెను లోకము బాధ లెట్టులో !

కాటుకదుప్పటిన్ బిగువుగా ముసుగేసి ప్రపంచపంచతం
త్రాటపి మాటలే మదికి దాకగనీని హిమాని ప్రక్కలో
గాటపు కౌగిలింతలనిగారపు నిద్దురమున్గ ఘూకదే
శాటనయాత్రికుల్. జరయు, చావును మ్రింగిన మూగజీవులే !

ఓ నిద్రాణ దరిద్ర దేవతలు రారోయీ ! నిశే, నిద్దురే,
ప్రాణంబై వినరాని గీతముల నాలాపింతమో ! స్వప్నసీ
మానాదంబుల !! అర్ధ తృప్తమగు పన్నాగాలు మిన్నాగులై
మీ నిశ్శబ్ద గళాల కాట్లనుచు ! ఏమిరా ! పొంగునో ధూమముల్ !

నా విరహార్తివేల కరుణా తరుణాంధతమోబ్ధిలో చన
త్రావనిదాఘ సంక్షుభిత.రావము లేనను బల్కరింప, సం
ధ్యావమదగ్రరాత్రిక విహాయస రేఖలు పెట్టిపోయి, నా
భావములో విశీర్ణరసభారము లౌచును బాధపెట్టవా !!

పాగవలె ప్రాకిప్రాకిచని భూనభముల్ ఒక కొల్కిలోనికిన్
బిగువుగ లంకెవేసిన దవీయసి వౌదువు గాఢతామసీ !
వగలెగయంగ సీమణికవాటము దీసి కనంగరాని సో
యగముల కేశబంధము రయంబుగ విప్పెదవేల దీర్ఘవై !

నరములు లేని సుందరివి, నాట్యముజేతువు దృఙ్మనోంతగాం
తరముల ! బుద్ధికందని కథాకళికల్ నవపేశలాంబర

స్ఫురిత విసారితాంబరలయి జోలలు పాడుచు, నిస్స్వనావధుల్
విరిసిన వేషము నీలపరివేష కషాయములూచు నెచ్చెలీ!

సర్వము శూన్యమే! మరియు సర్వము నేకమె! అంచు వేత్తలై
పర్విన వారు చూసిన విపాకము దోచుచు, భారమూను, నీ
దూర్వహ భ్రూలతాంగణ విధుంతుదభంగిమ తోంగి; ఇంక నీ
గర్వములోన సామ్రసిరి కాకులు—లోకులు మోకరిల్లిరో!!

ఓ తమసీ! ఒహూహోయి నిరయోష్ఠిత సంతమసీ! మరింక నీ
చేతములో కబోదులకు చేసయిగల్, కనుసైగ లెందుకో
జేతువు; మిణ్గురైన ఒక చిన్నని చుక్కయినన్ వెలుంగగా
భీతులు గారలే! ప్రణయవీరులుగా గపలే! క్షుధార్తులే!!

నీవలెనయ్యొ లోకములు, నీవలెనా కలమూచు నల్లగా
జేవలు గ్రక్కికోవలను జిమ్మెను; దీప మెరుంగనట్టి ప
జీవులు నీకవుంగిలిని చిత్తము శాంతికి జేర్తురో! రహో
గానము నీ యెడంద మరి రాయును నా యెడదన్ మహాసఖీ!!



# తనూ - నీరజా



శ్రీమతి మాలతీ చందూర్

*My dear friend*

పొద్దుటే వచ్చాం నందీ హిల్సునుంచి. రఘుకి రేపటినుంచీ హాస్పిటల్ పోస్టింగ్స్. సాయంత్రం 5 గంటలకి తప్పక రావాలి. రాత్రి పదింటిదాకా బ్రిడ్జి పేకాలు చూసుకు వస్తాంగదూ!

— నీరజ

కాఫీ ట్రేలోని వుత్తరాల్లోంచి నీరజ దస్తూరి మెరుపులా తొంగిచూసింది. తాగేకప్పు కాఫీని అలాగే వదలి లేతమబ్బురంగుకవరు ఆతుర్దాగా చింపాడు. ముచ్చటైన నగాసు బంతుల ఆహ్వానం.

నీరజ—నీరజ వేళ్ల మధ్యనుంచి జారిన మంచు బొట్టులా తన జీవితంలోంచి జారిపోయింది. ఎలా జారింది అనేది యీనాటికీ - ఏనాటికీ తెగని సమస్య. తన ఆత్మాభిమానమా - అహంభావమా? ఏది కారణం?

అంతవరకూ - అంటే నీరజలో స్నేహంకలవక ముందు—స్త్రీలందరూ తనకి, వుత్త ఆట బొమ్మల్లా, మనోనిశ్చయంలేని రామచిలుకల్లా కనపడ్డారు. పురుషుడు కదలక, మెదలక, మెతక లేకుండావుంటే, ఎంతటి స్త్రీఅయినా పాదాలవద్ద వాలుతుందని, తన పూర్వానుభవాలు పాఠాలు నేర్పాయి.

కాని నీరజ తన ఆహ్వానాన్ని—నవ్వుతూ మార్దవంగా తొక్కిపారేసి, మెత్తటి సుఖమల్ చెప్పుతో కొట్టినట్టు, స్త్రీకి ధనంకాక హృదయం కావాలని చెప్పింది. ఆ కళ్ళలో ఎంతేసి లోతులున్నాయి. తను ఆ లోతుల్ని చూసికూడా చూడనట్టు వ్యవహరించాడు. అందువల్లే నీరజ తన జీవిత ప్రాంగణంలోకి, అడుగెట్టికూడా చటుక్కున తప్పుకుంది. తన యింటిని ఆమె నవ్వుల్తో వెలిగించ నిరాకరించింది.

ఆమెకి తన హృదయాన్ని సమర్పించి, ప్రేమతో కట్టేసుకోకుండా — దూరాన్నుంచి అహంభావంతో చూస్తూ, ఆఖరికి ఆణిముత్యంలాంటి నీరజని చేతులారా వదిలేసుకున్నాడు.

తనకి తెలియకుండా నిట్టూర్పు వెలువడింది. నీరజ ఎంత తెలివైంది. నెమ్మదిగా, ధీమాగా తనని ప్రియమిత్రుణ్ణి చేసుకుంది! నీరజస్నేహంతో స్త్రీజాతి పట్ల తనకి కొత్తదృష్టి అలవడింది. కాఫీకప్పు ఎత్తి తాగబోయాడు. పెదాలకి చల్లారిపోయిన కాఫీ తగిలింది. టైము చూశాడు. 9 గం. 15 నిముషాలయింది. సాయంత్రం అయిదింటికి, తొమ్మిదింబావుకీ మధ్య ఏడుగంటల నలభైఅయిదు నిముషాలకాలం వుంది. యింతసేపు—యీ ఏడుగంటల నలభైఅయిదు నిముషాలు—తను నీరజనుతలంచిన ఆలోచనలు రాకుండా చేసుకోగలడా? ఏమో?

విచిత్రం, ప్రతి ఆలోచనని అదుపులో వుంచుకునే తనే నీరజనుగూర్చిన ఆలోచనలని ఆపుకోలేకుండా వున్నాడు. పక్కనున్న పేపరుతీసి పేజీలు తిరగేశాడు—కాని లాభంలేదు.

*    *    *

ఆగస్టు పద్దెనిమిదో తేదీ తన జీవితంలో మరపురానిరోజు. తనకింకా బాగా జ్ఞాపకం. పొద్దుట రెండుగంటలు అర్జంటుపనులుంటే ముగించుకుని, కారుసర్వీసింగ్ కిచ్చి, బిట్టిపేపరు మడిచిపుచ్చుకు, యాదాలాపంగా 16వ నెంబరు బస్ క్యూలో నుల్చున్నాడు. మధ్యాహ్నం పన్నెండున్నర అయింది. ఎండ పేలుస్తోంది. ఎప్పుడు బస్సింకారాదు! క్యూలో మనుషుల సంఖ్య ఒకటొకటిగా పెరుగుతోంది. తనవెనక—నలుగురైదుగురు మనుషుల కవతలగావచ్చినుల్చున్న అమ్మాయితలలోని ఎర్రనిగులాబీ తనకంటికి ఎందుకో ఆకర్షించింది.

ఎర్రనిగులాబీ—ఒకే ఒక్క గులాబీ వాలుజాటి జెడలోంచి వేలాడుతోంది—ఏ ఆలోచనలూ లేకుండా ఆ పువ్వువంక అలా రెప్పవాల్చకుండా చూసి నుల్చున్నాడతను.

ఇంతలో బస్సొచ్చింది. తన ముందున్నవారు ఎక్కుతున్నారు. క్యూనివదలి ఎర్రగులాబీ—గబగబ

వచ్చి ఎక్కబోయింది. తను చెయ్యి అడ్డుపెట్టి, "ఇది క్యూ—మీలాగే మేమూ నుల్చున్నాం. వరస ప్రకారం ఎక్కండి." అన్నాడు—కొంచెం మోటుగానే. తన కాక్షణాన ఆ ఎర్ర గులాబీమీద చికాకెత్తుకొచ్చినమాటనిజం. ప్రపంచజ్ఞానం తెలిసినవాళ్లుగూడా అలా ప్రవర్తిస్తే ఎట్లా? స్త్రీగదా అని క్యూలోని పెద్దమనుషులంతా కిక్కురుమనకుండా వూరుకున్నారు.

ఎర్రగులాబీపువ్వు తనవంక తీక్ష్ణంగా చూసి, వెనక్కితిప్పుకుంది. తను సన్నగా నవ్వుకున్నాడు.

అందరూ ఎక్కారు. చివరికి ఆ అమ్మాయి ఎక్కి, తనవంక విజయగర్వంతో చూసింది. కూర్చునేందుకు స్థలంలేక నుల్చున్న ఆ అమ్మాయికి తను నుల్చుని, సీటుయివ్వబోతే "అక్కర్లేదు *Thanks*" అని వినతో అని, పక్కమనిషి సీటిస్తే గబుక్కున కూచుంది.

ఆ అమ్మాయి అంతనిర్మొహమాటంగా తనిచ్చిన సీటు వద్దని, తక్షణం తనపక్కవాడిచ్చిన స్థలంలో కూచోటంతో—తనకి కొంచెం చిరాకూ, వెను వెంటనే నవ్వూకలిగినాయి.

బస్సుకదిలింది. తన పక్కవాడు పరమ శత్రువో—రాక్షసుడో అన్నట్టు ఆ అమ్మాయి తల కిటికీవేంపు తిప్పుకుని కూచుంది. తను తిరిగిచూడగా తల్లో ఎర్ర గులాబీలేదు. ఏదో వస్తువుపోయినట్టు నలుపక్కలా చూశాడుతను. కిందా, పక్కనా వెతగ్గా కాళ్ళవద్ద ఎర్ర గులాబీ పడివుంది. అదితీసి '*Excuse me*' అంటూ చేతికిచ్చాడు.

అమ్మాయి పువ్వునందుకుంటూ '*Thanks*' అంది, కళ్ళల్లోకిచూస్తూ. యిందాకటికిమల్లే కనుకొలకుల్లో కోపంతో మిళితమైన ఎరుపుజీరలు కనపడలేదు. కళ్లు స్నేహపూర్వకంగా నవ్వినట్లనిపించాయి.

పాలమీగడలాంటి తెల్లటిచీర. నీలిరంగు జాకెట్టూ, చేతినవాచీ, తల్లో ఎర్రగులాబీ, యివన్నీ అందాలపాలవెల్లి అయిన అధునాతన యువతిని జ్ఞప్తికితెస్తున్నా, వాటివెనకన ఏదో సౌకుమార్యం, స్వచ్ఛందతా—మనసుకు తేలిగ్గా తోచడం మొదలుపెట్టాయి.

బస్ పెట్రోల్‌బంక్‌కి వచ్చేదాకా, కోనదేలిన ముక్కూ, తీర్చిదిద్దిన కనుబొమలూ, సోగదేరిన కన్లనీ, తనకి తెలియకుండానే పరిశీలిస్తూ కూచున్నాడు, వెడల్పాటి నోరు ఒక విధంగా ముఖానికి వికారం కల్పించినట్టుగా వుంది. పెట్రోల్‌బంక్ దగ్గిర ఆగిన బస్సులోంచి ఆ అమ్మాయి దిగుతూంటే నల్లని జెడలోని ఎర్రగులాబీ తనని మురిపించింది...

అదే మొదటిసారి తను నీరజని చూడటం. అప్పటికి ఆమెపేరు నీరజ అని తెలియదు కాని మనసులో ఎర్రని గులాబీ—తెల్లనిపైటా, పొడుగాటిజెడా, చాలాసార్లు తనని వెంటాడుతూండేవి.

వారంరోజుల తర్వాత సాయంత్రం వేళ వోవర్ బ్రిడ్జివైపు కారులో పోతూంటే, ఫుట్‌పాత్ మీద ఎర్రగులాబీ యిద్దరు ముగ్గురు స్నేహితురాండ్ర మధ్య కనపడింది. వారినవ్వుల్లో కలిసిన ఆమె నవ్వు అలలు అలలుగా గాలిలోకలిసి తియ్యగా తన చెవి సోకింది.

ఆపైన రెండు మూడుసార్లు బస్‌స్టాపుల వద్దా, అలా ఫుట్‌పాత్‌లవైపు నడుస్తూనూ ఆ అమ్మాయి తనకి కనపడింది. నల్లతాచులాంటి ఆమె జెడ ఒకనాట్లా తన శాంతిని ధ్వంసంచేసింది.

తను ఎంతమంది స్త్రీలని చూడలేదు? అందులో చదువుకున్న స్త్రీలలో తనకు పరిచయం లేకనా? తనకున్న డబ్బూ—హోదాతో తెలిసిన స్త్రీల మనోహర వీక్షణాలను తప్పించుకోడానికి, తనెన్నెన్ని యిబ్బందులు పడటంలేదు? అలాటిది తను యీ అమ్మాయినిగూర్చిన ఆలోచనలనుంచి తప్పించుకోలేక పోవడం తనకే ఆశ్చర్యంగావుంది.

మరోసారి తను సినిమా హాల్లోకి అడుగెడుతున్నాడు. ఆ అమ్మాయి—ఎవరో స్నేహితుడితో బయటకొస్తోంది. తననిచూసి ఆమెకళ్లు గుర్తున్నట్టు సన్నగా నాట్యం చేశాయి. పెదాలు బద్ధకంగా నవ్వినట్లు వంకర తిరిగాయి. అంతే—తనకు సినిమా చూస్తున్నంతసేపూ మనసులోనూ, తెరమీదాకూడా ఆమె మొహమే కనిపించింది. వూరూ పేరూ తెలియని ఆ పిల్లమీద తన వలపు తలపులకి అర్థం?

తనేం యవ్వనంలోకి అడుగెడుతున్న యువకుడా? తన కళ్లతో తను ముప్ఫైఎనిమిది వసంతాలు చూశాడు, కనిపించిన స్నేహితులూ, ప్రేమిం



చిన ప్రియురాళ్లూ, చనిపోయిన తల్లిదండ్రులూ, మిగిలిన సిరిసంపదలూ,......తనకి జీవితంపట్ల ఏకోపమూ లేదు. ఉద్రేకాలూ, ప్రేమభావాలూ తనకంటవనే ధైర్యంతో దూరాన్నుంచి, నిర్వికార భావంతో చూసే తనకు యీ అమ్మాయిపై విడవకుండా తలపులేమిటి?

ఎంతమంది స్త్రీలు తన వంటరి జీవితపుగోడలు బద్దలుగొట్టి, లోనికి ప్రవేశించి, తన ఏకాంతతను తమ నవ్వుల్తో, అర్థంలేని మాటల్తో, భంగం చేద్దామని ప్రయత్నించలేదు? ఎంతమంది తమ చిరునవ్వుల్తో కనపడని అనురాగ బంధాలు తన చుట్టూ అల్లలేదు? వాటిని దూరాన్నుంచి చూస్తూ, అంటకుండా తప్పించుకుని మందహాస వదనంతో తను బయటికిరాలేదు కనకనా! అట్లాంటిది తనకెందుకు యీ ఎరగని పిల్లమీద మమకారం?

* * *

ఆనాడు పొద్దుటినుంచీ ఒకటేవర్షం. విడవకుండా పడుతోంది వర్షం. పదిగంటలవేళ సెంట్రల్ నుంచి తను యింటికెళ్లుతున్నాడు,—పూనమలే హైరోడ్డుమీదుగా. వెచ్చగా రెండుకప్పుల టీతాగి, ఏపుస్తకమో తెచ్చుకుందామని ప్లాన్. తనకి పెట్రోల్ బంక్ దగ్గిర బస్ స్టాపులో ఎర్రగులాబీ ముఖం కనపడింది. అనుకోకుండా కాళ్ళు బ్రేక్ వేశాయి. కారు నెమ్మదిగా దగ్గిరకి పోనిచ్చి.

"ఎక్కండి—యీ వర్షంలో బస్‌లో ఖాళీ గూడా వుండదు" అన్నాడు.

"అబ్బే, వద్దండీ—బస్ వస్తుందిగా. వెళ్ళిపోతా" అంది తలతిప్పి.

"ఫరవాలేదు. ఎటువెళ్తారో చెప్పండి—దిగబెడ్తా" అన్నాడు, ప్రార్థించే కంఠస్థాయి తనకి తెలియకుండానే ప్రవేశించింది.

"నేను మౌంట్‌రోడ్ వైపు వెళ్లాలి. మీరు యిటు వస్తున్నారాయెను. అనవసరంగా నాకోసం మీరు వెనక్కి వెళ్లడం యిష్టంలేదు." అంది ఆ అమ్మాయి.

"ఫరవాలేదు. నా కిష్టంగావుంది మిమ్మల్ని పంపడం" అంటూ కారుతలుపు తెరిచాడు.

ఎక్కి కూచుంది అమ్మాయి. ముదురురంగు ఆకుపచ్చనిచీర, తెల్లని జాకెట్టూ, జడలో తెల్ల గులాబీ యీ అమ్మాయి కీరంగు లెక్కడ దొరుకు తాయో ?

"ఆనాడు బహుశా మీకు నామీద కోపం వచ్చివుండాలి. నేను చాలా మొరటువాడిననికూడా అనుకుని వుంటారు" అన్నాడు పేర్లపరిచయం అయాక.

"మీరు చెయ్యి అడ్డుపెట్టంగానే ఆక్షణంలో కోపంవచ్చిన మాట వాస్తవమే. కాని మరుక్షణంలో, నా తప్పు నేను గ్రహించుకున్నాను. అందువల్ల కోపానికి బదులు కొస్త సిగ్గుకలిగింది" అంది సూటిగా చూస్తూ.

"మీ తప్పును వేలెత్తి చూపిద్దామనే భావంతో నేను బస్సెక్కవద్దనలేదు. వూరికే రూల్సు చెప్పాను. నాగరికత అంటే నిబంధనలు పాటించడమేగా"

"మీరు నా తప్పులేకుండా అనివుంటే, అసలు మీ మాటలు లెఖ్ఖచేసివుండేదాన్ని కాను. వున్న నిజంచెప్పారు; అదీ ముఖంమీద చెప్పారు. ఆ నిజాన్ని జీర్ణించుకునేందుకు కొస్త టైముపట్టింది. స్త్రీనిగదా అని క్రమాన్ని వ్యతిరేకిస్తుంటే చూసి వూరుకునే మొగాళ్ళకంటే, నిజంచెప్పే పురుషులు చెడ్డమనుషులు ఎందుకవుతారు ?" అంది నీరజ.

ఆ సంభాషణలోని—నిర్మొహమాటం, ఆ కళ్ళ లోని సూటితనం చూడగా ఆమె చెప్పినవన్నీ నిజం అనిపించింది.

నీరజని ఆఫీసు మెట్లవద్ద దించాడు.

* * *

గ్రాడ్యుయేట్ నీరజ యూరోపియన్ ఫరమ్‌లో సెక్రటరీగా పనిచేస్తోంది. తల్లీ దండ్రీ లేరట నీరజకి. ఆమెకి ప్రపంచంలో వున్న చుట్టాలల్లా భర్తలేని ఒక మేనత్త. నెలకి యిరవైరూపాయిలు పంపడంతో, ఈ బాంధవ్యపు తాళ్ళుగూడా తెగిపోయాయి. నీరజ స్త్రీల హాస్టలులో వుండి వుద్యోగంచేస్తోంది. అంతే నీరజ తననిగురించి చెప్పినవృత్తాంతం.

నీరజతో క్రమంగా స్నేహం అభివృద్ధి అవు తున్నకొద్దీ, ఆమె స్వభావంలోని సరళతా, హృద యంలోని మార్దవం, తనను ఆకర్షిస్తూవచ్చాయి. స్త్రీలని తప్పించుకుతిరిగే తను నీరజ ఆఫీసువద్దా, ఆడవాళ్ళ హాస్టలువద్దా ఆమెకోసం కనిపెట్టుకు కూచునే స్థితికివచ్చాడు. నీరజ ప్రతివిషయం చాలా సూటిగా, దాపరికంలేకుండా తనదగ్గిర మాట్లాడు తూండేది. ఇద్దరూ సినిమాలకీ వాటికీ వెళుతూండే వారు. మనసులో నీరజమీద మమత. అదిపైకి కనపడ నీయకుండా, దాన్ని స్నేహంతో కప్పి ప్రవర్తిస్తూం డేవాడు. కాని తన అంతర్యం తెలుసుకోలేనంతి అమాయకురాలు కాదు నీరజ.

"వొచ్చే ఆదివారం *Devotion* పిక్చరుకి టిక్కెట్లు తెప్పిస్తున్నాను." అన్నాడు నీరజతో.

నీరజ సమాధానం చెప్పలేదు.

నీరజ సరేనంటుంది. ఆమెకి అభ్యంతరం వుండదు అని ధీమాగా అనుకున్న తను ఆశ్చర్యపోయి ఆమెవంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఆదివారం ఒక ఫ్రెండ్‌తో ఆ పిక్చరు కే వస్తానని మాటిచ్చాను" అంది సాలోచనగా.

"ఎవరా ఫ్రెండ్ ?".

"మీతో పరిచయంకలగకముందు ఒకసారి సినిమాహాల్లో చూడలేదూ ఒకబ్బాయిని. అతనికి మాటిచ్చాను."

అసలు ఆ అబ్బాయిసంగతి మర్చిపోయాడు తను. ఆ అబ్బాయిఎవరు ? అతనికీ ఆమెకీ ఎన్నాళ్ళనుంచీ పరిచయం? ఈలాటి ప్రశ్నలుఅన్నీ గిర్రున తిరిగాయి. అతనికోసం తనతో సినిమాకిరానన టమూ—కొస్తమనసులో జెలసీలాంటిది తలెత్తింది.

"అహా—అల్లాగా" అన్నాడు ఏమీ అనుకో నట్టు.

"అసలు రఘుని మీకు పరిచయం చేద్దామని చాలా రోజులనుంచి అనుకుంటున్నాను. అతనంటే మీరు తప్పక యిష్టపడతారు. పోనీ మన ముగ్గురం కలిసి సినిమాకి వెళదామా—మిమ్మల్ని రఘు కలుసు కున్నట్టూ వుంటుంది, అంది నీరజ వుత్సాహంగా.

"తప్పకుండా" అన్నాడు తను, రఘునిగురించి మాట్లాడుతున్నప్పుడు మెరిసే ఆమెకళ్ళనుచూస్తూ.

ఆదివారం అయిందింటికి నీరజా, రఘూ తన యింటికొచ్చారు. నీరజ చాలా హుందాగా, దర్జాగా అడుగెట్టింది హాల్లోకి. రఘు ఆమె అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చాడు. నీరజ రఘుని తనకి పరిచయం చేసింది.

రఘురామారావు. *M. B.* చివరి ఏడు చదువుతున్నాడు. నీరజకీ అతనికీ మూడేళ్ళనుంచి స్నేహమట. నీరజ రఘుమీద ఒకవిధమయిన వాత్సల్యం వెల్లబోసింది. రఘు హాల్లో కూచున్నాడేగాని, అతని పరిసరాలన్నీ మర్చినట్టూ, చూడనట్టూ వున్నాడు. అతని కంటికి నీరజ ఒక్కతే కనపడ్తుంది. నీరజ ప్రతి కదలికనీ, ప్రతి చూపునీ, ప్రతిమాటనీ విశ్వాసంతో—కళ్లతో ఆరాధిస్తూ కూచున్నాడు రఘు.

తోటలో పూసిన జాజులు సజ్జలోవుంచి తెచ్చాడు నాయుడు—నీరజ టేబుల్ మీద వున్న పట్టుదారంతో మాలకడ్తూ మాట్లాడుతోంది. రఘుకళ్లు నీరజ వేళ్ళని వదలకుండా చూస్తున్నాయి.

నీరజ తనతో మాట్లాడుతూ—రఘువంక మధ్య మధ్య భయంలేదన్నట్టు చూస్తోంది. రఘు ఆ చిరునవ్వుకే మహా తపస్సులు చేస్తున్నట్టు ఎదురు చూస్తూ కూచునేవాడు.

నీరజ కిటికీవద్ద నుల్చుని జాజిచెండుని పొడుగాటి వేళ్ళతో, జడలో తురుముకుంది. చెరోదండా కట్టి తమ కిచ్చింది. నీరజ యిస్తున్న జాజిదండను తీసుకునే రఘు వేళ్లవణుకు చూసిన తనకు ఏదో మహాజ్ఞానం కలిగి నట్టయింది. ఆ కుర్రవాడిమీద నీరజకున్న అధికారం చూసి తనకెందుకో భయమూ, జాలీ కలిగాయి.

* * *

రఘుకి యిరవై మూడేళ్లుంటాయి. బహుశా నీరజకంటే ఏడాది రెండేళ్లూ చిన్నేమోకూడా. అతని తండ్రి తృణమో, పణమో వున్న ఖామందు. ఇద్దరు చెల్లెళ్ళూ—తమ్ముడూ వున్నట్లు చెప్పాడు తనతో. రఘు చూడటానికి, నీరజకి మల్లే పగిచుండిలోంచి విడిగా కనపడకపోయినా—ఆకర్షణగల ముఖం అని అనక తప్పదు. చదువులో మంచి తెలివి పట్టుదలా గల కుర్రాడు. నీరజ చెప్పినట్లు అతన్ని చూసి యిష్టపడకుండా వుండలేము కుర్రవాడిని చూడగానే వృద్ధిలోకి రావలసినవాడు అని, అనిపిస్తుంది. అన్నిటికన్నా నీరజమీద అతనికున్న ప్రేమా, ఆ ఆరాధనా చూస్తేమటుకు తప్పక ఆశ్చర్యం కలగకపోదు.

నీరజ యితన్ని వదిలి మరెవర్నయినా, అసగా పసను, పెండ్లాడితే, యితను పిచ్చివాడవుతాడా అన్నంతగా భయపడేవాడు కొన్నిక్షణాలలో. రఘులో నాకో విశిష్టమైన బాల్య చాపల్యం కనపడేది.

ఇద్దరూ నవ్వుతూండేవారు, ఏడ్తూండేవారు. రఘుని నీరజ లేకుండా, తను చాలాసార్లు కలుసుకున్నాడు. అతను నీరజను ఒక దేవిలా పూజిస్తాడనే అభిప్రాయం రఘు మాటల్లో తెలుస్తూండేది. తను నీరజ స్నేహితుడు కాబట్టి, తనకీ యిష్టుడే అన్నట్టు ప్రవర్తించేవాడు రఘు తనతో తిరుగుతున్నప్పుడు. తన పట్ల జెలసీగాని, కోపంగాని చూపిస్తాడేమోనని చాలా దగ్గరనుంచి కనిపెడ్తూండేవాడు. కాని తన పట్ల స్నేహభావం తప్ప మరొకటి కనపడేది కాదు.

క్రమంగా నీరజకూ, తనకూ మధ్య స్నేహం పెరిగి, యిద్దరూ చాలా సన్నిహితులయ్యారు. తన కిష్టమయిన పనులు చేయడంలో, తను యిష్టపడ్డ చీరెలు ధరించడంలో, నీరజ తన మీదవున్న మమకారాన్ని వెల్లడించేది.

ఏనాడూ తను నీరజని—"నీరజా నువ్వు నాకు కావాలి—నా హృదయ ప్రాంగణానికి నువ్వు కాంతివి" అనిగాని "నీ ప్రేమవాహిని నామీద పొంగనియ్యి" అనిగాని నోరుజాచి అడగలేదు. కాని తమ యిద్దరి చేష్టలూ, చూపులూ ప్రేమని వెల్లుబికించేట్లు వుండేవి.

నీరజవద్ద తన యితర ప్రేయసుల గురించీ, స్నేహితుల గురించీ దాచలేదు. ఒకవిధంగా తన ఆత్మను, జీవితాన్ని ఆమెముందు దాపరికంలేకుండా వుంచాడనే చెప్పవచ్చు. ఏవొక్క అభిప్రాయం వెలిబుచ్చకుండా, తను చెప్పినవన్నీ, ఓపిగ్గా, సానుభూతితో వినేది. గతకాలంలో తనకి తగిలిన, మానసిక గాయాలవల్ల ప్రపంచాన్ని, మనుష్యుల్ని నిరసనతో మాట్లాడితే నీరజ వారించేది. "ప్రపంచాన్ని తిట్టి లాభంలేదు—ప్రపంచాన్ని ప్రేమించి అదిమనల్ని ప్రేమించేట్టు చేసుకోవాలి" అనేది. నీరజమాటలు వుపదేశంగా తీసుకుని, ఆమెను

ప్రేమించి తనను ప్రేమించేట్టు చేసుకునేందుకు ప్రయత్నించాడు.

వేసంగికి రఘు కాలేజీకి శెలవలు యిచ్చారు. అతను శెలవలకి వాళ్ల వూరు వెళ్లిపోయాడు. నీరజకి వెళ్లాళ్ళు శెలవ పెట్టి తన మేనత్తదగ్గిర కెళ్లాలని వుంది. అభిప్రాయం అడిగేందుకు తనదగ్గిర కొచ్చింది రఘు వెళ్ళిన మూడో నాడు.

"మీ వూరెళ్ళి యిప్పుడేంజేస్తావ్ ? శెలవ పెట్టి మా యింటికొచ్చి వుండు. వూరంతా వూరికే తిరుగుదాం" అన్నాడు నవ్వుతూ.

"మీరుండమంటే యిక్కడే వుంటా. నా కెక్కడయినా ఒకటే. ఎట్లొచ్చీ కాస్త విశ్రాంతి కావాలి. అంతే, హాస్టల్లోనే వుంటా. తిరగటం అంటారా అది మీ వోపిక" అంది మళ్ళీ నవ్వుతూనే.

ఆ సాయంత్రం అనుకున్నాడు నీరజలోని పరాకు, 'మీ వోపిక' అన్న ఆమె మాటలోని మృదుత్వం చూసి తను నెగ్గానని; తన నోటిమీదుగా ప్రేమించానని అనకపోయినా, ఆమె తన వైపుగా తిరుగుతోందని. ఈసారి నీరజ ప్రేమపాశాల్లోంచి తను పారిపోయే ప్రయత్నం చెయ్యలేదు సరిగదా, నీరజ ప్రేమకి దాసోహంచేసి, జీవితాన్ని ఆమె చేతుల్లో నిశ్చింతగా, వుంచేందుకు నిశ్చయించు కున్నాడు.

ఆ శెలవలు నెలరోజులూ నీరజ చాలా చాలా సరదాగావుంది. తనలోని నిర్వికారం మాయమయింది. ఇంట్లో పనివాళ్ళు, బయట స్నేహితులు తమ్ముకాబోయే దంపతులుగా ఎదురుచూస్తున్నారు.

ఇంట్లో పనివాళ్ళు అమ్మగారిక్కి పువ్వులూ అవీ జాగరూకతతో సప్లయి చెయ్యడం, నాయరు అమ్మగారిక్కి యిష్టమయిన ఫలహారాలు చెయ్యడం, మొదలయిన పనులు తనకు తెలియకుండానే, వాటి అర్థాలు అవి, కల్పించుకు నేవి.

నీరజ తిరిగి ఆఫీసులో ప్రవేశించింది. రోజూ సాయంత్రం తప్పనిసరిగా యిద్దరూ కలుసుకునేవారు. ప్రతివుదయం నిద్దరలేచి సాయంత్రంకోసం ఎదురు చూసేవాడు తను.

పదిహేనురోజులు గడిచాక నీరజ ఒక సాయంత్రం, "రఘు దగ్గిరనుంచి వుత్తరం వచ్చింది" అంది గబుక్కున.

"ఏమిటి విశేషాలు ?" అన్నాడు తను సిగరెట్ ముట్టిస్తూ.

"వాళ్ల నాన్నతో దెబ్బలాడాట్ట, వారంరోజుల్లో వస్తానని రాశాడు."

"దెబ్బలాటెందుకూ ?"

"నన్ను పెళ్లిచేసుకోడానికి వాళ్లు వొప్పుకోలేదు. ఒకటి కులం. రెండు నేను అతనికంటె పెద్ద. మూడు మేనరికం వుందిట."

తను మాట్లాడలేదు.

"ఇందులో మీ వుద్దేశం ఏమిటి ?" అంది నీరజ చాలా స్నేహంతో, నమ్రతగా చూస్తూ.

"నీకు తెలీదూ" అన్నాడు. అంతే. తన అహం !

ఆ సంభాషణ అంతటితో ఆగిపోయింది.

ఆ సాయంత్రం తిరిగారు, నవ్వారు, యింటి కొచ్చారు. నీరజని హాస్టల్లో విడిచివచ్చాడు.

ఆ రాత్రి చాలాసేపు ఆలోచించాడు : రఘు నీరజలనీ, తననూ నీరజనీ త్రాసులో వుంచి. ఎంతసేపు ఆలోచించినా తనూ నీరజా వున్న వైపుకే త్రాసు మొగ్గింది.

తెల్లవారి గట్ల నీరజ తనదే, తనను పెండ్లిచేసుకోమని ఆమెను అడగటం నిమిత్తమాత్రం, అది ఎలాగా జరిగి తీరుతుంది—అనే ధీమాతో హాయిగా నిద్రపోయాడు.

వారంరోజులు యథాప్రకారంగా జరిగిపోయాయి. మళ్ళీ రఘుసంగతి, తనెత్తలేదు—నీరజ ఆ ప్రసంగం తీసుకురాలేదు.

సోమవారం తను స్టడీలో కూచుని 'షా' చదువుకుంటున్నాడు. అయిదున్నరకిగాని నీరజ రాదు. అంటే అయిదింటికి కారు గారేజిలోంచి తీసి బయలుదేరుతే చాలు. "*Man and Superman*" పేజీలు తిరగేస్తున్నాడు. ఇంతలో 'హాల్లో' నీరజ కంఠం వినపడింది. పుస్తకం అలా వదిలి బయట కొచ్చాడు.

టేబుల్ మీద వేస్‌లోని గులాబీగుత్తుల్ని

ఆకులమధ్యగా సర్దుతూ, అందులోని అందాన్ని బడి పిల్లవాడిలా శ్రద్ధగా వింటున్న రఘుకి బోధిస్తోంది నీరజ.

రఘు నుల్చుని నమస్కారం చేశాడు తనకు.

"బయటకెళ్దాం వస్తారా ? మీతో చాలా మాట్లాడాలి. రఘు పొద్దుటే వచ్చాడు" అంది నీరజ పువ్వులు సర్దుతూ.

కాఫీ తాగి ముగ్గురూ బయలుదేరారు.

కాసేపు బీచిలో కూచున్నాక నీరజ యిలా చెప్పింది. "రఘు వాళ్ళ వాళ్ళతో దెబ్బలాడి వచ్చేశాడు. అతనికోర్సు అయిపోయింది. యీ యేడు హాస్పిటల్ పోస్టింగ్స్ అటెండ్ చేస్తే, వచ్చేఏడు వుద్యోగం దొరుకుతుంది. వాళ్ళ నాన్న డబ్బు పంపనని చెప్పారట. నా జీతంతో యిద్దరం సరిపెట్టుకోవడం కష్టం కాదని, తను వుద్యోగం కోసం వేరే ప్రయత్నించన అవసరం లేదని మీరు అతన్ని నమ్మించాలి"

తనకు ఏదో కథలోని చివరిభాగాల్లో, కథ పూర్తిగా జ్ఞాపకం రానట్టుంది. నీరజ మాటల కర్థం ? తను మాట్లాడలేదు.

"మీతో రఘు వుత్తరం గురించి చెప్పానే, ఆనాడే అతను వాళ్ళ వూరునుంచీ నేనిక్కడనుంచీ రిజిస్ట్రారుకి నోటీసిచ్చాం. ఎల్లుండికి డేట్ ఫిక్సప్ అయింది. ఒకేఒక్క సమస్య మిగిలింది. వుద్యోగం చేసే అవసరం లేదని రఘుకి విడమర్చి చెప్పడం."

నీరజ తన కళ్ళలోకి సూటిగా చూస్తోంది. తన లోని వుద్రేకాలనీ, నిరాశల్నీ రోషాల్నీ అన్నీ కప్పెట్టుకుని *"Wish you good luck"* అన్నాడు తను.

"నీరజ కోచ్చే మాటయా థై మీ యిద్దరికీ నిత్యే పంగా చాలు. పైన ఏదన్నా కావాలంటే నేను లేనా ? రఘూ—నువ్వు చాలా అదృష్టవంతుడివి. లేవండి చల్లని పానీయం తాగుదాం" అని లేవదీశాడు.

వారి పెండ్లికి తనూ, రఘు స్నేహితులిద్దరూ సాక్షి సంతకాలు పెట్టారు. రిజిస్ట్రారు చెవులో "అ కుర్రాడు గొప్ప అదృష్టవంతుడు" అని రహస్యం చెప్పామని పించింది తనకి.

ఆ రాత్రి నీరజ తన పెండ్లి విషయాన్ని గురించి చెప్పిన రాత్రి తనకి నిద్ర పట్టలేదు, నాటకం చూడాలని కూడా లేకపోయింది. మనసు ఒకవిధంగా మొద్దుబారిపోయింది. మర్నాడు, తెల్లవారి కాఫీ తాగుతూంటే, పోస్టులో నీరజ దస్తూరితో పెళ్ళి కవరు కని పడింది.

*My dear Friend*

రీచిలో మీ శుభ కవలిక నేను కనిపెట్టాను. ప్రియురాలి దగ్గర ప్రేమికుడూ, దేవుని దగ్గర భక్తుడూ అహంకార రహితమైన హృదయంతో వెళ్లాలి. అప్పుడే వారి వాంఛలు ఫలిస్తాయి. రఘు చీకట్లో దారితప్పిన గొర్రెపిల్ల మాదిరి అమాయకుడు. అతనికి నేను చాలా అవసరం. మీతో నేను చెయ్యి కలిపినా, కలపకపోయినా ఒకటేఅన్న, విశాల భావంతో మీరు జీవితాన్ని గడపగలరనే నమ్మకం నాకుంది. రఘుని తల్లినై నేనే సాకుకోగలను. మా యిద్దరినీ నిష్కల్మష హృదయంతో ఆశీర్వదించండి. మా జీవితాల్లో ఆత్మీయుడిలా మీరు ఎల్లప్పుడూ నిలిచి పోవాలనే కోర్కెతో—నీరజ.

చూసుకుని, వేడి నిట్టూర్పు విడిచాడు. లోతు పాతులు తెలిసే నీరజ రఘు జీవిత సంరక్షణ నెత్తి నేసుకుంది. అతన్ని సుఖపెడుతుంది. అందుకు సందేహం లేదు. కాని తన జీవితం...

* * *

సాయంత్రం అయిదింటికి నీరజ గారింటికి వెళ్ళాడు. వరుసు వాకంలో రెండు గదుల్లో కొత్త కాపరం ఇద్దర్నీ చూశాడు. రఘు కలలో నడుస్తున్నట్టున్నాడు. అతని కళ్ళల్లో ఆరాధన మరీ లోతుగా వున్నట్టనిపించింది. ఆ రాత్రి నీరజచేతి భోజనం చేసిన తరువాత, ఆమె తొక్కినదారి సరి అయినదని మనస్ఫూర్తిగా అనిపించింది తనకి.



# నా సందేహము



శ్రీ బి. అప్పిరెడ్డి

సరసకవిత్వ యోజిత యశస్కర! వేదచయార్థతత్త్వవి
స్ఫురిత వచోవిలాస! గుణభూష! జగత్త్రిపూజ్య! యామినీ
వరకుల సుస్థితాత్మ! సురవందిత! సాత్యవతేయ! భక్తిత
త్పరతను మ్రొక్కి సంశయ నివారణకై నినుఁ గోరివేడెదన్.

నడువగ లేని దుస్థితి గనంబడు జానువు బాధ బాపుకో
నెడద దలంచి యుత్సుకత యేర్పడుమాటలతోడ గాలమున్
గడపగ, బల్కు దో డెవరుఁగానమి నిన్ను 'దమాష' గాగనే
నడుగగ బూనుకొంటి హృదయంబున దోచిన సందియంబులన్

ఎన్ని శతాబ్దము లాయెనో
యిన్నేళ్ల నీవు వెలసి యేపు సెడక నీ
వన్నెపలుకె పరమంబై
సన్నుతి గను నేటికిని, విచార నిధానా!

పంచమ వేదమంచు బుధవర్యులు సన్నుతిసేయు భారతం
బెంచ భవత్కృతంబె కద! యెల్లరునిన్ను విధాత గన్నని
ష్ణ్వంచిత మూర్తిగా దలతురయ్య! భవత్కృత కావ్యరాజమున్
గాంచి, మహాగమంబెయని కాంతుము తృప్తిని మానసంబులన్.

మనుమల కెల్ల దాతల సమక్షమునన్ బుయిలోట లేమియున్
జనవధికంబు కల్గుటయు సాజము; కావున జంకు కొంకు నె
మ్మనమున లేక నిన్ను జనమాన్య 'ఖులాస' గ వేడు చుంటి నే
ననచిన కూర్మి, గోపన గుణంబును దూరము సేసి చెప్పవే!

నీ పరమోత్తమంపు గృతి నేను విమర్శన జేయనౌనె! తా
తా! పరిహాస మంచు నెడదన్ రుష బూనగ బోకు; కౌరవుల్
పాపులటంచు బాండవు లపారగుణాకరులంచు జాటుటల్
నీపనియేమొ! పాండవులు నిన్ దమ చాటుకవీంద్రు జేయుటన్.

శంతనున కయి భవదీయ జనని నడుగ
దాశ విభుని సన్నిధికి శాంతనవు డరుగ,
నతడు పలికిన ధర్మ వాక్యములు కొన్ని
విస్మరించితె! యటులైన వినుతు వినుము

"జ్యేష్ఠసుతుడు నీవుండంగ క్షితి పతిత్వ
మంద నా కొమరిత బిడ్డ డర్హుడగునె?
రాజ్యదూర దౌహిత్ర సంప్రాప్తి నిచ్చఁ
దలప" నని యనియెనుగదా దాశరాజు!

"అయిన రాజ్య పరిత్యాగనియతి గొందు"
నన్న గాంగేయు పలుకుల కలరి, యాత
"డనఘ! నీ తరువాత నీ తనయులైన
గోరకుందురె రాజ్యంబు ధీరులగుచు?"

అనుచు మూడు తరంబుల కవల బుట్టు
వందు వారికి గూడ రాజ్యంబు హక్కు
గలదు జ్యేష్ఠ సంతతియైన కతన ననుచు
బలుక జేసితి వది కౌరవులకు లేదె?

అగ్రజుని సంతు ధార్త రాష్ట్రిను లుండ
నవరజు కుమారులైన పాండవులు రాజ్య
మును మదిఁ గోరు టక్రమంబనుచు నొక్క
యక్షరంబైన వ్రాసితే యనఘ చరిత!

మూడేండ్ల కొకతూరి మునుకొనియే తెంచు
శాస్త్ర సమ్మతమయి చాంద్రమాన
హాయనంబున నొక్క యధికమాసం, బది
తద్వత్స రాంతర్గతం బెయగుట
వత్సర గణికులెవ్వరు దాని ప్రత్యేక
విధిని లెక్కింపరు; విరటు ప్రోల
గోగ్రహణమునాడు గురు కృపాదులసమ్మ
ఖమున దద్విపరీత గణన జరిగె

పాండవుల ప్రవాసంబది పదియు మూడు
వత్సరములెకా? నూటయేబదియు నాఱు
మాసములు కావుగద? యెట్లు మాన్యుడైన
శాంతనవు చేత లెక్కింప జలిపినావు?

నీ ప్రాతల్స విమర్శదృష్టి గనగా నిక్కంబు గాంగేయుడున్
నీవున్ గృష్ణుడు ద్రోణముఖ్యులు గడున్ నీ చత్వమున్ బూనిచే
తోపీధిన్ గపటం బెరుంగని ప్రభున్ ధుర్యోధనున్ గన్న నా
యాపై కల్యల జేసి కూల్చినటు లూహన్ జెందగా నయ్యెదున్.

నీయురు వాక్ప్రపంచిత విస్ఫీతిని గాదనలేక భూప్రజల్
న్యాయమటంచు నాకొనెదరందఱు నిద్ధి, యసైన గొందఱ
న్యాయమటంచు గూడ దెగనాడెదరే నొకడందు నీయభి
ప్రాయ మెఱుంగ వేడితి గృపన్ సరియైన జవాబు నీయవే.

అయ్యరో! నీవు వాస్తవికమైనది వ్రాయగలేదా! లేకయే
నొయ్యన ద్వత్స మాహిత పదోర్జిత భావమెఱుంగ లేకిటుల్
కుయ్యిడుచున్నవాడనో! యకుంఠిత ధీ ప్రతిభావిశేష! నీ
తియ్యని వాక్కులన్ దెలిపి తీర్పుము నీకిదె నా నమస్కృతుల్.



# కుక్కుటేశ్వరము

(రేషన్ రోజుల కథ)



శ్రీ చాగంటి సోమయాజులు

ఒక్క చిక్కిన ముసలమ్మ అస్థిపంజరం కట్టె పురుగులాగ ఊగిసలాడ్డం మొదలుపెట్టింది. పత్తి బొగ్గలాటి కళ్లెత్తి చూసింది. ఆ కళ్లకి చత్వారం లేదు. మధ్యకాలంలో వచ్చిన చత్వారం మధ్యకాలంలోనే పోయింది. ముసలమ్మ చూసీ చూడ్డమే పోల్చింది. ఒక్క నిట్టూర్పు విడిచి ఈశ్వరుణ్ణి తలచుకుని మనస్సు కట్టుదిట్టం చేసుకొంది.

"ఎవరివి నాయనా నువ్వు?" అని, తనే, కాస్త బంధుత్వం కలుపుతూ ప్రశ్నించింది.

"మనం మనం పాతవాళ్ళమే. మళ్ళా వచ్చా ముసలమ్మా?" అన్నాడు, ఎదురుగుండా ఉన్న ఉద్యోగస్థుడు. ఏమిటి సాధనం శ్రీమన్నారాయణమూర్తీ అని దేవుణ్ణి సంబోధించుకుంది. కుక్కుటేశ్వరుడి ఆజ్ఞలేనిదీ కుక్కయినా మొరగదు అని ధైర్యం చెప్పుకుంది.

"లే" అని గద్దించాడు ఉద్యోగస్థుడు. ముసలమ్మ లేస్తే నేరమే. లేవకండానే వాణ్ణి సాధించాలి. లేవడానికి కాళ్ళలో సత్తువ వాస్తవంగానే తప్పిపోయింది. ముసలమ్మ ముసుగు సవరించుకొంది. పైటచెరగు తీసి వొళ్ళంతా కప్పుకుంది.

"నన్నెందుకు నాయనా లేవమంటున్నావు? టిక్కట్టు కొనుక్కున్నాను" అని అమాయకురాలి లాగ మొహం పెట్టింది. మొల్లో చెంగుకొస తీసి నెయ్యిముల్లలో వోముడిని విప్పుతున్నాది.

"పీటముడి ఊడిరాకండా ఉంది" అన్నది.

"రైలు ఆగనీ చూద్దాం తాపీగా" అని ఉద్యోగి ఎదురుగా బెంచీమీద బైఠాయించాడు. జేబులోంచి కేప్‌స్టను సిగరెట్టుపెట్టె పైకి తీశాడు. తాపీగా సిగరెట్టుతీసి ముట్టించాడు. అధికార అహంకారంతో రైల్లో ప్రయాణికులందరివైపు ఒకసారి చూశాడు.

ముసలమ్మ కొంగుముడి మరి విప్పలేదు. ఇహ నెందుకు? రైలు టిక్కట్టు! ఆ అంగుళన్నర అట్టముక్క చేతిలో ఉంటే ఎక్కడికైనా పోవొచ్చు! అదంటూ ఉంటే తెల్లారేసరికి శ్రీజగన్నాథం పోయి స్వామివారిని ధూళిదర్శనం చేసుకోవొచ్చు.

రాత్రిపదకొండు కాకుండానే బరంపురంలో దిగి కూతుర్నీ, పిల్లల్నీ, అల్లుణ్ణీ చూసుకోవొచ్చు! దానికి గతిలేకే ముసలమ్మ ఎనిమిదేళ్లయి కూతుర్నీ పిల్లల్నీ చూడలేకపోతున్నాది!

కూతురి పిల్లలు, తానెరిగిన ముగ్గురూ, కళ్లకి కడుతున్నారు. ఎనిమిదేళ్లక్రితం కూతురికి మూడో పురుడు పొయ్యడానికి ముసలమ్మ బరంపురం వెళ్లింది. మూడో పురుడు పుట్టింట పనికిరాదని కొడుకు చెల్లెల్ని తీసుకొచ్చాసుకొన్నాడు. తరవాత కొడుకుని అనీ ప్రయోజనంలేని రోజులు వచ్చాయి. ఎనిమిదేళ్లయి కాలం పక్కలాగ మండిపోతున్నాది. అందులోకి నాలుగేళ్లయి మరీ అధ్వాన్నమై పోయింది.

తాను పురుడు పోసిన చంటిగుడ్డుకి ఇప్పుడు ఎనిమిదేళ్లు! ఆ తరవాత కూతురు మరి ఐదుగురు పిల్లల్ని కనుక్కుంది! బరంపురానికి రానూపోనూ టిక్కట్టుకి కాస్తా కూస్తా అవుతుందా? టిక్కట్టు లేకండా దగ్గర ప్రయాణాలే ప్రమాదకరం, ఇంక బరంపురం ఎక్కడ వెళ్లగలదు! ముసలమ్మ చెవుల్లో కేరు కేరు మని చంటిగుడ్డు ఏడుపు వినబడుతున్నాది.

గోదావరిమండలం అంతర్ధానమైపోతున్నాది. పొలాలు సస్యశ్యామలంగా ఉన్నాయి. ఈన సిద్ధంగాఉన్న వరిచేలు పరుగులు పెడుతున్నవి. పొలాలనిండా నీటితో నింపి ఏతేరుతల్లి పరిపాలిస్తున్నాది. తర తరాల బట్టి పితృదేవతలంతా ముసలమ్మకి అన్ని వంకలవారూ దరిద్రాన్ని పంచి పెట్టుకొచ్చారుకాని కాస్తంత మట్టి బెడ్డ సంపాదించి పెట్టలేదు.

రైలు వాయువేగ మనోవేగములతో పరుగెడుతున్నాది. పడమట మూలనుంచి కొండలు హారాలు హారాలుగా పరిగెట్టుకువస్తున్నాయి. మేఘాలు మందలు మందలుగా వచ్చి చిక్కబడుతున్నాయి.

ఎదురుగా ఖరోదాలాగ ఉద్యోగి కూచున్నాడు. ఎదురుగా ఉన్న ఉద్యోగి అక్కడే ఉన్నాడా భ్రాంతా? చల్లటిగాలి ప్రాణానికి హాయిగా వీస్తున్నాది.

"నువ్వెవరబ్బాయివి నాయనా?" అని ముసలమ్మ ఉద్యోగిని అడిగింది. వాడు అతి దగ్గరబంధువు అయిపోకూడదూ?

"మా అమ్మకొడుకునే!" అని వెటకారంగా నవ్వేడు.

"మీరంతా అమ్మకొడుకులే కాని..." అని లోలోపల గొణుక్కుంటూ పళ్లు కొరుక్కుంది. ముసలమ్మకి ఒక్క పన్ను ఊడలేదు!

"పళ్లు కొరుకుతున్నావేం?" అని హుంకరించాడు.

"వోణుకు సంకటం. పళ్లు కొట్టుకొంటాయి. మరేం విపప్పళ్ళు కావులే" అన్నాది.

ఎదురుగా ఉన్నది రజ్జువుకాదు సర్పమే. పగపట్టిన నాగుపాము. ముసలమ్మని జ్ఞాపకం పెట్టుకునే ఉన్నాడు ఉద్యోగి. వాడికి గతనెల్లో పట్టుబడ్డాది. అప్పుడు సగం అన్యాయం, సగం న్యాయం చేశాడు. డబ్బుమాత్రం పన్నెండురూపాయలు గోదావరిపాలు అయింది.

పన్నెండు రూపాయిలంటే మాటలా? ఆ పన్నెండు రూపాయిలూ ముప్పైయ్యారు రూపాయిల కింద లెఖ్ఖ. ఏడేళ్ళయి వాళ్ళింట్లో రాత్రిళ్లు భోజనాలు లేవు. నిత్యం శనివారమే. పిల్లలకీ పెద్దలకీ కూడా శనివారమే. ఈ నష్టంనుంచి మూడేసిరోజుల కొక ఏకాదశి కూడా ఈనెలలో చేశారు. ఆ పుణ్యమంతా ఆ ఉద్యోగే మూటకట్టుకున్నాడు. గతనెల కొంపలో అంతా మంగలంలో పేలాల్లాగ పేలిపోయారు. ఇవాళ మళ్ళా భీష్మించుకు వచ్చాడు. ఈమాటు అందర్నీ మహామ్మాయి చేస్తాడు.

ఉద్యోగి సిగరెట్టుమీద సిగరెట్టు తీసి ఒకదానికొకటి అంటించుకొని ఊదేస్తున్నాడు. రొజ్జగాలికి సిగరెట్టు అంటించీ అంటించడంలో సగానికి రాజుకుపోతున్నాది.

"కోపం తెచ్చుకోక ఒక్కమాట చెపుతాను వింటావా?" అన్నాది.

"మా కెందుకండీ కోపం. మా ద్యూటీ మేము చేస్తాము" అని సౌమ్యంగా జవాబు చెప్పేడు.

"నన్ను పట్టుకొంటే నీకేం కలిసివస్తుంది?"

"ప్రభుత్వానికి కలిసివస్తుంది. అందుకే మాకు జీతం ఇస్తూన్నది."

"కుడీ ఏమీ లేదా?"

"ఉన్నాయి. మీరు చేస్తున్నపని తప్పు కాదా?"

"మావంటివాళ్లు చేసినా తప్పే?"

"తప్పే. ఇక్కడ ప్రభుత్వం ఉంది. నేరస్థులు శిక్షించబడతారు" అన్నాడు. ఇక్కడ ప్రభుత్వం ఉంది. ప్రభుత్వశాసనం ప్రకారం ఇక్కడ బండి చక్రాలు నడవాలి! ముసలమ్మ ప్రభుత్వాన్ని కూలద్రోసి ధిక్కరిస్తున్నాది!

"ఎందుకమ్మా గొడవ. ఆయన కేదో పారెయ్యరాదూ పోతాడు" అని ఒక ప్రయాణీకుడు అఖరికి వినివిని కలగజేసుకొన్నాడు. ముసలమ్మ వొళ్లు మరిచిపోయింది.

"నాదగ్గరొక్కం చిల్లిగవ్వ లేదు. ఉన్నదంతా వాళ్ల ఎదాన కొట్టివచ్చాను. గడ్డితినే పసువులంతా అధికారులైనాక వాళ్లనోట్లో ఇంతగడ్డి కుక్కితే ఊరుకుంటారని ఎంత ముసలమ్మనయినా ఎరుగుదును. నా దగ్గరఉంటే చావండి" అన్నాది ముసలమ్మ.

"నోటికొచ్చినట్టు మాట్లాడకండి. నేనెవర్నో

తెలుసా ?" అన్నాడు ఉద్యోగి. వ్యవహారం శృతి మించిపోతున్నాది.

"ఊరుకోవమ్మా నువ్వు గడ్డితింటూ అందరికీ గడ్డి పెడతానంటావు!" అన్నాడు, ఇంకో ప్రయాణీకుడు.

"ఔను నేనే గడ్డితింటున్నాను. వీరంతా ప్రభువులు అయినాక ప్రజలు గడ్డి తినక అన్నం ఎక్కడ తింటారు? గడ్డికూడా కాదు బాయనా మన్నే తింటున్నాము. కడుపునిండా తినాలంటే మన్నొక్కటే ఉంది" అన్నాది ముసలమ్మ.

"మన్ను మాత్రం మనదిటమ్మా? అదీ తేరగా లేదు. మట్టిపెళ్లా మనదికాదు. కామందులు ఊరుకుంటారా? మట్టితీసినా దొంగతనమే" అన్నాడొక ప్రయాణీకుడు.

"నీకడుపు చల్లగా నిజం చెప్పేవు నాయనా" అన్నాది ముసలమ్మ.

"ముసలమ్మా ఆయనకో రూపాయి సారెయ్యి" అన్నాడు మొదటి ప్రయాణీకుడు.

"అవకతవక మాటలాడవద్దు" అన్నాడు ఉద్యోగి.

"ఎందుకయ్యా అంత పట్టుదల. మూలనున్న ముసలమ్మని పట్టుకున్నావు ఎలాగైతే నేమి!" అన్నాడు ప్రయాణీకుడు.

"మీమీదా కేసు పెట్టమన్నారా ?"

"ఎందుకయ్యా !"

"ఎందుకా నాడ్యూటీ చేసుకోకండా అడ్డం వచ్చినందుకు. తెలిసిందా?" అని మరో సిగరెట్టు తీసి సిగరెట్టుకే అంటించుకొంటున్నాడు.

నీలాటివాళ్లని నా తలమీద ఎన్ని వెంట్రుకలున్నాయో అంతమందిని చూశాను. శ్రీరంగ నీతులు చెప్పకు. చూస్తూ ఉంటే కేప్స్టను సిగరెట్లు అలాగ ఊదేస్తున్నావు! నువ్వు నీ జీతం మీదే బతుకుతున్నావా?" అని ఎర్రగా చూశాడు ప్రయాణీకుడు. ఉద్యోగికి మొహంమీద కొట్టినట్టు జుమాయించింది.

"సరే సరే చెపతాను" అని లేచి తలుపుదగ్గరకి పోయి తల అవతలకి పెట్టేసుకున్నాడు. మేఘాలు గుంపులుగా గుమిగూడుతున్నాయి. కొండలు పరిగెట్టుకొంటూ దగ్గర కొస్తున్నాయి. సుఖమైనగాలి వీస్తున్నాది. ఉద్యోగివొళ్లు చల్లబడుతున్నా బుర్రలో రైళ్లు పరిగెడుతున్నాయి. ఎంతమాట అన్నాడు ప్రయాణీకుడు! ఇప్పుడంతా మొహంమీద అనేస్తున్నారు. ప్రజలు పొత్తిగా బరిదిగి పోతున్నారు. అధికారంలో ఉన్న ఎవడు నానే కాడు? మడికట్టుకు కూచుంటే మడిమాన్యాలు సంపాదించగలరా? చేతనైనవాడు చేతినిండా పుచ్చుకోవలసిందే.

ప్రయాణీకుడితో జట్టీ పెంచుకోడం ఉచితంగా వాడికి తోచలేదు. చాపకింద నీరులాగ తన పని తాను చేసుకోవాలి! రచ్చపడకూడదు. సిగరెట్టు మళ్లా కొసకొచ్చేసింది. మరో సిగరెట్టు తీసి ముట్టించడానికి ధైర్యం చాలిందికాదు. ప్రయాణీకుడిమాట వాణ్ణి పిరికిపందని చేసేసింది! అతనెవడో! అంత ధైర్యంగా చీవాట్లు పెట్టాడు! అటువంటివాళ్లతో జట్టీ ప్రమాదకరమౌతుంది. ఇంకో సిగరెట్టుకోసం నరాలు పీక్కుతింటున్నాయి. తీసి మళ్లా ముట్టించాడు. కాని సిగరెట్టు ప్రయాణీకుడికి కనబడకండా చేతిలో మూసుకుపట్టుకున్నాడు!

కొండలు, కొండలమీద మేఘాలు మనోజ్ఞంగా ఉన్నాయి. చుట్టూ పత్తి, మిరపపొలాలు తివాసుల్లాగ పరుచుకుని ఉన్నాయి. కొండలనిండా రంగులు తేలుతున్నాయి. ఆకాశమంతా ఊదారంగు వ్యాపించింది. ఉద్యోగి మనస్సులో ఛీతాహం పోయింది.

ఎదురుగుండా కొండలన్నీ వాడెరుగును. పిట్టలమాటు, పులిమాటు తను వెళ్లి చూసినవే. చేస్తున్నది చిన్న ఉద్యోగమైనా అనుభవిస్తున్నది దేవేంద్రభోగమే. ఐశ్వర్యం వొచ్చి మీదపడిపోతున్నాది. ఒహడు తిడతాడని, ప్రపంచం హర్షించదని పెట్టుకున్నంత అవివేకం లేదు. వెయ్యితాపులయినా ఒక బూరెముక్కకి సాటికాదని పూర్వుల మతం. ఎవరెన్ని శాపాలు పెట్టుకొన్నా తలుపులమ్మలోయకి షైరువంటిది అవుతుందా?

ఉద్యోగి పదిమంది మిత్రులతో కలిసి తలుపులమ్మలోయకి షైరువెళ్లేడు. అక్కడి ప్రకృతిరమణీయత వర్ణనాతీతం. ఎంత మండువేసవి అయినా శీత

లంగా ఉంటుంది. రాతిలోంచి సదా జల వస్తూ ఉంటుంది. సన్నని జలధార. అమృత సమానమైన జలము. అక్కడ హాయిగా బంగళాలు కట్టుకుని ఈ ధనికులంతా తమ తమ వేశ్యలతో కొంతకాలముండి ఎందుకు సుఖపడరు, అని ఉద్యోగికి ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది.

తలుపులమ్మలోయకి వెళ్లిన మిత్రులంతా అనుభవించడానికే వెళ్ళారు. వాళ్లు ఒంటరిగా వెళ్లలేదు. ఎరాపురం, పెద్దాపురం, కాకినాడ గ్రామాల నుంచి ఏరుకొని వెలయాళ్లని వెంటబెట్టుకు వెళ్లారు. మిఠాయిపొట్లాలు, పళ్లతట్టలు, పుల్లావు సామాను, మోసుకుపోయారు. వాళ్లకి వొక్కటే లోపం వచ్చింది. బర్గండీ వైన్ ప్రయత్నిస్తే దొరికింది కాదు. బ్రాండీమాత్రం కావలసినంత లభ్యమైంది.

ఉద్యోగం అంటూ ఉండబట్టి, అందులో వీలు ఉండబట్టి, తలుపులమ్మలోయలో, మరపుకి రాని రోజు సాధ్యమైంది. ఎంతమందో స్వప్నంలో కోరుకొనేది వాడికి జీవితంలోనే ఇంద్రధనుస్సు లాగ ప్రకాశిస్తున్నది.

నీలమేఘాలమధ్యని తెల్లగా రాజహంసలాగ మెరుస్తూ కనబడ్డాది అన్నవరం సత్యనారాయణ మూర్తి ఆలయం. ఉద్యోగి నోట్లో సిగరెట్టు తీసి పారేశాడు! రెండు చేతులూ తీసి కొండమీది దేవుడికి నమస్కారం చేశాడు. ఈ ఉద్యోగం వచ్చి, ఈనాటికి వచ్చినది లగాయతు ఏటా కొండ ఎక్కి సత్యనారాయణవ్రతం చేసుకొంటున్నాడు. లక్షలకి లక్షలు, వేలకి వేలు డబ్బు పోగుచేసుకొన్నవాళ్లంతా ఈమధ్య కొండ ఎక్కి తరచు వ్రతాలు చేస్తున్నారు. సత్యనారాయణమూర్తి వాళ్ళందరికీ బాగా దాఖలా ఇస్తున్నాడు.

"తలుపుక అడ్డంలే నాయనా దేముణ్ణి చూసుకొంటాను" అన్నాది ముసలమ్మ. ఉద్యోగి కిక్కురు మనకండా అడ్డంలేచిపోయాడు. బెంచీమీద కూచుని దేవాలయాన్ని చూస్తూ మనస్సంతా భగవదర్పితం చేసుకొంటున్నాడు ఉద్యోగి.

అన్నవరం రైలుస్టేషనులోంచి రైలు పోతున్నాది. ముసలమ్మ కొంగలాగ మెడ సాగదీసుకొని ఎగిరి ఎగిరి చూసింది. అన్నవరం స్టేషను కెదురుగా తుమ్మఅడివి ఉంది. ముసలమ్మకి కంటకాలతో సహా గుబురుకొన్న తుమ్మడొంకలు కనబడ్డాయి.

"నువ్వు కనబడవు. కంటకాలే కనబడతాయి. మాపక్క చూడవు. కొండెక్కి కూచున్నావు." అని ముసలమ్మ సత్యనారాయణతో చెప్పింది.

రైలుకి విరాళమెత్తింది. కొండలమధ్య మార్గం. చక్రాలమోతకి చెవులు చిల్లులు పడుతున్నాయి.

"భగవంతుడికీ దయలేదు; నరుడికీ దయలేదు" అన్నాది ముసలమ్మ.

"ఆ సత్యనారాయణమూర్తి సన్నిధానంలో చెపుతున్నాను. చిన్నవాడి వయినా నీకాళ్లు పట్టుకొంటాను. పాపం ఒడికట్టుకోకు. నా కొడుకు స్కూలు మేష్టరు. ఏభైరూపాయిలిస్తారు. వాడి కొరుగురు పిల్లలు. వాడి పీకమీదకి నేనొహత్తెనున్నాను. నన్ను పట్టుకొన్నావా ఈ నష్టం వాడికి తగులుతుంది. ఇంతమంది ఉసురూ పోసుకోకు." అని ముసలమ్మ చెప్పింది. ఉద్యోగికి తేళ్ళూ జెర్రులూ పాకినట్టుంది. ముసలమ్మ సత్యనారాయణ మూర్తి పేరు ఉచ్చరించకండా ఉంటే బాగుండేది. కరుకుగా ఉండడమే వాడి స్వభావము. స్వభావానికి విరుద్ధంగా ముసలమ్మ వ్యవహారం పరిణమించింది.

"ఇంకా ఎందుకయ్యా ముసలమ్మమీద పట్టిస్తావు. తునికూడా దగ్గరపడ్డాది. ఏదో తునితగువు చేసేయి" అన్నాడు ప్రయాణీకుడు.

"నేనువొదిలితే మిగతావాళ్లు వొదులుతారా?" అన్నాడు.

"అపాటి చెప్పలేవా?" అన్నాడు ప్రయాణీకుడు. రైలు రెండునిముషాలు కూతపెట్టింది. దాని పరుగులో మార్పువచ్చింది. తిరగబడేటట్టు అటూ ఇటూ వూగుతు పట్టాలు మారుతున్నాది. క్రమేణా వేగం తగ్గుతూ తుని ప్లాటుఫారముమీద ఆగింది.

ఎక్కేజనం దిగేజనం, తోడతొక్కిడి అయింది. బండీలోకి తోసుకుని మరో నలుగురు యమదూతలు ఎక్కారు.

"ముసలమ్మ మళ్లా వచ్చా" అని పలుకరించారు. దానికింద దవడ వెళ్లాడిపోయింది. నలుగురూ చుట్టబెట్టేశారు. ఉద్యోగి ముసలమ్మని వొదిలిపెట్టమని వాళ్లతో చెప్పలేదు! తానేదో లంచంతీసి

ఉంటాడని వాళ్లు భావిస్తారు. వొంకు అనుకుంటారు! ముసలమ్మకి అప్పచెప్పి వెళ్లిపోయాడు.

"ఏయ్ ముసలమ్మా ఒక్కసారి లేచినిలుచో" అన్నారు చుట్టువేసిన ఉద్యోగులు. ఇహ లాభం లేదు. కళ్ళు చీకట్లుకమ్మి చుట్టూ అయోమయం అయిపోయింది. కొత్తగా ఎక్కిన ప్రయాణీకులంతా ముసలమ్మచుట్టు దడిగట్టి నిలుచున్నారు.

"ముసలమ్మా ఈపని బాగుందా?" అని అడిగారు. ముసలమ్మ నోరు లేవలేదు.

"ఇది రెండవసారి కదూ?" అన్నారు.

"ఆరుగురు పిల్లలు—కడితేసిన ఏకైరాళ్ళు—తొమ్మండుగురం బతకాలి" అంటూ దవడలు ఆడించింది.

"మరో ఆరుగుర్ని కనుక్కోండి" అని వొకడు మహా వెటకారంగా నవ్వేడు.

"వొకసారి క్షమించారు. ఇహ క్షమించకండి. బతకడం నేరంగా ఉంది" అన్నాది ముసలమ్మ.

"తప్పుపనిచేస్తే నేరమంటారు" అన్నాడు ఉద్యోగి.

"ధర్మదేవతకి ఉన్న కాళ్లు విరగ్గొట్టేశారు. ధర్మపన్నాలు చెపుతున్నారు" అన్నాది ముసలమ్మ.

"ధర్మపన్నాలు వల్లెవేయకలే" అన్నాడు ఒక ఉద్యోగి. ముసలమ్మ లేవలేదు.

"లేస్తావా లేవగొట్టమన్నావా?" అని అశనిపాతంలాగ అరిచాడు వకడు. ఇహ ముసలమ్మ కూర్చోలేకపోయింది. అడుగునుంచి ఏదో శక్తి పైకి లేవదీసింది. లేచి నిలబడ్డాది. ముసలమ్మ నేరాన్ని కింద వేసుకొని సుఖంగా కూచుంది!

"నాది కాదను" అని వకరు పక్కనుంచి సలహా ఇచ్చారు.

"వొదిలిపెట్టే" అని మరొకరు సలహా ఇచ్చారు.

"వొదిలేసి ఏ రోట్లో పడను?" అని ముసలమ్మ వాళ్ళని ప్రశ్నించింది.

"దాంట్లో చిక్కు నీకు తెలియటంలేదు" అని ఇంకొకారు చెప్పేరు.

"నేను దొంగతనం చెయ్యలేదు. నా కొడుకు చెమటోడ్చి గణించుకొన్న డబ్బుతో కొనుక్కున్నాను" అని ముసలమ్మ ఏడుపుమొహం పెట్టింది.

"ఈ సాకులు నాకు చెప్పకు వదవ్వమ్మా" అన్నాడు ఉద్యోగి.

ముసలమ్మ కడవలతో కన్నీళ్ళు కారుస్తూ నిలబడ్డాది.

"సంగనాచిలాగ ఏడవక లే" అన్నాడు ఉద్యోగి.

"కడుపునిండా పెట్టరు. ఉన్నచోటికి తెల్లి కొనుక్కోనివ్వరు. ఈనాటికి బియ్యం కొనుక్కోవటం నేరమైందా?" అని ముసలమ్మ రెండు కాళ్ళ మధ్య నున్న ఐదుకుంచాల బియ్యపుమూటని సూటా కులవిూనికి ఎత్తుకుంది.

"శ్రీరామచంద్రులవారు పరిపాలిస్తున్నారు తల్లీ ఇంట్లో బియ్యముంటే నేరం! కొనుక్కొంటే నేరం. అమ్మితే నేరం. సరిపడేలాగ తింటే నేరం!" అన్నాది పక్కనున్న గవరల వర్తకురాలు.

"ఎందుకమ్మా దెబ్బచ్చి వ్యాజ్యం కొనుక్కుంటావు? వొదిలీ" అన్నాడు పక్కనున్న హితైషి.

"వొదిలీ వొదిలీ అని సుష్టి సలహా ఇవ్వకపోతే వాళ్ళనోట్లో గడ్డిపెట్టకూడదూ? వొదిలేసి పిల్లలని పస్తుపెట్టనా? మీరంతా మనుషులే?" అని ధీకరంగా ముసలమ్మ అందర్నీ అడిగింది.

"ఓహో అలాగా! రోజూ పట్టికెళ్ళి బ్లాకు మార్కెట్టులో అమ్ముకోవడం అనుకొన్నావా? పద పదా" అన్నాడు ఉద్యోగి.

"పదండి భడవల్లారా, నే నే దొంగమార్కెట్టులో అమ్ముకొని మేడలు కడుతున్నాను. నాకు ఉరిశిక్షకు తక్కువ వెయ్యకండి. నా పొగ కుక్కుటేశ్వరుడికి ధూపంవెయ్యండి" అంటూ ముసలమ్మ బియ్యపుమూటని బుజాని కెత్తుకుని వాళ్ళవెంట నడిచింది.

గోదావరి మండలం సరిహద్దులు దాటించి, ప్రభుత్వపు శాసనాన్ని ధిక్కరించి, హద్దు తప్పి, ఐదేసి కుంచాలు చొప్పున బియ్యం తరుచు తరలించుకుపోతున్న ఒక ముద్దాయి పట్టుబడ్డది!

# అ మ ర జీ వి



శ్రీ సామవేదం జానకిరామశర్మ

౧

ఎవడు బ్రతికియేమి యీధర గడియించు ?
ఎవడు మరణ మందియేమి పొందు ?
ఎవని బ్రతుకు చావులేకమై విల సిల్లు
అతడ యెల్ల కాలమందు బ్రతుకు !

౨

ఎవని ధనమునందు నెల్లరకును భాగ
మెవని జ్ఞానమబ్బు నెల్లరకును,
ఎవని తనువు మనసు లెల్లరఁ గూర్చియా
నతఁడ యెల్ల కాలమందు బ్రతుకు !

౩

ఎవని సౌఖ్యమెన్న నెల్లర సౌఖ్యమ్మొ
ఎల్లజగము బాధ లెవరికౌను,
ఎవని యునికి లోక మెల్లర దనియించు
నతడ యెల్లకాలమందు బ్రతుకు !

౪

ఎవడు లోకవృత్తి మెఱిగి చరించును
ఎవని శత్రుషట్క మెదుర లేదు,
ఎవ డహింసచేత హింసను బరిమార్చు
నతడ యెల్ల కాలమందు బ్రతుకు !

౫

అన్ని మంచి గుణము లందిన పండ్లయి
ఎవనిలోన గృహము నేర్పరించు,
ఎవడు భారతాత్మ కెనలేని రూపమ్మొ
అతడ యెల్ల కాలమందు బ్రతుకు !



# మృచ్ఛకటికము



## శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

ప్రతి సంస్కృతకవి జీవితచరిత్ర మంధకార బంధురముగ నున్నది. అందులో మృచ్ఛకటిక నాటకకర్తచరిత్ర మధికాగమ్యగోచరము. ఈ నాటక ప్రస్తావనయందు కవిని గూర్చిన విషయ మితర నాటకములందువలె నా కవియే తెల్పుకొనక, మఱి యొకరు గూర్చి కలుపుటచే నసలీ నాటకమును శూద్రకుడు రచించెనా, లేక యితరులు రచించి యా రాజునకు గౌరవమును, కవికి ధనమును, నాటకమునకు ప్రాచీనాధిక్యములను గలుగుటకై శూద్రక రాజు పేరు నారోపించిరా యను సందేహము గల్గుచున్నది. నాటక ప్రస్తావనయందు, శివుని కృపచే దివ్యదృష్టి గలిగి, ఋగ్యజుర్వేదములు, జ్యోతిష గజశాస్త్రములను నేర్చి, యశ్వమేధయాగ మొనర్చి, శత సంవత్సర దశదినములు జీవించి, తనయంతే సమర్థుడైన కుమారుని సింహాసనమందుంచి, యగ్నిప్రవేశము చేసిన సుక్షత్రియుడు శూద్రక మహారాజే నాటకమునకు కర్తయని తెలుపబడినది. కాని యీరాజే దేశమును పాలించెనో, ఈని వంశమేదో, ఈని రాజధాని యెక్కడో తెలియరాదు. మఱియు నీరాజు కవియో, లేక కవిపోషకుడో సందేహాస్పదమే. ఈ కవి 'వీణావాసవదత్తము'ను మఱియొక నాటకమును, 'పద్మప్రాభృతక' మను నొక భాణమును గూడ రచించినట్లు దెలియుచున్నది. ఈ రాజునుగూర్చి 'అబుల్ ఫజల్' నుండి బాణుని వఱకు సూచించిరి. ఈతడు తొంబదియొక్క సంవత్సరములు జీవించెనని 'ఐని అక్బరీలో' తెలుపబడినది. కాళిదాసు పూర్వులైన సోమిల్ల రామిల కవిద్వయము శూద్రక కథను రచించిరని రాజశేఖరుడు నుడివెను. శూద్రక రాజు 'విదిశ' ను పరిపాలించెనని కాదంబరిలో బాణుడును, 'శోభావతి' నేలెనని కథా సరిత్సాగరమునను, 'వర్ధమానము'ను పాలించెనని భేతాళ పంచ వింశతియందును గలదు. ఈత[illegible] నియు, శాలివాహను[illegible] తెలుపును. బాణకవి హర్షచరిత్రమునందు నాయకునిచేసి తన ప్రభావమువలన శత్రువగు చకోరరాజైన చంద్రకేతువును మంత్రితో సహా చంపెనని కలదు. బ్రాహ్మణాశోక డీకనికి తన ప్రాణము ధారవోసి శతసంవత్సరములు జీవించునట్లు చేసెనని వేతాళపంచవింశతి యందు గలదు. దశకుమారచరిత్రమున నితడు బహుసాహసవంతుడని వర్ణింపబడెను. కల్హణకవి తన రాజతరంగిణిలో నితనిని విక్రమాదిత్యుని ప్రక్కనిలిపెను. స్కాందపురాణ కుమారికాఖండమున నితడు కలిలో 3290 సం, నకు సరియైన క్రీ. శ. 189 సం. విక్రమాదిత్యునకు 27 సం. ల పూర్వమున నాంధ్ర భృత్యరాజ్యమును స్థాపించినట్లు గలదు. ఈవి యన్నింటివలన నీ రాజు కల్పితపురుషుడే కాని చారిత్రక మానవుడు గాడేమో యనిపించును.

కాని ప్రాచీనాలంకారికులు కొందఱితని దను గ్రంథములలో సూచించిరి. క్రీ. శ. 7 వ శతాబ్దమువాడైన దండి తన కావ్యాదర్శమున మృచ్ఛకటికనుండి యుదాహరించెను. క్రీ. శ. 800 సం. ప్రాంతమువాడైన వామనుడు తన కావ్యాలంకార సూత్ర వృత్తిలో 'శూద్రకాదిరచితేషు ప్రబంధేషు' అని రచించినాడు. మమ్మటుడును తన కావ్యప్రకాశమునగూడ వీని నుదాహరించినాడు. కాన శూద్రకుడు కల్పిత పురుషుడుగా దనిపించును. . చివరకు తేలు విషయమిది. మౌర్యరాజ్యము క్రీ. పూ 185 సం. లో నస్తమింపగ, దానివెంటనే 'శుంగ, కణ్వ' రాజులు 112 సం. లు పరిపాలించిరి. కణ్వరాజుల మంత్రియైన 'శిముఖుడు' ను వాడే వంశపు రాజుల జయించి యాంధ్రభృత్యవంశరాజ్యమును క్రీ. పూ 73 సం. లో స్థాపించెను. ఈతడే వాయుపురాణమున 'సింధుక'

ఏవియు, మత్స్యపురాణమున 'సింధుకు' నియు, విష్ణుపురాణమున 'శిప్రకుడ' నియు, వ్యవహరింపబడి భాగవతమున నాంధ్రప్రథమ రాజు 'శూద్రకుడు' వృషలుడని మాత్రము తెల్పబడెను, కాని పేరు చెప్పబడలేదు. ఈ 'శిముఖుడే' శూద్రక మహారాజకవియని చరిత్ర పరిశోధకులు నిర్ణయించిరి. పురాణములందలి పేర్లు కాలక్రమమున 'శూద్రకుడు' ని మారుట శబ్దపరిణామము భాషాశాస్త్రానుకూలముగ నున్నదని సంతృప్తి చెందవచ్చును. కాన నీకవి క్రీ. పూ 73 వ సం. ప్రాంతమువాడని విశ్వసింపనగును. మృచ్ఛకటిక నాటకము నుత్తర దేశమందలి యాలంకారికులు దమ గ్రంథములలో విశేషముగ నుదాహరింపకుండుటయు, నాటకమున చండాలుర నివాసము వింధ్య పర్వతము గాక, సహ్యపర్వతము చేయుటయు, 'కర్ణాటకలహ' మని నాటకమున వాడబడుటయు, వ్యాకరణ విరుద్ధమైన దక్షిణదేశ శబ్దప్రయోగము లధికముగ నుండుటవలన, నాంధ్రభృత్యుల కొందరు పాత్రిమైన వివిధ ప్రాకృతభాషలు విశేషముగ నీ నాటకమున వాడబడుటవలనను శూద్రకకవి దక్షిణదేశము వాడని బలపఱచుచున్నవి.

మృచ్ఛకటికమున వసంతసేనను బ్రతికించిన బుద్ధసన్యాసియైన సంవాహకుడు చివరకు రాజుచే బౌద్ధవిహారముల కన్నింటికి కులపతిగా జేయబడుటచే నీ నాటక రచనాకాలమున బౌద్ధమతమునకు గౌరవాదరములు నశించలేదని తెలియుచున్నది. క్రీ. శ. ప్రథమ శతాబ్దమునుండి దేశమున బౌద్ధమతాదరము తగ్గిపోవుటచే నీ నాటకము క్రీ. శ. మొదటి శతాబ్దమునకు బూర్వమే రచింపబడియుండును. బ్రాహ్మణుడు శూద్రస్త్రీని వివాహమాడుట మనుధర్మశాస్త్రమున నిషిద్ధము కాకపోయినను కవికాలమున ననువర్తింపమిచే, నది ప్రాచీనకాలమునకు జెందిన యాచారమై, వసంతసేనా చారుదత్తులయు, మదనికా శర్విలకుల వివాహములుగల మృచ్ఛకటిక నాటక రచనా కాలము ప్రాచీనమైనదని యెంచవచ్చును. ఇక పలు విధములైన నాటకలక్షణ వ్యతిక్రమణము లీ ప్రకరణమందుండుటచే నిది నాటకలక్షణ గ్రంథములు బయలుదేరక పూర్వము రచింపబడినదని యూహింపవలయును. ఇందుపయోగింపబడిన ప్రాకృతభాషలు గూడ బహు ప్రాచీన లక్షణములు గలవియై, కాళిదాసుని ప్రాకృత ప్రయోగములకంటె పూర్వకాలమునకు జెందినట్లు తోచుచున్నవి. మఱియు నీ నాటకమున నుపయోగింపబడిన భాష బహు సులభమైనదై యలంకారమయమును, జటిల సమాసభూయిష్ఠమైన రచనగల మన్య కాలమునకు జెందినది కాకపోవుటచే నీ నాటకము ప్రాచీనమైనదని విశ్వసింపవచ్చును. ఈ నాటకమున రాజ్యవిప్లవకథయందలి యార్యక గోపాలపాలక నాయకులు భాసకవికృతులందు గూడ గలరు వీరి చరిత్రము మొదట క్రీ. పూ 400 సం. లకు జెందిన జైనహరివంశమున గలదు. చివరి తీర్థంకర మహావీరుని కాలమున క్రీ. పూ 600 సం. న పాలకుడు రాజ్యమునకు వచ్చినట్లందున్నది. కాన వీరి కథ సూచింపబడిన మృచ్ఛకటికనాటకము తత్సమీపకాలమున రచింపబడుట సమంజసము గాని, విశేషకాలము గతించినతర్వాత నట్టి యతిప్రాచీన విషయములు విస్మరింపబడును. పై కారణములనుబట్టి యీ నాటకము క్రీ. పూ మొదటి శతాబ్దమునకు జెంది, భాసుని తర్వాతను, కాళిదాసునకు బూర్వమును రచింపబడి యుండును.

## నాటక ప్రాశస్త్యము

సంస్కృత నాటక వాఙ్మయమున, భాసకవి తెల్లజుకు ప్రతిమా వాసవదత్తాదులందు పూర్వకథాకల్పనముగల విచిత్రమైన కూర్పునందును, కవికులగురువైన కాళిదాసు శాకుంతలమున మెఱుగు పెట్టబడిన కావ్యశిల్పమందును, మృదుమధుర శబ్దప్రయోగమందును, భవభూతి మహాకవి యుత్తరరామచరిత్రమున నగాధ భావప్రకటనమందును, గంభీర శబ్దరచనయందును, దక్షులు కాగ, శూద్రక మహాకవి యీ లక్షణములేవియు లేకయే మహా నాటక రచనాధురంధరుడై, భారతీయ పండితుల వలననే కాక, పాశ్చాత్య విమర్శకులచేగూడ విశేష గౌరవాదరములను బడసి, తన నాటకము నత్యుత్తమ సంస్కృతరూపకములలో నొకటిగ చేయగల్గెను. ఈతని మృచ్ఛకటికము పూర్వ విశిష్ట లక్షణోపేతమై, సంస్కృత నాటకవాఙ్మయమున నిట్టిది 'నభూతో నభవిష్యతి' యనిపించుకొనినది. కాళిదాసు శాకుంతలమును, భవభూతి యుత్తర రామచరిత్రమును భారతీయుల మనస్తత్త్వ సంప్రదాయ

ముల మాత్రమే ప్రసాదించును; కాని మృచ్ఛకటికము విశాల ప్రపంచమందలి జనుల మనస్తత్త్వ సంప్రదాయములను వ్యక్తీకరించును. కాళిదాసునియందలి "సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతః కరణప్రవృత్తయః" "ఆ పరితోషాద్విదుషాంనసాధు మన్యే ప్రయోగ విజ్ఞానం' వంటివిగాని, భవభూతియందలి 'గుణాః పూజాస్థానం గుణిషు, నచ వయః నచలింగం' వంటి విశ్వజనీన కవితాభావములుండకపోయినను, మృచ్ఛకటికము కథాగమనమందు పై నాటకములను మించును. ఈ నాటకమున 'అభిరుచి కరత్వ' మను గొప్ప లక్షణ ముండుటచే సకల దేశములందు విఖ్యాతి గణించినది. శూద్రకకవి సంస్కృత శైలి బహుసులభమై, తేట తెల్లముగా నుండి, కాళిదాస భవభూతుల శైలులవలె నాకర్షణీయమైనది కాకపోయినను, శూద్రకుడీ లోపమును నవనవోన్మేషమైన ప్రతిభ—యుత్పాద్య శక్తితో గప్పివేసినాడు. రమణీయమైన శైలీప్రాధాన్యము భారతీయకవులలో క్రమముగా నుత్పాద్యమైన సారస్వతో వృత్తిని క్షీణింపజేసినది.

అనేక రూపకములు చదువుటకు బహు రమణీయముగనుండినను, ప్రదర్శన యోగ్యముగ నుండవు. అట్లుగాక యీ నాటకమున పది యంకములున్నను పఠితలకుగాని, ప్రేక్షకులకుగాని యెంతమాత్రము విసుగు జనింపనీయకుండుటయేకాక బ్రహ్మానందము గలుగజేయును. మఱియు నిది శాకుంతల ముద్రారాక్షసాది నాటకములవలె పండిత రసజ్ఞులను మాత్రమె కాక, పండిత పామరులను అబాలగోపాలము సమానముగా నానందపెట్టగల నాటకరాజము. సామాన్యముగ ప్రతి నాటకమున వీరశృంగార రసములలో నొకదానిని ప్రధానముగజేసి, మిగిలిన రసములలంకార రక్షణముకొఱ కక్కడక్కడ గిలికింపబడును. కాని యీ నాటకమందు నవరసములు సమాన ప్రతిపత్తి నొందినవనియే చెప్పవచ్చును.

శూద్రకుని రమణీయమైన వివిధత్వముగల యుత్పాద్యశక్తి మఱెక్కడను కానము. నాటకము వివిధ మానవజీవిత తత్త్వ ప్రదిపాదన మనుమాట సత్యమేయగుచో నది మృచ్ఛకటికమున వ్యక్తీకరింపబడినట్లు మఱి యే నాటకమునను లేదు. ఇందలి పాత్రలు చైతన్యము గలిగి జీవకళతో రాజిల్లుచుండును, కాని సాంకేతికము లెన్నటికిగావు. సంస్కారియగు బ్రాహ్మణుని చరిత్రమునుండి జారచోర హంతకాదుల జీవితములవరకు నిందు బహుస్వభావసిద్ధముగ చిత్రింపబడినవి. ఈరీతిగ నిది ప్రకృతిదర్పణమై పాశ్చాత్య కవికులగురువగు షేక్స్పియరుని పరమోత్కృష్ట నాటకములతో పోటికి నిల్వదగినట్లున్నది. ఈ నాటకమందలి యితివృత్తము సామాన్యముగా రూపకములందుండు నితివృత్తమువలె నొక మహారాజొక రాజకుమారిని ప్రేమించుట మొదలగు శృంగారరస ప్రధాన విషయముగాక, యొక సామాన్య సంసారియొక్క జీవితము మాత్రము గలది. మఱియు నిందు నాయకుడు ప్రారంభమున నాయికను ప్రేమించుటకాక, నాయికయే మొదట నాయకుని సుగుణములచే నాకర్షింపబడి ప్రేమించును.

ఈ నాటకమున కవికాలపు సాంఘిక జీవిత చరిత్రము ప్రతిపాదింపబడుటయేకాక, యప్పటి రాజకీయ విప్లవపరిస్థితులు, నార్థిక పరిస్థితులుగూడ ప్రకటింపబడినవి. మఱియు నీ సాంఘిక రాజకీయ పరిస్థితులు రెండు నెడతెగని సామరస్యము గల్గునట్లు బహు విచిత్రముగ కూర్పబడినవి కాని, యతుకుల బొంతవలె నెంతమాత్రము గనపడవు. ఇట్టి కూర్పునందే యీకవి ప్రతిభ ప్రకటితమగుచున్నది. ఈ నాటకమాబాలగోపాల మానందింపజేసిన మఱియొక విశిష్టలక్షణమిందలి బహు విషయప్రతిపాదనము. మరియు నిందలి సంఘటనలకు సన్నివేశములకు చక్కని యిమిడిక, సామరస్యము గలిగి స్వభావసిద్ధముగానుండును. ఈ నాటకోత్కృష్టతకు ముఖ్య కారణము దీనియందంతటను వ్యాపించి, చక్కగ పోషింపబడి, కడుపుబ్బ నవ్వింపజేయు హాస్యరసము. ఇట్టి హాస్యరసపోషణ మింకే నాటకమునను గానరాదు. వీనితోబాటు నిశితమై, కళ్ళకు గట్టినట్లుగా నుండు ప్రవర్తనము, సంభాషణముగల పాత్రపోషణము. ఈ విషయములను క్రమముగ విపులీకరించి విచారించుచో నీ నాటకప్రాశస్త్యము స్పష్టపడును.

శూద్రక కవి సర్వవిధముల స్వాతంత్ర్య మవలంబించినాడు. కథావస్తు స్వీకరణమందును, వివిధ సన్నివేశముల వర్ణనములందును, నాయికానాయక గ్రహణమందు, పాత్రపోషణమందు సామాన్య నాటకములకంటె భిన్నమైన ప్రత్యేకత యిందు గలదు.

స్వభావ సిద్ధముగ నున్నవి. ఇదే యిందు గొప్ప విశేషము. ఇట్టి కూర్పే కవికి గల నాటకరచనాశిల్ప మందలి నేర్పును చాటును. ఇది బహు కష్టమును చాల యరుదుగూడ.

ఈ నాటకమున, వసంతసేనా చారుదత్తుల ప్రేమగాథయందు శృంగారరసమును, శకార విదూషక సభికుల వాక్య ప్రవర్తనలందు హాస్యరసమును, చారుదత్తుడు వధ్యస్థానమునకు గొనిపోబడు నపుడును, వసంతసేన వధయందును, చారుదత్తుని దారిద్ర్యభావనయందు కరుణారసమును, వసంతసేన శకారాదులచే తరుమబడునపుడును, వసంతసేన గజము వీధులలో విజృంభించినపుడును, శర్విలకుడు దొంగతనము చేయునపుడు, నార్యకుడు పాలిపోవునపుడు, జీర్ణోద్యానమున వసంతసేన శకట విపర్యాస ఫలమున చారుదత్తుని బదులు శకారుని గాంచినపుడు, సంవాహకుడు జూదరులచే దరుమబడినపుడు భయానకరసమును పోషింపబడినవి. దర్దుర మాథురికులయు, వీరక చందనకులయు కలహములందును, పాలక మహారాజ పరాజయ వృత్తాంతసూచనయందు వీరరౌద్రరసములును, చారుదత్తుని వధ్యస్థాన శ్మశాన వాటిక వర్ణనమున భీభత్సరసమును, శకట విపర్యాస సన్నివేశమునను, వసంతసేన పునర్జీవితయైనపుడును, నామె విచిత్రసౌధవర్ణనమున నద్భుతరసమును, నిర్వికార చిత్తులగు వసంతసేనా చారుదత్తుల మరణావస్థలందు శాంతరసమును చక్కగ పోషింపబడినవి. ఈ రసములన్నియు సముచిత సన్నివేశములందు సమంజసముగ సంవప్నపద్ధతితో సమకూర్పబడినవి కాని యతుకుల బొంతవలె నుండవు.

నవరసము లీ నాటకమున తగురీతి ప్రతిపాదింపబడుటచే సుమారు ముప్పది పాత్ర లున్నయిందుట కవకాశముగల్గి, బహు విషయములతో నిండియున్నది. రసములన్నియు పాత్రలకు దగినట్లనేక సన్నివేశము లేర్పడియున్నవి. ఇందు జారచోర హంతక సభికులు వత్తురు. గాన చిత్రలేఖనాది లలితకళావిషయములును, న్యాయసభ, రాజభవనములు, ఉద్యానవనములు, ప్రాతకోటలు, భిక్షుసేవాశ్రమములు, పేదయిళ్లు, వాన, యుఱుములు రావణము, డప్పులు బాదుట, కన్నము వేయుట, మేడమీదనుండి దుముకుట, సంకెళ్ళు త్రెంచుకొనుట, రాజభటులు, బౌద్ధభిక్షువులు, బండ్లు, ఏనుగులు, రాజ్యము తలక్రిందగుట, ధనవంతులు దరిద్రులగుట, దరిద్రులు ధనవంతులగుట, విదూషకుని యావులింతలు, మొదలైనవన్నియు బహు చిత్ర విచిత్రములుగ ప్రవేశపెట్టబడినవి.

మఱియు నిందలి ప్రతి పాత్రయు మిశ్రలక్షణములు గల్గి సహజ బాహుళ్యముతో నొప్పుచున్నవి గాని ప్రత్యేక లక్షణోపేతములు గావు. ఇట్టి మిశ్ర విషయములతో గూడియుండుటచేతనే యీ దృశ్యకావ్యము హాస్యరస ప్రధానమైన 'ఫార్సు' వలెను, దుఃఖమయమైన విషాదనాటకము వలెను, శృంగారరసమయమై యిష్టమగు సంతోషదాయకరూపకముగను గూడ పరిణమించినది. ఇట్టి యపూర్వవిషయములతో నాటకమును సృష్టించుటచేతనే యాలంకారికుల ప్రకరణ లక్షణముల ననుసరించుటయు, కవి కల్పనాశక్తి ననేకవిధముల చాటుచున్నది. మాలతీమాధవమందు గాని, మల్లికామారుత ప్రకరణమందు గాని యిట్టి యద్భుత కల్పనాశక్తి గానరాదు.

## కల్పనా వైచిత్ర్యము

ఈ నాటకమున నాధికారికేతి వృత్తము వసంతసేనా చారుదత్తుల ప్రణయవృత్తాంతమైనను సంవాహకుడు, శర్విలకుడు, విటుడు, చేటుడు, ఆర్యకుడు, చందనకుడు, మొదలైనవారు నాయికానాయకులకు సంబంధించినవారుగారు. వీరి విషయములు ప్రధానకథకు సంబంధించినవి గాని, దానికి సహాయపడుటకుగాని, విరోధించుటకు గాని యుద్దేశించినవి కావు. వీరందరు స్వకార్యములందు మగ్నులై వానిని నిర్వహించుకొనుచు, నప్రయత్నముగ, ననుద్దిష్టముగ నాధికారిక కథయందు కాకతాళీయన్యాయముగ సహాయులై, నాయకుని మహోత్కృష్టగుణములచే నాకృష్టమానసులై, నీచుడగు ప్రతినాయకుడైన శకారుని యందసహ్యభావము వహించి, తమ దుర్గుణములతో బాటు సద్గుణములను గూడ వెలార్చి యాధికారికకథను మంగళాంతముగ పరిణమింపజేయుటకు బూనుకొందురు. ఇట్లు ప్రాసంగిక వృత్తము నాధికారిక వృత్తమున ననుద్దిష్టముగ చేర్చినను నది యసంగతముగగాని, యతుకుల బొంతగా గాని లేదు. మొత్తముమీద చివరకీ రెండు నవినాభావ సంబంధముగలవియై, స్వభావసిద్ధములై,

సుపాంగములుగ పరిణమించి వీనినుండి యేస్వల్ప విషయములు లోపింపజేసినను చివరకు ప్రధానకథకు భంగము వచ్చునట్లు కూర్పబడినవి. సంవాహకుడు జూదరియై నికృష్టవర్తనుడైనను, వసంతసేన తిరిగి బ్రతుకుట కాతని సన్యాసము కారణమాయెను. శర్విలకుడు దొంగయై దుర్మార్గముగ ప్రవర్తించినను వాడార్యకుని రాజ్యప్రాప్తికి కారకుడయ్యెను. ఆర్యకుడు రాజభటుల దృష్టినుండి తప్పించుకొని పాఱిపోయి, చారుదత్తుని శకటమెక్కి యాతనిచే నాదరింపబడిచివరకు రాజైనపుడు కృతజ్ఞతతో చారుదత్తుని రక్షించుటయేకాక, వానికి కొంత రాజ్యముగూడ నిచ్చెను.

సామాన్యముగ శృంగారరసప్రధానమైన నాటకములందు నాయికా నాయకులుగాని, వీరరస ప్రధానమైన రూపకములందు నాయక ప్రతినాయకులుగాని యుందురు. కాని యీ నాటకమున వీర శృంగార రసములు సమాన ప్రవృత్తి వహించుటచేత ప్రణయ రాజకీయవృత్తములే యితివృత్తమున మిశ్రితములగుటచేత, ఈ నాటకమున నీ రెండు రసములకు వలయు, నాయికా నాయకులతో బాటు ప్రతినాయకుడుగూడ గావలసివచ్చెను. సామాన్యముగ వీరరౌద్ర రసములు శృంగార రసమునకు విరుద్ధముగ పరిగణింపబడినను, నీకథయందట్టి విరోధభావము లేక నాయికా నాయకుల ప్రణయము గాఢమైనదని నిరూపించుటకివి సహాయకారులై, వారి ప్రణయకథతో నెడతెగని సంబంధము గలవై, ప్రతినాయకద్వేషమువలన వీరి కల్యాణపరిణామమునకు గూడ దారితీయుచున్నవి.

## కథా సంధానము

భారతీయ నాటకకర్తలు దమ నాటకముల ధీరనాయకుల యితివృత్తమును గ్రహించి వారిని కష్ట పరంపరలో వేగించి, చివరకు ధీరత్వముచే వారు కంటకములను దాటి వారి యుత్కృష్టత బ్రకటించి యాప్తితార్థముల బొందునట్లుగా ప్రతిపాదించుదురు. ఇందలి యాధికారికవృత్తము సామాన్యముగా నాయికా నాయకభూయిష్ఠమై, ప్రాసంగిక గత భిన్నవ్యక్తులాధికారిక వృత్త పరిణామమునకు సాయపడుదురు. మృచ్ఛకటిక నాటకమున వసంతసేనా చారుదత్తుల ప్రణయవృత్తాంత మాధికారికము. వీరి శాశ్వతసమాగమమునకు శకారుని కృత్రిమ మాటంకపఱచును. శకారుడు, సంవాహకుడు, నార్యకుడు, విటుడు మొదలైనవారల చరిత్రములు కథాసరణిలోని ప్రాసంగికవృత్తములు.

వసంతసేనా చారుదత్తుల పరస్పరానురాగము కేవలము కామప్రధానమైనది కాక, పరస్పర సుగుణాకర్షణ ప్రధానమైనది. వసంతసేన ప్రారంభమున కామదేవాలయమున చారుదత్తుని జూచినపుడామె కనురాగ మంకురించినది. ఆతని గుణములను విని యామె మఱియు నెక్కువ బద్ధానురాగయైనది. అందుచేతనే శకారుడు తన్ను బలాత్కరించెనని మైత్రేయుడు చారుదత్తునితో దెల్పగనే 'బలాత్కరింపబడి' యను నక్షరములే తన్ను బ్రతికించుచున్నవని యనుకొనుట, చారుదత్తు డన్యాయమును సహింపడని యామె గ్రహించినది. పర్యాప్త జాజిపూవుల సువాసనను స్ఫురించు నాతని యుత్తరీయము నాఘ్రాణించి, మురిసిపోయి, తాను కప్పుకొని, పారవశ్యము చెంది, 'యీతని యౌవన మింకను నుదాసీనముగా లేదని' మెచ్చుకొనుట, వీని సుగుణములను గ్రహించియే. సువర్ణభాండము నీతనియొద్ద దాచుట వలన, వీరి ప్రణయవృత్తాంతమునకు తన్మూలమున నాటకమునకు ముఖసంధి యేర్పడుచున్నది.

చారుదత్త సుగుణానురక్తయైన వసంతసేన గౌరవాదరములు చోరాపహృత సువర్ణభాండము వలన మందగించునేమోయని నాయకుడు భయపడి యాలోపమును దీర్చుటకై దానికంటె నెక్కువ విలువగల రత్నహారమును వసంతసేనకు బంపుచు, తా నా సువర్ణభాండమును ద్యూతమున నోడిపోయితినని యసత్యమాడుటకు, సత్యమంతయు నెఱిగిన వసంతసేన మఱియు నధికముగ నతని గుణములను మెచ్చుకొని విశేషముగ ప్రేమించుటవలన ప్రతిముఖసంధి యేర్పడుచున్నది. ఏ యసత్యమాడి చారుదత్తుడు వసంతసేనకు సువర్ణభాండమునకు బదులుగా రత్నహారమును బంపెనో, యట్టి యసత్యమునే చెప్పి వసంతసేన చారుదత్తునకు రత్నహారమునకు బదులుగా సువర్ణభాండమును పంపి చారుదత్తుని మెప్పించి, యాతని యౌదార్యమును గుర్తించి యాతనిని కామిం

చును. వీరి పరస్పరగుణాకర్షణము పంచమాంకమున నుచ్చదశకు వచ్చి, వీరి యనురాగము సిద్ధించుటవలన గర్భసంధి యేర్పడుచున్నది. ఇక షష్ఠాంకమునశకట విపర్యాయమున వసంతసేనా చారుదత్తుల ప్రణయ చరిత్రకు భంగముగల్గి, శకారుని దుష్టప్రవర్తనము వలన విధి ప్రతికూలమై విషాదాంతముగ పరిణమింప బోవుట యిందవమర్శసంధి గలుగుచున్నది. ఇం వసంకోచిత విషయమును శకటవిపర్యాయమువలన నద్భుతరస ముదయించుచున్నది. కడకు శకారుని దుష్టప్రయత్నము బయలుపడి సత్యము తేలి సకలము సుఖపర్యవసానమునై, చారుదత్తున కైశ్వర్య ప్రాప్తితోబాటు వసంతసేనాపాణి గ్రహణముగల్గుట నిర్వహణసంధి యనుచున్నది.

## ఆక్షేపణలు

నాటకమున ప్రాసంగికమగు రాజకీయ విషయ మధికప్రసంగమై కథయందలి సౌందర్యమును జెరచుచున్నదని యొక యాక్షేపము గలదు. కాని ప్రాసంగిక కథ యాధికారికకథవలె నెక్కువ ప్రాధాన్యము వహింపకయున్నను దాని యుపసంహృతి యాధికారికములో గలిసిపోయినది. ప్రాసంగికకథ యోగ్యమై కథాక్రమమునకు భంగము గూర్పదు. కాన నీ ప్రాసంగికకథ సర్వదా యాదరణీయమే. మరియు దర్దురకుడు రాజ్యవిప్లవమున పాలుగొనునని చెప్పుటచేతను, శర్విలకు డార్యకుని రక్షించుటకై పోవుటనుబట్టి రాజకీయవృత్తాంత మెట్టిదో పూర్తిగ తెలియరాదు. వసంతసేన దురదృష్టముచే శకటవిపర్యాయమగుటవలన నార్యకుడు రంగస్థలమునకు వచ్చును. ఆర్యకుని వృత్తాంతము దూరమైన విషయముగాన నాటకోపసంహార మార్యకునిపై యాధారపడి యుండుట సమంజసము గాదని యాక్షేపణముగలదు. ఒకవేళ వసంతసేన జీవించియుండు టనుగ్రహించి పాలకరాజే చారుదత్తుని రక్షించినను, సంస్థాపకుని చారుదత్తుడు క్షమించుటచే చారుదత్త వసంతసేన సంవాహకుల సుగుణములు బయలుపడు నెట్లు? కాన నార్యకుని సింహాసనారోహణము, సంస్థానకుని యధికారభ్రష్టము, చారుదత్తుని యభ్యుదయమును మృచ్ఛకటికమున కుపసంహారములైనవి.

ద్వితీయపంచమాంకములమధ్య కథాగమన మాగిపోయి ప్రాసంగికములతలన నాధికారిక వృత్తాంతమును వసంతసేనా చారుదత్తుల ప్రణయకథ విస్తరింపబడినదని డాక్టరు రైడరుపండితుడు దలచినాడు. యథార్థమునకు మృచ్ఛకటికము రెండు నాటకములకు దగినకథ గలది. ప్రథమాంక పూర్వభాగముతో షష్ఠాంకమునుండి దశాంకమువరకు నొక భాగమును, ప్రథమాంకోత్తర భాగముతో ద్వితీయాంకాది పంచమాంకమువరకు రెండవభాగము నగును. ద్వితీయాంక మాధికారిక వృత్తముతో నేమియు సంబంధము లేదు. ద్వితీయ పంచమాంకముల మధ్య కథ మందగించు ననుట సత్యమే. ఇందు చివరిదైన యంకములంత కథావేగము లేదు. అంతమాత్రముచే నిది ప్రధానకథకు దూరముగాదు. ద్వితీయాంకమున సంవాహకుని చరిత్రము ముఖ్యమై కథానిర్వహణమునకు సాధనమైనది. అదియే మంగళాంతమునకు కారణమగును. వసంతసేన కతడు పరిచితుడగుటవలన నామెకు చారుదత్తునిపై గౌరవమును తన్మూలముగ ప్రేమ బంధాభివృద్ధియు గలుగును.

ప్రకరణనామము నాయికా నాయకుల నామముల ననుసరించి యుండును. ఉదా. మాలతీ మాధవము, మల్లికామారుతము. కాని మృచ్ఛకటిక నాటకమున శకటమునకు విశేష ప్రాధాన్యము లేకుండుటచే నీ నాటకనామ ముచితముగ లేదు. మరియు నాయకుడు ప్రత్యంకములో గనబడవలసియుండగా, చారుదత్తుడు నాలుగంకములలో రానేరాడు, నాటకమున వేశ్య నాయిక గారాదు. విక్రమోర్వశీయమున దేవవేశ్య నాయిక కాగా, దీనిలో మర్త్యవేశ్య నాయికయైనది. మరియు వేశ్యా నాయికయగుచో కులస్త్రీయు వేశ్యయు నొక్కమారు నాటకరంగమునకు రారు. కాని యీ నాటకములో దశమాంకమున నట్లు వత్తురు. హత్యలు రంగస్థలమున చూపుట నిషిద్ధమైనను వసంతసేన వధ్యరంగముపై జూపబడినది. ఈ కారణములచే నీ రూపకము నాటకలక్షణకారులకు పూర్వమే రచింపబడినట్లు విశ్వసింపవలయును.

వసంతసేన చెలికత్తెయగు మదనికను ప్రేమించి, రేభిల చందనకుల మిత్రుడై, చిరకాల ముజ్జయినీ నివాసుడైన శర్విలకుడు, ప్రసిద్ధుడైన చారుదత్తుని గృహము దెలియకయే యాతనియింట దొంగతనము చేసెననుట సంభావ్యముగాక మానదు. వసంతసేన గృహా

భటుల పరిపాలనము శక్తిహీనమైనది కాదు. *III. 2.*
× *VI.* దోషులు శిక్షను తప్పించుకొనుటకై పారిపోవుటయు గలదు. రాజశాసనము సర్వత్ర గౌరవింపబడెడిది. ప్రాడ్వివాకులు ధర్మము, హక్కులను, పూర్తిగ గ్రహించుచుండెడివారు. మనుధర్మశాస్త్ర మందలి ధర్మములే పరమ ప్రమాణములుగ పరిగణింపబడెడివి. సాక్షి నియమములును, ధర్మవిచారణపద్ధతులు నియమింపబడి, ప్రాడ్వివాకులు వానినే యనుసరించెడివారు. సాక్ష్య నియమమును శూద్రక కవియే పూర్తిగా నెఱిగియుండెను. తాను దలపెట్టినచో, యెట్టితప్పును సాక్ష్యములగూడ నిరూపింపగల గొప్ప విచిత్రరాజభటోద్యోగి, కాగలడు. కానికల్పితదోషమును, యథార్థ దోషమును గుర్తింపబడినవి. కాయస్థులు ధూర్తులుగా పరిగణింపబడిరి ప్రాడ్వివాకులు దోషవిచారణచేసి దోషిని నిరూపింపగ, రాజు వానికి దగిన శిక్ష విధించును. ధర్మవిచారణమందు ప్రాడ్వివాకునకు సహాయముగా నధికరణికు లుందురు. అందులో వైశ్యులుగూడ నుండవచ్చును. దోషము ఋజువుకాగానె దోషి యథార్థము చెప్పవలయును. మనుధర్మ శాస్త్రానుసారము దోషియైన బ్రాహ్మణునకు మరణశిక్ష లేకపోయినను నీ నాటకమందది మార్పు చేయబడినది. శిక్ష యనేక విధములుగా నుండెడిది. X. 54. అపరాధనమిచ్చుటచే నెంతటి దోషియైనను విడిపింపబడును. మహాకార్యసంఘటనలందు గూడ దోషి త్యక్తుడగును. వణిజులకు వస్త్రస్థానమున సర్వహక్కులు గలవు. వారు రాజగోష్ఠులుగను, ప్రాడ్వివాకులుగా కూడ ప్రవర్తింతురు.

ఋణదాతలు ఋణగ్రస్తులమీద సర్వాధికారము చేయుదురు. వారిని సర్వవిధముల బాధింతురు. ఋణగ్రస్తులు హామీ నిచ్చి తప్పుకొనుటగూడ గలదు. వర్తకునకు బ్రాహ్మణునకు సాంఘిక గౌరవముల కెక్కువ యవకాశ ముండెడిది. వర్తకు లోక నియమిత శాఖకు చెందుదురు. వారిలో నధికారి రాజుచే నిమంత్రితుడై యన్యదేశములతో వ్యాపారముసేయుచు గొన్ని నావలుగూడ గలిగియుండును. ఈ వర్తకులకు చక్కని సంఘములుగూడ గలవు. బ్రాహ్మణులందఱు వైదికవృత్తియం దుండెడువారు గారు. కొందఱు పెద్ద వర్తకులు. చారుదత్తుని పితామహుడొక గొప్ప వర్తకుడు. తాత తండ్రులవృత్తిని తర్వాతివారు కొనసాగించుట సంప్రదాయమైనది.

కాని కొంత అపవిత్రజీవన మొనర్చి జూదము, దొంగతనము చేయుచు రాజ్యవిప్లవములందుగూడ పాల్గొనుచుండిరి. ఆ కాలమున బ్రాహ్మణులు భోజనప్రియులై దక్షిణల గ్రహించుటకై యాతురత వహించెడివారు. కాని సర్వత్ర బ్రాహ్మణులు పూజింపబడుచుండిరి. అందులో బ్రాహ్మణ సన్యాసులు మరియు పవిత్రులుగా పరిగణింపబడెడివారు. బ్రాహ్మణులు యజ్ఞము చేయునప్పుడు వారి గృహములు వేదమంత్రఘోషచే ప్రతిధ్వనించుచుండెడివి. శూద్రకుని కాలమున బ్రాహ్మణవిటులు వేశ్యల యిండ్లలోగూడ భుజింతురు. వారిని శాసనలను వివాహమాడుదురు. చండాలు [illegible] నాశ్రయముగారు. పంచముజాతివారుగూడ గొప్పదానార్హ్యగము చేయగలరు. అకాలపు పురుషులు నేటి కాలమువారివలెనే గృహస్థ కర్మలను, సంధ్యావందన దేవబ్రాహ్మణుల నాసక్యుచుండురు. స్త్రీలనేక వ్రతములను జేయుచుండెడివారు. నాటి కాలమున పౌరాణిక దేవతలు పూజింపబడుచుండెడివారు. శివుడు విశేషముగ పూజ్యదైవము. జ్యోతిష్యము, శకునములు యథార్థములని నమ్ముచున్నారు. అనాదింద్రోత్సవ కామదేవోత్సవాదులను గొప్ప యుత్సాహముతో చేయుచుండినారు. అప్పుడు వివాహోరాము ఫుర దేవాలయ స్థాపనాది ధర్మకార్యములొనర్చువారలును గలరు.

బౌద్ధమతము మృచ్ఛకటికే నాతికాలమునందు క్షీణింపసాగెను. బౌద్ధ భిక్షువులు దురాగ్రహవర్తకులుగ నుండుటచే నారియందు గౌరవము తగ్గినది. బౌద్ధభిక్షుని దర్శనము దుశ్శకునముగాకూడ పరిగణింపబడెడిది. ఆకాలపు ధనవంతులు సమస్త భోగముల ననుభవించెడివారు. ధనవంతుల యిండ్లయందర నారామము లుండెడివి; పావనంనాహూసు లుండెడివారు. వేశ్యలు లలితకళల నేర్చెడివారు. జూదము-లందు స్మృతి ధర్మసూత్రముల ననుసరించెడివారు. ఆ కాలమున మధురమైన గాన మభ్యసింపబడెడిది. నాటకప్రవర్తనములుగూడ లేకపోలేదు. మఱియు బానిసత్వము ప్రాచీనకాలమున స్వభావసిద్ధమైన సంస్థగా నుండెడిది. భారతీయపు బానిస నాడు కుటుంబములో నొకడుగా సరసముగా చూడబడెను వాడు. కొన్నిధన మిచ్చి బానిసలు తమ్ము విడిపించుకొనువారు. స్త్రీ సాంఘిక పరిస్థితియందు మార్పు గానరాదు. కన్యలు తల్లిచాటున నుండెడివారు. భార్యలు సిగ్గుగల్గి వర్తించెడువారు. చోరత్వము నేటివలె కాక పూర్వ మొక కళగా గ్రహింపబడినది.

# ప్రభూ!



శ్రీ సూరంపూడి భాస్కరరావు

ఆరిపోవగనీకుమీ పరాభవవహ్ని !
ఆరిపోవగనీకుమీ జ్వాలద్దుఃఖాగ్ని !

ఆనందమధుపాన మత్తుడను గానీకు
మధురగానరసాస్వాదమున మగ్నకనీకు.
కన్నెగాననిమత్తులో ఏ మొఱద్దునో
కొన్నలుంగగతేః ఏ పెదుంబదుకనో
కైపులో మరచి నిన్నెని దూషింతునో
నీ లేం సృష్టినే ధిక్కరింతునో !

ఆరిపోవగనీకుమీ పరాభవవహ్ని !
ఆరిపోవగనీకుమీ జ్వాలద్దుఃఖాగ్ని !
విస్మరింపగనీకు నా ఘోర పాపములు-
వీడిపోవగనీకు నా బ్రతుకుచీకటులు-

నా ఘుత్త వేసారచి ఎవరి నేమందునో
నా సుకృత వేతలచి ఎటుచరియింతునో
తోటిసోదరుని తేలికగానొనర్తునో
తోటిసోదరులలో తేలికయిపోదునో !

విస్మరింపగనీకు నా ఘోర పాపములు !
వీడిపోవగనీకు నా బ్రతుకుచీకటులు !

పలవించి పిలపించి తపియించిపోయమ్మ
కలుషమ్మె కష్టమ్మె కన్నీరె నాకిమ్మ
కన్నీటి తెరలపల్చని త్రోవలన్ సుమ్మ
కనజాలుదున్ నీదు సత్యస్వరూపమ్మ !

# పిలుపు



## శ్రీ అంగర వెంకటకృష్ణారావు

వంతెన దాటిపోగానే రైలుదారి విల్లులా వంపు తిరుగుతుంది. దాని కుడిప్రక్క గోతులు, చీపురుడొంకలు. ఎడమ వంపు వంపు నాభిస్థానానికి సమీపంలో బంగాళా తీరులోవున్న వొక చిన్న యిల్లు.

వంతెన క్రింద యెల్లప్పుడూ యెంతో అంత హాయిగా గలగల ప్రవహించే వొక గెడ్డ, ఆ యింటి పెరడునంటి పోతూంటుంది. ఆ వెనక యెత్తైన కొండ. ఆ కొండ చుట్టిపోతూందా వాగు.

ఈ దృశ్యం చూడగానే గోపాలం హృదయం గుబగుబ పొంగేది. అతనికి రైలుప్రయాణం భోజనానంతరం త్రేన్పడం అంత సరిపాటి అయిపోయింది. అంతే మార్పులేనిది ఉద్యోగంలో ప్రవేశించి రెండేళ్ళయింది. ఈ రెండేళ్ళూ ఆ రెండు స్టేషన్లనడుమ నే వారానికి కనీసం రెండుసార్లు ఆసులో కండెవలె ప్రయాణిస్తున్నాడు.

ఆ రైలుదారి వంపువద్దవున్న దృశ్యంకన్న శతాధికంగా సుందరమైన దృశ్యాలు మార్గంలో చాలా వున్నాయి చెరువులలో కలువపూలు, అంటు మామిడి, అరటితోటలు, తమని తామెరగని పల్లె పడుచులు, కంచెలు తిరిగిన దంపలు, చెంగుచెంగున దౌకళించే మేకపిల్లల మెడలలో చిరుమువ్వల సవ్వడి, యినుపదారి కిరుప్రక్కలా తెరలు తెరలుగా మారి పోతూ అతని సిగరెట్టు పొగ కవతలగా పారిపోతాయి. అతనికవి సిగరెట్టు పొగవలె అలవాటై పోయేయి.

కాని వంతెన దాటి రైలు ఆ వంపు సమీపిస్తూందనగానే అతని హృదయంలో యేదో ప్రాకుతూన్నట్టవుతుంది. ఇల్లు దాటి రైలు వెడిపోతూంటే అతను ఆత్మబంధువును దహనపరిచి వెడిపోతున్నట్టు అనుభూతి పొందేవాడు.

అప్పుడప్పుడూ రైలక్కడ ఆగిపోవడం కద్దు. ఆ సమయాల్లో అతనక్కడ దిగేవాడు. ఇంటిచుట్టూ ప్రహరీగోడ బ్రతికిచెడ్డ పెద్దమనిషి గౌరవం – ఆనవాలుప్రాయంగా వుంది. తలుపులు లేని గేటుమాత్రం ధైర్యంగా నిలబడి, రాత్రిళ్లు (ఒకవేళ యెవరైనా వస్తే) దారి చూపిస్తుంది.

రైలు కదులుతుందనేవరకూ గోపాలం ఆ గేటు ముందున్న రాతిమీద కాలు ఆనించి రైలు కభిముఖంగా నిలబడి సిగరెట్టు కాలుస్తాడు. ఎక్కువగా ఆ యింటివేపు చూస్తే అతనికి భయమో, లేక ఆనందం అయితే, దాన్ని కొంచెం కొంచెం అనుభవిద్దామని పిసినారితనమో అతనికే తెలీదు. రైలు కూత పెట్టగానే మాత్రం ఆ యింటివేపు తిరిగిచూసి బరువైన గుండెతో నడకసాగ వేసేవాడు. రైలెక్కి తలుపుదగ్గర నిలబడి, కొత్తగా వెలిగించిన సిగరెట్టు పొగ వొగులుగా విడుస్తూ విచారంగా చూసేవాడు. అప్పుడప్పుడు వొకటిరెండు కన్నీటిచుక్కలతని గుడ్లలో తిరగడం కద్దు.

## 2

'ఉద్యోగంలో ప్రవేశించినదగ్గరనుండీ కుఱ్ఱవాడు చిక్కిపోతున్నాడు చూశారా, యెందుకెలా అగుపిస్తున్నాడో' అంది విశాలాక్షమ్మ, భర్త జానకిరామయ్యగారికి చేతికఱ్ఱ అందిస్తూ. ఆయన మీసాలు కుడిముండతో నిమురుకుంటూ గోపాలం

'సేల్సు మ్యానేజరొస్తావుకాని, విశాఖపట్టణం నుంచి నాకేం తెచ్చావురా' అంది హఠాత్తుగా రంగం లోకి ప్రవేశించిన జానకి. గోపాలం ఆమె వేపు అప్రయత్నంగా చూసి అర్థరహితంగా నవ్వేడు.

'వాడి సెంట్లూ సబ్బులూ అరగదీస్తూనే వున్నావుగా, ఇంకా యేం తేవాలి.'

'నువ్వూరుకో అత్తయ్యా, అప్పుడే నీ సాధింపులూ నువ్వూను. ఏం బావా జెల్లంకొట్టిన రాయిలా వులకవేం!'

అతను విసుగ్గా లేచి 'వుండూ' అన్నాడు. లేస్తే అనకూబలవిగ్రహం. ఉంగరాల చిన్ని జుత్తు— విశాలమైన నుదురు. కోలముక్కు—గర్వంగా పొంగుతిరిగిన గడ్డం—నూనూగుమీసాలు. అతనిని చూసినప్పుడల్లా జానకికి సుందర్లో ఏకల సట్టాలు మెదులుతాయి. కాని వెంటనే అతను సమీపించరాని యేదో మహత్తరశక్తిలా తోచి చిన్నబోతుంది.

ఈలోగా విశాలాక్షమ్మ లోపలికి వెళ్ళి వచ్చింది. 'ఇదిగో నే జానీ, గోపాలం నీకు తెచ్చింది......'

'అహోయ్! సంపెంగపూలు—ఏం వాసన! సింహాచలంలో కొన్నావా బావా? అత్తయ్యా మనం యెప్పుడైనా సింహాచలం వెళ్ళాలి. బావ చెప్పేడు, ఆ పూలు, ఆ కొండకోనలు, జలధారలు - అహా! ఎంతో చూడముచ్చటగా వుంటాయట...'

'నీ పెళ్ళికి వెడతాంగా......' విశాలాక్షమ్మ యెగతాళిగా అంటించింది. గోపాలం చప్పున లేచి నడిచిపోయేడు. 'వీడికి ఆడదానికన్న సిగ్గెక్కువ' అంటూ విశాలాక్షమ్మ లోపలికి వెళ్ళింది. గోపాలం వెనకాలే జానకి మేడ యెక్కింది. పరుగు పరుగున మెట్లు దిగి నడిచిపోతూంటే విశాలాక్షమ్మ లోపలినుంచి 'అదేవిటే' అంది. జానకి ఆగకుండా వెళ్తూనే 'కొత్త రకం సబ్బు' అని కూతపెట్టి రుయ్యిన జారిపోయింది.

# 3

ఆవేళ సాయంత్రం ఏడు దాటిన తరవాత జానకి, జానకిరామయ్యగారింటికి వెళ్ళింది. విశాలాక్షమ్మ లోపలి వరండాలో యీజీచెయిరులో తీరికగా కూర్చుని వార్తాపత్రిక చదువుకుంటూంది. జానకి రాక ఆ యిల్లాలు సులోచనాలపైనుంచి గమనించింది.



ఆ పిల్ల వచ్చి నిమ్మళంగా పిల్లిలా కూచుంది ప్రక్కనేవున్న స్టూలుమీద.

'ఏం జానీ తీరికగా కూచున్నావు?'

'పనేముంది అత్తయ్యా. వంటైపోయింది. అమ్మపురాణం వినడానికి కోవెలకెళ్లిపోయింది. వీధితలుపు గొళ్లెం పెట్టి వచ్చా.' విశాలాక్షమ్మ మందహాసం చేసి తిరిగి చదువుకోజొచ్చింది. జానకి ఆవులించి చిటికలు వేస్తూ 'మామయ్య యింట్లో లేరా?' అంది. విశాలక్షమ్మ అర్థోక్తిగా నవ్వి 'మామయ్యగారీవేళప్పుడేనాడయినా యింట్లో వున్నారా జానీ?' అని యెదురుప్రశ్న వేసింది.

జానకి ఉదాసీనంగా నవ్వి, వెంటనే తల పైకెత్తి ఆవులించి చిటికలు వేసింది. డాబా లాజుల్లోంచి గోపాలం వుంగరాలజుట్టు అగుపించింది. దిగ్గున లేచి 'ఒస్తానత్తయ్యా' అంది.

'అప్పుడే యెంతొందరే జానీ, కూచో. ఏం కూర చేసేవు...' ఆ పిల్లకు మనసక్కడ లేదు. 'బెండకాయలు వేయించేను— గుంపల పచ్చడి, యింగువచారు.'

'నీకు వేపుడుకూరలు మహా యిష్టమేవ్. రేపెవడు కట్టబెట్టుకుంటాడో గాని, వాడి జీతం అంతా నూనెకే పోస్తావులా వుంది.'

జానకికి అక్కడ కూచోటం బాధగా వుంది. ఆ సంగతి విశాలాక్షమ్మకి తెలుసు. కాని ఆపిల్ల నూరించాలని అక్కడే ఆకట్టుతూంది.

'ఒస్తానత్తా...' జానకి లేవబోయింది.

'ఏం తొందరే! అమ్మ పురాణమునుంచొచ్చేసరికింకా చాలాసేపౌతుందిగా...'

'కాదు అత్తయ్యా...మజ్జిగ గిన్నెమీద మూత పెట్టడం మర్చిపోయేనుగా మోసు...గదిలోకి పిల్లి దూరిందేమో...' అని గబగబ నాలుగడుగులు వేసింది. 'అన్నట్టు వొసేవ్ జానీ...డాబామీద చామంతిపూలున్నాయే. వెళ్ళి కోసుకునితే, తలలో తురుముతా.'

జానకి టక్కుమని ఆగిపోయింది. 'చామంతి పూలే...' అని నోరు తెరచి దొంగకళ్ళతో డాబా లాజుల్లోంచి చూసింది. అటువెంపు, అత్తయ్యవెంపు చురుకుగా చూపులుమార్చి మెట్లవంపు పరుగుతీసింది.

గోపాలం మెట్లవెంపు వీపుపెట్టి యెదురుగా వున్న చెరువులోకి చూస్తున్నాడు. అస్తమిత సూర్యుడికాంతికి చెరువునీరు నెత్తురులా మెరుస్తూంది. దానిమీద తేలుతూన్న నీటికాకులు శరీరంమీద కత్తిపోట్లులా వున్నాయి.

అతను చేతులు వెనక్కి పెలితి వేసుకున్నాడు. పొడుగాటి లేత వేళ్లు తెల్లచిక్కుడుకాయల్ని తలపిస్తున్నాయి. తిరిగి తిరిగి వీచే మందపవనాలు అతని శరీరంమీంచి సెంటువాసన తెత్తుకొచ్చి జానకిమీద విసరి వేసారిస్తున్నాయి. ఆ పిల్ల అలా అతనివెంపు అరనిముషం చూసి గిఱ్ఱున తిరిగి చేమంతిగోలెముల దగ్గరకు వెళ్లి పూలు తెంపుతూ వొక కూనరాగం విసిరింది. గోపాలం వొక్కసారి వెనుదిరిగి చూడగానే ప్రక్కవాటుగా ఆ పిల్ల సంపెంగవంటి నాసిక, మాంసలమై బిగిసిన భుజం, దానిమీదుగా ముందుకు జారి మధ్య అర్ధచంద్రాకృతిపొందిన సర్పిణివంటి పొడుగాటి జడ అగుపించేయి.

ఆ లావణ్యాని కతనిలో హటాత్తుగా కోరికలు కెరటంలా పెరిగి, మరుక్షణంలో విరిగిపోయేయి. అతను తనని చూస్తూన్న సంగతి జానకి కొసకంటితో కనిపెట్టింది. అటువంటి రసవంతమైన, రమణీయమైన దృశ్యానికి తన హృదయం అనురణించకపోవడం ప్రకృతివిరుద్ధం అని గోపాలం బెదురుగా, 'పువ్వులు దొంగతనంచేస్తే యేం శిక్షో తెలుసా?' అన్నాడు. ఆమె తల పైకెత్తి కళ్ళతో నవ్వుతూ 'ఏమిట్లో?' అంది తాటాకులు కట్టినట్టు. అతను చతురత్వానికి యెబ్బెట్టైన ప్రయత్నం చెయ్యకుండా, 'జైలు' అన్నాడు. ఆమె 'అలాగా' అని తల పంకిస్తూ 'నవ్వులు అయితే యేం శిక్షో తెలుసా' అంది బెట్టుగా. దీనికి కూడా అప్రయత్నంగా అతడే జవాబు చెప్పేడు 'బాధ' అని. ఆ జవాబు చెప్పిన తరవాత అతని పెదవులు వణకేయి. అతని భుజంమీద కూచున్న వెన్నెలరాజు జానకి నాహ్వానిస్తున్నాడు. తన కోర్కెలు పోసుపోసినట్టున్న గోపాలం బావ జుట్టులోని వుంగరాలకొసవొంపులు చంద్రకాంతికి 'తళుక్' మంటున్నాయి. అతడామెను పిలిచిగాని, హస్తచాలనంద్వారా గాని, చివరకు ముఖకళవళికల ద్వారా గాని ఆహ్వానించలేదు. కాని ఆమె అతని

వేపు యెందుకు వెళ్లిందో అయస్కాంతం వెంపె పరుగెత్తిన వుక్కుతునకే చెప్పాలి.

'బావా విచారంగా వున్నావేం?'

'విచారం లేదు జానీ. కాని పరస్పర సంఘర్షణలో కలిగిన వూహాలతో మనసు నిండిపోయింది'

'నీ బాధేమిటో నాతో చెప్పరాదా' అంది, ఆ 'నాతో' అన్న పదోచ్చారణలో తన జీవిత కాంక్ష అంతా చూపుతూ. అతను డాబా బాలుకు బారబడి 'అది తెలీదు' అన్నాడు.

'పోనీ ఆ బాధకు కారణం యేమిటో చెప్పరాదా'

అతను నిట్టూర్చేడు. 'నేను జీవితంలో వొక వంపు ప్రయాణిస్తూంటే, యేదో అగోచర అనిర్వచనీయశక్తి నన్నింకొక వంపులాగుతూన్నట్టవుతుంది. నేను చూస్తూన్న వస్తువులన్నీ నామీద యేవిధమైన ప్రత్యేక ప్రభావాన్ని చూపించకపోయినా, కొన్ని మాత్రం నాలో యెంతో వొత్తిడి కలిగిస్తూంటాయి.'

'నాకంతా అగమ్యగోచరంగా వుంది బావా'

'ఔను, నీకు తెలీదులే. సరే. దీనిని నీకు సులువుగా బోధపరచాలంటే...ఆఁ! మాటకి నేనిక్కడనుండి రైలుమీద విశాఖపట్నం వెడుతూంటానా...దోవలో వొక వంతెన, అది దాటగానే రైలుమార్గం వంపు...దాని కెదురుగా వొక బంగాళా వుంది. రైల్వేస్థలం సమీపిస్తూందనగానే నా కనుపులో యెవరో చెయ్యిపెట్టి కెలుకుతూన్నట్టవుతుంది'

జానకికి కొంచెం భయం కలిగింది. అప్రయత్నంగా 'ఆ వుద్యోగం మానీ బావా' అంది. అతను వొక్కమారు హాయిగా నవ్వేడు. అప్పుడతని కళ్లల్లో యేదో అపూర్వమైన వెలుగు గోచరించింది. 'నువ్వూ అమ్మలాగే అన్నావూ? నేనీ వుద్యోగం అమ్మను తృప్తిపరచడానికి మానెయ్యొచ్చుగాని... కాని ఆ బంగాళా...అక్కడి గాలి...అక్కడ కదిలిన ప్రతిపిట్టరెక్కా...నాకోసమే...... ఏమిటో నా హృదయ హృదయపుటంతరాళంలో కన్నుమూసిన యేదో స్మృతిని కదిలిస్తాయి!'

'బావా నాకు భయంగా వుంది...అత్తయ్యతో చెప్పనా?......'తటాలున అతడామె చెయ్యిపట్టుకున్నాడు. 'ఒట్టువేసుకో జానీ చెప్పనని...అత్తయ్యతోనూ...యెవ్వరితోనూ కూడా...నా అమ్మతో అసలే చెప్పొద్దు.'

అతను చెయ్యిపట్టుకోడం మేల్జ్ఞాపకం వుందిగాని, తరవాత అతని మాటలు కూడా జానకికి వినిపించలేదు. పువ్వులు క్రింద పడిపోయేయి. ఆమె అతని వొళ్లోకి వొరిగిపోయింది.

ఆమె మొహమాటం విడిచి చెప్పింది, 'బావా! నువ్వు లేకపోతే నా జీవితం వృథా. నీ వుద్దేశ మెలా వుందో కాని, నా హృదయం నీకు అర్పణ అయిపోయింది. నేను నీదానినే. మీరంతా నాకిచ్చిన చనువు నాధారం చేసుకుని యింత స్పష్టంగా చెప్పగలుగుతున్నాను. నేను నీదానిని.' గోపాలన్నేదో పెద్ద సమస్య బాధించినట్టయింది. అతడేమీ జవాబు చెప్పలేదు కాని పడమటివేపు పొడిచిన చుక్కకేసి చూస్తున్నాడు.

'అత్తయ్య మా అమ్మతో చెప్పిందిట. మామయ్యగారికి కూడా యిష్టమేనట. కాని నువ్వే యిదమిద్ధమని తేల్చడంలేదట... ఏం బావా... మాట్లాడవా...'

ఆమె యేదో తన గోడ చెప్పుకుపోతూంది గాని, అతడేమాలోచిస్తున్నాడో, అసలు తను మాట్లాడుతూన్న విషయం అర్థం చేసుకున్నాడో లేదో కూడా యెరగదు. దేవతలు విహరించే ఆ వేళ, వెన్నెల రెచ్చగొట్టిన తన హృదయాన్ని అతని పాదాలముందు సమర్పించి 'స్వీకరించు' అంది గాని, అతని మనసప్పుడెక్కడుందో ఆ అమాయికకు తెలీదు.

అతడలా చుక్కలకేసి చూస్తూంటే రైలు కూత వినిపించినట్టయింది. పొగలు రేగి మలినంగా గోచరించే ఆ దృశ్యంలో రైలుదారి, ఆ వంతెన, పట్టాలవంపు...అక్కడ పొగ లింకా దట్టమైపోయేయి. వాటి నడుమనుంచి శిథిలమైన అజ్ఞాత హృదయంవలె బంగాళా అగుపించినట్టయింది.

'బావా! ఏమాలోచిస్తున్నావు? నా హృదయం పగులగొడతావా?...లేక నీ కాలి వుయ్యాలల మీద తూగిస్తావా?...' అతడు హఠాత్తుగా జానకిని తన హృదయానికి బలంగా వొత్తుకున్నాడు. 'జానీ!

నువ్వు నా దానివి!' ఆమె విదిలించుకుని, క్రింద జారిపోయిన పువ్వులు గబగబ యేరుకుని త్వరగా మెట్లు దిగి పోయింది. చావడిలో విశాలాక్షమ్మ జానకి తల్లి మాట్లాడుకుంటున్నారు.

'ఏం నే జానీ! ఇంతసేపూ పువ్వులు కోసుకోవటమే!' జానకి సిగ్గుపడిపోయి అడుగు వెయ్యలేకపోయింది. ఈసారి వాళ్ళమ్మ అంది 'పెళ్లి మజ్జిగ త్రాగేస్తుందేమో నే, తొరగా వెళ్లూ' అని. జానకి వెనుదిరగగానే మళ్ళీ విశాలాక్షమ్మ అన్నది, 'పరవాలేదు వదినా, అది కళ్ళు మూసుకుని త్రాగి వుంటుంది.' పరుగుతీయబోయిన జానకికి తిరిగి హఠాత్తుగా బ్రేకు పడింది. వెంటనే తల్లి సూటిగా అడిగింది, 'ఏమే జానీ, బావ నీకు నచ్చేడా?' జానకి చటాలున నోటికి చెయ్యి అడ్డుపెట్టుకుని వొస్తూన్న నవ్వు ఆపుకోలేక అక్కడించి అదే పరుగు తీసింది ఆ పరుగులో ఆమె వొడిలోంచి జారిపోయిన రెండు పూలు కాలిక్రిందపడి నలిగిపోయేయి. కాబోయే వియ్యపురాళ్లు గంభీరంగా నవ్వుకొన్నారు.

జానకి వెడిపోయిన తరువాత గోపాలం హృదయంలో తుఫాను బయలుదేరింది. అతనిని యేదో లోకాతీతశక్తి ఒద్దని వారిస్తూన్న కార్యాన్ని చేసినట్టు, అటుటించిపోయేడు. వెన్నెల చురుకు చురుకున గుచ్చుకుంటూంటే, మందపవనాలు త్రాచుపాముల్లా చెవులో బుసలు కొడుతూంటే డాబామీద నిలవలేకపోయేడు. నెమ్మదిగా క్రిందకు దిగి గదిలోకి వెడిపోయేడు.

ఆ రాత్రి జానకిరామయ్యగారిల్లు పెళ్ళివారిల్లులా వుంది. ఇరుగు పొరుగులకుకూడా చూచాయగా తెలిసిపోయింది, ఆ రెండు కుటుంబాలు వియ్యమందబోతున్నాయని. కొందరమ్మలక్కలు గాద్ధాంతాలు చేసేరుకూడా. జానకి తండ్రిలేనిది. దగ్గరగా కావలసినవాళ్ళుగాని, ఆస్తిగాని లేదు. కాగా జానకిరామయ్యగారికి చిత్తుగా డబ్బుంది. ఒక్కగాని వొక్క కొడుకు. కట్నం లేకుండా, కంచం లేకుండా కనీసం మఱిదళ్ళ, బావమఱదుల ముచ్చటలైనా లేకుండా, సుమారుభయత్రా పూచీ మగపెళ్లివారే భరించవలసినంత అగత్యం యెందుకు రావాలని కొందరు మాజీ సువాసినులు నోళ్లు నొక్కుకున్నారు.

రాత్రి సుమారు పదిగంటలైంది. జానకిరామయ్యగారు వాకిలిలో యీజీచైరుపై కూచున్నారు. ఆయన బట్టతలమీద చంద్రకిరణాలు సూటిగా పడుతున్నాయి. వీధివంపు చావడిమీద, విశాలాక్షమ్మ జానకి తల్లి రెండుకుర్చీలమీద, జానకి స్తంభానికి జేరబడి నేలమీద, కూచున్నారు. పెళ్లికబుర్లప్పుడే బూరెల వాసన కొడుతున్నాయి. జానకిరామయ్యగారు యెడం అరచేతిలో వుంచిన సున్నం పొగాకు కుడి బొటనవేలితో నలిపి 'టప్'మని చరిచి నోట్లో వేసుకుని, ఆవస్తువింకా నోట్లో సరిగా 'సెటిల్' కాకముందే, 'ఔనట్రా, యింతకీ అసలు వాడి నడిగారా లేదా?' అని చేతులు దులుపుకున్నారు. 'వాడికేం తెలుసులెండి వట్టినాగమ్మ, మనం సై అంటే వాడూ సైయే' అంది విశాలాక్షమ్మ. జానకి తల్లి గుండెలుకుదుటపడ్డట్టు నిట్టూర్చింది. జానకి మాత్రం ధైర్యంగానే వుంది.

'ఔరా గోపీ! నీ పెళ్ళిభోగట్టాలు మేం చెప్పుకుంటూంటే నువ్వేమిటిలా గదిలో దూరేవు. ఇలా వోసారి రా' అన్నారు జానకిరామయ్యగారు.

గోపాలం నెమ్మదిగా వచ్చి నిలబడ్డాడు. అప్పుడతనితల రైస్‌మిల్లులా తిరిగిపోతూంది. ఉష్ణంకూడా వచ్చినట్టుంది. కాని వాళ్ళకి తెలిస్తే రోసును కుంటారో అని నిభాయించుకుంటున్నాడు.

'గోపీ! జాని వొప్పుకుందిరా, నీకూ యిష్టమేనా' అన్నాడు తండ్రి.

తిరిగి అతని హృదయంలో రైలుచక్రాలు తిరిగిపోజొచ్చేయి. ధూళిపొగ లేగింది. మసక మసక వెలుతురులో ఆ బంగాళా ఔపిస్తూంది. కాని మళ్లీ ధైర్యం చిక్కబట్టేడు. మహావేగంతో ప్రవహిస్తూన్న నది కెదురీదేడు. 'ఆఁ' అని లేచి వెడిపోయేడు.

అతనికి రాత్రి తీవ్రమైనజ్వరం వచ్చింది. ఉదయాన్న లేవడానికి శక్తి చాలలేదు. కాని యెండయెక్కినకొద్దీ బలం వచ్చింది పదిగంటలకు మామూలుగా వున్నాడు. సాయంత్రం నాలుగు గంటల బండికి వెడుతూంటే తల్లి అతనికి జ్ఞాపకం చేసింది, వాళ్ళ నాన్నగారు వివాహ ముహూర్తం పెట్టిస్తారని, తను త్వరలోనే శలవు పెట్టవలసి

వుంటుందని. తన కామె మాటలు వినిపించిన సంగతి గోపాలం మరుక్షణంలోనే మరిచిపోయేడు.

## 4

గోపాలానికి శరీరస్వస్థత కుదిరిందిగాని మనసింకా శేషాగ్నిలా ఆందోళనాధూమవలయాలు విసురుతూంది. తదనుగుణ్యంగా రైలులో పక్కదగ్గర నుండీ జోరుగా సిగరెట్లు కాలుస్తున్నాడు తనకి పరిచయమున్న యెవ్వరియెదుటా కాల్చడు. ప్రయాణ సమయంలో కొంచెం యెక్కువగా కాలుస్తాడు. ఇలాంటప్పుడు మరీని.

జానకికి తనమీద మిక్కిలి అనురాగం వుంది. తండ్రి విషయం అటుంచి తల్లిమాత్రం ఆ సంబంధం కోసం తహతహలాడుతూంది. తనకూ జానకిమీద అనురాగం వుంది. ఆమె పొడుగాటి కనురెప్పల నీడలు పాలమీగడవంటి కపోలపరిభాగంమీద నీలి రేకలు దిద్దడం చూసూ యెన్నోసార్లు తను ముచ్చట పడ్డాడు. ఆమె తనను నోటినిండా బావా అని పిలుస్తూంటే ఆ అమాయకపు పెదవుల పగులగొట్టడం అమానుషం అనుకున్నాడు.

కాని ఆమెపై తన మనసు నిలకడగా లగ్నం చెయ్యడానికి శక్తి చాలడంలేదు. తన ప్రణయజ్యోతికి ఆహుతి అయిపోవడానికి తనకు తానై యెగిరివస్తూన్న ఆ మిణుగురు తను చేతులు విచ్చి ఆహ్వానించబోతే వొక్క లిప్తలో మహోజ్వాలాగ్ని గోళంగా మారినట్టవుతుంది. జానకికి అభిముఖంగా పోతూన్న తన హృదయాన్ని యేదో అవ్యక్తశక్తి బలవంతంగా మరొకవెంపు త్రిప్పివేస్తున్నట్టవుతుంది. ఆ పిల్ల నాజూకు పెదవులు ముద్దుపెట్టుకోవాలని యెన్నోసార్లనిపించింది. కాని వెంటనే అవి కస్సుని కాటేసే త్రాచుపాము కోరలవలె అగుపించినట్టయింది.

ఆలోచనలలోపడ్డ గోపాలానికి శరవేగంలో పోతూన్న రైలు, దాని కెదురుగా పరుగెడుతూన్న ప్రకృతి గోచరించడం లేదు. ప్రక్క ప్రయాణీకుడు అగ్గిపెట్టె అడిగితే పరాకున సిగరెట్టిచ్చేడు. ఆసామీ అదే అడిగినట్టు నోట్లో పెట్టుకుని తిరిగి అగ్గిపెట్టె అడిగి ముట్టించి, దమ్ములాగి 'సత్తెం' అన్నాడు కృతజ్ఞత నటించే తెచ్చుకోలు నవ్వుతో. ఆ మాట గోపాలానికి వినబడలేదు కాని తప్పెటగుపాగ అతని మొహంమీద కొట్టింది.

రైలు కోరుకొండలో ఆగి తిరిగి పరుగు లంకించుకొంది. వంతెన రాగానే గోపాలానికి హఠాత్తుగా యీ లోకంమీద ధ్యాస కలిగింది. రెండు మూడు నిమిషాల తరవాత రైలుదారి వంపు వచ్చింది. ఇంజను గ్రక్కుతున్న రాతిబొగ్గు పొగ కరాళమేఘపంక్తిలా క్రమ్ముకుంటుండగా చీకటి కల్పించింది. ఆ చీకటిలోంచి బంగాళా ఒక పూర్వజన్మస్మృతిలా గోచరిస్తూంది. గొలుసు లాగి అక్కడ దిగిపోవాలనిపించింది. కాని అంతవసరం లేకుండా రైలే ఆగిపోయింది.

గోపాలం లేచేడు. తన సిగరెట్టు కాలుస్తూన్న ఆసామీ ప్రత్యుపకారంగా 'ఇది స్టేషను కాదండి' అన్నాడు రవ్వలముగ్గులు వూపుతూ. గోపాలం వినిపించుకోకుండా దిగుతున్నాడు. అతను మళ్లా వినిపించాలని 'సిగ్నలు లాగలేదు కావాల' అన్నాడు. గోపాలం మెట్లు దిగి, గాళ్లు, వుక్కుతీగెలు, చిన్న గోడ్డి దాటి బంగాళా కేసువెంపు నడుస్తూ అప్రయత్నంగా వాచీ చూసుకున్నాడు ఐదు గంటలైంది.

ముందున్న స్టేషనులో మొదటిపట్టాలమీద వొక గూడ్సుపెట్టె తిరగబడిపోయిందట. అంచేత ఆ జంతువును లేవదీసేదాకా, అంటే కనీసం మూడుగంటల కాలంవరకూ, యీ బండీ కదలదు. టిక్కెట్లు లేని ప్రయాణీకులు వుల్లాసంగా అటూ యిటూ గాలి షికార్లు చెయ్యజొచ్చారు. టిక్కెట్లు గలవారు ముఖాలు వేలవేసి తమ దౌర్భాగ్యానికి యేడవజొచ్చేరు. గోపాలం ఆ తలుపులు లేని గేటు ముందున్న బండరాతిమీద రైలువంపు తిరిగి కూచున్నాడు. సుమారు తొమ్మిదిగంటలకు రైలు గోపాలం యెక్కలేదన్న సంగతి గమనించకుండా శెలవు పుచ్చుకుంది.

రైలువెడిపోయిన తరవాతకూడా గోపాలం దిగులుగా రైలువంపు చూస్తూకూచున్నాడు. అతడు నాల్గవ స్థలంలోకి రాబోతూన్నట్లుంది. ఆ నిర్జనారణ్యప్రదేశంలో రాత్రి వెన్నెలలో కూచుని అసాధారణమైన నూతన కాలగమనంలో పడిపోయినట్టు అనుభూతి పొందుతున్నాడు.

ఉండి వుండి వెనక బంగాళాలోంచి యేదో శబ్దం వినవచ్చినట్టయింది. వెనుదిరిగి చూసేడుగాని యేమీ గోచరించలేదు. అది తన భ్రమ అనుకుని లేచి ఆవరణలోనుంచి మెట్లవరకూ వెళ్లేడు. మధ్య మెట్టు వద్దకు వెళ్లేసరికి అతని కాళ్లెందుకో కంపించేయి. అక్కడే కూలబడి మోకాళ్ళమీద తలపెట్టి, కాళ్ళ చుట్టూ చేతులు పెనచుకుని మాగన్నులో పడ్డాడు.

హఠాత్తుగా బంగాళాలోంచి లాలిపాట వినవచ్చింది. అతడులిక్కిపడి తలయెత్తి చూసేసరికి బంగాళాగదులన్నిటిలోంచి దీపకాంతి అగుపిస్తోంది. చావిడికిప్రక్కనున్న గదిలోంచి ఆ లాలిపాట అతి మృదువుగా, జాలిగా, కాంక్షాపూరితంగా, హృదయవ్యథా వినిర్గతంగా వచ్చి అతని ఆత్మలోకంలో సుప్తావస్థలోవున్న ఏదో జ్ఞాపకాన్ని రెచ్చగొడుతోంది.

గోపాలం లేచి మెల్లిగా చావడిలోకి వెళ్ళి కుడివైపు గదిలోకి చూసేడు. ఒక స్త్రీ అటు తిరిగి రెండు చేతులలోను వున్నట్టూహించుకుని వూపుతూ పాడుతూంది లాలిపాట. ఆ దృశ్యం చూడగానే గోపాలం తనను తనుగా మరిచిపోయేడు. ఆమె యెవరో, యెందుకలా విలపిస్తూందో తోచలేదు. ఆమె వెనుదిరిగి అతనికేసి చూసి, దుఃఖంతో కళ్లు చెమర్చి, కళ్లు రెండూ సముద్రాలు చేసుకుని, మరుక్షణంలో ప్రక్కగదిలోకి వెడిపోయింది. పసుపు పూసిన చీరచెంగు నడుముకు బిగించుకొని, అలనాటి ఆకారం ధరించినట్టున్న ఆ తొలి యౌవనపు బొమ్మ పచ్చి బాలెంతరాలని గోపాలం పోల్చేడు.

అప్రయత్నంగా మెల్లిగా గోపాలం ఆ గదిలోకి వెళ్లేడు. ప్రక్కగదిలోంచి ఉబికుబికివచ్చే దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ, వెక్కి వెక్కి యేడుస్తూన్న యేడ్పు వినవచ్చింది. రెండు నిముషాలు గడిచేకా ఆ యేడుపు తిరిగి పూర్వ ఫక్కిలో లాలిపాటగామారి, ఆ గదిలోంచి పెరటివరండాలోకి వెళ్లింది. గోపాలం యీసారి కొంచెం వేగంగా పెరటివరండాలోకి వెళ్లేడు. వెంటనే ముందగపడిన స్త్రీ విగ్రహం గబగబ మెట్లు దిగి పెరటిలోకి పరుగెత్తింది.

మెట్లకు యాభైగజాల దూరంలో వొకపొదు గచ్చునయ్యా, దానికిప్రక్క నొక కుంకుడు చెట్టు, ఆ చెట్టుక్రింద వొక నాపరాయి వున్నాయి. ఆ స్త్రీ కుంకుడు చెట్టుక్రింద నిల్చుంది. ఆకులలోంచి పడిన వెన్నెల ఆమెను గోచరాగోచరం చేస్తూంది. గోపాలం అలా వరండాలో నిలబడిపోయేడు. తను చూస్తున్నది మనిషి కాదని అతని కర్థమైపోయింది. కాని అతనికి విశేషంగా భయం కలగలేదు. తదేక దృష్టితో చూస్తూన్న తనవంపు ఆమె చెయ్యి వూపి రమ్మని సౌంజ్ఞ చేసి నాపరాయిమీద కూచుంది. మెల్లిగా అడుగులు వేసుకుంటూ గోపాలం వెళ్ళి ఆమెకు రెండుగజాల దూరంలో నిలబడ్డాడు. అతడికామె స్పష్టంగా అగుపిస్తూంది. విరబోసుకొన వుంగరాలు తిరిగిన జుట్టు, తెల్ల చిక్కుడుకాయలవంటి పొడుగాటి లేత వ్రేళ్ళు, సుందరమైన కోలముక్కు, గర్వంగా వంపు తిరిగిన గడ్డం, విశాల ఫాలభాగం ఆమె అభిజాత్యాన్ని చెప్పక చెప్తున్నాయి.

'కూచో నాయనా!'

అతడికి వినపడిందా పలుకు. తన నిదివరకెంత మందో పిలిచేరు. కాని యీమె పిలుపులో యేదో విశేషమున్నట్టుంది. అది లోకాతీతమైనది. అతని ముఖంమీద పోసిపోయిన చెమ్మటచుక్కలలో వెన్నెలకాంతులు మెరుస్తున్నాయి.

'అమ్మా నువ్వెవరు?'

ఆ పిలుపుకామె నేత్రాలుజ్జ్వలంగా మెరిసేయి. చీరచెరగుతో కన్నీళ్ళు తుడుచుకుంది. మాట్లాడబోతే డగ్గుత్తిక కలిగింది. 'నాయనా! నే నెవరా! నేను నీ తల్లిని!'

అతడికి శరీరం పులకించింది. దుఃఖం కూడా వచ్చింది. ఇది స్వప్నం కాదుకదా అని అనుమానం వేసింది.

'ఔను నాయనా. నువ్వు నాబిడ్డవే. అదంతా వొక పెద్దగాథ. ఇరవైయేళ్లై నీకోసం యీ నా హృదయంలో కుంపటిలో వేచివున్నానోయ్. నా చిట్టి తండ్రీ! నిన్ను మోసికన్నదే నా వంతైంది గాని, నీ అచ్చటలు ముచ్చటలు చూడలేకపోయానోయ్. నిజమే నాయనా, నువ్వు నా చిట్టి తండ్రివే.'

ఆ వాక్యాలతని కడుపులో పేగును పీకేయి. మాతృవాత్సల్యం, తల్లి కోసం బిడ్డపడే 'తహ తహ' తొలిసారి అనుభవించేడు. ఇరవైయేళ్లు గాఢాంధంతో

పెంచిన తల్లి యీనాడు పోయినట్టు దుఃఖించేడు. అప్రయత్నంగా ఆమె వేపు జరగబోయేడు.

'అలాగే కూచో నా కన్నతండ్రీ! నిజానికి నాకూ నీవద్దకు రావాలనివుంది. ఇరవైయేళ్ళనాటి కోర్కెలదీపిక యిప్పుడు నాలో తిరిగి నాలుకలు జాపుతూంది. కాని యేం లాభం? మన యిద్దరిమధ్య జనితమనే చీకటితెర వుంది. అది మన సంచార భూములకు తుడిచివేయలేని యెల్ల. నిన్ను వొళ్లో వేసుకుని మనసార స్తన్యం యివ్వాలని నాలోని 'తల్లిముచ్చట' పెనుగులాడుతూంది. కాని ఆ ముచ్చట యెలా తీరుతుంది?' ఆమె నిట్టూర్చింది.

గోపాలం మరి దుఃఖంపట్టలేక పోయేడు. బోరని యేడువజొచ్చేడు.

'ఏడవకు చిట్టినాయనా, ఇరవైయేళ్ళుగా కంటూన్న నా కలలను నిజం చేశావు. ఈనాటికైనా నీకు నిర్భాగ్యపు తల్లిమీద దయకలిగింది. హా! రెండేళ్లనుండీ నువ్వీ మార్గంమీంచి తరుచు వెడుతూ వొక్కసారికూడా నన్ను చూడడానికి రాలేదు. రైలు వచ్చినప్పుడల్లా నువ్వే వచ్చినట్టు తలచి పీగులోకి వచ్చి ఆశగా చూసేదాన్ని. నువ్వప్పుడప్పుడు గేటువరకూ వచ్చేవాడివి. లోపలికి వస్తావేమో అని ఆశపడేదానిని.

తిరిగి గోపాలం కడుపులో దుఃఖం తుఫానులా లేచింది. కాని కష్టంమీద నిభాయించుకొని వెక్కజొచ్చేడు. 'అమ్మా...నిజం. నాకు కూడా యీ బంగాళా చూడగానే యేదో బాధగావుండేది. కాని యింత ఆత్మసంబంధం వుందని, నేనీ బంగాళాకింత ఋణపడివున్నానని కలలోకూడా అనుకోలేదు. కాని అమ్మా! ఆ సంగతి విపులంగా చెప్పవా?'

'నేను చెప్పలేను తండ్రీ. అది నీకు తెలుస్తుంది. కాని యిన్నాళ్లు నీకోసం యిక్కడ వేచి వుండడానికి కారణంవుంది. చిట్టితండ్రీ! చనిపోయిన నీ తల్లి ఆ కారణంగా, నీకోసం, వొకటి అర్థిస్తూంది. అది చేస్తావా?'

'అమ్మా! త్వరగా చెప్పు. నిప్పులలో దూకమన్నా సిద్ధంగా వున్నాను. త్వరగా చెప్పు తల్లీ...

'మరేంలేదు నాయనా...నువ్వు ప్రాంతాలలో వివాహం చేసుకోకు. సంస్థానానికి వెడిపోతానని నిన్ను పెంచినవాళ్ళతో చెప్పు. అక్కడే నీకు వివాహం అవుతుంది. నువ్వు సుపుత్రుడివని తెలుస్తా. సంస్థానాధీశ్వరుడవౌతావు.'

గోపాలం మనస్సులో యెన్నో ఆలోచనలు పరుగులుతీసేయి. ప్రాణం పట్టిన పెంపుడు తలిదండ్రులు, మనసిచ్చిన 'జాని' తన భావిజీవితంలో ప్రశ్నార్థకాలలా గోచరించేరు. కాని ఆజ్ఞాపిస్తూన్నది మాతృప్రే.

'సంకోచిస్తున్నావా, చిట్టిబాబూ? నేను చెప్పినదానిలో యేంతో అర్థంవుంది. ఇంటికి వెడుతూనే నీకే తెలుస్తుంది. ఈ సంగతి నీకు చెప్పేద్దామనే యీ యిరవైయేళ్లుగా నేనిక్కడ గూడుకట్టని పక్షిలా అల్లాడేను. ఈ నిర్భాగ్యపు తల్లి యేకైక వాంఛ తీర్చు తండ్రీ!'

అతడలాగే అని తలపూపేడు.

ప్రభాతశీతల పవనాలు తగిలేసరికి గోపాలానికి తెలివివచ్చింది. వేళ సుమారైదౌతూవుంది. అతడు తొలినాడు రాత్రి సుమారు పదిగంటలవేళకు బంగాళా మెట్లమీద యెక్కడ కూచున్నాడో అక్కడేవున్నాడు. బంగాళా యథాపూర్వంగా శిథిలంగానే వుంది.

లేచి రైలు పట్టాలమీంచి ప్రయాణంచేసి ప్రక్కస్టేషను చేరుకొన్నాడు. మరొక గంటలో వచ్చిన ప్యాసింజరుమీద వాల్తేరు వెళ్లి తొలినాడతని సామానులు రైలులో వుండిపోవడం రిపోర్టుచేశాడు. అదృష్టవశాత్తూ అన్నీ వున్నాయి. అవి తనవి అని స్థిరపరచి తీసుకున్నాడు. ఆవేళ విశాఖపట్టణంలో వుండిపోయి, మర్నాడు తెల్లవారుఝామున రాయపూరుబండీలో బయలుదేరి వుదయం ఎనిమిదిగంటలకు యిల్లు చేరుకున్నాడు.

## 5

గోపాలం వచ్చేసరికి యిల్లంతా కలకలలాడుతూంది. గుమ్మాలకున్న కొత్తపసుపులు కుంకాలు, కొత్తమామిడితోరణాలు కళ్యాణశోభ తీసుతున్నాయి.

అతను తిన్నగా మేడమీదకు వెళ్ళి సూటు కేసు దించి మంచంమీద కూలబడి ఆలోచిస్తున్నాడు. అతను వచ్చేడని తెలియగానే జానకి పరుగు పరుగున వచ్చి మేడమీదకు వెళ్ళింది. ఆపిల్ల తలంటుస్నానము చేసి శృంగారించుకుంది.

'బావా అలా దిగులుగా వున్నావేం'

బావా అన్నపిలుపు అతని గుండెలలో మారు మ్రోగింది. ఆలోచనారహితంగా అత డామెవేపు తలెత్తిచూసేడు. అతని నేత్రాలు వికసితనవకింశుకాలలా వున్నాయి. వాటిలో అశ్రువులు తిరుగుతున్నాయి. జానకికి ఆశ్చర్యం దిగులు కలిగేయి. ఎంతో ఆశగా, 'బావా, ఇవాళ మన ప్రధానం, పదిగంటలకు ముహూర్తం. ఎల్లుండే మన వివాహం. అలా చూస్తున్నావేం ?'

అతని పెదవులు స్పందించిపోతున్నాయి. "జానకమ్మా..." అన్నాడు మాటలు పెకబడుతూ. ఆ పిలుపుకు జానకి హడలిపోయింది. ఆమె అతని దగ్గరగా వెళ్ళి జిజ్ఞాసతో 'బావా...అదేమిటా పిలుపు' అంది.

'అంతేనమ్మా జానకీ. ఇవాళ మన ప్రధానం కాదు. విషాదం! ఇవాళే నా ప్రయాణం. ఇవాళే నీకూ నాకూ చిరవియోగారంభం! అంతా నీకు తెలుస్తుంది......'

ఆమె హృదయంలో బాకుతో పొడిచినట్టయింది. ఇంకేం అనాలో తోచలేదు. అప్పుడక్కడికి విశాలాక్షమ్మ వచ్చింది. కొడుకూ కోడలు యేడుస్తూండడం చూసి 'ఇదేమిటట్రా, మీ యిద్దరికీ పిచ్చెక్కిందా, నాగమ్మల్లారా! ఎందుకీ కన్నీళ్ళు? అబ్బాయీ, కాఫీ తాగుదువుగాని లే, మంగళస్నానానికి వేళవుతూంది. ఇవాళ మనింట్లో ప్రధానం!'

గోపాలం వొక గడ్డుసమస్యలో పడ్డాడు. ఈమె కెలా విషయం చెప్పాలో తెలీలేదు. తావు కనుపించలేదు గాని పట్టలేనంత దుఃఖం వచ్చింది. బిగ్గరగా యేడువజొచ్చేడు. ఆ యేడ్పుకు క్రింది వారంతా పైకి చేరుకున్నారు. వాళ్ళందర్నీ తోసుకుంటూ జానకిరామయ్యగారు వచ్చి యేమిటేగోలంతా అన్నారు. రావలసిన వారంతా వచ్చేరు. ఇక విషయం దాచవలసిన అవసరం గోపాలానికి తోచలేదు.

అతడు లేచి ఆ దంపతుల కాళ్లకు మొక్కేడు. 'ఇరవైయేళ్ళు కళ్ళల్లో పెట్టుకుని పెంచిన మీరు నాకెప్పుడూ తలిదండ్రులే. కాని మొన్న రాత్రి మా అమ్మను చూసేను. ఆమె అంతా చెప్పింది నా జన్మరహస్యం కొంతవరకు తెలిసింది. ఆమె నాకొక ఆదేశం యిచ్చింది. తదనుగుణంగా నే నిక్కడ వివాహం చేసుగోకూడదు. సంస్థానం తిరిగి వెడిపోవాలి......'

ఈ మాటల అర్థం యెవ్వరికీ బోధపడలేదు. జానకిరామయ్యగారు గ్రహించేరు గాని దబాయించడానికి ప్రయత్నించేరు. 'ఏమిటోయ్ నీ కబుర్లు... పీడా పిశాచం వాలలేదు కద—చాలు చాలు...... లే...అవతల... ప్రధానముహూర్తం సమీపిస్తూంది.'

గోపాలం దబాయింపుకు లొంగలేదు. మనసు దిటవు చేసుకున్నాడు. 'క్షమించండి మొన్న రాత్రి మా అమ్మను నేను చూసేను. కోరుకొండ కవతల రైలు దారి వంపుతిరిగినచోటు కెదురుగావున్న శిథిల గృహంలో చూసేను. తెల్లవార్లూ ఆమె కన్నీటి పాట విన్నా. ఇక నే నెవ్వరినీ మోసం చెయ్యదల్చుకోలేదు...'

ఈ మాటలకు అంత ఢిట్టమైన జానకిరామయ్యగారు తట్టుకోలేకపోయేరు. అతని నుదుటిమీద చమటపోసింది. కళ్లెంట నీళ్లు జలజల రాలిపోయేయి. అందర్నీ కూచోమని సంజ్ఞచేసేరు. తను కూడా చతికిల బడ్డారు. కన్నీళ్లు వుంగ్రపువేలిగోటితో మీటికొని 'నువ్వెవ్వర్నీ మోసంచెయ్యలేదు నాయనా. నేనే చేసేను మోసం అంతా. లోకం నేటివరకూ నిన్ను నా బిడ్డే అనుకుంటూంది...' అని వొక్క నిముషం నిశ్శబ్దంగావుండి తిరిగి గోపాలం కథ అక్కడున్నవాళ్ళ కిలా చెప్పేరు.

'గోపాలం మావాడు కాదు. అసలు బ్రాహ్మణుడే కాదు. రాజవంశ సంజాతుడు. భావి సంస్థానాధీశ్వరుడు. దానికి ఋజువు డాక్యుమెంటు నాదగ్గరున్నాయి. కాని యిరవై యేళ్లు పెంచిన ప్రేమవల్లరిని తెంపుకోలేక నా విధికి వ్యతిరేకంగా వర్తించ

పోయేను. కాని జీవించినా మరణించినా తల్లి ప్రాణం తన పేరుకు అన్యాయం...అంటే యిది మరి అన్యాయమేకదా ... జరుగుతూంటే యెలా వోరుస్తుంది...వినండి అంతా అతని జన్మరహస్యం.

నేనూ మా సంస్థానాధీశ్వరుడు ప్రాణస్నేహితులం. అతని ఆట్టుగుట్టు అనువాళ్ళన్నీ నాకు చెప్తుతూండేవాడు. బహు నాజూకైన విషయాల్లో నేనతనికి సలహా యిస్తూండేవాడిని.

నేటికిరవైయేళ్ళక్రితం అతనికొక అప్పగారి కూతురుండేది. అతడామెను వివాహం చేసుకుంటానని ఆమెకు రహస్యంగా వాగ్దానం చేసేడు. కాని వివాహం జరగకముందు వారి స్నేహకారణంగా ఆమెకు గర్భోత్పత్తి కలిగింది. ఆ విషయం జమీందారుగారి మనస్సులో పెద్ద కలవరం లేవదీసింది. ఆమెకు అన్యాయం చెయ్యడం యిష్టంలేక కడకు యీ సంగతి నాతో చెప్పి సలహా అడిగేరు.

'మహాప్రభూ! ఇది యేమంత క్లిష్టసమస్య కాదు. ఆమెకు దూరస్థలంలో ప్రవాసం యేర్పాటుచేద్దాం. రహస్యం బైటపడకుండా చూసే పూచీ నాది. నెలలునిండి శిశువును కననీండి.'

రాజాగారన్నారు 'ఆ శిశువు నేం చేద్దాం? అది నా బిడ్డకదా...'

'మీకాభయం అక్కరలేదు. నాకు బిడ్డలు లేరు. కొన్నాళ్లు నేను సాకుతాను.'

రాజాగారు నా చెయ్యిపట్టుకుని చిరునవ్వుతో అన్నారు, 'కాని పంతులూ...కొన్నాళ్ళే సుమీ. నీలాగే నాకుకూడా పిల్లలు లేరుకదా. ఇన్నేళ్ళయినా, యిందరు భార్యలున్నా ఫలించని బీజం యిక్కడ ప్రాణస్పందన పొందుతూంది. ఈ మొలక తిరిగి యీ వనం చేరాలి.

'అలాగే ప్రభూ అన్నాను' అని జానకిరామయ్యగారు భార్యవేపు చూసేరు. ఆమె హృదయంలో దుఃఖసాగరం పొంగుతూంది. గోపాలం అనాథ బ్రాహ్మణశిశువని భర్త కల్పించి చెప్పిన కథ యిన్నాళ్ళూ నమ్మింది. ఆమె కీవర్ణరహస్యం తెలీదు. కాని ఆ శరీరసౌష్ఠవం చూసి అప్పుడప్పుడనుమానపడేది.

"అప్పుడు కోరుకొండ రైలుస్టేషను కవతల, వంతెన దాటినతరువాత వొకచిన్న బంగాళా నిర్మించబడింది. దానిని వెయ్యిమంది పనివాళ్లూ నెలరోజులలో హుటాహుటిని నిర్మించేరు. దానిలో ఆమెనుదింపి సర్వసదుపాయాలూ జరిగే యేర్పాటుచేసేం. గోపాలం మాతృగర్భంలో ఈబంగాళాలోనే పెరిగేడు.

తరవాత నవమాసాలూ భరించి ఆ ప్రణయకల్పవల్లి యీ పండురాల్చి ప్రసవించిన పసివాడు తనకు శాశ్వతంగా కన్నుమూసుకుంది. ఇక చనిపోతుందనగా నేనూ, మా రాజాగారు ఆమెవద్దకు వెళ్ళేం. నేనసలక్కడే వుంటూండేవాడిని. ఆమె రాజాగారి వెంపు వెంగటిల్లిన నేత్రాలు త్రిప్పి కన్నీరుకార్చి, 'నేనెడిపోతూన్నా, కాని నా చిట్టితండ్రిని చూడండి' అంది. రాజాగారి కడుపు చెరువైపోయింది; సముచితంగా యేం చెప్పాలో తెలీక నావేపు చూసేరు. నేనామెతో చెప్పా 'అమ్మా మీరు భగవంతుణ్ణి తల్చుకుని నిర్భయంగా వుండండి. చిన్నిదొరవారికేమీ భయవాలేదు. వారిని కొంత కాలం పువ్వులలో పెట్టి నే పెంచుతా' కాని నామాటలామె నంత అనునయించలేదు. రాజాగారి వేపు చూసి 'మీ వాగ్దానం...' అంది. చెయ్యిపట్టుకుని సాభిమానంగా జాలిగా వారామె నిస్తేజనేత్రాలలోకి చూస్తూ, 'దిగులుపడకు మన చిట్టితండ్రి సంస్థానాధీశ్వరుడౌతాడు. దానికి కావలసిన డాక్యుమెంటు తయారుచేయిస్తాను. ఇదిగో ప్రమాణం చేసి చెప్తున్నాను.' అన్నారు.

ఈ మాటలు చెవిలోపడుతూంటే ఆమె నేత్రాలలోంచి జ్యోతి బైటపడి అనంతంలో లీనమైంది.

ఆమె పోయిన పది దినాలలో డాక్యుమెంటు తయారైంది. అది తయారైన సంవత్సరం తిరగకుండా రాజాగారుపోయేరు అప్పటినుండి సంస్థానం కోసం యెక్కడెక్కడి వారసులు కుక్కలలా నేటివరకూ కొట్లాడుకొంటూన్నారు. నేను తమాషా చిత్తగిస్తున్నా.

కాని దీనిలో యింకొక రహస్యం వుంది. ఈ డాక్యుమెంటు పుట్టిన కొన్నాళ్లవరకూ నావద్ద

నాక వరప్రసాదంలా వుంది. కాని గోపాలంమీద మమకారం పెరిగిన కొద్దీ అది హృదయకంటకంగా పరిణమించింది. అది మాహృదయాలను పసులన్లోతై ంప్రోక్షలి. దానిని నిర్మూలిద్దామనే మహోహాయా మస్యనే కలిగింది. కాని అటువంటిది జరగనందువల్ల సంతోషంగానే వుంది.' అంటూనే ఆయన వెక్కి వెక్కి యేడవబోచ్చేడు.

తిరిగి నిగ్రహించుకొన్నారు. 'కథపూర్తి అయింది. ఇవాళే బయల్దేరి యీ యేరువుబంగారాని స్వస్థానం చేరుస్తా. ఇరవై యేళ్ళు మోసిన యీమహాభారం నేటితో తీరుతూంది."

అంతా తెల్లబోయేరు. అతని కేం మొగాడ అనువుగా పెరిగినవాడు. విశాలాక్షమ్మహృదయంలో యిరవైయేళ్ళప్రేమ పెట్టిన చిచ్చు యెవరార్పగలరు! 'జాని' భగ్నహృదయపు ఆర్తి యెవరు తీర్చగలరు!!



తల్లి, బిడ్డ. చిత్రకారుడు : శ్రీ డి. రామలింగేశ్వరరావు

# టాగూర్ చిత్రాలు



శ్రీ వేలూరి రాధాకృష్ణ

గురుదేవుడు విశ్వకవిఅని అందరకూ తెలిసిన విషయమే. ఆయన రచించిన గేయాలకి ఆయనే స్వరకల్పనచేసి సుందర తామే పాడేవారు. తరువాత గాయకులచేత పాడించేవారు. ఆయన పాడించిన, పాడిన సంగీతానికి 'రవీంద్ర సంగీత్' అని పేరు. ఆ రవీంద్ర సంగీత్ యే ప్రఖ్యాత వంగ గాయకులచే సంస్కరింపబడి ఇప్పుడు కలకత్తా రేడియోద్వారా వినే 'రవీంద్ర సంగీత్' అయింది.

గురుదేవుడు చిత్రకారుడుగా కూడా ప్రపంచమంతటా విఖ్యాతి గాంచినవాడు. ఆయనే చమత్కారంగా ఒకసారిలా అన్నారు: "దేవతలు అడుగుపెట్టటానికి భయపడేచోట్ల అడుగిడటం, దురుసుతనం అని ఎరగనివారితో నేను సమానుణ్ణి. అందువల్లనే 'చిత్ర' ప్రపంచంలోకి అర్హత లేకపోయినప్పటికీ చొరవ చేసుకొని వచ్చినందుకు నా క్షమాపణ. నాకు చిత్రకారుడుగా, నా సాహసానికి తగిన నేర్పరితనం ఉందని నేననలేను. ఎందుకంటే, బహుప్రమాదకరమైన మార్గాన నడిచినట్లే స్వాప్నికుని విధంగా ప్రమాదాన్ని తెలియ నేరని, శ్రమనెరుగని, బాధ నెరుగని, అమాయకపు సాహసం నాది!

"నా చిన్ననాటినుంచీ భావంలో ఛందస్సుకీ ధ్వనిలో ఛందస్సుకీ నేను అలవాటుపడ్డాను. రూపం, నామం లేని నిలకడలేని దానికి ఛందస్సు నిశ్చితత్వాన్నిస్తుందని మొదట్లో తెలుసుకున్నాను. నా రచనలలోని కొట్టివేతలు పాపులవలె, విముక్తికై ప్రాధేయపడినప్పుడు, వాటి అపవితనంలోని అందవికారంతో నాకళ్ళని అరికట్టినప్పుడు వ్యక్తమైన నా కార్యసాధనకన్న మిన్నయైన ఛందస్సులోని సంపూర్ణతకై, ఆ కొట్టివేతలకు ఒక రూపాన్నిచ్చి రక్షించటానికి పూనుకున్నాను.

"అట్టి సేవాపరాయణతలో నేను ఒక సత్యాన్ని తెలుసుకోగల్గాను. అదేమంటే, ఈ రూపప్రపంచంలో సహజరేఖాగతుల, నిర్ణయంలో నిరంతర చర్య కలదు. నిబ్బరం ఉన్న రూపమే గిట్టగలదు. అట్టి నిబ్బరంలోనే శాశ్వతమైన గభీరత కలదు. కలగూరగంపగా నున్న ఈ దిక్కులేనివాటికి ఒక మార్గాన్ని చూపాలంటే, వాటికి సాఫల్యత నిచ్చే, ఆ అంతర సంబంధరూపకమైన సమానత్వాన్ని వ్యటమే సృష్టికార్యమని నేననుకున్నాను.



"నా చిత్రాలు రేఖలలోని గీతాలు! దైవికంగా అవి మెప్పును పొందుతున్నయ్యంటే, అందులోని పర్యవసానమైన ఛందస్సు యొక్క ప్రత్యేకతే గాని నా భావ, విషయ ప్రదర్శనలోని ప్రత్యేకత మాత్రం కాదు." అని...

ఆ సాహసమే ఆ ఉత్సాహమే కవిని చిత్రకారునిగా



మార్చింది. అందువల్లనే ఆ చిత్రాలలోని జీవాన్ని ఉన్నగున్నట్లుగానే చూచి, ఆనందించి, లోకం 'ఈ విశ్వకవి సృష్టికి ప్రధానమైన కళాకారుడు' అని ఎల్లెడలా చాటింపుచేసింది. సృష్టికి ప్రధానమైన ఛందస్సును అర్థంచేసుకోలేని సామాన్యులు 'ఆఁ. ఇవేమి బొమ్మలు బాబూ! పిచ్చిగీతలంటే మరీ బాగుంటుంది.' అంటారు. నిజమే! అసలు ఆయనకు పిచ్చిగీతల్లోనించే చిత్రాన్ని గీయటమనేది చేతనయింది! ఆ ప్రధాన సత్యాన్ని ప్రేక్షకులు మరువవద్దు.

గురుదేవుడు ప్రపంచ పర్యటన ప్రారంభించి దేశదేశమూ తిరుగుతూ, తనవెంట తన చిత్రావళిని కూడా తీసికోపోయి, ప్రతిదేశపు ప్రధాన నగరంలోనూ చిత్రప్రదర్శన చేశారు. అక్కడి ప్రేక్షకులు అందులోని ప్రత్యేకత కచ్చురువొందె, ఇందులో గూఢమయిన సత్యమేదో ఉందనీ, 'సత్యం ఒక్కొక్కప్పుడు కటువైనదీ, అందవికారమైనదీ' ననీ ప్రశంసాపూర్వకంగా ఆ దేశపు పత్రికలలో ప్రకటించారు—

1930 మే లో పారిసునగరంలోని 'గాలరీ పిగాలీ' అనే కళాభవనంలో రవీంద్రుడు ప్రదర్శన చేయగా ఆ ప్రదర్శనపై ఒక ప్రముఖు డీవిధంగా వ్రాశాడు :

"కవిగా రవీంద్రుడు చేసే పనికీ చిత్రకారుడుగా రవీంద్రుడుచేసే పనికీ ఏమీ సంబంధంలేదని ఆయనే అన్నాడు. కవిగా ఆయన వర్ణించే 'స్వప్నదర్శనం' లేక ఆయ నన్నట్లు మానసిక ప్రదర్శన - ఆయన కళ్ళఎదుట ఉంది. ఆయన ఒక దృశ్యాన్ని ఒక ఉద్యానవనాన్ని లేక ఒక ముఖాన్ని చూస్తాడు. ఒక చిత్రకారుడు అనుసరించే విధంగా ఆయన మనఃఫలకంలో హత్తిన ఈ ప్రతిబింబాన్ని ఆయన కూడా అనుసరిస్తాడు. ఆయన గీతాలు చూచిన లేక సృష్టింపబడిన బింబాలనే ప్రతిబింబిస్తయ్! ఆయన చిత్రకారుడైనప్పుడు దానికి వ్యతిరేకంగా (ఇది కథలోని అతివిచిత్రమైన భాగము) ఇతరులు 'కాపీ' కొట్టటానికి ప్రారంభించే చోటనే ఆయన మార్గాన్ని మార్చాడు. అది అసలు దృశ్యానికి అనుకరణ కాదు! ఆయన చిత్రం ఆయన మనస్సులో అంతకుముందే ఏర్పడుచున్న భావం యొక్క ప్రతిబింబం కాదు. అందువల్ల ముందర చూడటానికి పూర్వమే, ఆయన చిత్రించుచున్నప్పుడు ఆయన రేఖలు ఏ రూపాన్ని తాలుస్తాయో ఆయనకే తెలియదు. కావున కావ్యాలనాయన రచించినప్పుడు, చిత్రకారుడుగా పనిచేస్తాడు చిత్రాలని గీచేటప్పుడు కవిగా పనిచేస్తాడు. ఈ క్రొత్త కార్యక్రమంయొక్క సంపూర్ణత రెండు విజ్ఞానాల లేక రెండు కళాప్రపంచాల 'రోదసి' యందుంది!

"నేను ఆయన గీచిన మొదటి రేఖా చిత్రాలని చూచాను. బెంగాలీలో వ్రాసిన పద్యవ్రాతప్రతు



లలో, ఆయన కొన్ని తప్పులు సరిదిద్దాడు. కవులు నిజంగా అందమైన వ్రాతగాళ్లు! ఆ కొట్టివేతలు, నల్లగీతలమధ్య సన్నని తెల్లని చారలతో అడ్డంగా గీచిన చిత్రమైన రూపాలు! నల్లటి ఈ సుకుమారమైన భాగం తెలుపుచారలతో నిండి, ఒక్కొక్కప్పుడు సంభ్రమంగా, అలంకారికంగా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు, ఆ రెండూ రెండు విభిన్నమైన రేఖల్ని అతిక్రమిస్తాయి. అప్పుడు ఆ విధానంలో అలంకారమే ప్రధానభావమవుతుంది. ఒక సున్నితమైన రేఖతో పైభాగాన పూర్తియై ఒక రేఖలో మరొక రేఖ చంద్రాకృతిగా మిళితమవుతాయి. కాని కొట్టివేతలో క్రిందటి రేఖ ఎడమవైపుకు పొడిగింపబడితే దాని సహజరూపం పూర్తిగా మారిపోతుంది. ఒకప్పుడు ఆ రేఖాగతే, ఒక పక్షిముక్కుగా, వెన్నుపలకగా రూపొందుతుంది. ఒకప్పుడు పడమటకు ఎగిరిపోయే స్వేచ్ఛావిహంగమవుతుంది! అనేకమైన దిద్దుబాట్లు ఒకే పేజీలో, వాటి వాటి విశిష్టరూపాలలో అనేక ద్వీపాలుగా కనిపిస్తాయి. భావోద్వేగంలో చలించిన జలాలలోనించి లేచి, నిలిచిపోయిన ఈ చిన్న చిన్న దీవులు, ఒకప్పుడు ఒక మూలగానే సమిష్టిగా ఉండిపోయి, మరియొకప్పుడు పేజీ అంతా ఆవరించి, ఒక స్థానికంగా వీచే మారుతానికి తలయొగ్గి ఉండే అలలసమూహంవలె, హిందూమత విశిష్టమైన పాత్రలకుండే సౌకుమార్యంతో కన





పడతాయి. రవీంద్రుడు ఈ దీవులను, సుకుమారమైన సజీవమైన రేఖలతో కలిపి, మొత్తంమీద ఊపిరి పీలుస్తున్న రూపాలవలె కనబరుస్తాడు. ఆ కలిపిన వక్రరేఖలు, సమిష్టిగా విడివిడిగా ఒక సృష్టి సంబద్ధమైన నియమానికి కట్టుబడియున్నట్లుగా కనపడుతుంది.

"ఈ నియమమే, కవిహస్తాన్ని వశం చేసుకుంది. పూర్వనిర్ణీతమైన భావప్రదర్శన కంటె, ఆయన పూర్వం మనస్సులో ఏది లేని ఒక రూపానికి రేఖాకల్పన చేస్తాడు. ఈ రేఖ, మనస్సుచే గోచరమయింది కాదు. దానికి వ్యతిరేకంగా, సాధ్యమైన రూపాల అనంతంలో, మనస్సు చేయదలచిందల్లా, ఆ నిర్ణీతమైన అవకాశంలో దర్శనం ఇవ్వటానికి ప్రయత్నిస్తున్న, ఆ ముఖ్యమైన రూపాన్నే కనుగొనటం. తెలియనిదానికోసం, అగోచరమైన దానికోసం, నిత్యమూ తెలిసికొని, రూపాన్నిచ్చే ఆ మనస్సు, అతి సున్నితమైన ఆ సత్యాన్ని కనుగొనలేనిదై ఉండగా, అన్ని గీతాలనీ, కవితలనీ, వ్రాసిన ఆ చేయే, పూర్వమే 'ఛందస్సు' నెరిగిన ఆ చేయే, కవిని అడగకుండానే, అనేక సాధ్యరూపాలలోనుంచి, రూపొందవలసిన ఒక చక్కని రేఖారూపాన్ని గీచేస్తుంది! టాగూరు చేత కనుగొనబడిన, అట్టి సుందరరేఖలను కాగితం మీద అనేకం చూచాను. వాటిలోని సౌందర్యం, జీవం, సౌకుమార్యం, అద్వితీయమైనవి!

"అయినా, ఒక్కొక్కప్పుడు ఆయన తప్పుల్ని



చేస్తాడు. ఆయనే ఒకసారి నాతో అల్లా అన్నాడు. ఆ తప్పు ఎల్లాంటిదంటే, ఒకపూల కొమ్మను వంచబోయి, విరిచినట్లు! పొరపాటుగా గీచిన ఆ రేఖ కిక స్థానంలేదు దానికి మృతేగతి! ఆయన దాని నాశానికి కారణభూతమైనట్లు తెలుసుకొని, దానిని అతి విచారంతో విడనాడుతాడు. ఎందుకంటే, ఆ రూపాలన్నీ ఆయనచే విముక్తి నభిలషించే ఆత్మలు! ఆ ఆత్మల పరిపక్వానికి ఆయనే కారణభూతుడు. అదొక ఆనందమయ దృశ్యం! ఈ వృద్ధ కవి, అంతటి విశ్వఖ్యాతిని గడించి, ఆ చిత్ర విచిత్రమైన అల్లిక రేఖాచిత్రాలను ఒక 'గొట్టాలకొంపరి'వలె, అంతవరకూ నిద్రాణమైన రేఖలకు ఒక గతిని కల్పించాడు. ఈ రేఖలు వాటిలో ఎంతటి విశ్వరూపాన్ని దాచుకొని ఉన్నయ్!

"ఒక రేఖ పూర్తి కాకముందే, మరియొకటి ప్రారంభమవుతుంది. ఒకదాని సృష్టి పూర్తికాగానే రెండవది విధియుతంగా అవతరించాలనే పద్ధతి కాబోలు!—మరియొక రేఖ నన్నుకూడా వెంటనే సృష్టించమని అడుగుతున్నట్లు! అందువల్ల అవి ఒక రాగాన్ని ఆలపిస్తయ్. ఒకపాటని పాడతయ్. ఆ పాటలోకూడా అవి క్రొత్తరూపాన్ని పొందుతయ్. విచిత్రంగా మారుతయ్. అని ఒకచోట కలుస్తయ్. మళ్ళా నిర్గమిస్తయ్. అవిసంగా, తను జననంలోనే, ఒక అలంకారపూరితమైన ప్రాసజ్ఞయై ఒక అద్భుతమైన పవిత్రత్వాన్ని స్ఫురిస్తయ్! అది భావంతో ఆనందంతో కూడిన లయసంబంధమైన షడ్గానికి సరిపోలిన స్థానసంబంధమైన మరియొక సారూప్యము. రచన చేసి చేసి విసిగిన కవి తన హస్తానికి మరియొక కాలక్షేపాన్ని చేకూరుస్తాడు. ఆ హస్తమే అనంతమైన ఆనందమయమైన సుందరరేఖల్ని సృష్టించింది!

రవీంద్రుడు కొట్టివేతలనుంచి ప్రారంభమై, అసలు అలంకరణా విధానానికి మారాడు. విధి, దేవతలు ఆయనకు ఇతర శక్తుల నిచ్చినయ్. కాని ఇటీవలి చిత్రంలోకూడా ఆయన ప్రథమంలో గీచిన రేఖావిధానం కనుగొనవచ్చును. ఆ రేఖలు ఆ చిత్రంపొందిన రూపాన్ని తేలిగ్గా తెలియబరుస్తయ్. ఒక్కొక్కప్పుడు ఆ రేఖలు, ఇటికమీద ఇటికపెట్టి కట్టిన మహానిర్మాణంవలె, ఒకదానిపై ఒకటి ఎక్కి ఒక విచిత్రనిర్మాణాన్ని గోచరింపజేస్తయ్. తరుచుగా, మామూలుగా రచన సాగించుతుండగా గీత క్రింద గీత గీచినట్లు తేలికగా తెలుస్తుంది. అన్ని రేఖలూ అడ్డముగా ఒకదానిమీద ఒకటి కుడినుంచి ఎడమకు పోయి, రెండుబొమ్మలుకల చిత్రంగా కనిపిస్తుంది. ఆ చిత్రం ఒక నగ్నస్త్రీ గుఱ్ఱపు మేను మీద వాలి, గుఱ్ఱాన్ని అదిలిస్తుంటే గుఱ్ఱం వాయు



వేగంలో గాలప్ చేస్తున్నట్లు కనిపిస్తుంది! మాటలు వ్రాస్తే అవి ఏ మాధుర్యాన్నీ తేలేక పరాస్తైనప్పుడు, వాటికో బాహ్యరూపా న్నివ్వటానికి కొట్టివేయగా అవే మళ్లా చిత్రప్రపంచంలో, చిత్రవిచిత్రరూపాలై వెలసినై!

"బయలుదేరినచోటు దాటి బహుదూరమేగినప్పటికీ అసలు పనంతా ఒకే రీతిలో చేసినదే. ప్రారంభానికి ఒక పరిధినిస్తే, అదే అభివృద్ధియై టాగూరన్నట్లు, అప్పటినుంచీ 'స్రష్ట' ను పురికొలిపి అసలు పరిణామంలోనుంచి రూపప్రపంచాన్ని సృష్టి చేయనిచ్చే అద్భుతనియమాలను చేకూరుస్తుంది. ఈ రూపాలు ఒక అదృశ్యమైఉన్న పాత్రతో ప్రారంభమవుతయ్. క్రమక్రమంగా ఏదో ఒక సంబద్ధమైన పరిణామంవల్ల కానీ, లేక మామూలు ప్రపంచపు సంపర్కపు ప్రభావంవల్ల కానీ, ఆ రూపాలు మనం ప్రకృతి అనిపిలిచేదానితో సన్నిహితమైన పోలికను పొందుతయ్. అవి 'సుఖం' గా మారుతయ్. ఒక్కొక్కప్పుడు వాటి గమ్యాన్ని తెలుసుకోటానికే జంకుతయ్. ఒక విచిత్రమైన అలంకారం ఆ కాగితంమీద వ్రాసిన గీతలద్వారా, ఒక పూలబొత్తిగా గోచరమయి, మళ్లా మనస్సు మార్చుకొని, ఆ పూరేక పక్షి రెక్కగా మారి, దాని చిన్న రెమ్మ దాని కాళ్లుగా మారి పూవల్లా ఒక ఊహాతీత





మైన పక్షి అయిపోతుంది! ఈ పోలికలు ఒక్కొక్కప్పుడు వాటి స్థైర్యానికే అచ్చెరువొంది, మరో విధంగా మారుతవా అన్నట్లుగా ఉంటుంది! మరి యొకప్పుడు ఆ రేఖలే ఒక విషాదకరమైన బలాన్ని కలిగియుంటయ్. కొన్ని రేఖలు 'మొడిగ్లియానీ' చిత్రించిన చిత్రంగానో, 'పొల్లాయిలో' రచించిన చిత్రంగానో లేక వాటి కతిసామీప్యంగానో మారుతయ్. కాని వాటి అంతర్హితమైన నైజాన్ని తెలుసుకున్నవాడు అవి కేవలం ఆపువుగా సృష్టింపబడినవే గాని అవి ఏ 'స్టుడియో పద్ధతి'కీ చెందినవి మాత్రం కావని తెలుసుకోగలరు—ఆ చిత్రంలో నున్న 'రస' విశేషమే ప్రముఖ చిత్రకారుల భావ సామీప్యాన్ని తెస్తుంది...

"రవీంద్రచిత్రరచన ఆయనకు ఆటవస్తువు కాదు. గత రెండేళ్ళనుంచీ, ఆయన కేవలం చిత్రలేఖనంలో మునిగిపోయి యున్నాడు. కల్హాలతోనూ, నల్లసిరాలతోనూ వ్రాసిన ఆ చిత్రాలు అద్వితీయమైనవిగా కనపడతయ్. ఆయన రంగులను కుంచెతో చేబట్టాడంటే ఆ చిత్రం పూర్తి అయ్యేవరకూ వదలిపెట్టడు! ఒక్క బిగువున వ్రాసిన చిత్రాలు కొన్నీ, ఒక గంటలో కించిత్తుకూడా లోపం లేకండా రచించినవి మరికొన్నీ. ఆయన ఈ క్రొత్తపద్ధతి నిజానికి అంత 'ఊహాతీతమైనదీ' అర్థం కాని నిరూఢమైనదీ కాదు. అంతవరకూ ఆయనలో నిద్రాణమైఉన్న శక్తి ఒక్కమాటుగా మేల్కొంచింది. ఆ అలంకరణలోని పొంకం, ఆ రంగులపూతలోని అందం, ఆ చిత్రణలోని నేర్పరితనం, ఆయన విశేష ప్రతిభాశక్తిని తెలియబరుస్తయ్. ఆయన జీవితంలో చివరిభాగంవరకూ, ఆయన ఆ శక్తిని

మరుగు పరిచాడు. ఇప్పుడా శక్తి సాటిలేని ఉద్వేగంతో సృష్టిని సాగించింది. విశ్వకవి ఒకరోజున మరొక క్రొత్తవ్యక్తి తననుంచి బయల్వెడలినట్లు కనుగొన్నాను. కాని ఆ 'క్రొత్తమంత్రి' 'స్టేటులా'లను వేటినీ మార్చలేదు! 1929 లో ఆయన రచించిన 'గోరా' అనే నవలలో రచయిత రవీంద్రుడు 'రమేష్' అనే అతి తెలివైన వ్యక్తిని సృష్టించాడు. ఆ వ్యక్తి విధికృతాన్ని జాగ్రత్తగా తప్పించుకొని, దాని పర్యవసానమైన అనేక సాహసోపేతమైన కష్టాల నెదుర్కొన్నాడు. చిత్రకారుడైన రవీంద్రుడు అదేవిధంగా రమేష్ అనే వ్యక్తి జీవించియున్నాడని నిరూపిస్తాడు!", అని.

తరువాత రవీంద్రులు లండనులోనూ మరితర నగరాలలోనూ ప్రదర్శించి అక్కడివారి మన్ననలను పొందారు. శ్రీ స్వర్గీయ ఆనందకుమారిస్వామి కూడా వీరి చిత్రాలపై అత్యుదాత్తమైన సంతృప్తికరమైన విమర్శ చేశారు.

"......*Genuinely original, genuinely naive expression, extraordinary evidence of eternal youth, persistent in a hoary and venerable personage*" అని...

ఇప్పుడా చిత్రాలన్నీ కొన్ని వందలు, శాంతినికేతన్‌లోని ఆయన మహాభవనమైన 'ఉత్తరాయణ్' యందు, గోడలంతటా, అమర్చి ఉంచబడినవి...వాటినుంచే ఉత్తమమని అనుకున్న చిత్రాలని, కలకత్తా నుంచి వచ్చే 'మాడరన్ రివ్యూ' లో ప్రచురించారు. అందులో నాకు 'పునస్సంధానం' అనే త్రివర్ణచిత్రం చాలా బాగుంది.

శ్రీనందా బాబు అన్నట్లు "విశ్వకవి ప్రసిద్ధ కళాకారుడుగా, మాకు మార్గదర్శియైనాడు"

(ఇందులో ప్రకటించిన చిత్రాలు—విశ్వభారతివారి సౌజన్యంతో)



**రంగస్థలము:**

# నాట్యగృహము



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి

నాట్యశాస్త్రమున రెండవ అధ్యాయములో నాట్యగృహనిర్మాణ మీయబడినది. ఈ భాగము చాల క్లిష్టముగ నుండుటచేత వ్యాఖ్యాతలు చాలవరకీ భాగమును వదలినట్లు కన్పించుచున్నారు. ప్రాచీనులు మూడువిధములగు నాట్యగృహములను శాసించినారు. దీర్ఘచతురస్రాకారముగా నుండు నాట్యగృహమును వికృష్టమని, సమచతురముగు దానిని చతురస్రమని, త్రికోణాకారముగు దానిని త్ర్యస్రమని పిలతురు. ఒక్కొక్క దానిలో మరల జ్యేష్ఠము, మధ్యము, అధమము అని మూడువిధములగు నాట్యగృహములు ఏర్పడగలవు. కాగా వికృష్టనాట్యగృహములు మూడు, చతురస్రములు మూడు, త్ర్యస్రములు మూడు కలసి తొమ్మిది వచ్చుచున్నవి. వీటి కొలతలను మూరలలోను, బారలలోను భరతు డిచ్చినాడు. మూరయనగా రెండడుగుల మూడంగుళములని చెప్పవలెను.

నూటయెనిమిది మూరల పొడవుగల నాట్యగృహమును జ్యేష్ఠమని, అరువదినాలుగు మూరల పొడవుగలది మధ్యమమని, ముప్పదిరెండు మూరల పొడవుగలది అధమమని చెప్పబడుచున్నది. దేవతాదులను నాట్యరూపమున ప్రయోగించుటకు జ్యేష్ఠమనబడు నాట్యగృహము కావలెను. నృపతిప్రాయులను ప్రయోగించు నాటకాదులకు మధ్యమ పరిమాణముగల నాట్యగృహ మవసరము. మిగిలిన సామాన్యప్రజలనే చూపు భాణప్రహసనాదుల కధమ మనబడు నాట్యగృహము కావలెను. కాని సామాన్యముగా మధ్యమపరిమాణముగల నాట్యగృహమే శ్రేష్ఠము. నాట్యమండపమును పెద్దదిగా నిర్మించినచో నాట్య మవ్యక్తము కాగలదు; పాఠ్యము నతిప్రయత్నముతో బిగ్గరగా నుచ్చరించినను దూరమున కూర్చొనియున్న సామాజికులకు వినబడక పోగలదు. నాట్యమండపము చాల చిన్నదైనచో శబ్దము ప్రతిధ్వనించి మాధుర్యమును కోల్పోవగలదు. మండపము పెద్దదైనచో ముఖములో నభివ్యక్తములగు నానాదృష్టి సమన్వితములైన భావములు అవ్యక్తము కాగలవు. పైగా జ్యేష్ఠపరిమాణముగల నాట్యగృహమున రూపకాదులను ప్రయోగించుటకు సౌకర్యమంతగా కన్పించదు. మధ్యమ నాట్యగృహముననే పాఠ్యగేయములు చక్కగా వినిపించగలవు. కావున నాట్యగృహములన్నిటిలోను మధ్యమ పరిమాణముగల నాట్యమండపమే శ్రేష్ఠమైనదని భరతుడు సిద్ధాంతించినాడు.

నాట్యగృహమును నిర్మింపదలచిన భూప్రదేశమును నాట్యాచార్యుడు చక్కగా పరీక్షించి, వాస్తుప్రమాణముతో గృహనిర్మాణ కృత్యమును శుభసమయమున నారంభించవలెను. నిమ్నోన్నతములు లేనిది, చలించని స్వభావముగలది, చవుడు నేల కానిది, తెలుపు లేక నలుపురంగుతో నున్నది యగు భూమి యందు నాట్యమండపమును నిర్మించవలెను. మొట్టమొదట భూమిని శుద్ధిపరచి, తర్వాత నాగలితో దున్ని, అందలి ఎముకలు, మేకులు, పుర్రెలు, చెట్ల వేరులు, ముళ్ళు మొదలగువానిని తీసివేయగా నా భూమికి బాహ్యాభ్యంతరములలో శుద్ధి కలుగగలదు. భూశుద్ధియైనతర్వాత పుష్యమీనక్షత్రమున తెల్లని సూత్రమును చూచి, నాట్యగృహమునకు కావలసిన ప్రమాణములను పట్టవలెను.

వికృష్టమనబడు నాట్యగృహములలో మధ్యమ పరిమాణముగల గృహమునకు కొలతలను మొదట చెప్పుచున్నాము. ఈ నాట్యమండపముయొక్క

పొడవు అరువది నాలుగుమూరలు లేక నలుబది ఎనిమిది గజము లుండును. దీనిని రెండు సగభాగములు చేయగా తూర్పునగల ఇరువదినాలుగు గజముల ప్రదేశమున ప్రేక్షకులు కూర్చొందురు. మిగిలిన ఇరువదినాలుగు గజములు నాట్యమండపమునకు రాగలవు. దీని వెడల్పు ఇరువదినాలుగు గజము లుండును. ఈ ఇరువదినాలుగు గజముల చతురమున రంగశీర్షము, రంగపీఠము, నేపథ్యగృహము రావలెను. కాని

"సమమర్ధవిభాగేన రంగశీర్షం ప్రకల్పయేత్"
అని 2.34 లో చెప్పుట —

"రంగపీఠస్య పార్శ్వేతు కర్తవ్యా మత్తవారణీ"
అని 2.63 లో భరతుడు చెప్పినాడు. రంగపీఠ, రంగశీర్షములకు భేదమున్నదా? లేదా? వికృష్టమండప నిరూపణలో రంగశీర్షమునకే స్వరూప ప్రమాణాదికము చెప్పినాడు. రంగపీఠశబ్దమును "రంగపీఠస్య పార్శ్వేతు," "రంగపీఠ ప్రమాణతః", "రంగపీఠం తతః కార్యం" అని మూడు తడవలు ప్రయోగించినాడు. మొదటి రెండు ప్రయోగములలో అనువాదరూపమున నిర్దిష్టమై రంగపీఠము కన్పించుటచే దీని విధానము మొదట చెప్పవలసియున్నది. కాని ఇచట రంగశీర్ష విధానమే కన్పడుచున్నది. అందుచే రంగపీఠ, రంగశీర్షములు భిన్నమైనవి కావని సిద్ధమగును. ఇవి రెండును భిన్నములైనచో వికృష్టమండపమున రంగపీఠము యొక్క స్థానప్రమాణాదికము చెప్పబడవలసియున్నది. కాని భరతుడట్లు వచించలేదు. చతురస్ర, త్ర్యస్ర మండపములలో రంగపీఠవిధానము నే నిర్వచించియున్నాడు. కేవలము వికృష్టమండపమున నే రంగశీర్షముండునని కూడ చెప్ప వీలులేదు. 99, 100 వ శ్లోకములలో చతురస్రమునకూడ రంగశీర్షమును విధించినాడు. పైగా నేపథ్యగృహమునుండి వికృష్టమండపములో రంగశీర్షమును ప్రవేశించుటకు, చతురశ్ర త్ర్యశ్రములలో రంగపీఠమును ప్రవేశించుటకు ద్వారములను విధించుచు, రంగపీఠ, రంగశీర్షములకు తాదాత్మ్యమునే గ్రహించినాడు.

కావున రంగపీఠ, రంగశీర్షములు భిన్నములని చెప్ప వీలున్నదా? "రంగపీఠం తతః కార్యం విధిదృష్టేన కర్మణా రంగశీర్షం తు కర్తవ్యం" అనుచో వీటికి వైలక్షణ్యము కన్పించుచున్నది. "సమున్నతం సమంచైవ" అనుచో వికృష్టమండపమున, రంగపీఠము కన్న రంగశిరస్సు ఎత్తుగా ఉండవలెనని కలదు. "సమమర్ధవిభాగేన" అనుచో ఎనిమిది మూరల పొడవు గల రంగశీర్షమును నిర్మించవలెనని కలదు. కావుననే "రంగపీఠే కర్తవ్యే రంగశిరస్తావదాహ రంగశీర్షమితి" అని, "రంగపీఠ తచ్ఛిరసోర్వక్తవ్య శేషం నిరూపయతి" అని మొదలుగాగల వాక్యములలో అభినవగుప్తుడు రంగపీఠము వేరు రంగశీర్షము వేరు అని గ్రహించినట్లున్నది. ఈ రెంటికి ప్రయోజనభేదమును కూడ చెప్పినాడు. పాత్రల విశ్రాంతికి ప్రవేశించువారి గోపనకు, రంగమునకు శోభను తెచ్చుటకు రంగశిరస్సును నిర్మించవలెనని వ్యాఖ్యానించినాడు. అనగా మొదట నర్తనాదికముచే శ్రాంతులై మరల అభినయాంతర ప్రయోగమునకు రంగపీఠమును ప్రవేశించుటకు, అంకమధ్యమున అపటీక్షేపము మొదలగువానిద్వారా ప్రవేశించు పాత్రల గోపనకు, ఉద్యానవన పత్తన జలాశయ పర్వతాది విభావములను సాక్షాత్తుగా ప్రదర్శించుటకు, రంగశోభాజననమునకు రంగశీర్షము కలదని భావము. గాయక, వైణికాద్యుపరంజకవర్గ మీ రంగశిరస్సున ఉండును. రంగపీఠముననే గాయకాదులకు నివేశనమున్నచో పాత్రాంతర ప్రవేశపరిక్రమణాదుల కవకాశమే ఉండదు.

ఇట్టిచో రంగపీఠ, రంగశీర్షములకు తాదాత్మ్యము చెప్పవచ్చునా? నేపథ్యగృహమునకు తూర్పునగల ప్రదేశము ప్రేక్షకులు కూర్చొను భూభాగముకంటె ఒకటిన్నర మూర ఎత్తుగా నుండును. దీనికి రంగపీఠమని సామాన్యనామము. ఈ రంగపీఠమును రెండు సమభాగములు చేయగా వెనుకనున్న సగభాగమునకు రంగశిరస్సు అని విశేషనామము. మిగిలిన సగభాగము, అనగా తూర్పునగల సగభాగమునకు రంగపీఠమని విశేషనామము. కొన్ని కొన్ని స్థలములలో పూర్వ పశ్చాద్భాగములను అవివక్షితములుగా గ్రహించుటచే రంగశీర్షమునకు కూడ రంగపీఠమని వ్యవహారము వచ్చుచున్నది. కావుననే నేపథ్యగృహమునుండి రంగపీఠమును ప్రవేశించుటకు, రంగశీర్షమును ప్రవేశించుటకు ద్వారములు అవివక్షితములుగా చెప్పబడినవి. రంగపీఠ, రంగశీర్ష ప్రమాణములు సమములగుటచే, రంగపీఠప్రమాణమును మరల చెప్పలేదు. చతురశ్రమండపమున వీటికి వైశిష్ట్యముం

ముటచే మరల చెప్పవలసివచ్చినది. "నాట్యమండప స్యోత్తాన సుప్తవవనస్థితస్వరంగ పీఠం సుఖం తదష్టహస్తం శిరః." "రంగపీఠస్యయుత్సృష్టం రంగశిర స్తత్ర," "రంగపీఠస్య యదుపరి శిరోరూప మిత్యర్థః" అని మొదలుగాగల అభినవభారతీ వాక్యములద్వారా అభినవునకు సమ్మతమైన అర్థ మిదేనని గ్రహించవలెను.

వనోద్యాన యుద్ధరంగాది విస్తృత ప్రదేశములను ప్రదర్శించుటకు, యుద్ధాములలో ఉచ్చతర పరిక్రమణకొరకు, రంగపీఠమునకు వెనుకగల భాగము కూడ పాత్రలచే నప్పుడప్పుడు ఉపయోగింపబడుచున్నది. వికృష్టమండపమున సామాజికుల దృష్టి విఘాత పరిహారార్థము రంగపీఠముకన్న దాని వెనుకభాగము ఎత్తుగా ఉండవలెను. చతురశ్రమున సామాజికులు సోపానాకృతిగల ఆసనములపై కూర్చుందురు గనుక దృష్టికి ఉపరోధము తటస్థించదు. అందుచే చతురశ్రమున సమతలముగనే రంగపీఠ, రంగశీర్షము లుండవలెనని భావము.

కాగా ఇప్పుడు రెండు మూరల చతురము నాట్యమండపమున పశ్చిమముగా పదునారు మూరల పొడవుగల నేపథ్యగృహముండును. దీనికిపూర్వమున ఎనిమిది మూరల పొడవుగల రంగశీర్షముండును. ఈ రంగశీర్షమునకు పూర్వముగా ఎనిమిదిమూరల పొడవుగల రంగపీఠ ముండును. అపై ఆగ్నేయదిక్కుతో నారంభించి నాలుగుమూలలయందు నాలుగు స్తంభములను స్థాపించవలెను. నాట్యమండపమున పూర్వముగాగల ఎనిమిదిమూరల మేరను రంగపీఠ ముండును. రంగపీఠమునకు రెండు ప్రక్కలయందు మదపుటేనుగులను నిర్మించవలెను. ఉత్తరమున నొకటి, దక్షిణమున నొకటి కలసి రెండేనుగులు రాగలవు. ఈ ఏనుగులు నాలుగు స్తంభములతో కలసి యుండవలయును. నాట్యమండపమునకు గోడవద్ద నొక స్తంభము, దీనికి ఎనిమిదిమూరలదూరమున లోపల మరియొక స్తంభము ఉండవలెను. ఈ రెంటి మధ్య దూర మెనిమిది మూరలు. కావున రంగపీఠమునకు నాలుగు మూలల లోను రెండేసి రెండు స్తంభముల చొప్పున ఎనిమిది స్తంభములు రాగలవు. తూర్పు ముఖముగా ఎనిమిది మూరల పొడవున దక్షిణదిశలో నొక మదపుటేనుగు, ఉత్తరదిశలో మరియొక ఏనుగు వచ్చినచో ఒక్కొక్క యేనుగునకు నాల్గు స్తంభములతో సంబంధము కలుగ గలదు. ప్రేక్షకులు కూర్చుండు భూభాగమునకు ఒకటిన్నర మూర యెత్తున మత్తవారణు లుండవలెను. మత్తవారణు లెంత యెత్తున గలవో అంతే యెత్తున రంగపీఠ ముండవలెను. ప్రేక్షకుల కభిముఖముగా నున్న ఈ యేనుగులు నాట్యమండపమును మోయుచున్నట్లు కన్పించగలవు. కాగా మత్తవారణుల మధ్య ఎనిమిది మూరల వెడల్పున, పదునారు మూరల పొడవున రంగపీఠ మేర్పడగలదు.

నేపథ్యగృహమునకు పూర్వముగల గోడవద్ద మధ్యగా రెండు స్తంభముల నేర్పరుపవలెను. ఈ రెంటి మధ్య దూర మెనిమిదిమూర లుండవలెను. ఒక్కొక్క స్తంభమునకు తూర్పుగా నాలుగు మూరల దూరమున మరల రెండు స్తంభములను నిర్మించవలెను. అప్పుడు నాలుగు స్తంభములు రాగలవు. వీటిలో వెనుక గల రెండు స్తంభములకు క్రిందుగాను, ముందుగాను రెంటికి పైగాను దూలములవంటి రెండు కొయ్యల నేర్పరచగా, నాల్గు స్తంభములతో కలసి మొత్తం ఆరు కొయ్యలు రాగలవు. ఈ మద్దారువులు మండపాకారమున నుండును. ఈ మద్దారుక ప్రదేశమున నాయకాద్యుపరంజకవర్గముండును. ఇందులో వెనుక గల రెండు స్తంభములకు రెండుప్రక్కల రెండుద్వారములను నిర్మించవలెను. నేపథ్యగృహమున కీరీతిగా రెండుద్వారములు రాగలవు. ఉత్తరమునగల ద్వారము నటీనటుల ప్రవేశమునకు, దక్షిణద్వారము పాత్రల నిర్గమనమునకు ఉపకరించును. ఒకప్పుడు రెండు ద్వారములనుండియు పాత్రలు ప్రవేశింపవచ్చును. నటీనటులు వేషము లేసికొను నదియగు నేపథ్య గృహము నాట్యమండపమునకు చివర పడమరగా నుండునని భావము.

వెనుక నేపథ్యగృహము, ముందు రంగపీఠము రాగా, మధ్య రంగశీర్ష మేర్పడును. కూర్మపృష్ఠము వలె గాని, మత్స్యపృష్ఠమువలె గాని నిర్మించక, నిర్మలమైన అద్దముయొక్క సమతలభాగమువలె రంగశీర్షమును నిర్మించవలెను. రంగశిరస్సును నిర్మించి, తర్వాత కొయ్యపనిని చేయించవలెను. శిల్పకారుని ఊహాపోహ పాటవమును చూపు వివిధ శిల్పములచే చెక్కబడిన స్తంభముల మధ్య స్త్రీమూర్తులను సాలభంజిక లుండవలెను. నానా సంజవనోపేత మైనవి, అనేక పక్షులతో శోభించుచున్నవియు నగు వివిధములగు సాలభంజికలు చక్కగా కూర్పబడినవి కావలెను. నిర్వ్యూహకుహరోపేత మైనవి, వివిధములగు ఆకృతులచే కూర్పబడిన వేదికలు గలవి, వివిధ విన్యాసములతో కూడినవి యునై యుండవలెను. చతురశ్రములు, అష్టకోణములు, సంప్రద నివియునగు ద్వారము లుండవలెను. స్తంభములపైని పీటలు తులాదండమువలె నేర్పరుపబడవలెను. కపోతముల సమూహములతో నిండినట్లు స్తంభములు కన్పడవలెను. ఈ రీతిగా దారు శిల్పముల చేయించి, గోడల విషయమాలోచించవలెను. స్తంభమునకుగాని, నాగదంతమునకు గాని, వాతాయనమునకుగాని ద్వారవేధ కలుగరాదు.

ముందుకూర్చొను ప్రేక్షకులు వెనుక కూర్చొను వారికి అడ్డము రాకుండునట్లు, క్రమక్రమముగా వెనుక కూర్చొను వారి ఆసనములను ఎత్తుగా నుంచుచు నిచ్చెన మెట్లవలె నిర్మించవలెను. చివరి ఆసనముల ఎత్తు రంగపీఠముయొక్క ఎత్తుతో సమానముగా నుండవలెను. ఇట్లు చేయుగా దిగువ ఇచ్చిన బొమ్మవలె నాట్యగృహము రాగలదు.




ఈ వికృష్ట నాట్యమండపమున ఒకటవ అంకె గలది ప్రేక్షకులు కూర్చొను ప్రదేశము దీని పొడవు 32 మూరలు, వెడల్పు 32 మూరలు. రెండవ అంకె గల రంగపీఠము 16 మూరల పొడవు, 8 మూరల వెడల్పుగలది. మూడవ అంకెగలవి మత్తవారణులు. ఇవి 8 మూరల పొడవు, 8 మూరల వెడల్పుగలవి. నాల్గవ అంకెగల రంగశీర్షము 32 మూరల పొడవు, 8 మూరలు వెడల్పుగలది. ఐదవ అంకెగల షడ్దారుకము 8 మూరల పొడవు, 4 మూరల వెడల్పుగలది. ఆరవ అంకెగల స్థానములు ద్వారములను చూపునవి. ఏడవ అంకెగల నేపథ్యగృహము 32 మూరల పొడవు, 16 మూరల వెడల్పుతో నుండును. సున్నలు స్తంభములను తెల్పునవి.

ప్రేక్షాగృహమందలి ఆసనములు సోపానాకృతితో నుండుటచే నాట్యమండపము కొండగుహవలె కన్పించగలదు. ఈ నాట్యగృహమున చతురశ్రముకన్న ఎక్కువ స్తంబములు కన్పించగలవు. జల్లెడవలె అల్లిన కిటికీలు మాత్రమే నాట్యమండపమున నుండవలెను. తద్ద్వారా మండపమునమే గాలి రాగలదు. గీతివాద్యములు ప్రయోగింపబడు మండపమున మున్నచో చక్కని ధ్వనియు రాగలదు. లేనిచో ప్రతిధ్వనిగల్గును. రంగపీఠమునకు రంగశీర్షమునకు మధ్య రంగపీఠమంత పొడవుగల తెర ఉండును. వనోద్యానాది ప్రదర్శనమునకు, నాటకాంతర్గతమగు రూపకమును ప్రదర్శించుటకు రంగశీర్షముల నుపయోగించవలెను అప్పుడీ తెరను తీసివేయుదురు. నాట్యమండపము నిట్లు నిర్మించి, గోడలకు రంగు వేయవలెను వన, పత్తన, జలాశయ, ఉపవన, పర్వతాదులను సాక్షాత్తుగా భాసింపజేయుట కనేకవిధములైన చిత్రదారు కర్మాదికముతో రంగము నలంకరింపవలెను.

ఇక మధ్యమ పరిమాణముగల చతురశ్రనాట్యగృహముయొక్క లక్షణములను వివరింపవలసియున్నది. చతురశ్రమధ్యమమునకు అరువదినాలుగు మూరల పొడవు, అంతే వెడల్పు ఉండును. ఇందు ఉత్తరమున, దక్షిణమున పదునారు మూరల వెడల్పుగల భాగములను వదలి శేషించిన ప్రదేశమున నాట్యగృహమును నిర్మించవలెను. కాగా నీ నాట్యగృహమునకు పొడవు అరువదినాలుగు మూరలు, వెడల్పు ముప్పదిరెండు మూరలు రాగలవు. ఇచట చెప్పని విషయములను వికృష్టమండపములోవలె నిర్మించవలెను కనుక నిచట విశేష ప్రక్రియయే వివరింపబడగలదు. వికృష్టమండప విధానమున చెప్పని విషయము లేవైన ఇచట చెప్పబడినచో నివికూడ వికృష్టమండపవిధానమున వర్తింపబడవలెనని శాస్త్రమర్యాద.

చతురశ్ర నాట్యగృహమును వెనుకటివలెనే రెండు సమభాగములు చేయగా తూర్పున ప్రేక్షాగృహము రాగలదు. వెలుపలివైపున అన్ని ప్రక్కల ఇటుకతోను, సున్నముతోను దృఢముగా గోడలను కట్టించవలెను. "అష్టహస్తంతు కర్తవ్యం రంగపీఠం ప్రమాణతః" అని చెప్పబడుటచే ఇచటి రంగపీఠ ప్రమాణము ఎనిమిది మూరలని వచ్చుచున్నది. చతురశ్రమండపమున రంగపీఠము కూడ చతురశ్రముగానే ఉండును గనుక ఈ రంగపీఠము పొడవు ఎనిమిదిమూరలు, వెడల్పు ఎనిమిదిమూరలు ఉండును. కాగా మండపమునకు దక్షిణమున పన్నెండుమూరలు, ఉత్తరమున పన్నెండుమూరలు ప్రదేశము మిగులగలదు.

రంగపీఠమునకు వెలుపలగా పది స్తంభములుండుట ప్రశస్తమని భరతుడు చెప్పుచున్నాడు. ఈ స్తంభములకు వెలుపలనున్న భాగమున ప్రేక్షకులు కూర్చొనుటకు నిచ్చెన మెట్లవలె ఆసనములను ఇటుకతోను, కొయ్యతోను ఏర్పరచవలెను. ముందు మెట్లకన్న వెనుక మెట్లు ఎక్కువ ఎత్తుగా నుండవలెను. అప్పుడే రంగపీఠ మందరకు కన్పించగలదు.

చతురశ్ర నాట్యగృహమున పది స్తంభములు విశేషముగా చెప్పబడినవి. ఈ సందర్భమున కన్పించు శ్లోకములు అయోమయముగా కన్పించుచున్నవి. అభినవ భారతిలో సహితము ముందువ్యాఖ్య వెనుక, వెనుకవ్యాఖ్య ముందు కన్పించుచున్నది. వ్యాఖ్యననుసరించి, ఇతర గ్రంథముల ననుసరించి భరతుని శ్లోకముల నీ క్రింది రీతిగా సవరించవలసి యున్నది.

"కృతాభ్యంతరతః కార్యం రంగపీఠం యథావిధి
దశప్రయోక్తృభిః స్తంభాః శక్తా మండపధారణే.
స్తంభానాం బాహ్యతశ్చాపి సోపానాకృతి పీఠకమ్
ఇష్టకా దారుభిః కార్యం ప్రేక్షకాణాం నివేశనమ్.
హస్తప్రమాణై రుత్సేధై ర్భూమిభాగ సముత్థితైః
రంగపీఠావలోక్యంతు కుర్యా దాసనజం విధిమ్.
షడన్యానంతరేచైవ పునః స్తంభాన్ యథాదిశమ్
విధినా స్థాపయేత్తజ్జ్ఞో దృఢాన్ మండపధారణే
అష్టౌస్తంభాన్ పునశ్చైవ తేషా ముపరి కల్పయేత్"

పది స్తంభములు, ఆరు స్తంభములు, ఎనిమిది స్తంభములు విధించబడుచున్నవి. "అష్టౌస్తంభాన్ పునశ్చైవ తేషాముపరికల్పయేత్", "శక్తామండపధారణే" "దృఢాన్ మండపధారణే" "భిత్తిః శ్లిష్టేష్టకాదృఢా" అను ప్రయోగములలో 'దృఢ', 'శక్త', 'ఉపరి' అను పదములను విచారంగా ప్రాచీన నాట్యమండపములలో ఉపరిప్రాసాదము లేక పై అంతస్తు ఉండెడిదని నిర్ణయింప వీలున్నది.

నేపథ్యగృహమునకు ముందుగల రంగశిరస్సున స్తంభములను మండపాకారమున చూపినచో స్వర్గాది ప్రదర్శనార్థము ప్రాసాద మొకటి రాగలదు ఇట్టి ప్రాసాదము రంగశిరమున నుండును. ఈ నాట్యమండపమునకు పైఅంతస్తుగా, రంగపీఠ సమానవిస్తారముగల ప్రాసాద మొకటి యుండును ఈ ప్రాసాదములోనికి పోవుటకు ఉత్తరమున, దక్షిణమున పదునారేసి మూరలుగల ప్రదేశమును వదలవలెను ఈ ఉపరిప్రాసాదము ఎనిమిది స్తంభములతో నిర్మింపబడునది. దక్షిణదిక్కున ఆగ్నేయమూలగా రంగశీర్షమునకు పైన ఒక స్తంభముండును. దీనికి ఉత్తరముగా నాలుగుమూరల దూరమున రెండవ స్తంభముండును. దీనికి నాలుగుమూరల దూరమున ఉత్తరముగా మూడవ స్తంభముండును. ఈ మూడవ దానికి నాలుగుమూరల దూరమున నాల్గవ స్తంభముండును. ఇట్లే ఉత్తరదిక్కున గూడ నాల్గు స్తంభములు రాగలవు. ఇవి ఎనిమిది స్తంభములు. ఈ ఈ స్తంభముల మధ్యగల ప్రదేశము ఎనిమిదిమూరలు. ఇది సమచతురముగా నుండవలెను. గనుక ఈ స్తంభముల కెనిమిది మూరలు పశ్చిమముగా గోడ ఉండును ఈ స్తంభములను గోడను కలుపుచు వేదికలు రెండు ఉండవచ్చును. ఇట్లు పైఅంతస్తున వచ్చు ప్రాసాదము చతురశ్రమండపమునగల విశేషము.

ప్రేక్షకులు కూర్చొను ప్రదేశమున పది స్తంభములుండును. గోడలకు పన్నెండుమూరల దూరమున నీ స్తంభములు రావలెను ఒక్కొక్క స్తంభమునకు మధ్యగల దూరము ఎనిమిది మూర లుండును. కాగా ఉత్తరమున ఐదు స్తంభములు, దక్షిణమున ఐదు స్తంభములు రాగలవు. ఈ స్తంభములకు మధ్యగల ప్రదేశము ఎనిమిదిమూర లుండగలదు. స్తంభములకు గోడలకు గల మధ్యప్రదేశమున ప్రేక్షకులు కూర్చొనుటకు సోపానములవలె ఆసనము లుండును. స్తంభములకు గల మధ్యప్రదేశమున ఉత్తములగు సభాసదులుందురు. ఈ స్తంభములకు ద్వారవేధ కలుగరాదు.

రంగశీర్షము నాలుగు మూరలే యగుటచే గాయకాదులకు నిర్మింపబడు షడ్దారువుల నీ మండపమున నేపథ్యగృహములో నిర్మించవలెను. కావుననే "షడన్యానంతరేచైవ" అనుచో "అంతరే" అను శబ్దము ప్రయోగించబడినది. "అంతరే" యనగా "నేపథ్యగృహములో" అని అర్థము చెప్పికొనవలెను. మండపములో పద్మాదులు చెక్కబడిన స్తంభముల పైన ఎనిమిదిమూరల పీఠమును అనగా దూలమును

చేయవలెను. ఈ నాలుగుమూలల బహురూపదండములను గల రెండు స్తంభములపై కాలస్త్రీల ఆకృతులను చెక్కించి అందము కూర్చునట్లు చేయవలెను. రంగశీర్షమునకు పశ్చిమముగానుండు నేపథ్యగృహమునకు ఒకటివలెనే రెండు ద్వారము లుంచవలెను. కాని ఇచట విశేషవిధి గలదు. వికృష్ట మండపమున చెప్పబడిన రెండుద్వారములకు మధ్య మరియొక ద్వారము కూడ చతురశ్రమున నుంచవలెను. గాయకౌద్యప్రవేశనార్థము షడ్దారువు నేపథ్యగృహమున నుండవలెనని చెప్పితిమి. ఈ గాయకులు నటీనటనాటకమును చూచుచు వాద్యముల నాలాపించుట ఉత్తమముగనుండ మధ్య మూడవద్వారము విధింపబడినది. ఈ గాయకులు కూర్చుండు ప్రదేశము రంగపీఠమంత ఎత్తుగా నుండవలెను. రంగమధ్యమునకు త్వరత్వరగా ప్రవేశించుటకు కూడ ఈ ద్వార ముపయోగించును.

పడమర




తూర్పు

సామాజికులు ప్రవేశించుటకు రంగపీఠమున కభిముఖముగా నాట్యగృహమునకు తూర్పున నాల్గవ ద్వారమును నిర్మించవలెను. కాగా చతురశ్రమున నాలుగు ద్వారము లుండగలవు.

రంగపీఠము తూర్పు పడమరలుగా ఎనిమిది మూరల వెడల్పు గలిగియుండును. దీనికి రెండు ప్రక్కల ఒకటిన్నరమూర ఎత్తున సమతలమైన వేదికలను నిర్మించవలెను. ఒక్కొక్క వేదిక నాలుగు మూరల వెడల్పుతో నుండును. నాట్యవేదికకు రెండు ప్రక్కలయందు వెనుక చెప్పినట్లుగా నాలుగు స్తంభములతో సమాయుక్తములగు రెండు మదపుటేనుగులను స్థాపించవలెను.

ఈ విధముగా నిష్పన్నమగు చతురశ్ర నాట్యమండపము నిచట బొమ్మలో సవిశేషముగా గాంచనగును. ఒకటవ అంకెగల ప్రదేశము 16 మూరల వెడల్పు, 64 మూరల పొడవుగల ఖాళీ ప్రదేశము. రెండవ అంకెగల ప్రదేశము 8 మూరల వెడల్పు గల్గిన ఉత్తమ సభ్యులు కూర్చుండు స్థలము. 12 మూరల వెడల్పుగల మూడవ అంకెగల ప్రదేశమున సోపానాకృతిగల స్థానము లుండును. 8 మూరల వెడల్పుగల రంగపీఠమును సూచించునది నాల్గవ అంకె. 8 మూరల వెడల్పు, 4 మూరల పొడవుగల వేదికను తెల్పునది ఐదవ అంకె. ఆరవ అంకెగలచోట్ల 8 మూరల పొడవు వెడల్పులుగల మత్తవారణు లుండును. 4 మూరల పొడవు, 32 మూరల వెడల్పుగల రంగశీర్షమును తెల్పునది ఏడవ అంకె. ఎనిమిదవ అంకెగలచోట షడ్దారుకముండును. దీని వెడల్పు 8 మూరలు, పొడవు 4 మూరలు. తొమ్మిదవ అంకెగలచోట్ల ద్వారము లుండును. పదవ అంకెగలది నేపథ్యగృహము. దీని పొడవు 16 మూరలు, వెడల్పు 32 మూరలు.

నాట్యమండపమున రంగపీఠము త్రికోణాకారముగా నున్నచో త్ర్యశ్ర నాట్యమండపము కాగలదు. ఇంతకుమించి ఈ నాట్యమండపమున చెప్పవలసిన విశేష మేమియు కన్పించదు. వికృష్ట, చతురశ్రముల లక్షణముల నితర స్థలములయందు వర్తింపజేయవలెనని భావము.

# "సౌందరనందము"



## శ్రీ పొట్లపల్లి సీతారామారావు

ఆధునిక కావ్యములలో శాస్త్రక్రమమునకు నిల్చు కావ్యములు లేవు. సమాసమున కర్థము కుదురుట — కారకప్రక్రియ సరిగా నుండుట — ప్రసిద్ధ సాంకేతికమైన శబ్దము వాడుట — భావమునందు పూర్వాపర సందర్భములుండుట... ఈ మొదలైనవాని దృష్ట్యా కావ్యము నిలువజాలదు. దీని తర్వాతగాని రసవిచారమునకు తావుండదు. ఇది కవికి మొట్టమొదట కావలసిన సామగ్రి. ఆంగ్ల విమర్శనల వైఖరిగా చూచువారి కివేమియు నవసరములేదు. అక్కడనున్న శబ్దముల కా భావము నిచ్చుశక్తి యున్నదా లేదా యని వారు విచారింపరు. ఆ భావమును వారే యూహించి సర్దుకొందురు. ఇట్టి విమర్శలవలన ఆధునిక కావ్యములలో శబ్ద, సమాస, కారకదోషములు సర్దుకొనలేదు. కవి కావ్యము వ్రాయునపు డెట్లున్నాడు — క్రమముగా నతడు పరిణతి జెందినట్లు కావ్యమునం దెట్లు కనిపించుచున్నది — ఇట్లు చర్చించి వ్రాయుట వారి కాచారము. ఇట్లు వ్రాయుచుపోయినచో దేనిని గురించి యైనను వ్రాయవచ్చును. ఇది లెక్కసహమైన విమర్శ గాదు. విమర్శలో నొక భాగమైన గావచ్చునేమో కాని దానివలన కావ్యనిర్మాణమార్గము సంస్కరింపబడదు. గొప్పగొప్ప యుద్యోగములలో నుండవచ్చును. లోకములో ప్రతిష్ఠ గల్గియుండవచ్చును కాని నిర్దుష్టమైన కావ్యమును వ్రాయుట కష్టము.

కావ్యములలో గల్గిన యీ దోషములు వెలిబుచ్చనిదే మంచికావ్యములు రావు. ఆ దోషము లీనాడెక్కువగా కనిపించుచున్నవి. విమర్శకుడు దోషైకదృక్కుగా గాని పక్షపాతదృష్టిగలవాడుగా గాని యుండరాదు. కాని నిష్పాక్షికముగా నివి దోషములు — ఇవి నిర్దుష్టములు — అని చెప్పుటకు విమర్శకునకు స్వాతంత్ర్యమున్నది. ఆమాత్రము స్వాతంత్ర్యము విమర్శకునకుండుట న్యాయ్యము.

ఆధునిక యుగమునంతయు తిరుపతి వేంకట కవుల యుగమని చెప్పవచ్చును. వీరిలో చాల భాగము వారి శిష్యులైన కవులే యున్నారు. వారి శిష్యులలో శ్రీ పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావుగార్లు ముఖ్యులు. వీర సౌందరనందముపై జెప్పిన దోషము లేమాత్రము [illegible].

ఈ కావ్యములోని మొదటిభాగమంతయు అశ్వఘోషుని సౌందరనందములో దానికి భిన్నముగా లేదు. మధ్య, అంత్యమునందు కొంచెము భిన్నమైనది. ఈ కావ్యమూ సౌందరనందమునకు కొంత యనుసరణము, కొంత స్వతంత్రమని చెప్పవచ్చును. కవులు స్వతంత్రించిన భాగములు మొదటి భాగములతో సరిగా ననుస్యూతము లగుటలేదు.

పూర్వప్రబంధములు వస్తునిర్దేశకముగా ప్రారంభింపబడలేదు. ఆశీస్సు, నమస్క్రియలలో నేదో నొకటి యుండితీరును. సంస్కృతకావ్యము లెక్కువ భాగము వస్తునిర్దేశకముగా ప్రారంభింపబడినవి. సౌందరనందము ప్రబంధము కాదుగాని ప్రబంధము వంటిది. ప్రబంధములలోని వర్ణనలన్నియు తగ్గించుటయే వీరు దీని కాపాదించిన నవీనగుణము. మిగిలిన ఛాయలన్నియు ప్రబంధములనుండి పుణికి తెచ్చుకొన్నవే. కావ్యములో ప్రథమసర్గయంతయు బుద్ధుని ప్రవేశప్రబోధములు వర్ణింపబడినవి. ఇది కథాదృష్టితో నిర్మింపబడినదిగాని రససృష్టిచే నాకృష్టమైనది గాదు. ఆ బుద్ధుని ప్రవేశము రసమున కేమాత్రము దోహదము చేయదు. ఆ బుద్ధుని ప్రబోధము కావ్యమునందు ప్రసారితమగుటచే, దానిని సూచించుచు వీ రిట్లు చేసిరి.

కావ్యమంతయు సుకుమారముగనున్నది. కాని పలుకుబడి చాలినంతగ లేదు. ఆ పలుకుబడికొరకు కవులు ప్రయత్నించిన ట్లగుపించదు. ఎంతసేపటికి జిలుగుపని. వీరి కవిత్వమునం దంతయు శ్రీనాథాదు

లకి కొంచెముగా, పింగళి సూరనది అధికముగా ముద్ర కనిపించుచుండును. భావమును కుదించి చెప్పిన కవులలో నోజోగుణముండును. భావమును కుదించక విస్తరించి వివిధ్యముగా చెప్పిన కవులలో సుకుమారతా గుణ ముండును. సుకుమారకవులందరికి భిక్ష పెట్టినవారు; శ్రీనాథుడు పింగళి సూరన. ఈ కవు లా మార్గమున ప్రవర్తించినవారు.

నందుడు బుద్ధుని సోదరుడు. ఆ నందుడు, అతని భార్య సుందరి సన్యాసాశ్రమము స్వీకరించుట ఈ ప్రబంధములోని ఇతివృత్తము. ఈ ఇతివృత్తము తొమ్మిది సర్గల ప్రబంధముగా చెప్పబడినది. ఇతివృత్తముతో సమీకసాగించుట కావ్యములో కష్టము. కావ్యమునందు ఇతివృత్తమాత్ర నిర్వాహణయే చాలదు. రసదృష్ట్యా దానిని దిద్దుటతో కష్టమెంతేని యున్నది.

కథ వ్రాయుట యనుటతోపనే, కవికి చాల చిక్కు లున్నవి. అసలు ముందు కథను రసదృష్ట్యా మలచుకొనుటతో కవి తలప్రాణము తోకకు వచ్చును. పంచసంధుల, సుచిత స్థితులలో కూర్చుటకు కవి శక్తినంతయు వెచ్చించవలెను. "ముఖ ప్రతిముఖ గర్భావమర్శ నిర్వహణాఖ్యానాం, తదంగానాం చోపక్షేపాదీనాం, ఘటనం రసాభివ్యంజకాపేక్షయా, యథా రత్నావల్యాం. నతు కేవలం శాస్త్రస్థితిసంపాదనేచ్ఛయా" అని. ఏదో శాస్త్రమర్యాదకొరకు పెట్టినట్లుగా కనుపించకూడదట. కథతో నింత చిక్కున్నది. రసాభివ్యంజకములైన కథలు నేడు వెలువడు కథానికలలో నెన్ని యున్నవి? కథాదృష్టిని సంస్కరించిన యాలంకారికులలో ఆనందవర్ధనుడే ప్రథముడు. వేణీసంహార కర్తకే యీ దోషమును సర్దుకొనుట చేతనైనది కాదు. ఈ సూక్ష్మాంశముల సంగతి బ్రహ్మదేవు డెరుగును. కవికి కనీసము భావౌచిత్యమైన పాటించు నేర్పుండవలెను.

సౌందరనంద కావ్యములో నా భావౌచిత్యము నెంత వెదకినను కనుపింపదు. కావ్యములో నాయికా నాయకులు సుందరీనందులు. వీరిద్దరి శృంగారచేష్టలుదాత్తములుగా లేవు. అదికాక బుద్ధుడు మధ్యాహ్న భిక్షార్థియై వచ్చినపుడు నాయికా నాయకులు, శృంగారములో మునిగి తేలుచున్నట్లు వర్ణించబడినది. ఇది దోషము. పట్టపగలు నాయికా నాయకుల శృంగారము నిషేధము. లోకములో నుండిన నుండవచ్చును గాని కావ్యములో నుండగూడదు. అంత కాముకుడుగానున్న నందుడు కూడ సన్యాసి యయ్యెననెడి భావము స్ఫురించుట కట్లు చేసెనన వచ్చును. ఇది కథాదృష్టితో చెప్పు మాట కాని రస దృష్టితో చెప్పు మాట కాదు. మన దేశములో కథ రస దృష్ట్యా యేర్పడినది. ఆ శృంగారము ఉత్తమ ప్రకృతి శృంగారము కాదని నా వాదము. భావౌచిత్యము తెలిసినచో ఈ దోషము రాదు. "తథాహ్యధమ ప్రకృత్యౌచిత్యే నోత్తమప్రకృతేః శృంగారోప నిబంధనే, కాభవే న్నోపహాస్యతా," అని. ఈ దోషము వీరియందొక్కరియందే యున్నదని నా యభిప్రాయము గాదు. ఆధునిక కథాప్రబంధములు నూటికి తొంబదితొమ్మిది పాళ్ళు ఈ శ్రేణిలోనివే. అందులో సౌందరనంద మొకటి.

నందుడు బుద్ధునిదగ్గరకు వెళ్లి తిరిగిరాగా, సుందరి యప్పుడు విచారించినది.

"కూరిమితో బుట్టుగుల విస్తరించి యూ
సెయ్యమ్మ నీమీద నిల్పుకొంటి,"—ఇది అధమనాయికకు, నుచితముగ నున్నదితప్ప రాజపుత్రికకు నుచితముగా లేదు. ఇవన్నియు కథను పాడుచేసినవి. ఈ కవులు శృంగార చేష్టావర్ణనములో ప్రణయకోపము నొకదానిని తెచ్చి పెట్టినారు. అది కృతకముగా తెచ్చిపెట్టినట్లున్నది తప్ప సహజముగా లేదు. సుందరి నందుని చేతికి దర్పణమిచ్చి తాను కేశసంస్కారము చేసికొనును. నందు "డుప్ఫ" ని దర్పణముపై నూదును. ఆమె మిథ్యాకోపము నటించినదట. ఇంతమాత్రమునకే యామెచే కవి ప్రణయ కోపమును నటింపచేయుట, లోక విరుద్ధము. నాయికచే చమత్కరించి మాట్లాడించిన రమ్యముగా నుండెడిది. ఇట్లు చేయకపోవుటచేత ప్రసిద్ధ నాయికాలక్షణము లామెలో కనిపించుటలేదు. నందుడొక సేవకమాత్రుడుగా కన్పించుచున్నాడు. ఉదాత్తమైన శృంగారము లేదు. అధమ ప్రకృతిగల నాయికా నాయకుల స్థితి వ్యంగ్యమగుచున్నది.

పూర్వప్రబంధములలో నాయకునిచే గోత్రస్ఖలనాదికము చేయించుట గలదు. దానికి నాయిక

కుపితయగుట సహజము. ఈ కవులు దానిని తాత్పర్య దృష్ట్యా జూచి కావ్యమునం దిమిడించిరే కాని ఔచిత్య దృష్టిచే కాదు. ఆ కోపమునకు నాయకుడు సాపరాధుఁడై నాయికను సాంత్వనము చేయుట సహజము కాని ఈ గ్రంథములలో నున్నట్లుగాదు. ఇవన్నియు దోషములే. కావ్యమును కేవలము చదువుకు పోయినచో ఇవి కనిపించవు. పద్యరచన మెత్తగా నుండును. లోకములో సామాన్య పాఠకునకు గావలసిన దంతమాత్రమే. కాని సహృదయు డట్లు చూడడు. శక్తి రెండువిధములు 1. భావయిత్రీ శక్తి 2. కారయిత్రీశక్తి. కవిలో ఈ రెండుశక్తు లుండును. సహృదయునిలో భావయిత్రీశక్తి మాత్రముండును. పాఠకుడు భావయిత్రీశక్తి గలవాడగుచో కావ్యములో ననౌచిత్యము గ్రహింపగలడు కాని అట్టివారు స్వల్పముగా నుందురు. సహృదయునకు కవికిగల ఈ భేదము రాజశేఖరుడు చూపించినాడు. భావయిత్రీశక్తి గలవారి దృష్టికి సౌందరనందము నిలువదు

ఈ కావ్యములో బౌద్ధమతముయొక్క వాతావరణము గోచరించదు. కథ బౌద్ధమతసంబంధమైనది. కావ్యవస్తువుతో కవి, తాదాత్మ్యమందవలెను. అట్లు, తాదాత్మ్య మందలేని కవులలో నీ దోషము మెక్కువగా గన్పించును. బౌద్ధమత సంబంధమైన వాతావరణము కనుపించకపోయినను కొంత నయమే. అట్లుగాక ఈ గ్రంథమునిండా హిందూమతముయొక్క ఛాయ లెక్కువగా గన్పించుచున్నవి. బౌద్ధవిహారభూమిని వర్ణించుచు

"స్మరదురత్రదున్ పట్టి సపరివారముగ
పశువరించిన యజ్ఞవాటివోలె."

అన్నారు. బౌద్ధులకు యజ్ఞయాగాదులు లేవు. అట్టి వారి విహారమును యజ్ఞవాటితో బోల్చుటలోగల ఔచిత్యమును పాఠకు లూహింతురుగాక.

బుద్ధుడు నందుని కుపదేశము చేయుచు

"పాలుని జన్మమున్ పుడమి పాలుని జన్మము గల్గె నిర్ధరన్" అన్నారు. బౌద్ధులకు వర్ణాశ్రమ ధర్మములు లేవు. హిందూమతములో వర్ణాశ్రమ ధర్మములు లోకప్రయోజనముకొరకు పుట్టినవని, బుద్ధుని భావమా? అయినచో హిందూమతమును పైని, తనేవ నవసరము లేదా!

ఇక బుద్ధుని యుపదేశములలో బౌద్ధమతము లేదు. ఏవో ప్రసిద్ధముగానున్న నాల్గుమాటలను తీసికొనివచ్చి గ్రంథమున కూర్చిరి. అవి బౌద్ధమత మును కొన్నవిన అని మనకు సాధ్యముకాదు. కావ్యము చదువుచున్నంతసేపు సద్యఃపరనిర్వృతి కలుగవలెను గదా. అది ఈ కావ్యము చదువుటలో నెట్లు గల్గునో చెప్పలేము. ఈ దోషము ఈ కవులలోనే కలదని నా యాశయము కాదు, మిగిలిన కవులు పెంక కావ్యములు వ్రాసిరి. కావున వారి నీ దృష్టితో చూడరాదు. కథ వ్రాసిన కవులందరు సుప్రసిద్ధులు, కావున కావ్యజగత్తులో సౌందరనందమున కెంత స్థానమున్నదని నిరూపించుటయే నా కర్తవ్యము.

అసలు నందునికి బలవంతముగా సన్యాసమిప్పించుటయే తప్పు. బౌద్ధమత విరుద్ధము. జీవకారుణ్యమే బౌద్ధులకు ప్రధానాశయము కాని బలవంతముగా సన్యాసాశ్రమ మిప్పించుట కాదు. కావున నందుడు మొట్టోయనిమంపగా నుపదేశము చేయుటలో నేమి ఔచిత్యమున్నది? అశ్వఘోషుడు సంస్కారములో జీవులు రెండువిధములుగా నుందురని చెప్పియున్నాడు 1. ఆత్మాశ్రయులు, 2. పరాశ్రయులు.

"అయత్నతో హేతుబలాధికస్తు
నిర్ముచ్యతే ఘట్టితమాత్ర ఏవ
యత్నేనతు ప్రత్యయనేయ బుద్ధిః
విమోక్ష మాప్నోతి పరాశ్రయేణ."

ఇందులో ప్రథములు ఆత్మజ్ఞానమును స్వయముగానే పొందుదురు. ద్వితీయులు పరులప్రోత్సాహము చేతగాని పొందరు. ఈ నందుడీ రెండవశ్రేణి లోనివాడు. ఈ కల్పనచే అశ్వఘోషుడు కథలోని దోషమును, కొంతవరకు సమర్థించుకొని తప్పించుకొన్నాడు. కథలోగల నీ పట్టులలోనె కవియొక్క చాకచక్యము గన్పించును. తెనుగుకావ్యమునం దట్లు సమర్థింపబడకపోవుటచే కథలోని దోషము దోషముగానే మిగిలిపోయినది.

ఇక నందుని ప్రేమసిద్ధాంతము. ఈ సిద్ధాంతము కాలానుగుణముగా నున్నదాయని నా ప్రశ్న. ఇదంతయు సంస్కృతగ్రంథములో లేదు. వీరి కల్పన. షెల్లీయొక్క లౌఫిలాసఫీకి కొంత దగ్గరగా

న్నది. ఈ ప్రేమ సిద్ధాంతము అరవై యేబ్బది ఏండ్ల నుండి మన దేశములో బహుళ ప్రచారములో నున్నది. దాని యుక్తాయుక్తము లెంచి చూచినను కనిపించదు. ఎవరో కొత్త సందర్భము తా నొక సిద్ధాంతము నిర్మించుకొని దానియందు తీవ్రనిష్ఠ గల్గిన వ్యక్తి అతడెట్లు మారినారని నా ప్రశ్న. భోగలాలసుడైన నందుడు సన్యాసిగా గావలసిన లక్షణములను కవులు నందుని యందు చూపించలేదు. పాత్రపోషణ యున్నచో నిట్లుండవలెను.

నందుని ప్రేమసిద్ధాంతము స్థూలము గానిది. "చింతలురాని తావు, ఉదాసీనత లేని యిష్టము, అంతశ్శత్రువులను నాశనము చేయునది. కృపాలయ తాస్పదము, ఆనందపు సామ్రాజ్యమైయై ప్రణయము భాసించును, నక్షత్రములు గ్రహములు, ప్రేమసూత్రము చేతనే నిల్చియున్నవి. విశ్వములో ననేక ప్రేమ సూనములు సృష్టించినది. అందొకటి నా హృదయములో దాగి నిండినది. జగజ్జీవనమును నేను తెలియనివాడనుగాను తుచ్ఛసుఖమునకు లోబడి ప్రణయామృత కళోచితమైన భామిని ప్రేమ భామిని చేసితి. నాకీ లోకముతో పనిలేదు. ప్రవాహములచే నిండిన ద్వీపములలో నా ప్రాణ ప్రాణమైన చెలితో నైక్యము పొంది నిత్యమైన ఆనంద మనుభవింతును."

ఈ సిద్ధాంతమునందంతయు సగము షెల్లీప్రభావములో నిండియున్నది. ఒకదానికొకటి పొత్తుకుదురు చున్నట్లు కనుపించదు. రాగము—ప్రేమ—వలపు— ఈ శబ్దములు కవులలోని యొక పరిమిత భావములకు సాంకేతికములుగా వాడబడినట్లు కనుపించుచున్నది. ఆ శబ్దార్థములలో చూచిన సరిపడదు. సంప్రదాయ బద్ధముగా నార్వాచీనుల యొక్కయో జైనుల యొక్కయో, సిద్ధాంతమును నందునిచే జెప్పించి దానికి ఖండనముగ బుద్ధునిచే చెప్పించిన రమ్యముగా నుండెడిది. వీరట్లు చేయలేదు. పైగా పైని చెప్పిన నందుని సిద్ధాంతమునకు రెండుమూడు సర్గలలోని సుందరీనందుల శృంగారమునకు పొత్తుకుదురుటలేదు. తీర్థానికి తీర్థము ప్రసాదానికి ప్రసాదముగానే యున్నది. అసలా సిద్ధాంతమెంత చూచిన నిదమిత్థమని తేలుటలేదు. నిగమనము కల్గుటకుగల హేతువులు లేవు. అన్నియు హేత్వాభాసలే.

## ఇక బుద్ధుని ప్రేమనిర్వచనము

"కామవికార మింతయు
గ్లానిరోని కనార చెప్పుమా
ప్రేమకు నాటపట్టయిన ప్రేయసి
కై యిటులేల పొక్కెదో."

ఈ నిర్వచనము ప్రకారము దూరస్థయైన ప్రియురాలికొరకు ప్రియుడు తహతహ పడినచో ప్రేమ కాదు అది కామము. ఈ సిద్ధాంత మెక్కడి నుండి దిగుమతియైనదో కాని మన దేశములోని ఏ ప్రసిద్ధ శృంగారకావ్యము దీనిముందు నిలువదు. పాపము బుద్ధుడే పాపము నెరుగడు. ప్రతిజీవుని యందు కారుణ్యము వహించుమని చెప్పుటయే యాయన ప్రధానాశయము. ఈ ప్రేమసిద్ధాంతము నాయన కంటగట్టగూడదు.

"మమత లేనట్టి ప్రేమ నిర్మలము కుమార" అని బుద్ధుడు చెప్పెను. ఇది సంభవించుట యెట్లు? ప్రేమ యనుటతోడనే యిష్టమని గదా యర్థము.

"ఇన్ని పూవులుండగ నీ వొక్క పుష్పమున్న పుడుక నేల?" దీనినుండి దురర్థము వచ్చుటలేదా? కవుల భావ మిది కానిచో నాకును సందేహము లేదు. కవులీ భావ మిట్లు చెప్పవలెను. జీవకారుణ్యము వేఱు. ప్రేమ వేఱు. ప్రేమకంటె జీవకారుణ్యము గొప్పది. భూతదయగలవానికి ప్రతిజీవియు నాత్మప్రాయమే అని చెప్పించినచో సందేహాస్పదముగ నుండదు. ఈ కవుల యూహా ప్రేమ యను దానిని తీసికొని దానినొక యద్వైతసిద్ధాంతముగనో విశిష్టాద్వైత సిద్ధాంతముగనో చేయవలెనని. కాని ఆ శబ్దమును తీసికొని కీ రెంత పైకి గుంజినను, నది త్రిశంకునివలె క్రిందికే జారిపోవుచున్నది. ప్రేమ యొక సిద్ధాంతముగా నిలువదు.

ఒక సిద్ధాంతము లోకోత్తరముగ నిర్మింపబడుటకు కావ్యజ్ఞానమే చాలదు. తర్కసహమైన బుద్ధి గావలెను. ఆ బుద్ధిలోను లోకోత్తరమైన ప్రతిభావైభవముండవలెను. ఇంత జరిగినను అది లోకములో బహువిమర్శకులలో క్షుణ్ణముగా నరిగిపోవలెను. అంతేకాని నేటి రాజకీయవాదుల వైఖరిగా తేలికగా నొక సిద్ధాంతము నిర్మించరాదు. దానికి హేతుబలము చాలక పట్టుమని పదిరోజులైనను నిలు

వదు. వాల్మీకి, వ్యాసులు చేసిరన్నచో వారు కేవలము కవులు మాత్రమే కారు. వేదాంతములు చదివి, తెలిసి చూచిన మహాపండితులు. వారు ఋషులు. వారి శక్తులే వేఱు.

ఈ కావ్యములో నందు నొక క్రూరునిగ చిత్రించి బుద్ధునిచే భూతదయ నుపదేశింప జేసినచో నౌచిత్యము స్పష్టముగా పోషింపబడియుండెడిది.

ఇక నీ కావ్యమునందలి రసమునుగూర్చి విచారింతము. ఈ కావ్యమునందలి ప్రధానరసము శాంతము. అంగిరస మితివృత్తమునం దంతటను ననుసంధితమై వ్యాపించియుండవలెను. ఈ కావ్యమునందది లేదు. మీదుమిక్కిలి అంగరసమైన శృంగారరసము మిక్కిలిగా వ్యాపించియున్నది. అది యొక దోషము. అదికాక శృంగార శాంతములు రెండును పరస్పర విరోధిరసములు. వీని రెండిటికిని అంగాంగిభావము నిక్షేపించుట తగదు.

కవికి రసవిరోధిజ్ఞాన ముండవలయును.

"ప్రబంధే ముక్తకే వాపి రసాదీన్ బంధుమిచ్ఛతా
యత్నః కార్యః సుమతినా పరిహారే విరోధినామ్"

ఒకవేళ యట్లు నిక్షేపింపబడినను దానిని తప్పుకొనుటకు ననేక మార్గములు సూచింపబడినవి. అవేవియు వీరు పాటింపలేదు. కావ్యములో షష్ఠసర్గవరకు శృంగారరసముయొక్క ప్రాచుర్యమే కనుపించుచున్నది. అందుచే నంగరస మంగిరసమును మ్రింగివేయుచున్నది. అదికాక అంగ్యంగరసములు విరోధులైనపుడు అంగరసము తరువాత అంగిరసము స్ఫురించులోపల వేఱొక అంగిరసముతో, నవిరోధమైన రసమును స్ఫురింపజేసిన యీ దోషము తప్పిపోవును. నాగానందకారుడట్లే శాంతశృంగారముల నంగ్యంగ రసములుగా నుంచినను మధ్య యద్భుతరసమును స్ఫురింపజేసి యీ దోషమును సర్దుకొన్నాడు. ఈ కావ్యములో నా పద్ధతి ఛాయామాత్రముగనైనను కనుపించదు. "యః పునరేకాధికరణత్వే నిర్విరోధో నైరంతర్యేతు విరోధీ స రసాంతర వ్యవధానేన ప్రబంధే నివేశయితవ్యః, యథా శాంత శృంగారౌ నాగానందే నివేశితౌ." కావున కావ్యములో ప్రధానరసమే తారుమారైనది. ఇక నా యున్నరసమైన యుత్తమప్రకృతి యోగ్యము కాదని యిదివరకే సూచించితిని. ఏ దోషములైనను సహించవచ్చును. కాని రసదోషమును సహించుటెట్లు? వ్యుత్పత్తిలోపముచేనైన దోషము పరిహరింపదగినది కాదు. కాని యశక్తికృతమైన దోషమును మించిన దోషముండదు.

ఇక నీ కవులు వాడిన యలంకారములన్నియు వట్టి యలంకారములు. ఏ ప్రయోజనమును సాధింపవు.

"సంసరణ మహాబ్ధి మగ్నమగు మానవ
కోటిపయిన్ కృపాపరుల్."

ఇక్కడ కృపను ఝరిలో బోల్చుటలోనే ప్రయోజనము సాధింపబడినది? సముద్రములో మునిగినవారిని లేవనెత్తు సాధనములతో బోల్చిన ప్రయోజన మున్నది.

దీనిని బోలినదే మఱొకటి యున్నది.

"భవనిదాఘ సంతాపముల్ పరిహరించు
సత్యశాంతిదయాది నిర్ఝరుల్ పొంగను
నే విహార మహాహార్య మెక్కి యిటుల
కంట నీర్వొట్ట దగదు నీవంటివాడు."

విహారము కొండవంటిది. అందు సత్య శాంతి దయాది వాహినులు ప్రవహించుచున్నవి. ఇక్కడ కంటనీర్వొట్ట వలదనుటలో నేమి యాటంకమును వారించుచున్నారు?

"కావులు గట్టియున్ తరుణకంజహితున్ బురడించువాని" ఇంతవరకు మంచిదే "అవ్వలి మోమై యున్నవాని" నన్నారు. నందుడు శోకబాలుని ముద్దు బెట్టుకొనుచు వెనుకకు దిరిగియుండగా సుందరి చూచినది. అతనిని సూర్యునితో సమానముగా నన్నా ననుట రమ్యముగా లేదు. ఏమైన పై యలంకారము రమ్యముగానే యున్నది. కాని అవ్వలి మోమయి యనుటతోడనే యది చెడి యూరకొన్నది.

"బోనునబడ్డ భద్రగజపోతము పోలిక"

ఈ ఉపమలో లోకస్వభావము లేదు. ఏనుగు పిల్లలను బోనులలో పట్టరు.

"చని సోపాన తరము దెస
కనుగొని నిట్టూర్పువిడిచి గ్రక్కున మరలెన్
అనిలవశమ్మున జని గ
ట్టును డీకొని తిరిగి సుడివడు షడపదీలిన్"

ఏ పద్యము చూచినను బాగుగ నలిగిన బాటపై నుండి నడచినదిగనే కనుపించుచున్నది. ఈ కావ్య మంతయు సౌకుమార్యమను గుణముచే నిండిపోయినది. కావ్యములో ప్రసాదగుణమున్ననే రమ్యమని యాలంకారికుల యూహ. ప్రసాదగుణ మన్ని రస ములయందు తన్నర్పించుకొనును.

"సమర్పకత్వం కావ్యస్య యత్తు సర్వరసాన్ ప్రతి
స ప్రసాదో గుణో జ్ఞేయః సర్వసాధారణక్రియః"

ఈ కావ్యము నెల్ల చూచినను పాత్రికమునకు నిలువదు. దిఙ్మాత్రముగ కొన్నిటి నుదాహరింతును.

పొచ్చె మెరుగని భావముల్ పొందిపొసగి
వలపు నెత్తావులీనెడి భాగ్యమల్ల
మగునె గురుదేవ"

ఆ భాగ్యమెవరిది? దంపతుల భాగ్యమన వద్దా?

"బౌద్ధధర్మమే శరణమటంచు భిక్షువను సౌధపురస్థలి నిల్వగాంచి' ఒక భిక్షువను నిల్వ గాంచి యని యుండవలెను.

"పుష్పబాణాగమాద్యత్వ
ప్రాథమకుటంపవై"

ప్రాథమకుటంపవై కాదు. ప్రథముపవై యన వలెను.

"ఎలదేటి రెక్కతుదపై
బొలసిన గసుగందు మల్లెమొగ్గకు దులయై
తొలిసంజ నూత్నరుచులన్
గలకలమని నవ్వు వలపుగాదన దగునే?"

ఈ పద్యమువలన ఆ వలపుయొక్క లక్షణమెట్లు తెలిసినది?

"వసివాళ్వాడ, దొకప్పడు
గసుగందదు, మేల్మిచాయతగ్గదు, తావుల్
కొసరు, మరందము చిలుకును
విసువక యెదదాల్చునట్టి ప్రేమసుమమ్మున్"

ఈ భావము లెంతి పరస్పరభిన్నములుగ నున్నవో చూడుడు. పై పద్యములో వలపు కసుగందును. రెండవపద్యములో ప్రేమ కసుగందదట. కవుల భావములలో ప్రేమ, వలపులు విభిన్నములేమో! ఈ భావములకు లక్షణార్థమే తప్ప వాచ్యార్థముండదు. లక్షణార్థము తీసినచో పొసగదు. ముఖ్యార్థబాధ గలిగినచో లక్షణ. మరి లక్షణార్థబాధ గలిగినచో నేమని చెప్పవలెనో.

కావ్యదోషములలో ననౌచిత్యము కంటె నెక్కుడు దోషముండబోదు. ఈకావ్యములో నూటికి తొంబదిపాళ్ళు దోషమున్నది.

"అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా"

"ధర్మచక్రమ్మును కేల ద్రిప్పును" ధర్మచక్రమును త్రిప్పుట యేమిటి? ఇదేమైనా గారడీ విద్యయా.

"అతిమేటి సుకృతాత్మయైన మాయాదేవి
కడుపారగన్న బంగారుతండ్రి"

భారతములో కృష్ణునిగూర్చి వ్రాయుటచే నీ ధోరణి సొగసుగా నున్నది. కాని యిక్కడ సన్యాసిని గూర్చి వ్రాయుటచే నది సొగసుగా లేదు. పామరులైన ప్రజలు గుంపులు గూడి యయ్యో పాపము సన్యాసము పుచ్చుకొన్నాడేమని యను కొందురుగాని పై పద్యపాదములె యనుకొనరు.

"సడలని కౌగిలింతలను చందనచర్చలు పేటు లెత్తగా"

ఇది యెట్లు సంభవమని నా ప్రశ్న. విరహముచే హృదయమెండి పేటులు లేవవచ్చునేమో కాని సడలని కౌగిలింతలలో సంభవమే కాదు. కవి సమయమును కాదు.

"కవిమనః పంకజాసవసిక్తమై రసా
గ్రమున నాడెడి పదార్థములనంగ
ఆనందపరిపుల్ల మానీంద్రదహరతా
రాధ్వమందాడు జీవాత్మలనగ."

ఇవి శాస్త్రదృష్ట్యా నిలువవు.

నా చూడ్కులన్ ద్రావుదున్ నీ నవ్యామృత వీక్షణమ్ములన్.

నా చూపులతో నీ యందమును త్రాగుదునన్న ప్రయోగమును మన మెఱుగుదుము. ఈ ప్రయోగ మపూర్వము.

"రచియించుకొనిరా చెలియ చనుచెక్కు
లందు విశేషకమ్ము"

విశేషక మనగా నొసటిబొట్టు. సుందరి దానిని చెక్కులపై నేల యలంకరించుకొన్నది. అదేమైన శృంగారచేష్టయా (అశ్వఘోషుడు కూడ నిట్లే వ్రాసినాడు)

"ఎడపని ధర్మమార్గ మెటులే నొక యుండక నేయ"

ఏయు పదమునకు బాణము ప్రయోగించుట యని యర్థము. ఇక్కడ వేయు అని యుండ వలయును.

"రతనాలు పోహళించిన" దీనికంటె రతనాలు కూర్చిన యన్నచో బాగుండును. ఈ పోహళించు శబ్దార్థమును కృష్ణశాస్త్రిగారిమీద వ్రాసిన వ్యాసములో వివరించితిని.

"జాలిన్ బడె డేమిటికన్న
దైన్యభావము గదురన్"

జాలి, దైన్యము భిన్నార్థకములు కాబోలును.

"పాదుగ విడువని పెళ్లపై బుద్ధపాలి
యకొలునన్ తల్లి మేక యాగాంగణమున
రాల్చు కన్నటిబొట్లంకురములుగాగ
మొలచు మన్నవి విషవృక్షములు కుమార."

ఆ కన్నటిబొట్లతో దయావృక్షములు మొలచు నన్నచో నున్న సారస్యము దీని కుండదు. అది కాక యాగాంగణమున తల్లి మేకలను కోయరు.

"గొం కొంకెంత యనరీకృతమైన కోలంది"

అనరీకృతము నిట్లు వాడకూడదు. సంస్కృత సమాసపూర్వశబ్దమైన రమ్యముగా నుండును.

"స్వయము కోరి వరించి కయికొన్న"

తెలుగులో స్వయముగా నని వాడితీరవలెను.

"నేతి నేతి యటంచు ననేక గతుల
బలికి కన్గొనె తుదకు నిర్వాణపథము"

నేతి నేతి యనునవి వేదాంతములోనివి. వానిని తీసుకొనివచ్చి బుద్ధునియొద్ద వాడుటలో ప్రాచ్యము చెప్పిన దోషము సంఘటిత మగుచున్నది.

ద్వితీయసర్గాంతమందు నందుడు బుద్ధుని యొద్దకు వెళ్ళుచు సుందరిని బుజ్జగించెను.

'వలవని జాలిపూని నను
వారణ సేయకు, జేలవై కనుం
గొలుకుల నీరునింప కది
గో! గురుదేవు డతిక్రమించెడున్
చెలి! కనుమూపు మేర, నను
దెచ్చెర నంపిన దత్సపర్యలన్
సలిపి భవత్ పదాంబురుహ
సన్నిధికిన్ జనుదెంతు నింతలో.'

"అనుచు నూరార్చి పత్రసమంచితముగ
నాననమ్మును దడవి ముద్దాడి, రాజ
సాతిరంజిత చిత్రాంబరాళితోడ
నందు డున్నట్లు రేపు పయనంబుగాగ."

అని చెప్పినారు. చతుర్థసర్గలో నందుడు చానంమున సుందరి దుఃఖించుచు నిట్లు పల్కినది.

"నీ నయనమ్ము లాన, సుదు-
నిన్ గని మ్రొక్కిడి వేగమైయనా
శ్యాన విశేషకమ్ము భవ
దాననలక్ష్మి భంపవత్తుగా
దా, ననునమ్మి యంచు శప
థంబులు పల్కిన ధర్మవృత్తికిన్
హాని యొనర్చ లేక సరి
యంటిని ధత్పుల మిట్టులయ్యెబో."

ఇది ఎక్కడ నున్నది. నందుడు బుజ్జగించి వెళ్లునపుడు చెప్పినట్లే లేదు. పైగా దీనికి "గుర్తొకటి యుంచినారు. దీనినిబట్టి యున్నదున్నట్లుగనే యీ వాక్యము లుండవలెను గదా. నందుడు బుజ్జగించెనని చెప్పి ద్వితీయ సర్గాంతమందలి "వలవని జాలిపూని" అన్న పద్యమును తీసివేసినచో నిది సమర్థితమగును. కాళిదాసు కుమారసంభవములో రతివిలాపము పెట్టినాడు. ఆ రతీదేవి మన్మథుడు తన్ను విడిచి వెళ్ళునపుడు చెప్పిన మాటలను స్మరించుకొని యేడ్చును. రతిని విడిచి మన్మథుడు ఇంద్రుని సభకు వెళ్లునపుడు జరిగిన సంభాషణను కాళిదాసు వర్ణించలేదు. కావున దీనినిబట్టి యది అనుమీయమానము గావచ్చును. ఇక్కడ నందుడు వెళ్లునపుడు తేటతెల్లముగ కొన్ని వాక్యములు చెప్పినట్లు గలదు. ఇక్కడ అది యనుమీయమాన మగుటకు వీలులేదు.

ఈ కవులు పరిచ్ఛేద విభాగమును చేయుటలో గూడ నేర్పు చూపలేదు. ఉపదేశములో

"అని బుజ్జవమున బలికిన
విని నందుడు బెదరు సుంత విడిచిన మది నా
నన మెత్తిచూచి గౌతమ
మునికేమో విన్నవించబోయి మనమునన."

అన్న పద్యముతో సర్గ ముగించుట న్యాయము. దాని తర్వాత నారు పద్యములు ధర్మసంవాదములో చేర్పవలెను. ఆ యారుపద్యములు వ్రాసి యుపదేశము ముగించుటలో నేమైన విశేషమున్నదా యన్నచో నేమియు కనుపించదు.

ఈ కావ్యములో నున్న విరహాదివర్ణనలు ప్రబంధములనుండి యెరువుతెచ్చుకొన్నవి. శృంగార రసప్రధానములైన ప్రబంధములందు భాసించినట్లుగా నవి యిక్కడ భాసింపవు. ఇవన్ని సునిశితముగా నూహించి పరిహరించవలెను. అశ్వఘోషుడట్లు సంస్కృతమున పరిహరించుకొన్నాడు. అతడు శృంగార శాంతముల కంగాంగ భావము కూర్చెను. శృంగారముకంటె వేయిరెట్లెక్కువగా శాంతమును కావ్యమున కుప్పించినాడు. కావ్యమునందంతయు బౌద్ధమతపు వాతావరణము భాసింప జేసినాడు. ఇంతజేసియు నెట్లుపోయి యెట్లువచ్చునో యని శృంగారరసమునుండి శాంతరసము స్ఫురించులోపల శాంతరసమునకు, విరోధరసమైన యద్భుతమును స్ఫురింపజేసినాడు. కావ్యము వ్రాయుట కింత సూక్ష్మపరిశీలన కావలయును. వీరు వ్రాసిన యితివృత్తమంతయు నందములోనిదే. వీరు మార్చినది ముఖ్యముగా రెండు. అందొకటి ప్రేమసిద్ధాంతము—అశ్వఘోషుడు నందుని బోధకునిగా నిర్మించి బౌద్ధమతమును నుపదేశింపజేసెను. వీరు దానిని స్వీకరింపక యగమ్యగోచరము చేసిరి. ఇక రెండవది నంద సుందరులను సంఘసేవకులుగా మార్చుట ఇది క్రొత్తగానే యున్నది. కాని ప్రయోజనము లేదు. కొన్ని కొన్ని యంశముల కొరకు లశ్వఘోషుని దాటినట్లు వీరు చూడిరి. దోషమెవ్వరు వ్రాసినను దోషమే. సమ్యక్పరినిష్పత్తి మహాకావ్యమున కవశ్యకముగా నుండును. ఆ దృష్టితో నగలిన దోషముల నిరూపించుట న్యాయము. ఆ దృష్ట్యా అశ్వఘోషునిలో గూడ కొన్ని స్వల్ప దోషములున్నవి. కాని వానికి కప్పు ప్రతిభ యతని కున్నది.

కొన్ని శిల్పదోషము లుండవచ్చును. కొంత ప్రక్రియ సరిగా నుండకపోవచ్చును—కాలక్రమమునకు నిలువని కావ్యము లాధునిక యుగములో నున్నవి. వారు దానిపై అశ్రద్ధవహించుచున్నారని పాఠకులకు తెలియుటకు మాత్రమే యుదాహరించితిని. పద్యరచనవిషయములో నీ కవులధోరణి తెలియజేసి కనుమంటిని. ఒక్కొక పద్యము నెక్కడ కక్కడ చూచిన పరమ రమణీయముగ నుండు ననుటలో నాకు సందేహము లేదు. ఔచిత్యము—రసము—కథ—వీనిదృష్ట్యాయీ కావ్యము నిలువదు. కావ్యమునకు ముఖ్యముగా కావలసిన సామగ్రియే యది. మిగిలిన దోషము లందరిలో నున్నట్టే వీరిలో నున్నవి. అవి పెద్దదోషములని నే ననను. కాళిదాసాదులయందును దోషము లున్నవి. కాని వారి దోషము లిట్టివి కాదు. పద్యరచన రమ్యముగా నుండి మిగిలినవి లేని కవులు వేలకొలది యున్నారు.

"ఏనాస్మిన్నతివిచిత్రకవిపరంపరావాహిని సంసారే కాళిదాస
ప్రభృతయో ద్విత్రాః పంచషా వా మహాకవయ ఇతి గణ్యంతే."



# మధురానగరచరిత్ర

★ శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

చరిత్రను తెలియవచ్చిననాటినుండియు వైఘనదీ తీరముననున్న మధురానగరము సర్వసంపదలకు నిలయమై శోభిల్లుచుండెను. ఈ నగరరాజము తొలుత పాండ్య వంశస్థుల యధీనమున నుండెను. పాండ్యభూపతులు బలహీనులుకాగా వారిని జయించి చోళవంశేయులు మధురను కైవసము గావించుకొనిరి. 'గంగైకొండ చోళ' బిరుద విరాజితుడగు రాజేంద్రచోళుడు మధురను పాలించిన ప్రప్రథమ చోళ మహీపతియని చరిత్రకారుల యభిప్రాయము. పాండ్యులు వారికి సామంతులై కాలము వెళ్ళబుచ్చుచుండిరి. పదునాల్గవ శతాబ్దమునాటికి చోళుల ప్రాబల్యము తగ్గిపోచ్చెను. తగిన తరుణమునకై వేచియున్న పాండ్యులు బలము చేకూర్చుకొని మధురను వశముచేసికొన యత్నించిరి. కాని లాభము లేదయ్యెను. ఇది యిట్లుండగా క్రీ. శ. 1310 లో ఢిల్లీ పాదుషాయగు అల్లాయుద్దీనుచే ప్రేరేపితుడై మాలిక్ కాఫరు సేనాని దక్షిణాపథముపై దండెత్తివచ్చి విజయములు సాధించుచుండెను. పాండ్యమండలము (మధుర) కూడ వానికి స్వాధీనమయ్యెను. మాలిక్ కాఫరు జైత్రయాత్రలవలన దక్షిణభారతమున హైందవ సామ్రాజ్యభానుడు నల్లని మేఘముల చాటున మాటువడెను. చంద్రధ్వజము రెపరెపలాడనోడెను.

పిమ్మట క్రీ. శ. 1336 సం॥న విద్యారణ్యస్వామివారి సహకార సానుభూతులు సంప్రాప్తములు కాగా హరిహర బుక్క సోదరులు తుంగభద్రానదీ తీరమున విజయనగర రాజ్యమును స్థాపించి హిందూమతమునకును, సంస్కృతికిని జీవము పోసిరి. హరిహరరాయల మరణానంతరము 1343 సం॥న మొదటి బుక్కరాయలు సింహాసనమునకు వచ్చెను. ఇతని రెండవ కుమారుడగు వీరకంపనరాయలు మహాసాహసుడగు యుద్ధవీరుడు. ఈతని నాయకత్వము క్రింద విజయనగర సైన్యము మధురపై దండెత్తి తన్నగరము నేలు సుల్తానును సంహరించి, మధురను హస్తగత మొనర్చుకొనెను. ఈ విజయగాథను కంపనరాయలవారి సతీతిలకము గంగాదేవి తన 'మధురా విజయ'మను సంస్కృతకావ్యమున మనోజ్ఞముగ నభివర్ణించియున్నది. అతని జైత్రయాత్రాఫలితముగ మధుర విజయనగర సామ్రాజ్యమున లీనమైపోయెను. నాటినుండియు విజయనగర సమ్రాట్టుల ప్రతినిధులు మధురను పాలింప దొడగిరి.

విజయనగర సమ్రాట్టుల పక్షమున మధుర నేలిన వారిలో పేర్కొనదగినవారు కోట్యము నాగమ నాయకుని వంశస్థులగు నాయకరాజులు. తొలుత వీరు విజయనగరసామంతులుగ వ్యవహరించుచు వచ్చినను పిమ్మట స్వాతంత్ర్యము ప్రకటించుకొని స్వతంత్ర రాజులయిరి. ఈ నాయకరాజులు తెలుగువారు. కాశ్యపగోత్రజులు. వీరి పరిపాలనమునకు శాశ్వత చిహ్నములుగ పాండ్యమండలము నందెన్నటనో చూచినను నాయకరాజులు నిర్మించిన మహోన్నతములైన ఆలయములు, శత్రు దుర్భేద్యములగు దుర్గరాజములు, అందాలు చిందు శిల్పకళాఖండములు, సుందర మందిరములు, సత్రములు— నేటికి గూడ కలకలలాడుచు గనబడుచుండును. ఇట్టి నాయకరాజుల యేలుబడిలో నందాలు దిద్దుకొనిన మధుర మఱల మహమ్మదీయుల హస్తగత మయ్యెను.

మధుర నేలిన రాజులకు సంబంధించిన చారిత్రక లేఖనములు తెలుగు, తమిళములందు జాలగలవు. వీనిలో 'మధురై త్తల వరలారు' అను తమిళ లేఖన మతి ముఖ్యమయినది. దీనిలో మధురను పాలించిన రాజులెల్లరు పేర్కొనబడిరి. ఎప్పుడు వారు రాజ్యమునకు వచ్చిరో, ఎంతకాలము వారు పాలించిరో, వారు చేసిన దానధర్మము లెట్టివో— మున్నగు విషయములు కూడ నుదాహరింపబడినవి. కాని ఆధునిక చరిత్రకారుల పరిశోధనలవలన బయల్పడిన యంశములనుగస్కరించుకొని చూచిన నీ లేఖనములో పేర్కొనబడిన తేదీలు కొన్ని సరికావని ఋజువవలసియున్నది. అయినను కాలనిర్ణయము చేయు నవసరమున నీ లేఖనమువలన గొంతయైన లాభము చేకూరునని నుడువుట సమంజసము!

తొలుదొలుత మదురై త్తలవరలారును పరిష్కరించినవారు కీ. శే. రాఘవయ్యంగారు. వీరు భాషా కవిశేఖర బిరుదాంకితులు. తమిళమున గొప్ప పండితులు; విమర్శకులును. వారే దీనిని సెందమిళ్ యను పత్రికలో బ్రచురించిరి. మదురై త్తల వరలారులో మధురనాయకరాజులను గూర్చి పేర్కొనబడిన యంశములను మాత్రము ఈ వ్యాసములో యథాతథముగ నుదాహరించితిని.

"శకాబ్దం 1481 మీద చెల్లు రౌద్రి సంవత్సరం మార్గళి నెల రాయలవారి ఉత్తరువు ననుసరించి కోట్యం నాగమ నాయకుని కుమారుడు విశ్వనాథ నాయనయ్య మధురకు వచ్చి రౌద్రి సంవత్సరం మార్గళి నెల మొదలు ఆంగీరస సంవత్సరం వైగాసి నెల వరకు 12 సం॥లు రాజ్యంచేసి అస్తమించిరి. పిమ్మట ఆంగీరస సం॥ ఆణి నెల మొదలు వృష సంవత్సరం వైగాసి నెలవరకు 8 సం॥లు విశ్వనాథనాయనయ్య కుమారుడు కృష్ణప్ప

నాయనయ్యా రాజ్యం పాలించి అస్తమించిరి. వృష సం॥ ఆణి నెల మొదలు మన్మథ సంవత్సరం వైగాసి నెలవరకు 14 సం॥లు కృష్ణప్ప నాయనయ్యా కుమారుడు వీరప్ప నాయనయ్యా రాజ్యంచేసి స్వర్గస్థులయిరి పిమ్మట మన్మథ సం॥ మొదలు శుభకృతు సంవత్సరం ఆణినెలవరకు 7 సం॥లు వీరప్పనాయనయ్యా కుమారుడు కుమారకృష్ణప్ప నాయనయ్యా రాజ్యం పాలించి అస్తమించిరి. శుభకృతు సం॥ పెరటాసి నెల మొదలు ప్లవంగ సంవత్సరం మాసి నెల 5 సం॥లు కుమార కృష్ణప్పనాయనయ్యా తమ్ముడు విశ్వప్పనాయనయ్యా రాజ్యంచేసి స్వర్గం అలంకరించిరి. ఆయన తమ్ముడు కస్తూరి రంగప్ప నాయనయ్యా పట్టానికి వచ్చి నాటికి (నదీ) తీరమునయున్న సంధ్యా మంటపములో ఎనిమిదవ రోజున అస్తమించిరి పిమ్మట విశ్వప్ప నాయనయ్యా కుమారుడు ముద్దుకృష్ణప్ప నాయనయ్యాయూ, ఆయన కుమారుడు ముద్దువీరప్ప నాయనయ్యాయూ పట్టం కట్టుకొని ప్లవంగ సం॥ పంగుణినెల మొదలు దుందుభి సం॥ కార్తీకమాసం వరకు 15 సం॥లు రాజ్యంచేసి స్వర్గస్థులయిరి. దుందుభి సం॥ మార్గళినెల 7 వ తేదీ ముద్దువీరప్ప నాయనయ్యా వారితమ్ముడు ముద్దు తిరుమల నాయనయ్యా వారు పటంగట్టుకొని శ్రీ మీనాక్షీ సుందరేశ్వరుల కటాక్షానికి పాత్రులై, స్వామివారికి అనేక ఆభరణాలు చేయించియిచ్చి, కొత్త (పుదు) మంటపం, తెప్పకుళములు కట్టించియు, స్వామిసన్నిధిలో బంగారుపూత వేసిన సింహాసనము దంతంతో చేయబడిన చపురమును, రత్న సింహాసనమును చేయించి యిచ్చి, ఏకుకుళ్ళకు అనేకంగా సత్కార్యాలుచేసి నిత్యపూజకుగాను నలభైనాలుగువేల పణములు (ఆదాయం లభించు) సీమను ఇచ్చి గుడికి సంబంధించిన పరిజనులకు అన్నపానాదికములకుగాను సర్వమాన్య అగ్రహారములు యిచ్చివేసి, తమ సొంతంలో గృహనిర్మాణమున్ను చేసి, ఉత్సవాదులను వైభవంగా జరిపించి స్వామి అళగర్ వారికి చిత్తిరైఉత్సవానికి చప్పరము కట్టించి స్థలము లన్నిటిని మిగుల ప్రబలంగాచేసి, "స్వామిదర్శనానికి వస్తే స్వామికి పాదకానుక అభిషేక నైవేద్యాలకు వెయ్యిపణములు యిచ్చేది; మాడవీధిలో వేంచేసియున్నప్పుడు స్వామివారికి వెయ్యిపణములు యిచ్చేది;" ఈ విధంగా దుందుభి సం॥ మాసినెల 7 వ తేదీ మొదలు విళంబి సం॥ మాసినెల 4 వ తేదీవరకు 36 సం॥లు రాజ్యం పాలించి విళంబి సం॥ మాసినెల 4 వ తేదీ మంగళవారం రాత్రి దైవికం చెందిరి. విళంబి సం॥ పంగుణినెల మొదలు వికారి సం॥ వైగాసినెల వరకు 3 సం॥లు ఆయన కుమారుడు ముద్దు వీరప్ప నాయనయ్యా రాజ్యం పాలించిరి. వికారి సం॥ ఆణినెల మొదలు దుందుభి సం॥ ఆణి నెల వరకు 24 సం॥లు ముద్దు వీరప్పనాయనయ్యావారి కుమారుడు చొక్కనాథనాయనయ్యా రాజ్యంచేసి ఆణినెల 4 వ తేదీ స్వర్గస్థులయిరి ఆయన కుమారుడు రంగకృష్ణ ముద్దువీరప్ప నాయనయ్యా రుధిరోద్గారి సం॥ ఐప్పసినెల 17 వ తేదీ మొదలు ప్రమాదీచ సం॥ వరకు 7 సం॥లు రాజ్యంచేసి స్వర్గస్థులయిరి. పిమ్మట ఆయన కుమారుడు విజయరంగ ముద్దు చొక్కనాథ నాయనయ్యా పసిబిడ్డగా ఉన్నందువల్ల ఆయన అవ్వ రాణీ మంగమ్మగారు ఆ బిడ్డను ఒడిలో కూర్చుండబెట్టుకొని కొద్దిరోజులు రాజ్యం పాలించినారు. అప్పుడు చాలా అగ్రహారప్రతిష్ఠలు, సత్రములు, శాలలు నిర్మించి, తిరుమలనాయనయ్యావారి రోజులలో జరిగిన ఒప్పందం ప్రకారం దేవాలయ విషయములను జరిపించుతూవచ్చిరి. మంగమ్మగారు స్వర్గస్థులయిన పిమ్మట విజయరంగ ముద్దు చొక్కనాథనాయనయ్యా రాజ్యం పాలించుచూ పూర్వం తిరుమలనాయనయ్యావారి రోజులలో జరిగిన విధంగా జరిపించుతూ వచ్చిరి. ఆ విధముగా జరిగే రోజుల్లో ఒక నాడు నగరశోధనకు గాను ఒంటరిగా గుడికివచ్చి చూచిన సందర్భమున గుడిలో పూజ, దీప, ధూప నైవేద్యాలు పూజ్యంగా జరిగిన వైనం చూచి వారు అంతఃపురంపోయి చేరిరి. మరునాటి ఉదయం గుడికి సంబంధించిన పరిజనులందరినీ రప్పించి మనం గుడికిగాను సర్వమాన్యముగా నలభైనాలుగువేల పణముల సీమను విడిచియుండగా ఈవిధంగా దైవకార్యంలో లోపం ఎందుకు వచ్చింది—అని చాలాకోపం చేసుకొని పరిజనముల యధీనంలో నున్న గ్రామాలను సర్కారులో చేర్చి వారి గ్రామాలలో వుంచబడిన భూమి పట్టాలను తీసుకొని పరిహారించివేసి ఏకుకుళ్ళ పూజకు నలభైనాల్గువేల పణములున్నూ, అంతఃపురం బొక్కసంలోనుంచి నిత్యపూజను, ప్రత్యేకపూజలు అలంకారవిశేషము, ఉత్సవాదులను, అళగర్ స్వామివారి చైత్రోత్సవమును (చిత్రి) విమర్శగా జరిపించుచు పరిజనములకు గుడికి పూర్వం తిరుమల నాయనయ్యావారి రోజులలో విడిచిన విధంగా నిర్వాహక గ్రామము (భటవృత్తిమాన్యము) అర్చనాగ్రాములను సర్వమాన్యంగా విడిచి వేసి బహు విమర్శగా నడుపుతూ వచ్చిరి. వారు 40 సం॥లు రాజ్యం పాలించి విరోధికృతు సం॥మాసినెల శివరాత్రిరోజున దైవికంచెందిరి. విరోధికృతు సం॥ మాసినెల మొదలు సిద్ధార్థ సం॥ వైగాసినెల వరకు 9 సం॥ములు విజయరంగ చొక్కనాథనాయనయ్యా భార్య మీనాక్షియమ్మ పట్టంగట్టుకొని సోదరుడైన వెంకటపెరుమాళ్ నాయకుని సహాయంతో రాజ్యం చేసిరి."

# గ్రంథవిమర్శనము

## పెనుమంచిలి జైన దేవుడు

[మున్నగు పది కథలు]

కవికొండల వేంకటరావు. అభినవాంధ్ర కార్యస్థానము, రాజమహేంద్రవరము. వెల 1-4-0

ఇవ్వన్నీ ఆంధ్రదేశంలో ప్రసిద్ధములైన పుణ్యక్షేత్రాలనుగూర్చిన కథలని పుస్తకంమీద ఉన్నది.

శ్రీ కవికొండల వెంకటరావుగారి రచనలలో ఆంధ్రదేశప్రసిద్ధములైన పుణ్యక్షేత్రాలు, వాటికి సంబంధించిన పామర పౌరాణిక గాథలు మన కళ్ళెదుట కట్టేటట్టు చేశారు.

ఆయా పుణ్యక్షేత్రాలు, వాటికి సంబంధించి పల్లె టూరి పరిసరాలు, ధ్వజస్తంభాలు, వాటి చిరుగంటల మోతలు, పాడుపడిన జైన, చారిత్రిక విగ్రహాలు, సహజమైన వాతావరణంలో చిత్రించడంలో శ్రీ వెంకటరావుగారు దిట్టలు. ఈ రచనలన్నీ చదువుతూంటే మనకు—సర్వత్ర ఆంధ్రదేశ జానపద పరిసరాలలో హాయిగా సంచరిస్తూన్నట్లే ఉంటుంది.

నిజానికి కథాలక్షణాలున్న రచన లింపులో చాలా తక్కువే. ఆంగ్లభాషలో 'స్కెచ్' అనే జాతి రచనల లక్షణాలే ఈ రచనలలో ఎక్కువగా కనిపిస్తున్నాయి.

అయితే ఈ చిన్ని రచనలన్నీ కథలంత ఉత్సాహంగాను నడిచిపోతాయి.

---

ఈ పదిరచనలలోను 'పెనుమంచిలి జైనదేవుడు,' 'శ్రీరంగపట్టణపు నడువీధి పెరుమాళ్ల స్తంభము', 'కొపవరపు చెరువులో కోరుకొండ నరసింహస్వామి నీటినీడలు' అత్యుత్తమమయిన రచనలు. వీటిలో చాలాచోట్ల రచయిత అత్యుత్తమ కవితాశక్తి స్ఫోరకాలైన ఘట్టాలెన్నో ఉన్నవి. కవికొండలవారి రచనావైవిధ్యం పరిశీలింప దలచినవారిది తప్పక చదవవలసిన పుస్తకము.

## (2) పొట్టి రవికెలు, వాలుజడలు

[మున్నగు పదికథలు]

కవికొండల వేంకటరావు, అభినవాంధ్ర కార్యస్థానము, రాజమహేంద్రవరము. వెల : రూపాయి.

పై సంపుటిలోని రచనలకు ఈ రచనలకు చాలా భేదం ఉంది. ఈ సంపుటిలోని రచనలలో పల్లెల్లోను పట్టణాల్లోను జరిగే సంఘటనలకు సంబంధించినవి.

వీటిలో రెండు చక్కనికథ లున్నాయి. ఈ కథలు చాలా సంప్రదాయధోరణిలో చెప్పబడుతున్నట్లుంటాయి. కాని వీటిలో కథనశక్తి చాలా నిశితమైనది. వీటిలో మొదటిది శృంగారశ్రేష్ఠి. రెండవది పెద్దూరు. ఇక మిగిలినవాటిలో కథలన దగినవి లేనేలేవని చెప్పవచ్చును. అయితే ఈ మిగిలిన రచనలలో అంతటా పల్లెటూరి రైతుపడుచులు మొదలుకొని పట్నవాసపు రంగేళీలదాకా—అన్ని రకాల జనాభా ప్రత్యక్షమౌతూంటారు.

ఈ వ్యక్తులను చిత్రించడంలో వెంకటరావు గారి దగ్గర ఒక విశిష్టమైన ప్రత్యేకత కనబడుతుంది. వీరందరు అచ్చంగా తెలుగుదేశంలో కనబడే మనుషులలాగే ఉంటారు. ఈ విధమైన సహజము, స్వాభావికము అయిన వ్యక్తిచిత్రణం వీరి సొమ్ము. అయితే ఈ వ్యక్తిచిత్రణాలలో కొన్ని సంపూర్ణంగాను, సర్వాంగ సుందరంగాను ఉంటాయి. 'శృంగారశ్రేష్ఠి'లోని వ్యక్తిచిత్రణాలన్నీ ఈ తరహాకు చెందినవి.

ఈసంపుటిలో చివర రచనలలో వచ్చే ఈ వ్యక్తిచిత్రణాలు చాలావరకు కేవలం రచయిత ఊహావేశంలో పుట్టి గాలికీ ధూళికీ కొట్టుకుపోయేటంత అస్పష్టంగాను, అసంబద్ధంగాను ఉంటాయి.

బహుళశః ఈ రెండురకాలైన ఫణితులు మొత్తంమీద వీరి రచనలలో అంతటా కనిపిస్తూఉంటాయని చెప్పవచ్చును.

ఈ సంపుటిలో శృంగారశ్రేష్ఠి, పెద్దూరు వంటి పటిష్ఠమైన రచనలు మొదలుకొని కేవలం ఖులాసాకోసం చదువుకోడానికి వీలైన 'రయిషు సమస్య' దాకా అన్నిరకాల రచనలు ఉన్నాయి.

భాషలో, భావాలలో వైదేశిక వాసనలేని అచ్చమయిన జాతీయత ఈ రచనలలో కనబడే ప్రత్యేకత.

# గ్రంథస్వీకృతి

## ప్రయోజన విద్య

1. మొదటిపుస్తకము.

2. రెండవపుస్తకము.

రచయిత : గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారు. ప్రకాశకులు : ఆంధ్రగ్రంథాలయ ట్రస్టు,

పెనుమట లంక. వయా విజయవాడ. వెల : ఒక్కొక్కటి అయిదు అణాలు.

వయోజనుల విద్యాభివృద్ధికి తోడ్పడే వాచక పుస్తకాలు మన భాషలో లేనేలేవని చెప్పవచ్చును. శ్రీ హరిసర్వోత్తమరావుగారు రచించిన ఈ పుస్తకాలు రెండు వయోజనుల మనస్తత్వాల ననుసరించి రచించినవి. ఈ పుస్తకాలు రెండు వయోజన విద్యాభివృద్ధికి అత్యంతోపయుక్తమైనవి.

## శమనగర్వ భంగము

[హరికథ]

బంకుపల్లి కనకాచలకవి. ప్రతులకు : నగరంపల్లి బ్రహ్మానందంగారు. పలాసా. విశాఖపట్టణం జిల్లా వెల 12 అణాలు.

ఇది మార్కండేయచరిత్రాత్మకమైనది. కీర్తనలు పద్యాలు మొదలయినవాటితో సాంప్రదాయిక మార్గంలో రచించిన హరికథ.

## వివేక కౌముది

బగ్గాం సన్యాసప్పకవి, ప్రతులకు : రామభద్రపురం పి. ఓ. బోనంగి. వయా. విజయనగరం. వెల : నాలుగణాలు. ఇది నీతిబోధకమైన కందపద్య శతకము.

## పరమార్థతత్త్వము

శ్రీకొండమూర్తి వేంకటనరసయ్య. సాధనగ్రంథమండలి తెనాలి. వెల 12 అణాలు. ఇది ఈశ్వరనామ ప్రభావము, నామ సంకేతాలు మొదలైన వాటిని గురించిన సప్రమాణంగా వివరించే గ్రంథము.

## జాతీయ గీతాలు

ఆరవెల్లి సత్యనారాయణాచార్యులు. భీమవరప్పుకోట. వయా తుని. తూర్పుగోదావరిజిల్లా. వెల. రెండణాలు. రచయిత వ్రాసిన జాతీయగీతాలన్నీ ఈ చిన్న పుస్తకంలో సమకూర్చారు. ఈ జాతీయ గీతాలన్నీ కాంగ్రెసు పరమైనవే.

**1 పఠన మందిరాలు, 2 మదరాసు పౌర గ్రంథాలయ చట్టము, 3 గ్రంథాలయ ప్రచారం, విజ్ఞాన వ్యాప్తి, 4 గ్రంథాలయ సూత్రాలు, 5 తెలుగు పుస్తకాల వర్గీకరణము.**

ఈ అయిదు పుస్తకాలు రచించినవారు, పాతూరి నాగభూషణంగారు. ఈ అయిదు ప్రతులకు; గ్రంథాలయ పుస్తకశాల. పటమట పోస్టు:



# ఆమెకు తెలుసును!

ఆమె చాలా చురుకైనది.

సాయంత్రం అలసిపోయి యింటికి చేరిన భర్తను సేద దీర్చి ఉల్లాసవంతంగా చెయ్యడం ఎలాగో ఆమెకు తెలుసు. అతడు దుస్తులు మార్చుకునే లోపుగా, ఒక గ్లాసు "టీ" అతనికి అందిస్తుంది.

"చూడండి! ముందు 'టీ' తాగండి; లేకపోతే చల్లారి పోతుంది," అని ప్రేమతో, అనురాగంతో ఆజ్ఞాపిస్తుంది.

భర్తకు రుచించే విధంగా "టీ" తయారు చెయ్యడం ఆమెకు తెలుసు. అందరు ఆదర్శవంతమైన గృహిణులవలెనే, ఆమెకు కూడా—చక్కెర, పాలు, ఏ పాళ్లలో కలపాలో, వేడి ఎంత ఉండాలో, సరిగా తెలుసు.

చాలా చవకగా, తక్కువ వ్యవధిలో, శ్రమ లేకుండా తయారుచేయగలిగిన పానీయం "టీ" అని వేరే చెప్పాలా?

"మంచి 'టీ' ఒక కప్పు ఎలాగ తయారు చేయుట" అనే పుస్తకం (బొమ్మలతో సహా) ఉచితంగా అడిగినవారికి పంపబడుతుంది. ఈ క్రింది అడ్రసుకు వ్రాయండి: సెంట్రల్ టీ బోర్డ్, 27 & 29 బ్రేబోరన్ రోడ్డు, కలకత్తా.

## మంత్ర శక్తి నిచ్చే పానీయం "టీ" త్రాగండి



సెంట్రల్ "టీ" బోర్డువారివల్ల ప్రచురింపబడినది.

CTB 67



త్వరలో వస్తోంది!
విజ్ఞాన వినోదాలను
ఉత్తమ స్థాయిలో
అందించు
శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ వారి
పేదరైతు
దర్శకత్వం.. కె.బి.నాగభూషణం
అసోసియేట్.. ఇంటూరి
అంజనీదేవి
కన్నాంబ
శ్రీ.రామమూర్తి
చమ్రియా రిలీజ్




ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు

అలెగ్జాండర్ డ్యూమా రచించిన

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(రెండు భాగములు)

అనువాదం:

సూరంపూడి సీతారామ్

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికనుండి పునర్ముద్రితము

సంపుటము ఒకటికి మూడున్నర రూపాయిలు

అమ్మకమునకు సిద్ధముగానున్నవి.

---

సిద్ధముగా వున్నవి! త్వరపడుడు!!

# టామ్‌సాయర్

(పిల్లలనవల)

రచన:

మార్క్ ట్వేన్

అనువాదం:

నండూరి రామమోహనరావు

వెల రెండురూపాయిలు

కాపీలకు:

ఆంధ్రగ్రంధమాల, మద్రాసు—1.




"నిరీక్షణ"

(ఇంటర్నేషనల్ కంటెంపరరీ ఆర్టుఎగ్జిబిషన్, ఢిల్లీలో 'ఏ' బహుమతిపొందిన చిత్రం)




నందన
భాద్రపదము

# భారతి

సంపుటము 29
సంచిక 9


# నీలిమబ్బులు




శ్రీ బొడ్డు బాపిరాజు


నీలాల నీటి మబ్బులు
వ్రేలెను మాయనుగు తెనుగు విను వీధులలో;
లీలా విధృత శ్రావణ
బాలాకమనీయకైశ్యబంధములగుచున్

మధురవినీలకాంతి సుషిమాకృతులై రమణీయ దక్షిణా
పథముల కాదృతిన్ వలసవచ్చిన వింధ్య హిమాచలమ్ములో !
విధురనిదాఘ నిర్దళన విక్రమముల్, సురరాజ వాహినీ
రథములో ! నీల నీరదములౌనో, వియత్పథి సాగె నుద్ధృతిన్

తుమ్మెద రెక్క కామ్మెరుగు దొంతరలై, తళుకుంజిలుంగు పిం
ఛమ్ముల విప్పి నాట్యములు సల్పు నెమళ్లయి, లేజివుళ్లజొం
పమ్ముల పూలగాలి పసిపాపల నూయెల లూపు నెత్తమా
లమ్ముల కొమ్మలై సొగసులద్దెను మింటియెడంద మేఘముల్

నిగనిగనైన మబ్బుకొన నెక్కొను వెల్గుశలాకవంపు సో
యగములు తొంగి చూచు—హృదయమ్మున నెన్నఁడొ దాచుకున్న క్రేల్
స్సిగముడినేలు మల్లెవిరిచెండుల ; కాటుక కంటి రెప్పలన్
బగటగు బాష్పబిందువుల ; వాతెరయంచుల జారు నవ్వులన్.

చల్లని మబ్బుతెప్ప తెరచాపలు పట్టినజోక, నిద్దపుం
దెల్లని రెక్కసాచి పరతెంచెను కొంగలబార్లు—సీరసో
ద్వేల్లితమైన యీ భువన వీథులకుం దిగివచ్చు వేలుపు
న్వెల్లువ క్రొత్తరంగ నురువెత్తిన తుంపర చిందు చిందులై !

నవనవరమ్యరమ్యపరిణామ విభాస్వదనల్ప కల్పనా
వ్యవధులు, వారి వాహనివహంబులు సత్కవిమానసంబులై;
భువన మహానసంబులయి పొల్చెను. పల్చని సంజవెల్గుల
స్నవకము దేరె నింటివలనై చనువెంచెడి పాడి మందలై.

జలరాశి ముద్దు కన్యలు
తొలకరి క్రొన్నీటి మబ్బుదొరసానులు మా
తెలుగుం బొలాల నమృతము
లొలుకుచు బంగారుపంట లొరిగింతురులే !



# త్యాగరాజు - సాహిత్యము





శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

త్యాగరాజస్వామి సిద్ధిపొంది, నూరేళ్లు దాటిపోయింది. చెన్నపట్నమూ, బెజవాడా, రాజమహేంద్రవరమూ వంటి పట్టణాలలో శతవార్షికోత్సవాలు వైభవంగా జరిగినవి. కాని ఈ యుత్సవాల ఫలితంగా త్యాగరాజు సంగీతరచనకికన్న సాహిత్యరచనకే ఎక్కువ ప్రచారము జరిగినది. చెన్నపట్నములో రసికరంజనీ సభలో వినబడిన ఉపన్యాసాలూ, రాజమహేంద్రవరపు గౌతమీవిద్యాపీఠమువారు ప్రచురించిన త్యాగరాజ శతవార్షికోత్సవసంచికలోని వ్యాసాలూ, ములకనాటి సభవారి సంచికా, బెజవాడ కార్యక్రమమూ, అన్నీ కూడా త్యాగరాజు సాహిత్యవిభూతినే ఎక్కువగా ప్రచారము చేసినవి. రాజమహేంద్రవరపు ఆంధ్రగానకళా పరిషత్తువారు "త్యాగరాజ కీర్తనలు" సవ్యాఖ్యానముగా ప్రచురించి త్యాగరాజు సాహిత్యానికి పరిషన్ముద్ర వేశారు. టి. వి. సుబ్బారావుపంతులుగారు త్యాగరాజు కవిత్వము కబీరు కవనాన్ని మించిపోయిందనేశారు. వీరభద్రశాస్త్రిగారు త్యాగరాజుని మహాకవి అన్నారు. శతవార్షికోత్సవోత్సాహంలో ఈరీతిగా ఎందరో ఉస్తాదులు "బస్తీమే సవాల్" చేశారు. త్యాగరాజస్వామిని ఇంతవరకూ గుర్తించుకోలేకపోయిన తెలుగుజాతికి ఆయన ఘనతను చూపించేయత్నంలో పైపండితుల యుత్సాహశకటము సంగీతరస్తా తప్పి సాహిత్యరస్తాలో సుదూరము సాగిపోయినది. ఇన్ని సంస్థలలో ఏ ఒక్కటీ కూడా త్యాగరాజు కీర్తనలను మొత్తంగా స్వరసహితంగా ప్రచురించలేదు. రాజమహేంద్రవరపు వారు 'త్యాగరాజశతవార్షికోత్సవ కార్యక్రమమూ' 'శతవార్షికోత్సవసంచికా', 'త్యాగరాజ కీర్తనలు—సవ్యాఖ్యానమూ', మొత్తము వేయిపుటల్ని మించిపోయిన గ్రంథము ప్రచురించారు. స్వరపరచిన 'అపురూప' కీర్తనలు నూరు అచ్చై ఎట్టకేలకు వచ్చినవి. నూరు కీర్తనలు! దానితో కథ కంచికి పోయింది! తక్కిన ఐదువందల కీర్తనలూ అందరికీ అందుబాటులో ఉన్నట్లే పై పరిషన్నిర్వాహకుల నమ్మకమన్నమాట.

ఏతావతా శతవార్షికోత్సవానికి ఆంధ్రులు వెలువరించినది—కబుర్లుతీసి వేరే పెట్టినట్లైతే—నూరు కీర్తనలు! త్యాగరాజస్వామి మహాగాయకుడూ, వాగ్గేయకారుడూ అయివుండగా మనము ఆయన నొసటికి సాహిత్యకుంకము పెట్టి ఊరేగించుకోడము మనకు రసికమండలిలో గౌరవాపాదకము కాదు. సంగీతకళకు ఔన్నత్యము చేకూర్చిన కారణము

చేతనే త్యాగరాజునకు గౌరవము వచ్చినది కాని అంద
మైన సాహిత్యభావములను వెలిబుచ్చినందుకు కాదు.
ఆయన జన్మము ద్రావిడభూమిలో. ఆయన రచించి
నది సమకాలికులకు ఎందరికో తెలియని తెలుగు
భాషలో. ఈనాటికీ తెలుగు తెలియని దాక్షిణాత్య
విద్వాంసు లాయన కీర్తనలు వినిపిస్తున్నారంటే,
ఆ కీర్తనలలోని భావాలకు తన్మయులై కాదు, వాటి
లోని సంగీతకళావిన్యాసమునకు ముగ్ధులై ముగ్ధులను
చేయుటకే. సాహిత్యభావాలు ఏలాగున్నా సంగీత
రచన గొప్పగానున్న కారణముచేతనే దక్షిణదేశమం
దంతటా ఆయనపేరు మారుమ్రోగినది. ఆయన కీర్తనల
లోని వాక్కులు చేలమాత్రములే. సంగీతమే వాటికి
జీవము. అలాంటప్పుడు త్యాగరాజు సంగీతాన్ని వెను
కకు నెట్టి సాహిత్యాన్ని తీసుకొచ్చి ప్రదర్శించడము
ఓరుదైన కార్యమా?

భరతుని కాలమునాటికి గాంధర్వకళ స్వరతాళ
పదాశ్రయము. జాతకకథలలోగాని, బౌద్ధశిల్పము
లలో గాని తాళమూ, జంత్రమూ లేని గాంధర్వము
కానరాదు. హీనయాన బౌద్ధులు గాంధర్వమును
ఇంద్రియలోలత్వము కలిగించుకళగా పరిగణించి
బహిష్కరించినా, బ్రాహ్మణ మతాభిమానులైన గుప్త
రాజులు జంత్రగానమును స్వయముగా సాధకము
చేయుచు పోషించిరి. హర్షుని కాలమునాటికి నాట
కాలలో తాళాశ్రయములే అయిన పదములు పాడు
పద్ధతి ప్రారంభించినా పదకొండో శతాబ్దమువరకూ
పదములలో సూత్రప్రాయముగా మెలగిన రాగము
ప్రత్యేకముగా గుర్తించబడినట్లు కనబడదు. నృత్య గీత
వాద్యముల చేరికయే సంగీతము (సభ్యకళ) అనే పరి
గణన అదృశ్యమై పద రాగతాళముల చేరికకూడ సంగీ
తమే అనే అభిప్రాయము అప్పుడు ప్రబలినది. సేనరా
జుల కాలములో రాగము సాహిత్యపు ఛాయలోనే
ఒదిగియుండినట్లు జయదేవుని అష్టపదులు సాక్ష్యమిస్తా
యి. పురందరదాసు రచనలలో రాగానికి కొంచెము
సంకెళ్లు సడలినట్లు కనబడినా రామదాసు కీర్తనలలో
అక్షరస్వరాలే హుమూలైనాయి. తాళ్ళపాకవారు
పల్లవి అనుపల్లవి చరణమూ అనే రచనలతో కీర్తనా
శిల్పాన్ని పెంచారు. క్షేత్రయ్యా, జావళీకర్తలూ,
కీర్తనలను చౌకకాలానికి దింపుటతో కీర్తనలలోని
సంగీతానికి కాస్త ఊపిరి తిరిగింది. దీక్షితులవారి
సంస్కృత కీర్తనలలో కావ్యభాషే అధికారము
చెలాయించినా, రాగము వెలయేరులాగ పెలికలు
తిరిగి ప్రవహించి తన చైతన్యాన్ని స్ఫురింపజేసింది.
చైతన్యమయుడైన త్యాగరాజు చేతిలో రాగానికి
అధికారము వచ్చింది. ఒకే చరణమును మూడేసి సంగ
తులు చేర్చి పాడే ఆచారము ఆయన కల్పించారు.
ఉమాకాన్త విద్యాశేఖరులన్నట్లు ఒక్కమారువింటే
సాహిత్యభావము బోధపడిపోతుండగా రెండు మూడు
మార్లు వినిపించడము దేనికి? సంగీతానికి వైశాల్యం
కలిగించడానికే. దీనికి తోడు త్యాగరాజ కీర్తనల
హ్రస్వరూపము ఒకటి బాగా తోడ్పడింది సంగీత
విస్తృతికి. పదిపన్నెండు చరణాలతో బండ్లవరుసవలె
కనపడే రచనలముందు, ఒకటి, రెండు చరణాలతో
సాంతమైపోయే త్యాగయ్యకీర్తన చంచల చైతన్య
మూర్తియైన హరిణశాబకమువలె ముగ్ధమనోహరంగా
విహరించింది. సంగీతరచనకీ చైతన్యమలవర్చినది
త్యాగయ్యయే. ఆయన కీర్తనలు రసజ్ఞుల నాకర్షిం
చుట కిది ముఖ్యకారణము.

భక్తిపూరితములైననూ మీరాబాయి కీర్తనలు
మధురభావపూరితములై శృంగారమునే ధ్వనించినవి.
కబీరు ప్రబోధగీతములలో సాహిత్యమే గరీయసి. సంగీ
తము ఆయన ఉపదేశములకు వాహనము మాత్రమే.
జయదేవుని అష్టపదులకు రాధామాధవుల శృంగారమే
వస్తువు. పురందరదాసు శ్రీకృష్ణుని లీలావిలాసమును
కీర్తించెను. విజయనగర పతనానంతరము ఆ రాజ
సభలలో పూజలందిన రాసిక్యము దక్షిణదేశానికి
వలసపోయింది. రాధికాసాంత్వనమూ, విజయ విలా
సమూ బట్టి ఆనాటి పరిస్థితుల పరిమళము కొంత
తెలుస్తుంది మనకి. క్షేత్రయపదములూ, జావళీలూ
ఆనాటి రచనలే. ఈరీతిగా తొలిరోజులనుంచీ సంగీ
తముతో హద్దూపద్దూ లేని శృంగారము చేరి వుండ
డాన్ని బట్టి నటవిటగాయకులు క్షుద్రులుగా గణించ
బడేవారు. ఆ కారణముచేతనే కాబోలు త్యాగ
రాజు తండ్రి రామబ్రహ్మముగారు త్యాగరాజు
గొంతులో పరవళ్లుతొక్కే సంగీత సరస్వతి అందెల
మ్రోత వినీకూడా త్యాగరాజుని సంస్కృత పాఠ
శాలలో ప్రవేశపెట్టారు. కీర్తనలు ఆశువుగా రచించే
ఉత్సాహంలో కూడా త్యాగరాజు 'నటవిట
క్షుద్రుల' 'కామమోహదాసత్వ'న్ని ఈ

డించి, సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గము కాదని కీర్తించి, తొలిసారి ఉజ్వలమైన స్వరరాగ సుధారసమును భక్తితో చేర్చి ఇచ్చినాడు. ఆయన కాలమువరకూ జగన్మోహనమైన సంగీతము రమణీతారుణ్యానికే అంకితము. తన కీర్తనలన్నిటా రామనామమును ధ్వనింపజేసి, నరహరిస్తుతినేగాని నరస్తుతిచేయక, శిష్టాచార సంప్రదాయమును తొలగనీయని పద్ధతిని ఉంఛవృత్తివల్ల జీవనముచేసి, త్యాగరాజస్వామి గాయకులకు గౌరవము సంపాదించిపెట్టి వారిని నటవిట వర్గమునుంచి తప్పించినాడు. పరమేశ్వరునికి అంకితమైన సుందర సంగీతమును నాయన్మారులకు తర్వాత దక్షిణదేశము, త్యాగరాజు కాలములోనే విన్నది. సమకాలిక జనసామాన్యమునకు అర్థయుతముగా బోధపడకున్ననూ, భక్తిపునీతమైన ఆయన కీర్తనావళి దూరదేశములకు కూడ వ్యాపించుటకిది రెండవ కారణము.

త్యాగరాజస్వామి చేతుల్లో సంగీతము సౌందర్యాన్నీ సౌశీల్యాన్నీ అలవర్చుకుంది. ఈ కారణాలచేత ఆయన రచనలకి వ్యాప్తివచ్చింది. కాని ఆ కీర్తనలలోని సాహిత్యభావాలవల్ల కాదు. ఇప్పుడు కదా ఆయన కీర్తనలు తెలుగుదేశంలో వినపడుతున్నాయి? దేశమంతటా తిరిగి వింటే నూటికెక్కువ కీర్తనలు వినబడతాయంటారా? సాహిత్యభావం అర్థంచేసుకోగల మనవంటి రసికులకే అక్కరలేకపోతున్నాయే, మరి దక్షిణాదివారికి సాహిత్యాన్ని బట్టి కావలిసివచ్చాయంటారా త్యాగరాజు కీర్తనలూ? అయినా మన తెలుగువారికి త్యాగరాజు తెలుగుదనముతోనేగాని ఆయన కీర్తనా సంగీతంతో నిమిత్తంలేదు. త్యాగరాజు తన కీర్తనల సంగీతంలో మూర్తీభవించినాడుగాని తెలుగులో మూర్తీభవించలేదు. దక్షిణాదివారు పాపం తెలుగు ఏమీ రాకపోయినా, కీర్తనల సంగీతంకోసం వాటిని వల్లించుకున్నారు వారితో సంగీతవిద్యలో పోటీ చెయ్యలేక, త్యాగరాజు కీర్తనాసాహిత్యాన్ని అరవలు పాడుచేస్తున్నారూ, మేముద్ధరిస్తున్నామని మనము బోరవిరిచి ఉపన్యాసాలిస్తున్నాము.

కీర్తన చెఱకుగడ అయితే సాహిత్యము పిప్పి సంగీతము రసమూను. కీర్తన ఒక వర్ణచిత్రమనుకుంటే సాహిత్యము వర్ణలేపనానికాధారమైన పటము మాత్రమే.

తొలిరోజులనుంచీ నేటివరకూ సంగీతము పొందిన వికాసాన్ని పరిశీలించుకుంటే, సంగీతకళ క్రమక్రమముగా సాహిత్యశృంఖలాల్ని తెంచుకుని తన స్వత్వాన్ని నిరూపించుకున్నట్టు తెలుస్తుంది. త్యాగరాజు, సంగతుల పద్ధతివల్ల కీర్తనకి ప్రాణము సంగీతమే అని నిరూపించడమే కాకుండా సాహిత్యాన్ని ఇష్టమువచ్చినట్టు విరిచి పారేశాడు. ఆయన కాలమువరకూ కీర్తనలలోని పాదములు మధ్యన ఆపకుండా పూర్తిగా పాడడము పరిపాటి. త్యాగరాజు కీర్తనలలో సంగతులు పాడే అలవాటువల్ల సాహిత్యాన్ని అడ్డదిడ్డముగా విరవవలసి వస్తోంది. కీర్తనలో సంగీతమే ప్రధానము గనుక సాహిత్యానికి జరిగే ఈ 'అపచారాన్ని' గురించి నేటికాలపు ఆంధ్రాభిమానులు తప్ప త్యాగరాజుగాని, ఆయన, శిష్యులుగాని బాధపడియుండినట్టు లేదు. నేటి ఆంధ్ర గాయకులు త్యాగరాజుకంటె సాహిత్యాభిమానం బలిసినవారు కనుక, అడ్డదిడ్డపు విరుపు వచ్చినప్పుడు వెనకటి చరణంలోని అక్షరాల్ని ఎరువు తెచ్చుకుని, 'గో-పురద్వారముున' 'శివమనో-విధ మెరుగరు' అని పాడుతూ,—వ్యాకరణసూత్రాభిమానులు పూర్వకవుల వ్యావహారిక భాషాప్రయోగాల్ని దిద్దేశి సమర్థించినట్లే—త్యాగరాజు 'యేమరిపాటును' సమర్థిస్తున్నారు. కాని ఆ పండితులకు యతిస్థానాలలోని ప్రయోగాల్లాగే, ఈ భాషాగాయకులకు, "బాగాయె నయ్యా", "చక్కని రాజమార్గము", "రామ నీ సమానము", "ఎంతని నే వర్ణింతును" "నీవాడ నేగాన"వంటి కీర్తనలు చిక్కు తెస్తాయి. వీటిలో పై పద్ధతిని సర్దుబాటు వీలు కాదు అసలీ రకంగా సర్దుకోవాలని త్యాగరాజు అభిప్రాయము కానే కాదు. ఏమంటారా? గురుశిష్య న్యాయముగా దిగివచ్చిన గానపద్ధతిలో ఈ సర్దుబాటు కనబడదు. ఈ విరుపువచ్చినచోట్లలో, యతి, విరిగిన ముక్కలోని మొదటి అక్షరానికే గాని ఆ ముక్కని పూర్తిచేసే మాటయొక్క మొదటి అక్షరానికి లేదు చూడండి, "(రా)జీవాక్ష సాధుజన జీవన సనాతన" "(సం)త్రాణగానలోల త్యాగరాజనుత" "ఫలము నీకు తనకు లేదనుచు పాలింపలేదా" పద్యంలోకన్న పాటలో యతియొక్క సౌందర్యము హెచ్చు. రెండక్షరాలూ వివరంగా వినబడినప్పుడే ఆ అందము తట్టుతుంది. ఈ రెండక్షరాల్నీ ఒత్తి

పడాలని త్యాగరాజు యతిస్థానంలో వేస్తే వెనక [illegible] దుక్కుకవచ్చి, సాహిత్యం పాడవకుండా రక్షించాలని [illegible] సంగీతం లోని అందం చెడగొట్టడానికి మనకేమి హక్కున్నది?

మరొక సంగతి. కీర్తనకి పల్లవీ అనుపల్లవీ చరణమూ అనేవి అంగములు. పల్లవి రాగస్వరూపాన్ని సూచిస్తుందీ, అనుపల్లవి ఆరోహణావరోహణాన్ని సూచిస్తుంది. చరణము రాగానికి చెందిన ఇతర ప్రస్తారాల్ని సూచిస్తుంది. పల్లవీ అనుపల్లవీ చేరి రాగమునొక్క పూర్తిరూపాన్ని చూపిస్తాయి. అలాగే చరణాలు పూర్తిగా పాడితే రాగమునొక్క పూర్తిరూపాన్ని చూపిస్తాయి. చరణపు మొదటి అక్షరంలో ఆ రాగానికి చెందే ప్రస్తారము ప్రారంభించి చివరిభాగంతో అంతమౌతుంది. సాహిత్యం అడ్డదిడ్డముగా విరిగే చోట, విరిగిన ముక్క మొదటిఅక్షరముతోనే చరణమునొక్క సంగీతము మొదలుపెడుతుంది. ఒకే గీతమీది బిందువులతో ప్రారంభమై సమాంతరముగా సాగిపోయే రేఖలలాంటివి ఒక కీర్తనచరణాలు. వీటి మొదళ్ళని స్థానభ్రష్టము చెయ్యకూడదు. కీర్తనా శిల్పాన్ని గుర్తించుకుంటే ఈ నియమమునొక్క ప్రాముఖ్యత తెలుస్తుంది. కీర్తనను సాహిత్యపు విరుపులు సర్దుబాటుచేసి పాడబోయేవారు సంగీతముమీద అభిమానమున్నవారు మాత్రము కారు.

అనుప్రాసాన్ని ధారాళంగా కావాలని కోరి త్యాగరాజు వాడినట్లు ఎన్నో కీర్తనలు సాక్ష్యమిస్తాయి. వీటిలోని అనుప్రాసము పాడుతూంటే చక్కగా వుంటుంది. సాహిత్యదృష్టితో చూస్తే అసహ్యంగా కనబడుతుంది. "తరాన దొరకని, పరాకు నాయెడ, నరాను జేసితే, సురాసురలు మె, త్తురా యిపుడు యీ, హరామి తనమే, లరా భక్త త్యాగరాజనుత." అన్నది ఒక ఉదాహరణము, ఇలాటివి చాలా ఉన్నాయి. వీటి అందము పాడినప్పుడే గాని మాటలు విన్నప్పుడు కాదు. ఇక త్యాగరాజును 'మహాకవి, విప్లవకవి' అని గొప్పలు చెప్పుకున్నవారు 'మహాకవి' శబ్దార్థాన్నిగాని, త్యాగరాజుమాటకారితనాన్నిగాని పరిశీలించినవారు కారంటాను. ఆయన వాక్యాలలో ముక్కలు మింగేస్తారూ! స్వాధీనముకాని చోట భాష ఎలా నడిస్తే అలా నడిపిస్తారూ! అన్వయానికి తిలోదకా లిస్తారు కావలిస్తే, మాటలకి శుద్ధ క్షౌరము చేసి ప్రయోగిస్తారూ! పులగపు సమాసాలు వాడతారూ! అరవపు జాతీయము వాడతారూ! మాటలు తుంచేస్తారూ! ప్రాసలు తప్పుతారూ, పదికట్టు రాష్ట్రప్రయోగిస్తారూ, కవిత్వపు జిత్తులు ప్రయోగించబోయి కాలుజారతారూ? ఇక మహాకవి అనగా యేమిటి? అయితే ఆగువందలకీర్తనలు రాసినప్పుడు, 'విడుదలకు మొక్కెద' 'ఉండేది రాముడొకడు' 'అలక లల్లాడగ', వంటి చక్కని భావాల అందపురచన లేవో కొన్ని రాకపోతాయా? వీటినీ, మనకి వచ్చిన భాషలో కీర్తనలు రాశారనీ పట్టుకుని మహాకవి పట్టాన్ని కట్టిన వాం రేపాటి రసికులూ?

త్యాగరాజుకీర్తనలు కబీరు కవిత్వాన్ని మించిపోయాయని రాసిన సంగీత సుధానిధులు సంగీతాన్ని గురించిన తమ అభిప్రాయాన్ని సాహిత్య వీధుల్లోకి తోలేరంటాను. కబీరు కవనాన్ని అర్థము చేసుకోగలిగిన వారనవలసిన మాటకాదిది. వీరే మరొక చోట "ఎందుదాగినాడో లో గంభీరమగు తోడి రాగముచేతనే తన చింత వెలిబుచ్చినాడ"న్నారు. అంటే "కీర్తనాసాహిత్యభావములకు అనుకూలముగా నీతను రాగమును" వాడినాడని వారి అభిప్రాయము. వీరికే కాదు, చెక్కురు సాహిత్య మనస్కులకు ఈ అభిప్రాయము ఉన్నది. ఇది విన్నవారికి కూడా యిష్టముగా తియ్య తియ్యగా వుంటుంది. కాని కొంచెము పరిశీలన చేస్తే ఈ పబాయింపు ఎంత అసందర్భమైనదో బోధపడుతుంది. కీర్తనకి చాలాచరణాలుంటాయి. రెండుమూడు చరణాలున్నవీ కలవు. కీర్తనలోని పల్లవీ, అనుపల్లవీ చరణమూ మూడింటినీ, ఒక్కొక్కటి మూడేసి సంగతులువేసి పాడుట మామూలు. చరణాలన్నిటికీ సాధారణముగా సంగీతరచన ఒకలాగే వుంటుంది. అందుకే ఒక కీర్తనని స్వరయుక్తంగా రాసుకునే విద్యార్థులు ఒక చరణానికి మాత్రమే స్వరము రాసుకుంటారు. నాలుగు చరణాలున్న కీర్తనని దేనినైనా తీసుకోండి ఈ చరణాల సాహిత్యభావాలు వేరుగా వుంటాయికదా? (లేకపోతే నాలుగు చరణాలు కల్పించడమెందుకూ?) ఈ భావాలన్నిటికీ సంగీతరచన ఒక్కటే! అంటే, ఒకేరీతిని నడిచే సంగీతము మూడు వేర్వేరు భావాలని ఆవేశిస్తుందన్నమాట. ఇది

ప్రతి కీర్తనలోనూ జరిగే సంగతి. ఇక 'రసానుకూల' 'సాహిత్యానుకూల' రచన అనగా ఏమిటి? అనుపల్లవికీ, చరణాల చివరిభాగాలకీ సంగీత మొక్కటే. ఇందుకు బాగా పనికొస్తాయి. త్యాగరాజ కీర్తనల కట్టలు పరిశీలించి చూడండి వీటికి 'భావానుకూల్యత' ఉన్నదేమో? కీర్తనయొక్క నిర్మాణంలోనే లేని దాన్ని 'గిరిపై నెలకొన్న' లోంచి ఒకపుల్లా, 'ఎందు దాగినాడో' లోంచి ఒక గడ్డిపోచా తెచ్చి కాకిగూళ్లు నిర్మించి నిరూపించడము సాధ్యమా?

సంగీతజ్ఞులు చేయదగిన పని మరొకటి సూచిస్తాను. తోడిరాగములోని కీర్తనలన్నీ కూర్చి, వాటి సంగీతరచనను పరిశీలించి, సంగీతరచనా సామరస్యమున్నచోట్ల సాహిత్యరచనలను పట్టిక వెయ్యండి. ఇప్పుడు చెప్పండి వీటి సామరస్యపు కబుర్లు. లేదా సాహిత్యరచనా సామరస్యమున్న కీర్తనల భాగాల్ని కూర్చి, వాటి సంగీత రచనలకి సామరస్య మున్నదేమో చూడండి.

ఇంతకూ చెప్పబోయేదేమిటంటే త్యాగరాజుని సాహిత్యపుటద్దాలతో కాదు చూడవలసినది. ఇంతవరకూ మన దురదృష్టమువల్ల సాహితీపరులే త్యాగరాజుని పట్టుకున్నారు. వీరి లేఖినులు చెయ్యగలిగినదేదో చేసినవి. చెయ్యవలసిన పనిమాత్రము జరగలేదు. శరభోజీమహారాజూ, స్వాతి తిరుణాళ్ ప్రభువూ విన నుబ్బియ్యారినది, గణేశభావే, గోవింద మారార్, సుందరేశ మొదలియార్, శ్రీరామమూర్తీ, తిరుపతి వెంకటేశ్వరుడూ, విని సంతోషించిన పాల సముద్ర తరంగఘోషను తెలుగునాటికి వినిపించే యత్నము జరగాలి. అదే విలువైన పని.

అయితే త్యాగరాజు సాహిత్యానికి ఏమీ ప్రయోజనము లేదా? అని అడుగుతారు కొందరు. లేకేమి? త్యాగరాజు మహాభక్తుడు. ఎరిగిన భగవద్రూపాలన్నిటినీ భక్తితో కొలిచినవాడు. ద్వైతాద్వైత మతాల బోధలు అనుభవమువల్ల పరీక్షించిన సాధకుడు. పరమభక్తుని ఆధ్యాత్మిక వికాసాన్ని చూపించనెంచేవారికి కీర్తనల సాహిత్యము సాయపడవచ్చును. కాని కీర్తనారచనాకాలముల వరుస తెలియదు కనక రచయితకు ఆధ్యాత్మిక వికాసమంటే వుండే అభిప్రాయాలనుబట్టియే కీర్తనాసాహిత్యాలను రచయితే పేర్చుకుని వేదాంతచర్చ చేయవలసివస్తుంది. త్రిలింగరజతోత్సవ సంపుటంలోని "త్యాగరాజస్వామి ప్రశస్తి" అనే వ్యాసం ఇలాటి యత్నమే. స్వంతంగా వేదాంతచర్చ చెయ్యక త్యాగరాజు మాటలనే పరమపదసోపానములాగ అమర్చేయత్నము కూడా 'త్యాగరాజు ఆత్మవిచారం' అనే పుస్తకంలో భమిటిపాటి కామేశ్వరరావుగారు చేశారు. అయితే దీనిలో "అక్కడక్కడ త్యాగరాజు రచనలోని తియ్యందనాలు ఇమిడ్చినప్పటికీ, భాష మొత్తంమీద భమిడిపాటివారిదే." అసలు త్యాగరాజు ఏమన్నాడో తెలుసుకోవాలంటే త్యాగరాజు కీర్తనల్ని చూసుకోవలసివస్తుంది ఒకటే, త్యాగరాజు భక్తి రసానికి వీరి హాస్యరసము చేరుతుంది రెండూ ప్రయోజనాలు. త్యాగరాజు సంగీతమూ వద్దూ, ఆయనగారి సాహిత్యమూ వద్దూ మనకి! మరేమిటి కావాలి?



# "సౌందరనందము"



"సురభి"

సత్కావ్యానుశీలనము చేయునపుడు నిశితాతినిశితమగు ప్రసన్నబుద్ధి నుపయోగించి కావ్యహృదయములోనికి చొచ్చుకపోయి సహృదయంలో సానుభూతిని పొంది అందలి మహాపదార్థాలను సవివరంగా తెలిసికొన్నగాని— ఒక నిష్కృష్ట నిర్ణయానికి రాగూడదు. అట్లు వచ్చుచో అది తర్కసహమైన విమర్శన మనిపించుకొనదు. లోకంలో ఏ విషయావగాహనానికైనా సహృదయత్వం పరమావశ్యకమైన లక్షణమనుట అనుభవ ప్రత్యక్షమైన సత్యం.

అంతియకాని విమర్శకుడు ఏదో నానుభూత అభూత ఆవేశాన్ని ఆరోపించుకొని కావ్యవిమర్శనమునకు సాహసించుచో వాల్మీకి కాళిదాసాదులు కూడ విపరీతంగా సాక్షాత్కరిస్తారు. నిష్పాక్షిక విమర్శనమే విమర్శనము.

ఇటీవల శ్రావణ భారతిలో శ్రీ పొట్లపల్లి సీతారామారావుగారు సౌందరనందమనెడి కావ్యముపై వెలిసిన విమర్శనమే నన్నీ కృత్యమునకు ప్రేరేపించినది. దోషైకదృక్కులు కొనివారి విమర్శనములోని అంశములకు నా సమాధానములను, తత్కావ్య అనుగత మహార్థములను యథాశక్తి సహృదయాలోకమునకు సమర్పించుటయే నా యీ వ్యాసప్రయోజనము. భాద్రపద భారతిలోనే దీని నందించుటలోని పరమార్థము నే చెప్పబోవు సమాధానములకు సహృదయహృదయ భద్రపద సంపాదనాపేక్షయే.

సత్కావ్యము పాత్రక్రమమునకు నిలువవలెనన్న కొన్ని హేతువులుండవలె నన్నారు. (a) సమాసమున కర్థము కుదురుట. (b) కారకప్రక్రియ సరిగా నుండుట (c) ప్రసిద్ధ సాంకేతికమైన శబ్దము వాడుట (d) భావమునందు పూర్వాపర సందర్భముండుట.

పై నుదహరించిన నాలుగు అంశములలో పై మూటిని విమర్శకులు తెఱచి చూడలేదు. మొదటి అంశమైన సమాసమును గుఱించి అధరీకృత శబ్దమును తడవి-గుటకలు మ్రింగిరి. మూడవ అంశమైన ప్రసిద్ధ సాంకేతిక శబ్దప్రయోగమును గుఱించి విచారణ చేయుచు సౌందరనందములోని ప్రాథమికము, విశేషకము, స్వయము అను శబ్దములను స్పృశించిరి.

తర్కసహమైన విమర్శ—అనుచు ఆధునిక విమర్శలో ఒక భాగమనిరి. ఆధునిక విమర్శలక్షణములు శ్రీ సీతారామారావుగారి దృష్ట్యా "కావ్యము వ్రాయునపుడు కవి ఎట్లున్నాడు? క్రమముగా అతడు పరిణతిచెందినట్లు కావ్యమునందెట్లు కాన్పించుచున్నది" అనునవి. ముఖ్యముగా ఆ దృష్టి వారిలో లేదు, వారు చేసినది తర్కసహమైన విమర్శన మనిపించుకొనదు.

"పూర్వపు ప్రబంధములు వస్తు నిర్దేశముగా ప్రారంభింపబడలేదు. ఆశీర్నమస్క్రియాదులలో నేదేని ఒకటి యుండితీరును. సంస్కృత కావ్యము లెక్కువభాగము వస్తునిర్దేశకముగా ప్రారంభింపబడినవి" సంస్కృతాలంకారికుల రససిద్ధాంతము, తద్భంగలక్షణము, సంస్కృత వైయాకరణుల వ్యాకరణపద్ధతి స్వీకరించి విమర్శనము వెలువుచున్న వారికి—"ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్" అని చెప్పిన ఆలంకారిక సూక్తిప్రకారముగ వస్తునిర్దేశముగూడ కావ్యముఖమున నుండదగునని ఏలనో రుచింపలేదు.

అదియునుగాక సౌందరనందములోని కృత్యవతారిక నమస్క్రియారూపముగనే ప్రారంభింపబడినది. కథారంభమున మాత్రము వస్తునిర్దేశము కలదు. పూర్వాంధ్రప్రబంధములలో గూడనట్లుండుట ప్రసిద్ధము. మనుచరిత్రము శ్రీవక్షోజకురంగ......అని ఆశీర్వాదరూపమున ప్రారంభింపబడి . కథారంభము మాత్రము వస్తునిర్దేశరూపంలో నిష్పన్నమయినది.

"వరణాద్వీపవతీ తటాంచలమునకా......మహా కంఠ హార తరళికస్ఫూర్తిన్విపం బించుమున్"

"కావ్యములో ప్రథమసర్గయంతయు బుద్ధుని ప్రవేశప్రబోధములు వర్ణింపబడినది. ఇది కథా దృష్టితో నిర్మింపబడినదికాని రసదృష్టిచే నాకృష్ట మైనదికాదు. ఆ బుద్ధుని ప్రవేశప్రబోధములు రసమున కేమాత్రము దోహదముచేయవు"

ఇందు శాంతమంగిరసమగుటచే శాంతరసో ద్దీపకములగు బుద్ధుని ప్రవేశప్రబోధములు కేవలకథా దృష్టిచే గాక రసదృష్టిచే కూడ పరమావశ్యకములు. ప్రతిభావంతుడైన కవి చేయుపద్ధతియే యట్టిది.

"కావ్యమంతయు సుకుమారముగ నున్నది. కవి పలుకుబడి చాలినంతగలేదు. ఎంతసేపటికి జిలుగుపని" ఇచట ఉపయోగింప బడిన "పలుకుబడి," "జిలుగు పని" అను పదములు కేవల శబ్దవ్యామోహంతో వాడి నవేకాని రమణీయార్థ స్ఫోరకములు కావు.

"పంచ సంధుల నుచితస్థితిలో కూర్చుటకు కవి శక్తినంతయు వెచ్చింపవలయును." ముఖప్రతి ముఖ గర్భ అవమర్శ...ఇత్యాది" పంచసంధి ప్రతిపాద నము దృశ్య కావ్యములలోవలె శ్రవ్యకావ్యములలో నంతగా పాటింప నక్కరలేదేమో! లేక వారు ఒక వేళ సామాన్య కావ్యదృష్టితో వ్రాసిరో!

"కావ్యములో నాయికా నాయకులు సుందరీ నందులు. వీరిద్దరి శృంగార చేష్ట లుదాత్తముగలేవు. దీని కుదాహరణముగ బుద్ధుడు మధ్యాహ్న భిక్షార్థియై వచ్చినపుడు నాయికానాయకులు శృంగారములో మునిగి తేలుచున్నట్లు వర్ణింపబడి యున్నది. ఇది దోషము. పట్టపగలు నాయికా నాయకులకు శృంగా రము నిషేధము" అని చెప్పిరి.

ఇట శృంగారమన విమర్శకుల దృష్టిలో పాశ వకేళి కాబోలు. కాని సుందరీనందులు కేవల బహిః సౌందర్యా కృష్యమాణ నిష్కామ ప్రేమారాధకులు. ఈ పరమార్థము సుందరీనందుల ప్రతి మాటలోనూ ధ్వని తమై, అనుస్యూతమై కావ్యమంతటను ప్రసన్నమగు చున్నది.

"ఇది కథాదృష్టితో చెప్పు మాటకాని రసదృ ష్టితో చెప్పు మాటకాదు" అనిరి. కావ్యప్రధాన రస మైన శాంతమును పరిపుష్టము చేయుటకు తద్విరోధరస మును తేటతెల్లముగను, పుష్కలముగను వర్ణించుట చాల ఆవశ్యకము. ఇట శృంగారరసము పరిపుష్టమై నదేకాని అంగిరసమగు శాంతము స్వచ్ఛముగ చెల్వా రదు. విరుద్ధరస సమ్మేళనమే—అదియును—హృద యంగమ సమ్మేళనమే కవి ప్రతిభను చాటి చెప్పు ఢంకా దెబ్బ. రసపోషణ చక్రవర్తిత్వానికి ఈ సన్ని వేశము పట్టుగొమ్మ. లోకమును చీల్చుక పోగల్గిన వ్యుత్పత్తి సముద్దీపిత ప్రతిభావంతుడైన కవి కాని, యిట్టి కార్యమునకు గాలూనడు. సాహిత్యరసపోషణ చక్రవర్తియైన నాచనసోముడు ఉత్తర హరివంశములో ఘంటాకర్ణుని వృత్తాంతములో యీ చమత్కారమును చేసినాడు. విమర్శకు లెక్కడో ప్రయోగించిన "గారడీవిద్య" అన్నది అట అస్థాన ప్రయుక్తము కాని ఇట ప్రయుక్తమగుచో సార్థకమగును. మను చరిత్ర మందలి వరూధినీ ప్రవరుల ఘట్టము చదివిన యీ విషయం బోధపడగలదు.

"శృంగార ముత్తమప్రకృతి శృంగారము కాదని నా వాదము" అన్నారు. ఇది కేవలము నిర్హేతుకవాదముగా కన్పించుచున్నది. దోషనిరూప ణైక దృష్టితో విమర్శన మారంభించిన ఏ కావ్యమును ఆగదు. మహాకవులని లోకప్రతీతి నందిన కాళిదాస, నన్నెచోడులు కుమారసంభవములో దివ్యులగు పార్వతీ పరమేశ్వరులకు గజమైథునమువలన కామో ద్రేకమును గల్పించి తాద్రూప్యమును పొందించారు. ఇయ్యది యుత్తమప్రకృతి శృంగారమగునేమో! "ఉపనాయక సంస్థాయాం, మునిగురుపత్నీ...... తిర్యక్షు...శృంగారే అనౌచిత్యం." అని పూర్వా చార్యులు ప్రవచించియున్నారు శృంగార రసా భాసమును గుఱించి. అయినను యీ ఘట్టములను పరమరసవత్ఘంటములుగా విజ్ఞులు గ్రహించారు. దాని కొకటే సమాధానం.

అనౌచిత్యాదృతే నాన్యత్ రసభంగస్య కారణం
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా."

ఎంతవరకు అనౌచిత్యమువలన రసపుష్టి సంపా దింపబడునో అంతవరకు దానిని పరిహరింపరా దన్నారు.

"యావతాతు అనౌచిత్యేన రసస్య
పుష్టిః తావత్ న వార్యతే."

అందువలన యీ ఘట్టమునందలి రసపోషణ చాతుర్యమువలన కవి సిద్ధహస్తత అభివ్యంజిత మవుతోంది. ఈ విషయంలో శ్రీవారి పురోభాగిత్వము సర్వతిశాయిగా ప్రసన్నమగుచున్నది. అయ్యది విమర్శక లక్షణము కాదని వారే ఉద్ఘాటించారు.

"నందుడు బుద్ధునిదగ్గరకు వెళ్ళి తిరిగిరాడు. సుందరి యప్పుడు విచారించినది.

"కూరిమి తోబుట్టుగుల విస్మరించి యీ
నెయ్యంబు నీమీద నిలుపుకొంటి."

ఇది అధమనాయిక కుచితముగ నున్నది. రాజపుత్రిక కుచితముగ లేదు." అని అన్నారు.

వీరికి విహారంలో ఉండే అవస్థా విశేషాలు అవగతంకానట్లు స్పష్టమగుచున్నది. తోబుట్టువుల పట్లగల సౌదర్యౌదార్యంకూడ విడచి దాన్నంతా నందునిలో స్థాపించుకొన్నది. ఇది విరహ వేదనలో ఉపాలంభనము.

'అష్టవర్షా భ వేత్ కన్యా పుత్రవత్ పాలితామయా
దాస్యామి తవపుత్రస్య దత్తాస్నేహేనపాల్యతాం'

అన్న సూక్తి మహార్థము ఇందులో వ్యజ్యమానమగుచున్నది.

శృంగార చేష్టావర్ణనములో ప్రణయకోపము నొకదానిని తెచ్చిపెట్టినారు. అది కృతకముగా తెచ్చిపెట్టినట్లున్నది తప్ప సహజముగ లేదు. పూర్వ ప్రబంధములలో నాయకునిచే గోత్రస్థలనాదికము చేయించుట కలదు. దానికి నాయిక కుపితయగుట కలదు."

ఇటవారువాడిన ప్రణయకోప శబ్దమే సమాధాన మొసంగుచున్నది. వారు చెప్పిన గోత్రస్థలనాదికము చేయించినచో అయ్యది ఈర్ష్యాకోప మనబడును. ప్రమాణము మనవి చేయుచున్నాను.

"మానః ద్వివిధః ఈర్ష్యామానః ప్రణయమానః
ఇతి ప్రణయమానః
ద్వయోః ప్రణయమానఃస్యాత్ ప్రమోదేసుమహత్యపి ప్రేమ్ణః
కుటిలగామిత్వాత్ కోపోయఃకారణంవినాః"

ఈర్ష్యామానః: ఉత్స్వప్నాయిత భోగాంక గోత్రస్థలన సంభవము అగుచున్నది. కావున ఇట ప్రణయకోపము అని చెప్పినది సరిగానే ఉన్నది.

"ఈకావ్యములో బౌద్ధమతముయొక్క వాతావరణము కాన్పించదు" కావ్యములో నున్నదే బౌద్ధమత వాతావరణము. అది సార్వత్రికముగ నున్నది. ఒక సుందరీ నందుల ప్రణయఘట్టములో తక్క తక్కినపట్టుల నెల్లననుస్యూతమై పూవులలో దారమువలె పరువులెత్తుచున్నది. ఉదాహరణము లొసగబూనినచో నిదియును మఱొక కావ్యమగును. వ్యాస విస్తర భీతిచే విడచుచున్నాను.

"ఈగ్రంథమునిండా హిందూమతముయొక్క ఛాయలు ఎక్కువగ కన్పించుచున్నవి"

"స్మరదుర్మదున్ బట్టి సపరివారంబుగ
పశువరించిన యజ్ఞవాటివోలె"

ఇది హిందూమత సిద్ధాంతచ్ఛాయగా బాహిరంగా విమర్శకుల దృష్టికి కన్పించినా ఇందులో తదతీతమై, తద్భిన్నమై, పరమ రమణీయమై బౌద్ధ సిద్ధాంత స్థిరీకరణము వెల్లారుతోంది. కామక్రోధ లోభమదమాత్సర్యములతో తారాడుతున్న జగత్తును కామప్రకృతినుండి నివర్తింపజేస్తూ నిష్కామప్రేమ సిద్ధాంతాన్ని స్థాపిస్తున్న బుద్ధుని గురించిన వాక్యమిది. అంతతప్ప యాజ్ఞిక వాతావరణానికి ప్రసక్తిలేదు. నందుని పరిచిత హృదయ వీధుల్లోకి బుద్ధుడు చొచ్చుకపోయి స్వీయసిద్ధాంతాన్ని స్థాపిస్తున్నాడు. అందువలన బౌద్ధచ్ఛాయతే సుభాసితాలచ్చట. హిందూమత సిద్ధాంత ప్రసిద్ధభాగాన్ని తీసికొని, దానిని ఖండించుచు బుద్ధుని ప్రేమ సిద్ధాంతాన్ని నెలకొల్పుచున్నారు. కవులిచ్చట!

"బుద్ధుని యుపదేశమ్ములలో బౌద్ధమతము లేదు"

బుద్ధుని జిహ్వాసింహాసనాసీనమై భాసించే ప్రతివాక్కూ బౌద్ధసిద్ధాంతవ్యంజకమై, రమణీయార్థపరీవృతమై కాంతా సమ్మితత్వంతో కలకలలాడుతోంది. అంతకంటె ఘాటుగా చెపితే కావ్యము కావ్యధర్మాన్ని విడచి శాస్త్రమయి ఊరకుంటుంది.

"నందునకు బలవంతముగా సన్యాస మిప్పించుటయే తప్పు - బౌద్ధమత విరుద్ధము" దీనికి సమాధానము కొంత ఈవరలో ఇచ్చిఉంటిని. కామాది అరిషడ్వర్గ బాధితమైన జీవలోకాన్ని ఉద్ధరించడమే బుద్ధుని ఆశయం. ఎయ్యది జీవికి శాశ్వతానందదమో

అయ్యది ఘటింపచేయుటయే బౌద్ధధర్మము. అదియే జీవకారుణ్య సిద్ధాంతము. తత్సూచకంగా కామోద్దీపితుడై కాలప్రవాహములో కొట్టుకచనుచున్న నందుని ఉద్ధరించుటకై చేసిన కృషి- అది బలవంతమయ్యును పథ్యమే.

"ప్రేమ సిద్ధాంతము — ఈ ప్రేమసిద్ధాంత మాయన కంటకట్టగూడదు" అనిరి. బుద్ధనందుల సిద్ధాంతము నిష్కామప్రేమారాధనము. ఇయ్యది అభంగమై కావ్యములో నెల్లెడల ప్రసరించుచున్నది. ఈ సిద్ధాంతమును పరమరమ్యముగ కవులు పోషించిరి. సహృదయంతో పరిశీలిస్తే పూర్వాపరవైరుధ్య మేమీ కానరాదు.

"రస విరోధిజ్ఞానము. ఈ కావ్యమందలి ప్రధాన రసము శాంతము. అంగిరసము ఇతివృత్తమునం దంతటను అనుసంధితమై వ్యాపించియుండవలయును. ఈ కావ్యమునందది లేదు"

శాంతరసము కావ్యమంతటను అనుస్యూతమై యున్నది. రెండవ సర్గలో సుందరీనందుల ప్రణయ వర్ణనము చేస్తూ అంగరసమైన శృంగారమును తలమున్కలుగా సృష్టించారు. విరోధిరసాన్ని అంత పుష్కలంగా పోషిస్తేనే తప్ప అంగిరసం పరిపుష్టం కానేరదు. విరుద్ధరస సంపుటీకరణమే సిద్ధహస్తుడు చేసే పని. ఎవరో ప్రౌఢకవులు తప్ప ఇట్టి చమత్కారము నిర్వహించి కృతకృత్యులు జాలరు. ఎఱుకతో చేసిన పనియే యిది. ఇది నిజంగా ఇంద్రజాల విద్య.

"ఈ కవులు వాడిన యలంకారములు వట్టి యలంకారములు." దీని కుదాహరణంగా "సంసరణ మహాబ్ధి మగ్నమగు మానవకోటిపయిన్ కృపాఝురుల్"

ప్రథమ సర్గలో బుద్ధుని చరిత్ర సంగ్రహంగా వివరించిరి. ప్రథమసర్గలో మొదటి పద్యంలో బుద్ధుని జననము, రెండవ పద్యంలో అభినిష్క్రమణము తపోవన ప్రవేశము, జ్ఞానావబోధము వర్ణించిరి. మూడవ పద్యంలో పరమసత్యాన్ని అరయ లోక భవాబ్ధిప్లావ్యమానమై పాటులుపడుచున్న లోకాన్ని చూచి అతనికి గల్గిన మనఃపరితాపాన్ని వర్ణించారు. నాలవ పద్యంలో అందుల కతడు చేసిన ప్రచారాన్ని వర్ణించారు.

మూడవ పద్యంలో మానవలోకం పడే పాట్లను చూచి తాను కుందుచు సకరుణంగా సానుభూతిని ప్రకటిస్తున్నాడు, అని చెప్పటలో పర్యవసితమగు "సంసరణ మహాబ్ధి......" అను పద్యపాదమున జన్మమును సముద్రంతో సరిపోల్చారు.

ఆ పోలికవలన భవాగాధత్వం వ్యంజిత మవుతోంది. ఆ అగాధములగు దుఃఖములను తెలిసికొనుటకు చొచ్చుకపోగల్గినది నిమ్నగ తక్క ఇంకొకటి కాదు. సముద్రంలో ఝరిప్రవేశించిననాడే సామరస్యం కల్గును. కాని పూజ్యపాదులు చెప్పినట్లు లేవనెత్తు సాధనములతో పోల్చిన ప్రయోజనము లేదు. అయ్యది తరువాతి పద్యమున నిర్వహింపబడు విషయము. అందుచే నిట యీ అలంకారము సర్వాంగసుందరమై సైకార్థస్ఫోరకమై, కవి ప్రతిభాసముల్లసనసూచకమై భాసించుచున్నది. ఈ శక్తి మహాకవి నిష్ఠము.

"భవనిదాఘ సంతాపముల్ పరిహరించు
సత్యశాంతి దయాది నిర్ఝరులు పొడెము
నీ విహార మహోహార్య మెక్కియుటుల
కంట నీర్వెట్టదగునె నీవంటివాడు."

కంట నీర్వెట్టవలదనుటలో ఏమి ఆటంకమును వారించుచున్నాడు?"

జన్మయనెడి వేసవి వడదెబ్బలనుండి, ఆ కొండయందు స్రవించు సత్యశాంతి దయాది వాహినీసేకము స్వాస్థ్యాన్ని పొందిస్తుంది. అని కవి చెప్పుచున్నాడు. ఇది లోకసామాన్యమైన విషయము.

నట్ట నడివేసవిలో ప్రయాణం చేస్తుంటాము. ఆ ఊష్మతవలన మనలో దాహ ముద్భూతమై కన్నులు చీకట్లు క్రమ్మట, లేదా బైరులుక్రమ్మట, చెమర్చుట జరుగును. పదార్థజ్ఞానము కూడా నేత్రేంద్రియం కోల్పోతుంది. వెంటనే ఏ మహాతల్లి యయినా చల్లని జలా లందిస్తే ప్రాణం బయటికి వచ్చినట్లు సంతోషిస్తాము. అందువలన కంటనీర్వెట్ట వలదని చెప్పుచున్నాడు. ఇట్టి సామాన్యవిషయం తెలియకపోవటం శోచనీయం.

"కావులు కట్టియున్ తరుణ కంబుహితుం బుర డించువాని" ... "అవలిమోమయి యున్నవాని"

అనుటతోడనే అందలి స్వారస్యము చెడి యూరకున్నది" ఇది విమర్శకాభిప్రాయము.

స్వారస్య మేమాత్రమును చెడలేదు. కావులు కట్టుకొనియుండుటచే బాలసూర్యప్రభాభాసమానుడై ఉన్నాడు. సమాసన్న మరణమైన ఉవిద వేదన చూడలేక కరుణామయుడైన ఆతడు అవలిమోమై యుండెను. జీవిపడే వేదన చూడలేక అట్లు పోనర్చెను. ఆతని జీవకారుణ్య సిద్ధాంతాన్ని పుష్టిమంతం చేస్తోం దీ సన్నివేశం. బాలభానుడుకూడ పశ్చిమాభిముఖుడై ప్రయాణం చేస్తున్నాడు. నందుడన్ననో జీవిపశ్చాదను భావ్యస్థితి నూహిస్తున్నాడా అన్నట్లు అవలిమోమై ఉన్నాడు.
ఉదాత్తభావ గంభీరంగా ఉందీ సన్నివేశం.

"బోనునబడ్డ భద్రగజపోతము పోలిక...ఈ ఉపమలో లోకస్వభావము లేదు"

ఇట బోనుఅనగా స్వేచ్ఛాసంచార నిరోధకము అని అర్థము. దీనిని లోకములో వ్యాఘ్ర సింహముల కుపయోగించు సాధనముగా వాడుచున్నారు. అట్లుపయోగింపక భద్రగజ పోతమున కుపయోగించుటలో ప్రౌఢిమకలదు. విశిష్టవాచక శబ్దములుకూడ కొన్నిచోట్ల విశేషణార్థము విడచి సామాన్యార్థమున ప్రయోగింపబడుట ప్రసిద్ధము. ఆలు అనుభార్యార్థ సూచక శబ్దమును స్త్రీ పరముగా వాడుచున్నాము. ముద్దరాలు ...మొ. పశుపక్ష్యాదులకు కామము ఋతుబద్ధమై ప్రవర్తించును. ఆ సమయముననే తక్క అన్యసమయములలో వ్యభిచరింపవు. అట్టి ఊహలకే తావీయవు. ఆ సమయమున మాత్రము కామతృష్ణ ప్రగాఢమై, మహా తీవ్రమై ప్రజ్వరిల్లును. కట్టుత్రాళ్ళను, గొలుసులను, కూడ—తదిచ్ఛా పూర్తికై త్రెంచుక పారిపోవు పశువులను మనము చూచుచునే యుందుము. దీనిని ఎదపోవుట అందురు. ఆ కామేచ్ఛయైనను గజములందు ద్విగుణీకృతమై ప్రవర్తిల్లును. ఆ గజపోతముతో నందుని పోల్చుట లోకోత్తరముగనున్నది. సామాన్యుడా ఉపమను ప్రయోగింపజాలడు. పోగా "బోనునబడ్డ... అనుచోకదా సందేహము. అయ్యది కొంతవరకు పై చెప్పిన హేతువులవలన పరిహృతమగును. ఏనుగుల పట్టుకొనునపుడు పెద్ద పెద్ద గోతులు త్రవ్వి—వానిని వెదురుతడకలతోన ఆచ్ఛాదించి, పైనమన్నుచల్లి కృత్రిమగ్రాసము మొలిపించి లేదా నెదజల్లి వాని నాకర్షింతురు. ఆగ్రాసాపేక్షతో వచ్చి ఏనుగులు గోతిలోపడును. దీనిని వాకొగ్గుట అందురు. ఇది యైనను స్వేచ్ఛాసంచార నిరోధకమే. బోనునబడుట అనగా అర్థమిది. ఏనుగును యథాతథముగా పట్టుకొనుట బ్రహ్మాంతరము కాదు. నందుని స్థితిని బోనునబడ్డ భద్రగజ పోతముతో పోల్చుట పరమ రమణీయముగ ఔచితీ పుష్టముగ నున్నది.

"కలయనద్దెస పన్ను వలచిక్కి బయటకి నుఱికి పాఱవలంచు నుడుతపోలె" ఇం దుపమాలంకార ఔచిత్యము లేదు."

వానివాని మహార్థముల నరయజాలక "అదితప్పు—ఇందులో ఔచిత్యములేదు" అనుట సాహసము. నందుడ వ్యవస్థిత చిత్తంతో ప్రియాసక్తమైన భావమొకవైపునుండి సోదరాజ్ఞా పరిపాలనాధర్మం మఱొక పార్శ్వంనుండి పెనవైచి వాని వాని సత్త్వానుసారంగా లాగుచుండ బాధపడుచుండును. ఆతని అప్పటి స్థితిని వర్ణిస్తాడు కవి. వలలో చిక్కుక బయటికి పోజూచే ఉడుతలా ఉన్నాడని కవులు ప్రవచించారు. ఉడుత బహుచంచల స్వభావమైన జంతువు. ఒకచోకాలూది నిముషమైన నిల్వదు. అస్థిరస్థితి నివేదనార్థమై ఆ ఉపమను గ్రహించారు తక్క నాయకునకు హీనత్వారోపణార్థమై కాదు. అట్లగుచో కింకవీంద్ర ఘటాపంచాననులు ప్రయోగించిన "చాలదే వేటకై ఒకజాగిలంబు" అన్న గంభీరవచనము, తచ్ఛర్చాసంపత్తి సంధూతా లవుతాయి. ఇది కవి ప్రౌఢిమను తెలుపు నలంకారములలో నొకటి.

"ఈ కావ్యమంతయు సౌకుమార్యమను గుణముచే నిండిపోయినది. కావ్యములో ప్రసాద గుణమున్ననే రమ్యమని ఆలంకారికుల ఊహ"

ప్రసాదగుణము రమ్యము సర్వరస పర్యవసాయి అని ఆలంకారికు లెల్లరు నంగీకరించిన విషయమే. సౌకుమార్యము కావ్యస్వాదుతా సంపాదక గుణమని కొంతమంది ఆలంకారికు లంగీకరించిరి. సౌకుమార్యము అనగా శ్రవఃకటుత్వము లేని శబ్దరచన అనియు, ప్రసాదగుణమన్న పఠనోత్తర క్షణముననే తదర్థము నవ్యోద్ధూత నవనీతంలా మెత్తగా సద్యఃప్రసన్నతా గుణము కలిగిఉంటుందని 'కుప్పేంధ.

మగ్నిరివ' అని ఉదాహరణమునిస్తూ రూపించారు ఆలంకారికు లెల్లరును. సౌందరనందంలో ఎక్కువ భాగము ప్రసాదగుణ భూయిష్ఠమై యున్నదనుట సత్యదూరము కాదు. స్థాలీపులాక న్యాయమున ఒకటి రెండు పద్యములు చదివిన చాలును. ఎంతగా ప్రసాదగుణాన్ని చిమ్ముచున్నారో తమరే పరిశీలింతురు.

"ఎలదేటి రెక్కతుదపై
బొలసిన కసుగందు మల్లెమొగ్గకు దులయై
తొలిసంజ నూత్న రుచులన్
కలకలమని నవ్వు వలపు గాదనదగు నే"

"వసి వాళ్వాడదు, ఒకప్పుడు
కసుగందదు మేల్మిచాయ తగ్గదు తావుల్
కొసరు మరందము చిలుకును
విసువక ఎదదాల్తు నట్టి ప్రేమసుమమ్మున్."

"పొచ్చె మెఱుగని భావముల్ పొందిపొసగి
వలపు నెత్తావులీనెడి భాగ్యమల్పమగునె గురుదేవ!

ఆ భాగ్య మెవరిది?

మనసు లేకీభావము నందిన ఏ యిరువురి మధ్య నున్న ప్రేమయైనను యీతని కల్పము కాదు. కేవల దంపతీగతమైన తుచ్ఛ కామము నీత డాశించుట లేదు. నిష్కామ ప్రేమసిద్ధాంతమును నిరూపించుచు నుపన్యసించు పట్టులో 'దంపతుల భాగ్యమునవద్దా?' అని ప్రశ్నించుట విరుద్ధంగాను విరసంగాను ఉన్నది.

'బౌద్ధ ధర్మమే శరణమటంచు
భిక్షుకుడు సౌధపురస్థలి నిల్వగాంచి'...

"ఒక భిక్షుకుడు నిల్వగాంచి అని యుండవలయును."

*A man* అంటే ఒక మనుష్యుడు అను నర్థము చెప్ప వ్యాకరణజ్ఞానములేనివాడు ఒక భిక్షుకుడు అనవలెను. అచట 'డుజ్' ఏకత్వద్యోతకము.

"పుష్పబాణాగ మాధ్యేతృప్రాథమి కుండనై—
ప్రథముడనై యనవలెను."

పుష్పబాణస్య ఆగమః పుష్పబాణా
గమః పుష్పబాణాగమస్య అధ్యేతారః
పుష్పబాణా గమాధ్యేతారః
ప్రథమేభవః ప్రాథమికః
అధ్యేతౄణాం ప్రాథమికః

అని ఇచట సంస్కృత సమాసములో ప్రాథమికశబ్దము ఏల దుష్టమో అనూహ్యము. పొగపునకైన సంస్కృతిజ్ఞానమున్నచో నిది యథార్థ మనిపించును.

"ఎలదేటి రెక్కతుదపై......
......కలకలమని నవ్వువలపు గాదననగు నే

ఈపద్యమువలన వలపులక్షణమెట్లు తెలిసినది?

వసివాళ్వాడదు......ఎదదాల్తు
నట్టి ప్రేమసుమమ్మున్"

ఈ భావము లెంత పరస్పర భిన్నములుగ నున్నవో చూడుడు. పై పద్యములో వలపు కసుగందును. రెండవపద్యములో ప్రేమ కసుగందదట. కవులభావములో ప్రేమవలపులు విభిన్నములేమో"

వలపు—ప్రేమ భిన్నార్థకములే. వలపనగా కోర్కె, ప్రేమ అనగా స్నేహము. అనిర్వచనీయాత్మానుబంధము. ప్రేమ సాక్షాత్కారానికి ప్రథమ దశవలపు. వలపుగాఢమై, అస్థానా ప్రయుక్తమై, పటిష్ఠమై సుప్రతిష్ఠితమైనప్పుడే అది ప్రేమగా ప్రసన్నమగును.

ఆవలపు లలితాకృతి కలది. ఏమాత్రము నొవ్వు, తాకుసహింపదు. భ్రమరపాద నిక్షేపాసహామల్లీ పుష్పస్వభావము కలదివలపు. అయ్యది ప్రేమగా పరిణమించిన కసుగందదు. చాయతగ్గదు. చిదానందతుల్యమై, ప్రసన్నమనువై హృదయానంద సంధాయకమగును. వాని యవస్థావ్యత్యాసజ్ఞానము మహాకవికిగాని ఇద మిద్ధముగా తెలియదు. లోకములో గృహస్థుడు కావచ్చును. పదిమంది అందాల బరిణెలతో పొందందవచ్చును. కామకళా బోధకములగు గ్రంథములను చిత్రములు చదువవచ్చును, చూడవచ్చును కాని ఆప్రేమ యందలి దశా విశేషాలరయుటకష్టం.

"ధర్మచక్రమ్మును కేల ద్రిప్పుచు...ధర్మ చక్రమును త్రిప్పుట ఏమి? ఇది ఏమేలి గారడీ విద్యయా?"

ఈ మాటను రసవిరోధజ్ఞాన విషయములో ప్రయోగించియున్న రమణీయముగ నుండెడిదని మనవిచేసియున్నాను. ఇటమాత్రి మస్థాన ప్రయుక్తము. అల్పజ్ఞానసూచకము. ధర్మచక్రము అను చోట ఉపమితసమాసము చెప్పినచో చక్రమువంటి ధర్మము అని ధర్మమునకు ప్రాధాన్యము వచ్చును

అప్పుడు వారి యాక్షేపణ సరిపడును. కాని రూపక సమాసము చెప్పుకొన్నచో ధర్మమునెడి చక్రము అని ధర్మమునందు చక్రత్వారోపము చేసి చక్రమునందలి పరిభ్రమణ క్రియాన్వయిత్వము ధర్మమునకు ఘటింపనగును. ఇట్లగుచో గేలద్రిప్పుటలో గారడీ ఏమున్నది?

"అతడె సుకృతాత్ములైన మాయాదేవి కడుపార గన్న బంగారు తండ్రి—ఈ ధోరణి సొగసుగా లేదు."

ఇది పరమజాతీయమైన పలుకుబడి. అచ్చపు తెలుగుదనాన్ని గ్రుచ్చుకొన్నది. శ్రీ సీతారామారావు గారు పల్లీజన సంప్రదాయ సౌభాగ్యాన్ని, పరస్పర బంధుతా సంపల్లక్ష్మిని పరిశీలించకుండా వ్రాసిన వ్రాతయిది. తత్సంఘంలో బుద్ధుడొకడై చెల్వారుచు, తదతీతుడై పెనుగొంపినుండి విడివడి సత్యమార్గ గవేషణా సక్తుడై మహాజ్ఞానియై వెలుగొందు మా చిరకాలానికి సాక్షాత్కరించిన తేజోమూర్తి. అట్టి తేజః పుంజాన్ని చూచి జనం ఏడ్చుట లోక స్వభావ విరుద్ధం. "ఇతడా నాతండ్రి! మనమాయమ్మ కన్న బంగారునాయన—ఇతడె మనల్ని పాపపు రాసులనుండి ఉద్ధరించే దేవుడు—" అని భావించుట పరమ సహజంగా ఉంది. "ధృవం వపుః కాంచన పద్మనిర్మితం" అన్న కాళిదాసుని వాక్యం స్మరణకు వస్తోంది. బంగరులోనున్న మేల్మిచాయ, మెత్తదనం ఆయన తనువల్లిలో భాసిస్తున్నాయి. ఇప్పటికీ మా ఊరు వెళితే—నా మూర్ధ మాఘ్రాణించి—ముద్దాడి చేతివ్రేళ్ళ చిటికెలతో నన్నాదరించే ముసలమ్మ లున్నారు. లోకచక్షువైనవానికిగాని యిందలి పరమార్థము గోచరంకాదు.

"సడలని కౌగిలింతలకు చందనచర్చలు పేటులెత్తగా" "ఎట్లు సంభవమని నా ప్రశ్న."

లావణ్యరాసులయిన విలాసవతులు స్తనముల యందు, చెక్కిళులయందు చందన చర్చా సౌభాగ్యాన్ని అలంకరింపచేసికొనడం కేవల కావ్యగతమే కాకుండా లోకసామాన్యంకూడా. అలాగే సుందరి స్తనాంతరసీమలో చందనచర్చ నెఱపుకొన్నది. తత్ప్రియ పరీరంభ నిర్భరానంద ఫలితంగా తనువల్లికి అతఃపూర్వము అలంకరించుకొన్న చందనం బీటలు వారింది. ప్రియదర్శనము తత్సంభాషణము, సంభాషణౌచితీఫుల్ల మనస్సద్మ శోభ—కారణముగా సాత్త్విక భావోదయమై ఘర్మాంబుకణ సంజననము, రోమాంచము మొదలగు కార్యము లావిర్భవిస్తవి. ఆ సమయంలో గాఢాశ్లేష ఫలితంగా చందనం తడి యారి అక్కడక్కడ బీటలు వారినది. ఇందులో దోసమేమో కానరాకున్నది.

"నిశ్శేషచ్యుతచందనం స్తనతటం
నిర్మృష్ట రాగోధరః—
వాపీం స్నాతుమితో గతాసి నపున
స్తస్యాధ మాస్యాంతికం"

అన్న శ్లోకము, దానిపై నాలంకారికులు నెరపిన విమర్శనము వివరముగా తెలిసికొన్న నీ సందియము తీరునను కొందును.

"కవి మనః పంకజాసవ సిక్తమై రసాగ్రమున నాడెడి పదార్థములనంగ, ఆనంద పరిఫుల్ల మానీంద్ర దహరతారాధ్యమందారుజీవాత్మలనగ- ఇవి శాస్త్ర దృష్ట్యా నిలువవు."

ఇది సుందరీనందుల సౌందర్య సౌఖ్య రసామృతానుభవము గురించి వర్ణించిన పద్ధతి.

పదము అర్థము కవిమనః పంకజములో నుండు కారయిత్రి భావయిత్రి శక్తులను నాసవముతో సమ్మేళనము చేయబడిననాడే అవి రసప్లుతాలై జిహ్వాసింహాసనాసీనలవుతాయి.

ఇట జీవాత్మ పరమాత్మలకు భేద మంగీకరించిననాడు శాస్త్రదృష్ట్యా ఇవి తప్పక నిల్చును. అట్టి అంగీకారాన్ని స్థాపించే మతములు ద్వైతవిశిష్టాద్వైతములు.

"నామూడ్కలక్ త్రావుదుఁగనీ నవ్యామృత వీక్షణమ్ములను.—ఈ ప్రయోగమపూర్వము"

శ్రీవారి నిందయే స్తుతి పర్యవసాయి యయినది.

"రచియించుకొనియె చెలియ నును చెక్కులందు విశేషకమ్ము. ఇట విశేషకము అనగా నొసటి బొట్టు. సుందరి దానిని చెక్కులపై ఎల అలంకరించుకొన్నది?"

ఇట విశేషక శబ్దమునకు నొసటిబొట్టు అను అర్థమే కాక మకరికాపత్రము అను అర్థము కూడ

కలదు. అట్టి పత్రరచన కపోలములందు, స్తనములందు పూర్వకావ్య ప్రసిద్ధమే. అదియును గాక *Apte Dictionary*లో *A Parting line of the Painting on the face*-అని వ్రాయుచు ఉదాహరణంగా

"స్వేదోద్గమః కింపురుషాంగనానాం చక్రేపదం పత్రవిశేష కేషు" నిచ్చిరి. సౌందర నందకర్తలు ఈ విశేషకశబ్దమును పెక్కుచోట్ల మకరికాపత్ర అర్థము నందుపయోగించిరి.

'ఎడవినిధర్మ మార్గమెటులే నొక సుందదుగేయ ఏయుపదమునకు బాణము ప్రయోగించుటయని అర్థము, ఇక్కడవేయు అని ఉండవలయును."

కనకపు సింహాసనమున శునకము
గూర్చుండబెట్టి శుభలగ్నమునం
దొనరగ బట్టముగట్టిన...
......వినరా సుమతీ.

దొనరగ అనేశబ్దమును గ్రహించి దానిపై కుస్తీ చేసినట్లుగా నున్నదీ విమర్శ. అడుగేయు అనే జాతీయాన్ని యథాతథంగా గ్రహించారు. దాన్నట్లు ప్రయోగించుటలోనే సొగసున్నది. 'నాలుగు అడుగులేద్దా'ము అనే లోకవ్యవహారాన్ని మనం వింటూనే ఉంటాము. వారి లోకజ్ఞతకు తార్కాణంగా తీసికొని సంతోషింపవలసినదే కాని శాబ్దిక చర్చ నెఱపకూడదు.

"జాలిగా బడె దేమిటి కన్న దైన్యభావము గదురగా-
జాలి, దైన్యము భిన్నార్థకములు కాబోలును."

జాలియన మనః ఖేదము. లేక విచారము. దైన్యమన భయభారములేక దరిద్రభావము. అని అర్థము. "ఏలనయా విచారింతు వుభయభావముట్టి పడు నట్లుగా" అని బుద్ధుడు ప్రశ్నిస్తాడు. అవి రెండును భిన్నార్థకములే. అర్థ స్వారస్య పోషకములుగనే ప్రయోగింపబడినవి.

"కొంగొకింత అఘరీకృతిమైనకొలంది.

అఘరీకృతము నిట్లు వాడకూడదు. సంస్కృత సమాస పూర్వశబ్దమైన రమ్యముగనుండును."

ఇట మొదటవాడకూడదనియు, తరువాతి వాక్యములో వాడ వచ్చుననట్లు అంగీకరించి సంస్కృత సమాసపూర్వ శబ్దత్వము రమ్యమని వారె అంగీకరించుచు అశబ్దసాధుత్వమును దూషించుటకు జంకిరి. ఇది శ్రేష్ఠమైన ప్రయోగము.

"స్వయము కోరివరించి కయికొన్న—
తెలుగులో స్వయముగా అని వాడి తీరవలయును"

స్వయం అని సంస్కృతములో నిది అవ్యయము. దీనిని తెలుగులో అవిధముగనే వాడకూడదనియు, 'గాన్' చేర్చి క్రియావిశేషముగ వాడవలెననియు వారియుద్దేశ్యము కాబోలు. కాని క్రియావిశేషణమునకు "గాన్," "గన్," చేర్చకుండ యథాతథముగ ప్రయోగింపబడుచున్న పట్టులు కుప్పలు తెప్పలుగ కన్పించుచున్నవి. ఉ॥ మిక్కిలి, పెక్కుగాక.
"నేతి నేతి యటంచు ననేకగతుల బడలికన్గొనె తుదకు నిర్వాణపథము"

"నేతి నేతి అనునవి వేదాంతములోనివి. వానిని తీసికొనివచ్చి బుద్ధునివద్ద వాడుటలో పూర్వము చెప్పిన దోషము సంఘటితమగుచున్నది."

బుద్ధుడు స్వజనాన్ని ఉజ్జగించి సత్యమార్గగవేషణాసక్తుడై తపస్సు చేస్తాడు. ఏవేవో కొన్ని పరమార్థములుగా తారకముందు తారాడుతవి. కాని యథార్థ మరయుచో, వానిలో నెవ్వియును సరిపడవు. ఆ భాగములో ఈ విధము అగు విచారము చేయుచు "ఇది కాదు—అరయవలయునది ఇది కాదు'—అని నిర్ణయం చేసికొనుచు, చాల శ్రమనంది తుదకు నిర్వాణపథాన్ని అందుకుంటాడు. వేదాంతాంతర్గతమైనదైనప్పటికిదాని నాపట్టులో నుపయోగింపలేదు. ఈ సంప్రదాయము సంస్కృతము క్షుణ్ణముగా మాటాడగల ఆర్యుల సంభాషణలో స్వచ్ఛంగా భాసిస్తుంది. సంస్కృత మహావాక్యాలూని చమత్కారంగా తెలుగులో బిగించి పలకటం కవిప్రౌఢిమను చూపించే వెలుగుతునక. "నరకేసతికో దోషో మరణేసతికిం భయము" అని రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యములో ప్రయోగించాడు. అయినను బుద్ధభగవానుడు శ్రీవారను కొన్నంతటి సామాన్యపురుషుడు కాడు. భగవదవతారపురుషుడే.

"ఔచిత్యము, రసము, కథ వీని దృష్ట్యా ఈ కావ్యం నిలువదు. కావ్యమునకు ముఖ్యముగా కావలసిన సామగ్రియే ఇది" అని శలవు ఇచ్చారు.

వ్యాసాన్ని ఉపక్రమిస్తూ కొన్ని కావ్యలక్షణాల నుద్ఘాటించారు. అదే వ్యాసాన్ని ఉపసంహ

గిస్తూ ఈ లక్షణాలని నిర్దేశించారు. వానికీ వీనికీ పొత్తు కుదురుటలేదు. అందలి పరస్పర మేమో వారికే ఎఱుక. ఈ విధముగా పూర్వాపర వచో భంగముతో నలరారే విమర్శనము ఎంతవరకు విశ్వాస్యమో విజ్ఞులకే ఎఱుక. ఈ కావ్యములోనున్న జీవగఱ్ఱయే ఔచిత్యము. కథాపటుత్వ మెచ్చటను సడలలేదు. రసమన్ననో పరిస్ఫుట విభావానుభావ వ్యభిచారిసామగ్రీ సముల్లసితమై ఎట తడివినను తలమునకలుగా దర్శనమగుచున్నది. శ్రీవారి భావముల రూపెట్టిదో వారి ఎఱుకకే సందేహముగా నున్నది. ఇక పరేంగితజ్ఞత మాట బ్రహ్మదేవుడి కెఱుక.

ఇంతవరకు వారుచేసిన దోషారోపణమును సమర్థించుటయే యయినది. అటనట తలమానికములుగ నున్న పద్యములను సహృదయ చక్రవర్తులకు మనవి చేసి,—అందలి అలంకార ప్రయోగపాటవము' భావనా ప్రాగల్భ్యము, ప్రసాద గుణదర్శనము చూపించి నా వ్యాసమును ముగింతును.

ఒక కావ్యమును వినుటకైనను, చదువుటకైనను దానిని గుఱించి విమర్శనము నెఱపుటకైనను అధికార ముండవలయును. తగిన వయః పాటవము—తదుత్పన్నమైన ప్రౌఢిమ, వ్యుత్పత్తియుండవలయును. జగచ్చక్షుత్వము సంపాదింపవలయును. ఈ సామగ్రి లేకుండ కావ్య శ్రవణ, పఠన, విమర్శనములకు గడంగుట ఈతనేర్వక చెఱువులో దిగుటవంటిది. సముద్రములో నురుకుటయైనను గాదు. శబ్దము జ్యోతిస్సు అని కదా మనపూర్వుల ఊహ. దానితో గారడీ చేసిన కారుచిచ్చులా మనం భస్మసాత్కృతుల మవుతాము. ఒక కావ్యంతోనయినా అంతే. వారు చెప్పినట్లు లోకములో పెద్ద ఉద్యోగముల చేయవచ్చును. అధిక సంపాదన చేయవచ్చును. పదిమందిలో పలుకుబడి బడయవచ్చును. తర్కకర్కశుడైనవాని ఆశ్రయము సంపాదింపవచ్చును. కాని కావ్యము—నిర్మించుట విషయము దేవుని కెఱుక—అటుంచండి—అర్థము చేసికొనుట సామాన్యము కాదు. తగినంత దమ్ముండవలయును. ఊరక మండూకప్లుతు లొనర్చిన ప్రయోజనము లేదు. యథార్థము నివేదించుటకై ఇంతగా ఒత్తిచెప్పుచున్నాను. క్షమింతురు గాక.

"పాతరలాడు తన్భ్రుకుటి
వల్లి యొటుల్ చలియించునట్టులన్
చేతులు తాండవింప మల
చెన్ నృపసూనుడు విశ్వమెల్ల కా
లాతిగమౌ తదీయ రుచి
రాంగ విలాస సుధాంబురాశిపై
చీతతిదొప్పదోగి నిలి
చెన్ చెలిమాపుల పాలపోలికన్."

ఇది సౌందరనందకర్తల బ్రహ్మాండమైన భావనా ప్రాగల్భ్యాన్ని చాటి చెప్పు పద్యము. ఆ నందుడు సుందరీసౌందర్య ఆకృష్యమాణ సర్వచేతనుడై ప్రపంచాన్ని మఱచెనట. ఆమె కనుచూపులలోని పాపలా వర్తిస్తున్నాడట. ఆమెకు దర్శనాభిముఖంగా ఉపకరిస్తున్నాడని తాత్పర్యం.

ఆమె ఏ పదార్థాన్ని చూడవలెనని కాంక్షించినా, ఆ పదార్థమును తనలో (నందులో) ప్రతిఫలింప జేసికొని, ఆమెకు సాక్షాత్కరింపచేస్తూ తాను ఆదర్శమై అనువర్తిస్తున్నాడన్న మహార్థం వ్యంజితమవుతోంది. అందువలననే అతడు ముమ్ముందు ఆమె చేసికొనబోయే విశేష కార్యాలకు ఆదర్శధారణము వహిస్తాడు. ఆమె నేత్రగోళమునకు నందుడు తారక. అట తారక అన్ననూ బాగుండెడిదే! పాప అన్నారు. ఈ మాట అనటంలో గడుసుదనం ఉట్టిపడుతోంది. తన్ను ఆచ్ఛాదించివైచిన సుందర సౌందర్యోపనిషత్సారజ్ఞానమును గ్రహించుటలో పాపలా ఉన్నాడు. పాప మెలా గ్రహించగలడు? ప్రియురాలు గట్టిగా కన్నెఱ్ఱజేసి చూచిన నిట్టనిలువున నీరైపోతాడు. అనగా నందుడు ద్రవీభూతుడౌతాడు. లోకంలో ఏదైనా పదార్థాన్ని నిదానంగా పరీక్షిస్తే తారక నీరుక్రమ్మటం సహజం. ఆమె నందుడను పాపకు నేత్రగోళముగ వర్తించుచున్నదని ఈవఱకే మనవి చేసియున్నాను. ఇతని అవ్యవస్థిత చేతః ప్రవృత్తి ఈ ఔపమ్యమువలన ధ్వనితమగుచున్నది. ఈ ఉపమాలంకారమువలననే భావ్యర్థసూచనము జరుగుతోంది. ఇది నావ్యతోదర్శనీయమైన అలంకార ప్రయోగ ప్రాగల్భ్యము. కాని విమర్శకు లన్నట్టులు వీరి అలంకారములు ఎచ్చటను, ఎన్నడును నిష్ప్రయోజనములు కావు.

ఇలా తలచినకొలదీ మహార్థాలు సద్యఃస్ఫురితము లవుతవి. ఈ ప్రయోగము కేవలముపూర్వమే కాదు. భావనా గంభీరమై పరమ రమ్యముగ నున్నది. సంస్కృతాంధ్రవాఙ్మయంలో ఎక్కడా ఇట్టిది లేదు. ఒక్క నాచనసోముడు మాత్రం అనిరుద్ధుడు అంతఃపురంనుండి దొంగిలింపబడినపుడు కృష్ణుని ముఖమున అనిపిస్తాడు. "కన్నులండ కంటిపాపం గొన్నట్టులు." ఇలా ఎవరో రసచక్రవర్తులు మాటాడవలసిన మాట కాని కవిసామాన్యుడు అనగల్గినది కాదు. ఇలాంటి వాటి నాస్వాదించియే కాబోలు 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్నారు పెద్దలు.

రసవిరోధజ్ఞానము వీరికి లేదన్నారు. వీరికి పుష్కలముగ నున్నది. అనుకున్నవారికి లేదేమో! ప్రియ విరహ వేదనా పేశ్యమాన అయిన సుందరి నందుణ్ని ఉపాలంభనము చేస్తుంది. అచట

"ఔరా! అభినయవిద్యా
పారంగత! వంచకాతి వంచక! రసభా
వారంభ ప్రతికూల వి
చారా! సౌహార్ద ధర్మసమయ విదూరా"

మేము యీ యీ ఘట్టాలలో యీ యీ గారడీలు చేస్తున్నాము. మీరు అప్రమత్తులై గ్రహించండి అన్నట్లు 'టముకు' వాయిస్తోంది పద్యం.

మహాకవులు ప్రతియుగంలోనూ పుట్టుచునే యుందురు. సత్కావ్య నిర్మాణం చేయుచునే ఉందురు. కవులు పెక్కురుండవచ్చును. మహాకవులు మాత్రము సంఖ్యాకంగా ఉంటారు. వారి నర్థము చేసికొని ఆరాధించుకొనటం ఆ యా జాతి జీవనసౌభాగ్య సంస్కారాలపై ఆధారపడియుంటుంది.

మహాకావ్యాన్ని గురించి ఏమి వ్రాసినను అపరాధమగును. ఆధునిక కావ్యములకు మాత్రమే కాదు, కావ్యవాఙ్మయమునకు సౌందరనందము శిరోభూషణము.

యేనాస్మిన్ అతివిచిత్రకవి పరం
పరావాహిని సంసారే కాళిదాస
ప్రభృతయః ద్విత్రాః పంచషా
వా మహాకవయ ఇతి గణ్యంతే.
విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్
నహివంధ్యావిజానాతి గుర్వీం ప్రసవవేదనామ్.
"తమసోమాజ్యోతిర్గమయ"





నవల:

# శాఫో



★

## ఆల్ఫాంజ్ డాడె(ట్)

### 1

"ఏదీ! ఇల్లా చూడు! అబ్బ! ఏం చక్కని కళ్లు! నీ పేరేమిటి?"

"జీన్"

"అంతేనా, మరేం లేదూ?"

"జీన్ గాస్సిన్"

"దక్షిణాది కాదూ! చూడగానే చెప్పగలనులే! మరి నీ కెన్నేళ్ళు ?"

"ఇరవై ఒకటి"

"ఆర్టిస్టువా ?"

"కాదండీ!"

"పోనీలే—బతికాం!"

అక్కడి గల్లంతులో, నవ్వులాటల్లో, నృత్య సంగీత కోలాహలాల్లో, ఆ వేసంగినాటిరాత్రి జరుగుతూన్న మారువేషాల ఉత్సవనృత్యమధ్యంలో, డెషిలెట్టి స్టూడియో ఆరామపు పోకచెట్ల తోపులో, ఒక ఐగుప్త పల్లెపడుచు వేషధారికి, ఒక ఇటాలియన్ మేళకాని వేషధారికి మధ్య జరిగిన ఈ సంభాషణ తునకలు, దాదాపు ఆ కోలాహలంలో మునిగిపోతూ చెదురుగా వినిపిస్తున్నాయి.

ఐగుప్తీయ పల్లెపడుచు ఒత్తి ఒత్తి ప్రశ్నలు అడుగుతూంది. మేళగాని జవాబులలో యౌవనాంకురపు పసిదనం, పల్లీయుని అమాయకత్వం తొణికిసలాడుతున్నాయి.

ఆ నృత్యఉత్సవానికి అతన్ని వెంటబెట్టుకొని వచ్చిన స్నేహితుడు, నృత్యశాలలో అడుగిడటం లోనే అతన్ని సముద్రంలో వదిలినట్లు వదిలి తప్పించుకుపోయాడు. అక్కడి గాయకులు, శిల్పులు, చిత్రకారులు, ఇత్యాది మహామహులందరూ అతనికి కొత్తే! బెరుకుదనంతో అతను కుంచించుకొనిపోయి, రెండు గంటలనుంచీ తోచక తప్పించుకొని తిరుగుతున్నాడు. తప్త కాంచనవర్ణంలో ఉన్న అతని దేహం, తీర్చిదిద్దిన అందపు మోము, అంటకత్తిరబడీ కూడా, తుమ్మెదనలుపుతో ఒత్తుగా ఉంగరాలు తిర్చుకొన్న జుట్టు, ఆ సారూప్యమే కల్గుతూ అతని దేహానికి అంటతొడిగినట్లున్న ఉన్నివస్త్రం, అన్నీ కూడా అతని చుట్టూతా, ప్రేక్షకులలో ఔత్సుక్యం, ఆకర్షణా కల్గిస్తున్నాయనీ, ఆ గుసగుసలు అభినందనలనీ మాత్రం, అతనికి ఈషణ్మాత్రమూ తెలియదు.

నృత్యమధ్యంలోని రతులజంటలు తన్ను బుజాలు రాసుకొంటూ తోసుకొంటూ, పోతున్నారు. తన వేషం కట్టుకోటంలో వాయిద్యం అస్తవ్యస్తంగా బుజాల వేలాడేసుకొన్నా డతను. అది చూచి, వేసవి వేడికి అమరని అతని కొండదుస్తులు చూచీ, యువచిత్రకారులు అతన్ని తోసుకొనిపోతూ, వెక్కిరింపుగా మందహాసాలు చేస్తున్నారు.

పారిస్ నగరపు టిరుకుసందుల జీవనమంతా కన్నుల స్ఫురిస్తూన్న ఒక యువతి, జపాన్ పిల్లవేషం వేసుకొని, తలకట్టు దిమ్మచుట్టగా నడినెత్తి కమర్చి, ఉక్కుబాకులతో వేణీబంధాన్ని బిగించి, విలాసపు నడకతో అతన్ని రాసుకొంటూపోతూ, అతన్ని

ఉడికిస్తూన్నట్టు "ఓహోహో! అందమేరా! మాయ సక్కని కోడెగాడా?" అంటూ మెత్తగా పాడుతూ లాలిస్తూ కదిలింది. తెల్ల పట్టువలువలతో స్పానిష్ కన్య వేషంలో ఉన్న మరొక యువతి, కోయ నాయకుని వేషంలోవున్న పురుషుని బాహు మధ్యంలో కదలుతూ, తన చేతి మల్లెపూదండ నతని ముక్కోళ్ళవద్దకు విలాసంగా చేర్చింది.

ఈ విలాసచేష్టల నెల్లా అర్థంచేసుకోవాలో అతనికి తెలియటంలేదు. అందరికీ తను చాలా హాస్యాస్పదునిగా కనపడుతున్నాననుకొని, తోట లోపలి చెట్ల చల్లనినీడల క్రింది శిలావితర్దికకు చేరి ఏకాంతంగా అక్కడ కూర్చున్నాడు. ఆ శిలావి తర్దిపైనంతా లతలు పందిరల్లుకొని లతాగృహాన్ని ఏర్పరచుకొన్నట్లున్నాయి అతను అక్కడ కూర్చున్న మరుక్షణంలోనే ఆ స్త్రీ అతని ప్రక్కకువచ్చి కూర్చుంది.

పడుచుదేనా? అందగత్తె? అతను చెప్పలేడు. ఆమె ధరించిన ఊదా ఉన్నివసనం దేహాన్నంటి పెట్టుకొని, ఒంటివంపుల వ్యక్తీకరిస్తూ, తామర తూండ్ల లాంటి సుంద్రని చేతుల రెంటినీ ఏమాత్రం ఆచ్ఛాదించకుండా నగ్నంగా బైట పెడ్తూంది. ఆ చిన్న చేతుల వేళ్లు ఉంగరాలతో బరు వెత్తి పోయినయి. అసలే పెద్దవిగాఉన్న ఆమె తెలి నీలి కండ్లు, ఆ నుదుటను వేలాడుతూన్న ఆభరణాల ఆవరణతో మరింత పెద్దవిగా కనబడుతూ, ఆ రూపాన్ని సర్వాంగీణ మొనరుస్తున్నాయి.

నిస్సందేహంగా నటీమణి అయిఉంటుంది. డెషిలెట్టి ఇంటికి నటీమణులు చాలామంది వస్తూం టారు. నటి అని అనుకోటంతోటే అతనిలో బెరుకు మరింత ఇనుమడించింది. అల్లాంటివాళ్ళంటే అతని కసలే హడలు!

అతనితో మాట్లాడుతూ అతనికి అతి సన్ని హితంగా జరిగి, మోకాళ్ళపై చేతులానించి అర చేతిలో చుబుకం ఇమిడ్చి, దీర్ఘాలోచనాపరురాలై నట్లు, మందంగా - కొంత అలసత స్ఫురింపచేస్తూ మాట్లాడుతూంది.

"ఊ! అయితే నిజంగా దక్షిణాదినుంచే వచ్చా వన్నమాట! ఆ జుట్టుకూడా ఎంత చక్కగా ఉందో! ఓ! అద్భుతం!"

ఇంకా అతని విషయాలన్నీ కదలవేస్తూంది. పారిస్‌లో ఎన్నాళ్ళబట్టీ ఉంటున్నావు! అతను కౌన్సల్ పరీక్షకై చదువుతూంది! ఆ పరీక్ష చాలా కష్టమా! అక్కడ చాలామంది నెగుసనా! అయితే డెషిలెట్టి ఇంట్లో విందుకు ఎల్లా వచ్చావు! డెషి లెట్టి ఉన్న "రూడిరోమ్" పేటకు, అతనుంటూన్న "లాటిన్ క్వార్టర్" పేటకు, చాలా దూరమే!

తనను తీసికొచ్చిన విద్యార్థి పేరు చెప్పి, మహా కవి "లాగూర్నెరీ" బంధువని చెప్పాడు. ఆపేరు వినగానే ఆమె ముఖకవళికలు మారిపోయాయి. మొగం అకస్మాత్తుగా నల్లబడింది. కాని అతనేమీ గమనించలేదు. ఇతర మేమీ చూడకుండా, కళ్ళు మెరిసిపోయే ఈడున ఉన్నాడతను. తన స్నేహి తుడు, లాగూర్నెరే మహాకవి ఇక్కడకు వస్తాడనీ అతనికి తనను పరిచయం చేస్తాననీ, మాట యిచ్చి తీసుకు వచ్చాడు. "ఆయన పద్యాలంటే నాకు మహా యిష్టం.ఆయన్ని కలుసుకోవాలని నాకు ఎంతో కోరికగా ఉంది" అంటున్నాడు.

అతని బోళాతనానికి జాలితో చిరునవ్వు నవ్వు కొంది. ఒక చిన్న విలాసంతో నిరసనంగా బుజాలు కుంచించింది. అక్కడి వెదురు పొదల ఆకులను రెండుచేతులా విడదీస్తూ నర్తనశాలలోకి చూచింది. అక్కడ ఆ మహామహుడు కనబడ్తాడేమో అతనికి చూపిద్దామని.

ఉత్సవం చాలా రంగేళీగా జరుగుతూంది. ఆ నృత్యరంగం నిజంగా గంధర్వవిహారభూమిలాగా ఉంది. ఆ నర్తనశాల అసలు డెషిలెట్ చిత్రశాల. కాని అక్కడ అతను బొమ్మలువేసిన పాపాన పోయి నట్లు లేదు. ఆ చిత్రశాల ఇంటిపైకప్పుఎత్తున ఒక్కటే పెద్ద హాలుగా ఉంది. హాలు నిండా రంగు రంగుల తెరలు,రంగుటద్దాలు,కలంకారీనగిషీలఅద్దాలు, పల్చని వెదురువేళ్ళ రంగురంగుల సన్నదారాల జిలుగు తెరలు, అందంగా అమర్చబడి ఉన్నాయి. చైనీయ, జపానీయ, పారసీక, కాచ, మృత్తిక, లోహ దీపకళి కలకాంతులు, రంగుకాగితాల బుట్టలలోనుంచి ప్రస రిస్తూ భవనం అంతటా ఇంద్రధనుస్సు రంగుల నన్ని టినీ విరజిమ్ముతున్నాయి.

మధ్యమధ్య విద్యుద్దీప నీలికాంతులు తళుక్కు మని, ఈ వర్ణాల నన్నిటినీ పేలవ మొనర్చి, అక్కడి

నర్తకీ నర్తకుల మొగాలమీదా, నగ్నభుజాలమీదా, వారి వసనాలు ఆభరణాలమీదా, వెన్నెల వెల్లదనాన్ని విరియింపచేస్తూ, అక్కడి అలంకరణలు ఆభరణాలు అన్నీ, తోటనుంచి నర్తనశాలదాకా అంచెలుఅంచెలుగా చీడీలు కట్టుకొని, నర్తకీనర్తకుల మొగాల పేర్పులో సోపానస్థితి గడిచి, వాద్యగాళ్ళ వేదికపై, వాళ్ళమెడల తెలుపులో, మేళకర్త చేతి కమాను చలనంలో ఆ ఆరోహణకు తారకస్థానం అందుకొన్నట్లు స్ఫురిస్తున్నాయి.

తాను కూర్చున్నచోటినుంచి, ఆ పచ్చని ఆకు జొంపాలసందులలో, ఆమారచిత్రంతోపాటు అల్లిబిల్లిగ పెనవేసుకుపోయినట్లున్న పూల తీగెల అల్లికలోనుంచి, ఆ ఉత్సవదృశ్యాన్నంతా ఆ యువకుడు చూస్తున్నాడు. ఆ ఆకుజొంపాలు, ఆ చిత్రానికి అంచులుకట్టినట్లున్నాయి. అక్కడి నృత్యసంగీతాల లయతో పెనవేసుకొనే ఆ పూలతలు ఆ మధ్యను కదలుతున్నట్లు, దృగ్భ్రమను కల్గిస్తున్నాయి. తన ప్రక్కనేఉన్న ఆ ఐగుప్తు పల్లీయ, అక్కడిజనాన్ని, వాళ్ల పేర్లను, విషయాలను, ఒక్కొక్కటే వివరణ చేస్తూంటే అతనికి మరింత కౌతూహలం పెరిగింది. ఆపేర్లన్నీ ప్రతిష్ఠ కలవే! ఆ మహామహులంతా సరదాగా, వివిధ మారువేషాలతో ఈ ఉత్సవంలో పాల్గొనటం, ఆ విషయాలన్నీ ఈయువతి ఆ వాతావరణంలో తనకు వివరించటం, అతని ఆనందౌత్సుక్యాలను ఇనుమడింపచేసింది.

నడుందట్టి ఓగించి, అందులో కొరడా దోపిన ఆ వ్యక్తి 'జేడిస్'; ఆ దూరాన్నున్న పల్లెటిపూజారి వేషగాడు "ఇజబే"; పొట్టిగా కనపడకుండా ఉండేందుకు కాలిజోళ్ళలో పేకదస్తాలు కుక్కుకొన్నాడు. ఫించను ఉద్యోగి టోపీతో చిరునవ్వు నవ్వుతున్నవాడు కోరట్ బాబా! "థామస్ కౌచర్" బుల్ డాగ్ వేషంలో ఉన్నాడు. పోలీసు దుస్తులు ధరించినవాడు "జండ్ట్"; కొంగవేషధారి "ఛామ్" అన్నీ ఆనాటి మహాకవుల, మహాకళాకారుల పేర్లే!

యువకులంతా పూర్వీకపు రాచవేషాలు, ఇంకా అల్లాంటి గంభీరపు వేషాలు ధరించారు. కాస్త నడివయసుదాటిన పెద్దలంతా, బజారీ అలగా వేషాలు, హాస్యదోహాదకమైన వేషాలు వేసుకొన్నారు. యువకులే కాస్త తీవ్రంగా వెనుదగ్గి ఉన్నారు. వృద్ధులే అరమరలు విడిచి కౌముది పంపగలో నిమగ్నులైపోయినట్లు విచ్చలవిడిగా ఉన్నారు.

ఏబదిఐదేళ్లు నిండిన శిల్పి "కొఉడల్" పేదరికంలో దుస్తులు చినిగి అల్లాడిపోతున్న బీదసైనికుని వేషంలో ఉన్నాడు. కండలు తిరిగిన అతని కైదంపెలు ఇంకా అతనిలోని భీమబలాన్ని వ్యక్తపరుస్తున్నాయి. అతని రంగులపళ్లెం, పాత డాలులాగా వేలాడుతూ అతని మోకాళ్లకు కొట్టుకొంటూంది. మహా సంగీత విద్వాంసుడు "డిపాట్టర్" ఫకీరు వేషంలో తలపాగా పక్కకుచుట్టి, పొట్టతో నేలమీద పాకుతూ, సర్పనృత్యం చేసున్నట్టు, సాగుతూ "అల్లా, ఇల్ అల్లా" అంటూ కీచుగొంతుకతో అరుస్తున్నాడు. "కొఉడల్" అక్కడే ఒక సైనికుణ్ణి ఒప్పులకుప్ప ఆడుతున్నట్లు చేతులతో గిరగిర తిప్పేస్తున్నాడు.

ఈ మహాపురుషుల ఇద్దరిచుట్టూ చాలామంది నర్తకీ నర్తకులు గుడికట్టినట్టు కూర్చుని విశ్రాంతి తీసుకొంటున్నారు. గృహయజమాని డెషిలెట్ పారశీక శిరోష్ణం ధరించి, చిన్నికళ్లు చికిలించుకొంటున్నాడు. అతని బిరుసుగడ్డానికి, ఆ దీర్ఘనాసికకూ ఆ శిరోష్ణం అమరినట్లుంది. ఆ జలసాలలో అతిథులు చూపిస్తున్న "సరదా" అతనికి చాలా హాయి కొల్పింది. పైకి కనుపరచకపోయినా అతనికి కూడా ఆ రాత్రి స్వర్గసౌఖ్యం అనుభవిస్తూన్నట్టుంది.

డెషిలెట్ ఉద్యోగరీత్యా ఇంజనీయరు. చాలా ధనికుడు. దయార్ద్రహృదయుడు. పదిపన్నెండేళ్ళనుంచి పారిస్ కళాసంఘాలలో మంచి పేరు ప్రతిష్ఠలలో ఉన్నాడు. తనుకూడా చిత్రాలు గీస్తాడు. కాని అంత "ఖాతరీ" ఉంచినట్టు కనపడడు. బ్రహ్మచర్య జీవితం, విస్తృత పర్యటనం, అంతకు అంతగా చేతినిండా ధనం, వీట్లతో, అతని వ్యక్తిత్వంలోనూ, కళలోనూ కూడా, సాంప్రదాయవిరహితమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అలవడిపోయాయి. అప్పుడతను మధ్యప్రాచ్యంలో టాబ్రిజ్ నుంచి టెహరాన్ దాకా రైలుమార్గం నిర్మించే ఉద్యోగంలో ఉన్నాడు. పదినెల్లుగా ఆ ఉద్యోగంలో రాత్రింబవళ్లు, చెమటోడ్చి పనిచేసి, ఎండకెండి వానకి తడిసి, ఇసుక ఎడారులలో మలేరియా మన్యాలలో, డేరానివాసాలతో గడిపి, వేసవి రెండునెలలూ

విశ్రాంతి తీసుకోందామని పారిస్‌కి స్వగృహానికి చేరుకొన్నాడు. ప్రతిసంవత్సరం పదినెల్లు విదేశాల్లో ఉద్యోగంలో అహోరాత్రాలు గడిపి వేసంగి రెండు నెలలూ పారిస్‌లో కులాసాగా విశ్రాంతి తీసుకోటానికి 'రూ డి రోమ్' వీధిలోని తనయింటికి వచ్చేవాడు. ఆ యిల్లు కూడా, అతను వేసవికేంద్రంగా అమరిఉండేటట్టు తన స్వంత డిజైనుతో కట్టుకొన్నాడు. పారిస్‌లో ప్రతిభులైన పురుషులని, అందగత్తెలైన స్త్రీలని అందర్నీ ఆ రెండు నెల్లూ తన యింటికి ఆహ్వానించేవాడు. ఆ కొద్దివారాలలోనే నాగరక జీవన మధుమత్తతనంతా ఆస్వాదించటానికి ప్రయత్నించేవాడు.

అతని ఇంటిముందు కిటికీ తలుపులు తెరుచుకొనేటప్పటికే, నాటకంలో తెర ఎత్తినట్లు, "డెషిలెట్ ఊళ్లోకి వచ్చాడ"న్న వార్త ఊరి స్టూడియోలన్నిటా పాకిపోయేది. అంటే ఇక వసంతోత్సవాలు మొదలు అవుతాయన్నమాట. ఇక ఆ రెండు నెలలు, సంగీతసభలు, నృత్యాలు, ఉత్సవాలు, కౌముది పండగలతో, ఆ యింట ఒకే జలసాగా గడిచిపోయేవి. వేసంగి సెలవులకు పారిస్ సామాన్య జనం అంతా పల్లెపట్టులకు సముద్రతీరానికి పోయి, పారిస్ నిర్జీవమైందా అనిపించే రోజుల్లోనే సరిగ్గా ఈ ఉత్సవం ప్రారంభమై మళ్లీ చైతన్యం కల్గించేది.

అతని ఇంటిలో రాత్రింబవళ్ళ ఏకధాటిగా సాగే ఈ జల్సాలలో డెషిలెట్ స్వయంగా పాల్గొనేవాడు కాడు. అంటే అంటనట్టుగా ఉంటూనే భంగు తాగినవాని మాదిరిగా, అందులో కనరాని నిమగ్నతతో విసుగులేక విరతిలేక ఆనందిస్తూ కూర్చున్నట్లుండేవాడు—కాని ఏమాత్రం తొణకకుండా, ఏ నిముషమూ చైతన్యం తప్పకుండా హుందాగా ఆనందించేవాడు.

డెషిలెట్ చాలా స్నేహపాత్రుడు. మిత్రులకు సహాయం చేయటంలో చేతికి ఎముక ఉండేదికాదు. ఆడవాళ్లంటే, ప్రాచ్యులకున్న నిరసనం—అందులోనే సహన గౌరవాలూ— మిళాయించుకొన్న నాగరికతతో చూసేవాడు. అతని భాగ్యభోగ్యాలకు పేరుప్రతిష్టలకు ఆశపడి వచ్చిన అందరు యువతుల లోనూ, ఒక్కరాత్రికి మించి అతని ప్రేమ చూరగొన్నానని చెప్పుకోగల పడతి ఒక్కతె లేదు.

"అయినా మనిషి మొత్తంమీద మంచివాడే"— అంటూ పల్లెపడుచు, గాసిన్‌తో డెషిలెట్ విషయం వివరిస్తూ చెప్పింది. ఇంతలో అకస్మాత్తుగా ఆ విషయం ఆపి, "అడుగో నీ మహాకవి" అంది.

"ఆ! ఎక్కడా?"

"నీ ఎదురుగుండా నే—కొత్త పెళ్లికొడుకు వేషంలో ఉన్నాడే, అతను."

యువకుడు ఆశాభంగంతో నీరసంగా "అహా!" అన్నాడు—ఇతడా తన మహాకవి! ఆ ఊబకాయం, ఒళ్ళంతా ఆ జిడ్డుచెమట బడుతూ, చొక్కాలో నించి ఉబుకుతూన్న రొమ్ము, మహోదరం—ఇతడా తన మహాకవి—"ప్రేమ కావ్యం"లోని ఉద్భ్రాంత వేదనా గీతికలు అతనికి జ్ఞాపకానికి వచ్చాయి. ఒళ్లు పులకరింతలతోనే ఆ కావ్యగీతిక లెప్పుడూ పఠిస్తూండేవాడు—తనకు తెలియకుండానే గట్టిగా ఆ కావ్యంలోని గీతం చదువుతున్నాడు.

"నీ శిలాసదృశ సుందరదేహ యష్టిన్
చైతన్యమింత కలిగించెడి యాశతో, నా
ఎదచీల్చి గుండె నెత్తురులోద్భుకొంచున్
తుది బొట్టుకూడ నరిపెట్టితి, నోసి శాఫో!"

ఆమె చటుక్కున ఇటు తిరిగింది. ఆ ఊపులో ఆ అనాగరక ఆభరణాలన్నీ ఖణేల్‌మన్నాయి.

"ఏమిటి అంటున్నావ్?" అంది విసురుగా. ఆ గీతపాదాలు "లాగూర్నెరీ" రచించినవి. అంత ప్రసిద్ధమైనవి, ఆమెకు తెలియవా అని ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"నాకు కవిత్వంఅంటే చిరాకు" అని ముక్తసరిగా అంది. అల్లా నిల్చునేఉంది. నొసలు కోపంతో ముడిపడే ఉన్నాయి. ఆ లతాకుంజంలో ప్రేలాడుతున్న అందమైన పూగుత్తులను వణుకుతూన్న చేతులతో చీదరింపుగా తోసేస్తూ నర్తకులవంక చూస్తూంది. చివరికి అతికష్టంమీద మనసు నొకదోవకు తెచ్చుకున్నట్లు "సెలవు" అని చెప్పి, అక్కడనుంచి మాయమైంది.

పాపం ఆమేశీగాడు తెల్లపోయాడు. ఇంతలో ఏం ముంచుకొచ్చింది? ఆవిడ కేమయింది! నేనే మన్నాను! అంటూ విభ్రమచేతిస్కుడైపోయాడు. తల పగులకొట్టుకొన్నా కారణం ఏమీ తెలిసేటట్లు

అల్పులుగా కనబడతారు. చివరకి తనలాంటివాడు ఇంటికి పోయి పడుకొని [illegible] మంచిదనిపించింది. ఒక్క [illegible] ఆ వేషం [illegible] అంతా [illegible] పల్లీయు [illegible] చిన్నకన్నా, అక్కడి జనం వత్తిడిలోనుంచి చీల్చుకొని తలుపు అవతల పడటమే మరింత చికాకుగా కన్పిస్తోంది.

ఇంతటి కీర్తిప్రతిష్ఠల సాన్నిధ్యంలో రవ అల్పత్వం మరింత కన్పులకట్టినట్లయి, అతన్ని మరింత భీరువుగా తయారుచేసింది.

అక్కడ నృత్యం ఆగిపోయింది. సంగీతం ఆలాపనలు ముక్తాయింపులు ఏవో ఇంకొంచెం సాగుతున్నాయి. వాట్లకే తాళం వేస్తూ, కొందరు ఉత్సాహులు మాత్రం నృత్యంలో గిరగిరా తిరుగుతున్నారు. అందరికన్నా ఎత్తుగా భీమవిగ్రహంతో కనబడుతూన్న కౌఉపెల్, ఒక చిన్న కోమలాంగిని బాహువుల్లో ఇరికించుకొని వానాలప్పలు తిప్పుతున్నట్లు గిరగిరా తిప్పుతున్నాడు. ఆవిడ కేశబంధం విరబారి, వెనుకకు కేతనంలాగా జీరాడుతోంది.

హాలు వెనుకగా ఉన్న పెద్ద కిటికీలు తెరచి ఉన్నాయి. వాట్లలోంచి వస్తూన్న శుభ్ర ప్రాతర్మలయానిలవీచికలు, పోక ఆకులను కదుల్చుకొంటూ వచ్చి, నర్తనశాలలో వెలవెలబోతూన్న క్రొవ్వొత్తి జ్యోతులను నొక్కేస్తున్నట్లు దిగవార్చేస్తున్నాయి. ఒక కాగితందీపం బుట్ట అంటుకొంది. అక్కడి గాజు పలకలు చిట్లి చుట్టూ జిమ్మాయి. హాలునిండా నౌకరులు చిన్న చిన్న గుండ్రనిబల్లలు కుర్చీలు ఆరుబయట హూటళ్ళలోలాగా విందుల కమరుస్తున్నారు. డెషిలెక్ విందులలో జనం నల్గురైదుగురు జట్టులుగా చేరి కూర్చోటమే అలవాటు. ఎక్కడికక్కడ సన్నిహితుల, సమహితుల, గుంపులు ఏర్పడేవి.

అక్కడ ఏం కోలాహలం? ఏం కేకలు? బజారు చికిలి వీథుల అలగా కేకలను, ప్రాచ్యసుందరుల "ఏఏఏఏ" అన్న ఓలకేకలు సమాధానాలిస్తున్నాయి. ఎన్నో చిన్నిచిన్ని గుసగుసలు, ఎన్నో కిలకిలనవ్వులూ, కౌమపారవశ్యంలో చిక్కిన లలనామణుల కూజితారావాలు! అన్ని ఒకే కోలాహలంలో మేళవించిపోతున్నాయి.

ఈ సందడిలో చప్పుడులేకుండా జారిపోతూన్న గాసిన్, తలుపుదగ్గిరకు చేరేటప్పటికి అసలు మిత్రుడు కనుపించాడు—అతని కళ్లు ఉబ్బిపోయి ఉన్నాయి. ఒళ్లంత చెమటలు కారి పోతున్నాయి. రెండుచంకలా రెండు సీసాలు ఇరికించుకొన్నాడు.

"ఒరిసి! ఎక్కడి కెళ్ళావోయ్! ఈ హాలు అంతా నీకోసం గాలించేస్తున్నాను. అదిగో అక్కడే మేజా, స్త్రీలువారి కౌరుపద—అదిగో మూఫిన్ నుంచి వచ్చిన బాచిలరీపిల్ల అక్కడే ఉంది—ఆ జపాన్ వేశ్య వేషంలో ఉంటే, ఆ అమ్మాయే! నిన్ను పిల్చుకు రమ్మని పంపించింది. త్వరగా పోదాంపద" అంటూ పరిగెత్తాడు.

అతనికి దాహం వేస్తోంది. అది కాకుండా, విందులో పాల్గొనాలని ఉత్సాహము రేకెత్తుతోంది. దూరాన్నుంచి తనని రమ్మని సైగచేస్తూన్న ఆ నర్తకి మొగంకూడా వ్యామోహితుణ్ని చేస్తోంది.

ఒక మెత్తని గంభీరస్వరం "వెళ్ళవద్దు" అంటూ అతని చెవిలో ఊదింది.

కాసేపటిక్రింద అతనితో ఉన్న స్త్రీ అతని ప్రక్కనే, దాదాపు అతన్ని ఆలంబించుకొని నిలచిఉంది. అతన్ని ప్రక్కగా లాక్కొని పోతోంది. ఏమాత్రం ఆలోచనలేకుండా ఆమె ప్రక్కనే కదలిపోతున్నాడు—కారణం? ఆమె అతన్నాకర్షించిందని కాదు. నిజాని కామె వంకన్నా అతను కన్నెత్తి చూసినట్లే లేదు. పైపెచ్చు, తలకట్టులో బాకులు అమర్చుకొంటూన్న ఆ జపాన్ వేశ్యరూపు, అతన్నింతకన్నా చాలా ఆకర్షిస్తూనే ఉంది. కాని తన చిత్తాన్ని మించిన మరో మానసిక శక్తి వశ్యమొనర్చుకోగా ఆ వ్యక్తి ఉద్వృత వాంఛా విజృంభణానికి తలవొగ్గి కదులుతున్నాడు.

వెళ్ళవద్దు...!

మరుక్షణానికి ఆ యిద్దరు "రూ డి రోమ్" వీధి అంచున నిలబడ్డారు. వేకువఝాము వెల్లవెలుగులో అక్కడి కిరాయిబళ్లు కునుకుతున్నాయి. వీధి ఊడ్చేవాళ్లు వీధి కడ్డంగా ఇటునటూ కదలుతున్నారు. కూలికి పోతూన్న కార్మికులు, వీధిలోకి పొంగి పొర్లుతున్న ఆయింటి జలసాకాంతులను; నడివేసగిలో ఈ వసంతోత్సవాన్ని, వీధినిబడ్డ ఈ వేషధారి మిథునాన్ని, తేరిపారజూసి కదలిపోతున్నారు.

"మీ యింటికా, మా యింటికా?" అని అడిగింది. ఏ, కారణమో సరిగ్గా తెలియకుండానే తన బసకు వెళ్లటమే మంచిదనుకున్నాడు. బండీవానికి తన బస ఉనికి చెప్పాడు. దోవ పొడుగునా, అంతటి దీర్ఘప్రయాణంలోనూ వాళ్ళేమంత మాట్లాడుకో లేదు. ఆమె మాత్రం అతని చేతిని తన రెండు చేతుల్లోకి తీసికొని అల్లాగే పట్టుకొని కూర్చుంది. ఆ చిన్ని చేతులు మంచుకన్నా చల్లగా తగుల్తున్నాయి అతని చేతికి. వెనుకకు వాలి సీటుకానుకొని ఆ సోఫాలో మునిగిపోయి పడుకొంది. ఆమె తన చల్లని చేతులతో తన చేతిని నిమురుతోన్న కదలికే లేకుంటే నిద్రపోతోందనే అనుకొనేవాడు. బండి కిటికీ అద్దాల నీలి ఛాయ ఆమె మొగంమీద నీడలు జార్చుకొంటోంది.

రూ జాకబ్ వీధిలో, విద్యార్థులకు వసతైన ఒక హోటలుముందు బండీ ఆగింది. నాలుగు అంతస్థులపైదాకా ప్రయాసపడి నాలుగు వరసల మెట్లెక్కుకుంటూపోవాలి.

"నా చేతుల్లో నిన్ను ఎత్తుకొని తీసికెళ్లనా" అంటూ నవ్వాడు. నిద్రామగ్నమైఉన్న ఆ యింటి నిశ్శబ్దతను భంగపరచకుండా చిన్నగానే నవ్వుతున్నాడు. ఆమె ఒక్క నెమ్మది చూపుతో అతన్ని ఆస్వాదిస్తూంది. నిరసనంలోనే మృదుత్వం—ఆ చూపులో అనుభవం ఉట్టిపడుతూంది. ఆ చూపు అతన్ని పూర్తిగా ఆకళించుకొంటూ స్ఫుటంగా "పిచ్చిపిల్లాడా!" అంటూంది.

దక్షిణపు పల్లెటూరినుంచి వచ్చాడు. ఆ గ్రామీణయౌవనపుటుత్సాహ ఉద్రేకాల్లో, ఆమెను పసిపిల్లనెత్తుకొన్నట్లు రెండు చేతులా ఎత్తుకొని మెట్లెక్కసాగాడు. కన్నెకోమలివంటి సున్నితంతో మృదులంగా కనుబడుతున్న అతని దేహంలో మంచి బలముంది. మొదటి అంతస్తు మెట్లు ఒక్క బిగిని ఊపిరి పీల్చనట్టే ఎక్కిపోయాడు.

తనకంఠానికి పెనవేసుకొని ఉన్న ఆ మెత్తని గుండ్రని అందపు చేతులు, తన చేతుల్లో ఆ సౌందర్యరాసీ, అతనికి మహదానందాన్నిస్తున్నాయి.

రెండవ అంతస్థుమెట్లు మరికొంత దీర్ఘమైనట్లున్నాయి. ఆమె తన దేహాన్ని అవశంగా అతనిమీదికే వదిలి మరింత బరువైంది. ఆమెనుదుటి ఉక్కు ఆభరణాలు, అతని చెంపలవద్ద ఊగుతూ, మొదటి మెట్ల వరుసలో గిలిగింతలు కల్గించినవి-అంతకంతకూ క్రూరంగా చర్మం లోపలికి గుచ్చుకొంటూ బాధపెట్టూన్నాయి.

మూడవమెట్ల వరుసకు వచ్చేటప్పటికి, బరువైన పియానోను మోసుకెళ్తున్న సామానుకూలీలాగా వగరుస్తున్నాడు. అతనికి ఆయాసంతో నోట మాట రావటంలేదు. ఆమె మాత్రం, అరగన్నుమూసి రెప్పల నల్లలాడిస్తూ ఆనందాతిరేకంతో, "ఓహో! ప్రియతమా! ఏమి సౌఖ్యం! ఎంత బాగుందోయ్!" అని గుబగుబ పల్కుతూంది. ఆ చివరిమెట్లు ఒక్కొక్కటే ఎక్కుతున్నాడు. అదొక రాక్షససోపానమైనట్లు, ఆ మెట్ల తిరుగుడు కంతులేనట్లు, ఆ చుట్టూ గోడలు, మెట్లపక్కని బద్దీలు, అన్నీ ఇరుకైపోయి అంతకంతకూ అంతులేకుండా గిరగిర తిరుగుతూన్నటనిపించింది. ఇంక అతని చేతుల్లోది స్త్రీమూర్తిగా అనిపించటంలేదు. ఏదో మోయరాని బరువైనట్లుగా తోచి, ఏక్షణానికాక్షణం ఆగ్రహంతో విసిరి గిరవాటేసి, తునాతునకలు చేసేద్దామన్న తీవ్రవ్యామోహం కలిగిస్తూంది.

నాల్గో అంతస్థు వరండాలో చేరేటప్పటికి ఆమె కన్నులు తెరచి "అప్పుడే!" అంది. అతను మాత్రం, "ఎప్పటికి!" అనుకున్నాడు. కాని ఆ మాట బయట కనలేదు. మొగం నెత్తురుముక్క లేకుండా పాలిపోయింది. బద్దలైపోతోందనిపిస్తున్న రొమ్మును రెండు చేతులా గట్టిగా అదుముకొంటున్నాడు.

ఆ తొలి వెలుగు మసకచీకటిలో, ఆ సోపానారోహణంలోనే, ఆ యిద్దరికథా అంతా ఇమిడి ఉంది.

## 2

ఆమెను రెండురోజులుంచాడు. ఆమె దేహకోమలత్వం, ఆమె అంతర్వసనాల సౌరభం - ఈ ఇంద్రియ జ్ఞానచ్ఛాయను మాత్రమే అతనికి వదిలి ఆమె వెళ్ళిపోయింది.

ఆమెనుగురించి పేరూ చిరునామా తప్ప అతనేమీ తెలుసుకోనేలేదు. "నీ కెప్పుడు నేను కావలిసివస్తే అప్పుడు నాకు కబురు చెయ్యి. సర్వదా సిద్ధంగా ఉంటాను" అన్నమాట మాత్రం ఆమెఅంది.

ఘుమఘుమలాడుతున్న చిన్న విజిటింగ్ కార్డు, తీసి ఇచ్చింది.

| ఫాన్నీ లెగ్రెండు<br>6. రూ డి లా ఆర్కేడ్ |
|---|

అని మాత్రం ఆ కార్డుమీద అచ్చువేసి ఉంది.

ఆ కార్డు అద్దంప్రక్కన డెషిలెట్ విందు ఆహ్వానపు కార్డుకూ, విదేశకార్యాలయంలో విందు ఆహ్వాన కార్డుకూ మధ్య గుచ్చాడు. ఆ ఏడాది మొత్తంమీద అతను వెళ్ళిన వాటిలో చెప్పుకోదగ్గ విందులు ఆ రెండే.

అంతకంతకూ ఆ సువాసన, గలికి అంతరించి ఆ కార్డు చిమ్మిగొట్టం మూలకు చేరి వాడిపోతోంది. గాసిన్ కష్టపడి చదువుకొనే విద్యార్థి. పరీక్షలంటే శ్రద్ధా—ప్రపంచంవిషయంలో ఉచితానుచిత జ్ఞానమూ కలవాడు. పారిస్ చూపించే ఎఱలని నమ్మి వ్యామోహపడకూడదని పూర్తి నిబ్బరంతో ఉన్న వాడు. అందుచేత ఆ అనుభవాన్ని పునశ్చరణ మొనర్చుకోవాలన్న ఉద్రేకం కూడా అతనిలో ఏనాడూ కలగలేదు.

మినిస్ట్రీ పరీక్షలు నవంబరులో జరుగుతాయి. పరీక్షలకు తయారయ్యేందుకు మూడు నెలల వ్యవధి మాత్రమే మిగిలిఉంది. ఆ పరీక్షతర్వాత మూడు నాలుగేళ్లు "కాన్సులర్ ఆఫీస్"లో పనిచెయ్యాలి. అప్పుడు ఏ దూరదేశానికో వెళ్లవలసివస్తుంది. ఆ దూరప్రయాణపు ఆలోచనేమీ అతన్ని కలతపెట్టడంలేదు. వాళ్ళ కుటుంబం, 'అవిగ్నన్'లోని పురాతన కుటుంబం. గాసిన్ డి ఆర్మండీల కుటుంబంలో, పెద్ద కొడుకు, రాచకొలువులో విదేశాల కెళ్లటం, తన పూర్వుల ప్రతిష్టా ప్రాపకాలూ, పేరు పెద్దరికాల చాటున తనూ ఆ ప్రతిష్ఠ నిలబెట్టటం సాంప్రదాయంగా వస్తూంది. ఈ మహాపథంలో పారిస్ నివాసం ఒక చిన్న మజిలీమాత్రమే. అందుచేత ఇక్కడ శాశ్వతమైన మైత్రీబంధాలు గాని ప్రేమబంధాలు గాని కుదుర్చుకోటానికి వలనుపడదు.

డెషిలెట్ యింట విందయి ఒకటి రెండు వారాలు గడిచాయి. గాసిన్ ఒకనాడు సంజెచీకటిలో దీపం వెలిగించి పుస్తకాలు బల్లమీద పరుచుకొని చదువు కుపక్రమించబోతున్నాడు. సన్నగా తలుపుతట్టిన శబ్దమైంది. తలుపు తెరుచుకొంది. నీలైన లేతరంగు దుస్తులుధరించిన ఒక స్త్రీమూర్తి ప్రత్యక్షమైంది. మేలిముసుగు తీసేదాకా ఆమెను అతను గుర్తించలేదు.

"చూశావా...మళ్ళీ వచ్చాను."

అని పుస్తకాలవంక అతను సందిగ్ధంగా చూడటం గమనించి,

"ఉహూ! నీపని పాడుచేయను—నాకూ తెలుసును" అంది. మేలిముసుగు విప్పి అక్కడపెట్టి, "రౌండు ది వరల్డు" అన్న పాతపత్రిక సంచిక నొకదాన్ని తీసికొని ఒక కుర్చీలో కూలబడి అందులో నిమగ్నమైపోయింది. కాని అతను తలఎత్తి చూసినప్పుడల్లా, ఆమె చూపులు కలుస్తూనే ఉన్నాయి.

నిజానికి, వెంటనే ఆమెను చేతుల్లోకి తీసుకోకుండా ఆగటానికి అతను ఎంతో మనోనిబ్బరం ప్రదర్శించుకోవలసివచ్చింది. ఆమె అతి ఆకర్షణీయంగా అతిరమణీయంగా కనబడుతూంది. ఆ చిన్న తల, సన్నని నుదురు, చిన్నముక్కు, కామాన్ని ప్రకోపింపచేస్తూ దయనొలికిస్తూన్న ఆమె అధరం—ఆమె ధరించిన పారిస్ దుస్తులు ఆమె దేహసౌష్ఠవాన్ని వ్యక్తపరుస్తూ, తొలినాటి అనాగరిక వేషం కల్గించిన అలజడి కల్గించకుండా ఆకర్షణీయంగా ఉన్నాయి.

మరునాడు తెల్లవారగానే వెళ్ళిపోయింది. ఆ వారం పొడుగునా చాలాసార్లు వచ్చింది. ఎప్పుడు వచ్చినా, మొగంలో ఆ పాండురత్వం, స్పర్శలో ఆ శైత్యం, కంఠంలో ఉద్రేకపూరితమైన గాద్గదికం, ఆమెలో అల్లాగే ఉన్నాయి.

"ఆ! నీపనికి అడ్డంగా ఉన్నానని తెలుసును. నిన్ను విసిగిస్తున్నాననీ తెలుసును. నా కింతకన్నా కొంచెం అభిమానం ఉండిఉండాల్సిందే...కాని గమ్మత్తు! రోజూ పొద్దున్నే వెళ్ళేటప్పుడు ఇక మళ్ళీ రానని ఒట్టేసుకొంటాను. అయినా సాయంత్రం అయ్యేటప్పటికి వెఱ్ఱెత్తినట్లై పోయి మళ్లీ మొదటికొస్తాను". అంటూ అతనితో అనేది.

అతనికి ఆడవాళ్లంటే ఉన్న నిరసనంలో, ఈ నిరంతర అనురాగాన్ని చూసి ఆశ్చర్యపోయి

ప్రపంచమంతా మంచేనని భావిస్తూ, చైతన్యంతో నోటికసంతమయూన్న ఆమెను చూసి, ఇవన్నీ ఏన్లకు మించి ఉంటాయంటే ఎవ్వరూ అనుకోలేరు.

ఒకనాటి సాయంత్రం కె.ట్రూపు లోయరు 'సెయింట్ క్లౌడ్' చేరుకొన్నారు. అప్పుడు ఆ గ్రామంలో ఏదో సంబరం. అప్పటికే బాగా చీకటి పడింది. అక్కడెక్కడా బసకు గది ఏదీ దొరక లేదు. మరో చోటికి పోవాలన్నా మూడు మైళ్ళు కట్టడవిలో నడిచిపోతేగాని సమీపంలో పల్లె లేదు. చివరికి ఒక కొట్టంలో ఒక మూల, గోనుపట్టా మంచెమంచం ఒకటి మాత్రం దొరికింది. కొట్టం పొడుగునా ఇటుక పనివాళ్లు కొందరు నిద్రపోతున్నారు.

"దా! దా! నా జీవిత నికృష్టదినాలు జ్ఞప్తికి తెచ్చుకొంటాను, దా!" అంటూ పకపక నవ్వింది.

ఆమె జీవితంలో చాలా నికృష్ట దారిద్ర్యం అనుభవించిన మనిషి.

కొట్టం, పొడుగుగా సన్నహాలులాగా ఉంది. గడలు కట్టవేసి ఉన్నాయి. గోడలో ఒక మూల సన్నగూట్లో ఒక గుడ్డి దీపం వెలుగుతూంది. సద్దు చేయకుండా పడుకొన్న జనాన్ని తప్పించుకొని చివరకు చేరుకొన్నారు. గాటపు కౌగిలింతలో ఇరుక్కునిపోయి, ముద్దుల, చిరునవ్వుల శబ్దాలు పైకి పొక్కనీయకుండా, పక్కబట్టి అక్కడే నిద్రపోతున్న కార్మికుల గుర్రులూ, నిశ్వాసాలు, కవలికలూ వింటూ రాత్రంతా గడిపారు. వాళ్ళ మురికిబట్టలు కట్ల చెప్పుల ప్రక్కనే ఆమె సిల్కుగౌనూ, సున్నితమైన పాదరక్షలూ పడిఉన్నాయి.

తెల్లవారగానే కొట్టం అటు చివరనున్న గేటు తలుపులలో, అడుగున ఉన్న చిన్న తలుపు తెరుచుకొని, అక్కడి గోనుపక్కలు, మట్టికుప్పలతో మిళితమయిపడుకొన్న జనంమీదికి సన్నవెలుగు ప్రసరించింది. "ఓహోయ్! లేవండిరో, అబ్బాయిలూ!" అంటూ ఒక పొలికేక వినబడి మళ్లీ తలుపు మూసుకొంది. ఆవులింతలతో, వళ్ళు విరుచుకోటాలతో, పొడిదగ్గులతో - మంద భాగ్య మానవజీవితపు వేకువ నిస్వనాలన్నిటితో - కొట్టం మెల్లగా మేలుకో సాగింది. ఒకొక్కరే, లేచి బరువుగా అడుగులేసుకొంటూ నోటమాటలేకుండా, కార్మికులు కొట్టం బైటికి వెళ్ళిపోయారు. ఆ రాత్రి తమప్రక్కనే అంత అందమైన యువతి పడుకొని ఉందన్న విషయం ఒక్కళ్ళకీ తెలియకుండానే అంతా వెళ్లిపోయారు.

అంతా వెళ్లిపోగానే ఆమె లేచింది. తన దుస్తులకోసం వెదుకుకొని వెంటనే తొడుక్కొంది. తొందరతొందరగా విడిపోయిన జుట్టు జారుముడి వేసుకొంది.

"అక్కడే ఉండు — క్షణంలో వస్తా" అని వెళ్లింది. కాసేపటిలో, రెండుచేతులా మంచులో తడిసిన అడవిపూలు నింపుకొని వచ్చింది.

పక్కనిండా ఆ సువాసనపుష్పాలను విరజిమ్మింది. ఉదయపవనంలో, నవనవలాడుతూ ఆ పుష్పాలు ఆ వాతావరణానికి కొత్తకాంతిని శోభను చేకూర్చాయి.

"ఇంక నిద్రపోదాం, దా" అంది. ఆ ఉదయ కాంతిలో, చిరునవ్వులీనుతూ, ముంగురులు మలయ మారుతంలో తేలిపోతూ, అల్లరిగా చేతులనిండా పుష్పాలనింపుకొని, ఆ కాలంలోపలికి వస్తున్నప్పుడు కనుపడ్డంత రమణీయంగా ఆమె అంతవరకెన్నడూ అతనికి కనిపించలేదు.

మరొకసారి విల్ - డి - అవ్రేలో సరస్సు ప్రక్కన పొద్దున్నే ఫలహారాలు తీసుకొంటున్నారు. ఆ సరోవర నిశ్చలనీరాలు, శిశిరఋతువు తొలిపొద్దు మంచు తెరలలో ముసుగు కప్పుకొన్నట్లున్నాయి. అల్లంతదూరాన చిట్టడివి కొనఅంచు లప్పుడే అరుణ, స్వర్ణ, రాగాలలో ముంచెత్తబడుతున్నాయి. ఆ హోటల్ ఆరామంలో వాళ్లిద్దరే ఒంటరిగా ఉన్నారు. పావురాజంటలాగా ఫలహారాలను నోటికినోటికి అందిచ్చుకొంటూ ముద్దులు పెట్టుకొంటున్నారు. అకస్మాత్తుగా వాళ్లు కూర్చున్న చెట్టుపైన ఆకుబొంపాలు గుబురుగా పొదకట్టినట్లున్న ఒక కొమ్మ మీదినుంచి, ఉల్లసమాడుతున్న పెద్దగొంతు వినిపించింది.

"ఏమయ్యోయ్, చెట్టుక్రింది పిట్టలూ, మీ కూజితాలు, చుంబితాలు పూర్తయాక కాస్త..."

కొమ్మమీది ఆకుబొంపాలలోనుంచి తల బైటికిపెట్టి సింగపు మొగమూ, బుజ్జిమీసాలూ కనపర్చుకుంటూ, శిల్పి కౌవుడల్ పిలుస్తున్నాడు—

"నాకూ క్రిందికివచ్చి మీతో కూర్చుని తినాలనిఉంది. ఇక్కడొకడినే కూర్చుంటే మరీ గుడ్లగూబలాగా తోచకుండా ఉన్నాను."

ఇక్కడ ఇతను తటస్థించటం చిరాకెత్తించినట్లు ఫాన్ని మాట్లాడలేదు. గాస్సిన్ మాత్రం ఆత్రంతో ఆహ్వానించాడు. అంతటి మహాశిల్పిని చూడాలన్న కుతూహలమూ, అతను తమతో పాల్గొంటున్నాడన్న ఉత్సాహమూ అతన్ని పరవశుణ్ని చేస్తున్నాయి.

కౌవుడల్ దుస్తులు అతి నిర్లక్ష్యంగా ధరించినట్లు కనుబడుతున్నా, బహు జాగ్రత్తతో, ప్రతి స్వల్పవిషయాన్ని ఆచితూచి, అందానికి అనువైన

శేషమే సంతరించుకొన్నాడు. అతని చర్మం అంతా రాచకురుపులతో మచ్చలూ మచ్చలూ బడి ఉంది.

ఆ మొగంలోని వికృతిని కనరానీకుండా కష్టం చూసి తెల్లని క్రేప్ పట్టురుమాలు మెడకు చుట్టాడు. అతని చొక్కా ఒంటినంటి పెట్టుకొని అతని సన్నని నడుమూ, కండలుగట్టిన దేహసౌష్టవమూ మరింతగా స్ఫురించేట్టు చేస్తూంది. ఆ యువకుని చూపుల్లో, కొవుడెల్, రెషిలెట్ విందుకు వచ్చిననాటికంటె ఏళ్లు ముదిరినవాడుగా కనిపించాడు.

కాని తన ప్రియురాలితో అతిపరిచయంగా, అతి సన్నిహితంగా కొవుడెల్, మాట్లాడుతూంటే గాసినెకు ఆశ్చర్యం కల్గి, కొద్దిగా చిత్తరపడ్డాడు. కొవుడెల్ ఆమెను "ఫాన్ని" అని పిలుస్తున్నాడు. ఆమెతో బాగా అంతర్యం ఉన్న వాడిలానే మాట్లాడుతున్నాడు.

కొవుడెల్ తన ప్లేటుకూడా వాళ్ల టేబిల్ మీద పెట్టాడు.

"అన్నట్టు నీకు తెలుసా! పదిహేను రోజుల నుంచి నేను భార్యాహీనుడనైపోయాను. మేరియా, మోటేబర్ గాడితో లేచిపోయింది. మొదట కొన్నాళ్లు "అమ్మయ్యా!" అనే అనుకున్నాను కాని ఇవాళ ప్రొద్దున్నే స్టూడియోలోకి వచ్చేటప్పటికి చెప్పలేనంత నిస్సారణ పట్టుకుంది. పనిచేద్దామంటే కుదరనే లేదు—అందుచేత చెక్కుతూన్న బొమ్మలను నాటిని నానన వదిలేసి, పల్లెటూళ్ళో ఫలహారం చేద్దామని ఇక్కడికు బయలుదేరివచ్చాను. కాని ఒంటరిగా ఎక్కడికెళ్దామనుకోటమూ బుద్ధితక్కువే! ఇందాక, చేతిలో ఫలహారప్పళ్లెమంతా కళ్లనీళ్ళతో తడిసే పర్యంతమయింది."

అంటూ ఆ పల్లెటిపిల్లడివంక చూశాడు. పట్టుకుచ్చులాగు వస్తూన్న అతని చిరుగడ్డం, తల ఉంగరాలు, వాటి రమ్యత్వం అన్నీ చూస్తూ నిటకలేశాడు.

"యౌవనంలో ఉండటం ఎంతటి మహా భాగ్యం! ఈ కుఱ్ఱాడు ఒంటరితనంతో కుమలాల్సిన పనిలేదు కదా! అంతే, కాదు. గమ్మత్తేమిటంటే, ఈ యౌవనం పరుసవేదిలాగా పరిసరాలనుకూడా మార్చేస్తూంది. ఈమెకూడా అన్నివిధాలా అప్పటి పసిదనంలా పడుచుగానూ కనపడుతూంది." అన్నాడు.

"ఓరి, పోకిరీ!" అంటూ నవ్వింది. ఆనవ్వులో కాలపరిధులెరుగని చిరంతనమైన వలపుటలల మృదు రసస్వనం వినిపిస్తూంది. వలచి వలపించబడకోరుతూన్న యువతి యవ్వనమంతా ఆనవ్వులో ప్రతిధ్వనిస్తూంది.

కొవుడెల్ ఫలహారంచేస్తూనే, కన్నులతో ఆమె అందాన్నంతా [illegible] "అద్భుతం, అద్భుతం" అంటూ [illegible]. [illegible] ఒక్క క్షణంలో [illegible] మెలపడిపోయి [illegible].

"[illegible], ఫాన్ని, [illegible] ఫలహారాలుచేశాం, జ్ఞాపకం ఉందా!—[illegible]! —[illegible] '[illegible]' ఉన్నారు, '[illegible]' ఉన్నారు. [illegible] యౌవనం కూడా ఉన్నారు. [illegible]—[illegible] అయి [illegible] మొగముస్తులు [illegible], [illegible]! ఆ [illegible] ఎంచక్కగా [illegible]!"

"ఏమో జ్ఞాపకం ఉన్నట్టు లేదు." అంది [illegible] [illegible]సరిగా, [illegible]పోయినట్లు. [illegible] కూడా కాదు. [illegible] ఏటికేడు [illegible]న అనుభవాలతో జీవితం గడిపే వాళ్లందరిలాగానే, ఫాన్నికూడా ఎప్పుడూ వర్తమాన ప్రేమ పవిత్ర క్షణాలలోనే నిమగ్నమై జీవించేది. అట్లాంటి వాళ్ళకు, జరిగిన విషయాల జ్ఞప్తికాని, జరుగనున్న విషయాలనుగురించి చింతగాని ఉండవు.

కొవుడెల్ అట్లా కాదు. గతకాలంలో [illegible]స్తున్నాడు. ఆ [illegible], తన యౌవనంనాటి కాము కలాపాలను, మనసు [illegible]విహారాలను—ఆనాటి [illegible] తోత్సవాలు, నృత్య కేళివిహారాలు, [illegible] ఆర్భాటాలు, యుద్ధాలు, విజయాలు-అన్నిటిని ఏకరువు పెడుతున్నాడు.

ఆ స్మృతులతో తనలోని కామాగ్నిని ప్రజ్వలింపచేసుకొంటూ ఆ స్ఫులింగాలు ప్రసరించుకొంటూన్న చూపులతో, వాళ్లవైపు మధ్యమధ్య చూస్తూవచ్చాడు. వాళ్లు తన గోడే వినటంలేదు. పచ్చిద్రాక్షపళ్ళు నొకళ్లకొకళ్లు అందిచ్చుకోటంలో నిమగ్నులైపోయిఉన్నారు.

"నేను మరీ పీడగా తయారయానా, ఏమిట్రా! నిజమేలే, మిమ్మల్ని విసుగెత్తించి చంపుతున్నట్టున్నాను. ప్చ్! అంతేలే! వృద్ధుడికి బ్రతుకు హాయి ఏం ఉంటుంది." అంటూ లేచి హోటల్ దిక్కై నెయిటర్ని పిలిచి "అబ్బాయి, [illegible]ంగ్లాంప్! బిల్లు నా పేర వ్రాయరా" అన్నాడు.

ఏదో పురాణవ్యాధితో బాధపడుతూన్న వాడిలాగా, బరువుగా కాళ్లీడ్చుకొంటూ, విచారవదనంతో కొవుడెల్ నిష్క్రమించాడు. ఆ పసిమిపచ్చని ఆకుల కొమ్మలక్రిందగా నడుం వంచుకుంటూ

కారి గదులలో వెలిసిన మజ్లిన్ తెరలను, ఫ్రాక్వే కపుపట్టు, మెమస్క్రీన్ తెరలులాంటివే చూశాను తప్ప, గదిగోడలవద్దనుంచి మొజాయిక్ పట్టుపట్టి తాపితా పరచ్చబడిన బంగారు పచ్చికగూడ నేను చూడ నేలేదు. గదిసరంబీ గోడలన్నీ మెత్తని మొకమల్ పట్టుతాపితా చేయబడ్డాయి. పడకమంచము, మామూలు సోఫాలకన్న కొంత విశాలమైన సోఫా మాత్రంగానే కనబడుతూంది. గదిలో ఒక మూల తెల్లని కంబళం పరిచి దానిపైన పంజరం అమర్చ బడింది.

గదినిండా ఉన్న అద్దాల అంచులనుంచి చెది రిన నీలికాంతులు గదినంతా పచ్చని వెలుగులతో నింపుతూ, ఇందాకటినుంచి ఆరుబయటి పొలాల మంచులోను, పాకిస్ సందుగొందుల బురద కయ్యల లోను, తడిసి ఇరుకునపడివచ్చిన దేహాన్ని సేద దీరుస్తూ, అమితమైన హాయిని చేకూరుస్తున్నాయి. కాని ఈ ఆనందం ఈపల్లెటిపిల్లవాడు అనుభవించేం దుకు, ఆ వృద్ధ చేటిక అతనివంక అనుమానంతో కొఱ కొఱ లాడుతూ చూస్తున్న చూపులు అభ్యంతరంగా ఉన్నాయి. చివరికి షాన్ని ఆ అవ్వని "మాచామి! నువ్వు పో! నాకు మేం చూసుకొంటాంలే!" అని బైటికి పంపించేసింది. మాచామి చిట్లుబుస్సు లాడు కొంటూ తలుపు ఫడాలున వేసికొంటూ బైటికి పోయింది. "అది అంతేలే. దాని విషయం పట్టించు కోకు. నిన్ను నేను ఎక్కువ ప్రేమిస్తున్నానని దానికి మంట. నా బ్రతుకు పాడు చేసేసుకొంటున్నా నంటుంది. ఈ పల్లెటివాళ్ళకంతా ఎక్కడి కక్కుర్తి రాబట్టుకునే దృష్టే! అయితే వంటమాత్రం మహా రుచికరంగా చేస్తుంది. ఇంకా నాకు, ఇవి ఈ అప్పచ్చులు తిను" అంటూ షాన్ని అతన్ని బుజ్జగిం చింది.

రొట్టె ఇద్దరికి ముక్కలుకోసి పెట్టింది. షాంపేన సీసా తనే మూతతీసింది. అయితే అతను ఆరగి స్తూంటే కళ్లుఅప్పచెప్పి చూస్తోందేగాని తను తినటమే లేదు. ఆల్జీరియన్ ఉన్నికంచుకం ధరించింది. చేతులు కదిపినప్పుడల్లా ఆ చొక్కా చేతులు పైకి ముడుచుకొంటూండేది. అంతలో అతనికి డెమి లెట్టి విందునాటి ఆమెతో ప్రథమ సమాగమం జ్ఞప్తికి వచ్చింది. ఇద్దరూ ఒకేచోట ఒకరొకరిని ఆను కొని కూర్చుని, ఒకే పళ్లెంలోనుంచి ఆరగిస్తూ, ఆనాటి రాత్రి విషయాలు ముచ్చటించుకొంటు న్నారు.

"నిజం! నువ్వు లోపలికి రావటం చూసిన క్షణాన్నుంచీ నిన్ను నావాడిని చేసుకోవాలనే నిశ్చ యించుకొన్నాను. అసలు నీ తేవుంటే, ఇతరుల కెవ్వ రికీ అందకుండా అప్పటికప్పుడే నిన్ను ఎగరేసుకొని పోయుండేదాన్ని. మరి నిన్ను [illegible] నప్పుడు [illegible]!"

అలిసిక మెదటి [illegible] అంతే భయమేసింది. కాని తరువాతి [illegible] ఎక్కువ ఆమెతో ఉండటం బహుశ కష్టంగానే ఉంది.

"ఇన్నాళ్లూ [illegible] — [illegible] ఇప్పుడు కోపం ఎందుకు కల్గింది? — అదే, అలాగూర్కె పద్యాలు [illegible]?" అని ప్రశ్నించాడు.

అనాటి [illegible], [illegible] ఆమె కళ్లు [illegible] కట్టాయి. [illegible]. "ఆ! ఏదో చిన్న [illegible]లే! ఆ విషయం మాట్లాడుకోవద్దు" అంటూ తలవిదుల్చుతూ పెదాలు కదలించి, "అసలు నాకు కూడా కొంచెం భయమే వేసింది. త్వరలోనే బైటపడాలని, కొత్త నన్ను నేను కాపాడుకోవాలని ప్రయత్నించాను. కాని చేతకాలేదు. ఎప్పటికీ చేతకాదు కూడాను!"

"ఆ!-అల్లా అనకు"

"వాస్తవంగాని!"

ఆ "వాస్తవంగాని" అన్న పదం వినటంలో ఉన్న ఉద్రేకం, ఆకంఠంలోని జీవరింపు, ఏమాత్రం పరిగణించుకోకుండానే ఆ యువకుడు సహజమైన ఉల్లాసదింపుతో అలతిగా నవ్వాడు. ఆమె కోమల హస్తబంధం అంత మృదువుగా, అంత లొంగిపోతు న్నట్టుగా ఉంది. ఆ బంధంనుంచి తిన్నని నిను విముక్తుణ్ణి చేసికొనేందుకు తాను కొంత కపలికను [illegible] చాలుననే అతని గాఢనమ్మకము.

కాని ఎందుకు వదుల్చుకోవాలి? ఆ గది మెత్తదనపు హాయిలో మునిగిపోయి నిద్రాభారంతో అర్ధనిమీలితాలయిన కనురెప్పల నాశ్వాసిస్తున్న ఆమె నిట్టూర్పుల సువాసనల కైపులో మత్తిల్లిపోయి, స్వర్గదృశ్యాలను చూస్తున్నాడు. ఆరుబయట్ల లేమ ప్రేమకలాపాల, పైడిపచ్చని పంటచేలు, సెలయేళ్ల గులకరాళ్లపై నీటిధారలల మృదుమధురస్వనులు, ప్రేమ మయమైన [illegible] వాసరాలు... ఆ దృశ్యాలే వీక్షి స్తున్నాడు.

తెలవారుతుంటే, మాచామి కేకలతో ఆరాటంగా నిద్రలేచాడు. కాళ్ళదిక్కున నుల్చుని, ఏ దాపరి కాలు లేకుండా, "వాడు వచ్చాడు. నిన్ను చూడా లంటున్నాడు" అంటూ మాచామి అరుస్తూంది.

"ఏమిటే! వాడన్నాడూ! అయితే నా యింట్లో నా పెత్తనమే లేదన్నమాట! వాడ్ని లోప లికి రానిచ్చావా" అంటూ కోపంతో మండిపోతూ,

ఒక్క ఊపుతో మంచందిగి, విడివడ్డ గౌనుకుండీలన్నీ సరిగ్గా పెట్టుకోకుండా పరుగెత్తూ, వెనక్కు చూసి, "ప్రియతమా, కదలకు. ఒక్క క్షణంలో మళ్లీ వస్తా"నంటూ ఫోన్ని గది బయటికి కదిలించింది.

అతడామెకోసం ఆగలేదు. లేచి దుస్తులన్నీ వేసుకొని బూట్సులలో కాళ్ళు ఇరికించుకోవాలో కూడా అతనికేం తోచనట్లయింది.

గాలి ఆడకుండా మూసి పెట్టినట్లున్న ఆ గదిలో ఇంకా వెలుగుతూన్న నక్షత్రదీపపు వెలుగులో తన బట్టలన్నీ సంగ్రహించుకొన్నాడు. వాళ్ళు ఆరగించిన ఎంగిలి పళ్లాలు, వికారంపుగా కనబడ్డాయి. అటు చూస్తూండగా, ఆ గది తెరలు కంఠం నొక్కేసినట్లు, తగ్గుస్థాయిలో బైట గలభా వినబడింది.

వాదప్రతివాదాలు ఘోరంగా జరుగుతున్నాయి. ఒక పురుషకంఠం- ముందు ఆగ్రహంతో - తరువాత బతిమాలుతూ, తిరువాత ఏడుస్తూ, చివరికి జాలిగా వెక్కిలు పెట్టి ఏడుస్తూ, వినబడుతూంది. రెండవ కంఠం ముందు నచ్చుపట్టలేకపోయాడు. అంతే కటువుగా, కఠోరంగా, ద్వేషపూరితమై వస్తున్నాయా మాటలు. ఆ మాటలూ, నీచప్రతిట్లూ-అక్కడికి కూడా వినబడుతూ, బజారు లంజల పోట్లాటలను స్ఫురింప చేస్తున్నాయి.

సిల్కుల బట్టలనిండా బురద జిమ్మినట్లు, ఆ కామసౌఖ్యం అంతా ఒక్కసారి మురికిపడి నెడిపడి పోయినట్లయింది. ఆ స్త్రీ కూడా హీనపడిపోయి, ఏ స్త్రీలంటే కంటగించుకొనేవాడో వాళ్లల్లో ఒక్కత్తెగా జమ అయిపోయింది.

ఆయాసపడుతూ, వగరుస్తూ, విడివడిన జుట్టు, విలాసభంగిమంలో నుదుటికి ఎగదువ్వుతూ "అబ్బ! మగవాడు ఏడవటమేమిటి అసహ్యంగా!" అంటూ గదిలోకి వచ్చింది.

అంతలో అతని దుస్తులు చూసి కోపంతో "అప్పుడే లేచావా! ముందుపోయి పడుకో! నే చెప్తున్నా పద" అంటూ ఉరిమింది. అంతలో అకస్మాత్తుగా మెత్తబడిపోయినట్లయి, రెండు చేతులూ అతన్ని చుట్టేస్తూ, మాటలతో కూడా చుట్టివేస్తూన్నట్టుగా మెత్తగా గొణిగింది "వద్దు! వద్దు, వెళ్ళవద్దు! నువ్విల్లా వెళ్లిపోటానికి వీల్లేదు. అదీ కాకుండా ఇల్లాఅయితే నువ్వు మళ్ళీరావని నాకు తెలుసు"

"వస్తాను. ఎందుకు రానూ!"

"నీకు కోపం రాలేదని ఒట్టేయ్! మళ్ళీ వస్తానని ఒట్టేయ్! ఊ! నిన్ను నేను ఎరుగుదునులే!" అంటూ మారాం చేసింది.

అతనికి ఒట్లన్నీ వేశాడు. కాని ఎన్ని చెప్పినా పక్కమీదికి మాత్రం చేరలేదు. ఎంతో బతిమాలింది. ఇది తన ఇల్లేనని, తన ఇష్టమే రాజ్యమని, తన కిష్టంవచ్చినవాళ్ళని రానివ్వవచ్చునని, తను చిత్తంవచ్చినట్టు చెయ్యవచ్చునని ఎన్నో చెప్పింది. కాని అతను వినలేదు. చివరికి అతను వెళ్ళిపోటానికి ఒప్పుకోక తప్పదని సమ్మతిచేసుకొని అతన్ని సాగనంపుతూ కదలింది. అంతకు ముందటి భీకరకామినిరూపానికి, ఇప్పటి అణకువకు ఏమీ పోలికే లేదు. అతి వినయంగా అతని క్షేమాన్ని కాంక్షిస్తూన్నట్టు వెంటనంటవస్తూంది.

విడలేని వీడ్కోలు కౌగిలింతలా హాలులో ఒక్క క్షణం విలంబన సంభవించింది.

"పోనీ—ఎప్పుడు" అంది, అతని కళ్ళల్లోకి కళ్లు పెట్టి లోతులు పరికిస్తూ. అతను బైటికి వెళ్లాలన్న తొందరలో ఏదో జవాబు, బహుశా అబద్ధమే, చెప్పాలనుకొంటున్నాడు. ఇంతలో బైట తలుపు గంట మోగి, అల్లాగే స్తంభించి నిలచాడు. పాచావిడ వంటయింట్లోంచి కదలివచ్చింది. కాని తలుపు తీయవద్దని ఫోన్ని ఆమెకు సైగచేసింది. ముగ్గురూ కదలక మెదలక అల్లాగే నుల్చున్నారు.

తలుపవతలనుంచి గుండెలు నొక్కేసుకొంటున్నట్లు ఒక్క నిట్టూర్పు వినిపించింది. తలుపుక్రింద సందునుంచి ఒక ఉత్తరం లోపలికి పడింది. బరువుగా, మెల్లిగా నిష్క్రమిస్తూన్న పాదధ్వనులు మెట్లు దిగి అంతరించాయి.

"చూశావా! నేను స్వతంత్రురాల నన్నా నా లేదా—ఇంకా ఇది చూడు" అంటూ ఉత్తరం విప్పి అతనికి అందిచ్చింది. ఏ కాఫీహోటల్ బల్లదగ్గిరో కూర్చొని, దొరకిన కాగితం ముక్కమీద పెన్సిలుతో వ్రాసుకొన్న ప్రేమలేఖ. కాగితం చూస్తేనే విషాదార్తమై, అతిదీనమై జాలిగొలుపుతూన్నట్లుంది. ఆ వ్రాసిన మందభాగ్యుడు, ఆ తొలిరేయియందు తను అసభ్యంగా అడవిగొడ్డుగా ప్రవర్తించినందుకు క్షమాపణ వేడుకొంటున్నాడు. ఆమెమీద తనకు ఏ హక్కూ లేదనీ, ఆమె భిక్ష పెడితే అదే చాలుననీ, తన్ను శాశ్వతంగా వదిలివేయవద్దని మోకరిల్లి ప్రార్థిస్తున్నాడు. ఆమె ఎల్లాచెప్తే అల్లా ఒప్పుకొంటానని హామీ యిస్తున్నాడు—ఏం చేసినా సిద్ధమేనన్నాడు. ఆమెనుమాత్రం వదలలేనని, "భగవాన్! ఆమెనుంచి దూరం చెయ్యొద్దు!" అని ప్రార్థిస్తున్నాడు.

"ఏమిటి గొడవ!" అంటూ కటికనవ్వు నవ్వింది. ఏ హృదయాన్ని తనకు వశమొనర్చుకోవాలని అల్లాడిపోతూంటాడో, ఆ హృదయకవాటాన్ని ఆ నవ్వే



# కృష్ణదేవరాయలు

కళింగ జైత్రయాత్ర ౫.

శ్రీ నేలటూరు వెంకటరమణయ్య

గజపతితో సంధి గావించుకొనిన పిమ్మట తత్పూర్వమే బదవేనేండ్లనుండియు నప్పగింపక తిరుగబడియుండిన కొటూరు ప్రభువుమీద రాయలు దండెత్తి చనెనని న్యూనిజు చెప్పుచున్నాడు. ఈ కొటూరురాజ్య మెచ్చటనుండెనో నిశ్చయించి చెప్పుటకు దగిన సాధనములు లేవు; విజయనగర చరిత్రకారు లీ యంశమునుగూర్చి భిన్నాభిప్రాయములను వెలిబుచ్చియున్నారు; కాని న్యూనిజు సందర్భమున జెప్పియుండు నంశములనన్నిటిని దృష్టియందుంచుకొని నిష్పక్షపాతబుద్ధితో బరిశీలించి చూచితిమేని యది దక్షిణదేశమున తామ్రపర్ణీ ముఖద్వార ప్రాంతమున నుండెనని తోచకపోదు. 1

ఈ దండయాత్రయందు నడచిన యుద్ధప్రకారము మనకు జక్కగ దెలియదు. ముఖ్యాంశమొక్కదానిని మాత్రము న్యూనిజు పేర్కొనియున్నాడు. కృష్ణరాయలు కొటూరు ప్రభువుపై నెత్తిపోయి యతడు నివసించుచుండిన ముఖ్య పట్టణమును ముట్టడింప దలపెట్టెను; కాని యాపట్టణము నావరించి ప్రవహించుచుండిన నదియొక్కటి వెల్లువ నీటిచే నుప్పొంగి దరులు దాకి ప్రవహించుచుండుట వలన దాని ముట్టడివేయుటకు సాధ్యపడదాయె; కృష్ణరాయ లంతట నా యుద్యమమును మానుకొనలేదు. నదియొక్క ప్రధానశాఖనుండి పెక్కు కాలువల ద్రవ్వించి వానిమూలమున ప్రవాహజలము నన్యమార్గముల ద్రిప్పి వెల్లువను శోషిల్లజేసి కోటనుముట్టడించి స్వాధీనపఱచుకొనెను. అందు విస్తారమైన ధనమును హస్త్యశ్వాదివాహన చయమును లభించినవి. కొటూరు ప్రభువు బందీకృతుడై విజయనగరమునకు గొంపోబడెను. అతని రాష్ట్రము రాయసామ్రాజ్యమున గలసిపోయినది.

కొటూరు వృత్తాంతము న్యూనిజు చరిత్రయందు దప్ప మరెయెందును గానరాదు. సమకాలిక ప్రబంధములు గాని యన్యరచనలుగాని ఈ దండయాత్రను బేర్కొనవు. రాయవాచక కృష్ణరాయ విజయాది యర్వాచీన గ్రంథములందు నైతము దీని ప్రస్తావము గానరాదు. కొటూరుప్రభువు కృష్ణరాయలకు మాఱొడ్డిన క్షుద్రశత్రువులలో నొక్కడనియు, దత్కారణమున భారతీయ గ్రంథకర్తలతనిమీది దండయాత్రను కృష్ణరాయల సుప్రసిద్ధ విజయములలో జేర్చి లెక్కపెట్టక వదలిపెట్టియుందురనియు మనమూహింప వలసియున్నది.

## కుతుబ్శాహుతో యుద్ధము :

ఇతడు గోల్కొండ కుతుబ్శాహీ రాజ్యస్థాపకుడగు సుల్తాన్‌కులీ కుతుబ్శాహు. ఇతనిని సమకాలికాంధ్రులు కుతుపనములక యని పిలిచెడివారు. జన్మముచే నితడు తురుష్కుడు. ఇమ్మడి ముహమ్మదుశాహు కడపటిదినములలో దక్కనుకువచ్చి సుల్తాను అంగరక్షక బలమును బ్రవేశించెను. ఇతడు మొదట బహామనీసుల్తానుయొక్క వేటకుక్కలను గాపాడు చేర్వగాడుగ నియమింపబడినట్లు రాయవాచకమునందు కలదు. 2 ఇది యెంతసత్యమో తెలి

1. చూ : అనుబంధము, 'కొటూరు'.

2. రాయవాచకము, ఆం. సా. పరి. పత్రిక, సం: 8. పుట 61.

యను. ఇతను నెలకొనోదు; నేర్పరియైన దళవాయి; సుల్తాన్ ఇమ్మడి మహమ్మదుశాహు రాజ్యప్రారంభ దశయందు తెలంగాణమునకు పాలకుడాయెను. సుల్తాను దౌర్బల్యమును సంపర్కపఱచుకొని, తక్కిన బహమనీ సామంతు లందరివలెను, స్వతంత్రుడాయెను. కృష్ణరాయలు సింహాసన మధిష్ఠించిన క్రొత్తలో నితడు దనపేర నాణెములను ముద్రించుకొని ఖుద్బా జదివించుకొని నిజస్వాతంత్ర్యమును ప్రకటించుకొనెను. ఇతను ఆసపోతు, ఇతని రాజ్యకాంక్షకు మేరలేదు; తెలుగుభూమి కంతటికిని తానె యొడెయుడను గావలయునని ఇతని కోరిక. కావున, గజపతులతోడను విజయనగర రాయలతోడను బోరితని కని వార్యమాయెను.

కృష్ణరాయల ప్రథమ తురుష్కయుద్ధమున నె కుల్లీ కుతుబ్శాహతని కత్తిపోటు రుచిజూచియుండెను. రాయలు సింహాసన మెక్కియు నెక్కకముందె బిరుదుగ ప్రకటించి విజయనగర సామ్రాజ్యముపై నెత్తివచ్చిన బహమనీసుల్తాను రెండవ మహమ్మదు శాహునకు తోడునడచి కృష్ణాతటమున ఘోరసంగ్రామమున నిర్జితులై పాఱిపోయిన ముగ్గురు సుబేదారులలో కుతుబ్శాహొక్కడు. ఈ పరాజయ మతని హృదయమునకు శల్యప్రాయమై రాయలతో పదింబదిగ బోరాడ బురికొల్పినది. ప్రతి సంవత్సరము నతడు విజయనగరసామ్రాజ్యముపై దండయాత్ర వెడలువాడట! క్రీ. శ. 16వ శతాబ్ద ప్రారంభదశయందు విరచితమైన 'తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీ కుతుబ్శాహీ' యను గోల్కొండ సుల్తానుల చరిత్రయందు సుల్తాన్ కుల్లీకుతుబ్శాహునకు కృష్ణరాయలతోనైన యుద్ధములు కొన్ని విపులముగ వర్ణింపబడియున్నవి. ఈ చరిత్రప్రకారము ఆ యుద్ధమంతయు రెండు రాజ్యముల గడిప్రదేశములందుండిన గిరిదుర్గము లైదింటి చుట్టు నడచినవి. దేవరకొండ ముట్టడితో యుద్ధము ప్రారంభమైనది; కుల్లీ కుతుబ్శాహు తన సైన్యములనంపి కోటను ముట్టడించి స్వాధీనపఱచుకొనుటయే కాక యచ్చట హిందూదేవాలయములను కట్టడములను నుడియగొట్టించివాని స్థానమున మసీదులను గట్టించెను. ఈ వార్త విన్నంతటనె కృష్ణరాయలొక గొప్ప సైన్యముతో గూడ కుతుబ్శాహీ రాజ్యముపై నెత్తివచ్చి గడిప్రదేశమున జాలభాగము త్రొక్కి దాచి పాడుగావించెను; సుల్తాన్ కుల్లీ యంతట నొక చిన్న సైన్యముతో నతని దఱుముటకు వచ్చెను. ఉభయ సైన్యములును పానుగల్లు దుర్గముకడ దారసిల్లినవి; యుద్ధమున కృష్ణరాయ లోడి పారిపోయెను; తరువాత కొంతకాలము ముట్టడి నడచిన పిమ్మట రాయల బంధువైన దుర్గాధ్యక్షుడు పానగల్లు కోటను సుల్తాన్ కుల్లీవశము గావించి రాజ్యముతో గూడ నచటు వాసిపోయెను; అచటినుండి కుల్లీకుతుబ్శాహు ఆ దుర్గమునకును గోయిల్‌కొండకును మధ్యనుండు గన్పురమును ముట్టడించెను. రెండు నెలల పర్యంతము ముమ్మరముగ ముట్టడి సాగినది. దుర్గపాలకులు మొండిధైర్యముతో దుర్గసంరక్షణకార్యమును నిర్వహించినను తుదకు కోటను శత్రువులపాలు గావించి బయలువెడలవలసినవారైరి. గన్పురము స్వాధీనమైన పిమ్మట కుల్లీకుతుబ్శాహు కోవెలకొండ (కొయ్యలకొండ)ను ముట్టడించెను; కొన్నినాళ్లైన పిమ్మట తురకలు కోటగోడలలో గండ్లు పొడిచి లోపల ప్రవేశింప ప్రయత్నించిరి; అంతపిమ్మట శత్రులనిల్వరించుటకు సాధ్యము గాకపోయినందువల్ల దుర్గసంరక్షకులు కోటను శత్రువులకు గైవసము జేయ వలసి వచ్చెను.

కోవిలకొండను సాధించిన తరువాత కొన్ని యేండ్లు గడచినవి. కుల్లీకుతుబ్శాహు ప్రతాపరుద్ర గజపతి నోడించి కృష్ణాగోదావరుల మధ్యనుండు తీరాంధ్రభూమిని స్వాధీనము జేసికొనెను. ఆతడు గజపతితో యుద్ధము సేయుచుండగా కృష్ణదేవ రాయలు గడిసీమలపై దండెత్తి వచ్చెను. సుల్తాన్ కుల్లీ యుద్ధప్రయత్నములు పూర్తి జేసికొని కొండవీటికివచ్చి యా దుర్గమును ముట్టడించెను; కాని యది నిరభ్యంతరముగ సాగలేదు. బెల్లముకొండ వినుకొండ దుర్గములందు కాపుండిన రాయరాణువ పలుమారు రాత్రులందు ముట్టడికారులపైబడి వారి కపార నష్టము గలిగించెను; కావున కుల్లీకుతుబ్శాహు కొంత దండుతో దన కుమారుని హైదరుఖానుని కొండవీటి చుట్టును గాపుంచి స్వయముగ బెల్లంకొండపై నడచి యా దుర్గమును ముట్టడించెను. అచ్చటి రాయసైన్యము నిర్వక్ర పరాక్రమముతో బోరినను కోటను దుదకు కుతుబ్శాహున కొప్పజెప్పవలసినవారైరి. ఇంత

లోపలనె కొండపీటిని ముట్టడించుచుండిన కుతుబ్షాహి దండు హైదరుఖానుని యాధిపత్యము నంగీకరింపక తిరుగబాటు చేసెను; వెంటనె కుల్లీకుతుబ్శాహు కొండపీటికి బోవలసివచ్చెను; బెల్లంకొండ మహమ్మదీయులకు వశమైనదని తెలియవచ్చినంతటనె, కృష్ణరాయ లొక గొప్పసైన్యమును, కొండపీటి రాజ్యమునుండి తురకలను బాఱద్రోలి వారాక్రమించుకొన్న దుర్గములను రాష్ట్రియు మరల స్వాధీనము జేసికొనుట కొఱకంపెను; కాని యా సైన్యమును బెల్లంకొండ చేరగనే వారి రాక నెఱింగి కుల్లీకుతుబ్శాహు కొండపీటినుండి వేగిరమె తిరిగివచ్చి యాకస్మికముగ పైబడి యుద్ధమున వారి నోడించి పాఱద్రోలెను; పిమ్మట నతడు కొండపీటికి మరలివచ్చి యా కోటను గూడ సాధించెను. కొండవీడు శత్రువశమాయెనని విన్నంతనె, కృష్ణరాయలు దన యల్లుడును సేనాధిపతియు నైన శివరాయల యాధిపత్యము క్రింద నొక లక్ష దళము నా దుర్గమును మరల జయించి వశపఱచుకొనుటకొఱకంపెను. రాయసైన్యము వచ్చుటనుగని కుల్లీకుతుబ్శాహు కొండపీటిని విసర్జించి కొండపల్లి పైకి తరలిపోయెను. హిందువులు వెన్నంటి తఱుముచు బోయిరి. వారు సమీపించునందాక ఊరకయుండి కుతుబ్శాహు దటాలున వారిపై నురికి పంచబంగాళము గావించెను. ఇట్లు నిర్జితులైన హిందువులు వెనువెరిగి కొండపీటికిబోయి యా దుర్గమున జొరబడి ద్వారములను మూసికొనిరి. కుల్లీకుతుబ్శాహు వారిని వెంబడించివచ్చి కొండపీటిని మరల ముట్టడించెను. కుతుబ్శాహుధాటి కాగజాలక హిందువులు, సంవత్సరమునకు మూడు లక్షల హొన్నులను గప్పముగట్ట నొప్పుకొని, యతని కరిగాపులైరి[3].

తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుతుబ్శాహీయందు వర్ణింపబడిన యుద్ధవృత్తాంతము సంగ్రహముగ నిది. యుద్ధవృత్తాంతము నింత విపులముగ విరచించిన చరిత్రకారుడు యది యెప్పుడు జరిగెనో తెల్పియుండిన విషయ గ్రహణమునకు జాలగ ననుకూలపడియుండెడిది. అట్లాతడు తెల్పియుండకపోవుటచే నీ యుద్ధచరిత్రము దురవగాహమై తప్పుతలంపులకు దావకమైయున్నది. కొందఱు సుప్రసిద్ధపరిశోధకులీ మహమ్మదీయ చరిత్రగ్రంథమున వివరించియుండు యుద్ధవృత్తాంతమంతయు గల్పనాకథయని వ్రాసి పెట్టియున్నారు[4]. కావున మొట్టమొదట నీ యుద్ధకాలమును నిర్ణయించుట కర్తవ్యము. కుల్లీకుతుబ్శాహు యొక్క దేవరకొండ ముట్టడితోగదా ఈ యుద్ధము ప్రారంభమైనది. మొదట నీ దుర్గము గజపతులకు నేల్పుచుండెడిది. క్రీ. శ. 1460 వ సం॥మున కపిలేశ్వర గజపతి యాజ్ఞవొప్పున నతని పుత్రు డంబీరదేవుడు దేవరకొండ వెలమలకు గొడుచని నప్పటినుండి క్రీ.శ. 1515 సంవత్సరమున గృష్ణరాయలు గజపతి సామ్రాజ్యముపై దండెత్తిపోవుచు దేవరకొండతో గూడ తెలింగాణ దుర్గముల నన్నిటి సాధించువఱకును నది గజపతుల యాధీనమందే యుండినది; కావున కుతుబ్శాహు దాని ముట్టడించినది క్రీ. శ. 1515 నకు దరువాతనైయుండవలయును. తరువాత పానుగల్లు గమ్పరకోవెలకొండదుర్గము లన్నియు నొకదాని వెనుక నొకటిగ గుతుబ్శాహుచే నైదాఱునెలల కాలమున జయింపబడినట్లు చెప్పియుండుటచే నవి కుతుబ్శాహునకు క్రీ. శ. 1516 వ సంవత్సరమున వశమైనట్లు మనము నిశ్చయింపవచ్చును. కాని కీర్తిశేషులైన శ్రీ కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారు అద్దంకి గంగాధరకృత తపతీసంవరణ పీఠికలోని కుల్లీకుతుబ్శాహు ప్రశంసాత్మకములైన—

"పసమట సవాయి బసవనిగా జేసి
యచట గొయ్యలకొండ యావరించె
దమది (రి) మి (మ) ల్లా ఖాను దక్షిణంబున గొట్టి
హరియించె పానుగల్లాదిగిరుల."

అను సీసపద్య చరణముల నాధారపఱచుకొని 'ఈదమదిమిల్లాఖాను డెవ్వడో తెలియదు. కాని యతడు తురుష్కు డనుటకు సందేహము లేదు. అదిల్ షాహ యొక్క సేనానియైయుండునో పు. కావున గుతుబ్ షాహ పానగల్లును రాయలయొద్దనుండి తీసికొనియె నన్న వార్తకల్ల' యని వ్రాసినారు[5]. కుతుబ్శాహు దమదిమిల్లాఖానుని దఱిమి పానుగల్లాదిదుర్గములను గొనియెనని గంగాధరకవియన్నంతమాత్రమున, గృష్ణరాయ

3. *Briggs Ferishta III pp* 355-57, 365-67.

4. కె. వి. లక్ష్మణరావుగారు—మహమ్మదీయ మహాయుగము, పుటలు 368-69.

5. పైది.

లవాత నోడించి యీ దుర్గము స్వాధీనపఱచుకొనెనని తారీఖ్-ఇ-మహమ్మదు కుల్లీకుతుబ్‌శాహీయందు చెప్పబడిన వృత్తాంతమును, 'కల్ల' యని త్రోసిపుచ్చవలసిన యావశ్యకత లేదు. ఎలన, రెండును సత్యమే కావచ్చును. పానుగల్లు మొదలగు దుర్గములను కుల్లీ కుతుబ్‌శాహు ఒకసారి కృష్ణరాయలను జయించియు మఱియొకసారి దమదిమిల్లాఖానుని బోలవోలియును స్వాధీనము చేసికొనియుండ వచ్చును.

ఇక కొండపీటి యుద్ధవిషయమును విచారింతము. తారీఖ్ - ఇ - మహమ్మదు కుల్లీకుతుబ్‌శాహీలో చెప్పినట్లు సుల్తాన్‌కుల్లీ కొండవీటిపై నెత్తి వచ్చినది వాస్తవమని పరిశోధకు లొప్పుకొనుచున్నను, అందు వర్ణించినట్లు విజయుడుగాక రాయలచే పరాభూతుడై పాఱిపోయెనని నిశ్చయించియున్నారు. వీరు తమ యభిప్రాయము సత్యమైనదని నిరూపించుటకు న్యూనిజుమున్నగు సమకాలిక రచయితల వ్రాతల నుదాహరించుట; కాని న్యూనిజు సాక్ష్యము నాధారపఱచుకొని తారీఖ్ - ఇ- మహమ్మదుకుల్లీ కుతుబ్‌శాహీయందలి యుద్ధవృత్తాంతము సత్యాత్మకము గాదని వాదించుట తగవుగాదు. ఎలనగా, న్యూనిజు, పేర్కొను దండయాత్ర తారీఖ్ ఇ - మహమ్మదు కుల్లీ కుతుబ్‌శాహీయందు వర్ణింపబడిన దండయాత్రకంటె భిన్నమైనది. న్యూనిజు చెప్పు దండయాత్ర. క్రీ. శ. 1519 సంవత్సరమునకో యంతకు కొంచెము ముందో జరిగినది. కృష్ణరాయలు కళింగవిజయము సంప్రాప్తమైనపిమ్మట విజయనగర

---

6. జరిగినవాస్తము గూడ నింతియయని తోచుచున్నది. ఇందు పేర్కొనబడిన దుర్గములన్నియు నిప్పటి హైదరాబాదు రాజ్యమునందలి మహబూబ్నగరమండలము నందున్నవి. దేవరకొండ నల్లగొండ జిల్లాసరిహద్దునను పానుగలు గన్పుర కోవిలకొండలు మహబూబునగర పశ్చిమప్రాంతమున నొండొంటికి చేరువయందున్నవి. క్రీ. శ. 16 వ శతాబ్దప్రారంభమున విజయనగర విజాపుర గోల్కొండరాజ్యముల పొలిమేరలను ఇచ్చటనె సంధించుచుండెనవి. ఈ ప్రదేశమప్పుడు మురియ్యలపట్టు; కావున పై జేర్కొనిన దుర్గములన్నియు పలుమారు చేతులుమారుచుండుట యందు వింతయేమియు లేదు. కోవెలకుంట వీని యందు ప్రధానదుర్గము; దాని చరిత్రననుసరించియె లెక్కనవాని కథయు నడచెను. 16 వ శతాబ్దప్రారంభమునందది విజాపురరాజ్యస్థాపకుడగు యూసఫ్ ఆదిల్ ఖానుని యధీనముందుండెను. క్రీ. శ. 1511 వ సంవత్సరమున కృష్ణరాయలీ తలి వధించి కోవెల కొండను దత్సమీపదుర్గములను రాష్ట్రములను వశపఱచుకొనెను. క్రీ. శ. 1534 వ సంవత్సరమున కోవెలకొండ కుల్లీకుతుబ్సాహునకు జెల్లుచుండినది. విజాపుర ప్రభువగు ఇస్మాయీల్ ఆదిల్ శాహీ దుర్గమును గైకొనుటకు వచ్చి ముట్టడివేసి యచటనె కోటను సాధింపకముందె వ్యాధిగ్రస్తుడై మృతినందెను. (*Briggs Ferishta III p. 71*) కావున కుతుబ్‌శాహు సహాయని బసవని గావించె కోవెలకొండనాకరించినదియు దమదమిల్లా ఖానుని గొట్టి పానుగలు మొదలగు దుర్గములను హరించినదియు నీపూర్వము జరిగియుండవలెను. ఎప్పుడో నిశ్చయించి చెప్పుటకు తగిన సాక్ష్యము లేదు; కాని యది 1530-34 ల మధ్య జరిగియుండవచ్చును. ఎలనగా క్రీ. శ. 1529-30 సంవత్సరమున బీదరు ప్రభువైన బరీదునకును ఆదిల్‌శాహునకును యుద్ధము నడచెను. ఈ యుద్ధమున ఆదిల్ శాహునకు బీరారు పాలకుడైన ఇమాదు శాహును, బరీదునకు కుతుబ్‌శాహును తోడు వచ్చిరి; కాని బరీదుపక్షమునకు ఓటమిగల్గెను. ఆదిల్ శాహు బీదరును స్వాధీనము చేసికొనెను. ఈ సందర్భమున ఆదిల్ శాహు కోవెలకొండ గన్పుర పానుగలు దుర్గములను స్వాధీనపఱచుకొనియుండ వచ్చును; ఎలనగా నతని, పుత్రుడగు మల్లూఖానుడీ యుద్ధమున దండ్రికి బాసటయై నిలిచి శత్రులతో బోట్లాడెను. (*Ibid p. 64*). ఇతడు గంగాధర కవి పేర్కొన్న దమది లేక దమరి మల్లాఖానుడు. దమది లేక దమరియనునవి రెండును అపపాఠములు. 'తఱిమి' మల్లూఖాను అని యుండవలెను. తరువాత కుతుబ్‌శాహీదిలు శాహీయుల నోడించి యీ దుర్గముల నన్నిటిని కైవసము జేసికొని యుండవలయును. కావున నీదుర్గములను కుతుబ్ శాహు కృష్ణరాయల నోడించి కైకొన్నది క్రీ. శ. 1516 నందగుటవలన గంగాధరకవి వాక్యముల నాధారపఱచుకొని తారీఖ్ - ఇ - మహమ్మదుకుల్లీ కుతుబ్‌శాహీ సాక్ష్యమును నిరసించి త్రోసిపుచ్చుట సమంజసము గాదు.

మునకువచ్చి తిమ్మరసయ్యను అతనికి నాయంకర మున కిచ్చియుండిన కొండవీటికి ప్రయాణము చేసి యంపెను. అతడచటికి పోయి చేరకముందే కుతుబ్ శాహు వజీవాయి - మహార్ మలుక యను మహమ్మదీయుడు అఱువది వేల సైన్యముతో నతని నెదిరించెను. రెండులక్షలఫౌజును వెంటబెట్టుకొని పోవుచుండిన తిమ్మరసు వానిని సులభముగ నోడించి భార్యాపుత్రులతోగూడ చెఱబట్టి విజయనగరమున కంపెను. వారందఱు నచట చెఱసాలయందు మృతులైరి.[7]

తారీఖ్ - ఇ - మహమ్మదు కుత్బ్ కుతుబ్ శాహి యందు వర్ణింపబడిన దండయాత్ర క్రీ. శ. 1526 న తరువాత నడచెను. ఎలన నతడు గజపతిని జయించి కృష్ణాగోదావరుల నడిమి వీరాంధ్రదేశమును జయించి స్వాధీనముచేసికొనినపిమ్మట కొండవీటిని ముట్టడించు నట్లు చెప్పయున్నది. కుత్బ్ కుతుబ్ శాహు విజయముల కప్పుడు కొండవీటిరాజ్యమున రేగిన యల్లరియే ముఖ్యకారణము. క్రీ. శ. 1515 మొదలు కొండవీడురాజ్యము కృష్ణరాయల సర్వశిరఃప్రధాని యైన తిమ్మరసయ్యకు జెల్లుచుండెను; అతని పక్షమునం దతని యల్లుడైన నాదెండ్ల గోపమంత్రి యారాష్ట్రము యొక్క పాలనకార్యమును కొండవీటినుండి జరుపుచువచ్చెను. ఆసంవత్సరమున కృష్ణరాయలు దన కుమారుడైన తిరుమలదేవ మహారాయలను నాదెండ్ల వారిని తిమ్మరసయ్య కుమారుడగు తిమ్మదండనాయకుడు విషప్రయోగముచే జంపినాడని విశ్వసించి తిమ్మరసయ్యను నతని పుత్రులను సోదరులను బంది చేసి చెఱబెట్టించెను; కాని తిమ్మదండనాయకుడు చెఱనుండి తప్పించుకొని సాంద్రారణ్యమునకు బారి పోయిబందిపోటు దొంగలకునుదారి చూపెడిగాంధ్రకు ను ఇరవైన యొక దుర్గమునుబోయిచేరెను. ఆ దుర్గాధ్యక్షుడతనికి బంధువగుటచేత నతని జేరదీసి యతనికి వలసిన ప్రెల్ల సాయమొనర్చెను ఆ దుర్గమును ప్రధాన స్థానముగ జేసికొని కృష్ణరాయలతో యుద్ధముసేయ గడగెను; రాయ లాతని యల్లరి నణచివేయుట కయ్యపరసయ్య నాయకత్వముక్రింద నొక గొప్ప సైన్యము నంపవలసివచ్చెను. అయ్యపరసు తిమ్మదండనాయకునికి మద్దతుపడైన దుర్గమును ముట్టడించి సాధించి యతనిబట్టి విజయనగరమునకు గొనిపోయి రాయలకు నొప్పగించెను. కోపోద్రిక్తుడై రాయలాతని నోటిని, తండ్రియైన తిమ్మరుసును చెఱసాలనుండి రప్పించి కన్నులు పొడిపించి మరల కారాగారమున బంధించెను. తిమ్మదండనాయకుడు చెఱసాలయందె మృతి నందెను.[8]

తిమ్మదండనాయకుని తిరుగుబాటువలన కొండవీటి రాజ్యమున శాంతి చెడి సంక్షోభము కలిగినది. తిమ్మదండనాయకుడు పాఱిపోయిన సాంద్రారణ్య పర్వతప్రదేశము శ్రీశైలప్రాంతము. అతని కాశ్రయమిచ్చిన దుర్గపాలుని బావ నాదెండ్ల గోపమంత్రి. తిమ్మదండనాయకుని తిరుగుబాటునకును కుత్బ్ కుతుబ్ శాహు కొండవీటిదండయాత్రకును పరస్పర సంబంధ మెద్దియేనియు గలదో తెలియదు. కాని యించుమించుగనవి యొకకాలముననె సంభవించినవి. అన్యోన్యసంబంధ ముండినను లేకపోయినను తిమ్మదండనాయకుని యల్లరిమూలమున గలిగిన సంక్షోభము కుతుబ్ శాహు దండయాత్రకు బాలగ ననుకూలించె ననుటకు సంశయము లేదు.

తారీఖ్-ఇ-మహమ్మదు కుత్బ్ కుతుబ్ శాహిలో చెప్పినట్లు ఈ దండయాత్రయందు జయము కుత్బ్ కుతుబ్ శాహుకు జేకూరెననుట సంశయాస్పదమైన విషయము. హిందువులోడి దుర్గము సంరక్షించుకొనజాలక కప్పము కట్టెదమని యొడబడినంత మాత్రమున కుత్బ్ కుతుబ్ కొండవీటిని హిందువులకే విడిచిపెట్టి పోయెనన్నది నమ్మదగిన సంగతి కాదు. ఇది సుల్తాన్ కుత్బ్ పద్ధతికి వ్యతిరేకమైనది. అతనికి గలిగిన యపజయమును గప్పిపెట్టుటకు తారీఖ్-ఇ-మహమ్మదు కుత్బ్ కుతుబ్ శాహి రచయిత యవలంబించిన కుయుక్తి ఇది యని తోచుచున్నది. ఈ తలంపు కళాపూర్ణోదయ పీఠికయందలి,

"వదలక యుత్కళేంద్రుని సవాయి
బరీదు నడంచు దుర్జయుం
గుమువనమల్కు దల్లడిల గొట్టె
మహాద్భుత సంగరంబులో
నెదిరిచి కొండవీటకడ నెవ్వరు
సాటి విచిత్ర శౌర్య సం

7. *Nuniz. See. Forgotten Empire p. 322.*

8. *Ibid pp* 360 - 61.

పదపడ నారసింహ విభుపట్టికి నార
నృపాల మౌళికిన్."

అను పద్యమువలన వ్యక్తమగుచున్నది. ఇందు కుతపనమల్కనువలన నందెల నారపరాజు కొండవీటి దగ్గర యుద్ధమునం దోడెంచినట్లు తెలియవచ్చుచున్నది. ఈ నందెలనారపరాజు ఆరవీటి బుక్కరాజునకు మనుమడు; మఱియొక మనుమడైన అళియరామరాజు కృష్ణదేవరాయల యల్లుడు; ఇతని నే తారీఖ్-ఇ-మహమ్మదు కుల్లీకుతుబ్‌శాహీ రచయిత రామరాయలని పేర్కొనియున్నాడు. ఇతని యాధిపత్యముక్రింద నే కృష్ణరాయలొక ప్రచండసైన్యమును కుల్లీకుతుబ్‌శాహును కొండవీటినుండి తఱిమివేయమని పంచియుండెను. కావున లక్ష్మణరావుగారు వచించినట్లు 'కొండవీటికడ నోడిపోయినది కుతుబ్‌షాహియే గాని హిందువులుగా'రని స్పష్టముగ జెప్పవచ్చును.

కృష్ణరాయలకు కుతుపనమల్కతో జరిగిన యుద్ధములలో నాద్యమున జయము కుతుపనమల్కకే కలిగెను; కళింగ దిగ్విజయమున నిమగ్నుడై యున్నతరి యాదిల్‌శాహు కుతుబ్‌శాహు లిద్దఱును గలిసియో ప్రత్యేకముగనో విజయనగర సామ్రాజ్యగడిదుర్గములను గొన్నింటి నాక్రమించిరి. కృష్ణరాయ లవ్వల ఆదిల్‌శాహు నోడించి రాయిచూరు ముద్గలు దుర్గముల మరల స్వాధీనపఱచుకొన్నను కుతుబ్‌శాహాక్రమించిన కోవిలకొండ గన్పురపానుగలు దేవరకొండ దుర్గములు నాల్గును అతని యధీనముననె నిలిచిపోయినవి; కొండవీటి రాజ్యమున తిమ్మదండనాయకుని హోవళి మూలమున సుల్తాన్ కుతుబ్‌శాహునకు మొదట జయము చేకూరినను చివరకు నిర్జితుడై నిజరాజ్యమును బోయి చేరెను.

# అనుబంధము

## కొటూరు,

కళింగ విజయానంతరము కృష్ణదేవరాయలు కొటూరు రాజ్యముపై దండు వెడలెనని న్యూనిజు వ్రాసియున్నాడు. కొటూరు దండయాత్ర ప్రశంస మఱి యెచ్చటను గానరాదు; కావున దీని చరిత్రను గనుగొనుటకు న్యూనిజు గ్రంథమునకంటె సాధనాంతరము లేదు. అతడు వివరించిన కొటూరు వృత్తాంత మిది :—

"కృష్ణరాయలు ఒరియా రాజుతో సంధి కొడబడి యతని పుత్రికను బెండ్లియాడి యతని రాణివాసము చెఱవదల్చి (కృష్ణా) నది కవ్వలి రాష్ట్రముతో గూడ నతనికి మరల నొసగిన పిమ్మట గొప్ప సైన్యమును సమకూర్చి కొటూరుపై దండు వెడల సంసిద్ధుడాయెను. కొట్టూరనునది—ఏబదివేండ్లనుండి (రాయల యధికారము నంగీకరింపక) తిరుగుబాటు చేసియుండిన యొక ప్రభువు యేలుబడిక్రిందనుండిన—యొక రాజ్యము. చోళమండల తీరమందున్నది—(కృష్ణరాయలు) దానిమీద దండు వెడలి తత్ప్రభువు వసించుచుండిన ముఖ్యపట్టణములయం దొకదానిని ముట్టడించెను. దాని పేరు......1 అది జలపరివృతము.

కృష్ణరాయలీ పట్టణము ముట్టడివేయ గడగినప్పుడు వానకాలమగుటచే దానిచుట్టును నావరించియుండిన నది వెల్లువచే నుప్పొంగి జలభరితమై ప్రవహించుచుండెను. తత్కారణమున అదనివలన నా పట్టణమును పెట్టిముప్పు గలుగదాయెను. ఆలస్యమును సహింపక కృష్ణరాయలు తన యుద్యమమును కొనసాగనీయక యడ్డపడుచుండిన యానది ముఖ్యశాఖను దాటి దాని (యా పట్టణమును) దాకుటకు వీలు కలుగునట్లు దానినుండి పెక్కు కాలువలను త్రవ్వించిన పరివారమున కాజ్ఞాపింపించెను. (అతనికడ) జనస్తోమ మధికముగనుండుటచే నా కార్యమచిరకాలముననె ముగిసెను. క్రొత్తకాలువ లన్నియు ద్రవ్వబడిన పిమ్మట నదీప్రవాహమును దానివైపు త్రిప్పించెను. నదిలోని నీరంతయు నల్పకాలముననె కాలువలమూలమున బాఱిపోవుటచే నది యడుగంటి లోతులేక వట్టిపోయినది. అంతట నా పట్టణప్రాకారమును డాయుటకు వలనుబడెను. ఏబదిపాయలగుండ వేఱు మార్గముల నదీజలమంతయు బాఱిపోయినది.

పట్టణములో గాపుండిన లక్షకాల్బలమును మూడువేల గుఱ్ఱపురౌతులును ధైర్యసాహసముల బ్రకటించుచు హోరాహోరిగ బోరిరి; కాని వారి పరాక్రమము వానికెక్కక వమ్మయిపోయినది; వారు కృష్ణరాయలను పట్టణమును జేరనీయక యడ్డపెట్టజాలరైరి. ఒక కొన్నినాళ్లు పోరాటజరిగిన వెనుక, రాయలాపట్టణమును బ్రవేశించి యందుండినవారి నంద

1 న్యూనిజు గ్రంథములో ఆ పట్టణము పేరుండవలసిన తావు శూన్యముగ వదలివేయబడి యున్నది.

మాత్రమైన నాధారము లేదు; కావున కటకమే కొట్టూరను సిద్ధాంత మంగీకరింపదగినది కాదు.

ఉమ్మత్తూరు కొట్టూరా? ఇది కృష్ణరాయల కాలమున గాని యంతకు మునుపుగాని కొంగవుల యధికారము క్రింద నుండెనా? కృష్ణరాయలోడించి బంధీకృతుని గావించి విజయనగరమునకు గొనిపోయిన కొట్టూరు ప్రభువు కొంగవ వంశజుడా? అను ప్రశ్నలకు సమాధానము చెప్పవలసియున్నది. క్రీ. శ. 1323 వ సంవత్సరమున మహమ్మదీయులు ద్రావిడదేశమును జయించిన తరువాత కొంగవ వంశజు లడపొడ గానరాకపోయిరి. విజయనగర యుగశాసనములలో గాని మఱి యన్యచరిత్రాధారములందు గాని కొంగవుల ప్రస్తావ మించుకయు గానరాదు. కొంగవు లనగా పల్లవులు. క్రీ. శ 10 వ శతాబ్దారంభమువఱకును పల్లవుల యధికారము పశ్చిమాంధ్ర దక్షిణకర్ణాటక భూములపై సాగినది. తరువాత వీరి యధికారము క్షీణించి వారి రాష్ట్రము చోళసామ్రాజ్యమున గలసిపోయినది. క్రీ. శ 13 వ శతాబ్దమధ్యమున కొప్పెరుంజింగడను కాడవ ప్రభువు ప్రసిద్ధికెక్కి తొండమండలమున బాలభాగము నేలెను. అతని యధికారమెన్నడును ఉమ్మత్తూరుపై సాగలేదు. మఱియు విజయనగరరాయల కాలమునందు ఉమ్మత్తూరు నేలిన రాజవంశము కేవలము కర్ణాటకవంశము; మఱియు, దాము పాశ్చాత్యగాంగరాజుల యొక్కయు హొయసలుల యొక్కయు సంతతివారమని వారు చెప్పుకొనిరి. కొంగవులకును వారికిని సంబంధమున్నట్లగపడదు. ఇంతకంటె ప్రబలమైన యాక్షేపణ మొకటి కలదు. కొట్టూరు ప్రభువు ముఖ్యపట్టణమువలె కృష్ణరాయలచే సాధింపబడిన యుమ్మత్తూరులోని శివసముద్రముభయ కావేరిమధ్యస్థమైనను, నది మైసూరు పీఠభూమిపై నున్నది కాని చోళమండల తీరదేశమున లేదు. ఈ రెండు కారణములవల్లను కొట్టూరనునది కొంగవరాజ్యమనియు దాని కుమ్మత్తూరు రాజధానియనియు దలంచుటకు వీలు లేదు.

ఇక న్యూనిజువచించిన కొట్టూరు పొన్నేరితాలూకాలోని ఆ పేరిటి గ్రామమా? ఇది పైనుడివినట్లు చోళమండల తీరదేశమునందున్నది. మఱియు దత్పరిసరముల నొక యేఱు ప్రవహించుచున్నది. కాని యాప్రాంతము నేలుచుండిన ప్రభువు కృష్ణరాయల దండయాత్రకు మును పేబది సంవత్సరములనుండి తిరుగుబాటు చేసియుండెననుట విశ్వసింపదగనిది. ఏలన నీ ప్రాంతభూమియంతయు క్రీ. శ. 1491 పర్యంతము సాళువనరసింగరాయల యేలుబడిక్రింద నుండినది. తరువాత ఇమ్మడి నరసింహరాయల కాలమున రాజ్యసంరక్షకుడైన నరసానాయకుడు మధురగిరికడ గజపతి నోడించి సముద్రతీరమునకు సైన్యమును నడిపించుకొనిపోయి ద్రావిడదేశమును ప్రవేశించి యచటినుండి దక్షిణ దిగ్విజయయాత్ర సాగించినట్లు వరదాంబికా పరిణయమునందు చెప్పియున్నది. 9 తుండీరమండలమును ప్రవేశించుటకు మునుపుగాని తరువాతగాని సముద్రతీరదేశమున నతడెవ్వరితోడను యుద్ధముజేసినట్లు చెప్పియుండలేదు. ఈ దండయాత్ర క్రీ. శ 1496 వ సంవత్సరమున నడచెను. నరసానాయకుడీ సందర్భమున రామేశ్వర పర్యంతము రాజ్యము సల్పుచుండిన దాక్షిణాత్య భూపాలురనెల్ల జయించెను. 10 వీరనరసింహరాయల కాలమునగాని కృష్ణరాయల రాజ్యారంభకాలమునగాని పొన్నేరి ప్రాంతభూమిని రాయల కనతుడై యుండిన సామంతికు డొక్కడేలుచుండిన ట్లూహించుటకు దగిన సాక్ష్యము లేదు. కావున పొన్నేరిప్రాంతమున చోళమండల తీరప్రదేశమున నదీతటమున కొట్టూరను పేరుగల గ్రామ మొకటి యున్నను నదియే న్యూనిజు వర్ణించిన కొట్టూరని తలచుట పొరబాటు.

మఱి యీ కొట్టూ రెచ్చట నున్నదనుట విచారణీయాంశము. కొట్టూరనునది కాయత్తారు కావచ్చును. ఇది మధురకు దక్షిణ దిగ్భాగమున తిరునెల్వేలి ప్రాంతభూముల నేలుచుండిన పాండ్యవంశజులలో నొక శాఖవారికి రాజధానియై యుండెను. అప్పటి పోర్చుగీసు ప్రయాణీకులును గ్రంథకర్తలును దీనిని పేర్కొనియున్నారు. 'ఆ తీరదేశమునకు రాజధానియైన తూత్తుకుడి ప్రభువును 'కయిత్రో రాజ'ని పిలుతురు. అతడు తూరుకుడు', అని పైద్రో డి బస్తో యను నతడు చెప్పియున్నాడు. 11 సింహళవిజయ చరిత్రను రచించిన క్వైరోసుపాదిరి కూడ 'కేత్రగ్రో నేలు చిన్నరాజు'లను పేర్కొనియున్నాడు. ఇట్లు పోర్చుగీసు రచయితలచే కెయత్రో యని పేర్కొనబడినది కాయత్తారు పాండ్యరాజ్యము. న్యూనిజు కొట్టూరునుగూర్చి చెప్పిన ముఖ్యాంశములు కాయత్తారునకు సరిపోవుచున్నవి. కావున కృష్ణరాయలు క్రీ. శ. 1519-20 వ సంవత్సరమున జయించిన కొట్టూరి కాయత్తారు రాజ్యము గావచ్చును; ఇట్లని దృఢముగ జెప్పుటకు వలనుపడదు; ఈ యంశమును ఋజువుసేయగల సాక్ష్యమింకను లభ్యపడలేదు.

---

9. *Sources of Vijayanagara History. pp 172-3*

10. *Further sources* I. *pp 168. f*

11. *Queyros, The Conquest Ceylon, p. 394. n. 1.*

# "హిమగిరి తనయే..."



శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న

"శారదమ్మా, శారదమ్మా" ఉచ్చస్వరని నిట్టూరుస్తూ వీధిగుమ్మం యెక్కి నెమ్మదిగా పిలిచింది ఉమాదేవి మధ్యాహ్నం రెండుగంటలవేళ. అగ్ని కత్తెరలున్నాయి. ప్రాణికోటిసర్వం ఎండవేడిమికి సొమ్మసిల్లి పడిపోయినట్లుంది. ఎక్కడో రెండు వీధుల వెనక తిరుగాడుతూన్న "అయిస్ క్రీమ్"అమ్మే వాళ్ళ కేకలూ, అంతకంటే దూరంలోఉన్న ఆఫీసుల్లో పనిచేసుకుంటూన్న వాళ్ళనీ మినహాయిస్తే, ఊరు నిద్దరలో యిందనే చెప్పొచ్చు. లోకల్ ఫండు వాళ్ళ ధర్మమా అని మసూచిపడ్డ మొహంలాగ తయారయిన రోడ్డుమీద పలచగాజల్లిన సన్నపు టిసకా, సగం కరిగిన తారుమరకలూ, ఆ మండుటెండలో మిలమిలా మెరిసిపోతూ కళ్లు చికిలిస్తే కాని చూపు ఆననివ్వడం లేదు. కందగడ్డలాగ యెర్రవారిన ముఖం పైట చెరగుతో తుడుచుకుంది, ఉమాదేవి. ఎండదెబ్బ మూలాన్ని రొప్పులో అలా గనిపించింది కాని, నిజానికి ఆమె అట్టే సేపువేచి ఉండనక్కర లేకపోయింది. పిలుపు వెళ్ళిన రెండు నిముషాలకి తలుపు తెరుచుకుంది; వట్టివేళ్ళ తడిక వొత్తిగిలిస్తూ శారద అవుపడనూ అవుపించింది.

"మీ — మీరా? ఇంత యెండలోను?" అని ముహూర్తమాత్రం ఆశ్చర్యపోయి, తిరిగీ ఉత్తర క్షణంలోనే "రండి, రండి...అబ్బే, యిక్కడ కాదు. నాగదిలో కూచుందాం రండి, అక్కడ చల్లగా వుంటుంది" అంటూ నోటినిండా పలకరించి, లోనికి తీసుకువెళ్ళింది.

"నిద్దర పోతున్నావు గాబోలు, పాపం." క్షంతవ్యని అన్నట్టుగా అంది ఉమ, పాముకుబుసం లాంటి శారద వాయిలుచీరా, బాగా మెడక్రిందికి కత్తిరించిన జాకెట్టూ, కొంత చెదురువాటుగా ఉన్న ఆ ముంగురులూ చూస్తూను.

"అబ్బే-నిద్దరపోవడం లేదు. తలంటుకున్నానేమో, ఫేను క్రింద కూచునేసరికి జుట్టు కొంత చెదిరినట్టుంది" సమాధానం చెబుతూనే శారద పెరసకాయలాంటి ఉంగరపు వేలితో ముంగురుల వెనక్కి తోసి సవరించుకుంది.

నీడగా, కొంత చీకటిగా ఉన్న ఆ గదిలో కూచుని, వట్టివేళ్ళ తడికల మీదుగా వస్తున్న గాలి అనుభవించేసరికి రెండునిముషాల్లో తెప్పరిల్లుకుంది ఉమాదేవి. దానికితోడు శారద బలవంతంమూలాన్న, కూజానీళ్ళతో సబ్బెట్టి మొహం కడుక్కుందేమో, కొంత స్తిమితపడింది కూడాను

తను అంటే యెందుకో అంత అభిమానం ఆ పిల్లకి? "ఆc హాc హాc. ఆ షరబత్తునాకు. మీరీ ఓవల్టీన్ను తీసుకోండి. 'చల్లటి వోవల్టీను పానీయము!' వాళ్ళే ఎడ్వర్టయిజు చేస్తారుగా!!' అంటూ కిచకిచనవ్వుతూ అలా కబుర్లు చెబుతూనే బలవంత పెట్టేసింది, శారద.

"చిన్నదానివి. ఈ మర్యాదా అంతా బాగానే వుందనుకో... అయినా, అనవసరపు శ్రమ అమ్మాయీ."

కాని, నిజానికి ఉమ అలా మన్నించమని అనవలసిన అగత్యం లేదు. అక్కడా అక్కడా చెప్పకుంటూన్న ప్రైవేట్లు తప్ప వేరేవీ ఆమెకి ఆధారం లేదని శారదకి తెలుసును. అందులోనూ ఏ యింగ్లీషో, లెఖ్ఖలో గనకనా? పది యిళ్ళలో కుదురుకుంటే ఏదో యిదవుతుంది అనుకోడానికి? సంస్కృతం ఆయిరి! మొగరాయిళ్ళే పరీక్ష ప్యాసు కావడానికి తెలుగుకన్నా సులభం అని అఘోరిస్తారు, సంస్కృతం—కేవలం యెలాగో తట్టతగలేద్దాం అనీ. అలాంటప్పుడు ఆడపిల్లలకి వీటి అవకాశాలు ఉండి యేడుస్తాయా? అసలు ; ఖచ్చితంగా

పెద్దక్లాసులు చదువుకునేవాళ్లు యెంతమంది? ఇహ సంస్కృతంకోసం ప్రాణేయ పడేవాళ్లు యేమాత్రం? అందులోనూ మరీ ఆడపిల్లోళ్ళను! ఆ భాషఅంటేనూ, ఆ సారస్వతం అంటేనూ తల్లిదండ్రులకి యెంత ఉత్సాహం ఉంటే, పిల్లలకి యీ పరిస్థితులు కలిసేనా? నూటికి తొంభైమంది రోడ్డ రొట్టుగా చదువుకు పోతూన్న వాళ్ళేగా? ఇంక యేదో ఒకటి కుదిరిందీ అంటే శబ్దమంజరి మొదలుకుని శాకుంతలం వరకూ యేపాఠం చెప్పినా అల్లా పట్టేజీతం, కని బొమ్మలమీద వెంట్రుకల్లాగ యెదుగూ పొదుగూ లేకుండాను; పైగా యింటికీ యింటికీ వొల్లమాలిన దూరం! పాపం, ఉమాదేవికి ఊరు మొత్తంమీద యెలాగో నాలుగుపాఠాలు కుదిరేయి: ఉదయం ఓ రెండూ, మధ్యాహ్నం ఓ రెండున్నూ. అమ్మలక్కలేతే అలిండియా రేడియో ఆయిపోయిన ఆ ఊళ్లో ఆమె పరువు మర్యాదలన్నీ గూటిని కనిపెట్టుకుని ఉండపంబట్టే నిర్ధేశిస్తారని వేరే చెప్పనక్కర లేదు. ఆయా పరిస్థితుల్లో మొగాళ్ళు కచేరీలనుంచి యిళ్ళకి రాకుండానే పాఠాలు ముగించుకుని గుమ్మం చేరుకోవలసి వచ్చేది ఆమెకి. అంచేత ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం అన్న విభేదం లేకుండా కలగలుపుగా కలిసి జరిగిపోయేవి రోజులు, ఉమాదేవికి, నిత్యమున్నూ. వేసవికాలం అయినా అంతే.

"మధ్యాహ్నంపూట వస్తూ ఉంటానమ్మా" అని మొన్న వాళ్ళ అమ్మతో అంటూ ఉన్నప్పుడే శారదకి యీ పరిస్థితులు చూచాయగా తెలిసినా, బొత్తిగా యిలా యెండ మండిపోతూన్నా, వచ్చేస్తుంది అనుకోలేదు. ఎండపడి వస్తుంది అని మాత్రం తెలుసు. అందుకే కాస్త వోవల్టిను కలిపి "రెఫ్రి—జరేటరు" లో ఉంచింది.

ఎన్నిక్లిష్ట పరిస్థితులలో శ్రమించవలసి వచ్చినా ఉమాదేవిమాత్రం, యేదో ఘోర తపస్సులో నిమగ్నురాలయిన దానిలాగ, ఎంతో శ్రద్ధానిష్ఠలతో సాగించేది కార్యక్రమం. సంస్కృత కావ్యాలు ఆమెకి కరతలా మలకం. అందులోనూ కాళిదా సంటేప్రాణాలే పెట్టేది.

శారద షరబత్తుచవి చూసేసరికి, ఉమాదేవి ఓవలిటిన్ను పుచ్చుకోవడమున్నూ అయింది. ఆమెపైట చెఱగుతో పెదవులు తుడుచుకుంటూ ఉంటే, శారద పుస్తకం తెరిచింది. కుమారసంభవం కంట పడేసరికి ఉమ పరవశ అయిపోయింది. అంతవరకూ ఉన్న ఆయాసం, నిస్త్రాణా, బడలికా పటాపంచలయిపోయినాయి. ఆమె పెదవులని మందహాసం తొణికిసలాడించి; కని పాపల్లో కళలు మెరిసేయి. శారద పుస్తకం విప్పి యింకా శ్లోకం తడుముకుంటూ ఉండగానే, దేవి వరసగా చదువుకు వెళ్లిపోతోంది; రసవత్తరమైన ఘట్టాలు—ఒకటీ, రెండూ, మూడూ, ఆ ధోరణిలో ఒక మాధుర్యం; ఆ విరుపుల్లో అర్థస్ఫూర్తి, ఆగుడుకాల్లో భావ సౌకుమార్యం—శ్లోకం అయ్యేసరికి శ్రోతని ఉద్రూత లూగించేయికావూ? దేవి పాఠం చెప్పడంలో మెలకువలే వేరు!!—

"ఇదుగో, చూడు, శారదా. నువ్వే ఉన్నావనుకో," క్లిష్టతరమైన భావం హృదయానికి హత్తుకుపోయేటట్టుగా ఉదహరిస్తోంది దేవి,—"నీ కన్నా వెయ్యి అంతస్థులు పైనున్నవాణ్ణి ప్రేమించేవు. కేవలం కాముకత్వేనా కాదు; మనసారా వలచి వరించేవు. అతను, ఏ విదేశాల్లోనో పెద్దపెద్ద పరీక్షలు ప్యాసయివచ్చి, ఏదో పేద్ద ఉద్యోగం చేస్తున్నాడనుకో. నువ్వు-మాట వరసకి అనుకుందాం—అవనికన్నా యెన్నో మెట్లు దిగువని ఉన్నదానివి. కాస్త నాలుగువేళ్ళు నోట్లోకి పోతూన్న దానివే; అందగత్తెవి కూడాను. కాని, మొత్తంమీద చూస్తే అతని వర్చస్సు వేరు; నీతరహా వేరు. ఇటువంటి పరిస్థితుల్లో అతన్ని చూద్దాం అనీ, అతనితో మాట్లాడదాం అనీ యెంతో అటమటించిపోతున్న నీహృదయం—అకస్మాత్తుగా ఆ సన్నివేశం తటస్థపడేసరికి—ఎంతలాగ కొట్టుకుంటుందో కాస్త ఊహించు.

"సరిగ్గా అటువంటిదే పార్వతీ శివుల ప్రణయంలో తొలిఘట్టం. శివుడు మహా ఐశ్వర్యవంతుడు. 'ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛేత్', అని ఆర్యోక్తే ఉంది. అవునా? అయినా అంతకన్నా నిరాడంబరజీవి యింకొకడు లేడు. అనునిత్యంవు ప్రసన్న వదనంతో తపస్సు చేసుకుపోయే వ్యక్తి; కాని కోపంవచ్చిందీ అంటే ముల్లోకాలూ భస్మం చెయ్యగల శక్తీ ఉంది. ఇలాగ ఆదర్శ ప్రాయమయినవి అనేకగుణాలు అతనిలో యిమిడిఉన్నాయి. కాగా, చక్కని ధవళ కాంతి దేహం. మరి అతన్ని చూసేసరికి

పార్వతీ ముగ్ధహృదయంలోంచి ప్రేమవాహిని పెల్లుబికివచ్చి, పొంగి, కట్టలు తెగి పారింది అంటే ఆశ్చర్యం ఏంవుందీ? అయినా అపరిచితగా? అంచేత వివిధ భావాలు విపరీతంగా పెనవేసుకుపోయి, నానా గందరగోళం చేసేసేయి ఆమెని. తపశ్చర్యా నిమగ్నుడూ తన నోముల పంట కాబోయే వాడున్నూ; భక్తి తత్పరతలో పడింది పార్వతి. కాని తన మనోవికారం మూలాన్న ఆ తపశ్చర్యకి యెక్కడ భంగంకలిగి ఏవి శపించిపోతాడోనని భయంతో వొణికిపోయింది, పాపం. అంతలోకే త్రికరణశుద్ధిగా ఆరాధిస్తున్న ప్రేమమూర్తి స్ఫురించేసరికి వొళ్లమాలిన సిగ్గు వొళ్లంతా కమ్మేసింది! భయం, భక్తి, సిగ్గూ అనేయీ మూడు లక్షణాలూ జడపాయల్లాగ పెనవేసుకు పోయినాయిట, ఆమెలో. ఈమాటు తెలిసిందీ! ఇప్పుడు చదువ్."

అప్పటిదాకా వొళ్లు మరిచిపోయి వింటూన్న శారద తిరిగీ వాస్తవిక ప్రపంచంలోపడి, ఆఘట్టం మళ్లీ చదివింది. అర్థం చేసుకుంది. గురువుగారి కావ్య పరిశీలనకి లోలోపలే మెచ్చుకుంటూ స్తంభించిపోయేసరికి—అంతలో ఉమాదేవే అందుకుంది— "హిమగిరితనయే, హైమవతీ—" అని. దానితో నాటికి పాఠం సమాప్తం. యెప్పుడూ యింతే. ఈ మాటతో నే పాఠం ఆరంభం అవుతుంది; దానితో నే మళ్ళా ఆఖరు!

## 2

"హిమగిరి తనయే...హైమవతీ...హిమ... గిరీ...తనయే-" ప్రశాంత సలిలగంభీరంగా ఆరంభించిన ఆలాపన, అలా అలా గాలిగుమ్మటంలాగ పై పైకి యెగిరిపోతూ, సుళ్లుగాతిరిగి వస్తున్న మూర్ఛనలు వొళ్లు పరవశం చేసేస్తూ ఉంటే, యెత్తుకున్న యీ కృతి ఆవృత్తాలు తిరిగి, మూర్ఛనలుమారి, కల్పనస్వరాల్లో విజృంభించి, శ్రోతలని మంత్రముగ్ధులని చేసేసింది—రెండేళ్ళక్రితం ఉమ పాడిన ఉదయరవిచంద్రిక! శంకరం ఉపన్యాసం యెంత బావుందన్నారో, అంతికి మరెంత మెచ్చుకున్నారు ఉమా కుమారి సంగీతం ఆవేళ. అసలుసంగతి యేఁవిటీ అంటే, ఓ ప్రొఫెసరు రిటైరయి పోతున్నాడు. అతనికి వీడ్కోలు విందూ, సందర్భమున్నూ. నిజానికి శంకరం అప్పటికి ఆకాలేజీ స్టూడెంటు కాడు. ఆ క్రిందటి సంవత్సరమే బి. ఏ. ముగించుకుని పై చదువుకోసం పట్నం వెళ్ళిపోయేడు. దసరా సెలవులకని యింటికి వచ్చేసరికి, యిదీసంగతి. ఏవో ఉపన్యాసాలూ అవీయిచ్చి, పత్రికలలో కథలూ వ్యాసాలూ రాసీ, కాస్త గడబిడ చేస్తూ ఉండడం శంకరానికి యింటరునుంచీ పరిపాటే. అలాగని కాలేజీలో చదువూ వెనకాడేది కాదు. అందుచేత కాలేజీ ప్రొఫెసర్లకి అందరికీ శంకరంఅంటే యెంతో అభిమానమూ, గౌరవమున్నూ. కాగా మొదటినుంచీ ఆ కాలేజీలోనే చదువుకున్నవాడాయిరి. వీటి అన్నిటి మూలకంగానే అతన్ని ప్రత్యేకించి ఆహ్వానించేరు ఆ సమయానికి. ఉపన్యాసాలు ముగిసేయి. సెలవు పుచ్చుకోబోతూ ఉన్న ప్రొఫెసరు శర్మగారు ఎంతో సాదరంగా మాట్లాడేరు. కార్యక్రమంలో చివరి అయిటం సంగీతం. ఏవో ఫిల్ము గీతాలూ గొడవా కాబోలుననుకుని, నెమ్మదిగా హాలు గుమ్మందాటి వరండాలోకి వెళ్లేడు శంకరం, సిగరెట్టు కాల్చుకుందాం అని. అంతలో ఫిడేలు శ్రుతి బిగింపులూ, "త-ర-న్నా-నా-ఆ-" అని రాగం ఎత్తుబడీ శ్రుతి పుటానబడ్డాయి సిగరెట్టు కాలుస్తూ, ఎదరగానుంచుని తన ఉపన్యాసం మెచ్చుకుంటున్న యింకో ఫోర్తు యియరు విద్యార్థితో మాట్లాడుతూ పరధ్యానంగానే విన్నాడు మొదట్లోను. అంతలోకే రాగం అవరోహణలోపడి, కైశికి నిషాదంవద్ద ఆగి, కాస్సేపు రిషభం దగ్గిరకివచ్చి, మళ్ళపైకి, వెళ్ళి వక్రులుకలు తిరిగి, మూర్ఛనలుమారి, వింటూన్నకొద్దీ గంభీరతా ముద్ర వహించుకుపోతూ, ఇహ మరి నిలబడనిచ్చింది కాదు. సగం కాల్చిన సిగరెట్టు గట్టిగా ఒక్క దమ్ములాగి అవతలకి విసిరేసి, నిశ్శబ్దంగా తిరిగి వచ్చి కూచున్నాడు, చివరి బెంచిమీద. హాల్లో అంతా చెవులు రెండూ ఆమెకే వప్పచెప్పి మరీ వింటున్నారు. ఆ పాడిన సంగతులు కెరటాలమీద తెప్పలాగ వొయ్యారంగా తేలిపోతూ వినవస్తున్నాయి. శంకరం వొళ్లు మరిచిపోయేడు.

అలాగ పాటవింటూ ఉండగానే అతనిలో ఆలోచనలు రేకెత్తాయి. 'ఎక్కడ చూసేను చెప్మా? కొత్త మొహం మాత్రం కాదు, నిశ్చయం' అనుకుంటూ బాగా అయిదునిమషాలు గుంజాటనపడితే నే

గాని తేలలేదు. తను ఫోర్తుయియరులో ఉండగా యీమె ఫస్టు యియరులో చేరిందని. ప్రక్కనున్న విద్యార్థిని కూడా అడిగి సందుగొమ్మల అనుమానం తీర్చేసుకున్నాడు. ఉమ సెకెండుయియరు స్టూడెంటు ఇహనేం? ఆ అమ్మాయే. పక్కవీధులో ఉండేది. వాళ్ళ తండ్రి ఏదో తెలుగువైద్యుడు కాదూ, నల్లరాతి కల్వాలు పెట్టుకుని మందులు నూరుకుంటూ ఉండేవాడు యెప్పుడూనూ? అవునవును. ఆ అమ్మాయే.—:

"ప-ప-ప—ని-ని-ప—స-ని-ప..." ఓమూల స్వరాలు దొర్లిపోతున్నాయి ఫిడేలు కమాను జంపుకు యిచ్చి తిరుగుతోంది.

ఆమె కంఠంలోంచి అమృత స్వరాలు కెరటాలయి వెలువడుతున్నాయి. శంకరం వేళ్ళు అప్రయత్నంగా తాళం వేసుకుంటూ పోసాగేయి.

ఆలోచనలన్నీ వొదిలి, తాత్కాలికంగా తన్నుదా మరిచిపోయాడు అతను.

కూడా వచ్చిన స్నేహితులు నాలుగు రోజ్లే మొగని విడిపోయారు. ఇంటిదోవ పట్టినా శంకరానికి ఆపాటే శ్రుతపుటాల్లో మారుమోగుతోంది—'హిమగిరితనయే... హేమలతే'.

"ప్చ్"

శంకరం అదిరిపడి తిరిగి చూసేడు. ఉమ నాలుగ్గజాలు వెనకఉంది, చిన్న చెల్లాయితో సహా. అతనికి అనుమానం వేసింది. ఆ అమ్మాయేనా అలా పెదిమవిరుస్తా?

"మన్నించాలి. హేమలతే కాదు, హైమవతీ అని చరణం" పార్వతే అనేసింది.

"పైకే అంటున్నానా యేంవిటి కొంపదీసి? కాకపోయినా శృతి పాండిత్యంలో తప్పులకేం కొదవా? ఇంతకూ మీ పాట అలా నిలిచిపోయింది చెవిలోను."

"మీ ఉపన్యాసం కంటేనా?"

"సహృదయులు కనక అలాగ ఆపేక్షగా మాట్లాడుతారు, మీరు."

"మీ మాటల్లో ఆపేక్ష లేదని అనుకోను?"

ఇద్దరూ నవ్వుకున్నారు.

ఇద్దరికీ యిద్దరి యిళ్ళల్లోనూ పరిచయమూ అయింది, రాకపోకలు సాగేయి, క్రమేణాను. 'మా ఉమకి సంస్కృతం కొత్తనట్టుతోందిట. నువ్వో రెండు ముక్కలు చెప్తావా, నాయనా?' అన్నాడు ఉమతండ్రి ఓనాడు. అదీ వాళ్ల సాన్నిహిత్యానికి నాందీ ప్రస్తావన.

"వాంగర్థా కశ్చిదస్తి? అని యేదో ఆక్షేపణగా అంటారేమిటండీ?"

"ఎవడో కాళిదాసుని ఆక్షేపించేట్ట, గ్రామరు తెలియదని. అసలు ఆయన వ్రాయబోయే ఉద్గ్రంధాలకి వేసుకున్న ప్రాతిపదికట అవి.

'అస్త్యుత్తరస్యాం' యిందాకానే చెప్పెనుగా; కశ్చిత్కాంతా అన్నదాంతో మేఘదూత ప్రారంభం, వాగర్థావివ అన్నది రఘువంశంలో మొదటిశ్లోకం. నిజం అని నమ్మడానికి వీల్లేకపోయినా, చమత్కారంగా ఉన్నవి, యిలాంటివి బోలెడు కథలున్నాయి' అంటూ ఆ గ్రంథాల్లో మెరుగులు స్థాలీపులాక న్యాయంగా వివరించేడు శంకరం, ఉమ నాన్నగారికి.

ఆ వెనరా నెలవల్లో ఉమ మేఘమాల చదివేసింది.

తరవాతి వేసవిలో రఘువంశంలోవి నాలుగు సర్గలూ, కుమారసంభవం అంతానూ పూర్తిచేసింది. ఏ రోజు పాఠానికి ఆనాడు శంకరం శ్లోకాలకి తెలుగు పద్యాలు రాస్తూనే వచ్చేడు; పాఠం పూర్తి అవగానే ఆమెకి వినిపించేవాడు. మూలం వ్నూ, తర్జుమా తైపారు వేసుకుని చర్చ జరిపించేవారు ఉభయులూనూ. ఉమ సూచనల ప్రకారం ఎన్నోసార్లు దిద్దుకున్నాడు అతని పద్యాలు; దిద్దుకున్నాక తన అనువాదానికి తనే ముగ్ధుడైపోయేవాడు. తరవాత తరవాత అని పత్రికల్లో పడి బాగున్నాయని నలుగురూ ప్రశంసించినప్పుడెల్లా, ఆరగన్ను మెప్పుతో ఉమని లోలోపలే అభినుతించేవాడు, అలాగ సలహాలుయిచ్చి, మెరుగులు దిద్దినందుకు. తల్లితో అనేవాడు కూడాను, 'అమ్మా, మొదట్లో యిలాగ రాసేనే. రాస్తేనూ,...ఉమ యిలా మార్చమంది. చూశావా మరీ, ఆ మాత్రం మాట మార్పుతో పద్యం ఎంత బావుందోనూ?"

అటువంటి ప్రసక్తివచ్చినప్పుడల్లా ముసలావిడ వాళ్ళ చనువూ అన్యోన్యమూ చూసి మురిసిపోయేది.

ఉమ బి. ఏ. లోకి వచ్చేసరికి శంకరానికి ఎం. ఏ. పూర్తి అయింది. ఉపాధి భిక్షాటనకి ఊరు వదిలి వెళ్ళవలసి వచ్చింది. మర్నాడు వెళ్ళిపోతా డనగా, ఉమ ఏదో పుస్తకం చేతపట్టుకువచ్చింది. పాఠం చెప్పుకునే నెపంతో. శంకరం తల్లితో కాస్సేపు మాట్లాడి మేడమీదికి వెళ్ళింది. ఆ వేళ అరగంటకన్నా యెక్కువ సేపు పాఠం కాక పోయినా, పాఠం అవుతూ ఉన్నంతసేపూ నోరు యెంతమాట్లాడిందో, అంతకి రెండింతలు సంభాషించుకున్నాయి వారి కళ్ళు. ఉమ యింక తన యింటికి తరలిపోతూ ఉండగా అంది శంకరం తల్లి—

"రేపు ఉదయం బండిలో వెళ్ళిపోతున్నాడమ్మా, మావాడు...ఇక్కడికి చదువు అయిందా? యింకయేదో బతుకు తెరువు చూసుకోవాలి, మరి."

ఉన్నపాళంగా స్తంభించిపోయి, నోటమాట రాక, కళ్ళు నేలకే ఒప్పచెప్పిచూస్తూ, బరువుగా దీర్ఘ నిశ్వాసం విడిచింది ఉమ. ఆ లేత గుండెల్లో ఆ వేదన ముసలామె గ్రహించక పోలేదు. వెంటనే సానుకంపతో అంది.

"అయితే నేం లే, అమడలు దూరం అయితే అంతః కరణలు దూరమా ఏమిటి? ఉత్తరాలు రాస్తూ ఉండమన్నాను." ఆమె అంతశ్శుద్ధి మెచ్చుకుంటూ లోలోపలే చేతులెత్తి మొక్కింది ఉమ, ఆ దయార్ద్రమయికి.

ఆ మాటే శంకరానికి ఆదేశమూ ఆశీస్సూ అయింది కూడాను. సోమవారం తను రాస్తున్నాడు. బుధవారం అది చూసుకుని లక్ష్మివారంనాడు ఉమ జవాబిస్తోంది. శనివారం దాన్ని అందుకుని తిరిగీ సోమవారం శంకరం రాస్తున్నాడు. పట్నం డైరీలో శనివారాలకి ఒక ప్రత్యేకతా, యిక్కడ కేలండరులో బుధవారాలకి ఒక విశిష్టతా యేర్పడిపోయినాయి. నిజానికి ఆ డైరీ కాని, యీ కేలండరు కాని ఏనాడూ యిది ఫలానారోజు అని తెలియజెయ్యడం మానేసి— ఆ శనివారమో బుధవారమో, ఏదయితే అది— ఎల్లుండి వస్తుందనో, తెల్లవారితేననో, యింకా కాక పోతే యివాళేననో అనేది. అసలు ఆ మాటకి వస్తే ఆ రోజులకి ఉన్న ఔన్నత్యము, విలవా యింకే రోజులకి ఉన్నాయి?

## 3

తల్లి ఆశీర్వచనమో, ఉమ తపః ఫలమో, తన కృషి పర్యవసానమో తెలియదుగాని శంకరానికి నెల్లాళ్ళలో నౌఖరీ అంటూ కుదిరింది. మరో ఆర్నెల్లు పోయేసరికి రెండు మూడు జాగాలు మారి చివరికి ఒక మంచి కంపెనీలో కుదురుకున్నాడు, కొస్త చెప్పుకోదగ్గ ఉద్యోగమే ననిపించుకుని.

ఆ వేళ షష్టుతారీకూ శనివారమూనూ. జీతం పుచ్చుకుని లాడ్జికి చేరుకునేసరికి సమ్ముఖంలోనే పలకరించింది ఉమ రాసిన ఉత్తరం. ఉబ్బి తబ్బిబ్బయి పోయేడు శంకరం అది చూసుకుని. ఉమకి సెలక్షను పరీక్షల్లో మంచిమార్కులు వచ్చేయి. ఇంగ్లీషు లోనూ, సంస్కృతంలోనూ ఆమెదే ఫస్టుమార్కుట. తనదగ్గిర చెప్పుకున్న నాలుగుముక్కలూ సద్వినియోగానికి వచ్చేయనీ, పేపర్లు యిచ్చిన నాడయితే మరీ అతని మూర్తి మంతమే పదే పదే మననం చేసుకుంటూ, అలా మనస్సులోనే సాష్టాంగ పడి ప్రణమిల్లేననీ రాస్తూ—

"మీకు నేనేమి గురుకట్నం యివ్వుకోగలనూ? అయినా నేను చెయ్యగలిగినదల్లా మీ రుచిరగాత్రం, మధురపాఠం మననం చేసుకుంటూ ఉండడమే" అని ముగించింది. కాని శంకరానికిమాత్రం ఉత్తరం ముగియలేదు. చివరిదాకా చదివినట్టే చదివి, మళ్ళీ ఒక రెండు పేరాలు ముందుకువెళ్ళి, అంతలో యింకెక్కడో మరో నాలుగుముక్కలు అందుకుని, తిరిగీ మొదటినుంచీ ఆరంభించి—ఆకాశంలో విమానం చక్రాకారంగా తిరిగి తిరిగి, అంతలో నిటారుగా యెగిరి, గభాల్న ముక్కు సూటిగాదిగడి, చూస్తూఉండగా వొయ్యారంతో రెక్కలవిరుగా పల్టీలు కొట్టి కొట్టి నేత్రపర్వంగా భంగిమలుసలిపి నట్టు—ఆ సరస హృదయాకాశంలో సోత్కంఠతో అతి ఉల్లాసంగా విహారాలు సలిపి తనకి తెలియకుండా నే కేంప్ కాట్ తలగడామీదికి వొరిగిపోయేడు, చేతిలో ఉత్తరం అప్రయత్నంగా చెక్కిలినంటుతూ ఉంటే ఏదో అవ్యక్తమయిన ఆనందం అను విస్తూను.

మళ్లీ కన్ను తెరిచి చూసేసరికి ఆరు!

ఉత్తరం తిరిగి చదువుకున్నాడు.

నిర్భరసంతోషం అనుభవించేడు.

ఉమ—తన శిష్యురాలు—కాదు, తన సర్వస్వమున్నూ—తన మనస్సులో ఉన్న కోరికే ఆమెకీ ఉన్నట్టు—తనలాగే ఆమెకూడా ఉబలాట పడుతూన్నట్టు—ఉవ్విళ్లూరుతున్నట్టు—ఎంత సున్నితంగా వ్యక్తపరిచిందీ?

శివాలయంలో ఘంటారావం చెవినిపడింది. ఘనశ్యామూర్తి. తపశ్శాలి, నిగ్రహానుగ్రహసమర్థుడు, కరుణామయుడు—ఆ శివుడి హృదయంలో పార్వతి ఎలా హత్తుకుపోయిందీ? ఆమె సౌజన్యానికీ, సౌమనస్యతకీ, అమాయకతకీ, చురుకుదనానికీ ముగ్ధుడైనాడు కాదూ, శివుడూ? శరీరార్థం త్యాగంచేసి, ఆమె అనునిత్యవూ తనలోనే యిమిడి ఉండిపోయేటట్టు విలీనం చేసుకున్నాడు కాదూ? ఆదర్శ దాంపత్యం అంటే ఫలానా అని లోకానికి నిర్దేశించిన మహానుభావుడు కాదూ ఆ ప్రేమ స్వరూపి? వాగర్థావివ అని కాళిదాసు, వారి అన్యోన్యం ఉపమానించేడంటే వాస్తవమే కాని ఉత్ప్రేక్ష యేముందీ?

కాళిదాసుమాట తట్టడంతోనే కుమారసంభవం పాఠం జ్ఞాపకంవచ్చింది. దానితో ఒక్కమాటు, సినీమాలో చూసినట్టు, ఉమ ప్రార్థన గేయమూ, వెంబడే తను మామూలుగా పాడేపాటా వెంబడే స్ఫురించి, "పాడు, పాడుమరీ" అని ఎవరో చెవిలో చెప్పి ప్రోద్బలం చేసినట్టయి—మనం మాటల్లో విశమరిచి చెప్పకోవడమే ఆలస్యం అయిపోతోంది అనిపించేటట్టు అరమోడ్పు కన్నులతో, అతిశయిల్లిన భక్తి పారవశ్యంతో, గాఢగాత్రం సాపుగాయెత్తి, కేదార గౌళంలో అందుకున్నాడు—

"నీలకంఠం భజేహం—సతతం—నీరజాసనాది నుతం "నీల" బాలకుచాంబా సహితం—బాలచంద్ర సేవితం..." ఈశ్వరార్చన చేసుకుని అలాగ బజారు వేపు వెళ్ళేడు. ఉమకి ఏదయినా ప్రెజెంటుకొని పంపాలి. ఏది కొనడానికీ పాలుపోయిందికాదు.

బట్టలకొట్టువాడు ఆకాశంయెత్తున పొగుడుతూ అతినవీనపు ఫాషన్‌అని అమెరికన్ జార్జెటు చూపించేడు. కాని శంకరానికి నచ్చలేదు. "కాకపోయినా, చీరారవికలసుద్దా యేమిటి పేరంటానికి పెట్టినట్టు" అనుకున్నాడు.

"టాయిలెట్ సెట్ తియ్యండిసార్. ఇది దా గర్ల్స్‌కి యిస్తురు. అప్-టు-డేట్. మాక్స్ ఫాక్టర్ సెట్ దా, సార్. ఏంది అట్లా యోచనచేస్తురు? "అన్నాడు" ఫాన్సీస్టోర్సు"లో సేల్సుమన్. కాని, యేవిటో సంప్రదాయ విరుద్ధం అనిపించింది.

ఎనిమిదిగంటలయినా ఏ వస్తువా నచ్చలేదు. ఇలాగని అన్వేషణమాననూ లేదు. ఇహ ప్రాణం విసిగి, అడుగు వెనక్కి పడుతూన్న మనస్సు చిన్నబుచ్చుకుని తిరిగి వొచ్చేస్తూఉంటే, ఎదరగా కంటపడింది—రోలెక్సుకంపెనీ! అద్గదీ, వస్తువా, ప్రెజెంటూ అంటేను. పరీక్షలకి పనికివస్తుంది, తరవాత జీవితాంతం ఉండనూఉంటుంది. కాగా అనునిత్యవూ ఆమె వొంటినే అంటిపెట్టుకుని వుండేవస్తువా, అలంకారమున్నూ. ఎంచియెంచి సమచతురస్రంగావున్న చిన్న రిస్టువాచీ కొన్నాడు, దానికి అమిరే రోల్డుగోల్డు చెయినున్నూ.

గూటికి చేరుకోగానే మొదలెట్టిన ఉత్తరం గడిదాటిపోయినా ముగియలేదు; ఏదో కొఱత కనిపిస్తూనేవుంది. అంతలో చిన్న ఆలోచనతట్టి తనలో తనకే నవ్వువచ్చింది. జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రెల్ — నాలుగునెలలు. ఈ నాలుగునెలలూ ఎలాగో కళ్లుమూసుకుని గడిపేస్తే ఆమెకి పరీక్షలూ అయిపోతాయి—వేసవిలో ముహూర్తాలు ఉండనూ ఉంటాయి. గభాల్న ఉత్తరం ఆ పాళంగా ముగించి—

"శేషాన్ మాసాన్ గమయ
చతురో లోచనే మీలయిత్వా"

అని మాత్రం ఓ చిన్న కాగితం ముక్కమీద రాసి, వాచీ డొక్కుపై భాగానికి అంటించి, ఆ ఉత్తరమూ యీవాచీ కలిపి పేకింగుచేసి—పోస్టు ఆఫీసులో యివ్వడమే తరవాయిగా పని పూర్తిచేసుకుని—ఆనందడోలికల్లో ఊగిపోతూ, స్వర్గానికి ఒక్కమెట్టు తక్కువలో కన్నుమూసేడు శంకరం.

## 4

ఓ. ఏ. ఫలితాలు తెలిసేయి.

ఉమ ప్రశంసనీయంగా ప్యాసయింది.

ఆనాడు కళకళలాడుతూ పెళ్లివారిల్లులాగ ఉంది వాళ్లయిల్లు.

"పాపం, ఆ శంకర్రావు ఓ రెండుముక్కలు చెప్పబట్టి యీనాడు మాట దక్కింది," అంటూ ఆమె తండ్రి కొంచెం అందుకున్నాడు. వృద్ధదంపతులు యిద్దరూ శంకరాన్ని యేరీతిగా సంతోషపెడితే బావుంటుందా ? అని ఆలోచనలు సాగించేరు.

"ఉప్పాడ జరీ ధోవతుల చాపు పంపుదాం" అన్నాడు తండ్రి.

"పట్నంలో ఉద్యోగం వెలిగిస్తున్న వాడికి పంచల చాపు రెందుకూ ? అంతకన్నా రెండుపట్టు సూట్లు కుట్టించియిస్తే కచేరీకి వెళ్లడానికీ పనికి వస్తుంది, అతనికి ముచ్చట తీరుతుంది. తను యెలాగా కుట్టించుకునే స్థితిలో లేడాయిరి, పాపం" తండ్రి ప్రతిపాదనకి తల్లి ఓ దిద్దుబాటు చేసింది.

"కాకపోయినా బట్టలు నాలుగు రోజుల్లో చిరిగిపోతాయే. ఏదయినా యిచ్చేమూ అంటే, మన పేరుతో నాలుకాలాలపాటు మన్నాలి. రెండిది ఒ కాఫీ కప్పో, సబ్బుపెట్టో యిస్తేనో ?"

"ఇంకానయం, పన్నీరుబుడ్డీ, గంధపుగిన్నో యిస్తానన్నారు కాదూ ?

"పోనీ సైకిలు కొని పంపనా ?"

"ఎందుకూ ? అసలే పట్నంలో ఊరి జన సమ్మర్దంపూ, లారితొక్కిడీని. ఏదయినా యిదయిందంటే ఆజన్మాంతం మన ఉసురుకి పడియేడుస్తాడు."

ఇలాగ ఓ పావుగంట భార్యాభర్తలు వివాద పడి, ఏ నిర్ణయానికీ రాలేక, చివరికి కూతురినే కేకేసేరు. పట్టరాని ఉత్సాహంతో పక్క వసారాలోంచే చెవులు రిక్కించుకుని వింటూన్న ఉమ చిరునవ్వుతో ప్రవేశించేసరికి, తల్లి గారాబంగా ఒడిలోకి తీసుకుని, తల నిమురుతూ అంది—

"ఏం తల్లీ, శంకరం చలవవూలాన్న పరీక్ష అంటూ ప్యాసయ్యావుగదా, మరి గురుకట్నం ఏం చదివించమంటావమ్మా ?"

"చెప్పు తల్లీ చెప్పు. పావుగంటయి కిందా మీదా పడుతూన్న మాకు యే ఆలోచనా పాలుపోయింది కాదు. ప్రాజ్ఞురాలవయినావు, నీ సలహా కూడా చెప్పు." తండ్రీ ప్రోత్సహించేరు.

"నేనుమాత్రం మీకన్నా యెక్కువ ఏవి ఆలోచించగలనూ ? మీ కెలా బావుంటుందని తోస్తే అలాగ చెయ్యండి."

"మాకు యేమాత్రం తోచక నేగదమ్మా, నిన్ను కేకేస్తా ?"

"ఏం చెప్పమంటారూ ?"

"ఏదయినా చక్కని వస్తువ ఆలోచించి చెప్పమ్మా," తల్లి అంది బుజ్జగిస్తూను," అతనికి ఇవ్వ తగిందీ—"

"మన దర్జాకి లోటులేకుండా ఉండేదన్నీ" తల్లివాక్యం అర్ధోక్తిలోనే అందుకుని తండ్రి ముగించేడు.

ఉమ కాస్సేపు మౌనంగా కూచుంది.

"నీకు గురువుగారు మరి, ఆ కృతజ్ఞత తెలియ జెయ్యొద్దూ లే" తండ్రి ప్రోద్బలం చేసేరు.

"అతని శుశ్రూషవల్ల నీకు చరితార్థం లభించింది" తల్లి పల్లవిపాడింది.

"చెప్పనా ?" అంది పార్వతి, ఎర్రబడ్డమొహం తల్లి గుండెల్లో దాచుకుంటూను.

"నా ఫోటో ఒకటి పంపించండి" చెప్పనే చెప్పేసింది.

ఆ మాట అశని ఘాతంలాగా తగిలింది తండ్రికి.

తల్లి దిగాలుపడింది.

క్షణకాలం యెవ్వరూ మాట్లాడలేదు.

ఆ రాత్రి తల్లిదండ్రులకి తీవ్రమయిన వాదోపవాదాలు జరిగేయి అని తెల్లవారేసరికి తెలుసుకుంది ఉమ, కూరలు తరగడానికి తల్లిపక్కనే వంటయింట్లో కూచుని.

"బిల్హణీయం అనీ, అదనీ యిదనీ యేవేవో ఆడిపోసుకున్నారే తల్లీ, తెల్లవార్లూను."

"నాన్నగారు యేవన్నా మంచిమాటేనమ్మా. ఆయనకి ముక్కుమీద ఉంటుంది కోపం. ఇవాళ కొత్త గనకనా ?"

"అది కాదే-" అని అర్ధోక్తిలో ఆపి, గుడ్లనీళ్లు కుక్కుకుంటూ, జాలిగా దీనంగా కూతురివంక చూసింది తల్లి. ఆ చూపులో ఏదో నీలాపనింద

అంతర్గర్భితంగా అవుపించింది. కుటుంబం పరువూ, మర్యాదా, యింకా ఏవేవో—అనరానివీ, అనకూడనివీ కూడా—తండ్రి అన్నట్టూ, ఆ ఉదాసీనంతో తల్లి కుళ్లిపోతూన్నట్టూ ద్యోతకం అయింది ఉమకి. కోపమూ, రోషమూ కూడా ముంచుకురాగా, కంపిస్తూన్న పెదవులతో, ఎఱ్ఱబారిన కళ్ళతో, గద్గద కంఠంతో అంది ఉమ, "అమ్మా, నాన్నగారు పెద్దవారయితే అయినారు కాని, అంత తొందరపాటు కూడదమ్మా. పోనీ, ఆ ఆవేశంలో ఆయనకి తెలియకపోతే నువ్వయినా చెప్పలేకపోయావుటే? ఎంతైనా ఆయన కడుపున పుట్టేను; ఆ గుణాలే నాలోనూ ఉంటాయి మరి."

ఈ జవాబుకి చెంపదెబ్బతిని, తల్లికి కడుపు తరుక్కుపోయింది.

"తెలుస్తూనే వుందమ్మా. నిన్నా నేడూనా? నేటికి పంధొమ్మిదేళ్ళయి చూస్తున్నాను కానూ? ఆ తండ్రికి యెంత కోపమో, యీ కూతురికి అంత రోషం" అంటూ, అటు భర్తని నివారించే మార్గం తెలియకా, యిటు కూతురికి ధైర్యం చెప్పే శక్తి చాలకా బావురుమంది తల్లి.

తాటాకుల మంటలాగ, ఎంత త్వరగా అంటుకుందో అంత త్వరగా చల్లారిపోయింది తండ్రికోపం, సాయంకాలానికి. కాని కూతురికోరిక తనకేమాత్రం కూడా నచ్చలేదు.

"ఇన్నాళ్లలాగా కాదు, 'యుద్ధపురోజులు, ఎక్కడో ఒకచోట నౌకరీయే దొరక్కపోతుందా' అనుకోడానికి తెలుసా? ఇప్పుడు యెక్కడ చూసినా రిట్రెంచిమెంటే. ఉన్న ఉద్యోగాలు చెడామడా తగ్గించి పారేస్తున్నారు. ఎనిమిదేసేళ్లు, పదేసేళ్ళు సర్వీసు ఉన్నవాళ్లే ఉసూరుమనీ ఏడుస్తూ ఉంటే, ఈయనగారి లెక్కెవిటి? నిన్నగాక మొన్న ప్యాసయేడు ఎం. ఏ. ఎలాగయితే నేం" తండ్రి పనస చదివేస్తున్నాడు.

"మీరు మరీ చెబుతారు లెద్దురూ, పెడితే పెళ్ళి పెట్టకపోతే మరేకోట. ఇన్నాళ్ళూ మనం మెచ్చుకున్న శంకరంవేనా, యీ రెండురోజుల్లోనూ మారిపోయేడా?" తల్లి గుండె లోతుల్లోంచే అంది.

"అది కాదే. చంటిపిల్ల, దానికి తెలియకపోతే నీకూ మతిపోయిందా? స్త్రీబుద్ధిః ప్రళయాంతకః అని అన్నారంటే సార్థకనే అన్నారా మరి? ఏదైనా వ్యవహారం వ్యవహారంలాగ చూసుకోవాలి గాని, అభిమానాలతో కొట్టుకుపోకూడదు. నేనయినా శంకరానికి చదువులేదని అన్లేదు. కాని సొంగు కొచ్చిన చదువూ? అదే యే డాక్టరీయో, యింజనీరింగో చదివించి ఉంటే—ఆ బాపతు అవసరాలు మనిషి ఉన్నంతకాలం ఉంటాయికనక—ఎక్కడో ఏదో కాస్త యిదవుతుందని అనుకోవచ్చును. అలా కాకుండా మనవాడిది ఇంగ్లీషూ, సంస్కృతమూ, తెలుగూను. ఎం ఏ. అయితే నేం? మరేవయితే నేం?

"మీరన్నట్టు యింజనీరో, డాక్టరో అవుతే బాగానే వుండును కాని, ఆ పరిస్థితుల్లో ఆయన మనకి తటస్థపడి వుండేవాడు కాడు, మీరు యెంతో ఉబలాటపడి చెప్పించిన యీ సంస్కృతం నాకు అబ్బేదీ కాదు." ఉమ అన్న యీమాటకి, పచ్చి వెలగకాయ గొంతుక పడ్డట్టయి, తండ్రికి మరి నోటమాట రాలేదు, రెండు నిమిషాలు.

"ఏ చదువయితే నేం? ఏదో ఉద్యోగం అంటూ చేసుకుని తనపొట్ట తను పోషించుకుంటున్నాడుగా" తల్లి అందుకుంది సద్దుబాటుగాను.

"చాల్లే. మూడేళ్ళు కసరత్తుచేసి మూలనున్న ముసలమ్మని కొట్టేట్ట ఏం ఫైలుకట్టిన ప్లీడరీయా? ఖచ్చితవయిన గవర్నమెంటు ఉద్యోగమా? ప్రైవేటు కంపెనీలో అఘోరిస్తున్నాట్ట. రేపు వాళ్ళకి నచ్చకపోతే యిట్టే ఉద్వాసన చెప్పేస్తారు."

"అంతలాగ నుదుటరాసివుంటే లక్షాధికారీ భిక్షాధికారి అయిపోతాడు."

"ఇన్నీ చెప్పి నువ్వు అసలు విషయం మరిచేపోతున్నావు" అంటూ ఏదో ఆలోచనలో పడ్డవాడిలాగ ఒక్క నిమిషం నిదానించి "కాసిన్ని మంచినీళ్ళు అందుకోతల్లీ" అన్నాడు ఉమవైపు తిరిగి. ఈ చివరిమాట ఆమెని బయటికి పంపించే ఉద్దేశంతోనే అన్నాడు తండ్రి. ఆ మాత్రం అంతర్యం కూతురు గ్రహించక పోనూలేదు. 'ఏవిటి చెప్తా అంత నిగూఢ విషయం' అనుకుంటూ గదిలోంచి బయటికి వచ్చి నట్టేవచ్చి, గుమ్మం పక్క గోడమ్మటే తిరిగి, తండ్రి

వీపు వెనకగోడనున్న కిటికీ దగ్గిరసావొచ్చి నుంచు న్నేసరికి, ఆయన రహస్యంగా అంటూన్న ముక్కలు తనచెవిని పడ నేపడ్డాయి.

"ఏమంత చెప్పరో తన్న కుటుంబం అని దీనికి ధరా లేః తల్లికింద లైపోగు న్నామా? మొన్న మొన్నటిదాకా అదిర కలక్టరు గారింట్లో వంట చేసేది తెలుసా! ఇంత బతుకూ బతికి చివరికి ఆవంట పుట్టి కొడుకుచేతుల్లోనా పెట్టమంటావ్, బంగారుతల్లిని? చేసినపని విన్నవాడయినా హర్షిం చాలా? దానికి జొత్తిగా చిన్నతనం. నువ్వు మళ్ళీ ఆలోచించుకుని, దానికి నచ్చచెప్పు. కాకపోయినా, మన పిల్లకి యేం తక్కువనీ? అనాకారా? చదువు లేనా? సంగీతం రాదా? కాకా పోదూ అంటే ఆ మాత్రం కట్నంవే యిచ్చునో లేనా? గుః—"

ఉమ యింక అక్కడనుంచో లేక డాగా గా గిదికిపోయింది. తండ్రికి మరి మంచినీళ్లూ రాలేదు. అసలాధ్యాసే లేదు ఆయనకి. భార్యాభర్తలు యెంత సేపు మాట్లాడుతూ కూచున్నారో తెలియదు. కాని యిక్కడ డాబామీద ఈజీ ఛెయిరులో కూచుని, కాళ్లు పెట్టగోనని ఆనించి, ఉమయేదో దీర్ఘాలోచ నలో పడిపోయింది.

నిజవే, శంకరం పేదవాడు, పాపం. అయి తేనేం తక్కువొచ్చిందీ, కూటికి పేదలయితే కులా నికి పేదలా, అనీ! అదేం ప్రారబ్ధమో కాని యీ పాపిష్టి ప్రపంచంమాత్రం "డబ్బు, డబ్బు" అనే దేవుళ్లాడుతుంది. సభల్లోనూ, శ్మశానాల్లోనూ యెంత వైరాగ్యం వెళ్లబోసినా, పట్టుమని అవసరం వొచ్చే సరికి ధనమూలమే అయి పూరుకుంటుంది. యిదం జగత్తు. ఇంతా చేస్తే అర్జన పరులు అనుకుంటున్న వాళ్ళకే యీ డబ్బుయేవ. ఆ సంపాదనకోసం వాళ్లు యెంత తాపత్రయపడేదీ, ఎన్ని డొంకతిరుగుళ్లు తిరి గేదీ, ఎంతలేసి ఘోరాలకి వొడికట్టుకునేదీ చూస్తే, ఘరానా మనుషులు అనిపించుకున్న వీళ్ళకంటే గర్హనీయం అయినవాళ్ళు యింకొకరు ఉండరు అని పిస్తుంది. ఎవరిదాకానో యెందుకూ? నాన్నమాటే అనుకుందాం. మొన్న నా శంబరివారి. అమ్మాయికి కాళ్ళూ చేతులూ చల్లబడిపోయినాయంటూ, ఉన్న వాళ్ళకికూడా మతులుపోయి, తను యేవిటో మహా ఘనవైద్యుడని, పెద్దపెద్ద యింగిలీష్ డాక్టర్లే పెదవి విరిచేసిన కేసులు యెన్నో బాగుచేసేడనీ కొండంత ఆశతో పుత్రికాభిక్ష పెట్టమని అర్థిస్తూవస్తే—నూట పదహార్లకి బేరం ఆడుకుని, అర్థనూట పదహార్లు అరి చేతుల్లో పెట్టేదాకా అడుగయినా కదిలేదూ నాన్న? అలాగ యేనో అవకాశాలు చిక్కుబుచ్చు కుని, అవతలవాళ్ళని పీడించి, నాలుగు రాపాడ డాలు మూలకేస్తినదానికి పెద్దబతుకూ; పేదిదానికి తేలి బతుకూను!

డబ్బు లేకపోవడం శంకరానికి ఓ పెద్ద లోపవా? తల్లి కలక్టరుగారింట వంటచేసి పెడితే అదో మహాపచారమా? ఘోర! ఇంతకూ, యేవి పూట కూళ్ళయిల్లు పెట్టుకుందా, అష్టమయినవాళ్ళ యిళ్ళ ల్లోనూ కుడుచుకుందా? పరమాయువు చాలక, పాపం యిరవైతొమ్మిదో యేటే కాలం చేసేరుటగాని, అసలు శంకరం నాన్నగారు ప్రొఫెసరు గిరీ చేసే ట్టగా? బతికిఉంటే యీపాటికి ఆయనపేరు దశ దిశలూ అలుముకుపోయేది కాదూ? ఆమాత్రం సర్వీసు లోనే ఓ అయిదువేలకి యిన్సూరెన్సు చేసుకున్నాడు —పాపం. అదివినా యింకే ఆధారమూలేని ఆమె, ఆ డబ్బు అలాగే వుంచి, దాంతోనే శంకరాన్ని పెంచి, పెద్దవాణ్ణిచేసి, చదువు చెప్పించి సాకుతూ వొచ్చింది ఇహ, నిత్యపూ దేహయాత్ర ఎలాగో ఒకలాగ సాగించక తీరదు కనక కొన్నాళ్ళు— నిజమే—కలక్టరుగారింట వొంట వొండేది. అయితే? తన తోబుట్టువులాగ చూసుకునే వాడా కలక్టరు. ఎన్నడూ "అక్కయ్యా" అన్నమాటకి మినహా యింకోలాగ పిలిచి యెరుగునూ ఆయన? సాటివాళ్ళు కావడంచేత, వారికీ వీరికీ యేదో బంధుత్వం అనేగాని, యింకొక లాగ అనుకుందా లోకం? పదేళ్ళక్రితం— శంకరానికి యేదో జబ్బుచేసి, యింగ్లీషు డాక్టర్ని పెట్టుకోలేక—అప్పట్లో నాన్నకి యింత డబ్బు ఖచ్చితం ఉండేదికాదు మరి!—తనని పిలిపించి నప్పుడు తెలుసుకున్న యీ లోగుట్టు ఇప్పుడిలాగ రచ్చకి యీడ్చడం యేవయినా బావుందీ? ప్రాజ్ఞతకి లక్షణమేనా? ఇంతకూ ఎన్నాళ్ళు చేసింది కనక? శంకరం స్కూలుఫైనలు ప్యాసయ్యేదాకాను. తర వాత నుంచీ అతనికి స్కాలరుషిప్పులు రావడంతోనే, వాళ్ళు యెలా బతుకుతున్నారో రెండోకంటివాడికి

తెలియకుండా వ్యవహరించింది, శంకరం తల్లి. ఆ మహా యిల్లాలిని యిప్పుడిలాగ ఆడిపోసుకుంటే సున్నొందు పుట్టగతులుంటాయా ?

తనలో తాను యెన్ని అనుకుని యేంలాభం ? ఎందులో ఒక్క ముక్క కూడా తండ్రిముందు అనడానికి వీల్లేదు. తనదారి తను చూసుకోవలసిందే.

సరే ననుకుంది.

స్నేహితురాలు జానకమ్మతో సంప్రదించింది. ఓ నిశ్చయానికి వచ్చింది.

ఉమకి వేరే సంబంధం నిశ్చయం చేసేడు తండ్రి. లగ్నం నాటిరాత్రి పెళ్లికూతురు పరారీ!

## 5

ఏ నూతా గోతా పడిందేమోనని తల్లి తల్లడిల్లి పోయింది. పరువుమర్యాదలు మంట కలిసిపోయేయి అంటూ, సాటిబంధువర్గంలో—అందులోనూ కొత్త వియ్యాలవారి దగ్గిర—భరించరాని అవమానానికి గురి అయి తండ్రి అగ్నిహోత్రావధాన్లే అయిపోయి నాడు. నాలుగురోజులు గడిచిపోయేయి. కంచు కాగడా పెట్టి వెతికించినా పిల్ల ఆచోకీ తెలియ లేదు. కావలసిన ఆ వియ్యాలవారూ, ముచ్చటగా వచ్చిన బంధుకోటీ అంతా ఒకొక్కరే—మింగనూ లేక కక్కనూలేక—ఏవేవో కొత్త అనునయంగానే అంటూ, తమ ఆశాభంగం వ్యక్తపరుస్తూనే జారుకున్నారు. నిమ్మళంగానూ. చూస్తూ ఉండగా యిల్లు చిన్నబోయింది. తనకే యేదో చెయ్యి విరగ్గొట్టుకున్నట్టనిపించింది. పొరపాటే జరిగిపోయిందని గ్రహించేడు కూడానంటే వాస్తవ దూరంకాదు. ఏడవనూ లేక, ఓగబట్టుకోనూ లేక యెలాగో నిలదొక్కుకుని చుట్టుపక్కల ఊళ్ళన్నీ గాలింపించేడు. ఈలోగా గృహిణి ప్రశ్నలు అడిగించింది, అంజనం వేయించింది; జాతకాలు చూపించింది: ఇహ రుద్రాభిషేకాలకీ నవగ్రహ స్తోత్రాలకీ, మొక్కుబళ్లకీ, మీదు కట్లకీ అయితే లెక్కే లేదు. పిల్ల బ్రతికి ఉందని కొత్త ఆ చోకీ తెలిస్తే ఆ ఏడుకొండలవాడికి వెండి పావుకోళ్లు చేయిస్తానంది; ఆంజనేయ స్వామికి వెయ్యి కొబ్బరకాయలు కొడుతానంది; మహాలక్ష్మికి పిసెడు కుంకంపూజ చేయిస్తానంది. దేశంలోవున్న దేవుళ్లపేర్లు లిస్టుదాటిపోతున్నా, పిల్లసంగతి పిసరంతా తెలియలేదు. ఈలోగా బెంగతో చిక్కిపోయి శల్యావస్థ పట్టిపోయింది.

ఆయనకయితే అంతకుముందే యేనాడో మతి పోయింది. అసలు గౌరీపూజకి పిల్లని తీసుకురండి అని ఓ మూలనుంచి పౌరోహిత్యుడు గొంతుక చించుకుని అరుస్తూఉండి, యివతల పిల్ల కనపడక పదినుండీ కంగారుపడిపోతూఉన్న స్వాడే — ఆ వేళంలో తన్నుదా తిట్టుకుని, యెదుటనున్నవారిని మరో నాలుగు తిట్టి, గొడవగా విరుచుకుపడ్డాడన్నమాటే గాని—కడుపులో యేకుస్తు నేవున్నాడు తనూను. అయితే అప్పట్లో అతనికి అది తెలియలేదు. రోజులు గడిచిపోయి, ఊరూరా వెతకడానికి వెళ్లినవాళ్లు యే భోగట్టా లేకుండా తిరిగి రావడంతోనూ, యిటు యింటావిడ అలాగ బెంగతో కృశించిపోవడంతోనూ, మరీ కడుపులో చెయ్యిపెట్టి కెలికేసి నట్టయింది.

ఈలోపున—సంధిగా వ్యవహారం జరిపించాలన్న ఉద్దేశంతో వ్రాసిన ఉత్తరానికి జవాబూ వచ్చింది, కంపెనీనుంచి— శంకరం వాళ్ల కంపెనీలోనే ఉద్యోగం చేస్తున్నాడనీ, చాలా సమర్థుడనీన్నీ. సరే. తెలియకుండా పెళ్లి అరాత్తుగా శంకరాన్ని కలుసుకోవాలనుకున్నాడు. అసలు పట్నం వెళ్లి చూడాలన్న ఆలోచన మొదట్లోనే తట్టింది. కాని పట్నం వెళ్లాలంటే పదిహేనురూపాయలు టిక్కట్టుకే ఉండాలి; ఇక్కడ చూడబోతే ఉమ పెట్టెలో వస్తువులూ బట్టలూ అన్నీ సద్దినవి సద్దినట్లే వున్నాయి. పోనీ వస్తువా వాహనం ఎక్కడయినా కుదవబెట్టి ఏవయినా చేసిందా అని అనుమానించడానికి కూడా వీల్లేకుండా, మెడలో గొలుసూ, చేతిని ఉన్న బంగారపుగాజులూ కూడా పెట్టెలోనే దిగవిడిచి వెళ్లింది. తొలినాడు పెళ్లికూతుర్ని చేసినప్పుడు, వాళ్ళూ వీళ్ళూ యిచ్చినరూపాయలుకూడా ఆ పెట్టెలోనే ఉన్నాయి ఆయిరి, సిల్కురుమాల్లో ఓమూల భద్రంగాను. ముచ్చటపడి తల్లి కట్టించిన నేలం పట్టుచీర కూడా విప్పేసి ఆ పెట్టెమీదే ఉంచేసింది. ఇన్నోటి యెందుకూ, వస్తువలన్నీ జాబితా రాసినట్టు పొందికగా పేర్చిఉన్నాయి అంటూంటేనూ? అసలు అవి అన్నీ అలాగ ఉండబట్టే ఎందులోనో పడి యేవి అఘాయిత్యపు పని చేసిందోనని భయపడ్డారు

మొదపెట్టోను. ఇహనిప్పుడు అన్ని ఆశలూ అడుగంటి పోగా, పట్నంవెళ్లి శంకరాన్ని చూడడంతప్ప గత్యంతరం యేవీ తోచలేదు, మానవుడికి. ఫలానా నాడు వొస్తున్నానని తెలియబరుస్తే, మరెక్కడి కయినా ముందుగానే ఉడాయించేస్తారేమో? 'ఫరవాలేదు. తనకి ఆమోదమేననీ, వాళ్లిద్దరూ సుఖంగా ఉండడమే ప్రధానం' అని రాస్తేమాత్రం—యింత రభసా, హంగామా జరిగేక తన మాటల్లో వాళ్లకేం నమ్మకం ఉండేనూ? అంచేత యింకో మార్గం అవలంబించాలి.

అలాగ అనుకునే రాసేడు, పట్నంలో కంపెనీ వాళ్లకి. మీ కంపెనీలో ఫలానా కుర్రవాడు ఉన్నట్టు వినికి. నాకో ఆడపిల్ల వుంది. సంబంధాల విషయంలో మీ సహకారం అర్థిస్తున్నాను. పిల్లవాడి జీతం వగైరా వివరాలు కాస్త వ్రాయింపించవలసింది అంటూను. ఈ వ్యవహారం చాలా గుట్టుగా వుంచవలసిందనీ, వారివద్దనుంచి జాబు రాగానే తాను స్వయంగా బయలుదేరి వస్తున్నాననీ కూడా ఓ ముక్క చేర్చేడు, అందులోనే.

ఆ పర్యవసానంగా వచ్చింది కంపెనీవాళ్ల ఉత్తరం. శంకరం చాలా చురుకైనవాడనీ, పెర్మనెంటు అయిన నౌకరీ అనీ, యెంతో నమ్మదగిన వాడూ సౌమ్యుడూ అనిన్నీ. శంకరం పట్నంలోనే ఉన్నాడని తెలుసుకుని కాస్త కుదుటపడ్డాడు, ముసలాయన. మర్నాడు ప్రయాణం కట్టేడు.

## 6

ఓనాడు ఉదయాన్నే కబురొచ్చింది శంకరానికి, తొమ్మిదింటికే కచేరీకి రమ్మనమనీ, వస్తూనే సరాసరి పెద్ద అధికారిని చూడవలసింది అనిన్నీ. అడావిడిగా హోటల్లో రెండు మెతుకులు నోట్లో వేసుకుని—ఏ వ్యవహారంతాలూకుది యేభోగట్టా అడుగుతాడోనని—ముఖ్యమయిన కాగితాలూ, కంపెనీ లెఖ్ఖలూ అవీ నెమరుకి తెచ్చుకుంటూ పావుతక్కువ తొమ్మిదికే చేరుకున్నాడు శంకరం. టేబిలుమీద ధూళి దులుపుతూన్న బంట్రోతు అటుదొరా, యిటు శంకరంకూడా ఆవేళ అంత పెందరాళే రావడం గమనించి, యెందుకో ఊహిం చుకోలేక, నమస్కరిస్తూనే, "భోంచేసేరా, బాబూ, మరీ పెందరాళే వొచ్చేరు" అన్నాడు.

"అఁ యేదో ఎంగిలిపడే వచ్చేను—దానికేం గానీ—దొరగారు రాగానే చెప్పవోయ్"

"అయినా యిప్పుడే వొచ్చి గ్రను సెప్పనా, బాబు, తమ రొచ్చేరనీ!"

"ఉండవోయ్, ఉండుండు. ఇంకా పదినిమిషాలు వ్యవధి ఉంది, ఈలోగా ఓసిగరెట్టు పేకెట్టు తెచ్చిపెట్టూ" అంటూ దగ్గరున్న ఆఖరు సిగరెట్టు ముట్టించి, వాడికి డబ్బులిచ్చి బీరువా దగ్గిరకి పోయాడు — శంకరం. సిగరెట్టు కాల్చుకుంటూ ఫైల్సుతీసి, కొన్ని అర్జంటు కాగితాలూ అవీ జతపరుచుకుని, లెక్కాడొక్కా యింకోసారి నిఖరాసుగా చూసుకుని, యింక తొమ్మిదీ కొడతా రనగా అధికారి గదిలోకి వెళ్లేసరికి, ఆయన కాళ్ళు రెండూ మేజా చివరని ఆనించి, ఉయ్యాలలాగ ముందుకీ వెనక్కీ ఊగుతూ, తల పైకెత్తి కళ్లు మూసుకుని ఏదో ఆలోచనలో మునిగిపోయినవాడిలాగ కంటపడ్డాడు కుర్చీలోను. శంకరంబూట్సు చప్పుడు వినపడడంతోనే చప్పున సర్దుకుని కూచుంటూ, "రండి, రండి, కాస్త యిబ్బందే అయినా నామాట మన్నించేరు" అంటూ నోటినిండా పలకరించేడు, యెంతో గౌరవంతోను.

"ఇవాళ యింత తొందరగా యెందుకు పిలిపించేనో తెలుసా?"

"ఏవో అర్జంటు వ్యవహారాలు ఉండివుంటాయి."

"అబ్బే, అవేవీ కాదు. అంతరంగికంగా ఒక్క ముక్క చెబుదాం అని రమ్మన్నాను. మీలాగే నేనూ యింకా బ్రహ్మచారిని అన్నమాట తెలుసునుకదూ? క్రిస్‌మస్‌కి సెలవుపెట్టి మాదేశం వెళదాం అనుకుంటున్నాను, కొన్నాళ్ళపాటు. నేను ప్రేమించిన అమ్మాయి ఒకర్తె అక్కడ ఉందిలెండి. నిన్ననే పంపించింది; యిదుగో యీ ఫోటో చూడండి."

ఈ విపరీతపు వెంగలితనానికి శంకరం ఎంతైనా ఆశ్చర్యపోయినాడు. తానంటే దొరకి మంచి నమ్మకమే; ఎన్నో ఆంతరంగిక విషయాలు తనతో ముచ్చటిస్తూనూ ఉంటాడు. కాగా తన పనికి మెచ్చుకున్న

రోజులూ ఉన్నాయి. పొరపాట్లు వచ్చినప్పుడు యెంతో మృదువుగా చెప్పి సవరించినరోజులూ ఉన్నాయి. ఎప్పుడూ దొర ఎంతో ఉత్సాహంగానూ, సద్భావంతోనూ ప్రవర్తించేవాడు. కానిస్కూలు ఫైనలు ఫస్టు ఛాన్సులో ప్యాసయిననాడిలాగ యిలాగ పర్రోడిపోవడం యేనాడూ జరగలేదు గనక శంకరానికి ఆశ్చర్యమూ వేసింది, నవ్వూ వచ్చింది.

"కళ్లలో చక్కని చురుకుదనం ఉంది; కాగా మాంఛి స్ఫురద్రూపి" అన్నాడు చివరకి మందహాసంతో.

"మీ దేశంలో ఆడపిల్లగలవాళ్లు వరుణ్ణి వెతుక్కుంటారని విన్నాను. అవునా?"

శంకరం ఆర్యసంప్రదాయాలూ, ఆచారాలూ వివరించేడు.

అంతా విని ఆత్రుతగా అన్నాడు దొర "నా కంటె ముందు మీ పెళ్లి స్థిరపడింది. బ్రాంచి మేనేజరుగా ప్రమోషనూ అయింది. కన్‌గ్రాచ్యులేషన్సు" రెప్పవెయ్యకుండా శంకరం కళ్ళలోకి చూస్తూనే, మళ్ళీ కాళ్లు బల్ల అంచు నానించి, కుర్చీలో ఉయ్యాల లూగుతూ, ఒకొక్క ముక్కా వొత్తి వొత్తి నెమ్మదిగా అన్నాడు—"ఈ ప్రమోషనే—మీకు నేను—యివ్వగలిగిన—పెళ్లికానుక!"

అసలే ఆశ్చర్యచకితుడయిపోయిన శంకరానికి యీసారి బొత్తిగా తలా తోకా తెలిసింది కాదు.

"నాకా? నాకు పెళ్ళా?"

ఇంకా యేవో అలాగ తొట్రుపాటు మాట అంటూ ఉండగానే దొర ఛట్టున లేచి, వోరగా వేసి వున్న పక్కగది తలుపుతోస్తూ—

"దయచెయ్యండి, పంతులుగారూ; యీయనే శంకరంగారు. మీ అమ్మాయికి యింతకన్నా సౌమ్యుడు యింకొకడు దొరకడు" అనేసేడు. ఉమ తండ్రిని చూసేసరికి శంకరానికి ఆశ్చర్యమూ సంతోషమూ ఒక్కసారి పెనవేసుకుపోగా—అంతలో ఆఫీసులో ఉన్నానన్న సంగతి సుర్తుతెచ్చుకుని—ప్రఫుల్లవదనంతో అంజలిబద్ధుడై నిలుచున్నాడు.

కథ యిలాగ అడ్డుతిరిగేసరికి—కచేరీలో శంకరాన్ని చూద్దాం అని వొచ్చిన ముసలాయనకి—ఏవి అనడానికి పాలుపోక నిలువునా స్తంభించిపోయేడు.

మరో నిముషానికి, "ఇవాళకి మీకు సెలవు. వొచ్చిన అతిథిసమ్మానం చూసుకోండి. గుడ్‌లక్" అంటూ యిద్దర్నీ సాగనంపేసేడు దొర.

ఎంత బలవంతం పెట్టినా ముసలాయన భోజనం చెయ్యనన్నాడు. పోనీ, కాస్త కాఫీపుచ్చుకుందాం రండి అంటూ, కాఫీహోటలుకి దారితీసేడు శంకరం. క్లబ్బు చేరుకునేదాకా యివ్వరూ యేమాటా ఆడకుండా నడిచేరు. అలాగా ముమ్మారు ఏదో మాట నాలికచివరిదాకా వచ్చింది శంకరానికి. తనలో తనకి నవ్వువచ్చింది. ఇందుకా మూడు వారాలయి ఉమదగ్గిర్నుంచి ఉత్తరంలేదు! ఎంత తల్లడిల్లిపోయినాడూ అనవసరంగానూ? ఉమ ముఖం మననం చేసుకుని, సిగ్గు దొంతరలతో నిండిపోయి కళకళ లాడుతూన్న ఆమె చెక్కిళ్ళు ఊహాచిత్రం గీస్తూనే మురిసిపోయినాడు తనలో తాను.

మూలగా నున్న ఓ టేబిలుదగ్గిర కూచుని, "పుచ్చుకోండి" అంటూ ఐస్‌క్రీము కప్పు ఒకటి ఆయనవైపు జరిపి, తనూ కప్పును తీసుకున్నాడు.

"బాబూ, ఇవి కాళ్లుగాని చేతులుకావు. మన్నించు" అంటూ శంకరంచేతులు రెండూ తన చేతుల్లోకి తీసుకుని బావురుమన్నాడు ముసలాయన.

శంకరానికి యిదో పులిమీదపుట్ర!

"ఉమ నీ దగ్గిరికే వొచ్చిందనుకున్నాను." రుద్ధకంఠంతో తొలిమాటకీ మలిమాటకీ సంబంధం లేకుండా అన్నాడు ముసలాయన. క్రమేణా వివరాలు వెలువడ్డాయి.

"నాయనా, నాకు కాస్త సాయపడవూ? యెక్కడుందో, యెలాగఉందో నా బంగారుతల్లి? చచ్చిపోలేదు; చచ్చిపోలేదు. అంతమట్టుకు నిశ్చయంగా నా గుండెల్లో నాకే తెలుస్తోంది. యెక్కడ ఉన్నా అది నీదే బాబూ; ముమ్మాటికీ నీదే. ఆ చిన్నహృదయంలో యింత దృఢసంకల్పమూ, యింత గాఢానురాగమూ ఉంటాయని గ్రహించలేకపోయాను. ఎలాగయినా, యీ వృద్ధాప్యంలో నాకు తోడుపడవూ? మనశ్శాంతి చేకూర్చవూ?"

ముసలాయన వాపోవడానికి అంతంటూ లేకుండాపోయింది.

శంకరానికి గుండె నీరయిపోయింది.

ప్రేయసికోసం ప్రియహృదయం అటమటించింది.

"వొస్తున్నా—వొచ్చేస్తున్నా. ఎంత వెతికినా దారి కనపడదేం కర్మం? అయినా కాస్సేపు వోపికపట్టు. ఇంక పడినంత కాలం కష్టాలు పడవులే. దగ్గిరపడ్డాంగా" అంటూ లోలోపలే ఊరకలు వెయ్యటం మొదలెట్టింది గుండె.

## 7

ఆవేళ శారదగారింట్లో ఓ చిన్న పార్టీ. వాళ్ల నాన్నగారు ఆ వూళ్ళో కొత్త పలుకుబడి ఉన్నవాడు కావడంచేతా, "సెన్సస్" పనిలో యెంతో చాకచక్యంతో నలుగురినీ కూడగట్టుకుని మాంచి ఉత్సాహంగా పనిచెయ్యడంవల్లనూ, ఆ 'సెన్సస్' పనిలో నడుము కట్టినవాళ్లందరినీ టీపార్టీకి కేకేసేడు. ఉమాన్వేషణలో కొత్త పరిచయాలూ, నూతన స్నేహాలూ అభిలషిస్తూన్న శంకరానికి "సెన్సస్" పని, నిజంగా దేవుడిచ్చిన వరంలాగ దొరికింది. గంపెడు ఆశతో వాలంటీరు చేసేడు అతను. అంతమందీ ఒక్కొక్క వార్డు చేస్తూ ఉంటే, తాను స్వయంగా రెండుమూడువార్డులు చేసి, అది చాలక యింకా మిగిలినవాళ్ళకికూడా యథోచితంగా తోడు పడుతూ వచ్చేడు. ఆ మూలంగా యెంతమందితోనో చక్కటి స్నేహం యేర్పడింది. కాగా, తన కంపెనీకి ఆవూళ్ళో తనే పెద్ద ఉద్యోగి. దానాదీనా, యిట్టే ప్రత్యేకత లభించింది సంఘంలో శంకరానికి. తనూ వొచ్చేడు. అల్పాహారాలయినాయి.

అంతమందీ టీ పుచ్చుకుంటున్నారు.

"శారదా" అని కేకేసేడు వాళ్లతండ్రి "ఏవైనా రెండు కృతులు పాడతావా అమ్మా, కాస్సేపూ?" అడిగేడు.

"ఔనమ్మా, చాలారోజులయింది నీపాట వినీ" అంటూ ఆ ప్రతిపాదన బలపరిచేడు, ఆ కుటుంబంతో చనువుగా ఉన్న యింకో స్నేహితుడు.

"మరేం. ప్రతీపార్టీలోనూ నేనే పాడటం అయిపోతోంది. ఈ సారి మీరు పాడండి మావయ్యగారూ" కొత్త కొంటెతనంగా అంది శారద. నలుగురూ కిలకిల నవ్వేరు. అతన్ని వేళాకోళం చేసేరు. అంతలో యెవరో శారద నాన్నగారి చెవిలో ఏదో ఊదేరు.

"సరే అయితే, యింకేం? శంకరంగారికి సంగీతం అంటే అంత మనసా!" అంటూ వెంహ మాటపెట్టేసేడు శారదతండ్రి.

శంకరం పాడడానికీ శారద ఫిడేలు వాయించడానికీ ఒప్పన్నం అయిపోయింది. ఆదిలో శంకరాభరణం పాడుదాం అనుకున్నాడు. అంతలో ఉమ స్ఫురణకి వచ్చింది. పాతలింకు బలపడింది. ఈ రెండేళ్ళలోనూ తను మనసారా పాడింది యెప్పుడూ? గొంతుక సవరించుకుని, శ్రుతి అందిచ్చి, సాఫుగా కంఠం యెత్తి ఆరంభించేడు శంకరం—

"హిమగిరితనయే—హైమవతీ... హిమా—గిరీ—తనయే..." కూడా వాయించడానికి పూనుకున్న శారద, కమాను ఒళ్ళోకి జారవిడిచి, రెప్పవెయ్యకుండా శంకరం మొహంకేసే చూస్తూ స్తంభించిపోయి కూచుంది.

శంకరం ఈ లోకంలో లేడు.

సమాధిలోపడి, స్వర్గంలో ఏ దేవతనో ఆరాధిస్తూన్నవాడిలాగ, అరమోడ్పు కన్నులతో, పారవశ్యం చెందిపోయి పాడేస్తున్నాడు. వచ్చిన నలుగురూ మంత్రముగ్ధులయిపోయేరు.

అంతలో, లోగుమ్మంలోంచి యేదో కలకలం! యెవరో మొహం తిరిగి పడిపోయారు!!

ఒక్క అంగలో శారద లోపలికెళ్ళింది; తండ్రీ అనుగమించేడు. శంకరం పాటకి బ్రేకు పడిపోయింది. నలుగురూ నాలుగు విధాల సలహాలు యిస్తూ కోలాహలం చేసేరు. మరి కాస్సేపటికి, 'ఏమీ లేదంటే, యేమీ లేదని' కొందరూ, 'పైత్యం చేసి ఉంటుం'దని యింకొందరూ, 'కాకపోయినా కాలం మారులోంది కాదూ' అని మరికొందరూ ఊరటపడ్డారు. సద్దు అణిగింది. అతిథులు గృహోన్ముఖులయినారు. శంకరం కూడా సెలవు పుచ్చుకుంటానన్నాడు.

శారద కాస్సేపు ఉండమంది.

భోజనానికే బలవంత పెట్టేసింది.

"మీ పాట చివరంటా వినాలనీ, దాని ఆరాటం. పిల్లకోరిక మన్నించకూడదూ ?" తండ్రీ మొహమాటం లోకి దింపేసేడు.

కాదనలేక తిరిగి వొచ్చి డ్రాయింగురూము సోఫాలో కూచున్నాడు శంకరం.

శారద కాఫీ పట్టుకొచ్చింది.

"ఇప్పుడే కాదమ్మా, పుచ్చుకున్నానూ ?"

"అయితేనేం లెండి. మీకు అత్యభిమానం అయిన వస్తువేగా ?" క్షణకాలం శంకరం చకితు డైనాడు. అంతలోనే సంబాళించుకుని, "బొత్తిగా కొత్తవాణ్ణి, నా సంగతి నీ కెలాగ తెలిసిందమ్మా ?"

"హిమగిరితనయే చెప్పిందిలెండి. శంకరుడి యిష్టాయిష్టాలు ఆ ఉమాకాంతకి తెలిసినట్టు యింకెవ రికి తెలుస్తాయీ ?"

శారద వాక్యం ముగిసేలోపున, ద్వారం తెర తొలిగించుకుని, ఉమ రానేవొచ్చింది. అతని పాదా లకి ప్రణమిల్లింది. తన కళ్ళని తనే నమ్మలేక పోయి నాడు శంకరం.

"ఉమా ? నువ్వే ? నువ్వే ఉమా ? ఇలాగ- ఈ ఊళ్ళో—ఇన్నాళ్ళబట్టీ — యెన్నాళ్ళనుంచీ ఉంటున్నావు ఉమా ? ఎక్కడ ఉంటున్నావు ? యెలాగ ఉంటున్నావు. నీ కీ అజ్ఞాతవాసం ఏంకర్మ కాలింది ఉమా ? నాకో టెలిగ్రాం యివ్వలేకపోయి నావా ?"—అతని ప్రశ్నల వర్షానికి అంతులేదు.

"మరిచిపోకుండా గుర్తుంచుకున్నారు నన్ను. అదే పదివేలు నాకు. ఇవాళ నిజంగా అదృష్టమే కలి సొచ్చింది. లేకపోతే, యీ టీపార్టీకి అంత బలవంతం చేసి నన్ను పిలిచీ ఉండెదు శారద; మీ దర్శనప్రాప్తి దుర్లభం అయిపోయేది.

"అసలు, ఆనాడు జానకీ — మా జానకమ్మని యెరగరు మీరూ, నా క్లాసుమేటూ—అది సాయ పడకపోతే మరి మిమ్మల్ని చూసే భాగ్యం కలిగేది కాదు నాకు. జానకే యిచ్చి పంపింది ఓ నాలుగు చీరలూ, పాతికరూపాయిలున్నూ. వాళ్ళ అక్కయ్య యీ ఊళ్ళోనే ఉంది; ఆయన, పాపం బోర్డు స్కూలు మేస్టరు. వాళ్ళలో వాళ్ళే అవస్థపడుతూ ఉంటే నేను కూడా యెక్కడ నెత్తికెక్కి కూచోనూ ?... ఆయనే సంపాదించి పెట్టేడు నాకో నాలుగుట్యూషన్లు. వేన్నీళ్ళకి చన్నీళ్లు తోడుగా వెళ్ళిపోతోంది కాలం...వ్యవహారం గుట్టుగా ఉండా లని సంస్కృతం తప్ప మరేదీ చెప్పనన్నాను." శారద కొంత పూర్వగాథ ముగించింది.

"మీ నాన్నా అమ్మా యెంత తల్లడిల్లి పోతు న్నారో తెలుసా ? అసలు నువ్వు యేవిఁ అసూ యిత్వం చేసేవోనని—"

"మొదట్లో అపనే తలపెట్టేను మరి. కాని జానకమ్మ ఉందే—దానిఋణం చర్మం చెప్పులు కుట్టియిచ్చినా తీర్చుకోలేను—అది బ్రేకులు వేస్తూనే వొచ్చింది. 'చచ్చి సాధించేదేవిటి? ఆత్మ- అనాత్మ, పునర్జన్మ—వాంఛాసాఫల్యం యిలాంటి మాటలు అన్నీ ఉపన్యాసాల్లో అయితే బాగానే ఉంటాయి గాని—అవన్నీ తథ్యం అని నమ్మినా, ఆ సిద్ధికోసం నువ్వు చేసిన కృషి యేదీ? అసలు నీకు కాస్త ప్రాజ్ఞత వచ్చిందీ అనుకున్నప్పుడు హృదయం పర వశం చేసేవు. ప్రేమ పెంపొందించుకున్నావు. నానాటికి అది మహావృక్షమయి నిలుచుంది. ఆవరించు కుంది నిన్ను. ప్రేమభోగ్య ప్రపత్తి, వస్తుతః ఆత్మతః కూడాను మరి దాని కాధారమయిన దేహం త్యజిస్తే —నిర్వికారం అయిన ఆత్మకి అనుభూతిప్రపూర్ణత యేవిఁ సిద్ధించినట్టూ ? ఇహ కాగాపోగా, కైవ ల్యమో, భగవత్ సాన్నిధ్యమో అనుకోడానికి వీల్లే దుగా నీ పరిస్థితుల్లోనూ ?

"కాబట్టి, నీవు అనుభవించడానికి నోచుకోక పోయినా, మిగతా కొంతమందికయినా అనుభవైక వేద్యంచెయ్యి. సంస్కృతం చదివేవు. శృంగార కావ్యాలు యితోధికంగా అర్థంచేసుకున్నావు. రసా స్వాదనలో పరమావధి కనిపెట్టేవు. నీకున్న రసార్ద్ర హృదయం వాళ్ళలో ప్రసరించు. నీలాగ సంస్కృతం చెప్పుకున్నవాళ్లు యేరీ ? నువ్వు నేర్చు కున్నట్టే మరి కొంతమంది పిల్లలకి నేర్పు. వాళ్ళని ప్రేమించు/ అందరి పరిస్థితులూ ఒక్కలాగే ఉండవు గా. వాళ్ల ప్రేమసాఫల్యం చూసి ఆనందించు. ఈలోగా అదృష్టం కలిసివొచ్చిందా సరేసరి. లేదూ, ప్రేమోపాసన చేసినందుకు ఆ సిద్ధి శిష్యులహృదయవికసనంలో చూసి ఆనందించ గలుగుతావు.' ఇలాగ ఓనాడు రెండుగంటలసేపు

భోగపరిచింది జానకి. ఇన్నాళ్ళకి నా నోము ఫలించింది. మీరు కంటపడ్డారు."

"నిజమే ఉమా. నీ నోమూ ఫలించింది. నా దీక్షా పూర్తయింది."

"ఏమా—దీక్షా? అంటే—మరింకా—అది సాహిత్యమా?"

"ఇంకా అంటే? ఈ రెండేళ్లలోనూ మారిపోయే ననుకున్నావా, వెర్రిదానా? నీవు కాకుండా పోయిన నాడు, లోకంలో యింకెవ్వరికీ కానవసరం లేదు, నేను."

ఉమకి సంతోషంవల్లా దుఃఖంవల్లా ఒక్కసారి ఉప్పెనగా ముంచుకొచ్చేయి. కళ్లలో నీళ్ళు సుళ్లు తిరిగాయి—

"మరి - నేను -" గద్గదికతో అంది, "లోకం దృష్టిలో నీ మరాలిని. పతితని. పెళ్ళినాటిరాత్రి పరారీ అయి, పరాయివాళ్ళయింట్లో పదాయి ఇళ్లో, తలదాచుకున్న దాన్ని."

"హుఁ. లోకం!" తుడిచిపారేస్తూ అన్నాడు శంకరం, "లోకం అని వ్యవహరించే మనుషులకి యేమాత్రం అయినా వివేచనజ్ఞానం ఉందీ? ఒకడు ఓడు అంటే కంచం అంతా ఓడు! అసలలో నన్ను యీసడించలేదూ 'వంటొక్కకొడుక్కి గుమాస్తా గిరీ కాకపోతే గవర్నరు అవుతుందా యేమిటనీ? ఈనాడు నాలుగురాళ్ళు తెచ్చుకుంటూ ఉండేసరికి, 'భద్రమ్మ కొడుక్కేం? వాడు చిన్నప్పట్నుంచీ సీమ మిరపకాయే' అని అంటున్నారు వాళ్లేను.

"నువ్వు కనిపించకుండా పోయింతరవాత అట్టుడికి పోయింది మీ ఊరు, ఊరుపుకార్లతోను. ఏం ప్రమాదం అయిన పని చేసేవోనని అనుమానపడ్డారు, తొలిరోజుల్లోను. 'అతనంటే మొదట్నుంచీ దానికి ప్రాణవేసే' అంటే, 'రాధాకృష్ణుల్లాగ యెంత పుణ్యం చేసుకుంటే నమ్మా అలా బెల్లం జీలకర్రలాగ అతుక్కుపోవటం' అంటూ ఓ నాలుగు రోజులు మెచ్చుకున్నారు నిన్ను. కాని మరికొన్నాళ్ళకి నువ్వు యెవ్వరితోనో వెళ్ళిపోయేవనీ, బతికే ఉన్నావనీ రూఢి అయిపోవటంతోటే 'శాబాసు! ఎంత సాహసం అయిన పనిచేసింది? దీని మెరమెచ్చు మాటలకి లొంగిపోయి అతను చేసుకున్నాడు కాదు. పుట్టినింటికీ మెట్టినింటికీ కూడా అప్రతిష్ట' అంటూ, నాకు ధైర్యం చెప్పి సంబంధాలు తీసుకొచ్చే నెపంతో రచ్చకీడ్చేసేరు నిన్ను. నువ్వు లోకం అనుకుంటూన్న వాళ్లు ఆ యిరుగుపొరుగు అమ్మలక్కలేగా? ఇలాంటి వాళ్ళే పోగయి సీతా అమ్మవారిలాంటివానికి నీలాపనిందలు నెత్తిన వేసేరు. మళ్లీ వాళ్లే నాడూ నేడూ కూడా ఆ పటం నెత్తినెట్టుకుని పూజిస్తున్నారు. అవునా?'

ఉమ ఆనందం అతిశయిల్లింది. అతని పాదాలు కన్నీళ్లతో కడిగేసింది. ముందుకు వంగి, తన పాదాలకి మోకరిల్లిన ఆమె ముంగురులు నిమురుతూ అన్నాడు శంకరం—

"లే ఉమా, లే. ఏమిటీ వెర్రితనం!'

నాటినుంచీ శంకరం లాడ్జికి మరి వెళ్ళలేదు.

నేటికీ ఉదయసాయాహ్నాలు ఉదయరవి చంద్రిక వినిపిస్తూనే ఉంటుంది ఆ మేడమీదనుంచి, అదే రాగం, అదే పాట—"హిమగిరి తనయే."

ఇదివరలో ఒక్క స్త్రీకంఠమే వినపడేది. ఇప్పుడు పురుషగాత్రం కూడా జముటగా మేళవించుకుపోతుంది. కొత్తకొత్త సంగతులతో, ఏర్చి కూర్చిన కల్పనస్వరాలతో, ఉత్తుంగ తరంగభంగిమల లాంటి మూర్ఛనలతో జీవం ప్రజ్వరిల్ల జేస్తూ—"హిమగిరి తనయే"—

అని వినవస్తూఉంటే క్రిందని వీధి చీడీమీద ఓ తాతగారు కల్వంలో ఏవో మందులు నూరుతూ కూచుంటారు. అందులో మూడువొంతులు మందులు గాత్రం చెడిపోకుండా ఉండటానికేట!!

# తొలకరి



శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

వెచ్చని వాగు గుండెలు ద్రవింప సమస్త జగమ్ము చల్లగా
వచ్చిన వానజల్లులకు పచ్చని పచ్చిక పట్టుచీరతో
ముచ్చట గూర్చుచున్నయది భూజనయిత్రి ; కృషీవల ప్రజల్
కచ్చె బిగించినారు తొలుకారు పొలాలహలాల దున్నగన్.

మొగ్గ దొడగనది మొగిలికొమ్మయొకంతు
ప్రియురాలి దరహాసరేఖ పోలె
మురిపించిపోయె మబ్బుల మధ్య మెఱుపులు
తెరచాటుమాటు సుందరుల పోలె
పొటమరించినవి నాగటిచాళ్లు కేదార
లక్ష్మీకటాక్ష జాలముల పోలె
వలపించె పూచికోముల మాలతీలత
పడుచు ప్రాయపునవప్రమద పోలె

చల్ల చల్లగా గాడుపుసాగె మోద
మొప్ప ప్రకృతి విడిచెడు నిట్టూర్పు పోలె
ఉడికిపోయిన లోకమ్ము వడకిపోయె
చెలువుమీరగ తొలకరి తొలకరింప

జాలిగల మానవుడు పేదరాలి చేతి
బిచ్చపుంగిన్నెలో పడవేసిపోవు
నట్టి చిల్లరడబ్బులయట్లు చిన్న
చిన్న చినుకులు టపటప క్షితిని రాలె.

జగములో బగబగ సెగల్ రగులు కొలుపు,
చండకిరణుని ఆతపజ్వాలలందు
మోడువారిన కాననభూములన్ని
పెల్లుగా క్రొత్త క్రొత్త చిగుళ్లుపెట్టె.

---

# ముగ్గురు అభాగ్యులు



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

గత శతాబ్దారంభంనుంచీ, ప్యారిసు, కళాసారస్వతాల్లో యూరపుకు వెలుగునిస్తూ, అగ్రసరంగా ఏలుకుంటోంది. గ్రీకు, రోమను సాంప్రదాయాలంటే విసిగిపోయిన పాశ్చాత్య కళాలోకానికి క్రొత్తజీవం ఇచ్చింది ఫ్రెంచి విప్లవం తరువాత వచ్చిన కళావిప్లవము. బూజుపట్టిన క్లాసిసిజమ్ము వదలి వచ్చిన రొమాంటిసిజము తరువాత అతి నవ్య విధానాలైన ఇంప్రషనిజము, పోస్టు - ఇంప్రషనిజము బయలుదేరినాయి. ఈ పాశ్చాత్యానూతన సాంప్రదాయాలకి ఎడ్వోర్డు మేనెట్ తల, విన్సెంట్ వేంగో, గుండె, పాల్ సిజానె తనువు, అనవచ్చు. ఇప్పుడు ప్రసిద్ధులైన మెటిసీ, మోడిగ్లియానీ, పికాసోలు వీరి అడుగు జాడల్లో నడుస్తున్నారంటే కళాలోకంలో వీరి ప్రాముఖ్యం తెలుస్తుంది. అయితే, వీరి జీవితాలు చాల విచిత్రమైనవి సామాన్య మానవదృష్ట్యా అవి మిక్కిలి దుర్భరమైనవి. కళాపరంగా మహోన్నతులైన వీరిని ప్రపంచము దృష్టిలో అభాగ్యులనే అనాలి.

కళాజీవనము పూలబాట కాదు. నిజమైన కళాశిల్పి నలిగిన బాటను పోడు. తన కళ్ళ ఎదుట తరళితమయ్యే ఏదో క్రొత్త కళాలోకానికి బాటలు కడతాడు అతని కళాలోకం ఎంత యథార్థమంటే ప్రపంచమంతా తన్నెంత హేళనచేసినా, ఇనుప పాదాలతో తొట్టించినా తన దృష్టి మరలించడు. పసరు పేరిన పాత ప్రపంచం క్షాళనచేసి క్రొత్తలోకాల కాంతులు వెలయించి, నవ్యయుగ కళానిర్మాతలైన ఈ ముగ్గురి జీవితవిశేషాలు పర్యాలోకిద్దాము.

ముగ్గురిలో ఎడ్వోర్డు మేనెట్ తెలివైనవాడు. చిన్నతనంలోనే ఆశ్చర్యకరమైన కళాపాటవము గడించాడు. ఫ్రెంచి నవ్యకళా విలాసంలో ఉన్న వయ్యారం అంతా అతను సంతరించినదే! అనూచాన పద్ధతులన్నీ అతిక్రమించి విషయం, విధానంలో క్రొత్తదనం తెచ్చిపెట్టాడు. కళారీతుల్లోనే గాక వ్యక్తిజీవనంమీద కూడ అతని ప్రభావం బాగా పనిచేసింది. ఊహల్లో, తత్సంవిధానంలో చాల గడసరి. సాంప్రదాయంలో మాగిన కళాలోకంలో వెర్రులెత్తించాడు తన సరిక్రొత్త యదార్థ రచనలు విరజిమ్మి.

నిద్రపోతున్న సింహాన్ని జూలు లాగినట్లయింది. కళాలోకం గగ్గోలు పెట్టి అతనిమీద విరుచుకపడింది. సుతిమెత్తని అతని హృదయకుసుమం నలిమివేయబడింది. సుకుమారమైన తనువల్లి త్రెస్సిపోయింది.

సాంప్రదాయికమైన ఫ్రెంచి కళాభిరుచి ఏమంటే—చిత్రాల్లో దేవతలు గాని, దేవకన్యలు గాని ఉత్తమ నాయికలుగా తలుకొత్తాలి. కాని, మేనెట్ తన చిత్రాల్లో విక్టోరైను అనే తన మోడలును యథాతథంగా అనేక భంగిమల్లో—అందులో నాట్యకత్తెగా, వేశ్యమాతగా, వివస్త్రగానూ, వివిధాభరణ విలసితగానూ చిత్రించాడు.

విక్టోరైన్ మ్యూరెండ్ అనే చిన్నదాన్ని, మేనెట్, పట్టణంలో ఒక బహిరంగ ప్రాసాదాంగణంలో చూసి మోడలుగా తీసుకువచ్చి తన కళకేగాక హృదయానికే రాజ్ఞిగా చేసికొన్నాడు. ఆమె ఏమంత అందమైనది కాదు. ఎర్రని జుత్తు, పొట్టి మనిషి. ఏదో వింత ఆకర్షణ ఉండేది. ఆమెనే రవంత మార్చి సాంప్రదాయసిద్ధంగా ఏ అచ్చరగానో, అపరూపపు ఆశయంగానో చిత్రించుకుపోతే తగాదా ఉండేది కాదు. మేనెట్ తాను చూచినది గాని చిత్రించననే వ్రతం కలవాడు. దాంతో దవానలం చుట్టుకుంది.

దీనికితోడు కొన్ని చిత్రాల్లో చక్కని నిండు దిరీసులలో ఉన్న ఒకరిద్దరు మొగాళ్ళ సరసని విక్టోరైన్ను నగ్నంగా కూర్చున్నట్లు చిత్రించాడు. ఈ

విధంగా వస్త్రాలంకృతులైన పురుషుల సమక్షంలో వివస్త్రలైన అంగనలను చిత్రించడము అంతకుముందు లేకపోలేదు. సుప్రసిద్ధులైన టిటియాన్, పీటరుపాల్ రూబిన్సు మొదలైనవాళ్లు చాలా చిత్రాలు ఈ ధోరణిలో చిత్రించారు. అయితే, అందులో వారు వీనసు మొదలైన అచ్చర ముచ్చెకంటులవడముచేత బాధ లేకపోయింది. మరి, ఇక్కడ విక్టొరైనూ, ఫలానా ఫలానావాళ్ళ్యానాయెను. ఇందుకు ఫ్రెంచి నాగరక ప్రపంచము వికృతదంష్ట్రలు తీండ్రించింది.

మేనెట్ అడిగిందేమంటే—తనపూర్వీకులైన టిటియాన్, రూబెన్సుల కిచ్చిన అవకాశమే తనకూ ఇయ్యమని. అందుకు అతన్ని అనరాని మాటలని, అల్లరిచేసి, సంఘం ఉప్పు పుట్టకుండా చేసింది.

అంటే, ఆనాటి ఫ్రెంచి నైతిక జీవనము ఏమంత ఉన్నతమైనదని కాదు. ఫ్రెంచి నాగరకులు మోడలు స్టడీసుగాని, న్యూడు మోడల్సుగాని ఎరగరని కాదు. చిత్రకారుడు ఆ మోడల్సుతో ధర్మబద్ధమైన సంబంధము కలిగి ఉండటమే వ్యత్యయమయింది. మేనెట్ తాలూకు కళ, నీతికి సంబంధించిన నిజాయతీ అర్థంచేసికో లేకపోయింది.

మేనెట్ చిత్రాలు ప్రదర్శనాల్లో నిరాకరించి, దుష్టకళా విమర్శకులు అపరూపమైన అతని కళాజీవనంలో కత్తులుదూసి, నిప్పులు చెరిగారు. మళ్లా అతని చిత్రాలే ముప్పయ్యేళ్ళ తరువాత లూవరీ ఆర్టు గ్యాలరీలో ప్రదర్శించుకొని మురుసుకున్నారు.

మేనెట్‌ని, అతని మిత్రులని తిరస్కృత చిత్రాలన్నీ ఒకసారి ప్రత్యేకము ప్రదర్శించారు. అందులో ప్రసిద్ధుడైన క్లాడిమోనెట్ తాలూకు "ఇంప్రషన్సు" అనే ప్రకృతి-చిత్రం ఉంది. అది చూసి ప్రేక్షకులు ఆ గ్రూపునందరనూ "ఇంప్రషనిస్టులు" అని అవహేళన చేశారు. ఈ విధంగా "ఇంప్రషనిజము" అనేది కళాలోకంలో ఉద్భవిల్లి సుప్రతిష్ఠితమైంది. మేనెట్ ఈ యింప్రషనిస్టులకందరకు మొనగా నిలిచి దుష్టవిమర్శలకు ఆహుతి అయ్యాడు.

మేనెట్ తన చిత్రాల్లో అతిలోకమైన దివ్యసౌందర్యానుభూతులు కాక, తనచుట్టూ కళ్ళ ఎదట కనిపించే మానవజీవితంలో మిలమిలలాడే అందాన్నే అనంతకాలం నిలిచేలా చిత్రించాడు. ఆకాశపథాల నుంచి కళను నేలకు దింపి నిత్యజీవనవాటికలే కళానందన వనాలుగా వాసింపజేశాడు.

కృత్రిమమైన విషయగౌరవానికి తగ్గట్టు క్లాసికల్ చిత్రాల్లో వర్ణసమ్మోదాన్ని కప్పుతూ వ్యవహితమై వస్తూన్న కాలం మేలిముసుగు కూడా మేనెట్టే తొలగించాడు. ఇంప్రషనిజంలో వర్ణస్వచ్ఛత ఒక ప్రధానలక్షణం. బొమ్మలలో వెలుగునీడలు వర్ణాత్మకంగా ఊహించినవాడు మేనెట్. తన చిత్రాల్లో విషయం వెలుగే అనేవాడు. మేనెట్ చిత్రాల్లో రంగుల నవకమూ, ఊహల వాస్తవికత, రచనలో నాజూకుతనము తన వెనుక మూడుతరాలవాళ్ల చిత్రాలమీద నైల్యాసులు పులిమి తరువాత రెండు తరాల వారికి వెలుగు ఇచ్చినాయి.

ఏమయితేనేం, మేనెట్ బ్రతికున్నంత కాలమూ కళాలోకం పగబట్టిన కోడెత్రాచులా. అతని బొమ్మలకు మార్కెట్టు లేకపోయింది. సంఘం చేసిన గాయం కోలుకోనిదైంది. ప్రసిద్ధ సారస్వతికులు బాడిలీరు, జోలా, గయటేరు—వీళ్ళంతా కలుగజేసుకొని అండనిలిచినా మేనెట్ తన ఏభయ్యోయేటనే కళాదర్శాలకు బలి అయ్యాడు.

మేనెట్ తెచ్చిన ఇంప్రషనిజమువల్ల రెండు ముఖ్య విషయాలు జరిగినాయి. చిత్రిత విషయమైన వస్తువు ఉత్తమ, అధమ వివక్ష లేకుండా యధార్థ జీవితంలోంచి తీసుకోనడం, రచనలో కంటికి కనబడిన రంగులు, ఆకృతి స్వచ్ఛంగా, సహజంగా చిత్రించడం. కాని ఈ రెండూ మేధస్సుకు, కంటికి సంబంధించిన బాహ్య విషయాలే. మేనెట్ ప్రాధాన్యం ఇయ్యకపోయినా, అతని తరువాతవాళ్లు యీ విషయాల్లో శాస్త్రీయమైన పరిశోధనలు చేసి అనేక క్రొత్త సాంప్రదాయాలు సృష్టించారు. వర్ణాత్మకంగా ల్యూమినిజము, పోయింటలిజముతో బాటు బొమ్మకు జీవమైనభావము అప్రధానమై కేవల ప్రాదేశిక కల్పనలు క్యూబిజానికి, అరూపవాదానికి దారితీశాయి. మళ్లా చిత్రాల్లో జీవం, ఆవేగం, మానవతా విశ్వాసం నింపింది వినిసెంటు వేంగో అనే అతిలోక వ్యక్తి.

నిర్జీవమైన చిత్రంలో ఎంత కళాకౌశలం ఉంటే ఏమనే మనస్వి వేంగో. అమానుషమైన లోకం మానవతలో అకుంఠిత విశ్వాసమే అతని మతం. టాల్‌స్టాయి, డికెన్సు రచనవలె తన చిత్రాలకు నైతిక ప్రయోజనం ఉండాలనే ధార్మికవాది. తన్ను నిర్లక్ష్యంచేసిన ప్రేమకు ఒడలుకోసి ఇచ్చిన ప్రణయోన్మాది. అందుకనే అతని ప్రతి తూలికా విన్యాసంలోనూ జీవం మిలమిల లాడింది.

చాలా ఆలశ్యంగా చిత్రకళ వృత్తిగా అవలంబించాడు వేంగో. అతనితండ్రి ఒక మత ప్రచారకుడు. వేంగో అందమైనవాడు కాకపోబట్టి ఆ ప్రచారానికి పనికిరాలేదు. అయితే నేం, బైబులు తత్వం బాగా జీర్ణించుకున్నాడు. మొదట్లో ఒక బొమ్మల వర్తకునివద్ద తాబేదారుగా పనిచేశాడు. తన దగ్గిర బొమ్మలు కొంటూ ఎవరన్నా విలువలేని చిత్రాలు ఏరుతుంటే తన జీవిత సత్యాలైన పరమహంస సూక్తులు ఉపన్యసించేవాడు.

వేంగో జీవితమంతా అనాదృత ప్రేమ కలాపాలతో దుర్భరమైపోయింది. తన అధికారి కూతురు ఉర్సులాను ప్రేమించాడు. ఆ అమ్మాయి నడిచిన నేలకూడ అతి పవిత్రంగా చూసుకొనేవాడు. ఉర్సులా హృదయం లేకుండా అతని పవిత్ర ప్రేమని చులకనచేసి అవహేళన చేసింది. దాంతో వేంగో మత ప్రచారానికి దిగాడు. ఈ సందర్భంలో అతి నికృష్టమైన ప్రజానీకంతో అతనికి జోస్తి ఏర్పడింది. భగవన్మాయ ఏమో! ఈ పరిసరాల్లో వేంగో చిత్ర రచన ప్రారంభించాడు. ప్యారిసులో ఉన్న ఇతని అన్న థియో ఈ చిత్రాలు చూసి ఉప్పొంగిపోయాడు. అయినా, వేంగో అప్పుడే తన జీవితం చిత్రకళకు అంకితం చెయ్యలేదు. తన ప్రేయసి ఉర్సులా వద్దకు మళ్లా ప్రేమభిక్షకు వెళ్లాడు. ఆమె తిరస్కరించింది. ఇక బెల్జియము గనులలో పనివాళ్ళకు మత ప్రబోధము చెయ్యడానికి వెళ్లాడు. ఆ పామరులు వేంగోను తమలో ఒకడుగా చూసుకునేవారు. వాళ్లపిల్లలకు చదువు ముదుసళ్ళకు మతవిద్య చెప్పుతూ మానవసేవలో నిమగ్నమయ్యాడు వేంగో.

అక్కడ చిత్రించిన చిత్రాల్లో కొండల్ని కదలించే వేంగో తాలూకు మానవతా విశ్వాసం, జాతికి తనందియ్యబోయే జీవన సందేశచ్ఛాయలు నిండి ఉన్నాయి. ఆ రోజుల్లో అన్నగారైన థియోకు ఉత్తరాల్లో తన జీవితం సార్థకము చేసికొనే అవకాశం లభ్యమయిందనీ, సజీవమైన నెత్తురు, కండ మిలమిలలాడే పాటకజనంతో తన బ్రతుకు శృతికలిసిపోతోందనీ, సేవాపరంగా మహాశిల్పి అయిన క్రైస్తే తనకు ఆదర్శమని రాశాడు.

పచ్చని ప్రియురాలి ప్రేమకోసం తపించాడు. కాని ప్రేమ ఒక చిరునవ్వు రాల్చలేదు—ఏంటివర్పులో ఒక పతిత, వేంగోకు మోడలుగా ఉండటానికి వప్పుకుంది. "విషాదమూర్తి" గా ఆమెను చిత్రించి క్రింద యీ పంక్తులు రాశాడు. "ఏ స్త్రీ గాని ఒంటరిగా ఎందుకు ఉండవలసి వస్తుందో" అని. తిండికి మాడి అధమస్థమైన జనసముదాయంలో సర్వ నాశనమయే సమయంలో థియో తనవెంట ప్యారిసుకు తీసుకువెళ్లాడు వేంగోను.

ప్యారిసులో పిసారో, సీరట్ మొదలైన ఇంప్రెషనిస్టులతో కలిసి పనిచేశాడు. అతనికి జీవితం చాల పరిమితంగా ఉన్నదని తెలిసింది. ఫ్రాంసు దక్షిణ భాగంలో ఆర్లిస్‌కు వెళ్లి తన్ను మింగనున్న ప్రకృతిని లాలన ప్రారంభించాడు. థియోధర్మమా అని ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. అక్కడ ఉంటూ మూడు సంవత్సరాలు నిరంతరాయంగా వందలాది చిత్రాలు చిత్రించాడు. ఈ చిత్రాలమీదనే వేంగో ప్రతిష్ఠ అంతా నిలబడిఉంది. సూర్యుని వెచ్చన, దున్నిన పొలాల పరిమళాలు—ఈ మట్టిలో మళ్ళా పసిపాపలా ఆడుకోవాలనుకున్నాడు.

చుర్రుమనే ఎండలో ఆచ్ఛాదం లేకుండా ఎన్నో బొమ్మలు అప్పటికప్పుడు చిత్రించేవాడు. తన కాంతి కుటీరంలో ఉంటూ సూర్యోపాసన చేశాడు. కాని ఈ శాంతి అతని బ్రతుకులో జారిపోయే ఘడియలు వచ్చినాయి. పాల్ గాగిన్ అనే చిత్రకారుడు వేంగో యింట్లో వచ్చి బసచేశాడు. గాగిను వింతప్రకృతి గలవాడు. ఇతరులను హింసించి ఆనందించేవాడు. వేంగో చిత్రాలు విమర్శించి ఈసడించాడు. దగ్గిరఉన్న ఒక పడుపుటింటికి తార్చాడు వేంగోని. హృదయంలేని ఒక గయ్యాళి రాక్షసి వేంగోను చిలిపిగా అతని చెవి బహుమతి ఇయ్యమంది. వేంగో ఇంటికి వెళ్లి ఆలోచించాడు. అతని మతిపోయింది. ఆవేశంలో తన చెవి నిజంగానే కోసి

పార్శిలుకట్టి పంపించాడు. థియో వేంగోను తీసుక వెళ్ళి మానసిక చికిత్స చేయించాడు. వేంగో ఉన్మాద స్థితికి చాల చేరువలో ఉంటూనే చాలా చిత్రాలు చిత్రించాడు. చెవికట్టుతోనే తన రూపచిత్రం చిత్రించుకున్నాడు. అప్పటికీ అతని చేయీ, హృదయం ఎంత నిశితంగా ఉన్నదీ ఆ చిత్రంలో చూడవచ్చు.

ఒకరోజున వేంగోకు అంతా తేటతెల్లంగా కనిపించింది. పూర్తిగా మనస్సు చుక్కాని కోలుపోయింది. కడుపులో పిస్టలు పేల్చుకొని సంతోషంగా చచ్చిపోతున్నానని చెప్పి చచ్చిపోయాడు.

సామాన్యంగా ఇతర చిత్రకారులకు కేవలము సాధనకోసమైన మోడెల్సు వేంగోకు అతిలోకం అయిన ఆవేశం కలిగించేవి. పంటపొలాలు, ఎగిరే పిట్టలు, పొదలు అతనికి క్రీస్తు పుట్టుకవంటి పవిత్ర పౌరాణిక విషయాలంత మహావేశం కలిగించేవి.

వేంగో తన పరిసరాలను తీవ్రమైన ఆవేశంతో, ఆసక్తితో చిత్రించాడు. ఆర్లిస్సులో తనఇల్లు, పచ్చిక పొలాలు, పనకు రోజూవస్తునుంచి ముసియార్లల్లు తెచ్చే పోస్టుబంట్రోతు, అతని భార్యా, కొడుకుని అతి లోకం అయిన ఆసక్తితో చిత్రించాడు.

"జైలుగోడలమధ్య" అనే ఇతని చిత్రము చూస్తే హృదయం పిండి వేసినట్లవుతుంది. జైలుగోడల మధ్య ఖైదీల దుర్భర జీవితం కరుణామయంగా చిత్రించాడు. నిరాశాపూరితమైన పెద్దరాతిగోడల మధ్య చేతులు కట్టుకొని ఒకరి వెనుక ఒకరు వ్యాయామం కోసం తిరుగుతూ ఉంటారు ఖైదీలు. మానవ జీవితాన్నే చిత్రిస్తానని, తత్సాధనలో సంతోషంగా తన్నే ఆహుతి చేసుకొన్నాడు వేంగో.

కళ, మతమువలె, జనాన్ని చిన్న చిన్న సంఘములుగా కలిపితే, ఈ ప్రపంచమంతా ప్రతి ఒక్కడికి స్వర్గధామంగా అవాలనేది వేంగో ఆశయం. చాల వినమ్రుడై, సామాన్య మానవుడికోసం చిత్రాలు చిత్రించాడు. కాని అతని చిత్రాలిప్పుడు చాల డబ్బున్నవాళ్లు గాని కొనలేరు. అన్ని బొమ్మలూ ఎక్కడెక్కడున్నవీ పెద్దపెద్ద మ్యూజియములకు, కోటీశ్వరుల సొంత గ్యాలరీలకు సేకరించబడ్డాయి. కాని వేంగో చిత్రాలు బహిరంగ ప్రదర్శనం ఏర్పాటుచేస్తే ఎక్కడెక్కడనుంచో జనం గుంపులుగుంపులుగా వచ్చి అతని చిత్రాల్లో అభివ్యక్తమయ్యే మానవత సందర్శించుకు పోతారు.

ఇక సిజనే. ఇతను మేనెట్‌కన్న ఏడేళ్లు చిన్న, వేంగోకన్న పధ్నాలుగేళ్లు పెద్ద. అయినా వాళ్లందరికన్నా ఎక్కువ కాలం జీవించాడు. అరవైయ్యేడు సంవత్సరాలు. ఈ శతాబ్దారంభంలో ఆరేళ్లదాకా ఉన్నాడు. వేంగో ముగ్గురిలోకి తక్కువ కాలం బ్రతికాడు—ముప్ఫయ్యేడు సంవత్సరాలే!

సిజనే ఇంప్రెషనిస్టులతోనే తన చిత్రాలు ప్రదర్శించేవాడు. పిసారో, రినోయిర్ మోనెట్ మొదలైన వాళ్ళతో స్నేహంగా పనిచేశాడు. అయినా తన వ్యక్తిత్వము ప్రత్యేకము నిలుపుకున్నాడు. వర్ణ ప్రత్యేకమైన వాళ్ళ చిత్రణా విన్యాసాలతో చిక్కుకొనక కళలో శాశ్వతమైన స్థైర్యము కోసము ప్రయత్నాలు చేశాడు. ఇంప్రెషనిజములో ఉన్న అల్పత్వము గుర్తించి మళ్లా పూర్వపు చిత్రాల్లో ఉన్న బిగువు, తూకము నెలకొల్పి "పోస్టు-ఇంప్రెషనిజము"కు జనకుడయ్యాడు. అయితే సిజనే చిత్రాల్లో కనబడే బూడిదరంగు క్లాసిక్ చిత్రాల్లోని బూడిద బురఖా మాత్రం కాదు. అది అతని జన్మస్థానమైన దక్షిణ ఫ్రాంసుకు సహజమైనరంగు. ఇక - ఇంప్రెషనిస్టులందరూ ఉత్తర ఫ్రాంసుకు చెందినవాళ్ళే.

పాల్ సిజనే 1861 లో ప్యారిసుకు ఒక వర్ధిష్ణు చిత్రకారుడుగా వచ్చాడు. అతని ఈడు చిత్రకారులంతా చాల నాగరీకులు. దక్షిణఫ్రాంసునుంచివచ్చిన ఈ అనాగరీకుణ్ణి వట్టి సంస్కారంలేని నాటుసరుకని వేళాకోళం చేశారు. అయితే సిజనే ధైర్యము, పట్టుదల, తెలివితేటలూ కలవాడు. సుకుమారమైన మనస్సు. మొగమాటం ఎక్కువ. కాని ప్రత్యర్థులకు లొంగేరకం కాదు. ఏ విధమైన అడ్డంకులూ నిర్లక్ష్యం చెయ్యగల మానసిక స్థితి కలవాడు. అదృష్టవశాత్తు తండ్రి బ్యాంకరు అవటంవల్ల సిజనే తన ఉన్నతాదర్శాలను నిలబెట్టుకోకలిగాడు.

అయితేనేం, సిజనే ప్యారిసులో ఉన్న 35 ఏళ్ళూ కళాలోకం అతనికి స్థానంలేకుండా చేసింది. ప్యారిసు కళాసమితిల అధికారంలో ఉన్న సాంప్ర

దాయికవాదులు సిజనేకి సభ్యత్వం నిరాకరించారు. పది సంవత్సరాలు తలవంచుకొని ఒంటరిగా ఎవరితోనూ సంబంధం లేకుండానే చిత్రసాధన చేశాడు. సహజంగా అతని చిత్రాలు వర్ణాత్మకంగానే ఉండేవి. ఎప్పుడూ అల్పమైన ఊహ తెరుగడు. ప్యారిసులో తన్ను నీరసంగా చూసినా లక్ష్యం చెయ్యక తన దేశానికి పోయి మళ్ళీ మళ్ళీ చక్కని ప్రకృతిచిత్రాలు చిత్రించుకునేవాడు.

సిజనే ఒక సామాన్య కుటుంబంలో పిల్లను పెళ్లి చేసుకున్నాడు. ఆమె అంత తెలివైనది కాకపోయినా, సిజనే జీవితానికి వెన్నెముకగా ఉండి కళాలోకంలో వచ్చిన అనేక ఆఘాతాలను అతడు తట్టుకొనేటట్టు చేసింది. 1874 లో రినోయిర్, పిసార్రోలతో కలసి వాళ్ళు మొదటి చిత్రకళాప్రదర్శనం ఏర్పాటు చేసినప్పుడు సిజనే బొమ్మలనే ఎక్కువ దుయ్యబట్టుకున్నారు సాంప్రదాయవాదులు. ఆ దుష్టకళా విమర్శకులు సిజనేని భ్రష్టుపట్టిన అడవి మనిషి అని, కసాయివాడని నిందించారు. చిన్ననాటి స్నేహితుడు, సుప్రసిద్ధ సారస్వతేయుడు అయిన ఎమిలీజోలా, మరి కొందరు సన్నిహిత కళామిత్రులు అండకు రాబట్టి ఆ చిత్రవధ తట్టుకున్నాడు.

సిజనే తండ్రి నెలకు 12 పౌనులు ఎలవెన్సు ఇచ్చేవాడు. దాంతో సిజనే బొమ్మలు అమ్ముకోవలసిన అవసరం ఉండేదికాదు. అందుచేత ప్యారిసు కళావిమర్శకుల దౌష్ట్యాన్ని లక్ష్యపెట్టక ఎక్కువ కాలం తన జన్మభూమిలో ప్రకృతిని స్వేచ్ఛగా ఆరాధించుకునేవాడు. 1895 లో ఒక చిత్ర కళా ప్రదర్శనంలో తన చిత్రాలకు ప్రత్యేకం అన్యాయం జరిగింది. దాంతో శాశ్వతంగా ప్యారిసు వదలి తన ఎస్టేటులో మకాం పెట్టాడు.

తరువాత సిజనే పది సంవత్సరాలుమాత్రం జీవించాడు. ఈ పదేళ్లూ తన ఈజిలు ఆరుబైటనే పెట్టుకొని పనిచేశాడు. అంతకంతకు ఏకాంతము వరించాడు. ఎన్నో బొమ్మలు ధ్వంసం చేశాడు. బొమ్మ తయారవగానే స్టుడియోలోంచి అవతల పారేసేవాడు. తన పిల్లలకు ఆడుకునేందుకు ఇచ్చేవాడు. బొమ్మవేసేదాకానే గాని ఆ తరువాత ఏ పొదదగ్గిరో కూచుని వేసిన బొమ్మ ఆ పొదదగ్గిరే వదిలేసేవాడు. చాల బొమ్మలు అతనిభార్య ఏరి జాగర్తచేసింది.

ఈ శతాబ్దారంభంలో గాని సిజనే కృషి కళాలోకం గుర్తించలేదు. వాలర్డు అనే బొమ్మలవ్యాపారి ప్యారిసునుంచి సిజనేని వెతుక్కుంటూవచ్చి అతను చిత్రించిన ప్రతిచిత్రం కొనేయడం ప్రారంభించాడు. దాంతో ఆ ప్రాంతంలో పెద్ద సంచలనం కలిగింది. ఎక్కడనుంచో వచ్చి ఒక బుద్ధిలేనివాడు ఎందుకూ పనికిరాదనుకునే సిజనే బొమ్మలన్ని నిజంగా డబ్బిచ్చి కొంటున్నాడనే సంబరంతో ఎన్నో చిత్రాలు భూమిలో పాతుకుపోయినవి పెల్లగించి తెచ్చారు తన ఊళ్ళోవాళ్లు.

ఐక్స్ చిత్రకారుడు అప్పటికి ముసలివాడయి పోయాడు. తన్ను కళాలోకం అప్పటికి గుర్తించిందని సంతోషించాడు. కాని ఎంతోకాలం సిజనే ఆ తరువాత జీవించలేదు. ఒకరోజున వానలో తడుస్తూనే బొమ్మవేస్తుంటే జ్వరము తగిలి, దాంతో మరణించాడు.

వివిక్త కళాపథాన తనొక నిస్సహాయుడైన బాటసారినని అనేవాడు సిజనే. కాని అతని మార్గము రాజబాట అయింది. అనేకమైన ఎత్తుగడలు దిద్దుబాట్లతో మొత్తము ఒకచోట జేరిస్తే పూర్వపు చిత్రాల్లో ఉండే గొప్పతనమూ, ఆధునిక చిత్రాల్లో ఉండే నిర్మాణాత్మకమైన పరిణతి సిజనే చిత్రాల్లో ద్యోతమవుతాయి.

సిజనే చిత్రరచనా విధానము చాల విలక్షణమైనది. కొన్నివందల సిటింగులు తీసుకునేవాడు. అందుకనే అతనికి ఎవరూ మోడెల్సుగా కూర్చునేవారు కాదు. ప్రకృతి చిత్రాలు—ఎక్కువగా పళ్లు కాయలు, పూవులు చిత్రించాడు. కాని వాటిని చిత్రించినంత ఆవేశంతో ఏ చిత్రకారుడూ మనుష్యుల్ని చిత్రించిఉండడు. ఏ పడుచు చెక్కిళ్ళూ, సిజనే ఏపిల్ పళ్ళు చిత్రించినంత అనురాగంతో చిత్రించబడి ఉండవు.

నిజానికి సిజనేకి ఆడవాళ్ళంటే భయం. వాళ్ళు పిల్లులవంటి వాళ్ళని అనేవాడు. స్త్రీరూపం చిత్రించాలనే అంతరక్తితో పళ్ళూ, కాయలు, పువ్వులూ చిత్రించేవాడు. తన భార్య రూపచిత్రము, తన అభిమాన విమర్శకుడైన జఫ్రె చిత్రము సిజనే

రూపచిత్రములలో ప్రసిద్ధమైనవి. బొమ్మలవ్యాపారి వాలర్డ్ రూపచిత్రము వంద సిటింగులు తీసికొని చిత్రించాడు. అతని రూపచిత్రా లన్నిటిలోకీ గొప్పది స్వీయరూపచిత్రము. కొన్ని వేల సిటింగు లతో అతని ముఖము కరతలామలక మయింది. ఇది చూస్తే ఇతరులుకూడ కదలకుండా కూర్చుంటే ఎంత బాగా సిజనే చిత్రించగలడో తెలుస్తుంది. సిజనే ఏది చిత్రించినా, రచనాప్రాభవముతో స్థిరమైన విలువలు తన చిత్రాల్లో నిలుపుకున్నాడు. అందు కనే పికాసో మొదలైన ఆధునికులకు మార్గదర్శకు డయాడు.

ఈవిధంగా ఈ ముగ్గురు క్రితము శతాబ్దం ఉత్తరార్థంలో పాశ్చాత్యకళాలోకమును తారుమారు చేసి నవ్యయుగకళా వ్యవస్థాపకులయ్యారు.

# కల్పలతికలు

శ్రీ దోగిపర్తి వెంకటరమణ



ఏకలగీతికామధుర హృన్నినదాశ్రయ జీవవత్ మధు
శ్రీకలమై నిసర్గతకు—చీకటి వాకిట నిండిపోయి, య
శ్రాకట నీయుషఃకలల రాపిడులుం దొరలింప బడ్డవో ?
లోకవిలోకనమ్ము నవరూపక ప్రాపకమై విదల్చెడిన్

నీల శరన్నిశావశఘనీభవ శారద మేఘమాల నీ
రాలస నిద్ర ముద్రల విహాయసరేఖల సాగుస్వేచ్ఛ రా
గాలసరాగచంద్రికల కాంతిలి శ్యామల మోహనాభ్రవ
ర్ణాలకు దారులిచ్చి కరుణా కిరణాంకితమై తరించెడిన్

ఈ వీచీ పవనాంకురశ్రమలకేయే సిడలందో ? ప్రశాం
తావృత్తుల్ పరువెత్తిపోవు బ్రతుకుందార్ఢ్యంపు భారాల; జీ
వావేగాల సరాగ సాగర పతాకాంతస్థలం దేలి, యా
ప్రావృణ్ణీరద కేల గేలి మధుజీవశ్రీ ప్రవాసించుచున్

విసవిసరేగు యౌవనప్రవృత్తి నశాశ్వత కాలకంఠపుం
గొసల వసంతరేఖ వనకుంజ గృహాల విలాసలాలసం
పుసరవి సోగరాగముల పూరణగా నవమంగళంపు సాం
ధ్యసమయమై ప్రపంచమున దర్శనభాగ్య పవిత్రమాయెడిన్

సడలిన తామసీ హృదయసంధుల సాగిన శ్రీవసంతపుం
గడలు మధుస్రవంతికల కాల్వలవారి అనంతగాన సం
దడుల మహాంతరిక్షతల ధామనిధానము లంటి రాగపుం
జడుల పసందులం బొదలి శాంతనిశాంత సమాంత మాయెడిన్

# నీటిచుక్క

శ్రీ మంథా వెంకటరమణరావు

ఔను. ఆమెవి అరమోడ్పుకన్నులు. ఆశ ఆ రెప్పల ప్రతి వంపులోనూ ప్రతిబింబిస్తోంది. నిరీక్షణ ఆమె కాటుకకన్నుల అంచులమీద చిందు లాడుతోంది. దేనికోసమో వెదుకసాగాయా కళ్లు.

దూరంగా చూస్తున్నాయవి. ఎంతదూరం? ఏమో? ఆ కొండలుదాటి ఇంకా దూరంగా—కాదు ఇంకా దూరదృష్టుందా కళ్ళకి—ఆ కొండలు దాటాకా బయలు ప్రదేశం. తిరుగకొండలు, సెల యేళ్ళు, నదులు, సముద్రాలు, ఎడారులు ఇంకా ఎన్నెన్నో వాటి నన్నిటినీ చూస్తున్నాయో యేమో!

అస్తమిస్తున్న సూర్యుడికాంతి ఆమె కనుకొలకులలో ప్రతిబింబించింది. ఎంత ఓర్మి ఆ కళ్లకి. జేగురుపూసుకున్నట్టున్నాయా రెప్పలు—ఔను— భూమిలోకి పాకుకుపోయే ఎఱ్ఱటిబింబం వాటి దృష్టి నాకర్షించింది. ఎఱ్ఱదనంలో అంత అందముందా? ఎఱ్ఱగా ఉండేదంటని చూస్తే భయమేస్తుందే! కాగ పోసిన ఇనుములా ఉండే ఆ బింబం ఆ కళ్ళనెందు కాకర్షిస్తోంది? ఆ బింబంలో దూరుదామని ఉందేమో వాటికి—దూరితే కాలిపోవూ? అది నిప్పుచింతని మేష్టారు చెప్పారే. దానికన్న ఎఱ్ఱగా ఉన్నట్టు న్నాయా కళ్ళు—కాలకపోవచ్చు. అంత శ్రమపడి అక్కడికి వెళ్లటంలో వాటి ఉద్దేశం? ప్రపంచా న్నంతా ఒక్కసారిగా కలియచూదామని ఆశేమో. ఎంత ఆశ వాటికి! ఆశించటంలో తప్పేముంది? ఎంతమందలా ఆశించటంలేదు అసాధ్యమైన వాటి కోసం?

ఆ రెప్పలు కలుసుకొన్నాయి ఒక్కక్షణం— ఊహించుకొని తృప్తిపడుతున్నాయవి—పాపం! ఏంచేస్తాయి? అలాటి కోరికలు కోరుకుంటే ఎక్కడన్నా ఫలిస్తాయా?

రెప్పలువిడ్డాయి. మునుపటిలా లేవు. ఏదో మార్పొచ్చింది వాటిలో—సూర్యుడి ఒక ఎర్రటి కిరణం ఆమె కుడికను కొలకులో మెరసే నీటిచుక్క లోకి దూసుకుపోతోంది. మణిలా మెరసిపోతోందా చుక్క. రెండో కన్ను రెమ్మగిలింది. అంతే. వింతగా ఉంది!

బింబం పూర్తిగా పాతుకపోయింది.

ఒక నిట్టూర్పు విడిచి బరువైన శరీరాన్ని తిప్పిం దామె. తలలో నెరసిన వెంట్రుకలు వెండి తీవల్లా మెరుస్తున్నాయి—కాని అమ్మకన్నా చిన్నగా కన్పిస్తోంది. అమ్మకన్నా ఎవరైనా చిన్నంటే నాకు చిన్నతనం. నే నొప్పుగోను.

తన్ను పరీక్షగా చూస్తున్న నన్ను చూసి చిరు నవ్వు నవ్వింది. రమ్మని చేసౌజ్ఞచేసింది. నాకా శ్చర్యం వేసింది. ఆవిడతో అంతగా నే నెప్పుడూ మాట్లాడలేదే. ఒకసారి కామోసువీధిలోకి ఐస్ క్రీమ్ తెస్తే కొని వీధిలో ఆడుకొంటున్న పిల్లలందరికీ పంచింది—ఆ గుంపులో నే నున్నాను. నా కందిస్తూ బుగ్గమీద మెల్లగా కొట్టి ముద్దుపెట్టుకుంది. నాకు చాలా సిగ్గేసింది— మరోసారి బడినుం డొస్తూఉంటే పిలచింది. నా పే రడిగింది. కొత్తవాళ్ళకి నా పేరు చెప్పడం నాకిష్టం లేదు. ఐనా నాకోసారి ఐస్ క్రీమ్ ఇచ్చింది కాబట్టి తప్పదన్నట్టు నసుగుతూ చెప్పేను. చెయ్యి పట్టుకుని ఇంట్లోకి తీసుకెళ్ళింది. చాలా బాగుందా ఇల్లు. ఎదు రుగా ఉన్న ఆ ఇంటిని అన్నిళ్లూ చూసినట్టు

చూశాను. కాని లోపల అంత అందంగా ఉంటుందని ఎప్పుడూ అనుకోలేదు. మెరుస్తున్న కఱ్ఱటేబిలు ముందు కుర్చీలో కూర్చోబెట్టింది. ఆవిడేమీ మాటాడలేదు కాని నోరూరేటట్టు తియ్యతియ్యని సామానులన్నీ తెప్పించిందొక పనిమనిషి. "తిను. నీ కోసమే"—అందావిడ. నాకు సిగ్గు, సిగ్గు తెప్పించినందుకు కోపమూ, వచ్చేయి. ముఖం ఎర్ర చేసుకొని మౌనంగా కూర్చున్నాను. "అలా అయితే నే నాకు కోపమొస్తుంది" అంటూ నా అనుమతి లేకుండానే ప్లేటునుంచి-ఒకటి ఏమిటో తెలీదు—తీసి నానోటికందించింది. ఉమ్మేద్దామనుకున్నాను. కాని నా నాలుక ఆ పని చేయనీయలేదు. చాలా రుచిగా ఉందా పదార్థం. మంచులా నోట్లో కరగిపోయింది. అలాంటివి అమ్మ తన జన్మలో చేసిందా అనిపించింది-సిగ్గు పడుతూనే ప్లేట్లన్నీ ఖాళీచేసేను. వీలున్నప్పుడల్లా నన్ను రమ్మని రోడ్డువరకు దిగబెట్టింది. ఆ రాత్రి అమ్మతో సంగతి చెప్పేను. ఎందుకో మా అమ్మ ముఖాన నెత్తురు లేకుండాపోయింది. "రామం రేపట్నుంచీ ఈ ఇంట్లో భోంచెయ్యకు" అంది. పెద్ద రాయి పడ్డట్టయింది. "ఏమమ్మా?" అన్నాను. "ఇంకో ప్రశ్న వెయ్యకు. ఈ ఇంటికీ నీకూ సంమ్మంధం లేదు" అంది. నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "నేనేం తప్పు చేశానే" అన్నాను. మరి మాటాడలేదమ్మ. కోపం తగ్గాక మర్నాడుదయం అంది. "రెండో ఫారం చదువుతున్నా నీకు లోకజ్ఞానం సున్నా. నీతో ఎలా ఏడవడమో నాకు తెలియకుండా ఉంది. నువ్వు చేసిన పనేమిటో తెలుసా. పోనీ నన్నడగొద్దూ. ఆ ముండకైనా బుద్ధుండొద్దూ-తల్లిదండ్రులకు తెలియకుండా పిల్లల్నిలాగేనా పాడు చెయ్యటం?"—నాకేమీ అర్థం కాలేదు. "ఏమే అమ్మా ఎందుకలా ఆవిణ్ణి తిడతావే?" అన్నాను. దానికి జబాబుగా నా వీపుమీద గట్టిగా ఆవిడచేతులు పడ్డాయి. "వెధవా దాని మాయల్లో పడ్డావూ. నేనెలా చచ్చేది. తల్లినీ పిల్లనీ ఇలాగేనా వేరు చెయడం? ఆ రంకులాడికి జ్ఞానముండొద్దూ ఇలాగే మెల్లిగా మాయలుపన్ని దానివేపు లాక్కోవడం" అంటూ పెంకు లెగిరేటట్టు నోరుపెట్టింది. మరో ప్రశ్న వెయ్యడానికి నా ఒళ్లు ఒప్పుగోలేదు.

అది అంతకుముందు జరిగిన విషయం.

నా మౌనం చూసి మరోసారి సౌంజ్ఞ చేసిందామె రమ్మన్నట్టుగా. నేను సందిగ్ధంలో పడ్డాను.

పాపం రెండుసార్లు చెయ్యూపింది రమ్మని. నాతో ఏదో ముఖ్యమైన పనుండకపోతే ఎందుకు రమ్మంటుంది? నే వెళ్లకపోవడం వల్లఆమె కేమన్నా నష్టం కలుగుతుందేమొ. అలా బ్రతిమాలుతూ ఉంటే వెళ్ళకపోడం బాగుంటుందా. ఆవిడ ఏడుపు జ్ఞాపకమొచ్చింది. పాపం. ఏడ్చింది సూర్యణ్ణి చూస్తూ. ఉత్తినే ఏడుస్తుందా - ఎందుకేడ్చిందో మామాష్టారు కొడితే నే నేడుస్తాను. అంత పెద్దావిణ్ణెవరన్నా కొడతారా? కొడితే కొట్టొచ్చు - నాన్న చెప్పుడన్నా కోపమొస్తే అమ్మని......నాకే బలముంటే నాన్నని గిరగిర తిప్పి గాల్లో ఎగరేసుండేవాణ్ణి. నాన్నలాంటి వాళ్లెవ్వరూ ఆవిడి ఇంట్లో లేరే. స్నేహితులు ఒచ్చిపోతూంటారు. అందరూ నవ్వుతూ ఆమెతో మాటాడతారు. కొత్త కొత్త వాళ్ళొచ్చి నమస్కారాలు పెడుతూ ఉంటారు. వాళ్లెప్పుడన్నా...? ఛా! ఛా! మరి? వెళితే బాగుణ్ణు. ఆవిడ మంచిదికాదని అమ్మంది రెణ్ణెల్ల కింద. ఏవేవో తిట్టింది. మంచావిడ కాపోతే రోజూ ఎందుకలా ఏడుస్తుంది మరి? అమ్మెప్పుడూ అబద్ధం చెప్పదే. అయినా ఆవిడదగ్గరకెళ్తే బాగుణ్ణు!

ఇంకా చూస్తోందామె. వెళ్ళాలని నాకు బుద్ధి పుట్టింది. కాని అమ్మజ్ఞాపక మొచ్చింది.

అమ్మకి తెలిస్తే ప్రాణాలు తీసేదూ - రోజూ నేను స్కూలుకి వెళ్లినప్పుడూ,వచ్చినపుడూ బయట నిల్చుంటుందే.

నిశ్చయించేను వెళ్ళకూడదని. రానన్నట్టుగా తలూపేను. ఒక్క అరనిముషం తీక్షణంగా చూసిందామె నాకళ్ళలోకి. నా ఒళ్ళంతా వణికింది. మంచావిడకాదేమో అనిపించింది. కాక నే ఒస్తానని అలా చూస్తోందేమో. మరోమాటు తలూపాను అసమ్మతిసూచకంగా. నన్ను చూసి వింతగానవ్వి లోనికి పోయింది. నాపిరికితనాన్ని చూసి నవ్విందేమో అనిపించింది. నాకు అవమానంగా తోచింది.

నన్ను పిరికిపంద కిందకట్టిందేం, నా సంగతి తెలీదు కామోసు, ఐతే మరి పిలిచేసరికి ఎందుకు వెళ్ళలేదు? అమ్మ......అమ్మదగ్గర భయం లేకపోతే ఎలా? ఎవరిదగ్గరన్నా బాధలేదు కాని—ఎలా

నవ్వింది నన్ను చూసి. ఛీ! ఎవరో పై ఆడది నన్ను చూసి నవ్వడమా—పై ఆడదా? ఒక్కసారి ఐస్‌క్రీమిచ్చింది. మరోసారి మిఠాయిచ్చింది. మంచి కబుర్లు చెప్పింది—పై ఆడ దెలాగయింది?

దీనికంతకీ కారణం అమ్మ అని నిర్ధారణపరచుకున్నాను. అమ్మ వెళ్ళనీపోవటంవల్లే ఆ అవమానం నాకు జరిగిందనిపించింది.

ఆ రాత్రి అమ్మని సమీపించేను. కంచాలు కడుగుతోంది. "అమ్మా" అన్నాను. వెనక్కి తిరిగి చూసింది ప్రశ్నార్థకంగా. "నీకు కోపం రాకపోతే" అని నసిగాను. "ఏమిట్రా" అంది విసుగ్గా. జంకు వేసింది. కాని బరువొదుల్చుకొన్నాను. "మరే. ఆవిడెందుకు మంచిది కాదమ్మా" అని! "ఎవర్రా" అంది ఆశ్చర్యంగా నా ముఖంలోకి చూస్తూ—"ఆవిడే నే. ఆ వేళ నాకు మిఠాయిచ్చింది". వింతగా చూసింది నా వేపు. "నీకు మతికాని పోతోందేమిట్రా? అదేదో మందు పెట్టినట్టుంది. ఇన్నాళ్లూ లేనిది ఇవాళ దానూసెందుకొచ్చింది?" రాబోతున్నది తెలిసింది. కాని ధైర్యం చేసేను. "రోజూ సాయంకాలం ఎందుకో ఏడుస్తుందే. మంచిది కాపోతే ఏడుస్తుందే" అన్నాను. కోపంలో వ్యవధి లేకుండా అందమ్మ "తిన్నగా తిని కూర్చుండలేక, ఊళ్ళో ఉన్న రంకుమొగుళ్ళు చాలక. ఎవడిచ్చున్నాడో ఆస్థి. ఇట్లా ఒదిలిచచ్చేడు. ఇదిలా కులుకుతోంది. చచ్చేకాలమొచ్చినా...." ఆగిపోయిందొక్కసారి ముఖం ఎర్రది చేసుకుని తప్పుచేసిన దానిలా. "ఏంటంటున్నావే" అన్నాను. "వెళ్ళి పడుకో" అని కసిరింది. నాలో ధైర్యంపోయింది. అంతే ఆవిడసంగ తెప్పుడూ అమ్మదగ్గ రెత్తలేదు, మరి.

ఆ మరునాటి సాయంకాలం మాయింటి సావిట్లో నిలబడి చూశాను. రోజూలానే ఆ ఆవరణలో నిలబడి అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూస్తోందామె. కళ్లు మూసుగొని విప్పింది సంతృప్తిగా. కుడి కను కొలకులో నీటిచుక్క మణిలా మెరిసింది. సూర్యు డస్తమించేడు. నిట్టూర్చి తిరిగిందామె. నన్ను చూసింది. రమ్మని సౌంజ్ఞ చేస్తుందనుకున్నాను. విచారపు ఒక చిరునవ్వుతో చాలించిందామె. నా ఆశ్చర్యానికి మేరలేకపోయింది. ఎందుకు పిలవలేదివాళ, కోపంకానొస్తే నా వేపు చూసి నవ్వుతుందా? ఎంతబాధ ఇమిడుందా నవ్వులో. కళ్లెంత నీరసంగా ఉన్నాయి. నే వెళ్ళలేదని బాధపడుతోందేమొ. అమ్మ వెళ్లనివ్వటంలేదని తెలుసునేమొ—తెలిసైన వాళ్లకి చెప్పఖర్లేకుండానే తెలుస్తాయని విన్నాను. అమ్మమీద కోప మొచ్చి ఉంటుంది. కాని—రావాలి. నన్ను వెళ్ళనిస్తే ఏంపోయింది అమ్మకి, ఆవిడిలా ఏడుస్తూ ఉంటే? అమ్మది జాలిగుండె కాదు. నాన్నోసారి రక్తాలొచ్చేటట్టు నన్ను కొడుతూ ఉంటే ఒద్దనన్నా చెప్పింది కాదు. నాన్న దగ్గర భయమేమొ. అయి ఉంటుంది, అందుకే నన్ను వెళ్ళనివ్వటంలేదు. నాన్న దీనికంతకీ కారణం.

నాన్నమీద కోపమొచ్చింది నాకు.

ఆవిడంటే నాన్న కెందుకు మరిష్టంలేదు? ఆవిడింటికి రానివ్వలేదేమొ. మంచిబట్టలు వేసుకొని అంతా వెళ్తూ ఉంటారు. నాన్నకి మంచిబట్టలు లేవు. అక్కడికి వెళ్ళడానికి అంతా మంచిబట్టలు వేసుకుంటారని ఆవిడమీద కోపం. మంచిబట్టలు వేసుకుంటే ఏంపోయింది. అలాంటి బట్టల్లో ఎంతబాగుంటారు! అందుకే ఆవిడ బాగుంటుంది. అమ్మకన్న చిన్నావిడలాగుంటుంది. అన్ని మంచిబట్టలూ, అంతపెద్దిల్లూ, తినడానికి మంచి తీపివస్తువులూ ఉంటూఉంటే ఆవిడెందుకలా ఏడుస్తుందా అనిపించింది. పాపం. ఒక్కసారివెళ్తే, వెళ్లాలనిపించింది. వెళ్లి ఆవిడ ఏడుపుకి కారణం అడగాలనిపించింది. కాని అమ్మకి తెలీకుండా ఎలా వెళ్ళడం. లాభంలేనిపని.

ఎర్రటి కాంతిపోయింది. చీకటిపడింది.

ఆవిడవస్తూ ఉండేది రోజూ ఆవరణలోకి. చూస్తూ ఉండేది సూర్యుణ్ణి. నీటిచుక్క మెరుస్తూ ఉండేదామె కంటి కొలకులో. ఆమె విషాదపు నవ్వు నాకు దక్కేది. వెళ్లాలని బుద్ధిపుట్టేది నాకు. కాని. ఎలా?

అకస్మాత్తుగా ఒకనాడు నాకు ఆశ్చర్యం, ఆశాభంగం ఆత్రుత కలిగాయి. ఆమె ఆవరణలోకి రావటం మానేసింది. అరమోడ్పు కన్నులు, కను కొలకులో నీటిచుక్క, విషాదపు నవ్వు నాకు లేకపోయాయి. ఆశతో కూడిన ఆ కన్నుల దృష్టి పడకుండా బింబం అంతరించిపోయింది. సమ్మెటపోటు

తగిలినట్టయింది నాగుండెకి, ఆమెరాక కాలకృత్యంగా మారిందనుకున్న నా భావనకి ఆదెబ్బ. ఆవిడ రాక ఒక తప్పిపోని నిజంగా ఏర్పడిందినాకు. అస్తమించే సూర్యుడు, ఆమె కొలనులోని నీటిచుక్క రెండూ రెండు నిజాలు నాకు. ఒకనాడా దృశ్యం లేకపోతే నామనసెంత కలవరపడతుందని ఊహించనైనా లేదు నేను.

ఏమిటి కారణం? ఆమె రాకపోవడానికి? ఈ ప్రశ్న నన్ను ప్రతి నిముషం బాధించసాగింది. విరమించుకుందేమో తన ఉద్యమం. చూసేటి అవసరం తీరిందేమో ఐతే నిన్నకూడ విచారంగావుంది. నేను వెళ్ళలేదని కోపమొచ్చిందేమో అనిపించింది అయ్యుంటుంది. ఎన్నాళ్లనుంచో నన్ను రమ్మన్నట్టుగా నవ్వుతూన్నపుడు ఒక్కనాడన్నా ఆమె ఆశని తీర్చలేకపోయాను. కోపం తెచ్చుకోవటంలో ఆమెది తప్పేముంది? వెళ్ళి దీనికంతకీ కారణమేమిటో అడగాలనిపించింది. కోపం తెచ్చుగోవద్దని చెప్పాలి. దీనికంతకీ తప్పంతా అమ్మదే. కాదు నాన్నదే. ఇంతకీ వెళ్ళడమెలా? లాభంలేదు. నాకళ్లు చెమ్మగిల్లేయి. నేనేం చెయ్యగలను! నా చేతుల్లో ఏముంది?

రోజులు గడుస్తున్నాయి. ఒకటి, రెండు, మూడు అలా వారం రోజులు గడిచాయి. సావిట్లో నిల్చొని ఎదురు చూసేవాణ్ణి ఆవరణలో ఆమెకోసం ప్రతిరోజు సాయంకాలాన్న. ఆమె జాడేలేదు. నిరాశ, ఆతృత ఎక్కువవ జొచ్చాయి నాలో రోజు రోజుకీ. వారం రోజు లయేసరికి నాలో సహనం తగ్గింది. ఆతృతపట్టలేకపోయాను. ఆమె రాకపోవడానికేదో తీవ్రమైన కారణం ఉండుండాలని తోచింది. ఎవరడ్డొచ్చినా సరే ఆమెను కలుసుగోవాలి. కొడుతుందమ్మ—నాన్నకూడాను, కొట్టనీ. వెళ్తాను. వెళ్లితీరుతాను. ఏ మొచ్చిందో ఆమెకి. ఏం బాధపడుతుందో.

నిశ్చయించేను. కాని నిశ్చయానికి వచ్చిన రెండుదినాలవరకూ కావలసిన ధైర్యం చిక్కలేదు. ఆఖరికి తెగించేను.

కాలేబింబం కనుపించలేదు. జేగురురంగు. తరువాత చీకటి.

నాన్నింట్లోలేరు. అమ్మ పెరట్లో వంటచేసుకుంటోంది. చడిచెయ్యకుండా యిల్లు దాటేను. మా యిల్లు వదలటం ఆమె ఇంటావరణ చేరటం ఒకేసారి జరిగాయి. కుక్క మొరిగింది. కుక్కలంటే నాకు భయమే. కాని అరచేకుక్క కరవదంటారు. ఓ రెండు సార్లు అరచి ఊరుకుంటుంది. గదిలోని దీపపు కాంతి అద్దపుతలుపులలోంచి స్పష్టమౌతోంది.

"ఎవరది" అని లోనుండి స్త్రీకంఠం ప్రశ్నించింది. ఆమే ఐఉంటుందని నిశ్చయించుకున్నాను. ఆ కంఠం ప్రశ్నిస్తూ దగ్గరగా వచ్చింది. కాదు. ఈ రూపం లావుగాలేదు. ఆమెకాదు. నన్ను సమీపించిందా రూపం. నాకు పట్టరాని కోపమొచ్చింది. మొదటే ఒక ఆశాభంగం. వెళ్లివెళ్లిగానే నవ్వుతూ ఆమె కానొస్తుం దనుకున్నాను. దగ్గరగా తీసుగొని బుగ్గలమీద వేళ్ళతో కొడుతూ మంచిమంచి కబుర్లు చల్లగా చెప్తుందనుకున్నాను. కాని ఎదురుగా ఆ రోజు మిఠాయి తెచ్చిన పనిమనిషొచ్చింది. చెడ్డ శకునం. ఇంతా తెగించి రావడం దీన్ని చూడ్డానికేనా అనిపించింది. అమ్మమాట వినకండా దెబ్బలు తినడానికూడా సిద్ధపడొచ్చానే ఎవరూ అని ప్రశ్నిస్తూ ఎదురు రావడానికిదెవర్తె. ఏం చేస్తే చెయ్యనీ జవాబివ్వకూడదని నిశ్చయించుకున్నాను. దాని గొంతుక బొంగురుపోతేపోనీ. "ఎవరది" తిరుగ ప్రశ్నించింది. నేను మాట్లాడ్లేదు. "అడుగుతే జవాబు చెప్పకుండా ఎవరది" అంది గట్టిగా. నేను చలించలేదు. దగ్గరగా ముఖం పెట్టి పరిశీలనగా చూసింది. ఎంత సిగ్గులేదు. యజమానురాలి మర్యాదా తీసేస్తోంది. నేనయింది. సరిపోయింది. ఎవరన్నా కొత్తవాళ్లయితే? ముఖాన్ని పిడికిలితో గుద్దుదామనిపించింది. మరింత దగ్గరగా ముఖం తెచ్చిచూసింది. ముఖం తిప్పుగున్నాన్నేను. ఒక్క కేక వేసింది. "అమ్మా చిన్నబాబుగారొచ్చారమ్మా" అని. కేక వేస్తూనే నా చేతిని పట్టుగొని చీపురునీడ్చినట్టు గొరగొరా లాక్కొనిపోయిం దింట్లోకి. ఎంత సాహసం! నా ఒంటిమీద చెయ్యివెయ్యడానికి దానికున్న హక్కేమిటి? మనిషనుకుందా ఆటవస్తువనుకుందా నన్ను. దెబ్బనొప్పిగా కూడా ఉంది. నా కెంతో అవమానం జరిగినట్టుగా బాధపడ్డాను. పోగాలమొస్తే ఎరికైనా అలాటి బుద్ధులే పుడతాయి. ఈ

నిముషం వీధిలోకి గెంటిం చేస్తాను ఆమెతో చెప్పి. ఏమిటనుకుందో కాని! "అమ్మా చిన్నబాబుగా రొచ్చారమ్మా" అంది పెంకు లెగిరేటట్టు మరోసారి, దీపం వెలిగే గదిలోకి నన్ను లాక్కొని వెళ్తూ.

గది ప్రవేశించేసరికి నాకోపం హరించిపోయింది. ఆ గదిలోకి నేనెప్పుడూ వెళ్ళే అవకాశం కలగలేదు. అంత అందమైన గది నాజన్మలో చూడ ననిపించింది. అద్దాల్లా ఉన్నాయి గోడలు. నేలనుంచి మూడడుగుల ఎత్తున చుట్టూ పాలరాయి ఆ గోడలకి. గదినిండా మెత్తని తివాసీ. నాలుగు దిక్కులా నిలువుటద్దాలు. పెద్ద పెద్ద వార్నీసు బొమ్మలు. గోడలకీ, ద్వారాలకీ, కిటికీలకీ రంగు రంగుల సిల్కు గుడ్డలు. ఎంత బాగుందా గది. అడుగులు మెల్లగా వేసుకుంటూ ప్రవేశించేను. నా మట్టి కాళ్ళు పడి తివాసీ పాడవుతుందేమోనని భయం వేసింది. స్వర్గం లాగుంది. ఈ ఆలోచనల్లో పడి ఆమె మాటే మరిచాను. నా ఎదురుగా ఉన్న పెద్ద మంచాన్ని కూడా చూడలేదు. ఎంత పెద్ద మంచం! ఎలా మెరుస్తోంది! చుట్టూ తెల్లటి జల్లీగుడ్డ. బాగుంది. మా అమ్మ, నల్లులమంచం జ్ఞాపకమొచ్చాయి. ఎప్పుడూ నిద్రపట్టదని ఫిర్యాదే అమ్మ. ఆ పొట్టి, కుక్కి, నల్లులమంచంమీద ఎలా పడుతుంది? చిన్న మూలుగొకటి నా ఆలోచనల కంతరాయం కలిగించింది. మరోసారి వినవచ్చింది మూలుగు. ఈసారి నేను పరధ్యానంలో పడలేదు. ఆ మూలుగు ఆవిడదే. ఆ మంచంనుంచి వస్తోంది. వింతనిపించింది. ఆమెక్కాని జ్వరం రాలేదుకద! పనిమనిషి నా చెయ్యి వదల్లేదు, గది చూస్తున్నంతసేపూ. రెండవసారి మూలుగు విన్నాక ఇందాకటిలాగే రెక్క పట్టుకొని మంచందగ్గరకు లాగుకపోయింది. "ఇదిగో నమ్మా—చిన్నబాబు గారు" అంటూ. ఎంత హక్కు అధికారం ఉన్నట్టు ప్రవర్తిస్తోంది. ఇంటికి పరుగెత్తి పారిపోతే నన్నడ్డుపెట్టేవా ళ్లెవరనిపించింది. దా నధికారం సంగతప్పుడు తేల్తుంది. మంచంమ్మీదేదో చలనం కలిగింది. ఒక ఒళ్ళు కదిలింది. వెంటనే పోల్చాను. ఆవిడదే ఆ ఒళ్లు. మంచి వాసన వస్తోంది. కప్పుకున్న దుప్పటినుంచి. ఒకసారి నేను దొంగిలించితెచ్చిన ఆకు సంపెంగకు కూడ అంతవాసన లేదు. ముఖంపైనున్న కప్పు తొలగించింది పనిమనిషి. అనుకున్నట్టే అయింది. ఆమే! ఎంత నీరసంగా ఉందా ముఖం కళ్ళు వాడిపోయాయి. మూతలుపడి విశ్రాంతి తీసుకుంటున్నట్టున్నా యవి. ఇదివరకు నే చూసిన వాటికన్న ఎక్కువగా ఉన్నాయి నెరసిన వెండ్రుక లామె తలపైన. అలా పడుకున్న ఆమెను చూస్తే నాకు భయమేసింది. తేలిగ్గా ఆమె తల నిమురుతూ లేపింది దాసీది—"అమ్మా చిన్నబాబుగా రొచ్చారమ్మా" అంటూ. విసుపన్నది లేకుండా రోజూ సూర్యుణ్ణి చూడ్డంవల్లే బరువెక్కుంటూ యామె కళ్లు. ఎలా మూతలు పడ్డాయి. ఇంత వేగం అవి విడతాయా అనిపించింది. నా రాకకి క్షీణంగా అవి తెరచుకున్నాయి. ఓర్మి, ఔదార్యం ఆ కళ్ళల్లో ఉట్టిపడుతున్నాయి. పరిశీలనగా చూశా యవి నన్ను. "చిన్న బాబు గారమ్మా" అంది దాసీది అమాంతంగా నన్నెత్తి మంచం మీద కుదేస్తూ. దానిమీద కోపమొచ్చి నా ఆలోచనకి వ్యవధిలేకపోయింది. సంతృప్తితో చూస్తున్నా యామె కళ్ళు. ఆమె పాలిపోయిన పెదాలమీద ఒక విచారపు చిరునవ్వు వెలిసింది. ఎందుకలా ఉందామె. సంజవేళ పడుకోక్కరాదనే అమ్మమాట జ్ఞాపకమొచ్చింది. జ్వరమొస్తేనే అలా పడుక్కుంటాను నేను—జ్వరమే ఒచ్చిందామెకి, ఆమెమీద జాలి వేసింది.

కప్పుకున్న దుప్పటిలోంచి వచ్చి నాపైన పడ్డా యామె చేతులు. నా శరీరాన్ని సున్నితంగా స్పృశించసాగా యవి. నా శరీరాన్నీ నా బుగ్గలనీ రాసిం దామె నవ్వుతూ. సున్నితంగా, మెత్తగా ఉన్నాయా వేళ్ళు. దాసీది జ్ఞప్తికివచ్చి నాలో అణగారిన కోపం రగులుకొంది. దగ్గరగా తీసుకున్నా యామె చేతులు నన్ను. మంత్రముగ్ధుడ్లా లొంగిపోయాను వాటికి. నన్ను ముద్దెట్టుకున్నా యామె నీరసించన పెదాలు, నాకు సిగ్గనెయ్యక పోలేదు. కాని ఆ కళ్ళలోని నమ్రత దాన్ని చెదరగొట్టింది. నేనక్కడికి వెళ్ళడానికి కారణం అప్పుడు గుర్తొచ్చింది. ఆమె రాకపోడానికి కారణం అడ గాలి. మంచిసమయం. నాలుక కొసదాకా వచ్చింది. కాని అడగలేకపోయాను. ఆ స్థితిలో ఆమెకి నేను మరింత బాధ కలిగించినవాణ్ణవుతానేమో అనిపించింది. గుండెల కదుముకుందామె నన్ను. అమ్మ

జ్ఞానమొచ్చాక ఒక్కనాడన్నా నన్నలా తీసుకున్న పాపాన పోలేదు. ఒకసారి మెడపట్టుక వేళ్లాడితే "వెధవా గాడిదలా పదేళ్లు నెత్తికొచ్చినా" అంది. కాని ఈమె!

నిశ్చలమై ప్రశాంతమైన ఆమె ముఖం నన్ను వశపరచుకుంది. నా జుత్తులో కామె వేళ్ళు వెళ్ళాయి. నాతల నిమిరిందామె. తృప్తిగా ఆమె కళ్లు మూతలుపడ్డాయి. ఒక్క నిముషం అలా సమాధిలో ఉంది. మా పుస్తకంలో వేసిన బోధిచెట్టుక్రిందున్న బుద్ధుడిపటం జ్ఞాపకమొచ్చింది. మూతలుపడ్డా అరమోడ్పుగానే కనుపించాయా కళ్లు. ఆమె కెప్పుడూ అరమోడ్పుకళ్ళే. విడ్డాయి తిరుగ అవి. చెమ్మగిల్లాయి వాటి రెప్పలు. కాని దూసుకపోయే సూర్యకిరణంతో మెరసే నీటిచుక్క లేదు. దగ్గరగా, ఇంకా దగ్గరగా తీసుకుందామె నన్ను. ఆమెకు లొంగిపోయాన్నేను. కాదు, ఆమె మనస్సుకు. ప్రేమమూపే ఆమె గుండెకి. నా కళ్ళు చెమ్మగిల్లాయి. కాదు నే నేడుస్తున్నాను.

ఇంటిముఖం పట్టేవరకు నాకే ప్రపంచం జ్ఞాపకానికి రాలేదు. అమ్మ! నాన్న! ఇల్లు! ఆమె బాహువులలో ఎంతసేపు నిద్రపోయేను. ఎంత ప్రశాంతంగా గడిపానా క్షణాలు. ఆమె ప్రేమ నీడల్లో బ్రతుకంతా గడుపుతే ననిపించింది. పది గంటల రాత్రిలా వుంది. చాల చీకటిగా ఉంది. దాసీది వెంటవస్తోంది. పొమ్మని కసిరేను. కదల్లేదది. వెంట వస్తూనే ఉంది. ఆమె కళ్ళలో ఏదో బాధుంది. నే నన్నంతసేపూ సంతోషించింది. మళ్లా వెళ్తే— అమ్మో! ఏం చెయ్యడం ఇప్పుడు? ఇంటికెలా వెళ్లడం. కళ్ళల్లోనీళ్లుతిరిగాయినాకు. ఏం తప్పుచేశానని నన్నిలాకొడతారు అమ్మానాన్నా? ఆఖరుసారిగా గట్టిగా కసిరేను దాసీ దాన్ని. కాని మాయింటి గేటుదాటి లోపలికి వెళ్ళేవరకు అది నన్ను వదల్లేదు. మెట్లెక్కే ముందు నిలబడ్డానొక్క క్షణం. ఇంట్లోఎక్కడా చడిలేదు. అంతా పడుకున్నట్టున్నారు. వరండామీద పడుక్కుంటే. బాగానే ఉంటుంది. తెల్లవారుజామున దెయ్యాలన్నీ ఇంటిముఖం పడతాయన్న అబ్బులుగాడి మాటలు జ్ఞాపకానికొచ్చాయి. ఈ వీధిగుండానే పోతాయని కూడా అన్నాడు, తురకల స్మశానం ఈ వీధి చివరనుందికాబట్టి. నాలో ఉన్నధైర్యం కాస్తాపోయింది. చడిచెయ్యకండా మెట్లెక్కేను. ద్వారాన్ని సమీపించి చెవి తలుపు దగ్గరగా పెట్టి విన్నాను. ఏమి అలికిడిలేదు. తలుపు మెల్లగా తోశాను తీసుందేమో అన్న ఆశతో, బర్రుమంటూ తెరచుకుంది. నామీద నాకే కోపమొచ్చింది. బందుల్లో ఆముదం పొయ్యాలని అనుకున్నాను. గది ప్రవేశించేను మెల్లగా అడుగులు వేసుకుంటూ. ఆ గదిలో నే పడుకోడానికి నిశ్చయించేను. అకస్మాత్తుగా ఏదోమీద పడింది గట్టిగా, అంతే. ఎవరో రెక్కపట్టుక ఈడ్చుకపోతున్నట్టనిపించింది. మరి నాకేమీ గుర్తులేదు. కళ్లు విప్పేసరికి నాన్నా అమ్మాదగ్గరగా కూర్చొనున్నారు. అంతా ఏమిటో వింతగా అనిపించింది. దీపం ఎర్రగా కాల్తోంది. కంది ఎర్రగా ఉంది నాన్న ముఖం. అమ్మకళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి. నేను కళ్ళువిప్పాక స్టూలునుంచి లేచాడు నాన్న. "వచ్చింది తెలివి. రాకేం చేస్తుంది? అలా చావలేకపోయాడూ వెధవ" అన్నాడు పళ్ళుబిగించి, గోడపైపుతిరుగుతూ. ఏమిటో అర్థంకాలేదు నాకు, ఆలోచనకి బుర్రపరుగెత్తలేదు. "వస్తే చచ్చాడు వెధవ పోతే జైలుకిపోదును. ఇంకో ముత్తువు త్రీవలసింది. అప్రతిష్ట తెచ్చినవెధవ" పిడుగులా గర్జిస్తున్నారు. "దొంగలా వచ్చి పడుక్కుందామనుకున్నాడు. నాదగ్గరా పీడిమాయలు" నారాకకోసం కిటికీగుండా చూస్తూకూర్చున్నారని నామీద బరువుగా పడినది. అతని పిడికిలేనని నాకప్పుడర్థమైంది. అతని నోరాగలేదు. "ఛీ! ఎంత అప్రతిష్ట. నలుగురిలో ఎంత నగుబాటు. దానికి డబ్బేఉండుగాక. ఊళ్లో తెలివితక్కువ వెధవలచేత పెద్దమనిషే అనిపించుకోనుగాక. నాకు మాత్రం అది ఎప్పుడూ రంకులంజే పైకి పెద్దమనిష నేవారేకాని లోన ఎవరికి మాత్రం తెలీదు. మదపిశాచి, చచ్చేకాలమొచ్చినా. ఛీ! ఛీ! నావల్లే ఆమెకి మాటలన్నీ వస్తున్నాయని ఎంతో బాధపడ్డాను. వళ్ళుండకపోతే బావుణ్ణనిపించింది.అమ్మఅడ్డొచ్చింది."వాడిముందర ఈకబుర్లేమి"టంటూ, "అంటానా మరీ అంటానా, అందరిముందూ అంటాను. మొగుడుచచ్చేక పెళ్లిచేసుకోకూడదూ. ఒక్కసారి ముఖంకాల్చి ఊరుకుందురు. ఇప్పుడురోజూ కాల్చినా సిగ్గుకూడా లేదు . దానికి,

కన్నకొడుకుకూడా వదలిపోయేసరికే..." అతనలా ఎంతసేపు మాట్లాడాడో నాకు గుర్తులేదు. ఏమిటి మాట్లాడాడో అంతకన్నా వినలేను. కలల ప్రపంచంలోనికి పోయేను నేను.

నా కాళ్ళకి బంధాలు పడ్డాయా మర్నాటి నుండీ సరిగా సమయానికి బడికివెళ్ళటం తిన్నగా ఇంటికి రావటం. ఇల్లే నా ఆటస్థలం అన్నీను. ఏమీ పనిలేపోతే అమ్మకి సాయం చెయ్యటం. ఆవిడింటి వైపు చూడనైనా చూడవని ఆజ్ఞ. కాని అమ్మవంట హడావిడిలో ఉన్నప్పుడూ, నాన్న ఇంట్లో లేనప్పుడూ దొంగతనంగా కిటికీని సమీపించి ఆత్రతగా చూసేవాణ్ణి, ఆ ఇంటి ఆవరణలోకి. ఆవిడుండేది. అదే చూపు. నిశ్చలప్రశాంతమైన చూపు. ఆశ! నిరీక్షణ! దేనికోసం? ఏమో? కాని నా కొకటి తెలుసు. పూర్తయిన విశ్వాస మామె కుంది తనలో. రోజూ అస్తమిస్తున్న సూర్యుడితో మెరుస్తూ, ఆగుతూ ఉండేది, ఆమె కనుకొలకులో నీటిచుక్క. ఎర్రటి కాంతిలో దివ్యంగా ఉండే దామె మూర్తి. నా చూపు లామె కళ్ళలో లీనమయేవి. నా ఆత్మ ఆమెతో ఏకీభవించింది. నే నామెలో ఒక్కటయ్యే వాణ్ణొక్క క్షణం.

రోజులు గడవసాగాయి. వారాని కొకసారో రెండుసార్లో చూడ్డాని కవకాశం చిక్కేది. అప్పుడే నా మనస్సుకు శాంతి దొరికేది. అమ్మ ఆమెను సమీపించేందుకు కనుమతిస్తే బాగుణ్ణనిపించేది. అమ్మకి ప్రేమించడం తెలీదు. ప్రేమంటేనే తెలీదు. ఒక్కనాడు నాతో దయగా మాట్లాడి ఎరుగదు. నా కేడుపొచ్చేది.

నిద్రపోతున్న నాకు మెలకువ కలిగిం దొకరాత్రి. ఏదో శబ్దమయినట్టనిపించింది. గది నాలుగు మూలలూ పరికించి చూశాను. గదిలోని దీపం, చమురులేక కామోసు ఆరిపోయింది. అంతా చీకటి, ఇంటా బయట. అంతా నిశ్శబ్దం. ఎందుకు తెలివొచ్చిందో అవగాహన కాలేదు. దూరంగా మాత్రం వీధికుక్కలు మొరుగుతున్నాయి. గది నాలుగు మూలలూ తిరిగి కలియచూశాను ఆ చీకట్లో నే. ఏ కారణమూ లేకుండా తెలియవొచ్చిందేమొ. తల పక్కకు తిప్పి కళ్ళుమూసాను. మగతగా నిద్రపట్టింది. ఉలిక్కిపడి లేచాను. ఈసారి నేను పొరబడలేదు. ఆవిడింటినుంచే ఏవో కేకలు. చెవులిచ్చి విన్నాను. పురుషకంఠం. కొన్ని సెకండ్లు పోయాక వెక్కి వెక్కి ఏడుస్తూ స్త్రీకంఠం. ఆశ్చర్యం వేసింది. ఆమె ఇంటినుంచి ఏడుపు. తిరిగి బొంగురుగా పెద్ద కేకలు. ఎవరో ఆ కేక వేస్తున్నది. మంచం సద్దుచెయ్యకుండా దిగాను. చీకటిలో తడుముకుంటూ కిటికీని సమీపించేను. ఆత్రతతో ఆమె ఇంటి ఆవరణలోకి చూసాను. చీకటయినా నక్షత్రాల కాంతిలో తెల్లగా కనబడుతోంది ఆ ఇల్లు. బయటేమీ అలికిడి లేదు. లోనుండి కఠోరంగా పురుషకంఠం. స్త్రీకంఠం నుండి జాలిగా ఏడుపూ వినవస్తున్నాయి. ఆశ్చర్యం ఎక్కువైంది నాలో. ఏడుస్తున్న దావిడే అందుకు సందేహం లేదు. ఎవరిదా బొంగురుగొంతుక కోపంతో కూడుకున్నట్టున్నాయా వచ్చే మాటలు. అదంతా ఒక వింతలా తోచింది. ఆవిడింటికి వెళ్ళాలి. ఎలా? సాధ్యమా? సాధ్యమైనా వెళ్ళి నే నేం చేస్తాను? ఏడుపు మానుతుందేమొ ఆమె నేను దగ్గరుంటే. ఆలోచించేను. అంతకంటే ఏమీ చెయ్యలేకపోయాను. కిటికీ ఊచలు పట్టుకొని వెర్రిగా చూస్తూ నిల్చున్నాను. అరగంట గడిచాక పెద్దశబ్దంతో ఆ ఇంటి తలుపు తెరచుకుంది. గదినుండి తెరవబడిన ద్వారంగుండా వచ్చే దీపపు కాంతిలో పొడుగాటి ఒక వ్యక్తి బయటకు రావటం చూశాను. పెద్ద అంగలు వేసుకుంటూ బూట్లచప్పుడుతో చరచరా ఆవరణ దాటాడు. రోడ్డెక్కాక చీకట్లో కలిసిపోయాడు. కొంతసేపటిదాకా బూట్లచప్పుడు వినవచ్చింది. ఆఖరకలా అలా గాలిలో కలిసిపోయింది. ద్వారంగుండా ఆవరణలోకి పడే దీపపుకాంతిలో కూడా ఆమె ఏడుపు చీకటిని చీల్చుకొని వినవస్తోంది. ద్వారమలానే తెరచుకుంది. ఏడుపు తగ్గలేదొక ఘంట వరకు. ఆ చీకటిరాత్రి! ఆ నిశ్శబ్దం! దాన్ని చీల్చుకొనివచ్చే ఆమె ఏడుపు మరుపురాని స్మృతులుగా ఏర్పడ్డాయి నా మనస్సులో. చెమ్మగిల్లిన కళ్ళతో అలా చూస్తూ నిల్చున్నాను. ఏడుపు తగ్గింది కొంతసేపటికి. మరికొంతసేపటి కామెలో అంతరించింది. నా కళ్ళు మూతలు పడ్డాయి. నిద్రపోయేను ఆ ఊచలను పట్టుకొనే నాకు తెలియకుండా.

మర్నాడు లేచేసరికి బాగా తెల్లవారింది. ఎందుకో నా మనస్సు కలవరపడింది. అప్పుడు

జ్ఞప్తికి వచ్చింది రాత్రి జరిగిన సంఘటన. ఆశ్చర్యం నన్ను వదల్లేదు. సావిట్లోకి పరుగున వెళ్ళి ఆమె ఇంట్లోకి చూశాను ప్రశ్నార్థకంగా. రోజులాగే ఉన్నా ఆ ఇల్లు నాకు విచారంగా కనుపించింది. ఆవరణలోని పువ్వుల చెట్లు రక్తంలేని ముఖాల్లా కనుపించాయి. ఆ ఇంటివేపు అడుగు వెయ్యడానికి భయమేసింది. స్కూలుకి వెళ్ళేను. తిరిగి వచ్చేను. రెండుసార్లా ఇంటిని చూశాను. వెళ్లాలని బుద్ధి పుట్టింది. కాని ఎందుకో, చీకటి, బూట్లచప్పుడు, ఏడుపు జ్ఞాపకమొచ్చి భయమేసింది. సాయంత్రాన ఆ ఇంటి ఆవరణలోకి చూశాను. ఆమె లేదు. నా కళ్లల్లో నీళ్లు తిరిగాయి. నా మనస్సులో భయానికి తప్ప దేనికీ తావు లేపోయింది.

రోజులు గడుస్తున్నాయి. ఆమె ఆవరణలోకి రావడం మానేసింది. ఆ బొంగురుగొంతుక మాత్రం నన్ను వదల్లేదు. ప్రతినిముషం నా మనస్సులో ప్రతిధ్వనించసాగిందది. ఆ అర్ధరాత్రి ఆమెపట్ల అంత నిర్దయగా ప్రవర్తించిన వ్యక్తి ఎవరు? ఆ వ్యక్తికీ ఆమెకీ ఉన్న సంబంధం ఏమిటి? అతని ప్రవర్తనకీ ఆమె అసహాయపు ఏడుపుకీ కారణం? నాకేమీ తోచలేదు. ఎన్నో ఆలోచనలు నా మనస్సులో దొర్లేయి. ఏదీ సబబుగా తోచలేదు. ఆమెను సమీపించడానికీ ప్రశ్నించడానికీ సాహసం లేక పోయింది. ఆ ఇంటినిచూస్తే భయమేసేది.

ఒకనాడుదయం నిద్రలేచేసరికి అమ్మెందుకో హడావిడిగా తిరుగుతోంది సావిట్లోకి ఇంట్లోకీను. స్కూలుకి సెలవు. తెలివొచ్చినా మంచం దిగడానికి బద్ధకం వేసింది. కిటికీగుండా ఆకాశం ప్రశాంతంగా, నీలంగా, భీకరంగా కానొస్తోంది. ఎంతో తృప్తినిచ్చిందా పొద్దు. లేవటానికి మనసొప్పలేదు. కళ్లు మూసుకున్నాను.

పొరుగింటావిడ వచ్చినట్లుంది. అంత ఉదయాన్నే ఏం మునిగిపోయిందనొచ్చేసింది. ఇద్దరూ ఏవో గుసగుస లాడుకుంటున్నారు. బద్ధకంగా లేచాను. నే రావటం కనిపెట్టి మాటలు కట్టిపెట్టారు వాళ్లిద్దరూ. అమ్మ నావేపు నవ్వుతూ చూసింది. అమ్మ నాతో ఇంత చనువుగా ప్రవర్తించడం నా ఎరుకలో చాలా తక్కువసార్లు. వింతనిపించింది నాకు. వేపపుల్లకోసం పెరట్లోకి వెళ్ళేను.

అమ్మ గొంతుక వినవచ్చింది.

"శని విరగడైపోయింది. లేకుంటే ఎంత అప్రతిష్ట, ఎంతప్రతిష్ట."

"కాదుటమ్మా మరి, ఒక పేరంటూ ఉండి మర్యాదగా నాలుగు కుటుంబాలంటూ ఉన్నాక మన్ననిగచ్చపెట్టులాగ అప్రతిష్ట కాదుటమ్మా—" పొరుగింటావిడ గొంతుక ఏకీభవిస్తూ కొంత విపుల పరచింది.

"దేముడంటూ ఒకడున్నాడు. ఏనాటికన్నా ఒక కన్ను వేసే ఉంచుతాడు" అమ్మ చాలించింది.

వేపపుల్ల విరుచుకొని ఇల్లు ప్రవేశించగానే సంభాషణ ఆగింది.

అమ్మంది. "రామూ పెరట్లో తోముకో ఈ వేళకి పళ్ళు" అని.

"వీధిలో చల్లటిగాలి వేస్తుందమ్మా" అన్నాను.

"పెరట్లోనూ వస్తోంది. వెళ్లు" అంది.

"ఏమే వీధిలో తోముకుంటే" అన్నాను.

"నాతో అనవుసరంగా వాదించకు. చెప్పిన మాట విను" అంది విసుగ్గా.

"ఏమే" అన్నాను జాలిగా చూస్తూ.

పొరుగింటావిడ నా సహాయానికి వచ్చింది.

"చిన్నపిల్లాడివి నాయనా నువ్వు. నీకు తెలీదు. మనింటి కెదురుగా ఒకావిణ్ణి రేవుకు తీసుకెళ్తున్నారు. చిన్నపిల్లలు చూడకూడదు" అంది.

"ఏం దేనికి" అన్నాను అర్థంకాక.

"నీతో బలేచిక్కులాగే వుంది. నీకు దేనికది విడమర్చి చెప్పాల్లాఉంది. ఎదురుగుండా ఉన్న ఆ ముండ చచ్చింది. దాన్నీడ్చుకుపోయాక నువ్వు వీధికొచ్చు." అంది అమ్మ పెద్ద గొంతుక చేసుకుంటూ.

ఆత్రుత నాలో విజృంభించింది.

"ఎవరే" అన్నాను.

"పెరట్లోకి నడూ." అని ఒకటే ఒక ఆజ్ఞ అమ్మ నుంచి.

దేనివల్ల ప్రేరేపింపబడో నాకు తెలీదు. ఎందుకో, ఎలా ప్రవర్తించానో నాకు తెలీదు. వీధి

సమ్మ్రంలోకి పరుగెత్తివెళ్ళేను. ఆమె ఇల్లు నన్నా పిందొక్క నిముషం. ఇంటినిండుగ ఇరవైమందిలా ఉన్నారు. గబగబగా లోనికీ, బైటకీ వెళ్తూవస్తున్నారు. ఒక్క పరుగులో ఆ ఇంటి ఆవరణ ప్రవేశించాను. ఏడుస్తూ పని మనిషి బయటకొచ్చింది. నన్ను చూసి భోరుభోరుమంది. "ఇంకేముంది అమ్మగారు మరి మనకి లేరు చిన్నబాబుగారూ" అంటూ.

నాకు స్పృహలేదు. అందర్నీ తోసుకుంటూ లోనికి వెళ్ళేను. పని మనిషి నావెనకనే వచ్చింది. ఆమెగది ఆమెమంచం కళ్ళకు కట్టినట్టే ఉన్నాయి. అక్కడున్న వాళ్ళందర్నీ తోసుక లోనికి పోయేను. ఆమె గది ఆనాటిరాత్రిలాగనే అందంగా ఉంది ఆమె మంచం చెక్కు చెదిర్లేదు. శుభ్రంగా పరిచున్న దుప్పటి. ఆ రాత్రిలానే సుఖంనిండా కప్పుకొనుందామె. నా కాళ్ళబంధాలు విడ్డాయామెకు నికిని సత్తించగానే. పరుగెత్తివెళ్ళి ఆమె ఒడిలో వాలేను. అంతే ఏమి జరిగిందో నాకు గుర్తులేదు. తెలివొచ్చేసరికి ఆమె చుట్టూ నలుగురైదుగురే ఉన్నారు. పని మనిషి నామీద చెయ్యివేసి కూర్చుంది. ఆమెలో చలనంలేదు. ఆనాటిలా ఆ మె చే తు లు దుప్పటి కప్పులోంచి నన్ను దగ్గరగా తీసుకు నెందుకు రాలేదు. ప్రశాంతమైన ఆమె చూపులే దుప్పటి ముఖాన్ని కప్పేసుందికనుక, ముఖానున్న కప్పు తొలగించేందుకు చేతిని జాచాను. వెనుక నుండెవరో పట్టుకున్నారు గట్టిగా.

"తప్పు" అని మందలించిందొక జీరగొంతుక.

ఎవరిదో అని చూసేందుకు కూడా శక్తిలేక పోయింది. తిరుగ ఆమె ఒంట్లో వాలేను.

"ఈ ఊరికే తీరని నష్టం. ప్రాచీనభావాలు, సాంప్రదాయాలు జీర్ణించుకున్న ఈ ఊరుకి ఇప్పటి నవీనప్రపంచంలో పడేందుకు ఒక విప్లవానికి దారి తీసిన వ్యక్తామె. ఆమె మన మధ్యనుండే భాగ్యం మనకు లేదు." అన్నదొక పురుషకంఠం శీవిగా

"నాకొక స్నేహితురాలు పోయింది. నాలో ఎన్నోవింత భావాలు రేకెత్తించిందామె" అందింకొక పురుషకంఠం జాలిగా.

"నాకొక దగ్గర బంధువు పోయినట్లుంది. మా ఇద్దరికీ పరిచయమై చాల తక్కువ కాలమైనా మా భావాలు హృదయాలు ఏకీభవించాయి. మా ఇద్దరి మనస్తత్వాలూ ఒకటే" అంటూ సంతాపాన్ని వెలిబుచ్చిందింకొక కంఠం.

చాలా విచారంగా అంకొక గొంతుక వణుకుతూ దుఃఖించసాగింది.

"అవును. నాకూ ఆమెకూ అంత చెప్పుకోదగ్గ పరిచయముండేది కాదు. కాని ఒకనాటి సంఘటన ఏకోపనుండి ఆమె మా స్కూలుకి రావటం తటస్థించింది మాటల సందర్భాన మా ఇద్దరి భావాలు ఒకేవిషయం మీద ఏకీభవించాయి. ఆమె నన్ను ఆ ఆదివారం నాడు రాత్రి ఇంటికి విందుకు రమ్మంది. నాకోసమే ప్రత్యేకంగా ఏర్పరచింది. వద్దన్నా వినలేదు. విందు పూర్తయేసరికి నడిరాత్రి దాటింది. చాల చీకటిగా ఉంది. ఇంటికి పోయేందుకు తయారుపడ్డాను. "మీకేం మతిపోయిందా. ఈ చీకట్లో ఎలా వెళ్తారు. పైగా చాల రాత్రయిపోయింది. ఇక్కడే పడుకొని రేపుదయం వెళ్ళండి. మీకోసం అన్నీ ఏర్పాటు చేయించేను. కాదంటే మరి లాభంలేదు" అని బలవంతం చేసిందావిడ. అది మా పరిచయానికి మొదటి మెట్టు. ఎంత మర్యాద ఎంత పెద్దమనిషి తరహా" దుఃఖం ఆ కంఠాన్ని కంపించింది.

"కాఫీ తాగొస్తే బావుణ్ణు. పదండి వెళ్ళి పది నిమిషాల్లో వచ్చేద్దాం" అని ఆజ్ఞాపించింది మొదటి కంఠం. మెల్లిగా గది వదలి వెళ్ళారంతా. పనిమనిషి లేచి సావిట్లోకి వెళ్ళింది. నేనూ ఆమే గదిలో. ప్రశాంతంగా, నిశ్శబ్దంగా ఉంది గది. ఆమె ఒడిలోంచి లేచాను. ఆమె ముఖం చూడాలని గట్టిగా కోరిక పుట్టింది. కాని జంకు కలిగింది. చల్లటిగాలి వీస్తోంది కిటికీగుండా. ఆకాశం ఉదయమంత నీలంగా లేదు. కొంచెం బూడివరంగొచ్చింది దానికి. నా మెదడు ఖాళీగా ఉంది. ఖాళీగానే కిటికీగుండా శూన్యంలోకి చూసేను. ఐదునిముషాలు గడిచాయి. నాకళ్ళు చెమ్మగిల్లాయి.

రెపరెప చప్పుడు నా మనసు నాకర్షించింది. కిటికీకి ఎదురుగాఉన్న టేబిలుమీదున్న ఒక నోటు పుస్తకపు పేజీల నెగరవేస్తోంది తన బలంతో గాలి. చేత్తో తిప్పినట్టు పేజీలు తిరుగుతున్నాయి. అకస్మాత్తుగా అందు నుండొక చిన్న ఫోటో గాలి కెగిరి

నేలపడింది. వెళ్ళి ఆతృతకొద్దీ దాన్ని తీసిచూశాను. పదిహేనేళ్ళ వయస్సులో నున్న ఒక కుర్రాడి ఫోటో. ముఖం అందంగా ఉంది. కళ్ళనుండి చూపులు పదునుగా ఉన్నాయి. నుదుటిమీద పెద్ద మచ్చ. ఫోటో వెనుకభాగం తిప్పాను. 'గోపాల్' అని పెద్దక్షరాల్లో రాసుంది. అన్ని ఫోటోల్లాగే వుంది. అందులో ప్రత్యేకత మరేమీ నాకు కనిపించలేదు. ఆ పుస్తకంలో ఆ ఫోటో ఉండడానికి కారణమేమిటో అని అనుమానం పుట్టింది. పుస్తకాన్ని తీశాను. బాగా నలిగిన డైరీ పుస్తకం అది. పేజీలు తిరగేశాను. అస్పష్టంగా పెన్సిలుతో రాసుంది, అక్కడక్కడ. ఒకచోటుంది - "నీకోసం రోజూ ఎదురుచూస్తాను." మరొకచోట - "నాతప్పులుంటే క్షమించి రావూ" అని. ఏవేవో అస్పష్టంగా రాసున్నాయి. ఆఖరు పుట తిప్పాను. సిరాతో రాసుంది. ఆతృతగా చదివాను.

"గోపాలం—నా తండ్రీ—మనం మానవులం అలానే ఉండగలం మనం. ఏవు రజోగుణాలు ప్రతి ఒక్కరిలోను ఉంటాయి. అందుకే మానవులమయ్యాం మనం. లేకపోతే దేవతలమే. వాటినుండి విముక్తి సాధ్యంకాదు తండ్రీ. వాటికి లొంగిపోయేం మనం. కాబట్టి అందులో ఏ గుణానికి లొంగినా అది మానవ నైజం.

ఈ ఇల్లు వదిలినాడు నువ్వు నా కుడికంటి మీద కొట్టినదెబ్బ తియ్యని స్మృతిగా రోజూ తలచుకుంటూంటాను. నువ్వు నన్ను వదలిన నాటినుంచీ ప్రతిదినం నీ రాకకోసం ఎదురుచూస్తున్నాను.

రావూ గోపాలం! ఏ ఆశాలేకండా అంతరించి పోయే నా హృదయానికి మెరుపువి కావూ?

నువ్విల్లు వదలడానికి నేనే కారణమన్నావు. కామంతో కాలే మంటన్నావు. నిజమే. వాటి నన్నింటికీ తలవంచుతున్నాను నీ పాదాలముందు. నన్ను తల్లిగా చూడు. తల్లిగా అర్థంచేసుకో. కళంక రహితంగా వెలిగే తల్లిప్రేమకి నీ హృదయంలో చోటు నియ్యి. రావూ గోపాల్."

అట్టమీద రాసుంది పెన్సిలుతో—

"నా నిరీక్షణ ఫలించింది. నువ్వు వచ్చావు. అంతే నాకు చాలు. కొట్టినా తిట్టినా నేను బాధపడలేదు. అవి నాకు ఆనందాన్నిచ్చాయి. కాని ఆ అర్ధరాత్రే నన్ను వదిలావు. నేనింక బ్రతకలేను. ఇది నా జీవితంలో ఆఖరిఘట్టం"

పుస్తకం నా చేతినుండి జారింది. ఆమె మంచం వైపు చూశాను. ప్రశాంతంగా అక్కడే ఉందామె. ఆమెను సమీపించాను. రెండు చేతులతోను ఆమె ముఖాన్ని కప్పున్నదుప్పటి తొలగించాను. నాలోని భయం ఏనాడో పోయింది. ఆ ముఖం నాకాశ్చర్యం కలిగించింది. జీవం ఉట్టిపడుతోందా ముఖంలో. కళకళలాడుతూ ఎంత ప్రశాంతంగా ఎంత గంభీరంగా ఉందా ముఖం! వంగి ఆమె నుదుటిని ముద్దు పెట్టుకున్నాను. సూర్యుడు మీదకొచ్చాడు. బంగారు తీవలా అతని ఒక కిరణం ఆమె ముఖంమీద పడింది. ఒక్కసారి వెనక్కు తగ్గాను. రోజూ ఆమె కళ్ళల్లో అస్తమించే కిరణం ఈవేళ ఉదయించింది. లేత బంగారుకాంతిలో దూసుకుపోతోంది, ఆమె కుడి కనుకొలకులోకి. మణిలా మెరసింది "నీటిచుక్క" ఆ కంటికొలకులో.



# ఏమంటావ్, శ్రీనివాసరావ్!



శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

ఏమంటావ్
శ్రీనివాసరావ్
ఏమో యేమో
నివేమైనాఅను

పులకించిన
ప్రకృతిపై
చివురించిన
కొమ్మలలో

కూర్చుండిన
చిలుకలజంట
మా కన్నుల
కొకకంట–

కాదంటావా?
ఏమంటావు
శ్రీనివాసరావు ?
గలగల స్రోతల

జలజలపారే
సెలయేఱులపై
తెరలియాడే
చిరుకెరటాల

మురువులు, హొరువులు
లేవంటావు, కావంటావు.
అందమయిన
చందమయిన

చిన్నదాని
వన్నెలాడి
కన్నుసన్నలు
సున్నంటావు.

ఏటి యొడ్డుల
సరసు సరసల
తోటచివరల
సీటుగా బైఠాయించి

దీటుగా మిన్నువంక
చూచినప్పుడు,
కానవచ్చే తారకల
మిలమిలలు,

జలజలలు
మిన్కుమిన్కులు
లేనేలేవంటావు
శ్రీనివాసరావు!

నాజూకుగాళ్లం
సుదతిచూపులే
ఓపలేం
నీ పోటుమాటలు

నీ యీ టెపోటులు
ఎట్టా, ఎట్టా–
అమ్మయ్యో! యెట్టా
భరించటం, వరించటం!

ఏరు వదలి
సరసు వదలి
తోట వదలి
ముఖమల్

భారతి - నందన భాద్రపదము

పచ్చిక వదలి
జీవితపు
కరకు బాటపై
పయనిస్తూ

ఠపేలున
తాకే ఎదురుదెబ్బలకు
పలవిస్తూ, ప్రలపిస్తూ
ప్రలపిస్తూ, పలవిస్తూ

బుర్రుమని, తుర్రుమని
సాగిపోయే కారు
క్రూరంగా, ఘోరంగా
మా మొగాలపై -

లాల్చీ వేసి
కండువా తాల్చి
కళ్ళపై జోడు సవరిస్తూ
మొహరిక్కిస్తూ

దిక్కులు పరికిస్తూ
సాగిపోయే
తూగిపోయే
మా మొగాలపై -

ఇంత దుమ్ముగులాం
పోసిపోయినప్పుడు
ఉక్కిరి బిక్కిరి
ఊపిరి, చిక్కబట్టుకోలేక

కండువా అడ్డం పెట్టుకొని
యంత్రయుగాన్ని
తిట్టుమంత్రాలతో
దీవించినపుడు, భావించినపుడు —
దొరగారి వాకిట్లో
కరవబోయే

కుక్కపిల్లను
తప్పించుకొని
మెల్లిగా, చల్లగా
ముసిముసి నవ్వులతో

ముకుళిత హస్తాలతో
వేచికొని కాచికొని
అడిగే ప్రశ్నలదుమారంలో

చదువుదీపం, ఆరిపోయి
చిన్నతనం నములుకుంటూ
నీ తెలివి, ఇంతేనా అన్నట్టు
చూసే అధికారి చూపులకు

అహంభావం, వ్యక్తిత్వం
అన్నీ చచ్చి, అన్నీ ఉడిగి
లఘుత్వం, భజిస్తూ
భాజిస్తూ

దొరగారి గేటువాకిలి
నుండి బైటపడినపుడు -
"ఔను నిజం, ఔను నిజం
ఔను నిజం, నీవన్నది

నీవన్నది, నీవన్నది
నీవన్నది నిజం, నిజం"
అంటాము మేం లోలోపల.
తంటాలేమీ లేకుండా

అనుకుంటాము మేం లోపల.
ఏమంటావ్, ఏమంటావ్
ఔనంటావ్, ఔనే నంటావ్?
శ్రీనివాసరావ్, శ్రీనివాసరావ్ !!

['శ్రీ శ్రీ రచించిన మహాప్రస్థానం
చదివినమీదట ఉబికిన స్వచ్ఛందకృతి]

# రుధిరజ్యోతి - ఒక ప్రస్తావన



శ్రీ రోణంకి అప్పలస్వామి

ఆధునిక కవితను, భావ, వాస్తవిక కవిత్వాలని రెండువిధాలుగా విభజించి మనం చెప్పుకొనవచ్చును. భావకవులలో రాయప్రోలు, దేవులపల్లి మున్నగు కవులు శిష్టులు. ద్వితీయ వర్గమునకు చెందిన కవులలో శ్రీశ్రీ ప్రభృతులు విశిష్టులు. ఇట్టి విశిష్టులలో శ్రీరంగం నారాయణబాబు ఒకరు. తెలుగునాట, కవిగా బ్రతుకుతూ, ఖ్యాతి నార్జించిన వాస్తవికుడు. ఆయన రచియించిన గీతాలకు, రుధిరజ్యోతి అని నామకరణం చేసుకున్నాడు.

శ్రీశ్రీ పేరు వినగానే, నారాయణబాబు, నారాయణబాబు పేరు వింటే శ్రీశ్రీ మనకు చటుక్కున స్ఫురిస్తారు. దీనికి కారణం ఏమయినా, వీరి కవిత్వపు పోకడలుమాత్రం వేర్వేరు. స్వీకరించిన కవితావస్తువు ఒక్కొక్కచో, ఒకటే కావచ్చును. కాని వారు దానిని దర్శించే పద్ధతులు, వ్యక్తీకరించే రీతులు మాత్రం విభిన్నములు. ఇందులో ఇరువురికీ ఏమాత్రం పోలికలు కనిపించవు. ఉద్రేకజనితాలయిన శక్తులు, స్వీకరించిన దృక్పథం, అభిన్నాలు. పరిగ్రహించిన అలంకారాలలో, శబ్దప్రయోగంలో ఎవరి త్రోవ వారిది; ఎవరి పోకడ వారిది. శ్రీశ్రీ స్థూల దృష్టికికూడా దొరుకుతాడు. నారాయణబాబు కొన్ని తావులలో సూక్ష్మదృష్టికి వినా, స్పష్టం కాడు. నోటికి పట్టే చందస్సులలో శ్రీశ్రీ పరుగులు తీస్తాడు. తన లక్ష్యాన్ని ప్రత్యక్షపద్ధతిని వ్యక్తంచేస్తాడు. నారాయణబాబు పరుసులో శ్రీశ్రీకిగల ఉద్వేగం లేదు. అతనిది పరోక్షపద్ధతి. ఇద్దరూ పాశ్చాత్య కవితా సంప్రదాయాలను మననం చేసుకొనినవారే; కాని భారత సంప్రదాయం, నారాయణబాబుకవితలో చక్కగా జాలువారుతూ వుంటుంది.

పాశ్చాత్యదేశాలలో, పారిశ్రామిక విప్లవానంతరం, కవితారంగంలో కొన్ని వినూత్నపరిణామాలు జనించాయి. ఈ ప్రభావం, ఆంధ్రసాహిత్యంపై ప్రసరించకపోలేదు. అంతటితో, వస్తువునకు గల ఇతఃపూర్వమున్న విలువలు తారుమారుకాజొచ్చాయి. వ్యక్తిప్రధానమైనవాద మొకవంకను, సంఘప్రధానమైనవాదము మరివొకప్రక్కను నిరంతర సంఘర్షణతో, అపూర్వ కావ్యసృష్టికి కారణభూతము లయాయి. సామాన్య మానవుని అనునిత్యం వేధిస్తున్న ఆకలి, నిరుద్యోగం, అకాలమరణం మొదలుగాగల సమస్యల కొక వ్యక్తీకరణ అవసరమొచ్చింది. ఈ దృష్ట్యా, వ్యక్తి ప్రధానవాదులు మానవునకు సంతృప్తి నీయలేకపోయారు. వాస్తవిక పరిస్థితులనుంచి తప్పించుకు తిరుగుతూ, జీవితాని కతీతంగా ఇసుకలో తల దూర్చిన ఉష్ట్రపక్షులకు మల్లే, కవితాగానం చేస్తారని, ఆ పద్ధతి పరిత్యాజ్యమని, వాస్తవికవాదుల మతం. ఎవరు ఏమి చెప్పినా 'ఆత్మాశ్రయకవుల'లో ఒక విశిష్టత లేకపోలేదు. మానవజీవితాన్ని అనేక దృక్కోణాలనుంచి దర్శించవచ్చును. అందులో భావకవుల పద్ధతి ఒకటి. ప్రకృతిలోగల రామణీయకతను, ప్రణయమాధుర్యమును, ప్రేమమహత్తును, భావకవిత్వం రసమయంచేస్తుంది. అయితే ఇదీ పాక్షికమైనదే, కాని సమగ్రమైనది కాదు. జీవితం ఒక గనివంటిదే అయితే, అందులో ఒకమూలనుమాత్రమే ఇది స్పృశిస్తున్నది. కాని అదే సర్వస్వమనుకుని, జీవితపరిశోధన ముగించుకోవడం, అనాదరణీయం. కావ్యవస్తువులో వైవిధ్యంలేకపోవడం, వున్నది పునరుక్తిదోషమునకు గురికావడం, విముఖతను కలిగిస్తుంది; విసుగునుపుట్టిస్తుంది. ఈ విముఖతపట్ల విముఖతాఫలితమే వాస్తవికవాద జననం. భావకవిత కిది ప్రతిచర్య. ఇంతటితోమాత్రమే ఆగిపోక, సమాజంలోని క్రౌర్యం, కౌటిల్యం, వ్యగ్రత, జీవితంలోని, అనునిత్య సమస్యలను వాస్తవికవాదులు గ్రహించగలిగారు. మానవుణ్ణి కలవరపెట్టే ప్రతీ విషయము,

వారి కవితావస్తువులు కావాలనే తహతహ జనించింది. అయితే ఇది మాత్రం పాక్షిక దృష్టి కాదా అని ఎవరైన ప్రశ్నిస్తే, 'అవున' నే సమాధానం.

ఒకే వస్తువును సందర్శించిన, భావకవు లొక పద్ధతిని, వాస్తవికులు మరి ఒక పద్ధతిని, అవలంబించి, తమ భావాల నభివ్యక్తం చేస్తారు. దీనికి తెలుగుకవిత నుంచి ఒక ఉదాహరణ నిస్తున్నాను. రాత్రి, ఆకాశంలో మెరసే నక్షత్రాలు కృష్ణశాస్త్రిగారి కొక రీతిగను, నారాయణబాబుకు మరి ఒక రీతిని స్ఫురించాయి. అందుకే శ్రీశాస్త్రిగారు:

"నింగిమూలల
నీలిపందెళ్లు నైచి
ఎంత చిరుమల్లెతోట
వేయించినాను"

అనేటపుడు వారి భావన సముజ్వలమే. మరి దీనినే నారాయణబాబు ఉత్ప్రేక్షించిన విధం గమనించండి:

"నల్లని త్రాచుకోరలు
తెల్లని మశూచికుండలు
గగనమ్మునచుక్కలు"

లోకంలో ఎటుపరికించినా, భీభత్సమే కనిపిస్తున్న కవికి, ఆకాశంలో చుక్కలు ఆనందాన్నీయవు. నక్షత్రాలొకేసారి త్రాచుకోరలవలె, మశూచికుండలవలె భయంకరంగా గోచరించడం కవికి సహజం. లోకంలో విశ్వమానవకల్యాణం, విశ్వశాంతి నెలకొల్పబడాలని, జీవితం మంగళప్రదం కావాలని అతి ప్రాచీనకాలంనుంచీ, కవులంతా వాంఛిస్తూనే వున్నారు. కావ్యాలలోని వస్తువులను మంగళప్రదాలుగా భావించి, మంగళాంతం చేసినంతమాత్రాన ఇది సిద్ధించదు. కంటికి కనిపించేదంతా, బాగానేవున్నదనుకొని, అందులోని చెడుగును తలపెట్టక, మంచినిమాత్రమే, అభివర్ణించితే అది దోషమే. చెడుగునుగ్రహించి, దానిని ఎదిర్చి, చూపాలి. జీవితంలో కాఠిన్యమును బయటపెడుతున్నపుడు, భీభత్సతను స్ఫురింపించే పైగీతాల వంటివి రచియింపక తప్పదు. మాలిన్యాన్ని కప్పిపుచ్చుకోవడంతో, అది మటుమాయం కాదు. దానిని బహిర్గతం కావించాలి. వస్తువును సామాజిక విమర్శనాదృష్టితో తరచి తరచి చూడవలసివుంటుంది. సమాజాన్ని ఎక్కడికక్కడ విమర్శించడం, వాస్తవిక వాదలక్షణం.

ఈ లక్షణం నారాయణబాబుకవిత్వంలో ప్రస్ఫుటం. భావకవిత్వం పై తిరుగుబాటు, వస్తువ్యాకరణలతో ఆగక, విప్లవపథాలను పడుతుంది. రీతిలోను, వస్తువులోను సరిక్రొత్తదనం కనిపిస్తుంది. ఎవరూ చెప్పని పద్ధతిని చెప్పడం అతనికి సరదా. 'ఇమేజిస్టు' కవితకు ఇతను ప్రాణంపోస్తాడు. శబ్దార్థాలతో, కుదించి, సొగసైన విగ్రహాలను నిర్మించే శిల్పి. క్లుప్తత ఇతనిపద్ధతి. ఒక మాటలో చెప్పవలసినది, పదిమాటలలో చెప్పడు. పదిమాటలలో చెప్పవలసినది ఒక మాటలో చెబుతాడు. ఈ శిల్పం సాధారణులకు అలవడేది కాదు. పరిపూర్ణాకృతితో అతని వర్ణ్యమాన వస్తువులు కనులఎదుట మసులుతాయి. 'దేశమాత' అనే గీతంలో—

"ఎండాకాలం
ఎండాకాలం
పగళ్లు సెగళ్లు
మండేరోడ్లు
పన్నెండుగంటలు
కాలం
కాలిన గుడ్డపీలికై
ధూళిరేగినది"

గ్రీష్మర్తువు తీక్ష్ణత 'పగళ్ళను సెగళ్లు' గా కవి చెప్పడంలో బలంగా వ్యక్తమవుతున్నది. కాలం కాలినగుడ్డపీలికై ధూళిరేగడంతో, వర్ణనఉజ్వలవంతం. అలాగే—

"కరవే రూపందాల్చి
కడుపే చెరువై ఏడ్చె"

అనే చోట బిచ్చగత్తె దీనావస్థ తెనుగు నుడికారంతో ప్రతిబింబితం. ఎండ ప్రచండంగా కాస్తున్నపుడు; తలుపులు బిగించుకుని భవంతులమధ్య నివసిస్తున్నవారికీ దీనాలాపం వినిపించదు. ఎండకు మాడి, పాపం ఆమె.

"అసువులు వీడి
చచ్చిన దేశమాతయై
చాపచుట్టగ
నేలకు వ్రాలింది"

కాని ఆర్చేవారూ తీర్చేవారూ కనిపించరు. తమ జాతికి చెందిన బిచ్చగత్తెను చూసి మానవులకే జాలికలుగని సాంఘిక వాతావరణ మేర్పడింది. 'వీధి కాలువ, బురదనీటిలో విశ్రమించినశ్వానాగ్రు డొకడు' మాత్రం నిట్టూర్పుతో వాపోతాడు. అలాగే బుషిపక్షి, గాడిద కరుణను ప్రకటిస్తాయి. ఇక్కడ 'శ్వానాగ్ర'శబ్దప్రయోగం సాభిప్రాయం. మనుష్యులచే నీచంగా చూడబడే కుక్క, మనిషి చనిపోయి పడి వున్నపుడు సంతప్తహృదయంతో వుంటుంది. అందుకే గౌరవవాచకమైన 'శ్వానాగ్ర' ప్రయోగం. ఇలాగే మరొకచోట 'గార్ధభస్వామి' అనే ప్రయోగం కనిపిస్తుంది. సామాన్యులైన బిచ్చగత్తెను కవి దేశమాతగ దర్శిస్తాడు. 'ఆకలి దీర్చని మానం కప్పని దేశంకోసం, మట్టిప్రమిదలో వత్తైకాలిందీ, మానిని ఈనాడు' అని సాధారణీకృతిని కావిస్తాడు. కవితో పాటు, మనం కూడా నిట్టూర్పుతాము. తెలుగువారి సంప్రదాయాలను, ఆచారాలను, ప్రకృతి సహజ దృశ్యాలను చూస్తూ, వాటితో వ్యక్తం చేస్తాడు. తెలుగునాట కనిపించే పేదవారి దుస్థితిని 'తెనుగు రాత్రి'లో వర్ణిస్తున్నాడు.

"పేదవాని కడుపుమంట
కాలి పేలి పోవు కోర్కె
గగనమ్మున చుక్క"

వలె కవికి స్ఫురియించింది. చిన్నతనంలోనే, గర్భిణిఅయి, శక్తి సన్నగిల్లిన తెలుగుపడుచు 'చేతి గాజు' వలె 'నెలవంక' కనిపించింది. "శస్త్రమ్ముట్టు, బిలుకుమార్పు, మాసిపోని గాజుముక్క నెలవంక, సంఘంవంక !" సంఘంకేసి చూడడమే కాక, పగ తీర్చుకునే శస్త్రంవలె కనిపిస్తున్నది. సమాజంలో ఎంతటి తీవ్రాందోళన చెలరేగినా, బాలవితంతువుల దుస్థితి నేటికి కూడా మారలేదు. ఈ దురన్యాయ సాంఘిక విధానాన్నే పురస్కరించుకుని కవి "పసితనమున పెండ్లి, భర్త పరమపదము చేర, విధవ మసక మసక యవ్వనమున కుసుమించే తల్లి తలపు, గుండెల్లో పాలపాట, ఆకాశపు పాలబాట" గా పాడిన ఈ చరణాలు తెలుగుకవిత కొక పాలబాట. నారాయణ బాబు కవనం, మన్నునుండి మానవులను సృష్టిస్తుంది. ఈ వింత సృష్టికి, భారతీయ పౌరాణికదృష్టి కవికి బలమిచ్చింది. పౌరాణిక ఇతివృత్తాలతో సంప్రదాయపు మెలకువలను ఆకళించుకుని, పఠితకు కవితను ఆస్వాదయోగ్యం కావిస్తాడు. ఒక్కొక్కసారి శరీరం జలదరింపచేసే మెరుపులు కురిపిస్తాడు. శబ్దం కొత్త పలుకుబడితో ధ్వనిస్తుంది. ఈ దృష్టితో రచించిన అతని గేయావళిలో 'కపాలమోక్షం' ఎన్నదగినది. భగవత్సింగ్ దేశభక్తుడు; వీరుడు. అతనిని ఉరితీసే ఘట్టం భారతీయ చరిత్రలో మగ్గామన్నా మరుపురానిది. ఈ దుస్స్వప్నం కవిని కలవరపెట్టింది. విషాద సంఘటనను వీరరస ప్రధానం గావించి భగత్సింగ్‌ను పౌరాణిక వీరుల కులపతిగా కీర్తిస్తాడు. అనుగుణంగా ఆవేశం, తొణికిసలాడుతుంది. ఆది శంకరుడు తపస్సమాధినుంచి చైతన్యావస్థను పొందుతాడు. తిరిపెమెత్తుకునేందు కతనికి కపాలం కావలసి వచ్చింది. 'పాలాక్షుని' హస్తాలలో పడేభాగ్యం ఏ కపాలానికి పట్టుంది ?

"క్రైస్తవుల సమాధులలోన
తురకల గోరీలందు
హిందూ స్మశానవాటుల
పుణికెలు పులకరించినవి
వికావిక నవ్విన
కపాలములు
కంకాళములు
ఘల్లుఘల్లుమని
మ్రోగినవి."

కాని శివుని హస్తస్పర్శ భగత్సింగ్ కపాలానికి తప్ప, ఇతరముల కెలా లభిస్తుంది? దేశభక్తుని కపాలం త్రినేత్రుని హస్తయుగళిని చేరుతుంది. అపుడు

"శేషుని ఫణాలమెత్తనిశయ్య, పుడమి ఒత్తిలి
గించింది
ఎడారిపుష్పించింది, అండపిండబ్రహ్మాండమంతయు
తాండవనృత్యం చేసింది; ఎందరు పుట్టలేదు
ఇంకెందరు గిట్టలేదు, అందరికీ లభియిస్తుందా
హాలాహల మంటిన హస్తమునస్పర్శ
పెదవులచుంబనము !
కపాలమోక్షం, కపాలమోక్షం !"

భగత్సింగ్‌వంటి యోధానుయోధుల జీవితం ఉదాత్తం చేస్తున్నపు డీ పద్ధతి పౌరాణిక సంప్రదాయం కవికి అత్యవసరం. ఇతని రీతి విచిత్ర

మైనది. దేనినీ వాచ్యం చేయడు; ధ్వనిస్తాడు. వ్యంగ్యవైభవోపేతమైన పంక్తులన్నీ అమృత పేశలమే. పూర్వగాథలను భావంలో పొదుగుతూ, వాటి ఛాయలనున్న రసోదయం కావిస్తాడు. ఆ పౌరాణిక కథలను అవగాహన చేసుకుని, వానిని కవి, తన ఇతివృత్తాని కెలా అన్వయించుకుంటున్నాడో గ్రహించిన పాఠకునికి నారాయణబాబు గీతం మరీ హృదయంగమమౌతుంది. 'గడ్డిపరక' అనే గీతంలో ఈ సూత్రరచన అంతటా కనిపిస్తుంది. సమాజంలో పతితులై పడివున్న పేదలకు ప్రతినిధిగా 'గడ్డిపరక' గొంతును వినిపిస్తుంది. పేదలు, వారి జీవితాలపై సాగిపోతున్న ధనికులు, వీరి సంఘర్షణను మధురంగా చిత్రిస్తాడు. నిత్యం మన కాళ్ళక్రిందపడి నలిగిపోతున్న 'గడ్డిపరక' ఏమంటుందో చూడండి:

"పల్లకీ దిగినట్టి
పెండ్లికొడుకులు మీరు
పట్టు తివాసీని నేను
నడవండి నడవండి

నామీంచి నడవండి" అంటూ తాను 'పశువుల నోటికి పాయసాన్నని' చెప్పుకుంటుంది; కాని నిజానికి తన ఆత్మశక్తిని అది గ్రహించుకుంటుంది. "మాతృవర్గంవాడు, మా అన్న పన్నగమ్ముల చక్షులుత్తరించిన మిన్న" అని—

గరుత్మంతుని కథాకథనం కావిస్తుంది. పన్నగాల కనులుత్తరించిన విధంగా మీకను లూడబెరుకుతానని ధ్వని. అంతమాత్రంతో ఊరుకోక, 'మీకు ఉత్తమగతులు కల్పిస్తున్నా'నని కూడా చాటుకుంటుంది. ఇంతటితో మానవు డూరుకొనవచ్చుకదా! ఇంకా గడ్డిపరకను కాళ్ళక్రింద అణచిపెడుతున్నాడు.

"నేటికి మీపితృకార్యంనాడు
పారణమీద
మీచేతిమీద
మరకత
అంగుళీకమ్ము"

ఇంత సగర్వంగా ఆత్మాభిమానాన్ని ప్రకటించుకుంటున్నా మనిషి ఊరుకోడు. కనుక నే 'మిన్ను విప్పిన రక్తపతాకం' గడ్డిపరకపుట్టిన మన్ను సత్తువ తెలపగా, 'కాకాసురునికథ' జ్ఞప్తికి రాగా, 'ఆగండి ఆగండి' అని హెచ్చరిస్తుంది. సాధారణమైన గడ్డిపరకను చూసి వర్గ సంఘర్షణ నూహించడమే కాక, గరుత్మంతునికథ, కాకాసురునికథ, పారణమీద పితృకార్యంనాటి సంప్రదాయము, భావించి, వానిని కవి వాడుకుంటున్న విధం ఎంతో గొప్పగావుంది. సంప్రదాయాన్ని మరచిన రచనను నారాయణబాబు చేపట్టడు. ఈ సుగుణమే కవితకు క్లాసికల్ స్వభావాన్ని ప్రసాదిస్తుంది.

బీభత్స, వీరరసప్రధానాలయిన రచనలనే కాక, కొన్ని గీతాలలో హాస్యోక్తి, చమత్కృతులతో కవి, వస్తువును విస్తరిస్తాడు.

కవిత్వాన్ని, సంఘాన్ని, విమర్శిస్తూ తన కవితా పటిమను ప్రదర్శిస్తాడు. ఈ ప్రదర్శనలో గ్రీంచి, ఆంగ్ల సంప్రదాయాల ప్రభావం కనిపిస్తుంది. "ఊరవతల" అనే కావ్యం ఇందుకుదాహరణం. భావకవిత్వపు పోకడలమీద, ఛాయావాదమీద ఇది ఒక ఎగుగుదాడి.

"కలల పొదరిళ్ళపై
సౌఖ్యంపు నిదురలో
కనిపించి ఒక తన్వి
మేనక నా పేరు
మేఘాలకు వెనుకప్రక్క
మా ఊరని, మాయమయ్యె
చిరునామా తెలిసికూడ
చేసే దేమీలేక
ఊహాగానం చేయగ
ఊరవతల కెళ్ళాను"

ప్రకృతిలో స్థూలచక్షువులకు కనిపించే రమణీయ దృశ్యాలు ఈ కవికి సౌందర్యాన్నందీయవు. అందరకు మల్లే సౌందర్యగానం చేయడు. అతని దృష్టి వేరొకవిధమైనది. ఉదయసంధ్యతో కూడిన ఆకాశం, నోరు తెరచిన కాకిపిల్ల. ఏమూలలనుంచో అరచే కాకిపిల్ల ఆకలి అరుపులు, ఆకాశం ఘోషిస్తున్నట్లే కవి భావిస్తాడు. ఈ పద్ధతి రచనను పాశ్చాత్యులు 'ఇమేజిస్టు పొయిట్రీ' గా పేర్కొంటారు. ఈ కృతి అట్టి పోకడరచనకు తలమానికం. ఇందులో కవి భావించినవన్నీ దుశ్శకునాలే. ఇనోదయం

పాముకాటు గాను, భూమికి శివజ్వరం, ఎదుట నీడ నీయలేని మోడుమానులజంట, వెంటనే మృత్యువును జ్ఞప్తికి తెస్తూ, యముని దింపివచ్చిన ఎనుబోతు, ఇవన్నీ కవిభావనలు. మరొక అడుగు వేయగా, కనిపించేవే కాక, వినిపించేవి సహితం దుశ్శకునాలే.

> "ప్రేతలతో ఇల్లట్టుల
> బూరుగు వృక్షంమీద
> కళ్ళజోడు పెట్టుకున్న
> గరుడపురాణ బ్రాహ్మడు
> కంఠమెత్తె ఘూకమ్మ"

మనిషి మరణించగా, బాధోపశమనార్థం గరుడ పురాణ పఠనం కావించడం హైందవ సంప్రదాయం. అలాగే కవికి

> "కాటకంపు తాటకిలా
> ఊరుబయట మిల్లు"

కనిపించి 'విశ్వకర్త హృదయంలో దుస్వప్నంలా భగభగమను పొగ గొట్టం' పొగలుచిమ్ముతున్నది. ఈ దుస్వప్నఫలితమే ప్రకృతి కవికి దుశ్శకునాల మయంగా కనిపించడానికి హేతువు. మిల్లులలో ఉత్పత్తిసాగుతున్నా, ఆ సంపద ప్రజలపరం కాలేదు; సరికదా, ఆకలికి, నిరుద్యోగానికి కారకమై, మానవులను యంత్రాల పగిదిగమారుస్తున్నది. ఈ యాంత్రిక స్వభావం, జీవితంలోని రక్తం పీల్చి పిప్పిచేసి అవతలకు నెట్టివేస్తున్నది. అందుకే కాబోలును, మిల్లుదరి నున్న ఎండిన సెలయేరును కవి ఉత్ప్రేక్షిస్తున్నాడు.

> "జీవనమ్మె తీసినారు
> జలమంతా మిల్లుకెత్తి
> పాడలేని గులకరాళ్ళ
> పాతవడ్డ సెలయేరు"

ఈ సెలయేరు ఒకప్పుడు గలగల నవ్వేది. ఆ నవ్వు 'జలమంతా మిల్లుకెత్తి'న కారణంగా ఇంకిపోతుంది.

> "పోయిన యా ఏటినవ్వ
> పుక్కిట నెమరేసుకుంటు
> గండశిల నీడలోన
> కనుమోడ్చిన
> గార్ధభస్వామి"

గతించిన వైభవమంతా నేడు మానవుడు తలచుకుని కను మోడ్చిన గార్ధభంవలె భరిస్తున్నాడే కాని, కారణాల నన్వేషించుకోనడు. సంఘాని కెంతో ఉపకారహేతువవుతున్న గార్ధభం మానవ దృష్టిలో అతి చులకన. కాని ఈ చులకనను క్షమిస్తున్న దాని సహనశక్తి స్థాణురూపమైన దేవునికుండే ఓర్పువంటిది. కనుకనే మామూలు 'గార్ధభం' గార్ధభస్వామిగా కవికి గోచరించింది. పుక్కిట నెమరు వేసుకునే గుణం దానికి సహజసిద్ధమైనది కాదు. కాని పాతతలంపులను తిరగపోసుకునే స్వభావా న్నారోపించి, దాని నోటినురగను, పాతవడ్డ సెలయేటి నవ్వు నురగతో కవి ఉపమిస్తున్నాడు. మీద నుదాహృతమైన గీతం ఇమేజిస్టు కవిత కొక అలంకరణ. ఆధునికాంధ్రసాహిత్యాని కొక శిఖరం. పాశ్చాత్యకవు లిట్టి పోకడల పోహళించిన రచనను కనుల కద్దుకుంటారు.

> "బ్రహ్మచెముడు కంచెమధ్య
> పూర్ణిమసంధ్యల్లోన
> గడిదైనా ఉదయాద్రిని
> రుధిరజ్యోతై వెలిగే జాబిల్లి
> మృతశరీరయాక్రమణ
> ఘటాకాశయరుణారుణ
> రక్తసిక్త మోముతోడ
> 'మా అమ్మే చంపింది
> మా అమ్మే చంపింద'ను
> మానముగ
> గాజుకళ్ల
> పురిటిపిల్ల"

హఠాత్తుగ కనిపించే, త్రోవను నడిచేవారిని నిలబెట్టి ఆశ్చర్యపరుస్తుంది; శరీరం జలదరింప చేస్తుంది. ఆకాశంలో అప్పుడే ఉదయించే చంద్రుని ఎర్రని మోమువలె, కుండలో నిక్షేపించబడిన శిశువు మోము పాలిపోయి కనిపిస్తుంది. కవికి దారి పొడుగునా, తన నీడ, వెంటాడే మృత్యువువలె భయంకరమవుతుంది. ఈ గీతం కాలజ్ఞానులకు కత్తిపదును వంటిది. జీవితం సుఖమయం కావాలని మానవుని ఈప్సితం; జీవితంలో చెడుగు లేదనుకుని, సర్వత్ర మోదాన్నే భావించి కీర్తించడంవల్ల ఈ మనోరథం సఫలీకృతం కాదు. ఉన్న ఖేదాన్ని ఉన్నదని అంగీకరించి, ఎదుర్కొని, బయటకు నెట్టి, జీవితం మోద

మయం చేసుకోవాలి. ఇదే వాస్తవిక దృష్టి. వస్తువులో చెడుగును పరిహరించి, మంచిని నిర్మించే వారిని విలియమ్ జేమ్స్ అనే అమెరికన్ మేధావి '*Twice born*' అని పేర్కొన్నాడు.

మానవు డనేక రాగద్వేష సహితుడు. జీవికి, శారీరిక మానసికవాంఛలు నెరవేరనిదే సంతృప్తిలేదు. ఈ వాంఛ లనేకం. ఆకలి ఒకటే కాక, అది కాస్త తీరగానే సుఖమైన నిద్ర కావాలి.

నిద్రనుంచి లేవగానే, ఆనందమిచ్చే వస్తుసముదాయ మవసరం. ప్రేమ, దుఃఖం, కామోద్రేకం ఇవన్నీ సహజాతే. ప్రకృతి పుట్టినదాదిగా ప్రాణి జీవితంలో ఈలైంగిక సంబంధాలు మరింత బలపడుతూవచ్చాయి. మతంలో, మతోత్సవాలలో, దేవాలయాల శిల్పాలలో, పిండివంటలలో, దీని ప్రభావం ప్రతిబింబితమవుతున్నది. ఈ కామేచ్ఛను మొగ్గలోనే త్రుంచి, అణచిపెట్టడం మానసికారోగ్యాన్ని చెడగొడుతుంది. ప్రబలమైన ఈశక్తిని ఇతర మార్గాలలోనికి మళ్లించినపుడు జీవిత సౌఖ్యం పక్కాగా నిర్మింపబడుతుంది. నిగ్రహం నిగ్రహం కోసమే అని దీనిని అణచుకొనడం ప్రమాదం. ప్రయోజనంతో ఇతర కార్యాలలో దీనిని వ్యక్తం చేయాలి. అప్పుడే అట్టి నిగ్రహం అర్థవంతమవుతుంది. ఈ దృష్టి లోపించిన వారికి, కవి ప్రకృతి అంతా సెక్సుమయంగా గోచరింపచేస్తున్నాడు. 'లెండోయ్ ఋషులు' అనే గీతం మెరపుయుద్ధం వంటిది.

"కనురెప్పల సెజ్జమీద
కళ్లజోడుముక్కుతోడ
వ్యభిచరించె
నట్టింట్లో చిల్లుపడిన
మజ్జిగకుండ, కవ్వం
చీకటి తప్పే చేశాయి"

ఈలైంగికేచ్ఛ ఇంతప్రబలంగా పెనవేసుకుపోతున్నపుడు, అట్టిది సహజంకాదని చూపులకు మడిగట్టుకోవడం వాస్తవికతకు దూరమేకదా!

"కుళ్లిపోయిన కూరగాయలు
కునికిపాట్లు పడుతుంటే
టమాటాపండు మాంసం ముక్క
కలసి అఖండ
సంధ్యారాజ్యం చేస్తున్నాయి"

అనేది కూడా కాచుకోలేని ఎదురుదెబ్బ. ప్రకృతిలో లైంగిక సంబంధాలు అసహజ వాంఛలకు హేతువులనీ, వాటిని పరిత్యజించడమే ధర్మమని బోధించేవారిని

"ఈ సముద్రంతీసి అవతల పారపోయండి
ఆపోసనం పట్టండి
పత్తిగింజలు చుక్కలు, గోళ్ళతో నొక్కండి
సురవిలాసవతులు చూచుకునే
అద్దం, చంద్రుని బ్రద్దలుకొట్టండి"

అని హాస్యం చేస్తున్నాడు. పైవన్నీ ఎంత వీలుకానివో, సెక్సును అణచడం కూడా అట్టిదేనని కవి తాత్పర్యం.

ఇతను రచించిన గీతాలలో, 'విశాఖపట్టణం' అనేది పేర్కొనదగినది. వచనంలా కాక, వచన ధోరణిలో నడచిన గీతం. ఇమేజిజము, సామాజిక విమర్శనతోపాటు ప్రస్ఫుటమవుతుంది.

"ప్రేమకు ప్రాణాలిచ్చే స్త్రీలు
ఉరికొయ్యలాటి మగాళ్లు
... ... ...
సుమాస్త్రాలంతా గుల్లగాళ్లు
పేదవాళ్ళ నెత్తురు
బీరులా త్రాగేస్తారు.
... ... ...
ధర్మాన్ని పశువునుచేసి
పట్టపగలు కోర్టులో
వధచేసి, సాయంత్రం
సురాపానంలో చప్పరించి
నంచుకుంద్రు!"

అనే ఈ పంక్తుల మాధుర్యం ఎనలేనిది. ఇది ఒక ఆధునిక స్థలపురాణం.

నగ్నంగా స్త్రీ స్నానం చేసేటపుడు
ఎదురుగుండా పరాయి మగాడు
ఏరాడకొండ
ఆలిబాబా అద్ది!!"

పాశ్చాత్యకవితలోని ఆధునికత నారాయణబాబు పుణికిపుచ్చుకున్నాడు. దీనికి మన సంప్ర

చాయం రంగరించుకున్నాడు. నిష్పక్షపాత దృష్టితో విమర్శించేవారికి ఈ కవిత్వం ఆహ్లాదం కలిగించక మానదు. శబ్దాడంబరంకోసం వెతికేవారికి ఈ కవనం తృప్తినీయదు. కవిత్వంలో రెటరిక్కు వుండడం సల్లక్షణమని ఆంగ్లేయ విమర్శకులంగీకరించరు, బైరన్‌లో రిటరిక్కు అనే దోషం వున్నదని వారంటారు. సంస్కృతాది హైందవ భాషలలోను, లాటిన్, తత్సంబంధ భాషలలోను ఈ రిటరిక్కును తప్పించుకుని కవనముల్లడం కష్టం. సభావేదికలమీదనుంచి వినిపించే ఉపన్యాసధోరణి కవిత్వం చెప్పేవారికి విసర్జనీయం. ఉపన్యాస విన్యాసం మంచి కవిత్వ పద్ధతి కాదు. అందుకే ఒక ఆంగ్లేయవిమర్శకుడు "*Poetry is overheard*" అని వచించాడు. కవిగా నారాయణబాబులో వక్తృత్వ ధోరణి కనిపించదు; మరి వ్యక్తిగా అతను ఉపన్యాసకుడే. అతని కవిత చదివినపుడు సద్యఃస్ఫురణ కలుగదు. తరచినకొద్దీ అమృతాన్ని చిలుకుతుంది.

"బుద్ధి హృదయం
ధ్యానబుద్ధులై
నిమీలిత నేత్రాలతో నిద్రిస్తే
వ్యక్తావ్యక్తంలోనుంచి
వెలుగుబాటలు చూపించే, నీ జవరే !"

అంటూ కవి తన కవితాపద్ధతికి సూత్రంగా రచించుకున్న సిద్ధాంతాన్ని విడమరచిన పఠితకు, అతని గేయాలు సుబోధకాలవుతాయి. జ్ఞానంకోసం హృదయంలోనుంచి మానసికావస్థను పొందినపుడు అతని కవిత ఆనందజనకమవుతుంది. చీరమడతలు విప్పి కొలిచినట్లు, కవిత్వానికి దండాన్వయం చెప్పడం సులభంకాదు; అవ్యక్త మనోరభావాలను వ్యక్తంచేస్తూ, రసస్ఫూర్తి కలిగించడమే అతని లక్ష్యం.

"హాయిగ అర్ధరాత్రి, ఆడమగ
తడిమిన తెలియని
తాంధ్ర పాపారాయుడు తమస్సు"

ఇక్కడ కవిప్రయుక్తమైన 'తాంధ్ర పాపారాయుడు' 'తమస్సు' అనేవి విశేషణ విశేష్యములా అని విమర్శించి ప్రయోజనంలేదు. దండాన్వయ, వ్యాకరణ పరిధుల నధిగమించి భావం మనస్సులలో కొన్ని 'ఈవకేషన్స్'ను రేపుతున్నది.

"భూమిపూతమట్టి, నిశ్శబ్ద పురాణ సంపుటముల దొంతి"

న్యాయానికి అతని కవిత్వమే నిశ్శబ్ద పురాణ సంపుటాలదొంతి. భావ మొక పూతరేకు. కొన్ని నిగూఢరహస్యాలు అతని కవితలో తొంగిచూస్తాయి. శిల్పం రహస్యంగా వుండిపోతుంది. ఇంద్రియాలు గ్రహించిన అనుభూతులను ఆయా ఇంద్రియాలతోగాక, వానిని భిన్నభిన్న యింద్రియ సంపాదితములుగా పేర్కొనడం ఒక శిల్పరహస్యం. 'తెల్లని రుచి' 'రజతరావ సంగీతం' అనే ఇలని ప్రయోగాలు ఇలాటివి. అతిధైర్యంగా ఇతను చేసిన 'ఐరావతపు పంది అర్ధచంద్రుడు' అనే ప్రయోగాలు నావంటి రసోన్మాదులను మరీ పిచ్చెత్తిస్తున్నవి.

"రుధిరజ్యోతిర్ లలనాప్రియుండ
విప్లవ ఋషిని, విద్రోహకవిని" అని సంకోచ నిబ్బరంతో చాటుకున్న ఈ కవి ధన్యుడు.



# తీరని కోరిక



'హితశ్రీ'

ప్రహారీగోడ గేటుదాటి అర ఫర్లాంగు దూరం నడిచి బంగాళా మెట్లెక్కుతున్న ఉమ రమ అదృష్టాన్ని లోలోపల కనీసం నూరో సారిఅభినందించుకుంది. వొచ్చిన వ్యక్తినిచూసి సీమ కుక్క తోక ముడిచి ఇంట్లోకిదారితీస్తూ తల వెనక్కి తిప్పి బౌ బౌమంది. నేల మీదకూచుని ఆకాశం వైపుచూస్తూ పరాకుచిత్తగిస్తున్న ముసలి నౌకరు రామయ్య ఉలిక్కిపడి ఉమనిచూసి, ఊరుకో మన్నట్టుగా "మోతీ" అని చిరాగ్గా కేకేశాడు. తదు పరిసింహద్వారం కర్టెన్ తొలగించుకుని ఓ పాతికేళ్ల సుందర వదనారవిందం బయటికి తొంగిచూసింది.



"నువ్వేనా, ఉమా! ఎవరో అనుకున్నాను."

"రమాదేవిగారు బలే కుక్కని సంపాయిం చారే!"

"ఏం?"

"ఏంలేదులే. చాలా అందంగా ఉంది."

"ఈమధ్యే కొన్నాను. అన్నట్టు దాన్ని కొన్న తరవాత నువ్వురావటం ఇదేగావును మొదలు."

"ఊఁ. మన రామయ్యేనా కొనుక్కొచ్చింది?"

"ఊఁ ఇంకెవరు?"
అప్పుడే అనుకున్నాన్లే"
రామయ్య ఆమెవైపుకోంచెం అనుమానా స్పదంగా చూశాడు.

"ఏం, అలా అంటున్నావు."

"రామయ్యా సెలక్షన్ కాబట్టే అంతధైర్యంగా వెనక్కి పరిగెత్తింది." ఉమ ముసిముసిగా నవ్వుతూ అంది. రామయ్యాకి కొంచెం ఉక్రోషం వొచ్చింది. ఉమ ఏదోఅనటం, రామయ్యాకి ఉక్రోషం రావటం, తప్పనిసరిగా కనీసం నూరోసారి అది.

"తమర్ని చూసి అదిపారిపోతోం దనుకున్నా రెట్టా?"

"అబ్బే, నే నొచ్చానని మీ అమ్మగారితో చెప్పటానికి పోతోంది."

"నిజం మాట్టాడారు. మీరు నమ్మినా, నమ్మక పోయినా నూటికి నూరుపాళ్లు అంతే." అన్నాడు రామయ్య దృఢంగా.

సరేలే రామయ్యా, నీతో నాకు పోట్లాట ఎందుకు? నీ సెలక్షన్మంచిదే, అయితే నాకో సందేహం పట్టుకుంది."

"సరేలే, లోపలికొచ్చి కూచుందూ." అంది రమ. కాని ఉమ ఆమెమాటలు వినిపించుకోలేదు.

"ఇంట్లో ఎవరూ లేనప్పుడు ఏదొంగో వొచ్చినా, అమ్మగారికోసం పరిగెత్తుకు పోదుగదా, ఈ బొచ్చుకుక్క?"

"తమరు మరీ సిత్రంగా మాట్టాడతారే."

"మరి నేను దొంగని కానని ఈ కుక్కకెలా తెలుసు?"

"తమర్ని చూస్తే తెలీదెట్టా."

"తెలుసుద్దెట్టా?" నవ్వాపుకుంటూ అంది ఉమ.

"ధగధగా మెరిసే ఆ వజ్రాల నెక్లేసు చూసి వొచ్చిం దెవురో పసికట్టేసింది మా రాజాకుక్క."

ఉమ ఒక్కసారిగా నవ్వేసింది. రమ కూడా ఓసారి ఉమ నెక్లేసు వైపుచూసి శృతి కలిపింది.

"అయితే మీ కుక్క భలేగా బోల్తాపడ్డదిలే. ఇది ఇమిటేషన్ వజ్రాల నెక్లేస్. దొంగలూ, దొరలూ కూడా కొనగలరు." అనేసి లోపలికి వెళ్ళి పోయింది ఉమ రమతోసహా.

ఆమెవైపు కొంచెం ఆశ్చర్యంగా చూసి, "బలే సరదాగా మాట్టాడుద్ది మా తల్లి." అనుకుని మళ్ళీ నేలమీద చతికిలబడి ఏవో ఆలోచనలలో పడిపోయాడు రామయ్య. అది ఇమిటేషన్ వజ్రాల నెక్లేస్ అవటం అతనికి మహాశ్చర్యంగా ఉంది. కాని మరు నిమిషంలో అతనా సంగతి పూర్తిగా మర్చిపోయి ఇతర విషయాల్ని గురించి ఆలోచించసాగాడు. రమ ఈ విషయం అంత సులభంగా మర్చిపోలేక పోయింది. ఆమె ఇమిటేషన్ వజ్రాల్ని గురించి విన్నది, కాని అవి గుర్తు తెలియకుండా అసలు వజ్రాలలా చలామణీ కాగలవని ఆమెకి అదివరదాకా తెలియదు. తెలిసిం తరవాత అది ఆమెకి చాలా తమాషాగా కనిపించింది. ఉమ నెక్లేస్ వైపు ఆమె చాలాసార్లు సంభాషణ సాగుతున్నంతవరకూ అదో రకమైన విస్మయంతో, కుతూహలంతో చూసింది.

ఉమ వెళ్లింతరవాత, ఉండబట్టలేక రామయ్యతో అంది రమ.

"చూశావా, రామయ్యా! ఉమాదేవిగారిది ఇమిటేషన్ వజ్రాల నెక్లేస్ట. తమాషాగా లేదూ?"

"తమాషా ఏముందమ్మా? ఈ రోజుల్లో అన్నీ తమాషాలే, ఏవికావు."

"చూడటానికి బాగానేఉంది. చెబితేగాని తెలీదు."

"ఔను."

"ఇహ అసలు వజ్రాలకి విలువ ఏముంటుంది?"

"అదేం మాటమ్మా?"

"తేడా తెలిస్తేనేగా విలువ?"

"ఎందుకు తెలవదు? తమలాంటోళ్లు పెట్టుకుంటే అసలు వజ్రాలు. తక్కువోళ్లు పెట్టుకుంటే నకిలివి." చాలా సూక్ష్మవిషయం అన్నట్టుగా నవ్వేశా డతను. కాసేపటిదాకా రమ మాట్లాడలేదు. తరవాత అంది.

"మరి, డబ్బున్నవాళ్ళుకూడా అవే పెట్టుకుంటే?"

రామయ్య కొంచెం చిక్కులోపడ్డవాడిలా ముఖంపెట్టి, మళ్లీ ఏదో స్ఫురించగా నవ్వేసి అన్నాడు.

"ఎందుకు పెట్టుకుంటారమ్మా డబ్బున్న మా గాజులు? ఎవరో పీనాసోళ్ళుంటే ఏమో గాని..."

"ఊరికే, తమాషాకి..."

"ఎవరన్నా తమాషాకి పెట్టుకుంటారా ఏమిటమ్మా? నవమంత్రపుసిరి పట్టుకొని కగ్చుపెట్టలేక దాచుకునేవాళ్ళు ఆ నాటనాలగాని బయటికి..."

రమ కాసేపు ఊరుకుని అంది.

"నాలాంటివాళ్లు పెట్టుకుంటే...?"

"తమలాంటివాళ్ళు అసలు వాటివైపే చూడరు గదమ్మా!"

రమ మళ్ళీ కాసేపు నిశ్శబ్దంగా ఉండి తరవాత అంది. "మీ బాబుగార్ని తమాషా చేస్తే...?"

ఈసారి రామయ్య ఆమె ముఖంలోకి భావయుక్తంగా చూసి నవ్వుతూ అన్నాడు.

"ఈ ముసలోడ్ని ఆడించినట్టు బాబుగార్ని ఆడించగలరంటమ్మా!"

"మా నే?"

"బాబుగారి విషయం నాకు బాగా తెలుసు. ఏమీ లాభంలే" దన్నట్టుగా తల ఆడించాడు రామయ్య.

"చూద్దాం."

"అయితే ఆ అమ్మగారింటి కెళ్లిరమ్మన్నారా"

"ఎందుకు?"

"మరి యాడనించి వొస్తది? మనం కొనం గదా!"

"ఏం?" చిన్నగా నవ్వింది రమ.

"ఏం ఆడిస్తారండమ్మా! తమరి సంగతి నాకు తెలవనట్టు మాట్టాడతారు. తరవాత పెట్టుకునే వాళ్లయితే కొంటారు గాని...సిత్రంగా మాట్టాడతారు."

"పెట్టుకుంటే గాని కొనగూడదా ఏమిటి?"

రామయ్య ఆమెవైపు అదోమాదిరిగా చూశాడు.

"ఏమైనా మనం నకిలీ వస్తువులు కొనం గదమ్మా అవి డబ్బు లేనోళ్లు, పీనాసోళ్లు కొనుక్కునేవి. ఇయాల అమ్మగారు నన్ను ఆడిస్తున్నారు"

రమ ఈసారి గట్టిగా నవ్వింది.

"తమాషాగా అన్నానులే."

"ఆ అమ్మగారింటి కెళ్లిరానా?"

"ఇప్పుడు కాదులే. తరవాత చెబుతాను."

రామయ్య ముసిముసిగా నవ్వుకున్నాడు. రమ అతనివైపు అలాగే కాసేపు చూసి చిన్నగా నవ్వి వెళ్లిపోయింది.

*　　*　　*　　*

బిజినెస్ మాగ్నెట్ రామకృష్ణ సుపరిచితమైన కారు దుకాణంముందు ఆగగానే సేఠ్ రాజారాం ఉల్లాసంగా ఎదురువెళ్లి రామకృష్ణనీ, రమాదేవినీ ఆహ్వానించాడు. "డైమండ్ నెక్లేసులు చూపించండి." రామకృష్ణ ఠీవిగా జేబురుమాలుతో ముఖం తుడుచుకుంటూ ఆర్డరిచ్చాడు. షో కేసుల్లోంచి కళ్లు చెదిరేట్టుగా వజ్రాలహారాలూ, ఉంగరాలూ మొదలైనవి కనిపిస్తున్నాయి. అందులో సరిగా ఉమాదేవి నెక్లెస్‌లాంటిదే ఒకటి కనిపించగా రమ దాన్ని చూపించమంది. సేఠ్ ఒక క్షణం తెల్లపోయి "అది ఇమిటేషన్ వజ్రాల నెక్లెస్ అండీ." అన్నాడు. ఆ మాట విని ఆమె రామకృష్ణవైపు చూసింది. అతని ముఖం కొంచెం చిన్నబోవటం ఆమె కనిపెట్టక పోలేదు. ఒక్కక్షణం తొట్రుపడి అతనన్నాడు.

"ఆ నమూనా చాలా బావుంది. అటువంటిదే మంచి వజ్రాల నెక్లేస్ లేదా?"

"ఎందుకు లేదు?" సేఠ్ స్వయంగా వెళ్ళి ఒక చిన్న పెట్టె తీసుకొచ్చి నెక్లేస్ చూపించాడు. రామకృష్ణ 'ప్యాస్' చేశాడు.

రమ కూడా ఒప్పుకుంది.

"పదివేలు" అన్నాడు సేఠ్.

"దానికీ, దీనికీ తేడా ఏమిటి?" రెంటినీ చూపించి అడిగింది రమ.

సేఠ్ నవ్వి "లెన్సుపెట్టి చూపిస్తాను" అన్నాడు.

రామకృష్ణ నిర్లక్ష్యంగా "మీ మాట చాలదా?" అన్నాడు.

రమ నవ్వుతూ "రెండూ తీసుకుంటే!" అంది.

రామకృష్ణ ఆశ్చర్యంగా ఆమెవైపు చూసి అన్నాడు.

"అదెందుకు, నకిలీది?"

రమకి ఏమనటానికీ తోచలేదు. నవ్వింది.

"ఏం?" అన్నాడతను.

"ఊరికే అన్నాను" అందామె.

రామకృష్ణ ఊపిరి కొంచెం స్వేచ్ఛగా పీల్చాడు.

మళ్లీ రమ చిరునవ్వుతో అంది.

"డైమండ్ నెక్లెస్ కొంటే ఒక ఇమిటేషన్ డైమండ్ నెక్లెస్ ఊరికే ఇవ్వాలండి సేఠ్ గారూ"

"హా...హా...తమ లాంటి వాళ్ళే అలా అంటే!"

"హి...హి..." పెద్దగా నవ్వాడు రామకృష్ణ.

"ఇమిటేషన్ మాత్రం, తమరేం చేసుకుంటారు?"

"ఏ పని చేసే వాళ్లకో ఇవ్వొచ్చుగా" రామకృష్ణవైపు చూస్తూ అందామె.

సేఠ్ పెద్దగా నవ్వాడు.

"పనిచేసేవాళ్ళకి నెక్లెసు లెందుకండీ?"

"బాగా చెప్పారు" అన్నాడు రామకృష్ణ.

"ఊరికే ఇచ్చినా, పేరేగాని, దీని ఖరీదు కూడా గాంట్లోనే వేసుకుంటా రనుకోండి."

"ఎంతమాట!" అన్నాడు సేఠ్ సందర్భం సరిగా అర్థం కాక.

"సరే. ఇహ పోదాం" అన్నాడు రామకృష్ణ.

డబ్బు ఇచ్చేసి, కారులో స్టీరింగ్ దగ్గర కూచుని పక్కన కూచున్న రమవైపు చూసి అన్నాడు రామకృష్ణ.

"హడిలి చచ్చాననుకో. ఆ నకలీది నిజంగా కొంటావేమో ననుకున్నాను."

"అంత హడలెందుకు?" రమ కొంచెం చిన్న బుచ్చుకున్నట్టుగా మూతిముడిచి అంది.

"నువ్వు హాస్యాని కన్నావని నాకేం తెలుసు?"

"నా సంగతి మీకు తెలీదూ?" వెంటనే అందామె.

"ఎందుకు తెలియదు? అవతలవా డెక్కడ మిస్ మెంటాలిటీ అనుకుంటాడో నని నా భయం. నీ హాస్యం సంగతి వాడికేం తెలుసు?"

రమ ఏమీ అనలేదు.

"అయినా నువ్వు ఆ నకిలీ దాన్ని గురించి గుచ్చి గుచ్చి అడగటం అంత బావుండలేదు రమా."

రమ ఒకసారి అతని కళ్ళలోకి చూసి హఠాత్తుగా గట్టిగా నవ్వేసి, "నిజంగా, నేనది కొంటాననే మీరనుకున్నారా ఏమిటి?" అంది. రామకృష్ణ కూడా నవ్వి "ఛ...ఛ..."అన్నాడు.

రాత్రి ఎనిమిదిగంటలవేళ విద్యుద్దీప కాంతిలో ఉమ వజ్రాలహారం పరిశీలిస్తూఉంటే, ఆమె కెదురుగా టేబిల్ ఇవతల రమకూచుని ఉమ ఇమిటేషన్ వజ్రాల నెక్లెసు వైపు తదేకంగా చూస్తోంది. ఉమ పరీక్ష పూర్తిచేసి ఆ నెక్లెస్ ని బల్లమీద ఉంచింది.

"ఎలా ఉంది?"

"వేరే అడగటమెందుకు? చాలా బావుంది."

"నీ నెక్లెస్ కీ, దీనికీ స్థూలంగా జూస్తే భేదం ఏమీ లేదు."

"స్థూలమేమిటి, బాగా తెలిసినవాళ్ళకి గాని భేదం కనపడదు."

ఉమ తన నెక్లెసుతీసి బల్లమీద రమ నెక్లెసు కెదురుగా ఉంచి పోల్చిచూడసాగింది:

"నేను కూడా అటువంటిదే కొంటే ఎలా ఉండేది?"

"అదేమిటి? నీకేం కర్మం? కొనలేని నాలాంటి వాళ్లకేగాని నీలాంటి పిల్లజమీందారిణుల కిలాంటి వెందుకు? కొన్నా నలుగురూ నవ్వుతారు."

"భేదం కనపడనప్పుడైతే నేం?"

"బావుంది. డబ్బు ఖర్చుపెట్టుకుని అనుభవించటం కోసం కాదూ? మనల్ని మనం మోసగించు కుంటూ ఇతర్లని మోసగించటంలో ఆనందం ఏముంటుంది?"

రమ ఆమెవైపు కొంచెం పరీక్షగా చూసింది.

"ఏమిటి నువ్వనేది?"

ఉమ కొద్దిగా ముఖం ముకుళించుకుని అంది.

"నలుగురూ మంచివజ్రాల నెక్లెస్ అనుకోవాలనేగా ఇది పెట్టుకోటం."

ఆమె స్వరంలోని అసంతృప్తిని స్పష్టంగా గమనించింది రమ.

"అంతేనా?"

"కాక?"

రమ ఏమీ అనలేదు. ఆమె పెదవులు నవ్వటానికి ప్రయత్నించాయి.

"ఒక్కొక్కప్పుడు మనుషుల ఇష్టాయిష్టాలు చిత్రంగా ఉంటాయికదూ?"

రమవైపు ఓసారిచూసి "ఏం?" అంది ఉమ.

"ఏం లేదులే. చూస్తే నీకు డైమండ్ నెక్లెస్ మీద మనసు పారిందల్లే ఉంది."

"మనసుల కేం! ఇష్టంవొచ్చినటు పారుతూనే ఉంటాయి. ఘనమూల మిదం జగత్. అది లేనిదే ఏం లాభం?"

"డబ్బుంటే అన్ని కోరికలూ తీరతాయా?"

"డబ్బుతో సంబంధించినవన్నీ అని నా అభిప్రాయం."

రమ సమాధానం చెప్పకుండా తినలో తాను

నవ్వుకున్నట్టుగా పెదవులు కొద్దిగా విస్తరింప చేసింది. ఉమే అంది మళ్ళీ, తన ప్రకటనకి సవరణ ప్రతిపాదిస్తూ.

"అయితే కొంతమంది డబ్బున్నా సుఖపడ లేరులే."

"ఎవరిసంగతి నువ్వు మాట్లాడేది?"

"మన రాజ్యంలేదూ! గెజిటెడ్ ఆఫీసర్ భార్యకదా! పైగా ఎకరాలు అటూ, ఇటూ కూడా తెగకలిశాయీ! నిన్న కాక మొన్న ఇమిటేషన్ డైమండ్ నెక్లేస్ కొంది..."

రమ ఒకక్షణం ఉమ కళ్ళలోకి చూసింది. ఆమె చూపులో విస్మయం, మరేదో భావంతో మిళితమై తాండవమాడింది.

"నీకు కూడా ఆశ్చర్యంగా ఉందా? దాన్ని పీనాసితన మనాలో, కొంచెపు మనస్తత్వ మనాలో నాకు తెలియటంలేదు."

రమ ముఖంలో కొంచెం కాంతి తగ్గింది. నెమ్మదిగా అంది. "చుట్టూ ఉన్న సంఘం అద్దం లాంటిది." ఉమ తన ధోరణిలో అంది. "రాజ్యానికి ఆలోచన తక్కువ. బొత్తిగా ఆలోచించదు. నలుగురిలో తిరుగుతున్నప్పుడు, తన్నిగురించి నలుగురూ ఏమనుకుంటారో దానికి అక్కర్లేదు. డబ్బు కూడ బెడితే సరి..."

ఉమ విసుగ్గా "పోనిద్దూ" అంది. మరుక్షణంలో లైటు ఆరిపోయింది.

"ఎలెక్ట్రిసిటి ఫెయిలయింది. ఇప్పుడే వొస్తుందిలే, మామూలే." అంది రమ కంగారుపడుతున్న ఉమతో. రెండు నిమిషాలు గడిచాయి.

"దొంగలకి పగలంటె భయం, దొంగవజ్రాలకి రాత్రి అంటే భయం." ఉమనవ్వుతూ అంది. రమ యథాలాపంగా 'ఊఁ' అంది.

బయట దగ్గు వినిపించింది.

"అడుగో మీముసలి నౌకరు షికారునించి ఇంటికి చేరుకున్నాడు."

"రోజూ సాయంత్రం మోతీని బయట తిప్ప మన్నానులే."

రమ జవాబు పూర్తయేలోపలేమోతీ 'కుంయి' మంటూ ఆ అస్పష్టకాంతిలో తన యజమానురాలిని గుర్తించటానికి ప్రయత్నించి, ఉమ కుర్చీలోకి ఒక్క దూకు దూకింది. ఉమ ఉలిక్కిపడి గభాలున ఆ కుక్క పిల్లని బల్లమీదికి విసిరేసింది. ఆ ఊపుతో మోతీబల్లమీది రెండు నెక్లెసులతో సహా రమ ఒళ్లోపడిపీఠంవేసుకుకూచుంది. రమ కుక్కపిల్లని నిమిరి బల్లమీద ఉంచింది. ఆమె ఒళ్లో, చీకటిలోకి కాంతిని ప్రసారంచేస్తూ, దొంగని పట్టుకోటానికి వేసిన సెర్చిలైటులాగా వెలుగుతోంది డైమండ్ నెక్లేసు. పక్కనే, రహస్యం బయటపడిన దొంగలాగా వెలవెల పోతూ ఇమిటేషన్ డైమండ్ నెక్లేస్ మినుకుమినుకుమంటోంది. రమ హృదయంలో అనిర్వచనీయమైన అభిమానం—తప్పు ఒప్పుకుని అసహాయంగా దిక్కులు చూసే నేరస్థుడిని చూస్తే కలిగే జాలిలాంటిది—ఏదో కలిగింది. ఆ రెండిటివైపూ ఆమె అలాగే చూడసాగింది...

లైట్లు వెలిగాయి.

"అమ్మయ్య, ఇహ వెడతాను." ఉమ లేచి నుంచుంది. రమ ఆమెచేతికి నెక్లేసు అందించింది. నెక్లేసు అందుకుంటూన్న సమయంలో రమ చెయ్యి తగిలి, కొంచెం ఆశ్చర్యంతో అంది ఉమ.

"ఇంత వేడిగా ఉంది—జ్వరం తగిలిందా ఏమిటి?"

"ఉఁహు...ఏం లేదు." రమ నసిగింది.

"అదేమిటి, కొంచెం వొణుకుతున్నావు కూడా. డాక్టరుకి కబురుచెయ్యి."

"అబ్బ, ఏం లేదులే." కొంచెం విసుగ్గా అంది రమ. రామయ్యా, డ్రైవర్ ని త్వరగా కారు తీసుకు రమ్మను. అమ్మగారు వెడుతుందిట."

ఉమ నెక్లేసు పెట్టుకుని బయలుదేరింది. అదే క్షణాన మళ్ళీ లైట్లు ఆరిపోయాయి. తన కంఠంలో కాంతివంతంగా వెలిగే నెక్లేసువైపు ఆశ్చర్యంగా చూసి ఉమ వెనక్కి తిరగబోయే సమయంలో హఠాత్తుగా మళ్ళీ లైట్లు వెలిగాయి. ఆమె వెనక్కి తిరిగి చూసింది. రమ కుక్కపిల్లని 'ఫీఃమ్స్' చేయిస్తోంది.

ఆమె ఇదేం గమనించినట్టులేదు.

"రమా, మన నెక్లేసులు సరిగా ఉన్నాయా?"

"ఎందుకుండవు, చాదస్తం. పద, పోదాం."

"మారుపడలేదుగద!"

"ఎందుకు పడతాయి? ఒకవేళ పడితేమాత్రం, ఇందులో పోయేందుకు లక్ష లేమున్నాయి?"

"అబ్బ, ఎంత నిర్లక్ష్యం? ఇదంతా నా దగ్గిరే. ఎలాగూ పోదని ధైర్యం"

"సరేలే, అడుగో డ్రైవర్ వొస్తున్నాడు, పద."

ముందుకుపోయే బదులు ఉమ వెనక్కి వొచ్చి, స్విచ్ వేసింది. లైటుఆరిపోయింది. ఉమ నవ్వి అంది. "ఇప్పుడు తెలిసిందా?" ఆమె నవ్వుతో పాటు లైటు కూడా వెలిగింది. "అసలు పొరపాటు చేశాను. కొట్టేసి ఉండాలిసింది. తెలివితక్కువదాన్ని."

"నువ్వు తెలివిగలదానివని ఎవరనుకున్నార్లే!" రమ ముఖంమీద కొట్టినట్టుగా ఇలా అనటం మొదటిసారి కాకపోయినా, ఈసారి నవ్వుతూ అలా అనక అతి విసుగ్గా అనటం స్పష్టంగా గమనించిన ఉమ, రమవైపు ఒక క్షణం తేరిపార చూసింది.

# పదములు-శృంగారము



శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

'అమరుకకవేః ఏకః శ్లోకః ప్రబంధశతాయతే' అని ప్రాచీనుల ప్రస్తుతి. రససిద్ధి సంపాదనంలో శృంగారసర్వస్వం అనదగిన అమరుక కావ్యంలోని ఒక్కొక్క శ్లోకమూ ఒక్క ప్రబంధమే యేమి నూఱు ప్రబంధములకు సమానము కాగలదని ప్రాచీనాలంకారికుల విశ్వాసం. సంస్కృత భాషా వాఙ్మయంలో అమరుక మెట్టిదో ప్రాకృత భాషా వాఙ్మయంలో హాలుని గాథా సప్తశతి అట్టిది. రెంటను ప్రతిపాద్యము శృంగారమే అయినా గాథా సప్తశతి కల్లకపటము తెలియని పల్లెపడుచువలె దైనందిన జీవితములోని మధురఘట్టములను నిర్వ్యంచనంగా నగ్నంగా ప్రదర్శిస్తూ సహజ సౌందర్యంతో ప్రతిభాసిస్తున్నది. అమరుకము, గాథాసప్తశతి, ఆర్యాసప్తశతి, గీతగోవిందము అనునవి శృంగార రసోత్తరము లయిన మధుర రచనములు. సాహితీ రసజ్ఞుల కివి అమృతోపమానములు. తెలుగున వీనిని మించిన ఆనందానుభూతిని రసజ్ఞకోటికి పదసాహిత్యం ప్రసాదించినది. తెలుగులో శృంగార కావ్యములు బహుళముగానే కలవు. కాని పదసాహిత్యము కలిగించిన రసానుభూతిని కలిగించడంలో అవి సమర్థములు కావన్న విషయం సత్యదూరం కాదు.

ఆంధ్ర సాహిత్యోద్యానంలో పొగరు మిగిలిన కోయిలలు స్వచ్ఛంద సుందరంగా మధుర గానాలాపములు చేసిన మనోజ్ఞకాలం అది! మానవజీవితంలో యౌవనంవలె ఆంధ్ర సాహితీజీవనంలో పరువమునకు గరువము వెలసిన కాలం అది! యౌవనోన్మాదం కన్నుల కెగదట్టినపుడు ప్రపంచములోని సర్వమూ సుందరముగా తోచినట్లు ఆ కాలంలో కవీశ్వరులకు కవితాజగత్తు అంతా సౌందర్య మహితంగా ప్రతిభాసించింది. వారి సుందర సుమధుర దృక్పథ ఫలితమే తెలుగున వెలసిన పదసాహిత్యం. వారి దొక అపూర్వ దృష్టి! అది ఒక అపూర్వసృష్టి! తెలుగువారు పండించుకొన్న క్రొత్తపంట అది. తెలుగుసాహితి చేయించుకొన్న క్రొత్తసొమ్ము అది. అది సాహిత్యవీథిలో వెలసిన సుందర నందనోద్యానం!

తెలుగులో యీ పదసాహిత్యం యేనాడు అవతరించినో సరిగా చెప్పదగిన ఆధారాలు మనకు లభింపలేదు. తెలుగులో తొలిసారిగా పద్యకవిత్వం వెలయడానికి పూర్వమే గేయాత్మకమయిన యీ పదకవిత్వం వున్నట్టున్నది. క్రీస్తుశకం పండ్రెండవ శతాబ్దివాడయిన పాలకురికి సోమనాథుడు తుమ్మెదపదములు, ప్రభాతపదములు, పర్వతపదములు, ఆనందపదములు, శంకర పదములు, నివాళి పదములు, వాలేసు పదములు, గొబ్బి పదములు, వెన్నెలపదములు మొదలయిన పద రచనా ప్రభేదములను పేర్కొనినాడు. అతని కింకా పూర్వంలోనే సామాజిక జీవనానికి సంబంధించిన పదరచన లనేకములు బహుళ ప్రచారములో నున్నట్టు తెలియవస్తున్నది. ఇలా సామాజిక జీవన వర్ణనాత్మకము లయిన పదరచనములను తరువాతి కొందఱు భక్తాగ్రేసరులు భక్తివ్యక్తికి సాధనాలుగా వుపయోగించుకున్నారు. ద్వితీయ ప్రతాపరుద్రుని కాలంలో ఓరుగంటికి సమీపప్రాంతాలలో నివసిస్తూవుండిన కృష్ణమాచార్యులు మహాభక్తాగ్రేసరుడు. అతడు సింహాద్రి నరసింహస్వామి భక్తుడు. అతడు తాళగంధి వచనములను రచించి భగవంతుని కీర్తించినాడు. అతని తరువాత సుప్రసిద్ధ సంకీర్తనాచార్యులు తాళ్ళపాకవారు భక్తివ్యక్తికి పరమ సాధనంగా యీ పదరచనలను వినియోగించుకున్నారు. ఇంతదాకా భక్తిమయము లయిన గేయాత్మక రచనము లివి తాళ్ళపాక అన్నమయ్య కాలంలో శృంగార సంకీర్తనములను స్వరూపాంతరమును పరిగ్రహించినవి. భగవంతుడు

వేంకటేశ్వరస్వామి నాయకుడు. భక్తుడు నాయిక. వేంకటేశ్వరుడు తానొక్కడు పురుషుడు. మానవ కోటి స్త్రీ. ఈ స్త్రీ పురుషుల అనంత శృంగార లీలయే విశ్వము. ఇట్టి అలౌకిక మధురభావము అన్నమయ్య శృంగార సంకీర్తనములకు బీజమయినది. ఏతద్భావస్ఫూర్తితో అన్నమయ్య శ్రీ వేంకటేశ్వర లీలలను అనంతముగా శృంగార సంకీర్తనములలో కీర్తించినాడు. అతడు రచించిన యధ్యాత్మ సంకీర్తనల సంఖ్యకన్న శృంగార సంకీర్తనల సంఖ్య యధికముగా నున్నది. ఇందుచే నీయలౌకిక శృంగార భావము అన్నమయ్యలో యెంత రూఢముగా వేళూనుకొని చిలవలు పలవలు వేసినదో ఊహింపనచ్చును.

'శ్రుతులై శాస్త్రములై
పురాణకథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీథులై
వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభ
రతిక్రీడారహస్యంబులై
నుతులై తాళులపాకయన్నయ
వచోనూత్నక్రియల్ చెన్నగున్-'

అన్నమయ్య శృంగార సంకీర్తనములు 'వేంకటశైల వల్లభరతి క్రీడారహస్యముల' వెల్లడించునవి. అవి పదసంజ్ఞ దాల్చినవి. అధ్యాత్మ సంబంధములగు సంకీర్తనములును పదరచనములే యయినప్పటికిని శృంగార సంకీర్తనముల యావిర్భూతితో నవి పద సంజ్ఞను కోలుపోయి కేవల సంకీర్తన సంజ్ఞను మాత్రము తాల్చినవి. నాటినుండి పదసంజ్ఞ శృంగార సంకీర్తనములయందు రూఢమై పోయినది. భగవద్గుణ సంకీర్తనాత్మకము లయిన పదరచనములకు సంకీర్తనములని, శృంగార సంకీర్తనములకు పదములని వ్యవహారము నాటినుండి యేర్పడినది. తాళ్ళపాక చిన్నన్న సంకీర్తన లక్షణంలో యీ రెండువిధము లయిన రచనలకు లక్షణం నిరూపించినాడు.

'వైరాగ్య వృద్ధికరగం
భీరపదశ్రేణి పొసఁగఁ బెనుపుచు నగ్రా
మ్యారమ్య విష్ణుచరితో
దారములైయున్న జాలుధరణిన్ వెలయున్.
దేహాత్మేశవివేకో
త్సాహంబును లోక వేదధర్మాధర్మా
ద్యూహాపోహంబులఁ గల
యాహరిసంకీర్తనంబు లధ్యాత్మంబుల్.'

అధ్యాత్మ సంకీర్తనములు వైరాగ్యవృద్ధి కరగంభీర పదశ్రేణి కలిగి యగ్రామ్యములు, విష్ణుచరితోదారములు నయి చెలువార వలయును. శృంగార ప్రధానము లయిన పదములలో గ్రామ్యోక్తు లుండ వచ్చును.

'పదములు శృంగారవధూ
మృదుమధురమనోజ్ఞ వాక్యమిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ జొంక మెఱఁగి పలుకఁగవలయున్,
పల్లవనారీ మ్లేచ్ఛా
ద్యుల్లాసమనోజ్ఞ బంధురోక్తులు చవియై
చెల్లును గ్రామ్యము లయినను
హల్లీసకముఖ్య నాటకాదికఫణితిన్.'

'శృంగార ఏవ ఏకోరసః' అని భోజదేవుని అభిప్రాయము. ఇతరము లాతనికి రసములు కావు. మానవునకు స్వభావసిద్ధమైన హృదయస్పందము రాగమయము. ఆరాగము స్పష్టము కానపుడు అది రూపాంతరములలో గోచరించును. స్పష్టము కాగా రాగము రాగమె యై శృంగారములో పర్యవసించును. ఇది సాధారణముగా భోజదేవుని భావము. తక్కిన రసములు చరమావస్థయందే మనోహరము లగుచుండగా శృంగార మాద్యంత మధురమగుచున్నది. అన్యరసవిషయమున కావ్యగతమయిన గుణగణనీయత లోకమున నుండదు. ఉద్ధతములయిన వీర రౌద్రభయానక బీభత్సాదులు అసాధారణములు. ఆనంద జనకతకు అవి సద్యశ్శక్తములు కావు. శృంగార రసస్థాయి భావము రతి. రతీతరములయిన రసస్థాయులకు శృంగారమున కున్నంత చురుకుగాని శుద్ధిగాని లేవు. అందుచేతనే శృంగారమునకు ఉజ్జ్వల, శుచియను నామాంతరములు కలిగినవి. సృష్టిరహస్యమంతయు నిముడ్చుకొన్న యీ శృంగారము తరతరముల దేశదేశముల సారస్వతోపాసకుల నుజ్జూతలూగించినది. తెలుగు కవులలో ననేకులు శృంగారము నారాధించినవారే!

అన్నమయ్య శృంగార సంకీర్తనములలోని శృంగారము దివ్యశృంగారము. అతని శృంగార

విషయక సంకీర్తనములను జగువునపుడు మనసున నెట్టి వికారమును జనింపదు. అది యొక యలౌకికానందమును జేకూర్చుటతో పర్యవసన్నమగును. అన్నమయ్యకు తరువాత శృంగారమును తన పదములలో ముంచెత్తి వేసినవాడు పదకవితాసార్వభౌముడు క్షేత్రయ్య. అతడు చూపినమార్గము నందుకొని యతని తరువాతివారు వంగల సీనయ్య, సారంగపాణి, కస్తూరి రంగకవి, సభాపతయ్య మొదలగువారు శృంగార రసోత్తరములయిన పదములను విరచించి మించినారు. క్షేత్రయ నాటినుండి తెలుగున వెలసిన పదరచనము లన్నీ శృంగార రసగుళికలు! ఆలంకారికులు తమ యలంకార శాస్త్రగ్రంథములలో నానావిధ శృంగారభావములకు లక్షణముల నిరూపించి లక్ష్యముల నొసగిరి. ఆ లక్ష్యములు శృంగారమును సూచించుననే యయినను నందలి కామతంత్రము అస్పష్టము, అజ్ఞేయమునై దూరదూర్గ మయినది. తెలుగు పదసాహిత్యములో నది అదూరమయిన తంత్రము! అమరు శతకంలోని శృంగారము కామినీకాముకుల గాఢ ప్రణయమును భావింపజేస్తుంది. అమరుకదేవు డొక్కడే నాయకుడు. నాయిక ఒక్కతె కాదు. అనేకలు. అనేకరీతులవారు. నానా నాయికల తృప్తి సంతృప్తులు, బాధావ్యథలు, ఎడమోములు, పెడమోములు నందున్నవి. కాని తెలుగు పదరచనములలో వున్న రమ్యత అందులో లేదు. అందు ముఖ్యముగా క్షేత్రయ్యపదములలో అట్టి రమ్యత హృదయగోచరం కాగలదు. ఆ రమ్యత సహృదయుని మనస్సులో గిలిగింతలు పెట్టగల సామర్థ్యం కలది. ఇదే అన్నమయ్య శృంగారపదములకు, తక్కిన పదరచయితల శృంగారపదములకు వున్న ప్రధానమయిన భేదం. అన్నమయ్య శృంగారపదములలో వర్ణితమయిన దివ్యశృంగారం పలుచబాఱి క్షేత్రయ్య రచనములో లౌకిక శృంగారముగా పరిణమించినది. క్షేత్రయ్య చూపిన మార్గమును తరువాతిపద రచయితలు అనుసరించినారు. కాగా క్షేత్రయనాటి నుండి పదరచనలలో విశేషంగా లౌకిక శృంగారమే ప్రతిపాద్యమయింది.

భానుదత్తుడు రసమంజరిలో నాయికా లక్షణములను ప్రస్తరించి నిరూపించినాడు. భోజదేవుడు శృంగార ప్రకాశములోను, శారదా తనయుడు భావప్రకాశములోను నాయికల విశేషముల నింక నెన్నిటినో చూపినారు. ఆయా భేదములన్నీ తెలుగుపదరచనలలో గోచరించును. ఆలంకారికులు కావించిన బహువిధ నాయికా భేద నిర్వచనములు చాలవన్నట్టుగా ఈ పదరచనములలో ఒక్కొక్క పదములోను, ఒక్కొక్క నాయిక విలక్షణ హావభావములతో ప్రత్యక్షం అవుతూవుంటుంది. నేడు ఉపలబ్ధమవుతున్న క్షేత్రయ్య పదములలోనే దాదాపు పదశతము స్వీయా నాయికలకు లక్ష్యములు. సుమారు అఱువది పదములకు పైగా పరకీయాలక్ష్యములు. ఇంచుమించుగా అన్నిపదములే సామాన్యాలక్ష్యములు. తెలుగులో వెలసిన తక్కిన పదరచనలను కూడ యీ రీతిగానే వర్గీకరిస్తే వివిధనాయికలకు లక్ష్యములు ఎన్నో మనకు లభింపగలవు.

వివిధనాయికల అనుభవములను నిరూపించే యీ పదరచనలు నాయికా ప్రధానకములు. నాయకు డొక్కడు. మువ్వగోపాలపదములలో అతడు మువ్వగోపాలుడు. మన్నారురంగని పదములలో అతడు మన్నారురంగడు. సారంగపాణిపదములలో అతడు వేణుగోపాలుడు. సభాపతయ్య పదములలో అతడు రాజగోపాలుడు. నామభేదమే కాని ఆ పదములలోని నాయికలకు నాయకుడు భగవానుడు. అతడు అనంతరూపచక్రవర్తి! ప్రేమవివశలయిన నానావిధనాయికలు వివిధావస్థలలో, వివిధమనోభావములతో మన కీముక్తకపదరచనలలో సాక్షాత్కరిస్తారు. ఆయా నాయికల మనోభావములు, మాటలు, చేతలు, విలాసములు, విలాపములు అన్నీ యిందులో వున్నవి. ఇందులో లేనివి లేవు!

శృంగారము అయోగము, సంయోగము, వియోగమునని మూడువిధములు. ఇవి అనంతభేదభిన్నములు. కాని కవులకు వియోగశృంగారమే పరమప్రియ మయినది. వియోగమునందు ఎంతో ప్రతిపాద్య మున్నది. సంయోగమునందును, అయోగమునందును నది అంతకు తక్కువ. విప్రలంభములేక సంయోగమునకు పుష్టిలేదు. తెలుగు పదరచనములలో విప్రలంభ శృంగారము విశేషముగా వర్ణింపబడినది. వియోగభేదములు అభిలాషాదులు అన్నీ వాటిలో తారుణ్యంతో నిండుకొన్నవి.

పదములలో కొన్నిట నాయక కథనము, కొన్నిట నాయికా కథనము, కొన్నిట దూతీకథనము కలదు. విప్రలంభాత్మక పదములలో నాయికా కథనమే విశేషముగా వర్ణితము. ఏకథనములో కాని పరిపూర్ణ శృంగారసామగ్రి వుండడం గమనార్హమయిన విషయం! శృంగారరసం యింత విపులంగా యే కావ్యాలలో కూడా పోషింపబడలేదు! పద సాహిత్యానికి ఇది ఒక అసాధారణమయిన యోగ్యత!

స్త్రీపురుషుల యన్యోన్యానుభవకాంక్ష రతి. అది సుస్థిరమయినప్పుడు స్థాయిభావం అవుతుంది. నాయకుడు ఒక్కడు భగవానుడు. అతని విషయమై ఆయా పదములలోని నాయికకు అనురాగమున్నది. ఆ సమయమునందు ఆ నాయికమనసులో అన్య రాగము లేదు. విరుద్ధ భావావేశమును నామె కప్పట లేదు. ఆ నాయికయందు నాయకుడు రతిచిత్తను కలవాడు. అందుచే నా నాయికానాయకుల రతి స్థిరము. అది స్థాయీకృతమగును. భావము నుద్దీపింప జేసే సామగ్రి ప్రతిపదములోను పుష్కలముగా వున్నది. నాయకునికి నాయిక, నాయికకు నాయకుడు ఆలంబనము. ఆయా నాయికల హావభావాది శృంగార విలాసాదులు అనుభావములు. నాయిక స్థాయి రతిసాగరములో అసూయాదులు, శంకాదులు, ఉత్సాహాదులు ఆలీనములై అనితరశోభను కూర్చుచున్నవి. ప్రియసందర్శనాదులచే వివశయయిన నాయిక సాత్వికస్థితి యుండనేయున్నది. 'విభావానుభావవ్యభిచారి సంయోగాత్ రసనిష్పత్తిః' అని కదా భరతుని వాక్యము. ఆ సంపద వీటిలో నున్నది. విభావాదులసంయోగమువలన రతిస్థాయి శృంగార రసమై ప్రతిపదమునను సహృదయులకు చర్వ్యమాణమగుచున్నది!

ఈపదములలోని నాయికలలో సీతలు, అనసూయలు, రుక్మిణులు, సత్యభామలు మొదలయిన పురాణనాయికలు ఆయాగుణవిశేషములతో అందఱు నున్నారు. మఱొకవిధముగా నిందలి నా యి క లు కన్యలు, ముగ్ధలు, మధ్యలు, ప్రౌఢలు, ధీరలు, అధీరలు, ధీరాధీరలు, జ్యేష్ఠలు, కనిష్ఠలు, స్వాధీనపతికాదులు, బాలింతలు, రజస్వలలు, పరకీయలు, సామాన్యలు, సర్వరూపలు. ఇందలి యాయానాయికల యనురాగములు నిత్యము, నైమిత్తికము, ప్రకాశము, ప్రచ్ఛన్నము, స హ జ ము, కృత్రిమము, సామాన్యము, విశేషము ననువివిధభేదములతో నొప్పుచున్నవి.

క్షేత్రయ్య — ఒక్క క్షేత్రయ్యయే యేమి పద కర్తలందఱు లోకవృత్తమును చక్కగా పరిశీలించినవారు. కాంతల చిత్తవృత్తులు వారికి తెలిసినట్లు ఇతరులకు తెలియ వనవచ్చును. ఏయే అవస్థలలో, ఏయే సమయాలలో స్త్రీజనం ఎలా మాటాడుతుందో వారికి బాగా తెలుసు. మాటలే కావు. వివిధ సమయాల్లో వారు మామూలుగా ఎలా ప్రవర్తిస్తారో, ఏం చేస్తారో కూడా వారికి బాగా తెలుసు. లోకంలో వివిధరూపాలతో వున్న శృంగారవృత్తను సర్వమూ వారికి కరతలామలకం! లౌకికశృంగారమునంతా వారుతమపదములలో మూసపోసినారు. ఆలంకారికుల లక్షణాల కన్నిటికీ మన కీ పదాలలో లక్ష్యాలు సులభంగా లభిస్తవి. లక్షణశాస్త్రం దగ్గఱ పెట్టుకొని అందులోని లక్షణాలకు అనుగుణంగా రచింపబడిన లక్ష్యాలు కావు ఇవి. భావుకు లయిన ఆయా పదకర్తల నిశిత పరిశీలనమే, లోకవృత్తసంగ్రహ నైపుణ్యమే అలాంటి లక్ష్యాలరచనకు తోడ్పడివుంటుంది. అజ్ఞాతభావుకు డొకడు క్షేత్రయ్య పదాలను భానుదత్తుని రసమంజరిలోని నాయికాది లక్షణాలకు లక్ష్యాలుగా దర్శించినాడు. రసమంజరికే కాదు ఏ అలంకార శాస్త్రానికైనా తెలుగు పదసాహిత్యం లక్ష్యకోశంగా వెలయగలదు.

'వాక్యం రసాత్మకం కావ్యం' అని విశ్వనాథుడు. 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం' అని జగన్నాథ పండితుడు. ఇందులో ఎవరి అభిప్రాయంతో ఏకీభవించినా తెలుగు పదసాహిత్యంలో వెలసిన ప్రతిపదమూ ఒక్క కావ్యమే అవుతుంది! రసపోషణము, అర్థపుష్టి, భాషాసౌందర్యము— యీ మూడూ పద్యసాహిత్యంలోకన్నా పదసాహిత్యంలో విశిష్టశోభతో వెలుగొందటం అనుభవరసికులకు తెలియని విషయం కాదు.

అ మ రు క ము శృంగార ధ్వనికావ్యము! అందులో శ్లోకములలోని నాయికా నాయకుల ప్రణయభావ భావనమువలన మనకు శృంగార రసానుభవం కలుగుతుంది. పదము లలా కాదు. అంతకంటె యెక్కువ రసానుభూతిని ఇవి చేకూర్చగలవు. అమరుకము ఒక్క భావనమువల్ల మాత్రమే రసానుభూతిని కలిగిస్తే పదములు భావనము, శ్రవణము, దర్శనము అనే యీ మూటివల్లా రసానుభవం చేకూరుస్తవి. ఈ పదాలలో ఒక్కొక్కపదమును ఒక్కొక్క ఖండకావ్యంగా చదువుకొని ఆనందింపవచ్చును. రాగ తాళయుక్తంగా, శ్రావ్యమధుర కంఠంతో యెవరైనా పాడితే అంతకంటే ఆనందం అనుభవింపవచ్చును. సంగీతంతోపాటు ఆంగిక, వాచిక, ఆహార్య అభినయాలతో చక్కని నట్టువకత్తె అభినయిస్తూ వుంటే యిక రసానుభవం సంగతి వేఱే చెప్పాలా? మనసుకు, చెవులకు, కండ్లకు కడుపు

నిండుగ పెట్టిన భోజనం అది! ఇతర భాషలలో ఇటువంటి సంపద లేదు. తెలుగులో పదసాహిత్యం, కవిత్వం, సంగీతం, నాట్యం అనే మూడు కళలను పొదుగుకొని పుష్టి చెందిన అద్భుత కళాసృష్టి! ఆంధ్ర సాహిత జీవనంలో పదసాహిత్యం ఒక మధుర సన్నివేశం! శృంగారరసఘుని పదసాహిత్యం! లలిత కళలకు లోకంలో గౌరవం వున్నంతకాలం పదసాహిత్యానికి వినాశం లేదు.

---

# నా చదువు



శ్రీ పులివర్తి శరభాచార్యులు

గోచి గొడవలేక, గోనంబు విడగాక
జిలుగు వలువ మడత చెరగనీక;
బ్రతుకుబాట బట్టి పయనంబు సాగించి
చూచుకొంటి నొక్క చుట్టుగోడ.

భువనగృహము కట్టి రవిచంద్ర తారకా
సకల దీపరాజి సంతరించి
ప్రాణికోట్లు గల ద్విపాద చతుష్పాద
చిత్రశాల నన్ను జేర్పగంటి.

జీవ వితతికెల్ల శిక్షణాలయముగా
జన్మశతము లిందు చదువ వలసె
పలురేలు పెక్కు పాఠాలు గరపగా
పదవి కెక్కె మాదు పంతులయ్య

ఎపుడు తెరచినాడొ ఈ పాఠశాలను
ఎపుడు చేర్చినాడొ ఇందని; నెన్ని
పారితోషికములు పంచియున్నాడొ నా
వీపువిరుగ ఎన్ని పెట్టినాడొ

మూడు గోనములనడి ముష్టరి త్రాళ్లతో
ఆటబయలునెల్ల ఆయకట్టి
అరలు గిరులు గీసి గిరికీలు పెట్టించి
త్రిప్పు వీని మదిని తెలియరాదు.

ఆడు మగల వలపు లన్యోన్య భేదాలు
నేలనీళ్ల పంపిణీల తగవు
లొకటి రెండు కాదు సకల సంకులమైన
గొట్టు పాత్రమంట గట్టినాడు.

పర ధనాపహరణ పాఠాలు బాగుగా
నల్లె వేయ 'వంట' బట్టిపోయె
కామకళలలో జగాజెట్టినై కొట్ట
కొన పరీక్షకొఱకు కూరుచుంటి.

గంట మొరయవచ్చి గబగబా అధికారి
ప్రశ్న పత్త్రములను పంచి యిచ్చి
పోయె; అర్థకామపురుషార్థముల కెంట
ప్రశ్న మొక్కటైన గాకపోయె.

'ధర్మ' 'మోక్ష' ఖండ దండాన్వయాముల
లేశభావమేని లేని కతన
తెల్లపోయి ఉత్త తెల్లకాగితములే
ఇచ్చి వచ్చినాడ నింటికడకు.

విశ్వ విద్యాలయమున ప్రవేశమై ప్ర
ధాన పాఠ్య ప్రణాళిక మానివేసి
ఆయువంతయు విత్తమోహముల గరచి
దుర్గతిం బోవవలయు వ్యర్థుండనైతి.

---

# లల్లయోగీశ్వరి



శ్రీ నేలటూతల శ్రీకృష్ణమూర్తి

క్రీ. శ. 1350–1400 కాలమున 'లల్ల'యను గృహిణీమణి కాశ్మీరరాజ్యమున వెలిసెను పుట్టిన యూరు తెలియదు. మెట్టినయూరు పాంద్రేన్‌థాన్ యను, శ్రీనగరప్రాంత గ్రామము. గృహిణీ ధర్మముల నెల్ల వినయముతో నిర్వర్తించినను, అత్తగారిని మెప్పించలేకపోయెను. భర్త మాతృవిధేయుడై లల్లను సుఖపెట్టలేకపోయెను. అత్త లల్లను బహుకష్టములు పెట్టెను. సతీసక్కుబాయి, రాణి మీరాబాయి, భక్తత్యాగబ్రహ్మమువలె లల్లకుకూడ గృహపీడన మెక్కువగ నుండెను. కడకు లల్లకు కడుపునిండు టయు దుర్ఘటమయ్యెను. లల్లకు పరులబంతితోపాటు భోజనము వడ్డించునప్పుడు రాక్షసియగు అత్త, పళ్లెరములో పెద్దరాతిని బెట్టి, దానిపై వరియన్నము కప్పి వడ్డించుచుండెను. ఈ బాధలుగాక అత్త తన కుమారునితో లల్లనడత దారితప్పెననియు దుర్బోధ నము చేసెను. భర్త లల్లవెంబడిపోయి ఆమెను ప్రార్థించుటను చూచెను. కాని అస్వాధీనుడగు వ్యర్థుడగుటచే, భార్యను యింటినుండి వెడలగొట్టెను.

అప్పటినుండి లల్ల, యోగినియై పూర్వజన్మ సుకృతముచే, విరాగియై, గేయములు పాడుచు, ఆడుచు, ఊరూరు తిరిగి బోధలు చేయుచుండెను. ఆమె పాడిన గీతములు స్మృతులై ఈనాటికిని, వైదిక, ఇస్లాము మతస్థులందరినోటను పలుకబడుచున్నవి. ఈ భక్తురాలు శివయోగ తత్త్వవేత్త. ఈమె ఇట్లు తిరుగుచు ఆశువుగా చెప్పిన గేయములలో, స్వీయ చరిత్రము స్థూలముగ సూచింపబడినది.

తన్ను అత్తపెట్టిన బాధలగూర్చి చెప్పిన దుగ్గేయము:—

"హాండ్ మరాన్ కినకర్
లాలి నీల్‌వుటూ శాలి నజ్హా."

వారు పెద్దగొర్రెనుచంపినా, చిన్నదానిని చంపిన నొక్కటే. (లాలి) లల్లాకు తినుటకు రాళ్లే.

ఇట్లు తిరుగుచు శైవయోగతత్త్వప్రచార స్థాపకుడగు 'వాసుగుప్తుని'శిష్య పరంపరలోని 'సెద్‌బాయు' (సెద్ అనగా సిద్ధుడు) శిష్యురాలై, యోగినియై విలసిల్లెను. విరాగియగుటచే, వివస్త్రయై కూడ పర్యటన సల్పుచుండెను. ఆమెయే:

"గోరఙ్ వొఙ్ ఉనమ్ కున్యూవత్సున్
నెబరాదోప్‌నమ్ అంపిరే అత్సన్
స్యూగావ్ లాలి మేవాఖ్హితవత్సున్
తవేమే హ్యోతుం నన్‌గే నత్సున్."

నా గురువు నాకొక్క వాక్యమే బోధించెను.

"బాహ్యమునుండి, అంతఃకరణము నన్వేషింపుము." ఈ సూక్తియే నా కాదర్శమై, యనుభవము నకు వచ్చెను. అప్పటినుండి, నగ్నయై, ఆడుచుంటిని"

అట్టి నగ్నాకారమును చూచి, గృహిణులు కొందఱు పరిహాసముగా ప్రశ్నింప, యామె ప్రత్యుత్తరము చమత్కారయుతమేగాక తత్త్వబోధనాయుతముగ చెప్పెను. "పురుషులనదగినవారు, భగవంతునికి భయపడువారు, అట్టివారు ఈ కాశ్మీరమున అరుదు."

దేహాభిమానముల కతీతమైన జ్ఞానసంపత్తి బడసిన దివ్య సంభూతురాలీ లల్లయోగీశ్వరి.

"మోరీ పంచభూత్ తే హండే
చేతున్ ధాన్ నా ఖుర్ దితి
జానహాపరమోపద్ యిద్ రండే
ఖశేఖుర్ హి శోఖర్ కిత్".

భూతములగు అజపంచకమును యోగాభ్యాసమును ననుభవముచేతను, ధ్యానమను ధాన్యముతో పెంచి, వాటిని బలి యివ్వుము. అట్లు భూతలయము చేసినగాని పరమమైన జ్ఞానోదయము కల్గదు.

జ్ఞానార్జనమునకు ముందు తృష్ణను పోగొట్టుకొనవలెను లోభమున్నంతకాలము మనుజుడు పరమసోపానములపైకి పోనేరడు.

I "హితా కర్తా రాజ్యఫరినా
దేతా కర్తా తృప్తినామన్
విన్‌లోభా జూవ్ మరినా
జూవన్తోయ్ మరితా సోయే జ్ఞానీ"

రాజ్యప్రాప్తి తృపిని గూర్చదు. మఱి యెక రాజ్యసమీకరణమును లోభమును పుట్టించును. కాని లోభత్వము నణచిన జీవి నష్టము చెందడు. బ్రతికి యుండి లోభమును చంపుకొనిన నిజమైన జ్ఞానము ప్రాప్తించును. 2

---

1. శ్లో. "దాతుర్ మనఃతృప్యతి నైవ రాజ్యం
దత్వా గ్రహీతుశ్చ తద్ ఏవ లబ్ధ్వా
జీవ ఒపిలోభేన న మృత్యు మేతి
మృతస్య నైవాస్తిహి జాతు మృత్యుః."
రాజానక భాస్కరుని సంస్కృతీకరణము.

2 ఈ సూక్తిని పురస్కరించుకొని, శ్రీ శ్రీ శ్రీ పరివ్రాజకులు శివశంకరస్వామివారు నొక కాశ్మీర చక్రవర్తి జీవితమును 'సుదీర్ఘ కావ్యముగా' రచించుచున్నారు.

ఈమె శివయోగమును అనుష్ఠించినట్లు స్ఫుటముగ తెలియవచ్చుచున్నది.

3 ఏకుమ్ ము త్తి తీమయ్ షమి
శ్యామగలాచి యీావిన్ తుట్టూస్
ఏహుంయ్ భిన్నా ఖేన్ చితామి
చూపన్‌స్వామీ భుపయ్ భూతూస్."

'నీలకంఠా నీకు షడ్గుణములున్నవి. (అంతర్యామిత్వము ఇత్యాది) నాలోను ఆరు గుణములున్నవి (అరిషడ్వర్గము). కాని నేను పాపపంకిలమందున్నాను. మన ఇద్దరకును భేదము యెక్కటియే. నీవు షడ్గుణదేవతవు. నేను అరిషడ్వర్గముచే పెడదారిన పోవుచున్నదానను.

ఇందు కవయిత్రి చూపిన చమత్కారము సహజపాండిత్యమునకు వన్నె తెచ్చుచున్నది. లల్ల యోగాభ్యాస మనుష్ఠించినది స్పష్టము.

"జానిహో నా డీదలామన్, రట్టిత్
చట్టిత్, పట్టిత్, కుట్టిత్ లేక్కాశ
జానిహా అ స్తరసాయున్, ఘట్టిత్
శివక్షోయీా కహోతిచిన్ ఉపదేశ."

నా మనస్సుచే, నా నాడులను స్వాధీనము తెచ్చుకొనుటకు తెలిసియుండిన, ఎట్లు తెగగొట్టవలయునో, కట్టవలయునో, తెలిసి, దుఃఖమును అణచియుందును. అట్లు చేయుచో, శివమగును.

తరువాత క్రమముగా:—

"4భానగలో సుప్రకాశా జోని
చన్ద్రిగలో తాముతో.చిత్త్
చిత్తగలో తాకింహనాకోని
గమ్ భవాని సన్దనకిత్ !"

సూర్యుడు పోగా సోముడు వచ్చును చంద్రుడుపోయిన మనస్సు నిల్చును. ఆత్మపరమాత్మపై లగ్నమైన, మనస్సు కూడ లయించును. అప్పుడు సర్వభూతిగులును నశించును అప్పుడే పరమపదము చెందుట.

యోగాభ్యాసనమున ఎన్ని కష్టముల కోర్వవలెనో లల్లచెప్పిన ఉమ చక్కగ నున్నది.

"లాల్ బ్రో ద్రాయేసి కపనిపోషే సేసు స్త్రియే
కోడతదూన్ కురునమ్ యుక్షిమేలత్
తా యేమేలి భారేసమ్ జోయి జేతాయే
బేవారీ వానగయేమ్ అలోన్జబాల్."
దోబియేలి చోవునస్, దోబిక సే పేఠయే
సజ్ తిసాబన్ శ ప్టినమ్ యుత్సుయ్యా
సత్సియేలి ఫిర్ ఉనంహాని హానికోస్తులు
అద లాలి మే ప్రోవుస్ పరముగత్"

"నేను రమ్యమగు పత్తిపుష్పమువలె ప్రకాశింప నుంటిని. కాని, నన్ను చెట్టునుండి రాల్చి, దులిపి, కొట్టిరి. తరువాత స్త్రీలు రాటముచే త్రిప్పి, దారము తీసిరి. తరువాత, ఎండబెట్టి, కొట్టి పోగులు దీసిరి. ఆపై, మగ్గమున బంధించి నేసిరి.

ధావకుడు నన్ను బండలపై తడిపి దంచి ఉతికెను. అంతియె గాక, మట్టితో, చవుడుతో కలిపెను.

తరువాత సూచీపల్లవుడు, ముక్కలుగా కత్తిరించి, కుట్టెను.

ఆపైన లల్లా సన్మార్గమును చెందెను.

అద్వైతసిద్ధి చెందుటకుగల ఆటంకములు తెల్పుచు:—

5 "నాథా పానా నాపర్జానా
సాధిత్ బాధిమ్ ఏహాకు దేహా
చిభు మామిమిలో నాజానా
మూకు భుకుక్కియ్యం సన్దేహా"

"స్వామి, 'నేను' అనుటతప్ప మరి ఒకరినెరుంగలేదు" అని మేమ మీ దేహము నే నమ్మియుంటిని. 'అహం బ్రహ్మాస్మియని,' 'తత్త్వమసి' యని నెరుంగలేకపోతిని. 'నే నెవరని? నీ వెవరని?' ప్రశ్నించుట, తప్పు. స్వామి నేను నీకు భిన్నమగు దాన ననుటకొంటి అపరాధము. ఈ భ్రమ దేహాభిమానమున జనించినది.

తత్త్వమసి.

పరమసిద్ధిని పొందినవారు:—

6 "పరతోయ్‌పాన్ యెమ్‌సోమ్ మోన్
యేమ్‌హ్యూవ్ మోన్‌దెన్‌క్యోరాత్
యేమిసే అద్యుమన్ సోహి
త్యామి జ్యూష్ట్యాసురా - గురునాథ్."

"తనను, మరియొకరిని సమభావమున ఒక్కరే యని తలంచినవానికి, పగలు (సుఖము) రాత్రి

---

3. రా. భాస్కరుని సంస్కృతీకరణము.
"యన్ ఏవ షట్కమ్ తే దేవ
తన్ ఏవ చ మమ ప్రభో
నియోక్తృ నియోజ్య హం
తస్య స్థితి ఆవయో ర్భిదా."

4 రా. భాస్కరుని సంస్కృతీకరణము.
"భానౌనష్టేకాసతే చంద్రబింబమ్
తస్మిన్ నష్టే కాసతే చిత్తమేవ
చిత్తేనష్టే దృశ్యజాతంకు కేన
పృథివ్యాదీదం గచ్ఛతి క్వాపి సర్వం."

5 రా. భా: సంస్కృతీకరణము.
"నాథ! నత్వం నదత్ మపి జ్ఞాతో దేహాభిమానతం
స్వస్యైకం చత్వయ తేనక ఆవామ్ ఇతిసంశయః"

6 రా. భా. సంస్కృతీకరణము.
"ఆత్మాపరోదినం రాత్రిఃయస్య సర్వమ్ ఇదంసమం
భాతమ్ అద్వైవ మనస స్తేన దృష్టో2 మహేశ్వరా!"

(కష్టము) ఒక్కటే. ద్వైతభావము వీడినవానికి, పరబ్రహ్మప్రాప్తి కల్గును."

మన త్యాగరాజు "ఎవరని నిర్ణయించేదిరా" యని ప్రశ్నార్థముగా, పరబ్రహ్మ ఒక్కడేనని నిరూపించెను. లల్ల :—

"[7]శివ్ వా కేశవ్ జిన్ వాకముల్ నాథానావ్
ధారినియ్ యీమో
సోమి అబలకావిూ తన్ భవరుజ్
సో వాసో వాసో వాసో.

పరమేశ్వరుడు, శివుడు కాని, కేశవుడు కాని, జినదేవుడు కాని, పద్మభవుడు కాని, సంసారపీడన మనుభవించు నబలనగు నన్ను జాడ్యరహితగా చేయునుగాక, అతడు, అతడుగాక, మరొకడుగాక, మరి మరొక్కడుగాక."

లల్ల నమస్కరించి, ధ్యానించినది ఓంకారము. ఈ ప్రణవోపాసనమే యామెను తరింపచేసినది.

ఓమ్‌కార్ యేలిల యే ఓనుమ్,
వుహికోరుమ్ పనున్‌పాన్
షెవోట్ త్రోవిత్ తసత్ మార్గరోతుమ్
తేలిలాల్ బ్హో వోత్సుస్ పుకాషేస్థాన్.

ప్రణవమును ధ్యానించి, నా దేహమును ఎఱ్ఱని మంటవలె చేసితిని. ఆరు చక్రమార్గముల దాటి ఏడవదాని చేరుకుంటిని. ఈ లల్ల ఇట్లు సుప్రకాశస్థానము చేరుకొన్నది.

సెడ్‌బాయి శిష్యురాలై, యాజ్ఞవల్క్యునివలె, గురువును మించిన జ్ఞానార్జనము చేసెను. ఒకనాడు గురువు ఎదుట సంవాదమొకటి జరిగెను. అందు ఈ ప్రశ్నలకు జవాబు చెప్పవలసివచ్చెను.

అన్నిటికన్న ప్రకాశించు వెలుగు రేది?
యాత్రలన్నిట ప్రసిద్ధిచెందిన దేది?
బంధువర్గమున ఉత్తము లెవ్వరు ?
సౌఖ్యమిచ్చునదేది ?

ఇందులకు లల్లజవాబు, సెడ్‌బోయి, ఆక్షేపణ, మరల లల్ల ప్రత్యుత్తరము గీతమున గలవు.

"శిరస్ యుయ్యాః న ప్రకాషకు నే
గంగియుయ్యాః న తీర్థ కాః
బొయిస్‌యుయ్యాః న బానదవ్ కు నే
రాణీయుయ్యాః న సుఖ కాః"

సూర్యునిమించిన ప్రకాశమేదిలేదు.
గంగకుమించిన తీర్థము లేదు.
సోదరునుమించిన బాంధవుడు లేడు.
భార్యనుమించి సుఖమిచ్చువారు లేరు.

దేశికుని ఆక్షేపణ:—

అచ్చిన్ యుయ్యా న ప్రకాష్‌కూ నే
కొహ్‌న్‌యుయ్యా న తీర్థ కాః
చనదస్ యుయ్యా న బాన్దవ్ క్యూ నే
ఖాని యుయ్యా న సుఖ కాః ?

కన్నులమించిన జ్యోతి లేదు.
పదాక్రసనము మించిన తీర్థయాత్ర లేదు.
స్వశక్తివంటి బంధువు లేదు.
కంబలిని మించి మరెవ్వరు సుఖమివ్వరు.

ఇందులకు లల్ల ఈ దిగువ జవాబిచ్చెను.

మాయియుయ్యా న ప్రకాష్‌క్యూ నే
లయియుయ్యా న తీర్థ కాః
దయేస్‌యుయ్యాన బాన్‌దవ్ క్యూ నే
బేయస్ యుయ్యాన సుఖ కాః

పరమజ్ఞానము మించిన వెల్గులేదు
నిష్కల్మష ప్రేమకుమించిన తీర్థము లేదు.
దేవునిమించిన బంధువు లేడు
శరణాగతిని మించిన సౌఖ్యము లేదు.

ఈమెయందు ప్రహ్లాదుని భక్తి, పోతరాజు సహజపాండిత్యము, సనకసనందుల జ్ఞానము శుకుని వైరాగ్య సంపత్తి మూర్తీభవించియుండెను. అనుభవమున అద్వైతసిద్ధి చెందిన పరమ పవిత్రురాలు. భారత సంస్కార సదనమున ఈమెను ఇలవేల్పుగా కొలువవలయును.

ఈ గేయములను 1896. డాక్టరు. స్టీన్ పండిత శేఖరులు, సేకరించి నాగరిలిపియందు వ్రాయించి యున్నారు కొన్ని గేయములను [8] రాజానక భాస్కరుడు సంస్కృతీకరించెను. జార్జిగ్రీర్ సన్, యల్. డి బార్నెటువారిచే 1920 సం॥ ఆంగ్లీకరింపబడినవి వీరు ఆంగ్లభారతికి సేవచేసిరి. 1924 రిచ్చర్డు "కార్నర్ టెంపుల్ లల్లా పలుకని" ఆంగ్లమున వ్యాఖ్యానము వ్రాసెను.

భారత వైదికజ్ఞానము పూర్ణముగ వ్యక్తమైన గొప్పవచనములలో లల్లా వాక్యావళి ఎన్నతగినది.

వీటిని ఆంధ్రీకరించుట తెనుగుతల్లికి సేవ చేయుట.

---

7. రా. భా. సంస్కృతీకరణము.
శివో వా కేశవో వాపి జినో వా ద్రుహిణోఽపి వా
సంసార రోగేణ క్రాంతామ్ అబలామ్
మాం చికిత్సతుం

8 శ్రీ అభినవగుప్త పాదాచార్యుని 'ఈశ్వర ప్రత్యాభిజ్ఞ విమర్శిని'కి భాస్కరియని వ్యాఖ్యానము చేసిన 18 వ శతాబ్దమునాటి పండితులు (?)

# గ్రంథవిమర్శనము

## శాకుంతల విమర్శనము

నండూరి బంగారయ్య. ప్రతులకు : నండూరి బంగారయ్య, అడ్వొకేటు, రాజమహేంద్రవరము. వెల : ౫ రూపాయలు.

ఇది సర్వాంగీణమైన శాకుంతలవిమర్శనము. కాళిదాసుని నాటకరచనా పరిణామము, నిర్మాణ శిల్పము, రసవిచారము, పద్యరచనము, ఆశ్రయ శిల్పము, శాకుంతలము–శకుంతలోపాఖ్యానము మొదలయిన శీర్షికలలో విమర్శకులా యా విషయాలు కూలంకషంగా చర్చించారు.

షేక్స్పియరు మొదలయిన పాశ్చాత్యకవులతో పోల్చినప్పుడు ఇంతవరకు కాళిదాసుమీద వచ్చిన విమర్శన చాలా స్వల్పమే. అరవింద, రవీంద్ర, ద్విజేంద్రు లింతకుపూర్వం తలస్పర్శి అయిన కాళిదాస విమర్శ రచించారు.

వీరు ముగ్గురు, నిర్మాణశిల్పము, పాత్రోచిత భాష, పద్యరచనము, ఆశ్రయ శిల్పము, శాకుంతలము—శకుంతలోపాఖ్యానము మొదలైన విషయాలు స్పృశించనే లేదని చెప్పవచ్చును.

బంగారయ్యగారి పై విషయాలమీద వెలువరించిన అభిప్రాయాలు వీరి నిశిత విమర్శక శక్తికి తార్కాణంగా ఉన్నాయి.

అయితే 'ఆదర్శీకరణమునందలి యనర్థములు—విశ్వాసరాహిత్యము' అనే శీర్షిక క్రింద వీరు వ్రాసిన విషయాలలో ఒకచోట వీరు మూలం అన్యథా అవగాహన చేసుకున్నారేమో ననిపిస్తుంది. ఈఘట్టం ఇది.

"చూతానాం చిరనిర్గతాపి
కలికా బధ్నాతి న స్వం రజః
సన్నద్ధం యదపిస్థితం
కురవకం తత్కోరకావస్థయా
కంఠేషు స్ఖలితం గతేపి శిశిరే
పుంస్కోకిలానాం రుతం
శంకే సంహరతిస్మరోపి చకితః
తూణార్ధ కృష్టం శరం

ఈవిధంగా ప్రకృతి స్తంభించిపోయినట్లు వర్ణించడం విశ్వాసజనకంగా లేదని విమర్శకులు వ్రాశారు.

ఇది కంచుకి వాక్యము. ఇతడు తన ప్రభువు మీద అచంచలమైన భక్తివిశ్వాసాలున్నవాడు. ఈసందర్భంలో శిశిరము గతించినా ఇంకా వసంత లక్షణాలు పొడచూపకపోవడం ప్రభుభయం వల్లనే జరిగి ఉండవచ్చునని కంచుకి ఉత్ప్రేక్షిస్తున్నాడు; ఆవిధంగా తన ఎదటివారిని భావింపజేస్తున్నాడు. అంతేగాని వాస్తవంగా వసంత ప్రాదుర్భావం కాకుండా శిశిరం స్తంభించిపోయిందని కంచుకి అభిప్రాయం కాదు. ఈశ్లోకంలో 'శంకే' అనే పదం దీనికి తార్కాణంగా ఉన్నది. ఇది ఈవిధంగా ఉత్ప్రేక్షా ప్రధానమైన శిశిర వసంత సంధివర్ణనంగా ఉన్నది గాని బంగారయ్యగారు భావించిన ట్లిది వాస్తవికవర్ణనలా కనబడదు.

ఇక "క్షౌమం కేనచి దిందుపాండు తరుణా మాంగళ్యమావిష్కృతం", అనే శ్లోకం కూడా విశ్వాసజనకంగా లేదని విమర్శకులు వ్రాశారు. నిజాని కిది వారు వ్రాసినట్లు వాస్తవిక వర్ణనమే. అయితే అభిజ్ఞాన శాకుంతలం కేవల వాస్తవిక దృక్పథంలో నడిచే రూపకం కానే కాదు. విమర్శకులు కూడా దీనితో ఏకీభవిస్తా రనుకుంటాను.

ఈ రూపకంలోనే శకుంతలాంతర్ధానాదులైన అద్భుతా లనేకం కనిపిస్తున్నాయి. ఇవన్నీ సహృదయులకు సంభావ్యములైనపుడు—ఈ శ్లోకం అంత అభూతకల్పనగా ఎందుకు భాసించాలో బోధపడడం లేదు.

ఇక "సహజం కిల యద్వినిందితం" అనే శ్లోకం పల్లెవాడు మాట్లాడినట్లు లేదని కూడా విమర్శకు లన్నారు. మనం మన దేశంలో పాటకజనం నోటిలో నించి కూడా తత్త్వాలు అన్నీ వింటూంటాము. ఆవిధంగా చూసినప్పుడు పాఠకుల కిది అసహజంగా కనబడదేమో!

ఇక శాకుంతలము — శాకుంతలము శకుంతలోపాఖ్యానము అనే ఘట్టంలో వీరు శాకుంతల నాటకము సంస్కృతభారతంలోని శకుంతలోపాఖ్యానంతో సరిపోల్చి నాటక పాత్ర పోషణాదు శకుంతలోపాఖ్యానానికి లోమ్ముగా ఉన్నవని విపులంగా విమర్శించారు.

ఇది కూడా అభిప్రాయభేదానికి తావిచ్చే విషయమే. షేక్స్పియరు కాళిదాసులను కొందరు సరిపోలుస్తున్నారనీ, ఇది సరియైన విమర్శనాపద్ధతి కాదనీ, ఈ ఇద్దరు కవుల దృక్పథాలు చాలా విభిన్నంగా ఉన్నాయనీ అందుచేత వీరిద్దరినీ సరిపోల్చడమే అసలు సరియైన పద్ధతి కాదనీ విమర్శకులు వ్రాశారు.



వ్యాస కాళిదాసులను సరిపోల్చడంలో కూడా ఇలాంటి చిక్కే వస్తుంది. ఈ ఇద్దరు కవుల రచనా దృక్పథాలు చాలా విభిన్నమైనవి. వ్యాసునిది ఇతిహాస పద్ధతి. కాళిదాసునిది రసప్రధానమైన రూపక పద్ధతి. ఈవిధంగా ఇద్దరి దృక్పథాలు వేరు వేరుగా ఉన్నప్పుడు వీరిద్దరికీ తారతమ్య పరీక్ష చెయ్యడం ఎలాగో తెలియడం లేదు. ఇంతేకాక అరవిందులు కాళిదాస విమర్శనలో ఒకచోట వాల్మీకిది నీతి ప్రధానమయిన దృక్పథమనీ వ్యాసునిది మేధా (*Intellect*) ప్రధానమయిన దృక్పథమనీ కాళిదాసకవిది రస ప్రధానమయిన దృక్పథమనీ వీరు ముగ్గురు ఈ మూడుమార్గాలకు ప్రతినిధులనీ వ్రాశారు. ఇది చాలా నిశితమయిన సూక్తి. ఈవిధంగా చూసినప్పుడు ఈ మహాకవుల దృక్పథాలు మూడు మూడు విధాలుగా ఉంటాయి. అలాంటప్పుడు ఇతివృత్తాదులు మలచడంలోను, రసనిర్వహణంలోను, కావ్యలక్ష్యసాధనలోను చాలా విభేదాలు వస్తాయి. వీరి ముగ్గురిలోను అనుస్యూతమయిన భారతీయ సంప్రదాయం ఒకటే కావచ్చును. అంతమాత్రంచేత తారతమ్యపరీక్షలోకి దిగడం న్యాయం కాదనుకుంటాను.

అందుచేత అసలు తారతమ్య పరిశీలన మేలుపరదు. ఒకవేళ విమర్శకు లెవరయినా ఇలాంటి పరిశీలనలోకి దిగినా ఆయా విమర్శకుల దృక్పథాలనుబట్టి వారి విమర్శనలు మారిపోతూంటాయి.

ఇలాంటి మహాకవులను విమర్శించేటప్పుడు వారి వారి రచనాస్వభావాలు వివరించి, ఆ స్వభావాల దృష్ట్యా వారెంతవరకు కృతకృత్యులయ్యారో విమర్శించవచ్చును. అంతేగాని కేవలం విభిన్నులయిన కవుల తారతమ్య పరీక్ష చెయ్యడం మొదలుపెడితే విమర్శకుల అభిరుచులే బయటపడిపోతాయి గాని ఆయా కవుల సహజలక్షణాలు తెరమరుగునే ఉండిపోతాయి. అందులోను ఈ తారతమ్య పరీక్ష చెయ్యవలసినవారు మహాకవులైనప్పుడు ఈ సమస్య మరింతక్లిష్టమైపోతుందేమో అనిపిస్తుంది.

బంగారయ్యగారీ విమర్శగ్రంథానికి శాకుంతల విమర్శనమని పేరుపెట్టారుగాని నిజానికి వారిందులో కాళిదాసరూపకాలన్నీ చాలా చక్కగా విమర్శించారు. తెలుగులో కాళిదాస రూపకాల

మీద ఇంతవరకు ఇంత సమగ్రమయిన విమర్శన గ్రంథం వెలువడలేదు.

ఈ వ్యాసాలలో కొన్ని ఇదివరకు భారతిలో వెలువడినవే. అయితే వీరింకా కొన్ని వ్యాసాలు చేర్చి ఈ పుస్తకం సర్వాంగసుందరంగా వెలువరించారు. ఈ పుస్తకంలో రచన గ్రాంథికమే. అయితే గ్రాంథికరచనపై అభిమానం సన్నగిలిపోతూన్న ఈ రోజుల్లో కూడా ఇది తిరిగి గ్రాంథికరచనపై అభిమానం రేకెత్తించేటట్టుంది.

కాళిదాస రూపకాభిమానులందరు ఇది తప్పక పరిశీలించవలసిన అమూల్య విమర్శనగ్రంథము.

---

## నిరంకుశోపాఖ్యానము

కందుకూరి. రుద్రకవి. ఆంధ్రశిల్పకళాపరిషత్తు. సత్తెనపల్లి. గుంటూరుజిల్లా. వెల : అయిదు రూపాయలు.

కందుకూరి రుద్రకవి ఆంధ్రప్రబంధ కర్తలలో పేరెన్నిక గన్నవాడు.

అయితే ఇతని ప్రబంధం ఇంతవరకు వ్యాఖ్యానాదికాలు లేకుండా సామాన్య ధోరణిలోనే అచ్చుపడిందిగాని అంతకంటె విశేష ప్రసిద్ధికి నోచుకోలేదు. ఆంధ్రశిల్ప కళాపరిషత్తువారీ ప్రచురణతో ఆలోటు తీర్చివేశారు. ఈ సంపుటిలో స్వర్గీయ సుబ్రహ్మణ్యకవి విరచిత విపుల ప్రతిపదార్థ వ్యాఖ్యానము, కొండూరు వీరరాఘవాచార్యులుగారి కావ్యమీమాంస, వ్యాఖ్యాత వ్రాసిన ఉపోద్ఘాతము, పూర్వముద్రణదోష సవరణలు పండితాభిప్రాయాలు మొదలైన విశేషాలన్నీ ఉన్నాయి.

వ్యాఖ్యాత తమ ఉపోద్ఘాతంలో కవి కాలాదులను గురించి విపులంగా చర్చించారు. నిరంకుశోపాఖ్యాన కథకు, పాండురంగ మాహాత్మ్య కళాపూర్ణోదయ కథలకు దగ్గిర పోలికలున్నాయి. అందుచేత ఎవరో ఒకరు తదితరకవుల కావ్యాలు కొంచెం కాకపోతే కొంచమైనా పరిశీలించి ఉంటారని చెప్పక తప్పదు. ఈ వివాదం స్పష్టమైన కవికాల నిర్ణయం దొరికినప్పుడే సరిగా పరిష్కారం అవుతుంది.

ఈ కవికృతమని చెప్పబడిన సంస్కృత రాష్ట్రౌఢవంశ మహాకావ్యంలో కవే వ్రాసిన "శాకే భూనిశిరాష్ట్ర భూపరిమితే సంవత్సరే దుర్ముఖే మాసే చాశ్వయుజే సిత ప్రతిపది" అనే శ్లోకం ఒక్కటి నిశ్చితమైన కాలనిర్ణయానికి ఉపయోగపడుతున్నది. దీనికి సరియైన క్రీస్తు శకం 1535 అయింది. ఇది ఒక్కటే కొంచెం విశ్వసనీయమయిన కాలనిర్ణయంగా కనబడుతుంది. అయితే వ్యాఖ్యాత లిఖించిన మంగలికోంపోజి కథ, తాతాచార్యుల చాటుపద్యకథలు కవి కాలంలో మళ్లీ కొంత గందరగోళం కలిగిస్తూనే ఉన్నాయి.

ఇక పాండురంగమాహాత్మ్యంలోని "నీలాబాలయుక్, నీరాకల్ మదిగోరు చంద్రుపాదుపున్ నీరాకరంబుంబలెన్" అన్న పాదాలకు, నిరంకుశోపాఖ్యానంలోని

"నందను నిన్ను నిమ్నగను
నందనుకను నెగురుదాచు నకటసముద్రం

బిందువనుబోలె జనకుం
డెంగునకా నీ మహత్త్వ మేమున నేర్తున్."

అన్న పద్యానికి భావంలోనే గాక శ్లేషాదుల్లోగూడా పోలికలున్నాయి. కందుకూరి రుద్రకవి రామకృష్ణకవి అంతటి ప్రతిభాకవి కాకపోవచ్చును. అంతమాత్రంచేత కందుకూరి కవి రామకృష్ణుని అనుకరించాడని చెప్పలేము. ఒక్కొక్కప్పుడు ఒక కవి నేలబారుగా అన్న భావమే తీసుకుని మరొక కవి ఆకాశాని కెత్తివేసిన ఘట్టాలనేకం వాఙ్మయంలో కనిపిస్తున్నాయి. అందుచేత కవిత్వంలో పోలికలనుబట్టి కూడా ఈ సమస్య పరిష్కారం కాదు. ఇక ఈ ఇద్దరికవుల కాలాలు స్పష్టంగా నిర్ధరించడానికి తగిన ముఖ్యాధారాలు దొరికేదాకా ఈ సమస్యను ఇలాగ వదిలివెయ్యడమే మంచిది. బహుశః ముందు ముందింకా ప్రబల ప్రమాణాలు దొరికి దీని కొక మార్గం కనబడితే కనబడవచ్చును.

రుద్రకవి ప్రబంధ కవులలో పరిగణింపదగిన కవి.

ఈ కవి కావ్యానికి ఇంత సర్వాంగసుందరమయిన ముద్రణ ఇంతవరకు జరగలేదు. ఆంధ్ర కవిత్వాభిమానులందరికీ ఇది అవశ్యపఠనీయమైన గ్రంథము.

---

## తత్త్వ సందేశము

[కీర్తనలు]

శ్రీ ఉమర్ ఆలీషా కవి. ప్రతులకు: శ్రీ ఉమర్ ఆలీషాకవి గ్రంథమండలి. పిఠాపురము, తూర్పుగోదావరి జిల్లా. వెల: 1-8-0.

ఇవి వేదాంతపరమైన గీతికలు. ఉమరాలీషా కవిగారీ గీతికలలో మహమ్మదీయ తాత్త్విక విషయాలు వివరించి ఉండవచ్చునని పాఠకు లూహించి ఉండవచ్చును. కాని ఇవి స్వచ్ఛమైన హైందవతత్త్వ పరములయిన గీతికలు. ఉమరాలీషా కవిగారికి పల్లె పట్టులలో పాడబడే తత్త్వాల ఫణితి చాలా చక్కగా పట్టుబడింది. ఇంతేగాక వీరి గీతికలలో హృదయంగమమైన నిజాయితీ, భక్తిభావము ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

ఇటీవలి ఆధునిక కవులలో ఇటువంటి గీతికలు వ్రాసినవారు చాలా అరుదుగా ఉన్నారు. ఉమరాలీషా కవిగారు ఆంధ్రదేశంలో ఒక సుప్రసిద్ధాధ్యాత్మిక సంఘానికి ఆచార్యులుగా ఉండేవారని గ్రంథపీఠికలో ఉదాహరించిన వారి జీవితచరిత్రవల్ల స్పష్టపడుతున్నది. ఈ గీతికలలో కొన్ని శిష్యులు ప్రార్థనాదికాలలో పాడేవారని తెలుస్తున్నది. ఈ క్రింది గీతిక స్వచ్ఛమయిన జానపదతాత్త్విక ఫణితికి ఉదాహరణంగా తీసుకోవచ్చును.

1

"గుడ్డులై తిరిగెదరు జనులార!
నిజ మింత దెలియక
గుడ్డులై తిరిగెదరు జనులార!
మట్టి కిరువదియైదు కొమ్మలు
తొట్టి లారయ తొమ్మిదున్నవి
పట్టు పట్టున తిరుగు పక్షి
గుట్టు మని పోనేను మిథ్య.

2

ఏడు కొండలు మెట్టి కుండలి
పాడుచున్న ప్రణవనాదము
తోడనే మనసనెడు చేటిక
ఆడుచున్నది శివనాటిక.

3

పంచకోశము లనుసరించి
పంచ వాయువులను నటించి
పంచ విషయములను కలంచి
సంచరించెడు హంస నెరుగక—

4

సుందరంబగు సరసు లోపల
మందిరం బొకటున్న దదిగో!
అందులోపల వెలుగు దీపము
ముందు నిలిచిన చక్రి నాయిక.

5

ఒక్క చూపున గాంచితేను
ఒక్క మాటను తెలిసితేను
ఒక్క జ్యోతిని నిలిచితేను
నిక్కముగ తను దెలియగలరు!"

ఈవిధంగా ఈ పాట హైందవ తాత్త్విక పరిభాషలతో తాత్త్వికరహస్యాలు వ్యాఖ్యానిస్తూ సరళంగా సాగిపోతుంది.

ఉమరాలీషాకవిగారి రచనా వైవిధ్యానికీ పుస్తకం చక్కని తార్కాణం.

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము

మదరాసు.

సంపుటము 29 అక్టోబరు, 1952 సంచిక 10

విడిప్రతి వెల ఒకరూపాయి.



# విషయానుక్రమణిక

## అక్టోబరు - 1952



త్రివర్ణ చిత్రము : "కాత్యాయని" (కార్వేటినగరసంస్థాన చిత్రాలనాటి ప్రాచీనచిత్రము)

---



నందన
ఆశ్వయుజము

# భారతి

సంపుటము 29
సంచిక 10

# శారదా ప్రశస్తి



శ్రీ. పి. గణపతి శాస్త్రి

వీణా పుస్తక ధారిణీ! కవిమనోపీఠిన్ నినాదించు నీ
వేణీ జృంభిత బంభరోంకృతులు గంభీర స్వనద్గాంగ వా
ర్మాణిక్య క్వాణనమ్ము లై, ధరణి సర్వ ప్రాణిసమ్మోద కృ
ద్వేణు స్వానములై ధ్వనింప జనతా ప్రేమార్ద్రులై రాగదే!

జగదాశా మణిదీపికా! జనని! చంచన్నూపురాభా ధగ
ద్ధగిత త్వత్పదరేణు వించుక యొడందం దూలెనే నింక ది
గ్గిగధీశాన శిరస్తటీ మకుట పంకేజాత సందోహ మం
దగలే దిమ్మహనీయ భాగ్యమని యున్మత్తుండనై యాడెదన్

"కాత్యాయని"



శ్లో. విద్యుద్ధామ సమప్రభాం మృగపతి స్కంధస్థితాం, భీషణాం,
కన్యాభిః, కరఖాలఖేట విలసద్ధస్తాభిరాసేవితాం
హస్తైశ్చక్ర గదాసిఖేట విశిఖశ్చాపంగుణం తర్జనీం
విభ్రాణామనలాత్మికాం త్రిణయనాం కాత్యాయనీమాశ్రయే.

శారద సాంధ్యవేళ వికసన్నవ కోకనదమ్ములం భవ
స్మేరవ పాదచిహ్న రమణీయత లోన దలంచి, బాష్పపూ
రారుణితేక్షణమ్ముల దయామయి ! నీ చరణాంక పూత కా
సార వినిర్మలాంతరలసజ్జలబిందుతతికై తపించెదన్

తెల్లని రెల్లుపూల తరితీపుల చేల చెరంగుతో ధరా
హాల్లకచిత్రకార చరణాంకన కుంకుమ రేఖతో కృపా
వల్లరులై తలిర్చు దృగపాంగ సుశీతల వీక్షలం గృహా
మ్మెల్ల వెలుంగ జేయుము! కవీంద్ర మనోంగణ రంగవల్లికా!

ద్యోమార్గోపనిషద్వధూ భుజ సువర్ణోంకారపల్యంకికా
ధావా ! నీ సితమూర్తి సర్వ జగదాంధ్యమ్ములం దోలంగించు రా
కాముగ్ధేందు శుచి స్మితమ్ముగ వెలుంగంజేసి, యజ్ఞానని
ద్రామోహమ్ము దలించు నూపురనినాదస్ఫూర్తి విచ్చేయుమీ !

పుత్తడి బొమ్మలంచు దలపోయుచు నిల్చితి నూరకే మృషా
మృత్తికలైన కాంతుల సమీపమునం జననీ ! చిర వ్యథా
కృత్త హృదంతరమ్ము పరిఖిన్నత నైన నికం భవత్పదో
న్మత్త ధరాపరాగ చలనమ్ముల చూపరు భాగ్యమందునో!

భీకర సాగరోర్మి పరిభిన్న గతిం దరి కానరాని పెం
జీకటి బాటలన్ గదలనేరని జీవితనౌకకై ధ్రువా
శాకిరణమ్మవై, తటదిశం దెలివెల్గుల తెన్ను జూపి యే
కైక శరణ్యవై నడపుమీ ! యలలే కలలై నశింపగన్

పాయని పూర్వపుణ్య పరిపాకమునన్ మనసార నోర న
మ్మా! యని పిల్చినంత ఘనమయ్యెను గద్గదగీతి! కన్న త
ల్లీ! యిక నీవె నెమ్మది నొకించుక నిల్వగదమ్మ! కచ్ఛపీ
గేయ ఝరీతరంగ మురికించెద! నవ్వుల రవ్వమువ్వలన్

యౌవన ముగ్ధమైన హృదయమ్మున గన్నకలల్ కపోల భా
గావిల బాష్పబిందుతతులై ప్రవహించెడు వేళ, హీరము
క్తావరమాలగా మెరయగా దయసేయగదే! మనోజ్ఞ మ
ల్లీ వికచస్మితమ్ము తరళించు దయానవనీత మూర్తివై!

---

# యశశ్శరీరులు అడివి 

#  బాపిరాజుగారు

'శాస్త్రి'

అడివి బాపిరాజుగారు అస్తమించారన్న వార్త ఆంధ్ర కళా సాహిత్యాభిమానుల కందరికీ ఒక పెద్ద పిడుగుపాటుగా వినిపించింది. బాపిరాజుగారు నవ్యసాహిత్య రంగంలోనేగాక కళారంగంలో కూడా ప్రథమశ్రేణిలో నిలిచిన మహనీయ వ్యక్తి. బాల్యం మొదలుకొని తుది గడియ వరకు వారి జీవితం సాహిత్యాది కళారాధనలోనే సాగిపోయింది. అనుక్షణము వారి ముఖభంగిమలో ఆ ఆరాధనావేశమే తాండవిస్తూండేది. తెలుగు దేశంలో చిత్రకళలో మొట్టమొదటగా నూతన రేఖలు తీర్చిదిద్దిన వారిలో బాపిరాజుగారు ప్రథమ గణ్యులు. అసంఖ్యాకంగా నవలలు, కథలు, నాటికలు, గేయాలు రచించారు. పత్రికా రచయితగా ప్రముఖస్థానం ఆక్రమించారు. వివిధములైన కళారహస్యాలు వివరించే వ్యాసా లెన్నో రచించారు. ఈవిధంగా బహుముఖమైన కళారంగంలో రచనా నైపుణి అలవరుచుకోవడం సామాన్య రచయితలకు సాధ్యంకాదు. అయితే జీవితం అతి జాగ్రత్తగా ఒక సుఖమైన దారిలో పెట్టుకునే కళమాత్రం వారికి అలవడలేదు. బహుశః ఇది పట్టుబడిన జనానికి మరి సరస్వతీ నూపురనాదమే వినబడదేమో!

బాపిరాజుగారు 1895 అక్టోబరు 8 వ తేదీని జన్మించారు. జన్మస్థానం పశ్చిమ గోదావరిజిల్లా భీమవరము. చిన్నతనంలో విద్యాభ్యాసం ముగించిన తరవాత రాజమహేంద్రవరం కళాశాలలో పట్టభద్రులై తదుపరి మద్రాసు న్యాయ కళాశాలలో న్యాయవాద పరీక్షలో ఉత్తీర్ణులైనారు. పిమ్మట ఆంధ్రజాతీయ కళాశాలలో శ్రీ ప్రమోద కుమార చట్టోపాధ్యాయలవద్ద చిత్రకళాభ్యాసము, దానితో కళారంగంలో ప్రవేశించడము జరిగాయి.

తదాదిగా వారనేక చిత్రాలు చిత్రించారు. వీటిలో ఖడ్గతిక్కన, శబ్దబ్రహ్మ, శ్వేతతార, శశికళ, మృత్యుంజయమూర్తి, రుద్రమదేవి, సముద్రగుప్తుడు,

మీరాబాయి, నాగనృత్యం మొదలైన చిత్రాలు ప్రజానీకం మన్నన లందు కొన్నాయి.

బాపిరాజుగారు చిత్రరచన కుపక్ర మించే సమయానికి జాతీయమైన చిత్రకళ కేవలం జానపద శిల్పులలో మాత్రమే తల దాచుకుని కొనఊపిరితో నిలబడి ఉంది. ఆ కాలంలో బాపిరాజుగారు మొదలైన ప్రము ఖులు ఒక వంక వంగసంప్రదాయము, మరొకవంక అజంతాది గుహాలయాలలో నిలి చిన ప్రాచీన భారతీయ కళాసంప్రదాయము పరిశీలించి ఒక వినూత్నమైన ఆంధ్ర చిత్ర కళా ప్రస్థానం ప్రవర్తింపజెయ్యాలని సంక ల్పించారు. ఇటు సాహిత్యంలో సృష్టి కుపక్రమించాలనే తహత మిగిలిన కళారంగా లన్నింటిలో కొత్త తెన్నులకు దారితీసింది. శంలో బాపిరాజుగారు రచించి లసంఖ్యాకంగా ఉన్నాయి. వీటిలో తిక్కన చిత్రం ఆంధ్రవిశ్వకళాపరిషత్తు మన్నన లందుకొన్నది.

ఇవిగాక వీరు ప్రముఖ సాహిత్యపరుల గ్రంథాల కెన్నింటికో ముఖచిత్రాద్య లంకారాలు సంతరించారు. ఇంకా కొన్ని కొన్ని సినీమాలకు గూడా వారు కళా దర్శకులైనారని తెలుస్తున్నది.

ముఖ్యంగా బాపిరాజుగారు మన జాన పద కళలన్నీ కూలంకషంగా పరిశోధించి వివిధోపన్యాసాలలోను, ప్రసంగాలలోను, ఆయా విషయాలు వ్యాఖ్యానిస్తూ ఉండే వారు. వీటి విషయంలో ప్రజలలో ప్రత్యే కాభిమానం రేకెత్తించి ఒక నూతనాభిరుచి కలిగించిన గౌరవం చాలవరకు బాపిరాజు గారికే దక్కుతుంది.

వీరు సాహిత్యంలో చేసిన కృషి అపారమైనది. రాజమహేంద్రవరం కళాశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడు వారికి కూల్డ్రే శిష్యత్వం లభించింది. కూల్డ్రే విద్యార్థులలో బహు ముఖమైన కళాభి రుచి పెంపొందింపచేసినమనీషి. ముఖ్యంగా ఆయన ఆ కాలంలో పండితులీసడించే జానపదసాహిత్యంలో గల మెరుగు లెన్నో తమ శిష్యుల కెరుకపరచేవాడు. అప్పటికే గురజాడ రచనలు కొంత వ్యాప్తిలోకి వచ్చి జానపద గేయాల మీద ఆద నాలు రేకెత్తించాయి. బాపిరాజు
దలపోయుచు నిల్చ్నియులభాష అనుకరిస్తూ రచించిన
ల సమీపమునం జన నూ లెన్నో ఉన్నాయి. వీటిలో
్ర పరిభిన్నత నైన శిలో అజరామరంగా ఆంధ్రవాఙ్మ
చలనచుర్మల హూపరు నిలిచిపోయే పాటవం స్ఫురిస్తుంది.
బసవమూర్తిపై రచించిన ఈ గీతి వారి జానపదగేయరచనాఫణితికొక చక్కని ఉదాహరణ.

'లేపాక్షి బసవయ్య లేచిరావయ్యా!
కైలాసశిఖరిలా కదలిరావయ్యా!
హుంకరించిన దెసలు ఊగిపోయేను!
ఖురముతో దువ్వితే కులగిరులె వణికేను!
ఆకాశగంగకై అర్రెత్తి చూస్తేను
పొంగేటి పాల్కడలి గంగడోలూగేను!
నందిపర్వతజాత నవ పినాకిని జలము
నీస్నాన సంస్పర్శ నిలువునా పులకించె
వంగోలుభూమిలో పెన్గొండ సీమలో
నీవంశమీనాడు నిలిచింది గర్వాన!
లేపాక్షి బసవయ్య లేచిరావయ్యా!
కైలాస శిఖరిలా కదలిరావయ్యా!'

వెల్లువలతో పొంగివచ్చే వరద గోదావరిని కన్నులకు కట్టినట్లు చిత్రించే ఈ 'వరద గోదావరి' కూడా ఆంధ్రజాతికి చిర స్మరణీయంగా నిలిచిపోయేదే.

"ఉప్పొంగిపోయింది గోదావరి! తాను
తెప్పున్న ఎగసింది గోదావరి!
కొండల్లు ఉరికింది! కోనల్లు నిండింది!
ఆకాశగంగతో హస్తాలు కలిపింది.
అడివిచెట్లన్నీని జడలలో ముడిచింది.
ఊళ్లుదండలు గుచ్చి మెళ్లోన తాల్చింది!
శంఖాలు పూరించి కిన్నెరలు మీటించి
శంకరాభరణ రాగాలాప కంఠమై,
పడులలో గర్వాన నడలలో, నుడులలో
పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తువచ్చింది!
నరమానవుని పనులు శిరమొగ్గి పణికాయి!
కరమెత్తి దీవించి కడలికే నడిచింది!"

ఇలాంటి రచనలు వీరి గీతికా సంపుటాలలో చాలా ఎక్కువగా కనిపిస్తాయి. వీటి అన్నిటిలోను స్వచ్ఛమైన తెలుగుదేశ జీవితం కలకల్లాడుతూ ప్రతిఫలిస్తూంటుంది.

ఈ గీతికలలో కొన్ని వీరిదివరకే ప్రచురించిన తొలకరి, హారతి, గోధూళి, అనే గేయసంపుటాలలో కనిపిస్తాయి. బాపిరాజుగారు రచించిన గీతికలనేకం ఇంకా అచ్చుకాకుండా అలాగే ఉండిపోయాయి.

ఈ విధమైన జానపద ఫణితిలో గేయాలు రచించి, శాటికి నేటి ఆంధ్ర కవిత్వంలో గౌరవం ఇప్పించినవారిలో బాపిరాజుగారి పేరు అవశ్యస్మరణీయము.

ఇక నేటి కథకులలో బాపిరాజుగారు పెద్దతరంలోకి వస్తారు. వీరి కథలలో అంతటా కవిత్వం జాలువారుతూంటుంది. కథలలో కవిత్వ వాతావరణం రాకూడదనే వారు కొందరున్నారు. కాని అది ఒక దృక్పథం మాత్రమే. ఈ కవిత్వధోరణిలో కథలు రచించి ప్రపంచవాఙ్మయంలో ప్రసిద్ధికెక్కిన ఘను లెందరో ఉన్నారు. బాపిరాజుగారీ విధంగా రచించిన కథ లెన్నో ఉన్నాయి. పూర్వపు ఉదయినిలో ప్రచురించిన వీణ, భారతిలో ప్రకటించిన తిరుపతికొండ మెట్లు, ఇంకా ఇతర పత్రికలలో ప్రకటించిన శైలబాల మొదలయిన కథ లెన్నో వారికి కథకగౌరవం కల్పించాయి. ఈ కథలలో కొన్ని అంజలి, రాగమాలిక, మొదలయిన చిన్నచిన్న సంపుటాలలో వచ్చాయి.

నవలా రచయితగా బాపిరాజుగారు చేసిన కృషి అన్నిటికన్నా మిన్నగా కనిపిస్తుంది. పూర్వం ఆంధ్ర విశ్వవిద్యాలయోరవాపు ఉత్తమనవలల పోటీ ఏర్పరచినపుడు బాపిరాజుగారి 'నారాయణరావు' శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయిపడగలు' ఆ పోటీ బహుమతి సమానంగా పంచుకొన్న విషయం ఆంధ్రు లందరికీ తెలిసినదే. వీరింతకుపూర్వమే 'హిమబిందు' అనే నవల రచించారు. అయితే దాని ప్రకటన కొంత ఆలస్యంగా జరిగింది. ఇవికాక తుపాను, గోనగన్నారెడ్డి, కోనంగి, మధురవాణి, మొదలైన నవలలెన్నో వారి లేఖినిలోనించి వెలువడ్డాయి. ఇటీవలనే ఆంధ్ర మహిళలో 'జాజిమల్లి' అనే పేరుతో మరి ఒక నవల ప్రకటించారు.

బాపిరాజుగారి రచనల తారతమ్య పరీక్ష చెయ్యడంగాని లేక మిగిలినవారి

రచనలతో వారి రచనలు సరిపోల్చి గుణదోష నిర్ణయం చెయ్యడం గాని ఈ వ్యాసోద్దేశ్యం కాదు. వారు చేసిన బహువిధమైన కృషి వివరణమే దీని లక్ష్యం. పరిశీలించవలసివస్తే వారు చేపట్టిన ఒక్కొక్క వాఙ్మయశాఖకు అధమం ఒక్కొక వ్యాసమైనా వ్రాయవలసి ఉంటుందేమో !

అయితే ఇంకా ఇప్పుడిప్పుడే రూపురేఖలు దిద్దుకుంటూన్న తెలుగు నవలా పరిణతికి వారు చేసిన కృషి ఆంధ్ర వాఙ్మయంలో చిరస్మరణీయంగా నిలిచిపోగలదు. ఈ నవలలో సామాన్య పల్లెటూరి జనం మొదలు సంపన్నులదాకా — అన్ని తరాల తెలుగుజనం కనిపిస్తూంటారు. ఈవిధంగా అచ్చంగా తెలుగు సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు చిత్రించడంలో బాపిరాజుగారి నవలలు బాగా దారి చూపించాయి.

బాపిరాజుగారు మీజాను సంపాదకులుగా ఉంటున్నప్పుడు వారిదగ్గర సహాయ సంపాదకులుగా పనిచేసిన పత్రికా రచయితలు కొందరీనాడు పత్రికా రచనలో కృషి సాగిస్తూ ముందుకు వస్తున్నారు.

మద్రాసు ప్రభుత్వం ఇటీవలనే బాపిరాజుగారిని సింహాళం పంపించి సిగీరియా చిత్రాలకు ప్రతులు తయారు చెయ్యవలసిందని అభ్యర్థించింది. ఇంకా కొంతమంది యువకచిత్రకారులతో కలిసి వారక్కడికి వెళ్ళి ఆ చిత్రాల కన్నిటికీ ప్రతులు తయారుచేశారు. ప్రస్తుతం అవన్నీ మద్రాసు మ్యూజియంలో భద్రపరిచారని తెలుస్తున్నది.

అటు సాహిత్యంలోను, ఇటు చిత్రకళలోను ఉత్సుకులయిన యువకు లెందరికో బాపిరాజుగారి ప్రోత్సాహం చేయూతనిచ్చి, నూతన రచన లుద్భవింప జేసింది.

వీరు సాహిత్య కళారంగంలో చేసిన కృషి తలుచుకుంటే ఇంతటి విస్తారమైన రచన సాధ్యమా అనిపిస్తుంది. అయితే ఇన్ని రంగాలలో ఒకేసారి వేలు పెట్టడంవల్ల కొంత ఏకాగ్రత తగ్గి వారి ప్రతిభ ఒక మహాస్రవంతిగా ప్రవహించక కేవలం పాయలుపాయలుగా చీలిపోయిందేమోనని కూడా అనిపిస్తూంటుంది.

బాపిరాజుగారి వ్యక్తి ఒక ఎత్తు. వారి కళా సాహిత్యకృషి అంతా ఒక ఎత్తు. ఆ వ్యక్తితో ఒకసారి పరిచయం కలిగించుకొన్న వారా మధురమూర్తినిక మరిచిపోలేరు. వారి ఇష్టాగోష్ఠులలో సిగరెట్టు తయారీ మొదలు సిగీరియా చిత్ర గాంభీర్యంవరకు ఎన్నెన్నో విషయాలు దొర్లిపోతూ శ్రోతల నుర్రూతలూగిస్తాం డేవి. వివిధవిషయాలలో వారు చదివిన గ్రంథాలు, సేకరించిన విజ్ఞానము అపారము. వైల్డ్ వెస్ట్ నవలలు మొదలుకొని విఖ్యాత పాశ్చాత్య రచనలదాకాగల గ్రంథాలన్నీ వారికి కరతలామలకాలే. ఎప్పుడు ఏవేవో పుస్తకాలు చదువుతూ ఆ ధోరణిలోనే తన్మయులై పోతూఉండేవారు.

చివరిరోజులలో కూడా ఏవేవో పాటలు రాసుకుంటూ, నారాయణరావు నవల తప్పొప్పులు దిద్దుకుంటూ ఉండేవారని తెలుస్తున్నది.

బాపిరాజుగారి అస్తమయంతో నేటి ఆంధ్రవాఙ్మయంలో ప్రముఖ సాహిత్య వ్రతి, అమృతహృదయుడు, అయిన ఒక మహావ్యక్తి స్వర్గపథానికి తరలిపోయాడు.

ఆయన రచించిన రచనలలో మధుర వాణి మొదలయిన నవలలు, కథలు మొదలైన వింకా అముద్రితంగా ఉండిపోయా యని తెలుస్తున్నది. వారి రచనలు, చిత్రాలు—అన్నీ సంపుటాలుగా ముద్రించి ప్రకటించవలసిన బాధ్యత తెలుగువారి మీద నిలిచిపోయింది. తెలుగువా రీవిధం గానైనా బాపిరాజుగారి మీదల తమకున్న భక్తిగౌరవాలు ప్రకటించుకోగలరని ఆశిస్తు న్నాను.

---

# కాగితపు పడవలు

శ్రీ బొడ్డుబాపిరాజు



చినుకున్వాను కొనుగాలికి
ననువుగ నటునిట్టుతూగి యాగుచు నాలో
జను వానకాల్వ నురవడి
నొసరుగ కాగితపు పడవ లొకటొక్కటిగా.

రమణీయాభ్ర పథమ్ములంజను మరాళశ్రేణి లీలన్, క్రమ
క్రమ మయ్యారములేలు పెండ్లినడకల్ గా, తూగుటుయ్యాలలై
తమి నూగించు తరంగ నెత్తముల యం దందాల పొందమ్మితో
రములై, వెన్నెల చారగా జరుగు, బాలానంద కందమ్ములై !

చెలువుం గెంపుల వ్రేళ్ల నిన్ మలచి తీర్చెన్, చిన్ని చిన్నారి క్రొ
న్నెల వంకంబలె; మెత్తనౌ పసిమెదన్నిండారు బంగార పుం
గల లన్నింపుచు లంగరెత్తె, నికజోకన్ సాగిపో క్రొత్త రే
వులకుం బోవుదు వేమి తెత్తు పడవా! బుజ్జాయి కజ్జాయముల్?

చక్కనిగాలి వాలునను సాగెదవో ? యెదురా తుపాను కుం
జిక్కి చికాకు నెందెదవొ? చీదర మబ్బుల త్రోవ తప్పినో
ప్రక్కల కొసరిల్లెదవొ ? పైబడు వెల్లువ నిబ్బరింపకే
గ్రక్కున మున్గెదో ? తుదకు గమ్యము చేరగనౌనొ — కాదొకో ?

చెడుగుడు లాడు నీ వెలుగు చీకటులన్ నడయాడు త్రోవలం
దొడు దొడుకుల్ ఘటించి, యెదురొత్తెడి గాలికి కేలుగల్పు నీ
యడుగని యెండవానలకు నాగక - లొంగక - సాగిపోవుమో
పడవ ! వెలార్చి తీర్చునొక వాడు కలం డఖిలాంత రాయముల్ !

అల సుడిపోయి, భగ్నహృదయమ్ముల యట్లొక కొన్ని మున్గిపో;
నిలిచె నిరుద్ధయాన సరణిన్ మరికొన్ని, తీరనట్టి కో
ర్కెలవలె; - ఎండవాన లెదిరించి ననున్ తలవంచ కుండ ను
జ్జ్వలగతి సాగె కొన్ని, ఫలవన్మధురాశయ భాగ్యశాలురై !

ఎరుగనిబాట, త్రోసి నడిపించెడి వెల్లువ గాలిపాట. ముం
దరిగిన వానివెంట, తడియారని కంట గమింపగ లేక, రెక్కలం
బరువిడగాక, అశ్రు నయనాంతరముల్ పెడ ద్రోయరాక, ని
వ్వెరపడు పాప మొక్కపడవేమొ తలంపుల మున్గి దేలుచున్ !

కడలేని వెల్లువంబడి
యడుగడుగున కార్తిగుడిచి యూగున్, సాగున్
జడిలో నెద్దడిలో నీ
పడవలు మనవోలె బ్రదుకు బాటలలోనన్



# కావ్యదోషము



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి

"తదల్పమపినోపేక్ష్యం కావ్యేదుష్టం కథంచన
స్యాద్వపుఃసుందరమపి శ్విత్రేణైకేనదుర్భగమ్"

అని కావ్యాదర్శకారుడనినాడు. శరీరమెంత సుందరముగా నున్నను కుష్ఠుపొడ యొకటి ఉన్నచో దుర్భగత్వ మెట్లు వాటిల్లునో, అట్లే కావ్యమున గూడ నొక్క దోషమైనను పనికిరాదు. వ్యాకరణ దోషములు, సాహిత్యదోషములు, అనౌచిత్యాది దోషములు కావ్యమున నుండరాదు. దోషమపకర్ష హేతువు.

ప్రాచీనులు శబ్దార్థ సహితత్వమునే కావ్యలక్షణముగా చెప్పిరి. శబ్దార్థములతోపాటు వామను డలంకారమును కలిపి కావ్యమును నిర్వచించెను. గుణాలంకారములనుండి నిష్పన్నమగు సౌందర్యము నలంకారముగా భావించుటచే "కావ్యశబ్దోఽయంగుణాలంకార సంస్కృతయోః శబ్దార్థయోర్వర్తతే" అని పలికి, తర్వాత "సదోష గుణాలంకారహానాదానాభ్యామ్" అని సూత్రించెను.

"నిర్దోషం గుణవత్కావ్య
మలంకారై రలంకృతమ్
రసాన్వితం కవిఃకుర్వన్
కీర్తిం ప్రీతించ విందతి."

అని భోజుడు పలికినాడు. "అదోషౌ" "సగుణౌ" అను విశేషణములతో మమ్మటుడు శబ్దార్థములను ప్రస్తుతించెను, "అపదోషతైవ విగుణస్యగుణః" (9-12) అని మాఘుడు దోష రాహిత్యమునే గుణముగా స్వీకరించినాడు. కాని దోషములనెంత శ్రద్ధగా పరిత్యజింప జూచినను యత్కించిద్దోష మెట్టి కావ్యమందైనను కన్పించగలదు. గుణబాహుల్యమున "మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీంతనోతి" అని సరిపెట్టుకొన వచ్చును. "ఏకోహిదోషోగుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అనిగూడ మహాకవి యనినాడు.

దోషరాహిత్యమును కావ్యలక్షణములలో నొకదానినిగా నెంచరాదని విశ్వనాథ, జగన్నాథులు వాదించిరి. అవిమృష్టవిధేయాంశము లేక విధేయావిమర్శమనబడు దోషము కన్పించు "న్యక్కారో హ్యపి..." అను శ్లోకమున సౌందర్యము లేదనుట ప్రామాణికము.

"నచ కించిద్గుణహీనం
దోషైః పరివర్జితం నవా కించిత్
తస్మాన్నాట్యప్రకృతౌ
దోషా నాత్యర్థతో గ్రాహ్యాః"

అని భరతుడే పలికినాడు. ఇంతమాత్రమున దోషములు కావ్యమున నుండవలెనని చెప్పరాదు. దోషములుండరాదు, కాని దోషములు లేనంతమాత్రమున కావ్యత్వము సిద్ధించదు. స్వల్పదోషము లన్నచో ప్రమాదము లేదు, కాని రసదోషములు పనికిరావు. దోషములనేక తెరగులు గాగలవు గనుకనే "న్యూనాధికాది దోషోపి నేత్రోత్పాటతుల్యః. అసమర్థాదికస్తు పటలనిభః" అని నమిసాధువు, "రస దోషో మహాన్ దోషః అర్థదోషః తదపేక్షయా నికృష్టః. పద పదైక దేశదోషాః పరిపాట్యా దవిష్ఠాః ఇతి నికృష్టతరాః" అని కావ్య ప్రకాశ వ్యాఖ్యావసరమున విద్యాచక్రవర్తి యనినారు.

పది కావ్యదోషములను భరతుడు ప్రస్తుతించి, దోష విపర్యయములే గుణములనినాడు. మమ్మటుడు మూడుగుణములనే గ్రహించి, మిగిలినవి దోషాభావ సూచకములనినాడు—"దోషత్యాగాత్పరే శ్రితాః" కాని వామనుడు గుణ విపర్యయాత్మకములే దోషములనినాడు, అలంకార గ్రంథములలో ప్రధానగుణములే నిర్వచింపబడినవి. ఒక్కొక్క గుణమనేకరీతుల

విపర్యస్తము కాగలదు గనుక దోషములసంఖ్యేయము లగును.

కావ్యమున నిరసింప వలసినవి దోషములు. కావ్యవిపత్తును తెచ్చునవి దోషములని దండి యనినాడు, "దోషావిపత్తయే తత్ర గుణాః సంపత్తయే" యను దండివాక్యము "కావ్యసౌందర్యాక్షేపహేతవః త్యాగాయ దోషా జ్ఞాతవ్యాః" అని వామనునిచే ప్రపంచింపబడినది. అభిమత ప్రతీతి వ్యవధాయకమై విఘ్నభూతమైనది దోషము. కావ్యమున రసము ప్రాణభూతమైనదగుటచే దోషములీ ముఖ్యార్థబాధకము లనవలెను. అనగా రసోత్పత్తి ప్రతిబంధకత్వమే దోషము. కావ్యాపకర్ష హేతువగు దోషము శబ్దార్థములలో గోచరమగునది, రసప్రతీతి నిర్విఘ్న ప్రతీతియైనచో నట దోషము లుండవు. అనగా నొకటి దోషమైనది, కానిది తేల్చవలెననిన, నిది రసప్రతీతికి ప్రతిబంధకమా? కాదా? యని విచారించవలెను. ఒకవేళ నొక దోషమున్నను నిర్విఘ్నప్రతీతి కల్గినయెడల నది దోషము కాజాలదని భావము. కావున

"శ్రుతిదుష్టాదయో దోషాఃఅనిత్యాయేచ సూచితాః
ధ్వన్యాత్మన్యేవ శృంగారే తే హేయా ఇత్యు
దీరితాః"

అని ఆనందవర్ధను డనినాడు. శ్రుతిదుష్టాది దోషములు రౌద్రాది రసములలో గుణములుగాను, శృంగారాది రసములలో దోషములుగాను భాసించుచున్నవి. ఒక దోషము శాశ్వతముగా, అన్నిచోట్ల దోషముగానే నిలచిపోవునని చెప్ప వీలులేదు గనుక దోషముల కనిత్యత్వము చెప్పబడినది. కాని అపశబ్ద, భిన్నవృత్తాదులు నిత్యదోషములని అభినవు డనినాడు. అనుకరణాది సన్నివేశములలో నపశబ్దములు దోషములు కాజాలవని అభినవుడు విస్మరించినాడు.

"తదపి పదం నదోషాయ, యథావికట నితంబాయాః పతిమనుకుర్వాణా సఖీ ప్రాహ—

'కాలేమాషం సస్యేమాసం
వదతి శకాశం యశ్చసకాశమ్
ఉష్ట్రేలుంపతి రం వాషం వా
తస్మై దత్తా వికటనితంబా'

అని ఉదహరించుచు అపశబ్దమే స్థలములలో దోషము కాదో నమి సాధువు చెప్పినాడు. కాగా అభిమతార్థ విఘ్నహేతువు, ముఖ్యార్థహతి, లేక రసవిఘ్నకరము నగు దోషమును అనౌచిత్యముగా నిర్వచింపవలెను. "శబ్దదోషాణా మనౌచిత్యోపగమాత్" అని మహిమభట్టు దోషమును అనౌచిత్యముగా నిర్వచించి,

"పారంపర్యేణ సాక్షాచ్చ తదేతత్ప్రతి పద్యతే
కవేరజాగరూకస్య రసభంగ నిమిత్తతామ్
యత్త్వేతత్ శబ్దవిషయం బహుధా పరిదృశ్యతే
తస్య ప్రక్రమభేదాద్యాఃదోషాఃపంచైవయోనయః"

అని సంగ్రహకారికల నిచ్చినాడు. అనౌచిత్యమనగా సహృదయోద్వేజకత్వము.

అనృత, వ్యాఘాత, పునరుక్తము లనబడు దోషములు న్యాయసూత్రములచే (2-1-57) పరామర్శింపబడినవి. భరత, భామహ, దండి ప్రభృతుల ఏకార్థమే ఇచట పునరుక్తము గాగలదు. భామహుని వ్యర్థము, దండియొక్క పూర్వాపర విరుద్ధము ఇచట గల వ్యాఘాత పర్యాయములు. న్యాయ భాష్యాదులలో అనువాదసమయమున పునరుక్తి దోషము కాదని దోషానిత్యత్వము చెప్పబడినది. ఇవిగాక అర్థాంతర, నిరర్థక, అవిజ్ఞాతార్థ, అపార్థకములను దోషములు న్యాయసూత్రములలో (5.1-10) ప్రస్తుతించబడినవి. శాసనాధికారమున అకాంతి, వ్యాఘాత, పునరుక్త, అపశబ్ద, సంప్లవములను లేఖదోషములను కౌటిల్యుడు (2 10) వివరించినాడు. అనృత, నిరర్థక, అపార్థక, ఛల, నిస్సార, అధిక, ఊన, పునరుక్త, వ్యాఘాత, అయుక్త, క్రమభిన్న, వచనభిన్న, విభక్తిభిన్న, లింగభిన్న, అపద, స్వభావహీన, వ్యవహిత, కాలదోష, యతిదోష, ఛవిదోష, అనభిహిత, సమయ విరుద్ధ, నిర్హేతుక, సమాసదోష, ఉపమాదోష, రూపకదోష నిర్దేశదోష, పదార్థదోష, సంధిదోషములు అనుయోగ ద్వారమున వివరించబడినవి. మహాభారతములోని శాంతిపర్వమున సులభాజనకసంవాదములో అపేతార్థ, భిన్నార్థ, న్యాయవిరుద్ధ, అధిక, అశ్లక్ష్ణ, సందిగ్ధ, గుర్వక్షర, పరాఙ్ముఖపద, అనృత, త్రివర్గవిరుద్ధ, అసంస్కృత, న్యూన, కష్టశబ్ద, విక్రమ, సశేష, నిష్కారణ, అహేతుకాది దోషముల ప్రస్తావన గలదు,

భరతుడు పదిదోషములను పేర్కొనినాడు. భామహుని దేశకాలకలా లోకన్యాయాగమ విరోధి, ప్రతిజ్ఞాహేతు దృష్టాంతహీనములు భరతుని న్యాయాపేతమునకు జెందినవి. విషమము వృత్తదోషము. ఈ వృత్తదోషమును శబ్దానౌచిత్యముగా మహిమభట్టు గ్రహించెను. శబ్దచ్యుతము శబ్దహీనమనబడు అపశబ్దము. గూఢశబ్దాభిధానమే గూఢార్థము. అర్థాంతర మన వాచ్యావచనము, అవాచ్యవచనమునను దోషద్వయము గలదని వ్యక్తివివేకముద్వారా తెలియనగును. అర్థహీనమనగా భామహాదుల అపార్థము. ఏకార్థమును పునరుక్తమనినారు. అభిప్లుతార్థమును ససంశయ మనదగును.

వామనుని మతము నవలంబించి గుణదోషముల నభినవుడు వ్యాఖ్యానించెను. గూఢార్థమును నేయార్థము లేక కల్పితార్థముగ గ్రహించినాడు. భరతుని అర్థాంతరమునకు వామనుడు ఏకార్థము లేక ఉక్తార్థముక్రింద నొసగిన ఉదాహరణ నిచ్చినాడు. భరతుని అవర్ణ్య వర్ణనను వాక్యదోషముగా వ్యాఖ్యానించినాడు. అర్థహీనమును వామనుని వ్యర్థముగా వివరించినాడు. దూరసంబంధ వ్యవధానము లేక వామనుని వ్యవహితార్థప్రత్యయమగు క్లిష్టము, గ్రామ్యము లేక అసభ్యము, పరస్పర విరోధము అను ముత్తెరగుల దోషములు భిన్నార్థమున గలవనినాడు. సముదాయార్థ శూన్యమగు అపార్థముగ నభిప్లుతార్థమును వివరించినాడు. దేశకాల కలాశాస్త్ర విరుద్ధమే న్యాయాపేతమనినాడు.

ఈ పదిదోషములనే గాక సిద్ధివ్యంజకమున పునరుక్తము, అసమాసము, విభక్తిభేదము, విసంధి, అపార్థము, త్రిలింగదోషములు, ప్రత్యక్షపరోక్ష సంమోహము, ఛందోవృత్తత్యాగము, గురులాఘవ సంకరము, యతిభేదము అను దోషములను భరతుడు ప్రస్తావించెను.

నేయార్థ,క్లిష్ట, అన్యార్థ, అవాచక, అయుక్తిమత్, గూఢశబ్దాభిధా, శ్రుతిదుష్ట, అర్థదుష్ట, కల్పనాదుష్ట, శ్రుతికష్ట (1-37-47-) దోషములనే భామహుడు వివరించి, ఈ దోషము లెట్లు గుణములు కాగలవో వివరించెను (1. 54-58) నాల్గవ అధ్యాయమున అపార్థ, వ్యర్థ, ఏకార్థ, ససంశయ, అపక్రమ, శబ్దహీన, యతిభ్రష్ట, విసంధి, దేశకాలకలాలోకన్యాయాగమవిరోధి, ప్రతిజ్ఞా హేతుదృష్టాంతహీనములను పదిదోషములను చెప్పినాడు. కావ్యాదర్శములో నీ పదిదోషములు గలవు. ప్రతిదోషము ఎప్పుడెట్లు గుణమగునో విస్తృతముగా దండి చూపినాడు.

గుణదోషములను శబ్దార్థపరములుగా విభజించినవాడు వామనుడు. అసాధు, కష్ట, గ్రామ్య, అప్రతీత, అనర్థకములనునవి పదదోషములని; అన్యార్థ, నేయార్థ, గూఢార్థ, అశ్లీలార్థ, క్లిష్టార్థములు పదార్థదోషములని; భిన్నవృత్త, యతిభ్రష్ట, విసంధులు వాక్యదోషములని; వ్యర్థ, ఏకార్థ, సందిగ్ధ అయుక్త, అపక్రమ, లోకవిద్యా విరుద్ధ దోషములు వాక్యార్థదోషములని విభజించినాడు. ఇవి గాక ఉపమాదోషము లీయబడినవి.

న్యూనపద, అధికపద, అవాచక, అపక్రమ, అపుష్టార్థ, అచారుపద దోషములను రుద్రటు డంగీకరించినట్లు తెలియనగును. అసమర్థ, అప్రతీత, విసంధి, విపరీత కల్పన, గ్రామ్య, అవ్యుత్పన్న, దేశ్యములను పదదోషములను, సంకీర్ణ, గర్భిత, గతార్థ, అనలంకారములను వాక్యదోషములను, అపహేతు, అప్రతీత, నిరాగమ, బాధయత్, అసంబద్ధ, గ్రామ్య, విరస, తద్వత్, అతిమాత్రములను అర్థదోషములను, ఉపమా దోషములను గూడ అంగీకరించినాడు.

ఆనందవర్ధనుడు గుణములను రసధర్మములుగా ప్రపంచించుచు, దోషములను గూడ రసధర్మములుగానే గ్రహించెను. రసప్రతీతికి విఘ్నము కల్గించునవి దోషములని సామాన్యలక్షణ మీయబడినది. పద, వాక్య, ప్రకరణ, ప్రబంధ, శబ్ద, అర్థ, అలంకార, రసములకు చెందిన దోషము లిచట కన్పించుచున్నవి. ఈ దోషము లనౌచిత్యము నాశ్రయించుకొని వచ్చునవి. విరోధిరససంబంధి విభావాది పరిగ్రహము, విస్తరముగా నన్వితమైన వస్తువుగూడ అన్యవర్ణన కుపకరించుట, అకాండవిచ్ఛిత్తి, అకాండ ప్రకాశనము, పుష్టమైన విషయము మాటిమాటికి దీప్తమగుట, వృత్త్యనౌచిత్యము అనునవి ప్రధానముగా రసప్రతీతికి విఘ్నమును తెచ్చు దోషములు. ఇవి రసవిరోధులు. ఈ దోషములను మమ్మటుడు చక్కగా వివరించి యున్నాడు. "రసస్థాయి వ్యభిచారిణాం స్వశబ్దవాచ్యత్వం", "అనుభావ విభావయోః కష్టకల్పనయా

వ్యక్తిః", "ప్రతికూల విభావాది గ్రహః", "పునః పునః దీప్తిః", "అకాండే ప్రథనం", "అకాండే ఛేదః", "అంగస్యాప్యతివిస్తృతిః", "అంగినః అననుసంధానం", "ప్రకృతి విపర్యయః", "అనంగస్యాభిధానం" అని వివరించియున్నాడు.

మహిమభట్టు తన వ్యక్తివివేకమున ద్వితీయ విమర్శలో దోషవిచారమును పూర్తిగా తెలిపినాడు. అనౌచిత్యమే దోషము. దోషము శబ్దార్థములలో గాననగును. విభావాది పరిపోషము ననర్థదోషములు కన్పించగలవు. కాని శబ్దదోషములు బహిరంగములు. ఇట్టివాటిలో ముఖ్యముగా నైదువిధములు కన్పించగలవు. విధేయావిమర్శ, ప్రక్రమభేదము, క్రమభేదము, పౌనరుక్త్యము, వాచ్యవచనము నని వీనిని పిలుతురు. వృత్తమున దుఃశ్రవత్వమున్న నది శబ్దానౌచిత్యమగును. కాని రసానుగుణ్యముగా నీదోష వివేకము గావించవలెనుగనుక "వివక్షిత రసాది ప్రతీతి విఘ్నవిధాయిత్వం నామసామాన్య లక్షణమ్" అనినాడు. వాచ్యవచనముతో బాటు అవాచ్యవచనమునుగూడ గ్రహించి, అపుష్టార్థమును ప్రస్తుతించినాడు.

దోషములలో రసదోషములు ప్రధానములు. రసదోషముల నాశ్రయించుకొని శబ్దదోషములు, అర్థదోషములు, వర్ణదోషములు, రచనాదోషములు బయలుదేరుచున్నవి. వర్ణరచనా దోషములు సంఘటనను, వృత్తిని ఆశ్రయించుకొనినవి. రీతితో బాటు అలంకార దోషములను ముఖ్యముగా విస్తృతముగా ప్రపంచించినాడు.

దోష విపర్యయములు గుణములని, గుణవిపర్యయములు దోషములని భరత, వామనులనినారు. దోషములు రసదోషములని ఆనందవర్ధనుడీ వాదమునకు ప్రాణము తెచ్చినాడు. దోషములు సహితము గుణములు కాగలవని భామహాదులు దోషానిత్యత్వమును ప్రపంచించిరి. భోజుడు కూడ వైశేషికగుణము లనబడు దోషగుణములను చెప్పినాడు. దోషము సహృదయోద్వేజక మగుటచే మహిమభట్టు దోషము ననౌచిత్యముగా నిర్వచించెను. దీనితో ప్రబంధదోషములు కూడ బయలుదేరినవి.





నవల:

# శాఫో



అల్ఫాంజ్ డాడె (ట్)

## 3

"ఈమాటు సరిగ్గా మనకి కావల్సింది దొరకింది. రూ డి ఆమ్‌స్టర్ డామ్‌లో, స్టేషను ఎదురుగా ఇల్లు! మూడుగదులు, పెద్ద బాల్కనీ. నీకిష్టమయితే సాయంత్రం నువ్వు ఆఫీసు నుంచి రాగానే వెళ్ళి చూసివద్దాం. భాగం చాలా ఎత్తున ఉంది. ఐదుఅంతస్థులపైన. కాని నన్ను ఎత్తుకొని వెళ్తావ్‌గా! అప్పుడెంత బాగుందో జ్ఞాపకం ఉందా?"

అంటూ ఆ స్మృతి రేకెత్తించిన ఆనందంలో అతని కౌగిలిలో తలదూర్చి, అతని రొమ్ముపై మొగం రుద్దుకుంటూ, తన పూర్వస్థానాన్ని, స్వస్థానాన్ని, అక్కడ వెదుకుతుంటూన్నట్లు కౌగిటిలోకి కదుల్తూంది.

లాటిన్ క్వార్టర్ సమ్మర్దమధ్యమంలో ఒక నాసి హోటలు గదిలో ఇద్దరూ ఉన్నారు. అక్కడి వాతావరణమంతా—తలకట్టువలలుకట్టిన ఆడవాళ్లు, కఱ్ఱచెప్పులతో, చెక్క మెట్లమీద నిత్యంచేసే టక్కుటక్కు ధ్వనులు, ప్రక్కగదుల్లోని సర్వ వ్యవహారాలూ చెవులకు కట్టినట్లు వినిపిస్తూ గదులకు మధ్యనున్న, కాగితపుపూత దేవదారు చెక్కసరంబీ గోడలు, ఉమ్మడి తాళాలు, గుడ్డిదీపాలు, తలుపవతల అన్నిటి కలగా పులగం—ఆ వాతావరణమంతా అతనికి చీదర ఎత్తించి దుర్భరమైపోయింది. ఆమె కాప్రసక్తే పట్టినట్లులేదు. అటుకమూలనైనాసరే మురికి కాలవ తూములోనైనాసరే నివాసం ఏర్పరుచుకోనేందు కామె కభ్యంతరమే ఉన్నట్లు లేదు. జీన్‌తో మాత్రం ఉండాలి. అతను ప్రక్కనుంటే ఎక్కడున్నా ఆమెకు లెక్కలేదు.

తనకు తనుగా నివసిస్తూన్నంతకాలం ఏనాడూ ఆలోచించనైనా ఆలోచించని అనేక సన్నివేశాలు స్పర్శలు, ఇప్పుడతని సున్నితహృదయాన్ని గాయపరుస్తున్నాయి. ఈ ఏకరాత్రి ప్రణయాలు తన ప్రేమను నీచపరుస్తూన్నట్లనిపించి అతనికి చిరాకు కల్గించసాగాయి. జార్డిన్ డిప్లాంటిస్‌లోని జంతుశాలలో కోతుల బోనుముందర నుల్చున్నట్లు అనిపించేది అతనికి. అక్కడికోతులు మానవప్రణయ కలాపాన్నంతా నీచంగా వెక్కిరిస్తూన్నట్లు అనుకరించి, కామమంటేనే అసహ్యమూ, వికారమూ కల్గించేవి అతనిలో. ఇక్కడా అల్లాగే అనిపించసాగింది. అదికాకుండా అక్కడి "బూల్‌వర్డు సెంట్ మైకేల్ రెస్టారెంటు"లో భోజనంకూడా విసుగు పుట్టించసాగింది. రోజూ రెండుసార్లు ఆ హోటల్లో, పెద్దహాలులో యూనివర్సిటివిద్యార్థులు, ఆర్టువిద్యార్థులు, చిత్రకారులు శిల్పులు, వీళ్ళందరితో కలిసి భోంచెయ్యాల్సి రావటం కూడా మొహం మొత్తుకురాసాగింది. అక్కడ ఎవళ్లనీ ఎరగడు. కాని ఏడాది పాటు వస్తూండటంలో, అతని మొగం అక్కడ అందరికీ పరిచయం కాక తప్పలేదు.

భోజనాలహాలు ప్రవేశించీ ప్రవేశించటం తోనే హాలులో ఉన్నవాళ్ళదృష్టులన్నీ ఫాన్ని వైపు

తిరగటంతో అతని మొగం సిగ్గుతో ఎఱ్ఱబారి కందగడ్డలాగై పోయేది. ఆడదాన్ని వెంటబెట్టుకొని వెళ్తున్న యువకులలో ఉండే తత్తరపాటుతో, లేని పౌరుషం తెచ్చుకొని ఉద్ధృతంగా ముందుకు కదలేవాడు.

అంతకన్నా, తన ఆఫీసులో పై ఉద్యోగులుగాని, తన యింటిదగ్గరవాళ్లెవళ్లైనాగాని, ఆమెతో ఉండగా తటస్థపడతారేమోనన్న నిత్యభయం. పైపెచ్చు ఖర్చుకూడా భరించరానంతగానే ఉండేది.

ప్రతిసాటూ భోజనంఅయి బిల్లు చేతి కందగానే, ఫాన్ని బిల్లు చేత పుచ్చుకొని, జాబితా అంతా చదివి, "అబ్బ ఎంత ప్రియమో! ఈ డబ్బుతో, మనకు మనం చేసుకొంటె, మూడురోజులు గడపగల్గుతాను"అనేది.

"చేసుకొంటే వద్దన్న దెవరు" అన్నాడు.

అంతతో అద్దె ఇల్లు వెదకటం ప్రారంభించారు.

అక్కడే ఉన్నది ఉచ్చు. ఎంతెంత మంచివాళ్ళు, ఎంత నిబ్బరం గల వాళ్ళూ కూడా, ఆ ఉచ్చులో పడిపోతారు. వెచ్చని, ఇంటి వాతావరణాలలో, కుటుంబమధ్యాలలో చిననాడు పెరిగిన ప్రతివాళ్లనూ, తన గార్హస్థ్యం సక్రమమువాలని, తనకు తనదంటూ ఒక ఇల్లు ఉండాలనే వాంఛ లోబర్చుకొని ఆ ఉచ్చులోకి నెట్టుతుంది.

రూడి ఆమ్‌స్టర్‌డామ్‌లోని, ఆ భాగం వెంటనే అద్దెకు తీసుకొన్నారు. చాలా బాగుందనే నిశ్చయించుకొన్నారు. గదులన్ని ఒకదానిలోకి ఒకటి తెరుచుకొంటూ వరుసగా ఉన్నా!—చావడీ, వంటగదీ, క్రింది దొడ్డి ఆవరణలోకి చూస్తాయి. అక్కడంతా చెత్తాచెదారం. క్రింద ఇంగ్లీషు కల్లుపాకలొంచి ఘాటైన దుర్వాసన లొస్తాయి. పడకగది వీధిమీదికుంటుంది. వీధిలో అస్తమానం రాస్తా సందడి. దగ్గిరలో నిత్యం రైళ్లకూతల, రాకపోకల హోరుశబ్దం. స్టేషన్ జనం మోత—ఇవేవీకూడా వాళ్ల లెఖ్ఖలోకి రాలేదు. స్టేషన్‌కు దగ్గిరగా ఉండటం, సీన్ నది ఒడ్డునే ఇటూ అటూ పచ్చపచ్చని తోటలూ బంగాళాలూ కన్నులపండువుగా, కనబడటం, వాళ్ళకి ఉత్సాహాన్నిచ్చాయి. ఆ బాల్కనీ, పైకప్పు జింక్ రేకులతో అమర్చబడింది. వానకాలంలో వాన హోరుకు రేకులు టపటపా మోగుతూ, చుట్టూ కుంభవృష్టిగా నీరు కారుతూ, బితుకు బితుకు మనిపించేటట్లున్నా, వేసవికాలంలో బాల్కనీలో చల్లగాలిలో కూర్చుని భోంచేస్తూంటే ఎక్కడో కొండకొన నున్నంత ఆనందం కల్పించేది.

ఇంటికి సరంజామా చేర్చుకోటం ప్రారంభించారు. తను స్వంతంగా ఇల్లు పుచ్చుకుని ఉందామనుకొంటున్నానని జీన్ ఇంటికి వ్రాశాడు. వెంటనే పిన్ని "దివోనీ" కావలసిన డబ్బు పంపించింది. (తన యింటిదగ్గిర పెత్తనం అంతా దాదాపు ఆవిడదే) డబ్బుతోపాటు ఉత్తరంలో, కావల్సిన సామానంతా ఇంటిదగ్గిరనుంచి వెంటనే పంపిస్తున్నానని వ్రాసింది. కుఱ్ఱవాడి సౌఖ్యంకోసం, ఉత్తరపు గదినుంచి తీసి, ఒక పెద్ద పేము సోఫా, ఛెస్ట్ ఆఫ్ డ్రాయర్సు, పెద్ద బీరువా అన్నీ పంపిస్తోంది.

తన యింటిదగ్గిర ఆ గది అతని కన్నులలో మెరిసింది. వరాండా చివర ఒకమూలగా, గాలి జోరుకు ఆలవాలమైన ఉత్తరపు గది ఉంది. ఆ గది కిటికీలు ఎప్పుడూ మూసేసి ఉంటాయి. విశాలమైన గది. అక్కడ ఎవళ్లూ ఉండరు. హోరుగాలికి అక్కడ కిటికీ తలుపులన్నీ నిత్యంటకటకా మోగుతుంటాయి. ఒక్కొక్క తరంవారు వాడి వదిలేసిన సామాన్లన్నీ ఆ గదిలో గుట్టగా పేరుకొంటూఉంటాయి.

తను పంపిన పేముసోఫా ఎన్నెంటి వింతవింత కలాపాలకు ఆలవాలమౌతూందో, ఆ పురాతనపు ఎంపైర్ ఛెస్ట్ ఆఫ్ డ్రాయర్సు, ఎన్నెంటి సిల్కు గౌనులూ, లేసుబ్లౌజులూ, పట్టు మొలదట్టీలతో నిండిపోతోందో దివోనికి తెలిస్తే! కాని గాసిస్ అంతరాత్మ చేసిన ఘోషలన్నీ కొత్తకాపురపు మోజులో అంతరించిపోయాయి.

రోజూ సాయంత్రం అవగానే ఆఫీసునుంచి ఇంటికివచ్చి, ఫాన్నితో చెట్టాపట్టా లేసుకొని అవీ ఇవీ కొనేందుకు బజారుకు బయలుదేరటం చాలా కుతూహలం గల్గించేది. ఇంటికి కావలసిన సామాన్లు కొనుక్కోవాలి. భోజనాలగదిలో, వంటకాలకు బల్ల కావాలి. భోజనం చేసే గుండ్రనిబల్ల, ఆరు కుర్చీలు కిటికీలకు, మంచాలికి దోమతెరలు కర్టెన్లు—అతన్ను

ఏదిపడితే అది ఏ గరకుపడితే ఆ గరకు కొనేందుకు సిద్ధంగా ఉండేవాడు—కాని ఫాన్నీలో ఇద్దరికీ కావలసిన జాగ్రత్తంతా ఇమిడేఉంది. కుర్చీలు గట్టివానో కాదో కూర్చొని చూసేది. బల్ల సొరుగులు సమంగా వస్తున్నాయో రావో తీసిచూసేది. ప్రతి వస్తువు పరీక్షచేసి, బేరంచేసి, వ్యాపారంలో మంచి అనుభవం నిరూపించుకునేది.

చిన్నకాపురానికి కావలసిన వంటపరికరాలన్నీ ఎక్కడ చవకగా కొనగలచోట్లు ఆమెకు తెలుసు. నాలుగు ఇనపబూర్ల మూకుళ్లు, ప్రొద్దున్న చాకలేట్ కాచుకోనేందుకు పింగాణీబూర్లమూకుడు—రాగిదికాదు రాగిదైతే తోమటం కష్టం—పళ్ళాలు, గరిటలు, భోజనానికి పింగాణీప్లేటులు—అన్నీ మొత్తంగా చవకగాకొని, బొమ్మసామాను లాగా పాక్‌చేయించి ఇంటికి తెప్పించింది. తువ్వాళ్లూ, దుప్పట్లు, గలేబులు, టేబిల్‌క్లాతులు, తెరగుడ్డలు,—ఇలాంటివన్నీ ఫ్యాక్టరీ ఏజంటు నొకణ్ని పట్టుకొని, అతనిదగ్గర చవకగా కొన్నది. వాట్ల ధరకూడా, నెలవారీగా కొంతకొంత ఇచ్చి తీర్చుకోవచ్చు. నిత్యం ఎక్కడే వస్తువు చవుకగా దొరకుతుందా, ఎక్కడేం ఏలం అమ్మకాలు జగుగుతాయా అని పారిస్ మహాసముద్రంలో మునిగి పోయిన కుటుంబాల తాలూకు పాతసామాన్లు, కొట్టుకొనివచ్చిన తీరాలలాగుండే ఏలపుబజారులన్నీ గాలించేది. క్లిచే బూలివర్డ్‌లో, దాదాపు కొత్తపందిర పట్టు మంచం, "శ్రీకృష్ణుడూ, అష్టభార్యలూ" కూడా ఏకకాలంలో పడుకునేందుకు విశాలమైనంత మంచం, అతి చౌకగా బేరంచేసి తెచ్చింది.

అతనుకూడా మధ్యమధ్య మంచిబేరం చేద్దామని ప్రయత్నించేవాడు. కాని అతనికి కుదిరేది కాదు. షాపులో కెళ్ళి, అక్కరలేదని వట్టి చేతులతో రాగలగటం అతనికి చేతయేదికాదు. ఒకసారి ఫాన్ని చెప్పింది ఏదో కొనటానికి వెళ్ళి అది ముందే అమ్మడై పోయేటప్పటికి, కచేరి చావడిలో వేలా డేసే, దీసాలగుత్తి కొనుక్కొచ్చాడు. కాని కచేరీ చావిడే లేదా యింట్లో!

"పోనీలే! వరండాలో పెడ్దాం!" అంది ఫాన్ని అతన్ని ఓరడించేందుకు.

ఎక్కడే వస్తువుండాలి—ఎంతెంత ఉండాలి—కొలతలు, అంచనాలు-వాదాలు ప్రతివాదాలు—ఎంత హాయి అనిపించేవి! తీరా ఇంత జాగ్రత్తపడ్డాక ఏదో అవసరమైన వస్తువు మర్చిపోయే టప్పటికి, పట్టరాని నవ్వులు, హాలికేకలు! ఎంతకీ ఏదో ఒకటి మరిచిపోక తప్పనట్లే ఉండేది.

తీరాచూస్తే సన్నికల్లు తెచ్చుకోలేదు. సన్నికల్లు లేకుండా కాపురం మొదలుపెట్టారట—హయ్యో!

అన్నీ కొని, అన్నీ సర్ది ఎక్కడి వక్కడ చక్కగా అలంకరించి, కొత్త లాంతరులో కొత్త వత్తివేసి, దీపంవెల్గించి, క్రొత్తఇంట్లో కాపురం ప్రారంభిస్తే, నిజంగా ఆ మొదటిరాత్రి ఎంతహాయిగా ఉంది!

రాత్రి పడుకోబోయేముందు, గదులన్నిటా ఎక్కడిదక్కడ సరిగ్గా ఉందో లేదో పరీక్షిస్తూ తిరిగారు. అతను తలుపులు వేస్తూంటే మహా ఆనందంతో చేతిలో కొవ్వొత్తి ఎత్తి పట్టుకొని దీపం చూపిస్తూ, అంది. "తాళం సరిగ్గా వేశావా! ఇంకో తిప్పు తిప్పు-తలుపులు గట్టిగా పడ్డాయా—ఏమాత్రం చలిగాలి లేకుండా వెచ్చగా ఉండాలి"

అట్లా ఒక నూత్న రమణీయ జీవితం ప్రారంభమయింది. రోజూ ఆఫీసు అవగానే తొందరగా ఇంటికి వచ్చేసేవాడు—ఇంటి దగ్గిర నీమా జామా విప్పేసి, స్లిప్పర్లతో, చలిమంట గూటిదగ్గిర వెచ్చగా హాయిగా కుర్చీలో కూర్చునేందుకు! ఇంటికివస్తూ చీకటి సందులలో బురదరోడ్లమీద వస్తూన్నంతసేపూ తన యింట్లో వెచ్చదనమూ, వెలిగించిన దీపమూ, తన ఊరినుంచి వచ్చిన పురాతన వస్తువులూ అన్నీ మనసులో ముందే చిత్రించుకొంటూ వచ్చేవాడు. ఫాన్నీ వాటిని మూలపారేద్దామనుకొందిగాని రానురానూ గదిలో కెల్లా అవే రమ్యమైన వస్తువులుగా తయారయాయి. ముఖ్యంగా లూయీ 16 కాలంనాటి అద్దాలబీరువా—ఆ అద్దాల మీద అంతా పల్లెటి పండుగల ఉత్సవదృశ్యాలు తప్పెటలతో నృత్యాలుచేస్తూన్న జానపదుల చిత్రాలు మనోహరంగా చిత్రించబడి ఉన్నాయి. చిననాటి నుంచీ పరిచితమైన ఆ వస్తువులక్కడ ఉండేటప్పటికి తన ఇంటి వాతావరణాన్ని, ఆ పవిత్రతనే, ఇక్కడ

కూడా మనోజ్ఞంగా స్ఫురింపచేస్తూ మనస్సుకు శాంతిని చేకూర్చేవి.

ఇంటికొచ్చి వీధితలుపు తట్టేటప్పటికి, నీటుగా పరిశుభ్రంగా, చక్కగా అలంకరించుకొని, ఫానీ్ని ప్రత్యక్షమయ్యేది. ఆమెకు దుస్తుల అలంకరణ చక్కగా తెలుసు. అందుకనే, ఎబ్బెరికంలేని సామాన్యతతో కనిపించే అతిసున్నితపు విధానంలో అలంకరణ సాగించుకొనేది. ఆమె నల్లని ఉన్నిగౌను, అతిసాధారణంగా కనబడేది. కానిబహు చక్కగా ఉండేది. చేతులు మోచేతులపైకి వెనక్కు మడిచి, వంటచేసేటప్పుడు దుస్తులు పాడవకుండా ఒక తెల్లని పెద్దరుమాలు బుజాలమీద కప్పుకొనేది. ఇంట్లో వంటపనులన్నీ ఆమే చేసేది. అంట్లు తోమటం, ఇళ్లు కడగటంలాంటి చేతులు మొద్దుబారే మోటుపనులకు మాత్రం చౌకగా ఒక గాసీని కుదిర్చింది.

భోజనాలు, పనులన్నీ అయ్యాక తెల్లరుమాలు తీసి వంటయింటి తలుపుఅవతల ఆరవేసి, వచ్చి కూర్చుని, తన మధురకంఠంతో అతనికోసం చక్కచక్కని పాటలు పాడేది.

వీధిలో చలివణికిస్తూ కుంభవృష్టిగా కురుస్తూన్న వర్షంలో కూడా ఎడ తెగకుండా వెళ్తూన్న బళ్ళ చక్రాల సందడి సాగిపోతూనే ఉండేది. వరాండా జింకురేకులమీద చినుకులు చిటపట చిటపట మోగిపోతూనే ఉండేవి. గాసిన్ చలిమంట పొయ్యిదగ్గిర, పేముకుర్చీలో కాళ్లు చాచుకొని కూర్చొని—పాదాలు కాచుకొంటూ చలికాగుతూ వెచ్చగాకూర్చొని - దూరాన రైలుస్టేషన్ మేడకిటికీల కేసీ, అక్కడి బల్లలదగ్గిర తలలువంచుకొని దీపాల వెలుగులో తెరిపి అంటూ లేకుండా వ్రాసుకొంటూ కూర్చున్న రైల్వే గుమాస్తాల కేసీ, చూస్తూ కూర్చొనేవాడు.

అతనికి చాలా సుఖంగా ఉంది. ఆ లాలనకు అవశుడై తన నొగ్గేసుకొంటున్నాడు. అయితే తను ప్రేమిస్తున్నాడా? లేదు. కాని, అనవరతం తన సౌఖ్యాన్ని వేయికళ్ళ కనిపెట్టూ తన నావరించుకొన్న ప్రేమకు కృతజ్ఞుడై పోతున్నాడు. ఇన్నాళ్లూ కేవలం ఏదో మాయా వాగురలో పడిపోతానన్న భయంచేత ఈ సుఖాన్ని నిరాకరించి దూరస్థుడనయి ఎల్లా ఉండగలిగానా అని ఆశ్చర్యపోతున్నాడు. ఇప్పుడా భయం పేలవంగా, పిచ్చి భ్రమగా కనబడుతూంది. నిలకడలేకుండా, ఏ స్త్రీతో పడితే, ఆ స్త్రీతో పోతూ, ఆరోగ్యానికిఅపాయకరంగావర్తించే గుమపటి జీవితంకన్నా, ఇప్పటి జీవితం గొంగా సుఖంగా, పరిశుభ్రంగా లేదా?

తరువాత ఎప్పుడో వచ్చే బాధలుకూడా ఏమీ లేవు. మూడేళ్లలో, అతను వెళ్లిపోవాల్సిన రోజువచ్చేటప్పటికి, చాలా సునాయాసంగా ఇద్దరూ విడివడి పోతారు. ఆ విషయమంతా ఫానీ్ని ఎరిగేఉంది.

మృత్యువుమాదిరిగే, ఇప్పుడు కాక ఎప్పుడో చాలా కాలానికి విధాయకంగా రాగల విషయాన్ని గూర్చి మాట్లాడుకొన్నట్లు, ఆ, రాగల ఎడబాటును గురించి, ఫానీ్ని అతనూ, శాంతంగా మాట్లాడుకునేవారు. అతని కున్న భయమల్లా ఒకటే. తను ఒంటరిగా జీవించటంలేదని తన కుటుంబంలో తెలుస్తుందేమోనని. తండ్రి చాలా తీవ్ర స్వభావుడు. శ్రోత్రియుడు. ఆయనకు కోపం వస్తేపట్టటం కష్టం.

కాని ఎల్లా తెలుస్తుంది! జీన్, పారిస్‌లో ఎవర్నీ చూడటానికి వెళ్ళేవాడు కాదు. అతని తండ్రికి (ఆయనను కౌన్సల్ అని పిలుస్తారు) ఏడాది పొడుగునా ఎస్టేటు, ద్రాక్షతోటలూ, అవి మాసుకోటంతోటే ద్రాక్ష పాడవకుండా కాపాడుకోవటంతోటే, సరిపోతుంది. అతని తల్లి రోగిష్టిది. ఇతరుల సాయం లేనిదే మంచం దిగి రెండడుగులు కూడా వేయలేదు. ఇంటి పనంతా తోడికోడలు దివోనీకే అప్పచెప్పేది. మార్తి, మేరీ, కవలపిల్లలు. వాళ్ళ పుట్టుకతోటే తల్లి శాశ్వతంగా రోగిష్ఠురాలయింది. వాళ్ళ పోషణకూడా పినతల్లి దివోనీమీదే పడింది. ఇక దివోనీ భర్త సీజేర్ బాబాయి అందామా- ఎన్ని ఏళ్ళు వచ్చినా పసిపిల్లాడే! ఒంటరిగా బైట ఎక్కడికీ వెళ్ళనే వెళ్ళనీయరు.

ఫానీ్ని, కిప్పుడా కుటుంబం అందరూ ఎరుక అయ్యారు. కాసిలెట్ (జీన్ యిల్లు)నుంచి ఉత్తరం వచ్చినప్పుడల్లా, అతని కుర్చీ వెనుక నిలిచి, ఉత్తరం చివర, కవల చెల్లెళ్ళిద్దరూ పెద్ద అక్షరాలతో వ్రాసిన మాటలు గట్టిగా చదివి, అతనితోపాటు, అతని మధుర స్మృతులలో తానూ లీనమైపోయేది.

ఆమె పూర్వ జీవితాన్ని గురించి మాత్రం అతని

క్కేమీ తెలియదు. అతను అడగనూ లేదు. అతనిలో అజ్ఞాతంగా ఉన్న ఉదాత్త యౌవన అహంకారంలో, అతనిలో ఏ ఈర్ష్యా, అలజడీ ఆమె విషయంలో కలుగలేదు తన జీవితమే తనకు సంప్రాప్త మనిపించి, తొణికిసలాడించుకొంటూ ఆమెను కూడా అంకితం చేస్తూతో, బిగ్గరగా ఆలోచించుకొంటూ కూర్చునేవాడు. ఆమె ఏమీ మాట్లాడకుండా, అందులో నే లీనమైపోయేది.

అల్లా రోజులూ వారాలూ ఆనంద సమాధిలో గడిచిపోయాయి. ఒక్కసారి మాత్రం చిన్న కల్లోలం రేగి అంతలోనే సమసిపోయింది. ఆ కల్లోలం ఇద్దరినీ గాఢంగానే కలవరపెట్టింది. కాని ఇద్దరూ తలోక విధంగా అలజడి పొందారు. ఒకసారి ఆమె నెల తప్పిందనుకొంది. అతిసంతోషంతో అతనితో చెప్పింది. కాని అతను ఆనందంలో పాల్గొనలేకపోయాడు. అసలా విషయం అతిన్ని అదల గొట్టింది. తన యీడున తనకొక బిడ్డా? ఆ బిడ్డ నేంచేస్తాడు? తనదని ఒప్పుకొంటాడా? ఈ స్త్రీకి తనకూ మధ్య అది ఎల్లాంటి బంధంగా తయారవుతుంది! భవిష్యత్తు ఎంత క్లిష్టమయిపోతుంది!

అకస్మాత్తుగా ఈ బంధం, బరువుగా, కర్కశంగా సంకెళ్ళలాగా చల్లగా తగిలినట్లయింది. ఆరాత్రి నిద్రపట్టలేదు. ఆమెకూడా అంతే. దీర్ఘాలోచనలతో ఆకాశానికేసి చూస్తూ, ఎవళ్ళాలోచనలతో వాళ్లు ప్రక్క ప్రక్కనే పడుకొనీకూడా పదివేలమైళ్ళు, ఎడమయిపోయారు.

అదృష్టవశాత్తూ, ఆ అనుమానం తప్పు అని మళ్ళీ నెలకు ఋజువయింది. మళ్ళీ ఎప్పటి సంతోషంతో వాళ్ళ ఏకాంతజీవితం ఆనందంగా సాగిపోయింది. శీతాకాలం పూర్తిగా గడిచి, వసంతసూర్యుడు వెలుగొందేటప్పటికి, వాళ్ల నివాసం మరీ అందంగా కనబడ సాగింది. ఇప్పుడా బాల్కనీ, ముందుడాబా కూడా వాడుకలోకి వచ్చాయి. అక్కడే వినీలాకాశం కింద మెరుపుగీతలలా ఎగిరిపోతూన్న పక్షులను చూస్తూ సాయం భోజనాలు సాగించేవారు.

సాయంత్రం అయ్యేటప్పటికి వీధి ఎండకు కాలిన రోడ్డు సెగలూ పొగలూ, ఇరుగు పొరుగిళ్ళ కోలాహలం అంతా ఎగజిమ్ముతూండేది. కాని ఈ ఐదంతస్థుల ఎత్తున వాతావరణం, ప్రశాంతంగా ఉండి, ఏమాత్రం చల్లగాలి ఎక్కడున్నా అక్కడ వీచి, మైమరపించేది. అల్లా ఒకళ్ళ నొకళ్లు పెనవేసుకొని కూర్చుని, తక్కిన ప్రపంచాన్ని, కాలాన్ని సర్వాన్ని మరచిపోయి గంటలకొద్దీ హాయిగా కూర్చుని పోయేవారు. జీన్ రోన్ నదీ తీరాన అల్లా గడిపిన చల్లని రాత్రుల నన్నిటినీ జ్ఞప్తికి తెచ్చుకొనేవాడు. దూరస్థ ఉష్ణదేశాలలో తను *కాన్సలేట్ గా వెళ్తే—అక్కడి వేసవి రాత్రులు, అడవుల ప్రయాణాలు; అక్కడి సముద్రాలమీది నిరంతర పవనాలు, ఆ ఊహలతో కలలు గనేవాడు. తమ బాల్కనీ గుడారం తెర, గాలికి ఏక కదలికగా కదుల్తూ, దీర్ఘ నిశ్వాసంలాగా వినిపిస్తూన్న స్వరం, ఆ స్వాప్నిక సముద్రపవనాల రుతంలో కలిసిపోయేది. ఇంతలో, కనుచూపు కందని కించిచ్చలిత అధరాంచలాలు తన పెదవులను చుంబిస్తూ "నన్ను ప్రేమిస్తున్నావా" అని మెల్లిగా గుసగుస లాడుతుంటే, ఆ స్వప్నవీధినుంచి బైలుపడి "తప్పకుండా ప్రేమిస్తున్నా" అనేందుకు వ్యవధి పట్టేది. మరి పసివాళ్ళతో ఇదే యాతన! వాళ్ళకు తలనిండా లక్ష ఆలోచనలు!

అదే బాల్కనీలో, రెండోభాగంలో మరో జంట కూజితారావాలొనరిస్తూ కూర్చొని ఉండేవారు. ఆ భాగానికీ ఈ భాగానికీ మధ్య ఇనుప చువ్వల దడి అడ్డంగా ఉండేది. దడినిండా పచ్చని లతలు, తీగెలు అల్లుకొనిపోయి ఉండేవి. ఆ జంట హెట్టేమాదంపతులు. వాళ్ళకు పెళ్ళి అయింది. మంచి స్థూలకాయులు. వాళ్ళ చుంబనశబ్దాలు చపేటరావాలలాగా వినబడేవి. ఇద్దరికీ ఈడూ జోడూ, అభిరుచులూ అభినివేశాలూ అన్నీ బహు చక్కగా కుదిరినట్లుండేవి. మందగొడి పద్ధతులు కూడా ఇద్దరిలోనూ ఒకేమాదిరిగా ఉండేవి. ప్రథమ యౌవనాలు గడిచాకకూడా, ఇంకా అంత ప్రేమలో నిమగ్నులయిపోయి, పిట్టగోడ నానుకొని, మెత్తని రాగాలలో ఇద్దరూ జంటగా చిననాటి శృంగారపదాలు పాడుతూ సొక్కుతూంటే, చూడ ముచ్చటయ్యేది.

"కలలోన వాడేమొ, కటికచీకటి రేయి,
నిట్టూర్చుతూ నిలిచి నట్టుగా వినిపించె—
ఎంత చక్కని కలయొ!—ఇక నిదురపోనిమ్ము!"

ఫాన్నీకి వాళ్లు నచ్చారు. వాళ్ళతో పరిచయం చేసుకోవాలనిపించింది. అప్పుడప్పుడు ఆ నల్లని దడి ఇనుపచువ్వల గండ్లలోనుంచి, ఫాన్నీ మాడమ్ హొ ట్టేమా ఒకళ్ళ నొకళ్లు చూసుకొనేవారు. ప్రేమ జీవితంలో మగ్నలై సుఖులైఉన్న స్త్రీల వదనాలలో ఉండే మందహాసాలు వాళ్ళ ముఖాల్లో ప్రతిఫలి స్తూండేవి. మొగవాళ్ళుమాత్రం, మామూలుగానే ఎవళ్ళకు వాళ్లుగానే ఉంటూ ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకొనేవారు కారు.

ఒకనాడు సాయంత్రం జీన్ క్వాయి డి ఆర్సేలో ఆఫీసునుంచి ఇంటికి వస్తూంటే, రూ రాయేల్ సందు మొగను ఎవరో పిలిచినట్లు వినబడింది. ఆ సందు మొగనుంచి చూస్తే ఆ సాయంత్రపు కెంపు వెచ్చ దనంలో పారిస్, రేకులు విడజార్చుకొంటూన్న గులాబి పుష్పంలా అనిపించి, ఆరామశ్రేణీ శోభిత మైన ఆ రాచబాట సుందరాతి సుందరమైనదిగా కనిపిస్తూంది. అచ్చటి సౌంద్యశోభ ప్రపంచంలో మరెక్కడా కూడా లభ్యంకాదు.

"రావయ్యా! అందాల అబ్బాయి! దా! మాతో తాగుదుగానిరా! నిన్ను చూస్తేనే ఈ ముసి లాడికి కన్నులపండుగగా ఉంటుంది!"

హోటల్ వరండా రోడ్డు పేవ్ మెంటుమీదికి వాలి, పేవ్ మెంటుమీదికి కూడా బల్లలూ కుర్చీలూ పరచి ఉన్న ఒక హోటల్ ముందు, జీన్‌ను రెండు చేతులా బలంగా లాక్కెళ్తూ అక్కడ టేబిల్ ముందు కుర్చీలో కూలవేశాడు. "కౌపుడల్" అంటూ చుట్టుప్రక్కనున్న విలాయితీ జనం, పల్లెటివాళ్ళూ, గుసగుసలు పోతున్నారు.

అతని ఆ మహాకాయానికి ఆతని యుద్ధవీర వేషానికి, అతను త్రాగుతూన్న ఆకుపచ్చసారాయ వర్ణం అమరినట్లుగా కుదిరింది. కౌపుడల్ ప్రక్కనే ఇంజనీరు డెషెలెట్ కూర్చుని ఉన్నాడు. ఆ క్రితం రోజునే పారిస్‌కు సెలవులకు వచ్చాడు. ఎండల్లో మొగం కొంచెం నల్లబడి, మనిషి కొస్త చిక్కి దవడ ఎముకలు పొడుచుకొచ్చినట్టు కనబడుతూ నలిగి ఉన్నాడు. ఆ నీరసంలో అతని చిన్నికళ్లు మరీ కరుణార్ద్రింగా కనబడుతున్నాయి. ముకుకోళ్లు పెద్దవి చేసికొని, పారిస్ సౌరభాన్నంతనూ ఆత్రంతో ఆఘ్రాణించేస్తూన్నట్లున్నాడు. జీన్ కూర్చో గానే, కౌపుడల్ చేతులు తిప్పుకుంటూ వక్త్రోక్తిగా,

"ఓరీ! ఏం చక్కనికోడె దూడవోయ్! ఒకప్పుడు నేను ఆయీడున, ఆవుంగరాల జుత్తుతో అట్లానే ఉండేవాడినంటే! ఆహా! ఆహా! యౌవనం సుమా, యౌవనం!" అంటున్నాడు.

డెషెలెట్ తన మిత్రునిధోరణికి చిరునవ్వు నవ్వుతూ "ఇంకా ఆ పాటేనా?" అన్నాడు.

"నవ్వొద్దు భాయీ, నన్ను చూసి నవ్వవద్దు! ఎందుకూ, నాకున్న సర్వస్వము, ఈ పతకాలు, బిరుదులు, శిల్పశాల, రాజశిల్పత్వమూ, ఒకటేమిటి ఆ భండారాలం అంతా ఇచ్చేస్తాను! ఆ బంగారు ఉంగరాల జుత్తుమాత్రం నాకిమ్మను చాలు!" అని, అకస్మాత్తుగా గాసిన్‌వంక తిరిగి, "అన్నట్టు, శాఫోనేం చేశావు? ఇప్పుడెవరికంటికీ ఆమె కన బడ్తూన్నట్టు లేదే?" అని అడిగాడు.

జీన్ అర్థం చేసికోలేక అతని వంక తెల్లబోయి చూశాడు.

"ఓహో! అయితే నువ్వు ఇప్పుడు దాంతో ఉండటం లేదన్నమాట!" అన్నాడు కౌడల్. అప్పటికీ అతను తెల్లబోతూనే ఉంటేమ సిచిరాకుగా "శాఫో, తెలియదూ?—ఫాన్నీ లిగ్రాండ్!—విల్లీ డి ఆవ్రేలో?"

"ఓ అదా! అప్పుడే ఎప్పుడో పోయింది."

ఎందుకట్లా అన్నాడో? తన ప్రేయసిని శాఫో పేరిట పిలచినందుకు నామర్దా, సిగ్గు—స్వస్త్రీ ప్రసక్తి ఇతరుల ముందు తెచ్చేందుకుకల అయిష్టత,— అన్నిటికన్నా బహుశా, యితరత్రా తనముందు ఎవరూ చెప్పని విశేషాలు తెలుసుకోవాలన్న కుతూ హలమూ—అల్లా అనటానికి ప్రేరేపించి ఉంటాయి.

"శాఫో! ఆ! ఇంకా శాఫో తిరుగులాడుతూనే ఉందా?" అంటూ, అక్కడి పూలవనాలు, పచ్చని చెట్లూ, ఆప్రకృతినంతా కన్నులగ్రోలుతూ కూర్చున్న డెషిలెట్ పరధ్యాన్నంగా అన్నాడు.

"అరే! క్రిందటి ఏడు నీ యింట్లో విందుకు వచ్చింది జ్ఞాపకం లేదూ! ఐగుప్తు దుస్తులలో భలే అందంగా ఉంది! ఆ తర్వాత శరత్కాలంలో ఒక

నాటి ప్రొద్దున్నే లాంగ్లాయ్‌గాడి హోటల్‌లో ఈ అందగాడితో ఉండగా చూశాను—అవేళ ఎల్లా ఉందనుకొన్నావు! సిగ్గు లొలుకుతూ అచ్చంగా కొత్త పెళ్ళికూతురులా ఉంది.

"ఆమెకు అసలు ఎన్నేళ్లున్నా యంటావ్? మనకు తెలిసేటప్పటికి—ఆగూ, చెప్తా—"

కౌవుడల్ జ్ఞాపకం తెచ్చుకొంటూన్నట్లు గాలిలోకి తేరిపార చూశాడు—"ఆగు, చెప్తా! ఎన్నేళ్ళంటావా—1853 లో నేను బొమ్మ చెక్కటానికి మోడల్ గా నిలబడింది కదూ, అప్పటికి పదిహేడేళ్లు. ఇప్పుడిది 1873—ఊ! ఎన్నేళ్ళో మీరే లెఖ్ఖేసుకోండి" అన్నాడు. ఇంతలో అతని కళ్ళు మిలమిలా వెలుగసాగాయి. "ఆఁ! ఇరవై యేళ్ళ క్రింద ఆమెను మాస్తేనా! సన్నగా శలాకలా ఉండేది. అధరం విల్లు వంచినట్టు ఉండేది. పాలరాయిలాంటి నుదురు. భుజాలూ చేతులూ కాస్త పల్చగా ఉండేవి—కానీ శాఫో విరహాగ్నిలో కాగిపోతున్నట్లుగా ఆ పల్చదనం సరిగ్గా సరిపోయినట్లుండేది. కాని ఏం ఆడవోయ్! ఆడతనం అంటే ఆమెదే! ఆ చిన్న దేహంలో ఏం ఉద్రేకం ఉండేది! ఆ చెకుముకి రాతిలో ఎంత నిప్పు పుట్టేది! ఆ వీణాతంత్రుల్లో ఒక్క స్వరమన్నా లోపించేదా! లా సుర్నెరీ అన్నట్లు మహతీవీణాశతతంత్రీసమగ్రరూపం కదోయ్."

జీన్ మొగం పాలిపోయింది. "ఆయన కూడా ఆమె నుంచుకొన్నాడా?" అని అడిగాడు.

'లా సుర్నెరీయా! అనే అనుకొంటాను. నా కప్పుడు భలే దెబ్బే అనిపించింది. నాలుగేళ్లు పూర్తిగా, భార్యాభర్తలలాగే గడిపాం. నాలుగేళ్లు ఆమెకోసం నానా శ్రమలూ పడి పువ్వుల్లో పెట్టి పోషించాను. ఏం కోరితే అవల్లా సమకూర్చాను. కొండమీది కోతిని తెమ్మంటే తెచ్చిపెట్టేవాడిని. ఆవిడకోసం అష్టకష్టాలు పడే వాడిని. సంగీతం మాష్టర్లని, డాన్సు మాష్టర్లని, ఎవళ్లు కావాలంటే వాళ్ళను కుదిర్చాను—ఇప్పుడు జ్ఞాపకం చేసుకోవాలన్నా మతి చాలదు—చక్కగా సానపట్టి తళతళా వజ్రంలాగా మెరిసేట్టు చేశాను—అసలు, మారుమూల మురుక్కాలవలో పొర్లాడుతూన్న దాన్ని మా యింటికి తెచ్చి, మహారాణి లాగ తయారుచేశాను. తీరా ఇన్ని చేశాక ఆ నసుగుడు భావకవిగాణ్ణి తగులుకుపోయింది. లాసుర్నీగాడు ప్రతి ఆదివారం పెద్ద స్నేహితుడి లాగా వచ్చి మాయింట్లో విందుగుడిచేవాడు."

అని బుగ్గలు బూరించుకొని ఆ విషం కక్కేసు కొంటూన్నట్టు ఒక దీర్ఘనిశ్వాసం వదిలాడు. ఇంతలో కొంత తేరుకొని మళ్ళీ శాంతంగా చెప్పసాగాడు.

"ఏమయితే నేం! అల్లాటి నీచపుపని చేసినందుకు తగినశాస్తే అయింది వాడికి. ఇద్దరూ కలిసిఉన్న మూడేళ్ళూ, మహానరకం అంటే నమ్మ! కవిగారి ఇచ్చకాలూ లాలనలూ అన్నీ, మూణ్ణాళ్ళ పట్టిపగలు లేవు. ఆ తర్వాత వాడి పినాసితనం, ఉడుకుమోతు తనం, ద్వేషబుద్ధి, అన్నీ బైటపడ్డాయి. వాళ్ల నిత్య కలహాలు చూడాలి బాబూ! ఇంటి కెప్పుడెళ్లినా, ఆవిడ కంటికి పట్టీ లేసి ఉండేది. వాడి మొగంనిండా రక్కులూ, బఱుకులూ! అన్నిటికన్నా వాడు దాన్ని వదిలిపెడ్తానన్నప్పుడు చూడాలి తమాషా! వాడిని వదలనని జలగలాగా పట్టేసింది. వాడివీధి తలుపు బద్దలు కొట్టేది. అక్కడేగుమ్మంలో వాడు బైటికొచ్చేదాకా ప్రాణాచారాలు పడిఉండేది. ఫార్నీ హోటల్‌లో విందుకు పెద్దలందరితోపాటూ వాడూ వస్తే, ఆ గుమ్మంబయట, నడి శీతాకాలంరాత్రి చలిలో వణుకుతూ ఐదు గంటలూ అక్కడే నిలబడింది. నిజంగా జాలే వేసేది. కాని ఆ రసోపాసక భావకవిగారు మాత్రం తొణక లేదు బెణక లేదు.

చివరికి ఆవిడను వొదుల్చుకొనేందుకు పోలీసు సాయం కూడా తెచ్చుకొన్నాడు. భలేవాడులే! అన్నిటికన్నా చివరిపని మరీ మకుటాయమానంగా చేశాడు! తన పండుయౌవనాన్నంతా, మనస్సూ దేహమూ, సర్వమూ వాడికి అర్పించిన ఆ పిచ్చి పిల్లకు వాడు చూపించిన "కృతజ్ఞత" ఏమిటో తెలుసా! తన కశ్మలం అంతా వొలికిస్తూ మురికి బురదకుళ్ళు మోతు పద్యకావ్యం ఒకటి "ప్రేమ కావ్యం" అంటూ వ్రాసి ప్రకటించాడు. ఆయనగారి కావ్యాల్లోకల్లా అదే మహాకావ్యం!"

'గాసిన్ నిశ్శబ్దంగా బుజాలు కుంచించుకొని కూర్చుని, బల్లమీది గ్లాసులో శీతలపానీయాన్ని గడ్డి

గొట్టంతో పీలుస్తూ చప్పరిస్తూ కూర్చున్నాడు. నిజంగా అతనికి ఇచ్చింది విషమేఅయిఉంటుంది. లేకపోతే గుండెలూ పేగులూ కూడా ఇంత బిగుసుకు పోతాయా !

సాయంత్రపు వెలుగు ఇంకా చుఱ్ఱుమని తగులు తున్నా కూడా గాసిక్ లోపల వణికిపోతున్నాడు. అతని కళ్ళు బైరులుకమ్మాయి. ఏదో పొగమంచులో నీడలు కదులుతూన్నట్లు, ఆ మసక వెలుగులో, బలిసిన మనుషులూ, బజారుసర్వస్వమూ నీడలలా కదులు తూన్నట్లు కనిపిస్తున్నాయి. పారిస్ అంతా నిశ్శబ్ద మయిపోయి అక్కడి తమ బల్లదగ్గిర మాటలు తప్ప మరేవీ వినబడటంలేదు. ఇప్పుడు డెషిలెక్ మాట్లాడుతున్నాడు. ఈమాటు విషం అతను పోస్తున్నాడు.

"ఈ తెగతెంపులు ఇంతఘోరంగా ఉంటా యేమిటి?"

డెషిలెక్ నెమ్మదిగా మాట్లాడుతున్నాడు. అతని ఆక్షేపణ ధోరణిలో అనంత దయామయమయిన ఒక మృదుస్వనం కూడా మిళితమయి ఉంది.

"వీళ్లు ఏళ్ళతరబడి ఒక్క ఇంట్లో ఉంటారు. ఒక్క కంచంలో తింటారు. ఒక్కమంచంలో పడు కొంటూ, ఒకళ్లొకళ్ళు కలిసిపోయి, ఉమ్మడిగా కలలుకంటూ, ఉమ్మడిగా చెమటలోడుస్తూ ఒత్తు కొని ఒత్తుకొని పడుకొంటారు. అరమరలు లేకుండా ఒకళ్ళతో ఒకళ్లు అన్నీ చెప్పుకొంటారు. ఒకళ్ళ కొకళ్లు సర్వమూ అర్పించుకొంటారు. చూపులూ చేష్టలూ, అభిప్రాయాలూ, పద్ధతులూ, వేషభాషలూ, చివరికి రూపాలుకూడా, ఒకళ్ళవి వొకళ్ళు అలవర్చుకొంటారు. నఖశిఖపర్యంతమూ ఒకళ్ళ కొకళ్ళయిపోతారు. తీరా ఒకనాడకస్మాత్తుగా ఒకళ్ళనొకళ్ళు వదిలేసి ఛేదించుకుపోతారు. ఎల్లా చేస్తారంట వీళ్ళిల్లా! ఎల్లా ప్రాణాలొప్పుతాయి! నేను మాత్రం జన్మలో అల్లా చెయ్యలేను—నిజమే! ఆపది నన్ను మోసంచెయ్యొచ్చు, నా ఒంటినిండా బురద పులమవచ్చు, నన్ను బురదలో కిసెవ్వచ్చు! కాని ఎన్ని చేసినా, కళ్ళ నీళ్ళెట్టుకొని, "నన్ను వదిలిపోవద్దం"టే చాలు, ఇంక నేను కదలనే! అందుకనే ఎవర్నన్నా చేరిస్తే, ఒక్క రాత్రికి మించి చేరనియ్యనే! మన పాతసామెత చెప్పినట్టు, రేప నేది లేదు. కావంటావ్ పెళ్ళిచేసుకో! అంతే, ఆఖరు. అదింకా మర్యాదైన పని !"

"రేపు లేదు ! రేపులేదు! నీలాంటివాడు అల్లా మాట్లాడటం బహు తేలికేలే వోయ్. ఒక్కరాత్రితో వదల్లేని స్త్రీలు చాలామంది ఉంటారు. ఉదాహర ణకు, ఆమే అల్లాంటిదే"అన్నాడు కావుడల్.

"ఆమెనే రాత్రిదాటాక ఒక్క నిమిషంకూడా ఉంచలేదే నేను." అన్నాడు డెషిలెక్, సంతృప్త మందహాసంతో. ఆహాసం చూసి జేన్ తనువెల్ల కంపించిపోయాడు.

కావుడల్ జవాబు చెప్తున్నాడు.

"అంటే నువ్వు ఆవిడ రకం కాదన్న మాట! లేకుంటే ఎల్లాంటిదనుకొన్నావు? ప్రేమించిందంటే, పట్టుకు వేళ్ళాడుతుంది. ఆ మనిషికి గృహిణిగా కాపురంచెయ్యాలని మహా మోజు. కాని దిక్కు మాలినకర్మ, ఆవిడ ఎప్పుడు కాపురంపెట్టినా భగ్న మౌతూనే వచ్చింది. నవలాకారుడు డివోయ్‌తో చేరింది. అతను చచ్చిపోయాడు. లిజానో వెంట పడ్డది. వాడు వేరే పెళ్ళిచేసుకొన్నాడు. తరువాత స్వర్ణకారుడు ఫ్లామెంట్‌ను బట్టింది. చాలా అందంగా ఉండేవాడు. ఒకప్పుడు "మోడల్"గా ఉంటూండే వాడు కూడా—ఎప్పుడూ ఆమెకు అందమూ, ప్రతిభా అంటేనే మోజెక్కువుండేది. సరే, ఆ కాపురానికి పట్టిన దౌర్భాగ్యం ఆ కథంతా తెలి సిందేగదా ?"

"ఏ కథా!" అన్నాడు జేన్, మాట మింగుడు పడక ఉక్కిరిబిక్కిరౌతున్న కంఠంతో. ఒకప్పుడు పారిస్‌నంతనూ ఉద్రిక్తంచేసిన ఆ ప్రేమికుల గాథ వింటూ గ్లాసులో పానీయం తృణనాళంతో పీలుస్తూ కూర్చున్నాడు.

ఆ స్వర్ణకారుడు బీదవాడు. ఈ స్త్రీ అంటే మహా వ్యామోహంలో ఉన్నాడు. ఎక్కడ తన్ను వదిలేస్తుందో అని నిత్యం భయపడుతూండేవాడు. అందుకని ఆమెకు నిత్యభోగాలన్నీ సమకూర్చే ప్రయత్నంలో, దొంగనోట్లు అచ్చువేశాడు. దాదాపు వెనువెంటనే పట్టుబడ్డాడు. ఇద్దరినీ వెంటనే ఖైదుచేశారు. తీర్పులో అతనికి పదేళ్ళు కఠినవరకం వేశారు. ఆమె తప్పు ఎక్కువ ఋజువు

కానందున ఆర్నెల్లు రిఫర్మేటరీ జైలుకు మాత్రం పంపించారు.

ఆనాటి జైలు దుస్తుల్లో ఆ తలరుమాలుతో ఆమె ఎంత చక్కగా ఉన్నదీ కావుడల్ డెషిలెట్టేకి జ్ఞాపకం చేస్తున్నాడు. "ఆ ధైర్యం!—ఏ మాత్రమైనా తొణికిందా—చివరిదాకా ప్రేమికునిపట్ల విశ్వాసంతోనే ఉంది. ఆ తెల్లమొహం జడ్జీని బెట్టుకొని ఏం ఝాడించేసింది! తర్వాత ప్రియుణ్ణి పోలీసులు తీసుకెళ్తూంటే వాళ్ల టోపీలమీదుగా ప్రియుడికి ముద్దులు చెప్తూ ఏం చక్కగా అంది. "ఏం, ఫరవాలేదు ప్రియతమా! మళ్లీ మంచిరోజులు వస్తాయి మనమప్పటికీ ఇల్లా ప్రేమించుకొంటూనే ఉంటాము" ... అబ్బ ఆమె మాటలు వింటూంటే అప్పుడు రాళ్ళుకూడా కరిగిపోతాయనిపించింది. ఏమైనా ఆ తర్వాత మళ్ళీ ఆమెకు ఒక కాపురం అంటూ కుదుటబడలేదు.

"అప్పటినుంచీ పెద్ద పెద్దల మధ్య తిరగటం మొదలు పెట్టింది. నెలకొకణ్ణి, వారానికొకణ్ణి, జేరదీసేది. కాని ఆర్టిస్టులదగ్గర మాత్రం చేరేదికాదు. ఆర్టిస్టులంటే బలే హడలు పుట్టిందనుకొంటాను. ఆ తరువాత ఎప్పుడైనా ఎవళ్ళనైనా కళాకారులనంటూ చూసిందంటే, ఒక్కనా దగ్గరకే వచ్చేది. ఇంకెవరింటికీ వెళ్ళేదికాదనే నానమ్మకం. ఉండి ఉండి ఎప్పుడో ఒకనాడు నా స్టూడియోకి వచ్చేది. కాసేపు కూర్చొని నాతోపాటు ఒక సిగరెట్టు కాల్చి వెళ్ళిపోయేది. తర్వాత మళ్ళీ కొన్ని నెలలదాకా మనిషి పత్తాయే లేదు. అకాత్తుగా ఒకనాడు ప్రొద్దున్న ఈ అందగాడూ, ఆమే కూర్చుని ఫలహారాలు చేస్తూ చిలకల్లాగా నోళ్ళతో ద్రాక్షపళ్ళు ఒకళ్ళ కొకళ్ళు అందిచ్చుకొంటూ కనబడ్డారు. "అదో! మా శాఫోకు మళ్లీ పాట్లు ప్రారంభమయాయే!" అనుకున్నా!"

జీన్ ఇక భరించలేక పోయాడు. అక్కడ త్రాగినవిషం అంతా తన్ను దగ్ధంచేసి చంపేస్తోన్నట్లనిపించింది. కొద్ది నిముషాలు చలికి గడ్డగట్టుకుపోయాక అకస్మాత్తుగా గుండెల్లో మంట బయలుదేరి రొమ్ము బిగదీసి, తలకెక్కి ఘనారిస్తూ, చండ్రనిప్పులు నిండా కూరితే కుంపటిని బ్రద్దలు కొట్టినట్లు, తలను బద్దలు కొట్టేసూంది, అల్లాగే గుఱ్ఱపు బగ్గీల కడ్డు నడుస్తూ రోడ్డు దాటాడు. గుఱ్ఱపువాళ్ళు కేకలు వేశారు. ఎవళ్ళమీదా, అరుస్తారు, తెలివితక్కువ మొగాలు?

పూవుల బజారులోనుంచి పోతున్నాడు. అక్కడి ముద్దబంతిపూల సువాసన మొగం మొత్తుతోంది. తన ప్రియురాలు ఆ సెంటే వాడుతుంది. ఉక్రోశంతో అక్కడినుంచి బైటపడుతూ ఆ కోపతీవ్రత ఆగక మనసులో మాటలు గట్టిగా అనుకొంటున్నాడు. "ప్రియురాలా! పచ్చిబోగంది! శాఫో, శాఫో! ఏడాదిపాటు ఈ—దీనితో కాపురం చేశానా!" ఉగ్రకోపంతో ఆ పేరు మళ్ళీ మళ్ళీ ఉచ్చరించసాగాడు. లోకాభిరామాయణపు రంకుపురాణాలందిచ్చే బజారి పత్రికల్లో, ఆ భోగస్త్రీల పెట్టుకు పేర్లలో ఈపేరుకూడా చదివిన జ్ఞాపకం వచ్చింది. రంభా, మేనకా, తిలోత్తమాలాంటి పేర్లు—శాఫో, కోరా, కేరో, ఫ్రీని, శంఖిణీ...

ఆ పేరి రెండక్షరాలతోపాటు, ఆ స్త్రీ జీవనమంతా మురుగుతూములో ధారకట్టి పారుతున్నట్లు కన్నులముందాడింది. కావుడల్ స్టూడియో, లాగూర్నరీ ఇంట గలాటా, నీచపువీధుల్లో దారికాపులు, కవిగుమ్మాలదగ్గర పడిగాపులు...ఆ తర్వాత ఆ అందాల స్వర్ణకారుడు — పోర్జరీ, సెషన్సుకోర్టు జైలువేషంలో చక్కగా అమరిన ఆ తలరుమాలు, ప్రియుడికి గాలిలో విసరిన ముద్దు; "పరవాలేదు! ప్రియతమా" "ప్రియతమా" తనను పిలిచేటప్పుడూ అవే మాటలు! ఛీ! సిగ్గుసిగ్గు!

పోనీలే, ఈ కశ్మలం అంతా వెంటనే కడిగేసుకొని శాశ్వతంగా తెగతెంపులు చేసుకోవాలనుకొన్నాడు.

ఆ ముద్దబంతిపూల వాసన అల్లాగే అతన్ని వెన్నాడుతూంది. సాంధ్యాకాశం కూడా ఆ పూవు రంగునే ప్రసరించుకొంటూంది.

అంతసేపూ ఆ బజారునే అటునించి ఇటూ ఇటునించి అటూ, కటకటాల మధ్య ఉన్నట్లు, తిరుగుతున్నానని అకస్మాత్తుగా గ్రహించుకొన్నాడు. అక్కడినుంచి తన దోవను బయలుదేరి ముందుకు సాగి ఇట్టే తమ వీధికి చేరుకున్నాడు. వెంటనే లోపలికెళ్లి మాటామంతీ లేకుండా జుట్టట్టుకొని ఆవిడను వీధి

లోకి ఈడ్చి, ఆ పేరు రెండక్షరాలూ ఆమె మొగం మీద ఊసి, బైటికి గెంటేద్దామనుకొన్నాడు. తీరా తలుపుదగ్గిరకు వచ్చాక అనుమానాలు పట్టుకొన్నాయి. ఆలోచనలో పడ్డాడు. మళ్ళీ నాలుగడుగులు ముందుకు నడిచాడు.

కేకలు వేస్తుంది. వెక్కిళ్లుపెట్టి ఏడుస్తుంది. ఆవేళ రోడ్డి ఆర్కేడ్‌లో లాగే, ఆ బజారు తిట్లూ, భాషా, అంతా వాడుతూ ఇల్లంతా గల్లంతు చేసేస్తుంది.

పోనీ ఉత్తరం వ్రాస్తే! ఔను అదే మంచిపని. బహుక్లుప్తంగా మూడునాలుగు ఘాటైన మాటలతో తెగతెంపులు చేసుకోవచ్చు.

దగ్గిర యింగ్లీషు హోటల్‌లో కెళ్లాడు. కొత్తగాస్ లైటు దీపం వెలుగులో హోటల్ దాదాపు ఖాళీగా బావురుమంటూ ఉంది.

ఒక బల్లదగ్గిర, గూబసుష్టే గుడిసేటి స్త్రీ ఒకతి చేపలకూరమాత్రమే తింటూ కూర్చుంది. బల్ల తడి తడిగా జిడ్డోడుతూంది. ఒక గ్లాసెడు ఏల్ సారాయం తెమ్మని ఆర్డరిచ్చి, ఆ గ్లాసు ముట్టుకోకుండానే ఉత్తరం వ్రాయటానికుపక్రమించాడు కాని చెప్పదలచుకొన్నదంతా బుఱ్ఱలో ఉడుకెత్తి పొంగులారుతూ, అన్నిమాటలూ ఒకేసారి దొర్లిపడటానికి ఉరుకుతూన్నట్లున్నాయి. కలంలో సిరా మాత్రం గడ్డ కట్టుకుపోయినట్లు అక్షరాలు తొందరగా సాగటమే లేదు.

రెండుమూడుమాట్లు వ్రాసి చించేశాడు. చివరికి ఉత్తరం వ్రాయకుండానే వెళ్దామని లేస్తున్నాడు. ప్రక్కనే సన్నగా నోటిలో ముద్దలతోపాటు ఆత్రంగా మాటలుకూడా నములుతూ గొంతుక వినిపించింది. "మీ రెళ్లాగా తాగటం లేదుగా—నే తీసికోనా?" అని ఆ అమ్మి అడుగుతోంది. తల ఊపాడు. ఆ అమ్మి అతి ఆత్రంతో గళాసు ఎత్తుకొని పెద్ద పెద్ద గుటకలు మింగేస్తోంది. ఆ తాగటంలో, ఆమె ఎంత దుస్థితిలో ఉందో తెలిసివచ్చింది. ఆమె దగ్గిర, తిన్నపదార్థం పానీయంతో తడుపుకొనేందుకు కూడా డబ్బులేదు. అతనిలో అనంతమైన జాలి పుట్టుకొని వచ్చింది. ఆజాలి వుపశమనమిస్తోంది. ఆ జాలిలో, ఆడదాని బ్రతుకు ఎంత దౌర్భాగ్యభూయిష్టం కావచ్చునో, అకస్మాత్తుగా కన్నుల కట్టినట్లయింది.

కొంత దయార్ద్ర చిత్తంతో విషయవిచారణ చేసుకోగలిగాడు—తనకు ప్రాప్తించిన దుఃస్థితిని సహేతుకంగా విమర్శించుకోసాగాడు.

ఎంతైనా, ఆవిడ తనతో ఆడిన అబద్ధమేమీ లేదు. ఆవిడ పూర్వజీవితంవిషయం ఏమీ తెలియదంటే కారణం, ఏనాడూ తను ఏ స్వల్పకుతూహలమూ ఆ విషయంలో చూపకపోవటమేకదా! ఆలోటు తనదే! దేనికి ఆవిడను తప్పుపడ్తున్నాడు? జైలుకి వెళ్లిందనా? కోర్టువారు ఆమె తప్పులేదనే తీర్పు ఇచ్చారుకదా! తీర్పు అవగానే జనం ఆమెను అభినందిస్తూ భుజాలమీద ఎత్తుకొని బైటికి తీసుకొచ్చారే! మరి ఇంకేమిటి? తనకుముందు ఇతరులు కొందరు అనుభవించారనా? ఆవిషయం తనకు పూర్తిగా తెలిసినదే కాదా? వాళ్ళంతా ఎవరో అనామకులు కాక ప్రతిభాశాలురైనందుకూ, వాళ్ళ చిత్రాలను శిల్పాలనే పొగడుతూ, తను వాళ్ళతో కూర్చుని మాట్లాడి గలిగినందుకేనా అసహ్యం? సామాన్యులను కాక గొప్పవాళ్ళను వరించినందుకు తను ఆమెను తప్పు పట్టగలడా?

ఇంతలో, అతని హృదంతరం మారుమూలలలో ఎక్కడో, అతని కతనే ఒప్పుకోలేని, ఒక దురహంకారము సన్నగా పొటమరించింది. ఆ మహాపురుషులందరితోపాటు తనుకూడా ఆమె ననుభవించగలిగాడు. తనకులాగే వాళ్ళకుకూడా ఆమె అందంగానే కనబడ్డది.

అతని యీడున ఎవ్వరికీ ఆత్మవిశ్వాసం ఉండటం కష్టం, తనబుద్ధి సమమో అసమమో, తనది ఏ అంతరమో, ఎవ్వడూ నిజంగా తెలిసికోలేడు. ఆ యీడున "స్త్రీ"ని ప్రేమిస్తాడు. అంటే "ప్రేమ" భావాన్నే! ఆ యీడున అనుభవసిద్ధమైన చూపు ఉండదు. యువ ప్రేమికుడు తన ప్రియురాలి ఫొటోను నీకు చూపించినప్పుడు, తన రసజ్ఞత్వానికి, నీ ఆమోదం ఉందో లేదో చూసుకొని మనస్సును దిట్టపరుచుకో చూస్తాడు.

ఇప్పుడు, శాఫోవదనం మహోత్కృష్టంగా ఉజ్వలంగా కనిపించసాగింది. లాగూన్నరీ మహాకవి, ఆ వదనాన్ని మహోజ్వలంగా వర్ణించాడు. మహాశిల్పి

కౌవుడల్ తన శిల్పంలో దానికి అమరత్వం చేకూర్చాడు.

చెట్లతో పులా ఉన్న ఒక రోడ్డుప్రక్కనున్న పార్కు బెంచీమీద కూర్చొని ఆలోచనలలో నిమగ్నుడై ఉన్నాడు. జూన్ నెల. గోధూళి కాసమయం. అక్కడ కేరింతాలాడుతున్న పిల్లల కేకలు, కూలివాళ్ళ పెళ్ళాల కులాసాకబుర్లు, ధూళితో పాటు రేగి వాతావరణాన్ని నింపుతున్నాయి.

అకస్మాత్తుగా అతనికి మళ్ళీ నిష్టికోపంతో ఆవేశం కల్గింది. లేచి చరచరా ముందుకు నడిచిపోతూ తనలో తను గట్టిగా గొణుక్కొంటున్నాడు... ఓహోహో! భలేబాగుంది శాఫోవిగ్రహం! ఏ షాపులో పడితే ఆషాపులో దొరికే విగ్రహం! ఎక్కడ పడితే అక్కడ కనపడే బొమ్మ! అల్లాటప్పాపాట కన్నా కనాకష్టం! దానాపు ఆ పౌరాణికపు శాఫోకున్న కళంకం అంతా ఉంది. ఆ పేరు శతాబ్దాల తరబడి దిగజారి దిగజారి, బూతుకథల బురదలలో పొర్లాడి, పౌరాణిక స్వచ్ఛత ఏమాత్రమైనా ప్రపంచంలో ఉంటే అది అంతా పోగొట్టుకొని దేవతపేరే దౌర్భాగ్యపు రోగానికి పేరై పోయినట్లుగా, అధః పతనమై పోయింది. ఆరి భగవంతుడా! సర్వమూ డోకుపుట్టించేస్తోందికదా!

అల్లా తికమకలుపడుతూ, ఒక నిముషం ఉగ్రుడౌతూ ఒక నిముషం శాంతుడౌతూ, విరుద్ధ భావాల, ఉద్రేకాలమధ్య ఊగులాడుతూ పోతున్నాడు. అంతకంతకు చీకటులు ముసురుకొంటున్నాయి. బాట నిర్జన మౌతూంది. గాలి ఇంకా వేడిగానే ఉంది. ఏదో సన్నని దుర్వాసన గాలిలో అలుముకున్నట్లుంది. అటు చూడగా పెద్దగోరీలదొడ్డి, గేటు కనబడింది. లాటిన్ క్వార్టరునవలా కారుడు, "సిండెరిసెట్టి"నవలా రచయిత, డిజోయ్ స్మారకార్థం, అతని గోరీమీద, కౌఉడల్ చెక్కిన అతని శిలావిగ్రహం స్థాపించే ఉత్సవ సందర్భంలో, సంవత్సరం క్రిందట, యువజనసమూహంతో తనుకూడా ఈ శ్మశానవాటికకు వచ్చిన జ్ఞాపకం వచ్చింది. డిజోయ్! కౌఉడల్! ఒక్క రెండుగంటలలో ఆ నామాక్షరాలు, ఎల్లాంటి నూతన ధ్వనిని సేకరించుకొన్నాయో! ఆ పూర్వోదంతాలన్నీ చెవులబడ్డాక అల్లాంటి అస్తవ్యస్త వివాహాలను గురించి డెషిలెట్ చేసిన దారుణ సునిశిత విమర్శనమంతా విన్నాక— ఈ విద్యార్థిలో ఉంపుడుకత్తె, అతని ఈబొమ్మరింటి కాపురం—అన్నీ ఎంత కృతకంగా, మలీమసంగా కనబడుతున్నాయి!

ఆ చీకటి, ఆ మృత్యువాటిక సాన్నిహిత్యంలో మరింత కొరవడి భీభత్సం గొల్పుతూంది.

అక్కడినుంచి వెనక్కి తిరిగాడు. ఆ పరిసరాల తక్కుతూ తారుతూ చీకటిపక్షుల్లా సంచరిస్తున్న వ్యక్తులను, ఒరుసుకొంటూ, చీకటి గుయ్యారపు గుహాలలా ఉన్న వాకిటికొట్ల గుమ్మాలలో నిల్చున్న కామినుల చేలాంచలాలను దులబరించుకొంటూ, ఆ చీకటి కొట్ల కిటికీల వెలుగులను దాటుకొంటూ పోతున్నాడు. ఆ కిటికీలు ఆచీకటిమధ్యంలో సినిమా తెరమీద ధగధగలాడే దయ్యపు బొమ్మలలా, కిటికీల వెనుక ఒకరొకళ్ళ కౌగిళ్ళల్లో కదులుతున్న కాముకుల జంటల దృశ్యాలను బైటపెడుతున్నాయి.

ఎంత పొద్దుపోయి ఉంటుందో? సైన్యంలో చేరిన మొదటినాడే సుదీర్ఘప్రయాణంచేసిన కొత్త కుఱ్ఱాడికిమల్లే, వళ్ళంతా కొట్టుకుపోయి, ఓపిక పూర్తిగా చచ్చిపోయినట్లు, శోషిల్లిపోయాడు. ఇందాకటినుంచి అలయించిన ఆవేదన మూగపడి, బరువుగా కాళ్ళకు దిగజారి, భుజాలను క్రుంగదీశేస్తూ వంచేసి, బండ బరువైనట్లయిపోయింది. అబ్బా! పడక్కచేరి నిద్రపోగలిగితే! తర్వాత మెళుకువవచ్చాక ఆమనిషితో, నెమ్మదిగా, ఏమీ కోపం తెచ్చుకోకుండా చెప్పొచ్చు. "మాడం. నువ్వెవరవో, ఎల్లాంటిదానవో అంతా నాకు తెలుసు. ఇది నీ తప్పూ కాదు నా తప్పూ కాదు. కాని ఇహ ఇద్దరం కలిసి జీవించలేం. ఎవరిత్రోవను వాళ్లు పోదాం" అని చెప్పేసి, ఆవిడ వెంటబడకుండా తప్పించుకునేందుకు, తను ఊరుపోయి, అమ్మను చెల్లెళ్ళను చూస్తాడు. వాళ్ళ కౌగిలింతలలో తేరుకుంటాడు. అక్కడ, రోన్‌నదిమీదనుంచి వచ్చే, శీతపవనాలలో, పరిశుద్ధ, ఉత్తేజ, వాతావరణంలో, ఈ దుఃస్వప్న, దౌర్భాగ్య, కళంకాలన్నింతా కడిగేసుకొంటాడు...

అతనికోసం కాచుకొని కాచుకొని చూచి,

అట్లాగే మంచంమీద పడుకొని తెలియకుండానే నిద్రపోయింది. దీపం పెద్దగా వెలుగుతూనే ఉంది. చదువుతూన్న నవల ఆమెపక్కనే దుప్పటిమీద తెరుచుకొనిపడిఉంది. అతను వచ్చినా ఆమెకు మెళుకువ రాలేదు. మంచంప్రక్కనే నుల్చొని, అంతకుముందెన్నడూ చూడని అపరిచిత స్త్రీ వక్కవ చూస్తున్నట్లు, ఆమెవంక విపరీతంగా చూస్తూ నిలబడ్డాడు.

నిజంగా ఆమె అందంగానే ఉంది! ఓ! ఏమి అందం! ఆమె చేతులు, వక్షఃస్థలం, భుజాలూ, నున్నని సంగ్రాహపు బిగువుతో, మచ్చగాని, మాలిన్యంగాని లేక, బంగారు పోతపోసినచాయనున్నాయి. కాని కనురెప్పలు మాత్రం కంది ఎఱ్ఱబడినట్లున్నాయి— బహుశా చదువుతూన్న నవల కారణమేమో! లేక అతని రాకకోసం ఎదురుచూడటంలోకల అలజడి, ఆవేదనల వల్ల ఎఱ్ఱబడ్డాయో!

ఆ నిద్రాభారంలో, బిగుతుసడిలి జాలువారిన ఆ దేహవిక్షేపంలోనూ, అలసభారమైన మొగపు రేఖలలోనూ, ప్రియాపరిరంభణోద్వేగరైనప్పటి కామోత్కంపనోద్దీపనాలు ఈషణ్మాత్రమూ స్ఫురించటం లేదు. ఆ కనురెప్పల చాలులు, ఆ మొగంతీరు, ఎంతో నిస్త్రాణమైపోయినట్లు, సర్వమూ నివేదించుకొంటున్నట్లు కనిపిస్తూన్నాయి. ఆ రూపులో ఆ జీవితసర్వస్వమూ, నగ్నంగా ప్రతివారికీ కనబడుతూ ఎట్టఎదుట నిలుస్తూన్నట్లుంది. ఆమె వయసు, పూర్వచరిత్ర, ఆ కోపతాపాలు, ఆర్భాటాలు, తలతిక్కలు, మురులు, మమకారాలు, ఉన్మత్తకాముకలాపాలు, వియోగాలు, జైలుజీవితం, కొట్లాటలు, దెబ్బలు, కన్నీళ్లు, భీభత్సాలూ—అన్నీ, ఆ, నిద్రావిహీన కామలాలసలతో కమిలిపోయినట్లున్న కంటి చుట్టు నీలారుణవర్ణంలో, వ్యగ్రభావస్ఫురణాంకితమైన క్రింది పెదవి చిరుజార్పులో,—ఊరివారంతా నిరంతర తీర్థప్రజగా వచ్చి, దాహోపశమన మొనర్చుకొన్న రాపిడిలో అరిగి, సురిగిన ఊరిబావి అంచులా -వొడిలిపోయి వసివాడిన పెదవుల తీరులో, వృద్ధాప్యపు ముడతలను సంతరించుకొంటూన్న మొగపుటుబ్బు చర్మపు బిగతీతలో—అన్నీ ప్రత్యక్షంగా కనబడుతున్నాయి.

మృత్యుసన్నిభ నిశ్శబ్ద పరీవృతమై, జీవిత సర్వస్వాన్నీ విశ్వాసహీనంగా బట్టబయలుపరుస్తూన్న, ఆ సుషుప్త్యవస్థ ఒక మహాగంభీరతను, వెలువరుచుకొంటూంది. చీకటిరాత్రిలో రణరంగమట్లుగా ఘాతుకాలను బయటబెట్టా, చీకటి కదలికల ఛాయలలో అంతకన్న మహాఘోరాలను స్ఫురింపచేస్తూ, మహాభీభత్స ప్రాయంగా కూడా కనుబడుతూంది.

ఒక్కసారిగా ఆ దీనుడి దేహం అంతా కంపించిపోయింది. కన్నీటి వెల్లువలో సర్వమూ కడిగేసుకొందామన్న ఆక్రోశము పుస్తకబంటిగా అతన్ని ముంచివేసింది.

## 4

తెరచి ఉన్న కిటికీకి దగ్గరగా కూర్చుని ఇద్దరూ భోజనాలు ముగిస్తున్నారు. బైట సాంధ్యకాలంలో పక్షులు బారులుగట్టి దివసావసాన మంగళగీతా లాలపిస్తున్నాయి.

జీన్ మాట్లాడటం లేదు. కాని ఏదో అడగటానికి ఉద్యమిస్తున్నాడు. కౌడల్ తో మాట్లాడినప్పటినుంచీ తన్ను వెంటాడుతూన్న దుర్భర ఆవేదననుగురించే! ఆ ఆవేదనతోనే అప్పటినుంచీ ఫాన్నీని హింసిస్తూనే ఉన్నాడు. ఆ రెప్పలు వాల్చటం, కృతకంగా తెచ్చిపెట్టుకొన్న ఆ శాంతం, అన్నీ చూసి అతను నోరు తెరవకముందే అతను అడగబోయే విషయం పసిగట్టినట్టు ఫాన్నీ మాట్లాడసాగింది.

“ఇదిగో, నువ్వేమనబోతున్నావో నాకు తెలుసు. కాని, బాబు! బాబు! నామాట విను—మళ్ళీ ఇద్దరం ఆరభస అంతా పడకుండా ఆపలేవా! చూడూ, అదంతా ఏనాడో మృతమై ఆఖరై పోయింది. నేను నిన్ను తప్ప ఎవర్నీ ప్రేమించటం లేదు. నాకు నువ్వుతప్ప ప్రపంచంలో ఎవరూ లేరు.”

“అంత ఏనాడో మృతమై ఆఖరైపోయే ఉంటే...” అని మాటమధ్యలో ఆపి, జేడిస కళ్ళలా నిత్యం తళుకు తళుకుమనే ఆమె అందపు తెలినీలి కళ్ళల్లోకి తీవ్రంగా చూస్తూ, మళ్ళీ మాట సాగించాడు. “అంతే అయితే, అదంతా నిత్యం జ్ఞాపకంచేసే వస్తువులనుమాత్రం ఎందు కుంచు

కొంటావు ? అదే—బీర్వాపై సొరుగులో మూల దాచినవాటిమాటే నేను చెప్పేది" అన్నాడు.

ఆమె కన్నులు తళుకొంరి నీలినీడలతో అరుణనీలిమ మయాయి. "అయితే నీకూ తెలుసన్న మాట."

తన ప్రేమలేఖలు, చిత్రపటాలు, నానావిధ స్మృతిచిహ్నాలు, ప్రేమార్ద్రమైన జీవితానుగతి వివిధప్రేమకలాప భస్మాలలో సంచయన మొనర్చుకొన్న పురాణాస్థిక సర్వస్వమంతా, విసర్జించేందుకు సంసిద్ధమయింది.

"పోనీలే ! తర్వాతైనా నన్ను నమ్ముతావా?"

అతని వికృత హాసంలో అపనమ్మకం సవాలు చేసినట్లయి, ఒక్క పరుగున బీర్వావద్దకుపోయి, పై సొరుగులో తన బట్టలమధ్య భద్రంగా ఉన్న ముత్యపు నగిషీల లక్కభరణి బైటకి తీసింది. కొన్నాళ్ళ నుంచి తన ప్రియునిరూపంతా ఆ పెట్టెలోనే ఉన్నట్లుంది. ఆపెట్టె తెచ్చి అతనిముందర భళ్లున పడేసింది.

"అన్నీ తెరలపెట్టేయ్ చింపేయ్ నీయిష్టం వచ్చినట్లు చెయ్యి"

కాని అతను భరిణ మూత తియ్యటానికి ఆత్రం చూపటం లేదు. ఆ మూతమీది ముత్యపునగిషీల ఫల వృక్షాలు, ఎగురుతూన్న కొంగలూ అన్నీ చూస్తూ కూర్చున్నాడు. అకస్మాత్తుగా మూత తెరిచాడు. అనేక రకాల వివిధవర్ణాల—వివిధ పరిమాణాల ఉత్తరాలు, కవర్లు, అన్నిరకాల దస్తూరీలు, నాగరిక పత్రాలు, పాతకాగితప్పీలికలపై వ్రాతలు, చిత్తుకాగితాలపై పెన్సలుబరుకుళ్ళు, విజిటింగ్ కార్డులూ అన్నివిధాల ప్రేమలేఖలూ, సంజ్ఞా పత్రాలూ, మడతలు చీలిపోతున్న పెళుసుకాగితమ్ముక్కలు, అన్నీ కలగాపులగంగా, ఎప్పటి కప్పుడు పెరుక్కొంటూ కలబోసుకొస్తూన్న సొరుగులో వస్తువులలాగా, చిందరవందరగా బొత్తికట్టి ఉన్నాయి. వణుకుతూన్న చేతులు ఆ బొత్తిలోకి సుచ్చెత్తాడు.

"ఇల్లా ఇచ్చెయ్ ! నీ కళ్ళముందరే అన్నీ తగలేస్తాను" అంది.

చలిమంట పొయ్యికి దగ్గిరగా ఒక కొవ్వొత్తి వెలిగించుకొని మోకాళ్ళమీద కూర్చుని ఉంది.

"నాకిచ్చేయి" అంది.

"ఊహూ !" అని అడ్డు చెప్పాడు. "అబ్బ" అని గొంతుక తగ్గించి, సిగ్గుపడుతూన్నట్లు నసుగుతూ "ఇందులో కొన్ని చదవాలి..." అన్నాడు.

"ఎందుకు ? చదివినకొద్దీ నీకు మరింత బాధ కల్గుతుంది" అంది.

అతనికి కలిగే హృదయావేదనే ఆలోచిస్తుంది తప్ప, తనను ప్రేమించిన ఆ ప్రేమికులందరితోటి తన రహస్యాలు, తమ తమ మధ్య ఆంతరంగికాలు, తన ప్రక్క పరుండి తనను వాళ్లు పొగిడిన మర్మనర్మ భాషణలు, ఇన్నీ అతని కర్పించడంలో, తనకు కలిగే సిగ్గుచేటును కూడా లక్ష్యపెట్టుకోటం లేదు. మోకాళ్ళమీదే అతని ప్రక్కకు జరిగి, అతనితో కలిసి చదువుతూ క్రీగంట అతని ముఖలక్షణాలు గాలిస్తూంది.

"లా గూర్నెరీ, 1861" అన్న సంతకం, తేదీతో పదిపేజీలకట్ట, ప్రౌఢమైన దస్తూరీలో కనబడింది. ఆ కవిని చక్రవర్తి దంపతుల ఆల్జీరియాపర్యటన నంతా ప్రత్యక్షంగా వర్ణించి గ్రంథస్థం చేసేందుకు ఆల్జీరిగూ పంపించారు. ఆ మహోత్సవాలన్నిటినీ ఉజ్జ్వలంగా వర్ణిస్తూ తన ప్రియురాలికి పది పేజీల ఉత్తరం వ్రాశాడు.

ఆల్జీర్స్, ఉత్సవ జనంతో ఇసుకవేస్తే రాలకుండా కిటకిటలాడిపోతూంది. అరేబియన్ నైట్సు కథలలోని గాంధర్వపురి బాగ్దాద్‌ను తలపింప చేస్తూంది. ఆఫ్రికాఖండప్రజయావత్తూ ఝంఝా మారుత ఉద్ధృతంతో పట్టణంమీదికి విరుచుకుపడ్డారా అన్నట్లుంది. పట్టణం బైటా లోనా కూడా జనసమ్మర్దమే. నీగ్రోసార్థవాహులు ఒంటెలమీద పచ్చిచర్మాలు, తుమ్మజిగురు మొదలైన సరుకు లెత్తుకొని సార్థాలుగా బయలుదేరివచ్చి, సముద్రతీరం పొడుగునా గుడారాలు వేసుకొని విడిశారు. అక్కడి మనుష్య సమూహం, నానా జంతుజాలం, అన్నీ మృగమద మనుష్యమద వాసనలతో వాతావరణాన్నంతా దుర్భరంగా ముంచెత్తివేస్తున్నాయి. సార్థవాహులు రాత్రుళ్లు, భోగిమంటలు వేస్తూ, ఆటవిక నృత్యకోలాహలాలతో రాత్రి తెల్లవార్లూ సముద్ర తీరాన్నంతా హోరెత్తించేస్తున్నారు. తెల్లవారినప్పటినుంచీ చిత్రచిత్ర వస్త్రాలంకృతులైన నానాదేశ సామంతరాజుల

ఆగమన ఘోషలు, జయభేరులు, తాళాలు, తప్పెటలు, మోగుతూండేవి. ప్రవక్తగారి త్రివర్ణ పతాకాల చుట్టూ మేళతాళాలు వాయిస్తూ భక్తబృందాలు చేరేవి. వాళ్లకు వెనుకగా, వెండి జల్తారు ముకమల్ పట్టు వస్త్రాలు కప్పి అడుగడుగున కాలిమువ్వలు గంటలు గలగలమని మోగుతున్న ఉత్తమాశ్వాలను నీగ్రో నాయకులు చక్రవర్తికి కానుకగా నడిపించుకొని వస్తున్నారు...

ఆ కవి ప్రతిభవల్ల, ఆ వర్ణనంతా సజీవంగా ప్రత్యక్షంగా కన్నులకు కట్టుతూంది. అక్షరాలు కాగితంమీద తళతళలాడుతూ, రత్నపరీక్షకులు కాగితంమీద పెట్టి పరీక్ష చేస్తున్న రత్నాలలాగ, మెరుస్తున్నాయి. నిజానికి ఇంతింతటి మహాభాగ్యాలు ఆమె ఒళ్లో వచ్చి పడినందుకు, ఆమె ఎంతైనా గర్వించి ఉండవచ్చు. యథార్థానికి ఆమె నా మహాకవి ఎంతో ప్రేమించి ఉండవచ్చును. ఇంతటి మహోత్సవ మధ్యంలో ఉన్నా అతడు ఆమె నొక్కతనే ధ్యానిస్తూ ఆమెకోసమే పరితపిస్తూ ఆమెదగ్గిర లేదని విరహవేదనలో వేగిపోతున్నాడు.

"అబ్బా! గతరాత్రంతా రూడిలా ఆ ర్కేక్లో నీ గదిలో పట్టెమంచంమీద నీతోటే ఉన్నట్లున్నాను. నువ్వు నగ్నంగా ఉన్నావ్. మదోన్మాదినివై పోయావ్. నేను మన్మథోపచారాలొనరిస్తూంటే, ఆనందాతిరేకంతో కేకలేస్తూ కన్నీరు కారుస్తున్నావ్. — అకస్మాత్తుగా మెళుకువ వచ్చింది. డాబామీద ఆరుబయట శాలువా ముసుగెట్టుకొని పడుకొనిఉన్నాను. పైన నీలాకాశమూ, నక్షత్రాలూ. ప్రక్కనే ఎక్కడో దగ్గిర మసీదు గోపురంలో ఎవరో ఫకీరు నమాజ్ చేస్తున్న కేక తారాజువ్వలాగ ఉజ్జ్వలంగా ఆకాశాని కందుకొంటూ వెడల్తూంది. ఆ కేక ప్రార్థనాగీతంగా కాక ఉన్మత్తావేశంలో కేకలాగే వినిపించింది. ఆ వినపడటంలోనూ, నిద్రమేల్కొన్నాక కూడా, నీ కేకగానే నా చెవుల మ్రోగుతూంది."

ఈర్ష్యాక్రోధాలు దుర్భరంగా పీడిస్తున్నాయి. పిడికిళ్ళు బిగిస్తూ వదులుతూ, వణికిపోతున్నాడు. పెదవులు తెల్లబారిపోయినయి. కాని చదువు ఆపలేకుండా ఉన్నాడు. ఏ శక్తి ప్రేరేపిస్తోందో?

మృదువుగా లాలిస్తూ, అతని చేతులోంచి ఆ ఉత్తరం తీసికొందామని ఫాన్నీ ప్రయత్నించింది. కానీ అతనా ఉత్తరం చివరిదాకా చదివేశాడు. తరువాతి ఉత్తరం తీశాడు. ఆ తర్వాత మరొకటి—ఒక్కొక్కటే చదువుతూ, నిరసనతో నిర్లక్ష్యంగా మంటలో పారేస్తున్నాడు. మంటలు గప్పుమని రాజుకొని జాజ్వల్యంగా పైదాకా నాల్కలు సిసరటం కూడా గమనించటం లేదు.

ఒక్కొక్కప్పుడు, ఆ లేఖాపాత్రలలోని ప్రణయమధువు, ఆ ఉష్ణఖండ చండాతపంలో, పొంగులెత్తి ఉబికి ఉత్తుంగతరంగాలుగా పైకి లేస్తూంది. కాని మధ్యమధ్య పచ్చిబూతులు అందులో దొర్లి, ఆ మధువును మురికిగోళంగా చేస్తున్నాయి. అమరప్రేమ నిధానమై స్వచ్ఛ రజతశృంగసన్నిభమైనదంటూ, ఆ మహాకవి "ప్రేమ కావ్యం" చదివి తల ఊచి మెచ్చుకొన్న అబలాశిరోమణులెవరైనా ఆ పచ్చిబూతులు చదివి ఉంటే దిగ్భ్రాంతులై దెబ్బ తిన్నట్లయిపోయి ఉందురు.

హృదయం ఎంతెంత విపరీత సంఘర్షణలకు ఆలవాలమో! అన్నిటికన్నా ఆ పచ్చిబూతులున్న భాగాలే, అతన్ని మరీ మరీ ఆకట్టి చదివిస్తున్నాయి. అతని మొగంలో ఒక్కొక్క చదువుతో ఎంతెంత వికృతపు కదలికలు కలుగుతున్నాయో అతనికి తెలియటం లేదు. ఒక ఉత్సవాన్ని ఉజ్జ్వలంగా వర్ణించిన ఒక ఉత్తరం చివరున కలంతో వ్రాసి ఉంది. "ఈ ఉత్తరం నేను మక్కా, చదువుకొన్నాను. కొంత కొంత చదువుతూంటే బాగానే ఉంది. ఫర్వాలేదనే అనిపించింది. ఈ ఉత్తరం జాగ్రత్తగా ఉంచు—తర్వాత నా కెప్పుడైనా పనికి రావచ్చు" అని ఉంది. పట్టలేక వికటాట్టహాసం చేస్తూ కీచుమని నవ్వాడు.

"చాలా పొదుపరైన పెద్దమనిషే నే!" అంటూ, అదే దస్తూరిలో ఉన్న మరొక ఉత్తరం తీశాడు. ఈ ఉత్తరం చాలా కరుకుగా ఉంది. తన అరబ్ గీతాల సంపుటినీ, వరిగడ్డి స్లిప్పర్ల జోడునూ, వెంటనే తనకు పంపించేయమని ఆజ్ఞాపిస్తున్నాడు. అప్పటికే ఆ ప్రేమ వట్టిపోయిందని, ఆ ఉత్తరమే నిదర్శన మిస్తూంది. ఆహా! ఠాగూర్నే ఠీ తెగతెంపులు చేసు కోగలిగాడు—నిజంగా సమర్థుడే!

అంతటితో ఆగకుండా, సెగలుపొగలుగా దుర్వాసనలు రేకెత్తుతున్న ఆ కుర్రికి కూపాన్నంతా తిరగతోడుతున్నాడు. చీకటి పడ్డాక కొవ్వొత్తి టేబిల్ మీద పెట్టాడు. వరుసగా చిన్న చిన్న చికిలి గీతల ఉత్తరాలను చదువసాగాడు. మొద్దువ్రేళ్ళతో, ఏ ఘుంటమో పుచ్చుకొని కోపంతో, తీవ్రంగా కాగితం చిల్లులుపడేటట్టు బరికినట్టుందా వ్రాత. కాపుఃల్‌తో ప్రేమకలాపం ఇక్కడె ప్రారంభ మౌతూంది. రహస్యసమావేశాలు, సంకేతాలు, అల్పాహారాలు, విహారాలు, అంతలో ప్రణయకలహాలు, మళ్ళీ బ్రతిమాలుళ్లు, ఏడుపులు కొట్లాటలు, బజారుకూలీనోటినుంచి వచ్చే తిట్లు, మధ్య మధ్య చిన్ని చిన్ని చమత్కారాలు, నర్మహాసాలు, ఉపాలంభనలు, ఎత్తిపొడుపులు, మెత్తికోళ్లు, ఆ మహాశిల్పి వికారాలన్నీ అవియోగంతో, ఆమె వదిలేయటంతో అక్షరరూపాన్ని అక్కడె బైటపడ్డాయి.

అగ్ని వాటినికూడా ఆహుతి చేసుకొని, రక్తవర్ణపు మంటల నాల్కలు పొడుగ్గా పైకి జాచుకొంటూంది. ఆ మహాప్రతిభుని చీమూ నెత్తురూ, కన్నీరూ, ఆ మంటలో పడి కుంచుకుపోయి, కాలి ధూమమై ఎగసిపోతున్నాయి.

కానీ తన ఈ యువప్రేమికునికోసమే జీవిస్తూ సర్వమూ పరికిస్తున్న ఫాన్నీ అందుకు తృణమాత్ర మైనా లక్ష్యంచేయలేదు. అతని జ్వరతీవ్రత, ఆ వసనాలలో నుంచి కూడా ఆమెను మాడ్చేస్తూన్నట్లుంది.

కలం సిరాతో గీసిన పోర్ట్రైట్ చిత్రం ఒకటి కనబడింది. క్రింద "గావర్ని"అని సంతకం ఉంది. "ఒక వాసరోజున, డాంపియన్‌లో హోటల్‌లో కూర్చుని, నా ప్రియమైన ఫాన్నీ కోసం గీచినది" అని వ్రాసిఉంది. ఆ బొమ్మలో వ్యక్తి తల, జ్ఞానవృద్ధుని తలలా ఉంది. కళ్లు గుంటలు పడి బాధను వెలిగ్రక్కుతున్నాయి. ఏదో పీడించగా బ్రతుకు చేదైపోయినట్లు స్ఫురింపజేస్తున్నాయి.

"ఎవరిదీ బొమ్మ!"

"ఆంద్రీ డి జోయ్‌ది. ఆ సంతకంకోసం అట్టే పెట్టిఉంచాను" అంది.

"ఉంచుకో! నీదే!" అన్న మాట, అతి బాధాకరంగా, బిగదీసుకుపోయినట్లు వినిపించేటప్పటికి, చటుక్కున లాక్కొని ఫట్టున చించి నిప్పులో పారవేసింది. అతను ఆ నవలాకారుని ఉత్తరాలకోసం ఆ కుప్పలో వెదుకుతున్నాడు. ఆరోగ్యం కోలుకోటానికి సముద్రతీర శీతగృహాలకు వెళ్లి అక్కడినుంచి వ్రాసిన ఉత్తరాలు. ఆ ఉత్తరాలు చాలా బాధామయంగా ఉన్నాయి. వాట్లలో తన ఆరోగ్యం, శారీరకంగా, మానసికంగా కూడా చితికిపోయిందన్న నిస్పృహలో, ఒక్కొక్క భావంకోసం తల పగులగొట్టుకొంటూ, మందులూ మాకులూ పంపించమంటూ, తన ఆర్థిక, వ్యావహారిక దుస్థితులను వివరిస్తూ, ఆ నవలాకారుడు వ్రాస్తున్నాడు. కాని అన్నిటా శాఫో కోమలదేహం కావాలన్న వాంఛ, (వైద్యులతనికి కామప్రసక్తి నిషేధించారు) ఆమె అంటే గౌరవభావం ఉట్టిపడుతున్నాయి.

అశక్తకోపం పట్టలేక, జీన్, పైకేకి గొణుగుతున్నాడు. "ఏం కర్మ పట్టిందని వీళ్ళంతా ఇల్లా నీ వెంటబడ్డారు!"

ఆ లేఖల పరివేదనలో ఆ యువకునికి కనిపించిందంతే! ఏ మహామహుల జీవితాలు చూసి యువకులు ఈర్ష్యామగ్నులౌతారో, యువతీమణులు కలలు గంటారో, ఆ జీవితాల స్వయంవినాశనమంతా ఆ ఉత్తరాలు నివేదించుకొంటున్నాయి. పైను వీళ్ళందరూ ఎందు కిల్లా అయ్యారు? ఆమె ఏం జేసి వీళ్లందర్నీ ఇంత మరులుకొల్పి నిర్వీర్యులను చేసింది?

కాళ్లు చేతులూ కట్టేసి నోట గుడ్డలుకుక్కి, ప్రియురాలిని కట్టెదుట మానభంగ మొనరుస్తూంటే మనిషిపడే ఆవేదనంతా పడుతూన్నాడు. కాని కళ్ళుమూసుకొని ఆ పెట్టెడు ఉత్తరాలూ, ఒక్క బొత్తిగా నిప్పులో పారేసి పెట్టె కాళీ చేసుకునేందుకు మనసు కుదుర్చుకోలేకుండా ఉన్నాడు.

తరువాత స్వర్ణకారునివంతు వచ్చింది. నిరు పేద, అనామకుడు. పోలీసుకేసులో వచ్చిన కీర్తి తప్ప మరేమీ లేదు. ఈ మహారథుల శ్రేణిలో అతను కూడా ఉండటానికి ఫాన్నీకి అతనంటే ఉండిన మహత్తర ప్రేమయే కారణం.

జైలు అగౌరవాన్ని వెంటతెస్తూ వచ్చిన ఉత్త రాలు. సిపాయి ఎవడో తన పల్లెపడుచుకు వ్రాసుకొన్నట్లు గ్రామ్య 'సింగారంలో' మొర టుగా, అవకతవకగా, తెలివితక్కువగా ఉన్నాయి. కానీ ఏ అణాకానీ బజారు శృంగారపు నవలల నుంచో అలవర్చుకొన్న, ఆ కృతకభాషలోనుంచి కూడాఅతని నిర్మలప్రేమా, ఆమెను, 'స్త్రీ'గా అత నిచ్చిన మహద్గౌరవమూ, ఆమె శ్రేయోభి లాషలో నే మున్నుడయిపోయి, తనను తను మరిచి పోవటం, అన్నీకూడా అంతర్లీనంగా ప్రవహిస్తూ, ప్రాణనాడిలా స్పందిస్తూ, తక్కినవాళ్ళ కెవళ్లకూ లేని ఒక ప్రత్యేకతను ఆ 'ఖైదీ'కి చేకూర్చి పెట్టాయి. ఆమెను అతిగా ప్రేమించిన నేరానికి తన్ను క్షమించమన్నప్పుడు; కోర్టులో తనకు దీర్ఘ కారాగారవాస శిక్షపడిన క్షణంలో నే కోర్టుసమాస్తా దగ్గిరే కౌగిలించుకొని ఆమె నిర్దోషిత్వం బుజువై ఆమెను వదిలేసినందుకు అపారసంతోషం వెలిబుస్తూ వ్రాసినప్పుడు-అల్లాంటి ఉత్తరాలన్నిటా ఆ ప్రత్యేకత కనబడుతూనే ఉంది. ఆమె నతి నెక్కడా పల్లెత్తుమాట అనలేదు. ఆమె పుణ్యమా అని, ఆమెతో తను రెండేళ్లు అపార స్వర్గసౌఖ్యం అనుభవించాడు. తన భావిజీవిత దౌర్భాగ్యాన్నంతా తుడిచి పెట్టేసి సుఖంగా బ్రతికించేందుకు ఆ రెండేళ్ల, మధుర, గాఢస్మృతులే చాలును. ఉత్తరం చివర తనకొక ఉపకారం చేసిపెట్టమంటూ వ్రాశాడు.

"నాకు పల్లెటెదిక్కున ఒక బిడ్డ డున్నాడని నీకు తెలుసును. వాడి తల్లి ఏనాడో పోయింది. ఒక ముసలామె, దూర బంధువు, సాకుతూన్నది. వాళ్లున్నచోటు ఒక మారుమూల ఉండటంమూలాన నే నేమయానో కూడా వాళ్ళకు చెప్పేవా ళ్ళెవరూ ఉండరు. నాదగ్గిర మిగిలినడబ్బు వాళ్ళకు పంపుతూ నేను దూరప్రయాణం వెళ్తున్నాననీ, చాలారోజులు పడుతుందనీ, వాళ్ళకు వ్రాశాను. నిన్నే! అప్పుడప్పుడు ఆ కుర్రాడిసంగతి తెల్పుతావని నీమీద ఆశ పెట్టుకొని ఉన్నాను."

అతని కోరిక ఫాన్నీ నెరవేర్చినందుకు కృత జ్ఞత తెలుపుతూ వ్రాసిన ఉత్తరం మరొకటి కనబ డింది. ఆ తర్వాత ఈమధ్య నే ఆరునెల్లక్రిందే వ్రాసిన ఉత్తరం కనబడింది. "ఓహో! నాకోసం వచ్చా వంటే ఎంత మంచిదాని వనుకోను! నువ్వు ఎంత అందంగా కనిపించావ్! నీదేహం ఎంత కమ్మని పరి మళం జల్లింది? నేనో జైలుచొక్కాతో ఉన్నాను! నా మురికిదుస్తులు చూసుకొని ఎంత సిగ్గుపడిపోయాను!"

జీన్ చటుక్కున ఆపి ఉగ్రుడై అడిగాడు: "అయితే ఇంకా అతన్ని చూస్తూనే ఉన్నావన్న మాట"

"అప్పుడప్పుడు, జాలిపుట్టి!"

"మనఇద్దరం కలిసి ఉంటున్నాకకూడా?"

"ఆ! ఒక్కసారంటే ఒక్కసారె చూశాను. విజిటర్లగదిలో! వాళ్లె నక్కడం తప్ప చూడటానికే కుదరదు"

"అబ్బా! ఎంత జాలిగుండె మనిషివి!"

అన్నిటికన్నాకూడా తమ సంయోగానంతరం కూడా ఆమె యింకా అతన్ని చూట్టానికి వెళ్తూం దన్న విషయం, అతన్ని మండించివేసింది. కాని పైకి చెప్పుకోటానికి అభిమానం.

ఇంక ఒక్కటే. ఊదారిబ్బనతో బంగీకట్టిన చిన్న ఉత్తరాలకట్ట ఒక్కటే మిగిలింది. బంగీపైన వ్రాత, చిన్న చిన్న అక్షరాలతో ఆడవాళ్లు పట్టి పట్టి వ్రాసినట్లు, సున్నితమైన దస్తూరీతో ఉంది. అది చూసేటప్పటికి బిగబట్టుకున్న కోపంఅంతా కట్ట తెంచుకొని ఉబికివచ్చింది.

"రఘాలపరుసు అవగానే, దుస్తులు మార్చు కొంటాను. అప్పుడు నా అలంకారగృహానికి రా!" అంటూ చదువుతున్నాడు.

"వద్దు! వద్దు! అది చదవ్వద్దు"

అంటూ అకాత్తుగా అతనిమీదపడి చేతులలో ఉత్తరాలు లాగేస్తూ, కట్టకట్టా ఒక్కసారిగా నిప్పులో పడేసింది. అతనికి ముందు అర్థంకాలేదు. ఆ మంటముందు మోకరిల్లి సిగ్గుతో కుంచించుకుపోతోంది. మంటల ఎరుపుకేకాక సిగ్గుతోకూడా మొగమంతా ఎఱ్ఱబడిపోతోంది. అప్పటికీ అతనికి అర్థంకాలేదు. సిగ్గుతో కుంచించుకొనిపోయి అంది.

"అప్పటికి చాలా చిన్నదాన్ని — కౌపిల్ మరీఅల్లాంటి వట్టి మొట్టి పనులు చేయించేవాడు. అప్పట్లో అతను ఏం చెయ్యమంటే అదల్లా చేసేదాన్ని"

అప్పటికి అతనికి అర్థమయింది. మొగమంతటా పాలిపోయాడు.

"ఆ! ఔను. శాఫో*—మహతివీణాశతతంత్రీ సర్వస్వమూ కదూ!" ఆమె యేదో నీచజంతువైనట్లు, ఒక్క తన్నుతో అవలకు తన్నేశాడు. "నా చాయలకు రాకు—నన్ను ముట్టుకోకు. పేగులు పెళ్లుకొచ్చేట్టు చేశావు"

ఆమె రోదనస్వరం, ఉరుములాంటి భీకరశబ్దంలో మునిగిపోయింది. గదిలో ఒక్కసారిగా భగ్గుమని ఒక పెద్దమంట

గది నిలువునా లేచింది! ఇల్లు అంటుకొంది! ఆమె భయంతో ఒక్క ఉరుకున లేచి, బల్లమీదున్న నీళ్ళకూజా కూజా, ఆ కాగితాల మంటమీద పోసేసింది. కాని చిమ్నీగొట్టంలో పేరుకొన్న మకిలంతాకూడా భగ్గుమని చూరుకూడా అంటుకొంది. క్రిందిమంట ఏమాత్రం చల్లారలేదు. ఇంట్లో నీళ్ళబిందెలన్నీ తెచ్చి, దబదబా ఉన్న నీళ్ళన్నీ పోసేసింది. మంటలార్పటం తనకు సాధ్యం కావటంలేదు. నిప్పురవ్వలు గదిఅంతటా పరజిమ్ముతున్నాయి. గబాలున బాల్కనీలోకి పరుగెత్తి "ఇల్లంటుకొంది! ఇల్లంటుకొంది!" అంటూ కేకలువేసింది.

ముందు హోటెమాదంపతులు. తర్వాత, ఇంటి నౌకర్లూ, పోలీసులూ చేరారు.

"వెనుక చెక్కలు పీకండి! అటు కప్పుమీది కెక్కండి! నీళ్లెక్కడున్నాయి నీళ్లు! నీళ్లు కాదు కంబళ్లు ఇయ్యండి!" అంటూ ఆదరాబాదరాగా నిప్పు ఆర్పే జనం కేకలు వేస్తున్నారు.

తమ నివాసంలోకి జనం తోసుకొంటూవచ్చి నానా కంగాళీ చేస్తూంటే, కొయ్యబారినట్లయి చూస్తూ నిలబడిపోయారిద్దరూ! చివరికి మంటలు చల్లారి జనంఅంతా దిగిపోయి, ఇరుగు పొరుగు అంతా ఇంక భయంలేదని శాంతించి తమ తమ నెలవులకు జారుకొన్నాక, మసీ, నీరు, బొగ్గూ, మయంగా ఉన్న తమగదిలో చెల్లాచెదరుగావింపబడ్డ సామాను మధ్య ప్రేమికులిద్దరూ నిలబడి, దిగాలుపడి చూస్తున్నారు. ఇద్దరూ నిర్జీవులై ప్రాణంలేని నిస్సత్తువతో నీరసపడిపోయిఉన్నారు. ఇందాకటి దెబ్బలాట సాగించటానికిగానీ, సామాను సరిగ్గా సర్దుకోటానికిగాని ఏ ఒక్కరిలోనూ నలుసంత ఓపికకూడా కనబడటంలేదు. తమ కాపురంలో ఏదో దుర్గ్రహప్రభావం ప్రవేశించి జీవితాలను నేలను పొర్లాడించింది.

మునుపటి కోపతాపాలన్నీ మరిచిపోయి, ఆ రాత్రి ఏదైనా హోటల్లో గడుపుదామని బైలు వెడలారు.

ఫాన్ని చేసిన త్యాగమంతా నిష్ఫలమైపోయింది. ఉత్తరాలు కాలి మసిఅయి మాయమైపోయినా, వాట్లల్లో వాక్యాలు వాక్యాలు పూర్తిగా ప్రేమికుని స్మృతిలో నిలిచిపోయి, అతన్ని వెంటాడుతూ, కొన్ని దుష్టగ్రంథాలలో ఘట్టాలలాగా, నిత్యం నెత్తురు సుడికించి, మొగము ఎఱ్ఱబడేస్తూనే ఉన్నాయి.

అతని వలపుకత్తె పూర్వప్రియులంతా దాదాపు అందరూ మహాపురుషులుగా కీర్తిగడించినవారే. చనిపోయినవారి కీర్తి అమరంగానే ఉంది. బ్రతికిఉన్నవాళ్ళ బొమ్మలూ పేర్లూ, నిత్యం ప్రతిచోటా కనబడుతూ, ప్రతినిత్యం జనం నోటిలో ఆడుతూనే ఉన్నాయి. అతనిముందర ఎవరైనా వాళ్ళ ప్రసక్తి తెచ్చినప్పుడల్లా, చీదరఎత్తి, ఏదో ఆత్మబంధుత్వం ఘోరంగా తెగిపోయినట్లు దిగాలుపడిపోయేవాడు.

ఈ కష్టం, అతని మానసికశక్తులను దృష్టినీ కూడా నిశిత మొనర్చింది. ఫాన్నీలో పూర్వ

---

* స్త్రీని స్త్రీ మోహించే దుర్వ్యసనానికి పౌరాణికంగా శాఫోను ఉదాహరణగా తీసుకొంటారు.

ప్రియులవద్దనుంచి అలవర్చుకొన్న, మాటతీరులు, ముఖకవళికలు, భావవిధానాలు, దృక్పథాలు, ఒక్కొక్కటే సంతరించసాగాడు. ఏదైనా చెప్తున్నప్పుడు, చెప్తున్న విషయం బొమ్మ కట్టిస్తున్నట్టు, బొటనవ్రేలు మెదుపుతూ, "చూశావా ఇల్లాగా" అనటం శిల్పిదగ్గరనుంచి వచ్చింది. మాటలు తుంచేసే పద్ధతి డిజోయ్‌దగ్గర నేర్చుకొంది. బహుశా జానపద గీతాలన్నీ అతనిదగ్గర నేర్చినవే—పురాతన జానపద గేయాల సంపుటికూడా అతనొకటెప్పుడో ప్రచురించాడు. ఆధునిక సారస్వతమంటే తిరస్కారపు పలుకులు, నిస్సంకోచంతో ధిమాకిగా మాట్లాడటం, లాగూర్నెరీవద్ద నేర్చిన కళలు. అందరిగుణాలు, అన్నీ జీర్ణం చేసుకొంది. అన్నీ పొరలు పొరలుగా ఒకదానిపైన ఒకటి పేర్చుకొని, భూగర్భశాస్త్రజ్ఞులు భూమి పొరలను పరీక్షించి, ఏ యుగంనాటివో చెప్పేందుకు అనువైనరీతిగా, ఏ యే గుణాలు ఏ యే కాలంలో జీర్ణంచేసుకొన్నవో దేని యాస ఎంతో తెలుపుతూ కాలక్రమానుగతంగా పేరుకొంటూ వచ్చాయి. బహుశా ముందు పైకి కనిపించినంత తెలివైనది కాదేమో! కాని తెలివితేటల సమస్యకాదది. నిజానికి ప్రపంచంలోకల్లా మహామూర్ఖురాలైనప్పటికీ, ఆమె పూర్వచరిత్రబలం ఆధారంతోనే అతన్ని పూర్తిగా ఆకట్టుకొని ఉంచుకోగల్గేది. ఆ ఈర్ష్యావిషాగ్నులు నిత్యం అతన్ని దహిస్తూండేవి. ఆ కోపతాపాలను ఆమెముందుకూడా దాచుకోనైనా దాచుకోలేక, ఏ ఒక్కరి ప్రశంస ఏ స్వల్పమాత్రంగానైనా తగిలినా, భగ్గున మండి, వాళ్ళమీద విషమంతా ఆవిడముందు కక్కేవాడు.

డిజోయ్ నవలల కిప్పు డమ్మకమే లేదు. ఇప్పుడా పుస్తకాలన్నీ మొత్తంగా పుస్తకం అణా కానీ చొప్పున ఏ రోడ్డుమీద పడితే ఆ రోడ్డుమీద దొరుకుతాయి. ఇంక ఆ ముసలిపీనుగ కాఉడెల్! ఆ యీడున వాడికింకా ఈ స్త్రీ వ్యసనమేమిటి! "వాడికి పళ్ళన్నీ ఊడిపోయాయి తెలుసా! విల్లీడి ఆవ్రేలో ఆవేళ ఫలహారం చేస్తూంటే చూశాను. ముందు పళ్ళతో మేకలాగ నములుతున్నాడు—వాడిలో శిల్పశక్తికూడా అంతరించిపోయింది. మొన్నటి ప్రదర్శనానికి చెక్కిన బొమ్మకు ఒక తీరూ తెన్నూ ఏమీ లేదు!" "తీరూ తెన్నూ" అన్న మాట అతను ఆమెదగ్గిరే అలవర్చుకొన్నాడు. అది ఆమె ఆ శిల్పిదగ్గిర అభ్యసించిన మాటే!

ఇల్లా తనకు పూర్వపు ప్రత్యర్థులను అతను దుమ్మెత్తి పోస్తూంటే, ఫాన్ని అతని మాటలకన్నిటికీ తాళం కలుపుతూ, వాళ్లను పడదిట్టూ అతనికి ప్రియం చేకూర్చేందుకు పాటుపడేది.

జీవితమూ, కళ, ఇదితరమూ, ఏమీ తెలియని ఆ పసిపిల్లాడూ, ఆ మహాపురుషులదగ్గిరే, మాటకారితనం కొస్తా చిలకపలుకుల్లాగా నేర్చిన ఈ చిన్న బుట్టబొమ్మా ఇద్దరూ కూర్చుని ఆ మహామహుల కళాకృతులపై విచారణకు కూర్చుని, ఎందుకూ కొరగాని వాట్లల్లా జమకట్టి ఖండించేసేవారు.

కాని గాసిన్‌కు అందరికన్నా ప్రబలశత్రువు, స్వర్ణకారుడు. ఫ్లామంట్! ఆ మనిషిని కూర్చి అతనికి తెలిసినదల్లా—ఫ్లామంట్ కూడా తనంతటి చక్కని అందగాడేననీ—అతన్ని ప్రియతమా అని పిలిచేదనీ, రహస్యంగా అతన్ని ఆమె కలుసుకొంటూండేదనీ—ఇంతమాత్రమే. అతన్ని పట్టుకొని, "నిర్జితప్రేమ వాషి" అనీ "అందమైన సన్యాసి" అనీ గాసిన్ వెక్కిరింపులకు దిగినప్పుడెల్లా, ఫాన్నీ మార్మొగంచేసికొని మాట్లాడకుండా కూర్చునేది. ఇంకా ఆ లుచ్ఛా అంటే నీకు భ్రాంతి పోలేదనీ, అతనంటే నీకింకా ఇష్టమున్నదనీ, ఆవిడను పట్టుకొని తూలనాడుతూంటే—ఫాన్ని నిక్కచ్చిగానే అతి మృదువుగా తన మనస్థితి వివరించుకొనేది.

"జీన్! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. అందుచేత ఇప్పుడింక అతణ్ణి ప్రేమించటంలేదని నీకు బాగా తెలుసును. నేనిప్పుడక్కడకు వెళ్ళటమే లేదు. అతని ఉత్తరాలకు వేటికీ జవాబు వ్రాయటమే లేదు. కాని ఆ మనిషినిగురించి దుష్టంగా మాత్రం నానోటంబడ అనిపించలేను. నన్ను ఉన్మత్తునిలా ప్రేమించాడు. ఆ ప్రేమలో నాకోసం నేరం చేసి శిక్షకూడా పడ్డాడు"

అల్లా నిష్కల్మషంగా మనసు విప్పి మాట్లాడుతూంటే జీన్ ఏమీ అనలేకపోయేవాడు. ఆమెలో ఉన్న గొప్పగుణం ఆ ఋజుప్రవర్తనమే! కాని మనసులో ఈర్ష్యాక్రోధాలుమాత్రం ఇంకా బాగా బాధపెడ్తున్నాయి. ఒక్కొక్కప్పుడు మిట్ట

మధ్యాహ్నం అకస్మాత్తుగా ఆఫీసునుంచి ఇంటికి వచ్చేవాడు. "ఏమో! వాడికోసం వస్తిందేమో." అన్న అనుమానంతో, పట్టుకొందామని!

కాని ఎప్పుడువచ్చినా ప్రాచ్య గృహిణిలాగా ఇంటిదగ్గిరే, ఇంటిపనులే ఏవో చూసుకొంటూ ఉండేది. లేకపోతే పొరుగు హొట్టినూసతికి పియానో సంగీతపు పాఠం నేర్పుతో కూర్చునుండేది. ఇల్లంటుకొన్న నాటినుంచీ—శాంత గార్హస్థ్య జీవన సమృద్ధితో, జీవితం పరిపూర్ణంగా ఆనందింప గల్గుతున్న ఆ హొట్టినూదంపతులతో ఈ దంపతులకు పరిచయం హెచ్చయింది. హొట్టినూలు నిత్యం గాలిమీద బతికేవాళ్ళలాగా చలిగాలిలో కూడా కిటికీలూ తలుపులూ అన్నీ తెరుచుకొనే ఉంచేవాళ్ళు.

భర్త ఆర్టిలరీ మ్యూజియమ్‌లో డ్రాఫ్ట్‌స్మన్‌గా పనిచేస్తూండేవాడు. రోజూ ఆఫీసుపని ఇంటికికూడా తెచ్చుకొనేవాడు. ప్రతిసాయంత్రమూ, ఆదివారం రోజంతానూ, పెద్ద బల్లదగ్గిర డ్రాయింగ్ కాగితాలు పరుచుకొని ప్లానులు వేసుకొంటూ బల్లమీదికి తల వాల్చి ఉండేవాడు. ఈలకొడ్తూ, రొప్పుకొంటూ, చెమట ఆర్పుకొని గాలిపోసుకొనేందుకు మధ్య మధ్య చొక్కా చేతులు పైకి విదిలించుకొంటూ, ఆ మీసాలు, చెంపగడ్డాలలోనుంచి, సన్నని చికిలికళ్లు మాత్రం కనబర్చుకొంటూ పని చేసుకొంటూండే వాడు. ప్రక్క నే స్థూలకాయంతో ఒకపరికిణీ రవికా మాత్రం కట్టుకొన్నట్టుగా ఇంటిదుస్తుల్లో, అతని భార్య కుర్చీ కూర్చుని, ఏ పనీ చెయ్యకుండానే మూర్ఛపోతుందా అన్నంత అస్సురుస్సురంటూ కూర్చునేది. అప్పుడప్పుడు ఇద్దరూ కలిసి ఏవో జంటపాటలు పాడుతూండేవారు.

అనతికాలంలోనే, రెండిళ్లకూ మంచిస్నేహం ఏర్పడింది.

రోజూ ప్రొద్దున్నే పదింటికి హొట్టినూ తలుపు దగ్గిరకు వచ్చి ఎలుగెత్తి "గాసిన్! బయలు దేరుతున్నావా?" అని కేకవేసేవాడు. ఇద్దరి ఆఫీసులూ ఒకేదిక్కున ఉండటంవల్ల ఇంటిదగ్గిరనుంచి ఇద్దరూ కలిసే బయలుదేరేవాళ్లు. హొట్టినూ అతి సాధారణవ్యక్తి. కొంత మోటుగానూ మందగొడిగానూ ఉంటాడు. సాంఘిక అంతరాలలోకూడా గాసిన్‌కన్నా చాలా తక్కువ మెట్టువాడు. ఎక్కువ మాట్లాడేవాడు కాదు. మాట్లాడిన కొస్తాకూడా, నోట్లోకూడా గడ్డం ఉందా అన్నట్టు నీళ్లు నములుతూ మాట్లాడేవాడు. కాని గాసిన్ దృష్టిలో చాలా ఉత్తముడుగా కనిపించేవాడు. తన ప్రస్తుతక్షుభిత మానసిక స్థితిలో, అల్లాంటి సావాసం చాలా అవసరం అనిపించేది. ఫాన్నీకోసంగా చూసినాకూడా ఆ ఇరుగు పొరుగుస్నేహం చాలా విలువైనదనిపించింది. ఫాన్నీ కేవలం ఒంటరిగా పూర్వ స్మృతుల, విలాపాల, సంరంభంలో జీవిస్తూ, గడపసాగితే, ఆమె అతనికోసం స్వబుద్ధితో త్యజించిన బాంధవ్యాలన్నిటికన్నా కూడా, ఆ స్మృతులే ఆపత్కరంగా పరిణమించవచ్చునేమో అని అతని కనిపించింది. అందుచేత ఈ ఇరుగు పొరుగు కాలక్షేపం, చాలా శ్రేయస్కరమనిపించింది. హొట్టినూసతికి, భర్త—అతనింటికి రావటం, అతనికోసం వండబోయే కూరా నారా—ఆకొత్త కొత్తవి చూసి అతనెల్లా ఆశ్చర్యపోతాడో, ఆ సంతోషం, లేకపోతే అతని కిష్టమయిన కొత్త పాట ఏది పాడవచ్చో—ఇదే లోకం. అందుచేత, ఈ స్నేహం, రుచిమంతంగానూ ఆరోగ్యవంతంగానూ కనబడింది ఫాన్నీకికూడా.

కాని పరిచయం కొంత వృద్ధిపొంది, ఒకరింటి కొకర్ని పిలుచుకోవటాల స్థితికి వచ్చేటప్పటికి జీన్ అంతరాత్మ బాధపెట్టింది. పాపం ఆ సత్కుటుంబీకులు, తామకూడా పెళ్ళైన దంపతులే అనుకొంటున్నారు. ఏమైనా అల్లాంటి దుర్భ్రమలలో వాళ్ళనుంచి, సహపంక్తి జరిపించటానికి అతని మనస్సు ఒప్పుకోలేదు. తర్వాత తర్వాత ఏమీ అపోహలు రాకుండా ఆ విషయం ముందే హొట్టినూసతికి వివరించటం మంచిదనీ అల్లా చెయ్యవలసిందనీ ఫాన్నీతో చెప్పాడు.

అతను చెప్పినదంతా విని విరగబడి పకపకా నవ్వింది. "అయ్యొ పసిపిల్లాడా! ఇంత అమాయకుడు ప్రపంచంలో ఎక్కడైనా ఉంటాడా! మనకు పెళ్లిఅయిందని వాళ్లు ఎప్పుడూ కలలోనైనా అనుకోలేదు! కాకపోయినా, వాళ్ళకేంపట్టింది! అతగాడు భార్యనెక్కడ ఏరుకొన్నాడో తెలుసా! నేను ఏ రేవు తిరుగుళ్లు తిరిగినా, ఆవిడతో పోల్చిచూస్తే ఎంతో మెరుగ్గా, (పరమ పతివ్రత) నే అనిపిస్తానే! కేవలం తన కొడుక్కి తక్క ఇతరుల కామె,

దక్కకూడదనే, ఆవిడను పెళ్ళిచేసుకొన్నాడు. అందుచేతనే ఆమె పూర్వ చరిత్ర అంటే ఏమాత్రమూ లక్ష్యంలేదని నీకూడా కనబడుతుంది, చూడు" అంది.

అతనికి సుక్క తిరగలేదు—ఇంత ఇల్లాలిగా, కిలకిల పసినవ్వులు నవ్వుతూ, బుంగమూతితో, పల్లెటి పడుచులాగ దీర్ఘాలు తీస్తూ మాట్లాడుతూ, చక్కచక్కని స్త్రీలపాటలు పాడుతూ, ఎప్పుడూ ఉత్తమాశయాలతో, మర్యాదమాటలతో, గడుపుతూన్న ఈ స్త్రీ—చెయ్యితిరిగిన వెరజాణా? ఇక ఈ ప్రబుద్ధుడు, ఇంత శాంతంగా, సంతృప్తితో, ఈ ప్రేమ ఆనందంలోనే మునిగి తేలుతున్నాడా! ఇద్దరూ ప్రక్క ప్రక్కనే నడుస్తూంటే అతను తాపీగా, సంతృప్తిగా చుట్ట కాల్చుకొంటూ, నిదానంగా, పొగ వదుల్తూ, వెళ్తూంటాడు. తనో, నిత్యం దుర్భర వేదనతో దహించుకుపోతూ, ఆ కోపం మ్రింగుకోలేక క్రక్కకోలేక బాధపడుతూ పోతూఉంటాడు.

"అదే తగ్గిపోతుందిలే ప్రియతమా." అంటూ పరస్పర హృదయ నివేదనావసర సన్నిహిత సమయాలలో మృదువుగా అతనితో అనేది. మొదటినాడెంత కోమలంగా, సౌఖ్యదాయకంగా అతనితో ఉందో, అంతటి కోమలత్వంతోనూ, అతనికి ఉపశమనమిస్తూ సౌఖ్యదాయిని అయ్యేది. కాని జీన్‌కు ఆమె ఇప్పటి ప్రవర్తనలో ఏదో విశృంఖలత్వచ్ఛాయ, ఇదమిత్థమని చెప్పటాని కలవిగాకుండా కనబడుతూన్నట్లుండేది.

ఆమె ఇతోధికంగా ప్రదర్శిస్తున్న చనువులో, మాటతీరులో, తన కాతనిపై గల ప్రభావం ఎరుకపరచటంలో, ఉండి ఉండి, మధ్య మధ్య అయాచితంగా, తనపూర్వవిశృంఖల జీవితవిషయాలు, తన విపరీత అభిరుచులు, పిట్టి మొట్టి చేష్టలు, అన్నీ బట్టబయలుగా అతనితో విప్పి చెప్పటంలో, నిర్లజ్జగా ఆఛాయ ప్రస్ఫురిస్తూ ఉండేది.

మునుపటిలాగ కాక ఇప్పుడు స్వేచ్ఛగా సిగరెట్లు కాలుస్తుంది. నిత్యం వేళ్ళ మధ్య సిగరెట్ తిప్పుకొంటూ సామానులమీద ఎక్కడపడితే అక్కడ పెడుతూండేది. అల్లాంటి స్త్రీ జీవిత దినాలన్నిటినీ మనసుకు కనరాని మైకంలో కప్పటానికి ఆ సిగరెట్ శాశ్వతమైపోయింది.

సంభాషణలలో, పురుషుల నీచస్వభావం, స్త్రీల స్వైరగుణం, భూమికలుగా మానవ జీవితాన్ని నిరసిస్తూ మహా వ్యగ్రసిద్ధాంతాలు ఉపపాదించేది. అల్లాంటప్పుడు ఆమె కన్నులు కూడా మురికినీటి అట్టడుగున ఉన్నట్లు కారునలుపు పడిపోయి, మధ్య మధ్య పచ్చి శృంగారపు వెకిలినవ్వులో మాత్రం కొంచెం తళుకుతళుకు మంటూండేవి.

వాళ్ళ మధ్య శృంగారరస స్వరూపం కూడా అంతికంతకూ మారిపోయింది. మొదటి రోజుల్లో తన వలపుకొని పసిదనాన్ని, ఆదర్శభావుకత్వాన్నీ గౌరవిస్తూ, తను కూడా ముగ్ధగా, తను నిగ్రహంతో ప్రవర్తించేది కాని తన హీనచరిత్రంతా అతనికి అకస్మాత్తుగా తెలిసి, అతని రక్తంలో అదంతా, విష ఆవేశం కల్పించేటప్పటికి, ఇక తనలో నిగ్రహం అనవసరమని పూర్తిగా పురి విప్పింది.

ఇన్నాళ్ళూ ప్రయోగించకుండా బిగబట్టుకొన్న కామశాస్త్ర పాండిత్యం, అంతా అతనికి చవిచూపింది. ఏ పలుకులు తొణకనీయకుండా నాలుక కరుచుకొని కూర్చుందో ఆ పలుకులన్నీ బాహాటంగా పలుకసాగింది. ఏయే కళారహస్యాలు తెలుపకుండా ఆపుకుందో అవన్నీ బట్టబయలొనర్చసాగింది. తన సహజస్వభావానికి తానే వశయైపోయి, కామశాస్త్రోపాధ్యాయినియైన గంధర్వ స్త్రీ అయి, తనకు "శాఘా" అన్న నామం అంకితమొనర్చిన శృంగార జీవితాన్నంతా జీవించేస్తోంది.

ముగ్ధగా, శీలవతిగా ప్రవర్తించి ప్రయోజనమేముంది? మొగవాళ్ళంతా ఒకటే! వ్యసనం, లాంపట్యం, ఇవేవాళ్లల్లో ఉన్మత్త, ఆకర్షణ రగుల్పుతాయి. ఈ బాలుడూ అల్లా తక్కిన అందరితో పాటివాడే! వాళ్ళకు కావలసిందేదో అందిస్తూ నిత్యం వలపు గొలుపుతూండటమే, వాళ్ళను ఆకట్టుకొని ఉంచటానికి ఉత్తమ విధానం.

ఆమె పాండిత్యమంతా—అనేకు లామెలో రంగరించి పోసిన వ్యసన రసికత్వమంతా — జీన్ నేర్చుకొన్నాడు. తరుణం వచ్చేటప్పటికి తనూ ఇతరులకు నేర్పుతాడు. అల్లా ఆ విషం విస్తరించి విస్తరించి, దేహాన్నీ ఆత్మనీకూడా భగభగమండించే దావానలంలాగా వ్యాపిస్తూ ఒకరి నుంచి ఒకరికి సంక్రమిస్తూ, తరంగాలుగా తరతరాలుగా నిత్యస్రవంతై ప్రవహిస్తుంది.

# నిజాయితీ

శ్రీ బలివాడ కాంతరావు

చీకటి పట్టంగా వ్యాపిస్తోంది. చలి వేస్తున్నా, పొరుగింటాయన చెప్పగానే నిలుచున్న పాటున ఒంటిమీదనున్న బనియనుతోనే సుబ్బారావు బయలుదేరాడు. ఊరి రెండో చివరన సన్యాసి పాకవుంది. ఎనిమిది మైళ్లలోనున్న పట్నంకు బదిలీయైన ఈ నాలుగు రోజుల్లో యీ వూరికి రావటం యిదే తొలిసారి. వచ్చిన పింఛనుతో తండ్రి స్వగ్రామమైన యీ వూర్లో బ్రతుకుతున్నారు. పైనున్న వాతావరణ ప్రభావం తలలో తిరిగే ఆలోచనలపై కనపడలేదు. నిజాయితీగా బ్రతకలేని మనిషి చచ్చిపోవటం వుత్తమం! తను ఒక్కడూ నిజాయితీగా వున్నంతమాత్రాన సరిపోదు. మనిషి తనచుట్టూ వున్నవాళ్ళను మనుషులుగా చేసే బాధ్యతకూడ స్వీకరించాలి. ప్రజోపయోగం కోసం ప్రభుత్వం చేసే శాసనాలు అమలుపరచడంలో ప్రతిమనిషి ఒక సత్యమైన పోలీసు కావాలి. ఇదివరకెన్నోసార్లు సుబ్బారావు యిలానే తలచుకున్నాడు—మెసులుతున్నాడు కూడాను. నిజాయితీగా మెసలేవాళ్ళకు సాధారణంగా ఆప్తబంధువులు సన్నిహితులైన మిత్రులు వుండరు! పదేళ్ళ సర్వీసున్నా తాలూకాఫీసు గుమస్తాగానే వుండిపోయాడు. అయినా తను బోరవిరచి, ముఖమెత్తి నడవగలుగుతున్నానని, తండ్రికితగ్గ కొడుకుననే గర్వం తనకుంది.

చిన్నపాక. తలుపు చాప వేసివుంది. అమ్మకం జరుగుతోందని లోన గుసగుసలు విని తెలుసుకున్నాడు. వాకిట కొయ్యకు కట్టివున్న గొర్రెపోతు సుబ్బారావు మీదకు వురికింది. తప్పించుకొని గుమ్మందగ్గరకు వెళ్లాడు. అరుగుమీద వసారాక్రింద కోళ్ళ పిల్లలు చిన్నశబ్దం చేస్తున్నాయ్. అక్కడే కోడి పుంజుకూడావుంది. వాకిట ఆవు, దూడ పచ్చగడ్డి నములుతున్నాయ్. అలా నిల్చొనే లోనుంచి వచ్చే మాటలు వింటున్నాడు.

"రేపు యిస్తాన్రా సన్నాసీ—ఇంకో దరాం పోసీ!"

"ఒరే! ఆడు యిత్తానంటే యిత్తాడురా—సత్తానంటే సత్తాడురా! రారోరి—తాగినోడికన్నా నిబద్దిగా వున్నాడు యెవుడున్నాడు?" ప్రక్కనున్నవాడు అందుకున్నాడు.

సన్యాసి చిన్న నవ్వునవ్వి "ఊరొదిలి యెలిపోతాడురా—నివ్వు సెప్పాలా? నానువూర్లో యెవురికి అరువివ్వనేదు! ఆడు యేనాడూ యిచ్చినాడురా?"

"ఆడా? యెదవ! మనూరు దోసి మరి రెండు మేడలు కట్టించినాడటనే! యెదవనోకం—యెత్తి దేవుడు. డబ్బునోడికే డబ్బు సంచుల్తో తోసేస్తాడు." అరువు అడిగిన మనిషి యెత్తుకున్నాడు.

ఈ త్రాగి తందనాలాడుతున్న వాళ్లింత వేగిరంగా కదిలేటట్టు లేదని "సన్యాసీ! ఇలారా" అన్నాడు. ఒకక్షణం జవాబు లేదు. తరవాత మెల్లిగా చేతిలో దీపంబుడ్డీ పట్టుకొని "ఎవురుబాబో" అంటూ తలుపు తీసుకొని ముందుకొచ్చాడు. తీక్షణంగా వున్న యీ ముఖం వేపు చూసి బొమ్మలా నిలుచుండిపోయాడు. మాటలు రాక కాళ్లు కదపలేక

వున్న ఆ సన్నని మనిషి శరీరమంతా వణకటం చూచి "రావోయ్" అని హుంకరించాడు. అప్పటికే త్రాగుతున్నవాళ్లు కాళ్లకు బుద్ధిచెప్పారు. సన్యాసి "దండం బాబో" అని సణుగుడుతో అని దీపం అక్కడ పెట్టి మెల్లగా దగ్గరగా వచ్చాడు. సుబ్బారావు వాకిటను పోతూనే "నివ్వని యిక్కడకు వచ్చాను. ఏమిటీపని!" చిరాకూ కోపంతో యెగిరిపడ్డాడు.

సన్యాసి చేతులు నులుపుతూ "అన్నీ తెలిసిన బాబులు. ఏం సెపతాను?"

"ప్రజాప్రభుత్వం త్రాగుడు పిశాచం పారద్రోలాలను కుంటుంటే—నివ్వు చేస్తున్న పనేమిటంటావు?"

"నా నే సెయ్యానేదుబాబూ, పతీవూర్లోనూ ఒకటి, రెండు కొట్లున్నాయ్‌బాబూ!"

"ఛప్! నే నడిగినదానికి సమాధానం చెప్పు. నివ్వెందుకీ పాడుపని చేస్తున్నావ్?"

సన్యాసి దీనంగా "బాబూ! కూనకుక్క నాగ పోత్రంతో యిది సెయ్యానేదు. నాకడుపా—గంజి నేకపోయినా నానుండ గలనుబాబో! సూసినారా యీ పచ్చులిన్ని. ఈ కాలంలోనా కూలిపనా నేదు—ఉన్న మారాజులా సెయ్యి దులపరు. ఈ పచ్చులిన్ని మాడ్చేసినాను. ఎండిపోయి యీ సురోమనివుంటే—ఆటియేపు సూస్తావుంటే నా పేసులు తెగిపోయేవి బాబూ! నాకు మరెవురున్నారు—మీకు తెలీదా? పెళ్ళమా పిల్లలా? ఇయేనాకు పిల్లలుబాబూ!" మరి కాస్త దగ్గరగా జరిగి ఆ మాసిన గడ్డం పైకి యెత్తుతూ "సూడండిబాబో! ఒక్క రెండు నెలలు ఓర్సండి. సంకురోతిరి పందాలకి సచ్చిన పెద్దనాయుడికోడ్డి పుంజుమాంసం మీకు పంపనా? ఈ పుంజు యిప్పుడు బాగా బలిసిందిబాబో. మన అయ్యగోరికి యీ ఆవుపాలు నే కండాసేస్తానా? పెద్దపాడు పెద్ద గొల్లోడి పోతుని తరిమేసి యీ గొత్తె పోతు యీ వూరిపేరు నిలబెట్టదా?"

"ఈ నిముషంనుంచీ యీ వ్యాపారం మానమంటున్నా! వింటావా లేదా?"

సన్యాసి కాళ్లావెళ్లా పడ్డాడు. "బాబూ నాను సేస్తన్న పని తప్పే నాను వూరుకుంటే యింకొకడొస్తాడు. ఇన్నాళ్ళూ మేడలమీద వున్నాడు కొట్టుపెట్టితే వూరంతా మంచి చేసుకొని నాను కొట్టుపెట్టానన్నాను. మందలోని పిల్లలతో వొదిలిన గొర్రెనమ్మి కొట్టు పెట్టానుబాబూ. నానాలిక మంచిది. ఊరుమంచ వకరయేసూతాది? ఆడు పెద్దోలందరి మాతీకట్టేవోడు. నానకేం సెయ్యక సాటుగా అమ్ముకుంటున్నాను బాబూ. తమరు రచ్చించాలి"

ఇంతలో యింటిమీద పిల్లి మ్యావ్ మంటోంది. గేదెకొమ్ముతో కొయ్యకు టప్‌టప్‌మని కొట్టుంటే సన్యాసి అపశకునమని వారించి మళ్లీ ప్రాధేయ పడ్డాడు. "సూడు బాబూ ఆపిల్లి! నాలుగు ముద్దలేస్తే యిల్లు కనిపెట్టుకున్నాది. ఆ యింటిమీద సుమ్మొడిపింజల దగ్గరికి యిప్పుడు యెలికలు రాలేవే! ఈయన్నీ బతకనీబాబూ! మీలాంటి పెద్దలు వరాత్ముల దయవుండాలిగానీ..."

"అయితే యీపని మానవన్నమాట!" అంటూ సుబ్బారావు తల పరికిస్తూ వెళిపోతుంటే కొంత దూరం వెనకనే వచ్చి బ్రతిమాలాడు. ఏదో నిశ్చయానికి వచ్చిన సుబ్బారావు "సరేలే. వెళ్ళవోయ్" అన్నాడు.

సరిగ్గా యీ సంఘటన జరిగిన వారంనాడే వూర్లో నీలమ్మ జాతర జరుగుతోంది. భాజాభజంత్రీలతోనూ, డప్పుల ఢమఢమలతోను వూరంతా మారుమ్రోగుతోంది. రాత్రి యేడుగంటలప్పుడు సన్యాసి దుకాణంలో అమ్మకం ముమ్మరంగా సాగుతోంది. ఉన్న డబ్బంతా పెట్టి వంటసారా తెచ్చాడు. ఇటువంటి రోజున అరువు లేదంటే యీ సారా డబ్బుకాదు. అరువు అడిగిన వాళ్లందరికీ యిస్తున్నాడు. ఇంతలో ప్రొహిబిషన్ గార్డ్సు యింటిని చుట్టుముట్టారు. సన్యాసి చలోక్తులాడుతున్న వాడల్లా చేతిలోని తెడ్డు జార్చి అలా నిశ్చేష్టుడయ్యాడు. త్రాగుతున్నవాళ్ళు సందుగొందుల వెంబడి పలాయనం చిత్తగించారు.

సన్యాసికి వూర్లో వాళ్లెవరూ బెయిల్ గాలేదు. సుబ్బారావొకసారి కటకటాల వెనకనున్న సన్యాసిని చూడటానికి వెళ్లాడు. సన్యాసి సుబ్బారావును చూడగానే యేడుస్తూ "వచ్చావాబాబో? నీమాట యిన్నానుకాదు. ఆ పాపిష్టి గేదవే సేసినాడు. జాత

రనాడైతే నా డబ్బంతా పెట్టి యెపారం సేస్తానని యిన్నాళ్ళూ వూరుకోని యీలుతో సెప్పి పట్టించి నాడు. మళ్ళీ ఆడు కొట్టు పెట్టుకోడానికి యిదంతా సేసినాడు. నావుసురంతా తగిలి ఆ యెదవ వంశం నే కండా నాశనం అయిపోదా? నాగొంతై వులవలు నేక యెంత గిరగిర లాడతందో? అవుసూలుతో వుంది బాబూ—యెంతసట్టుక పోతందో? నా నేం సేస్తును—నాకు సావొచ్చింది కాదు. ఈ వుసురు తగట్టా! దేవుడు నేడా?"

సుబ్బారావుకు ఒక్కొక్క మాట గుండెకు నాటుతున్నా ఆత్మవిశ్వాసంతో మెలిగాడు. అప్పటికీ వూరుకోలేక "వాడిసెందుకు అనవసరంగా తిట్టావ్. నివ్వు చేసింది మంచిపనా? కాదే. నివ్వు చేసిన నేరానికి శిక్ష అనుభవించటంలో తప్పులేదుగా?"

సన్యాసి కటకటాలికి తల కొట్టుకుంటూ "నాదినాలు! నా నేం సేస్తును? నరాలన్నీ పీక్కుపోయినట్టు సెమటకార్సినా కడుపు నిండ నేదు. ఆడు మరంత బాగ్యమంతు డవ్వాలా? ఏంటో బాబూ—నోకంలో నాయం నేదు. ఆడు మోసంతీసిన పనిసేసి నాడు. ఆ సలమ్మతల్లి ఆడిని యిక్కడికి తీసుక రాదా?"

వాడి పరిస్థితికి సానుభూతి చూపించకండా నే సుబ్బారావు అక్కడినుంచి కదలిపోయాడు. తను యిన్‌స్పెక్టరుకు చెప్పి పంపించి పట్టించటం మంచిదే యైంది. కొన్నాళ్లు శిక్ష అనుభవించాక బుద్ధివచ్చి శుభ్రంగా వుంటాడు. వీడి శిక్ష వూరిలో కొంత సంచలనాన్ని కలిగించి త్రాగుడు మానిపిస్తుంది. తను మంచిపనే చేశానని సగర్వంగా యింటికి వచ్చాడు.

సన్యాసి కోర్టులో తన గాథను మళ్లా కన్నీటితో విన్నవించుకున్నాడు. తన కడుపుమండినా వుండగలనని, తన గొడ్డు, గేదె, ఆవు, కోడి అన్నీ యేమైపోతాయో, వాటి సుఖం చూసైనా యీసారికి కనికరించమని ప్రార్థించాడు. మేజస్ట్రేటు మూడు నెలలు కఠినశిక్ష చెప్పేటప్పుడు బొలబొలా యేడ్చాడు.

సుబ్బారావు నెలరోజులు పోయాక మళ్ళీ స్వగ్రామం వెళ్లాడు. ఇరుగు పొరుగు వాళ్ళవలన అసలు విషయం తెలుసుకొని ఆరాత్రి యెనిమిదిగంటలప్పుడే వూరిలోనికి వెళ్లాడు. ఈసారి సారాకొట్టు ఒక పెంకుటిల్లు. కొంతదూరంలో అలా నిల్చొనే, యింత బాహాటంగా స్వేచ్ఛా వ్యాపారంలా సాగుతూ వుంటే వూర్లో మునసబు యేంచేస్తున్నాడు, గవర్నమెంటు పెట్టిన యీ సిబ్బంది యేంచేస్తోందన్న ఆలోచనతో కాళ్లు కదపలేక పోయాడు. అప్పుడే యిద్దరు మాటలతో ఆ వరండామీదే యుద్ధానికి దిగారు.

"సూడరా అప్పిగా! అరువా నేదు. కరీదా లావు—ఈగ వుర్నుమెంటోలు ఆ సన్నాసిగాడి సైసెన్సు తీసి యీడికిచ్చినారు. డబ్బు యెక్కువేసుకొని—ఛీ—కంపురా సరుకు!"

రెండోవాడు వాడి వీపుమీద చరచి "చస్! యెదవకానా! అబద్ధం సెప్పిన నాలిక కోసెత్తాను. గవుర్నుమెంటోలకి డబ్బు యెక్కువై పోనాదని సైసెన్సు నేకండా అమ్ముకోవచ్చంటే!"

అంతవరకు పళ్లు పటపట కొరుకుచున్న మొదటివాడు ఒక్కసారి మీదికి వురికి "నీకా—గోసుంటే గుండారు నేదు. గుండారుంటే గోసి నేదు. నివ్వు నాకంటావురా? గవుర్నుమెంటోలికి డబ్బునేదని కొంపెంత పన్ను లేస్తారని నాయుడోలింటి కాడ అచ్చుకాగితంమీద రాసింది సదివి సెప్పితే!—ఆకాసంమీద బూకాసం—ఇలాగ అలాగ—"

యిలాగ...ఇద్దరూ, యిక అరచుకుంటూ ముష్టియుద్ధానికి దిగారు. కొట్టులోనుంచి యిద్దరు వచ్చి యిద్దర్ని రెండువేపుల పంపించి వేశారు. ఆ వచ్చిన యిద్దరి కరుకు ముఖాలు చూసి తిన్నగా మునసబు యింటికి వెళ్లాడు. ఇటువంటి వేళకాని వేళలో రావటం చూసి మునసబు ఆత్మీయతతో అతి వినయంతో గౌరవిస్తోంటే సుబ్బారావు వుద్రేకం ఆపుకోలేక గ్రామపెద్దవైయుండి యీపని జరుగుతుంటుంటే చాతకాని వాడిలా మెసలుతావని అనుకోలేదు. ఈ పనికి సరియైన సంజాయిషీ చెప్పకపోతే అసలుకే మోసంరాగలదని గద్దించాడు. మునసబు మనసులో మండిపడ్డా విధిలేక నెమ్మదిగానే అన్నాడు "ఊరిలో బ్రతకమంటారా? ఊరందరికీ చెడ్డకాకండా వుండాలంటే నేను మూగివాడిని, గుడ్డివాడినై వుండవలసిందే!"

"ఎందుకొచ్చిన సంజాయిషీలు!"

"మీరు అలా అంటేనే చెప్పేదున్నది యేమీ లేదండీ. పెద్దరైతుకు ఒక సీసా నిండుగా లేకపోతే నిద్దరపట్టదు. ఊరిపెద్దలన్న వాళ్లకి డబ్బు ఖర్చుకాకండా అవసరం గడచిపోవాలి. నన్నేం చెయ్యమంటారు? వాళ్ల నిజాయితీలు..."

"వాళ్ల నిజాయితీలు నాకెందుకు? నీ నిజాయితీ చూపించు"

"మీకు తెలీదాఅండీ! వందకాకుల్లో ఒక హంస హంసలా మెసలడానికి యెంత కష్టపడాలో. వాళ్ళ పాపానికి వాళ్ళే పోతారని అరవకండా వూరుకున్నాను. నేనేమన్నా అంటే యింటికి నిప్పంటించి మరీ వూరినుంచి తగిలేస్తారు"

మునసబు ముఖంలోనికి చూడటానికి అసహ్యపడి సుబ్బారావు వస్తానని చెప్పకండానే చరచరా వెళ్లిపోయాడు. ఇంట్లోకి వెళ్లిన మునసబును చూసి భార్య యీ గొడవంతా యేమిటంది. ఇంతవరకు అణగారిన నిప్పులాంటి కోపం రాజుకపోయింది. మండిపోతూ "వాడికేం? ఇటు యీ ముసలాళ్లు పింఛనీతో బ్రతుకుతున్నారు. అటు ఒక్కడే కొడుకు—ఎన్ని నీతికబుర్లైనా ఆడతాడు. నాలా అయిదుగురి పిల్లలతో యీ యిరవైరాళ్లతోనూ సంసారం చెయ్యమను— తెలిసొస్తుంది. ఇచ్చేది యేగానీగానీ—అబ్బబ్బ అందరూ మొగుళ్లేనే!"

సుబ్బారావు ఆ మరుసటిరోజు వుదయం మొదటి బస్సుకే పట్నం వెళ్లిపోయాడు. మళ్లీప్రొహిబిషన్ యిన్‌స్పెక్టరుని కలుసుకొని ఆయింటి సరిహద్దులిచ్చాడు. ఇందులో గ్రామమునసబుకు పెద్దలకు కూడా భాగముందని చెప్పాడు. వాళ్ళనుకూడా పట్టుకొనే ప్రయత్నం చెయ్యాలని పట్టుబట్టి చెప్పాడు. ఇన్‌స్పెక్టర్ "మీరింత నొక్కి చెప్పాలటండీ? మా డ్యూటీమాది. మీరింత సహాయం చేస్తున్నందుకు మా అందరి కృతజ్ఞత!"

ఈ సాదరమైన వాక్యాలు సంతోషంగా స్వీకరించి మూడోరోజు వుదయమే మళ్ళీ యినస్పెక్టరును కలుసుకున్నాడు. సుబ్బారావును చూడగానే ముఖం ముడుచుకుంటూ "ఏమండీ! తప్పుడు రిపోర్టు లెందుకిస్తారు? సరిగ్గా తెలియకపోతే వూరుకుంటే మంచిదిగా—అనవసరంగా మాకాలం వృధా అయ్యింది."

సుబ్బారావు నోటివెంబడి మాటరాడానికి కొంత వ్యవధి పట్టింది. "నే చెప్పిన యింటికే వెళ్లారా?"

"ఆ ఒక్క యిల్లేకాదు. ఊరియిళ్లన్నీ గాలించేశాం! సన్యాసితోనే అప్పుల్లో ఆ వ్యాపారం అంతరించి పోయిందట."

సుబ్బారావు వుద్రేకంతో అరచాడు "కాదు కాదు. ఈ కొట్లు యిదివరలా వూరిబయట పాకల్లో లేవు. ఇప్పుడు వూరిమధ్యను పెంకుటిళ్లలోనూ, మేడల్లోనూకూడా వుంటున్నాయ్. ఈ అవినీతిని మీరు అరికట్టాలి. అరికట్టితీరాలి!"

ఇన్‌స్పెక్టరు ప్రశాంతంగా "మా పనేఅది. దానికోసం ప్రజా సహకారం కావాలి. ఊరంతా ఒక్క గొంతుకతో చెప్పేటప్పుడు మేము మనుష్యులమేనా?—నమ్మాలంటారా? నిదర్శనంగా మాకేం దొరకలేదు కూడానూ!"

సుబ్బారావు ఒళ్ళంతా నిజంతో వుబ్బి యీఅబద్ధాన్ని యెదుర్కోడానికి యెగురుతోంది. అన్నాడు. "ఎల్లుండి రాత్రికి మీతో వస్తాను. పదండి. ఊరిపెద్దలనే పేరుతో యిదంతా సాగిస్తున్న రాక్షసులకు భయపడి నిజం లేదని చాలామంది చెప్పివుంటారు. రండి. నేనూ వస్తాను. అప్పుడు నా మాట నిజమో అబద్ధమో మీకే తెలుస్తుంది"

ఇన్‌స్పెక్టరు సరేనన్నాడు. ఇలా వెళ్తున్నామన్న విషయం పైకి పొక్కకుండా చూసే బాధ్యతను గుర్తించారను కుంటాను అంటూనే నాలుగడుగులు సాగనంపాడు.

ఆ వేళకు యెల్లుండిరాత్రి యీ వేళరాత్రి అయ్యింది. సుబ్బారావు వుత్సాహంతో బయలుదేరాడు. ఊరిలోనికి వెళ్ళేసరికి యెక్కడైతే కొట్టు వుండేదో ఆ కొట్టు అరుగుమీద హరిదాసు కమ్మగా రాగంతీస్తూ గెంతులు వేస్తున్నాడు. ఊరిలో చిన్నా పెద్దా శ్రద్ధతో వింటున్నారు.

ఇన్‌స్పెక్టరు వుద్యోగ గర్వాన్ని చూపిస్తూ "చూపించండి యెక్కడో!"

సుబ్బారావు ఒళ్ళంతా మండిపోతోంది. ప్రతి

ఒక్క కణాన్ని యీమారే మనుష్యజాతి సూదుల్తో పొడుస్తోంది. ఎందరి బ్రతుకులనో కూలద్రోసే కార్యాలయమైన ఆ యింటివేపు, త్రాగుబోతులు కొట్లాడిన అరుగుమీద దేవుని స్మరిస్తూ గెంతుతున్న త్రాగుబోతైన హరిదాసుని, నిజాన్ని నిలపలేని ఆ ప్రజా సమూహంవేపు నిశ్చేష్టుడై చూస్తున్నాడు. మళ్లీ యిన్‌స్పెక్టరు మాపించమని గద్దించాడు.

సుబ్బారావు కంటిరెప్పలు మూత పడలేదు. మెడకు చుట్టిన మఫ్లర్‌తో కళ్లు కప్పుకోగానే యిన్‌స్పెక్టరు కాస్త కటుస్వరంతో అన్నాడు "ఇలాంటి తప్పుడు రిపోర్టులిచ్చి దేశాన్ని వుద్ధరించకండి. మమ్మల్ని శ్రమ పెట్టకండి. అవసరమైతే మీ చర్య గురించి తహశీల్దారుకు రిపోర్టు చెయ్యవలసి వుంటుంది." అంటూ వెళ్లిపోతుంటే సుబ్బారావు ప్రేవుల్లో, రక్తంలో, నాడుల్లో కుమిలి కుమిలి యేడుస్తూనే పైకి బావురుమని యేడవలేక వికటాట్టహాసం చేసుకుంటూ యింటివేపు నడిచాడు.

నడుస్తున్నాడు. నడవలేక పోతున్నాడు. కెరటాలలాంటి ఆలోచనలు అఘాతంలో పడి స్తబ్ధమైనయ్. ఇంటి అరుగుమీద కూర్చున్నాడు. ఎదురుగుండా పెద్ద భూతంలా మర్రిచెట్టువుంది. చలి వణికిస్తోంది. ఐనా పాషాణంలా అలానే కదలకుండా వున్నాడు. దగ్గుతూ నిద్రపోలేని తండ్రి కిటికీగుండా చూసి "యెవరది" అన్నాడు. కొడుకు నోరు పెగల్లేదు. ఒక్కసారి తండ్రి "దొంగ దొంగ" అని అరవటంతో నోరు ఆవులించేశాడు. ఏమిటీ ప్రపంచం యిలా మారిపోతోందీ? మనుషుల నిజాయితీలు, మన స్థైర్యాలు యంత్రాల్లానే అరిగి పోతున్నయా?

నేనే అంటూ లేచి వెళ్లాడు. ముసలాయన కోపం ఆతృత రెండూ ప్రదర్శించాడు. కారణం చెప్తే ఆయన తేలిగ్గా అన్నారు "నువ్వెందుకు అనవసరంగా చెడ్డకావటం. మా రోజుల్లో యిన్ని శాసనాలూ లేవు—యీ కంట్రోళ్ళూ లేవు. ఇలా మనుషులు హీనస్థితికి రాలేదు. శాసనాలు యెక్కువై న్యాయంకంటే కట్టుబాట్లు హెచ్చయ్యాయన్నమాట! అవి తట్టుకోలేకే శాసన ధిక్కారాలు హెచ్చుగా జరుగుతుంటాయ్. అందులో ప్రజల మనస్సులను తెలుసుకోకుండా చేసిన శాసనాలగతి యిలానే వుంటుంది!"

సుబ్బారావు చాప, తలగడ పట్టుకొని యీ మాటలను లక్ష్యం చెయ్యకుండానే అరుగుమీదకు వచ్చాడు. తండ్రి యెముకలు విరిగే చలి బయట వద్దంటున్నా వినక ప్రక్క వేశాడు. అంతకంటే కఠోరమైన బాధ తను యింకా అనుభవిస్తూనేవున్నాడు. ప్రక్కమీద వ్రాలాక ఆలోచనలో పడ్డాడు. ఒక్కొక్క వ్యక్తి, విషయం మెదడులో చుట్టుక పోతోంది. ఇది ప్రపంచ పరిణామమా? బ్రతకడానికి అన్యాయం చేస్తేగానీ కూడు దొరకదా! మనిషి ఆశతో బ్రతికి సంతృప్తితో చావలేడా? ఈ దురాశతో న్యాయాన్యాయ విచక్షణ లేక మానవత్వాన్ని మరచి సంచరించటమేనా జీవితం? మనిషి, పెట్రోలు త్రాగిన బస్సులా, బొగ్గుతిన్న రైలు యింజనులా పరిస్థితుల డ్రైవరు చెప్పుచేతల్లో వుండవలసిందేనా? —చివరకు యెవరెలా పోనీ తను నిజాయితీగానున్నాననే తృప్తిగర్వంతోనే నిద్రపోయాడు.

ఆ మరుచటిరోజు వుదయం వెళ్లిపోయేముందు ఆ యింటివేపు యింకొకసారి చూశాడు. అవినీతికి ఆలవాలమైన యీ గ్రామంవేపు తను కన్నెత్తి చూడకూడదనుకున్నాడు. కానీ యీ పంతం తనలో రేకెత్తించిన పౌరుషంకన్నా హెచ్చయిన సంబంధం తనను మళ్లా రెండు నెలలో రానిచ్చింది. తండ్రికి జబ్బుచేసింది. కబుర్లమీద కబుర్లు రాగా వచ్చాడు. ఆతృత పడవలసిందేమీ లేదు. రేపు వెళ్లి పోతాడనగా సన్యాసి జైలుశిక్ష అనుభవించి వచ్చాడు.

ప్రొద్దు అప్పుడే క్రుంగుతోంది. సుబ్బారావు వీధి అరుగుమీద కూర్చొని దూరంగావున్న పచ్చని పెసరచేనుతో నిండిన పొలాలవేపు చూస్తున్నాడు. సన్యాసి మెల్లగా వస్తూనే నమస్కరించాడు.

"ఏమోయ్? ఎలావుంది—ఇప్పుడైనా—!"

సన్యాసి గోక్కుపోయిన ముఖంలో లోతుకు పోయిన కళ్ళు నిలబెట్టి "ఏవుందిబాబో! అక్కడ వున్నాను ఆలుతిండికి నోటు సెయ్యనేదు. నానక్కడ నా మనసిక్కడ. ఇయన్నీ కలలోకి వస్తావుంటే—ఆటిమీద దేనంతోటే యెండిపోనాను బాబూ. అబ్బా అమ్మా, ఆటికి యెవురు గతిబాబూ?"

"కూర్చోవోయ్" అన్నాడు సుబ్బారావు.

సన్యాసి కూర్చుంటూనే "నా పిల్లమ్మ యెల కల్ని పట్టాదిగానీ దొంగల్ని పట్టాదాబాబూ? గుమ్మడికాయలు దొంగలాడేసి యిల్లంతా కుమ్మేసినారు. వర్షాలకి యిల్లు సామాను అంతా తడిసి యెందుకూ పనికిరానేదు. గుమ్మడికాయలు దొంగలాడిన ఆలకి పెద్దరోగం రాదా? ఒక్కటే నేదు. ఎదుగతున్న నా కోడి పిల్లల్ని, పుంజునీ సంపేసి మెక్కేసినారుబాబో! ఆల కడుపుల్లో రాసపుల్లు పుట్టవా? అల్లా తవిటిగాగు ఆవుపాలంతా తాగేసి పాలే యియ్యనేదనేస్తున్నాడు. గేద, గొడ్డె అన్నీ యెండిపోనాయి. పెద్ద రైతుదగ్గిరనుంచీ వూరు సగం నాదగ్గర సారాకి అరువెట్టినోలే డబ్బడిగితే యిప్పుడెక్కడున్నాది—వూరొదిలి పారిపోతావా? ఇస్తాం నేరా అంటున్నారు. నా కస్టానికి నేకపోయింది సుకమప్పుడెందుకుబాబూ? ఇదంతా కానుకోనేకపోనాను. నీ కొచ్చిన బయం నేదని మునసబు సెప్పబట్టి అలా గమ్మనాను. ఆ పొద్దుటిరోజున సాటుగా అమ్మితే పోను. నావుసురూ, నన్ను నమ్మికోనున్న నోరులేని ఆ పచ్చుల వుసురూ ఆ పద్దుకు మాలినోడు పోసుకున్నాడు. నావొచ్చినానని అవి కడుపునింపేతాయికదా అని కళ్లిప్పి సూస్తున్నాయి. ఇప్పుడేం సేస్తును బాబో? సెసర తీతలదాకా పుర్లో కూతే పుట్టదు. మా పెద్దలు సచ్చి సర్గాన వున్నారుగానీ యెంచెంచి పేరెట్టారు బాబో—నాను సన్నాసినే"

ఈ మాటలు వ్రాల్చుతూ సన్యాసి మాసిన చిరికిగుడ్డతో కళ్లు ఒత్తుకుంటున్నాడు. పారిపోతున్న చలి వుండివుండి చిన్న విసురు విసురుతోంది. సుబ్బారావు మనసు కరిగినా గర్వం పాలు తగ్గలేదు. వీడినైనా ఒక మనిషిని చెయ్యగలిగాననే తృప్తితో "ఇకనైనా నీకష్టంమీద బ్రతకడం నేర్చుకో. ఈ రెండు రూపాయలూ అందాక గంజి కాచుకొని త్రాగు" అంటూనే యిచ్చాడు. సన్యాసి కళ్ళు కద్దుకుంటూ "అంతే సేనబాబూ! సుండున్న బాబులు-మీ ఋణం యెలాగ తీరుస్తానో!" దండం పెట్టూనే కదలిపోయాడు.

వసంతఋతువు ప్రారంభంలో ఆఫీసుకు శెలవు పెట్టవలసి వచ్చింది. శెలవు పెట్టడమంటే తనకు బాధగానే వుంటుంది. ఒకరోజు కాజూయలు లీవు తీసుకోని సంవత్సరాలున్నాయి. శెలవు హక్కు కన్నా అవసరం దృష్టిలో చూసేమనిషి కాబట్టి భార్య జ్వరంతో మూలుగుతున్నా లెఖ్ఖ చెయ్యక ఆఫీసుకు వెళిపోయేవాడు. ఏమీ కాదనుకున్న జ్వరం ముదిరిపోయింది. దానితోపాటు స్వయంపాకం—ఈ చిరాకువలన ఆవూర్లో పేరున్న పెద్ద డాక్టరునే పెట్టాడు. నాలుగురోజుల్లో నయమయితే యీ బెడదలన్నీ పోతయ్యనుకుంటే యిరవైరోజుల వరకూ యీడ్చింది. డాక్టరు యాభై రూపాయలకు బిల్లు పంపించాడు. నిల్చున్నపాటున ఆబిల్లు పట్టుకొని పరుగెత్తాడు. ఎన్నోవిధాలుగా చెప్పాడు కానీ డాక్టరు తక్కువకే పంపించానని వాదించాడు. అందామనుకున్న నాలుగుమాటలు గట్టిగానే విసరి తిన్నగా యింటికి వచ్చాడు. చిరాకుగా "ఆ గాజులుతే!" అన్నాడు. భార్య మాటాడకుండా తీసి టేబిలుమీద పెట్టింది. తను యీ సర్వీసులో గడించిందనుకున్నది యీ నాటితోసరి!

వేసవి సెలవుల్లో మనుమణ్ణి పంపించమని తాత కబురుపెట్టాడు. సుబ్బారావు ఆవూరు కొడుకును పంపించడానికి ఒప్పుకోలేదు. కుర్రవాడు శెలవుల్లో వాడి చిత్తం వచ్చినట్లు తిరగటం, ఆపటం చేసేవాడు. రాత్రుళ్లు జ్వరం వస్తున్నా యింట్లో తల్లితో చెప్పకండా మొండికెత్తి తిరిగాడు. ఐదోరోజు రాత్రి జ్వరం తీవ్రంగావుంది. ఆఫీసులో ఆ వేళ లైట్లు వెలిగించి మరీ పనిచేసి వచ్చిన సుబ్బారావు రాగానే డాక్టరును తీసుకరమ్మని భార్య చెప్పింది. అక్కర్లేదు అదే పోతుందన్నాడు. జ్వరంవల్ల పొందే బాధను తను వూహించలేదు. మొన్న భార్యకు జ్వరం వచ్చినప్పుడు తప్పించి యిదివరకు తను డాక్టరుముఖం చూడలేదు. డాక్టర్లంటే మానవత్వంలేని మనుషులనే తనకున్న యీర్ష్యను భార్య జబ్బులో మాటలతో వ్యక్తపరిచాడు కూడాను.

మరి రెండురోజుల హూనం జ్వరం తీవ్రతకు మార్చింది. సుభ్బారావు ఒక ఆయుర్వేద వైద్యుణ్ణి తీసుక వచ్చాడు. కావాలన్నవి యింట్లో తెచ్చి వెయ్యటం తప్పించి యీ జ్వరం విషయం అట్టే పట్టింపు చేసుకోలేదు. ఆఫీసుకు మామూలుగానే వెళ్తున్నాడు. ఆ నాలుగురోజులు జ్వరం తగ్గుముఖం పట్టలేదు, భార్య చప్పున కన్నీరు చాటుగా కారుస్తూ గొణిగింది విషజ్వరమట అని. హా అన్నాడొక్కసారి. విషజ్వరంతో చచ్చిపోయిన వారెంద

రినో చూశాడు. మళ్లీ అక్కడనుంచి కదలి వాలు కుర్చీమీద కూర్చున్నాడు. హరికేన్‌లాంతరు మసగ్గా వెలుగుతోంది. కొడుకు మూలుగు వింటున్నకొద్దీ స్వరం హెచ్చుతున్నట్లు రానురాను సన్యాసి పెట్టిన శాపాలు చెవులు చిల్లులు పేలినట్లు మారుమ్రోగాయ్. భార్య లిగవాల కొడుకు పడిపోవటంచూస్తే యిది నిజమేమో? మళ్ళీ చాధా అంతా పిచ్చి అనుకున్నాడు.

భార్య మెల్లిగా దగ్గరగా వచ్చింది. తనమార్పు ఆమెకు చూపించ కూడదని లేచి నిల్చుంటి "అణగి పోతుంది. గాబరా పడక్కర్లేదు" అన్నాడు.

"ఈ మందులవల్ల యేమీ గుణం కనపడలేదు." కాస్సేపాగి "ఆ డాక్టరుని తీసుకవస్తే!"

భర్తముఖం కోపంతో ముడుచుకపోయింది. "వాడా—వాడా? వాణ్ని యేమనాలో తోచ లేదే!"

"మన అవసరం. ఇలాంటిజబ్బులు ఆయన చాలా బాగు చేశాడని ఇరుగుపొరుగువాళ్లు చెప్తున్నారు."

సుబ్బారావు తల ఊపిస్తూనే చప్పున ఆపివేశాడు. మారుతున్న మనస్సును మళ్ళీ వెనుకకులాగి "ఈ డాక్టరూ యెన్నో యిలాంటి జబ్బులు బాగుచేశాడులే!"

ఆరాత్రి భార్యతోపాటు తనూ నిద్రపోలేదు. ఈ పరిస్థితినిజ్ఞాచి అప్పటి కప్పుడే అల్లల్లాడి మళ్ళీ ధైర్యంతో యెందుకొచ్చిందో రానీ నే చూస్తా నంటూ ధైర్యంతో ప్రమాదాలను నొక్కిపట్టేవాడు. ఇలా తన నిజాయితీని సమర్థించుకోడానికి యిదివర కెప్పుడూ ప్రయత్నించలేదు.

తెల్లవారేక డాక్టరు వచ్చేటప్పుడు తను అత్మ తను వెళ్ళబుచ్చ కూడదని అనుకున్నా ఆయనవెంట కొంతదూరం వెళ్ళకండా వుండలేక పోయాడు. "విషజ్వరమైనా అప్పుడే ఆతృత పడక్కర్లేదని." డాక్టరన్నాడు. ఆ నిముషంలో తృప్తి. వెనుతిరిగి వస్తుంటే ఆ మాటలే అనుకుంటుంటే వేరు అర్థాన్ని స్ఫురింపజేశాయ్. ఇంటికి రాకండా తహశీల్దారు యింటికి వెళ్లాడు. ఆయన యీ డాక్టరుతో లాభం లేదని కాస్త డబ్బు గుంజినా తనే డాక్టరు దగ్గరకు వెళ్ళ నమకున్నాడో ఆ డాక్టరునే తీసుక వెళ్ళమని చెప్తూనే అన్నాడు "అయినా నీకెందరున్నారోయ్. ఆ ఒక్కడి ప్రాణంకోసం నీప్రాణాలైనా అడ్డు పెట్టావుగా!"

ఈమాటలు మళ్ళీమళ్ళీ మనస్సులో తిరిగిపోతుం డగా యిదివరకు తనెప్పుడూ యీ కొడుకు యింత సమస్య తెచ్చిపెట్టాడని అనుకోలేదు. అయితే మహా పోతేపోతాడుగా—మళ్ళీ వెంటనే తండ్రి అనుకో వలసినమాటలేనాయివి? తనతండ్రి తననిలా చూడ లేదే! ఐనా తనపట్టుదలతో ఒకప్రాణాన్ని ఖూనీ చెయ్యటమా? వాడియింటికి వెళ్ళలేక యింటికి వస్తే సరి? యిరుగుపొరుగువాళ్లు మనిషోమాట అంటు న్నారు. భార్య కన్నీటితో యేదో మెల్లగా చెప్తోంది. పొరుగమ్మ "పోనీ మాఆయనను పంపించి ఆ డాక్టరుని తెప్పిస్తానులేఅమ్మా" అని అంటూనే సుబ్బారావును చూచి పెరటకు వెళిపోయింది.

ఇంట్లో నిశ్శబ్దంగావుంది. కుర్చీమీద కూర్చొని యింటికప్పు వేపుచూస్తున్నాడు. డాక్టరు, తహశీ ల్దారు, పొరుగావిడ అందరూ అన్నమాట వొక్క సారిగా మెదడులో ములుకుల్లా పొడుస్తున్నాయ్. తనా డాక్టరుదగ్గరకు యెందుకువెళ్ళకూడదు? నిజా నికి తనకు యీ కొడుకున్నా యింకెవరున్నారు? లేచి భార్యవేపు చూశాడు. మొదటినుంచీ భయ భక్తులతో మెసలిన ఆమె తనను బలవంతంచెయ్యా లేక, ఆ బాధను యెంతకష్టంమీద అనుభవిస్తోంది!.

నడుస్తూనే...తనెందుకువెళ్ళాలి? ఇంకెవరినైనా పంపిస్తే అలాఅయితే యెలానూ నాయిల్లని తెలుసు కుంటాడుగా! ఒకర్ని పంపించి తను లోకువగా మెసలేకంటే తనే వెళ్ళటంమంచిది. పోనీ వూళ్లో యింకొక డాక్టరును పెట్టే! నాలుగడుగులు వేసాక— కొడుకు వీడిచేతిలో యేమైనా అయిపోతే మళ్ళీ చచ్చేకాలంవరకూ తప్పుచేశానని బాధపడాలి. అందరుఅన్న డాక్టరును పెట్టె నలుగురన్నమాట నిజం కాకూడదూ? చివరకు ఆ డాక్టరుదగ్గరకు వెళ్ళ టానికే నిశ్చయించుకున్నాడు. నడుస్తూ "వాడిని అలా తిట్టానుగద్దా—వస్తాడా? వచ్చినా నా కొడు కునుకోరి చంపడుకదా! ఆ డాక్టరుదగ్గరకు యెందుకు వెళ్లాలి?" ఆగిపోయాడు. "మనిషిని చూస్తూచూస్తూ చేతనైన వాడెలా చంపేస్తాడు! అందులో వృత్తి

పెట్టుకున్న మనిషి — పేరు ప్రతిష్ఠలకు పాటు పడడూ ?"

వెళ్ళినవెంటనే డాక్టరు బయలుదేరివచ్చాడు. పుత్రుడిని పరీక్ష చేసి "మరేం భయంలేదు. మీరు నాతోరండి" అంటూ బయటకు తీసుకువెళ్ళి "నాలుగురోజుల క్రితమైతే నేనేమైనా చెప్పగలిగే వాణ్ణి. ఈ వేళకి పుత్రుడిపరిస్థితియేమీ బాగులేదు. మీరు ఆదుకోగలిగితే 'క్లోరోమేసిన్' అని క్రొత్త మందువచ్చింది. దానియందు నాకు నమ్మకంవుంది. ఇకమీయిష్టం"

సుబ్బారావు తన అశ్రద్ధకు విసుక్కుంటూ నే డాక్టరుని ఆగమని గాజులమ్మగా అవసరానికని దాచిన అరవైరూపాయలు తీసుకవచ్చి చేతపెట్టాడు. పెట్టినతరవాత ఒకక్షణం అరవైరూపాయలే అను కున్నాడు. మరుక్షణంలోనే యిది అంత యెక్కువ కాదనుకుంటూ డాక్టరుప్రక్కన కారులో కూర్చు న్నాడు.

మూడురోజులు గడిచాయి. ఈలోగా యింట్లో వున్న కానీ పరకపుత్రవాడిక్రింద ఖర్చయింది. మందుకొనడానికి మళ్ళీడబ్బు అవసరంవచ్చింది. ఇక అమ్మాలంటే యింట్లో పాత్రసామానులే వున్నయ్. అవైనా అవసరానికిమించి హెచ్చుగా లేవు. ఒకరికి యిదివరకు తను అప్పు యివ్వలేదు. తను పుచ్చుకోనూలేదు. ఒకరికి అప్పు యివ్వడమంటే వాడిని పాడుచేస్తున్నామనే వూహలోవుండేవాడు. తనువచ్చే జీతపురాళ్ళమీదే నిశ్చింతగా బ్రతికాడు. రెండుమూడు గంటలు విసుక్కుంటూ యేమీతోచక కూర్చున్నాడు. తను డబ్బిస్తేనేగానీ యింజక్షను లేదు. తోటిసమస్తాల జీవితం తెలుసు, ఈ మాత్రానికి, ఆమాత్రానికి కక్కుర్తి పడ్డవాళ్ళతో యిదివరకు కయ్యం తెచ్చుకునే వున్నాడు. తహశీల్దా రుని అడుగుదామని వెళ్ళాడు. వెళ్తూనే పెద్దవాళ్ళ దగ్గర అప్పుచేసి తన ఆత్మను కొల్చుకుంటున్నానని అనుకున్నాడు. ఆయన వూర్లోలేరు. ఉన్నా యేమాత్రంయిస్తారు. అతనూ తనలాంటి మనిషే. అవ సరం ఆలోచనలని రేకెత్తించింది. మౌనంగా కూర్చుండిపోదామన్నా మనస్సు చంచలమౌతోంది. లేచాడు. తను యెవరిదగ్గరకు వస్తేలేదనరనేవి శ్వాసంవుందో ఆ వర్తకునిదగ్గరకువెళ్ళాడు. "ప్రొద్దున్న వస్తే నూరుకాదు రెండువందలిచ్చేవాణ్ణి, గంట క్రితమే ఐదువేలు ఒకడిదగ్గర చేబదులు పుచ్చు కున్నది యిచ్చేశాను" అన్నాడు. సుబ్బారావు యీ జవాబునిని ఆమనిషి వ్రేళ్ళన్నిటికీవున్న వుంగ రాలవేపు, చేతికున్న వాచీ గొలుసువేపుచూసి మన స్సులో నటకారించుకుంటూ, యిలాంటివాళ్ళతో మళ్ళీ మాటాడకూడదని వస్తుంటే పీకెడు బంగారం మెడలో వేసుకున్న శెట్టిభార్య యెదురైంది.

ఇదీ ప్రపంచం ! మనసులో మూలుగుకున్నాడు. ముందురోజునే తండ్రిదగ్గరకు కబురుపంపించాడు యెవరిదగ్గరనైనా నూరురూపాయలు బదులుతీసుకొని పంపమని. ఆయనైనా వచ్చుంటే బాగుండేదని అను కున్నాడంటానికి అవకాశంలేదనికూడా స్ఫురి స్తోంది. ఇంటికితిరిగివచ్చేసాడు. ఇంకెవరినీ అను అడిగి లేదనిపించుకోకూడదని అనుకున్నా మళ్ళీ జేజా రెత్తినమనసు మూడుచోట్లకు పరుగెత్తనిచ్చింది. ఏదో ఒకసంజాయిషీ, గంభీర్యస్తిపడిచే విధానం చూపించినా, సాయంత్రం కావస్తున్నా డబ్బు చేజిక్కలేదు. అందరూ తన నేదో సానుభూతి మాట లతో చూపిస్తున్నా, అనుమానంగా తన వేపు చూస్తు న్నట్లనిపించింది. ఇదేమిటి వీళ్ళ మనస్సులన్నీ పాషాణాలుగా మారిపోయాయా ? మళ్ళీ యింటికి వచ్చాడు. తన చేతకానితనం భార్యకు తెలియకూడ దనే పట్టుదలమాత్రం అలా చెక్కు చెదరకుండానే వుంది. డాక్టరు యింకారాలేదేమని ఆమె అడిగిన ప్రశ్నకు గంభీరంగానే "వస్తానని" చెప్పాడేగానీ మళ్ళీ మెత్తబడిపోయి తనేదోయిదివరలా యిప్పుడూ ఆలస్యంచేసి యేదోముప్పు తెస్తున్నానని గబగబ బయటకు నడిచాడు.

నడుస్తున్నాడు. ఉండి వుండి ఆగిపోతు న్నాడు. నాలుగడుగులు వెనుకకు వేసి మళ్ళీ యేదో గొణుక్కుంటూ ముందుకు పోతున్నాడు. ఇలాంటి స్థితిలో తన నెవరో "దండం బాబూ" అన్నట్లు విని పించింది తలెత్తకుండానే జవాబు చెప్పకుండానే ముందుకు నడిచాడు. నాలుగడుగులు వేశాక వెను తిరిగి చూశాడు—సన్యాసి వడిగా నడిచిపోతు న్నాడు. పిలిచి మానాన్న యేమైనా చెప్పాడా అని అడిగాడు. "నాను పట్నం అరజంటు పనిమీద వొచ్చి నాను బాబూ. వచ్చిన ముందు ఆ బాబుతో సెప్ప నేదు !"

"సరేలే!" అంటూనే ముందుకు సాగిపోయాడు. తిన్నగా డాక్టరు దగ్గరకు వెళ్ళాడు. అంతవరకూ చూసిచూసి అప్పుడే యెక్కడకో వెళ్లాడని తెలిసింది. మాడిపోయిన ముఖం దించి అలానే కూర్చున్నాడు. కొడుకు మనసును మహాసముద్రం చేస్తున్నాడు. శరీరమంతా నీరుగుమంటోంది. తన నెవరో బలవంతాన జైలుకు తీసుక వచ్చినట్లుంది. ఈ జైలునుంచి యెప్పుడు కదిలి కొడుకు దగ్గరకు వెళ్తానని ఆతృత పడ్తున్నాడు. దీపాలు వెలిగించాక డాక్టరు వస్తూనే "సుబ్రావ్ జేమైనా నా తప్పేమీ లేదండీ" అన్నాడు. ఏదో అందామన్నా నోరు పెగల్లేదు. నలుగురిముఖ్యా డబ్బులేదు. మీరేదో సహాయం చెయ్యండి తరువాత యిచ్చుకుంటానని చెప్పలేకపోయాడు. తను వృథా చేసిన నిముషమే తన కొడుకు చావుకు కారణమౌతుందన్న భయంతో బ్రతిమాలాడు. నా ఒక్కగాని ఒక్క కొడుకుని నిలబెట్టండి. మీ డబ్బు తరవాత తీర్చుకుంటానని కోరాడు. ఈ నాలుగు మాటలైనా అతి కష్టంమీద పలదించుకొని అన్నాడు. మామూలు మనిషి చలించి కనికరించడానికైనా సరిపడని మాటలివి. అందులో ఈ డాక్టరు యెందరి దీనాతి దీనాలాపాలు విన్నాడో? చాలా తేలిగ్గా అనేశాడు "నే చెయ్యగలిగిన సహాయం చేశాను. ఫీజు వెంటనే చార్జి చెయ్యకండామందులే మిమ్మల్ని కొనుక్కోమని చెప్తున్నానుగా?"

సుబ్బారావు మాటాడలేదు. ఆ నిముషంలో మళ్ళీ మనస్సు అమావాస్య నాటి మహా సముద్రంలా హోరుమంటోంది. మనస్సులో ఆత్మాభిమానం, పితృవాత్సల్యం ముష్టియుద్ధం చేసి మహాబాధ పెట్టున్నాయ్. వణుకుతూనే అన్నాడు "మీరు కొద్దిగా దయ చూపండి. ప్రావిడెంట్ ఫండులో అప్పు పెట్టి మీ ఋణం తీర్చుకుంటాను!"

డాక్టరు హేళనగా చూస్తూ "చూడండి— ఎక్కడో చూపెండి. డాక్టర్లు షావుకార్లు కాలేరుగా! అయినా మీకేమండీ?—తాలూకాఫీసు గుమస్తాలు?"

సుబ్బారావు డాక్టరుకు ఘడీమని చెంపపెట్టు పెడదామన్న వుద్రేకం వచ్చింది. కానీ లేచిన కుడిచేతి చూపుడు వ్రేలిని నోట్లో పెట్టి గట్టిగా కఱచిపట్టుకొని రొప్పుకుంటూ మెట్లు దిగిపోయాడు. నోటి నుంచి బయటపడ్డ చేయి తనజుస్తూనే గట్టిగా పీకింది!

ఇదివరకు తను దేవుని పేరు కష్టాలలోనూ, నష్టాలలోనూ, అన్యాయంలోనూ, అవినీతిలోనూ యెత్తకూడదని, అలా యెత్తేవారిని దేవుని పవిత్రతను చెరిచే మూర్ఖులని ద్వేషించాడు. కానీ త్రోవలో 'దేవుడు లేడా? నన్ను తలెత్తుకొని నడవనీడా?' అన్న మాటలు హృదయంనించే అప్రయత్నంగా వచ్చేశాయ్. అవి వచ్చాక తన పొరపాటును గ్రహించి అబ్బే అబ్బే అనుకున్నాడు. నడుస్తూనే యమయాతనపడుతూ మరచిపోయి యింటికి వచ్చేశాడు.

దీపం మిసమిసగా వెలుగుతోంది. సుబ్రావు చైతన్యం లేనట్లే పడున్నాడు. భార్యముంచందగ్గరగా కూర్చుంది. ఈ బెంగతో మరింత చిక్కి శల్యమైంది. ఇంట్లో ఒకఅడుగు వేశాక తనుయింటికి యెందుకువచ్చాననుకున్నా తిరిగి వెళ్ళిపోలేకపోయాడు. భార్య చూడగానే డాక్టరుగారేరీ అంది. వస్తాడన్న సమాధానం వద్దనుకున్నా నాలిక చివరనుంచి వచ్చింది.

మెల్లగా క్రిందకూర్చున్నాడు. కుర్చీ అక్కడనే వుంది. కష్టపడుతున్న కొడుకువేపు చూస్తుంటే కళ్ళంటనీరు తిరుగుతోంది. వీడింత ప్రియతముడని యిదివరకెప్పుడూ వూహించలేదు. పిల్లలమీదనున్న ప్రేమాభిమానాలు మానవత్వంలో ముప్పాతికవంతు మిగతాఅన్ని అనుభూతులు కలసి ఆమిగతా పాతికవంతు. నరాలన్నీ కుమిలి కుమిలిపోతున్నయ్. కళ్లు నిలబెట్టి కొడుకువేపు చూస్తున్నాడు. భార్యలేచి నిల్చోవటం, ముఖాన్ని దాచుకోవటం ఆమె గొంతు విప్పి మెల్లగా వణుకుతూ మాట్లాడేవరకూ చూడలేదు.

ఆమె మెల్లగాఅన్నది "సన్యాసివచ్చాడు!" ఈ పేరువినగానే తనకళ్ళల్లో వూరే కన్నీటికి ఆనాడు సాయంత్రం తనకు చేరువగా కూర్చొని తనగాథను వెక్కివెక్కి కార్చిన కన్నీటికి యేదో పోలికవున్నట్లనిపించింది. అయినా పైని వినిపించుకోనట్లే కొడుకు వేపు చూస్తున్నాడు.

భగ్గుభగ్గుమని అంతరంగం మండుతోంది. కానీ తరవాత సర్దుకుంది. చెప్పకవిధిలేక, తన కెటువంటి శిక్ష

పడబోతుందన్న భయంతో ఆగిఆగి భార్య చెప్తోంది—సన్యాసికి మీరెప్పుడో రెండురూపాయ లిచ్చారట!"

"ఇస్తే!"

"మీరు గంజి త్రాగమని యిచ్చారట. త్రాగ కండా ఆ రెండురూపాయలు యిచ్చి నాలుగు రూపాయల సారా తెచ్చి అమ్మాడట. ఆ నాలుగు రూపాయలు యిచ్చి యెనిమిది రూపాయలది తెచ్చి అమ్మాడట! ఆ రెండు రూపాయలతో ఇలా అరువు ఇవ్వకండా ఇప్పటికి రెండువందల రూపాయలు చేశాడట!"

సుబ్బారావు చూపు వింతగా మారిపోతోంది. భార్య భర్త నిజాయితీని యీ పదేళ్లాకళ్లారా చూసింది కాబట్టి యీ చూపుతో వణుకుతూనే మెల్లిగా "మామయ్యా వూళ్లో అప్పుడు తిరుగుతుంటే విన్నాడట! ధరలు పడిపోయాయని అప్పుపుట్టడం లేదట. 'ఈ డబ్బంతా ఆ బాబుదే. ఆ బాబుకు కష్టంవస్తే నానీ డబ్బంతా వుంచుకొని యేంచేస్తానని నూరు రూపాయలు తీసుకవచ్చాడు. నన్ను చంపె స్తారు, వద్దు వద్దని యెంత చెప్పినా విన్నాడు కాడు. నేలమీద పడి మ్రొక్కి యెంతో హంగామా చేశాడు. డబ్బు నాడి ముఖంమీద పారవేశాను. ఆ నోట్లన్నీ యేరి మళ్ళీ టేబిలుమీద పెట్టి "యిది నా డబ్బుకాదు. ఆబాబుడబ్బు ఆ బాబుకిచ్చినానని చెప్పండమ్మా అని వెళిపోయాడు"

భార్య యీ మాటలు ఆగి ఆగి చెప్పాక తల వంచుకున్నాడు. బహుశః తన కళ్ళల్లో వూరిన కన్నీరు ఆమెకు చూపించ కూడదనే అభిమానం అలాచేసి వుండవచ్చు. కొంతసేపటికి తలెత్తి కొడుకు వేపు చూస్తూ వెఱ్ఱివానిలా ముఖంపెట్టి "ఆ డబ్బేదీ?" అన్నాడు.

మంచందగ్గరకు వచ్చి కూర్చున్న భార్య డ్రాయరులో వుందంటూనే భర్తవేపు ఆవేదన అల సటతో చూసింది. కొడుకుకన్నా తండ్రికే హెచ్చు జబ్బుగా వున్నట్లుంది!

జోగుకుంటూ మెల్లిగా టేబిలువద్దకు వెళ్లాడు. కాస్సేపు ఆగాడు. మళ్ళీ కొడుకు కనిపించాడు. తను యింటిలో యిల్లాలి యెదురుగా పిచ్చివానిలా ప్రవర్తిస్తున్నానన్న స్ఫురణ లేనేలేదు. ఒక్కసారి డ్రాయరు తెరచాడు—డబ్బు!—ఎన్నో కుటుం బాల హాహా కారా లొక్కసారి చెవులను చిల్లులను చేశాయ్! డ్రాయరు ఫర్‌మని మూశాడు. ఆ శబ్దం మళ్ళీ మెదడును మేలుకొలిపింది టేబిలును కరుకు కరుకుమని నమిలినట్లు పట్టుకున్న వాడల్లా కొడుకు కనిపించగానే కళ్ళు ఘట్టిగా మూశాడు. దిగువ పెదిమ పళ్ళతో నొక్కిపట్టి వూపిరి బిగబట్టాడు. మళ్ళీ యెందుకో శావురుమని యేడవాలని పించింది. ముఖంలోని అసహ్యం వఱ్ఱినవ్వుగా మార్పుజెందు తోంది. డ్రాయరు మళ్ళీ విప్పాడు. బుస్సని పడ గెత్తిన నల్ల త్రాచులా ఆడబ్బు అగపడింది. ఒళ్ళు చచ్చినా, కళ్ళుమూసి ఆపడగ చేతితోనొక్కి పట్టు కొని డాక్టరు యింటివేపు పరుగెత్తాడు.



# కంఠీరవరాజు యక్షగాన కృతులు - పదములు



శ్రీ నిడుదవోలు వెంకటరావు

తెనుగు సాహిత్యములో మధుర కవితాశాఖకు సంబంధించిన కృతులలో యక్షగానములను గూర్చి యింతవరకును సమగ్ర పరిశీలన జరిగి యుండ లేదు. ఈ శాఖలో కూడ ముద్రితములు, అముద్రితములు నగు గ్రంథజాలము చాలగా వెలయుచున్నది. కాని వాఙ్మయ ప్రపంచమున నీ శాఖకుగల యున్నత స్థానము గుర్తింపబడకుండుటచే యక్షగానములను గూర్చి కూలంకషముగా వ్యాసంగము జరుగ లేదు. కొలదిమంది విద్వాంసులు [1]మాత్రమే దీనిని గూర్చి పరిశ్రమ చేసి యాంధ్ర విద్వల్లోకమును కృతజ్ఞతాబద్ధము గావించినారు. సాహిత్య పథకముయొక్క పరిణామమును సంగీత సాహిత్యములకు గల పరస్పర సంబంధమును వ్యక్తముసేయుచు, సంప్రదాయముద్రను ప్రదర్శించు నీ యక్షగానములు మిక్కిలి సూక్ష్మముగా పరిశీలింప దగినవి. అట్టివానిలో నీవఱకు పరిశోధకుల కెఱుగరాకుండ కాలగర్భము నణగియున్న కంఠీరవరాజు యక్షగానకృతులను గూర్చి పదములను గూర్చి నేడు తెలుపుచున్నాను.

కంఠీరవరాజు మైసూరు పరిపాలకుడును కవి పండితప్రియుడును మహాయశస్కుడునగు చిక్క దేవ రాయల కుమారుడు. ఇతడు క్రీ. శ. 1704 నుండి 1713 వరకును మైసూరును పరిపాలించెను. ఇతడు పుట్టుకచే మూగవాడును, చెవిటివాడునై యుండెను. అందుచే నీతనికి "మూకరసు" అను నామాంతరము. కేవలము హస్తసంజ్ఞలతోడనే రాజ్యకార్యములను నిర్వహించెడివాడు. అయితే భగవంతు డేదేని యంగ వైకల్యమును గలిగించినప్పు డావ్యక్తికేదే నొక విలక్షణమైన శక్తిని ప్రసాదించును. కంఠీరవ రాజునకు కమనీయమగు కవనశక్తియేగాక బహు భాషా వేతృత్వమును పరమేశ్వరుడు ప్రసాదించినాడు. ఇతని యక్షగాన రచనముల మూలమున నితడు సంగీత సాహిత్య నాట్య విద్యలందు నేర్పరి యగుటతోపాటు సంస్కృతమున ప్రాకృతమున మాతృభాషయగు కన్నడమున తెనుగున తమిళమున కవితారచన చేయగలవాడని విశదమగుచున్నది. ఈతని విద్యావిశేషము మైసూరు చరిత్రకారు లెవ్వరును నీవఱకు గుర్తించి యుండ లేదు.

ఈ యక్షగాన రచనలవలన నీతడు దక్షిణాంధ్ర వాఙ్మయముననే కాక యాంధ్రవాఙ్మయమున గల రాజకవులలో నొక ప్రశస్తకవిగా నెన్నదగినవాడు. ఇతని కృతుల వివరణము నీక్రింద నొసగుచున్నాను.

1. కొఱవంజికళై — ఇందులో నాలుగుకృతులు గలవు.

   *a*. ఆంధ్రకొఱవంజి. *b*. కన్నడకొఱవంజి *c*. ప్రాకృతకొఱవంజి. *d*. తిగుళకొఱవంజి లేక తమిళకొఱవంజి

2. పంచాయుధకళై.
3. లక్ష్మీవిలాసము.
4. కలవాణీవిలాసము.
5. నాట్యవిద్యావిలాసము.

---

1) కీ. శే. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు. 2) కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు. 3) శ్రీ చింతా దీక్షితులు గారు. 4) శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్య గారు.

6. వసంతోత్సవవిలాసము.
7. విభక్తికాంతావిలాసము.
8. అష్టదిక్పాలకవిలాసము.
9. పావకినాటకము.
10. వైవస్వతనాటకము.
11. నైరుతినాటకము.
12. వారుణినాటకము.
13. వాయవినాటకము.
14. కాబేరినాటకము.

పై కృతులలో నీక్రింది లక్షణములు సాధారణముగ గన్పట్టుచున్నవి.

1) గ్రంథాదిని సంస్కృతశ్లోకము కొన్ని కృతులయందున్నది.

2) గ్రంథాదిని తెలుగుపద్యము కొన్నింట గలదు

3) వచనములు మధ్య మధ్యగలవు

4) ద్విపదలు, సీసపద్యములు మొదలగు జాతులుకలవు

5) మత్తేభము మొదలగు వృత్తములుగలవు.

6) దరువులు, జంపె, త్రిపుటలు గలవు.

7) ఆటతాళము, ఏకతాళము, ధృవతాళము, మధ్యతాళము ప్రయుక్తములైనవి.

8) కొన్నింట ప్రాకృతమును కన్నడమును వాడబడినవి.

9) తెనుగున లేక, కన్నడమున నున్న సాంగత్య ఛందో పద్ధతి యిందు గలదు.

10) అన్నింటియందును రచన సరళమును హృద్యము నైయున్నది.

## 1. 'ఆంధ్రకొఱవంజి'[2]

కంఠీరవరాజు శ్రీ రంగనాథుని దర్శించి తిరిగి వచ్చుచుండగా పాంచాలదేశపు రాచపట్టి కాంచనలత యాతని చూచి మోహించును. ఇంతలో కొఱవంజి ప్రవేశించును. తన మనోరథమును తెలుసుకొని కంఠీరవరాజు తన్ను ప్రేమించి వివాహమాడునని కొఱవంజి చెప్పగావిని సంతోషించిపారితోషికమిచ్చి పంపుట యిందలి యితివృత్తము.

దీని రచన కొక మచ్చుతునక — ఎఱుకత వచ్చుట

మాళవిరాగము.
వచ్చెనెఱుకత యెఱుకయెఱుకని
వాడవాడల నంటనూ
హెచ్చుగా తాంక్రలెల్లను
యిదిగో చెప్పెద ననుచునూ.
తళుకు చెక్కుల పసిడికమ్మలు
తళుతళుక్కని మెఱయగా
కులుకుగుబ్బల పైనిహారము
వెలని వేసుక మీఱగా
పొందుగా రత్నములు నించిన
బుట్టబుజమునుంచుక
చందముగ తన చిన్నిబుగుటను
సరవి వీపున గట్టుకొ
ఘుల్లుఘుల్లన జాళువాగిల
కనుకరంబుల మ్రోయగా
మెల్లమెల్లనె హంసనడపులు
గల్లసొగసులు త్రోయగా
సాంగత్య ఛందోపద్ధతి కుదాహరణము.
సాత్యవతి నే నుండు స్వర్గాన నేనుండు
నిత్యమ్ము గిరిలోన నుందూ
అత్యంతాద్భుతమైన అమరాద్రియందుండు
సత్యమ్ము సర్వత్ర నుందూ

ఇందు, ఆహిరి, కాంభోజి, ఘంటారవ మాళవి మొదలగు రాగములు ప్రయుక్తములైనవి. ద్విపదలు దరువులు కలవు. కంఠీరవ రాజుకృతులలో నిదియె పెద్దకృతి—

## 2. పంచాయుధకల్పి

ఇందు విష్ణుమూర్తి పంచాయుధములు కంఠీరవ నృపతిని సంరక్షించుచున్నట్లుగా, నాయికాపాత్ర లభిన యించునట్లు రచితమైనది. ఇందు సంస్కృత శ్లోకములు హెచ్చుగా గలవు. ఇది సంస్కృతశ్లోకముతో ప్రారంభము.

2. దీనినిగూర్చి "తాళపత్ర గ్రంథములు కొఱవంజి" అను శీర్షిక క్రింద వాణిలో తే 7-10-1950 దిని ప్రకటితమైన యస్. యస్. సుందరేశ్వరరావు ప్రసంగము చూడదగును.

### 3. లక్ష్మీవిలాసము

ఇదియు నాదిని సంస్కృత శ్లోకము గలది. ఇందు మహాలక్ష్మి కంఠీరవరాజుసభను నృత్యమొనరించి యాశీర్వదించుట చెప్పబడినది. ఇందు దరువు ద్విపద, వచనము గలవు. ఈ క్రింది గేయముతో సమాప్తమైనది.

రాగం సౌరాష్ట్ర.
కవితనిరంతర కనకవసంత
వలరిపువైభవ వారిరేవంత
వితరణరాధేయ వినయవిధేయ
ప్రతిమహితోపాయ శోభనకాయ
రాజకంఠీరవ రాజాధిరాజ
రాజేంద్రచిక దేవరాజతనూజ.

### 4. కలవాణీవిలాసము.

ఇందు కలవాణి యను వేశ్య కంఠీరవరాజును చూచి మోహించు కథ చెప్పబడినది. ఇది తెలుగు పద్యముతో ప్రారంభము—ఆ పద్యమిది.

శ్రీకాంతారమణుండు భూమిమహిళా
చిత్తాభి రామోత్సవుం
డాకల్పాంతవిలోచనుండు కమనీ
యాజాను బాహుద్వయుం
డీకంఠీరవ రాజచంద్రునికి దా
నీరంగపద్ధీవరుం
డాకల్పంబగు నార్చు నర్మిలుల నే
కైశ్వర్య కీర్త్యాదులన్

### 5 నాట్యవిద్యావిలాసము

ఇది నాట్యకర్తలు తమ తమ విశేషములను వివరించు కృతి. సంస్కృత శ్లోకముతో ప్రారంభము. ఇందు సంస్కృతభాగము హెచ్చుగానున్నది. పద్యరచన తెనుగున నచ్చటచ్చట గానవచ్చును.

### 6. వసంతోత్సవ విలాసము

ఇది ప్రశస్తమైన కృతి. పూర్వము నాచన సోమనాథ మహాకవి వసంతవిలాసమును వ్రాసినట్లు లక్షణగ్రంథములవలన తెలియుచున్నది. కాని గ్రంథము పూర్తిగ లభించలేదు. కంఠీరవరాజు కృతి పూర్తిగ నున్నది.

ఇది.
శ్రీమత్పశ్చిమరంగ పట్టనవరే
భోగీంద్ర శయ్యాతలే
శ్రీభూమీకర పల్లవాశ్రితపదాం
భోజశ్శ్రియానోహరిః
అవ్యాదాశ్రితపారిజాతమఖిల
క్షోణీంద్ర చూడామణిం
శ్రీకంఠీరవ భూమిపాల మనిశం
శ్రీదేవ రాజాత్మజం

అను శ్లోకముతో ప్రారంభము—దీని వెనుక ఈరీతి నాందిచేసి సూత్రధారుడు తెరదిస్సి జూచుటయు నటి వచ్చేక్రమం బెటువలెనన

రాగం - ఆహిరి.

వచ్చెను నటి వచ్చెను
హెచ్చైనకంఠీర వేంద్రుని సమ్ముఖమున
ఆటలపాటల తేటలనలరిన
పాటలగంధి నెఱనీటుతోనదిగో.

పల్లవి

వచనం: వచ్చిన నటిని జూచి సూత్రధారుడు వసంతోత్సవవిలాసంబు వినిపించవలెనని. నటి. అయ్య! ఆ వసంతవిలాసంబనే కృతికి కర్తయెవ్వరు? అనుటయు సూత్రధారుం డిట్లనియె.

శ్రీసోమవంశాబ్ధిసితకిరణుడు మహా
దానధారేయుడు ధర్మపరుడు
అకలంకచారిత్రు డమిత విక్రమశాలి
సకలవిద్యాభ్యాస చతురహృదయు
డంగనాజనమనోహర రూపలావణ్య
డాశ్రితజన కల్పకావనిజుడు
రాజకంఠీరవ రాజేంద్రచంద్రుండు
చారు కారుణ్య విస్తారయశుడు
మధురమృదువాక్య సందర్భమగుచు నెగడి
నవరసాలంక్రియాకల్పనములదనరి
లలితమైనవసంత విలాసమనెడి
నాట్యమేళానగతి ప్రబంధము రచించె

ఆ వెనుకనటి వసంతసమయమును వర్ణించును, ఇందు రెండు ప్రాకృతగేయములు, నొక తెనుగు పదము గలదు.

గేయము:

సహియరమ్ము యుళ్ళీబాణో
మహయరనిస్సాణ దణుహాశంకారో
విరహియణ మణోమియసుం
మియయాకళ్ళం కరయికదస్సో.

తెనుగున రేయెకుల కాంభోజి-ఆటతాళముతో

ఈవసంతము లింపాయె
భావించిమాడ బాగాయె
శీవితో రాజ కంఠీరవరాయ
డీవినములవింత లీటువలెనేయ.

పల్లవి

అలరువల్కల క్రొవ్విరులు తేనెజాలు
సొలకేగియాసించి యలులందు జేర
చెలువైన మావిడి చిగురాకుసొల
ములమదించిన కోయిలల సొంపుమీఱు...

ఈకృతి కంఠీరవేంద్రుని సమ్ముఖమున ప్రవర్తించినట్లుగా తరువాత భాగము చెప్పుచున్నది. దాని మొదలు. "ఆసమయంబున రాజకంఠీరవేంద్రుడు కొలువైయుండు క్రమంబెటులన్నను" అని 22 పంక్తులలో కొలువు వర్ణన గలదు. అపుడు సూత్రధారుడు నటినిజూచి "రాజకంఠీరవేంద్రుడు రత్నసింహాసనారూఢుడై నిండుకొలువైయున్నాడు. ఈసమయంబు వసంతోత్సవ విలాసంబను నాట్యప్రబంధంబు వినుపించుటకు వేళ. ఇప్పుడందుకు తగినపాత్రలు ఎవ్వరంటే మల్లిక, మందారిక, మంజుభాషిణి, మధురవాహిని మొదలైన యంగనామణులు ముస్తీబై వచ్చునట్లు సేయమనునప్పుడే వారు ముస్తీబైవచ్చు క్రమంబెట్లన్న.

"వచ్చెను మల్లిక వరుసతోనిదిగో
హెచ్చైన కంఠీర వేంద్రపరాకు."

దీనినిబట్టి తంజావూరి రంగమునందువలె మైసూరియందు నాటకశాలలో స్త్రీలు స్త్రీపాత్రలు గరించి నాటకము లాడెడివారని తెలియుచున్నది. ఆ మల్లిక కంఠీరవేంద్రుని మోహించి చేపట్టుమని యారీతిని ప్రార్థించును. దానితో కథ ముగియును.

ధ్రువతాళము

శ్రీకంఠీరవరాయ శ్రితజనరాధేయ
రాకేందుచంద్రికా రవళికితాళలేను
ఆ కౌముదిబారికి నలసితిచాల

రూపకము

నిరతము నెమ్మది నిన్నె నమ్మినదాన
పరిపరిగా నన్ను భావించ నేల
ఇరవుగా దయతో నన్నేలు కంఠీరవేంద్ర
ధరణీపురందర దానమందార

ఝంపె

నీపాందు నెడబాసి నిముసమోరువజాల
రాపేలజేసి నను రచ్చబెట్టేవు
నీపాదమాన యిక నీ చెలిమి నేమాన
భూపకంఠీరవ శుభోదయవిశాల.

(సశేషము)

## కంఠీరవరాజుపదములు.

### 1

రాగము భైరవి.
త్రివడితాళము

వారినిధిగంభీర, శారద
నీరదాశ్రిత హారరుచిర వి
హార, మనసిజవీర, శతగుణసార,
వితరణశూర, ధర్మవిచార, కుజనవి
దూర, సరసోదార, సుజనాధార, వంశో
ద్ధార, లలితాకార, మైసూరివీర
కంఠీరవేంద్ర జయ. జయ 1

---

1. కీర్తిశేషులు శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు మైసూరి విశ్వవిద్యాలయమున నధ్యక్షపురోధారులు (Prochanceller) గా నున్నప్పుడు, మైసూరిరాజులాంధ్రవాఙ్మయమున కొనర్చిన సేవను గూర్చిన విశేషముల నన్నెఱిగింపగోరిరి. అంతియేకాక మైసూరి పరిపాలకులకు సంబంధించిన తెనుగు గ్రంథముల నన్నింటిని విశ్వవిద్యాలయము తరఫున ముద్రితములుగావించు నేర్పాటు చేయుదుమని నన్నొక ప్రణాళికను తయారుచేయుమనికూడ కోరిరి. నారి యనుమతిని నేనెంతయో పరిశ్రమచేసి, యనేక నూతన విషయములతో వారికొక ప్రణాళికను చరిత్రను పంపితిని. వారు కీర్తిశేషులు కాగానే యాయుద్యమ మంతరించినట్లున్నది. అందలి క్రొత్తవిషయములలో నొకదానిని గూర్చినదియే పైవ్యాసము.

ని. వెంకటరావు.

గానలోలఘనబుధజాల కవిజన
కలిత లీలా.

పల్లవి —

వందితాఖిలబృంద సుజనానందలసదర
విందపదకనదిందు బంధురవదనభాస్వర
కుందకుట్మల దంతసురవరనందివాహన
వందనప్రియకందళి తకురువిందనఖకర
మందరాచలధైర్యసౌందర చంద్రకంఠీర
వేంద్ర జయ జయ.
రాజరాజ సమానభోగవి
రాజమాన మనోజభాసుర
రాజబింబ సమానసౌమర
వేణితామర రాజవిద్యా
భోజమైసూరి దేవభూప త
నూజనవకృత నైజశవితాజాలకూజిత
రాజకంఠీర వేంద్ర జయజయ

2

రాగము ఘంటారవ }
వర్ణిమత్య }

కొమ్మ నీవదియేమే నాసామినీవెంత
కొదవగా యేంజేసేమే
ఈమహిని రాజ కంఠీర వేంద్రుని
యేమని తెలియలేను.

పల్లవి.

ఆటపాటలవింతి మాటలతేటల
అందచందములు గలిగినా
మీకైననీటు బలు జాటుపనుబోటుల
మిటుకులాడు లైనట్టి
పాటలగంధులు పదము మోపినగాని
పొన్పుజేర్చనినాడమ్మా
పాటపాడియైన పశుచులనెల్లా
పాటిజేసునటే ఓభామా.
ఏణాక్షీ వినవె యిలలోవారికెల్ల
యెక్కుడైన రూపము.
జాణతనమునుంచి జిగిబిగితనమున
జగబిరుదందినట్టి
ప్రాణనాయకి వేసుకొనినగానిసుమంత
ప్రాపు చేయని వాడమ్మా
త్రాణము దలియని తగినవారివలల
తగిలియుండేవాడేమో ఓచెలియా
సఖిగరిమ దెలిసిన ఘనగంభీరముగల
గుణవంతు డితడందు
నరపాల జనలలో నాడాడివాడంటే నను
బోడి నెంచదగునా
నిరతమై గూడియుండువాని మహిమ
నిజమై యెవరు దెలిసేర
వీరరాజ కంఠీర వేంద్రుడు వేరిటి వలపులాడిని
నమ్మునా ఓ కొమ్మా.

3. రాగం ఘంటారవ – ఆటతాళం

అక్కరో! వినవె యీ వేళ వలపుజూడ
యెక్కడనుండి వచ్చెనె
సొక్కుపొడి జల్లెనో సొగసు కంఠీర వేంద్రుని

పల్లవి

అటుగా జూచినవాని అలరుమోములందము
ఇటుజూడ వాని నీటు యింత హీనమై
ఎటుగా జూచినవాని యేమనవచ్చునో యందు.
విటరాయని వగలు వింతవైచినటు నాటి
కనుబొమ్మ సన్నలోను కలికిరో రమ్మని
మొనగుబ్బలపై గోరు ముద్దుగానుంచి
అనవరతము నన్ను అంగజుకేళినిగూడి
వినయమున కంఠీర వేంద్రు నున్నట్టి నున్నది.

4. రాగం ఘంటారవం – ఆటతాళం

కానిలేర చక్కని సామి కానిలేర
దానశూర కంఠీరవ ధరణిపాల యీలాగైతె

పల్లవి

పడుచుదాననంటూ నడిప్రాయాన నన్ను
జూడక విడిచి దానినే జేరున్న వివర మెఱుగనా
వడియగట్టినదాన వసుమతి చంద్రావిను నా
జడనుజుట్టిన పూలు చెదరి వేయకమా నేన
దురుసుమాటలాడి దూరి ముద్దు బెట్టబోయనంటి
ఓరుదువని తలచే బలిమి బిరుదందినదాన
ఓరుసైనగుబ్బల బిగిసి చక్కిలి చిక్కిలిగోరు
వరుసవరుసగా జూడక వరిది విడిచెనాడ్రోళ్ళ
చక్కనైనయ్య యేరా యిట్టి చప్పనలాడునవచ్చి.
సొక్కించి సోలించి నన్ను సొబగుమీఱగ
మక్కువతో గూడినట్టి మైసూరికంఠీర వేంద్ర
గ్రక్కున మోవి నొక్కి గంటుశాయకమా నేన

5. రాగం. అశోక వరాళి

ఏమే భామినీ ప్రేమను యెంతటిదో కానవమ్మా
కామకోటి రూప రాజకంఠీరవేంద్రునియందు
వలపులాడినీ చెలులు పిలిచినట్టివాని
పేరనికలసి బిలిచి నీలోనీవె తల వంచుకనుండేవేమే
అలనైనదినుదిటినీవు తిలకమున దిద్దినంటూ
వలపులో వాని రూపు వన్నె మీఅ దిద్దేవేమె
ఆటపాటలాడే వేళ అందిపొంది యుండే వేళ
బోటిరో కంఠీరవేంద్రుని పొందియుండు భావమిదిగో

6. రాగం - తోడి

పదరి నన్నంటి వచ్చేవేర
మొదటివలె గాదు చాలురా మోహనాకారా

పల్లవి

కులుకు సుబ్బలాన వయ్యారి సుమ్మీనమీరి
సురులైయున్నదిరా కస్తూరి
అలదానివద్ద నీవు దూరినాని
అటువంటి దినమున మైసూరికంఠీరవేంద్ర
కంటికంటరా నీ మాయలెల్ల అమ్మనే నెల్ల
కల్లగాదు కామినివల్ల
వింటి వింటి వింటిరా నీమాట లెల్ల అల్ల
చెలదియుండే నీ ప్రేమమేల కంఠీరవేంద్రా
అనరానిమాటలాడేవేర అవురా చాలురా
అదేరా నీ కామేరవయ్యేరా.
దినమున నేలు దాని భారమూర
దేవరాజేంద్రుని కుమార కంఠీరవేంద్ర.

7. రాగము. తోడి త్రివడి

వారివారి కిట వలచినవాడే
వీర కంఠీరవేంద్రుని వింతలుజూడే

పల్లవి

అలివేణి వినవె అల్లటు జూచె నేనివాని
చెలువైన చెక్కిలి జేరేది ఒకతె
అలరు నీమోవియన్న అమృతమేదిరా యని
వెలయ పంటి నొక్కు వింతలాడి యొకతె
బారిగుబ్బల మొనల బలిమిరొమ్మున గ్రుమ్మి
బీరముతో జఘను బిగిసి జుట్టుకొని
వేడ్క నీకొకను యేచెలది వలెరా యని
యీరీతి గూడియున్న యింతి నేనొకతె
బారాడు కురులను బాగుగా వైచుక
వాశాసిగ పెట్టిన వయ్యారి ఒకతె.
ఏరా కంఠీరవేంద్ర ఎవతె కోరినదనీ
గారుచేసే బలు గయ్యాళి యొకతె.

8. రాగము - ముఖారి

విన్నవించరో ఓయమ్మ
కన్నెరో యీ వగలెల్ల కంఠీరవేంద్రునితోన
విడిదికే వచ్చిన సొమ్మనదె నన్ను పుడు విడనాడెనె
విడెమీయగా నందుకోరాదా వింతజేసేదు
గుడుకు లేటికి నాతో వాద దూరకొనెదే
కడుదుడ్జేసెదే మరుడా కాని నేనేమిసాగ
ల్లదని నెట్టబట్టికొంటి
ఒంకముతోన అటుజూచుకొంటి
మొల్ల మొగ్గలవంటి పంటి మోవి యానుకొంటి
ఉల్లాసాన దానియింటనుండి వచ్చెదనూనంటి
సరిగా మైసూరి నేలునంటి
నిజతనంటి ఘన గుణవంతు కంటె
వీరకంఠీరవ వీరుడెంటి వద్ద జేరుంటే
నిరతాన నను గూడి నాడెంటి
నే నమ్మియుంటి మోఅసివాడనుంటి
మేరగాదని యంటి.

9. రాగము కాంబోది - తాళము త్రిపుట

ఇపుడు జాణవైతివా చెలియా నీ
విపుడు జాణవైతివా
అపటిదినము మఱచి నీవ
పైపయి వారి యందమై సుపరతి నమరేవేమె

పల్లవి

ముద్దులాడిరో నీవు చిన్నప్రాయమునాడు
ముద్దుగుమ్మలతో బొమ్మలపెండ్లిండ్లు చేయించి
కొద్దిగా సతిపతి నిద్దఱినిగూర్చి కులుకుచునీవుండగా
అద్దరిపాయమునె నేను రాగా కనుగొని
అదరి బెదరి మోము వారవేసుకొంటి
వద్దనున్న చెలులమఱుగదాగున్నట్టి
వలపులాడి వింతెగదవె నీవపుడు.
సామజయాన నాడు పొన్నపై నేను
సరసమై నిదురముబ్బుగనున్న యాసన్న
ప్రేమతోనుపరతి దిద్దుకొమ్మనంటి భామనాప్రసి
యుండగా నేమి జేసునోయని వారజేసుకొంటి
ఇంతిజోడునరీతి నీవు దెలుసుక
మోము వెళ్లమరుగునుండొచ్చి మేలు మీఅ
ముదముతోడ పక్కజేరి యుంటివే యపుడు
చెలియ చప్పడకాళ్ల మంచముపైని చిక్కించి
అద్దముపై నీడ గనుగొని
తొలుత మదనకేళిలోని రీతిజూచి
తొయ్యాలి భ్రమసి నీవు
చెలతరో నా సామి కంఠీరవేంద్రుడు
నేర్పున సుపరతి నేర్చుకొన్నాడంటి
పలుమారద్దము బాగజూపులనూచుక
పపరి చిఱునవ్వుతో నున్న దానవపుడు
శ్రీ శ్రీ శ్రీ శ్రీశైల సురవే నమః

# వర్షా జీవనము



★

శ్రీ బులుసు వెంకటేశ్వర్లు

శమదమ నూత్న పత్రములు శాంతముగా దలలెత్త జొచ్చెమ
ద్విమల మనోలతన్ మునుపు దివ్య వసంతమునందు నీనిదా
ఘమున గృశించి మాడిపడగా దొడగెన్ భవితవ్య వర్షకా
లమున నశించునో యవి బలంబుల ఫుల్లములై వెలుంగునో ?

వేసవి భీషణ ప్రకృతివేదన కొంత శమించు నాకు జిం
తాసముపేత మానస వృథాభరమెల్ల దొలంగు నంచు సం
త్రాసము మాపుకో బలులెఱంగుల నువ్విళు లూరుచున్ సుఖా
వాససుజీవనంబు గడపన్ దలపోసితి ముందు కారునన్.

క్రోధోన్నగ్న భవాభినామక ఘనాక్రోశంబు దిగ్భిత్తులన్
బాధామూలకమై పగుల్ప క్షణ సంపత్ప్రా భవార్థంబు ల
త్యాధారంపు మెఱుంగు దీగలయి యాత్మానంత పాపంబు లం
భోధారా సదృశంబులై కురియ నొప్పెన్ వర్ష ఘోరంబుగన్

అందము జందమున్ గలుగు నాత్మసరస్సది పాపవర్షని
ష్యందిజలప్రపాతమున నంతట భీషణమై చెలంగ మ
ధ్యందిన సాధుదర్శనము నందమి నెల్లెడ జిమ్మ జీకటిన్
క్రమ్ముచు నున్న దెంతయును మానసపద్మము నాడు నాటికిన్.

ఇన ఘన దర్శనం బొదవ దెయ్యెడ జూచిన గాని యెంత వే
చినను లభింపవాయె నిజచిత్తసరోజ వికాస హేతువుల్
ఘనభవ మేఘ సంతతి వికావిక చేయడు జ్ఞానభానుడున్
జినుకున జీకటిన్ బ్రతుకు చిక్కువడెన్ విడిపోవు టెన్నడో ?

కడు దమసా వృంతంబయిన కారు హృదంతరమ్ముం గలంపగా
నడుగిడచే శ్రమావహము నందును బంకిల జీవమార్గమం
బడుగగ నేల యొక్క పరమాత్మ ననంత కృపాశరత్సుఖం
బొడుపగ జాలు దుఃఖతతి నొక్కటగాన దపింతు దానికై.

నిరతము గోరుకొందు నటి నిష్ఠ మెయిన్ మది భక్తితో మహే
శ్వరు కరుణాశరత్సమయ శాశ్వత దివ్య పదానుభూతి స
ద్గురువరు సత్కృపామహిమ దుర్ఘట మన్నది లేదు కానసే
బరగుదు సద్విభూతి నిక వర్ష ఋతూత్క్రమణాభిలాషినై.

భవజీమూతము విచ్చిపోవగ నహంభావానలం బాఱగా
వచైతన్యము గోచరింపగ జగన్నాథుండు జ్ఞానార్కుడు
ద్భవ మైనన్ ఘనపాప పంకమది సర్వంబున్ నశింపంగ బ్రా
భవమందున్ హృదయాబ్జమెంతయు శరత్ప్రారంభ దైవప్రభన్.



# బిచ్చగాళ్ల జెండా

## శ్రీ మునిపల్లెరాజు

నేను రెండవప్రపంచ సంగ్రామంలో వైమానికోద్యోగిగా, చావు బదుకుల మధ్య ఆకాశంలో జరిగిన ఒక విమానపోరాటంలో గాయపడ్డాను. నా గాయాలు ఏమంత ప్రాణప్రమాదకరమైనవి గాకపోయినా, నా విమానపు పెట్రోలుటాంకుకు, శత్రువుల మరతుపాకి గుళ్ళతో అగ్నిప్రమాదం సంభవించినప్పుడు, నాకు తగిలిన "షాకు"తో చాలా నెలలపాటు నేను మంచంలోనే వుండిపోవలసివచ్చింది. అప్పట్లో ఆరోగ్యానికని, పూనాలో ఒక బంగాళా అద్దెకు తీసుకొని వుండేవాణ్ణి. ఎందువల్లంటే నన్ను రక్షించిన డాక్టరు మిత్రుడు అక్కడివాడే గనక.

నా బంగళా శివాజీనగర్ తోటలమధ్య రైల్వే గిడ్డంగుల మాపుమేరలో, ఎండిపోయిన మూలానది ఎడమతీరాన వుండేది; మా బంగళా ముందున్న శిథిలమైన తోటలోనే నాకు ఎక్కువ కాలక్షేపం అయిపోతుండేది. ఈ శిథిలవనం పక్కనే చాలా పెద్ద ఖాళీస్థలం, ఆ స్థలానికి చివరలో మరొక పాత మేడ వున్నాయి. ఈ ఖాళీస్థలం చుట్టూ, దాని యజమానులు ఒక దశాబ్దం క్రిందనో, ఏమో వేయించిన ముళ్లతీగ కంచె గూడా పేరుకుమాత్రమే మిగిలివుంది. చాలా రోజులు పాడుబడి జీర్ణావస్థలోవున్న యీ పాత మేడను బొంబాయి సేట్ ఒకాయన కొని కొన్ని రిపేర్లు చేయించి కొద్దికాలంలోనే అందులోకి వచ్చాడు. మా తోటమాలివల్ల, యీ సేటుగారి వ్యాపారం యుద్ధం తర్వాత బొంబాయిలో కష్టబట్టగా యిక్కడకు చేరినట్లు తెలిసింది. ఈ షావుకారి పేరు—శంకర్‌లాల్ భోగాలాల్.

శంకర్‌లాల్ భోగాలాల్ ముఖం చూడగానే నాలో కొన్ని వింతవుద్దేశ్యాలు వుద్భవించిన మాట సత్యం. మొదటిది—అసహ్యభావం. ఆ ముఖంలో కళాకాంతీ లేదు. సేటు రోల్డుగోల్డు కళ్లజోడు వెనుకనున్న క్రూరత్వం ఏదో నాకు అస్పష్టంగా అవుపించింది. లావుగా, పొడుగ్గా భోగాలాల్ వూగి నడవటం గూడా నాకు జుగుప్సగానే వుండేది. రెండో వింతభావం—యీ షావుకారు చాలా దురాశాపరుడని. మూడవ భావం నా జీవితంతోనే సంబంధించినది. నేను వైమానికోద్యోగిగా యుద్ధశాఖలో చేరకపూర్వం, బొంబాయిలో చిత్రాలకు సినేరియోలు, కథలూ వ్రాస్తూండేవాణ్ణి. నాకు సినేరిష్టుగా పేరు రాకముందు, నిరక్షరాస్యులైన, ఏమాత్రం కళాదృష్టీ లేని ఫిలిం పెట్టుబడిదార్లు కల్పించిన అవమానాలూ, హింసలూ, మోసాలూ అన్నీ అనుభవించాను. మొదట్లో నా కథ నొకటి కొంటామని నమ్మించి తీసుకొని, ఒక వారంరోజులు తిప్పి చివరకు—"నీ కథ మాదగ్గర్లేదని" అబద్ధమాడి మోసంచేసి, చివరికి నా బుద్ధిబలంతోనే లక్షలార్జించిన గుజరాతీ సేట్ ముఖకళవళికలు—నాకీ భోగాలాల్ సన్నకళ్ళజోడు వెనుక దృగ్గోచరమైనాయి.

ఈ విషయం నిర్ధారణ చేసుకుందామని నాకు ఒక విధమైన వుద్వేగమే కాకుండా, గొప్ప వుత్సుకత గూడా జనించింది. వైమానికదళంనుండి విడుదల పొందగానే తిరిగి ఫిలిం కథలు, సినేరియోలు వ్రాయటమే వృత్తిగా నిర్ణయించుకొన్న నాకు, యీ పాతమోసగాడిచరిత్ర తెలిసికొనే కుతూహలం జనించటం మానవస్వభావ దౌర్బల్యమే కావచ్చు.

కాని యీ కౌతూహలం తీరకముందే ఒక భయంకర సంఘటన సంభవించి నా ప్రయత్నాలన్నింటినీ భగ్నం చేసింది. ఇది యిట్లా సంభవించింది.

* * * *

శంకర్‌లాల్ భోగాలాల్ పాత మేడముందున్న ఖాళీస్థలంలో ఒక రోజున హఠాత్తుగా కొన్ని చిన్న గుడిసెలు వెలిశాయి. ఇది పెద్ద విచిత్రమైన విషయం కాదు. ఆ ఖాళీస్థలం—బిచ్చగాళ్ళకు, నగరంలో హోటళ్లకు నోచుకోనని పల్లెటూరి ప్రయా

జేబులకూ, చాకులూ కత్తులూ అమ్మి జూపి యింకా దోపిడీలు, దొంగతనాలూ కావించే రోహిల్‌ఖండ్ దండునకూ—ఒక విధంగా అది బహిరంగ సత్రం. నేను చాలాసార్లు రైళ్ళనుండి దింపివేయబడిన గోసాయీలను గూడా చూశాను. కాని ఎప్పుడూ యిట్లా ఆంధ్రదేశంలోని మెట్టజిల్లాలను స్మృతికి తెచ్చే ప్రకృతి కట్టడాలను చూడలేదు.

నిజాని కవి నైజాంప్రాంతంనుండి పనులకోసం వలసవచ్చిన వడ్డె వుప్పరులవి. నల్లగా, మట్టిబొమ్మల్లాగా, ఎండలో నిగనిగలాడే కండలతో, బలిష్ఠమైన శరీరాలతో—బొంబాయి, పూనా నగరాల్లో ఎన్నో రోడ్లు, కట్టడాలు నిర్మించిన తెలుగునాటి వడ్డెవుప్పరులమీద జాలితో భోగాలాల్ వాళ్ళకి నివేశనస్థలం యివ్వలేదని మా తోటమాలి కబురు తెచ్చాడు.

“మరెందు కిచ్చాడు?” అని అడిగాను నేను.

“మీకు తెలీదు బాబూ! వాళ్ళందరివద్దా గుడిసెకు అయిదు రూపాయలు కాజేశాడు. అంతే కాదు. యీపైన నెలకు రెండు రూపాయల బాడిగ కూడా గుడిసెకు ఒక్కంటికి యిచ్చుకోవాలి. వీటన్నింటినీ మించిన యింకో రహస్యంవుంది బాబూ! ఈ వుప్పర్లు బియ్యం తినరు. వాళ్ళ పేరన చాలా దొంగ రేషనుకార్డులు సృష్టించి, ఆ బియ్యాన్ని తనే నల్ల బజారులో అమ్ముకుంటాడు. అవును బాబూ, మరి బొంబాయిలో వచ్చిన నష్టాల్ని, యీ సేఠ్‌లు యితర ప్రదేశాల్లోనే గదా పూడ్చుకొనేది?”

తోటమాలి గణేష్‌మారుతి సేఠ్‌లంటే ద్వేషంగా, వుద్రేకంతో ఒక్కొక్కసారి చాలా నిరసన హాస్యంతో మాట్లాడేవాడు.

“బ్లాక్ మార్కెటంటే నేను సహించను. చూడు. పోలీసు సూపరెంటెండుకు వ్రాస్తాను” అన్నాను నేను.

గణేష్‌మారుతి కనుబొమ లెగరవేసి “మీకు పుణ్యం వుంటుంది” అన్నాడు.

*  *  *  *

తోటమాలి జోస్యం నిజమే అయింది—ఆ నెల తిరక్కముందే. భోగాలాల్ రేషన్‌షాపుకు లైసెన్సు సంపాదించి అక్కడ విచ్చలవిడిగా వడ్డెర్లను దోచి వేస్తున్నాడని నేను సులభంగానే గ్రహించగలిగాను.

*  *  *  *

నేను సైనికాధికారిని కావటంతో నా ఒక్క చీటీనీ పోలీసులు అలక్ష్యం చెయ్యలేకపోయారు.

ఒక వుదయం ఒక పోలీసుదళం, రేషనింగు యిన్స్పెక్టర్లూ కలిసి భోగాలాల్ ఆవరణను ముట్టడించి అన్నీ తనిఖీచేసి వెళ్ళిపోయారు; కాని నాకు సూపరింటెండెంటు తెలియజేసిం దేమంటే— భోగాలాల్ మీద కేసు పెట్టేందుకు తగిన ఆధారాలేవీ కనిపించలేదనీ, కాని తనుగూడా నల్లబజారు జరుగుతున్నదనే నమ్ముతున్నాననీ యింకా విచారణలు జరిగించి తీరుతాననీ.

ఏది ఏమయినప్పటికీ, మరో రెండ్రోజుల్లో వడ్డె వుప్పర్లు అక్కడనుంచి మకాం ఎత్తివేశారు.

*  *  *  *

మళ్ళీ కొన్నాళ్ళు—వలస దారి బంగ్లాలోకి వచ్చిన కొత్తపాంథు లెవర్నీ నేను చూడలేదు.

ఇంతలోనే వేసంగి వచ్చింది. దానితోపాటు దక్షిణాదిలో కరువు వార్తలూ వచ్చినాయి. చూస్తూండగానే తమిళదేశపు బిచ్చగాళ్లు పూనా కంటోన్మెంటులోని పాశ్చాత్య నాగరీకుల హోటళ్ళముందు వుదయాన్నే వుజన్లు నిలబడి సాయంత్రాల్లో హోటళ్ళల్లో మూగే భాగ్యవంతుల నందరినీ ముట్టడిస్తున్నారు.

ఈ బిచ్చగాళ్ళలో స్త్రీలు, పురుషులూ బాలురూ వున్నారు; సంఖ్యలో తమిళ బిచ్చగాళ్ళు ఎక్కువైనా రాయలసీమనుంచీ (ముఖ్యంగా బొంబాయికివచ్చే రైలుమార్గంలో వున్న నగరాలనుండి) హైదరాబాదు ప్రాంతాలనుంచీ వచ్చిన, ఏదో ఒక కమ్మని యాసతో తెలుగుమాట్లాడే ఆంధ్ర బిచ్చగాళ్లుగూడా వున్నారు వీళ్ళలో.

వీళ్ళందరికీ “రాష్ట్రభాష” దక్షిణాదిలో మాట్లాడే బజారు వురుదూ.

ఈ దీనవదనాలు కొన్ని మాయింటి ముందున్న బహిరంగమైదానంలో మకాం వేశారు.

పూనాలో అసంఖ్యాకమైన సంఘాలూ, సంస్థలూ, క్లబ్బులూ వున్నాయిగాని—చాలావరకు

అవి సమాజ సంస్కరణలతోనూ, స్త్రీల సమస్యలతోనూ సంబంధించినవి. కాని వీటిలో బిచ్చగాళ్ళ వుపయోగార్థమై ఒక్కటి లేకపోవటంలో వింత ఏమున్నది? అభాగ్య జీవితానికి—తరగని పాతరఅయిన మన దేశంలో ఏ ఒక్క సంస్థ యిందరు బిచ్చగాళ్లను పోషించ గలుగుతుంది?

మొదట్లో భోగాలాల్, అతడి వుత్తరాది బంట్రోతు గులాబ్‌సింగూ బిచ్చగాళ్ళను అక్కడ నుండి తరిమివేశారు; కాని గణేషమారుతి—మిలిటరీ ఆఫీసరు బంగ్లా తోటమాలి హోదాతో కొందరు నిర్భాగ్యులికి మాకంచపక్కనే ఆదరణ కలగజేశాడు. మళ్లీ మూకలు మూకలుగా—రేపటి దినమంటే లేని బిచ్చగాళ్లు, ఆ ఖాళీస్థలంనిండా మూగారు. ఈసారి భోగాలాల్ లాఠీ వాళ్ళమీద తిప్పలేదు.

కొత్తల్లో, పగటి భిక్షాటనలను ముగించుకొని రాత్రిళ్ళు యీ బహిరంగ మతంలో చేరిన "దేవుడి బిడ్డల" పాటలతో నాకు రాత్రి పన్నెండు గంటల దాకా కాలక్షేపం జరుగుతుండేది. కరువునూ, ఆకలినీ స్వదేశంలోనే వదిలి వచ్చేసినట్లుగా—ఆ జానపదగేయాలు. మళ్ళీ పొద్దున్నే పూలమొక్కలకు నీరు పోస్తూ ఆ ట్యూనులన్నీ తిరిగివల్లె వేసే ముసలిగణేషమారుతి వణికే గొంతుతో నాకు మెళకువ వచ్చేది. మరు నిమిషం నాదికాని యుద్ధరంగంలో గూడా నాకేవో ఆంధ్రదేశపు దృశ్యాలో, జీవన పద్ధతులో గోచరమై యింటిమీది దిగులును నాకిట్లాగే వృద్ధి చేస్తుండేవి.

* * * *

నేను ఆఫీసర్ల క్లబ్బుకు వస్తూండగా, ఆ సాయంత్రం గణేష్‌మారుతి ఎదురొచ్చి "బాబూ, మళ్లీ సాగిస్తున్నారు" అన్నాడు ముఖం చిట్లించి.

"ఎవరు? ఏమిటి?"

"సేఠ్! నల్లబజారు"

"నేను పోలీసులకు రిపోర్టు చెయ్యబోవటం లేదు" అన్నాను నిశ్చితంగా.

మారుతి నావంక ఒకసారి నిరాశగా చూసి, తలమీది మురికిటోపీ సర్దుకుంటూ తన పని చూసుకోబోయాడు.

* * * *

వెలిసిపోయి, మురికిబారిన రంగు రంగుల పాత తుంపుల గుడ్డలతో మా యింటిముందు బిచ్చగాళ్ళ డేరాల శిబిరం వెలిసింది. వికలాంగులు, వృద్ధులు, రజాకార్ నరకాన్నుండి తప్పించుకువచ్చిన శరణార్థులు, క్షామపీడితులు యీ డేరా క్యాంపులోని పౌరులు. దక్షిణాది భాషలన్నీ, అన్ని బాధలనూ అన్ని ఆశలను అన్ని నిరాశలనూ భరించి

నిశ్శబ్దత నిచ్చే కాల రాత్రుల్లో యీ నగరంలో, యీ తమస్సులో కలగా పులగంగా సజీవంగా వినబడుతుంటై; సృష్టీ, ప్రకృతీ, లోకమూ, మానవులూ తిరిగి ప్రాణంపొందే వుషః కాంతుల్లోనే యీ అనాథనగరం నిర్జీవమైపోతుంది! ఈ దృశ్యాలకు నేను బాగా అలవడిపోయాను. యుద్ధంలో ప్రతిక్షణమూ, ప్రతి వస్తువులో, ప్రాణిలో, జీవిలో, ఆల్మ్రలో మృత్యువూ, అపనమ్మకమూ దర్శించిన నాకు, యీ బిచ్చగాళ్ళ సన్నిధి ఏమని కష్టమనిపిస్తుంది?

కాని యీ నగరాధిపతి ఎవరు? తెలంగాణపు యాసతో రాత్రల్లా పదాలు పాడే ముసలి యల్లమందా? పెద్దగొంతుతో తమిళంలో తనకన్నా బలహీనుల్నీ, స్త్రీలను తిట్టే తెలివిగల బిచ్చగాడు మురుగేశనా? కాదు!

భోగాలాల్ నగరాధిపత్యం వహించిఎన్నాళ్లో అయింది. అదే గణేశ్ మారుతి నాకు చేసిన రొంపెవ కంప్లైంటు. బిచ్చగాళ్ళ దైన్యంనుండి, బిచ్చగాళ్ళ పాటలనుండి రూపాయలు సృష్టిస్తున్నాడు మాజీ స్టాక్ బ్రోకరూ, ఫిలిం నిర్మాతా, వడ్డీవ్యాపారీ, దవాలోకోరూ — భోగాలాల్.

బిచ్చగాళ్ళు అడుక్కువచ్చిన బియ్యమంతా తక్కువ ధరకు కొని, అందులో యింత తవుడూ యిన్ని రాళ్లూ, యింత మట్టీ కలిపి, మహారాష్ట్రపు ఎండు రొట్టెలు తినలేక చచ్చిపోతున్న మిలిటరీలో ఉద్యోగాలకని వచ్చిన దక్షిణాది బ్రాహ్మల కందరికీ మూడురెట్ల ధరల కమ్ముతూ, తన కులంవాళ్లలో తిరిగి గౌరవంపొందే అర్హతలనుసంపాదిస్తున్నాడు— శంకర్ లాల్ భోగాలాల్.

ఎవరైనా, ఏరోజైనా తన బియ్యమో, గోధుమ పిండో యివ్వ నిరాకరించాడా, గులాబ్ సింగ్ లాఠీదెబ్బలతో ఆ పట్టిన దయ్యం వదిలిపోతుండేది. లేదా భోగాలాల్ స్వయంగావచ్చి ఒకడేరాసు కూలదోసి, ఆ బిచ్చగాణ్ణి అనాథనగరంనుండి వెళ్లగొడుతుండేవాడు. హైద్రాబాదు బిచ్చగాళ్లకు తమిళ బిచ్చగాళ్లు వత్తాసురాలేదు, తమిళ బిచ్చగాళ్లకు నైజాం బిచ్చగాళ్ల మద్దతూ లేదు. ఒకరోజున గులాబ్ సింగ్ చేతుల్లో ప్రాణం విడువనున్న ఒక బిచ్చగాడి రక్షణకోసం, నేను, నాపాత రివాల్వరును భయానికి చూపించవలసి వచ్చింది.

కాని యీ స్వల్పవిషయా లేవీ అనాథ నగరాన్నంట లేదు. రాత్రిళ్లు జోరుగా పాటలు సాగుతూనే వున్నై. అప్పుడప్పుడు నందనార్ భజన కీర్తనలు. ఒకసారి నా ఆశ్చర్యానికి క్షేత్రయ్యపదం విన వచ్చింది.

* * * *

కొత్త బిచ్చగాళ్ల ప్రవాహం ఆగలేదు. ప్రతి దినమూ రైలుపెట్టెల్లో బల్లలకింద నక్కిగూడ్సు బళ్ళల్లో గార్డుకు తెలీకుండా ప్రయాణంచేసీ దక్షిణాది కరువుదాసులు పూనా చేరుతునే వున్నారు. వీళ్ళకు తోడు మలబారునుండి గంజిలేక సైన్యంలో భర్తీ కావటానికి వచ్చి నిరాకరించబడ్డ ముసలీ ముతకా గూడా వున్నారు. నాలుగురోజుల పస్తుల్తో, ఎక్కడా కూలి దొరక్క, ఆత్మాభిమానం తనంతట తాను చావగానే వీళ్లందరూ కొత్త బిచ్చగాళ్ళై పూరి పొద్దెరగకుండా తిరుగుతున్నారు. ఈ మానవకోటి ఖాళీవున్న ప్రతి పేటలోనూ నిండిపోయింది. రోడ్లమీద, మురుగు దొడ్లలో, స్టేషనుముందు, దర్గాలమీద, స్మశానపు గేట్లముందు, శంకరలాల్ భోగాలాల్ తనదని చెప్పుకొంటూన్న ఖాళీస్థలంలో — ఒక టేమిటి? — అనంతమైన పూనాలోని అనారోగ్యకర ప్రదేశాలన్నింటిల్లో నిండి పోయింది. మా నగరంలో కొత్త డేరాలు వెలిసినై. కొత్తగొంతుల్తో కొత్తపాటలు వినబడుతున్నై —

* * * *

కాని పాత గొంతుల్లో జీవం తగ్గిపోయింది. ఎప్పుడూ నిశ్శబ్ద మెరగని రాత్రుళ్లుగూడా అనాథ నగరానికి నిశ్శబ్దాన్నిస్తునై.

"బిచ్చం దొరకటంలేదు బాబూ, ఎవరు పెడతారు యీ కరువురోజుల్లో? అందులో యీ సిటీల్లో పుణ్యం, పాపం జాలీ ఎక్కడున్నై?"

అన్నాడు తన సహజధోరణిలో మారుతి. మారుతి పల్లెటూరినుంచి వచ్చాడు. చాలా భక్తిపరుడు.

ఇప్పుడు ప్రతిరోజూ గులాబ్ సింగ్ లాఠీకి పని తగులుతున్నది. ప్రతిరోజూ అరవ గుమాస్తాలతో

ఓయ్యాపు దొంగధగలు నిర్ణయించటానికి జరిపే వాదనలు వదిలి, శంకర్‌లాల్ భోగాలాల్ స్వయంగా, రంగుపుష్పల శిబిరాలను పడగొయ్యటానికి రావలసి వస్తూనే వుంది. కుయ్యో, మొర్రో బాధాప్రలాపాలు అన్ని భాషల్లోనూ వినబడుతునే వున్నై—ప్రతి దినమూ.

* * * *

ముసలి యల్లమంద ఎప్పుడూ బిచ్చానికి ఒంటరిగా వెళ్ళటం నేను చూడలేదు. అతనివెంట ఎప్పుడూ నీడవలె ఆర్కాటు జిల్లా కరువునుండి తప్పించుకువచ్చిన మురుగేశన్ వుంటాడు. మురుగేశన్‌కు ఒక కాలు కొద్దిగా అవుడు. అత నెప్పుడూ యల్లమందకు ముందు నడవడు. వెనక వెనకనే, ఏవో కబుర్లు వచ్చీరాని హిందూస్థానీలో చెబుతూ, నడుస్తుంటాడు.

ముసలి యల్లమంద చేతిలో పొడుగైన కర్రొకటున్నది; దాని చివర చిన్న గజ్జలగుత్తి నొకటి కట్టాడు యల్లమంద. కర్రను భూమిమీద కొట్టినప్పుడల్లా అనేక వింతతాళం మోగుతుంది. దానికి అనుగుణంగా యల్లమంద గొర్రెమందల్ని కాచే గొల్లల మేలుకొలుపు పదాలు పాడతాడు. మురుగేశన్ మధ్య మధ్య తన గొంతుకూడా కలిపి 'అనుపల్లవి' వేస్తాడు. జోలెపట్టటం, మొయ్యటం గూడా మురుగేశ చేసే పనులే.

"తాతా!" అంటాడు దక్షిణాది మురుగేశ.

"ఏం మనవడా!" అని పితృభూమిలో గొర్రెల్ని మేపిన యల్లమంద పిలుపుకు జవాబిస్తాడు.

* * * *

కాని కొత్త సమ్వత్సరంవచ్చి పైబడ్డ తర్వాత కాళ్ళీడ్చుకుంటూ, ఆశలేని శూన్యమైన దృక్కుల్తో, ఆకలితో దిగాలుపడి, మేనెల వడదెబ్బలు తిని—అన్నింటినీ మించి—ఖాళీజోలెతో తాతా మనవళ్ళిద్దరూ ముఖనగరం చేరుతున్నారు. మళ్ళీ తెల్లవారుతుంది. మళ్ళీ ఆకలి. నిరాశ. శూన్యం. కాళ్ళ యీడ్పు. ఖాళీజోలె. నిశ్శబ్దంగా ఒకరితో ఒకరు మాట్లాడుకోనకుండా, దారిపొడుగునా పెదిమలు ఒక్కసారిగూడా విప్పకుండా, ముందాశ లేకుండా, ఒకచోటు విడిచి మరొకచోటుకు జరిగి, తిరిగి ఆ దుఃఖ వలయాన్నే పూర్తిచేయటానికి తిరిగివచ్చే—యీ యిద్దరు బిచ్చగాళ్ల మనసుల్లో ఏముందో ఎవరు చెప్పగలరు?

"ఎద్దుల్లాగే వున్నారు. పనిచేసుకోరాదా?"

ఎక్కడపని? ఏమిపని? ఎవరిపని?

"పరదేశి ముండాకొడుకులు. మహారాష్ట్రం నాపిడిచేస్తున్నారు"

పరదేశీలమా? ఆకలివేసి పక్కజిల్లాలని వచ్చాం. రాగూడదా? ఎవరూ ఆమాట చెప్పలేదే?

"ఛీ...మద్రాసీ..."

ఇద్దర్లో ఎవ్వరూ మద్రాసు చూడలేదు.

"ఆపండిరా! మీ బుర్రలేని పాటలు" బుర్రలేని పాటలు! హూఁ!! ఈ పాటలతో గాదా వేలకువేలు గొర్రెలు నెమరువేసి, గడ్డిపరకలు జీర్ణించుకొన్నది? ఈ గొంతుకాదా—తప్పిపోయి తిరుగుతూన్న గొర్రెపిల్లలకు పిలుపునూ, ఆశనూ, అభయాన్నీ అందించింది? తెలంగాణా ప్రల్లరి అడవులన్నీ గుర్తించగల ఈ పాటలా బుర్రలేని పాటలు? గుట్టల్లో, గుళ్ళల్లో పెళ్ళి సంబరాల్లో, కొలుపుల్లో, సంతల్లో వేలాదిని తలవూపించిన ఈ పాటల్లో లోపమేముంది?

ఏమైనా, గింజగూడా నిండని పిచ్చిజోలె, అరిగిపోయి శక్తిలేని కూలబడే కాళ్లు, అంటుపడ్డ డొక్కలూ, ముందున్న వస్తువును గూడా చూడలేని కళ్ళూ—యివీ కఠిన సత్యాలు.

మురుగేశన్ వుపాయాలు గూడా ఏవీ లాభించలేదు. స్టేషనుముందు కూర్చొని యల్లమందను గుడ్డివాణ్ణిగా మార్చినా కానీ రాలలేదు. తను కాళ్లకూ చేతులకూ మురికి నూనెగుడ్డలు కట్టుకున్నా రాగి నమ్మిడీ దర్శనం కాలేదు. ఇద్దరూ కుంటివాళ్లుగా తిరిగి జన్మఎత్తినా జోలె అడుగు పూడేస్థితి కన్పించలేదు. అడుగులేని యీ చిన్నజోలె!!!

పై పెచ్చుస్టేషను దగ్గర బీటు పోలీసుకు—యీ వేషాలన్నీ అనుమానం కలిగించినై. ఇక మళ్ళీ ఆ చెంతనా, చాయలాపోయే ఆ ప్రాకారం, హక్కు పోగొట్టుకొన్నారు. బస్సు స్టాండ్ వద్దగూడా యిదే తంతు. యీ పోలీసులకు ఎర్రబుట్టల్లేవు. వీళ్ల లాఠీలు చిన్నవి., అంతే భేదం!!

గులాబ్ సింగువచ్చి జోతె చూశాడు. కళ్లెర్ర జేసి యిద్దరి వంకా చూశాడు. అప్పటికే శిబిరాల నగరంలో దెబ్బలు తిన్న అనాథలంతా, వింతతో ఆకలిని మరిచేందుకనేమో యిక్కడచుట్టూ మూగారు. అందులో యింకా కొందరు ఏడుస్తూనే వున్నారు. మరికొందరు భయంతో వణికిపోతూనే వున్నారు. పిల్లలు, చిక్కి బొమికెల గూళ్ళై, కాకి రొమ్ములతో భయవిహ్వలులై గులాబ్ సింగు వంక చూస్తున్నారు. మరొక క్షణంలో దుఃఖనగర వాసులంతా అక్కడే వున్నారు.

యల్లమంద పెదిమలు కదిలి ఏదో జవాబుకోసం వెతుక్కుంటున్నాయ్. మురుగేశన్ కళ్ళు నేల మీదికి వాల్చాడు.

గులాబ్‌సింగ్‌కు అవమానం జరిగింది. ఎంత అవమానం — యీ మానం ? దయలేని లాఠీయుంగు, గతిలేని అనాథల నెందరినో మోది వాళ్ళ బొమికెలకు పదును బెట్టిన తన లాఠీయుందు గూడా యీ బిచ్చపు ముండాకొడుకు లికెంత దర్జా? పలకరా?

తపీమని యల్లమంద ఒకటి వడ్డించాడు. యల్లమంద కదలకనే కళ్ళెత్తి చూశాడు. గుంపులోని బిచ్చగాళ్ళలో కొందరూ పెద్దకేకల్తో అక్కడే కూలబడ్డారు. కొద్దిమంది తప్పుకుపోయారు.

యల్లమంద బాధ కనుపడనీయలేదు. జాలిగా చూస్తున్న మురుగేశన్ వంకకు దృష్టి మరల్చాడు. మురుగేశుకు ధైర్యం చెప్పే దృష్టి అది, ఒక ఆత్మను వేరొకటి కదిల్చి అగ్ని రగుల్కొల్పే దృష్టి అది. ఒక పీడితహృదయంనుంచి మరొక తాడిత హృదయానికి అర్థంలేని, వ్యక్తంగాని, మానవ సందేశాన్ని కొనిపోయే దృష్టి అది.

మురుగేసు ముఖంలోని భయం యిప్పుడు భయంకరంగా వంకర్లు తిరిగింది. నెత్తురు లేక ఆకలితోనే ఎర్రనైన నేత్రాల్లో నిప్పులు వేగిన విప్పును. ఒక్క తృటిలో అతని శరీరమంతా రౌద్రంతో బ్రహ్మాండమంతా తనుగా వుప్పొంగింది. మరు తృటిలో, గుండెలు విరుచుకు నిలబడివున్న గులాబ్ సింగు లాఠీని పైబడి మురుగేసు లాగుకున్నాడు.

యల్లమంద లంఘించి, సింగు జుట్టు లంకించుకొని కిందకు వంచాడు. మరి ఆలస్యం లేదు. మురుగేసు లాఠీ ఆ వంగిన నమూంమీద తాండవనృత్యం చేయసాగింది.

గుంపులో కొందరు బిచ్చగాళ్ళు అరిచారు. మరికొందరు "తన్నండి తన్నండి" అని కేకలు వేశారు. చాలామంది "పాపిష్టి ముండావాడు" అని దీవించారు. కొంచెం పుష్టివున్నవాళ్లు పొయ్యిరాళ్లు ఏరి పెద్దవాటిని పృథ్వీమీద కూలిన పీనుగను గులాబ్‌సింగ్ మీద బలంగా కుమ్మారు. మూలిగి, సింగు దొర్లిగింతలు పెట్టి కదలక మెదలక దుమ్ములో దుమ్ముగా పడ్డాడు. చుట్టూ రక్తం చిన్న పెద్ద మడుగులుగా నిలిచింది.

మురుగేశ్ అందరివంకా చూసి—

"చూస్తారేంరా, పిచ్చముండా కొడుకుల్లారా" అని అరిచాడు.

బిచ్చగాళ్లందరూ భయపడ్డారు — తమనెక్కడ చంపుతాడోనని. కాని ఒక ముసలి బిచ్చగాడు రక్తంలోపడిన తన పేలికల తలపాగా కొరకు వంగగానే, మురుగేసు ఒక్కతన్ను తన్నాడు.

"ఇటు — తే" అన్నాడు కళ్ళెర్రతో. వాడు భయంతో వణికి రక్తంలో తడిసిన ఎర్రగుడ్డ నిచ్చాడు.

మురుగేసు దాన్ని గులాబుసింగు లాఠీకర్రకు కట్టాడు. దాన్ని అక్కడే నిలబెట్టాడు.

"పదండి పదండి. మన బియ్యమంతా సేఠ్ కొట్లోవున్నై."

బిచ్చగాళ్ళంతా సేఠ్‌కొట్టువున్న పాతమేడవైపు నడిచారు. మురుగేసు ముందుకెళ్ళి చూశాడు. ఘోగాలాల్ అప్పటికే పలాయనం చిత్తగించాడు.

కొంచెం వదులుగా వున్న బియ్యం బస్తాను పిచ్చి శక్తితో ముందుకులాగి మురుగేసు అందరికీ చూపి—

"తీసుకోండిరా" అని గర్జించాడు.

* * * *

నేను క్లబ్బునుంచి తిరిగి వచ్చేటప్పటికి బిచ్చగాళ్ళ శెండా చుట్టూ పోలీసులూ మేజస్ట్రేటులూ కనిపించారు.

# సహోదరులు

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

వీరాస్వామి సంధ్య చీకటి వేళ చంద్రయ్య ఇంటి తలుపు కొట్టినాడు. తెలుగు దినపత్రికను ఎడమ చేతితో పట్టుకునే కుడిచేతితో తలుపు తెరచి— వీరాస్వామిని లోపలికి రమ్మన్నాడు చంద్రయ్య.

“చంద్రయ్యా! మన ప్రయత్నాలన్నీ వ్యర్థమై పోయేటట్లు కనబడుతున్నాయి. విభయిమందిని పోగు చేసుకొని—చలమయ్య ఆ ఊరు వెళ్లనే వెళ్లినాడు. మనము ఖర్చు పెట్టిన సొమ్మూ—పడిన శ్రమా వ్యర్థమైపోతాయేమో ననిపిస్తున్నది. ఏదో ఉపాయము చూసి నన్ను గట్టున పడవెయ్యి” నిలుచబడే చంద్రయ్య ముఖములోకి చూస్తూ అతడి రెండు భుజాలమీదా చేతులు వేశాడు వీరాస్వామి.

“చలమయ్య ఆ ఊరు వెళ్ళాడనేనా నీ భయము? నేను ఆ చలమయ్యకంటె ముందుగా – అంతకంటె ఎక్కువమంది జనముతో – తెల్లవారక ముందే వెళ్లి – నీవు కోరినంత ప్రచారము చేసివస్తే సరికదా! భారమంతా నాపైన పెట్టి – నీవు నిశ్చింతగా ఇంటికి వెళ్లు. కాని ఒక్క మాటమాత్రము మనసులో ఉంచుకో. మనకు సహాయపడుతున్న వాళ్ళకు కొంత విరివిగా డబ్బు ఖర్చుచేయవలసి ఉంటుంది... చూసుకో... రేపు ఈవేళవరకూ...ఎంత పని జరుగుతుందో? ఆ చలమయ్యను చూస్తేనే అంత భయపడతా వెందుకు? వాడు లెక్కపెట్టతగిన మనిషనా నీ అభిప్రాయము?” చంద్రయ్య తనతోపాటు వీరాస్వామిని కూడా మంచముమీద కూర్చోబెట్టుకొని – “ఏం వీరాస్వామీ! నా మాటమీద నీకు నమ్మకము కుదరటము లేదా?” అన్నాడు.

“లేకేం? చాలా ఉన్నది. ఆ చలమయ్య తగని వాడు. అతడివాక్కు ఎటువంటిదో గాని...ఒక్క మాటతో అందరూ అతడికి లోబడిపోతారు. చిల్లిపైస చేతిలో లేకుండానే ప్రచారము సాగించుకొని వస్తున్నాడు. ఆ జిల్లా సాంతము అతడి మాటమీద నడుస్తుందని అందరూ అనుకుంటున్నారు.” అని ఒక్కసారి దీర్ఘముగా ఊపిరి తీసుకొని విడిచాడు వీరాస్వామి.

“ఇదుగో స్వామీ! నీవు ఇప్పటినుంచీ ఊరికే దిగులుపడుతూ కూర్చోకు. జయాపజయాలు మొదలుపెట్టిన దగ్గరనుండే లెక్కచూసుకుంటూ దిగులు పడకు. నేను ఆ చలమయ్య అంతు కనుక్కొనిదీ ఈసారి విడిచిపెట్టను. నీకు చేసిన వాగ్దానము ఏమాత్రము మరువను. ఆ భారమంతా నామీద ఉంచి నీవు నిశ్చింతగా ఉండు.”

మంచము మీదినుండి ఇద్దరూ లేచి వాకిటి ముందుకు వచ్చి నిలువబడ్డారు. వీరాస్వామి పదినూరు రూపాయల నోట్లను రెండుసార్లు లెక్కపెట్టి చంద్రయ్యవట్టుజేబులో పెట్టి—అతడి ముఖము వంక చూశాడు.

“రేపు పని పూర్తి చేసుకొని నాదగ్గరికిరా ఇప్పుడిచ్చినవి రేపటి ఖర్చుకేలే” చంద్రయ్యముఖము చూస్తూ—మనసులో ఆలోచించుకుంటూ వీరాస్వామి వెళ్లిపోయినాడు.

ఆ జిల్లాలో మోతుబరిరైతు అయిన చలమయ్య—శాసనసభకు రంగయ్యను అభ్యర్థిగా నిలువబెట్టవలెనని తీవ్రముగా కృషిచేస్తున్నాడు. ప్రజలను సమావేశపరచి ప్రచారము చేస్తున్నాడు. ఆజిల్లా ప్రజలకు మొదటినుండీ చలమయ్యమీద అపరిమితమైన భక్తిగౌరవాలు ఉన్నాయి. ప్రజల కొతడు వరము లిచ్చే దేవతగా కనబడుతున్నాడు.

స్వతంత్రముగా ఆజిల్లాకు అభ్యర్థిగా నిలువబడ దలచుకొన్న వీరాస్వామికి—చలమయ్య చేస్తూఉన్న ప్రచారమువల్ల కలవరపాటు హెచ్చినది.

‘రంగయ్య తెలివికి శాసనసభాసభ్యత్వము

తక్కువైనది కాబోలు! నిజంగా సభ్యుడు కావటమే తటస్థించినట్లయితే—వాడిని పట్టపగ్గాలు ఉంటాయా? రంగయ్యా! వట్టి పనికిమాలినవాడు! వాడి చదువెంత—వాడి రాజకీయపరిజ్ఞాన మెంత? నలుగురిలో నిలువబడి నాలుగుమాటలైనా మాట్లాడలేడు! అప్పు డెప్పుడో దోచిన ధనముతో—ఇప్పుడు ప్రచారము చేసుకొని—ఎన్నికలలో నిలువబడుతున్నాడు. ఒకవేళ—గెలవటమే నిజమైతే—పట్టపగలే దారులు దోయించడూ?...వీడిని గెలువనిస్తే... నేను కోటయ్య కొడుకు నేకాదు!' అనుకున్నాడు వీరాస్వామి. తెల్లవార్లూ కంటికి నిద్ర లేకుండా యోచించసాగినాడు. తెలతెలవారుతుండగా చిన్నకునుకు పట్టినది. ఆ పట్టే పట్టని నిద్రలో వీరాస్వామి కంటికి చంద్రయ్య ప్రత్యక్షమైనాడు. మెలికలు తిరిగిన వెంట్రుకలతల. స్వదేశీ వస్త్రధారణమూ—పట్నవాసపు పాపోసులూ—చేతిలో కర్ర. ముఖము పైకెత్తిమాస్తేనేగాని చూపందని విగ్రహము—ముఖముమీద చిరునవ్వు. టకటక తలుపుకొట్టి 'స్వామీ! అన్నిటికీ నేనున్నానుగా!' అని చంద్రయ్య చెప్పినట్లనిపించింది వీరాస్వామికి.

చంద్రయ్యా! పదిమంది గ్రామస్థులకు జవాబు చెప్పగల దేహదారుఢ్యము కలవాడు. మాటలతో ప్రజల నాకర్షించగలిగినవాడు. అదిగాక—ఆ జిల్లా మొత్తముమీద చలమయ్య పేరు వినగానే అసహ్యించుకొని పళ్లుకొరికేవాడు ఒక్క చంద్రయ్యే! ఇతడే తన కన్నివిధములా అనుకూలమైన వ్యక్తి అని వీరాస్వామి భావించుకున్నాడు.

* * * *

అది నవభారతములో ప్రజాప్రభుత్వపు ప్రథమ ఎన్నికల సంరంభకాలము. అత్యుత్సాహముతో ప్రజలు కేరింతలు కొట్ట నారంభించినారు. ఏభయి సంవత్సరాల శాంతి సమరము తరువాత—నేడు సంపూర్ణస్వాతంత్ర్యము. ప్రజాస్వామ్యము!

తెలిసినవారికీ తెలియనివారికీ ఒకటే సందడి. ఎన్నికలసందడి! ప్రతి గ్రామములోనూ ఎన్నికల ప్రచారము అఖండముగా సాగిపోతున్నది. జీపుకార్లూ—పెద్దకార్లూ—లౌడ్ స్పీకర్ల నలంకరించుకొని—ప్రచారకులతో తిరుగ నారంభించినవి.

'కడుపునిండా అన్నమూ—ఒంటి నిండా బట్టా మీకు దొరకవలెనంటే మన జిల్లాలోకి సమర్థుడైన రంగయ్యకే మీఓటు ఇవ్వండి అని కేకలు వేస్తూ ఏభయి మంది జనము కాగితాలను పంచుతూ వీధులవెంబడి బయలుదేరినారు. ఆ గ్రామములోని పిల్లలు వారిని వెంబడించినారు. ఊరిబైట రచ్చబండ దగ్గర పెద్ద సమావేశము జరిగినది. రంగయ్య ప్రతిభాసామర్థ్యములను గురించి సుమారు ఒకగంటసేపు ఒకరు ఉపన్యసించినారు. గ్రామస్థులకు రంగయ్య పేరు బాగా మనసున పట్టినది.

ఆ గుంపు ఆదినము అక్కడినుండి బయలుదేరి మరునాటికి మరొకగ్రామములో ప్రచారము చేయటానికి ఏర్పాటుచేసుకున్నది.

ఆ మరునాడు ఆ గ్రామములోకి మరొకగుంపు బయలుదేరివచ్చింది. 'బీదజనులకు న్యాయముజరుగవలెనంటే—బీదలు మానవులుగా భావింపబడవలెనంటే—దీనదయాళుడైన వీరాస్వామికే మీ ఓటు నివ్వండి. దాంభికులను నమ్మబోకండి!'

జనసమూహము ముందుకుసాగిపోతున్నకొలదీ-ఆ నినాదాలు ప్రజల హృదయాలలో నాట్యము చేయసాగినవి. 'ప్రతిమనిషికి కడుపులోకి అన్నమూ, ఒంటికి బట్టా ఏర్పాటు చేయకలిగినవాడికే మా ఓటు' అని నిశ్చయించుకొన్న ప్రజలకు-రెండవసారి జరిగిన ప్రచారముతో ప్రథమంలో కలిగిన అభిప్రాయము మారిపోయినది. బీదలను కష్టాలను తొలగించి—బీదలను కూడా మానవులుగా భావించే మహానుభావుడున్నట్లయితే తమ ఓటును ఖండితముగా ఆయనకే ఇవ్వవలెనని ప్రజలు నిశ్చయించుకున్నారు.

మూడవనాడు ఆ గ్రామవీధులలో మరొక సమూహము తిరిగినది.

ఆ సాయంత్రము మరొకటి సంచారము చేసినది. తాము అంతకుపూర్వము చేసిన ఘనకార్యములను విపులీకరిస్తూ కొన్ని జీపుకార్లు గ్రామసంచారము చేసినవి.

ఆ గ్రామములోని ప్రజల ఓట్లకు వారసులనేకులైనారు. ఒక్కొక్క సంస్థ ప్రచారము చేసుకొని—ఓట్లను కాయపరచుకొని-సాగిపోయినది.

భుజబలముగల ఏభయిమంది జనముతో

చంద్రయ్య బయలుదేరి గ్రామగ్రామమూ సంచారము సాగించినాడు.

మార్గశిరమాసపు చలి మానవులను గడగడ వణకించి వేస్తున్నది. పుచ్చపువ్వువలె వెన్నెల విరియకాస్తూ ఉండగా చంద్రయ్య వెంబడి బయలుదేరిన జనము ఏలపదాలు పాడుకుంటూ నడుస్తున్నారు. ఇంకా కోసెడు దూరము నడిస్తేనే గాని గమ్యస్థానము చేరుకోనరు. త్వరపడి-చలమయ్యకంటె ఆ గ్రామము చేరుకొని ప్రచారము చేసుకోవాలి.

పొడుగుపాటి కర్రలను చేతపట్టుకొని నలుగురు మనుష్యులు ముందు నడుస్తున్నారు. చంద్రయ్య లంకపొగాకు చుట్టను వెలిగించి గుప్పుగుప్పున పొగ విడుస్తూ - తల వంచుకొని ఆలోచించుచూ - నడుస్తున్నాడు. తక్కినవారంతా ముందుగా వెళ్లినవారిని అనుసరించుచున్నారు.

గ్రామము కనుచూపుమేర వరకూ వచ్చినది. పొలిమేర సమీపములో — ఒక పాకలోనుండి జన సందడి చంద్రయ్యకు వినవచ్చినది.

ఆ సందడి చలమయ్య పార్టీది కాదుగద!

చంద్రయ్య మనసు ఉద్రేకించినది. చలమయ్య కంటె ముందుగా గ్రామము ప్రవేశించవలెనని అతడి ల్పము. ఆ చలమయ్య అదేమి మనిషో - జనాన్ని క్షణాలమీద కూడగట్టుకొని — తనచేతిక్రింద పెట్టుకుంటాడు! ఎక్కువగా ఏదైనా ఖర్చు చేయడు!

చంద్రయ్య రక్తము ఉడుకెక్కినది. జేబులోని పైకము గలగలలాడినది. వెంటనే తలమీది ముసుగు తీసి — చంద్రయ్య తన జట్టువారికందరికీ చేతిసైగ చేసినాడు.

అందరూ ఒక్కపరుగున పాకమీద పడినారు.

* * * *

ఎన్నికలు జరిగేవరకూ చంద్రయ్య ఊళ్లమీద తిరుగుతునే ఉన్నాడు. ఎన్నికల బాబతు పైకము అతడిసంచిలో ఏమాత్రమో నిలచి—అతడిని కలకత్తా పట్టణమువరకూ లాగుకొని పోయినది.

క్రొత్తగా పట్టణపు విశేషాలనూ వింతలనూ చూసి ఆనందిస్తున్న చంద్రయ్య—తిరిగి గ్రామము చేరుకొనటానికి కావలసిన పైకముమాత్రము అట్టి పెట్టుకొని - మిగిలినదంతా ఖర్చుచేయ నారంభించాడు. అతడికా సంబరములో ఎన్ని దినాలు గడచినవో గమనికేలేదు.

ఒకనాటి ఉదయము హోటలులో కాఫీ త్రాగుతుండగా తెలుగు పత్రికలో ఎన్నికల ఫలితాలు పెద్దక్షరాలలో కానవచ్చినవి.

ఓట్లు ఎక్కువ సంఖ్యలో సంపాదించుకొని— ఎన్నుకొనబడిన వ్యక్తి చంద్రయ్య పార్టీకాదు—చలమయ్యది అంతకంటె కాదు—మూడవపార్టీ వ్యక్తి!

చంద్రయ్య మనసు ఒక విధముగా సమాధానము పొందినది. తాను నిలువబెట్టదలచిన వ్యక్తి ఓడిపోయినా చలమయ్యపార్టీ మనిషిమాత్రం గెలువలేదని!

* * * *

చంద్రయ్య ఇంటికివచ్చి విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఈసంగతి వీరాస్వామికి తెలిసి చూడటానికి వచ్చాడు.

“నేను రెండుసార్లు మీయింటికి వచ్చాను అయ్యా. నీవు ఊళ్లోలేవా ఏం—కనబడలేదు” అన్నాడు వీరాస్వామి.

“ఆ రోజులలో తిరిగిన తిరుగుడుకు శరీరము చాలా అలసిపోయినది. గాలిమార్చితే బాగుంటుందేమోనని బయలుదేరి వెళ్ళాను” తలవంచుకొని అన్నాడు.

వీరాస్వామికి చంద్రయ్యతో ఏమి మాట్లాడవలెనో తోచలేదు. ‘అట్లాగా! ఇప్పుడు ఆరోగ్యము బాగున్నదికదా!’ ఈ మాట మాత్రము నిర్వికారముగా అనగలిగాడు.

అయిదునిమిషాలపాటు ఇద్దరిమధ్య నిశ్శబ్దము భరించరానిదిగా తయారుఅయింది. చివరకు చంద్రయ్య ‘చూస్తున్నావుగా వీరాస్వామీ! న్యాయముగా గెలవటము చాలా కష్టమైన పని’ అన్నాడు ఇంటికప్పును చూస్తూ.

“అవును. ఓడిపోయినాను గనుక న్యాయము నావైపే ఉన్నదనుకోవాలి.” తల ఆడిస్తూ వీరాస్వామి గడపదాటి వెళ్లిపోయినాడు.

చంద్రయ్య మాట్లాడకుండా భోజనముచేసి పడుకున్నాడు.

రాత్రి పన్నెండుగంటలవేళ చంద్రయ్యకు నిద్రలో మెలకువ వచ్చింది. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఎక్కడినుండో ఎవరో మూలిగిన శబ్దము చంద్రయ్యకు వినబడ్డది.

మొదటిసారి రెండవసారి పరాకుగా విన్నాడు.

మూడవసారి నాలుగవసారి బాగా స్ఫుటముగా వినబడ్డది.

మనసుపెట్టి విన్నకొలదీ సమీపమునుండే విన వస్తున్నట్లుగా చంద్రయ్యకు తోచింది. భార్యను లేపి అడిగినాడు.

"మొన్నటి ఎలక్షను గడబిడలో బావగారికి బలమైన దెబ్బలు తగిలాయట. తలమీద పెద్దగాయమైనదట. కాలి ఎముక విరిగినదనుకుంటున్నారు. నిలబడ లేరట. చాల బాధపడుతున్నారట" కంట్లనులుపుకుంటూ జంకుతూ చెప్పింది భార్య.

'నీకెవరు చెప్పారు?' అన్నాడు ఆశ్చర్యముతో.

'బావగారి రాముచెప్పాడని మన పని మనిషి అన్నది. వాళ్ళమ్మ నిద్రాహారాలు లేకుండా ఏడుస్తున్న'దని చెప్పాడట!

అంతలో 'అబ్బా! అని బాధకొద్దీ మూలిగిన శబ్దము తిరిగి వినపడ్డది.

చంద్రయ్య బలవంతముగా నిద్రపోవటానికి ప్రయత్నించాడు. మూలుగు చెవినపడినప్పుడెల్లా దేహము జలదరించి మనసు కలతపడ నారంభించింది.

ఆశబ్దానికీ ఈహృదయానికీ ఏమి సంబంధమో- ఆ మూలుగునకు చంద్రయ్య హృదయములోని నరాలు తోడుపలుక నారంభించినవి.

రెండుచేతులతో తలపట్టుకొని చంద్రయ్యపోరగిల పడుకున్నాడు.

ఈసమయములో తనతల్లే ఉన్నట్లయితే ఆమె హృదయమెంత తరుగుకొని పోయెదో! చలమయ్యనూ చంద్రయ్యనూ గన్నతల్లి శంకరమ్మ ఇద్దరిని చెరి ఒక కన్ను అనుకొనేది. కుమారద్వయము జన్మించిన నెలకే తండ్రి హృద్రోగముతో అకస్మాత్తుగా చనిపోయినాడు. ఆయింటా—ఆయింటాపనిచేసి— వంటలుచేసి బిడ్డలను పెంచుకొన్నది ఆతల్లి. ఆమె నోటి మంచితనమువల్ల బిడ్డలకు రెండు అక్షరపుముక్కలు అంటి జీవనోపాధులు కలిగినవి.

బాల్యములో అన్నదమ్ములిద్దరికీ - ఇతరులకు అసూయను పుట్టించేంత వాత్సల్యము ఒకరిపైన ఒకరికి ఉండేది. పాతికేళ్ళ కిందట కూడా - తమ్ముడికి జ్వరము రాగానే - ఆదుర్దాతో రెండు మైళ్ళ దూరము నడిచివెళ్ళి అన్న మందు తెచ్చియిచ్చేవాడు. అన్న పథ్యములోకి కావలసిన ఆవుపాలు పొరుగూరినుండి - సూర్యోదయానికి పూర్వమే తమ్ముడు తెచ్చియిచ్చేవాడు. తనకు లభ్యమైన చిరుతిండిని చేతబట్టుకొని అన్న వచ్చేవరకూ ఎదురు చూస్తూ తమ్ముడు వాకిట్లో నిలువబడేవాడు. తమ్మునితో పంచుకొననిదే అన్నకు ఏ వస్తువూ సహించేది కాదు. వాళ్ళ హృదయాలు పరస్పరమూ మారుమ్రోగుతూ ఉండేవి.

యౌవనము పొడచూపి వ్యక్తిగతజీవితములారంభమయే వరకూ ఏ మార్పూ ఉన్నట్లు కనబడలేదు. ఒకనాడు చంద్రయ్య సామానులకొరకు బజారుకు వెళ్ళాడు. బేరము కాగానే - సెట్టి "బేరములో అన్నయ్యగారిని మించిపోతున్నారే!" అన్నాడు.

"అంటే?"

"అంటే ఏం లేదులెండి. అన్నయ్యగారిది అదోకమాదిరి మనసు" అన్నాడు సెట్టి.

ఇంటికి వస్తూనే చంద్రయ్య తల్లిని భోజనము పెట్టమన్నాడు. "నాయనా! వంట సాంతమయిన తరువాత భోజనము చేతువు గాని. అన్నయ్య కూడా తొందరపడుతున్నాడు. పావుగంట తాళితే అయిపోతుంది" అన్నది.

మాట్లాడకుండా చంద్రయ్య పెళ్లి గదిలో పడుకున్నాడు. అన్నగారి గదిలోనుంచి కిలకిలనవ్వులు వినబడుతున్నాయి. రెండేళ్ళ పిల్లవాడు వచ్చీరాని మాటలలో తండ్రితో దాగుడుమూతలాడుతున్నాడు.

చంద్రయ్య కానాడు మనసు స్వాధీనములో లేదు. కారణమేమో అతడి ఊహ కందలేదు. బాలుడి కేరింతలు ఒకప్పుడు అతనికి ఆనందాన్ని కలిగించిన వేగాని యిప్పుడు చిరాకుపరచాయి. అంతలో తల్లి భోజనానికి పిలిచింది— "అన్నయ్య పీటమీద కూర్చున్నాడు. నీవుకూడా రా నాయనా!" అని.

చంద్రయ్య అన్యమనస్కుడై మెల్లగా లేచి పీటమీద కూర్చున్నాడు. చంద్రయ్య భార్య నెయ్యి వడ్డిస్తున్నది. గిన్నె పట్టుకొని చంద్రయ్యదగ్గర ఒక నిమిషముసేపు నిలుచబడ్డది. అతడు పరధ్యానములో ఉండగా చూసి బావగారికి నెయ్యి వడ్డించివచ్చి మళ్ళీ నిలువబడ్డది. చంద్రయ్యకు నెయ్యి వేయించుకొన బుద్ధి పుట్టలేదు.

అప్పటికి నాలుగేళ్ళక్రింద పొరుగూరినుండి- రామయ్య తనకూతురిని ఈయింటికి యివ్వవలెనని

అడుగుదామని వచ్చాడు. తల్లి రెండవపిల్లవాడికి—వచ్చే సంవత్సరము ఆ పిల్లను చేసుకొంటానని చెప్పింది. అతడు వినక వచ్చే సంవత్సరమైనా పెద్ద పిల్లవాడికిగాని యివ్వనన్నాడు. తల్లి కాదనలేక పోయినది. నిజానికి ఆ పిల్లదగ్గిరికి వరుడు హీనంగా కనబడుతాడు.

చంద్రయ్యకు ఆ విషయము తలవని తలంపుగా అప్పుడు జ్ఞాపకము వచ్చింది. ఆ రామయ్యకు ఇద్దగన్నదమ్ములలో కనబడ్డ వ్యత్యాసమేమిటి? తాను తరువాత ఎకరపు పల్లపుభూమి కట్నము తీసుకొని చక్కని పిల్లనే పెళ్లిచేసుకున్నాడు—కాని ఆ విషయము మాత్రము మరపుకు రావటములేదు.

లోతుగా ఆలోచించితే ఆ సంఘటనలలో ఒక్కటైనా పెద్దకారణ మనిపించుకోదు కాని—ఇవన్నీ అతడి మనసులో ఒకమూల కాపురము చేస్తూనే ఉన్నాయి—ఇప్పటికీ.

మధ్యాహ్నము నిద్రపోయి లేచేసరికి భార్య గదిలోకివచ్చి — కాఫీ గ్లాసు చేతికందించింది. 'చక్కెర చాలలేదన్నా'డు, ఆమె అమాయికముగా — 'ఎవరూ తక్కువైనదని అనలేదే!' అన్నది. వెంటనే 'అన్నయ్యేనా అననిది?' అన్నాడు.

మరునాటినుంచీ అన్నగారి పిల్లవాడిని ఎత్తుకొని ముద్దులాడుతున్న తన భార్యను—అకారణముగా కోప్పడి—పిల్లవాడిని వదలిపెట్టిరమ్మని అనబుద్ధిపుట్టింది అతనికి.

మనసులో బయలుదేరుతున్న ఆ విప్లవ మేమిటో దాని నామరూపా లేమిటో అతడికి తెలియలేదు కాని—ఆనాటినుండీ అతడి మనసులో ఒక భావము సంచారముచేయ నారంభించినది. సాంసారికముగా—సాంఘికముగా తమ యిద్దరికీగల వ్యత్యాసమూ—తారతమ్యమూ బాగా ప్రచారానికి వచ్చినాయి కదా? ఆ భేదసాదృశ్యాలు ఏవేవి? దాని జవాబు ననుసరించుకొని మరొక ప్రశ్న ఉదయించింది—'అయితే ఏది ఎక్కువ?' అని. స్వాభిమానము నిర్ణయానికి రానివ్వలేదు.

తల్లిపోయిన తరువాత—చంద్రయ్యకు ఏడాది బిడ్డ చనిపోయింది. ఆ ఊరిలో ఎరిగినవాళ్ళంతా ఆడా—మొగా—వచ్చి దంపతులను పలకరించి—సానుభూతి వాక్యాలు పలికి వెళ్ళారు. అన్న చలమయ్య మాత్రము నోటితో తమ్ముడినేమీ పలకరించలేదు కాని—అతడి ఒడిలోనే ఆ బిడ్డ కన్నుమూసింది. చలమయ్యే ఆ బిడ్డను తీసుకొని వెళ్ళాడు. పదిరోజులపాటు తమ్ముడి మంచముదగ్గర మంచము వేసుకొని పడుకొన్నాడు. తమ్ముడిని తన పంక్తికి భోజనానికి కూర్చుండబెట్టుకొని తమ్ముడు నోట్లో ముద్దపెట్టుకొన్న తరువాతనే తాను మెతుకు కొరికేవాడు. అప్పుడు ఇతరుల సానుభూతి వాక్యాలతో తాను అన్న సానుభూతిని పోల్చిచూసుకున్నాడు. అన్న నోటవెంట మాటే రాలేదు.

ఆతరువాతనే ఆ యింటిని రెండు భాగాలుగా పంచుకొని మధ్య తలుపులను బంధించుకొన్నారు. క్రమాగతముగా ఒకరిని చూడగానే మరొకరు ముఖము త్రిప్పుకోవటము కుటుంబములోని శుభాశుభ కార్యములలో ఒకరినొకరు పలుకరించుకొనకుండా ఉండటము జరుగుతూ వచ్చినది. బిడ్డలు మాత్రము ఇంటి ఆవరణములో తప్ప బయట మాట్లాడుకోవటము నిలుపుకొన్నారు.

“అబ్బా! తలపోటు!”

తిరిగి మూలుగు వినపడ్డది.

మంచముమీద పడుకొని సోదరునకూ తనకూగల గుణభేదాలను గురించి ఆలోచిస్తున్న చంద్రయ్య మూలుగును విన్న తరువాత మంచముమీద లేచి కూర్చున్నాడు.

గోడగడియారము ఖంగు ఖంగున రెండుగంటలు కొట్టింది.

“అమ్మా! ఊ!”

చంద్రయ్య దిగ్గున లేచి నిలువబడి—రెండునిమిషాలపాటు యోచించి—దక్షిణపు దిశన బంధించి ఉన్న తలుపును తెరువ ప్రయత్నించినాడు. ఆ తలుపులను బంధించి ఎనిమిది సంవత్సరాలకు పైగా కావటము వలన—గొడ్డలి సహాయముతో గాని గడియ పైకి లేచినది కాదు.

కరదీపిక చేత పట్టుకొని—సావడిలోనుండి—చంద్రయ్య గదిలోకి వెళ్ళి నిలువబడినాడు.

ఒక మూల సన్నగా దీపము వెలుగుతున్నది. మంచముమీద అన్న పండుకొని మూలుగుచున్నాడు. తలకూ కాలికీ కట్టుకట్ట ఉన్నాయి. వదినెగారు రోగికి విసరుతూ దగ్గరకూర్చున్నది.

చంద్రయ్య చేతిలో వున్న కరదీపిక చేయి జారి నేలమీద పడ్డది. అన్నను ప్రత్యక్షముగా చూసిన తమ్ముడు “చలమన్నయ్యా!” అంటూ మంచము మీద ఉన్న రోగిపైన బడి—తన హృదయానికి అతడిని అదుముకున్నాడు.

“తలబాధరా చంద్రీ! తలబాధరా!” తమ్ముని తన బాహువులతో బంధించుకొన్నాడు చలమయ్య.

అన్నదమ్ముల కౌగిలింతను గాంచిన తోటికోడళ్ళ హృదయాలలో 'ఎంతయినా వాళ్ళు ఒక తల్లిపిల్లలు!' అన్న భావము మెరపువలె మెరసింది.



లేపాక్షి దేవాలయములో నాట్యమంటపములోగల స్త్రీ ముఖశిల్పము.

# చారిత్రక శతకములు - భద్రగిరి శతకము



శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

తెనుగు శతకవాఙ్మయము మతివిస్తృతమయినది. తెనుగు శతకములలో శృంగార రసాత్మకములు, భక్తిరసభరితములు, నీతిజ్ఞాన వైరాగ్యబోధకములు, రాజనీత్యుపదేశకములు మొదలైన పెన్నిరకములో యున్నవి. ఇవి కాక రామాయణ, భాగవత కథలను దెలుపునవి కొన్ని; విద్యాసంస్కారవాసనా విరహితులైన గ్రామీణుల యమాయక వృత్తమును వర్ణించి నవ్వు పుట్టించునవి కొన్ని; బలాధికార గర్వాంధకారప్రమత్తులై ప్రజలను హింసించు రాజుల, దురాశాపరులై సామాన్యజనులను బీడించుకొని తిను దుష్టాధికారుల దుర్వర్తనమును నిరసించి నిందించు నధిక్షేపణాత్మకములు హేళనపరాయణములునైన శతకములు కొన్ని; కేవలము తత్త్వబోధ చేయునవి కొన్ని — ఇట్లు శతకములలో గలవిషయమును పురస్కరించుకొని రకముల నెంచుకొనుచు బోయినచో తెనుగు శతకవాఙ్మయమున నెన్ని రకములైన దేలును.

పైనుడివిన రకములు మాత్రమే కాక చరిత్రకుపకరించునట్టి, చారిత్రక సంఘటనలు జరిగినపుడు కవులు రచియించినట్టి శతకములు కొన్ని యున్నవి. ఇట్టివానిలో 'శత్రుసంహార వేంకటాచల విహార', 'రాక్షసవిరామ కస్తూరి రంగధామ', 'వైరిహరరంహ సింహాద్రి నారసింహ', వంటి మకుటములుగల శతకములు ముఖ్యమైనవి. ఇవి యన్నియు ముస్లిములు మన దేశములోని ఏదో యొక ప్రాంతముపై దండెత్తివచ్చి గ్రామములను దోచుకొని ప్రజలను హింసించుటతో తృప్తిచెందక యచ్చటి దేవాలయములను, అందలి విగ్రహములను నాశనము చేసినప్పుడచ్చటి దేవుని పేర జెప్పబడిన శతకములు. ఆస్వామిని రక్షింపుమని వేడుకొనుచు, రక్షింపవయ్యెనని నిందించుచు దమ యార్తిని వెలిబుచ్చుచు కవులు ఆ యాపత్కాలమున జెప్పిన శతకము లివి. మచ్చునకు చూడుడు గోగులపాటి కూర్మనాథకవి విరచించిన సింహాద్రి నారసింహ శతకములోని యీ క్రింది పద్యము :

"మున్ను తాటక ప్రాణముల్ గొన్న బాణంబు
మెఱసి సుబాహు దునిమిన విశిఖము
మించి విరాధు ఖండించిన ప్రదరంబు
ఖరదూషణాది సంహరణశరము
మాయల మారీచు మద మణంచిన తూపు
ఘోరకబంధుని గూల్చు సిలుగు
వాలిని బలశాలి గూలనేసినకోల
జలధి నింకించిన సాయకంబు
రావణాది మహాసురరాజి నణచు
చండకాండంబు లేమాయె చటుల యవన
ఖండనము సేయ నయ్యంబకముల బరపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!"

ఇట్టిదే వేంకటాచల విహార శతకములోని యీ క్రింది పద్యము నవలోకింపుడు :

వడిసుళ్లు సొచ్చి దేవళ్ళ బ్రద్దలు చేసి
ఘట్టించి తేజీల గట్టునపుడు
జిగురుపాలకటంచు జిగిరించు రావిమ్రా
కులు నజ్జు నజ్జుగా గొట్టునపుడు
గురు సార్వభౌముల గోడుపోసుక పట్టె
నామముల్ మొదలంట నాకునపుడు

గద్దించి వెస వైదిక బాపనయ్యల
  పిల్లజుట్లూడంగ బెఱుకునపుడు
సెక్కమా నీకు తురకల జక్కసేయ
విన్నవించితి నా వెఱ్ఱి విన్నపంబు
పరగ మీ చిత్త మిదె నాదు భాగ్యమూర
శత్రుసంహార ! వేంకటాచల విహార !

కవు లుద్రిక్త హృదయులై దేవుని తమ్ము రక్షింపుమని వేడుకొనుచు బ్రతిమాలుకొనుచు, రక్షణలేక పోయినప్పుడు తురకల విజృంభణము యథారీతిగ సాగుచున్నప్పుడు ఓపిక చెడి స్వామిసామర్థ్యమును గేలిసేయుచు పరిపరివిధముల స్వామిని దూఱుచు రచియించిన శతకము లివి. ఈ శతకములు ఆనాటి ప్రజలుపొందిన సంక్షోభమును బాధలను కడగండ్లను అద్దములోవలె ప్రతిఫలింపజేయును. తురకల దండయాత్రల సందర్భమున ఆంధ్రప్రజానీకము పొందిన దుర్భరమైన యార్తి రూపు గైకొన్న మూర్తు లీ శతకరాజములు. విపత్తు తొలగిపోయిన వెనుక కవి తాను చేసిన దూషణమునకు తన్ను క్షమించి రక్షించవలసినదని పరిపరివిధముల వేడుకొనును. వ్యాజస్తుతి, వ్యాజనిందాదులతో గూడిన యిట్టిశతకములు చారిత్రక విశేషములను దెలుపకపోయినను చారిత్రక సంఘటనలు కారణముగ బుట్టినవగుటచేత వీటిని చారిత్రక శతకములుగ పరిగణింపవచ్చును. ఇటువంటి చారిత్రక శతకములు తెలుగు శతకవాఙ్మయమున చాల పరిమితముగా నున్నవి. ఈ శతకము లన్నిటిని గురించి వ్రాయవలసియే యున్నను ఈ వ్యాసము వ్రాయసంకల్పించిన దందులకు కాదు. ఇటువంటి చారిత్రక శతకములలో తెనుగు పాఠకుల కంత యెక్కువగ దెలియనిదియు, తెనుగుదేశమున నంతగ ప్రచారములో లేనిదియు నైన భద్రగిరిశతకమును గుఱించి యెఱుకపఱుచుటయే నా యుద్దేశము.

## 2

భద్రగిరి శతకమును శ్రీ వావిళ్ళవారును, ఆంధ్ర సాహిత్య పరిషత్తువారును గూడ ముద్రించి ప్రకటించినారు. ఇంక నితరు లెవ్వరైన ప్రకటించిరేమో నాకు తెలియదు. ఇది పేరయ కవికృతము. ఇతని యింటిపేరు భల్లావారని గలదు. ఈ శతకమును ప్రకటించిన ఆంధ్ర సాహిత్య పరిషత్తువారును, శ్రీ వావిళ్ళవారును గూడ భల్లా పేరయయనియే ప్రకటించినారు. భల్లావారన్నదే సరియైన యింటిపేరేమో. చల్లావా రున్నారు; భల్లావారు కూడ నున్నారేమో తెలియదు.

ఇదివఱలో నుడివినట్లు ఈశతకమును కవి తురకలు భద్రాచలప్రాంతమునిమీదికి దండెత్తి వచ్చి ప్రజలను హింసలపాలుచేసి గ్రామములను దోచుకొని దేవాలయములను పాడొనరించి యందలి విగ్రహములను విధ్వంసము కావించుచుండిన సంవత్సరమున వ్రాసినాడు. ఆ కాలములో ఇటువంటి యుపద్రవము లంతకు పూర్వము సంభవించినపుడు శ్రీరంగమునుండి శ్రీరంగనాథుడును, జగన్నాథమునుండి నీలాద్రివాసుడును స్థలాంతరములకు వలస వెళ్లినట్లుగా భద్రాద్రివాసుడైన శ్రీరామచంద్రమూర్తి కూడ భద్రగిరిని విడిచి పశ్చిమగోదావరి జిల్లా పోలవరమునకు వలసవెళ్లి యచ్చట నయిదు సంవత్సరము లుండెను. ఇంతలో దుర్మార్గుల యుపద్రవ మంతరించి భద్రాచలమున శాంతి నెలకొనుటచేత అయిదు సంవత్సరముల ప్రవాసానంతరమున శ్రీరామచంద్రమూర్తి మఱల దన స్వస్థలమునకు జేరుకొనెను.

భద్రగిరివాసు డే కారణమున నెప్పుడు భద్రాచలమును వదలి పోలవరమున కరిగెనో, తిరుగ భద్రాద్రి కెప్పుడు వచ్చెనో యీ క్రింది పద్య మిట్లు తెలుపుచున్నది.

"సర్వధారను పేరి సంవత్సరమునందు
  ధంసాకు వెఱచి యిద్దరికి వచ్చి
పోలవరంబులో బొలుపొంద నైదేండ్లు
  వనవాస మొనరించి వరుసతోడ
శాక్తేయ మతయుతు సంహార మొనరించి
  మంత్రాంగశక్తి యిమ్మహిని వెలయ
దగ బూసపాటి సీతారామరాజు వి
  జయరామరాజుల సరసముగను(?)
విజయ సంవత్సరంబున విజయముగను
భద్రగిరి చేగి తౌనయ్య భద్రముగను
భద్రగిరివాస ! శ్రీరామభద్ర ! దాస
పోష బిరుదాంక ; రఘుకులాంబుధి శశాంక!

భద్రగిరివాస! శ్రీరామభద్ర! దాసపోష బిరుదాంక! రఘుకులాంబుధి శశాంక! యను మకుటముతో నున్న నూటయెనిమిది సీసపద్యముల ఈశతకమున కవి మొదటినుండియు నీ విటువంటి పరాక్రమశాలివి; అటువంటి ప్రతాపవంతుడవు; శత్రువీరుల నెందఱినో యవలీలగా గడతేర్చినావు; నీ వీ యవనుల నేల సంహరింపవు? వీరికి వెఱచి పోలవరమునకు బారిపోయినా విది యేటి పౌరుషమని భద్రాద్రివాసుడైన శ్రీరామచంద్రుని బరిపరివిధముల దూఱి, సూటిపోటుమాటల నా స్వామి నగుమపఱచి పలు విధముల నెత్తిపొడిచి నొవ్వ నాడెను. ఈ రీతి నవహేళనపూర్వకముగ నిందతో గూడిన పద్యము లీశతకమున నర్ధశతమును మించియున్నవి. యవనభయము తీరినది కాబోలు నంతటినుంచి కవి తాను పరిపరి విధముల నిందించి మనసు నొప్పించినందుకు దన్ను క్షమించి రక్షింపవలసినదని, నీ పాలబడితినని, శరణాగతత్రాణబిరుదము నీకే కాని యితరులకు లేదని భక్తావన పరతంత్రుడైన శ్రీరామచంద్రుని బహువిధముల వేడుకొనెను. ఇట్లు ఉత్తరార్ధమునందలి పద్యము లన్నియు పూర్వార్ధమునందలివానికి భిన్నములై స్తుత్యాత్మకములుగ నున్నవి. ఇట్టి పద్యముల తీరు తెలియుటకు పూర్వార్ధమునుండియు, ఉత్తరార్ధము నుండియు కొన్నిటి నిచట నుదాహరించుచున్నాను.

"పదియును రెండేనుల ప్రాయంపువాడవై
మించి తాటక నెట్లు ద్రుంచినావో
తఱుహూతులను దైత్యగణముల బరిమార్చి
కౌశికు సవ మెట్లు కాచినావో
కరముల బట్టి యెత్తగరాని హరువిల్లు
చెఱకుకైవడి నెట్లు విఱిచినావో
సంగరరంగవిశారదుడైన భా
ర్గవరాము నేరీతి గడపినావో
కాని తెలియదు అప్పటి క్రమము దలప
దురకదొరలన్న భీతిలి యుఱుకుదొరవు,
భద్ర..."

"ఈపాటి దొరవౌట యెఱుగక మిము నమ్మి
దేశస్థు లెల్లరు దిగులుపడిరి
ఈపాటి దొరవౌట యెఱుగక మిము నమ్మి
భక్తు లెల్లరు మ్లేచ్ఛబాధపడిరి
ఈపాటి దొరవౌట యెఱుగక మిము నమ్మి
సెట్టిపల్లియవారు మట్టమైరి
ఈపాటి దొరవౌట యెఱుగక మిము నమ్మి
యశ్వరాయడు భూపలాయనంబు
నొందె; నీపాటి దొరవౌట ముం దెఱింగి
కదనమునకు దురుష్కుండు గదిసె నహహా,
భద్ర..."

"ఇల్లు నప్పాలగంప యిల్లాలు చలచిత్త
పొన్పు నాగుల పుట్ట వదినె జేష్ట
గొల్ల పెంపుడు తల్లి కోడలు ఱాగ కూ
తురు పొఱుబోతు నాతురుడు సఖుడు
మనుమడు తంత్రి కాముకుడు కుమారుండు
క్షయరోగి మఱది వంచకుడు తండ్రి
యన్న పానఘనుండు నరయ నిష్టుడు పేడి
వేసదారివి నీవు వేయు నేల
ఇన్నియును నాదు నెమ్మది నెఱిగియుండి
కొలిచితిని మిమ్ము విశ్వాసగుణము దలచి,
భద్ర..."

"కలిమిచే విబుధుల గాన నేరనివారి
వారించు గుణశాలి వదినెగారు
నెఱి జేడనైనను నిల్చి చేపట్టియు
ధీరుని జేయు పత్నీలలామ
పతితాత్ముడైనను బావనుగా జేయు
గుణవతి ముద్దుల కూతు రరయ
నవివేకునైన విద్యావంతునిగ జేసి
గురురూప మొనరించు కోడ లెన్న
నిట్టి సంపత్తిగల మిమ్ము నెఱిగి భక్తి
గొలిచితిని వేగ నాకేమి కొదవ యింక,
భద్ర..."

ఈ కవి కవిత్వ మంత ప్రౌఢమైనది కాకపోయినను ఈ శతకమునకు చారిత్రకముగా ప్రాముఖ్యమెక్కువ. ఇటువంటి శతకములలో తురకలు చేయు దుండగములు మాత్రమే వర్ణితములు కాని చరిత్ర విషయములను దెలిసికొనుటకు దాకరములు మృగ్యములు. ఈశతకమునందును తురకల దండయాత్రవలన గలిగిన ఫలితములును బాధలును బహుధా వర్ణితములైనవి. చూడుడు :

శ్రీరామముద్ర లీక్షితిని నీరసమందె
"ఆక్చద్బశ్లై"రను నచ్చులమరె
గోవిందశబ్దముల్ గుఱిమాలి "బాహసేక్
యాహసే" నను పలుక్కులావహిల్లె
గరుడాశ్వగజరథవరవాహనములచే
బరగు వీథులు పీర్ల ప్రభల జెందె
సత్రశాలాంగణల్ చలువపందిరులు బ
ర్బరచి ఖాసాల చప్పరములయ్యె (?)
మత్స్యమాంసాదికముల నమరెను గోద
రేవు లెచ్చట గన్న గోరీల నమరె, భద్ర...

సంచరించిరికదా సమదాపసవ్యులు
విమలబృందావన వేదికలను
వీటిబుచ్చిరికదా విరులచే జెన్నొందు
ఘనమల్లికా పుష్పవనచయంబు
[illegible]ాళు చేసిరికదా కళ్యాణమండపా
గారవాహన గృహాంగణములెల్ల
గొల్లలాడిరికదా కోమల నవ వీచి
కల నొప్పు దివ్యగంగా ఝురముల
చూఱవట్టిరి పురమెల్ల జొచ్చి విప్ర
మందిరములన్ని తురకలు మత్తులగుచు, భద్ర..

ఇటువంటి పద్యములే కాక చారిత్రక సూచనలు కల పద్యములును ఎన్నియో యున్నవి. అవి యన్నియు తెలుగుదేశచరిత్ర కుపకరించునవే. వాటి ననుసరించి యీ శతక రచనాకాలమును నిర్ణయింప వచ్చును. అట్టి పద్యము లివి :

"కైకవరము జ్ఞాపకము వచ్చెనో మళ్ళి
వనముల జరియింప వసుధలోన
నీలాద్రిపతి జూచి నేరిచికొంటివో
వలసలు వోవ నీ వసుధలోన
పట్టిసపతికి జెప్పదలంచి పోతివో
వలసపే రిడికొని వసుధలోన
రామలదేవు కారణజన్ము డని తోచి
వరమీయ బోతివో వసుధలోన
లేక యిది యేమి వింత ముల్లోకములను
జడిసి వేంచేసితి వటన్న జమెపుగాడె,
భద్ర..."

"అరబుసిద్దీల దివ్యాజ్ఞలో వర్తించి
చేరి మేకల జపా సేయలేక
వరుసతో ధరియించు వరభూషణము లిచ్చి
యుడుకు నూనెల జేయి యుంచలేక
సెట్టిపల్లియవారి జేయు నిర్బంధంబు
సోరిది మీరగ గనుల జూడలేక
తమ గుమాస్తా యనదగు నశ్వరాయని
కరుణ మీరంగను గాంచలేక
తొలగిపోతిరి; మీవంటి దొరల నమ్మి
కొలువదగునయ్య దీనులు కొలదిమీరి,
భద్ర..."

"శబరి విందయ్యెనే సరభసంబున మీకు
భావింప రామలదేవు భక్తి
హనుమంతుడయ్యెనే యతి సాహసుండగు
జోగిపంతుల యుక్తి చూడ మీకు
సుగ్రీవు డయ్యెనే సోరిది గోరుందొర
కష్టానుఘనుడు మీ కార్యమునకు
ఘన ఋశ్యమూక మయ్యెనె రాజమాహేంద్రి
వర మెన్న మీ మనోవాంఛ దీర్ప
కాకయుండిన నిచ్చటి రాక కేమి
కారణం బెన్న మీవంటి ఘనునకరయ,
భద్ర..."

"జోగిపంతులకు మెచ్చులు వల్కబోతివో
యంగిరీజాల ప్రాపు నిచ్ఛగించి
తురకరూపము దాల్చుతరి వచ్చెనో మ్లేచ్ఛ
సంహార మొనరింప జగ మెఱుంగ
శాఖామృగంబుల జతగూర్ప ఋశ్యమూ
కము జేరబోవుటో క్రమముతోడ
నన్ను ధన్యుని జేయ నాచేత బద్యముల్
చెప్పింప బూనుటో యొప్పమీర
గాక యిది యేమి వింత ముల్లోకములను
వలస వేంచేసితిరటన్న నలుసు గాదె,
భద్ర..."

"అగ్నివర్ణాది వీరాగ్రేసరుల కంటె
మిక్కిలే సోల్జారు లక్కజముగ
వృశ్చిక రోమాదివీరుల కినుమశే
సిఫరు షెంషేరుల సిద్దిబలము
ఇంద్రజిత్తాదుల కెక్కుడే తలపోయ
ధరణిలోపల గుముందాను లరయ
నవని రాక్షసమాయ కధిక మే లెక్కింప
మొగలాయి మర్మంబు మొగి దలంప

బోసగ త్రేతాయుగంబు రక్కసులకంటె
గలియుగమునాటి తురకలు ఘనమె మీకు,
భద్ర.

పితృకార్యమునకునై పినతల్లికోరిక
వెఱవక తీర్చిన వేల్ప నిన్ను
బదరేణువ నహల్యపాపంబు వెడబాపి
ధవుని గూర్చిన పుణ్యధనుని నిన్ను
పిగ గన్న బగవాని తమ్ముని లంకలో
బట్టంబుగట్టిన ప్రభువ నిన్ను
ఘను సుబాహుని బట్టి ఖండించి కౌశికు
సవము గాచిన సర్వసముడ నిన్ను
భక్తలోకోపకారార్థ పరుడ వగుచు
దూఱితిని నాదు నేరంబు దొలగజేయు,
భద్ర...

బలుసాకు మెక్కి ద్రౌపదిచేత వనములో
బొంకవావలిని గాపాడినట్లు
సరవి దెచ్చినపండ్ల సారం బనుభవించి
చెంచుముద్దియను రక్షించినట్లు
అడిగి తెచ్చిన ముక్కుటుకులు భక్షించి
చెలగి బాపని ధన్యజేసినట్లు
పెట్టిగానని తొటిరో బ్టికు బ్రతిమాలి
ముసలి యవ్వకు గీర్తి యొసగినట్లు
పూసపాటి నృపాలుర బ్రోవదలచి
తెచ్చుకొంటిరొ మీ కర్చు వెచ్చములకు,
భద్ర..."

"గోత్రికులని పాలు కొట్టి పోలేక మీ
యంశభూతులటంచు నడిగినావో
పేరుమోసిన కట్న మారసికొంటివో
శూరులనుచు నంత జేరినావో
మీ నౌకరులలోన మీరి మన్కటు దెచ్చె
నని చూపి వ్యయమున కలిగినావో
స్థలము వంశంబు మీ రోరుని పోలిక...(?)
బలు కష్టసుఖముల దెలిపినావో
యెట్టు దయచేసిరయ్య మీపట్టు మీకు
బూసపాటి కులోద్భవు బాసయెరిగి,
భద్ర..."

ఇందరు చారిత్రక వ్యక్తులను, ఇన్ని చారిత్రక విషయములను ఉదాహరించిన చారిత్రక శతక మింకొకటి తెనుగున నాకు గన్పింపలేదు. పై నుదాహరించిన పద్యములలోని వ్యక్తులను గురించియు విషయములను గురించియు దెలిసికొనినప్పుడు కాని యాకాలపు పరిస్థితులను, చారిత్రకముగ ఈ శతకము విలువయు బోధపడవు.

భద్రగిరి శ్రీరామచంద్రమూర్తి పోలవరమునకు వలసవెళ్లుటకు కారణభూతమైన యీ యవన దండ యాత్రకు నాయకుడు ధంసా. ఈతడీ శతకమున నిట్లభివర్ణితుడయినాడు :

రమణతో డుత నిభరాహిముఖానుని
నేల పుట్టించెనో యిలను బ్రహ్మ
పుట్టించె గాక యీ పుడమిలోపల నేల
ఫాజిలుబేగని పల్కజేసె
బల్కజేసినవాడు పదవి చాల నొసంగి
లీల జాల్దుంగుపే రేల తెచ్చె
దెచ్చినవా డేల దృఢచిత్తుగా జేసి
ధంసా యను కితాబు ధరణి నొసగె
నొసగి మిము గెల్చు సాహస మొనర నేల
చేసెనో యని మది జింత సేయవలదు,
భద్ర..." (104)

## 3

ధంసా యెవరు ? ఈతని యుదంత మేది ? ధంసానుగురించిన పద్యమును జదివినచో నతని పేరు మొదట 'ఇభరాహిముఖా' ననగా ఇబ్రాహింఖానని తెలియుచున్నది. ఇతనికి దరువాత వచ్చిన బిరుదు 'ఫాజిలుబేగు'; పెద్దపదవి చేకురిన పిదప ఇతనికి 'జాల్దుం'గని వ్యవహారనామము కలిగెను. అనంతర మతనికి వచ్చిన 'కితాబు' 'ధంసా'. ధంసా యన్నది కితాబే కాని అసలుపేరు కాదనుట స్పష్టము. ధంసా కీ బిరుదము లిచ్చిన దెవరు ? ఇత డెవరి కొలువులో నుండెను? ఎవరి యాజ్ఞ ననుసరించి భద్రాచలముపై ఈ దండయాత్ర జరిగినది? ధంసా భద్రాచలము నకు సర్వధారి సంవత్సరములో దండెత్తిరాగా శ్రీరామచంద్రు డాతనికి వెఱచి రాజుపోలవర మునకు వలసవెళ్ళి మరల విజయసంవత్సరమున దన స్వస్థలమునకు మరలివచ్చినట్లు పూర్వోదా హృతపద్యములలో గలదు. సర్వధారి విజయసంవ

త్సరములు చక్రనేమిభ్రమణ విధమున నలువదేండ్ల కొకసారి మఱల వచ్చుచుండు బార్హస్పత్యమానాబ్దములు. ఈ సంవత్సరములకు సరియైన క్రీస్తుశకవర్షము లేవి? సెట్టిపల్లియవారు, అశ్వరాయడు, రామలదేవు, గోరుందొర, జోగిపంతులు, పూసపాటి సీతారామరాజు, పూసపాటి విజయరామరాజులు ఈశతకకర్తకు సమకాలికులై ధంసా యుపద్రవకాలమున సం[illegible]నట్లు ఉదాహృతపద్యములవలన బోధపడుచున్నది. వీరంద ఱెవరు? అతి సాహసుడు జోగిపంతులు—శ్రీరామచంద్రునకు హనుమంతునివంటి వాడయ్యెనట. "గోరుందొరకప్తాను ఘనుడు" సుగ్రీవుడట. ఈ యుపమానములు ధంసాసంహార కార్యమున సార్థకములైన వగునా? ఇంగిలీజుల ప్రాపు నిచ్చగించి జోగిపంతులకు మెచ్చులు వల్కబోతివా యని శతకకర్త శ్రీరామచంద్రుని వలసకు కారణమడుగుచున్నాడు. ఈ విషయము లన్నియు నా కాలమునాటి చరిత్రను విశదము చేయునవి. వీటిని పరిశీలించి తెలిసికొనినచో ధంసాదండయాత్ర కాలమునాటి ప్రాగాంధ్రదేశచరిత్ర కొంత బోధపడగలదు.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారి శతకమునకు పీఠిక వ్రాసిన ట్లగపడదు; శ్రీవావిళ్ళవారు ప్రకటించిన యీ శతకమునకు శతావధానులును, చరిత్ర పరిశోధకులును అయిన శ్రీ శేషాద్రి రమణకవు లొక చిన్న పీఠిక రచించి యందు చారిత్రకముగ నీ శతక రచనాకాలమును గొంత చర్చించినారు. ఆ భాగము నిం దుదాహరించుచున్నాను:

"నైజాము ప్రభువులవద్దనుండి సామాన్య సైనికోద్యోగిగా నియమింపబడిన ధంసాయను యవనుడు వేల్పుకొండ (ఇది ఒరంగల్లునకు 24 మైళ్ళ దూరమున గలదు)పై దుర్గములు గట్టి దేశము నాక్రమించుకొనుటకు బయలువెడలి యెన్నియో దురంతములు గావించెను. ఈతని దురంతములు శ్రీనాథుని వేంకటరామ కవికృత అశ్వారాయ చరిత్రమునందు గలవు. దేశద్రోహులను కొందరను తనలో గలిపికొని గౌరవపాత్రములను సంస్థానములను పెక్కింటిని రూపుమాపి కడ కీతడు భద్రాచలమును ముట్టడించెను. పురవాసుల నందర నానావస్థలపాలు గావించెను. దేవళములో జొరబడి విగ్రహముల నెక్కడ బాడు చేయునోయని యర్చకులు శ్రీరామాది విగ్రహములను బోలవరమునకు రహస్యముగా బడవలపై నెట్లో చేర్చిరి. భక్తులందరు దిక్కుచెడి ధంసాచే నవస్థల బడుచుండ నీవు సుఖముగా బోలవరములో దలదాచుకొంటివా రామా! నిన్నింతతో నీ తురకలు విడువరని నిష్ఠురములాడుచు నీ పేరయకవి శతకమును రచించెను. ధంసా పరిపాలనమున శ్రీరామచంద్రుడు వలసకేగినట్లు భద్రాద్రిలోని శాసనమునందు గలదు. దాని నిట నుదాహరించెదము.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శా॥ శ॥ 1574 అగు నేటి వర్తమాన వ్యవహారిక చాంద్రమాన నందన నామ సంవత్సర వైశాఖ శు 8 (చైత్ర శు 9) లు భానువారము శ్రీ భద్రాచల సీతారామచంద్ర మహా ప్రభువువారి సన్నిధిని శ్రీరామదాసుగారు తానీషా గారి యనుమతి వెంబడిని జరిగించిన దేవబ్రాహ్మణ వృత్తులు శ్రీవారి సన్నిధిని జరుగు ఉత్సవప్రకరణములు వ్రాసియున్న శాసనము. ధంసా ప్రపంచములో శ్రీవారు పోలవరము వలస వేంచేసినపుడు వక దురాత్మగ్గుడు శాసనం చెక్కివేసినందున సర్వజనులు తెలిసి సంతోషించేటందుకు లేకపోగా ఆ దురాత్మగ్గుడు పుత్రమిత్రకళత్రాదులతో నశించిపోయినాడు"

—(ఆలయములోని శాసనము)

"ఈ విధముగా ధంసా దుర్నయము గ్రంథములందు శాసనములందు శాశ్వతమొనర్పబడెను. 104 వ పద్యమువలన ధంసా కధికార మిచ్చినవాడు నిభరాహిముఖానని తెలియును. క్రీ. శ. 1687 లో ఔరంగజేబు తన పుత్రుడగు మహమ్మదు ఆజాముతో గోలకొండ ముట్టడింపవచ్చినపుడు తానీషాయెడ ద్రోహము తలచి గుట్టు తెలిపినవాడును స్వామిద్రోహియు నగు ఇబ్రహీమె యిందు జెర్కొనబడిన యిభిరాహిము ఖాను. ఇతడు ఔరంగజేబు పరిపాలనకాలమున ప్రముఖుడై ధంసాచేత నింతలేసి పనులు చేయించెను.

"తానీషా రాజ్యాంతమున ఇబ్రహీము కాలము నుండి ధంసా ప్రముఖుడయ్యెను. ఔరంగజేబు అంత్యకాలము ధంసా విజృంభణకాలము నొకటియె. శ్రీరాముడు పోలవరమునకు వలస యేగినది సర్వధారి సంవత్సరమున. అక్కడ నున్నది ఐదేండ్లు. తరువాత పూసపాటి విజయరామరాజు సీతారామరాజుల కాలమున విజయసంవత్సరమున

దిరిగి భద్రగిరికి వేంచేసెను. వీని నన్నింటిని సమన్వయించితిమేని ఘంసా భద్రగిరిమీదికి వంచెత్తి (1923 నాటికి) రెండువందల సంవత్సరములైయుండు నని చెప్పవచ్చును. ఇది ఔరంగజేబు అంత్యకాలమునకు పూసపాటి విజయరామరాజు రాజ్యారంభకాలమునకు సర్వధారి విజయసంవత్సరములకు చేరువగా నున్నది. కాల నిర్ణయమును గూర్చి మఱియొకమాఱు విపులముగా వ్రాయుచున్నారము..."

శ్రీ శేషాద్రిరమణకవులు ఈ శతకకాల నిర్ణయమును గూర్చి మఱల నెప్పుడును వ్రాయలేదని నేననుకొనుచున్నాను; ఒకవేళ నెక్కడనైన వ్రాసిరేమో నాకు తెలియదు. ఉదాహృతపీఠికాభాగమున వారు శతకకాలమునుగూర్చి ఘంసాపంపమాత్రకాలమునుగూర్చి చేసిన నిర్ణయమాత్రము సరియైనది కాదని ముందు తెలుపబోవు విషయముల ననుసరించి పాఠకులే తెలిసికొనగలరు. పైని వారు చేసిన నిర్ణయమున బొరపాటున్నదనుటకు పూర్వోదాహృతపద్యములలో రామలదేవు, గోరంగోర, పూసపాటి విజయరామరాజు సీతారామరాజులకు గల సూచనలే చాలును.

గోరంగోర, రామలదేవు, పూసపాటి విజయరామరాజు గార్లను గుఱించి మనము బొబ్బిలిపాటలో వినుచునేయుందుము. ఇప్పటి బొబ్బిలి మహారాజు కథ—పాట—వేమన పద్యములవలెనే మొదట నుండుదానికి ఇప్పుడున్నదానికి పోలిక లేకుండ చాల పెరిగిపోయినది. దానిలో అప్పటికి నిప్పటికి ననేకములు మార్పులు చేర్పులు వచ్చినవి. బొబ్బిలి పాట ఆదిమప్రతిలో గోరం దొరను గుఱించి రామలదేవును గుఱించి యిట్లున్నది.

"దుబాసి నిప్పుడు కుదర్చగలవా పాపయ్యగారు
మహాప్రభో! బందరులో వున్నాడయ్యా గోరం దొరగారు
గోరంగోరా రెడ్డినాయఁడూ బేటికి వస్తేను
వారు ఇద్దరూ బేటికొస్తే నీకు దుబాసి కుదిరేని
అలాగైతే గోరందొరకూ జాబులు వ్రాయండి
గోరందొరకూ రెడ్డినాయనికీ జాబులు వ్రాసిరిగా
జాబులమీదా బూసీగారు మొహరువేసినారు
బేగిరావుల చేతికప్పుడూ జాబు లిచ్చినారు
ఘడమటి జాముప్రొద్దునకే బందరు చేరిరిగా
జాబులుతీసుక వచ్చినారుగా బేగిరావులేమీ
గోరంగోరా రెడ్డినాయడే కొలుసై వున్నారు
పరాసువారి పరమ్మానంటూ చేతికిచ్చినారు
గోరంగోరా రెడ్డినాయగూ జాబులు చదివిరిగా
చదువుతూనే దిగ్గన లేచిరి వారిద్దరేమీ..."

పీరు రుస్తుంబాసులో కలంకారి వ్రాయుచున్న సోమనాసు లక్ష్మన్నను నెల కేబదిరూపాయల జీతము మీద బూసీకి దుబాసిగా కుదిర్చినారు. పై చరణములలోని గోరంగొరయే శతకములోని పద్యములలో నుదాహృతుడైన గోరంగొర కప్తాను. అతని నివాసము మచిలీబందరు. ఇక రామలదేవునిగుఱించి యీ కథలోనే యిట్లున్నది :

"కొప్ప్వారి మామిడితోటలో ఎత్తిరి జండాలు
మూకలరోజులూ కొప్ప్వారిలో ముకాములైనారు
హైదరుజంగుకు లక్ష్మన్నను బూసీ పిలిపించి
కొప్ప్వారి మహాల్కు దొరలూ ఎవరంటడిగెను గా
మహాప్రభో! కొప్ప్వారి మహాల్కు దొరలు రెడ్డి నాయఁడేమీ
ఎక్కడున్నరో యేడ నున్నరో రెడ్డివార లేమీ
పోలారంలో వున్నారయ్యా రామలదేవారు
దివాణమంటే గడన లేదుగా జమీందార్లకేమీ
పన్నెండువేల్ రూపాయీ లతనూ బాకీదారుడుగా
నే కోటకొమ్మలతే యేలాం వేసి అమ్మించకపోను
నా కాళ్ల ఘూళినీ లేచిపోనుగా పోలారపు కోటా
కరకరకర జాబులు వ్రాయీ లక్ష్మన్న నీవు
జాబులలోపల ఏమని వ్రాసెను లక్ష్మన్న తాను
కూర్చుంటే కూర్చున్నలాగున బేటికి రావాలె
నిలుచుంటే నిలుచుండులాగున బేటికి రావాలె
లేకుంటే మరి నిలువబోదుగా పోలారపు కోట
జాబులు వ్రాసి బేగిరావుల చేతి కిచ్చినారు
రెండు జాముల లోపల వచ్చెను పోలారములోకి
రెడ్డివారి దివానుగిరి అద్దంకి చెంచు
... ... ... ... ...
జాబులు తెచ్చిన బేగిరావుకే విడుదులు చూపెంచి
జాబులు తీసుక కచ్చేరి కొచ్చె అద్దంకి చెంచు
పరాసువారి పరమా నొచ్చె రామలదేవారు
పరాసువారి పరమా ననగా గుండె జల్లుమనెను
పన్నెండ్వేల రూపాయలకు మనము బాకీదారులము
ఆ జాబులు తెలియా జదివినారుగా రామలదేవారు
దేశ మెరుగనీ పరాసుదొరలు దేశము కొచ్చిరి
మన యింటిమీదికి వచ్చి దిగిరి పరాసులైతేను
పన్నెండ్వేలరూపాయలకు మనము బాకీదారులము
కోటకొమ్మలతే యేలాంచేసి అమ్మించకపోరు

నూటికి వరహాలొప్పున పైకము వడ్డికి తీసుకొని
పన్నెండ్వేల రూపాయ లప్పును సంచుల బోసిరిగా
సంచులకు పోసి సీలు చేసికి రామలదేవారు
జివానుగిరి అద్దంకి చెంచును పైనముచేసిరి..."

కొవ్వూరు మహాలుకు ప్రభువు రామలదేవు (రామలదేవారు = రామలదేవు + వారు); పోలవరము నివాసము. ఇది పట్టిసమునకు సమీపమున గోదావరీ తీరముననున్న పోలవరము ఇదియే శతకమున రాజు పోలవరమని, జనవ్యవహారమున రెడ్డిపోలవరమని ప్రసిద్ధిగన్నది.

ఇక పూసపాటి విజయరాజుగారినిగురించి యాంధ్రలోకమునకు తెలిసిన విషయమే. వీరు విశాఖపట్టణమండలములోని విజయనగరరాజ్యమున కధిపతులు. వీరు క్రీ. శ. 1757 వ సంవత్సరమున బొబ్బిలియుద్ధమున విజయమును గాంచియు తుదకు తాండ్ర పాపారాయనిచే వధింపబడిరి. అయితే పూసపాటి విజయ రామరాజనామధారు లిరువు రున్నారు. బొబ్బిలి యుద్ధమున నిహతులైన విజయరామరాజుగారి భార్య చంద్రమ్మగారు—సంతానము లేకపోవుట చేత—సన్నిహిత జ్ఞాతియైన పూసపాటి రామభద్ర రాజుగారి ద్వితీయభార్య కుమారుడైన వేంకటపతి రాజను చిన్నవానిని పెంచుకొని ఆయనకు విజయ రామరాజను పేరు పెట్టి—మొదటి విజయరామరాజు గారి యనంతరమున విజయనగరరాజ్యమును పాలించిన ఆనంద గజపతిరాజుగారు మరణించిన వెనుక—ఆయనను పట్టాభిషిక్తుని గావించెను. ఈ విజయ రామరాజుగారు బాలురయినందున సవతియన్న గారగు పూసపాటి సీతారామరాజుగారు రాజ్యాధికారము నంతను వహించి, తమ్మునకు యుక్తవయస్సు వచ్చినపిదప గూడ రాజ్యము నాయన కొప్పగింపక తామే యేలుబడి నెరపుచువచ్చిరి. ఈ విషయములు తెలిసినపిదప శతక పద్యములలో నుదాహృతములైన సర్వధారివిజయ సంవత్సరములకు సరియైన క్రైస్తవాబ్దములను దెలిసికొనుట తేలికైన పని.

బొబ్బిలియుద్ధము క్రీ. శ. 1757 లో, అనగా శాలివాహన శకము 1679 కి సరియైన ఈశ్వర సంవత్సరమున జరిగినది. అందువలన శతకోక్తమైన సర్వధారి అంతకు పూర్వపుది మాత్రము కాదు; అటు తరువాతిదే కావలెను. ఈశ్వర సంవత్సరమునకు తరువాత వచ్చు సర్వధారికి సరియైన శకవర్షము 1690; క్రైస్తవాబ్దము 1768 – 69; సర్వధారికి పిదప విజయ శా. శ. 1695 (క్రీ. శ. 1773 – 74) లో వచ్చును. శ్రీరామచంద్రమూర్తి 1768 – 69 లో భద్రగిరి వదలి పోలవరమునకు వలసవెళ్ళి యచ్చట 1773–74 వరకు నుండెను. ఇదియే ధంసా దండయాత్రకాలము. భద్రాచలము తురకలక్రింద నున్నకాలము 1768–69 మొదలు 1773–74 వరకునని స్పష్టముగ దెలియ వచ్చుటచేత శతకమున నుదాహృతులైన పూసపాటి విజయరామరాజుగారు రెండవ విజయరామరాజుగారని, పూసపాటి సీతారామరాజుగారు ఆయనకు సంరక్షకుడై ఆయనకు బదులుగా రాజ్యపరిపాలనము నెఱపిన ఆయన సవతియన్న సీతారామరాజుగారనియు విదితమగుచున్నది.

ధంసానుగురించిన పద్యము బాగుగ జదివిన మీదట అతని నిజనామము 'ఇభరాహిముఖాన్' (ఇబ్రాహింఖాన్) అని నాకు తోచినది. ధంసా కధికారమిచ్చినవాడు ఇబ్రాహింఖా నని నా కర్థము కాలేదు. తానీషాయెడ ద్రోహము తలచి ఔరంగజేబు పాదుషాకు గుట్టుమట్టులు తెలిపెన ఇబ్రాహిమునకు ఇతనికి నేవిధమైన సంబంధము లేదు. గోలకొండ పతనమయినది క్రీ. శ. 1687 లో. ఔరంగజేబు పాదుషా లోకాంతరగతుడైనది క్రీ. శ. 1707 లో. ఔరంగజేబు మరణానంతర మరువది వత్సరములు గడచిన వెనుక భద్రాచలముమీదికి ధంసా దండెత్తి వెళ్లెను. తానీషా పరిపాలన మంతరించిన పిదప నించుమించుగా వంద సంవత్సరములకు జరిగిన దండయాత్ర యిది. అందువలన తానీషానాటి ఇబ్రాహిమును ఈ ధంసాయు నెంతమాత్రమును సమకాలికులు కారు.

పోలవరమునుండి శ్రీరామచంద్రమూర్తి మరల భద్రాచలమునకు విజయ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. 1774 లో తిరిగివచ్చెను. ఆ మరునటి సంవత్సరము జయలో (క్రీ. శ. 1775) మరల భద్రాద్రిలో శ్రీరామచంద్రుని కల్యాణము జరిగినది:

"శ్రీరామచంద్రులు సీతాసమేతులై
వచ్చి భద్రాద్రి వాసమునకు
జయనామ వత్సర చైత్ర శుద్ధాష్టమి
తరువాతి దినమందు దగ వివాహ
మరయ మార్గమునందు నౌరయ సత్రములు బల్
చలువపందిరులు పచ్చని జలములు
శీతోదకంబులు చిక్కని మజ్జిగల్
నిమ్మపండ్ల రసంబు నీరు చల్ల
లాదిగా గల్గు ద్రవ్యంబు లమరజేయ
వలయునని వేగ బంపుడీ వాయుసుతుని,
భద్ర..."

ఈ శతకము ధంసా దండయాత్ర సమయమున ప్రారంభింపబడి శ్రీరామచంద్రమూర్తి మరల భద్రాద్రికి తిరిగివచ్చినపిదప పూర్తి కావింపబడియుండును. అందువలన నిది క్రీస్తుశకము 1770, 1776 సంవత్సరములలో పుట్టిన దనుటకు సంశయింపబని లేదు.

(సశేషము)

# మంగుళూరు మెయిల్

## శ్రీ యన్ ఆర్ చందూర్

బొంబయి మెయిలూ, కలకత్తా మెయిలూ, బెంగుళూరు మెయిలూ మొదలైనవన్నీ ఒక ఎత్తు; మాంగళూర్ మెయిల్ ఒక్కటే ఒక ఎత్తు. మాంగళూర్ మెయిల్ అంటే నాకు మహా చెడ్డ కోపం. నన్ను అన్యాయం చేసిందది. దాన్ని తలుస్తేనే కడుపులో చెయ్యిపెట్టి కలచినట్లవుతుంది.

మంజులత—మంజుల—మంజు. మూడు నామాంతరాలు. మంజుల ఈనాడు వొట్టి స్మృతి. గుల్లటి వేగ తలుచుకోవలసిన కమ్మటిజ్ఞాపకం. కాలం గడిచినకొద్దీ మనుష్యులు స్మృతులుగా మారిపోతారు. కడపటికి జీవితంలో మిగిలేవన్నీ స్మృతులే. కొన్ని బాధించేవి, కొన్ని సేదదీర్చేవి. మరికొన్ని జ్ఞాపకాలు మైలురాళ్ళలా జీవితనడకని లెక్కిస్తాయి. మంజుల స్మృతి మైలురాయి కాదు. అదొక అపూర్వానుభవం—ఒక కాంతి కిరణం.

పుష్కరం పైన అవుతుంది. కాని యిప్పటికీ మంజుల కళ్ళముందు మెసులుతూనే ఉంది. మాంగళూర్ మెయిల్ సెంట్రల్ ప్లాట్‌ఫారమ్మీద కనిపించినప్పుడే కాదు; ఏ మళయాళపు అమ్మాయి కనిపించినా మంజు ఆమెలో లీలగా గోచరిస్తుంది. మంజు నా హృదయంలోని హృదయం. ఆమెను గురించి కథ అల్లడం చాలాకష్టం. కథ అల్లేందుకు తగినన్ని సన్నివేశాలు మా యిద్దరిమధ్యా గాని, మా చుట్టూతా గాని లేనే లేవు. జీవితంలోని వ్యక్తులు కథలో పాత్రలకి మల్లే ఒక వరవడి ననుసరించి నడవరు. కథాపాత్రలు ఒక పరిణామాన్నిబట్టి పెరిగి పెద్దవవుతాయి. జీవిత వ్యక్తులతో అలా కుదరదు. వారు ఎక్కడో ఎప్పుడో అకస్మాత్తుగా తటస్థపడి, వారికి అనుగుణంగా మన జీవనక్రమాన్ని మార్చడానికి ప్రయత్నించి, ఫలితంతో ప్రమేయం లేకుండా టుపుక్కున మాయమవుతారు. కథాపాత్రలు రచయిత యిష్టానుసారం నడుస్తాయి. జీవితంలో మనుషులు వాళ్ల యిష్టానుసారమే నడుచుకోలేరు. పరిస్థితుల వొత్తిడి ప్రకారం నడవవలసిందే! అందుచేత జీవితంలోని ఒక పుటని తెరచి పాఠకుని ముందు పెడుతున్నప్పుడు, అందులో కథా లక్షణాలు లేకపోవచ్చు.

పన్నెండేళ్ళో పధ్నాలుగేళ్ళో అయింది. ఒక హోటల్లో మూడో అంతస్తుమీద తొమ్మిదవ నెంబరు గదిలో ఉంటున్నాను. టర్నీవ్ 'జ్యూ' లోని కథా భాగం నాకు జ్ఞాపకంలేదుగాని, ఆ కథ చదివి కన్నీళ్ళు కార్చిందా గదిలోనే. డాస్టవిస్కీ 'క్రయిమ్ అండ్ పనిష్మెంటు' చదివి, ఒక రోజల్లా అన్నం మానేసింది అక్కడ ఉంటున్నప్పుడే. ఈనాడు హృదయం అలా స్పందించదు; తర్కిస్తుంది. ఇతర గ్రంథాలతో పోలుస్తుంది. అసలు రసాస్వాదనలోనే బోలెడంత తేడా. ఆనాడు లేత గుండె—ఈనాడు ఒక రకంగా రాతిగుండె. పాషండుణ్ణి కాకపోవచ్చు; ఆ కరకుతనాన్ని *Iron in the soul* అని నాకు నేను సమర్థించుకోవచ్చు. లేత గుండెకాలంలో, ప్రథమ యవ్వనపు దినాలలో, నేనా హోటల్లో ఉంటూండేవాణ్ణి.

హోటల్‌లో పర్మనెంటుగా ఉండటం తమాషాగా ఉంటుంది. పర్మనెంటు అంటే ఎల్లకాలమూ కాదు—ఏ ఆరునెలలో, సంవత్సరమో మన మొక్కళ్ళమే పర్మనెంటుగా ఉంటూంటాము; మిగతావాళ్లు వస్తూపోతూ వుంటారు. ఏరోజుకారోజు కొత్త మొహాలు కనిపిస్తాయి. అదీకాక పట్నం హోటళ్ళలో దినమూ ఏదో ఒక విశేషముండక మానదు. పట్నం చూదామని వచ్చే పామరులూ, లేచిపోయివచ్చే జంటలూ, వ్యాపారరీత్యా వచ్చేవారూ, ఊసుపోక సుప్రపందాలకోసం వచ్చేవారూ—రకరకాల మంది. వీళ్ళందరూ నాలుగు రోజులుంటారు, వారంరోజులుంటారు. మనం పర్మనెంటుగా ఉంటున్నప్పుడు, హోటల్‌వాళ్ళు వీళ్ళందరిమీదకంటె మనమీద ఎక్కువ శ్రద్ధాభక్తులు చూపడం సహజం.

అదే సేట్‌జీ, ఆయన అనుచరవర్గం నా పట్ల చూపుతూ వుండేవారు. రెండురోజుల కొకసారి అయినా నా గదికి వచ్చి యోగక్షేమాలు కనుక్కొని వెళ్తూండేవాడు సేట్‌జీ; వ్యాపారంలోని సులువు బులువులు చెప్పుకు నేవాడు. నిజానికి నేనూ మిగతావా రందరికి మల్లేనే ఒక కస్టమర్ని; కాని సేట్‌జీ నన్ను తనవానిగా భావించేవాడు. ఆ మిత్రత్వధోరణివల్ల నాకు పెద్ద కలిసొచ్చిం దేమీ లేదు. సేట్‌జీ ఫ్రెండ్‌ని అయినా కాకపోయినా నౌకర్లు వాళ్ళకందే టిప్స్‌నిబట్టి నా పనులు సక్రమంగానే చేస్తారుగా!

'హోటల్లో ఎందుకుంటున్నారు?' అని అడక్కండి. అది నాయిష్టం. ఉంటున్నాను. కథలు రాసేవాణ్ణి (అచ్చయేవి కూడాను); పుస్తకాలు చదివే వాణ్ని; తిని తిరిగేవాణ్ణి. తినుకోవలసిన అవసరం లేనంత డబ్బు బాంకులో ఉండేది. ఆరోజుల్లో నా గదికి ఒక్కడే స్నేహితుడు వస్తూండేవాడు. దారుణం కాదూ యిలాటి మహానగరంలో. ఒకే ఒక్క స్నేహితుణ్ని కలిగివుండటం! కాని వెంకటపతి ఒక్కడే ఆ రోజుల్లో స్నేహితుడు. వెంకటపతిని 'పతి' అని పిలవాల్సిందే—'వెంకటపతి' అనకూడదు. వెంకటపతి అని అంటే ఈ జన్మకి తనకి ఏజంటయ్యే యోగ్యత ఉండదట—యిప్పుడువుండి ఏడిసినట్టు! న్యూమరికల్‌గా అంతేనట. ఏమయితే నేం, ఈ పతి జీవితం ఒక ట్రాజడీ. అతనిది నిత్యదరిద్రం. దినమూ అతని చేతులమీదుగా అరవై డెబ్భయివేలు తిరుగుతున్నా, సాయంత్రం కాఫీకి డబ్బులుండేవి కావు. అతని ఉద్యోగం బాంకులో కాషియర్ పని. వారానికి అథవా ఒకసారైనా నాలుగో ఐదో అప్పుకింద తీసుకెళ్ళేవాడు నాదగ్గిర్నుంచి. ఆ చిల్లర మొత్తాలు అన్నీ కలిపి నలభయ్యో, ఏభయ్యో అయిన తర్వాత ఒక అణాస్టాంపు అంటించి నోటు రాసేవాడు. అలా రెండో మూడో నోట్లు రాశాడు. ఒక్కదాని మీదా ఒక రూపాయికూడా చెల్లువెయ్యలేదు. పాపం—అతనికి యిద్దామనే వుండేది; డబ్బు మిగిలేవి కావు. సూక్ష్మంలో చెప్పాలంటే వెంకటపతిని స్నేహితుడనడం కూడా అసందర్భమే. నాతో అవసరముండేది కనక నన్ను పట్టుకుతిరిగేవాడు.

మంజులత కథ మొదలుపెట్టి సేట్‌జీ గురించీ, వెంకటపతి గురించీ తెగచెబుతున్నాను. సేట్‌జీ నే నుంటున్న హోటల్ యజమాని; వెంకటపతి నాకా నాడున్న పరిచయుడు. పతి ఒక సాయంత్రం ఆరు గంటలకి నా గదిలోకివచ్చి, బీడీ మరికాస్త ఘట్టిగా పీల్చి (సిగరెట్లకంటె బీడీలే ఎక్కువ యిష్టం అతనికి), "ఐదో నెంబరు గదిలో రంగుల రామచిలక ఉందే," అన్నాడు.

నాకు వెగటుతోచింది. స్త్రీని చులకనగా మాట్లాడటం నాటికీ నేటికీ కూడా నాకు రుచించదు. ఆమె కట్టూబొట్టూ మనకి నచ్చనంతమాత్రాన రామచిలక అనడమేనా? ఎవరో అమ్మాయిని అంత సులువుగా అనగలిగినవాడు, తన చెల్లెల్నో భార్యనో అదేమాట పరాయివాడు అంటే సహించగలడా? నాలుగూ పెట్టాను వెంకటపతిని. కిమ్మనకుండా వూరుకున్నాడు.

"ఏమయినా ఆడవాళ్ళని అంత తలకెక్కించుకో కూడదు," అన్నాడు వెంకటపతి.

"ఈశ్వరుడికంటె దిగి వచ్చామా? ఆయనని మించిన ఘనులము కాముకదా!" అన్నాను.

ఇంతలో సేట్‌జీ వచ్చి వెంకటపతి వున్నాడని సంశయించి వెళ్ళిపోయాడు. పతీ నేనూ ఆ సాయంత్రం సినీమాకి వెళ్ళాం. నేను రాత్రితొమ్మిది గంటలకి హోటల్‌కి వచ్చేటప్పటికి, సేట్‌జీ నాగది ప్రాంతాల తచ్చాడుతున్నాడు. ఏనాడూ యీ వేళకియింటి దగ్గిర హాజరై, భార్యని సినిమాకి తీసుకువెళ్ళే అలవాటు అతనికి. ఇవ్వాళేదో కొంప మునిగినట్లుంది.

"మీకోసమే వెయిట్ చేస్తూండాను, సార్."

"ఏమిటి విషయం?"

"అంజి నంబర్ సూస్త్రిగా. అందయ్యా కొత్తాల నించి కొనమ్. అమ్మా యిరికిరాంగో, ఎయిటీన్ రుపీస్ ట్వెల్వ్‌యనాస్ గుడ్యా."

మిగతా సంభాషణ సేట్‌జీ పలుకుల్లో చెప్పను. నామాటల్లో చెబుతాను. ఐదవ నెంబరు గదికి రామనాథ్ అనే ఆయన అయిదురోజులక్రితం బొంబాయి నుంచి వచ్చాడట. రాగానే పదిరూపాయలు అడ్వాన్సు యివ్వమంటే, ఐదురూపాయిలే యిచ్చి, మిగతాది మర్నాడు యిస్తానన్నాడు. మొదటిమూడు రోజులూ తను ఒక్కడే వున్నాడు. రెండురోజుల క్రితం, మొన్న సాయంత్రం, ఆ అమ్మాయి హోస్ట

టల్ నుంచి డిశ్చార్జి అయివచ్చింది. డబ్బుకి వొత్తిడి చేస్తే ఈ పూటా ఆ పూటా అని మొహం చాటేస్తున్నాడు. నిన్న సాయంత్రం సేట్ జీ గది ఖాళీ చెయ్యమన్నాడు—డబ్బు యివ్వక పోవడంవల్ల. యివ్వాళ పొద్దున్న కాఫీ యిడ్లీ సప్లయిచేశారు—సేట్ జీ రాకపూర్వం. భోజనం సప్లయి చెయ్యవద్దన్నాడట, సేట్ జీతను వచ్చినతర్వాత. అయ్యాలేడు అమ్మ ఒక్కతే ఉందని తెలుసుకు, జాలిపడి, మధ్యాహ్నం టిఫిన్ పంపించాడు. అమ్మ టిఫిన్ తిరగ్గొట్టి కాఫీ మాత్రం పుచ్చుకుంది పొద్దున్న ఏడు గంటలకి వీధి మీది కెళ్లినరామనాన్, యిప్పుడు రాత్రి తొమ్మిదయింది, యింతవరకూ రాలేదు. తనకేమి చెయ్యాలో పాలుపోకుండా ఉంది. వీళ్లిద్దర్నీ హోటల్లోంచి గెంటించడమెలా? తనకి రోజుకి మూడురూపాయిల నష్టం.

"సేట్ జీ, ఈ రాత్రికి వాళ్లిద్దరికీ భోజనం పంపండి. ఆ అమ్మాయికి పొద్దుట్నుంచీ తిండి లేదను కుంటాను. మీరు యింటికి వెళ్లిపోండి. రాత్రి పన్నెండు గంటలకైనా ఆ రామనాన్ రాక పోడు. నేను రాత్రి రెండుగంటలదాకా చదువు కుంటూ వుంటాను గనక ఆయన వ్యవహారమేదో తెలుసుకు, రేపు పొద్దున్న మీకు చెబుతాను. ఆడది, అబల్లని, పస్తువుంచడం మనకి దోషం." సేట్ జీకి నామాటమీద గురికనక నేను చెప్పినట్లు చేశాడు.

ఆ రామనాన్ రాత్రి పదకొండుగంటలకి పిల్లిలా చక్కా వచ్చాడు. మనిషి సన్నగా పూచలా ఉంటాడు; పక్షిముక్కు; చామనచాయ; తరుముకొస్తున్న తోడేలునుంచి పారిపోతున్నట్టుంటుంది అతని మొహం. వర్చస్సేమీ లేదు గాని ఆ కనురెప్పల్లో తీక్ష్ణతా, ఆ వేదనా ఉన్నాయి. వయసు యిరవై రెండూ యిరవైమూడూకంటె ఎక్కువ ఉండదు.

వరండాలో రెండుమూడుసార్లు పచార్లు చేశాను. వాళ్ళ గదితలుపు వోరవాకిలిగా ఉంది. అతి నెమ్మదిగా మాటలు చెప్పుకుంటూ భోజనాలు చేస్తున్నారు. వెంకటపతికి రామచిలకలా కనిపించిన అమ్మాయి పీలగా రోగిష్టిలా ఉంది. పదిహేడేళ్లుంటాయేమో: సర్వసామాన్యమైన చీర కట్టుకుంది. భార్యాభర్తలిద్దరూ ఒకళ్ళనొకరు—నాకు తెలియని భాషలో—ఓదాయించుకుంటున్నారు. భోజనమయ్యాక రామనాన్ సిగరెట్టు ముట్టించి వరండాలోకి వచ్చాడు. దూరంగా నుంచున్న నన్ను చూసి కొద్దిగా కలవరపడ్డాడు—ఆ కాల్చుకోవడం గది లోనే కాల్చుకోక బయటికెందుకొచ్చానా అన్నట్టుంది అతని మొహం.

ట్రాములూ బస్సులూ ఆగిపోయి చాలాసేపయింది. నిర్జన వీధుల్లో అక్కడక్కడ రిక్షాలుమాత్రం సంచారం చేస్తున్నాయి. రైలింజను అప్పుడప్పుడు కూస్తోంది. పేవ్ మెంటు కుటుంబాలవంక బాధగా చూస్తున్నాను. రామనాన్ ని ఎలా పలకరించడమా అని నేననుకుంటూవుండగా, అతనే నన్ను పలకరించి నా బుజాలమీద బరువుని కిందికి దించాడు.

"మాఆవిడ చెప్పింది—మీతో సేట్ జీ ఏమిటో చెబుతున్నాడట గా!"

తను నమ్రతగా ఉండటంబోయి పెద్ద ఖబుర్లాడుతున్నాడే ఈ పెద్దమనిషి--అనుకున్నాను లోపల. "నాతో ఏమీ చెప్పలేదు. రామనాన్ అంటే మీరే కదూ!—మీకోసం వెయిట్ చేస్తున్నా నన్నాను."

ఆమాటా ఆ మాటతో అరగంటలో కథ బయటపడింది. రామనాన్ నన్ను పరిచయం చేశాడు మంజులతకి. రామనాన్ అయినా పైకి పొగరుమోతులా కనిపించాడు గాని అంతర్యంలో మంచివాడే. బక్కచిక్కి వున్నా మంజులతది ఆకర్షవంతమైన ముఖం. ఆమె అందమంతా కనుబొమలలో ఉంది. కనుకొలకులలోని కాంతిరేఖ చెక్కిలిసొట్ట దగ్గిర విల్లంబులా తిరుగుతుంది. గడ్డం ఒక చూపువాసి పొడవు. సిల్కులాంటి జుట్టు బాబ్ చేయించుకుంది. చీరె జాకెట్టూ చవకరకవి. ఎర్రటి దుద్దులు మినహా నగా నాణెం వొంటిమీద లేవు. బాగా జబ్బుపడి లేచిన మనిషి. తమిళంలోనూ యింగ్లీషులోనూ కలిపిగొట్టుగా మాట్లాడేది. రామనాన్ మీద ఆమె కున్న అనురాగం క్షణక్షణానికీ చూపులో, సైగలో, మాటలో వ్యక్తమవుతూనే వుండేది.

అస్వస్థురాలు కనక మంజులత మంచంమీద పడుకుంది. రామనాన్, నేనూ కుర్చీలలో కూచున్నాం. అతను పదకొండుం బావుకి మొదలెట్టిన కథ పూర్తయేటప్పటికి ఒంటిగంటన్నర అయింది. అంతవరకూ మంజులత రెండుకళ్ళూ తెరుచుకు చూస్తూనే వుంది మా యిద్దరివంక. ఆమెని

నిద్రపొమ్మని అతనూ చెప్పాడు, నేనూ చెప్పాను. 'నిద్ర రావడంలేదు—నిద్రొస్తే మీరు చెప్పాలా?' అంది.

రామనాథ్, మంజులత ఒకర్నొకరు తీవ్రంగా ప్రేమించుకున్నారు. వివాహానికి కులాలేగాక శాఖలు కూడా సరిపడాలిగా! మంజులతకంటె రామనాథ్ కొంచెం తక్కువ కులంవాడు. మంజులత తల్లిదండ్రులు కొస్త కలవాళ్ళు. అంచేత, కులం తక్కువ—ధనం తక్కువ వున్న రామనాథ్‌తో ఎలా సరిపెట్టుకుంటారు? కూతురికి కట్టడులు ఏర్పాటుచేశారు. తత్ఫలితంగా యిద్దరూ పారిపోయి పెళ్లిచేసుకున్నారు. మధురలో డాక్టర్ చేస్తున్న మంజులత అక్కగారు కూడా ముక్కుమీద వేలేసుకుంది. బొంబయిలో టైపిస్ట్‌గా చేరాడు రామనాథ్. మూడేళ్ళు మూడు రోజుల్లా గడిచిపోయాయి. ఆరోగ్యం చెడిపోయింది. మద్రాస్‌లో ఉన్న రామనాథ్ పినతండ్రి వారికి సాయం చేస్తానన్నాడు. మంజులతని మొట్టమొదట తన పినతండ్రిగారింటికే పంపించాడు రామనాథ్. పినతండ్రీ పినతల్లీ ఆమెని హాస్పిటల్లో జేరిపించి, స్త్రీల వ్యాధి తాలూకు ఆపరేషన్ అయిన తర్వాత, బొంబయిలో ఉద్యోగం మానుకు మద్రాస్ రమ్మని రామనాథ్‌కి రాశారు. రామనాథ్‌కి ఆమాత్రం ఉద్యోగం యిక్కడ దొరక్కపోతుందా—అనుకున్నారు. ఒకరికొకరు చేదోడు వాదోడుగా ఉంటామనుకున్నారు. అనుకోకుండా ట్రాన్స్‌ఫరయింది ఆ పినతండ్రికి. అంతకే ఆయన రామనాథ్‌ని రెండుమూడు కంపెనీలకి తీసుకువెళ్ళి పరిచయం చేశాడు. రేపో మాపో ఉద్యోగం రాకపోదు. ఈమందులకీ మాకులకీ మంజులత వొంటిమీదవున్న బంగారం యావత్తూ అమ్మెయ్యవలసి వచ్చింది.

రెండుగంటలకి నా గదిలోకి వెళ్లి పక్కమీద పడుకున్నానేగాని ఒక పట్టాన కునుకు రాలేదు. లోకంలో ఎంతబాధ, ఎంత నిస్సహాయత! ఏమైపోతారు వీళ్లిద్దరూ! ప్రేమించి పెళ్ళిచేసుకోవడం బట్టేగదా వీళ్ళకిన్ని అవస్థలు. కొన్నూర్‌లోనో, మాంగనూర్‌లోనో వున్న మంజులత తండ్రికి వీళ్ళమీద అంత కక్ష ఎందుకు? పితృహృదయం, వాత్సల్యం, దయా దాక్షిణ్యాలూ యివెక్కడ? అలాంటి వున్నాయా అసలు, పుస్తకాలలో మినహా! ప్రతిమనిషీ, తెలిసో తెలియకో, స్వంత లాభం కోసమే చేస్తున్నాడు. నా గదిలోకి కనిపించే లైట్ హవుస్ వెలుగు ఎన్నో వెర్రి ఆలోచనలకి తావిచ్చింది. సూర్యుని ముదురు కిరణం నన్ను తట్టిలేపింది.

కాఫీ సేవించి, పేపరు తిరగేస్తూండగా సేట్‌జీ వచ్చాడు. తన జేబులోనుంచి ఒక చిన్న పొట్లంతీసి నా టేబుల్ మీద పెట్టాడు.

"మాపింకే—పొట్లంలో ఏముందో! ఆసొమ్ము నాదగ్గిర వుంచుకోమని చెప్పిపోయాడు పొద్దుటే. ఇదేదో దగుల్బాజీ వ్యవహారంలాఉంది." సేట్‌జీ అంత స్వచ్ఛంగా మాట్లాడలేదు. కాని ఆయన మాటలలోని సారాంశం అది.

పొట్లంలోవి మంజులత ఎర్రదుద్దులు. నా ప్రాణం కొస్త చివుక్కుమంది. గడిచినరాత్రి వారితో అంతసేపు కాలక్షేపం చెయ్యడమే ఆక్షణిక చాపల్యానికి కారణం. పట్టుకుచ్చులాటి జుట్టు ఎర్ర దుద్దులమీద పడినప్పుడు ఏదో తమాషాగా ఉండేది. అదేమీ అందం అనీ, ప్రత్యేకశోభ అనీ కాదు. పూచికపుల్ల బంగారంలేని ఆమె పచ్చటి శరీరంమీద, ఆ దేహకాంతిలో ఆ ముఖ వర్చస్సులో ఎర్రదుద్దులు ఒక రకమైన వింత ఆభరణం. సేట్‌జీ గుప్పెట్లోనుంచి రామనాథ్ ఆ దుద్దుల్ని ఏనాటికీ విడిపించలేడని నాకు అనుమానం కలిగింది.

"వాళ్ళ దుద్దులు వాళ్లకి యిచ్చెయ్యండి. వారు మీ కివ్వవలసిన పైకం నేనిస్తాను," అంటూనే, పాతిక రూపాయల చెక్కు సేట్‌జీ చేతిలో పెట్టాను. సేట్‌జీ తెల్లబోయాడు. నేనెందుకు అలా చేస్తున్నానో అతనికి బోధపడలేదు. నేను మర్యాదస్తుణ్ణే, బుద్ధిమంతుణ్ణే, వృద్ధిలోకి రావలసినవాణ్ణే అని సేట్‌జీకే కాదు, హోటల్ స్టాఫ్ కందరికీ తెలుసు; అంచేత, ఒక్కచిక్కవున్న ఆ అమ్మాయిమీద మనసు వుండి నేనిలా పూనుకున్నానని ఎవరూ అనుకోలేరు. నిజం కూడా అంతేగా! త్రుటికాలం తటపటాయించి చెక్కు జేబులో పెట్టుకున్నాడు సేట్.

"దుద్దులు రామనాథ్‌కి యివ్వనా, ఆ అమ్మాయికి పంపించేదా?" అని అడిగాడు.

"రామనాథ్‌కి యివ్వవద్దు—యిటు నాకివ్వండి"

మారుమాటాడక ఆ పొట్లం నా చేతిలో పెట్టాడు సేట్. ఆ ఉదయం వేళ ఆతనికి లోకమంతా అగమ్యగోచరంగా తోచివుంటుంది.

దుద్దులపొట్లం నౌకరుద్వారా పంపించక నేనే తీసుకువెళ్లి యిద్దామనుకున్నాను. పొరబాటేమో—నావయస్సింకా 'టీన్సు' దాటలేదు. ఒక గొప్పపని చేసి అందుకు ప్రతిఫలంగా పట్టుశాలువా నాకు నేనే కప్పుకుందామనుకున్నాను. నేను వెళ్లి తలుపు తట్టకపోతే, మంజులత తనకి తానుగా నాకు కబురంపించేదా? నరాలు తోడే బాధతో, జీవనాంత కాలంలో ఏమయ్యేనో! నాకు కబురంపించి వుండేది కాదేమో! అలా నిశ్చితంగా కళ్లుమూసేసేదేమో! ఏమంటావు— ఈ కథ చదవలేని మంజూ?

సంశయిస్తూ నేను తలుపుతట్టేటప్పటికి మంజులత తలుపు తెరిచింది. తెరిచిన తలుపు అలాగే వుంచి, మంచంమీద కెళ్లి పడుకుని ఉన్నట్టుండి కొట్టుకు పోవడం మొదలెట్టింది. రాత్రి కనిపించిన వెలుగు ఆమె ముఖంలో లేదు. కళ్లు గుంటలుపడ్డాయి. బాధతో ముఖం ఎర్రబడింది. కడుపు నులిపెస్తోం దంటారే స్త్రీలు—అలాంటి బాధట. మాట చెప్పలేక గిలగిలకొట్టుకుంటోంది. నాకు కళ్ళనీళ్లు తిరిగాయి. అలాంటి బాధ నేనంతవరకూ చూడలేదు. ఏం చెయ్యాలో తోచక కుర్చీలో కూలబడ్డాను.

పదినిముషాలకి తెప్పరిల్లి, "తెల్లారిగట్ల నాలుగు గంటలనుంచీ యిలా బాధపడుతూనే వున్నా. తప్పనిసరి కనక ఆయన బయటికి వెళ్ళారు. ఆపద్బాంధవుడిలా వచ్చారు మీరు. హోటల్ నౌకరు ఈ గదివైపు తొంగిచూడటమే లేదు. లోకమే అంత. ఒక కప్పు కాఫీ తెప్పించి పెడుదురూ—గొంతుక తడిఆరిపోతోంది." ఆమె యింత స్పష్టమయిన తెలుగుమాటలలో చెప్పలేదు. తమిళం యింగ్లీషూ కలిపి మాట్లాడింది.

వరండాలోకి వెళ్ళి హోటల్ నౌకర్ని ఆజ్ఞాపించగానే వాడు తక్షణం వేడివేడి కాఫీ పట్టుకొచ్చాడు. మంజులతకి ఆ కాఫీ చల్లార్చి పెట్టి యిచ్చాను. గడగడా తాగి, నిస్త్రాణ వచ్చినట్టు తల దిండుమీద తల ఆన్చింది. విల్లంబుల్లాటి కనుబొమల్ని వెక్కిరిస్తున్నాయి ఆమె ఎర్రటి పెదవులు. దుద్దుల పొట్లం యింకా నా చేతిలోనే వుంది.

రెండు నిముషాలు గడిచాయో లేదో, నన్ను పక్కకి తప్పుకోమని చేతితో సంజ్ఞచేస్తూ, మంచానికి అవతల పక్కగా తాగిన కాఫీఅంతా వాంతి చేసుకుంది. వాంతి అయినప్పట్నుంచీ ఆయాసం ప్రారంభమయింది. గుండె దడ హెచ్చింది. నౌకరు ఆమె వమనం చేసుకున్నచోట బాగుచేసి, గదిలో అగరువత్తులు వెలిగించి, ఆమెకి మళ్ళా వాంతివస్తే యిబ్బందిలేకుండా, మంచం పక్కనే బేసిన్ ఉంచాడు. పది నిముషాలు తిరక్కుండా మళ్లీ వాంతి చేసుకుంది. వాంతి వచ్చినప్పుడల్లా, మంచంచివర మోచేతిమీద బలం ఆన్చి, ముందుకి వంగవలసివచ్చేది. వొంట్లో త్రాణ లేకపోవడంవల్ల మూడోసారి డోక్కుంటున్నప్పుడు, యించుమించు కిందపడేటంత పని అయింది. ఒక్క అంగలో దూకి ఆమె పడకుండా పట్టుకున్నాను. భుజాలు పట్టుకుని మనిషిని ఆపానో, నడుం పట్టుకు మనిషిని ఆపానో—నాకిప్పుడు జ్ఞాపకం లేదు. ఆమెని సరిగా పడుకోబెట్టి, అయిదారు నిముషాలు ఆ పక్కమీద నే కూచున్నాను.

మంజులత ముఖంబాగా అలిసిపోయింది. రెండు కళ్లలోనుంచి నీళ్ళు జలజల కారుతున్నాయి. పెరమిడ్ రుమాలుతో ఆ కన్నీటి తుంపరలు తుడిచి, "చాలా బాధపడుతున్నట్టున్నావు—డాక్టర్ని పిలిపిస్తాను," అన్నాను. ఆమెని నేను ఏకవచనంలో సంబోధించడం, నన్నామె మన్ననచెయ్యడం వాతావరణసృష్టికోసం చేస్తున్నాను. మేమిద్దరమూ మాట్లాడుకున్నది చాలామట్టుకు యింగ్లీషులోనే—అప్పుడప్పుడు తమిళంలో.

"వొద్దు. మీరు భోంచేసిరండి. సాయంత్రందాకా నాదగ్గిరే, యిక్కడే, కూచోండి."

అప్పుడామె అరిచేతిని నా చేతుల్లోకి తీసుకున్నాను. ఆమె చేతివేళ్ళు వణికాయి; మళ్లీ కళ్లు చెమర్చాయి.

"డాక్టర్ని పిలుచుకువచ్చేందుకు నేను వెళ్ళక్కర్లేదు. ఫోన్‌చేస్తే వస్తాడు. ధనరాజ్ నాకు బాగా తెలిసినవాడే!"

"మీరు శ్రమపడకండి. ఏ డాక్టరూ నన్ను బతికించలేడు. డిస్చార్జి చేస్తున్నప్పుడు వాళ్లు హాస్పిటల్లో చెప్పనేచెప్పారు. ఏ తప్పయితే చెయ్యకూడ

దన్నారో ఆ తప్పు జరిగింది. నాకూ బతకాలని లేదు. ఎందుకు బతికి ?"

ఆ తప్పేమిటో క్షణకాలం ఆలోచిస్తేగాని తెలియని వయసు నాది. మంజులత అధరంమీద మెరిసిన చిరునవ్వువల్ల ఆ తప్పేమిటో తెలిసింది. రామనాన్ మీద నాకు పట్టరానంత ఆగ్రహం వచ్చింది. కోపతీక్షణత నాకు తెలియకుండానే మొహంమీద కనిపించడం పసిగట్టి, ఆ అమ్మాయి అంది! "అతనిమీద కోప్పడి ఏం లాభం? నన్ను ఎంతగానో ప్రేమించాడు, పువ్వుల్లోపెట్టి పూజించాడు. ఇవి మాకు చెడ్డరోజులు. అంచేత కష్టాలు పడుతున్నాం. కష్టాలు వొద్దు, సుఖాలుమాత్రమే కావాలి—అంటే వస్తాయా? పినతండ్రిని నమ్ముకుని వున్న ఉద్యోగం వదులుకున్నాడు. తిప్పలు పడుతున్నాడు. అతన్ని చూస్తే జాలేస్తుంది. నాకోసం చదువుమానుకు, అన్నగారితో దెబ్బలాడి, నన్ను పెళ్ళిచేసుకున్నాడు. ఇటు మా వాళ్ళకీ, అటు వాళ్లవాళ్ళకీ దూరమయాం...ఫోం చేసి రాకూడదూ ?"

"నాకు అన్నం సయించదీ పూట, మనసు ఎలాగో వుంది. డాక్టర్ కి ఫోను చేసివస్తాను," అని పక్కమీదనించి లేవబోతూవుండగా, నా చెయ్యి పట్టుకుంది మంజుల. మొట్టమొదటిసారి ఆ రోగి స్త్రీ అనే భావన కలిగింది. ఏదో విద్యుత్ నాలో ప్రవహించినట్లయింది.

"డాక్టర్ నన్ను ఎలానూ బతికించలేడు. హాస్పిటల్లో చెప్పినమాట అబద్ధం కాదు. నేను చనిపోయేదాకా నా పక్కని వుండండి, అదే నాకోరిక. రామనాన్ ఏ సాయంత్రానికి వస్తాడో! నన్ను వొదిలి వెళ్లకండి. మీరు నాపాలిట దేవుడిలా వచ్చారు. నాకు భయమేస్తోంది. ఏవో నల్లగా కనిపిస్తున్నాయి," అంటూ వణికిపోతూ, వెక్కి వెక్కి ఏడవ నారంభించింది. మనిషిని నా వైపుగా తిప్పుకుని, వీపుమీద చెయ్యివేసి బుజ్జగించాను.

"ఏడవకు, మంజూ, నిన్ను వొదిలి వెళ్ళను. డాక్టర్లు నిన్ను భయపెట్టేందుకు చెప్పివుంటారు. నేను పక్కనుండగా యమభటులు నీదగ్గర కొస్తారా? నీ ప్రాణానికి నా ప్రాణం వొడ్డి కాపాడనూ? భయపడకు. భయమే మృత్యువంటారు పెద్దవాళ్లు."

నెమ్మదిమాటలు చెప్పి కిందికి వెళ్ళి డాక్టర్ కి ఫోనుచేశాను. అరగంటలో ధనరాజ్ వచ్చాడు. డాక్టర్ పరీక్ష యింకా పూర్తికాక పూర్వమే మళ్ళీ బాధవచ్చిందామెకి. ఉండలా చుట్టుకుపోయి గిలగిల కొట్టుకునేది. ధనరాజ్ మనిషినంతా పరీక్ష చేశాడు. పొత్తికడుపూ, ఊపిరితిత్తులూ, నాడీ చూశాడు. నన్ను దూరంగా వెళ్ళమని ఆమెని ఏవో ప్రశ్నలు వేశాడు.

"ప్రస్తుతం ఒక యింజెక్షన్ యిస్తాను. యిప్పుడు రెండు అవవస్తోందా, సాయంత్రం ఆరు గంటలకి మళ్లీ వచ్చిచూస్తాను. బాధని వోర్చుకోగల శక్తి గుండెకి లేదు—అంచేత రోగి నిద్రపోవడం మంచిది. మత్తు కలిగించే యింజెక్షన్ యిస్తున్నాను." అన్నాడు ధనరాజ్ నాతో.

ఏ యింజక్షన్ యిస్తే నాకెందుకుగాని, ఆమె బాధలగ్గాలి. ఆమె అలా బాధపడుతూవుంటే రెండు కళ్ళూ వొప్పగించి చూస్తూ కూచోలేను. యింజెక్షన్ పుచ్చుకుంటూ డాక్టర్ తో అంది మంజులత:

"నిద్దర్లోనే హాయిగా చనిపోయేమందు యివ్వండి. ఈ యమబాధ నేను భరించలేను."

"బాధపడకండి," అంటూ సూదిపుచ్చాడు డాక్టరు.

ధనరాజ్ ని సాగనంపేందుకు వరండాలోకి వచ్చాను. "ఎవరా అమ్మాయి ?" అని అడిగాడతను.

కథ యావత్తూ చెప్పాను. "పాపం!" అని నిట్టూరుస్తూ, "బతకదు" అన్నాడు తీర్పు చెప్పినట్టు.

"అంత గడ్డువ్యాధా ?"

"ఆ అమ్మాయి సంసారానికి పనికిరాదు. ఆ భర్త పసువో, మృగమో అయివుండాలి."

ఆ సంగతి నాకింతకిపూర్వమే తెలుసు చూచాయగా! "నిజంగా బతకదంటారా ఆ అమ్మాయి ?" అన్నాను ఆదుర్దాగా.

నా వ్యాకులత గ్రహించి! "అంత మంచితనం మీకు పనికిరాదు. నిన్న నీపాటికి ఆ అమ్మాయి ఎవరో మీకు తెలీదు. యివ్వాళ ఎందుకంత వేదన మీ కామెగురించి, వొద్దు, వొద్దు; పసిలిసంవల్ల బేజారైపోతున్నారు," అంటూ నా వీపుతట్టి నిష్క్రమించాడు ధనరాజ్.

నేను గదిలోకి వచ్చేటప్పటికి ముఖమంతా కళ్లు చేసుకు చూస్తోంది మంజులత. నౌకరు కొత్త అగరువత్తులు వెలిగించి, బేసిన్ కడిగి పట్టుకొచ్చాడు. మూడోవ వాంతితో ఆ వాంతులు ఆగలేదు. అడపా దడపా అవుతూనే వున్నాయి. నాలిక పిడచగట్టుకు పోతోందని మంచినీళ్ళు తాగేది; బుళుక్కున వాంతి చేసుకునేది.

"వాసనేస్తోందిగదూ!" అనేది మధ్య మధ్య. అలాటి మాటలనవద్దని వారించేవాణ్ణి.

గది తలుపు జేర్లావేసి వుంచేది. నౌకరు వున్నప్పుడు కుర్చీమీద, నౌకరులేనప్పుడు మంచంమీద కూర్చునేవాణ్ణి. డాక్టర్ని పంపి గదిలోకి రాగానే, "ఏమన్నాడు డాక్టర్?" అంది మంజులత.

"తగ్గిపోతుం దన్నాడు."

"అబద్ధం."

"నిజమే. ఇంకో పావుగంటలో నీకు నిద్దర పడుతుంది. హాయిగా నిద్దరపో".

"నిద్దరపట్టగానే మీరు వెళ్ళిపోతారా?"

"నేను వెళ్ళిపోవడమా? నిన్ను వొదిలి ఎప్పటికీ వెళ్లను. మంచిపిల్లలా నిద్దరపోవమ్మ!" అన్నాను, ముద్దు చేస్తూ.

"మా అమ్మమ్మ చనిపోతూ యమదూతల్ని చూసి గావుకేకలు పెట్టింది. నేనూ అలా కేకలేసి యితరుల్ని భయపెట్టకుండా, శాంతంగా చనిపోగలితే......మీ చేతుల్లో నా ప్రాణాలు వొదల నివ్వరూ?"

ఈసారి కన్నీళ్లు నాకొచ్చాయి. ఈ అమ్మాయి చచ్చిపోతుందా? నిజంగానా? ఊరూ పేరూ తెలియని పరాయిమనిషి సమక్షంలో, 'నా' అనేవాళ్లు ఎవరూ లేనిచోట, పట్నవాసపు హోటల్ గది నాలుగుగోడలూ వెక్కిరిస్తూ వుండగా, ఈ చిన్నపుష్పం నేలకలుస్తుందా? ఏమిటి మానవ జీవితం? మృత్యుప్రాంగణంలో మేడలుకట్టే మన ఆశలకీ ఆవేదనలకీ అర్థం ఉందా? ఎంత దేవుళ్లాడుతాం—భర్తృహరీ, వేమనా చెప్పిన పరమ సత్యాలు తెలుసుకోలేక!

ఆమె ఫాలభాగంమీద చెయి ఉంచాను. పెద్ద జ్వరమేమీ లేదు. కణతలు వేగంతో కొట్టుకుంటున్నాయి.

"మంజూ, నువ్వు బతుకుతావు. నీకు తెలీదు—నువ్వు బతుకుతావు. నామాట నమ్మ."

ఆమె పెదవులమీద వెలిసిన నీరసపు నవ్వులో ఈ ప్రపంచపు శోభలన్నీ ప్రతిబింబించాయి. ఆమె గెడ్డాన్ని నొక్కుతూ యింకోసారి అన్నాను: "నమ్మ, మంజూ!" అప్పుడే మగత వచ్చేస్తోంది. "ఊ" అంటూ నిద్రపోయింది.

కాస్త కాఫీ టిఫినూ ఆ గదిలోకే తెప్పించుకు తిన్నాను. మళ్ళీ మరికొన్ని అగరువత్తులు వెలిగించాను. డోకులవల్ల గదికి రోగిష్టి వాసన వచ్చింది. నిద్రపోతున్న ఆమెని పరిశీలనగా ఒక గంటసేపు చూశానేమో! అర్థంపర్థంలేని ఆలోచనలెన్నో మెదడుమీదుగా దొర్లిపోయివుంటాయి. రామనాథ్‌ని తలుచుకుంటే ఒక్కొక్క క్షణాన జాలివేసేది; మరొక్కొక్క క్షణాన వొళ్లుమండే కోపంవచ్చేది.

బుర్ర వేడెక్కడంవల్ల చదువుకోడానికి పుస్తకం తెరిచాను. పేజీలు సాగితేనా! సాయంత్రం అయిపోయింది. తలుపు నెమ్మదిగా లోపలికి తోశాడు వెంకటపతి. చీమ చిటుకుమంటే ఆమెకి మెలకువ వస్తుందేమో అన్నట్టు, పదిలంగా అడుగులు వేసుకుంటూ మంచందగ్గిరికి వచ్చి, కళ్ళు పెద్దవిచేసుకు చూశాడామెని వెంకటపతి.

ఇద్దరమూ వరండాలోకి వెళ్లాం. జరిగినది వెంకటపతికి చెప్పాను.

"మధ్యని మీకొచ్చి చుట్టుకుందేమిటి ఈ పాపం!"

అతనలా నిర్దాక్షిణ్యంగా అనడం మనస్కరించక; "అలా అంటారేమిటి! కష్టాలు ఎంతటివారికైనా వస్తాయి. ఆమాత్రం ఉపకారబుద్ధి లేకపోతే మనకి మానవులనిపించుకునే అర్హత ఏమిటి? రామనాథ్ రాత్రికూడా వస్తాడో, రాడో! మీ ఆఫీసు పర్మిషన్ తీసుకు యిక్కడ పడుకోకూడదూ మీరీ రాత్రి?"

"ఓ—నిక్షేపంగా! కొండకులేని దురద చేమకన్నట్లు—మధ్యని మీరు యిరుక్కున్నారే ఇందులో అని అన్నానుగాని, మరోకందుకు కాదు. ఆపత్సమయంలో యిలాటివి చూసుకుంటామా? తప్పకుండా వస్తాను. పాపం—ఆ అమ్మాయిని రంగుల రామచిలక

అన్నారు కాని, సీతా అమ్మగారు వంటిది. ఆ పిల్లది బతికి బట్టకడితే మనకదే పదివేలు."

నాకు ఆ అమ్మాయిమీద దయారసం ఉందని గ్రహించిన ఉత్తరక్షణంలో వెంకటపతి ధోరణి మారిపోయింది. మంచిఅయినా చెడ్డఅయినా నష్టం కష్టదాయమన్నాడు. అతని ఊహ ఎంతదాకా పోయిందంటే! రామనాథ్ యింక ఎప్పటికీ రాక, ఆ అమ్మాయి దారీ తెన్నూ లేక నాదగ్గర వుండిపోవలసి వస్తే—అదీ అంత యిబ్బంది లేదట. అలాటి అందమైన స్త్రీ యింటిని దివ్యజ్యోతిలా వెలిగించగలదట.

వెర్రితలలు చేసే ఆలోచనల్ని అరికట్టమన్నాను 'ఈ రాత్రికి ఆమె బతుకుతుందో బతకదో' అని డాక్టరు చెప్పిన మనిషిగురించి, పతి అల్లే కాల్పనిక జగత్తు నీటిబుడగలాటిదనే యింగితం నాకు లేక పోలేదు. కాని వెంకటపతి, నాకంతవరకూ కలగని కొన్ని అసందర్భపు ఆలోచనలు నాలో ప్రవేశ పెట్టాడు. పుస్తకవ్యక్తులతో కాలక్షేపం చేసే నాకు, వెంకటపతి మాటలు జీవితసుడిగుండాల్ని జ్ఞాపకం చేసేవి. సంస్కారరీత్యా అతను నాకంటె తక్కువవాడని తెలిసివున్నప్పటికీ, అందుకే *Tolerate* చేసేవాణ్ణేమో అతన్ని!

డాక్టర్ వచ్చాడు. గుసగుసగా లోపలికి వెళ్లాం. స్విచ్ నొక్కగానే వులిక్కిపడి లేచింది మంజులత. బయట కొద్దికొద్దిగా చీకటి పడుతోంది. క్షణకాలం మా ముగ్గుర్నీ భయం భయంగా చూసింది.

"అలా చూస్తావేం!" అన్నాను.

"నేనింకా బతికేవున్నానా?" అంటూనే గిలగిల కొట్టుకోవడం మొదలెట్టింది. పావుగంట అలా తన్నుకుంది. డాక్టర్ గుండె చూశాడు. మధ్యాహ్నం యింకో యింజెక్షన్ యిస్తానన్నవాడు యిప్పుడివ్వనన్నాడు. నాలుగు పొట్లాలు యిచ్చాడు. బాధ భరించలేనప్పుడు, గంటకి తక్కువ కాని వ్యవధితో, ఆ పొట్లాలు వేసుకోవాలన్నాడు. పతిని ఆమెవద్ద కూచోబెట్టి డాక్టర్‌తో వరండాలోకి వచ్చాను.

"ఏమనుకుంటారు?"

"గ్లూకోజూ, పాలూ, అయినూ కలిపిన నీళ్లు చెంచాతో, మింగడం పడేటంతవరకూ, యిస్తూవుండండి. యింజెక్షన్ యివ్వడానికి గుండె అతి నీరసంగా ఉంది. యింజెక్షన్ యిచ్చినా ఒకటే, యివ్వకపోయినా ఒకటే. రాత్రి రెండు మూడు గంటలలోపున ఆమె చచ్చిపోతుంది."

పాదాలకింద గొయ్యి పడ్డట్టనిపించింది. "ఎంత డబ్బయినా ఆమెకోసం ఖర్చుపెడతాను. ఆమెని బతికించలేరూ?" మతిలేని మాటలు—మతి వున్నవాడు అలా మాట్లాడుతాడా?

నేను దిగజారిపోవడం కనిపెట్టి డాక్టర్ అన్నాడు. "మీరు మనసు కలవరపెట్టుకోకండి. జాతస్య మరణం ధృవం-నిన్న సాయంత్రం ఈ వేళకి ఆవిడెవరో మీకు తెలీదు. ఎందుకంత కంగారు పడతారు? ఆవిడకి ఆయుర్దాయం ఉంటే బతుకుతుంది."

"మీరేమీ చెయ్యలేరా?"

భుజం తడుతూ, "కథలు రాసే మీకు, డాక్టర్లు మందులిస్తారు గాని ఆయుర్దాయం యివ్వలేరని నేను చెప్పాలా?" అన్నాడు.

"ఆమె చనిపోతుందంటారా?"

"బతికివుంటే రేపు పొద్దున్న ఏడు గంటలకి ఫోన్ చెయ్యండి."

"బతకదనేగా మీరనేది! ఆ రామనాథ్—ఆమె భర్త—ఎక్కడ వున్నాడో వెతకడం మనవిధిగా

"ప్రాణములు కట్టేసేవాడైనా అతను రాక పోతాడా? పన్నెండు మూడుగంటల మధ్య ప్రాణం పోవచ్చు. పాపం—ఎవరి కెక్కడ రాసిపెట్టి ఉందోగదా!"

నాకు ముందు వెనకలు తోచలేదు. కళ్లు చీకట్లు కమ్మాయి. యంత్రంమాదిరి గదిలోకి వచ్చాను. సేట్‌జీ ఒక కుర్చీమీదా వెంకటపతి ఒక కుర్చీమీదా కూచుని ఆమె అసహాయతగురించి విచారిస్తూ, నా ఉదారబుద్ధిని శ్లాఘిస్తున్నారు.

"మీకు దేవుడు తప్పకుండా మంచిచేస్తాడు," అన్నాడు సేట్‌జీ నన్ను ఉద్దేశించి. ఆమె ఆరాత్రి మరణిస్తుందని డాక్టర్ చెప్పిన సంగతి సేట్‌జీకి నేను చెప్పలేదు; వెంకటపతికూడా తెలివిగా దాచాడు ఆ విషయం. కాసేపు రోగాలగురించీ మందులగురించీ మాట్లాడి సేట్‌జీ వెళ్తూ గుమ్మందగ్గర నాతో అన్నాడు! "అతను—ఆ రామనాథ్—వొట్టి దగుల్బాజీ, మీరు ఆదుకోకపోతే ఆ అనాథురాలు ఏమయ్యేది?"

తెల్లారేటప్పటికి ఆమె కష్టాలు తీరుతాయి గాబోలు! ఈ దుర్భరజీవననాటకానికి తెరపడుతుంది కాబోలు. అవమానాలూ, చిన్నచూపులూ, యాచనలూ లేకుండా ఈ తనుస్వాతంత్ర్యపు ఆవలితీరం చేరుతుంది కాబోలు! ఏమో!!

వెంకటపతి భోంచేసి వచ్చేందుకు వెళ్లాడు. సాయంత్రం ఏడవుతోంది. ఆమె పక్కలో కూచుని పట్టుకుచ్చులాంటి జుట్టు నిమురుతున్నాను. నిన్నటి సాయంత్రం—నాకు—ఈమె లేదు; రేపు సాయంత్రం—నాకు—ఈమె ఉండదు. తెల్లారేలోపున ఈ పసిడిదేహంలోని పరమాయువు మాయమవుతుందా? రెండు చెక్కిళ్లూ మృదువుగా స్పృశిస్తూ, మాపుడు వేలితో నుదురుమీదరాస్తూ "మంజూ, నీకు బతకాలని లేదూ?" అని అడిగాను.

"ఎందుకు బతకడం?"

"నాకోసం."

"నేను మీకెందుకు?"

"ఎందుకో నాకు తెలీదు. నువ్వు బతకాలి. బతికి తీరాలి. నాకోసం నువ్వు బతకాలి, ఎందుకని అడగకు." నా కంఠం రోదనస్వరంతో వణికింది. ఆమె కళ్ళల్లో క్రొత్తలోకాలు వెలిగాయి. చెక్కిలి మీదవున్న నాచేతిని తన చేతిలోకి తీసుకుని, చెంప మీద పెట్టుకు, ఆ చేతిని 'బంధిస్తున్నట్టు'గా ఒక పక్కకి ఒరిగింది.

"మధ్యాహ్నం భోంచెయ్యలేనట్టు ఉంది. తొందరగా భోంచేసిరండి." ప్రేమించే స్త్రీలు అన్నపానాదులగురించి ఒకటికి నాలుగుసార్లు కనుక్కుంటారని ఆనాడు నాకు తెలీదు.

"భోంచెయ్యాలని లేదు."

"వద్దు! వొళ్లు చెడిపోతుంది. నౌకర్ని యిక్కడ వుండమని మీరు వెళ్లిరండి"—అంటూ గడ్డం పట్టుకుంది. మా యిద్దరిమధ్యా మాటలే నశించిపోవలసిన దనువు వస్తోంది. ఆ దనువులోని అంతరార్థం మా ఆత్మలకే తెలుసు—లోకానికి తెలీదు.

పొద్దున్న, చనిపోతానని—తను - భయపడింది. ఈ పూట, డాక్టరు చెప్పడంవల్ల, చనిపోతుందని—నేను—భయపడుతున్నాను. నేను భోంచేసి వచ్చే వేళకి, మంజు మొహానికీ చేతులకీ పౌడరు రాసుకు పడుకుంది. పొద్దుట్నుంచీ అక్కర్లేకపోయిన పౌడరు యిప్పుడు ఎందుకు కావలసివచ్చిందో!

"మీరు వెళ్లినతర్వాత ఒక వాంతి అయింది; మళ్లీ నొప్పి వచ్చేటట్టు ఉంది."

"గ్లూకోజ్ వాటర్ తాగావా?"

"తాగడంచేతనే వాంతి వచ్చింది"

"పౌడరు ఎందుకు రాసుకున్నావు?"

"లవండర్ కూడా రాసుకోవాలనిపించింది. కాని సీసాలో లేదు."

వొద్దంటున్నా, నా గదిలోనుంచి లవండర్ సీసా తీసుకువచ్చి ఆమెకి యిచ్చాను. బట్టలమీద చల్లుకుంది.

"వెంకటపతి ఏమనుకుంటాడు?"

"ఎవరాయన?"

"ఇంగాక వచ్చిన స్నేహితుడు."

"మళ్ళీ వస్తాడా ఆయన?"

"రాత్రి మనకి సాయంగా యిక్కడే పడుకుంటాడు."

"బయట మడతమంచం వేయించి పడుకోమనండి. పాపం, ఆయన్ని కూడా శ్రమ పెట్టడమెందుకు?"

ఇంత తెలివిగా మాట్లాడుతున్న మనిషి రాత్రి రెండుగంటలలోపున ఎలా చనిపోతుంది? ధనరాజ్ చెప్పాడు; ఆమె చావు అమాంతం వస్తుందని, మాట్లాడుతూ మాట్లాడుతూ *Collapse* అవవచ్చునని. బహుశా మనసులో ఆమెకీ దృఢంగా తెలుసునేమో చచ్చిపోతానని. వెంకటపతి వొచ్చాడు; అతను బీడీ కాల్చుకుంటూ బయట మంచంమీద పడుకున్నాడు.

పది నిముషాలూ పావుగంటా మగతనిద్ర పోతూ లేస్తోంది మంజులత. రామనాన్ వచ్చి నా ప్రమాదం లేదనీ, తనపక్కలో అలా కూచుని వుండవలసిందనీ నిష్కర్షగా చెప్పింది. నౌకరు వెంకటపతి మంచం పక్కనే పడుకున్నాడు. తొమ్మిదయింది, పదయింది. భర్త అయిపూ జాడా లేదు. వొద్దని మారాం చేస్తున్నప్పటికి పదింబావుకి కాసిని గ్లూకోజ్ నీళ్లు పట్టాను; తాగింది. ఏదో భయం భయంగా ఉందంది. నాకూ మనసులో దడదడగానే ఉంది; మేకపోతుగాంభీర్యం మాపెట్టాను,

గదిలో పంద కౌండిల్ బల్బు వెలుగుతోంది. కిటి కీలని చూసి భయపడుతుందని కిటికీ తలుపులు వేశాను. ఎలక్ట్రిక్ పంకా టక్‌టక్ మంటోంది. అగరు ధూపం మస్తు కొద్దిగా తగ్గింది.

"చంద్రోదయమయితే గాని చావరటగా !"

మళ్ళీ ఈ మాటలు మాట్లాడుతుందని నేను అనుకోలేదు. మనసులోనుంచి ఆ భయోత్పాతం ఆమెకి పోలేదు.

"నీకేమీ ప్రాణాపాయం లేదని డాక్టర్ చెప్పాడు."

"మీకు అబద్ధమైనా చెప్పేవుంటాడు; లేదా ఆయన కాపాటి తెలుసుకునే శక్తి అయినా లేక పోవాలి. నాకు చావు ఎలా వస్తుందో నాకు తెలుసు—తక్షీమని గుండె ఆగి మరణిస్తానట. బాధ రాబోయేముందు గానీ, బాధ తీరిన పది పదిహేను నిముషాల్లోగాని ఆపని జరగవచ్చు."

"మంజూ, నువ్వు బతుకుతావు—నీకు తెలీదు," అంటూ ఆమె నుదుటిమీద ముద్దుపెట్టుకున్నాను.

ఆ రోగిష్టిమనిషి అవోలా నవ్వుతూ, "నన్ను ఎందుకు ముద్దెట్టుకున్నారు—తప్పుకాదూ ?" అంది.

"తప్పులేదు, గిప్పులేదు," అంటూ ఆమె వెన్ను ముకమీద చేతివేళ్లతో హార్మోనియం వాయించాను.

"అయ్యో, నామీద మీకీమమకారం ఎందుకు ?" అని దీనంగా, భూదేవిలా వాపోయింది.

పదకొండయింది,—భర్త రాలేదు. వెంకటపతి మాటలు జ్ఞప్తికొచ్చాయిగాని మంజుని శిరీషపు ప్పూలా ధరించగల ధైర్యం నా కొచ్చింది అమాంతం. రామనాథ్ వస్తాడూ, వచ్చినవాళ్ళలో జత—రాడూ, పోయినవాళ్లలో ఒకడు. మంజు ఈ ఉపద్రవంనుంచి దాటితే, ఆమెకురించిన సమస్తం నేను చూసుకుంటాను.

పన్నెండుకి యిరవైనిముషాలు వుండగా వులి క్కిపడి లేచి, నావొళ్ళో తలపెట్టుకు పడుకుంది. పట్టుకుచ్చులాటి జుట్టుని గోళ్ళతో దువ్వుతూ గాలి స్తున్నాను. మళ్లీ కొస్త కునుకుపట్టిం దామెకి. పన్నెండూ అయిదు నిముషాలకి ఒక్కసారి కెవ్వున కేక పెట్టింది. పక్కగదుల్లో వాళ్లు పరిగెత్తుకు వస్తా రనుకున్నాను గాని రాలేదు. ఆఖరికి వెంకటపతికి కూడా మెలకువ రాలేదు.

"కడుపు నరాలు తోడేస్తున్నాయి. ఈ గదంతా గిరగిర తిరుగుతోంది. ఇంత చీకటిగా ఉందేమి ?"

మంజులత మనలోకంలోనుంచి వెళ్ళిపోతున్న ట్టుంది. గదిలో అంత పెద్దదీపం వెలుగుతూవుండగా చీకటేమిటి ? ఆమెని దిండుమీద పడుకోబెట్టి వెంక టపతిని లేపనా ? అతనుమాత్రం ఏం చెయ్యగలడు ? ఈ అపూర్వబాంధవి మరణం నాచేతుల్లో ఉందా ? పెద్దపెట్టున ఏడుపొచ్చింది, ఏడవలేను. వొళ్లు జలద రించింది.

"మంజూ !" అన్నాను నెమ్మదిగా.

"ఏమిటండీ ?"

"కలవరిస్తున్నావు."

"కలవరింత కాదు. ఏదో అయోమయంగా ఉంది. నన్ను వొదిలి వెళ్ళకండి."

"నువ్వు నా మంజువి. నాకోసం బతుకుతావు. నిన్ను నేను బతికించుకుంటాను. ప్రేమలో అమృతా నికి వుండే గుణం ఉందన్నారు. అంచేత, నువ్వు బతక్క తప్పదు."

ఆమె బతికింది. సులువుగా ఒక్క మాటలో ఆ సంగతి ఈనాడు చెబుతున్నాను గాని, ఆనాడు తెల్లవారుజాము నాలుగు గంటలదాకా ఎంత బాధ పడింది మంజు! విలవిల తన్నుకునే ఆమె పాంచ భౌతికశరీరాన్ని చూసి నేనెంత ఏడ్చాను! బాధలూ కన్నీళ్లూ కాలమనే మహార్ణవంలో కలిసిపోతాయి కదా! నా మంజు నాకోసం మృత్యువుతో హోరా హోరిని పోరాడింది. ఎంత అహం—నా మంజు, నాకోసం; మంజూ నేనూ జీవితంలో కలుసుకోము. కలుసుకోకపోయినప్పటికీ ఎంత అహం !

మర్నాడు పొద్దున్న ధనరాజ్ మంజులత బత కడం 'మిరకిల్' అన్నాడు. ఆ సాయింత్రం ఆమె కింక ప్రాణభయం లేదన్నాడు. ప్రాణాపాయస్థితి దాటినతర్వాత ఎర్రదుద్దులు ఆమె చేతిలో పెట్టాను.

"యివి మీకెలా వచ్చాయి?"

"యివి యిద్దామనే నిన్నపొద్దున్న మీ గది

లోకి వచ్చి జన్మజన్మాలకీ మరుపురాని అనుబంధం ఏర్పాటు చేసుకున్నాను."

మంజులత నీరసంగా కాక శృంగారాన్ని వొలకబోస్తూ నవ్వింది.

"రామనాన్ రాడాయిక ?" అన్నాను,— నేను అడగకూడని ప్రశ్నే, కాని అడక్క తప్పదు.

"వస్తాడు — ఈ సాయంత్రం తప్పకుండా వస్తాడు."

ఆమె చెప్పినట్టుగానే సాయంత్రం వేళ రామనాన్ వచ్చాడు. భార్యాభర్తలు ఏమి మాట్లాడుకున్నారో తెలీదుగాని కన్నీళ్ళతో నాకు కృతజ్ఞత తెలిపాడు. మరుసటి ఉదయం అతను బెంగుళూరు వెళ్ళాడు,—ఆ సంగతి డాక్టరు వచ్చినపుడు మంజులత చెప్పేదాకా నాకు తెలీదు.

"ఎప్పుడొస్తాడు ?"

"రేపే వస్తానన్నాడు. రాగలడో, రాలేడో! మా బ్రదర్‌కి టెలిగ్రాం యివ్వండి—మా వాళ్ళింటికి వెళ్ళిపోతాను."

"ఇక్కడ వుండకూడదా ?"

"మీకు తెలీదు—చిన్నతనం." అలా అన్నందుకు కాసేపు అలిగాను- చటుక్కున జ్ఞాపకంవచ్చి "దుద్దులేవి ?" అన్నాను.

"యివ్వలేదు. తలగడకింద దాచాను. మీరు సేట్‌జీ దగ్గర్నుంచి తీసుకున్నట్టు అతనికి తెలీదు."

మంజులత, నాలుగురోజుల్లో ఎంతో చనువయింది. నాతో చిన్నపిల్లమాదిరి ఆడుకునేది; నన్ను ఆడించేది. స్త్రీ మనసివ్వడమంటే ఏమిటో అంతవరకూ పుస్తకాలలో చదివానేగాని అనుభవంలో తెలీదు. మంజులతకి జుట్టుదువ్వడం. పౌడర్ రాయడం నా డ్యూటీస్.

సాయంత్రం అయిదవుతుంది. పక్క డాబా మీద పదహారు పద్దెనిమిదేళ్ళ అమ్మాయి తమ్ముడి గాలిపటం ఎగరవేస్తోంది. మంజులత డ్రెస్సింగ్ టేబుల్ ముందు కూచుని వుంది. నేను పక్కన నుంచుని ఆమె మొహంమీద యార్డ్లీస్ మెత్తుతున్నాను. గాలిపటం ఎగరవేస్తున్న అమ్మాయిని చూపి మంజులత ఘటాలున అడిగింది: "అలాటి అందమైన పిల్లని మీరు పెళ్ళిచేసుకోకూడదూ ?"

"నీకంటె అందంగా ఉందా ఆ అమ్మాయి?"

మంజులత కన్నీళ్లు అద్దంలోనుంచి కనిపించాయి. ఇట్టే వెనక్కి తిరిగి నా చెంపలు తన చేతుల్లోకి తీసుకు, నన్ను దగ్గిరికి రమ్మని ముద్దెట్టుకుంది. బతుకు పండినట్లనిపించింది. పుష్కరం గడిచినా ఆ ముద్దు గురించిన జ్ఞాపకం జీవితానికి పరిమళ మాపాదిస్తోంది. ఆమె పాదాల దగ్గిర కూచుని వొళ్ళో తలపెట్టుకున్నాను.

"మీ రుణం ఈ జీవితంలో నేను తీర్చుకోలేను. మనకి జన్మలనేవే వుంటే, మరోక జన్మలో కలుసుకోకపోము. ఈ జన్మలో నేను మీకు పనికిరాను. ఏరుమాల్‌తో నా కన్నీళ్లు తుడిచారో అది నాది ; ఈ ఎర్ర దుద్దులు మీవి, మీ రెవర్ని పెళ్ళి చేసుకుంటారో ఆమెకి యివి యివ్వండి. రేపు మా బ్రదర్ వస్తాడు. ఈ ఒక్కరోజూ మనం కన్నీళ్లతో గడపవద్దు. అడవిపిట్టలా నేను మీ దగ్గిరికి వచ్చి వాలాను; అలానే వెళ్ళిపోతాను. బాధపడకుండా, నన్ను నవ్వుతూ రైలెక్కించండి. నేను మీకు తగనని మీకూ తెలుసు ; కాని బంధన వొదుల్చుకోలేక బాధపడుతున్నారు."

మంజులత నిజం చెప్పినప్పటికీ ఆమె మాటలన్నీ నేను వొప్పుకోలేకపోయాను. నా పిరమిడ్ కెర్‌ఛీఫ్ తాను తీసుకుని, ఎర్రదుద్దులు నా చేతిలో పెట్టింది. మనుషులమే విడిపోతున్నప్పుడు చిహ్నాలుమాత్ర మెందుకన్నాను. నవ్వి, ముక్కుపట్టుకు, లెంపలు వాయించింది. స్త్రీసహజమైన చాతుర్యంవల్ల, రైలుదగ్గిరికి వెళ్ళే వరకూ, తన కొంగునికట్టుకు తిప్పుకుంది నన్ను.

రైలు కింకా యిరవై నిమిషాల టైము ఉంది. బ్రదర్ సామాను సర్దుకుని పెట్లో కూచున్నాడు. నేనూ మంజులతా యింజను చివరిదాకా నడుచుకుంటూపోయాం. సాయంత్రం నేను ప్రజెంటుగా యిచ్చిన తెల్లచీరె కట్టుకుంది; ఊదా జాకెట్ వేసుకుంది. జుట్టు అందంగా దువ్వుకు, నాజూకుగా, లేత తమలపాకులా కనిపిస్తోంది. మనుషుల రద్దీలేనిచోట నుంచున్నాము.

"నేను మిమ్మల్ని వొదిలి వెళ్లలేకుండా వున్నాను. కాని వెళ్ళక తప్పదు." కంటి ముత్యాలు మెరిశాయి. దగ్గిరికి తీసుకునేందుకు అది జనసమ్మర్దం

గల ప్రదేశం. "మీరు చేసినదానికి నేను మీకేమీ యివ్వలేకపోయాను గదా!"

నాలోని పురుషుడు నిద్రించాడు. ఆమె ఆత్మ నిజస్వరూపం గోచరమయింది. "ఛీ—అలా అనుకోకు, నువ్వు ఎక్కడో అక్కడ సుఖంగా ఉండాలి. మంజుని నేను బతికించుకున్నాను. జన్మజన్మాలకీ 'యిది' నా మంజూయే!"

బాగా వెలుగులోకి వచ్చేదాకా చెట్టాపట్టాలు వేసుకు నడిచాము. హృదయావేదనని మరుగు పరచ ప్రయత్నించే మా తెచ్చికోలునవ్వులు, వర్షంపడ్డ తర్వాత కాసిన ఎండలాటివి. బ్రిడ్జ్ సరిగా చూస్తున్నప్పటికీ, రైలు కదిలేదాకా మంజు చెయ్యి నా చేతిలో ఉంది. మాంగుళూర్ మెయిల్ మా యిద్దరి చేతులూ విడదీసింది. అందుకనే నాకు మాంగుళూర్ మెయిల్ అంటే అంత కోపం!

మంజులత ఏమయిందో నన్ను అడక్కండి. 'దేవదాసు'లోని పార్వతి ఏమయిందో శరత్ బాబు చెప్పలేకపోయినట్టే, నేనూ చెప్పలేను. నా మంజులత పార్వతంత గొప్పది కాదు. చెప్పలేకపోవడానికి ఉదాహరణగా మాత్రమే ఆ ప్రసక్తి తెచ్చాను. పుష్కరం గడిచింది. మంజులత ఈనాడు ఒక స్మృతి. ఆ స్మృతిని ఉన్నదున్నట్టుగా కాయితం మీద కెక్కించాను; మీరు చదివారు. ఒక్క విషయం; నా భార్య చెవులకున్న ఎర్రదుద్దులు నిజానికి మంజులతవి.

---

# వసంత రజని

## శ్రీ వోలేటి పార్వతీశం

ఎండి ప్రోడులే చిప్పరెత్తి ఈ యజాండ
మెల్ల నూత్నానుభూతి రహించి నించు
మధు వసంతుని శృంగార మాధురీ మ
నోజ్ఞ హాసమ్ము నాలొ పొంగుల నదించె!
నాయెడదలో గతాను గానమ్ము తిరుగ
పాడుకొని స్పృశించెను భావవంత గీతి
ఈ ప్రకృతి మహోజ్జ్వలగీతి శృతిహితమ్ము
నాకనుల నిండు క్రమవిణా గణమ్ము
కడచినవి నాదు హేమంత కాలనిశలు
ఆసుదుస్సహ దుర్దినాలందు నేరు
కొంటిని విశీర్ణ పత్రాల కోట్ల కొలది
అవె మదీయ బాధాభర సాక్షికములు!

ఈజలధరాలపై పయనించు నాదు
కోర్కెలివి వానలై మొదగురిసి విరిసి
పల్లవశ్రీ సజీవమ్ము కొల్లగొనెను
నామనసొక భావాన తన్మయత నంద
రాలిపోయిన బ్రతుకులీ శేల స్మృతుల
గతులలో గతుకుమనునో? కలల యలల
తేల్చునో? దుఃఖ బాష్పాల రాల్చునేమొ!
నాహృదయ మొక్క ఘడియైన నాట్యమాడు.
కాలినవి దివ్య సాంధ్యలో కాలతీర
రేఖ కాంచలమ్మంటి నాహృదయ వసన
పాళికలు చీకటులసాగి చీలిపోయి;
ఎట్టులీ బూడిద నిశీధి నేరుకొందు!

---

సాహిత్యమీమాంస :

# 'సౌందరనందము'



శ్రీ పొట్లపల్లి సీతారామారావు

సురభిగారు వ్రాసినది నా విమర్శనమున కెంత వఱకు సమాధాన మగునో పండితులకు దెలియును. వారు వ్రాసినది సమాధానమే కాదు. సమాధానమనగా నేను చెప్పిన యుక్తికి-సమాధానము జెప్పుటకాని, నేను వ్రాసిన కొన్ని మాటలను దీసికొని సంబంధము లేనట్లుగా దాని కినుమడిగా ముమ్మడిగా, మాటలను గూర్చుట కాదు. నాకు సమాధానమీయవలె నన్నచో నేనే దోషములను జూపుచున్నానో ఆదోషములను దీసికొని సమాధానమీయవలెను.

నా విమర్శనములో ముఖ్యభాగము, రసము—కథ—ఔచిత్యము—వీని దృష్ట్యా ఈ కావ్యము నిలువదని. దానికి వీరేమి సమాధానమిచ్చిరి? "విరుద్ధరస సమ్మేళనమే కవి ప్రతిభను చాటి చెప్పుచున్నది" అనిరి. ఇది సమాధానమా?? ఇది యే ప్రమాణము ననుసరించియున్నది? అదికాక "మనుచరిత్రయందలి వరూధినీ ప్రవరుల ఘట్టము జదివిన నీవిషయం బోధపడగలదు" అని వ్రాసిరి;

అనగా మనుచరిత్రలో విరుద్ధ రస సమ్మేళన మున్నదని వారి భావన. పెద్దన్నగారికి గావ్యము మొత్తముమీద నీ రసము ప్రధానముగా జేయవలెనన్న భావన యున్నటులే తోచదు. ఆయన యేకథకాకథయే వ్రాసినాడు—

"మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయరస సముంచిత కథలన్
విననింపు కలిధ్వంసక
మనఘ! భవచ్చతుర రచన కనుకూలంబున్"

ఈ పద్యము కృష్ణరాయలవారే పెద్దనగారితో జెప్పినది. ఈ స్వారోచిషమను సంభవమునందు రస సముంచిత కథలున్నవి; ఆ కథలు వినుట కింపైనవి. కలిధ్వంసకమైనవి. ఆయన చతుర రచన కనుకూలమైనవి. ఇది యాయన పెట్టుకొన్న లక్ష్యము. ఆగ్రంథము స్వారోచిషమను సంభవము. కావ్యము మొత్తము మీద ప్రధాన రసము శాంత మనుటకు వీలు లేదు. సర్వధర్మములు మనువు వ్రాసెను. ఆయన పుట్టిన కథ. అంతకుమించి ఇందేమున్నది? ఆయన విడివిడి కథలు వ్రాసెను. ఏ కథ కా కథయే చూచుకొనవలెను. కలిపి చూచుటకే వీలు లేదు. ఆయన వ్రాసినది ప్రబంధము, వర్ణనా ప్రధానమైనది. కృష్ణదేవరాయలనాటి కవులందరు నిట్లే వ్రాసిరి. పాండురంగ మాహాత్మ్యములో నాలుగు కథలు, పారిజాతాపహరణములో రెండు మూడు కథలు, కాళహస్తీశ్వర మాహాత్మ్యములో నాలుగైదు కథలు. వానిలో రచనాచాతుర్యము ప్రధానము కాని రసచర్చ కాదు. ఒకవేళ సురభిగారన్నట్లు మనుచరిత్రలో ప్రధాన రస మేదో యున్న దందము; ఆ ప్రధాన రసమేదో వారే చెప్పవలెను. అప్పు డాయన రససమ్మేళనము జేసినా డందము. ఆ ప్రధానరసము మొదటి మూడాశ్వాసములలో నున్న శృంగార రసమునకు విరోధి రసమనియే యనుకొందము. అప్పుడును మనోరమకథలో నున్న రాక్షస వృత్తాంతముతో నీ రెండు ప్రధాన విరోధిరసములు నంతరితమైన యట్లు భావించవలసి యుండును.

"కాళిదాసు నన్నెచోడులు కుమార సంభవములో దివ్యులగు పార్వతీ పరమేశ్వరులకు గజమైథునమువలన గామోద్రేకము గల్పించి తాద్రూప్యమును పొందించారు" అని వ్రాసిరి. ఇది వ్రాసినది కాళిదాసుకదా యని కూడ మిన్నకుండక యాలంకారికులు విమర్శించిరి. అనంతప్రతిభచే సుప్రభాసితమై, యనేక దోషములను గప్పివైచుకొనగల భాషాసముద్రులైన కాళిదాసాదులనే యతిక్రమించి దోషము జరిగినంత మాత్రముననే విమర్శించగా, నిక "సౌందరనందము"ను విమర్శించుటలో విప్రతిపత్తియేమున్నది?

అదికాక, నేను శృంగార ముత్తమప్రకృతియోగ్యము కాదంటిని. దానికి సమాధానము వ్రాయవలసివచ్చినపుడు త్తమ ప్రకృతియందే యిక్కడ శృంగారము నిష్ఠమైనదని సహేతుకముగా నిరూపించవలెను. దానికి శృంగారాభాసము మొదలైనవాని నుదాహరించిన మాత్రమున సమాధానముకాదు.

"యావతాతు అనౌచిత్యేన రసస్య పుష్టిః తావన్నవార్యతే" ఇది యెవరు కాదన్నారని యుదాహరింపవలసివచ్చినది? ఆ యనౌచిత్యమువలన జరిగిన పుష్టియేమో చూపించవలదా! ఉత్తమ ప్రకృతి నిష్ఠముగానిచో శృంగారము చెడిపోవును. నాయిక సుందరి. ఆమెలో నుత్తమనాయికా లక్షణములు లేవు. నందునిలో నుత్తమనాయక లక్షణములు లేవు. వారిచేష్టలు, వారి వర్ణనలు దీనిని స్ఫురింపజేయుచున్నవి.

"విరోధి రసాన్ని అంత పుష్కలంగా పోషిస్తేనే తప్ప అంగిరసం పరిపుష్టం కానేరదు. విరుద్ధరస సంపుటీకరణమే సిద్ధహస్తుడు చేసే పని. ఎవరో ప్రౌఢకవులు తప్ప ఇట్టి చమత్కారం నిర్వహించి కృతకృత్యులు కాజాలరు" అని వ్రాసిరి. నేనాలంకారికులు చెప్పిన మాటల నుదాహరించి ఇది తప్పనిచెప్పగా, స్వయముగా దా నూహించి వ్రాసిన యీ వ్రాత ఎంతయోగ్యముగా నున్నదో చూడుడు. అంగముగా నున్న రసమును—అందులో విరోధిరసమును—పుష్కలముగా, బోషించినచో దోషము; బ్రహ్మ వ్రాసినను దోషమే!

"కూరిమి తోబుట్టువుల విస్మరించియా
నెయ్యమ్మ నీమీద నిలుపుకొంటి"

ఇది అధమనాయిక కుచితముగా నున్నదని నేనంటిని. సురభిగారు "వీరికి విహారం*లోవుండే అవస్థా విశేషాలు అవగతం కానట్లు స్పష్టమగుచున్నది. తోబుట్టువుల పట్లగల సౌదర్యౌదార్యం కూడ విడచి దాన్నంతా నందునిలో స్థాపించుకొన్నది. ఇది విరహవేదనలో ఉపాలంభనము" అని వ్రాసిరి. విరహవేదన కాదని యెవరనిరి? ఈ విమర్శకునకు నేను చెప్పిన దోషములర్థమే కాలేదు. ఎంత పతివ్రతకైన తల్లిదండ్రులు—అన్నదమ్ముల పైన ప్రేమయుండును. సృష్టిలో నొక కాముకి కాని తల్లిదండ్రులను వదలివైచి సర్వప్రేమలను త్యజించి లేచిరాదు. ఇదిలేచివచ్చిన స్త్రీ లక్షణము. సుందరిలో నుత్తమ నాయికాలక్షణము మందునకైనను కనుపించదు. శృంగారరస మేమాత్రము వెలితిపడినను చప్పున స్ఫురించును. అందులో కవి జాగ్రత్తగా నుండవలెను. ఈ భావము 'అధమనాయిక కుచితముగా నున్నద'న్న నా వాక్యము సూచించుచున్నది. విరహవేదనలో నుపాలంభమును నేను కాదనలేదు.

"అష్టవర్షాభ వేత్ కన్యా పుత్రవత్ పాలితామయా
దాస్యామి తవపుత్రస్య దత్తా స్నేహేన పాల్యతాం"

దీని యర్థము "ఈ కూతురు 8 యేండ్లవరకు పుత్రునివలె నాచే పెంచబడినది. సంతానముకొరకు నీ కిచ్చుచున్నాను. స్నేహముచే పాలింపుము" అని. ఈ అర్థము "కూరిమి తోబుట్టుగుల" అన్న పద్య పాదములో ధ్వనించుచున్నదన్నారు. అది యెట్లు ధ్వనించుచున్నదో పాఠకు లూహింతురుగాక! ఆ ధ్వనిని పుట్టించుటకు వ్యంజకములైన శబ్దములు గాని యర్థములుగాని యుండవలయును.

పంచసంధి ప్రతిపాదనము శ్రవ్యకావ్యములలో కూడ పాటింపవలెను. పంచసంధులు రసమున కనుగుణముగా కూర్చబడినవి. శ్రవ్యకావ్యములందు కూడ రసమే ప్రధానము. కాబట్టి యీ లక్షణము దీనికి కూడ పట్టును.

రసము పుష్టినొందుట విభావములపై నాధారపడియుండును. ఈ కావ్యము రసదృష్ట్యా నిర్మింపబడినదైనచో తదుప పోషకముగా నాలంబన విభావములైన నంద సుందరులను ప్రవేశబెట్టి రచన సాగించవలెను. బుద్ధుని ప్రవేశ ప్రబోధములు రసమును పుష్టినొందించుటలో తోడ్పడవు.

"ఇట శృంగారమన విమర్శకుల దృష్టిలో పాశవకేళి కాబోలు" అని వ్రాసిరి. ఇక్కడ పట్టిపగలు రతినిషేధము తప్ప శృంగార చేష్టలు నిషిద్ధములు గావని ప్రతి విమర్శకుల భావము కాబోలు!

*సురభిగారి వ్యాసములో "విరహం"నకు "విహారం" అని అచ్చుతప్పుపడినందుకు విచారించుచున్నాము—సం.

నే నన్నది “పట్టపగలు నాయికానాయకుల శృంగారము నిషేధము. లోకములోనుండిన నుండవచ్చును కావ్యములో నుండరాదు” అని. వీరు పూర్వవాక్యములే యుదాహరించి యుత్తరవాక్యములను తీసివైచి నన్ను పైవిధముగా నధిక్షేపించిరి. వీరన్న పాశకకేళియే నా “శృంగార” మనుకొన్నచో నది లోకములోకూడ పట్ట పగలు నిషేధింపబడినదే కదా! లోకములోనుండిన నుండవచ్చునంటినిగాని నిషేధము కాదని చెప్పలేదు. కావ్యములో రసమున కుద్దీపన విభావములు రక్తినిచ్చును. ఇక్కడ శృంగార రసమున కాయుద్దీపన విభావత్వము వెలితిగానున్నది. కావున దోషమని నా యభిప్రాయము. శృంగార రసమున కుద్దీపన విభావములు వెన్నెల మొదలైనవి. మధ్యాహ్న సమయము మాత్రము కాదు.

శ్రీ సురభిగారు నా విమర్శనలోని ప్రాణప్రాణమైనవాక్యములను పట్టుకొని విమర్శించలేదు. ఆనా చెప్పిన హేతువులకు యుక్తి యుక్తముగా జవాబుచెప్పినచో మిగిలినదానిని గురించి ప్రయాసపడ నవసరము లేదు. అవన్నియు పెద్దదోషములు కావని నేనే యొప్పుకొంటిని గదా? ఇక మిగిలిన వానికివారి సమాధానములను వరుసగా నుదాహరింతును.

“పై నుదహరించిన నాల్గంశములలో పై మూటిని విమర్శకులు తఱచి చూడలేదు.” అని వారివాక్యము. ఇది కొంతవఱకు నిజమే. అవి పెద్దదోషములు కావని ఆ వ్యాసమునందే చెప్పితినిగదా. ఆధునిక కావ్యములలో నా దోషములెక్కువగా నున్నవని చెప్పు సందర్భమున పై నాల్గిటి నుదాహరించితిని. దిఙ్మాత్రముగా చూపించి చాల దోషములను పరిహరించితిని.

“ఇట వారు వాడిన ప్రణయకోపశబ్దమే సమాధాన మొసంగుచున్నది. వారు చెప్పిన గోత్రస్ఖలనాదికము చేయించినచో నది ఈర్ష్యాకోప మనబడును. ప్రమాణము మనవి చేయుచున్నాను” అని వారి వాక్యము. నేను గోత్రస్ఖలనము పూర్వప్రబంధ కవులలో చేయించుట కలదంటిని. కాని సౌందరనందకర్త లేల చేయలేదని కాదు. నా యాక్షేపణ యేమనగా ప్రణయకోప ప్రమాణము వేరు. మానకోప ప్రమాణము వేరు. ప్రణయకోపములో నాయకుడు నాయిక. పాదములపై బడుట యెన్నడు నుండదు. అది గోత్రస్ఖలనాదులయందే యుండును. ప్రణయకోప మీ ప్రమాణములో పూర్వకావ్యములలో నెచ్చటనైన చూపించినచో నా వాదము పరాస్తమగును. అశ్వఘోషుడు నిట్లే వ్రాసినాడు. ఆయనే కాదు కాళిదాసు వ్రాసినను తప్పు తప్పే. నాకు కావలసినది నేను చెప్పినదానికి సమాధానము. అంతే కాని అప్రసక్తములైన యుదాహరణలతో నాకు పని లేదు.

“కావ్యములో నున్నదే బౌద్ధమత వాతావరణము. అది సార్వత్రికముగా నున్నది.” నా విమర్శలోని రెండవ బలీయమైన యంశమున కిది సమాధానముగా నిచ్చుచున్నారు. నేను బౌద్ధమత వాతావరణము లేదంటిని. ఉన్నదన్నప్పుడు దానిలోని యత్కించిత్ భాగమునైన సూచించవద్దా? “వ్యాసవిస్తర భీతిచే విరమించుచున్నా” నన్నారు. ఈ గ్రంథమునిండా హిందూమతముయొక్క ఛాయలు యెక్కువగా గోచరించుచున్నవి. “స్మర దుర్మదున్ బట్టి సపరివారమ్ముగా పశువరించిన యజ్ఞవాటి వోలె, బౌద్ధ విహారభూమిని యజ్ఞవాటికతో పోల్చుటలో నేమి యౌచిత్య మున్నదని” నే నంటిని. దీనికి వారి సమాధానము. “ఇది హిందూమత సిద్ధాంతచ్ఛాయగా వివర్శకుల దృష్టికి కనుపించినా ఇందులో తదతీతమై, తద్భిన్నమై, పరమ రమణీయమై బౌద్ధసిద్ధాంత స్థిరీకరణము వెల్గుతోంది. కామ క్రోధ లోభ మద మాత్సర్యాదులతో తారాడుతున్న జగత్తును కామ ప్రకృతినుండి నివర్తింప జేయుచు నిష్కామ ప్రేమ సిద్ధాంతాన్ని స్థాపిస్తున్న బుద్ధుని గురించిన వాక్య మిది. అంత తప్ప యాజ్ఞిక వాతావరణానికి ప్రసక్తిలేదు.” అని. “బుద్ధుని గుఱించిన వాక్యమిది” అన్నారు. అది బౌద్ధవిహారభూమిని గుఱించిన వాక్యముగాని బుద్ధుని గుఱించినదిగాదు. * “యాజ్ఞిక వాతావరణానికి ప్రసక్తిలే” దన్నారు. విహారభూమిని యజ్ఞవాటికతో బోల్చుటలో సొగసు లేదు. హిందూ మతము యొక్క ఛాయకు దోహదము చేయుచున్నదని

* (సురభిగారి వ్యాసముద్రణమున బుద్ధవిహారమునుగురించి అనుటకు బుద్ధునిగురించి అని అచ్చుపొరపాటు పడినందుకు విచారించుచున్నాము—సం)

నే నంటిని. దానికి యాజ్ఞికవాతావరణము మొదలైన వానిని, దీసికొనివచ్చుట యప్రస్తుతము "బుద్ధుని జిహ్వాసీనమై భాసించే ప్రతివాక్యం బౌద్ధసిద్ధాంత వ్యంజకమై...కలకల లాడుతోంది" అన్నారు. వీరికి బౌద్ధమతము, బౌద్ధ మత పరిణామము, హీనయాన మహాయానములయొక్క స్వరూపము, అశ్వఘోషుని తథతా సిద్ధాంతము, ఆత్మలేదను బౌద్ధమత సిద్ధాంతము, నిర్వాణస్వరూపము ఇవేవైన తెలియునా? బుద్ధుడు నిర్వాణమును బోధించెను. బుద్ధుని నాటికి యీ బౌద్ధమతారంభమెట్లున్నది? విశుద్ధమార్గము, పేహానికాయ, దమ్మసంపద్ది వ్యాఖ్యలు వచ్చెడి వఱకు బౌద్ధమత సిద్ధాంతముయొక్క స్వరూపమేమి? దీఘ, మజ్ఝిమ, సంయుక్తాంగుత్తర, బుద్ధక నికాయములు మాత్రమే నాటి గ్రంథములుగా గనుపించుచున్నవి. ఇవి బుద్ధుడు బోధించిన విషయములు. బుద్ధునిచేత సమకూర్చబడి, సూత్రములుగా నాడు వ్యాపించియుండెను. బౌద్ధ ధర్మమనగా సుత్తాది గ్రంథములు. సుహేత నిసత్త నిజ్జీవములు ఈనాల్గింటియొక్క సారాంశమే ధర్మమని చెప్పవచ్చును. ఇందులో నిసత్త, నిజ్జీవము పరమప్రధానమైనవి. హీనయాన మహాయాన మార్గము లేర్పడని నాటి బౌద్ధమతము ధర్మము మీదనే యాధారపడియున్నది. అది పట్టి శూన్యవాదము. దీనినే పతిచ్చ సముప్పాద మందురు. బుద్ధునినాటి బౌద్ధమతముయొక్క సారాంశము సంయుత్త నికాయములో ద్వితీయఖండములో నైదవసుత్తమున నిట్లున్నది. "ప్రజలుపుట్టుచున్నారు; జీర్ణించుచున్నారు; చనిపోవుచున్నారు, మరల బుట్టుచున్నారు. ఈ జరామరణదుఃఖములనుండి విడుదలయెట్లు?" ఇది బుద్ధుని జిజ్ఞాస. జాతి (జన్మ)తో నీ జరామరణములు కల్గుచున్నవి. ఈజాతికి మూలమేమి? భావమైయుండవలెను. దేని హేతువున భావమున్నది? ఉపాదానమువలన నున్నది. ఉపాదానము తన్హమీద నాధారపడియున్నది. తన్హా, వేదన, ఫస్స—ఇవి యొకదాని కొకటి హేతువులు. ఫస్స (యనగా స్పర్శ) అది షడాయతని; దానికి నామరూపములు హేతువులు. వానికి విన్నాణము హేతువు ఆ విన్నాణమునకు సంఖారములు హేతువులు. దానికవిజ్జహేతువు. దీనికంతయు 'భావచక్ర'మని పేరు. వీనికి బంచఖండములని పేరు. వీనితోబాటు అవిజ్జ, ఆసవము, శీలము, సమాధి, కర్మ, చిత్తశుద్ధి నిబ్బాణము. వీనినిగురించిన బహు విషయములు గలవు. వీని ప్రసక్తి యేమియు లేకుండ "దీనియందు బౌద్ధమతము కలకలలాడుచున్న" దనగా నెట్లు విశ్వసింపగలము? నిజముగా బుద్ధుడే మాట్లాడినచో దాను కనుగొనిన యీ తత్త్వమును నందున నుపదేశింపవలదా! తత్స్పర్శ కూడ దెలియకుండ వ్రాయగా సురభిగారు అవి శాస్త్రమగునని మానివేసి రనుటలో నర్థమేమో తెలియదు. శాస్త్ర విషయములే కవితాశక్తి కలవారు రమ్యమైన శబ్దముచేత స్వన్యాసములచేత జెప్పుదురు. మహాకవులు శాస్త్రవిషయములనే రమ్యముగా జెప్పిరి. తెలియని విషయముల నిట్లు మప్పుకొనుట గొంతవ దోషము.

అశ్వఘోషుడు తథతా సిద్ధాంతమును వ్యాప్తి చేసినాడు. ఆ సిద్ధాంతము ప్రకారము ఆత్మలో భూత తథతావశ, సంసారవశ—రెండున్నవి. భూత తథత యనగా ధర్మధాతుత్వము. దానివలన ప్రకృతి కలిగి వ్యక్తు లేర్పడుదురు. ఈ ప్రకృత్యతీతుడు నిర్వాణమార్గమునం దుండును. అనగా అభూత తథతాస్థితిని బొందును. అది స్థితి కాదు; అస్థితి కాదు. అది శూన్యత. మరల శూన్యము గాదు. సంసారము తథాగత గర్భములోనుండి జన్మించుచున్నది. ఈ తథాగతగర్భము మూలభూతమైన నిత్యస్థితి. తథాగతుల విశ్వవ్యాప్తమైన ధర్మకాయము నుండి సంసారము పుట్టుచున్నది. ఈ మొదలైన సిద్ధాంత మశ్వఘోషునిది. అతడు తన సిద్ధాంత స్థాపనకొరకు సౌందరనందమును వ్రాసెను. ఈ యశ్వఘోషుని సిద్ధాంతమునకును, థేరవాదమునకును సంబంధము లేదు. అశ్వఘోషుని కథ వదలిపెట్టినప్పుడే తథతా సిద్ధాంతము వదలిపోయినది. అప్పుడు నేను పైన జెప్పిన స్కంధావిద్యాసవ శీలసమాధి కర్మనిర్వాణములను గురించి యైనను వ్రాయకపోయినచో బౌద్ధమతము "కలకల" లాడదు; ఇది బుద్ధునినాటి మూలభూతమైన సిద్ధాంతము. దీనిమీద బహువ్యాఖ్యలు గలవు. వీనినన్నింటిని *Rhys Davis* ను ఆయన భార్యయును నెంతయో వ్రాసిరి. ఈ సౌందరనందము నందా ఛాయయే లేదు. అవేమియును లేకుండ నీగ్రంథమునిండ బౌద్ధమతము "కలకల" లాడుచున్న దనగా విశ్వసిం

చుట యెట్లు? విశ్వసించినవారు విశ్వసించవచ్చును; నేను కాదనను.

“నందునకు బలవంతముగా సన్న్యాస మిప్పించుటయే తప్పు. బౌద్ధమత విరుద్ధము.” అని నేను వ్రాయుచు నశ్వఘోషుడు తప్పుకొనిన మార్గమును సూచించినాను. వీరు దాని నుదాహరింపక నేదేవో వ్రాసిరి. నందుని కిచ్చినది బలవత్సన్న్యాసము. ఎద్దును బడగొట్టి లాడాలు వైచినట్లు సన్న్యాసమిప్పించిరి. దాని నశ్వఘోషుడు తప్పుకొన్నాడు; ఈ కవులా మెలకువను దెలిసికొనలేదు. వీరన్ని మాటలను జెప్పినను అది సమర్థింపబడదు.

ఇక వీరు ప్రేమసిద్ధాంతము నెత్తికొనిరి. ఆ ప్రేమ నిష్కామమని చెప్పిరి. బుద్ధనందుల సిద్ధాంతము నిష్కామప్రేమారాధన మనిరి. ఆ నిష్కామ ప్రేమ లక్షణమేమిటనియే కదా నా ప్రశ్న! అర్థరహితముగా నేటికాలములో వ్యాప్తిలోనికి వచ్చిన ప్రేమసిద్ధాంతమును తీసికొని, కని విని యెఱుగని బుద్ధనందుల కంటగట్టుట యవివేకము. దానికి వీరు సమాధానమే చెప్పలేదు. ఇది నిష్కామప్రేమ యైనచో శృంగార రసప్రసక్తి లేదు. నా రసవిషయక విమర్శ యంతయు సమాధాన మీయబడినట్లే యెంచవలెను. నిష్కామప్రేమలో స్థాయిభావమైన రతి లేదు. నాయికా నాయకుల లక్షణ లేదు. కోరికయే లేదుగదా, ఇంక రససామగ్రి యెందులకు?

విమర్శకులు నేను చూపించిన దోషములను సమర్థించుటకు బదులుగా—“ఇది ప్రౌఢకవులే చేయగలరు”—“ఇది మహాకవి నిర్మితము”— “ఇంద్రజాలవిద్య”—“గారడీ”—“రసము పుష్కలముగా నున్నది”—ఇత్యాది యదృచ్ఛా వాక్యములు, స్వేచ్ఛాధోరణి విసరివైచిరి.

—“సంసరణ మహాబ్ధి మగ్నమగు మానవకోటి పయిన్ కృపాస్ఫురుల్” అను దానిని సమర్థింప యత్నించిన భాగము నుదాహరించుచున్నాను:—

“ఈ పోలికవలన భవాగాధత్వం వ్యంగ్యమౌతుంది. ఆ అగాధములను, దుఃఖములను, తెలిసికొనుటకు చొచ్చుకుపోగల్గినది నిమ్నగ తప్ప వేఱొకటి కాదు. సముద్రములో ఝరి ప్రవేశించిన నాడే సామరస్యము కలుగును. పూజ్యపాదులవారు చెప్పినట్లు లేవనెత్తు సాధనములతో బోల్చరాదు.” పై గీటుంచిన భాగమున కర్థము మరల వారే చెప్పవలెను. సంసారమును గలుషితమైన కూపముతో బోల్చి, దానిలో కృపాస్ఫురుల్ ప్రవహించు నన్నను, కాలుష్యమును విడగొట్టు ననుకొనవచ్చును. సంసారమును సముద్రములో బోల్చుటచే భవాగాధత్వము వ్యంగ్యమగుచున్నదని వారే యొప్పుకొన్నారుకదా! ఐనచో కృపాస్ఫురులు వాఱుట యెట్లు సమర్థింపబడునో బ్రహ్మదేవుని కెఱుక! సముద్రములో మునిగెడివానిని ప్రవాహములు బైటకు దీసికొనివచ్చునా? మఱియు లోనికి త్రోయును. ఇది రూపకాలంకారము. అలంకారమును సమర్థించుకొనలేక యిట్లు వ్రాసిరి.

“భవనిదాఘ సంతాపముల్ పరిహరించు
సత్యశాంతి దయాది నిర్ఝరులు పాఱు
నీ విహార మహాహర్మ్య మెక్కి యిటుల
గంట నీర్వెట్ట దగదు నీవంటివాడు.”

“కంట నీర్వెట్ట దగ దనుటలో నేమి యాటంకము నారించుచున్నా” డని ప్రశ్నించితిని. ఇందులో నేను చూపినది యలంకార దోషమే యని “దీనిని పోలినది వేఱొకటి యున్న” దన్న నా వాక్యముచేతనే యూహింపవచ్చును. ఈ పద్యమునకు ప్రతి విమర్శకుడు నా కర్థము తెలియలేదని యూహించి కాబోలు వివరణ వ్రాసినాడు. వృథా ప్రయాస.

ఇక “కావులు గట్టియుఁ దరుణ కంజహితున్ బురుడించువాని” అని యున్నది. నా విమర్శ నందుఁడు వెనుకకు దిరిగియుండగా సుందరి చూచినది. కాన వెనుకకు దిరిగియున్న నందుని సూర్యునితో బోల్చుట సరిగాదని. కావులు గట్టినాడు గాన బాలభాస్కరునితో బోల్చినారని వారి సమాధానము. నా ప్రశ్న వెనుకకు దిరిగియున్న నందుని యట్లు పోల్చుటలో నౌచిత్యము లేదని మాత్రమే. ఏలననగా నందునియొక్కగాని, మఱెవ్వనియొక్కగాని, మఱెవ్వనియొక్క గాని పృష్ఠభాగ వర్ణనముచేత దరుణ కంజహితుని సామ్యము జెప్పుట పరమ గర్హ్యము; అప్రసిద్ధము.

“బోనున బడ్డ భద్రగజపోతము పోలిక” యన్న ఉపమలో లోకస్వభావము లేదు. ఏనుగు పిల్లలను బోనులలో బట్టరని నే నంటిని. గజముతో బోల్చుటలో నౌచిత్యము లేదని యనలేదు. వారు చెప్పిన గజజాతియొక్క కాముకత్వము వివక్షితమైనను, ఆ కాముకత్వము వ్యక్తమగుటకు సమర్థమైన శబ్దము లేదు. అందియిచ్చు సన్నివేశము లేదు. గజమని చెప్పినంత మాత్రమున గాముకత్వము సిద్ధించదు. కరిణీవియుక్త గజ మన్నప్పుడే యా స్ఫూర్తి కలుగును. ఇక ‘బోను’ శబ్దము యసహజముగ నున్నదని వారి కెందుకు తోచదో! ‘బోను’ పదమునకు స్వేచ్ఛానిరోధకమని యర్థము వ్రాసిరి. ఐనచో బంజరము కూడ స్వేచ్ఛానిరోధకమే; పంజరములో బడిన యేనుగన్నను వీరు దానిని సమర్థింతురు కాబోలును!

ఇక నందుని యుడుతతో బోల్చుటలో నుపమాలంకారౌచిత్యము లేదంటిని. దానికి క్షేమేంద్రుడెవరో కవిచే రచింపబడిన శ్లోకమును 'ఉపమాలంకారౌచిత్యము లే' దని యాక్షేపించుచు వ్రాసిన వాక్యముల నుదాహరించితిని. వీరు తిరుపతి కవుల కావ్యములోని యుదాహరణము నిచ్చి సమర్థింప బ్రయత్నించుచున్నారు. అట్టున్నవని నేనే యుదాహరణమిచ్చి, దీని నాలంకారికులీసడించిరని చెప్పగా వేఱొక యుదాహరణమిచ్చిరి! ఇచ్చట భయమే ప్రధాన గుణముగా, దీసికొన్నచో జాగిలమునకు శౌర్యము ప్రసిద్ధగుణమైనట్లు, ఉడుతకు భయము ప్రసిద్ధగుణముకాదు. వలలో బడిన యుడుతవలె నున్నాడన తప్పించుకొనలేక గగ్గోలు పడుట వ్యజ్యమాన మగును గాని దానిభయము వ్యజ్యమానముకాదు. ఆ సందర్భములో భయము సర్వ జంతువులకు నుండును. అందుచేత ప్రసిద్ధమైన భయము వ్యజ్యమానముగాక నీచోపము నీచోపమగా మిగిలిపోయెను. జాగిలమునందు, ప్రసిద్ధ శౌర్యలక్షణము నీచోపమయొక్క లక్షణమును వొలగించుచున్నది. ఇచ్చట భయము నాయకునకు ప్రసిద్ధ శౌర్యాదియైన గుణము నారోపించుటలేదు. నీచోపమయొక్క స్వరూపమే యిది. భయము సర్వజంతు లక్షణము. ఈ లక్షణము జెప్పినందువలన నాయకున కధికగుణ మాపాదింపబడలేదు. ప్రసిద్ధ మహోదార గుణ సామ్యములేని యిట్టిపోలికలే నీచోపమలు.

ఇక బ్రసాదగుణమున కుదాహరించిన యుదాహరణములో బ్రసాదగుణమే లేదు. ప్రసాదగుణ మర్థవ్యక్తిని గలిగించునది. వీ రుదాహరించిన పద్యములు నేను వలపు—ప్రేమ భిన్నార్థకములా యని యుదాహరించినవి. పద్యములో గూఢార్థముండి యర్థమును సులభముగా వ్యక్తముచేయుచో బ్రసాదగుణమున్నదనవలెను; కాని గూఢార్థము లేని పద్యమును సులభముగా నర్థమగుచున్నదని ప్రసాదగుణమున్నదనరాదు. ఇట్లుదాహరించినచో "నుప్పుకప్పురంబు నొక్కపోలికనుండు" నన్న వేమన పద్యముకూడ ప్రసాదగుణ భూయిష్టమని యొప్పుకొనవలసివచ్చును. సర్వ రసవ్యాపియైన ప్రసాదగుణము వాకబాగుగా దేలిపోవును.

"వలపు నెత్తావులీనెడు భాగ్య" మన్నచో దంపతుల భాగ్యమనిదే అన్వయము కుదురదు. "నిష్కామప్రేమ సిద్ధాంతము నిరూపించుట నుపన్యసించు పట్టులలో దంపతుల భాగ్య మనవద్దా?" అని ప్రశ్నించుట "విరుద్ధంగానూ విరసంగానూ ఉన్న"దని సురభిగారనిరి. అక్కడ దంపతులు అనుదాని నధ్యాహరించుకొనుట కష్టము. లేనిచో నర్థమే కుదురదు. అధ్యాహారముకూడ ప్రతిచోట జేయబడదు. అన్వయాక్షేప శక్తి ప్రబలముగా నుండవలయును. ఆ ప్రాబల్యమిందు లేదు.

"బౌద్ధధర్మమే శరణ మటంచు భిక్షుకుడు నిల్వగాంచె" ఒక భిక్షుకు డనవలె నంటిని. అక్కడకు వచ్చిన దా నందుడు. ఆ నందుడని సుందరికి దెలియదు; అందుచే నొక భిక్షుకు డన్నచో నౌచిత్యముండెడిది. సురభి "*A man* అంటే ఒక మనుష్యుడు అను అర్థము చెప్ప వ్యాకరణజ్ఞానము లేనివాడు ఒక భిక్షుకు డనవలె"నని యొక సమాధాన తల్లజమును విసరివైచిరి. *He is a man* అన్న వాక్యమునకు *He is one man* అన్న వాక్యమునకు భేదము లేదా? డుఙ్ ఏకత్వద్యోతక మన్నారు. డుఙ్ ప్రథమావిభక్త్యేకవచన ద్యోతకము గాని ఏక సంఖ్యావిషయ ప్రాధాన్యము గలది కాదు. అసలు నా యాక్షేపణ వీరి కర్థము కాలేదు. భిక్షుకుడన్న శబ్దము జాతి నిర్దేశవాచకము. వాడెవడైనను గావచ్చును. 'ఒక' శబ్దముచేత 'వారిలో నొకడు' అన్న నిర్దిష్టార్థబోధక మగును. ఎప్పుడును, భిక్షుకుడు వచ్చి నిలుచుండెడు; ఒక భిక్షుకుడు వచ్చియే నిలుచుండును. ఎవడో ఒక బిచ్చగాడొచ్చాడంటాము. బిచ్చగాడని వాడి నప్పటికి సందర్భమునుబట్టి వారిలో నొక డనియే యర్థము. ఇక్కడ నా యర్థము పుట్టుటకు వీలులేదు కనుక 'ఒక' యన్న నిర్దిష్టార్థబోధక శబ్ద ముండవలెను. పాగిపునకో వసపునకో వట్టి సంస్కృతజ్ఞానము చాలదు; శాస్త్రీయమైన జ్ఞానము కావలయును.

"పుష్పబాణా గమాధ్వోత్థ ప్రాథమికుం డప్ప" యన్నచో "బ్రథ ముడౌ" యన వలెనంటిని. దానికి వీరు పాగపునకైన సంస్కృతజ్ఞానమున్న నిది యథార్థమనుపించుననుచు నాక్షేపించిరి. వీరుచేసిన పని ఆ సమాసమునకు విగ్రహ వాక్యము వ్రాయుట. అక్కడ నేను చూపినదోషమే అది కాదు. 'ప్రాథమిక' శబ్దము *elementary* అన్న యర్థమున లోక మందు రూఢమై కనుపించుచున్నది. 'మాథర్ యోగా ద్బబీయసీ' అనికదా! కనుక సుదురదంటిని.

విమర్శకులు వలపనగా గోర్కెయని ప్రేమ యనగా స్నేహమని నిఘంట్వర్థములు జాగ్రత్తగా జూచి వ్రాసిరి. వలపునకు గోర్కె యర్థమైనచో నది నిష్కామమైన ప్రేమగా మారుట యసహజము. కామమనగా గోరికయే కదా! ఇప్పు డసలుకే మోసము దెచ్చినారు.

"సర్వస్వత్రమున్నను కేల్ద్రిప్పుడు"— చేతితో ద్రిప్పుటయేమోనని నా సంశయము. విమర్శకులు చెప్పినట్లు రూపకము చేసికొన్నను స్వత్రమునందలి పరిభ్రమణ క్రియాన్వయత్వము సర్వస్వమునకుఘటించ

నగును." ధర్మచక్రమును బరిభ్రమింప జేసెనని యున్నను నేనా శంకించి యుంటిని. చేతితో ద్రిప్పుట యేమని నాయాశంక. ఇక్కడ లక్షణ కుదురుటకు వీలులేదు. ఎందుకు వీలులేదో బౌద్ధమతము తెలిసినగాని తెలియదు. ధర్మచక్రమనగా నేమియో తెలియవలెను. అప్పుడు కేలద్రిప్పుట యన్నది పొసగదని తెలియును. అదివాని చేతిలోని పని యన్నచోట నర్థము కుదురునట్లు కుదురదు.

"అతిపటేటే సుకృతాత్మయైన మాయాదేవి
కడుపార గన్న బంగారుతండ్రి"—

దీనికి వారు ఇది యచ్చ తెలుగుదన మనియు, "సీతారామారావుగారికి పల్లెజన సంప్రదాయ సౌభాగ్యాన్ని.........పరిశీలించకుండా" -అని యేమో వ్రాసిరి. నాది పల్లెటూరే. ఆంధ్రదేశమునకు నడిబొడ్డున నుండు పల్లెటూరు మాది. తెలుగుదన మందులో నేమున్నదో కనుపించుటలేదు. సురభిగారు వారి ఊరు వెడితే, ఇప్పటికీ మూర్ధ మాఘ్రాణించి—ముద్దాడి, చేతివేళ్ళ చిటికలతో తన్నాదరించు ముసలమ్మ లున్నారన్నారు నేను మా యూరు వెళ్లినను కొంతవఱకు ప్రేమచే బుజ్జగించు ముసలమ్మ లున్నారు. కాని నేను సన్యాసము పుచ్చుకొని వెళ్ళినచో "నయ్యో! నిక్షేపమువంటి వాడిట్లు పాడైపోయినాడే"మని మాత్రమే విచారింతురు. అది వారి యజ్ఞతవలన గావచ్చును; కాని యది లోకస్వభావము. ఇట్టి పద్యములు తిక్కన్నగారి మొదలు సర్వపూర్వకవుల కావ్యములందున్నవి. నేను తిక్కన్నగారీ పద్ధతి పద్యమును వ్రాసెనంటిని. దానివలన నా భావము నాకు గ్రొత్తికాదని తెలిసికొనవచ్చును.

"సడలని కౌగిలింతలకు జందన చర్చలు పేటు లెత్తగా"— సడలని కౌగిలింతలలో నిది యెట్లు సంభవమని నా ప్రశ్న. దీనికి సమాధానముగా వారు నిశ్శేషచ్యుత చందనం స్తనతటం అన్న ప్రసిద్ధ శ్లోకము నుదాహరించిరి. సురభిగారు చెప్పినది తప్పని చెప్పుట కా శ్లోకమే చాలును. స్తనతటము నపరిష్వంగమువలన జందనము నిశ్శేషముగా చ్యుతము కావచ్చును; కాని పేటు లెత్తదు. సమర్థుడైన కవి కావున నిట్లు వ్రాసినాడు. చందనము స్తనతటమున బూసికొని ప్రియునికొఱకు నిరీక్షించు నాయికకు జందన మెండి పేటులు లేగవచ్చును; కౌగిలింతలవలన దన ప్రియుని వక్షఃస్థలమున కంటుకొనును తప్ప పేటు లెత్తదు.

"రసాగ్రమున నానెడి పదార్థము లనంగ"— రసాగ్రమున పదమాడవచ్చును గాని యర్థమాడదు. రసనాగ్రమునందు వాక్కు మాత్రమే యుండును. వాగర్థా వివ సంపృక్తౌ యన్నచోట వాగర్థములు రెండును గలిసియే యుండునను అర్థము కనుపించుచున్నది. ఈ వాగర్థములు రెండును కలిసియుండుట యెట్టిది? రసనాగ్రమందున్న వాక్కుతోగూడి యర్థమున్నదా? ఆ యర్థ మెప్పుడును రసనాగ్రనిష్ఠముగాదు. ఆ యర్థమున కది చిహ్నము. నాలుక వాక్కునే యుచ్చరించునుగాని దాని యర్థభావన చేయలేదు. అర్థభావన చేయునది శ్రోత—పఠిత—కవి. వీరుమువ్వురు. రసనాగ్రమండనుటచేత నీ గ్రంథకర్త లుద్దేశించిన యర్థము పుట్టదు. "ఇది మిక్కిలి శాస్త్రీయమైన విషయము; భావనాగమ్యము. జీవాత్మ పరమాత్మల భేదము నంగీకరించినచో, శాస్త్ర దృష్ట్యా ఇది నిలచు" నన్నారు. పరమాకాశములో జీవాత్మలాడుట కని విని యెఱుగము. పైగా నట్టి భేదము నంగీకరించినది ద్వైత విశిష్టాద్వైతములన్నారు. ఇది విశిష్టాద్వైతముకాదు. నేను విశిష్టాద్వైతిని. మా మతములో జీవుడు—ఈశ్వరుడు ఉన్నారుగాని జీవాత్మ పరమాత్మలు, లేరు. ఐనప్పటికి పంచధాయున్న యీశ్వరునిలో నేక ధాత్వ మంతర్యామిత్వము. ఈ యంతర్యామిత్వము విశిష్టాద్వైతములోనున్న ధర్మభూత జ్ఞానము తెలిసినగాని తెలియదు. జీవులనేక విధములు. బద్ధుడైన జీవునిలో నీశ్వరుడు తిరోహితుడై యుండును. ఈ సౌందరనంద గ్రంథకర్తలు విశిష్టాద్వైతులా, లేదా, బౌద్ధ విహారమును యజ్ఞవాటికతో బోల్చినప్పుడు అఖండమై, అభిన్నమై భాసించిన మహార్థమిచ్చటగూడ భాసించుచున్నదా ?

"నా మాడ్కల ద్రావుదున్ నీ నవ్యావృత వీక్షణమ్ములు—" ఈ ప్రయోగమపూర్వమన్నాను. ప్రతి విమర్శకులు "నిందయేస్తుతి పర్యవసాయియైన" దన్నారు. అనగా నే నపూర్వమని నిందార్థములో వాడినట్లు వారికి దెలియునుగదా! ఐనపుడు దానికి సమాధానము జెప్పవలసియుండగా నపూర్వమనగా స్తుతిగా నొప్పుకొనుటలో నేమి చమత్కారమున్నది? నా చూపులతో నీ చూపులను ద్రావుదునని దాని యర్థము. నా కన్నులతో నీయందమును ద్రావుదు ననియున్నది. చూపులతో జూపులు తావుటలేదు; ఉండదు. రెండును కిరణ ప్రసారములే. రెండు కిరణములు గలియవచ్చును. ఈ కిరణములు కలియుటలో నొకదాని నింకొకటి త్రాగుట యెట్లు జరుగునో తెలియదు. మనమేదైన పదార్థము ద్రావుటలో దానిని భుజించి నిశ్శేషముగా జేయుదుము. "నేను నీ యందమును గన్నులతో ద్రావుదు" నన్నపుడా సౌందర్యమును నేను నిశ్శేషముగా నాస్వాదించితినని యర్థము. రెండు

చూపుల మధ్య ఈ క్రియ జరుగుటకు వీలులేదు. ఇదియే అందున దోషము.

ఏయు శబ్దమునకు బాణము ప్రయోగించుట యర్థమైనను, లోకవ్యవహారమున నాల్గడుగు లేద్దామని యున్నదిగాన దానినే స్వీకరించిరని చెప్పిరి. ఇంక లక్షణ వేత్తలు దీనినికూడ అనింద్యగ్రామ్యములలో జేర్చవచ్చును. మఱి యింత ప్రామాణ్యము గల్గిన కావ్యములో జేర్చినపుడు చేర్చవలదా!

"వానరగ" అన్న శబ్దమును గ్రహించి దానిపై సుస్తీ పట్టినట్లున్నదని యొకమాట విసరిరి. అది కర్త్రగాలి సుమతీశతక కర్త వ్రాసినాడుగాన సురభిగారుపేక్షవహించిరి. అట్టి శబ్దమును సౌందరనందకర్తలే వాడినచో దానిని సమర్థించుటకు సురభిగారు సుస్తీలే కాదు, మొగ్గలుగూడ వేసియుందురు.

"క్షాం కొకింత అధరీకృతమైన కొలంది"— అధరీకృతశబ్దము నిట్లు వాడగూడదు; సంస్కృత సమాసపూర్వశబ్దమైన రమ్యముగా నుండునని నా విమర్శ. ఆ శబ్దము సమాసములో బూర్వపదముగా నుండరాదని యే నా విమర్శ. శబ్దముయొక్క సాధుత్వాసాధుత్వముల కిచట ప్రసక్తిలేదు.

"స్వయమ్" అను నది సంస్కృతములో నవ్యయము; దానిని తెలుగుగా దీసికొనివచ్చిన స్వయముగా నని వాడుట రూఢిగా నున్నది. స్వయము అని వాడుట తెలుగులోలేదని నా భావము. దానికి వారు తెలుగుపదములు మిక్కిలి మొదలైనవానిని "గా" విరహితములైనవాని నుదాహరించి యట్లైన నవసరములేదని చెప్పుచున్నారు. స్వయమ్ సంస్కృతము; కావున దానికి వారు చెప్పినవి పట్టవు.

"నేతి నేతి" యను దానిని గూర్చి చెప్పుచు దీనివలన పూర్వపు దోషము సంభవించుచున్నదన్నాను. పూర్వపు దోషమనగా బౌద్ధ వాతావరణము లేదని చూపిన దోషమని నా యభిప్రాయము. అది యక్కడ స్ఫురింపలేదు; పాత్రక్రమమును గూర్చి వ్రాయునపుడు స్ఫురించినది. అందుచేతనే పైదోషము అనకుండ పూర్వపుదోషమని చెప్పితిని. శ్రీ సురభిగారు "నేతి నేతి" శబ్దములను తెలుగులో వాడుట దోషమనుచున్నానని భ్రమించి, పాండురంగ మాహాత్మ్యమువరకు దృష్టిసారించి ప్రయాసపడి కొన్ని ప్రయోగములు చూపించినారు.

ఎక్కడ *Atmosphere* ఏ మాటవలన చెడుచున్నదో, యామాట యా *Atmosphere* కి భంగము కల్గించుచున్నది; అని నేను వ్రాసినచోట యాయన శబ్దప్రయోగ సామర్థ్యమును విచారించును. ఎక్కడ ప్రయోగ దుష్టతయని నేను చూపింతునో యక్కడ *Atmosphere* ఉన్నదనును. ఈయన బుద్ధి ఇది ఇది యని విస్పష్టముగా దెలియదు. కావ్యార్థ పరిశీలనము మిక్కిలి కష్టమైనపని. ఈ కావ్యవిమర్శక ప్రపంచకములోని పెద్దదోషమేమనగా, దీనిని శాసించువాడు లేకపోవుట.

ఇక శ్రీసురభిగారు పిదప రెండు మూడు పద్యములలో మెఱుగులున్నవని చూపించిరి.

"ఔరా! అభినయ విద్యా
పారంగత! వంచకౌతిపంచక! రసభా
వారంభ ప్రతికూల వి
చారా! సౌహార్ద ధర్మసమయవిహారా!"

ఈ పద్యము గారడీలు చేస్తున్నామని టముకు వాయించిందట! ఆ గారడీ లేమో మనకు దెలియవు. పై గీటుంచిన భాగమునుబట్టి వీరికి రసవిరోధి జ్ఞానమున్నదనుట స్పష్టమన్నారు. స్పష్టమైన విషయమది కాదు. రసములు, వానికి విరోధులు నుండునని తెలియును. ఇది వట్టి విషయజ్ఞానము. అది లేదని నేననలేదు. ఉండిన నుండవచ్చును. విరోధి రస సంపుటీకరణమునందు తద్దోషపరిహారణము చేయు విశేషజ్ఞానము లేదంటిని. సామాన్యజ్ఞానము చాలమందికుండును. కవి కుండవలసినది విశేషజ్ఞానము.

నా కావ్యలక్షణము లుద్దేశించుటలో పూర్వాపర వచోభంగమున్నదని వేఱొక విమర్శ. ఒకవేళ ప్రమాదముచే పటస్థించిన దేమో యని నా పూర్వవ్యాసము నొకసారి మఱల పరిశీలించితిని. అదెక్కడను లేదు. వీరి పురోభాగిత్వము తేటతెల్లముగా కన్పించుచున్నది.

సురభిగారు తమ ప్రతి విమర్శ యంతయు బూర్తిచేసి యింతకంటె మహాపద్యముండదని యీ క్రింది పద్యము నుదాహరించిరి:

"పాటలాను తద్భ్రుకుటివల్లి
రోటుల్ విరియించు నట్టులన్
చేతము తాండవింప మరచెన్
నృపసూనుకు విశ్వమెల్ల; కో
లాతిగమై తదీయ రుచిరాంగ
విలాస సుధాంబురాశికిన్
చీకటి దొప్ప [illegible] నిలిచెన్
చెలి మాపునపాసి వాలికన్"

ఇంతటి మహాపద్యములలో గూడ దప్పులున్నవి చూడుడు: తద్భ్రుకుటివల్లి—ఇది తప్పు. భ్రుకుటి

యనగా బొమముడి; దానిని దీగతో బోల్చరాదు. భ్రూవల్లి, భ్రూలత యనవచ్చును గాని 'భ్రుకుటి వల్లి' యనరాదు. రెండవ తప్పు, ఇందులో 'వీచీ తతి' కి 'కాలాతిగమా' అన్నది విశేషణము. ఆమె శరీర కాంతి యను పాలవెల్లి కెరటములు కాలము నతిక్రమించినవి అని యర్థము వచ్చును. ఆ కెరటములు కాలము నెట్లతిక్రమించును? జరుగదు. కవి యుద్దేశ్య మేమనగా నామె శరీరసౌందర్యము జూచుచుండగా నాయకుడు కాలమును మఱచిపోయెనని కాబోలును. ఆ యర్థము రాదు. ఆ యర్థము నుద్దేశించినదైన ఆ యర్థము వచ్చుటకు దగిన శబ్దప్రయోగసామర్థ్యము లేదన్నమాట. నే నిందు కనియే ఈ కావ్యము పాత్రకముమునకు నిలువ దన్నాను.

ఇక నిందలి యలంకార సారస్యము జెప్పెదను. ఆమెయొక్క చూపుల పాపపోలిక నతడు నిలిచెను. అనగా గన్నె పెది; మూపితడు. ఇత డెట్లు చెప్పిన నామె యట్లు చేయవలెను. కథ యంతయు వ్యత్యస్తముగా నున్నది. ఆమె చెప్పిన ట్లితడు నడచున్నాడుగాని ఇతడు చెప్పినట్లామె నడచుటలేదు. ఇక సౌందర్యోప నిషత్సారజ్ఞానమును గ్రహించుట మొదలైనగాలిలో గొట్టిన పల్టీలు వారికే తెలియును. ఇచ్చట విమర్శకుడు పోయినమార్గము నేయార్థమన్న దోషము నాపాదించుచున్నది. నీ వెదో అనుకొని అందులో నున్న దనుకొనుట. కాలాతిగమా అన్నచోట నెట్టి దోషమున్నదో యిచ్చటను అట్టిదోషమున్నది.

"మహాకావ్యాన్ని గురించి ఏమి వ్రాసినా అపరాధము"-ఇది సురభిగారి చివరి వాక్యము. మహాకావ్యమనునది యెప్పుడు? విమర్శలకు దాటి నిలువ ద్రొక్కుకొన్నప్పుడు. మన యింటిలో మనము కూర్చుండె మన బంధువులు, లోకములో మనవలన నుపకారము పొందినవారు, కులవర్ణాదరాభిమానములు గలవారు, మహాకావ్య మనుకొన్నంతలో కాదు. నేనీ విమర్శనమును ఆ భావములను పురస్కరించుకొని వ్రాయుటలేదు. కావ్య గుణదోషవిచారణ నిష్పాక్షికముగా జేయవలెననియే చేయుచున్నాను. ఎంత మహాకావ్యమునైనను విమర్శించుట యపరాధమే కాదు. ఆలంకారికులు కాళిదాసాది కృతములైన కావ్యములనే విమర్శించిరి.

ఇది సర్వకావ్య వాఙ్మయమునకు శిరోభూషణ మనుట నిజమైన మహాపరాధము. ఇట్లు తెలిసినవారె వరనరు; తెలియని సురభివంటి వారనవలెను.



# గ్రంథవిమర్శనము

## మదాలసావిలాసము

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి. అమలాపురం. తూర్పుగోదావరిజిల్లా. వెల రెండురూపాయలు.

ఇది మార్కండేయ పురాణాంతర్గతమైన గాథ. ప్రాచీనకవి నవరము నారాయణ భూపతి ఈ కథ ఆధారంగా స్వీకరించి కువలయాశ్వ చరిత్ర అనే శృంగార ప్రబంధం రచించాడు. శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు స్వీకరించినదీ మార్కండేయ పురాణగాథే. కాని దీనిని ధర్మవీర ప్రధానంగా మలిచి మూడాశ్వాసాలలో మదాలసా విలాసంగా రచించారు.

ఈ కావ్యం ప్రాచీన ప్రబంధాల ఫక్కిని నడిచింది. ఈ కవి శబ్దప్రయోగం ప్రౌఢమై అడుగడుగునా నిశితమైన సంస్కృతాంధ్ర వ్యాకరణ పాండిత్యం స్ఫురింపజేస్తున్నది.

ఇటీవల ప్రాచీన ఫణితిని బయలుదేరిన కావ్యాలలో ఇది ప్రముఖమైన కావ్యము. ప్రాచీన ఫణితి అన్నంత మాత్రాన దీనిలో పురగజాశ్వాది వర్ణనలు యథాతథంగా పూర్వ కావ్యాలలో ఉన్న మోస్తరుగానే ఉన్నాయని భావించకూడదు. నిజానికిందులో వర్ణనలకంటె కథాభాగమే ఎక్కువగా కనిపిస్తున్నది. అక్కడక్కడ వర్ణనలున్నా అవి సముచితమైన పరిమితిలోనే నడిచాయి.

ఇంక కథ చెప్పడంలో గాని, ఒక విశిష్టత కథా కథనంద్వారా ప్రత్యేకమైన పాత్ర మనః పరిణతి ప్రదర్శనంగాని. ఈ కావ్యంలో కనబడవు. అదీగాక కథ బాగా పెద్దదై పోవడంవల్ల కథాశరీరానికి సరియయిన అంగాంగీ భావంకూడా కుదరలేదు.

శాస్త్రిగారి పద్యరచన కొన్ని కొన్ని రసవత్తర ఘట్టాలలో ప్రాచీన ప్రబంధకవుల ఉదాత్త పద్యరచనా పద్ధతి స్ఫురింప జేస్తున్నది.

తృతీయాశ్వాసంలో తెర తొలగించిన తరవాత మదాలసా వర్ణన పరమైన ఈ క్రింది సీసపద్యం దీనికి తార్కాణంగా తీసుకోవచ్చును.

"సుమమంజరుల మంజిమము లెల్ల జెలువగా
    మీనకేతనుడు నిర్మించినట్లు
పల్లవంబుల మార్దవములు చైత్రుడు గ
    డించి భామినిగ సృష్టించినట్లు
పదియారు కళల శోభయు నేర్చి రమణిగా
    శీతాంశు డెలమి సృజించినట్లు
మలయానలుడు సౌకుమార్య సర్వస్వము
    నించి కాంతగ విరచించినట్లు
లలిత సకలాంగ లావణ్య కలితమూర్తి
మెఱయ; జూపులు వెన్నెల జఱచికొనుయ
మేలి రుచుల దటిల్లతల్ మెఱవ, నమ్మ
రాలస తళుక్కుమని యగ్రమందు మెరయ !"

తృతీయాశ్వాసంలో అశ్వం ప్రత్యక్షమయ్యే తీరు వర్ణించే ఈ క్రింది పద్యం పటిష్ఠమైన వీరి వృత్తరచనా చాతుర్యానికి తార్కాణ

"అత్తఱి గత్తలాని మదియందు
    దలంచుచు జాగు గాగ భూ
భృత్తనయాగ్ర భూమి
    దివిజేంద్ర ధనూరుచి రాంగకాంతి సం
పత్తినిదోచెనశ్వము; సుపర్ణు
    సపర్ణకు డోచు వచ్చెనం
చెత్తిన భీతి సర్వ జగమెల్లను
    దత్తర మెత్తి పారగన్."

మదాలసా విలాసం పాండిత్య పటిష్ఠమైన కవిత్వం అభిమానించే వారందరికీ అవశ్య పఠనీయమైన కావ్యము.

---

## గీర్వాణ రూపకము

తల్లావఝ్ఝల కృత్తివాసతీర్థులు ఎం. ఏ. బి. యి. డి. సాహితీసమితి. ప్రతులకు : ఆంధ్రసాహిత్య పరిషత్తు, హైదరాబాదు. (దక్షిణ.) వెల : రూపాయిన్నర.

ఇది సంస్కృత రూపకాలననుసరించి వ్రాసిన ఒక సంకలన గ్రంథము. శ్రీ తీర్థులుగారిందులో నాట్యాలంకార గ్రంథాలలోను, సంస్కృత వాఙ్మయ చరిత్రలలోను గల విషయాలన్నీ క్రోడీకరించి వ్రాశారు.

రూప కోప రూపకలక్షణాలు, ఉదాహరణలు, సంస్కృత రూపక సంప్రదాయాలు, వాటి చరిత్ర మొదలయిన విషయాలు తెలిసికోగోరే వారందరికీ ఈ చిన్న పుస్తకం బాగా ఉపయోగిస్తుంది.

రచయిత ఈ పుస్తకంలో మూల గ్రంథాలలో ఉన్న పారిభాషిక పదాల కన్నిటికీ తేటతెలుగులో వివరణాలు వ్రాశారు. అందుచేత ఇది సంస్కృతం రాని తెనుగువారికి గూడా సంస్కృతరూపక స్వరూపం చక్కగా విశదపరుస్తుంది.

---

## శ్రీ రామలింగప్రతిష్ఠా
(సంస్కృత కావ్యము)

శ్రీమతి బెల్లంకొండ కనకాంబ. ప్రాప్తిస్థానము. విశ్వనాథ వెంకటేశ్వరులు. దుర్గాగ్రహారము విజయవాడ. వెల : ఒక రూపాయి.

ఇది సంస్కృతభాషలో రచించిన ఏక సర్గ ప్రబంధము. సంస్కృతాభ్యాసం సన్నగిల్లిపోతున్న ఈ రోజుల్లో కావ్యరచనా పటిష్ఠమైన సంస్కృత పాండిత్యం సంపాదించడమే ఒక విశేషం. తత్రాపి సరళము, సాంప్రదాయికము అయిన సంస్కృత శైలిలో కావ్యరచన చెయ్యడం మరిన్ని దుర్ఘటమైన విషయం.

రచయిత్రి కథాకథనాదికం ప్రశస్తంగా ఉన్నది. ఈ క్రింది శ్లోకంలోని కల్పన రచయిత్రి కల్పనాశక్తికీ రచనాశక్తికీ చక్కని ఉదాహరణ.

"తల్లింగ మస్యా సదదర్శ రాఘవః
కైలాసనాథం కమలాత్మసేవితం
తల్లింగమస్యాస దదర్శ రావణః
సాకేతనాథం సకలాంగసుందరం"

---

## తండ్రులూ - కొడుకులూ

టర్జినీవ్. సాహిణీపల్లి కేశవన్న. జకింగ్ హామ్ పేట. విజయవాడ. వెల : మూడురూపాయలు.

టర్జినీవ్ వ్రాసిన 'తండ్రులూ—కొడుకులూ' (*Fathers and Sons*) రష్యా వాఙ్మయంలోనే కాక ప్రపంచవాఙ్మయంలోకూడా ప్రఖ్యాతి పొందిన నవల.

దీనికింతకుపూర్వం పాలగుమ్మి పద్మరాజుగారు రచించిన అనువాదం ఒకటి ఆంధ్రవారపత్రికలో పడింది.

ఇది ఇటీవల బయలుదేరిన రెండో అనువాదం.

ప్రపంచవాఙ్మయంలోని ప్రఖ్యాత రచనలు తెలుగులోకి అనువదించుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

అయితే ఈ పుస్తకం తెరవగానే మొట్టమొదటి ప్రకరణం ప్రారంభంలో కనబడేవాక్యాలధోరణి ఇది—

"అయితే పయోటర్! ఇంకా చూపుకి అందడంలేదూ" అని **1859** మే **20**వ తేదీన యన్—వద్ద మజిలీ దిగువమెట్లమీదకు టోపీలేకుండా మురికి కోటూ, గళ్ళలాగూ ధరించివచ్చిన నలభై ఏండ్లు పైబడ్డ ఒక పెద్దమనిషి యవ్వనంలోఉన్న లావుపాటి తనసేవకుని ప్రశ్నించాడు. ఆసేవకుని గడ్డం తెల్లగా వంపులతిరిగివుంది. కళ్లుచిన్నవీ, కాంతిలేనివీనీ."

ఇక రెండో ప్రకరణం ప్రారంభ వాక్యాల ధోరణి ఇది.—

"కొంచెం ఊపిరి పీల్చుకోనియ్యి నాన్నా" ప్రయాణంవల్ల అలసినా బాల్యత్వముతో బిగితోనిండి కంచుగీసినట్లున్న స్వరంలో తండ్రిలాలనకు సంతోషంగా ప్రత్యుత్తరమిస్తూ "నీమీద దుమ్ము పడుతున్నది." అని అన్నాడు ఆర్కాడీ. ఇంచుమించుగా ఈ నవల అనువాద ధోరణి అంతా ఇలాగే నడిచిపోతుంది.

ఇలాంటి అనువాదం మరి ఏభాషైనా కావచ్చునుగాని తెనుగుమాత్రం కాదు. ఇటీవల ఇలాంటి అనువాదాలు మన పత్రికల్లో కోకొల్లలుగా పడుతున్నాయి. వీటివల్ల మూల రచయితలమీద ఆదరాభిమానాల మాట ఎలాగ ఉన్నా, విహ్యభావంకలగడం మాత్రం తథ్యం.

నిజంగా ఒకొక్కప్పుడు స్వంత రచనకంటె అనువాదమే కష్టం. కాని ఇటీవలి అనువాదకులీ విషయం అంతగా గమనించినట్టే కనబడదు. ఏదో పుస్తకం దొరకబుచ్చుకుని బరాబరా బరికి వెయ్యాలనే కసి తప్ప తెనుగు నుడికారము, శైలి శబ్ద సాధుత్వము మొదలైన వాటి ఘోషే తలపెట్టడంమాని వేశారు.

ఇక టర్జినీవ్ వంటి విఖ్యాత రచయిత అనువాదం అనేసరికి మరింత బాగా జాగ్రత్తపడాలి.

రచయితలు ప్రకాశకులు ఇక ముందునించైనా ఈ విషయంలో బాగా శ్రద్ధవహించగలరనీ, ద్వితీయ ముద్రణంలోనైనా ఈ నవలానువాదం ఒకదారిని పడగలదనీ ఆశిస్తున్నాను.

---

## దాంపత్య దీపిక

ముద్దుకృష్ణ. విజ్ఞాన ప్రచురణలు. హీరాహాల్. జవహర్ లాల్ రోడ్డు. విజయవాడ. వెల : నాలుగు రూపాయలు.

ఇటీవల దాంపత్యరహస్యాలు మొదలైన వాటిమీద చవకబారు పుస్తకాలు, పత్రికలు విరివిగా బయలుదేరుతున్నాయి. లేనిపోని ఉద్రేకాలు రెచ్చగొట్టడమే వీటిలక్ష్యం.

ఈ విషయాలలో జనసామాన్యంలో ఉన్న అజ్ఞానం ఇంతా అంతా కాదు. ఈ విషయాలన్నీ శాస్త్రీయ దృక్పథంతో చర్చించవలసిన అవసర

చాలా ఉన్నది. ముద్దుకృష్ణగారు రచించిన "దాంపత్యదీపిక" ఇలాంటి శాస్త్రీయదృక్పథంతో రచించిన గ్రంథం. మిథునం, దాంపత్యం, క్షేత్రం, బీజం, అజ్ఞానం, కామవాంఛ, మొదలైనశీర్షికలలో గ్రంథకర్త లాయా విషయాలను గూర్చి చర్చించారు. ఈ చర్చలో వీరు పాశ్చాత్య కామశాస్త్రకర్తల గ్రంథాలే గాక వాత్స్యాయనాది ప్రాచ్య కామశాస్త్రజ్ఞుల అభిప్రాయాలుకూడా ఉదాహరించి తారతమ్య పరీక్ష చేశారు.

పుస్తకాకారము, ముద్రణ, మొదలైనవి చక్కగా ఉన్నాయి.

---

## స్వప్నవాసవదత్తము

భాసమహాకవి. స్వేచ్ఛానువాదము ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి. ప్రకాశకులు సరస్వతీపవర్ ప్రెస్ రాజమహేంద్రవరము వెల : ఒకరూపాయి.

## ప్రతిమ

భాస మహాకవి. అనువాదం ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ప్రతులకు: శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయము, పిఠాపురము. వెల రెండు రూపాయలు.

చిలకమర్తికవి, వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రభృతు లింతకు పూర్వం కొన్ని భాసరూపకాలు తెలుగులోని అనువదించారు.

అయితే ఆ భాసానువాదాలంతగా ప్రశస్తి సంపాదించలేదు. దీనికి కారణాలనేకం. వీటిలో, భాసరూపకాలు మక్కికిమక్కిగా తెలుగులోకి అనువదించాలన్న కొందర పట్టాక కారణంగా కనబడుతున్నది.

భాసుని పెద్ద రూపకాలలో స్వప్నవాసవదత్తము, ప్రతిమ, ఉత్తమోత్తమ మైనవి. చిన్న చిన్న సన్నివేశాలతో పాఠకుల హృదయాలు కదిలించి వెయ్యడంలో భాసుని శక్తి నిరుపమానమైనది. ఈ శక్తి ప్రతిమా స్వప్నవాసవదత్తాలలో ఒక అవధికి వెళ్ళిపోయింది.

సంభాషణల మధ్య సరీగా అనువైన ఘట్టాలలో శ్లోకాలు వ్రాయడంలోకూడా ఈ ప్రత్యేకత కనిపిస్తుంది. ఈ శ్లోకాలొక్కప్పుడు సామాన్య సంభాషణ ధోరణిలోనే నడిచిపోతూంటాయిగాని వీటిలో ప్రత్యేక రమణీయత [illegible] లాడుతూంటుంది.

సంస్కృతం తెలియని తెలుగువానికి భాసుని ప్రతిభ ప్రదర్శించాలంటే అక్షరమాత్రం ఈ శ్లోకాలైనా యథాతథంగా అర్థీకరించాలి.

అనువాదకులు ప్రతిమా స్వప్నవాసవదత్తానువాదాలు రెంటింటిలోను ఉన్న మూలశ్లోకాలు కొన్ని కేవలం వచనంలోకి అనువదించి ఊరుకున్నారు.

స్వప్నవాసవదత్త చతుర్థాంకంలో "పద్మావతీ ప్రియా మే మమయద్యపి" అన్న శ్లోకానికి వీరు "రాజు—ఏమిగతి! వినవయ్యా! సౌందర్య సౌశీల్యములచే పద్మావతి నా కిష్టురాలే! కాని వాసవదత్తయందు నిలిచిన నా మనస్సునుమాత్రం ఆక్రమింపజాలదు." అని వచనంలోకి అనువదించి ఊరుకున్నారు.

ప్రతి మానాటిక ప్రథమాంకం చివర రాముడు "అయోధ్యా పౌరులారా! వినుడు! నీరునిండిన కనులతో నీమెను స్వేచ్ఛగా జూడుడు యజ్ఞమునందును, వివాహమునందును, గష్టసమయమునందును, వనమునందును స్త్రీలను జూచుట కాక్షేపణము లేదుగదా!" అంటాడు. మూలంలో దీనికొక శ్లోకం ఉన్నది. ఈ శ్లోకం తెలుగులో గ్రాంథిక వచనంలోకి అనువదించేసరికి కొంత ఎబ్బెట్టుగా తయారయింది. ఇదే పద్యంలోకి అనువదించి ఉంటే భాసుని కవితారచనకింకా న్యాయం జరిగిఉండేది.

ఈ రెండు అనువాదాలలోను ప్రతిమానువాదం బాగా పాకాన్ని బడింది. పద్యరచననిబట్టి చూసినా, కొన్ని కొన్ని చోట్ల ప్రతిమనే పైచెయ్యిగా కనిపిస్తున్నది.

ప్రతిమాస్వప్నవాసవదత్తాలలోని ఈ క్రింది ఉదాహరణాలనుబట్టి వీరి అనువాదపాటవం గ్రహించుకోవచ్చును.—

"మరువులు [illegible] దిరిగి
సూర్యుని నీరము చెట్లపాదులన్
గరము పిపాస వ్రాలియ మృగంబులు
త్రావవు పంకతోయముల్
పురువులు [illegible] దిశసిపోయి
బయల్పడె నెట్టి నేలకుం
పఱిగిన నీటిచారలు
గనంబడు పాదపమూలసంతతిన్
—ప్రతిమ, పంచమాంకము.
పులుగులు గూండ్లకున్
దిరిగిపోవుచునుండె మునీంద్రులున్నదీ
జలములలోన గ్రుంకులిడసాగిరి,
యగ్నులు వెల్గె, ధూమపం
క్తులు చెలరేగె నాశ్రమముత్రోవలన్;
దూరమునం దివాకరుం
డలసి రథమ్ము ద్రిప్పి కొని
యస్తగిరీంద్ర పథమ్మున [illegible]

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

త్వరపడండి! నేడే మీకాపీని రిజర్వుచేసికొనండి!! త్వరపడండి !!!

# ఆంధ్రప్రజానీకానికి మా ప్రచురణలు

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక ద్వారా ఆంధ్ర ప్రజానీకమునకు పరిచయము చేసిన యీ క్రింది ప్రచురణలు మావద్ద చిల్లరగాను, టోకుగాను దొరకును.

**రాజూ పేద** (మార్క్ ట్వేన్) **2-0-0**

**టామ్‌సాయర్** ( ,, ) **2-0-0**

**హకల్‌బెరీఫిన్** ( ,, ) **2-0-0**

**కాంచనద్వీపం** (స్టీవెన్సన్) **1-8-0**

పై నాల్గింటికి అనువాదం: నండూరి రామమోహనరావు

**ఆలీబిల్లీలోకంలో అమ్మాయికథ** **1-0-0**

(లూయీకెరోల్) అనువాదం : వి. డి. ప్రసాదరావు

**కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో** (అలెగ్జాండర్ డ్యూమా)

(రెండుభాగములు) ఒక్కొక్క భాగము **3-8-0**

అనువాదం : సూరంపూడి సీతారాం

**ఆత్మకథ** రెండుభాగములు (మహాత్మాగాంధీ)

ఒక్కొక్కభాగం **5-0-0**

**శ్రీమద్భగవద్గీత** (కా. నాగేశ్వరరావుపంతులు) **4-0-0**

**ఆంధ్రవాఙ్మయ చరిత్ర** **2-0-0**

**శ్రీమదాంధ్ర మహాభారతము**

**ఉద్యోగపర్వము** **1-0-0**

**బసవపురాణము** (పాల్కురికి సోమనాథకవి) **4-8-0**

**డాన్ క్విక్‌సెట్** మూలం : సెరివాన్‌టెజ్

(అనువాదం) విశ్వాత్ముల నరసింహామూర్తి. తయారవుతున్నది.

**ఆంధ్రగ్రంథమాల, మదరాసు 1.**



# విషయానుక్రమణిక

## నవంబరు - 1952



త్రివర్ణ చిత్రము : "సాధన"—హెచ్. రామగోపాల్‌గారు.





"సాధన"



—శ్రీ హెచ్. రామగోపాల్.



నందన
కార్తికము

# భారతి

సంపుటము 29
సంచిక 11

# విన్నపము



శ్రీ వావిలాల సోమయాజులు

[జన్మగ్రామమును వీడి, వివిధ రాజాస్థానముల దర్శించి, తుదకు మరల జన్మగ్రామమునకు వచ్చి, యట వేంచేసియున్న కాళహస్తీశ్వరునితో నొక యేకాంతసమయమున మహాకవి ధూర్జటి యీరీతి విన్నవించుకొనినాడు.]

కన్నుల మూడిటి నార్పుచు
నెన్నడు నన్నెఱుగనట్టు లేల నటింపన్?
కన్నీ రొలుకకు తండ్రీ!
కన్నప్పనుగాను నేను కన్నుల నొసఁగన్.

చనినాఁడన్ విజిగీషతోడ కవితాసామ్రాజ్యము న్గోరి, నా
ఘన నిష్ఠాజపహోమ సత్క్రియలకున్ గల్పించితిన్ స్వస్తి; మా
యని కాలుష్యము క్లేశమున్ మిగిలె — రాజాస్థాన మర్యాద లీ
వని వల్లే జరిగెన్ - సభన్ గలుగవయ్యా యర్హ సత్కారముల్!

ఏనాఁడైన భువిన్ అసూయ కలుషం బీర్ష్యా వ్యథాఽశాంతియే
కానన్ రావు సమత్వ మభ్యుదయ మగ్రామ్యంబు సౌఖ్యంబు దే
వా! నాకేశగుహూత్తముండు కవినై యాస్థానముల్ చేరినన్
నే నమ్మన్ గనకాభిషేక మగుచేనిన్ శిరం బిచ్చెదన్

'పటు గంగాలహరీ పరీత శమశుంభ త్ప్రౌఢతాంచత్కళా
ఘటనన్' నన్గని కృష్ణరాయ ధరణీకాంతుండు సామాన్య వా
క్పటిమన్ గర్వితుఁగా దలంచి మది సంభావింప కన్ గావ్య ది
క్కటి గండస్థల గంధవాహ మధు వాఘ్రాణింపఁగా నేర్చనే

అలఘు ప్రౌఢిని గ్రీడమై బహురణోద్యోగంబులన్ నిల్చి రా
ట్కుల గంధేభుఁడు, కృష్ణరాయ ధరణీగోపాలు డైరావతి
గళ ఘంటారవ పాటవోజ్వల లసత్కావ్యంబు కల్పించెనే,
యల పెద్దన్నకు రాజుకున్ మధుర సఖ్యం బన్న నిద్దానసనే!

అంకిలి లేక గైకొనిన యా శఠగోప యతీంద్రదత్త చ
క్రాంకిత దేహమున్, మధుర కైటభవైరి పదాబ్జసేవ, ప్రే
మాంకిత నర్తకీగణ రహః ప్రణయార్ద్ర హృదంతరంబులే
కంకురితంబు కాదు మనుజాధిప సత్కృప యెంత నానికిన్

అళికనేత్రాగ్ని హాసానంత రోచిస్సు
భరమైన పద్మాక్షు పదము పట్ట,
నందీశ హుంకార నాద నిర్భిన్నోర్వి
గనలేక మధువేణు నినదు జేర,
దహనోగ్ర శితికంఠ దవదాహ వర్చస్సు
భయపెట్ట వనమాలి పజ్జనిలువ
హారఫణి నిశ్వాస మారుతౌద్ధత్యము
లడలింప కౌస్తుభహారు గొల్వ
బెద్ది రాజయ్యె నంతటి పెద్దవాడు
ముక్కు తిమ్మన్న సంస్తుతి కెక్కినాడు;
అబ్బినది రామలింగన్న కంత చొరవ,
అయ్యె కవిపితామహుఁడు పెద్దన్న మొన్న

ఉన్నది నాశరీర మట; నున్నది నిత్యము నామనంబు నం
పన్నవ తావకీన పదపంకజ పుష్పరసప్రలోభ గ

క్షోన్నయ బంధురాకృతి నహో నిశలిచ్చుట గాళహస్తి— నే
నెన్నట కాదు సర్వము నాకేశ! యెఱుంగవె, కావె సాక్షి విన్

ఏ శివలెంక నీభువిని నెన్నిభవంబులు గల్గు నన్నిటన్—
ఓశివ! కొల్వనేరను శుభోజ్జ్వల తావకభూతి పూత వే
షాశితికంఠ సుందర హసన్నవమూర్తినిఁ దక్క నన్య మీ
యాశయ మొక్కడే బ్రతుకునందలి మాధురికిన్ బ్రబోధమా

నాకీ స్వర్ణముఖీ మహాజలములన్ నాకౌకదివ్యాపగా
రాకాచంద్ర విశుద్ధ సద్గుణము, స్వర్గచ్ఛాయలుం దోచు నిం
దే కాలమ్మును దీర్ఘమాడుటలు స్వామీ! యే పురాజన్మలో
నో కావించిన పూజకాక యెటు లన్యం బౌను విశ్వేశ్వరా!

నీపాదాంబుజ సేచన క్రియను దంభ్రీ! కల్గు నానంద మే
భూపాలుండు కిరీట కోటితట ప్రోద్య ద్దివ్య మాణిక్య కాం
తిన్ పాదాబ్జము లెఱ్ఱవాఱ నతి నుద్దీపింపగా జేయు నీ
శా! పాలింపవె నన్ను కింకరుని వాత్సల్యంబుతో నిత్యమున్

గణికా కాముకు డన్న యొక్క ప్రథ లోకంబెల్ల వ్యాపించెనే,
యణుమాత్రంబును లేదు సత్య మట నీశా! యట్లినా డెవ్వడో
ప్రణయాందోళన నిత్యజీవన కథాలాపుండు, కల్పించె దీ
అని దుష్కీర్తిని—సంతసంబగును గల్గన్ భుక్తి యవ్వానికిన్

రాజద్వారములందు దర్శన సముల్లాసంబునన్ నిల్చుటన్
నా జన్మంబిటు వ్యర్థమైనయది—విన్నాణంబు కోల్పోయి పం
కేజశ్రీ పరిణద్ధ మత్కవిత విక్రీడింపగా మానె—నీ
రాజన్యత్వము నమ్మి చేరితిమి శర్వా! రాజ రాజేశ్వరా!!

తనువున్ నిత్యముగా నొసర్చు మిలపై దాసుండనై కొల్తు ని
న్ననవచ్ఛిన్నత కాళహస్తి నటు కాదా జన్మమే లేని నీ
గణమం దొక్కనిగా గ్రహింపగదె—యా కైలాస సంధ్యానట
ద్గణమం దొక్కడనై రచించెదను గాదా నృత్యగీతమ్ములన్

నాకొక జన్మమున్న భువినన్ జనియింపగ నిమ్ము స్వామి నీ
వాకిట బిల్వవృక్షమటు వత్సలతన్, దినమున్ దినమ్ము ప
త్రాకృతితో త్వదీయ పదహల్లకవీథి నలంకరింతు చా
యాకమనీయరూపమున హాదము గూర్చెద నేత్రపంక్తికిన్

శిరమున నున్న గంగ శశిశేఖర ! నా రసనాంచలంబునన్
దిరముగ నిల్పుమయ్య ! మధుదిగ్ధ సువర్ణ మహాత్వ వాణి సీ
కరుణ కథానకమ్ముల యుగమ్ముల తెల్గుధరిత్రి పాడగా
చరణము లాన జెప్పెద ప్రశస్తికి పాత్రునిగా నొనర్పవే !

'వాగర్థంబులు శ్రోతృవక్తలు జగద్వంద్యుండ వద్వైత వి
ద్యాగోష్ఠిన్' వివరింప నీవె కద; చిత్తావాసమున్ జేరి మ
త్ప్రాగల్భ్యంబు సమస్తమున్ మెఱయ శుంభత్ప్రౌఢి బల్కింపవే
సీ గాథన్ గిరిశా ! ప్రజాపతి పురంధ్రీ కంఠహారంబుగన్

తెల తెల వారెడి తూరుపు,
తెలిగన్నుల విచ్చి దేవ దీవన లిమ్మా!
తలపున నేయెడ నాపై
వలపే జనియింపనిమ్ము వరద, దయాబ్ధీ !!
'శ్రీకంఠ కంఠభూషిత
కాకోదర వర వరాక ఖండ మత వ్యా
ఖ్యాకోలాహల దూర చి
దాకృతి, జితకాల, కాళహస్తీశ, శివా!'



# కృష్ణదేవరాయలు

## కెంబావి-అహమదునగరము (క్రీ. శ. ౧౫౧౬-౧౮)



శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

ఇస్మాయీలు ఆదిలుఖానునికి బ్రాపై యతని పేర రాజకార్యములను నడపుచు కమాలుఖానుఁడు విజాపుర రాజ్యభార ధురంధరుఁడై యున్నప్పుడు, క్రీ. శ. ౧౫౧౨-వ సంవత్సరమున, కృష్ణరాయలు రాయచూరు దుర్గమును స్వాధీనపఱచుకొనెనని పూర్వప్రకరణమున దెల్పియున్నది. ఈ దుర్గ మిట్లు రాయలకు హస్తగతమగుటయు దన్మూలమున కృష్ణా తుంగభద్రల నడిమి యంతర్వేది తనచేతినుండి దుసికిలిపోవుటయు నాదిలుఖానునికి హృదయశల్యములై యతని బాధింపఁగడఁగినవి. కావున నతఁ డాదుర్గమును దత్సంబంధిరాష్ట్రమును నెట్లయిన మరల స్వాధీనపఱచుకొన నిశ్చయించి, కమాలుఖానుని పారుపత్యమును దొలఁగద్రోసి స్వయముగ రాజ్యమును బరిపాలింపఁగడఁగిన పిమ్మట దండయాత్ర వెడలి రాయచూరును సాధించినట్లున్నది. కాని ఇస్మాయీలు ఆదిల్ ఖాను ఇట్లు దండయాత్ర వెడలెననిగాని రాయచూరుదుర్గమును మరలఁ గైవసము గావించుకొనెననిగాని తెల్పెడి ఆధార మెద్దియు లేదు. ఇది వ్యక్తచరిత్రాంశము లందు నిగూఢమైయున్న విషయము. క్రీ.శ. ౧౫౧౨ న కృష్ణరాయ లీదుర్గమును జయించి కైవసము గావించుకొనెఁగదా; 1520 నందు ఆదిలుఖానుపై నతఁడు దాడి వెట్టినప్పు డది యతని యాధీనమందుండినది.[1] ఇందువలన క్రీ. శ. ౧౫౧౨, ౧౫౨౦ ల మధ్య నెప్పుడో యొకప్పుడు ఇస్మాయీలు ఆదిలుఖానుఁడు రాయసామ్రాజ్యముపై దండెత్తివచ్చి రాయచూరుదుర్గమును మరల జయించి స్వాధీనము జేసికొనెనని మన మూహింపవచ్చును. ఈమధ్య కాలమున కృష్ణరాయలు కళింగ కొటూరు విజయయాత్రలయందు నిమగ్నుఁడై యుండెను; అది యాదిలుఖానుని కపేక్ష నెఱవేర్చుకొనుట కనుకూలమైన సమయమే. రాయరాజ్య మంతయు గలింగాది యుద్ధయాత్రలయందు పనివడి యుండుటవలన, గడిదుర్గములను సంరక్షించుటకు దగిన బలములం దధివసితములైయున్నను, ప్రబలుఁడగు శత్రువెత్తి వచ్చిన నతని మార్కొని పాఱద్రోల జాలిన దశయం దుండబడి దూరమున లేవు. ఈ సంగతిని గుర్తించి యాదిలుఖాను రాయసామ్రాజ్యముపై నెత్తివచ్చి రాయచూరు మున్నగు నంతర్వేదిదుర్గములను వశపఱచుకొని యుండవచ్చును.

ఆత డెత్తివచ్చిన సమయ మిదియని నిర్ధారించి చెప్పుటకు వలనుపడదు; కాని ఊహించుటకు గొంత యవకాశము గలదు. అముక్తమాల్యదయాశ్వాసాంతములలో మొదటి నాల్గింటియందును ఉదయగిరి కొండవీడు కొండపల్లి సింహాచల విజయములను దరువాతి రెంటియందును కెంబావి నైజామన 'యావనావనిదవు'

1. ఫెరిష్తా చరిత్రయందు (*Briggs Ferishta III, IV 48 f*) రాయచూరుదుర్గము హిజిరీ ౯౨౬ అనగా క్రీ. శ. ౧౫౧౯-౨౦ వఱకును రాయలస్వాధీనమందే యుండెననియు, నప్పుడిస్మాయీ లాదిలుఖాను దానిని వశపఱచుకొనుటకు దండెత్తిరాగా రాయ లాతని నోడించి తఱుముకొనిపోయిరనియు జెప్పియున్నది. కాని ఇది వాస్తవము గాదు. ఏలనఁగా, సమకాలికుఁడును ప్రాయశః ప్రత్యక్షద్రష్టయు నగు న్యూనిజు రాయల దండయాత్రసమయమునందు రాయచూరు ఆదిలుఖానుని యధీనమున నుండెనని వ్రాసియున్నాఁడు. (*Nuniz, F. E. W. 334 f*). ఫెరిష్తా యర్వాచీనుఁడు; అతని వ్రాతకంటె సమకాలికుఁడును రాయలవెంట దండయాత్రను జూచుటకు బోయియుండిన న్యూనిజు వాక్యములు విశ్వాసపాత్రములు గదా. కావున, సూయలు మున్నగు నాధునిక విజయనగర చరిత్రకారుల మార్గము ననుసరించి న్యూనిజు వివరించిన వృత్తాంతమే సత్యాత్మకమైన దని విశ్వసించుచున్నాను.

లపైని విజయములను కడపటిదానియందు కటకవిజయమును వరుసగ జేర్పొనబడియున్నవి. దీనినిబట్టి చూడఁగా కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౧౬-౧౭ వ సంవత్సరమున సింహాచలమున విజయ స్తంభమును నిల్పినపిమ్మటను కటకదహనమునకు బూర్వమును మహమ్మదీయులతో గెంబావికడను నైజామన యావనావని ఘవుని మణి గృహోళిచెంతను యుద్ధముచేసినట్లు తెలియుచున్నది. ఆశ్వాసాంతో క్తవిజయము లవి చేకూడిన కాలక్రమము ననుసరించి పేర్కొనబడియుండిన, కెంబావి యవనులతోడను నైజామనయావనావనిఘవునితోడను కృష్ణరాయలు యుద్ధము జేసినది క్రీ. శ. ౧౫౧౬ నకు దరువాతను ౧౫౧౮ ముందునై యుండవలయును; అనగా నీ యుద్ధములు రెండును ౧౫౧౭-వ సంవత్సరమున జరిగెనని స్థూలముగ జెప్పవచ్చును.

ఈ సందర్భమున రాయలు మహమ్మదీతో జేసిన యుద్ధము రాయవాచకమునందును బ్రస్తాపింపఁబడియున్నది. కాని యందు కెంబావి మాట లేదు; నైజామన యావనావనిఘవుని రాజధానియగు నహమదునగరమును రాయలు నాశనము గావించినట్లు వచించియున్నది; మఱియు నది క్రీ. శ. ౧౫౧౪-వ సంవత్సరమున నాగార్జున కొండను సాధించిన పిమ్మటను ౧౫౧౬-౧౭ న పొట్నూరు సింహాచలముకడ జయ స్తంభమును ప్రతిష్ఠించుటకు ముందును నడచినట్లు చెప్పియున్నది. కృష్ణరాయ విజయమునందుగూడ అహమదునగరమున రాయలు తురకలను జయించినట్లు కలదు. యుద్ధకాలనిర్ణయవిషయమై పై గ్రంథముల సాక్ష్యమించుక భిన్నముగ గన్పడుచున్నను, కళింగ జైత్రయాత్రమున్న రాయ లోక పర్యాయము మహమ్మదీయులపై జయప్రదముగ దాడినడచెనని యవిరేకగ్రీవముగ బల్కుచున్నవి.

ఇట్లు రాయలచేబరాజితులైన తురక లెవ్వరో కనుగొందము. ఈ యుద్ధమునుండి మరలివచ్చినపిమ్మట గజపతి రాజ్యముపై మరల గాలిచిసేయ సంకించుచున్న రాయలనువారించు తిమ్మరసయ్యవాక్యముల వలన వా రెవ్వరైనదియు దెలియవచ్చుచున్నది.

'అప్పాజీ రాయలవారితో మూడు తెగల తురకలరాజ్యమంత్తా కంపోలంతేళీ వారి దుర్గాలున్ను స్థలాలున్ను కట్టుకొని అహమదానగరం ఆమిదాబాలు వి త్తించి గజపతి వారి గిరిదుర్గాలం స్థలదుర్గాలం యివి అన్నియు ఆక్రమించినట్టాయను. మంస్తర వదిలి పొయ్యేది కార్యంకాదు.'[2]

ఇంతకంటె స్పష్టతరముగ కృష్ణరాయవిజయమునందు,[3]—

'ఇతరులు శక్తులె తలప నేదుల
  శాహు నిజాము శాహులకా
గుతపవమల్కనుకా గెలిచి
  కొబ్బున సర్వగిరీంద్ర దుర్గముల్
జతురత గైకొనకా ధర
  నసాధ్యము నీకిఁక గల్గెనైన నం
చిత యశ యొక్క విన్నపము
  జేసెద వేడుకఁ జిత్తగింపుమా,'

ఇందువలన కృష్ణరాయలు కెంబావి యహమదునగరములకడ నోడించిన తురకలు ఆదిలుఖాన నిజాముల్ ముల్కు కుతుబ్బుల్ ముల్కులను, విజాపురాహమదనగర గోల్కొండసేలు ప్రభువులని తెలియవచ్చుచున్నది.

ఇఁక రాయలు కళింగజైత్రయాత్రను నడుమ నాం పై జేర్కొన్న తురకరాజులపై నేల దాడిపోయెనో కనుగొనవలసి యున్నది. విచారింపఁగా దీనికి ముఖ్యకారణము రాయసామ్రాజ్యముపై దురకరాజులందఱు నేకముగనో, ప్రత్యేక ప్రత్యేకముగనో నడిపిన దండయాత్రలని తోచుచున్నవి. క్రీ. శ. ౧౫౧౬ ప్రాంతమున కుల్లీకుతుబ్బుల్ ముల్కు విజయనగర గడి ప్రదేశమండలి దేవరకొండ పానుగలు గన్పూర కోవిల కొండలను నాలుగుదుర్గములను రాయల సైన్యముల నోడించి కైకొన్నట్లు ఇంతకుముందరి ప్రకరణమున విదితము సేయబడె యున్నది. ఇస్మాయీ ఆదిల్ ఖాను రాయచూరునుగూడ అప్పుడె స్వాధీనపఱచుకొని యుండవలయునని మనం ఊహించితిమి. అహమదునగర నిజాముల్ ముల్కు కూడ దాడి నడచి యుండవలయును. ఇట్టి సంఘటన నూతనమైనది కాదు. తత్పూర్వము పలుమార్లు నడచినదే. ఈ మూడింట్ల తురకరాజులును రెండు ఉద్దేశములతో నీ యుద్ధకార్యమును దల పెట్టి

---

2. రాయవాచకము (కాశినాథ, 1933) పుటలు 93-94.

3. కృష్ణరా. విజ 3: 66

న్నది. గజపతికి నోస్పలియునను ఇచ్చ మొకటి : 'గజపతివారికిని తురకరాజుల కును రాజకీయమైన మైత్రి గలదు. ఇప్పటివలె సర్వ మును రాజు లొంగోరుల సంస్థానములలో దమ ప్రతి నిధులను నిలుపువారు; ఈ ప్రతినిధులు తాత్కాలిక ముగ నేర్పైన యొక కార్యార్థము వచ్చి పోవు రాయ బారులును మాత్రలును గారు. స్థిరముగ నొకరాజు పక్షమున మరియొకరాజు నాస్థానమున నుండు నియోగులు. అప్పటి రాజకీయ పరిభాషయందు వీరికి స్థానాపతులని పేరు. ఈ స్థానాపతు లిప్పటి రాయబారులవలె నన్యరాజ్యములందు దమ రాజ్య మునకు సంబంధించిన వ్యవహారవిషయములను జెప్పుచు నీయక నూరకుండక అన్యరాజ్యముల మర్మ ములను గనుగొనుటకై యనుదినము రహస్య వేషముల సంచరించుచుండు వేగులకు ప్రాపైయుండిరి. తఱ చుగ పెక్కు రాజ్యముల స్థానాపతులు సమావేశమై తమ రాజ్యములకు నిత్యసామాన్యములయిన రాజ కీయసమస్యలను జర్చించి వానిని దీర్చుకొనుటయు మార్గముల నన్వేషించుచుండిరి. కృష్ణదేవరాయలు మహ మ్మదీయ రాజ్యములపై దండు వెడలబోవుచున్నా డనువార్త ప్రచురమయినంతనె ఇట్టి స్థానపతుల సమావేశ మొకటి విజాపురమున గూడెను.

'...ఇబురాహిం బహుమను గారు మందర దివానంలో కుంటుచ ఆయనవద్ద మౌంఘోసంతితులు మొదలయిన వారు నియోగులువారివద్ద కుతపనముల్క వారి హాజీ బులు ముకుందపండితులు మొదలయినవారు కూర్చుండి ఆలోచన చేసినది:—కర్నాటకం సింహాసనానకు నవ వంగా కృష్ణరాయలవారిని అధిష్ఠాన కర్తలను జేసిన దారభ్యం తురకలమీద కార్యం కాయ ఆలోచనజేసి అందుకై యత్నములు చేస్తూవున్నారు. అన్ని వివరా లను విజయనగరమునుండి కాకితములు వ్రాశివచ్చెను. ...మంత్రాలోచనగా వార్తలు తెలిసినవి: కర్నాటకం వారు సరదు బలపరించినప్పటి గజపతివారికిన్ని మన కున్ను మున్నెరికం గాకుండెగా వుండును. ఆరీతు గాకుండా అందునకైన యత్నంగని సరుగు దుర్గా లను రస్తుసామగ్రిలు వేయించి బలవంతంగా యేనుగలు గుఱ్ఱాలు కాల్బలములు వుంచవలెను. అని ఆలోచన జేసి నవారై యేదుల శాహువారితోను...నిజాంశాహు వారున్ను కుతుపనములకవారున్ను విజయనగరాని నుండి కాకితములు వ్రాశివచ్చినది విని ఆలోచన పరులై యిక్కడికి కాకితములు అంప్పి తమతమ సరుగు స్థలములు పదిలపరచుకొని గొప్ప హెచ్చరికలతో నున్నారు...

'గజపతివారు.........పరస్థలపు నియోగుస లతోనున్ను సంభాషణ చేయగా నిజాంశాహు వారి నీలాద్రిపంతులువారున్ను యేదుల శాహు కుతపనములక వారి స్థానాపతులున్ను......... కర్ణాటకాధీశ్వరులు కార్యముఖానకు నడిచే వారై చతురంగబలమున్ను జతచేసుక బైలు వెడలి సరుములకువచ్చి కనుపించుకొనేవారై యున్నారు. యీవరకు ఉత్తరం దక్షిణం దొరలకార్యాలకు హాని వృద్ధులకు సహాయసంపత్తి నడుపుచురు. ప్రబలమైన కార్యాలయితే అందరున్ను ఏకగ్రీవమై ఉత్తరం అగ్ర పురం వారి కార్యాలకున్ను నిర్వహింతురుగా. ఇప్పుడు అంతేసి కార్యాలు యేమి వున్నది? సరుదున వుండేవారు గనుక—యితరం గాదుకదా. యేదుల శాహువారున్ను నిజాంశాహువున్ను, కుతుపనములక వారున్ను సరుములు స్థోమశుద్ధిగా యోచనలేయగా పనిలేదు. అంతకు మించిన కార్యాలయితే అహ మదు నగరపర్యంతం వత్తురు—అని ఘనంగా వ్రాశి అంప్పినారు.'[4]

రాయవాచకమునందు పై వివరింపబడిన స్థానా పతుల వృత్తాంతము విశ్వాసపాత్రమేని—కాదనుటకు గారణము గానరాదు—దక్కను మహమ్మదీయ ప్రభు వులకును గజపతివారికిని రాజకీయములందు మైత్రి కలదనియు, నుత్తరమున అగ్రపురము (ఆగ్రా) వారి తోను దక్షిణమున కర్నాటకంవారితోను యుద్ధము పొసగినప్పుడు వారందరు నేకీభవించి శత్రువును దారికొనువారనియు దెల్లమగుచున్నది. క్రీ. శ. ౧౫౦౯-౧౦ యందు కృష్ణరాయలు మహమ్మదీయ రాజ్యములపై దండు వెడలబోవుచున్నాడను వదంతి పుట్టినప్పటినుండియు నతని నారందరు నేకమై ప్రతి ఘటించుటకు ఒండొరులతో సంప్రతింపులు సాగిం పుచు, బూర్వమర్యాదప్రకారము గజపతినిగూడ తమ తోడ్తాసిగనుండుమనియు దమతో నేకీభవించుట మేల నియు నతనికి దెలియబరచిరి. గజపతులకును కర్ణాటక

4. రాయవాచకం (కాకినాడ. 1935), పుటలు 46,47,49,73.

చక్రవర్తులకును శత్రుత్వము తరతరములుగ పెరిగి వచ్చుచుండెను; కర్ణాటక చక్రవర్తులతో యుద్ధము సంభవించినపుడు గురకలసహాయమును గొనుట కపిలేశ్వరుని కాలమునుండియు నాచరణయందుండిన పాత మర్యాదయేకాని క్రొత్తది కాదు. కావున గజపతి ప్రతాపరుద్రుడు కృష్ణరాయల ప్రతిఘటించుటకొఱకు దక్కను మహమ్మదీయ ప్రభువులతో నేకీభవించెనని నిస్సంశయముగ నంగీకరింపవచ్చును.

ఇట్లు మున్నె యుకగలిగి కర్ణాటకులను గడిదాటి రానీయకకు వెనుక త్రోయుటకొఱకు మహమ్మదీయ ప్రభువులును గజపతివారును జేసిన ప్రయత్నములన్నియు కృష్ణరాయల రణకౌశల్యమువలన విఫలములైపోయెను. ప్రారంభమునందె మహమ్మదీయుల కతని సంకాశమైన దెబ్బతగిలెను. క్రీ.శ.౧౫౧౧-౧౨ ప్రాంతమున కృష్ణరాయలు కృష్ణాతీరమున మూడింట్ల తురక రాజులదళములను విఱుగఁగొట్టిచి చెల్లాచెదరు గావించుటయేకాక కృష్ణకుదక్షిణమందుండిన వారిదుర్గములను రాష్ట్రమును నాక్రమించుకొనెను. తరువాత గజపతి సామ్రాజ్యముపై నెత్తిపోయి యుదయగిరి కొండవీడు కొండపల్లి మున్నగు తీరాంధ్ర సుప్రసిద్ధ దుర్గములను తత్సంబంధిరాష్ట్రములను జయించి స్వాధీనము జేసికొని తెలింగాణము ప్రవేశించి యచటి కోటలను సీమలను ఆక్రమించి, కళింగమధ్యమందలి సింహాచలము చెంతకు బోయి విడిసెను. అప్పుడె తిమ్మరసయ్యవలె దక్కను మహమ్మదీయ ప్రభువులును కృష్ణరాయలు గజపతిరాజ్యములోనికి చాలదూరము జొచ్చుకొని పోయెనని తలచిరి. రాయరాణువధాటి కాగజాలక పాఱుగజపతికిదోడ్పడుటకు అదియె యదననియెంచిరి. అప్పుడు తాము విజయనగరసామ్రాజ్యముపై నెత్తిపోయి తాకిన దమ దండయాత్ర నడ్డగించుటకొఱకు కృష్ణరాయలు కళింగమున యుద్ధము సల్పుచుండిన సైన్యమునంతటిని గాకపోయినను జాలభాగమును మరల్చుకొని రావలసివచ్చుననియు నందువలనగజపతిమీది రాయసైన్యముల యొత్తిడి తగ్గిపోవుననియు దలచి ఫౌజుల ముస్తీదు చేసికొని బయలు వెడలిరి. కేవలము గజపతికి సాయముసేయు నపేక్ష యొక్కటియె నాటి నీ దండయాత్రకు బురికొల్ప లేదు. ౧౫౧౧-౧౨ వ సంవత్సరమున రాయలచే దమకు గల్గిన పరాభవమునకు ప్రతీకారముసేయు దలంపును నప్పుడతడు దమచేతినుండి నాచికొన్న దుర్గములను రాష్ట్రమును మరల సంపాదింపవలయునను గోరికయు వారిని ద్వరపెట్టెను.

ఈ దండయాత్ర నెదుర్కొనుటకె కృష్ణరాయలు కళింగ చైత్రయాత్రను మధ్యయందాపి దక్కను తురకరాజులపై నడచినది. ఈ యుద్ధమున నడచిన ముఖ్యాంశములను కొంటెనిమాత్రము రాయలు పేర్కొనియున్నాడు. (1) కెంబావి కయ్యము:— కెంబావి ప్రాచీన బహమనీ రాజధానియగు గుల్బర్గకు నైఋతి దిగ్భాగమున నేబదిమైళ్ళదూరమునను, ఆదిలుషాహుల రాజధాని యగు విజాపురమునకు దూర్పున కొంచెమించుమించుగ నంతియెదూరమున నున్న గ్రామము. ఇదియు అహమదానగర రాజ్యముల సరిహద్దులు సమీపమునందె యుండినవి. ఇచట నొక బలిష్ఠమైన కోట యుండెను. అది యప్పు డెవ్వరి యేలుబడిక్రింద నుండెనో చెప్పుటకు వీలులేదు. మహమ్మదీయ రాజ్యములోని కంతదూరము కృష్ణరాయలు చొచ్చుకొనిపోవుటనుజూచి తత్పూర్వము మహమ్మదీయ ప్రభువులనోడించి వారిని నన్నింటి తఱుముచుబోయి నట్లున్నది. ఆముక్తమాల్యదలోని వర్ణనను బట్టి చూడగా కెంబావియుద్ధము భయంకరమై యవనజనమారణ కారణమైనట్లు తోచెడిని. (2) నైజామునయావనావని ఘపుని మణిప్రాసాద నిర్మూలనము:— రాయవాచకము నందును కృష్ణరాయవిజయమునను రాయలు అహమదునగరముపై నడచి యచట తురకల నోడించి యాపట్టణమును నేలమట్టము గావించినట్లు చెప్పియున్నది. రాయవాచకమున జరిగిన యుద్ధాంశములు వర్ణనాడంబరము లేక సంగ్రహముగ నిట్లు వివరింపఁబడినవి:—

'అహమదానగరమునకు నడరగా కొనమూకల వారు పళిపాళ్యాలు చేరబడి చెరపోరాపట్టి చాలా కంపోలం చేయంగా కోటలోని గుర్రాలు వారు వెళ్ళి వచ్చి యెదుట నిలిచి జగడమియ్యంగా మాడుం ముక్కాలు ఘోడియలలో గా రెండు వేలుం న్నెనమం న్నూరుగుర్రాలున్ను అన్నియు రౌతులున్ను చాప కట్టుగా మృతిబొందిరి. గనక యీ సమాచారం కోటలోవున్న మొదటిదొరలయినవారు విని ఇక్కను మనం కోటలో నిలిచివున్నట్లయితే చేపట్టుగా పట్టుక బోదురు. అందునుంచ్చి చాలా అవమర్యాద అని

యెంచ్చి యేమిబోయినాబోని అని కోటనువిడిచి పారి పోయిరి. గనక రాయలవారు ఆకోట యిడియ గొట్టించి ఆపట్టం గొంట్రిమేరో అంత మేరానన్ను వెలిపాళ్యాలుంన్ను గుంన్నించి ఆమిదాలు గిల్లేళ్ళు వి త్తించెను.5 కుమారధూర్జటి పై యంశములనే ప్రబంధ ఫక్కిని ఇట్లు వర్ణించినాడు:—

‘దర్పంబున నహమదానగరంబుపయి గరంబు మురంబుసేయుందలంచి యప్పురంబు నలుదెసలం జుట్టు ముట్టినం జెట్టదరియు బెదరియుఁ జెదరియుఁ దజ్జానపదవర్గంబు పలుదెసలం బాఱిపోయిన రాగంబున నచ్చటి యవనబలంబు రెసంగ దలంబునన్ గోటవెడలి వచ్చిం దలపడినం బోరు ఘోరంబై కౌరవ పాండవ రణంబునుంబోలి గాంగేయ కుంభజాత దుశ్శాసన పీరలక్ష్మణ కర్ణ శల్యాహరణ కారణంబై ... మెఱయు నమ్మ్యుద్దవనికి నోహటించి చలించి పలాయమానులగు పారసీకుల నసేకుల గాందికులని యెంచి బ్రదుకు దురగాక యని యుపేక్షించి తదీయస్థలంబున జయధ్వజం బెత్తించె’ అని.6

పై నుదాహరింపబడిన రెండు వర్ణనలయందును కొంతభేద మగపడుచున్నది. రాయవాచకమునందు కృష్ణరాయ లహమదునగరపుగోట నిడియగొట్టించెనని యున్నది. కృష్ణరాయవిజయమునందా ప్రస్తావము గానరాదు. కుమారధూర్జటి యీయంశము నెందుకు పేర్కొనలేదో కాని కోటను ఇడియగొట్టినదిమాత్రము వాస్తవము. కృష్ణరాయల సాక్ష్యమే రాయవాచక వర్ణన యథార్థమని ఋజువు సేయుచున్నది. ఆముక్తమాల్యదపష్ఠాశ్వాసాంతమున,

‘ఇది నైజామన యావనావనిప
వాహీనాభ్రచుంబి స్ఫుర
ద్విదితాభిలమణీగృహాళిదళనో
ద్వేలోగ్రహాస్తి వ్రజో
ద్యదనీకాగ్రగ కృష్ణరాయ,’

అని చెప్పుకొనియున్నాడు. ఈ మణిగృహాళి యహమదనగరపు గోటలో నుండినవి. వీని పరిసరములయందే యహమదునగరము నిర్మింపఁబడెను. ఈ మందిర పట్టణ నిర్మాణములనుగూర్చి ఫెరిష్టా యిట్లు వ్రాసియున్నాఁడు. బహమనీసుల్తాను సైన్యముతో నహమదునిజాముల్ ముల్కునకు జరిగిన యుద్ధమునందు నిజాముల్ముల్కునకు జయము గలిగెను. ఈ రణక్షేత్రమున క్రీ. శ. ౧౪౯౦ సం॥న అహమదు నిజాముల్ముల్కొక చక్కని ప్రాసాదమును నిర్మించి దానిచుట్టును కనులపండువు సేయు నుపవనమును వేయుటచే నా విజయమున కుపవన విజయమని పేరు వచ్చినది; అతని తరువాతివా రాతోటను మరింత మనోజ్ఞము గావించిరి. మఱియు దానిచుట్టును కోట గొత్తళము లెత్తించి దానికి నిజాము ఉపవనమని నామకరణము గావించిరి. ౧౪౯౪ సం॥న దనరాజ్యమున కొక రాజధానిని నిర్మింప నిశ్చయించుకొనెను. ఈ యుద్దేశముతో నతఁడు నిజాము ఉపవన పరిసరముల సీనానదీతటమునను నహమదునగరమను నూతన పట్టణమునకు బునాది వేసెను. తరువాత క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతమున దౌలతాబాదు ముట్టడినుండి మరలివచ్చినవెంట నిజాము ఉపవనము చుట్టు కోటనుగట్టి యం దెత్తు జాతితో నొక మందిరమును గట్టించెను.’7 ఈ నిజాము ఉపవనములోని ప్రాసాదములె కృష్ణరాయ లిడియగొట్టిన గృహాళి. అవి యహమదునగరపుగోట లోనివగుటచే గోట నిడియగొట్టక వానినిడియ గొట్టుట సాధ్యమైన కార్యము గాదు; కావున రాయవాచకమున జెప్పినట్లు కృష్ణరాయ లహమదు నగరపు గోట నిడియగొట్టుట నిక్కువము. కాని యీ విజయములవలన కృష్ణరాయలు విశేషము లాభమును బొందినట్లగపడదు. రాయవాచకమున మూడు తెగల తురకలరాజ్యమంత్తా కంపోలంజేసి వారి దుర్గములను స్థలములను గట్టుకొన్నట్లు వ్రాసి యున్నది. తురకల రాజ్యములను గంపోలము జేసినమాట వాస్తవమే; కాని యీ యుద్ధానంతరము దురకల రాజ్యమందలి దుర్గములును స్థలములును వారి యధీనమందే యుండుటచే కృష్ణరాయలు వానిని గట్టుకొనె ననుట యతిశయోక్తి. ఇంతియకాదు రాయచూరు మున్నగు నంతర్వేదిదుర్గము లింకను ఆదిలుఖానుని యాధీనమునందె యుండినవి. కోవెలకొండ మున్నగునవి కుత్బుల్ ముల్కు క్రిందనె యుండినవి. తురకలను పరాభూతులను గావించియు కృష్ణరాయ లీ దుర్గ

5 రాయవాచకం (కాకినాడ. 1933 పుట 93.)

6. కృష్ణరా. విజ 3: 65.

7. *Briggs Ferishta III pp 197, 200-01204.*

గ్రహణమున కేల పూనుకొనలేదు? అను ప్రశ్న యొకటి సమాధానమును గోరుచున్నది. ఏల పూనుకొనలేదో కనుగొనుటకు తగిన సాధనములు లేవు, కాని యూహ సేయవచ్చును.

రామాయణములో నిడుకలవేట్లాట యున్నట్లు కళింగ జైత్రయాత్రమధ్యమం దావిర్భవించిన కొండవీటి యహమ్మదునగరముల యుద్ధప్రసక్తి. తత్కారణమున నడచుచుండిన కళింగ దండయాత్ర నాపి మహమ్మదీయ ప్రభువులతో కృష్ణరాయలు గయ్యమునకు రావలసి వచ్చెను. వారిని పరిభవించి తఱుమగొట్టిన పిమ్మట వారాక్రమించుకొని యుండిన దుర్గములను గైకొనుట వ్యవధి లేకపోవుటచే వానిని తరువాత జయింపవచ్చునని తలంచి కళింగమునకు మరలిపోయి యుండెను. బహిరంగస్థలయుద్ధముకంటె కోటల ముట్టడించి సాధించుటకు దీర్ఘకాలము పట్టును. రాయలు మహమ్మదీయు లాక్రమించుకొనియుండిన గడికోటలను సాధించుటకు గడగిన, గజపతిపైని దండయాత్రను దదేకనిష్ఠతో సాగించుటకు వీలుండదు. అవకాశము గలిగిన నతడు రెక్కొని క్రొత్తగ దేశములను గూర్చుకొని ప్రబలుడై తాకొనవచ్చును. కావున గజపతి కట్టి యవకాశము నీయక వానిని సంపూర్ణముగ నోడించి సంధికొడంబఱచి యావల మహమ్మదీయుల పని బట్టింపవచ్చునని నిశ్చయించి సింహాద్రికి దరలిపోయి యుండెను.

## రాయచూరు

(క్రీ. శ. 1520)

కళింగ దండయాత్ర జయప్రదముగ ముగిసినది; కూతునిచ్చి రాయల కుద్వాహ మొనర్చి గజపతి రాయలతో సంధిజేసికొనెను; అనతుడైయుండిన కొటూరు ప్రభువు నిహతుడాయెను; అతని ధనసంచయము రాయ భండారమును జేరెను; రాష్ట్రము రాయ సామ్రాజ్యమున గలసిపోయెను. ఇంక తురక లాక్రమించుకొని యుండినదుర్గములను జయించి కైకొనుటకు ప్రయత్న పడవలసియుండెను. అందు ముఖ్యమైనది కృష్ణా తుంగభద్రల యంతర్వేదియందలి రాయచూరు. మొట్టమొదట నాదుర్గమును సాధించి యంతర్వేది నంతటిని తన యధికారము క్రిందికి దెచ్చుకొని దక్కిన చిల్లరకోటల నటుపిమ్మట సులభముగ స్వాధీనపఱచుకొనవచ్చు నని నిశ్చయించి యా కార్యమును నెఱవేర్చుటకు దగిన ప్రయత్నములు చేయగడగెను.

రాయచూరుదండయాత్ర ప్రకటనసందర్భమున న్యూని జొక కథను చెప్పుచున్నాడు:—

<u>సయ్యిదు మర్కారు కథ:</u> ఒకనాడు కృష్ణదేవరాయలు సాళువతిమ్మయతో సాళువ నరసింగరాయల మరణపత్రమందలి యాదేశముచొప్పున నందు చేర్కొనియుండిన దుర్గములలో నొక్కటియైన రాయచూరును ఆదిలుఖానుని జయించి స్వాధీనము జేసికొనుటకు నిశ్చయించితిననియు, నంతకుముందు నలువదేండ్లనుండియు నాటివఱకును వర్ధిల్లుచు వచ్చిన దమ రెండురాజ్యములయొక్క మైత్రిని భంగపఱచుటకు వెరవెఱుగక యున్నాడననియు జెప్పెను. అందుకు సాళువ తిమ్మయ ఇట్లు జవాబు చెప్పెను. రెండురాజ్యములకును మైత్రి కొన్ని నిబంధల ననుసరించి నడవవలసి యున్నది:—ఇరుపక్షములవారియం దెవ్వరి రాజ్యమునుండి యేనియు జమీందారులు, ఋణగ్రస్తులు ద్రోహి దేశపతులు మున్నగువారు పాఱిపోయి రెండవవారి యండ జేరిన, నట్టివారిని దమకు బట్టియీవలయునని మొదటివారు కోరినయెడల రెండవవారు వారి నప్పగింప వలయును. ఏలినవారి క్రింది భూస్వాములును, అప్పుపడి ధనమునీయ వలసిన ఋణగ్రస్తు లనేకులు ఆదిలుఖానుని రాజ్యమున డాగియున్నారు. కావున ఆ నెపము పెట్టి దండు వెడలవచ్చునని యతడుపాయము జెప్పెను; కాని ఇతరమంత్రు లందు కొప్పుకొనలేదు.

కృష్ణరాయల కొలువున సయ్యిదుమర్కారను మహమ్మదీయు డొక డుండెను. వానిచే నలువది వేల పర్దావుల పైకమిచ్చి గుఱ్ఱములను గొనుటకు గోవా పట్టణమున కంపియుండెను; గోవాకు రెండు లీగుల దూరమున పోండాయనుస్థలము గలదు అది మహమ్మదీయులకునికి పట్టు. మర్కారాస్థలమును జేరి యచటినుండి యాదిలుఖానుని రాజ్యములోని కాధనమునంతటిని వెంటగొనిపరారి చిత్తగించెను. పోండాయం దాతడుండగ నాదిలుఖానాతని పేర నొక యుత్తరము వ్రాసిపంపెననియు, దత్కారణమున నాతడాదిలుఖానుని రాజ్యమునకు బాఱిపోయెననియు గొందఱు

చెప్పుదురు. సయ్యిదుమర్కారు పలాయనము రాయల కెఱుకపడినంతటనె, యతఁడు పెక్కుసంవత్సరములుగ రెండురాజ్యములకును వర్ధిల్లుచున్న మైత్రి యాద్రోహి కారణముగ విఘాతముసేయుట యుక్తముగాదనియు, వానినిబట్టి తనకడ కంపవలసినదనియు గోరుచు నొక కమ్మనాదిలుఖానుని పేర వ్రాయించి పంపెను. ఆకమ్మ యందగనె యాదిల్ఖానుఁడు ఖాజీలను మంత్రులను రప్పించి వారి కాలేఖార్థము చదివి వినిపించి వారిని సలహా యడిగెను. మర్కారు సయ్యిదు, అనగా మహమ్మదుప్రవక్తవంశసంజనితుఁడగుటచేతను, మల్లాశాస్త్ర విశారదుఁడునగుటచేతను నాతని రాయలకుబట్టి యీరా దనిరి. అంతట నాదిల్ఖా నొకయుక్తి నవలంబించెను; మర్కారుకు దాబులును చేవుపట్టణమును జాగీ రొసగి యతనినచటి కంపి, యతఁడు తన యాస్థానమునలే డనియు, నతనిసంగతి తనకేమియుఁ దెలియదనియు బదులు వ్రాసియంపెను. దాబులునుండి యా సయ్యి దచ్చటికో పాఱిపోయెను.

ఈ విషయ మెఱుకపడగనె రాయలు దక్షిణమె దాబులుపై దండెత్తిపోయి సూడు దీర్చుకొన నిశ్చయించెను. మంత్రు లల్పధనముకొఱకు సయ్యిదుపై యుద్ధమునకు వెడలుట పాటిగాదని వారించిరి. కాని రాయల దృఢసంకల్పమును గుర్తెఱిఁగి, 'దేవా! దాబులుమార్గమున బోవలదు; ఇప్పు డాదిలుఖానుని యధీనమున నుండు రాయచూరుపై దండువెట్టుఁడు; అది పూర్వము మనరాజ్యమునకు జెల్లుచుండిన'దని విన్నవించిరి. మంచిదని వారి సలహా నంగీకరించి, సయ్యిదుమర్కారు వృత్తాంతమును దెల్పుచు మద్రె మలోక్కాదె, మెల్లెనో, దెస్తూర్, విరిదో అనువారలకు ఉత్తరములు వ్రాయించెను 8

క్రీ. శ. ౧౫౫౦ ప్రాంతమున దా ఏషియా యను చరిత్ర గ్రంథమున ప్రథమదశకమును ప్రకటించిన బ్యారాసు ఈకథను గూర్చి దవ్వత్యాస ముతో నిట్లు చెప్పుచున్నాఁడు:—

'ఆదిలుఖానుని తంత్రము చేసి బోను కెక్కింప వచ్చునని యెఱిఁగి కృష్ణరాయలు పెక్కేండ్లుగ దన కొలువునందుండిన సయ్యిదుమర్కారను మహమ్మదీయుని పిల్పించి, నలువదివేల పర్దావుల నెత్తికొని గోవాకుబోయి యచట పారశీక దేశమునుండివచ్చు గుఱ్ఱములను గొనుమని యాజ్ఞాపించెను. మన కర్తానునకు గూడ నాయర్థమును సాధించు నుద్దేశములో, నాయంశ మెల్లరకు దెలిసియుండుట మేలని యెంచి జాబుగా వ్రాసెను. సయ్యిదుమర్కారు తనవశమున నున్న ధనమునిమిత్తము ఆదిల్ఖా నంపిన యుక్తి మీదివ్యామోహముచేతనో, యాదిల్ఖానంపిన యుక్తి నకులోఁగియో, గోవాకు మూఁడులీగుల దూరమునందుండు పోండె యను రాజాదరియకు వచ్చి చేరినపిమ్మట ఆదిలుఖానుని రాజ్యమునకు బాఱిపోయెను. అతఁడు తన చెంతకురాగనే యాదిల్ఖాను, అతఁడు ప్రవక్త మహమ్మదుయొక్క మహోన్నత కుటుంబమునకు జెందిన వాఁడగుటచే నతనికి దావులు రాజాబారి యను జాగీరుగ నొసగి యచటి కంపెను..., కాని తరువాత కొన్నిదినములలోనే యత డచట గానరాక మాయమై పోయెను. అతని చెంత నున్న నలువదివేల పర్దావులను హరించినపిమ్మట ఆదిల్ఖా నాతని జంపించెనని చెప్పుదురు.9

ఇట్లు కృష్ణరాయలకు సమకాలికులును నించుక తరువాతివారునైన పోర్చుగీసు చరిత్రకారులును జెప్పు సయ్యిదు మర్కారుకథయందు సత్య ముండక పోదు; కాని వారి యాదార్థమును సంశయగ్రస్తముసేయు నట్టియంశములు వారి కథయందు లేక పోలేదు. ఇందు ముఖ్యమైనది విద్యానగర విజాపురరాజ్యముల మైత్రి. క్రీ. శ. ౧౫౨౦-వ సం॥న కృష్ణరాయలు రాయచూరుపై దండు వెడలుటకు పూర్వము నలువది సంవత్సరము లనగా ౧౪౮౦ నుండియు పైరాజ్యముల రెంటిమధ్య మైత్రి వర్థిలుచుండినట్లు న్యూనిజు చెప్పియున్నాఁడు. ఇది యబద్ధమని నోరువిచ్చి చెప్పనవసరము లేదు. విజాపురరాజ్యము స్థాపింపబడినది క్రీ. శ. ౧౪౮౯-వ సం॥ నందని మహమ్మదీయ చరిత్రలవల్ల దెలియుచున్నది. అదిమొదలు రాయచూరు యుద్ధపర్యంతము గడచినయేండ్లు ముప్పదియొక్కటి. ఈ ముప్పదియొక యేండ్లకాలములోపల విద్యానగర విజాపురములకు పెక్కుమార్లు యుద్ధము నడచినట్లు మహమ్మదీయ చరిత్రలవల్లను, హిందూవాఙ్మయమువల్లను, విజయనగరచక్రవర్తుల శాసనములవల్లను దెలియ

8. *Nuniz F.E. pp 323-25.*

9. *Ibid W. 325, W. 2.*

వచ్చుచున్నది. కావున ఈపట్టున న్యూనిజుమాట సత్యేతరకము గాదని వేఱుగ జెప్పవలయునా? దీని వలెనే మర్కారు కథయు నసత్యమైయుండరాదా యను సంశయము గలుగవచ్చును. వీటిరెంటికిని గల తారతమ్యమును గ్రహించితిమేని యట్టి యనుమాన మున కవకాశ ముండదు. విద్యానగర విజాపురముల మైత్రి న్యూని జన్యుల సుంత కర్ణాకర్ణిగ విన్న గత చరిత్రాంశము. సయ్యదు మర్కారుకథ ప్రాయశః అతడు విజయనగరమునకో, గోవాయందో, లేక తత్సమీపస్థ ముగు మఱియొక తావుననో నివసించుచుండినప్పుడు జరిగినది. ప్రత్యక్షముగ కంటితో జూచినది కాక పోయినను చెల్లు చూచినవారివల్ల నెఱిగినది. న్యూను వివరించుటకు వచ్చును; కావున నది యసత్యమని యనుకొనుటకు నవకాశము లేదు.

ఇక కృష్ణరాయలు సయ్యదు మర్కారు వృత్తాంతమును తెలియజేయుచు లేఖలు వ్రాసినవారెవ్వరో, వారి కట్లు ఏల వ్రాయవలసివచ్చెనో విచారింపవలసి యున్నది. వీరిలో 'మాద్రెములుకో' యను వానియొందలి 'మాద్రె' యను పేరు 'ఇమా' దని యము నతడు బీదరు సుల్తాననియు, 'వరిదో' బీదరు సుల్తానగు బరీదనియు, దెమెల్లీనో దెస్తూరుల యాన వాలు చక్కగ దెలియుచున్నవనియు నొక వేళ నది 'జెమెల్లుకో' యనగా నిజాముల్ ముల్కనుదానికి వ్రాయసకాని పొరపాటు కావచ్చుననియు, దెస్తూరనునది న్యూనిజు గ్రంథమున మఱికొన్ని యెడల నెసూయి, లేక యెస్కారను దాని రూపాంతరమనియు నది గోల్కొండసుల్తానగు కుత్బుషాయనియు సూరయెలు గారు వ్రాసియున్నారు.[10] కాని సూరయెలుగారి వ్యక్తినిర్ణయమును పూర్తిగ నంగీకరించుటకు వీలు గాదు. 'మాద్రె' యను నామమును ఇమాదుతో సరిపెట్టుటకంటె 'మదార్' యొక్క యపభాష రూపమని యూహించుట యుక్తమని తోచుచున్నది. 'మాద్రెములుకో,' మదారుల్ ముల్క కావచ్చును. అట్లయిన నతని గుర్తించుటకు దగు సాధనము లింకను లభ్యపడలేదు 'వరిదో' బీదరు సుల్తానగు బరీదనుటకు సంశయములేదు. 'దెమెల్లీనో' సూరయె లూహించునట్లు జెమెల్లుకో కావచ్చును. అగునేని యతడు అహమదునగర ప్రభువగు నిజాముల్ ముల్కనుట సరియే.[11] దెసూరు కుత్బుల్ ముల్కని సూరయెలు చేసిన వ్యక్తి నిర్ణయము సరియైనది కాదు. ఇది దస్తూరి మమాలిక్, దస్తూర్ దీనా రనువారిలో నొక్కరి పేరై యుండవలయును. వీరిరువురికి పితాపుత్రబాంధవ్యము గలదు. ఇరువురును కృష్ణరాయలకాలమున గుల్బర్గ నేలిరి. ఈ మహమ్మదీయ ప్రభువులందఱును బహమనీ సంస్థానము నాశ్రయించియుండిన సామంతులు. క్రీ. శ. ౧౩౪౭ మొదలు ౧౫౧౮ వఱకును బహమనీరాజ్యమును బాలించిన రెండవ మహమ్మదుశాహు కేవలము సత్వహీనుడగుటచే సామంతులపై దన యధికారమును జెల్లించుకొనజాలకపోయెను. కావున వారు తా మేలుచుండిన సీములయందు స్వతంత్రులుగ వర్తిలుటయె కాక, చుట్టుప్రక్కలనున్న తోడి సామంతులను గొట్టి వారి సీములను జయించి నూతన రాజ్య నిర్మాణమునకు గడగిరి. తత్కారణమున వారికి పరస్పరము వైరము గలిగి యుద్ధము సామాన్యమాయెను. వీరికి సయ్యదుమర్కారు కథను దెల్పుచు కృష్ణరాయలు త్తరము లేల వ్రాయించె ననునది ప్రస్తుతము విచారణీయాంశము. న్యూని జీ విషయమును జక్కగ వివరించి యున్నాడు:—'కృష్ణరాయలు మంచి నయశాలి. వారికి లేఖలంపినది వారిని ధనకు సుముఖులను

10. *F. E. p 325, N. 3*

11. 'జెమెల్లుకో' యనునది నిజాముల్ ముల్కను కాభాసరూపమని యా మాటలకు గల పోలికయే విదితము సేయుచున్నది. ఇంతే కాక జెమెల్లుకో సోదరి నాదిలుఖానుడు పెండ్లాడెనట్లు న్యూనిజు వక్కాణించి యున్నాడు. (*F. E. W. 326*); దీనిని రుజువుసేయు సాక్ష్యము లభ్యపడలేదు; కాని ఫెరిష్టా గ్రంథమునందు క్రీ. శ. ౧౫౧౦ మొదలు ౧౫౫౩ వఱకు రాజ్యముచేసిన మొదటి బుర్హాన్ నిజాం శాహు ఇస్మాయీలు ఆదిల్ ఖానుని తోబుట్టువగు మరియం బేగమును వివాహముజేసికొన్నట్లు వ్రాసియున్నాడు. మఱియు నీ వివాహము జరిగినది క్రీ. శ. ౧౫౨౮-వ సంవత్సరముననియు దెల్పియున్నాడు. (*Briggs-Ferishta III pp 51-2*) దక్కను మహమ్మదీయ ప్రభువుల కుటుంబములలో నుండెమార్పు పెండ్లిండ్లు పెక్కు జరిగినట్లు చరిత్రగ్రంథములవల్ల దెలియ వచ్చుచున్నది. కావున న్యూనిజు చెప్పినట్లు ఆదిల్ఖానుడు జెమెల్లుకో (నిజాముల్ ముల్క)ని తోబుట్టువును బెండ్లియాడి యుండినను నుండవచ్చును.

జేసికొనుటకొఱకే. వారి దళముల సహాయ మాతని కావశ్యకము గాకపోయినను, సౌహార్ద మభిలషింపవలసి యుండెను. వారంద ఱాదిల్ఖానునితో నేకమైన రాయ లాతని నారీతి జయించి యుండజాలడు. ఆదిల్ఖానుఁడు దమకంటె బలాధికుఁడగుటచే నతనితోడ వారు ద్వేషము వహించిరి. తురకలలో విశ్వాస మల్పము; కుక్కలవలె నొకరిపై నొకరుబడి పెనుగులాడుదురు; ఒండొరుల నాశమును బూని నపేక్షింతురు.' 12 కృష్ణరాయలు వదలిచినట్లైతే పై జేర్కొనిన తురకదొర లెవ్వరును ఆదిలుఖానునకు దోడ్పడరైరి. కాని నిజాముల్ ముల్కుమాత్ర మాతఁడు నిజసోదరీ భర్త యగుటచే గొంత దండంపక తప్పినదికాదు.13

<u>దళనాయకులు, దళసంఖ్య:</u>—రాయలవెంట రాయమూరుపై నడచిన ముఖ్యదళనాయకుల నామములను, వారినాయకత్వముక్రింద నుండెన గజతురగ పదాతిసంఖ్యను న్యూనిజు వివరించియున్నాడు:—

(1) కామానాయకుఁడు. ఇతఁడు రాయల కొలువునందుండిన మహమ్మదీయ సైనికుల కధిపతి. విలుకాండ్రేమి, ఖేటకధారులేమి, గడలవారేమి, తుపాకిబంట్లేమి—ముప్పదివేల కాల్బలమును, వేయి గుఱ్ఱములును, నాలుగజములును, నతని యాధిపత్యము క్రింద నడచినవి. (2) త్రియంబకరావు, ముప్పదివేలు కాల్బము, రెండువేల గుఱ్ఱములు, ఇరువది యేనుగలతో డను; (3) తిమ్మప్పనాయకుఁడు, అఱువది వేల కాల్బలము, మూడువేల గుఱ్ఱములు ముప్పదియేనుగలతోడను; (4) ఆదెప్పనాయకుఁడు లక్షకాల్బలము, ఐదువేల గుఱ్ఱములు, యేబదియేనుగులతోడను; (5) కొండమరసు లక్ష యిరువదివేల కాల్బలము, ఆఱువేల గుఱ్ఱములు, అఱువది యేనుగులతోడను; (6) కొమర ఎనుబదివేల కాల్బలము, రెండువేల యేనూఱు గుఱ్ఱములు, నలువది యేనుగులతోడను; (7) విజయనగరపాలకుడగు సాళువగోవిందరాజును అతనిదళవాయియు ముప్పది14 వేల కాల్బలము వేయిగుఱ్ఱములు బది యేనుగుల తోడను; (8) రాయల యనుగు కొజ్జాలు ముప్వ్వరు నలువదివేల కాల్బలము వేయిగుఱ్ఱములు పదునైదేనుగులతోడను; (9) రాయల యడపము 15 పదునైదు వేల కాల్బము, రెండు వందల గుఱ్ఱములతోడను;16 (10) కొమారవీరయ యెనిమిది వేల కాల్బలము, నాలుగు వందల గుఱ్ఱములు, నిరువది యేనుగులతోడను, యుద్ధమునకు నడచిరి. (11) బంకాపురాధిపతిదళములును బహుసంఖ్యాకులైన దొమరు పురప్రజలును మఱియొక మార్గమున బోయిరి.17 ఇరుగాక మఱికొంద ఱీయుద్ధమున బాల్గొనినవారు. శాసనములందు చేర్కొనబడి యున్నారు. మాధవవర్మ వంశజుడు కంఠమరాజు

---

12. *F. E. W. 326.*

13. *Nuniz, F. E. W. 326*

14. న్యూని జితని పేరును ఒగెంద్రహో. (*Ogemdraho*) అని వ్రాసియున్నాడు; కాని పయసు ఇతని పేరు గండరాజో యనియు నితడు సాళువ తిమ్మయ సోదరుడనియు జెప్పియున్నాడు (*F. E. W. 284*). సాళువ తిమ్మయసోదరుని సరియైన నామధేయము సాళువ గోవిందరాజని శాసనములవల్ల దెలియుచున్నది.

15. న్యూని జితని పేరు చెప్పలేదు. సూయె లిట్లు వ్రాసి యున్నాడు. 'రాయరాజ్యము విచ్ఛిన్నమైన పిదప, మధురయందు స్వతంత్రులై పాలించిన యచటి మహా సామంత ప్రభువులు రాయల యడపము వాని వంశజులని బర్రాడాసు చెప్పియున్నాడు.' (*F. E. W. 227, N 3*) ఇందువలన మధురనాయకుల పూర్వీకుఁడే ఇచట పేర్కొనబడిన యడపమని సూయె లభిప్రాయపడిన ట్లున్నది. అడపము డెబ్బదిరెండు నియోగములలో నొక్కటి. ఈ పదమున నం దేక కాలమున పెక్కండ్రు నియుక్తులై యుండ వచ్చును. మఱియు బర్రాడా సే రాయలకడ మధురనాయక రాజుల మూలపురుషు డడపగాడై యుండెనో చెప్పలేదు. మధురనాయకరాజ వంశ స్థాపకుఁడైన విశ్వనాథ నాయకుఁడు కృష్ణ రాయల కడపటి రాజ్యవర్షములందు బళ్లారి మండలములోని పాలకల్లుగ్రామము నమరముగ ననుభవించుచుండెను. ఇతఁడు అడపము చిననాగినాయని కొడుకు (*Fwrther Sowrces I. W. 175*). ఇందువల్ల చిననాగినాయడు కృష్ణరాయల యడపగాండ్రలలో నొక్కఁడని నిశ్చయమగుచున్నను, నతడే న్యూని జిట చేర్కొన్న యడపగాడని చెప్పుటకు వీలు లేదు.

16. ఇతని కేనుగులు లేవు.

17. *Nuniz F. E. pp 326-27.*

సింగరాజొక్కఁడు.18 ఆపత్సహాయాభిధానుఁడు చోళమండల బ్రాహ్మణుఁడు మఱియొక్కఁడు.19 దీనివల్ల రాయలదళనాయకులును సామంతులుమాత్రమె కాక సామ్రాజ్యమునందు పేరెన్నికగన్న యోధులనేకు లీ దండయాత్రయందు పాల్గొనినట్లున్నది. మఱియు పోర్చుగీసులు పెక్కండ్రుభయపార్శ్వములవారికిని తోడ్పడిరి. వీరియందు క్రిస్టొవాన్ డి ఫిగ్గెరెడో యను నశ్వవ్యాపారి ప్రముఖుఁడు. ఇతనిక్రింద తుపాకులవా రిరువదిమంది రాయలతోఁగూడ దండయాత్రకు నడచిరి. ఫిగ్గెరిడో రాయచూరు దుర్గమును సాధించునప్పుడు రాయల కమూల్యమైన సేవ యొనర్చెను. ఇట్లు రాయచూరుపై నడచిన రాయసైన్యమునందు రెండులక్షల ముప్పదివేల పదాతులును, ముప్పదిరెండువేల యాఱువందల గుఱ్ఱములును, నైదువందల యేఁబదియొక్క గజములు నుండెనని న్యూనిజు లెక్కనుబట్టి తెలియుచున్నది. దండయాత్ర నడచునప్పుడు వలసిన వస్తుసామగ్రులను నితరపదార్థములను సరఫరా సేయు వర్తకులును, సేవజేయు రజక క్షురకాది పరిచారకులును, విలాసినీబృందమును లెక్కకు మిక్కుటమై యుండెనట. ఇట్టి ప్రచండ సైన్యముతో గూచిచేసిపోయి కృష్ణరాయలు రాయచూరుదుర్గముచుట్టును ముట్టడి దిగెను.

---

18. *S, I. I. IV. 789.*

19. *ARE.* *47 of 1906.* తిరుక్కడవూరు అమృతఘటేశ్వరాలయమును ఆపత్సహాయుఁడను బ్రాహ్మణుడు కృష్ణరాయల కాలమున విషయ (వృష) సంవత్సరమున ననగా శకాబ్దము ౧౪౪౩ (క్రీ. శ. ౧౫౨౧-౨౨) న బాగుచేయించెను. అతడు ఇరాచ్చూరు విజైయా నగరములకడ నిజపరాక్రమ ప్రదర్శనమువలన కృష్ణరాయలను మెప్పించితి నని చెప్పుకొని యున్నాడు.





నవల:

# శాఫో



## అల్ఫాంజ్ డాడె(ట్)

### 5

వాళ్ళ గదిలో కేస్సు టిస్సాట్ గీసిన ఫానీ రూపచిత్రం ఒకటి, చక్కనిదుంది. ఆమె పూర్వ వైభవ చిహ్నాలలో మిగిలిన శిథిలావశేషం అదొక్కటే. ఆ బొమ్మ ప్రక్కనే పల్లెటి ప్రకృతి దృశ్యఛాయా చిత్రం ఒకటి వేలాడుతూంది. ఎవరో పల్లెటి ఫొటోగ్రాఫర్, ఎంతోపట్టాన ప్రథమ ప్రయత్నంగా తీసిన ఛాయా చిత్రంలాగుంది.

కొండచట్టు ప్రకృతి. కొండ దిగువభాగం రాళ్ళు పేర్చి గోడకట్టినట్టు దిమ్మకట్టుగా ఉంది. ద్రాక్షతీగెలు కొండప్రక్క అంతా ఒత్తుగా ఆవరించుకొంటూ కొండపైకి ఎగబాకుతున్నాయి. ఆ పైన తమాల వృక్షాలబారులు, వాటి వెనుక ఒక చిన్ని తాళవృక్షాలతోపు. అక్కడే ఎండలో ఆకులు మిలమిలలాడించుకొంటూ ఉన్న కదంబ వృక్షాలు. ఆ వృక్షాల నొరుసుకొంటూ, ఉత్తరపు గాలుల తాకిడికి వాట్లను రక్షగా కైకొంటూన్న ఒక పెద్ద భవనము. భవనంగోడలు తెల్లగా సున్నపుపూతలో ఉన్నాయి. ఆ యిల్లు సగం కోటదివాణంలాగా; సగం రైతు గృహాంగణంలాగా ఉంది. ఇంటిముందు వరండా, ఎత్తైన మెట్లవరుస, మకరతోరణాలంకృతమై దారుచెక్కడాలతో అలరారుతోన్న సింహద్వారం తలుపులు. అటుయిటూ కేసురురంగు గోడలు అంతా పల్లెటూరి దివాణంలాగా ఉంది. వెనుకగా గొడ్లసాలలు; వాట్లల్లో నాగళ్ళు మొదలైనవి మసకమసకగా కనబడుతున్నాయి. భవనం చుట్టూ సెమిళ్ళకోసం కట్టిన దిమ్మలలా ఉన్న, శిథిలమైన కోట బురుజాలూ, నిర్మలాకాశంలో, వాతావరణాన్నంతా ఆకట్టుకొంటున్నట్టు కనబడుతూ ధ్వజాకారంలో ఉన్న కోట గాలిగోపురమూ, వరుసతీరిన ఇళ్ళకప్పులూ, బొమ్మలో కనబడుతున్నాయి.

ఆ కోటలోనే అనాదికాలంనుంచీ, గాసిన్ డి ఆర్మండీల కుటుంబం నివసిస్తూ వచ్చింది. ఆ భవనాన్ని, జమీనీ, కాసిలెట్ అనేవారు. కాసిలెట్ జమీ ద్రాక్షతోటలకు ప్రసిద్ధి. ఆ తోటలు, దొడ్లూ, పొలాలూ, ఆ జమీ అంతా, ఒక తరంనుంచి మరొక తరానికి సంక్రమిస్తూ అవిభక్తంగానే నిలుస్తూ వచ్చింది. ప్రతి తరమూ, పిల్లలంతా ఉమ్మడిగా ఆ ఆస్తినంతా అనుభవిసూవచ్చారు. ప్రతి తరంలోనూ పెద్ద కొడుకు, రాచరికపు కొలువులో, విదేశోద్యోగిగా పోవటం ఆ యింట ఆనుమాయితీగా వస్తూంది. జమీ నిర్వహణభారం అంతా ప్రతి తరంలోనూ పూర్తిగా చిన్న కొడుకుమీద పడేది.

ఈ ఆనువాయితీలను, కులసాంప్రదాయలను, ఒకొక్కప్పుడు ప్రకృతి సహించలేనట్లు ప్రవర్తిస్తుంది. జమీన్‌దారీ నిర్వహణకు ప్రపంచంలో అనర్హుడంటూ ఎవరైనా ఉంటే—ఒక్క జమీన్‌దారీసే కాదు, అసలు ఏ పని నిర్వహించటానికైనా అసమర్థుడెవడైనా ఉన్నాడంటే, సీజేర్ గాసిన్ అనే చెప్పాలి. ఇంటికి పెద్దవాడైన అన్న కౌన్సులర్

ఉద్యోగిగా విదేశాల కేగటంతో జమీనిర్వహణ భారమంతా ఇరవైనాల్గేళ్ళ అతనిమీద పడ్డది.

సంగోష్ఠీ పురుషుడు, స్త్రీ లంపటుడు, జూదరి, పల్లెటి నిక్కచ్చ ద్యూతగృహాలన్నిటా ప్రసిద్ధుడు, సిజేర్, ఆగమ్యగోచరిగా, ఎందుకూ పనికిరానివాడుగా ప్రసిద్ధికెక్కాడు. అతని చిన్ననాడే ఊరంతా "షోకేలా" అని అతనికి పేరుపెట్టేశారు. ఎంతటి శిష్టాచార, సత్సాంప్రదాయిక కుటుంబాలలోనైనా కూడా, ప్రకృతి, కొన్ని కొన్ని తరాల కొకొక్కణ్ణి అల్లాటివాణ్ణి సృష్టించి, ఆ రూపేణా, అక్కడ పేరుకొన్న కశ్మలాన్ని బైటికి కొట్టేసి, ఆ రక్త సాంప్రదాయాన్ని సంరక్షిస్తూ వస్తుంది.

స్వేచ్ఛగా, నిర్లక్ష్యంగా, ఊరి క్లబ్బులలో పేకాటలలో ఉన్న డబ్బంతా జూదమాడుస్తూ, ఉచితానుచిత జ్ఞానం లేకుండా డబ్బు విరజిమ్ముకుంటూ గుబారా చేస్తూ, సిజేర్ పెరగటం మొదలెట్టాక కొద్ది నాళ్లలోనే, ద్రాక్షతోటలన్నీ తణఖాలలోకి వచ్చేసి, ద్రాక్షపానీయ భండారమంతా వట్టిపోయి, ఏయేటి పంట ఆ యేటికి పంటకుముందే జట్టీకి అమ్ముకం అయిపోతూవచ్చి, సిజేర్ వీధిని బడవలసిన స్థితి వచ్చింది. సిజేర్ అన్న, షాంఘైలో కాన్సల్‌గా ఉంటూండేవాడు. సిజేర్, అన్న సంతకం ఫోర్జరీ చేసి, అక్కడి కాన్సులేట్ మీద నూరు హుండీలు పుట్టించాడు. అవి చెల్లుబాటు కొచ్చేనాటికి ఎక్కడో డబ్బుపుట్టించి చెల్లించుకోగలననే నిజంగా నమ్మాడు. కాని అవి అన్నగారిదగ్గిరకు షాంఘై చేరేటప్పటికి, వాటితోపాటు తమ్ముడి ఉత్తరం, తన ఫోర్జరీ, తన దివాళాస్థితి విన్నవించుకొంటూ వచ్చింది. కాన్సల్ కప్పుడప్పుడే ఉద్యోగంలో పురోభివృద్ధి సూచనలు కనబడుతున్నాయి. కాని ఈ ఉత్తరం, తమ్ముడి ఫోర్జరీ హుండీలు, ఒకేసారి కాన్సులేట్ కివచ్చేటప్పటికి, తమ్ముని అసమర్థత తత్తరపాటు కల్గించింది. కిమ్మనకుండా ఆ హుండీలు చెల్లించి, ఉద్యోగం విరమించుకొని దివాణానికి తరలి వచ్చాడు. అక్కడే ద్రాక్షతోటలు, పొలమూ పుట్రా చూసుకొంటూ స్థిరపడిపోయాడు.

ఈ అన్న నికార్సైన గాసిన్. కులసాంప్రదాయం, శిష్టాచారం ఇవి పిసమెత్తుకూడా తొలగకూడదనే ఛాందసుడు. పైకి ఎంత శాంతుడో, లోపల అంతటి ప్రచండుడు. చల్లారిపోయికూడా, మళ్ళీ ఏ నిమిషం ప్రబ్బలవుతుందో అనిపించే అగ్ని పర్వతంలాగా, భీభత్సం స్ఫురింపచేస్తాడు. శ్రమజీవి. ఒళ్లు దాచుకోకుండా నిత్యం కష్టిస్తాడు. వ్యవసాయంలోకూడా మంచి అభిరుచి ఉంది. అతని పుణ్యమా అని మళ్ళీ దివాణం తేరుకొంది. రోన్నది తీరందాకా వాళ్ళపొలాలు, తోటలు విస్తరించాయి. కష్టాలలాగే సుఖాలుకూడా పరంపరలుగానే వస్తాయి. ఆ సమయంలో ఆ కదంబవనంలో, యింటికి జ్యేష్ఠ కుమారుడుగా జీన్ జన్మించాడు.

ఆ రోజుల్లో 'షోకేలా', పశ్చాత్తాప భారంతో కృంగిపోతూ, ఇంటిచుట్టూ తోటలలోనూ దొడ్లలోనూ కాలుగాలిన పిల్లిలా తిరుగుతూండేవాడు. ఆ అన్న మొగం కన్నెత్తి చూసేటానికే అతనికి ధైర్యం చాలేదికాదు. అన్న వదనంలోని తిరస్కారముద్ర నిత్యం అతన్ని కుమిలించివేసేది. ఇంటిలో ఊపిరాడనట్లయి, పొలాలకో నదిగట్టుకో పోయి, కాస్త గాలిపీల్చుకొగలిగేవాడు. ఏ చేపలు పట్టటమో, నత్తలు పట్టటమో, అడవిలో జువ్వలు ఏరి చేతిబెత్తాలుగా చెక్కటమో, ఏదో పనిగానిపని కల్పించుకొని, అరుబయళ్ళలోనే ఏ కోచబియ్యమో చేపలో కాల్చుకు ఫలహారం చేస్తూ, మనోవ్యథను క్షయింపచేసుకొంటూ కాలం వెళ్ళబుచ్చుకోవటం చేసేవాడు. రాత్రి అన్నతోపాటు పంక్తికి భోజనానికివచ్చేటప్పటికి నోరు మెదపకుండా కూర్చుని అన్నవంకకు కన్నెత్తకుండా భోజనం ముగించుకుపోయేవాడు. వదినగారు మాత్రం, ఈ అమాయికపు మరిది స్థితిని చూసి జాలిపడ్తూ మగనికి తెలియకుండా చిల్లరఖర్చులకు అతనికి డబ్బిస్తూండేది. మగనికి తెలిస్తే మాట దక్కదని ఆమెకు తెలుసు. "షోకేలా" విషయంలో ఆ అన్నగారు అరవీసమైనా జాలితలచడు. అదైనా మునుపు చేసిన తప్పుల కనికాదు. ముందుముందు వంశానికి అప్రతిష్టగా ఏం అఘాంద్రపు పనులుచేస్తాడోనని. ఆ అన్న భయపడ్డట్టే, కుటుంబప్రతిష్ట మంటగలుపుతూ, సిజేర్ మళ్ళీ అపభ్రంశపు పని చేయనే చేశాడు.

దివాణంలో కట్టుపనులూ అవీ చూసేందుకు, ఒక చక్కని పడుచు, వారానికి మూడుమార్లు, కోటలోకి వచ్చేది. వచ్చినప్పుడు రోజంతా పనిఉండేది.

ఆపిల్లపేరు దివోనీ. అబ్రూ అనే పల్లెవాని కూతురు. రోన్ నదీతీరాన్నే వాళ్ళ గుడిసె ఉండేది. ఆ పిల్ల నిజంగా నీటి తామరపూవులాగే, లలితంగా సన్నగా పొడుగ్గా ఉండేది. చిన్న తలకు బిగుతుగాకట్టిన రుమాలు టోపీ రిబ్బన్లు వెనక్కు వేలాడుతూ మెడ వంపుల అందాల్ని నేత్రపర్వ మొనర్చేవి. మొగమూ మెడాకూడా కొద్దిగా సూర్యాతపానికి కాగిన రంగులో ఉండేవి. బుజాలూ చేతులూ, నునుమంచు పూతమెత్తదనంతో అతిలలితంగా కనపడేవి. ఆ కోట శిథిల పరిసరాల్లో ఆమెను చూస్తే, పూర్వం ఆ రాజమందిరాలు వైభవాలతో వెలుగుతూన్న రోజుల్లో, శృంగార రసాధిదేవతలై, నీర సుందర శిఖామణుల కారాధ్యదేవతలై వెలసిన ఈ ఇంటి రాచపడుచులలో ఒకర్తె, ఇల్లా ఈనాడు అవతరించిందా అన్నట్లు స్ఫురించేది.

సీజేర్ ఆమెను చూసి మోహించాడు. ఆ వలపులో ఆ చారిత్రక భావనాప్రసక్తి ప్రమేయాలు లేవు. అల్లాంటి ఆదర్శాలన్నీ నిరక్షరుడైన ఆ అమాయకుడికి అనూహిత విషయాలు. కాని పొట్టివాళ్ళు కొందరికి వలెనే పొట్టి సిజేర్‌కుకూడా, పొడుగాటి స్త్రీలంటే ఆకర్షణ ఎక్కువ. దివోనీని చూచిన మొదటి నాటినుంచే ఆ మోహపుటురులలో చిక్కుపోయాడు.

పల్లెటి శృంగారఘట్టాలు నడపటంలో ప్రవీణత కొంత షోకేలాకు లేకపోలేదు. పల్లెటి వసంతోత్సవాలలో ఏ నృత్యంపేరటో దరిచేరటం, ఏదో ఒక చిన్న కానుక సమర్పించటం, పొలాలలో మొదటిసారి ఒంటరిగా ఆ వలపుకత్తె తటస్థమయినప్పుడు, రాక్షసగాంధర్వవిధానాలలో ఆలోచనకు ఊపిరిసలపనీయకుండా ఆ స్త్రీని కైవసమొనర్చుకొని, అచటి ప్రకృతి కుసుమాయింపులో ఆ స్త్రీని మైమరపించటం—ఈ కలాపం అంతా షోకేలాకు పరిచితమే. కాని దివోనీ అతనితో నృత్యమే చేయలేదు. అత నిచ్చిన కానుక నతని యింటికే సమర్పించింది. ఇక నదిఒడ్డున చెట్లతోపులో అత నామెను ఆలంబించవచ్చినప్పుడు, ఆశక్తిస్వరూపిణి విసిరిన విసురుతో పది అడుగులదూరాన వెల్లికిలా పడిపోయాడు. అప్పట్నించీ ఆమె అతన్ని దూరస్థంగానే ఉంచసాగింది. మితిమీరి వస్తుందన్నప్పుడు తన ఒడ్డాణంలోని కత్తెర చూపించేది. ఆ వలపుతో అతని కంతకంతకు మరీ పిచ్చెత్తిపోసాగింది. ఆపిల్లను పెళ్ళిచేసుకొంటా నన్నాడు. పోయి వదినగారికి తన గోడంతా విన్నవించుకొని ఆ పిల్లనిచ్చి పెళ్ళి చేయమని బ్రతిమాలాడు.

గాసిన్‌సతి, దివోని అబ్రూను, చిననాటనుంచీ ఎరుగును. చాలా జాగ్రత్తగల పిల్ల అనీ, సచ్ఛీల అనీ, చాలా మంచిదనీ ఆ పిల్లమీద ఆమెకు మంచి అభిప్రాయముంది. అందుచేత పెళ్ళైతే ఈ పిల్ల అయినా "షోకేలా"ను సన్మార్గంలో పెట్టి తరింపచేయగలదేమోనని ఆమె ఆశపడింది. కాని, కూలిపిల్లను తన వంశీకుడు పెళ్ళిచేసుకోటం కౌన్సల్‌కు గౌరవహీనంగా స్ఫురించింది. "సీజేర్ ఈ పని చేస్తే ఇక మళ్ళీ వాడిమొహం చూడను" అన్నాడు. ఆమాట నిలబెట్టుకొన్నాడు.

పెళ్ళిచేసుకోగానే, సీజేర్ దివాణంవిడిచి అత్తవారింటికి మకాం మార్చి, అన్న నెలనెలా ఇచ్చే స్వల్పభరణంతో జీవితంగడపసాగాడు. దివోనీతండ్రిది రోన్‌నది ప్రక్కనే చేపలవాళ్ళ గుడిసెల మధ్య ఒక చిన్నగుడిసె. నెలనెలా సిజేర్‌కు అన్నగారిచ్చేభత్యం అందచేయటానికి వదినగారు అక్కడికి వెళ్తూ ఉండేది. తల్లితోపాటు జీన్‌కూడా అక్కడికి వెళ్తూండేవాడు. మధ్యన ఒంటినిట్రాడుఆధారంగా గుండ్రంగా ఆకులతో కట్టినగుడిసె. ఏ మాత్రం గాలి వేసినా గుడిసెఅంతా కదలాడిపోతుండేది. లోపల కూర్చుని గుమ్మంలోనుంచి చూస్తూంటే, రేవుఒడ్డున ఎండబెట్టిన చేపలవల్లో ముత్యపుచిప్పల్లా ఎండు చేపపొలుసులు మిలమిలా మెరుస్తూండేవి. ఒడ్డున కొయ్యపాతి కట్టిన పెద్ద పడవ లొకటిరెండు అలలతో లేస్తూపడుతూ, అవి బిగలాగినప్పుడల్లా ఆతాళ్ళు కిఱ్ఱు కిఱ్ఱుమంటూండేవి. నది సువిశాలంగా ప్రవహిస్తూ తళతళలాడ్తూ, చల్లనిగాలి వీచినప్పుడల్లా, నదిమధ్యనున్న ఆకుపచ్చని లంక చేలతోపాటు, నది తీరాలుకూడా ఒక్క అలగా అటునించి ఇటు కదుల్తూ బహు రమ్యంగా కనబడుతూండేవి. ఆ చిన్ననాడే అక్కడ ఆ పరిసరాలను చూస్తూంటే, సముద్రయానాలుచేసి దూరదేశాలన్నీ తిరిగి రావాలన్న కాంక్ష జీన్‌లో ప్రబలం కాసాగింది.

సిజేర్ బాబాయి ఈ ప్రవాసజీవితం, రెండు మూడేళ్ళు గడిచింది. ఇక ఎప్పటికీకూడా అంత

మనకపోయేదేమో! కాని వివాహం కుటుంబపరిస్థితుల వల్ల మళ్ళీ అతను యింటికి రావటం జరిగింది. జీన్ తల్లి కవలపిల్లలను కన్నది. మార్తీ, మేరీ. ఈ కాన్పుతో తల్లి జబ్బుపడ్డది. మరదీ, తోడికోడలు ఆమెను వచ్చి చూడ్డానికి అనుమతి సంపాదించుకోగల్గారు. అంతటితో అన్నదమ్ము లిద్దరిమధ్యా, నిర్హేతుకంగానే, స్వతస్సిద్ధంగా ఉండే రక్తస్పర్శబలిమి వలన, మళ్ళీ సామరస్యం కుదిరింది. అప్పటినుంచీ కుటుంబం అంతా "కాసిలెట్" లోనే నివసించ సాగింది.

పాపం ఆ తల్లికి ఆ రోగం కుదరలేదు. పాండువ్యాధిగా మారి పురాణవ్యాధై, కీళ్ళవాతంతో ఆమె మంచంపట్టే ఉండవలసివచ్చింది. ఇక ఇంటి పెత్తనమంతా విధాయకంగా దివోనీమీద పడింది. ఇంటిపనులన్నీ చూసుకోటం, పిల్లలకు తిళ్ళుతిప్పలూ చూడటం, పాలేళ్ళను కూలీలను కనిపెట్టుకొని రావటం ఈ బాధ్యతలన్నీ దివోనీమీద పడ్డాయి. జీన్ ప్రక్కనే ఆవిగ్నన్‌లో బడిలో చేరాడు. వారానికి రెండుసార్లు వెళ్ళి, అతని మంచీ చెడ్డా కష్టం, సుఖం విచారించి, అతని సౌఖ్యాలు సరిచూడటమంతా దివోనీయే చేసేది. ఇన్నిటితోపాటు నిత్యం జబ్బుతో ఉన్న తోడికోడలు అవసరాలన్నీ కనిపెట్టి సపర్యలు చేస్తూండేది.

దివోనీ, వస్తుతః మనోబలమూ, పెత్తందారీతనానికి కావలసిన చాకచక్యమూ, కలమనిషవటంచేత, చదువు సంధ్యలు లేని లోటును సహజంగా ఉన్న తెలివితేటలతో పూరించుకొంది. షోకేలా ఆమె శిక్షణలో కొత్త బుద్ధి కుదిరి త్రోవనుపడ్డాడు. అతని దగ్గరకూడా చదువుల సారాలు కొంత అటూఇటూగా దివోనీ నేర్చుకొంది.

ఇంటిఖర్చు కరామతు విషయాలన్నీ బావగారు ఆమెకే వదలిపెట్టాడు. నానాటికి ఖర్చులు పెరుగుతూ, ఆదాయం తగ్గి కుటుంబనిర్వహణం భారమౌతూ వచ్చింది. ద్రాక్షకు వేరుపురుగుపట్టి ప్రతియేడూ పంటలో నష్టం రాసాగింది. ఆసీమ తోటలన్నిటా ఆపురుగు పాకింది. కంచెకట్టినతోటలు కొద్దీ మాత్రం, పురుగుబాధ అంతలేకుండా కొంతకొంతబాగున్నాయి. కౌన్సల్‌కు పొద్దస్తమానం, ద్రాక్షలకుపురుగు పట్టకుండా కాపాడటం ఎలా, అన్నదే వ్యాసంగము. ఆ పరిశోధనలలో నిత్యం నిమగ్నుడై ఉండేవాడు.

దివోనీ అబ్బా, ఏ వేషంతో ఆ యింటికి ముందు వచ్చిందో, ఆ తలరుమాలు, మొలను తాళం చెవులరింగూ, కత్తెర, ఆ వేషాని కనుకూలంగానే ఆ యింట స్థిరపడిపోయింది. ఇంటికి పెద్ద పనికత్తెగానే, ఇంటిపెత్తనదారుగా, తోడుకోడలికి చెలికత్తెగా ఉంటూ, ఇంటి విషయం సర్వస్వమూ చూచుకొంటూ, జబ్బుగా ఉన్న యిల్లాలుకు ఏ లోపమూ - మందులో మాకులో పథ్యంలో - ధనాభావంవల్ల జరగకుండా కనిపెడ్తూ, పిల్లలకు తల్లి సంరక్షణలేదన్న లోపం కనబడనీయకుండా, సర్వమూ సమకూర్చిపెడుతూ, జీన్ చదువు ఏమాత్రం వెనుకబడకుండా హైస్కూలు చదువులోనూ, తరువాత ఎయిక్స్‌లో లా చదివేటప్పుడూ, తర్వాత పారిస్‌లో కాన్సులేట్ డిగ్రీ చదువు రోజుల్లోనూ, కావలసిన డబ్బు సకాలానికి అందజేస్తూ, ఇంటికి పెద్దదిక్కుగా సమర్థంగా వ్యవహరించేది.

ఇంత క్రమబద్ధంగా, ఇంత జాగ్రత్తతో, ఏ మంత్రబలంతో ఆమె నిర్వహించుకు రాగలుగుతున్నదో, ఇతరు లెవ్వరికి తెలియదుసరిగదా, ఆమెకు కూడా సరిగ్గా తెలియనే తెలియదు. కాని జీన్‌కు 'కాసిలెట్' విషయం జ్ఞప్తికివచ్చినప్పుడల్లా, వెలిసిపోయిన ఆ ఫొటోగ్రాఫ్ చూచినప్పుడల్లా, మొట్టమొదట మనసులో ఆ రూపం, మొట్టమొదట నాలుకకు తగిలే పేరు-దివోనీ. ఆ విశాలహృదయ, ఆ అమాయక పల్లెపడుచు, కేవలం తన మనోదార్ఢ్యంచేతనే ఆ యింటిని నిలబెడుతూ, అతని మనోనేత్రంలో ఇల్లంతా ఆమెయేయై ఆవరించుకొని ఎక్కడబడితే అక్కడ కనబడుతూవుంది.

కాని యీ మధ్య కొన్నాళ్ళనుంచీ, తన ప్రియురాలు ఎల్లాంటిదో తెలిసినప్పటినుంచీ, ఆ ప్రియురాలి సమక్షంలో, ఆ పవిత్రధామంగాని, తన తల్లి, చెల్లెళ్లు, యింటి విషయం ఏదిగాని, పెదవిదాటనీయకుండా గడుపుతూ వచ్చాడు. శాఫో మంచానికి దగ్గరగా ఆ ఇంటి ఫోటో ఉండటంకూడా, చాలా అస్తవ్యస్తంగా కనబడి, దానివంక చూడటానికే అతనికి సిగ్గుగా ఉండేది.

* * *

ఒకనాడు సాయంత్రం అతను ఇంటికివచ్చేటప్పటికి, బల్లమీద ముగ్గురికి భోజనం అమర్చిఉంచ

టంచూసి ఆశ్చర్యపోయాడు. వెంటనే తను గుర్తు పట్టలేని ఒక పొట్టి మనిషి, ఫాన్నితో పేకాడుతూ కూర్చోటం చూసేటప్పటికి ఆ ఆశ్చర్యం ఇనుమడించింది. ఇంతలో ఆ పొట్టి మనిషి ఇటుతిరిగి, చింబోతుకళ్ళూ, పెద్ద ముద్దుముక్కూ, బట్టతలా, పిల్లిగడ్డమూ, చీకూచింతాలేని ముఖారవిందమూ కనబర్చుకొన్నాడు. సీజేర్ బాబాయి! గాసిన్ ఆశ్చర్యార్థక శబ్దానికిటుతిరిగి, చేతిలో పేకముక్కలు అల్లాగే పట్టుకొని జబాబు చెప్తున్నాడు.

"భలే కాలక్షేపం, చూశావురా! నేనూ కోడలుపిల్లా తములపాకుల ఆట ఆడుకొంటున్నాం."

కోడలు పిల్ల!

తన ఈ సంబంధం నరమానవుడికి తెలియకుండా జీన్ ఇంతా జాగ్రత్తపడ్డాక, తీరా ఇది! బాబాయి ఆమెతో చూపిస్తున్న ఈ అతిపరిచయం, తర్వాత ఆమె వడ్డన కటగాఇటూ తిరుగుతున్నంతసేపూ ఆమె నభినందిస్తూ మెల్లిగా తనతో చెప్తూన్నమాటలూ, అన్నీ, జీన్‌ను విభ్రాంతుణ్ణిచేశాయి. "భలేపిల్లను చిక్కించుకొన్నావురా అబ్బాయి! అదృష్టవంతుడవు! ఏం కళ్ళు! ఆ చేతులో! ఓ భలే చక్కటి చుక్కరా."

భోజనానికి కూర్చుని, ఏం అరమరలు లేకుండా హాకేలా, తమ కౌసిలేట్ వ్యవహారాలూ, తను ఇక్కడికొచ్చినపనీ చెప్పటంతో జీన్‌కు పరిస్థితి మరింత అధ్వాన్నమౌతూ కనబడింది.

సిజేర్ పారిస్ రావటానికి, పాత బాకీ వసూలు ఒకటి మిషగా దొరికింది. మునుపెప్పుడో సిజేర్ కార్బిబేసి అనే స్నేహితుడికి 8000 ఫ్రాంకులు అప్పు ఇచ్చాడు. ఆ డబ్బు తిరిగీ కళ్ళచూస్తానని అత నేనాడూ అనుకోలేదు. కార్బిబేసి చనిపోయాడని సీజేర్‌కియ్యవలసిన 8000 ఫ్రాంకులూ వెంటనే ఇయ్యగలవారమనీ ఒకలాయరు ఉత్తరం వచ్చింది. అసలు అంతకన్న ముఖ్యకారణం ఉంది. డబ్బుకేమొచ్చె, డబ్బు పోస్టులోనే పంపేవారు. "అసలు సంగతి ఏమిటంటే, మీ అమ్మవంట్లో ఏం బాగుండ్లేదురా అబ్బాయి. కొన్నాళ్ళబట్టి రోజురోజూ మరీ చిక్కిపోతోంది. సత్తువ తగ్గిపోవటమే కాకుండా మధ్యమధ్య మతి చెదరటంకూడా జరుగుతూంది. అన్నీ మర్చిపోతుంది. పిల్లలపేర్లుకూడా మర్చిపోతుంది. మొన్న ఈ మధ్య మీ నాన్న తన గదిలోంచి బయటికివస్తే డెనీసీని "ఎవరు ఈ పరార్ద్ర హృదయుడు? పాపం నన్ను చూడటానికి చాలా మాట్లు వస్తున్నాడు?" అని అడిగింది. ఆ మతిభ్రమణం ఎవరూ కనిపెట్టనేలేదు. డెనీసీ ఒక్కతే కనిపెట్టింది. నన్ను రహస్యంగా పిలిచి సంగతి చెప్పి డాక్టర్ బూచరూ దగ్గరకు వెళ్ళి, మీ అమ్మ వైద్యం విషయం అడిగిరమ్మంది. మునుపు ఆ పిచ్చి జబ్బుచేస్తే ఆయనే వైద్యం చేశాడు."

"మీ కుటుంబంలో మునుపెప్పుడైనా ఎవరికైనా పిచ్చియెత్తటం ఉందా" అంటూ ఫాన్ని మహానిదానంగా, కులాసాగా, తన లాగూర్నెరీ భంగిమంలో అడిగింది.

"ఎప్పుడూలేదు" అని, చిలిపినవ్వు మొగం అంతా చిందించుకొంటూ, తనుమాత్రం చిన్నప్పుడు కొన్ని పిచ్చపిచ్చ చేష్టలు చేసినట్టు చెప్పాడు. "అయితే, ఆ పిచ్చి ఆడవాళ్ళకు నచ్చేదేలే. అందుకని మన్ని ఇంట్లోపెట్టి గొళ్ళెంవేయాల్సిన అవసరం కలుగలేదు."

ఆ ఇద్దరివంకా చూస్తూంటే జీన్‌కు కడుపులో చెయ్యిపెట్టి దేవేస్తున్నట్లుంది. తల్లి విషయమైన దిగులొక్కటే కాదు. ఆ మాతృదేవినిగూర్చి, ఆ పండు వయసులో ఆమెకు కలిగిన ఈ క్లిష్ట పరిస్థితులగూర్చి, ఈ ఆడది, బల్లమీద మోచేతు లాన్చుకొని, చేతుల్లో సిగరెట్టు తిప్పుకొంటూ, అన్నీ తెలిసిన అరిందాలాగా, ఎబ్బెరికం లేకుండా, అయినమాట, కానిమాట అన్న విచక్షణలేకుండా, సంపూర్ణభాషా స్వాతంత్ర్యంతో మాట్లాడుతూండటం, ఆ దుర్వార్త శ్రవణం కన్నా మరింత భరింపరాని బాధగా తయారయింది. ఇక అవతల వ్యక్తి, ఉచితానుచిత జ్ఞానం లేకుండా వసపోసిన పిట్టలాగా, తన సహజధోరణిలో వాగుతూ తమ యింటి గుట్టుమట్టులన్నీ ఏమాత్రం సంకోచంలేకుండా బైటపెడ్తున్నాడు.

ఆ! ద్రాక్షతోటలా! ద్రాక్షతోటలు దగ్ధపటలమయ్యాయి. కంచెలున్నవికూడా ఆగటం లేదు. సగంపైగా అప్పుడే పురుగు తినేశాయి. తక్కిన సగం, ఏదో బ్రహ్మాండంమీద కాపాడుకు రావటం అవుతూంది. గుత్తిగుత్తికీ, పండుపండుకూ

రోగిష్ఠిపిల్లాడికి మందులుపోసినట్లు, మందువేస్తూ చికిత్స చేస్తూ కాపాడుకొంటూవస్తూంటే ఆ మాత్రం నిలవటం గగనమైపోతూంది. వాట్లకుపోసేమందులకు బోలెడు ఖర్చవుతూంది. అసలు అన్నిటికన్నా వచ్చిన చావు, అన్న కౌన్సల్, కొత్త ద్రాక్ష మొక్కలే వేసితీరాలని మొండిపట్టుపట్టి కూర్చున్నాడు. కొత్తవి పాతినా నాటినా వెంటనే పురుగుపట్టూంది. అంత కన్న సుక్షేత్రమైన ఆతోటభూముల్నిలా పాడు చేయకుండా, ఏ ఇతర ఫలవృక్షాలు నాటి నా బాగుండేది. ఇప్పుడా నేలంతా ఎందుకూళ్లు ద్రాక్షతీగల చెత్తతో కీకరబాకరగా తయారయి ఎందుకూ పనికిరాకుండా పాడయిపోతోంది.

తను, సిజేర్ మాత్రం, అదృష్టవశాత్తూ, రోన్ నది ఒడ్డునే ఉన్న తన కొద్దిపాటి భూమిలోనూ, ద్రాక్షపంటే, కొత్తగా తను కనిపెట్టిన ఏటిఇసుంపు పద్ధతి ఉపయోగించి లాభంగా పండించాడు. ఆ పద్ధతి ఫలే కొత్తపద్ధతి. అయితే ఏటిపల్లపు భూమికి 'లాయికే'గాని ఎగువ భూములకు ఉపయోగించదు. ఇప్పటికే ఒకపంట బాగాపండింది. సారాయంలో నూటుకూడా కొంచెం తక్కువనుకో; కౌన్సల్ వెక్కిరింతగా ఆ సారాయాన్ని, "గుంటనీటి" సారాయి అంటాడు. అయితే షోకేలా మాత్రం పెంకి ఘటంకాదూ! ఈ ఎనిమిదివేలూ పెట్టి లంకపొలం కొంటాడు.

"రోన్‌నదిలో గట్టుకివద్దర లేదురా, అబ్బా దగ్గర, వెందటిలంక, అదిరా అబ్బాయ్, అది కొంటాను. కాని ఒకేయ్ రహస్యం. ఇది మనలో మనమాట. కౌన్సెల్‌లో ఎవళ్ళకీ దీని వాసనైనా తెలులకూడదు సుమా."

"దివోనీకికూడానా, మామయ్యా!" అని ఫాన్నీ చిరునవ్వుతో అడిగింది. పెళ్ళాంపేరు వినేటప్పటికి షోకేలాకళ్ళు చెమ్మగిల్లాయి.

"ఆ! దివోనీ! దివోనికి చెప్పకుండా ఎప్పుడూ ఏపనీ చెయ్యనుగా. అసలు ఆవిడక్కూడా ఇది మంచిదనే నమ్మకం ఉంది. తన సిజేర్-కౌన్సెల్ భాగ్యాన్నంతా నాశనంచేసిన తన సిజేరే-మళ్ళీ దాన్ని బాగుచేయటానికి తలపెట్టున్నాడంటే దివోనీ ఎంతన్నా పొంగిపోతుంది."

జేన్ అదిరిపడ్డాడు. ఇప్పుడా సంగతంతా బట్టబయలు చేస్తాడేమో! ఘోరవ్యవహారం దేశీలూ, ఆ సౌభాగ్య చరిత్రంతా బైట పెడ్తాడా!

కాని సిజేర్ ఆ గొడవలో లేడు. దివోని ఆలోచనలలోనే నిమగ్నుడైపోయి ఉన్నాడు. దివోనీ ఎల్లాంటిదో, తన కెంత సౌఖ్యం చేకూరుస్తుందో, అది అంతా ఏకరువు పెడుతున్నాడు. అదీకాక ఆమె ఎంత అందమైన మనిషని! అద్భుతమైన రూపురేఖల సమ్మోహనాంగి!

"ఇదిగో చూడు, ఫాన్నీ! నువ్వు ఆడదానివి కదా, అందం విషయం ఆడదానికంటికే తెలియాలి. నువ్వే చూడు..." అంటూ పర్సులోనుంచి నిత్యం తనదగ్గిరుంచుకొనే ఒక చిన్న ఫోటో తీసి ఫాన్నీ ముందర పెట్టాడు.

తన పినతల్లినిగురించి జేన్ ఎప్పుడు మాట్లాడినా మాతృభావంతో మాటాడటంవల్లా, ఆమె ఉత్తరాలలో సలహాలలో మాతృవాత్సల్యం చిందుతూ, ఆ దస్తూరీ వంకరటింకర పెద్ద అక్షరాలలో ఉండటం వల్లా, కొంత వయసుమళ్ళిన పల్లెటిగృహిణిగా, ఫాన్నీ ఆమెను మనసులో చిత్రించుకొనిఉంది. అంగుచేత, సన్నగా పొడుగ్గా, నాగరికపు దేహసౌష్టవంతో, అందమైన తలగుడ్డల కట్టులోనుంచి సుకుమారమైన వదనం కనబర్చుకొంటూ, ముప్పదైదేళ్ళ నడివయస్సులో ఉన్న ఈ ఛాయాచిత్రరూపాన్ని చూసేటప్పటికి, ఫాన్నీ సన్నగా అదిరిపడింది.

"ఔను. నిజంగా, చాలా బాగుంది", అంది. పెదవులు ఒగివడిపోయి, కంఠంలోంచి మాట కొత్తగా వస్తోంది.

"ఏం! నిజంగా సమ్మోహనాంగికదూ!" అంటున్నాడు సిజేర్ బాబాయి, ఆ పదం అతనికి మరీ ఇష్టమైనట్లు.

అక్కడినుంచి ముందు వరాండాలోకి కదిలారు. పగలంతా ఎండ మాడ్చిందేమో—వరాండాపైన జింకురేకులు ఇంకా ముట్టుకుంటే కాలుతూనే ఉన్నాయి—ఎక్కడినుంచో చెదురుగావచ్చిన ఒక చిన్న మేఘం, అప్పుడే కొద్దిగా జల్లుకొట్టటంతో గాలి చల్లబడి, కొంత హాయిగా ఉంది. వానచినుకులు జింకురేకులమీదా, షేప్

మెంటుమీదా, చిటపట చిందులు త్రొక్కుతూ ఆనంద నృత్యాలు చేస్తున్నాయి. ఈ హ్లాదంబుద సేచనంతో పారిస్ మందహాస మొనరుస్తున్నట్లుంది. రోడ్లమీది జనసమ్మర్దం, బళ్ళసందడి, ఆ కోలాహల మంతా పైకెగసి ఆ పల్లీయుని తలకెక్కి, మువ్వగంట లాగా ఝల్లగా ఉన్న ఆ కాళీజాగాల్లో సుళ్లు తిరుగుతూ, దాదాపు ముప్పైఏళ్ళక్రితం యౌవన దశలో మూడు నెలలపాటు, తన స్నేహితుడైన కార్బ్బె జన్‌తో పారిస్‌లో అతను గడిపిన దినాలస్మృతులను రేకెత్తిస్తూంది.

అరే, పిల్లలూ, ఏం జల్సాగా వెళ్లాయిఆరోజులు! ఏం మోతఎత్తిపోయేవి! ఒకనాడురాత్రి మారు వేషాల ఉత్సవానికి తామంతా కలిసి ప్రేడో కెళ్లినప్పుడు—కార్బ్బెజేసి కి గుత్తైనషరాయి వేశాడు. తలమీద తురాయి టోపీ పెట్టాడు. అతని ప్రియురాలు లా మోర్నా పాటలపిల్ల వేషం వేసింది. ఆ వేషమే ఆమెను పైకి తీసుకొచ్చింది ఆతర్వాత. కేఫీ నాట్యమేళాలలో, మంచి పాటకత్తెగా పేరు తెచ్చుకొంది. ఇక లిను, సీజర్ చేరదీసిన పిల్లకు 'పెయ్యనాకుడు' అని పేరుండేది—ఈ సంగతులన్నీ చెప్తూ నిమిషనిమిషానికీ ఉత్సాహం అతిశయిస్తూ, ఆ చెవినుంచి ఈచెవిదాకా నోరు తెరుచుకొని కలకల నవ్వుతూ, నాట్యపురాగాలు, కూనిరాగంతీస్తూ తాళం వేస్తూ, కోడలి నడుంచుట్టూ చెయ్యివేసి గిరగిరా తిప్పుతూ, ఆ నాట్యాలన్నీ మళ్ళీ ప్రత్యక్షపురాణం చూపిస్తున్నాడు. చివరికి అర్ధరాత్రి అయ్యాక తను దిగిన హోటల్ "కుజా"కు—పారిస్‌లో అతనికి తెలిసిందీ ఒక్క హోటలే—బయలుదేరాడు. మెట్లు దిగుతూ, పెద్ద గొంతుకతో పాటలు పాడ్తూ, చీకట్లో దోవ చూపెంచటానికి దీపం తెచ్చిన కోడలుపిల్ల కేసి ముద్దులు విసురుతూ జీన్‌ను కేకేశాడు.

"అరే అబ్బాయి—తెలుసుగా! ఈపిల్లదాన్ని ఒకకంట కనిపెట్టి ఉండరోయ్!"

అతను దిగి వెళ్లిపోగానే, ఫాన్నీ వెంటనే దుస్తులు మార్చుకోనేందుకు తన గదిలోకి పోయింది. ఆమె నొసట ఇందాకపడ్డముడి ఇంకా అల్లానేఉంది. ఆ ఆలోచనలే ఇంకా తలలో రేగుతున్నాయి. గది తలుపు తెరిచేఉంది. గదిలోంచి ఇవతల హాలులో పడకకు సిద్ధమౌతున్న జీన్‌తో, అతిమామూలు ధోరణిలో మాట సాగిస్తూంది.

"అన్నట్టు నిజంగా చాలా అందంగానేవుంది, మీపిన్ని. ఎప్పుడూ అవిసనుసరించే మాట్లాడేవాడి వంటే ఇప్పుడు నాకు తెలుస్తూంది,ఆశ్చర్యమేం లేదని! మొగుడి చాటురంకు మహా ఆనినకు—అందులో ఆ 'షోకేలా' రూపం—వాడెవి మోసగించింనంటే—అనుమానం ఏం లేదు."

జీన్ కొక్కసారి ఒళ్ళు మండుకొచ్చినట్టయి కోపంతో విరుచుకు పడ్డాడు. దివోనీ—తనకు తల్లికి మారుతల్లి అయిన దివోనీ! చిన్నపిల్లాడప్పటినుంచి, తనకు నీళ్ళుపోసి, అన్నంపెట్టి పెంచిన దివోనీ! తనకు జబ్బుచేస్తే రెప్పలా కాపాడి రక్షించింది. ఇంత నీచాతినీచమైన కోర్కె ఏనాడూ ఆలనిలో కలగలేదే!

"ఓరి, హోహోయ్ చెప్పాన్!"-తలకట్టులో జడపిన్నులుతీస్తూ నోటినిండా పెట్టుకొని పళ్ళు బిగించుకొని గట్టిగా మాట్లాడుతూంది. "నాకా చెప్తావ్, ఈ కబుర్లన్నీ! ఆకళ్ళు, ఆ పక్షిపుల్లాయ్ చెప్పినట్లు ఆ సమ్మోహన విగ్రహం—నన్ను నమ్మిస్తావ్ గా—వాడి దివోనీ, నీలాటి అందమైన పాలబుగ్గల పడుచు కుర్రాడు దొరికి, ఒక్కయింట్లో ఇద్దరూ నిత్యం తిరుగుతూంటే, నీతిగీతి అంటూ మడిగట్టుకు కూర్చుంటుందేం! నేనొక్కటి చెప్తాను విను, రోన్‌నది పల్లెటిప్రక్కనుందనీ, ప్రపంచంలో మరెక్కడైనా ఉందనీ, ఆడవాళ్ళమంతా ఒకటే అనుకో!"

ఆ మాటలు పూర్తి నమ్మకంతో అంటూంది, తన స్త్రీజాతి అంతా హృదయంలో స్వైరిణులే అనీ, మొట్టమొదటి కోర్కె మొలకెత్తటంలోనే లొంగిపోతారనీ, మనసారా విశ్వసిస్తూంది. అతను కాదనివాదిస్తున్నాడు. కాని అదేసమయంలో స్మృతిపథమంతా గాలించుకొంటున్నాడు. ఏ అమాయికంగా పెట్టుకొన్న ముద్దులోగాని, స్పర్శలోగాని ఎక్కడైనా, ఈ అపార్థ అపాయం శంకించే ఆస్కారముందేమోనని! ఎక్కడా స్ఫురించలేదు. కాని తన మాతృభావ స్వచ్ఛందత్వం చెన్నుతరిగి, ఆ శుభ్ర స్వచ్ఛఫలకాకృతిపై గోటిగీత పడి పాడైనట్లయిపోయింది.

"ఇల్లా చూడు! ఇదిగో విూఊళ్ళోవాళ్ళు పెట్టుకొనేమాదిరి టోపీ!"

తల నున్నగా దువ్వి జడలు అందంగా ఎత్తుగా సిగజుట్టి, రుమాలు ముక్కోణంగా మలచి పిన్నులతో టోపీలాగా తలపై అమర్చింది. అతని పల్లెటిదిక్కున పల్లెపడుచులు దాదాపు అల్లా ముక్కోణాకృతి నున్న టోపీలనే ధరిస్తారు. తెల్లని నీలిపట్టు పడక గౌను, పాలనురుసులాగా ముతెలు పడేట్టు ధరించి, అతని ఎదుట నిలచి కళ్లు మిలమిలా మెరిపించుకుంటూ "దివోనీలా ఉన్నానా!" అని అడిగింది.

కాదు. కాదు, ఏమాత్రం కాదు. అసలు ఆ చిన్నటోపీలో ఆమె ఎవరిలాగా లేదు. అచ్చు ఆమెలాగే ఉంది. ఆటోపీకూడా, ఆనాడు ఆమె నేర విచారణ సమయంలో, ప్రియుడైన దుష్టాయికి వీడ్కోలు చెప్తూ "పర్వాలేదు ప్రియతమా, మళ్ళీ మంచిరోజులు వస్తాయి" అంటూ ముద్దులు విసుర్తున్నప్పుడు ధరించిన టోపీని—ఆమె కప్పుడు మహా అందంగా అమరిందని అందరూ అన్న టోపీని—ఆ పూర్వ వేషాన్ని స్ఫురింపచేస్తోంది.

ఆస్మృతి రేకెత్తగానే, మనస్సు చీకాకై పోయి, దుర్భరంగా తోచి, ఆమె ప్రక్కకు చేరిన మరునిముషంలోనే, ఆ రూపంలో ఆమెను చూడ నిచ్చలేక దీపం ఆర్పేశాడు.

* * *

మర్నాడు ప్రొద్దున్నే, ఆ బాబాయి బడబడలాడుకుంటూ చేతికఱ్ఱ తిప్పుకుంటూ, పెద్దరికం ఒలకపోసుకుంటూ "ఏమట్లోయ్, పిల్లలూ" అంటూ గగ్గోలుగా లోపలకొచ్చాడు. అతగాడు మునుపు, 'పెయ్యనాకుడు' పిల్లతో పారిస్‌లో గడిపినరోజుల్లో కార్చిబేసి ఆ పెద్దరికపుతీరులోనే అతగాడి గదిలోకి గబాలున వచ్చి పలకరించేవాడట. సిజేర్ క్రిందటి రోజుకన్నా మరీ హుషారుగా ఉన్నాడు. హోటల్ 'కుజా'లో నివాసమే ఆ ఉల్లాసం తెచ్చి ఉంటుంది. అంతకన్నా బాకీవసూలువచ్చిన 8000 ఫ్రాంకులూ, జేబులో పర్సులో ఉన్నాయి. ఆ వెబ్బెట్టి రోనేనది లంకను, చెప్పకుండా కొంటాడు. అయితేమటుకు అందులో ఒకటో, అరో, చిల్లర ఖర్చుపెట్టి కొడుకునీ, కోడలునూ, కొత్తకులాసాగా విందుకు తీసుకెళ్ళే అధికారం అతనికి లేదంటూరా!

"మరి డాక్టరు బూచరోదగ్గిర కెళ్ళటంఎప్పుడు" అన్నాడు గాసిన్. ఏక బిగిని రెండు రోజులు ఆఫీసుకు సెలవుపెట్టేందుకు అతనికి ఆస్కారం లేదు. చివరికి చాంప్స్ ఎలీసిన్‌లో అంతా పొద్దున్నే టిఫిన్ తీసుకొని, అక్కడినుంచి తర్వాత మొగాళ్ళిద్దరూ పెద్ద డాక్టరుగారిని చూడటానికి వెళ్లాలని నిర్ణయించుకొన్నారు.

అసలు షోకేలా అనుకొన్నదల్లా కొంటు. దర్జాగా నాలుగుగుఱ్ఱాల పార్టులో, పైన్ పేకీజీలు బండీనిండా అమర్చుకొని, మహా ఆటోపంతో, సెయింట్ క్లౌడులో చూసే జనంఅంతా బిత్తరపోయేటట్లు రోజల్లా విందు జరిపించాలనుకొన్నాడు. అయినా హోటల్ డాబామీద చెట్లనీడల్లో టేబిల్ అమర్చించి, చెట్లఆకుల సందులనుంచి ఎదుటి హోటల్ నృత్యగానాల సంరంభం హాయిగా చెవిసోకుతూ ఆ చెట్ల సువాసనలు ఆస్వాదిస్తూ, కమ్మగా విందారగిస్తూంటే, అక్కడా, అనుకొన్నంత కాకపోయినా, కొంత మజాగానే ఉంది. సిజేర్, ఈ పారిస్ నివాసుల సమ్మోహపరచే ప్రయత్నంలో, అతిగా మాట్లాడేస్తూ మహాగౌరవ మర్యాదలన్నీ జరుపుతున్నాడు. వెయిటర్‌ను నిత్యం కనిపెట్టి మన్నిస్తూ, పాకప్రవీణత నుగ్గడిస్తూ, ఆ తెచ్చిపెట్టుకొన్న సంతోషంలో, దర్బారులో వందిమాగధుల వెంగలితనమంతా అనుకరిస్తున్నాడు. జీన్‌కిది చాలా సంకటంగా పరిణమించింది. అంతకన్నా ఆ మామాకోడళ్ళమధ్య క్షణక్షణాభివృద్ధి పొందుతున్న అతిపరిచయం మరింత బాధ పెట్టసాగింది. ఇవేవీ అతని అదుపాజ్ఞలలో లేకుండా పోయాయి.

ఆ యిద్దరినీ చూస్తే అధమం ఇరవైయేళ్ళనుంచైనా వాళ్ళకు స్నేహం ఉందా అన్నంత చనువుగా ఉన్నారు. ఒక్కొక్క సీసా ఖాళీ అవటంతో, షోకేలా మరింత మధురహృదయుడై పోతున్నాడు. కాసిలెటోనుగురించీ, దివోనీనిగురించి, తమ బుల్లి అబ్బాయి జీన్‌నుగురించీ, అతిఆర్ద్రంగా మాట్లాడుతున్నాడు. తమ బుల్లాడు ఆమెలాంటి స్త్రీతో ఉన్నందుకు తనకు చాలా సంతోషమైందని అన్నాడు. ఆ వివేకవతి అతనేం తెలివి తక్కువ పనులు చెయ్యకుండా చూడగలదని సంతోషిస్తున్నాడు. ఇక వాడు, ఎప్పుడూ ఏదో మనాదిగా

ఉండటం విషయం ప్రసంగిస్తూ, ఆమె చేతులు నిమురుస్తూ ఎంత మెల్లగా చూసుకొంటూ రావాలో, క్రొత్త పెళ్లికూతురుకు చెప్పినట్లు అన్నీ చెప్తున్నాడు. ఆ కైపులో అతని గొంతుక గాద్గదికమౌతూ, మాట ముద్దగా వస్తూ, కళ్లు నీళ్లుగ్రమ్మి పోతున్నాయి.

డాక్టరు బూచరో, ఇంటికి వెళ్ళేటప్పటికి మళ్ళీ కొంత మామూలుస్థితికి వచ్చాడు. డాక్టరు ఇంటిదగ్గిర క్రింది గదులలో రెండుగంటలు పడి ఉండాల్సి వచ్చింది. ఆ గదులు ఎత్తుగా పొడుగ్గా, ఏ వెచ్చదనమూ లేకుండా, వెరపు పుట్టించేటట్లుగా ఉన్నాయి. హాలులనిండా జనం. రోగులు, వారి బంధువులు, ఆవేదనలు బిగబట్టుకొంటూ నిశ్శబ్దతతో మొగాలు దీర్ఘంగా పెట్టుకొని కూర్చున్నారు. ఒక హాలునుంచి ఒకహాలుకు, ఒక అంతస్థం తర్వాత మరొక అంతరం గడుస్తూ జాగరణచేస్తూ కదిలిన ఆ రెండుగంటలూ మనసులోని ఆదుర్దావల్ల రెండు యుగాల నరకయాతనంతా అనుభవింపజేసినట్లు చేశాయి. చివరికి ఎల్లాగో ఆ మహామహుని సముఖానికి చేరారు.

డాక్టరు బూచరో జ్ఞాపకశక్తి అద్వితీయం. గాసిన్ సతివిషయం అంతా అతనికి స్పష్టంగా జ్ఞాపకం ఉంది. పదేళ్ళక్రిందట, ఆమెకు జబ్బు ప్రారంభించినప్పుడు, ఒకసారిమాత్రం ఆ డాక్టరును కొనిసెల్'కు పిలుచుకు వెళ్ళారు. ఆ తర్వాత జబ్బు పరిస్థితులన్నీ వివరంగా వాళ్ళనడిగి తెలుసుకొన్నాడు. మునుపటి ప్రిస్క్రిప్షన్‌లన్నీ జాగ్రత్తగా పరిశీలించాడు. అంతా విని ఈమధ్య మెదడులో కల్గిన అపస్మారకానికి కారణం వాళ్లకు వివరించి ధైర్యం చెప్పాడు. కొన్ని ఘాటైన మందులు వాడటంవల్ల అది వచ్చిందని చెప్పాడు.

అని చెప్పి టేబిల్‌మీదికి వంగి, సన్నగా చికిలించిన్న ఆ గద్ద కళ్ళమీద గుబురు కనుబొమ్మలు తీవ్రంగా ఏకరేఖగా ముడిపడుతూంటే, అవిగ్నన్‌లోని డాక్టరుకు చికిత్స విషయం సలహా ఇస్తూ ఉత్తరం రాస్తూ కూర్చున్నాడు. అతనివంక ఆదుర్దాతో చూస్తూ వాళ్లిద్దరూ ఊపిరి బిగబట్టుకొని కాగితంమీద పాళీ బరుకుతూన్న చిరుశబ్దం వింటూ కూర్చున్నారు. ఆ మహాపట్టణపు రొద అంతా, ఆ చిరుశబ్దంలో లీనమయిపోయి వినరాకుండా ఉంది. ఒక్కసారిగా, ఈ నవీనకాలంలో డాక్టరు కున్న ప్రభావ మెంతగొప్పదో వాళ్ళకు అవగతమయింది. నరుని అచంచల మూఢనమ్మకాలకు, మహోన్నత భక్తివిశ్వాసాలకు, మూలాధారమైన శక్తికి నూత్న పూజారి ఈ నవీనవైద్యుడు...

అక్కడినుంచి రైలు పడేటప్పటికి సీజేర్'కు కైపు పూర్తిగా వదలిపోయి తీవ్రాలోచనానిమగ్నుడయాడు.

“నేను హోటలుకు వెళ్లి, మూటా ముల్లె సర్దుకొంటాను... చూశావా ఈ పారిస్ గాలి నాకు సరిపడదురా, అబ్బాయి! ఇక్కడే ఇంకా ఉంటే ఏదో అవకతవక పని చేసేస్తాను. అందుకని సాయంత్రం ఏడుగంటలబండికి బయలుదేరతాను. కోడలుపిల్లకు నా తరఫున మళ్ళీ రానందుకు క్షమాపణలు చెప్పు. ఏం! చెప్తావ్ కాదూ?” అని జీన్‌ను అడిగాడు.

అతనికి అడ్డు చెప్పకుండా జీన్ చాలా జాగ్రత్త పడ్డాడు. అసలు ఈ వెంగలిబాబాయ్ ఏం కుట్టితనపు పనులు చేస్తాడో అని అతనికి నిత్యం అదిలుగా ఉంది.

మర్నాడు ప్రొద్దున్న నిద్రలేచి, అమ్మయ్యా! ఇప్పటికి బాబాయి క్షేమంగా ఇంటిదగ్గర, దివోనీ కాపలాలో పెట్టెలో పెట్టినట్లుంటాడుగదా అని, గతరాత్రే అతన్ని పంపేసినందుకు తన్ను తను అభినందించుకొంటున్నాడు. అభినందించుకొంటూండగానే, అకాత్తుగా ఆ బాబాయి, మొగమంతా వాడిపోయి ముడుతలుపడి, ఒళ్ళంతా కుంచుకుపోయి శోకదేవత మూర్తీభవించినట్లు ప్రత్యక్షమయాడు.

“అరె భగవంతుడా! బాబాయి, ఏమయింది? అల్లా ఉన్నావేం?” అని అడిగాడు.

సిజేర్ బాబాయి నోటమాట లేక, కాలు చేయాడించలేక, అక్కడే పడకకుర్చీలో కుప్పగా కూలిపోయాడు. తర్వాత తర్వాత నెమ్మది నెమ్మదిగా తేరుకుంటూ పశ్చాత్తాపప్రకటనం ప్రారంభించాడు.

కార్పబేసితో తిరిగిన రోజులనాటి మిత్రుడొకడు కనపడ్డాడు. ఇద్దరూ కలిసి సుష్టుగా హోటల్‌లో భోజనపానీయాలు జరిపించారు. రాత్రికి రాత్రికి జూదపాటులో ఎనిమిదివేల ఫ్రాంకులూ హరించిపోయాయి. రాగిడబ్బుకూడా మిగల్లేదు! ఏమీ లేదు! ఇంక ఏ మొహం పెట్టుకొని ఇంటికిపోయి దివోనీతో చెప్తాడు? లా పిబూలెట్ లంకకూడా కొందామనుకొన్నాడు! అకస్మాత్తుగా అతనికి.

తేదీ అన్నీ స్పష్టంగా అందులో వివరిస్తానని పట్టు బట్టాడు.

"ఏం అవసరం లేదు, మామా! డబ్బు తేవటంలో నీపేరు నే చెప్పలేదు. నాకోసమని చెప్పే బదులు తెచ్చాను. అందుచేత నాకుతప్ప ఇది నీ కెవ్వరికీ బాకీ లేదు. నీ యిష్టంవచ్చినప్పు డెప్పుడైనా తీర్చ వచ్చు, తొందర లేదు"

"అమ్మాయి! ఇల్లాంటి ఉపకారాలు అనన్య మైత్రితోతప్ప తీర్చగలిగేవి కావు" అంటూ కృతజ్ఞత అంతా ఉట్టిపడుతూ సీజేర్ జవాబు చెప్పాడు.

ఈమాటైనా బాబాయిని స్వయంగా ఇంటికి పంపించాలని జీన్ స్టేషన్‌దాకా వెళ్లాడు. వీడ్కోలిస్తూ సిజేర్ కళ్ళనీళ్ళెట్టుకొని, "ఏం మనిషిరా! రత్నంలాంటి పిల్లరా! అబ్బాయి ఆమె సుఖంగా ఉండేట్టు చూస్తూ ఉండు" అంటూ జీన్‌లో ఇంకో సారి తన కృతజ్ఞత వెల్లడించాడు

* * *

ఈ సంఘటనతో జీన్ మళ్ళీ పూర్తిగా మన స్స్వాస్థ్యం గోల్పోయాడు. దీనితో, తనను కట్టేసిన గొలుసు అంతకంతకూ మరింత గట్టిగా బిగిస్తూ, సీల కొట్టబడుతూన్న ట్లనిపించింది. తన కుటుంబం, తన ఈ వ్యసనం, ఈ రెంటినీ, సహజమైన మనస్సున్ని తత్వంతో, విడివిడిగా దూరంగా ఉంచుకొందా మనుకొన్నాడు. కాని ఈ రెండూ ఒకదానిలో ఒకటి చొచ్చుకు కలిసిపోతున్నాయి. సీజేర్ బాబాయి, ఇంటివద్దనుంచి, కాసిలెహ్ నిత్యవ్యవహారాలూ, ద్రాక్షతోటలకు తను తెస్తూన్న అభివృద్ధీ అన్నీ ఏకరువు పెడుతూ జీన్ ప్రియురాలికి ఉత్తరాలు రాస్తున్నాడు. ఫానీ తీరుబడిగా కూర్చుని, ద్రాక్షతోటల విషయంలో కౌన్సల్ మొండిపట్టును విమర్శిస్తూ, అతని తల్లి ఆరోగ్యం విషయం మాట్లాడుతూ, అనవసరపు, అప్రస్తుతపు సలహాలన్నీ యిస్తూ, అతని ఒడలు మండిస్తూండేది.

తమవంశానికి సిగ్గుచేటుగా, తను చేసిన పనులన్ని పోకేలా ఆమెలో చెప్పుకొనిఉన్నాడు. ఆమె ఎప్పుడూ ఆ ప్రసక్తిగానీ అతనికి తనుచేసిన ఉపకారంమాటగానీ ఈషణ్మాత్రమూ తెచ్చేది గాదు. ఒక్కసారే జీన్‌మీదికి అభిమానం తిప్పింది. అదైనా ప్రత్యేకపరిస్థితుల్లో.

ఒకనాడురాత్రి నాటకానికెళ్లి ఇద్దరూ ఇంటికి తిరిగివస్తూ, వాన కురుస్తోంటే, బూల్‌వర్డు బళ్ళ స్టాండులో, ఒక గుఱ్ఱపు బండీ ఎక్కారు. ఆ బండీ కటకటలాడ్తూ అతిపాతదైపోయి ఉంది. అర్ధరాత్రి వేళతప్ప రోడ్లమీదికి పనికివచ్చేటట్టు లేదు. బండి బయలుదేరటానికే చాలాసేపు పట్టింది. బండీవాడు కునికిపాట్లు పడుతున్నాడు. గుఱ్ఱం దాణాసంచీలో ముట్టె కదుల్చుకుంటూ నిల్చునిఉంది. వాళ్లు లోపల ఎక్కి కూర్చుంటుండగా ప్రక్కబండీవద్దనుంచి ఒక ముసిలాడు, కంచికి కొత్తగాడు పన్నతో బిగిస్తూ, హెచ్చుగా బండికిటికీదగ్గిరకొచ్చి, కల్లువాసన గుబ్బుమనిపిస్తూ బొంగురుగొంతుకతో ఫానీని పల్కరించాడు.

"షెల్లా! ఎల్లా ఉంది నీపని"

"ఎవరు, నువ్వా!" తనంతట కలిగిన కదలికను వెంటనే సర్దుకొంది. ప్రేమికునితో మెల్లగా "మా నాన్న" అంది.

ఇతనన్నమాట ఈవిడతండ్రి! ఈ బండిమనిషి! బురదకొట్టుకున్న ముతక లాంగ్‌కోటు, ఎప్పటిదో ఏ జమీందారీ నౌకరులనాటిదో తొడుక్కొన్నాడు. దాని లోహపుగొత్తాములన్నీ ఊడిపోయాయి. రోడ్ గ్యాస్‌లైటువెలుగులో ఆ మొగం, తాగుడు అలవాటుతో ఉబ్బరించి, కమిలిన రంగులో ఉంది. ఆ మొగంలో ఆ పెద్ద కళ్ళల్లో ఫానీ, కనుముక్కు తీరులు ఛాయగా గోచరిస్తూన్నట్లు గాసిన్ కనిపించింది. ఇద్దరిలోనూ ఉన్న ఆ లాలస స్వభావ సారూప్యం కొట్టవచ్చినట్టు కనిపించింది. ఆ మనిషిని గాని ఆ కూతుర్ని గాని పరిగణించనట్లే, అసలు చూడనట్లే కూర్చున్నాడు. ముసిలిదెగ్రాండ్, ఇంటివిషయాలన్నీ ఆమెతో చెప్తున్నాడు. "ముసిల్ది రెండు నెలాల్నించి ఆస్పత్రిలో పడిఉంది. నువ్వు ఎప్పుడైనా ఒకసారి రంనాడు పోయి చూడరాదూ! దానికి కూడా కొంత ఇదిగా ఉంటుంది. నా అదృష్టమూ అంటూ, ఈ ఘటానికేమీ ఢోకా లేదు. కొరడా నరంతాడు గట్టిగుంటే, కొరడా గట్టిగుంటుంది. అదీ సంగతి. అన్నట్టు వ్యాపారం మునుపటిలాగా సాగటంలేదు. నీకేమైనా బండీమనిషి అవసరం ఉంటే చెప్పు. నేనే, పనికి కుదరగలను. అక్కర్లేదూ! పోనీలే ఏం చేస్తాం! పోయివస్తా"

వాళ్ళ వీడ్కోలు లవగానే బండి ముందుకు కదిలింది.

"ఏం! ఏమి టాలోచిస్తున్నావ్" అంటూ ఫానీ సన్నగా గొణిగింది. అని వెంటనే తన పుట్టుపూర్వోత్తరాలు చెప్పసాగింది. "పాపిష్ఠి గొడవ" అనీ, "పశుతుల్యంగా ఉంటుంద"నీ ఇన్నాళ్ళు చెప్పకుండా తప్పించుకు వచ్చింది. కాని ఇప్పుడొకళ్ళ సంగతి ఒకళ్ళకు బాగా తెలిసింది కాబట్టి ఇక నేదీ దాచనవసరం లేకపోయింది.

పారిస్ పరిసరాలలో, మోలిన్-ఆ-అంగ్లే, అనేచోట జన్మించింది. ఈనాయన అప్పుడు మిలిటరీ

గొంచి వచ్చి పారిస్‌కు, షాటిలాన్‌కు మధ్య సబ్జుపు బస్సు తోలుతూండేవాడు. ఆ దోవలో ఒక కల్లు పాకలో దాసీమనిషి ఈ బండివానికి తటస్థపడింది. ఆ స్వల్పికకలాపంలో తను తల్లి గర్భాన పడింది.

తల్లి సేనాడూ ఎరుగదు. తల్లి పురిటిలోనే చని పోయింది. కాని ఆ రోడ్డుపాక గృహస్థులు కొత్త సభ్యులేమో, ఈ పిల్లకు తండ్రి నేనని ఒప్పుకోవలసిం దనీ, ఆమెను సాకేందుకు ఒకదానిని ఏర్పరిచి ఆఖర్చు ఇచ్చుకొంటూండవలసిందని బలవంతపరిచారు. వాళ్లకి అప్పటికే చాలా బాకీ ఉన్నాడేమో, అతను ఒప్పు కోక తప్పలేదు. ఫాన్నికి నాలేళ్ళు వచ్చేటప్పటికి బండి తోలుతూ ప్రక్కను కుక్కపిల్లను కూర్చో పెట్టుకొన్నట్లు, బండిగూడుదిసువను ఎత్తు సీటుమీద కూర్చో పెట్టుకొని పోతూండేవాడు. దోవగతుకులలో బండి ఎత్తి కుదేస్తూ కుదుపుతూండేది. ఇటూ అటూ రోడ్డు ప్రక్కలాంతర్లు వెనక్కు పరుగెత్తుతున్నట్లు రమ్యంగా ఉండేవి. గుర్రాల వీపులు పైకి క్రిందికి ఉబ్బుతూ కదుల్తూ, ఆవిర్లు కక్కుతూండేవి. ఆ పిల్ల కా ప్రయాణం అంతా ముచ్చటగానే ఉండేది. ఆ బండి కుదుపుకు అట్లాగే జోగుతూ చలిగాలికి ముడుచుకుపోతూ, గుర్రాల మెడలో చిరుగంటలు, మువ్వలమోతలు జోలపాడ్తూంటే నిద్రపోయేది.

కాని ఈ పితృవాత్సల్య నాటక నిర్వహణము, తండ్రి లిగ్రాండ్‌కు చికాకు కల్గించసాగింది. ఎంత చక్కనైనా, ఈ పసిదానికి తిండీ బట్టలకంటూ కొంతఖర్చు పెట్టాల్సి వచ్చేటప్పటికి అదికూడా అత నికి భారమనిపించింది. అదీకాకుండా అతను పెళ్ళి చేసుకోటానికికూడా పిల్ల కొంత అభ్యంతరంగా ఉంది. అతను రోజూ పోయేదోవలో ఒక కూరగాయ లతోటఉండేది. పుచ్చలు, దోసలు, కాయగూరలు అన్నీ చక్కగా పండుతూన్నతోట. ఆ తోట యజ మాని బ్రతికున్నప్పుడు బజారులో కూరగాయల వర్తకం చేస్తూండేవాడు. ఇప్పుడతని పెళ్లాం,ఒక్కతే ఆతోటంతా చూసుకొంటూంది. ఆతోటమీదా, తోట అమ్మమీదా కన్ను వేశాడు లిగ్రాండు. అప్పట్లోనే ఫాన్నికి అర్థమయింది. ఆ త్రాగుబోతుతండ్రి, పెళ్ళికి అడ్డురాకుండా ఎల్లా అయినా తనను నాశనంచేయ చూస్తున్నాడని. నిజానికి ఆ తోట అమ్మ, పుణ్యాత్మురాలు మాచామి, దయదలచి ఆమె రక్షణలోకి తనను తీసుకోకపోతే తనగతి...

"అన్నట్టు, ఆమెను నువ్వు ఎరుగుదువు కాదూ, మాచామీ!" అంది ఫాన్ని.

"ఎవరు! నీయింట్లో అప్పుడు పనిచేసేమనిషా."

"ఊ! ఆమె: నా సవతితల్లి. నా చిన్నప్పుడు నన్ను చాలా దయతో చూసేది. ఆవిడను పెళ్లిచేసి కొన్నాక ఈ దరిద్రుడు ఆమె ఆస్తి అంతా తాగేసి, ఇల్లూ వాకిలి లేకుండాచేసి, నిత్యం చావమోదుతూ ఉండేవాడు. పైపెచ్చు తనొక తోట్టను చేరదీసి, దానికికూడా చాకిరీ చేయమని మాచామీని చంపే వాడు. 'పిడితోటి నీకొద్దు. పోదాం పద'మని చెప్పి, నేనే ఆవిడ నక్కడనుంచి కదలదీసుకొని వచ్చాను. కాని ఏం లాభం! అందగాడైన మొగుడికోసం, ఆడది ఎన్ని కష్టనష్టాలు భరించాలో, పాపం ఆ మాచామీకే తెలుసు. నేను ఇన్ని చెప్పి, ఇంతా తీసు కొచ్చాక, తీరా నన్నొదిలేటప్పటికి, చెప్పిందంతా చెవిచెవిని బెట్టి, మళ్లీ వాడిదగ్గరకే పోయింది, వాడితో ఉందామని! అదిగో, ఇప్పుడు హాస్పిటల్లో పడ్డది! అది దగ్గర లేకపోయేటప్పటికి ఈ దుర్మార్గుడు మళ్ళీ ఒళ్లు చెరుచుకొంటున్నాడు. అబ్బ! మరిగోడుతూ లేడూ! దిక్కులేని దిమ్మరిలా ఎల్లా ఉన్నాడో! ఆ కొరడా తప్ప మనిషికి వేరు ఆస్తి ఏమీ లేదు. ఆ కొరడా ఎంత నిటారుగా పుచ్చుకొన్నాడో మాతావా! తాగి తందనాలాడుతూన్నా సరే. కొరడా అల్లాగే కొవ్వొత్తి పట్టుకొన్నట్లు ముందుకు ఖడేరావ్‌లా కదలకుండా పట్టుకుంటాడు. అదొక్కటే అత గాడిలో సుగుణం. 'వరంతాడు గట్టిదైతే కొరడా గట్టిదౌతుంది' ఎప్పుడు చెప్పినా అదేమాట చెపు తూంటాడు"

ఎవరో ఎరగనివాణ్ణిగురించి చెపుతూన్నట్లు, ఏ అరమరలు లేకుండా,అతినిదానంగా, సిగ్గుగాని చీద రింపుగాని ఏమీ లేకుండా, శాంతంగా చెప్పుకొని పోతోంది. ఆ ధోరణి చూసి జీన్ విభ్రాంతుడై పోయాడు. ఏమి తండ్రి! ఏమి తల్లి! కౌన్సల్, తీవ్ర గంభీరవదనము, గాసిన్ సతి అమరమందహాసము.— వాటికీ వీటికీ పోలిక ఎక్కడ?—ఈమె ప్రక్కను కూర్చుంటేనే ఈ సాంఘిక కశ్మలం తన దేహం నిండా చిందినట్లయి అసహ్యంతో కుంచుకొనిపోయి నిశ్శబ్దంగా కూర్చుని ఉన్నాడు. అకస్మాత్తుగా ఫాన్ని ఆ ప్రేమికుని మూగతనంలో మనోగతమైన వ్యగ్రతనంతా పసికట్టినట్లు, వేదాంతధోరణిలో అన సాగింది. "అయినా ఇల్లాంటి దేగో ప్రతికుటుంబం లోనూ ఉండేదేలే! అది మనతప్పు కాదు. మనమేం చేస్తాం! నాకు లిగ్రాండులాంటి, తండ్రి ఉన్నాడు! నీకు మీ సీజేర్ బాబాయి ఉన్నాడు."

# కంఠీరవరాజు యక్షగానకృతులు

(గత సంచిక తరువాయి).

శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఈ యక్షగానము సంస్కృత శ్లోకముతో నిట్లు ప్రారంభమగుచున్నది.

"శ్రీ భూమీకరపల్లవవ్యతికరా
విర్భూత నిద్రాసుఖః
శక్రాదిత్రిదశేంద్ర మౌళిమణిరు
క్కిమ్మీరి తాంఘ్రిద్వయః
కారుణ్యామృత వారిరాశివి
చలద్దివ్య త్తరంగాయతా
పాంగో పశ్చిమరంగ జిష్ణురవతు
శ్రీరాజకంఠీరవమ్.

తరువాత గీతి పద్యము
శ్రీకరోదార శృంగార సింధువైన
సకలనాట్య కళాప్రౌఢిసారమగుచు
నలరుదిక్పాలక విలాసమనెడు కృతిని
తీవి కల్పించి తౌర కంఠీరవేంద్ర!

కథాప్రారంభమున నింద్రుఁడొకనాఁడు అష్ట దిక్పాలకులతో నాట్యశాలలో కొలువై యున్నప్పుడు, వాసవి పావకి, వైవస్వతి, నైరుతి, వారుణి, వాయవి, కౌబేరి నైశాని అను నెనమండుగురు నాట్య కత్తెలు తమ తమ విద్యావిశేషములను ప్రదర్శించి యావిద్యల తారతమ్యము నెఱిగింపుమని యింద్రుని కోరగా నా సురమునియైన నారదుఁడు.

"వినవయ్య! సురరాజ విద్యానివాస
మైన పశ్చిమరంగమను పట్టణమున
భూనాథచంద్రుండు పురుషసింహుండు
కొమరొప్ప నాత్రేయ గోత్రసంభవుఁడు
విమతరాజవిభేదవిక్రమార్కుండు
సంగీతసాహిత్య సార్వభౌముండు
రంగేశ చరణ సారసచంచరీకుఁ
డన్ని విద్యలగల్గు నందంబుఁ దెలియు
కన్నడరాయ విఖ్యాతిచే వెలయు
ఘనుఁడు మైసురి రాజకంఠీరవేంద్రుఁ
డనురాజు సర్వజ్ఞుఁడవనిలోఁ దెలఁగు
నతఁడు వీరల విద్యలన్నియుఁ దెలిసి
మతినెంచి తారతమ్యము నిశ్చయించు
ననిన"—అమ్మునిమాట కతిహర్షమంది వాసవుని సెలవీయఁగా నా నాట్యకత్తెలు కంఠీరవరాజు సమ్ముఖమునకు వచ్చిరి. ఆ వచ్చినవారిలో తొలి నాట్యకత్తె వాసవి విధానమెట్లున్నదో యీ క్రింది సీసపద్యమున వర్ణితమైనది.

"మహనీయ మందారమాల్య సౌరభ్యముల్
వేణీభరంబుపై వేడ్కమీఱ
ముక్తామణీహారములు లసత్కుచ కుంభ
యుగళిపై సారెకుఁ జిగివొలంక
కలితక్వణన్మణీ కంకణచ్ఛవి గుచ్ఛ
ములు హస్త పల్లవములు నటింప
ఘల్లుఘల్లని పాద కంజాతములయందు
రవఘంట సరిపెణల్ రవళిఁ జేయ
గరిమె బిరుదందె దిక్కులఘనత కెక్క
జగము మెప్పింపగల విద్యసరణిఁ దెలియ
నిదిగో [illegible] వాసవి యిందువచ్చె
నింపుతో రాజకంఠీరవేంద్రు సభకు"

ఈ యక్షగానమున వాసవి నాట్యప్రదర్శనమునకు కంఠీరవరాజు మిక్కిలి హర్షించినట్లు గలదు, అంతమున ఏకతాళి.

మంగళం జయ నవమనసిజరూపా
జయజయ సుకృతకలాపా
జయజయ మృదుమధురాలాపా
జయజయ కంఠీరవభూపా

దీని వెనుక క్రమక్రమముగా పావకి, వైవస్వతి, నైరుతి, వారుణి వాయవి కౌబేరి కంఠీరవరాజువద్దకు వచ్చినట్లుగ చిన్న చిన్న కృతులు రచితములైనవి.

---

ఈ కంఠీరవరాజు మైసూరి రాజుచరిత్రమున పేర్కొనఁబడిన రెండవ కంఠీరవనరసరాజు. ఈతనిఁ గూర్చి మైసూరి గెజటీరునందుగల విషయము నుదాహరించుచున్నాఁడను.

Kanthirava Narasaraja II 1704-1713 AD.

Kanthirava Raja the son of Chikadevaraja was born deaf and dumb and hence called mukarasu. But through the influence of Timmalaingar he suceeded to the throne. During his reign the Dalavay Kanthirava attempted te reduce Chikaballapur, but lost his life in the enterprise. His son Basava. raju appears to have continued the siege and suceeded in levying tribute. An inscription of Kanthirava's dated 1705 A D. states that the Temple of Venkateswara in the Bangalore fort was built by Chikadevaraja his father and he made a g ant to it [MAR. E.C IX Banga'oie 118] There are hardly any other inscriptions of his time though they are few nirupas orders dated between 1707 1711.

Mysore Gazetteer Vol. II Part IV Page 2464, G. Haysvadana Rao.

వాని స్వరూపము తెలుంగుట కిందుతో వానిని పొందుపఱచుచున్నాను.

పావకి నాటకము.

"శ్రీరామా హృదయాభి రాము(డచల
శృంగార సారాస్పదుం
డారూఢోన్నత వైభవుండు రవిచం
ద్రాలోకు(డవ్యాజ స
త్కారుణ్యామృత పూర్ణు(డహి —
ట్తల్పైక నిద్రాళు(డీ
శ్రీరంగేశు(డు ప్రోచు సంతసముననా
శ్రీరాజకంఠీరవున్"

వ చ న ము.

యివ్విధంబున వాసవి వినుతించినపిమ్మట పావకియనే భామాశిరోమణి వచ్చిన క్రమం బెటు వలెనన—

ద్వి ప ద.

శ్రీవెలయు రత్నంబు చికిలి సొమ్ములను
కీలించి(దాల్చి ప్రౌఢమ మీఱి సరస
చందన ఘనసార సౌరభ్యమెనసి
చందంబుగా విరిసరి జడజుట్టి
వగమీఱ సరిగంచు వలువయు గట్టి
వగలాడి పరువంపు వయసు మిటారి
చెఱజాణ ఖరగల్లు చెలంతలకెల్ల
పరికింపంగా మేటి భాగ్యనబో(టి
పాటు(తైన క్రొమ్మించు పొలసినయట్లు
వసుధలో నటియించు వనితాలలామ
పావకియను భామ భాగ్యనిస్సీను
కీర్తితో రాజకంఠీరవాక్షిక
సమ్ముఖమునకును స్వారస్యమెనసి
యొమ్మెమీఱం గ వచ్చె నింతి తానపుడు.

ఎరువు – ఆదితాళము.

గరిమతో పావకి వినిపించవచ్చెను
వరవైభ వేంద్ర కరుణతో జూడుమీ
ఘనమైన పాత్రము కంఠీర వేంద్ర !

గీ తి ప ద్య ము.

సకలరాజన్య మూర్ధన్య సరసమాన్య
సత్యభాషా హరిశ్చంద్ర శౌర్యసాంద్ర
ఫణిరసెవ్వరు నాజోడు వయసు జూడు
ధీరవిభ వేంద్ర ! రాజకంఠీర వేంద్ర !

ధ్రు వ తా ళ ము.

ఎక్కువలాడనేల యిదిగో నా విద్య జూడు
గ్రక్కున మైసూరి కంఠీర వేంద్ర !

మ ఠ్య తా ళ ము

తిన్నగ నేనూ తెలిసిన మాత్రము
విన్నవించెదను వేడుకమీఱ
ఎన్నికలోన మన్నించిచూడు
కన్నతెరాయ ! కంఠీర వేంద్ర !

రూ ప క ము.

కరుణమీఱంగ నన్నుగని పరికించితే
సరసవిద్యలమేలు చాలగల దిందూ
మఱిమాటలేటికి సరియెవరు తనకు
గరిమతో(జూడుము కంఠీర వేంద్ర !

ఝ ం పె.

ఇంతి యెవ్వతె యైన యెదురునిలిచిన దిపుడు
పంతమున రాకరోబట్టి పలికింతు
వంతైన సిరుదయు యింతగలిగిన చాలు
కాంతామనోమదన కంఠీర వేంద్ర !

త్రి పు ట.

ఎంచిచూడగ వారివారిలో
ఎలమి నొక్కటిగలదు యెక్కువ
ఇంచుదనమొకయందు గలుగును యిది నిజంబు
అంచితంబుగ తెలియు నన్నియు
మంచినగలై తోచునప్పుడు
కాంచనాచల ధీర మైసురి కంఠీర వేంద్ర !

ఆ ట తా ళ ము.

శ్రీరంగనాయక సేవానురీణ !
చారుసకలవిద్యాసార ప్రవీణ
వీరకంఠీరవవిబుధసంత్రాణ !
గౌరవింపుము నన్ను కన్నడజాణ !

ఏ క తా ళ ము

జయజయ విద్వజ్జనలోల !
జయజయ నయశాస్త్రానుకూల !
జయజయ సంతతజయశీల !
జయ కంఠీరవజనపాల !

పావకి నాటకము సంపూర్ణము.

వైవస్వతి నాటకము.

"శ్రీనాథ శ్రితలోకపాలన కళా
లీలైక దత్తక్షణః
పంకేజాత కుముద్వతీసఖ మహా
సంరాజమానేక్షణః
కావేరీ పవమానపాదిత మహా
రంగేభుజంగేశయః
శ్రీకంఠీరవ భూమిపాల మవతా
దక్రాంతమాద్యఃపుమాన్

వ చ న ం.

ఈ రీతిన పావకి వినిపించిన వైవస్వతి పెనుక వచ్చిన క్రమం బెటువలెనన.

ద్వి ప ద.

శ్రీరమ్యతను కాంతి జితదమయంతి
సారమంజులహాస సరసవిలాస

శరదిందుబింబాస్య సముదితలాస్య
హరిణాక్షి జనమనోహర సుధాలాప
వరవైభవాపాంగవంచితభృంగ
గురుకుచవినుతాంగ గుణగణోత్తుంగ
స్థిరకళావారాశి శృంగారరాశి
హరినీలసమవేణి అంబుజపాణి
అసియాడు కౌనురాయంచ నెన్నడలు
ఒసపరి నెఱనీటు నొయ్యారి సొగసు
భావంబుగలిగిన భామైనలేమ
వైవస్వతియను వరదివ్యభామ
వరుసతో నాట్య వివాదంబు దీర్చు
కొఱకు వేడుకమీఱ కూర్మితో వచ్చి
రాజాధిరాజ సంగ్రామనిశ్శంక
రాజకంఠీరవ రాజేంద్రవినుము.

దరువు - ఆదితాళము.

వచ్చెను జూడరె వైవస్వతిలలన
హెచ్చైన కంఠీరవేంద్రు సమ్ముఖమ్మున

వచనము.

ఈ తెఱంగునవచ్చిన వైవస్వతి యనే భామ, రాజకంఠీరవేంద్రుని మాచి యేమని విన్నవించె ననిన,

గీతి

"భోగ సౌభాగ్యములచేత పొలుపుమీఱి
ఆయురారోగ్య సంపద లతిశయించి
ధరణివర్ధిల్లు మాచంద్రతారకముగ
సరసకంఠీరవ నృపాల జయవిశాల"

ధ్రువతాళం.

ఘనమైన తాళసంగతిమీఱఁగ వినుపింతు.
కనుగొను మీ విధము రాజకంఠీరవేంద్ర.

మఠ్య.

చేరితినిన్ను చేకొనిచూడు
వీర శ్రీకంఠీరవ భోజ.

రూపకము.

వింతవింతగ నేను వినిపించగలను
కంతు సన్నిభరూప కంఠీరవేంద్ర.

ఝంపె.

అందరందము దెలిసియాడుదును నాదు
యందమున నిక నెవతె యాడ గల దిందు
పొందుగా నారీతి పూనిభావించు
ఇందుముఖి కంఠీరవేంద్రు భూచంద్రు

త్రిపుట.

పేరుగలిగిన వారిలోనే నాధియైనా నేమి నాతో
పోరినిలువగలేదు విను కంఠీరవేంద్ర.

అటతాళం.

చారునాట్య శాస్త్రమున సాటిలేని దాననని
గారవించి ధీరరాజ కంఠీరవేంద్ర.

ఏకతాళం.

జయజయ వితరణ సారమహీజ
జయజయ సంగీతసాహిత్యభోజ
జయజయ శిక్షిత కుజనసమాజ
జయకంఠీరవ భాస్కరసమతేజ.

నైరుతి నాటకము.

శ్రీకంఠీరవ నృపతేః శ్రితజన సుర
భూరుహాయమానస్య
శ్రీ పశ్చిమరంగేశః శ్రేయాం
సిదదాతు భూయాంసి.

వచనము.

ఈ విధంబున వైవస్వతి విన్నవించినపిమ్మట ఆనైరుతి క్రమం బెట్టులనిన.

ద్విపద.

శ్రీసార శృంగార సింహాసనై వెలయు
భాసురమైన వైభవములఁ జెలఁగు
నొయ్యన తనుకాంతి యుప్పతిల్లగను
నొయ్యారమున గూడి యుల్లాసమైనసి
కలకంఠరవముల గాబరిసేయు
సులలితగానము సొలసిపాడుచును
ననువుగ దనరారు నద్భుతమైన
ఘనతరలాస్యము గరిమఁజూపుచును
వరధీరవాదంబు వక్కాణింపుచును
వరుసతో జాతి విధమువఘళించుచును
విలసితోరగవేణి వెలయు విరిబోణి
జలజకోమలపాణి సరసకల్యాణి
మదనుని చేనున్న మాల్యపూబంతి
యిదిగొ నైరుతి యనే యింతి తావచ్చె
వరగుణ విధువంశ వారాశిచంద్ర
సరసకంఠీరవ సామిగాఁ జూడు

దరువు.

సదయకంఠీరవ సామినీగనుగొన
యిదిగొ నైరుతివచ్చె యింపుమీఱఁగను.

వచనము.

ఈ విధంబునవచ్చి రాజకంఠీరవేంద్రు సమ్ముఖమ్మఁజొచ్చి యేమని విన్నవించెననిన.

"యువతిజనమనసిజా కృతి
నవనవవిద్యాభిరామనయగుణధామా
అవిరతము వెలయు కంఠీ
రవధరణీదేవరాజ రవిసమతేజా!

ధ్రువతాళం.

వరుసలోనే నాడు వైఖరిమాడు
సరసకంఠీరవ సామి పరాకు.

మఠ్యతాళం.

పరికింపుము నాభావము లెల్ల
గరిమతో రాజకంఠీరవేంద్ర

రూపకము

పేరైన విద్యల బిరుదాడి సేను
చేరితినిను కంఠీరవ రాజేంద్ర.

ఝంపె.

ఆ నాకమున నెవ్వరైన నీసరిజూడగాన
నేవినుు రాజకంఠీరవేంద్ర
నను కరుణించితి భోగసాంద్ర

ఏకతాళం.

జయజయ సుజనాధార
సంగ్రామాంకణశూర
జయజయ సద్గుణసాంద్ర
జనపాల కంఠీరవేంద్ర!

వారుణి నాటకము.

శ్రీరంగేశతురంగ శ్రీలలనా
నర్తనోచితరంగం
సదితకాంతి తరంగం సమాశ్రయే
సప్తపది మంగళోత్తుంగం.

వచనము.

ఈ విధంబున నైరుతి వినుపించిన యనంతరంబున వారుణివచ్చే క్రమం బెటువలెనన.

ద్విపద.

ప్రేమనోహరముగా చెలులవిలసిల్లు
సోముని వగదేరు సొగసైనమోము
కలువల హసియించు కనుగవగీటు
తిలకింప శంఖముఁ దెగడెడు గళము
సరసమృణాలము జడికించు భుజము
నరుదైన జలజము నదలించు కరము
కరికుంభముల మించు గబ్బిగుబ్బలును
హరినీలపంక్తితో నమరు నూగారు
కేసరియందంబు గేరు నెన్నడుము
వాసైన పులినమువంటి జఘనము
అనటికంబము సొంపు లణచు పెన్దొడలు
మనసిజ శరధితోమలయు జంఘలును
చిగురుల చీకాకుసేయు నడ్గులును
వగలాడిభావంబు వర్ణింపఁదరమె
ఈరీతిబాగైన యింతి మరుదంతి
వారుణి యను భామ వచ్చె వైపునను
కలితవైభవరాజ కంఠీరవేంద్ర
వెలఁదిని దయఁ జూడు వేడ్కతో నిపుడు

దరువు. రాగం సారంగ.

వారుణి యనే లలన వచ్చెను
వన్నెమీఱఁగ నిదిగో
శ్రీరాజకంఠీరవ రాజేంద్ర
జాణని యాదరించి చూడు.

ఈ రీతిని వచ్చిన వారుణిభామ రాజకంఠీరవేంద్రునిఁ జూచి యేమనుచున్నది.

"ఇలఁగలిగిన రాజులలో
పల నీవే జాణవనుచు ప్రస్తుతి సేయన్
తెలిసితి కంఠీరవ భూ
లలనావర కరుణఁ జూడు లావణ్యనిధీ!

ధ్రువతాళము.

ఇల నేలు కంఠీరవేంద్రుని సముఖమున
తెలిసితినని రాఁదలు నెవ్వరికి
వెలయు నేర్చినయంత విడిగ వినిపించంగ
కలిదానరాధేయ కనుగొనుము దయతోను.

మఠ్యతాళము.

వరుసను సముఖము వనితామణులను
పరికింపగ నెవ్వరు సరిలేరు
ధరగలరెటువలె దయతోఁ జూడు
కరుణాసాగర కంఠీరవేంద్ర!

రూపకము

ధీరకంఠీరవేంద్ర జేకూడి
కోరినకోరికలెల్ల నేడు
ఈరీతి నీవద్దఁ జేరి వినిపించె
యొక్కువ లినము గలిగెను

ఝంపె.

ఇలజనులుజూడనే విదరువేరు
విద్యాకళలఁ దెలియు ఘనమైనవారు
తిలకింప నీవలెను తెలివిగలవారెందు
గలరు మైసూరి రాజకంఠీరవేంద్ర!

త్రిపుట.

చెలువ కంఠీరవ నృపాల
చిత్తగించు నేర్పుతో
వెలఁది యెవ్వతె మత్స్యఘటి
వెలయు నావలె వింతగా

ఆటతాళం.

ఘనుఁడవ కంఠీరవేంద్ర కరుణతో నీలాగ
జనువిచ్చినడపిన చంద మేమేలు.

ఏకతాళం.

జయ సంశ్రిత జనమందార
జయ పాథోనిధి గంభీర

జయ కలియుగ కర్ణావతార
జయ రాజకంఠీరవధీర.

నాయని నాటకము.

శ్రీరాజ కంఠీరవ భూమిపాలం
శృంగార సౌందర్యకళా (వతారం) విశాలం
సంగీతసాహిత్య సమగ్రశీలం
రంగేశతారంగతు రమ్యశీలం.

వ చ న ము.

ఇవ్విధంబున వారుణిభామ వినిపించిన యనంతరంబున వాయవి వచ్చె క్రమం బెటువలెనన.

ద్వి ప ద.

శ్రీమత్పటీర కాశ్మీరకస్తూరి
కామల్లికాజాతిఘనసౌరభములు
గరిమ దిక్కులనెల్ల ఘుమ్మఘుమ్మనను
సరవి వాసింపగా చాతుర్యమెనసి
వీణతంబురముఖ వీణవేణులను
రాణించుమద్దెల రహిమీఱ ఢక్క
ఘల్లుఘల్లనెడి బంగారు గజ్జెలను
సులలితనాదంబు శ్రుతిలీయముగను
మేళసన్నాహంబు మెఱుఁవఁ జేగాంచి
తాళక్రమంబున తప్పక నాట్య
విద్యావిలాసంబు వేడ్కనుప్పొంగ
హృద్యముగా నటియించు వగలాడి
సౌందర్యలావణ్య సౌభాగ్యసీమ
అందచందముల వాయవి యనేభామ
సకల రాజాధిరాజకిరీట కాంతి
వికసిత పాదారవిందుఁడై చెలఁగు
రాజకంఠీరవ రాజేంద్రుసభను
రాజసముగ వచ్చె రమణితానిపుడు

ద రు వు.

వచ్చెనిదిగో వాయవి యను వన్నెలాడి మిటారియై
హెచ్చుగల్గిన రాజకంఠీరవేంద్రు సమ్ముఖముననూ.
"తాటంకమణికృత తతకాంతి సంతతి
తళుకుఁ జెక్కులమీద తాండవింప
పేరైన ముత్యాలపేరులు కుచకుంభ
కోరకద్వయముపై గునిసియాడ
కాంచీమణీధామ కాంచనఘంటికల్
జఘున భాగంబున సందడింప
అభినయచ్ఛాయల నందంబుఁ జూపుచో
కరకంకణంబులు కళుకుఁజేయ
భావరసరాగతాళానుబంధబంధు
రాభినయదృష్టివైఖరు లపుడు మెఱయ
వరుస నరుదెంచె వాయవి వన్నెమీఱ
రాజకంఠీరవ కుమారమణుసభను.

ధ్రువ తా ళం.

భూమిపాళ కంఠీరవేంద్ర భోజునిసభయందు
నామోహ మనసొప్పంగ నమలుగ నటియింతు
సామతరసుగాదు శృంగారనాట్యము
సామిగాఁ జూడుము ప్రేమమీఱఁగను.

మ ఠ్య తా ళం.

సదయుఁడ నీకు సమ్మతిగాను
మృదుతర లాస్యము మెలఁగుచు నేను
ఇదిగో నాడుదు ముదమున బోదు
కదన సంహార శ్రీకంఠీరవేంద్ర!

రూ ప క ము.

ఆటలపాటల అందము చందము
మాటికి మదనుడు చూచి మెచ్చిన
మేటి నిను కంఠీరవేంద్ర !
మేలు దెలిసి చూడుము.

ఝం పె.

పలుక నేటికి విద్యకలిగిన తనుదానె
తెలయు కస్తూరి తావి వివరింప నేల
లలితనర్మ విశాల లాస్యవిద్యాలోల
ఇల నేలు కంఠీరవేంద్ర భూపాల.

త్రి పు టి.

రాజకంఠీరవ నృపాలక రమ్యముగ
నావిధముఁ జూడుము
రాజవిద్యల మేలు
తెలిసినరాజు నీవు.

ఆ ట తా ళం.

రాజులలో నెఱజాణవు నీవు
రమణులలో నెఱజాణను నేను
రాజకంఠీరవ రాజేంద్ర.
మది రంజిలగఁ గను గొంటేని.

ఏ క తా ళం.

జయ రణరంగవీర జయజయ శృంగారహీర
జయకంఠీరవ రాజధీర జయదాన.

కావేరి నాటకము.

శ్రీరాజకంఠీరవ భూవరాయ
చారు ప్రయాగోన్నత వైభవాయ
శ్రీసింధుకన్యా హృదయాభిరామః
శ్రీరంగనాథః శ్రియ మాతనోతు.

వ చ న ము.

ఈరీతి వాయవి వచ్చినమీదట కావేరివచ్చిన క్రమం బెటువలెను.

ద్వి ప ద.

శ్రీరమ్యమగుచు వాసికి నెక్కినట్టి
సారగాయకవృత్తి జరిపి తుంబురుఁడు

నలకూబరుఁడు తాళనయ ముచ్చటింప
నలవసంతుఁడు మద్దెలలర వాయింప
తలఁప మారుఁడు సూత్రధారుఁడై మెలఁగ
కలితభూషణములు గరిమ ధరించి
విలసిత సౌరభ్య విభవముఁ జెంది
వెలయు కీల్జడయందు విరిసరుల్ జుట్టి
తిలకింప కస్తూరి తిలకంబు నుదుట
నలరఁగాఁ దీర్చి సొయ్యారంబు మీఱ
గంధర్వమేళ సంఘటన దీపించి
గంధేభయాన యొక్కతె చెంత నిలిచి
కపురంపు జిలుగుబాగాల నందియ్య
నిపుణత నందొక్కతె నెలఁత సొంపుగను
తెలనాకుమడుపులు తీరుగా నొసఁగ
నలువిసనంపు నాకెమ్మై యొసఁగ
అదంపెమునందొక్క యబ్జాయతాక్షి
కైదండ యీయఁగా కావేరి వచ్చె
ఘనముగా శ్రీరాజకంఠీరవేంద్రు
తనరినసభయందు తా నటియించె.

దరువు.

వరుసతో నటియింపవచ్చె కావేరి
కరుణమీఱఁగఁ జూడు కంఠీరవేంద్ర.

మత్తేభము.

చలనామోదము లుప్పతిల్లెడు గతిన్
సారంగకస్తూరపుం
బలుకుల్ సుస్వరరీతి వెన్నెలలస
ద్భావంబు చందంబునన్
వెలయున్ తెమ్మెరవీచినట్టు లమృతా
విర్భూతి పొంకంబునన్
చెలువొందన్ వినిపింతు రక్తి వినఁగన్
శ్రీరాజకంఠీరవా !

ధ్రువతాళము.

సంతతకనక వసంత కంఠీరవేంద్ర
వింతగ జక్కిణి విధమును నేను
వంతుకెక్కినదాన మన్నించి దయఁజూడు
కంతు జయంతవసంతసమరూప

మఠ్యతాళం.

ఛప్పన్నదేశపు జాణలలో నిన్ను
మెప్పించఁగలిగిన మెలఁతను నేను
తప్పుమాటాడెడి తరుణి నే గాను
చెప్పఁగ విను కంఠీరవ భూప.

రూపకం.

చెలగిదవిణమక్కరు బిరుదునలకూబరుచేత నంది
వెలసినదానగాన నేను చెలువ రాజకంఠీరవరాజ.

ఝంపె.

అందచందముల కెల్లకును
ఆటపాటలకెల్ల
పొందైన నీదు దయ భూషణంబగును
ఇందులకుగా నే నిటువచ్చితిని జూడు
కందర్పసమరూప కంఠీరవేంద్ర.

పదములు.

రాగం తోడి = త్రిపుట.

వారివారి కిట వలచినవాఁడే
శూర కంఠీరవేంద్రుని వింతలు జూడే

పల్లవి.

అలివేణి వినవె అల్లదె మాటె నేని వాని
బలుసైన చెక్కిలి జిగిడెడి యొకతె
అలరుమోవి నన్న యమృతమేదిరా యని
వెలయ పంట నొక్కు వింతలాడి యొకతె
బారిపబ్బల మొనల బలిమితో స్మరుబ్రమ్మ
సీరముతో జడను బిగిసి జుట్టుకొని
వేసెనికొకను వెలదివలెరా యని
యీరీతి గూడి యున్న యింతిని నొకతె
బారాడు కురులను బాగుగా వగలుక్క
మోరసిగ వేసిన యొయ్యారి యొకతె
ఏరా కంఠీరవేంద్ర యొకతె కోరినవని
గారుచేసే బలు గయ్యాళి యొకతె.

రాగం, ముఖారి.

విన్నవించరో ఓయమ్మ
కన్నరో యీవగలెల్ల కంఠీరవేంద్రుతోన

పల్లవి.

విడిదికివచ్చిన పొమ్మనెదు నన్నిపుడు విడవాడేవు
విడెమీయఁగా నందుకోరాద వింతజేసేవు
దుడుకు లేటికి నాతో వాద మూరుకో నేదా
కడుదుజే నెదేమరుదా కాని నేనెమె సొద
అలదని చెట్టబట్టికొంటి బింకముతోన అటుజూచుకొంటి
మొల్ల మొగ్గలవంటి మోవి యానుకొంటి
అల్లసాని దాని యింటినుండి వచ్చెదమానంటి
గురిగా మైసూరి నేలునంటి
రాజితఘన గుణవంతుఁడంటి
వీరకంఠీరవ వీరుడంటి వద్దజేరుంటి
నిరతానను గూడి నాడంటి నే నమ్మియుంటి
మెఱసివారగనుంటి మేరగా దనియంటి.

కలనికాగు. ఇంకా ఎక్కువ పరిశోధనచేసి కొంత స్పష్టమైన చరిత్రను వెలుపు తీసేవరకూ ఆ శిల్పనిశ్రేషాలను చోళరాజులకాలంనాటివిగా చెప్పవలసిందేను. (పాశ్చాత్యులచే సేకరించబడిన) హిందూమతగ్రంథాలు రాతికన్న లోహశిల్పమే శ్రేష్ఠమని ('శైలజాత్ లోహజమ్ శ్రేష్ఠం') నిరూపిస్తున్నా పల్లవరాజుల రాజ్యవైభవసమయంలో లోహశిల్పాలు తయారు చేయటం సరియైన ఆచారం కాలేదు. పల్లవరాజులు 'లలితకళాకోవిదులు' అని ప్రఖ్యాతి గాంచినవారైనా, వారి కళాభినివేశానికి తగిన రాతిశిల్పాలను నిరూపణగా విడిచినా, పై విషయాన్ని మాత్రం నమ్మలేము. 'కాంచీపురం, వశం చేసుకున్నారన్న కథ ప్రకారం (ప్రస్తుతపు 'కంజీవరం' అదంతైనోళునిచే జయింపబడి పల్లవుల రాజధానిగా చేసుకోబడింది) అదంతైనోళునిచే కాపింపబడిన కొంత యుద్ధకాండ ప్రకారం పల్లవ రాజధానిలో లోహప్రతిమలు తయారుచేసే శిల్పులు ఉన్నారని నిరూపించే ప్రాకృత సూక్తంలోని కందపద్యం చెబుతుంది.

చోళరాజుల ప్రారంభదశను తెలుపు ఏ చరిత్ర కూడా వారి పరిపాలనాసమయంలో లోహశిల్పరీతిని తెలిపే వర్తమానం ఏమీ గోచరం కాదు. నిజానికి (985-1018) ఒకటవ రాజరాజు పరిపాలనవరకూ మన కే ఆధారమూ లేదు. ఆతరువాత తంజావూరువద్ద నున్న ప్రఖ్యాత శివాలయపు చరిత్రనుబట్టి లోహ విగ్రహరీతినిగూర్చినవర్తమానం దొరికింది. దేవతల, ఋషుల మూర్తులకై విగ్రహాలను ప్రతిష్ఠాపించేపద్ధతి, ఇంకా అతిప్రాచీనమైన ఆచారమైయుంటుంది— 'చలన' విగ్రహాలపద్ధతి ఆచరణలోకి వచ్చినప్పటి నుంచీ అని చెప్పవలసియుంటుంది. ఆలయంలో ప్రతిష్ఠాపితమై అచలమైయున్న శివదేవుని చిహ్నమై యున్న 'లింగ' ప్రతిమ భక్తులందరి మతతృష్ణని తీర్చియుండలేకపోవచ్చును. పవిత్రతలో అతిపవిత్రమైన ఆ శివాలయంలోకి అందరికీ ప్రవేశం కలగలేదు. ఆలయంలో ప్రతిష్ఠాపించిన 'అచల'మైన (ధ్రువ బేర) విగ్రహానికి వ్యతిరేకమైన 'భోగమూర్తు'లను 'ఉత్సవ మూర్తు'లనూ కల్పించారు. ఈ 'ఉత్సవమూర్తులు' (చలనమూర్తి) అతివైభవంగా పండగదినాలలోనూ, మతసంబంధమైన పర్వదినాలలోనూ వీథులవెంట సర్వ జనభక్తిసంతృప్తికోసం ఊరేగింపు చేయబడినది.



వినాయక

దేవాలయం ఏ దేవునికైతే సమర్పింపబడేదో, ఆ స్థిర దేవునికి, ఈ 'భోగ' 'ఉత్సవ' మూర్తులు ఆయనకు పర్యాయరూపములైనవి. ఈ ఉత్సవమూర్తులు మామూలుగా 'రాగి' 'కంచు' అనుడుగా వెండి, బంగారు లోహాల్లో పోత పోయబడేవి. ఈ పోతవిషయమైన చాతుర్యమంతా లోహకారుల చేతులలోని చమత్కారమే! అప్పటికే పల్లవులపరిపాలనలో శైవమతం ప్రచారం అయింది. ఆ శివదేవుని ('కర్ణాగమం' 25 లీలామూర్తులను పేర్కొన్నది) పదహారు రూపాలలో రూపించారు. ప్రతిరూపమూ ఒక ప్రత్యేక భావవిశేషాన్ని ప్రదర్శిస్తుంది. చోళులకాలంలో ఈ ప్రతివిశేషరూపమూ, రాతిలోనూ, లోహం లోనూ తయారయింది. రాతిలో తయారయిన విగ్రహాలు ఆలయప్రాకారాలలో ఏర్పరిచిన ప్రత్యేక ఫుగూళ్లలో అమర్చారు. లోహవిగ్రహాలను చిన్న గర్భాలయాల్లో ప్రతిష్ఠాపించారు. ఈ లోహ విగ్రహాభివృద్ధిలో చిత్రమైన అంశం ఇంకోటుంది. ప్రతివాడూ, ప్రతివిగ్రహానికి ప్రత్యేకమైన దేవాలయాన్ని కట్టలేకపోయేవాడు. అందుచే, వానివాని భక్తిపూర్వకంగా ఒకే స్థానికమైన దేవాలయానికి ఒక్కొక్క విగ్రహాన్ని సమర్పించేవాడు. పవిత్రగ్రంథాలు అనేక దేవదానాలరీతులను పేర్కొన్నవి. అందులో అతి ప్రఖ్యాతమైంది చోళరాజ్యపరిపాలనలో 'మూర్తి దానం'. ఒక్కొక్కప్పుడు ఈప్రతిమలు 'త్రిమూర్తి

దానం' గానూ, 'చతుర్మూర్తిదానం' గానూ ఇవ్వబడేవి. ఈవిధమైన 'మూర్తిదానం' ఒకటవరాజు పరిపాలనకు పూర్వంవరకూ ఉంది. దానిని గూర్చినచరిత్ర ఆయన పరిపాలనసమయంలో రాగి ప్రతిమలమీద వ్రాసిన శాసనముల ద్వారా ఇది తెలుస్తుంది. ఈరాజే తంజావూరులోని బృహదీశ్వరాలయంలో శైవబుషుల ప్రతిమలను ప్రతిష్ఠాపించి, వాటిపై శాసనాలను వ్రాయించినట్లు తెలుస్తుంది. నిజంగా ఈ ఆలయప్రాకారాలన్నీ ఆరాజుచేతా, రాణిచేతా, ఆయన మంత్రులచేతా, సేనానాయకులచేతా, రాజరాజు తరువాత రాజైన రాజేంద్రచోళుని



'ఉత్సవమూర్తి'

చేతా సమర్పింపబడి, శాసనములు వ్రాసి అమర్చిన విగ్రహాలతో నిండిపోయినవి! చోళరాజుల అపూర్వ దైవభక్తినిగూర్చిన వర్తమానంఅంతా పైవాటిద్వారా తెలుస్తుంది. వారికున్న దైవభక్తి భారతదేశంలోని ఏరాజులకూ లేదనిపిస్తుంది! వారు జయించిన రాజ్యాలు, యుద్ధాలు మొదలైనవాటికి చిహ్నంగా అనేక ఆలయాల బహూకరణ జరిగింది. బృహదీశ్వరాలయం కట్టించిన రాజు ఆ ఆలయదేవుని ఉత్సవ విశేషాలకి కావలసినంత ధనవ్యయానికి సరిపడిన గ్రామగ్రామాలనూ మాన్యాలుగా వ్రాసి యిచ్చారు. రాజరాజునకు, అందుకై ఇవ్వబడిన బిరుదులలో ఏదీ కూడా ఆ భక్తివైశాల్యాన్ని తెలుపలేదు. ఆ బిరుదు 'శివపాదశేఖర' అని, (శివునిపాదములే కిరీటముగా కలవాడు). ఆరాజు అతిభక్తిపూర్వకంగా చేసినబహుమానాలు, తరవాత పరిపాలనలో జరిగినవాటికన్న మిన్నయైనవి. విశేషంలో ప్లేటు 111 'స్టేట్ మినిస్టర్ ఎక్స్చెక్కి' చేసిన అతిప్రఖ్యాతమైన బహుమానాలు, విగ్రహాలూ, చిత్రాలూ, నగలూ, సంపూర్ణకాపాడష్ట చిహ్నాలూ మొదలైనవన్నీ చిరస్మరణీయమైనవి. ఉట్టి ప్లేటు 111 లో మనవాళ్ళను పోల్చవచ్చును. ఈనాడు రాజులలో అనేకులు శైవమత సంబంధమైన గ్రంథాలకు పోషకులైనారు. అందులో ముఖ్యమైనవి, '---రాకెన్' 'తిరుమంగై' 'తిరుపల్లై' మొదలైనవి. ఈ గ్రంథాలను జనులకు చదివి వినిపించడానికి వీలుగా చదువరులకు పారితోషికాలనూ, మాన్యాలనూ ఏర్పరచారు. ఆ చదవటానికి ప్రత్యేకించిన రోజులని 'అధ్యయన ఉత్సవాలు'ని పేర్కొన్నారు. అందువల్లనే దక్షిణాదిన ప్రబలమైన బౌద్ధమతం జైనమతంనుంచి ప్రజలమనస్సును త్రిప్పి, శైవమతంవైపుకు మరలించి, దానియందు భక్తివిశేషానురాగంగా కలగచేసినవారు శైవబుషులు. పల్లవ, చోళ, పాండ్యరాజ్యాలలో పాలనచేసినరాజులు బౌద్ధ, జైన మతాలంటే అపూర్వ భక్తివిశేషాలు కలవారు. శంకరాచార్యుని మతప్రచారానికి పూర్వం ప్రఖ్యాతిగడించిన తమిళబుషులు వారి శ్రావ్యమైన, భక్తిమయమైన గానమాధుర్యంతో జనబాహుళ్యంలో వారి శైవమతంమొదల అపూర్వ భక్తివిశేషాలు కలుగచేశారు. వారిదేశమంతా, ఆ శివదేవునిపై, ఆయన లీలపై, పాటలనుకట్టి, శ్రావ్యంగా పాడి, జనుల్ని ముగ్ధుల్ని చేశారు. నిజంగా దక్షిణాదిలో ఇప్పుడు ప్రబలంగాఉన్న శైవమతంయొక్క దృఢత్వానికి ఆకాలపు శైవబుషుల సమ్మోహనమైన ప్రచారమే కారణం. వారిగేయాలలో వర్ణించిన ఆ ఆలయాలే ఇప్పటికి పవిత్రంగా ఉంచబడినవి. వారి తదనంతరం వారి సంస్మృతికై ప్రతిమలు తయారుచేయబడినవి. అవే శివాలయాల్లో ప్రతిష్ఠాపింపబడినవి. వారికి భక్తి పురస్సరంగా పూజలు సలుపబడినవి. వారి స్మారకంగా పెద్దపెద్ద విందులు జరుపబడినవి. ప్రత్యేక పర్వదినాలు వారికై కేటాయింపబడినది. ఈ శైవాచార్యులుగాని లేక 'ఆడియార్లు' శైవాగమసిద్ధాంతాన్ని వేదాంతబోధనగా వారి దివ్యగానంద్వారా ప్రచారంసాగిస్తూ అందులో భక్తి శైవమతప్రకారం ఏవిధంగా ఉండవలసిందీ, ఆ సిద్ధాంతాలను వలమత

బడింది. కంజీవరానికి సంబంధించిన తిప్పరపిల్లై అనే ఆయన 'నరసింహపుర'వద్ద లక్ష్మీనరసింహమూర్తి విగ్రహాన్ని బహూకరించినట్లు శాసనం చెబుతుంది. వీటిలో అనేకవిగ్రహాలు 'ఉత్సవ' మూర్తులుగా నిర్దేశింపబడినవి. 'ప్రహ్లాదపురందర' అనేవిగ్రహంపై అలా నిర్దేశించినట్లు శాసనంద్వారా తెలుస్తుంది. దురదృష్టవశాత్తూ వైష్ణవలోహవిగ్రహాలు ఇంతవరకూ కనుగొన్నవి, శైవమతవిగ్రహాలతో పోలుస్తే అంత ప్రశంసాపూర్వకమైనవి కావని చెప్పాల్సొస్తుంది. బహూకరణలు శైవ, వైష్ణవ భక్తులైన ఇద్దరిచే బహూకరింపబడినప్పటికిన్నీ శైవశిల్పాలలోనున్న విన్యాసం వైష్ణవ శిల్పాలలో కనపడదు.

ఏమైతేనేమి, రాజులూ, ధనికులూ, శైవులూ, వైష్ణవులూ అంతులేని బహూకృతుల్ని దేవాలయాలకిచ్చినపుడు ఈ ప్రతిమలకై విపరీతమైన 'గిరాకీ' ఎక్కువైంది. గిరాకీకి తగిన సరుకు దొరకటంవల్ల ఏది తెగని ప్రాపకం ఉండేది. దానికి తగినట్లుగా నేర్పరులైన శిల్పుల, కంచు విగ్రహకారుల సమిష్టి కార్యదీక్ష ఉండేది. ఆ పనివాండ్లనే 'స్థపతు'లని పిలిచేవాళ్లు. ఈ శిల్పులు తామే ఒక గ్రామగ్రామం నిండి యుండేవారు. ప్రాచీనకాలంలో అలాంటి శిల్పుల గ్రామాలు అనేకం ఉండేవి. అందులో ఒక గ్రామం ఇప్పటికీ ఉంది. కావేరీనదిమీదనున్న 'స్వామిమలై' అనే గ్రామం కుంభకోణానికి మూడుమైళ్ళదూరాన ఉంది. ఆ గ్రామంలో కొన్నితరాలనుంచీ వంశవృత్తిగా ఉంచుకున్న కంచు, రాతి విగ్రహకారుల కుటుంబం ఇప్పటికీ ఉంది. నిజానికి ఈ చిన్న శిల్పకారులబృందమే ఇప్పటికీ పూర్వపు కళాప్రతిభనీ, కౌశల్యాన్నీ చెక్కుచెదరనివ్వకండా పనితనాన్ని తరతరాల నిలబెట్టింది. పూర్వపు 'స్థపతులు' ఏరకపు పద్ధతినైనాసరే — దారువులోగాని, ఇటికలోగాని, రాతిలోగాని, లోహంలోగాని,—ఏదైనాసరే అతి నేర్పుగా విగ్రహాలను తయారుచేశారు. వారిలో కొందరు కేవలం లోహపుపనినే చేశేవారు. వారికి కొన్ని పద్ధతులూ, నియమాలూ కలవు. ఆ నియమం, ఆ కార్యక్రమపద్ధతీ, సంస్కృతంలోనున్న శిల్ప శాస్త్రగ్రంథాలద్వారా అలవర్చుకున్నారు. వారికి అర్థంకావడానికిగాను ఆ సంస్కృతగ్రంథాన్ని తమి గంలో ప్రస్తావనచేసి అంగుళ అంగుళాలలోకి తీసికొని వచ్చారు.

ఈ శిల్పశాస్త్రగ్రంథాలు పూర్వం ఆనాటి కాలంలో ఋషివర్యులచే రచించబడినవని చెబుతారు. ఆ గ్రంథాలలో నిజానికి కళాకారుడికి అవలంబించవలసిన పద్ధతులను తెలుపుతూ చిన్న చిన్న పద్యాలు 'ధ్యానా' లని ఇష్టదేవతా ప్రార్థనరూపంగా వ్రాయబడినవి. ప్రతి 'ధ్యానం'లో సూచించిన విధంగా విగ్రహాలుండవలసింది, ఆ లక్షణక్రమం అంతా పాటించేందుకు అనుగుణంగా సూక్ష్మరీతిని వ్రాయబడింది. ప్రతిప్రతిమకూ కావలసినన్ని సూత్రాలు, కొలతలు, వంపులు, భంగిమలరీతి వ్రాయబడినవి. ఉదాహరణగా ప్రముఖమైన ప్రతిమలైన శివ నటరాజ, విష్ణు, విగ్రహాల ఎత్తు, పొడవు 'పదితల' రీతిన —పదితలలపొడవు—ఉండాలని నిర్ణయింపబడింది. ఒక తలపొడుగు పరిమాణం పరిమితిగా పెట్టుకొని, అట్టి పదితలల పరిమాణం కలది, ఒక విగ్రహపు ఎత్తు అనినిర్ణయింపబడింది. 'దేవీ'విగ్రహాలకు ('అష్టతాల భవేద్దేవీ') ఎనిమిదితలల పరిమాణం నిర్ణయింపబడింది. అంతకన్న చిన్నవిగ్రహాలవిషయంలో—అనగా బాల గణేశ, రాక్షసవిగ్రహాలకు 'పంచతాల' పరిణామం నిర్ణయింపబడింది. మిగతా శరీరంలోని అవయవాల నిడువు పరిమాణాలు, అతి నేర్పుగా ఖచ్చితంగా జ్ఞాపకానికి అతికేలుగా, అతిచిన్నసూత్రాలలో—పిల్లలు కూడా కంఠస్థం చేయడానికి అనుకూలంగా—వ్రాయబడినవి. ఉదాహరణగా బాలకృష్ణుని విగ్రహానికి ఒక చిన్న శ్లోకంలో కావలసిన పరిమాణరీతి వ్రాయబడింది:

"కర నవ నయన నస్త్రైః నాగ పాతాళ భాను రుద్ర
కర హృదయ మానం పంచ తాలంచ కృష్ణం"

అని అలాగే వివిధమైన ప్రతిమలకు ఆయా ఆధ్యాత్మిక రసవిశేషాన్ని బట్టి, భావ ప్రాబల్యాన్ని బట్టి తగిన భంగిమలు—, అభంగ, సమభంగ, అతిభంగ, త్రిభంగ మొదలైనవి—నిర్ణయింపబడినవి. ఈ భంగిమలు 'బ్రహ్మసూత్ర' ప్రకారం మధ్యరేఖ ననుసరించి శరీరం ఏవైపు ఎంతవంగియుండాలో నిర్ణయింపబడినవి. అవి 'అభంగ'ము కల విగ్రహాలు. ఒక కాలి మీద బరువునిలిపినట్లు ప్రశాంతస్థితిలోనున్నట్లు చూపబడినవి. 'సమభంగ' స్థితిలోనున్న విగ్రహాలు మామూ

# గానసుధ



శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

వానలు లేక బీటవడి పాడయి వేడిమికేడ్చు బోడిమై
దానము వోలె ఊర్పులు సదా ఎగజిమ్ముచు మ్లానజీవినై
గాన సుధారసమ్ము కొఱకై తపియించుచు నుందు నేను — నా
మానస మీ ప్రదాహమున మ్రగ్గుచునున్నది వాడు పూవుగా !

వెతలేవో ఎద జుట్టియున్నవి బృహత్ క్ష్వేళా ప్రపూర్ణ స్ఫుటీ
తతులై, ఊపిరి సాగనీవు — మధు నాదస్నిగ్ధ శీతాంబు వ
ర్షతుషారామృత సేచనమ్ముల పరిష్వంగంపు గాఢత్వమిం
త తొలంగం గలదోయి నెచ్చెలి ! గళద్వారమ్ములం దెఱ్వుమా !

ఏదో ఎడారిదారి అతి తృష్ణకు సైపఁగలేని పాంథుఁడ
ట్లై దురదృష్ట భారమున కేడ్చుచు మూర్ఛిల, స్వప్న వీథులం
దాదృతి మీఱ ఎవ్వరో, ఏయచ్చర, అచ్చర వచ్చి వాని శీ
ర్ణాధరసీమ అల్లన సుధామృతమున్ జిలికించునట్లుగా

పాడుము — జీవితమ్మునకు భావియు భూతము రెండు ఉన్నవన్
పాడు తలంపు రాలిపడ వాడిన ఆకయి వర్తమానపున్
నీడనె త్రాగుబోతునయి నిల్తును: నీ గళ రావ సంపుటుల్
గోడలు గట్టు నా ఎడదకున్ నలుమూలల పాలరాతితో !

గణయతి ప్రాసలన్ నిలుపు కష్టము, సార్థకమో పదాల పూ
రణ మొనరించు బాధ చెదరన్, తమ అంతనె లేచి ఏవో
రణగొణ శబ్దముల్ తలపులన్ కదలన్ కలదిచ్ఛ — మైకమం
దణులు సమస్తమున్ గడచి — హాయిగ నీ వెలుగెత్తి పాడఁగా !

క్రిందికి పైకి నీ ఎలుగు కిన్నెర తీగలను శ్రుతిన్ స్వనిం
పం దులదూచి చెప్ప ఉపమానములా అనుభూతి దోచునే ?
సందె గదా ఎడందకది జాగ్రదజాగ్రదవస్థలన్ ! రస
స్పందితమో మనస్సు నిలువంగలదే, స్ఫుటమై, అలోలమై?

---

# రాజీ

శ్రీ బుర్రా అప్పారావు

రాజీలాంటి మనిషి భర్తతో దెబ్బలాడి, కొడుకుని కూడా వొదిలి పెట్టి, పుట్టింటికొచ్చేసిందంటే నేను నమ్మలేక పోయాను. పండక్కి నేను మావాళ్లింటికి వెళ్లినప్పుడు మావాళ్లు చెప్పిన మాటలూ, ఇతరులవల్ల విన్న విషయాలూ నన్ను నిజంనుంచి మరింతదూరం చేస్తున్నట్టనిపించింది. అందులోనూ రాజీ అసలు సంగతి ఎవ్వరితోనూ—తన వాళ్లకి కూడా—చెప్పకపోవడంవల్ల, చెప్పుడుమాటలు విని మనుషుల మంచి చెడ్డలు నిర్ణయించే లోకందృష్టిలో రాజీ కన్యాయం జరుగుతున్నదేమో అని నా మనస్సు బాధపడ్డది. కాబట్టి రాజీని కలుసుకుని వీలయితే ఆమెనుంచి నిజం తెలుసుకుందామని వాళ్లింటికి వెళ్లాను.

నా రాక తెలుసుకుని తనగదిలో ఉన్న రాజీ హాలులోకివచ్చి "సరూ, ఎన్నాళ్ళకి? రెండేళ్ళయింది కదూ మనం కలుసుకుని? నీ కూతురాయిది?" అని శాంతని చేతుల్లోకి తీసుకుంది. రాజీని చూడడంతోటే నిలువునా నీరయాను. ఈమె పూర్వపు రాజీయే కాదు. ఈ రెండేళ్ళలోనూ యెంతమార్పు! ఆ చిరునవ్వు యిప్పుడూ ఉందిగాని అది మునపటిలాగ వెన్నెలలు విరజమ్మడంలేదు. ఆ కళ్లలో మునపటి వెలుగులేదు.

"ఇప్పుడేనమ్మా రాజ్యం మొహంలో ఆమాత్రం ఉత్సాహం చూడగలిగాను. పిచ్చిపిల్ల యెంత దుఃఖం మనసులో దాచుకుందో!" అని రాజీ తల్లి కామేశ్వరమ్మ కళ్లల్లో నీరు గ్రుక్కుకుంది.

"రా గదిలోకి. ఈ నిలువు భత్యమెంతసేపు?" అని రాజీ నాచెయ్యిపట్టుకుని తన గదిలోకి తీసుకు వెళ్లింది. రాజీచేత మనసు విప్పి మాటాడించగల చనువూ సానుభూతీ నాకొక్కర్తెకే ఉందని నాకు తెలుసు. "రాజీ, ఇంత అప్రతిష్ఠపని చేశావేమిటే? నీ చదువూ, తెలివితేటలూ యే.గంగలో కలిపావు?" అన్నాను వాళ్ళమ్మ తన పనిమీద వెళ్ళిన తరవాత.

"పోనివ్వూ సరూ. లోకం అనేక విధాలను కుంటుంది. మనం యెంతమందితో చెప్పి మెప్పించగలం?" అంది. మళ్లీ యేదో తెలుసుకుందామన్న అభిప్రాయంతో "ఇంతకీ నేనుచేసిన అపరాధమేమిటి?" అని ప్రశ్నించింది.

"వాళ్ళకేమిటి తెలుసు చెప్పు, నువ్వు మొగుడునీ పిల్లాడినీ విడిచిపెట్టి పుట్టింటికి వచ్చేశావని తప్ప అసలు సంగతి తెలియనంతసేపూ లోకం చెడ్డనే అనుమానిస్తుంది, ముఖ్యంగా ఆడవాళ్ల విషయంలో" అన్నాను. రాజీ ముఖంలో చిరునవ్వు మాయమయింది. కళ్ళలో నీటిచుక్కలు కూడుకుంటున్నాయి. నిరుత్సాహంగా, నిస్పృహగా "సరూ, అర్థంచేసుకోలేదే లోకం నా బాధని." అంది. "పోనీ అర్థంచేసుకోడానికి ప్రయత్నించే మాలాంటి వాళ్ళకైనా తెలియక్కర్లేదా? నీ దగ్గరివాళ్ళకైనా ఏమీ చెప్పకపోతే యెలాచెప్పు. చూడు రాజీ, దుఃఖాన్నంతటినీ కడుపులో దాచుకుని యెందుకలా కుమిలిపోతావు? నీ బాధ తీసేలేముగాని నీ కష్టాలు మా కష్టాలు కావూ? నాదగ్గరెందుకే దాపరికం?" అన్నాను. రాజీ నా ఒళ్లోకి ఒరిగింది. ఆమె తలను నా చేతుల్లోకి తీసుకున్నాను సానునయంగా. మెల్లగా తలెత్తి రాజీ తన కథచెప్పింది. సౌలభ్యంకోసం ఆమె చెప్పినట్టు కాకుండా నా మాటల్లా వ్రాస్తున్నాను.

రాజీ భర్త విశ్వనాథం తన మొదటి భార్యలేచి పోయిన కొద్ది రోజుల్లోనే ఆరేళ్ళ కొడుకు శంకరాన్ని వాళ్ళ తాతగారింటికి పంపేశాడు. మరెప్పుడూ తనవద్దకా పిల్లవాడిని తీసుకురావడంగానీ, తాను వెళ్ళి చూడడంగాని చెయ్యక తన జీవితంలోని మచ్చను శాశ్వతంగా చెరిపేసుకున్నాననుకున్నాడు.

"ఒరేయ్, మన శంకరానికి యిద్దరు తురక తమ్ముళ్లు కూడా ఉన్నారట్రా! వాడికేం మహారాజు" అని అసలేమండుతున్న శంకరం మనసులో మరొకరు ఆజ్యం పొయ్యడం తరుచు చేస్తుండేవారు. ఓర్పు అలవాటుచేసుకున్న శంకరం యీ దెప్పి పొడుపులకు జవాబు చెప్పకుండా మనసులోనే కుమిలిపోతూ ఉండేవాడు. శంకరం యింటిదగ్గర ఈ విషయాలు చెప్పేవాడుకాడు. ఉడుకుతున్న అతని మనసుకు ఆదరంతో కూడుకున్న రాజీ మాటలొక్కటే చల్లదనాన్నిచ్చేవి. సాయంత్రం యింటికి రాగానే ఆమె స్వహస్తాల్తో అందించే కాఫీటిఫినూ అతడికెనలేని సేద దీర్చేవి. బ్రతుకులోని తీపిని అతడొక్క రాజీ మూలంగానే తొలిసారి రుచిచూడ గలిగాడు.

ఒకనాటి సాయంత్రం శంకరం యింటికివచ్చి తన గదిలోకి సడికాకుండా వెళ్ళిపోవడం రాజీ గమనించలేదు. "నా కాఫీ యేది పిన్నీ?" అనే పిలుపు కోసం యెదురు చూస్తూన్న రాజీ వంటావిడ సుబ్బమ్మకేదో సామానులందిచ్చే పనిలో ఉండగా హాలులోంచి కటువుగా "ఒరే శంకరం, యిలారా చవట వెధవా" అన్న విశ్వనాథం మాటలు వినపడ్డాయి. ఏదో మునిగిందన్న తలపు రాజీ మనసులో కలిగింది. ఆమె చటుక్కున హాలుపక్క గదిలోకివెళ్లి చాటుగా విషయం కనిపెడుతూంది. ఒక కుర్చీలో తాసిల్దారు రాఘవులు నాయుడు కూర్చున్నాడు. ఆఫీసుదుస్తులన్నా విడవని విశ్వనాథం ఇంకొక కుర్చీలో ఉన్నాడు.

"అయినా యింతపొగరుబోతుతనంకూడదండీ. ఈవేళ మీ కుఱ్ఱవాడేగాడు; స్నేహితులం కాబట్టి సరిపోయింది. మరొకరైతే యింకేమన్నా ఉందా?" అన్నాడు విశ్వనాథం.

"సాధారణమైన గాయాలయితే నేను మీదాకా రానివ్వకపోదును. తలమీద దెబ్బ చాలా గట్టిదనీ, కొన్ని రోజులదాకా కుర్రాడు మళ్లా లేవడనీ డాక్టరన్నాడు." అని రాఘవులు నాయుడంటూ ఉండగా శంకరం హాలులోకివచ్చి తండ్రి కెదురుగా నిలుచున్నాడు.

"ఏమిరా రౌడీ వెధవా. వీరి అబ్బాయిని నువ్వీవేళ కొట్టావా?" అన్నాడు విశ్వనాథం.

శంకరం తాసిల్దారు వేపు ఒకమారుచూసి "ఔను" అన్నాడు.

"ఎందుకు కొట్టావు? ఒళ్లు పొగరెక్కా?"

శంకరం మాటాడలేదు.

"నిన్నే. మాటాడవేం?" గర్జించాడు విశ్వనాథం.

"నన్ను నొప్పించేమాట అన్నాడు నాన్నా"

"నువ్వేమీ అనకుండానే అన్నాడా? ఏమిటా నొప్పించే మాటలు?"

శంకరం జవాబు చెప్పలేదు.

"నిన్నే అడిగేది. నోరు పెగలదేం?"

ఇంకా జవాబు చెప్పలేదు శంకరం. అతని కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. మరుక్షణం అతని చెంప ఛెళ్లుమంది. "పో వెధవా, నాకు నీ దరిద్రపుగొట్టు మొహం చూపించకు." అని గర్జించాడు విశ్వనాథం. శంకరం చెంప చేత్తో పట్టుకొని గదిదారిపట్టాడు. రాజీకి ఆ దెబ్బ తనకి తగిలినట్టయింది. అలాగే కొయ్యబొమ్మలా ఉండిపోయింది.

రాఘవులు నాయుడుని సాగనంపి కోపంతో గదిలోకి వచ్చిన భర్తకోసం మౌనంగానే కాఫీ టేబిలుమీద పెట్టి మెల్లగా శంకరం గదికివెళ్లింది రాజీ. టేబిలుమీద మోచేతు లానుకుని, చేతుల్లో తల పెట్టుకుని కూర్చున్నాడు శంకరం. కంది ఉబ్బిపోయిన చెంప ఎదురుగా కనిపించింది రాజీకి. చెంపల మీదుగా జారిన కన్నీళ్లు ఆరి చారలుకట్టాయి. రాజీని చూసి "ఏం పిన్నీ?" అన్నాడు. దగ్గరగా వెళ్లి "శంకరం, నువ్వీవేళ కాఫీకోసం నా దగ్గరకు రాలేదేమీ? పిన్ని చచ్చిపోయిందనుకున్నావా?" అంది రాజీ. "లేదు పిన్నీ, ఈవేళ మనసు బాగు లేదు." అన్నాడు శంకరం. అతని తలను తన రెండు చేతుల్లోకి తీసుకుని రాజీ అతని ముఖాన్ని తేరి చూసింది. నుదుటిమీద సన్నంగా పొడవుగా ఒక గాయం కనుపించింది. చూడగా అతని మోచేతుల నుంచి మండలవరకూ బాగా గీరుకుపోయిన గాయాలు కూడా కనుపించాయి. "శంకరం, తోటి పిల్లలతో పోట్లాడుతున్నావా? తప్పుగాదూ?" అంది రాజీ. అతడు ఆమె కళ్ళల్లోకి తేరిచూశాడు. ఇదవరకందని దేదో అతని కామె ముఖంలో దొరికినట్టయింది.

"పిన్నీ, నేనవసరంగా పోట్లాడుతానా?" అన్నాడు.

"ఏం, ఏమి జరిగిందేమిటి? నాన్నగారడిగితే చెప్పావుకావు. నాతో కూడా చెప్పకూడదా?" అంది రాజీ ఆప్యాయంగా.

"పిన్నీ, వాళ్లు రోజూ నన్ను చంపుకు తింటున్నారు. అమ్మను గురించి వాళ్లాడేమాటలు యెంత బాధ గలిగిస్తున్నాయనీ. ఎంత ఓర్చుకుని జవాబు చెప్పకుండా ఉందామనుకున్నా వొదలరు. పోనీ అమ్మమాట అలా ఉంచినీ. ఈవేళ......" అతని గొంతు జీరపోయింది; పెదవులు వణికాయి; కళ్లు చెమ్మగిల్లాయి "నిన్ను......ఇంత మంచిదానివైన నిన్నుకూడా......సవతి" పళ్లు కొరికాడు "మీ పిన్నెప్పుడు పంగారీ చిత్రగిస్తుందోయ్'' అంటే ఎలా సహించేది పిన్నీ?" వెక్కి వెక్కి ఏడుస్తూ క్రిందపడి రాజీ కాళ్ళను పెనవేసుకున్నాడు.

రాజీ కళ్లుకూడా చెమ్మగిల్లాయి. లేవదీసి అతని తల గుండెకదుముకుంది. "పిచ్చి శంకరం, నేనంటే నీకెందుకోయ్ ఇంత అభిమానం? మంచిపని చేశావులే. ఈమారు వాళ్లు నీ జోలికిరారు" అంది.

అతిని గుండెలో బరువు తగ్గిపోయింది.

* * *

రాజీ తన పురిటికి పుట్టింటికి తొమ్మిదో మాసం ప్రవేశించిన కొద్ది రోజులదాకా రాలేకపోయింది. రాజీలేని యింట్లో పది రోజులన్నా ఉండలేక పోయాడు శంకరం. తండ్రివద్దకు వెళ్లి "ఒకమారు పిన్ని యెలా ఉందో చూసివొస్తానునాన్నా" అన్నాడు. "ఏడి శావులేవోయ్. ఇంకా పదిరోజులన్నా కాలేదదివెళ్లి; ఏమిటోయ్ ఆదాంఠవ్యం? అందులోనూ స్కూలు ఫైనలు పరీక్ష నెత్తిమీద పెట్టుకుని, బడిమానేసి నువ్వక్కడికివెళ్లి యేరాచ కార్యం వెలగబెట్టాలోయ్?" అన్నాడు విశ్వనాథం. ఆ మూడోనాడు తండ్రితో చెప్పకుండా బయలుదేరి రాజీదగ్గర వాలాడు శంకరం. గర్భభారంతో గదిలోపడుకున్న రాజీ శంకరాన్ని దగ్గర కూర్చోపెట్టుకుని "ఏమోయ్ శంకరం, నాకోసం యింత దూరం వచ్చావా? నాన్నగారితో చెప్పావా?" అని ప్రశ్నించింది చెప్పి ఉండడనే అనుమానం తోనే.

"చెపితే వొద్దన్నారు పిన్నీ. అందుచేత నువ్వొచ్చినప్పుడు నాకిచ్చిన అయిదు రూపాయిలూ పట్టుకుని వచ్చేశాను"

"ఎంత పనిచేశావు? నాన్నగారికి కోపం రాదూ? పైగా నెల్లాళ్ళలో పరీక్షలాయె. చదువు కోకపోతే యెలా పాసవుతావు శంకరం?"

"నాతో ముఖ్యమైన పుస్తకాలు తెచ్చుకున్నాను పిన్నీ. బడికిపోకపోతే యేమీ భయం లేదులే; కొత్తది లేమీ మిగిలిపోలేదు."

రాజీతోపాటు పురుడయ్యేవరకు యిక్కడే ఉండిపోదామన్న నిశ్చయంతో శంకరం వచ్చినట్లు కనిపించింది. రాజీకేమీ పాలుపోలేదు. ఒక వేపు భర్తకు కోపమొస్తుందన్న భయం; ఇంకో వేపు శంకరం పరీక్ష పాడుచేసుకుంటాడన్న కించ.

"పోనీలే. వొచ్చినవాడివెలాగా వొచ్చావు. ఎప్పుడు తిన్నావో! ఆ ఫ్లాస్కులో ఓవల్టినుంది తాగు. తరవాత మాటాడుకోవచ్చు" అంది రాజీ. ఓవల్టిను తాగుతూ ఉంటే పిన్ని కిష్టంలేనిపని చేశానేమో అన్న అనుమానం శంకరానికి తట్టింది. మెల్లగా రాజీ దగ్గరికివెళ్లి "నువ్వు చెప్పావుగాని నేనుండలేకపోయాను పిన్నీ. అందులో పురుడు రెండో జన్మతో సమానమన్న మాట వినేసరికి నాకెక్కడలేని భయమూ యెత్తుకొచ్చింది. నువ్వేమన్నా అయితే నాకేమిటుంది పిన్నీ?" అన్నాడు చెమ్మగిల్లిన కళ్ళతో.

"పిచ్చీ, అదేమిటోయ్ అలా అవుతావు? నాకొచ్చిన భయమేమిటి? నిన్ను విడిచిపెట్టి నేనెలా పోతానోయ్ యముడితోనన్నా దెబ్బలాడుతానుగాని?" అంది రాజీ. అతని ముఖం వికసించింది.

మూడు రోజుల తర్వాత అతడిని ఒప్పించి తిరిగి పంపించడానికి తల ప్రాణం తోకకొచ్చింది రాజీకి. వెళుతూ "నువ్వొచ్చినప్పుడు నాకొక చిట్టి తమ్ముణ్ణి తీసుకొస్తావు కదూ పిన్నీ" అన్నాడు. "బారసాలకొస్తావు కదటోయ్" అంది రాజీ.

పురుడయిన నెల రోజులు తిరగకుండానే రాజీ పురిటి పిల్లాడిని తీసుకుని వాళ్ళ ఊరువెళ్లి పోయింది.

* * *

రాజీకి జ్వరంవచ్చి స్పృహపోకుండా పడి ఉంది. శంకరం ఆ మెగది వదలలేదు. ఎప్పటి కప్పుడు మందులూ పళ్లూ అవి అందించడం, తమ్మరకు చిట్టెని ఆడించడం, రాత్రిళ్లు కనిపెట్టుకుని ఉండి ఏదవసరమైతే అది చేస్తూ, నిద్రాహారాలు మానుకుంటున్నాడు. పిలవగా పిలవగా రెండు మెతుకులు కతికి అయిందనిపించుకుంటున్నాడు. ఇంటరు పరీక్షకోసం ఏకాగ్రతతో చదువుకుంటున్నవాడు మానేసి మూడు రోజులాయె పుస్తకాల వేపన్నా చూడలేదు. నాలుగోరోజు వంటావిడ విశ్వనాథంతో "బాబూ, చిన్నబాబు జొత్తిగా తిండి మానేస్తున్నాడు. అంతగా దెబ్బలాడితే యేదో రెండు మెతుకులంటించుకుంటాడు. ఎప్పుడూ అమ్మగారి దగ్గరేఉండి ఒళ్లు పాడుచేసుకుంటున్నాడు. మీరన్నా కొంచెం చెప్పండి." అంది. విశ్వనాథం తానన్ని పనులూ చూసుకుంటాననీ, శంకరం రోగివేపు రానక్కరలేదనీ, చదువూ అదీ ఎప్పటిలాగే చూసుకొమ్మనీ శంకరంతో చెప్పాడు.

ఆ సాయంత్రం విశ్వనాథం యేదో మందివ్వబోయి టేబిలుమీద రెండు సీసాలు ప్రమాదవశాత్తు పడదోసి, గాభరాలో గాజు పెంకులుత్రొక్కి గాయంచేసుకుని మంచమెక్కాడు. ఎప్పటిలాగే శంకరానికి మనస్ఫూర్తిగా తాను చేయాలని కోరుకుంటున్న రాజీ సపర్యలు చేయడానికవకాశమూ, అవసరమూ కలిగాయి.

ఆ రోజున డాక్టరు జ్వరానికి టైఫాయిడ్ అని పేరుపెట్టాడు. వెంటనే విశ్వనాథం మామగారికి టెలిగ్రామిచ్చి అత్తగారిని సహాయంకోసం రప్పించాడు. కాని, శంకరం మాత్రం రాజీ సపర్యలు మానలేదు. కామేశ్వరమ్మ రాత్రి పది గంటలప్పుడు రాజీ మంచందగ్గర క్రిందను మంచాన్నానుకుని కూర్చున్న శంకరాన్ని చూసి "బాబూ, నీకెందుకోయ్ యీ అవస్థ? పెద్దదాన్ని నేనున్నానుకదా! రాత్రి నేనిక్కడుండి రాజీకి కావలసినవి చూస్తానులే. నువ్వుపోయి పడుకోడమో, చదువుకోడమో చెయ్యి" అంది.

"అమ్మమ్మగారూ, పెద్దవారు రాత్రల్లా మేలుకుని మీరెలా ఉండగలరండీ? ఎప్పటి కేమందులివ్వాలో, పళ్ళరసం అవీ యెప్పుడెలా యివ్వాలో మీకు బాగా తెలియదు. పిన్నికి నాచేతుల్తో సేవచేసి ఆవిడ ప్రాణం దక్కించుకున్నానన్న తృప్తి నాకు కలగనివ్వండి. మీరు విశ్రాంతి చూసుకోవలసిన అవసరమెంతగా ఉంది కదా!" అన్నాడు శంకరం.

ఒకరాత్రి రాజీకి తెలివివచ్చి కళ్లువిప్పి చూసేప్పటికి తనకు దగ్గరగా క్రింద కూర్చుని, మంచంమీద తలవాల్చి నిద్రపోతున్న శంకరం కనుపించాడు. నీరసించిన ఆమె కుడిచెయ్యి మెల్లగా అతని తలమీదకు వెళ్లింది. వ్రేళ్లు జుట్టులోకిపోయి వెల నిమురుతున్నాయి. "శంకరం", అని పిలిచింది. ఉలిక్కి పడిలేచాడు "ఏం పిన్నీ, ఏమి కావాలి? కాస్త ఓవల్టీ నివ్వనా? పాడునిద్ర యింతలోకే వచ్చేసింది." నేరంచేసిన వాడిలా సిగ్గుపడుతున్నాడు.

"ఇంత రాత్రిప్పుడు ఇక్కడ కూర్చున్నావేమోయ్? అమ్మ ఉందిగా? నువ్వు నిద్రాహారాలు మానుకుని యెందుకింత శ్రమపడతావోయ్? చూడు, ఆ కళ్లు లోతుకుపోయి, చిక్కిపోయి ఎలా ఉన్నావో! మీ అమ్మఉంటే నిన్నీ పరిస్థితికి తీసుకురావడానికి ఒప్పుకుంటుందా? నేనుండి నీకు చేస్తున్న ఉపకారమిది" అంది రాజీ.

"లేదు పిన్నీ, ఇప్పుడే చదువు పూర్తిచేసుకుని ఒక్కమారు నిన్ను చూసిపోదామని వొచ్చాను" అని అబద్ధమాడాడు.

"ఏమో, నాకెప్పుడు తెలివొచ్చి చూసినా పగలూరాత్రీ నువ్వీగదిలోనే కనిపిస్తున్నావు. ఎప్పుడు తింటున్నావో, ఎప్పుడు చదువుకుంటున్నావో, అసలు పడుకుంటున్నావో లేదో తెలియకుండా ఉంది. పోయిపడుకో నాయినా ఒంటికొస్తుంది. కావలిస్తే అమ్మనిపంపు" అంది రాజీ.

"అలాగే పిన్నీ. నేను మాత్రం యెంతోసేపు కూర్చుంటానా? ఇప్పుడే తమ్ముడేడుస్తూ ఉంటే అమ్మమ్మగారిని వాడి దగ్గరికిపంపి యిక్కడ కూర్చున్నాను" అని కదలకుండా అక్కడే కూర్చున్నాడు.

రాజీకి జ్వరం తగ్గి స్వస్థతచేకూరుతున్నప్పుడు కూడా శంకరం ఆమెదగ్గర రాత్రిళ్లు కాపలా ఉండడం మానలేదు. ఒక అర్ధరాత్రి రాజీ అంది "శంకరం, నువ్వు నన్ను బ్రతికించడానికెంతశ్రమ పడ్డా

విషమిస్తుందనీ, కాబట్టి తప్పక వెంటనే వచ్చి అతణ్ణి తీసుకెళ్ళవలసిందనీ వ్రాసింది. ఆ రోజల్లా రాజీ శంకరం గదిలోకి వెళ్ళలేదు. ఆ రాత్రి శంకరానికి జ్వరం తీవ్రమై అమితంగా దగ్గుకూడా వచ్చింది. అతను ఖళ్ ఖళ్ మని దగ్గుతున్నప్పుడల్లా రాజీ గుండెల్లో శూలాలతో పొడుస్తూన్నట్లనిపించింది. కాని అతని సహాయానికి అతని గదిలోకి వెళ్ళడానికి కాళ్లు రాలేదు. పాపం యేమి చేయగలదు? అబల; నిస్సహాయ. మరునాడు డాక్టరు శంకరాన్ని చూసి విశ్వనాథంతో యేదో చెప్పి వెళ్లిపోయాడు. విశ్వనాథం రాజీతో యేమీ చెప్పలేదు. రాజీ అడగలేక పోయింది కూడా. కాని యేదో ముంచుకొచ్చిందన్న దిగులు మాత్రం ఆమె గుండెల్లో ప్రవేశించింది.

మరి రెండు రోజులకి శంకరం మేనమామ కేనత్తా వచ్చాడు. ఈలోగా అతని జ్వరం ఉద్ధృతం కొంత తగ్గింది. సుందరమ్మ అసలు సంగతి తెలుసుకుందామని రాజీని కంగించి అడిగింది. రాజీయేమీ చెప్పలేకపోయింది. "ఏదో పెంచి పెద్దవాడిని చేద్దామనుకుని మీకుగాకుండా తీసుకొచ్చాను. లోకంలో ఆపది చేయగలిగిందేముంది చెప్పండి. పోనీ మీ దగ్గరన్నా అతను బ్రతికి బట్టకడితే అంతే చాలు. వొదినగారూ, శంకరం అమాయకుడు; వెన్నలాంటివాడు. ఈ లోకానికి తగ్గవాడు కాడు. జాగ్రత్తగా చూడండి. ఇకమీద అన్నింటికీ మీరే అతనికి" అని కళ్ళల్లో నీరు గ్రుక్కుకుంది. రాజీ.

శంకరానికి తన్ను ప్రయాణం కడుతున్నారన్న సంగతి తెలిసేప్పటికి అంతా అయోమయంగా తోచింది. అప్పటికి మూడు రోజులై రాజీ తనకంటికి కనబడకపోవడంకూడా యెంతో విపరీతంగా తోచి బాధపడ్డాడు. వెళుతున్నప్పుడు తండ్రిదగ్గర సెలవుపుచ్చుకోడానికి వెళ్లి "నాన్నగారూ, వెళుతున్నాను, మళ్లీ యెప్పుడు వొస్తానో తెలియదు. తప్పులేమన్నా ఉంటే క్షమించండి" అన్నాడు. విశ్వనాథం అటువేపు మొహం తిప్పుకుని "సరే" అన్నాడు. ఇంక రాజీదగ్గర సెలవు పుచ్చుకోవడమే మిగిలింది. అసలే నీరసంగా ఉన్న అతనికి రాజీగది సమీపించేప్పటికి కాళ్లు వణికాయి. గదిలోకివెళ్లి, తన మంచందగ్గర నిలుచున్న రాజీ కాళ్ళముందు సాష్టాంగపడి ఆమె పాదాలు పట్టుకున్నాడు.

"పిన్నీ, వెళుతున్నాను. ఇంతకాలం నా అపరాధాలన్నీ కడుపులో దాచుకుని నన్ను సాకావు. తల్లి లేనిలోటు కనపడకుండా చేశావు. నీకుకూడా నా మీద దయతప్పిపోయిందా పిన్నీ నన్ను పంపించేస్తున్నావు?" అన్నాడు. రాజీ మరి నిలుచోలేక పోయింది. అటువేపు తిరిగి, మొహం రెండు చేతుల్తో కప్పుకుని, అలాగే మంచంమీదికి ఒరిగిపోయింది. ఎంతసేపటికీ మాటరాకపోవడం చూసి శంకరం ఆ గదిలోనే ఆడుకుంటున్న ఆనందాన్ని చేతుల్లోకి తీసుకుని "చిట్టీ, నన్ను మరిచిపోకూ, అమ్మకి నామీద కోపమొచ్చింది. తెలిసి నేనే తప్పూ చెయ్యలేదురా తమ్మూ. బ్రతికుంటే వొచ్చి తన పాదాలదగ్గర క్షమాపణ చెప్పుకుంటానని చెప్పూ. మనమ్మకి మనమీద కోపమెంతకాలం ఉంటుందోయ్?" అన్నాడు.

శంకరం రాజీ దీవన పొందకుండానే వెళ్లిపోయాడు.

* * *

వేగిపోతున్న మనసుతో రాజీ శంకరం ఆరోగ్యం గురించిన ఉత్తరంకోసం రోజూ యెదురు చూస్తూంది. ఒక్కొక్కప్పుడు ఆమెకి తెలియకుండానే కాళ్లామెను శంకరం గది దగ్గిరికి యీడ్చుకెళ్ళేవి. ఇంకా అతనక్కడే ఉన్నాడన్న భ్రమతో గదిలోకి చూసేది. ఖాళీగాఉన్న గదిచూసి తన పొరపాటు తెలుసుకొనేసరికి యేదో దిగులు కడుపులోంచి పుట్టుకొచ్చేది. నెల్లాళ్ళయినా యేకబురూ తెలియకపోయేసరికి ఆత్రం, అనుమానమూ హెచ్చయాయి. భర్తకేమన్నా తెలుసేమో అనుకున్నా అడగలేకపోయింది. ఈపాటికి బాగుపడి ఉండదా అని మనస్సుని సమాధానపర్చుకుందామనుకుందిగాని సాధ్యంకాలేదు. అందరూ తనకు వ్యతిరేకంగా గూడుపుఠాణీ చేస్తున్నారేమో అనిపించింది. ఏమన్నా ఉత్తరాలువచ్చినా భర్త తనకి చూపించలేదేమో! ఈ అనుమానం మనసులోకి రాగానే ఆగలేకపోయింది. వెంటనే సుందరమ్మపేర ఒక ఉత్తరం శంకరం ఆరోగ్యమెలా ఉన్నదీ వెంటనే తెలియపర్చవలసిందని వ్రాసింది. తిరుగుటపాలో సుందరమ్మవద్దనుంచి జవాబు వచ్చింది.

"మీ ఉత్తరం చూస్తే యిదివరకు మేము వ్రాసిన రెండుత్తరాలూ మీరు చూడనట్టు తెలు

స్తూంది. అన్నగారి ఆఫీసు యడ్రసుకు వ్రాయమం చేత ఆయన మీకు చూపించలేదేమో. అన్న అనుమానం కలిగి నా ఉత్తరం మీ పేరనే వ్రాస్తున్నాను. శంకరానికి క్షయవ్యాధి అని యిక్కడి డాక్టరు నిర్ధారించి యేవన్నా ఆరోగ్యాశ్రమంలో కొంతకాలం ఉంటే బాగుపడవచ్చునేమో అని సూచించారు. మాకది సాధ్యంకాక యీ విషయం మేము మొదటి ఉత్తరంలో మీకు వ్రాస్తే దానికేమీ జవాబురాలేదు గాని, రెండువందలు మనియార్డరు మాత్రం అన్నగారు పంపారు. రెండువందలూ రోజుల్లో యెందుకు సరిపోతాయి చెప్పండి? అందుచేత ప్రస్తుతం యిక్కడే శంకరానికి మందిప్పిస్తున్నాం.

"శంకరం తన పరిస్థితి తెలుసుకున్నాడు. అతనికి మిమ్మల్ని మళ్లీ చూడలేకపోయానన్నదొక్కటే చింత. ఈ విషయం మీకు మా రెండో ఉత్తరంలో తెలియపరుస్తూ, ఒక్కమారు మీరువస్తే బాగుంటుందని వ్రాశాం. శంకరం రోజూ మీకోసం యెదురుచూస్తూ రాకపోయేసరికి 'ఈ వేళ కూడా రాలేదు కదూ? పెన్నికి నామీద కోపంపోలేదు. పెన్ని నన్ను క్షమించలేదు' అంటూ ఉంటాడు.

"ఇప్పుడతని ఆరోగ్యం బాగా క్షీణదశకి వచ్చేసింది. ఆట్టే రోజులు బ్రతకడం కష్టమని డాక్టరంటున్నాడు. వీలు చూసుకుని మీ రొక్కమారు రావాలని మాకోరిక. మిమ్మల్ని చూడకపోతే అతనికి శాంతి ఉండదు."

రాజీకి కడుపు తరుక్కు పోతూంది. గుండె బరువెక్కి పోట్లుపొడుస్తున్నట్టనిపించింది. నిస్త్రాణతో కుర్చీలోకూలబడిపోయింది. అలా యెంతసేపుందో ఆమెకు తెలియలేదు. దుఃఖం కెరటాల్లాగా పెల్లుగా వొస్తోంది. కర్తవ్యం తోచడంలేదు. ఆమె మనసు విలవిల కొట్టుకుంటూంది.

విశ్వనాథం ఆఫీసునుంచి యింటికివచ్చే వేళకి యెలాగో గుండెదిటవు చేసుకుని ముఖంమీది కన్నీటి చారలు కడుక్కుంది. గదిలోకివచ్చిన విశ్వనాథానికి కాఫీ కప్పులోపోసి, అతనికి దగ్గరగా టేబిలుమీద చేతులానుకుని నిలుచుంది. రాకుండా ఉన్నమాటని అతి ప్రయత్నంమీద తెచ్చుకుని "శంకరానికి చాలా జబ్బుగా ఉందట" అంది. కాఫీ త్రాగుతున్న అతను ముఖమెత్తి ఆమెవేపు నిదానించి చూస్తూ "నీకెలా తెలిసింది" అన్నాడు.

"ఉత్తరం వచ్చింది—నా పేర. మీకొచ్చిన ఉత్తరాలు నేనేమీ దొంగతనంగా చూడలేదు లెండి" అంది రాజీ.

"నాడి ప్రసక్తి నువ్వు మానవంలేదన్నమాట" నిశితంగా ఆమె ముఖం పరిశీలిస్తున్నాడు.

"మానలేను. ఈ కట్టెలో ప్రాణమున్నంత వరకు మానలేను" ఆమె గొంతు వొణికింది.

"సరే" సగంత్రాగి బల్లమీద ఉంచిన కాఫీ కప్పులోకి చూస్తున్నాడు. ఆ మాటలో బెదిరింపు ధ్వనిస్తూంది.

కొద్దిక్షణాల మౌనం. లోనున్న పటపటాంగంలో యెవరి స్థానబలం వాళ్లు చూసుకుంటున్నారు.

రాజీ: "శంకరం యెన్నోరోజులు బ్రతకడు. అతణ్ణి నా పొట్టను పెట్టుకున్నాను పాపిష్టిదాన్ని. పుట్టెడు రోగంలో నాయింట్లో బాధపడుతూ ఉంటే కూడు రోజులు కంటితో చూడనన్నా చూడలేదు. చివరకు వెళుతున్నానని చెప్పడానికి వొస్తే మాటన్నా మాటాడకుండా మొహం తిప్పేసుకున్నాను." అతను కుర్చీలోంచిలేచి చరచరా కిటికీ వద్దకు నడిచి అవతలికి చూస్తున్నాడు. ఆమెకూడా అతనివెంటనే నడిచి ఉద్రేకంతో "ఇదంతా మీకు భయపడి. మీ అనుమానం నా నవనాళ్లూ బిగించేసి నన్నెందుకూ పనికిరానిదాన్ని చేసేసింది. అతని చావుకి జవాబు చెప్పుకోవలసిన బాధ్యత మనిద్దరి మీదా ఉంది. అతను మనల్ని చూడాలని అలమటిస్తున్నాడు. ఇప్పుడన్నా పొరపాటు దిద్దుకుని వ్యవధి ఉండగానే వెళదాం పదండి" అంది.

అతను ఒక పెద్ద నిట్టూర్పు విడిచి గిరుక్కున ఆమెవేపు తిరిగాడు "ఇదిగో, ఆఖరుసారి చెపుతున్నాను; ఆవూసు మళ్లీ యెత్తొద్దు" అని విసురుగా గదిలోంచి నడిచాడు.

ఆ రాత్రి రాజీ విశ్వనాథాన్ని మరి చూడలేదు. మరునాడు ప్రొద్దున్నే తన బట్టలుపెట్టెలో సర్దుకుంది. పోయి కిటికీదగ్గర నిల్చుని శూన్య దృష్టితో ఆకాశంలోకి చూస్తోంది. నిద్రలేకపోవడం వల్లో ఏడవడంచేతనో ఆమె కళ్లు వాచి యెర్రగా

ఉన్నాయి. చెక్కిళ్లు పాలిపోయాయి. చిట్టి ఆకలి ఏడిస్తే ఫ్లాస్కులోని ఓవల్టీ నిచ్చింది. తనకోసం సుబ్బమ్మ బల్లమీదుంచిన కాఫీ అలాగే చల్లారి పోయింది.

తుపాను రాబోయేముందు వాతావరణంలా యిల్లంతా నిశ్శబ్దంగావుంది. నౌఖర్లు ఈ అనర్థాన్ని శంకించి యేం చప్పుడుచేస్తే యేకొంప మునుగుతుందో అన్నట్టు పనులు చేసుకుంటున్నారు.

మెయిలు వేళకి రాజీ బంట్రోతు సూరయ్యను పిలిచి ఒక రిక్షాను తీసుకొచ్చి అందులో తన పెట్టెను పెట్టమని చెప్పింది. సూరయ్య తలవంచుకొని బెదురుతూ యేదో చెప్పబోయాడు. "చెప్పినపని ముందు చెయ్యవోయ్" అని రాజీ శాసించేసరికి వాడినోటికి తాళంపడి పరుగెత్తాడు. పిల్లవాడినెత్తుకొని రాజీ విశ్వనాథం ఉన్న పడకగది గుమ్మందగ్గరకు వెళ్లింది.

"నేను వెళుతున్నాను" అంది.



"మళ్లీ రావడం యిష్టంలేకపోతే నా అభ్యంతరం లేదు" అన్నాడు విశ్వనాథం ఆమెవేపు చూడకుండానే.

"నా కిప్పుడు బోధపడుతోంది మొదటావిడ యెందుకలా చేసిందో" అంది రాజీ రోషంతో.

"ఆవిడ ననుసరించదలచుకుంటే నాతో చెప్పడ మెందుకు ?" అన్నాడు విశ్వనాథం.

మొదట పుట్టింటికే వెళదామనుకుంది గాని ఆమెలో తిరుగుబాటు తలెత్తింది. "వెళతాను. శంకరం దగ్గిరికే వెళతాను. నన్నెవరాపగలరో చూస్తాను" అంది కోపంగా.

విశ్వనాథం కొంచెం చలించాడు. కాని మళ్లీ గుండె కఠినం చేసుకున్నాడు. "నామాట గడ్డిపరకంతన్నా విలువచేయకుండా నన్ను తిరస్కరించి పోతున్నావు. రాబోయేది కాసుకోకుండా ఉన్నావు. నువ్వువెళితే వెళ్లొచ్చు. కాని పిల్లవాడిని మాత్రం తీసుకెళ్ళనివ్వను" అని చిట్టిని ఆమెచేతుల్లోంచి లాక్కుంటున్నాడు.

రాజీ భయపడ్డది. "వాడు నా కొడుకు. వాణ్ణి నాదగ్గరినుంచి వేరుచేయకండి. నన్నన్ని విధాలా చంపేయకండి" అంది చిట్టికోసం పెనుగులాడుతూ.

చిట్టిని ఛాతీలో లంకించుకున్న తరవాత "ఇప్పుడెలా వెళతావో చూస్తాను" అని విశ్వనాథం దూరంగా వెళ్లాడు. చిట్టి గోలపెట్టి యేడుస్తున్నాడు. కట్టేసినట్టుగా రాజీ గడిద్వార బంధానికి చేరబడిపోయింది. ఏదో పెద్ద పెనుగులాట ఆమె గుండెలో ప్రారంభమైంది. కాస్సేపటికి ఆమె ముఖం గంభీరమైంది. బరబరా వీధిలోకినడిచింది. రిక్షాయెక్కబోతూండగా సూరయ్య "అమ్మగారూ, అమ్మగారూ, కాసింత నిదానించండి. మమ్మల్ని తల్లిలేని వాళ్ళని చేసేకండి" అన్నాడు. ఒకమారు సూరయ్యవేపూ, యింటివేపూ చూసి "నడవవోయ్ స్టేషనుకి" అంది రాజీ రిక్షావాడితో.

*   *   *

రాజీ శంకరం మేనమామగారింటికి వెళ్లేప్పటికి శంకరం పరిస్థితి నేడో రేపో అన్నట్టుంది. ఉబికి వస్తూన్న దుఃఖాన్ని ఆపుకుంటూ అతను పడుకున్న మంచాన్ని సమీపించింది. మెరుస్తున్న ఆకళ్లుతప్ప అతిడిలో మునపటి శంకరం పోలికేలేదు. రాజీని చూసి "పెన్నీ, వొచ్చావా ? నిన్ను మళ్లీ చూస్తాననుకోలేదు. తమ్ముడేడీ ?" అన్నాడు.

"వాడికి ఒంట్లో బాగాలేదోయ్. తీసుకు రాలేదు. అందుకే యిన్నాళ్లూ రాలేకపోయాను కూడా" అంది రాజీ.

"తమ్ముణ్ణిచూసే అదృష్టంలేదు. పోనీ, నీ దర్శనమన్నా లభించింది. అదే పదివేలు. నిన్ను చూడకుండా యెలా చచ్చిపోగలను పెన్నీ ?" అతని కళ్ళంట నీళ్లు కారుతున్నాయి.

"అలా అనకు శంకరం. నీకేమీ భయంలేదు. పదిరోజుల్లో మళ్లీ తేరుకుంటావు" అని అబద్ధమాడింది రాజీ. ముఖం అటువేపు తిప్పుకుని పైట చెంగుతో కళ్లు తుడుచుకుంది.

నిస్పృహతో కూడిన చిరునవ్వొకటి అతని యెండిన పెదవుల్లో మెరిసింది. "నాకు తెలుసు పెన్నీ. నాకింకా యెన్నో రోజులు గడువులేదు. నన్నొక్కటే యిన్నాళ్లూ బాధించింది. నామీద నీకెందుకు కోపమొచ్చిందో తెలియలేదు. ఎంత వెతుక్కున్నా నా నేరమేమిటో కనుక్కోలేకపోయాను. తెలియకచేసిన తప్పేదన్నా ఉంటే క్షమించు పెన్నీ" అని నీరసంవల్ల కళ్లు మూసుకున్నాడు. రాజీ పైట చెంగులో ముఖం పెట్టుకుని వెక్కి యేడుస్తోంది. అతను మళ్లీ కళ్లు తెరిచాడు.

"ఏడుస్తున్నావా పెన్నీ ? నామీద నీకు కోపం లేదన్నమాట. ఆ వొక్కమాట నీ నోటంట వింటే నేను కోరేదింకేమీ లేదు. హాయిగా నిద్రపోతాను" అన్నాడు.

"నీమీద నాకు కోపమేమిటోయ్ బాబూ ? అదంతా నాకర్మ. నువ్వు నిశ్చింతగా పడుకో." అంది రాజీ ఏడుస్తూనే.

శంకరం కళ్లు మూసుకుని శాంతంగా నిద్రావస్థలోకి జారాడు.

ఆ మూడో రోజు రాత్రి శంకరం ప్రశాంతంగా రాజీ తొడమీద తలపెట్టుకుని శాశ్వతంగా కళ్లు మూసుకున్నాడు.

*   *   *

రాజీ వాళ్ళవూరు తిరిగివెళ్లేసరికి యింటికి తాళంపెట్టి ఉంది. సూరయ్యను కనుక్కుంటే "బాబుగారు రెండు నెలలు సెలవుపెట్టి చిట్టిబాబుగారితో కూడా యే వూరో వెళ్లిపోయారమ్మా" అన్నాడు.

రాజీ అలాగే పుట్టింటికి వచ్చేసింది.

---

త్కటముగఁ బాడెఁ జుట్టిన మృగంబులు
సోమ, మనుష్యరూప ధూ
ర్జటి మునిముఖ్య లోక గురు
జంగమలింగము మల్లికార్జునా.

కుమా - ౬ ఆ. ౧౭ ప

శబరకామిని పటికపురోటిలో వెదురుబియ్యము పోసి ఏనుగుకొమ్ము రోకటితో దంచుకూ జంగమ మల్లికార్జునునిమీద పెక్కు రాగములతో పాట పాడిన దట! అప్పు డక్కడ చుట్టుపట్టులనుండిన మృగములు కూడ నోరలు మఱచి సొమ్మసిల్లినవి!

ఈ పద్యంలోని విషయం ఎటుకు జీవితవర్ణన మాత్రంగానే పయికి ప్రతిభాసిస్తున్నా యిది ఆనాటి ప్రజాజీవనంలోని ఒక ప్రధానవిషయాన్ని పట్టి యిస్తున్నది. శబరకామిని అప్పుడు పాడిన పాటలు దంపుళ్ళ పాటలు! క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దినాటికే దంపుళ్ళపాటలు ప్రజాజీవన వ్యవహారంలో వుండి నట్లు ఈ పద్యంలోని విషయం మనకు ప్రబలమైన సాహిత్యాధారాన్ని ప్రసాదిస్తూ వున్నది. సువ్వి, సువ్వాల లనబడే దంపుళ్లపాటలు నన్నిచోడని కంటె పూర్వంనుండీ మన తెలుగునాట వ్యవహారంలో వుండేవని యిందువలన మనకు తెలియవస్తున్నది. ఇలాగే ప్రజాజీవనస్ఫూర్తితో మెఱసిపోయే ఘట్టాలు తెలుగు కావ్యాలలో అక్కడక్కడా మబ్బులలో దాగుడుమూత లాడుతూ వుంటవి. సోమనాథుని పండితారాధ్య చరిత్రమూ, శ్రీనాథుని క్రీడాభిరామమూ, పలనాటి వీరచరిత్రా, కృష్ణరాయని ఆముక్తమాల్యదా, నారాయణ కవి హంసవింశతీ ప్రజాజీవనాన్ని పరిస్ఫురింపజేసే గ్రంథాలలో ప్రధానంగా పేర్కొదగ్గవి.

వస్తువు, భాష, భావము, ఛందము—ఇన్నిటి లోనూ సంస్కృతసాహిత్యమార్గాన్ని అవలంబిస్తున్న మార్గకవుల పైఖరి శివకవులయిన సోమనాథుడు మొద లయినవారికి నచ్చలేదు. దేశికథావస్తువుతో, జాను తెనుగుపదములతో, దేశిఛందస్సులో కవిత చెప్పి శివకవులు ప్రజలకు సన్నిహితులయినారు. ప్రజా జీవనాన్ని ప్రజలభాషలో రచించి ప్రజాకవు లని పించుకొనినారు. సోమనాథుడు నాటి ప్రజా జీవనాన్ని పండితారాధ్య చరిత్రలో అందులోనూ పర్వతప్రకరణంలో ఈకాలంలోవున్న మనంకూడా కన్నులార దర్శింపగలిగేటట్టు చిత్రించినాడు.

పంటకోతలు ముగిసి నూర్పిడి అయినతర్వాత సంక్రాంతినాటికల్లా కొత్తధాన్యాన్ని ఇల్లు చేర్చు కుని తెలుగు రైతాంగం సంక్రాంతినాడు పెద్ద పండుగ చేసుకుని, కొత్తబియ్యంతో పొంగళ్లు పొంగించుకుని యింటిల్లిపాదీ ఆరగించి ఆ నాలుగైదు రోజులూ అత్యానందంగా వెళ్లబుచ్చుతారు. ఆ తర వాత మళ్ళీ పొలంమున్ని విత్తనాలుచల్లేదాకా వుండే ముస్సకాలమంతా వాళ్ళకు విశ్రాంతి. ఈ విశ్రాంతి కాలంలోనే రైతాంగం సాధారణంగా యాత్రలు తలపెట్టుతుంది. సదా సర్వకాలమూ పంటచేలల్లో తీరిక అనేది లేకుండా పాటుపడిన రైతాంగానికి మొక్కుబడులు తీర్చుకోవడానికి, అనూచానంగా పెద్దలనాటినుండీ వచ్చే వంశాచారాలని ఆదరించ డానికీ, ఇలవేల్పులకు మొక్కుకోవడానికి ఇదే చాలా అనువైన కాలం. విశ్రాంతిదృష్టితోమాత్రమే కాక ఆర్థికదృష్టితో చూచినా ఇది వాళ్ళకు చాలా అనుకూలమైన కాలం. సాధారణంగా శైవ సంప్రదాయానికిచెందిన తెలుగు రైతాంగం శివరాత్రి నాటికి శ్రీశైలయాత్ర తలపెట్టేది. భక్తకోటి శ్రీశైల యాత్రచేసేసందర్భంలో ఎటువంటి సాంఘికజీవనం (*Social life*) గడిపేవో మనకు యీ ఘట్టంలో బాగా తెలుస్తుంది.

దోనమరాజయ్య శ్రీశైలయాత్రపోతూ మహేశ్వరద్వారమార్గంలో నడుస్తూవుండగా అతగాడితో కూడా యాత్రచేసే పరుస జనం

'సందడింపకుఁ డంచుఁ జక్కర మనుచు
వెనుకఁ జిక్కకుఁ డంచు వేగ రం డనుచుఁ
జనుఁడు ముందరనంచుఁ జనకేమి యనుచుఁ
దొల తొలఁ డనుచు నాత్రోవఁ బోం డనుచుఁ
దలరకుఁడీ యంచు దవ్వంటి యనుచు
సిరిగిరి యిదె యంచుఁ జేరితిమంచుఁ
బురమున కెన్నఁడు వోదుమో యంచుఁ
బొదపొడఁ డిపుడేమి వోయె మీ కనుచుఁ
బదినాళ్ళకైనఁ బోయెదము కా కనుచు
నీయూరి బసుతులిం గ్లెలుగుచే యనుచు
నాయేఁడు విడియమే యీయూర ననుచు

జయవెట్టు డిటుగూడ సాఁ తెల్ల ననుచు
జయజయ ఘోషయు ఘోషయ యనుచు'—
సల్లాపాలూ, సరసాలూ చేసుకుంటూ, ప్రయాణ
శ్రమ పరిహరించుకొంటూ ముందుకు సాగిపోతూ
వుండినది.

దోనమరాజు ద్రాక్షారామ భీమేశ్వరుని ఆలయం
చేరుకుని నిత్యలింగార్చన నియమములుతీర్చి పండితా
ర్చణముగా భక్తమండలికి పండువు చేసినాడు.
పండువు ముగిసినతరవాత పరుసజనం పరవశం చెంది

'చిందులు ద్రొక్కుచుఁ జెలఁగి యాడుచును
జప్పట్లు వెట్టుచు సఖులఁ బట్టుచును
నుప్పొంగి పేర్చుచు నుబ్బి యార్చుచును
బద్యముల్ సదువుచుఁ బ్రబంధ నొదవుచును
వాద్యముల్ గూర్చుచు వాద్యఁ దనర్చుచును
దాళముల్ వెట్టుచు దరువు ద్రొక్కుచును
సాళముల్ సూపుచు జతి సంపుచును
భ్రమరిఁ దొల్చుచు సమభంగి నిల్చుచును
గతులఁ ద్రాలుచును నాళతుల సోలుచును'—
కేళికలు సలిపినది. పంద్రెండవ శతాబ్దినాటి ప్రజా
నీకం పండుగలు చేసుకున్నతర్వాత ఎంతలా ఆనం
దంగా ఆ పండుగదినాన్ని గడిపేదో మనకు యిందు
వల్ల తెలుస్తుంది. ఆనాటి సాంఘిక జీవనం యిందులో
మనకు కన్నులకు కట్టడం లేదూ!

దోనమరాజు శ్రీశైలయాత్ర పోతూవుంటే
మార్గంలో అతనికి తగిలినవారు అనేకులు, అనేక
విధాలవారు, అనేక వేషాలవారు, జంగమకోట్లూ,
వృద్ధతపోధనులూ, మిండజంగాలూ, శీలవంతులూ,
విరక్తులూ, శివయోగులూ, అభ్యాసయోగులూ,
పుణ్యాంగనలూ, జోగులూ, పిచ్చుకుంటులూ, చెంచు
ధర్మాత్ములూ, ఒకరేమిటి? ఎందరో యెందరో
యెన్నిరకాలవారో అతని బాటలో తారసిల్లినారు.
ఈ సందర్భాన్ని పురస్కరించుకుని కవి ఆయా
వ్యక్తుల వేషభాషలను తనివితీర వర్ణించి మన
కానాటి ప్రజల వేషభాషలు కనులకు కట్టేటట్లు
చిత్రించినాడు. నాటి మిండజంగాల గడుసుతనమూ,
వార్ధక్యమూ చూడండి—

'బగుతుల చేత దాపఁగ నిచ్చినట్లు
దగిలి ఘట్టించి యర్థములు దెచ్చుటలు
గారోరి బగుత! తేరా లంజ కనుచు
నారంగ ప్రయోగమున కడిగి తెచ్చుటలుఁ
గలియుగ బసవండ విల నీవ యనుచు
నలరించి భక్తుల నడిగి తెచ్చుటలుఁ
బ్రాకటంబుగ నచ్చు పుణ్యాంగనలను
ద్రోకంటఁ జూచుచుఁ గొలిసేయుటలు
సరసలఁ బుష్పమంగలు నై చుటలు'
అనే వారి నడతలు నేటికీ రోత కలిగిస్తూ వారు
ఎంత అవినీతిపరులుగా వుండేవారో తెలుపుతున్నవి.
యాత్రకు పోతూవుండే పరుసజనం వెంటబడి పిచ్చు
కుంటులు పాటలు పాడుతూ బిచ్చమడిగేవారు.
ఆబిచ్చమడిగే తీరు ఆనాడు ఎలా వుండేదో
ఈ వాక్యాలు మనకు తెలుపుడు చేస్తున్నవి.
గమనించండి—

'తార మొసంగరే ధర్మాత్ములార!
రారో! యనుచు ముక్కుఁ జేరంగఁ బిలిచి
యేలయా యిందులో నెవ్వరేఁ గరుణ
నాలించి యక్కటా! యనరయ్య నాకు
జీవంగఁ జేతులు లేవయ్య, నడచి
పోవంగఁ గాళ్లును లేవయ్య, యంధ
కులమయ్య, పిచ్చుకుంటులమయ్య
తలపోయ నభ్యాగతులముసుండయ్య
యగపడ్డ నెడఁగుల మమ్ముమ్మఁ బ్రోవఁ
దగవరుఁ డుండయ్య, దయ గల్గుడయ్య,
పరమమాహేశుండు బసవయ్య కరుణ
సిరిగిరినాథుని కరుణయూ, మీకు
సుంకర బంకయ్య సురియ చౌడయ్య
శంకరదాసయ్య వెంక మంచయ్య
దేవరదాసయ్య దెలుఁగు జొమ్మయ్య
బావూరి బ్రహ్మయ్య బాచి రాజయ్య
భూమిలోఁ బోలెడు స్వామి భక్తుండు
దా మఱియొకఁడు లేఁడే మల్లినాథ!"—
అంటూ ఒక పిచ్చుకకుంటు పాడితే అతడివంట
వుండే తక్కిన పిచ్చుకకుంటులు 'తార మొసంగరే
ధర్మాత్ములార!' అని పల్లవి అందుకుని చేయి చాపే
వారట! ఇక చెంచు ధర్మాత్ములు పరుసజనానికి
యాత్రాసందర్భంలో అవసరమయిన సమస్తపదా
ర్థాన్ని తమవెంట తీసుకునివచ్చి యాత్రికులకు వలసిన
వారికి వలసినపదార్థాలు యివ్వడమే కాకుండా గిక్కి

గాలిపందిళ్ళు, సత్రశాలలూ, చెలమలూ, పందిళ్ళు, మరుగులూ, విడిదలలూ, ఎప్పటికప్పుడు ఏర్పరుస్తూ జంగమారాధన చేసేవారు. అంతమాత్రమే కాదు. పరుసజనానికి నీరు, పువ్వులు, కర్జూరములు, విడియములు ఇచ్చేవారు. నడవలేనివారిని నడిపించుకొని వచ్చేవారు. ప్రయాణపు బడలికతో సొక్కి సోలుతూ వుండే పరుసజనానికి చెంచుమగర్త్రుల వుపచారాలు అమృతోపమానాలు!.

పరుసజనం చుక్కలపర్వతం ఎక్కుతూ పాడే పాట యిది !—

'చేదుకో చేదుకో శ్్రీగిరినాథ !
చేదుకో మల్లయ్య చేదుకో మొర్రోయి
చేదుకో చేదుకో శ్రీశైల నిలయ !
చేదుకో మల్లయ్య చేదుకో మొర్రోయి
చేదుకో చేదుకో చేనేత నాయకా !
చేదుకో మల్లయ్య చేదుకో మొర్రోయి"—

ఈపాట పాడుతూ చిందులు త్రొక్కుతూ పరుసజనం చుక్కలపర్వతం ఎక్కేవారు. పరుసజనంలో అనేకజాతులవారు, అనేకప్రాంతాలవారు, అనేక భాషలవారు వుండేవారు. ఏయేభాషలు మాట్లాడేవారు ఆయా భాషల్లో కలిసికట్టుగా జట్లుగూడి పాటలు పాడుతూ కొండ యెక్కేవారు. అందులో తెలుగుదేశంనుండి వచ్చిన పరుసజనంపాడేపాట!—

"నల్లవో! నల్లవో! నగరాజరాజ!
మల్లయా! మల్లయా! మహనీయతేజ!
పరమపాలకకోట్లు భస్మమైతూలు
సిరిగిరి మల్లన్న శరణన్నఁ జాలు
రాఁబోవ నెంతదూరంబైన నడువ
నేఁ బోదు మల్లయ్య నేటేటఁ గొలువఁ
పాతాళ గంగా ప్రవాహ మెంతైనఁ
జూతునే మల్లికార్జున దేవునైనఁ
జుక్కలపర్వతం బెక్కు డెంతైనఁ
జిక్కకపోదునే శిఖరేశుఁ గాన
నల్లవో! నల్లవో! నగరాజరాజ!
మల్లయా! మల్లయా! మహనీయతేజ!"—

శ్రీశైలయాత్రపోయిన దోనమరాజయ్య శివరాత్రి నాటికి శ్రీశైలము చేరుకున్నాడు. శివరాత్రినాడు రాత్రి అందరూ జాగరణ. ఆ రాత్రెల్లా శ్రీశైలంలో ఒకటేమి కోలాహలం. ఆటలూ, పాటలూ, నాటకాలూ ఒకటేమిటి? అన్నీ వింతలే. అన్నీ వేడుకలే! ఎన్నని చెప్పేది? గడలు పట్టుకొని పైకి యెక్కిపోయి అక్కడ వేడుకలు చూపేవారు కొందరు. సాహసంగా కత్తి ఆ మొనలమీద నడుస్తూ పక్షుల వెన్నుస్తరు ఆడేవారు కొందరు. తెరమరుగులో వుండి బొమ్మలను కథానుకూలంగా ఆడిస్తూ భారతాది కథలను చూపేవారు కొందరు. ఆ కాలంనాటికే తోలుబొమ్మలాటలు ప్రజాజీవనంలో ప్రముఖపాత్ర వహిస్తుండినట్లు ఇది తెలుపుతుంది. కొందరు ప్రచ్ఛన్న వేషములు ధరించి ప్రేక్షకులకు సంతోషం కలిగించేవారట! ఇప్పటికీ గ్రామాలలో పగటివేషగాళ్లు కావడిమోసుకుంటూవచ్చి కావడి ఒకచోట దించి అందులోనుండి మీసాలు అవీ పెద్దగా తీర్చి రంగులుతీర్చివున్న చెక్కమొగమునుతీసి తలకు తగిలించుకొని గ్రామంలోనిపిల్లలకు వినోదంకలిగించడం మనలో అనేకులు బాగా ఎరుగుదురు. అటువంటి ప్రచ్ఛన్న వేషాలు ఆనాడుకూడా విరివిగా వేసేవారు. శివరాత్రినాడు శ్రీశైలంలో భక్తకోటి ఆడిన ఆటలు !—

'చప్పట్లు పెట్టంగ చక్కన లేచి
యప్పాట పదమాట లాడెడువారు
వేడుకతోఁ జిందువాడంగ నుబ్బి
కోడంగి యాటలఁ సనిసెడువారుఁ
బ్రన్నని నిజదేశభాషల జతుల
కన్ని కోడంగాట లాడెడువారు
భ్రమరముల్ సాళెముల్ బయకముల్ సాలసి
రమణఁ బంచాంగి పేరణి యాడువారు
ప్రమథ పురాతన పటు చరిత్రములఁ
గ్రమమొందఁ బహునాటకము లాడువారు
లలితాంగ రసకళాలంకారరేఖ
లలవడ బహురూప మాడెడువారుఁ
గరణముల్ మెరవణుల్ గతులఁ జిత్రములు
నరుదుగ నద్దంగ మాడెడువారు
నమరాంగనలు దివి నాడెడుమాడ్కి
నమరంగ గడలపై నాడెడువారు
నావియద్గతిఁ బక్షులాడెడునట్టి
భావన మ్రోకులపై నాడువారు
భారతాది కథలఁ జీరమఱుఁగుల

వాకంగ బొమ్మల నాడించువారు
గను నద్భుతంబుగఁ గంబసూత్రంబు
లుపరంగ బొమ్మల నాడించువారు
నాడట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు
వేసమునఁ బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకొన నట్లారు"—

భరత శాస్త్రాభినయం చేసే నటుకి అలంకారం ఏవిధంగా వుండేదో మనకు యిందులో తెలుస్తుంది.

'నెరసిన నురమునఁ జెవులఁ గంఠమునఁ
గరములఁ గూకటఁ గాళ్ళఁ గెళ్వారఁ
గవసంపెలును గనుఁగవ నరణికలు
నవరంబులును గలశంబు పంపెలును
భసితంబు పూఁతపై బరఁగు బచ్చెనలు
నసలారు చిఱుగజ్జియలు నందియెలును
సరి రత్నపంక్తుల జలపోసనములఁ
గర మొప్పు తొంగళ్ళు గల చల్లడములఁ

బొల్చు దంతావళుల్ పుష్పమాలికలు దాల్చి'—
నటుడు రంగస్థలంమీదికివచ్చి తెర యెత్తేందుకు ముందుగా నార్భటమిచ్చేవాడు. దానికి తగ్గట్టుగా వాద్య సమ్మేళనంకూడా వుండేది. ఆతరవాత తెర తీసేసరికల్లా నటుడు త్రిభంగి నిలిచి వుండేవాడు. ఆ తరవాత అభినయం శాస్త్రమర్యాదతో సాగి పోయేది. ఆ అభినయంలో అతడు చూపే నేర్పులు చాలా వున్నవి. అందులో కొన్ని—

"చిలుకయుఁ బోలెఁ జెన్నొలయఁ బలుకుచును
జలచరంబులువోలె జనుల కులుకుచును
గల హంసయునుబోలె నడుల నేర్పుచును
నిల మృగము ట్లిరిమిరిమి చూచుచును
నందుఁ గోయిలవోలెఁ గడఁగి కూయుచును
నంది క్రొంతియుఁ బోలె వికృతిసేయుచును
మహి భుజంగమువోలె మెలికలు గొనుచు
విహగంబు క్రియ వ్యోమవీథిఁ జనుచు"—

నటుడు ఆడుతూవుంటే ప్రేక్షకజనం పరవశం చెందిపోయేది—

ప్రజలను ఇలా వశం చేసుకున్న తరవాత అతడు శివలీలలను అభినయించి చూపేవాడు. అది శివరాత్రి పర్వదినం కావడంచేత ఆనాడు ప్రత్యేకం శివకథాభినయం నాట్యం, శివకథానాటకాభినయం పుణ్యప్రదంగా పరుషజనం భావించేది—

'పురములు గాల్చినపోల్కి నాడుచును
మరుఁ జెఱు వుచ్చినమాడ్కి నాడుచును
సతి కర్థమిచ్చిన చంద మాడుచును
యతులు గొల్వఁగనున్న యందమాడుచును
నంధకాసురుమదం బడఁచు టాడుచును
గంధగజాసురు గడపు టాడుచును
గర్వంబు ద్రుంచిన జాడ నాడుచును
వెన్నుంకు గన్నిచ్చు వేడ్క నాడుచును
గరళంబు దాల్చిన కరణి నాడుచును
సరి నజాతలఁ గొన్న సరణి నాడుచును'—

నటుడు శివలీలలను అభినయించి చూపుతుంటే పరుసజనం తమ జన్మ తరించినట్లుగా తలపోసి తృప్తి చెందేది. ఇవిగాక యింకా యెన్నో శివకథలను నాటకాలుగా ఆడేవారు. ఇలా ఆటలతోటి, పాటలతోటి శివరాత్రి జాగరణం ముగిసేది.



# కళాపథము

శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

లేత తురాయి వేకువ చలించిన దూరపతత్రి కంఠ సా
కూత కషాయ గీతమనుకూలముగా విని, ప్రాచివాలు కీల్
రాతిరి కొప్పువీడి యెదరాచిన తీయని కైశ్య జాలికల్
పాతరలాడగా తెరల బాయగ ద్రోయుచు రమ్యవీక్షకై !

పూచిన మావిగా, సొగసుమోచిన వంపుల బాళి బాటగా,
నేచిన కొండగా, తరగలేచిన యేటి మలంక హోరుగా
వేచిన, ద్రిమ్మరిల్లిన, దపించిన, నేగుడుసుళ్లు వోయినన్
దోచద, యెంతకుందనివి దూకొనదా రమణీయ భావితన్ !

అదురుగడన్ దనంత నెదుర్రై, కమనీయ పథాంతరంబునన్
మృదుపదముల్ భువిన్నిలుపు నేరుపులన్ హావణించు మించహో !
యిది యటుగాక నేల ప్రభవించి, యొయ్యారముగా నడించి నా
యెదుట త్రపాన తొంగి యగు నేనును మోకరయి ! నాదు జెంగటన్

నిలిచిన కమ్రమూర్తి ! మహనీయ శిలాజడ రమ్యభావనా
కలిత సుశిల్పవాహిని ! చకచ్చకిత ప్రణయ ప్రవల్హికా
సలలిత రాగరేఖ ! యెదచాయల లత్తుకరేకలద్ది భా
వలలిత రీతులం గొసరి భాషణల న్నను బల్కరించునే !

రాకకు పోకకున్, చలతరంగము మాడ్కి నిగారపుం జగా
వాక హొయల్ దలిర్ప నెదబాటల సన్నరొదల్ ఘటించుం
మ్యాకృతి కల్వపూల తడియారని నిద్దపు టోరజూపులే
జోకగు మాలగా నరుత జొప్పడ, కావ్యకళా పథాలలో

అదరుం జెదవుల యొరపో,
మదకల కలకంఠి కంఠ మాధుర్యమొ, కన్
తుదలం బొందలెడు లౌల్యమొ !
యెదలో సెలయేటి నడలు, యెలదేటి రుతుల్ !

---

# అపరాజిత

"అమరేంద్ర"

"దారి అడగటంకోసం వచ్చారా? చెప్పాంగా. ఇక వెళ్ళండి." అంది ఆ యువతి దురుసుగా.

అంతవరకూ జర్మన్ సైనికుడు ఆమెని సరిగ్గా చూడలేదు. అందకత్తె అనటానికి వీలులేదు. నల్లగా నిగనిగ మెరిసే కళ్ళూ, కోటేరు వేసినట్లున్న ముక్కూ. ముఖంలో నెత్తురు తక్కువ. వేషంకూడా సాదాగా వుంది. అయినా ఆ యువతిలో ఏదో ప్రత్యేకత కనిపిస్తోంది. యుద్ధం సాగిన దగ్గర్నుంచీ తోటి సైనికులనోట ఫ్రెంచి యువతుల సౌందర్యాన్ని గురించి ఎన్నో స్తోత్రాలు విన్నాడు. తన దేశపు స్త్రీలలో లేని నాజూకు, విలాసం ఫ్రెంచి యువతుల్లో కనిపించినయ్.

"సీసాఖాళీ చెయ్యి, పోదాం" అన్నాడు స్నేహితుడు.

కాని జర్మన్ సైనికుడు తాపీగా కూచున్నాడు. అక్కణ్ణుంచి కదల బుద్ధి పుట్టటంలేదు. "నువ్వు రైతుకూతురులాగా కనబడటం లేదే" అని ఆ యువతితో మాట కలిపాడు.

"అయితే ఏమంటావ్?" అంది యువతి పెంకెగా.

"మా అమ్మాయి పంతులమ్మ" అంది తల్లి.

"అయితే బాగా చదువుకుందన్న మాట" అని ముఖంకేసి చూసేసరికి యువతి కోపంగా ముఖం చిట్లించింది.

"ఇది మీ దేశానికి ఎన్నడూ దొరకని అవకాశం. ముందు యుద్ధానికి మీరే కాలుదువ్వారు. పొగరు అణిచాం. మీ ఫ్రాన్సు దేశాన్ని బానిస చేస్తాం. దేశంలో అశాంతిని అణిచేస్తాం. పని చెయ్యటం నేర్పుతాం. సోమరితనం పోగొట్టి మీకు విగ్గేయుతాం, శత్రువైనా ఆదరించి మరీ చూస్తాం" అని సైనికుడు ఏమిటో వాగేస్తున్నాడు. కోపంతో కంది పోయిన ముఖంతో పిడికిలి బిగించి, పళ్లు కొరుకుతూ ఆ యువతి కొరకొరా చూసింది.

"నిషాలో వున్నావు పోదాం పద" అన్నాడు స్నేహితుడు.

"లేదు. లేదు. నిజం చెబుతున్నాను. నిషా లేదు, గిషా లేదు" అన్నాడు సైనికుడు.

"తప్పతాగావు. ఇకపో ఇక్కణ్ణుంచి" అంది యువతి చీదరించుకుంటూ.

"బాగా చదువుకున్నావు కదూ. మా భాష అర్థం అవుతుందిగా. మంచిదే, వెళ్తాను. కాని ముందు నాకొక ముద్దు ఇవ్వాలి" అంటూ లేచాడు సైనికుడు. తప్పించుకోవాలని ఒక అడుగు వెనక్కి వేసింది. కాని అమాంతం లేచి యువతి చెయ్యి పుచ్చుకున్నాడు సైనికుడు.

"నాన్నా నాన్నా" అని అరిచింది యువతి. తండ్రి అమాంతంగా జర్మన్ సైనికుడి మీదపడ్డాడు. ఆమె చెయ్యి వొదిలేసి ముసలాడి ముఖంమీద ఒక్క గుద్దు వేసేసరికి అంతదూరాన పోయిపడ్డాడు. యువతి తప్పించుకు పారిపోయేలోగా గిరున వెనక్కి తిరిగి చేతుల్లో చుట్టేశాడు. బలంకొద్దీ సైనికుడి ముఖాన యువతి గుద్దింది. "జర్మన్ సైనికుడు ముద్దు అడిగితే ఇదేనా నీ మర్యాద? ఫలితం అనుభవిస్తావులే" అని క్రూరంగా నవ్వాడు. బలంకొద్దీ ఆ యువతి చేతులు వెనక్కి విరిచిపట్టుకుని జరజరా పక్కగదిలోకి ఈడ్చుకుపోతున్నాడు. తల్లి అడ్డంవస్తే ఒక్క తోపు తోసేసరికి గోడకి వెళ్ళి కొట్టుకుంది.

"హాన్స్! హాన్స్! ఏం పని యిది?" అని స్నేహితుడు కేకలు పెట్టాడు. "నోరుమూసుకో" అని జర్మన్ సైనికుడు హాన్స్ హుంకరించాడు.

యువతి నోరుగట్టిగా నొక్కేశాడు చేత్తో, అరిచినా వినబడకుండా ముద్దుకి బదులుగుద్దు ఇచ్చింది యువతి. అదే తెచ్చిపెట్టింది ఈ ముప్పు.

తిరిగి వెళ్ళిపోతూ ఇంకా నేలపడి మూలుగుతున్న ముసలాణ్ణి, గోడకి అంటుకుపోయి గజగజ వణుకుతున్న ముసలమ్మనీ చూసి హాన్స్ నవ్వుతున్నాడు. "భయంలేదు. ఇదిగో ఈ డబ్బుతో కొత్తబట్టలు కొనుక్కో" అంటూ బల్లమీద డబ్బుతో ఉన్న సంచీ ఒకటి పడేసి, టోపీ తగిలించుకుని "వస్తాంపద" అన్నాడు అక్కడేవున్న స్నేహితుడితో.

ముసలమ్మ తలుపు వేసింది. గదిలో సోఫాలో కూతురు ప్రాణంలేని బొమ్మలాగా పడివుంది.

* * *

మూడు నెలల తరవాత హాన్స్ మళ్ళీ ఆ వూరు వచ్చాడు. ఆనాడు తనకి కోపం తెప్పించి తన కామానికి బలి అయిన యువతిని ఒకసారి చూసిపోవాలనిపించింది. ఆమెకి ఏదైనా ఖరీదుగల కానుక ఇవ్వాలని తోచింది. ఎందుకని తోచిందో ఎవరు చెప్పగలరు?

ఆ యింటిని త్వరలో గుర్తుపట్టాడు. సాయంకాలం. ఆకాశం మబ్బులేకుండా నిర్మలంగావుంది. మోటార్ సైకిల్ దూరంగా నిలిపి ముందుకినడిచాడు. కుక్క మొరిగింది. పిలిపించుకోలేదు. తలుపుకొట్టకుండా తోసుకుని లోపలికి సూటిగా వెళ్ళాడు. ఆ యువతి చాకుతో బంగాళదుంపలు చెక్కుతీస్తున్నది. సైనికుడిని చూడగానే చివ్వునలేచి నిలబడింది. "ఎందుకు?" అని ముఖంకేసి తేరిపార చూసి అతన్ని గుర్తుపట్టి గోడపక్కకి నడిచి, పొడిచేట్టుగా కత్తి పైకెత్తి "నువ్వా? రాక్షసుడా! మళ్ళావచ్చావా సిగ్గులేక?" అని అరిచింది.

"భయంలేదు. నిన్నేం చెయ్యను. చూడు నీకోసం ఒక చిన్న కానుక తెచ్చాను"

"తీసుకుపో. ముందు బైటికినడూ" అని ఎత్తిన చాకుతో బెదిరించింది.

"కత్తిదించు. తొందరపడకు. ఎందుకు నేనంటే భయం?"

"నాకేం భయం లేదు" అంటూ యువతి చాకు కిందికి జారవిడిచింది. టోపీతీసేసి కుర్చీలో కూచుని కాలితో నేలమీది కత్తిని దగ్గరికి లాక్కుని "నీకు పని సాయంచెయ్యనా? కొన్ని దుంపలు నేను తరగనా?" అంటూ ఒక దుంప అందుకుని చెక్కుతియ్యటం సాగించాడు.

ఆ యువతి కదలకుండా గోడకానుకుని నిలబడింది. ముఖంలోనూ, కళ్ళల్లోనూ కోపం, రోషం, రోత.

"ఎందుకల్లా కొరకొరా చూస్తావ్ నాకేసి? ఆ రోజు నేను నిషాలో తొందరపడ్డాను. నీకేం అపకారం చేశాను? ఎందుకంత కోపం?"

అతనికేసి ఎగాదిగా చూసి "పో బైటికి" అని అరిచింది యువతి.

"అప్పుడేనా? నా యిష్టంవచ్చినప్పుడు నేను వెళ్తాను"

"అయితే మా నాన్న వెళ్ళి నీ పై అధికారికి ఫిర్యాదు చేస్తాడు"

"ఎన్ని చేసినా బుట్టదాఖలే. ఫ్రాన్స్ ప్రజలతో పరిచయం చేసుకోమని అధికారి ఆజ్ఞ. సరేకాని నీ పేరేమిటే?"

"అదంతా నీకనవసరం. మర్యాదగా నడు అవతలకి" కోపంతో యువతికళ్లు మెరిసినయ్. ముఖం జేవురించింది. ఇంత అందం ఆమెలోవుందని ఇదివరకు హాన్స్ గుర్తించలేదు. బస్తీయువతుల నాజూకూ, విలాసం ఆమెకి శోభనిస్తున్నయ్. ఆమె పంతులమ్మ అన్నమాట గుర్తుకొచ్చింది. అందుకే కాస్సేపు ఉడికించాలనిపించింది. వేళ్ళతో ఉంగరాలజుట్టు సవరించుకుంటూ, "మీ అమ్మా నాన్నా లేరా?" అన్నాడు.

"పొలంలో వున్నారు."

"అయితే-నాకు భలే ఆకలిగావుంది. కొంచెం ఏమున్నా తినటానికి తాగటానికి ఇస్తావా? ఊరికే వద్దులే. డబ్బిస్తాలే"

"ఇంట్లో ఏమీలేదు. ఉన్నది మాకేచాలదు. మా గుడ్డాలూ, ఆవులూ, కోళ్లూ అన్నీ మీరేగా గుంజుకుపోయిందీ?" అంది కోపంగా.

"అన్నిటికి డబ్బు ఇచ్చే తీసుకున్నాంగా ?"

"ఏం చేసుకుంటాం పొట్టకొరికితాలు ? నూరుకు తాగుతామా ? తిండి లేకపోయాక డబ్బు వుండి ఎందుకు ?" అంటుంటే కళ్ళల్లో నీళ్ళు తొణికినయ్.

"ఆకలేస్తోందా ?" అని ఆదుర్దాగా అడిగాడు హాన్స్.

"లేదు. ఏదో వొకటి తిని కాలం గళ్ళ దీస్తాం ఎల్లాగో బతక లేకపోతామా??"

"నా మాట విను. నేను నువ్వనుకునేటంత చెడ్డవాణ్ని కాను. మాకు తినటానికీ తాగటానికీ కొల్లలుగా దొరుకుతోంది. ఈ మాటు చాలానుంచి తిను బండారాలు తెస్తాను. ఏం ?"

"ఎవరికొక్కాలి నీ కానుకలు ? ఛా-నేను నూడిచస్తాను కాని ప్రాణంవుండగా నువ్వు తెచ్చే వాటిని వేలు వేసిముట్టను"

"అల్లాగే. చూద్దాంగా" అని నవ్వుతూ గుడ్ బై అంటూ వెళ్ళిపోయాడు.

పదిరోజుల తరవాత జర్మన్ సైనికుడు హాన్స్ మళ్ళ ఆవూరికి వెళ్ళటానికి వీలు కలిగింది. మునుపటి లాగే దభాలున ఇంట్లోకి అడుగుపెట్టాడు. ఈసారి ఆ యువతి తల్లిదండ్రు లిద్దరూ ఇంట్లో నేవున్నారు. తండ్రి బల్లముందు కూచున్నాడు. తల్లి పొయ్యిమీద ఏవో వండుతోంది. వాళ్ళిద్దరూ సైనికుడికేసి ఒక్కసారి చూసి మెదలకుండా వూరుకున్నారు. వాళ్లు ఇంట్లో లేనప్పుడు తను వచ్చివెళ్ళిన సంగతి కూతురు చెప్పేవుంటుంది. కళ్లు అప్పగించిచూస్తారే కాని ఒకళ్లూ నోరువిప్పరు.

చివరికి హాన్స్ "నేనొక మంచి కానుక తెచ్చాను" అంటూ పొట్లంవిప్పాడు. తేలికగా దొరకని తినుబండారాలు, ఖరీదుమండిపోయే పానీయాలు. వాటికేసిచూడగానే ముసలమ్మ నోరూరింది. కళ్ళలో ఇవన్నీ ఎప్పుడు అమాంతం తినేస్తానా అనే ఆత్రం మెరిసింది. సైనికుడు తన తెలివికి పొంగిపోయాడు. ముసలాడు మాత్రం వాటికేసి కోపంగా ఓర చూపులు విసురుతున్నాడు.

"ఆ రోజు నేను కొంచం దురుసుగా ప్రవర్తించినందుకు మన్నించాలి. మెదలకుండా వూరుకుంటే, మీకిద్దరూ అడ్డంరాకుండావుంటే నాకంత కోపం వచ్చేదికాదు. అంటూ సైనికుడు రాజీకి దిగుతుండగా యువతి ఎక్కణ్ణుంచో ఇంటికి తిరిగి వచ్చింది.

"ఎందుకొచ్చావ్ మళ్ళీ ? ఏమిటివన్నీ ?" అంటూ బల్లమీది పదార్థాన్నిటినీ ఒక్కతోపుతోసి "తీసుకుపో. ఇల్లు అవతలికి" అని అవన్నీ [illegible] పారేసింది.

"అన్యాయం ! నీకేమైనా మతిపోయిందా ?" అంటూ తల్లి అడ్డంవచ్చింది. కిందపడ్డ పదార్థాలన్నిటినీ పోగుచేసింది.

"ఈ కానుక లేమీ నాకక్కర్లేదు" అంది యువతి తీవ్రంగా.

"నీ కక్కర్లేకపోతే పోనీ. ముసలాళ్ళకయినా పనికివస్తయ్ కదా" అన్నాడు నవ్వుతూ.

తల్లి తినుబండారలన్నీ పోగుచేసి ఆప్యాయంగా గుండెలకి అదుముకుంది. తిండిదొరకని యుద్ధకాలంలో వాటి విలువ అమూల్యం. ముసలమ్మ ఆ పొట్లాలని కళ్ళకద్దుకుంది. ఈ దృశ్యం చూసి యువతి భగ్గుమంటి తొణికేకన్నీళ్ళతో "ఎంత సిగ్గు చేటు !" అని అరిచింది.

"అరుదైన సరుకులు కానుకగా తేస్తే అందుకోటానికి సంకోచం దేనికి ?" అంటూ కుర్చీలో కూలబడి సిగరెట్ వెలిగించాడు. మిగతా పెట్టెని ముసలాడికి అందించాడు. కొంచెం తటపటాయించి, తమాయించుకోలేక ఒకటి తీసివెలిగించి పెట్టె సైనికుడికి తిరిగి ఇవ్వబోయాడు. "అక్కర్లేదు. వుండనీ. నాకు బోలెడు దొరుకుతయ్." అంటూ గట్టిగా పీల్చి ఒక పొగమబ్బుని ముక్కుల్లోంచి వొదిలాడు. "జరిగిందేదో జరిగింది. ఇకముందు మనం మంచిగా ఎందుకుండకూడదూ ? నేనీ వూళ్లో చాలా రోజులుంటాను. అప్పుడప్పుడువచ్చి చూసిపోతాను. మంచి తినుబండారాలు తెచ్చిపెడతాను. నేనంటే భయందేనికి ? ఆ రోజు తొందరపడ్డాను. కాని ఇకముందు మీ అమ్మాయినీ మిమ్మల్నీ ఎంతో గౌరవంగా చూసుకుంటాను. నన్ను కూడా మీరు స్నేహంగా చూడకూడదా ? నేను స్వభావంలో చెడ్డవాణ్ని కాను. యుద్ధంలో ఇల్లాంటివి జరుగుతునే

వుంటయ్. మీ అమ్మాయి స్నేహాన్ని నేను మన సారా కోరుతున్నాను" అని ముగించాడు హాన్స్.

"మా ఇంటికి మళ్ళీ ఎందుకు రావటం? మా దారిన మమ్మల్ని బతకనీ. వెళ్లు" అంది యువతి కోపంగా.

ఎందుకో అతనికే తెలియదు. శత్రువులమధ్య చిక్కుకున్న హాన్స్ మానవహృదయం మధురమైన మైత్రికోసం పలవరిస్తోంది. ఈ యువతి పేరు ఏనెట్. పెద్ద రూపసి అని ఆమెని కోరటంలేదు. తనలాగా నీలిరంగు కళ్లూ, ఒడ్డూ పొడుగూ, బలమూ వున్న స్త్రీలనే అతను ఇన్నాళ్లూ ఆరాధించాడు. కాని ఈ యువతి ఏనెట్ లో ఏదో మాటలకి అందని ఆకర్షణ కనిపించి అతన్ని ముగ్ధుణ్ని చేస్తోంది. ఆ యింటికి మళ్ళీమళ్ళీ వెళ్లాలని మనస్సుకి ఎందుకు అని పిస్తున్నదో చెప్పలేకపోయాడు. ఏనెట్ కేసి తిరిగి తిరిగి చూస్తూ హాన్స్ వెళ్ళిపోయాడు.

తను కానుకగా ఇచ్చివచ్చిన పదార్థాలు ముస లాళ్ళిద్దరూ తినేసివుంటారు. అనుమానంలేదు. కాని ఏనెట్ కూడా తింటుందా? తేరగావచ్చేవి జార విడుచుకుంటారా ఎవరైనా? పైగా యుద్ధంలో ఫ్రెంచి జాతికి వెన్నెముక విరిగింది. తనమీది కోపం వల్ల నోరూరించే పదార్థాలని తినకుండా వుండగల నిబ్బరం వుందా ఆ యువతిలో? ఎప్పుడూ ఆ యువతి మీదే మనస్సంతా. ఇదివరకెవరూ తనని ఇంతగా ద్వేషించలేదు. స్త్రీలు తనకోసం పడి చచ్చేవారు. కోరిన స్త్రీ తనచేత చిక్కేదాకా వదిలే ఘటం కాదు హాన్స్. కాని ఈ యువతిలో కరుడు కట్టినద్వేషం అతనికో కొత్త అనుభవం ఇస్తోంది. ఆమనుష మనసులో ఈ పగలోంచి హఠాత్తుగా మమత అంకురిస్తే ఎంత బాగుండును అనుకుంటున్నాడు.

చాలా రోజులకి మళ్ళీ అటుకేసివెళ్ళే వీలు దొరికింది. మునపటికంటే అరుదైన, ఖరీదైన వస్తువులు మూటకట్టుకు తీసికెళ్లాడు. తండ్రీకూతురూ పొలంలోవున్నారు. ముసలమ్మ ఒక్కత్తే ఇంట్లో వుంది. అతని చేతులో మూటచూడగానే ముస లమ్మ మురిసిపోయింది. హాన్స్ చేతులోంచి అందు కుని వొణుకుతున్న చేతుల్తో మూట విప్పతోంది. అతను తెచ్చిన అమూల్య వస్తువులు చూస్తుంటే ఆనందంతో కళ్లు తడిసిపోతున్నయ్. "కూచో హాన్స్! ఎంతమంచివాడివోయ్!" అంది ముసలమ్మ.

"ఇంతమాత్రానికేనా?" అంటూ కూచున్నాడు. ముసలమ్మ కిటికీలోంచి కూతురు వస్తోందేమోనని చూసింది. రావటంలేదని గ్రహించి ఒక గ్లాసునిండా మంచి బ్రాందీనింపి "తాగునాయనా" అని ఆప్యాయంగా అందించింది.

తిండిమీది మక్కువవల్ల ముసలమ్మ పని మంచిచేసుకోవాలని ప్రయత్నించటం హాన్స్ గ్రహించాడు. కూతురుచూసి ఏమంటుందో అని బెరుకుగా వుంది ఆమెకి.

"మొన్న నేను తెచ్చినవి నచ్చినయ్యా?"

"అద్భుతంగా వున్నయ్. జన్మలో మరచ గలనూ వాటి రుచి"

"అయితే ఈసారి ఇంకా మంచిసరుకులు తెస్తాను. మీ అమ్మాయికికూడా నచ్చినయ్యా?"

"పిచ్చిపిల్ల! అది వేలువేసి ముట్టలేదు. తిండి లేక మాడి చావనైనాచస్తాను కాని ఈ పదార్థాలు ముట్టుకోనని పట్టుపట్టింది"

"తెలివి తక్కువ. మూర్ఖం" అన్నాడు హాన్స్.

"నేనూ అదే అన్నాను. ఇలాంటి అరుదైన పదార్థాలు తినకుండా నోరు బిగించుకోటం ఒట్టి వెర్రితనం" అంది తల్లి.

"నిజం. నిజం. ఈసారి ఇంకా మంచివి తెస్తాను" అంటూ లేచాడు హాన్స్.

తరవాత రాకపోకలు ఇంకా తరుచుగా సాగి నయ్. హాన్స్ వచ్చినప్పుడల్లా ఏదో తెస్తునే వుంటాడు. ఆవేళ ముసలి దంపతులకి పండగ. కాని యువతిలో మార్పేమీ లేదు. లోపల పగసెగలు రగులుతునేవుంది. ఏనెట్ ని ప్రసన్నం చేసుకోవా లని ఎన్ని ఎత్తులు ఎత్తినా, పాచికలు వేసినా ఫలితం కనబడలేదు. తనమీద ప్రీతి కలగకపోగా రోజులు గడిచిన కొద్దీ ఏనెట్ కి రోత ఎక్కువవుతోందని హాన్స్ తెలుసుకున్నాడు. అతన్ని తృణప్రాయంగా చూస్తున్నది. ఆమె ప్రవర్తనకి ఒక్కొక్కప్పుడు ఉడికిపోయేవాడు. ఆ కోపంలో ఏనెట్ ని చంపే సెయ్యాలనిపించేది. ఎందుకో తనంటే అంతరోత, అంత అంతులేని ద్వేషం?

ఒకరోజున వెళ్ళేసరికి యువతి ఒంటరిగా ఇంట్లో కనిపించింది. హాన్స్ రాగానే లేచి వెళ్ళిపోబోయింది. దారికి అడ్డంగా నిలబడి "ఎక్కడికి? ఆగు. నీతో మాట్లాడాలి" అన్నాడు హాన్స్.

"ఏమిటి మాట్లాడాలి. నేను అబలని. అసహాయస్థితిలో వున్నాను."

"బెదిరిపోకు. మరేం లేదు. నేనింకా కొన్నాళ్ళు ఈవూళ్ళోవుంటాను. ముందు ముందు ఇంకా గడ్డుకాలం వస్తుంది మీకు. నేను సాయపడతాను. మీ అమ్మమామ్మ నన్నెంత ఆదరంగా చూస్తున్నారో? మీ నాన్న ఆనాటి దెబ్బమరిచిపోయి ఎంతో స్నేహంగావుంటున్నాడో? మరి నీకొక్కదానికే ఎందుకింత పగ నామీద? ఎన్నాళ్ళకీ నీ మనస్సు మారదేం?" అని బతిమాలుకుంటున్న కంఠంతో అడిగాడు.

"కారణం చెప్పనా?" అంటూ తొణికే కన్నీళ్ళతో గౌను మడతల్లో ఎదుగుతున్న పొట్టకేసి చేతుల్తో చూపించింది. పాలిన చెక్కిళ్ళమీద కన్నీరు జారింది.

హాన్స్ తలతిరిగిపోయింది. తన కళ్ళని తను నమ్మలేకపోయాడు. ఒక అపూర్వమైన ఆనందానుభవంలో మనస్సు సుడితిరిగిపోయింది. "నిజంగానా? తల్లివికాబోతున్నావా?" అన్నాడు కందుతున్న ముఖంతో. ఏనెట్ కుర్చీలో చతికిలపడి చేతులతో ముఖందాచుకుంటూ గుండెబద్దలైపోయేట్లు వెక్కి వెక్కి ఏడ్చింది.

హాన్స్ ఒక అడుగు ముందుకివేసి ఆమెని కౌగిట్లోకి తీసుకోవాలనుకున్నాడు. మెరుపులాగా చరాలున లేచి అతన్ని ఒక్క తోపుతోసి "నన్ను తాకకు. వెళ్ళిపో. వెళ్ళు. చేసింది చాలదా? వదూ బైటికి" అంటూ గదిలోంచి దూసుకుపోయింది.

ఒక్కడే అక్కడ కూలబడిపోయాడు. కదల్లేకపోయాడు. దారిపొడుగునా, బసలోనూ అదే ఆలోచన. చేతుల్లో ముఖం దాచుకుంటూ దీనంగా ఏడ్చినప్పటి ఆమె రూపం మనస్సులో హత్తుకుపోయింది. ఆమె లావెక్కిన నడుమూ, పాలిన చెక్కిళ్లూ, బరువెక్కిన నడకా కళ్ళలో మెదులుతున్నయ్.

ఆ ఎదిగే పొట్టలో తన బిడ్డ పెరుగుతోంది. మెదడులో తుపాకి పేలినట్లుగా అయింది. అవును. ఏనెట్‌ని తనకి తెలియకుండా ప్రేమిస్తున్నాడు. ఆమె ద్వేషంతోపాటు తన ప్రేమ పెరిగిపోతోంది. అందుకే తన హృదయంలో ఏదో తీరనిబాధ, వేదన బోన. అందచందాలు అట్టే లేకపోయినా ఎందుకో ఆమెమీద తనకింత మక్కువ? ఆమెని తన చేతుల్లోకి తీసుకోవాలని, తన మాటల్తో లాలించాలని, కన్నీళ్ళతో బరువెక్కిన ఆ రెప్పలమీద మెత్తని ముద్దులు కురిపించాలని ఆరాటపడుతోంది అతని హృదయం. ఆమె అందమైన కళ్ళలో ఒక్కసారి ప్రసన్నదరహాసం మెరిసిపోతే తన ఆవేదన అంతా పటాపంచలు కాదూ?

ఒకరోజున రోడ్డుమీద ముసలమ్మ కనిపించింది. కట్టెలమోపు తీసుకుపోతోంది. పక్కగా వచ్చి మోటార్ సైకిల్ ఆపాడు. ముసలమ్మ ఉలిక్కిపడి, హాన్స్‌నిచూసి ఆగింది.

"ఆ సంగతి నాకు తెలిసింది" అన్నాడు మెల్లిగా.

ముసలమ్మ విస్తుపోతూ "నిజంగానా? నీకు తెలియకూడదని పట్టుదల" అంది.

"ఏనెట్ తనే చెప్పింది."

"నువ్వేగా ఈ ముప్పు తెచ్చిపెట్టింది!"

"ఇంతకుముందే ఎందుకు చెప్పలేదూ?"

"ఏం లాభంచెప్పి? సరేకాని ఈ మాటువచ్చేప్పుడు కాసిని కుట్టుకునేసూదులు తెచ్చిపెడతావా? ఈ యుద్ధంలో అన్నిటికీ కరువే" అంది ముసలమ్మ.

"ఓ అలాగే. రేపే తెస్తాను. ఆదివారం మాకు ఖాళీ" అంటూ వెళ్ళిపోయాడు.

చీకటి పడుతున్నది. ఎప్పటికంటే పెద్ద మూట పట్టుకుని హాన్స్ లోపలికి వచ్చాడు. ముసలాయన ఏదో పాతపత్రిక తిరగేస్తున్నాడు. ముసలమ్మ వంటచేస్తోంది. ఏనెట్ ఏదో అల్లుతోంది. "ఇదిగో మీకు కావల్సినవన్నీ తెచ్చాను. మంచి సూదులూ, వూలూ. తాగటానికి షాంపేన్‌కూడా తెచ్చాను" అన్నాడు హాన్స్.

"నాకేమీ అక్కర్లేదు" అంది ఆమె.

"ఏం ఎందుకనీ? మన పాపాయికి బుల్లి మేజోళ్ళు అల్లరాదూ?"

"నిజమేనే" అని దీర్ఘాలుతీస్తూ తల్లిషాంపేన్ సీసాకేసి రెప్పవాల్చకుండా చూసింది.

"మాటల్లో ఏమనుకోను? చెప్పనా? ఏం చెప్పాలో తెలియకుండావుంది" అని ఆమెకేసి తిరిగి "ఆ రోజు నేనుచేసిన పనికి సిగ్గుపడుతున్నాను. అది పూర్తిగా నా తప్పుకాదు. పరిస్థితులన్నీ అల్లా తోసుకొచ్చినవ్. నన్ను క్షమించవూ?" అని దీనంగా అడిగాడు హాన్స్.

కోపంతో ఒక్కసారి చురచుర చూసింది. అతనికేసి. "అసంభవం. నా దగ్గిరికి రాబోకు. నన్ను సర్వనాశనంచేసింది చాలదా? నాశనమైన నన్ను బతక నివ్వరాదా?"

"నేనేం అపకారం చేశాను? తండ్రి కాబోతున్నానని నా కెంతో గర్వంగావుంది. ఆ సంగతి విన్నప్పట్నుంచీ నాలో ఏదో గొప్ప మార్పువచ్చేసింది."

"గర్వంట. సిగ్గులేకపోతే సరీ మొహానికి!" అని క్రూరంగా అంది.

"మన పాపాయిని భద్రంగా కాపాడు."

"నీకు నోరెల్లావస్తోంది ఇల్లా మాట్లాడటానికి?"

"నిజంచెబుతున్నాను. నామాటవిను. నా మనస్సంతా నీతోనే నిండిపోయింది. ఆరు నెలల్లో యుద్ధం ఆఖరవుతుంది. అప్పుడు నిన్ను పెళ్ళిచేసుకుంటాను"

"నువ్వా? నన్నా?" అని ఆశ్చర్యంగా అరిచింది ఆమె.

"అవును. నిన్ను ప్రేమిస్తున్నాను."

"ప్రేమ...ప్రేమ" అంటూ బిగ్గరగా వికటంగా నవ్వటం మొదలుపెట్టింది. కళ్ళల్లోంచి నీళ్ళు జలజల రాలుతున్నాయ్. తల్లి ఇది విని గబగబా వచ్చి "ఏంలేదు. దానికి మధ్యమధ్య ఇల్లా హిస్టీరియా వస్తూవుంటుంది" అని సర్ది చెప్పింది.

క్షణంలో ఆమె తెప్పరిల్లి, సంబాళించుకో గలిగింది.

"మన పెళ్ళి నిశ్చయం చేసుకోటానికే షాంపేన్ సీసా తెచ్చాను" అన్నాడు హాన్స్ జర్మన్ భాషలో "నువ్వు తల్లివి కాబోతున్నావని విన్నేదాకా నీ మీద నాకున్న ప్రేమని గుర్తించలేకపోయాను. ఆ నిమిషంలో గ్రహించగలిగాను. మొదటినించీ నిన్ను నేను గాఢంగా ప్రేమిస్తూనే వున్నాను"

"ఏమిటే అతననేదీ?" అంది తల్లి. "ఏదో చెత్త వాగుతున్నాడు" అంది ఏనెట్.

ముసలాళ్ళిద్దరూ వినాలని ఫ్రెంచిభాషలో అంటున్నాడు హాన్స్ "మాకూ ఇల్లూ వాకిలీ, పొలం తోటా వున్నయ్. నాభార్యవైతే నీకే కొరతావుండదు. మా ఇంట్లో టెలిఫోనూ, రేడియో, కారూ వున్నయ్, నేను బికారినికాను. మా నాన్నకి చుట్టుపక్కల బోలెడు పలుకుబడి."

"నా సుఖానికేం?" అంది వెటకారంగా.

తండ్రి నోరు విప్పాడు. "ఈయుద్ధం మాఒక్క కొడుకునీ పొట్టన పెట్టుకుంది. అమ్మాయితప్ప మాకెవరున్నారు? దాన్ని నిమిషంకూడా విడిచివుండలేం" "మీరల్లా అంటారని నాకు తెలుసు, పోనీ నేనే ఇక్కడవుండిపోతే?" ఏనెట్ అతనికేసి నిప్పులు చెరిగే చూపు విసిరింది.

"నిజమేనా నీ మాటలు?" అంది ముసలమ్మ.

"నిజం మా తమ్ముడు ఇంటిదగ్గర పెద్దవాళ్ళని కనిపెట్టుకుని వుంటాడు. నేనిక్కడే వుండిపోతాను. ఈ దేశం వొదల బుద్ధికావటంలేదు. నా బలమూ తెలివీ ధారపోసి మీ పొలంలో బంగారం పండిస్తాను. నాలాటి పడుచువాళ్లు పూనుకుంటే సుక్షేత్రంగా మారుతుంది మీ బీడు." ముసలిదంపతులు ఒకళ్ళ మొహం ఒకరు చూసుకుంటున్నారు. వాళ్ళ పొలంలో హలంపట్టే బలంకల యువకుడికోసమే కలవరిస్తున్నారు! కొడుకుపోయిన దగ్గిర్నుంచీ వాళ్ళకి ఇదే దిగులు. ఇటువంటి అల్లుడు దొరకటం వాళ్ళకి వరప్రసాదం. "అయితే బాగా ఆలోచించుకో తల్లీ! కుర్రాడు బుద్ధిమంతుడు" అంది ముసలమ్మ.

"నువ్వు మాట్లాడబోకు" అని గట్టిగా అరిచింది ఏనెట్. అతనికేసి తిరిగి "నేనిదివరకే ఇంకో యువకుణ్ణి ప్రేమించాను. పెళ్ళికూడా నిశ్చయమయింది. అతను యుద్ధంనించి తిరిగిరాగానే మా

తెల్లగా

ఉతుకబడినవి

ప్రకాశవంతముగా

ఉతుకబడినవి

ఇందుకు

సన్‌లైట్

సబ్బే

కారణము




బాదకుండగనే బట్టలను తెల్లగాను ప్రకాశవంతముగాను ఉతుకును!

179-50 TL

పెళ్ళి. నీకున్న బలం, అందం అతనికి లేవు. కాని అతని మొహంలో మెరిసే తెలివితేటలూ, అతని ప్రతి కదలికలో తొంగిచూసే సంస్కారం నేను ఆరాధిస్తున్నాను. జంతువును నేనెన్నడూ మెచ్చుకోలేను. నేనతన్నే మనసారా ప్రేమిస్తున్నాను" అని నిబ్బరంగా అనేసింది.

అతని మొహంమీద నల్లటినీడ పాకింది. "ఇప్పుడెక్కడున్నాడు?" "ఇంకెక్కడా? మీ జర్మనీలో బందీగావున్నాడు. నువ్విక్కడ తెగ మెక్కి బలుస్తుంటే అతనక్కడ ఆకలికి చిక్కి శల్యమై పోతున్నాడు. ఎన్నిసార్లు చెప్పాలినీకు? ఇంత మూర్ఖం ఏమిటి? నేను నిన్ను ఎంతగా ద్వేషిస్తున్నానో ఇంకా తెలుసుకోలేవా? క్షమించటం అసంభవం. నిన్ను ప్రేమించటం కలలోమాట" అని కొంచెం ఆగింది. ముఖం దుఃఖంతో వివర్ణమయిపోయింది. "అతను నన్ను క్షమిస్తాడనే నమ్మకముంది నాకు. కాని నువ్వు ఎరచూపిన కానుకల వలలోపడి లొంగిపోయా ననుకుంటాడేమోనని నాకుండేమండిపోతోంది. దుబ్బుజుట్టూ, గడ్డూ, సాదుగూ, నీలపుకళ్ళూ అన్నివిధాలా నన్ను గుర్తుకి తెచ్చే నీ శిశువుమూలాన మాజీవితం ఎంత దుర్భరం అవుతుందో? భగవంతుడా! ఎందుకు నాకీబాధలు?" అంటూ వంటింట్లోంచి బైటికి వెళ్ళిపోయింది. ముసలివారూ కొంచెంసేపు మౌనంగా కూచుండిపోయారు. హాన్స్ విచారంగా షాంపేన్ సీసాకేసిచూశాడు. నిరాశతో ఉసూరుమంటూ లేచాడు. సాగనంపటానికి ముసలమ్మకూడా లేచింది, గడప దాటుతుంటే మెల్లిగా "నిజంగా అమ్మాయిని పెళ్ళిచేసుకుంటావా?" అని అడిగింది.

"అక్షరాలా నిజం. నేను గాఢంగా ప్రేమించాను"

"నువ్వు ఇక్కడే వుండిపోవటం నిజమేనా?"

"మాట ఇస్తున్నాను."

"అయితే ఇదంతా నీదేనాయనా! ముసలాయన ఉన్నన్నాళ్ళు ఉండగు కదా! ఆఁ యేమిటో! దానికెంతతోస్తే అంతే, ఆ కుర్రాడు మా కెవ్వరికీ ఇష్టంలేదు. మా అబ్బాయివుండగా దానిమాటకి అడ్డుచెప్పనివ్వలేదు. ఇష్టంలేకపోయినా తల ఆడించాం. ఇప్పుడంతా తారుమారయిపోయింది."

"సొంతపొలం అమ్ముకోటం అంటే ప్రాణం పోయినట్లే అనిపిస్తుంది."

"నిజం చెప్పావు నాయనా! మళ్ళీ పుట్టవరా" అని అతని వీపుమీద చెయ్యివేసి వీడ్కోలు చెప్పింది.

ముసలామె తన పక్షమే మొగ్గుతున్నాది. కాని ఆమె ఇంకో మనిషిని ప్రేమించటమే పెద్ద చిక్కు అయిపోయింది. అయినా అతను ప్రస్తుతం ఖైదీ. అతను విముక్తుడైరాకముందే ఆమెని పుడుకో రావచ్చు. శిశువుకలిగాక ఆమెలో ఏం మార్పు వస్తుందో ఎవరు చెప్పగలరు? అదొక్కటే అతని ఆశ. కాలానికే వొదిలిపెడదామనుకున్నాడు ఈ సమస్య. తేలేదాకా ఓపిక పట్టాలి. దారిపొడుగునా ఆమె సంస్కారాన్ని పొగడుకుంటూ తనని తనుతిట్టుకున్నాడు. కొరడా దెబ్బలాటి ఆమె మాటలవల్ల బాధతోపాటు ఎందుకో అతనికి ఆనందంకూడా కలిగింది.

వారాలు గిర్రున తిరుగుతున్నయ్. పైఅధికారి చాలామంచివాడు. సైనికులని [illegible]కుండా పనిచేయించే రకంకాదు. జర్మన్ విమానాలు ఇంగ్లండు దేశాన్ని ధ్వంసంచేస్తున్నయ్యనీ, విర్రవీగే బ్రిటిషు ఓడలు జర్మన్ జలాంతర్గాముల ధాటికి తట్టుకోలేక ఒకటి తరవాత ఒకటి పుటుక్కున మునిగిపోతున్నయ్యనీ, కొద్దిరోజుల్లో యుద్ధం అంతమైపోతుందనీ వార్తలు వస్తున్నయ్. వసంతకాలంవచ్చేసరికి జర్మన్ సైనికులు జగత్తంతటికీ అధిపతులౌతారనే విశ్వాసం నిషాలాగా తలకెక్కుతోంది. హాన్స్ తండ్రికి ఉత్తరం రాశాడు. తను ఒక ఫ్రెంచి యువతిని పెళ్ళాడదలుచుకున్నాననీ, తన వాటాకివచ్చే ఆస్తి తమ్ముడికి అమ్మేస్తాననీ, తను ఫ్రాన్సులో నేవుండిపోవాలనుకుంటున్నాననీ రాశాడు. క్రమంగా ఏనెట్ తండ్రికూడా హాన్స్‌మీద మంచి గురికుదిరింది. కొత్త యంత్రాల సాయంతో పొలాన్ని బాగుచేసే విషయం ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకునేవాళ్ళు. ముసలమ్మ అతన్ని ఆప్యాయంగా ఆదరిస్తూ విందులకి ఆహ్వానిస్తోంది. కాబోయే అల్లుడనే చొరవకొద్దీ అతనికి జీన్ అనే ముద్దుపేరుపెట్టి పిలుస్తోంది ముసలమ్మ.

కాని ఆమెలోమటుకు పిసంకూడా మార్పు లేదు. ఆమెలోరోత, ద్వేషం, ఏవగింపూ రోజు రోజూ పెరిగిపోతున్నయ్. అతన్ని నోటితోఎన్నడూ పలకరించదు. అతనేదైనా అడిగితే ముభావంగా ముక్తసరిగా రెండు ముక్కలు మాటాడి గదిలోంచి వెళ్ళిపోతుంది. ఆమె ముఖంలో గంభీరసౌందర్యం నానాటికీ పెరిసిపోతోంది. నెలలునిండిన ఆమె రూపంలో హుందాతనంతోకూడిన కొత్త సోయగాన్ని చూస్తూ హాన్స్ పరవశుడవుతున్నాడు.

ఒకరోజున తొందరగా హాన్స్ మోటార్ సైకిలు మీదపోతున్నాడు. ముసలమ్మ చెయ్యి ఊపిపిలిచింది. ఆగాడు. "ఏమిటి సంగతి?" అని ఆత్రంగా అడిగాడు.

"అతను చనిపోయినట్లు కబురు తెలిసింది"

"ఎవరూ?" "అతనే అమ్మాయి ప్రేమించిన బడిపంతులు"

ఒక్కసారి హాన్స్ హృదయం ఎగిరిగంతు వేసింది. ఇంకేం? ఇక తనదారిలో ఆటంకాలు లేవు. ఇక తన కోరిక నెరవేరి తీరుతుంది అనుకున్నాడు.

"వీనెట్ చాలా విసుగుపడుతోందా?"

"లేదు. కన్నీటి చుక్కయినా రాల్చ లేదు. పోనీ పాపం అని నేను ఓదార్చబోతే కరిచేట్లుగా మీదికొచ్చింది. ఇవాళ నువ్వు కంట పడితే నీప్రాణం తీసేస్తుంది"

"అతని చావుకి నేను బాధ్యుణ్ణా? నామీద కోపం ఎందుకూ? నేనేంచేశానూ?"

"యుద్ధ ఖైదీల శిబిరంలో తిరుగుబాటు లేగిందట. ఖైదీలకి తిండిపెట్టక మాడిస్తే తిరగబడ్డారుట. చివరికి నాయకుల్ని కాల్చి చంపేశారుట. అందులో అతనూ వున్నాడుట."

హాన్స్ మౌనంగా విన్నాడు. "కొన్నాళ్ళ పాటు దాని కంటపడకు, కొంచెం ఈ దెబ్బనించి తేరుకోనివ్వు. అన్ని విషయాలూ నెమ్మదిగా దానితో మాట్లాడుతాను. నేను రాసిన ఉత్తరం చూసుకున్నాక ఇంటికి వద్దువుగానిలే. తొందరపడితే అసలుకేమోసం" అంది ముసలమ్మ.

"తప్పక రాస్తావుకదూ?" "ఎందుకు రాయనూ? మా ఇద్దరికీ ఈ సంబంధం ఇష్టమే. ఈ పరిస్థితుల్లో నీకంటే మంచి వరుడెక్కడ దొరుకుతాడు? అందులో, కొద్ది రోజుల్లోనే పాపాయి కూడా వస్తుందే!"

"మగపిల్లాడు కావాలని కోరుతున్నాను" అన్నాడు హాన్స్.

'మేమూ అల్లాగే అనుకుంటున్నాం' అని నవ్వుతూ వెళ్ళిపోయింది ముసలమ్మ.

* * *

పదిరోజులు గడిచి పోయినయ్. ముసలి దంపతులుకూడబలుక్కున్నారు. భోజనాలముందు తల్లి జంకుతూ ఇల్లా అంది "మొన్న ఉత్తరం రాశాను. హాన్స్ రేపొస్తాడు."

"మంచిగా చెప్పావు. సంతోషం. గడప తొక్కించి బైటికిరా నేరాను" అంది వీనెట్ కోపంగా.

"ఈ వెర్రిమాటలిక కట్టిపెట్టు. పరిస్థితులని బట్టి మారకపోతే ఎల్లాగే తల్లీ? అతనెల్లాగో పోనే పోయాడు. హాన్స్ నువ్వంటే ప్రాణంవిడుస్తున్నాడు. మనిషేమైనా అందవికారా? ఏ పనుచుడైనా ఎగిరి గంతేసి చేసుకుంటుంది. అతను అండగావుండి మన పొలం బాగుచేసి బంగారం పండిస్తాడు. ఎంతసేపూ గడిచిపోయినవే తవ్వుకుంటూ, పాత సంగతులే పట్టుకు వేళ్ళాడితే, ఎల్లాచెప్పూ?" అని తల్లి నచ్చజెప్పబోయింది.

"అనవసరంగా ఎందుకమ్మా నీకీ కంఠశోష? నా పొట్ట నేను పోసుకోగలను. అతను నా ప్రబల శత్రువు. అతన్ని ఎల్లా పెళ్ళాడమంటావు? అతని పొగరుచూస్తే నాకు అరికాలిమంట నెత్తికొస్తుంది. అతన్ని చంపినా నాకసితీరదు. నన్నెల్లా బాధించాడో అల్లా బాధిస్తాను. నాగుండెల్లో ఎటువంటి గాయం చేశాడో అతని గుండెల్లోనూ అంతటి గాయాన్ని చేస్తేకాని నామంట చల్లారదు" అని ఉద్రేకంగా అరిచింది.

"ఎందుకమ్మా అల్లా ఆవేశం తెచ్చుకుంటావు? నిదానంగా ఆలోచించు" అని తండ్రి అందుకున్నాడు.

"హాన్స్‌మీద ఎందుకే నీకింత కోపం? ఆ రోజు నిన్ను బలాత్కారంచేశాడే అనుకో. అప్పుడు నిషాలోవున్నాడు. అర్థంచేసికుంటే మీ నాన్న ని

కొట్టాడు. ఆ దెబ్బకి నెత్తురుబొటబొటలుకట్టింది. కాని ఆయన అవన్నీ మరచిపోలేదే? అతనంటే ఆయన కిప్పుడు ఎంత ప్రేమనుకున్నావ్?"

"ఆ సంఘటనని నేనెప్పుడో మరిచిపోయాను. కుర్రాడికేం? నిక్షేపంలాటి సంబంధం!" అని తాళం వేశాడు తండ్రి.

"అంతగొప్పశక్తి నాదగ్గర లేదు. అవమానాలని అంత తేలిగ్గా మరచిపోవటం నీదగ్గరే నేర్చుకోవాలి" అని చురకవేసింది కూతురు వెటకారంగా నవ్వుతూ.

"ఎవరైనా నవ్విపోతారు, ఊరుకో. చేసిన తప్పు దిద్దుకున్నాడుగా పాపం. మనకోసం ఎన్ని నిన్ని కొని తెచ్చాడు! మీ నాన్నకి ఎన్ని సిగరెట్లు తెచ్చి పెట్టాడు. అతను ఆదుకోకపోతే ఈపాటికి మలమల మాడిపోయేవాళ్ళమే!" అని తల్లి మళ్ళీ హాన్స్‌ని వెనకేసుకొస్తూ అన్నది.

"నీకు అభిమానమనేది లేశమైనా వుంటే అవన్నీ అతని మొహానవేసి కొట్టేదానివి" అంది కూతురు.

"పెద్ద చెప్పొచ్చావులే కబుర్లు. నువ్వూ తిన్నావుగా"

"లేదు. లేదు."

"మనింట్లోవున్న సరుకులన్నీ అతను తెచ్చినవేగా. అందరితోపాటు నువ్వూ అవే నీకు తెలియకుండా తిన్నావు"

"తిన్నది నేనుకాదు. నాలోవున్న రాక్షసుడు తిన్నాడు. ఎంత తిన్నా తీరని ఆకలితో తిన్నాడువాడు" అంది తడిసిన కళ్ళతో.

"అదంతా నాకెందుకూ? నువ్వూ తిన్నావా, లేదా?"

"సిగ్గుతో సగం చచ్చి, ఏడుస్తూ విధిలేక తిన్నాను. ముందు విమానాలతో, టాంకులతో మన బలాన్ని నాశనంచేశారు. బానిసలమైనాక ఆకలి చిచ్చుతో మన ఆత్మల్నికూడా ధ్వంసం చేస్తున్నారు."

"ఉద్రేకపడి లాభమేమిటి చెప్పు? చదువుకున్నదానివి. అన్నీ తెలిసినదానివి. గతాన్ని మరిచి పోవాలి. పరిస్థితులనిబట్టి నడుచుకోవాలి." అని తల్లిచేసిన హితబోధ వినికూడా ఎలిజబెత్ నిప్పుకి నీరెత్తినట్లు కూర్చుంది.

మర్నాడు హాన్స్ వచ్చాడు. ముందుగానే బలుక్కున్న ప్రకారం వాళ్ళిద్దరూ ఏదో వంక చెప్పి ఆ సమయానికి ఇంట్లో లేకుండా ఎక్కడికో వెళ్లారు.

అతనికేసి కోపంగా చూసింది ఆమె.

"నన్ను చూసి పారిపోలేదేం?" అని పలకరించాడు చిరునవ్వుతో.

"కూచో నీతో మాట్లాడాలి" అంది ఎలిజబెత్. హాట్ తీసి, కోటువిప్పి కుర్చీదగ్గరికి లాక్కున్నాడు. ఈ మాత్రం ప్రసన్నంగా పలకరించినందుకే అతనికి బ్రహ్మానందంగా వుంది.

"మాఅమ్మా నాన్నా నిన్ను పెళ్ళిచేసుకోమని ఊదర పెడుతున్నారు. నీ కానుకలవల్ల వాళ్ళని తెలివిగా బుట్టలో వేసుకున్నావు. కాని నేను ఒప్పుకోను. నిన్ను ద్వేషించేటంతగా ఈ సృష్టిలో ఇంకే వ్యక్తినీ నేను ద్వేషించటంలేదు." అని స్పష్టంగా చెప్పేసింది.

"కాని నేను నిన్నే ప్రేమిస్తున్నాను. నీ అందాన్ని, నీ సంస్కారాన్ని నేనెంత ఆరాధిస్తున్నానో చెప్పలేను. ఇప్పుడు మన మధ్య అవరోధాలుకూడా తొలగిపోయినయ్ కదా! అతను చనిపోయాడని విన్నాను"

"ఆ సంగతి ఎత్తకు." అని వెర్రిగా అరిచింది ఆమె త్రుళ్ళిపడి.

"అతని మరణానికి చాలా చింతిస్తున్నాను"

"మీజర్మన్‌లే కదా అతన్ని కాల్చిచంపింది?" అంది తోకతొక్కిన త్రాచులాగా.

"నేను కాదుగా? ఆత్మీయుల్ని పోగొట్టుకుంటే మనస్సు చాలా బాధపడుతుంది. కాని కాలమే అన్ని దుఃఖాలనీ మరిపిస్తుంది. ఆ తరువాత అయినా మనిద్దరం సుఖంగా పెళ్ళిచేసుకుని మన చిన్న పాపాయితో హాయిగా కాలంగడపవచ్చు"

"అసంభవం! ఇంతమందబుద్ధి మీ జర్మన్ జాతీయుల్లోనే కనిపిస్తుంది. ఈ శిశువు నాశోక మాయని మచ్చ అని గ్రహించవేం నువ్వు? ఈ కళంక

చిహ్నంతో నేను నలుగురిలో ఎల్లా తలఎత్తుకోగలను? నాలో ఘీంచి రక్తం ప్రవహిస్తున్నంతవరకూ నేను నిన్ను పెళ్లాడటం జరగదు. నిన్నొక్కటే కోరుకుంటున్నాను. నామీద ఏ కొంచెమైనా దయవుంటే ఇక్కణ్ణుంచి ఈ క్షణమే వెళ్ళిపో. మళ్ళీ నీ ముఖం చూపించకు. వెళ్ళు."

"ఎల్లా వెళ్ళను? కలగబోయే శిశువు నాది. నాకు కావాలి"

"తప్పు తాగి ఒళ్ళు తెలియక చేసిన పాపానికి ఫలితం ఈ శిశువు. దీనితో నీకేం పని?"

"చెప్పినా తెలుసుకోలేవు నువ్వు. శిశువు పుట్టకుండానే నాకళ్లు తెరిపించాడు. ఇన్నాళ్ళ నుంచీ నిన్ను ప్రేమిస్తున్నాననే విషయం నువ్వు తల్లివి కాబోతున్నావని విన్న నిమిషంలో తటాలున మెరిపించి. అప్పటినించీ నా దృష్టి మారిపోయింది. వాడికోసమే బతుకుతున్నట్లు, వాడు లేకుంటే జగత్తే లేనట్లు—ఏవేవో కొత్త అనుభవాలలో మనస్సు ఉర్రూతలూగుతోంది." అని హాన్స్ కొంచెం ఆగాడు.

ఈ మాటలు వింటుంటే ఆమె కళ్ళల్లో ఒక వింత వెలుగు తళుక్కుమన్నది. విజయోత్సాహం ఆమె కళ్ళలో, పెదవులమీద నవ్వులో చిత్రంగా మెరిసింది.

"పుట్టబోయే పసివాడిమీదే నా పంచ ప్రాణాలు. వాడిమీదే అస్తమానం నా ఆలోచనలన్నీ. వాడిని గురించే నా కలలన్నీ" అన్నాడు హాన్స్.

"మగపిల్లవాడే కావాలన్నమాట!" అంది ఏనెట్ పరిహాసంగా.

"కొడుకే కావాలి నాకు. వాడికి ఎన్నో ఆటలూ, పాటలూ, కబుర్లూ, కథలూ నేర్పుతాను. వాణ్ణి గొప్ప వీరుడుగా తయారుచేస్తాను. వాణ్ణి చూసుకొని నేనెంతో గర్వపడతాను"

అతనికేసి రెప్పవాల్చకుండా చూస్తోంది ఏనెట్. కళ్ళలో కరుణలేని కఠినమైన చూపు. మనస్సులో ఏదో భీకరమైన ఆలోచన మసకగా మెసులుతోంది. అతనుమటుకు వొళ్లుమరిచిపోయి మాట్లాడేస్తున్నాడు. ఇంతగా నేను వాణ్ణి ప్రేమిస్తుంటే కొంత కాలానికైనా నీకు వాడిమీద మమత ఏర్పడదా? వాడూ, నువ్వూ, నేనూ, ఈ యింట్లో, ఈ పొలాలమధ్య దివ్యంగా జీవించుదాం"

ఆమె నోట ఒక్క మాటయినా లేదు. అల్లాగే అతనికేసి చూస్తూ రాతిబొమ్మలాగా కూచుంది.

"పలుకే బంగారమై పోయిందే? ఎందుకింత కోపం నామీద?" అని దీనంగా అన్నాడు హాన్స్.

ఆమె ముఖం జేవురించింది. పిడికిలి బిగబట్టి ఆవేశంతో వణికే కంఠంతో "నువ్వు నా శత్రువ్వి. ఎప్పటికీ నా శత్రువువే. నేను నిన్ను ఎన్నడూ ప్రేమించలేను. నా దేశాన్ని [illegible] చెయ్యటానికి విరుచుకుపడిన విరోధులతో నేనెన్నడూ రాజీపడను. ఎవరెలా చేసినా సరే. నేను మాత్రం నా ఆత్మకి ద్రోహం చేసుకోలేను. నిన్ను పెళ్ళాడేటంతటి సిగ్గుచేటుపనికి నేనెన్నడూ పూనుకోలేను. నిన్నూ, నీవల్ల కలిగే శిశువునీ నేను విషంలాగా చూస్తాను. ఇవాళ మీరు గెలిచారు. మమ్మల్ని ఓడించారు. కాని అచిరకాలంలోనే మా దేశం విముక్తిపొందితీరుతుంది. ఆ తరుణాన్ని కళ్లారా చూడటంకోసమే నేను బతుకుతున్నాను. కొద్ది కాలంలోనే మీరు గ్రహిస్తారు మాలో రేగే ఆరని అగ్నిని! ఇక వెళ్ళు. నా మనస్సు మార్చటం బ్రహ్మతరం కాదు. నేను అనుకున్నంతా చేసితీరుతాను" అని నిప్పులు కురిపించింది.

హాన్స్ నివ్వెరబోయాడు. కొంచెంసేపటికి తెప్పరిల్లి "అయితే మంత్రసాని కుదిరిందా? పురిటి ఖర్చులు నేను భరిస్తాను" అన్నాడు.

"మా దురదృష్టాన్ని ఊరూనాడూ చాటుకుంటామా? మా అమ్మే దగ్గరుంటుంది"

"ఏదైనా ప్రమాదం వస్తే ఎల్లా?"

"ముందు నువ్వు నడూ బైటికి" అంది క్రూరంగా. హాన్స్ లేచి వెళ్ళిపోతున్నాడు. జాలిగా తలవంచుకుని నడిచి వెళ్ళిపోతున్న అతని రూపమూ, ఇందాకటినించీ అతని నోట్లోంచివచ్చిన మాటలూ— ఆమె మనస్సుని చివుక్కుమనిపించినయ్. అనుకోకుండా మెత్తబడుతోంది ఆమె రాతిగుండె.

"ఓ భగవంతుడా! శక్తిని ప్రసాదించవా నాకు?" అని వణికే పెదవుల్తో వేడుకుంది.

అతను ఇల్లుదాటి తోటలోకి అడుగుపెట్టగానే ఏళ్ళతరబడి ఇంటిని కనిపెట్టుకునివున్న ముసలికుక్క మొరుగుతూ వెంబడించింది. దాన్ని మచ్చిక చేసుకోవాలని ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. యజమానుని దగ్గరికి వస్తే కోరలు బైటపెట్టి కరవబోతుంది. ఇవాళ చికాకులో, నిస్పృహలో మొరుగుతూ మీదికొచ్చే కుక్కని ఈడ్చి ఒక్క తన్ను తన్నాడు. కుయ్యోమంటూ కుంటుతూ పొదల్లోకి వెళ్ళిపడింది ఆ దెబ్బ విసురుకి.

“ఒట్టిపశువు. ఈ పశువుమీదా నాకు జాలి?” అనుకుంటూ గోడనున్న అద్దంలో తన నీడకేసి చూచుకుంది ఏనెట్. తన నీడనిచూసి నవ్వుకుంది. అది నవ్వుకాదు. పిశాచి వికటాట్టహాసం!

తరవాత పదిహేను రోజులదాకా అతనికి శిబిరంలో పనితో ఊపిరిసలపలేదు. ఆదివారం తీరిక చేసుకుని ఏనెట్ ఇంటికి బయలుదేరాడు సైనికుడు హాన్స్. మంచుపడుతోంది మసకగా, నీరసంగా, వుంది వూరంతా. అడుగుపెట్టే సరికి “వచ్చావూ? ఇన్నాళ్ళూ తొంగిచూడనైనా లేదే? ఏమైపోయావో అనుకుంటున్నాం” అంది ముసలమ్మ ఆత్రంగా, ఆశ్చర్యంతో.

“రావటానికి పడలేదు. మా పటాలం ఏ నిమిషానైనా ముకాం ఎత్తేందుకు సిద్ధంగావుంది. ఉత్తరువులు రావటమే తరువాయి” అని సంజాయిషీ చెప్పుకున్నాడు హాన్స్.

“ఇవాళ ప్రొద్దున్నే పురుడువచ్చింది. మగపిల్లడు” అంది మురిసిపోతూ ముసలమ్మ.

అతను ఒళ్ళుతెలియని ఆనందంతో ఒక్క గంతు వేశాడు. “ఆదివారం పుట్టటమే అదృష్టం! తల్లి ఎల్లా వుంది?”

“పురుడు తేలికగానే వచ్చింది. అట్టే బాధపడలేదు. కులాసాగానే వుంది” చుట్ట కాలుస్తూ కూచున్న ముసలాడు హాన్స్ ఆనందాన్ని చూసి ముచ్చటపడుతూ “మొదటిసారి తండ్రి అయినప్పుడు మనస్సుకెంతో ఆనందంగా వుంటుంది” అన్నాడు.

“అంతా నీ పోలికే. పట్టుకుచ్చులాంటిజుట్టు. కళ్ళు అచ్చగా నీలాగే నీలంగా మెరుస్తున్నాయ్. ఇంత ముద్దులు మూటకట్టే పాపని నేనెన్నడూ చూడలేదు. పెద్దయాక నీలాగే అందంగా వుంటాడు” అని మురిపెంగా ముచ్చటగా వర్ణించింది ముసలమ్మ.

“నా ఆనందం ఎల్లా వెల్లడించను? మాటలు దొరకటంలేదు. ఒక్కసారి ఏనెట్‌ని చూడొద్దా?” అని ఆత్రంగా అడిగాడు హాన్స్ గాలిలో తేలిపోతూ.

“తొందరపడకు. అంత ఆరాటపడితే ఎల్లాగాయా? పిల్లణ్ణి ఎత్తుకొచ్చి నీకే చూపిస్తానే” అంటూ లోపలికి వెళ్ళింది ముసలమ్మ.

“అరే. ఏమయింది? అమ్మాయేదీ? పిల్లవాడేడీ?” అంటూ ఇల్లు ఎగిరేట్టు కేకలువేసింది ముసలమ్మ. అంతా కలియతిరిగి పిచ్చిదానిలా ఇల్లంతా గాలించింది. దొడ్డి తలుపు తెరిచివుంది. “ఇది ఏం పిచ్చిపని చేసి కొంప ముంచుతుందో! అయ్యో! ఏం పోయేకాలం తెచ్చిపెట్టిందో నాయనా! కొంప మునిగిందిరా! ఇంత మంచులో పచ్చి బాలింతరాలు బైటికి వెళ్తే ఇంకేమైనా వుందా? ఇదేం పిచ్చిపట్టిందో దేవుడా!” అంటూ గుమ్మందాకా కాలు పెట్టింది.

“వెతుకుదాం పదండి” అంటూ అప్రయత్నంగా నదివైపుకి పరిగెత్తాడు హాన్స్.

ఎదురుగా ఏనెట్ కనిపించే సరికి నిర్ఘాంతపోయాడు హాన్స్. ఒంటిమీద తడిసిన నీలంరంగు గౌను. భుజాలమీదికి తడిసినజుట్టు ముద్దలుగా పడుతోంది. ముఖంలో కత్తివేస్తే నెత్తురుచుక్క లేదు.

తల్లి అమాంతంగా వచ్చి కావలించుకుని “అయ్యో నా తల్లీ! తడిసి ముద్దయినావే! ఏం పిచ్చిపనే ఇది” అంటూ ఆవురుమన్నది.

ఏనెట్ బదులు చెప్పకుండా హాన్స్‌వైపుకి తిరిగి “సరిగ్గా సమయానికే వచ్చావ్ నువ్వు. సంతోషం” అంది కటువుగా.

“పిల్లాడేడీ? ఏం చేశావే?” అని గొల్లుమంది తల్లి.

“తరవాత ధైర్యాల చాలవని ఇప్పుడే తెగించాను. గుండెరాయి చేసుకున్నాను”

“ఏం చేశావే రాక్షసీ?” అని అరిచింది తల్లి భుజాలుపట్టుకుని ఊపుతూ.

“ఏం చెయ్యదలుచుకున్నానో అదే చేసి వచ్చాను” అంది తొణుకూ బెణుకూ లేకుండా.

“నిజం చెప్పు” అన్నాడు తండ్రి పట్టరాని ఆక్రోశంతో

“నీళ్ళలో ముంచాను. ప్రాణం పోయాక నదిలో వొదిలేసి వచ్చాను” ఆ మాట వినిపడగానే హాన్స్ బాణపుదెబ్బ గుండెల్లో తగిలిన మృగంలాగా ఒక్క అరుపు అరిచాడు. ముఖాన్ని చేతుల్లోకప్పుకుని తాగినవాడిలాగా పడుతూ లేస్తూ వెళ్ళిపోయాడు. వెనక్కి తిరిగి చూడకుండా.

పక్కమీద బోర్లపడుకుని ఏనెట్ వెక్కి వెక్కి ఏడ్చింది. సంతతధారగా కట్టతెగిన కన్నీరు!

(సోమర్సెట్ మామ్ “అన్ కాంకర్డ్” అన్న కథకు అనువాదము)

# సంధిగీత



శ్రీ రాంగోపాల్

ప్రాతిపదిక గా, ప్రపంచ సంఘర్షణకి,
ప్రస్తుతం జరుగుతోంది, పెద్ద ఘర్షణ—
   కోటి నక్షత్రాలు మూసిస్తా డొకడు,
   కొడవలీ సుత్తి ఎత్తుంటా డింకోడు—
నక్షత్రాలు మ్రింగలేక
కొడవలి వంకని క్రుంగలేక,
కూడు లేని సిపాయిలూ,
సద్దు లేని పాపాయిలూ,
కోటానుకోట్లు కృశిస్తే నేం?
కూరగాయలై నశిస్తే నేం?
   క్రొత్త ఘగులను పుట్టిస్తారు,
   క్రొత్త పీనలూ సృష్టిస్తారు,
   పస్తు లెపెతారు, శాసిస్తారు,
   క్రొత్త బస్తీలూ, నగ
   క్రొత్త యాటల పస్తీలూ,
   సాగిస్తారు!
   క్రొత్త క్రొత్త
   ఇస్తోకులూ
   నెలుస్తారు!
   తమ్ముడూ—
   కొన్నెత్తు సుళ్ళ—
   ఓం! ఓ!......
   ఓహుం, ఓహూం,
   ఓహాం, ఓహోం,
   ఓహం, ఓం!......
ఆకాశా ఆకళించని,
ఆకాశాలే ఆవులించనీ,
అమాయకం నీ నాదం,
అంతులేని యీ వేదం!
   వాళ్ళు మన నోళ్ళు
   భవితవ్యపు కళ్ళు,
   జేవకాలకు వకీళ్ళు,
   జీవితపు ముళ్ళు?
నీ కడుపు కేమిటి శోకమో,
నా నోటి కెప్పుడు తాళమో,
వాళ్ళకే తెలుసు!
   చావకుండా తిండి జల్లి,
   బ్రతకకుండా కళ్ళు కట్టి,
   చావు బ్రతుకుల సంధి మానవ
   సార మందురు, స్వేచ్ఛ యందురు,
   వాళ్ళకేం తెలుసు!

పంజరం బంగారమైనా,
పగలు రాతిరి మేతలున్నా
బయలు పై పై కెగరడానికి,
పక్షి గిజగిజలాడు నైజం
వాళ్ళకేం తెలుసు?

   బంధరాళ్ళలో, కొండలు నెరెఁ,
   చీల్చుకుంటూ, కొట్టయి కలసే
   విత్తు మహత్తూ, ఆత్మ వికసన
   వేధా, చేతన విశ్వగాథా,
   వాళ్ళకేం తెలుసు?

కొట్టుమిట్టుల చైతన్యానికి
చివరి పోట్లూ, ఆటుపట్లూ,
మనిషి యంటే మట్టి కాదని,
మనిషి యంటే పొట్ట కాదని
వాళ్ళకేం తెలుసు?

   కావ్యమైనా, సామ్యమైనా,
   మనిషికోసమె మతము లన్నది.
   జిలుగు శవముల లెక్కకంటె
   నీవు నొక్కటి చాలు నన్నది
   వాళ్ళకేం తెలుసు!

తమ్ముడూ!
పూరించు శంఖం!
తాహ తెరిగిన తత్వపుంఖం!—
ఓం, ఓం,
ఓహం, ఓం,
ఓహం, ఓహం,
ఓహం, ఓం!—

   ఆకలి మిగితే ఆశలు దాటి,
   అసలు మోసం యవనిక దాటి,
   అధికారాలూ, అహంకారం,
   అధిగమించే పథం నాదని—
   తమ్ముడూ!
   పూరించు శంఖం!

తరతరమ్ముల నివురు త్రోసుకు
తరుణతేజం మేలుకుందని,
తరతమమ్ముల తమసు చీల్చుకు
అరుణగిరి తత్వమసి యందని—
తమ్ముడూ!
పూరించు శంఖం!

సాహిత్య మీమాంస :

# "ప్రవాసం - ఊర్వశి"



'సురభి'

జనాన భారతిలో "ప్రవాసం-ఊర్వశి" అనే కావ్యంపై శ్రీ పొట్లపల్లి సీతారామారావు గారు చేసిన విమర్శనం ఎక్కువభాగం ప్రాచీనాచారాలపై ఆధారపడే ఉంది. అందుకని, దాని కాపద్ధతిలోనే సమన్వయంచేసి, సమాధానం కుదర్చటానికి, ప్రయత్నిస్తున్నా. కనక సహృదయలోకం సార్ద్రంగా విషయాన్ని గ్రహించాలని, సవినయంగా మనవి చేస్తున్నా.

"వాగ్ధేనుర్దుగ్ధ (దుగ్ధ) ఏకంహి
రసం యాన్ బాల (లాభ) తృష్ణయా
తేన నాస్య సమః సస్యా
ద్దుహ్యాతే యోగి భిర్హియః"

అన్నారు భట్టనాయకులు

కావ్యరూపాన పరిణమించే వాక్కనే కామధేనువు ఏమీ యెరగని ఉపాసక కవి యనే దూడయందు దివ్యమైన, సారభూతమైన, రసక్షీరాన్ని స్రవిస్తుంది. ఈ భావాన్నే ఆధారంగా తీసుకొని కుమార సంభవంలో, హిమాలయ వర్ణనంలో, కాళిదాసు,

"యం సర్వ శైలాః పరికల్ప్య వత్సం......
దుదుహుర్ధరిత్రీం"—అన్నారు.

కనకనే యోగులచే ప్రాణాయామక్రమంవలన పొందబడే బ్రహ్మానందరసంగూడ వాగ్రసంతో సమం కానేరదు. సరస్వతీ ప్రసాదంవలన సముపలభ్యమయ్యే రసం యోగాభ్యాసంవలన పొందే రసం కంటె రమ్యం. పండజేసిన కసుగాయకంటే స్వయం పరిపక్వమైన ఫలం స్వాదుతరంగదా !
అన్నారు సదా, శ్వన్యాచార్యులు

"సరస్వతీ స్వాదు తదర్థ వస్తు
నిష్యందమానా మహతాం కవీనాం
అలోక సామాన్య మభివ్యనక్తి
ప్రతిస్ఫురంతం ప్రతిభా విశేషం"

అంటే భారతి వస్తుతత్వాన్ని స్రవిస్తూ, మహాకవులకు అలోకసాధారణమై ప్రకాశించే ప్రతిభావిశేషాన్ని అభివ్యక్తీకరిస్తుందట! ఈ ప్రతిభయే లోక కల్యాణనిర్వహణసమర్థమై కావ్యరూపంలో ప్రసన్నమౌతుంది. ప్రతిభ అంటే అపూర్వవస్తునిర్మాణక్షమమగు ప్రజ్ఞ అని, "అభినవ గుప్తపాదు" లన్నారు. ప్రతిభావిశేషమంటే రసావేశ వైశద్య సౌందర్య కావ్యనిర్మాణక్షమత్వమని వారే ప్రవచించారు. అంచేతనే మునులుకూడా,

"కవేరంతర్గతం భావం—"

అని దాన్ని వివరించారు. దీన్నిబట్టిచూస్తే మహాకవి కోర్లించే ప్రతీవాక్కు ప్రతిభాద్యోతకమై ఉంటుందని తెలుస్తోంది. మహోత్కృష్టమైన భావనా వేదికమీద వెలుగురేకులా కూర్చొని, కవి నిర్మాణానికి పూనుకుంటాడని మన మనుకోవాలి.

కవి మనస్సు పాలకడలివంటిది. జగత్తు ఒక మందర పర్వతం. కామక్రోధాదులు వాసుకి మొదలగు రజ్జువులు. సంతోషం, విచారం, పడుచుదనం, ముసలిదనం, సౌఖ్యం కష్టం - క్రమంగా దేవతలు రాక్షసులూ అనుకోండి. ఈ దేవతలూ, రాక్షసులూ కలసి బాగా కడలిని పరవళ్లు త్రొక్కుతూ మథిస్తారు. ఉజ్జ్వలమైన వేదన బయలుదేరుతుంది. ఇలా వరుసగా తరచగా అమృతం హాలాహలం లక్ష్మి, ఊర్వశి, కామధేనువు, కల్పకం మొదలగున వావిర్భవిస్తవి. అప్పుడా నటరాజ కవి హాలాహలాన్ని కంఠంలో అదిమిపెట్టి, అమృతాన్ని స్రవిస్తాడు లోకానికి వాగ్రూపంలో. వేదనని తాననుభవిస్తాడు, లోకానికి చిమ్ముతాడు, వెన్నెలలను. అన్య దుర్లభమైన ఊర్వశిని తా నారాధించుకుంటాడు.

శోభాహేతువైన లక్ష్మిని, లోకానికిస్తాడు. ఆతడు చంద్రముకుటుడు. ఫాలాక్షుడు కూడాను. అందుకనే కవి శివుడన్నారు విశ్వకవి రవీంద్రుడు. దీన్నిబట్టి వేదనలోనే అంటే అశ్రుపాతంలోనే మహాకవిత్వ మావిర్భవిస్తుందన్నమాట. దానికి ఋషి చక్రవర్తి వాల్మీకే తార్కాణం. అందులోనించే విశ్వజనీనమైన ప్రేమభావం పుడుతుంది. విశ్వాత్ముడులా కవి ప్రేమమయుడైపోతాడు. అది కరుణంలో సర్వవసిత మౌతుంది. అందుకనే

"ఏకోరసః కరుణ ఏవ" అని అన్నాడు భవభూతి ఆయనా అపుడే కాబట్టి.

"మధురతమః కరుణయితి"—అని లోచనకారు లన్నారు.

లోకంలో అంతకు ముక్కాలి అందగత్తెలున్నారు. సుందరంగా ఉందంటే ఎవతెనైనా రంభలా ఉందంటాం. కాని ఊర్వశులు లేరు. ఊర్వశి ఒక్కతే. స్త్రీజాతి ఆదర్శమే ఆమె. అందమే ఆమె. ప్రేమే ఆమె. అందాలకందం. ఆభరణాలకాభరణం. వలపునకు వలపు. పరిధులకు పరిధి. ఎక్కడో స్వర్గ ద్వారంలో, దేహప్రాంతంలో వియోగ పాండురమైన కపోలాల్తో, ఘాసపరీతములై ముసరక పోలాలపై చిందులుత్రొక్కే చికురాలతో పూలను లెక్కిస్తూ కూచుంటుంది. అమ్మ అనే శబ్దం వినపడేటప్పటికల్లా సీతమ్మనో అమ్మని ఎలా అనుకుంటామో, ప్రేయసి అనేటప్పటికల్లా ఊర్వశి అని అనుకోవాలి. అలాంటి ఊర్వశిని కవితా నాయికగా తీసికొన్నారు కృష్ణశాస్త్రి. ఆయన హృదయాన్ని పంచుకొన్న రసస్వరూపిణి, ఆమె.

శృంగార రస సార్వభౌమత్వాన్ని ఋజువుచేస్తూ, విద్యానాథుడు "ఏకావళి"లో, "కామస్య సకల జీవలోకానంద కందళన క్షమతయా సర్వాక్ ప్రతి హృద్యత్వాత్ ఇతి విద్వాంసః పూర్వం నిర్దిష్టః శృంగారః" అని అన్నాడు. శృంగార రసం సకలజీవలోకాన్ని ఆనంద పులకితం చేస్తుందని తాత్పర్యం. ప్రకటనానికి బలంగా, ఆనందవర్ధనులు ధ్వన్యాలోకంలో, "శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః" అని అన్నారు. అది ఒక్కటే మధురమని, ప్రహ్లాదనజనకమని వారి యభిప్రాయము. దీనికే వ్యాఖ్యానాన్ని సమర్పిస్తూ లోచనకారులు "మధురోహి, శర్కరాది రసో వివేకినో వాస్వస్థస్య ఆతురస్య వాఝటితి రసనాని పతితః తావదభిలషణీయ, ఏవ భవతి. తన్మయమితి" అని ప్రవచించారు. పంచదార నాల్కపైబడగానే, వివేకికీ, అవివేకికీ, స్వస్థునకు, ఆతురునకు, (ఎల్లవారికి) ఎంతగా చవులూరునో, శృంగారమంత మధురముగానుండునని వారి యభిప్రాయము. మఱియొక చోట అభినవగుప్తులు "సంభోగ శృంగారాత్ మధురతరో విప్రలంభః తతోపి మధురతమః కరుణ ఇతి, తదభివ్యంజన కౌశలం రబ్ధార్ధయోః మధురతర మధురతమత్వం చేత్యభిప్రాయే ణాహ కరుణే చేతిచ శబ్దః క్రమమాహ ప్రకర్షవదితి, ఉత్తరోత్తరం తిరతమ యోగేనేతి భావః" అని అన్నారు. శృంగారమే సకలజీవలోకములకు మధురమని, మాధుర్య గుణవిశిష్టము రసమని మనవిచేసితినిగదా! సంభోగ శృంగారముకంటె విప్రలంభ శృంగారము మధురతరమట! అంతకంటె తియ్యగా నుంటుందట. బలేచవుల్ని పుట్టిస్తుందన్నమాట. అంతకంటె కరుణ రసం మధురతమం. వానియొక్క మాధుర్య తర తమత్వములు ఉత్తరోత్తర న్యాయంలో గ్రహించాలన్నారు.

ఆచార్య ప్రోక్తమైన మధురతర విప్రలంభ శృంగారం కృష్ణశాస్త్రిప్రవాసానికి ప్రధాన రసం. ఇలాంటి రసరాట్టు అభివ్యక్తి అవుతూ ఉంటే, ఆ కావ్య మధురిమ చెప్పేదేముంది? ఎక్కడికక్కడ జలజలా తేనె పెరలు, విరిసిపోతుంటాయి.

విప్రలంభమనగా వంచన. వంచనయందువలెనే ఇచటకూడ కోరబడిన వస్తువు లభింపకుండుటయే కారణముగ దీనికీపేరు గల్గినది. దీనిలోని భేదములను అభిలాష, ఈర్ష్యా, విరహ, ప్రవాసములుగా పేర్కొన్నారు.

కృష్ణశాస్త్రిగారి "ప్రవాసం - ఊర్వశి" లో ప్రధానరసం విరహ విప్రలంభం. అది కావ్యమునందు పరిపుష్టంగా భాసిస్తోంది. అంగిరసానికి ఎక్కడా భంగంలేదు. విభావానుభావాదులు పరిస్ఫుటంగా ఉంటేనే కాని రససృష్టి జరగదని విజ్ఞుల అభిప్రాయం. ఆత్మాశ్రయకవిత్వంలో కవే ఆలంబన విభావంగా ఉపచరిస్తాడు గాబట్టి పరిపుష్టరససృష్టి తారసిల్లదని కొందరివాదం. పరిశీలిస్తే కొంతవఱకావాదం హేతుదూరంగా కనబడుతుంది. రససృష్టి జరిగేది పాఠకుల్లోకనక (సామాజికుల్లో) "నేను

నేను" అని కవి తానుగాభావించే చర్వణమాణాను
భూతిని వివరిస్తుంటే ఏ సహృదయుడూ, రసదూరుడు
కాడు. కనుక ఆలంబనవిభావం కావటంవల్ల ఏమాత్రం
విభావపుష్టికి లోటు వాటిల్లదు.

ఈ కావ్యమునకు నాయికానాయకులు "ఊర్వశీ
కవులు"—వారే ఆలంబనవిభావములు. అట్లగుటచేత
కవి, తాను, ఆలంబనవిభావమగుచు పల్కుటచే
విభావపరిపుష్టి లేక రసస్పృష్టి జరగదని కొందరి
మతం.

అంతమాత్రముచేత రసభంగ మగునని చెప్ప
గలమా? మన యలంకారశాస్త్రము లన్నియూ
ప్రాచీనసంప్రదాయములపై నిర్మింపబడినవి. ప్రసిద్ధేతి
వృత్తగ్రహణము చేయుటా, ప్రఖ్యాత నాయికా
నాయకులను ఆలంబన విభావములుగా నుంచుటయే
మనకు వలిసినదారి. కాని అచటనైనను కవి
నాయికానాయకుల అనుభావసంచార్యాదులను తాను
గాభావించుకొనియే రసమార్గము నేర్పరుపవలయును.
తానావిధముగ భావింపనినాడు రసపుష్టి జరుగ
నేరదు. ఇచటనైనను కవి ప్రసిద్ధమగు నితివృత్తమునే
గ్రహించెను. నాయికానాయకులలో నాయకునకు
బదులుగా "నేను" అని వాడినాడు. అంతమాత్రముచే
తద్గత భావభావనకు గాని, రసపరిపుష్టికి గాని భంగము
కలుగ నేరదు. భావము విభావానుభావ వ్యభిచారు
లతో పరిపుష్టినొందిననాడు, రసత్వమునందక తప్పదు.
ఈ కావ్యమున ఊర్వశీకవులు ఆలంబనవిభావములుగా
తద్గతఅనుభావాదులు నిర్వేదగ్లాని శంకామరణాంత
వ్యభిచారిభావములుపరిపుష్టముగ వర్ణింపబడుటచేజనిం
చిన రతిరూపభావము రసపర్యవసితం అవుతోంది.
ఇందు రసమేలేదనుటకు ఎన్నడునూ అవకాశము
లేదు. మాధుర్యమనుగుణము ప్రధానంగా గలదని నుడు
వుట సమంజసం కాదు. రసంలేనిదే గుణముండుట
సంభవముగాదు. గుణములు రసాశ్రయాలు. అచ్చట
మాధుర్యమనునది విప్రలంభ శృంగార రసమున పుష్టి
పక్వమై, ఆధేయమై అలరారు గుణం. గుణప్రధానమై
రసాభిముఖమైయున్నచో నక్కావ్యము శిరోధార్య
మగును. క్షేమేంద్రునివచనంలో గుణప్రధానకావ్యము
దుష్టమని నిరూపింపబడినట్లు అగపడదు. ఔచిత్యము
మాత్రము చెడరాదని ఆలంకారికులందరు అంగీక
రించినవిషయమునే వారుకూడ ప్రతిపాదించిరి. అట్టి
ఔచిత్యభంగము మహాకవులలోనూ సంఘటిల్లును.
కాని అది "అశక్తికృతమైనచో అనౌచిత్యమువలె
భాసించును. లేనిచో కవియొక్క ప్రతిభయే దానిని
కప్పిపుచ్చును" అని ధ్వన్యాలోకవ్యాఖ్యాతచెప్పెను. కుమార
సంభవంలో దేవీసంభోగము వర్ణించుట ఔచిత్య
దూరము కాదా! అయినను కాళిదాసు లోకోత్తర
ప్రతిభ దాని నాచ్ఛాదించుచున్నది. అట్లనే ఏవో
కొన్ని అనౌచిత్యములు కావ్యములోనుండిన నుండ
వచ్చును, కాని అవి అశక్తికృతములా, వ్యుత్పత్తి
కృతములా యని పరిశీలింపవలెను. కృష్ణశాస్త్రిగారి
రచనలో నట్టి రసభంగకము లగు ననుచిత వర్ణనములు
గాని సంఘటనలుగాని, భావములుగాని, కల్పనలు
గాని చేయబడి యుండలేదు. అని సర్వజనాంగీ
కృతము. అట్టితరి ఇచ్చట రసములేదు. ఔచిత్యము
లేదు. సంప్రదాయము లేదు, గుణప్రధానము అని
వాకొనుట తత్కాలోచితావేశ ప్రభావమేనో!

కాని, సార్వత్రికంగా సంప్రదాయాల్ని
స్పృశించటం మహాకవులకు కూడ దూరమగువిషయం.
శ్రీ సీతారామారావుగారు స్పృశించిన సంప్రదాయ
ములే వీరి సంప్రదాయాభిమానమునకు నిదర్శనములు
కాగలవు. వీరి కవిత్వంలో ఏ భావము అనగా రతి
మొదట ప్రతిపాదింపబడినదో ఆ భావమే చివరి
వఱకు పరిపుష్టమై రసత్వమునందినదిగాని శాఖా
చంక్రమణమేమియు లేదు.

ఇక మాధుర్యగుణాతిశయమువలన రచనఅంతా
గుణప్రధానమైపోయిందనిగదా శ్రీ సీతారామారావు
గారి యూహ! ఇందున్నటువంటి మాధుర్యగుణ
మేమాత్రమును, రసమును చెఱచునదిగా లేదు.
ఈ సందర్భములో ధ్వన్యాచార్యులు "శృంగారే
విప్రలంభాఖ్యే కరుణేచ ప్రకర్షవత్ మాధుర్య మార్ద్రి
తాంయాతి యత స్తత్రాధికం మనః" విప్రలంభశృంగా
రములోను, కరుణరసంలోను, మాధుర్యమే ప్రకర్ష
వంతమని వారి యూహ. అదియే సహృదయస్పందన
మునకు ప్రధాన హేతువౌతుంది. అటువంటి మాధుర్య
గుణం ప్రతిపాదంలోనూ ప్రతిపాదిత మౌతోంది.
ప్రధాన రసావిష్కారానికి చేదోడు వాదోడుగా
ఉపకరించిం దీగుణమే.

ఈ కవిశబ్దాలంకారాలు శ్లేషలు అట్టే వాడి
నట్లులేదని ఒక అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. రస

జ్ఞానమున్న కవి, ఎవడూ శృంగారంలో శబ్దాలంకారాలు శ్లేషలు మొదలగు గారడీలు చేయడు.

శబ్దాలంకారాల్ని శృంగారరసంలో వాడటం గురించి ధ్వన్యాచార్యులు "ధ్వన్యాత్మభూతే శృంగారే యమకాదినిబంధనం శక్తావపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః" అన్నారు. అంటే ధ్వనికి ప్రాణమైన శృంగారరసంలో యమకాద్యలంకారాల నుపయోగింపరాదు. సమర్థునకూ ప్రమాదమట; విశేషించి విప్రలంభంలో అసలే పనికిరాదన్నారు. దీని వలన విప్రలంభ శృంగారరసంలో ఉండే సౌకుమార్యాతిశయం వ్యక్తమౌతోంది. మెత్తటి దూదిపింజ లాంటిదన్నమాట. ఏ సందర్భంలోనూ ప్రయోగింప రాదని శాసించారు. అందుచేత మనకెక్కడా శబ్దాలంకారాలు కృష్ణశాస్త్రి రచనలో కన్పడవు. కావ్యంలో చేసే ప్రతిపనీ రసోపస్కారకంగానే ఉండాలిగదా!

ఇక అలంకారాలనుగూర్చి చర్చింతము. సీతారామారావుగారు చెప్పినట్లు అలంకారం భావమునో, రసమునో, కనీస మేవస్తువునో ఉద్దీపింపజేయునట్లు వాడుట మన కవులసంప్రదాయం. దాన్నెవరు కాదన్నారు? సమర్థుడైన కవి అలాగే చేస్తాడు. ఎవడూ కూడ నిష్ప్రయోజనంగా అలంకారంకోసం పద్యము వ్రాయడనుకుంటాను. ముఖ్యంగా కృష్ణశాస్త్రి అలంకారాన్ని కేవలవ్యామోహంతో వాడరు. ఆయన పలికే ప్రతిపలుకునకూ ఉపయోగించే అలంకారానికి ప్రత్యేక ప్రయోజనం ఉంటుంది. వారు రూపకాలంకారాన్ని గ్రుక్క త్రిప్పకుండా క్రుక్కారని అన్నారు. ఒక్క రూపకమన్నమాటేమి? ఉపమల్ని వాడతారు. సందేహాన్ని వాడతారు. ప్రతీపాన్ని వాడతారు. ఉత్ప్రేక్షల్ని వాడతారు. ఒకటేమిటి! ఏది ఎప్పటి కవసరమొస్తే దాని నప్పుడు గ్రహిస్తారు. లేనపుడు విడిచిపెడతారు. ఆయా సన్నివేశాల కుచితంగా ఆయా అలంకారాల్ని వాడతారు. ఇవన్నీ కూడ రసోపస్కారకంగానే ఉంటాయి. ఒకప్పుడొక అలంకారాన్ని తీసుకొంటారు. దాన్ని పూర్తిచేయకుండానే మఱొకదాన్ని నిబంధిస్తారు. ఇదంతా కూడా శిల్పానికి సంబంధించినపనే. దీనిని గురించే "కుమారసంభవ" వ్యాఖ్యానంలో, "అలంకారస్య కవయో యత్రాలంకరణాంతరం, అసంతుష్టా నిబధ్నంతి హారాదేర్మణి బంధవత్" అని అన్నారు. హారాలే అసలు ప్రకాశంగా ఉంటాయి. అయితే అందులో మణులు పొదుగుతారెందుకు? ఇంకా అందాల్ని కురిపించటానికి.* అందుకే యీ అలంకారాల్లో అలంకారాల్ని పొదుగుతారు కవిశిల్పులు. ఈ సందర్భంలోనే శ్రీమదభినవ గుప్తపాదులు తమ శ్లోకాన్ని

"శీతాంశో రమృతచ్ఛటా
  యదికరాః కస్మాన్మనో మేభృశం
సంప్లుష్యం త్యథ కాలకూట పటలీ
  సంవాస సందూషితాః
కిం ప్రాణా న్నహరం త్యుత
  ప్రియతమా సంజల్ప మంత్రాక్షరైః
రక్ష్యంతే కిము మోహమేమి
  అహహా నో వేద్మికోయంగతిః"

ఉదాహరించారు. పై శ్లోకం అర్థాన్ని మనవిచేస్తాను. "ఇవి చంద్రుని సుధాకిరణాలే అయితే నన్నిలా వేపుతున్నాయెందుకు? ఓహో! కాలకూటవిషంతో చెలిమి ఫలితంకాబోలిది! అయితే నా ప్రాణాలుతియ్యవేం? నా ప్రియురాలి సంజల్ప మంత్రాక్షతలచే మంత్రింపబడ్డాయిగాబోలు! అయితే నాకీమోహమేమిటి? కారణం తెలియటం లేదు" అని ఒక విరహార్తుడంటాడు. ఇందులో రూపకసందేహనిదర్శనాలంకారాలున్నాయి. దేనినీ పూర్తిగా పోషింపలేదు. అలంకారాలను విడిచివేయడం తిరిగి గ్రహించటం కేవలం రసపోషణకొరకే యని లోచనకారు లన్నారు. ఇంతకీ చెప్పేదేమిటంటే కృష్ణశాస్త్రిగూడ అలంకారాన్ని భావోద్దీపకంగానో రసోద్దీపకంగానో వాడారుతప్ప అలంకారం అలంకార మర్యాదకోసం ఎక్కడా ప్రయోగింపలేదు. ఒకవేళ వాడినవాటిలో రూపకాలసంఖ్య ఎక్కువ కావచ్చును. అదైనా వాడటంలో ప్రత్యేక ప్రయోజనం ఉంది. రూపక ధర్మం - ఉపమానోపమేయ అభేదత్వం అంటే తాదాత్మ్యం. తానుగూడ ఊర్వశీ గతచేతస్కుడై ఆ తాదాత్మ్యానికై తహతహ పడుతున్నాడు. అలాంటిసందర్భంలో రూపకంలా పనిచేసే అలంకారం మఱొకటి ఏల ఉంది? వారిరువురి మనస్సులలో పెనవైచుకొని యున్న ప్రణయతత్వాన్ని, తదభేదత్వాన్ని ప్రకటించాలంటే రూపకమే శరణ్యము. అలాంటి సందర్భాలలో మహాకవి అన్నవాడల్లా అలాగే చేశాడు. ఉత్తర హరివంశములో జనార్దనుడు జనార్దన సాన్నిధ్యానికి పోయినపుడు,

"గోపాల నవపుష్పగుచ్ఛంబు దరిగొన్న
పరిచారికాద్విరేఫములలోన,
వసుదేవసుత సరోవరములో నోలాడు
సనకాది దివ్యహంసములలోన"

అని ప్రతిపాదంలోనూ రూపకాన్నుపయోగించాడు. పరమాత్మ సక్తమైన జనార్దనుని మనస్థితిని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది. ఈ జనార్దనుడూ ఆ జనార్దనుని మధ్యనున్న అభేదత్వాన్ని బయటపెట్టేది ఆ రూప

కాలం కొరకే.: అందుచేత పునఃపునరూపక ముహొత్తమైన రస పరిపోషణముకొఱకే అని మనవి చేస్తున్నాను. పైగా కృష్ణశాస్త్రి రూపకాలు కట్టే బొమ్మలు సృష్టిలో మనకెక్కడా కన్పడవు. ఉదాహరణానికి,

"ఏనాటి వియోగకాలినీ హృదయరాగ
వేదనాశిఖ ఆకలి వేసనావె
అంగుళీ కిసలయ పంచలాంచలముల
విడివడియవంత విశ్వాన పడిలినాడు"

"అంగుళీకిసలయము లాకలితో వేసుచున్నవని రూపకము చేయుటతో పద్యము క్కిరి బిక్కిరైనదట! నిజమే నేమో! మనకు బాగా ఆకలి వేసినపుడు తూలి సోలిపోతాము. మన శరీరంలో ప్రతిభాగం క్షుత్పీడితమౌతున్నట్లు మనము బాధపడటం పరమ సహజం. అలాగే ప్రేమకూడాను. అదిక, వియోగంలో చెప్పనక్కరలేదు. ఆమె వ్రేలికొనలలో గూడ ప్రేమ భావం విద్యుత్తులా ప్రసరిస్తోంది. ఈ మహాభావాన్ని ధ్వనించటంకోసం "ఆకలివేసు" అని చెప్పారు. గాఢమైన అనుభూతి మనలో ఉంటేతప్ప దీన్ని [illegible] లేము. ఇలాగే ఆయన వాడే ప్రతీమాట, సార్థకంగా ఉంటుంది. ఈ పద్యం చూడండి!

"వడవడ వడంకిపోదు జీవనపుగొనల
నెన్నడే నాసకళ తలయెత్తెనేని
ఉభయ సంధ్యాంచలములనెకొ వెలుంగు
కలుగ కలవరపోవు ఘూకమ్ము వోలె"

తాను ప్రవాస భారంతో క్రుంగి పోతున్నాడు. శాపవశంవలన నెత్తిపైబడ్డ విరహభారాన్ని సహించ లేకపోతున్నాడు. కేవలం చీకటిముద్దలో తారాడు తున్నాడు, ఎప్పుడైనా ఊర్వశీదర్శనం అనే ఆశా లేశంతనలో అంకురించిందా—సర్వేంద్రియాలు స్పందించిపోతున్నాయి. అంతేకాదు. ఆ భావాన్ని భావించటానికే ధైర్యం చాలటంలేదు. ఇదీ! తనస్థితి. ఉభయసంధ్యలలో వెలుతురిని చూచి భయపడే దివాంధంతో తన్ను పోల్చుకున్నాడు. వెలుగు తునక కనపడేసరికల్లా వడవడా వణకిపోతుంది ఘూకం. ఆ వెలుగును చూచి భయపడ్డందుకే సాదృశ్యము. ప్రాతస్సంధ్యా చర్చ అప్రస్తుతం.

ఇక కృష్ణశాస్త్రి భాషమరీకృతకమైందనీ ఒక పరిమితిని చుట్టి పెట్టుకొని తిరుగుతుందనీ, వాడిన ఏశబ్దం శక్తిమంతమైంది కాదనీ ఏ భావాన్నయినా ఒకటే పోతపోస్తాడని శ్రీవారి యాక్షేపణ. ప్రయత్నమువలన చేసేపని యేదైనా కృతకంగానే యుంటుంది. అది కావాలని చేసేపనిగనక. అందులో పోషితమయ్యేభావానికి స్ఫోరకంగా శబ్దప్రయోగం జరగాలి.

శబ్దమెప్పుడూ ఒక నిర్దిష్టమైన అర్థాన్ని చుట్టి పెట్టుకొనే తిరుగుతుంది. కవి శక్తిని బట్టే శబ్దానికి గూడ ప్రయోగంలో కొత్తకాంతి చేకూరుతుంది. కొత్త కొత్త రంగుల్నీ రుచుల్నీ పరిమళాల్నీ [illegible] కుంటుంది. [illegible] కవిత్వంలో [illegible] నానార్థాలను ఉపకరించిన శబ్దం సామాన్యులలో సామాన్యంగానూ, [illegible] హీనంగాను మహాకవి చేతిలో [illegible] కొగ్గుతుంటుంది.
ఉదాహరణానికి

"నా కుగాదులు లేవు
నా కుషస్సులు లేవు
నేను కృష్ణానంత హేమంత శర్వరిని."

"నటియించు అపూర్వ లేటు నవ్వు దున్న
సురిమి విరయు నాని ఎరుగనేని గూడ
సూరాలకో రహస్త్రీరాలకో చెలి!
కప్పికొంగున కనలు!
కప్పగల నాయెడద!
నాసఖీ! నాసఖీ! నేనోపగాలేను."

"కలుగనా నాకు వియోగమున్న నకియా
నాలు సికను నెప్పుల జాలి చూపు
లల్ల దిగజారి దిగజారి అమరనాగ
కంఠమాలా సుమపితాలు కాగ, గగన
వాహినీ నీరజాళినీ నీలపక్ష్మ నీల
నాట్యములుగ, తారాతోరణములుగాగ
నింగి నీడల మెట్లుగా నీలి మొయిలు
జిలుగు విరుపులు గాపులు గులుగనలరు
లుగ నలలుగా కలలుగాగ సాగయపోని
విసివిపోని వింత వలపు వేడివేడి
తొందరల పరువుల నెంత తూలితూలి
ఎంత దిగజారి దిగజారి ఎంతవెదకి
వెదకిపడినవో..............వదలని కౌగిలి జెదరు
గాక లజ్జాగాఢ వేదనాగ్ని......

పైవానిని మనవి చేస్తున్నాను. "ఉగాదులు లేవు ఉషస్సులు లేవు" అన్న పదాలు సర్వసామాన్యాలయినా ఆ కవితాబంధంలో ఇరుక్కునేటప్పటికల్లా వాటికి క్రొత్తచేవ కల్గింది. సకారాంత శబ్దమైన 'ఉషస్' శబ్దం వాడటంవలన ఉషోరేఖలు ఉజ్జ్వలంగా భాసిస్తున్నాయి. 'కృష్ణానంత హేమంత శర్వరిని' అనటం రమ్యంగా ఉంది. ఆ శర్వరీ దైర్ఘ్యం మొదటిలో బిగించిన సవర్ణ దీర్ఘసంధివలననే అభివ్యంజితమవుతోంది. 'శర్వరి' అన్న శబ్దప్రయోగమే చీకటిముద్దను స్ఫురింపచేస్తోంది. అరకొరవకారాలలో ఉన్నది ప్రాణం. సూక్ష్మసూక్ష్మాంతరభేదాలు తెలిసికోగల్గితేకాని ఈలాంటిప్రయోగాలు చెయ్యటం

జరగదు. తరువాతి ఊర్వశి ఎలా దిగి వచ్చిందో చెప్తున్నాడు. ఇంద్రలోకంలో ప్రహరీ కాపలాలో పడి ఉందామె. ఆమె అవన్నీ విదిలించుకొని క్రిందకు రావాలి. అందుకనే పొడుగు సమాసాలు వేసి...... రానురాను శిథిలబంధం చేస్తూ జాగ్రత్తగా ఆమెను క్రిందికి దింపాడు. కవిత్వానికి ప్రాణమైన శిల్పం ఇంతకంటె ఏం కావాలి? అందుచేత సమర్థుడైనవాడెవ్వడూ శబ్దాన్ని తేలికగా చూడడు.

"కృష్ణశాస్త్రిగారి ఊర్వశిని స్వర్గంలోని ఊర్వశిగానే కల్పనలతో చమత్కరించిన భాగం దెకిది. మానవసామాన్యంగా వర్ణించడంతోనే అందలి స్వారస్యం చెడి దూరమవుతున్నది" అని సీతారామారావుగారి అభిప్రాయం. ఇదికూడా సహేతుకంగా అన్నట్లే కనబడుతూంది. ఊర్వశి మన సంప్రదాయాలప్రకారం ఎలా అవతరించిందో పూర్వపు ఇతివృత్తాలను ఒకసారి పరిశీలిస్తే కృష్ణశాస్త్రిగారు చేసిన చమత్కారం అర్థమవుతుంది. ఇది వేదకాలం నుంచి పారంపర్యంగా మనకు సంక్రమించిన ఇతివృత్తం. ఋగ్వేదంలో శతపథ బ్రాహ్మణంలో (XI-V-I) ఈ ఇతివృత్తం ఉంది. ఊర్వశి తానా కట్టిన మూడు నియమాలకు లోబడేపద్ధతిలో పురూరవుని ప్రేమిస్తుంది. అందులో ఒకటి పురూరవుని ఎన్నడూ ఆమె మొండిమొలతో చూడకుండటం. గంధర్వులామెను తిరిగి స్వర్గానికి తీసుకపోవాలనే దురుద్దేశ్యంతో ఆమె మంచానికి కట్టుకొన్న రెండు గొఱ్ఱెపిల్లలని దొంగిలించారు. వెంటనే ఆమె నెత్తికేక వేసింది. సుప్తుడైఉన్న పురూరవుడు మేనపుట్టాలు సవరించుకోకుండానే దొంగలని తరుముదామని లేస్తాడు. అతన్ని నగ్నంగా ఉండేస్థితిలో చూస్తుందామె. వెంటనే స్వర్గానికి పోతుంది. ఇలా జరుగుతుంది కథ అక్కడ. ఈ ఇతివృత్తం రామాయణ భారత హరివంశవిష్ణుపురాణాలలో కాళిదాసుని విక్రమోర్వశీయంలో మళ్ళీ మనకు కనపడుతుంది. టాగూరు—అరవిందమహాశయుల గీతాలలో కనపడుతుంది. తరువాత కృష్ణశాస్త్రి ఊర్వశి సాక్షాత్కరిస్తుంది. అయితే యీ ఇతివృత్తం ఆయా కవుల భావనాప్రపంచంలో ఎలా ఎలా రూపాంతరాల్ని పొందిందో మనము తెలిసికోవాలి.

ఋగ్వేద ఇతివృత్తంలో కామం — కరుణం ప్రధానంగా కనపడుతూ మానవజీవితానికి దగ్గరగా ప్రతిబింబిస్తున్నట్లు మనకు కన్పడుతుంది. కాళిదాసునికృతిలో ఊర్వశి కొంతవరకూ స్వార్థప్రవృత్తి కల వేశ్యలా కనుపడుతుంది. చివరకు అచ్చపునీడలా భాసింపవచ్చును. విక్రమోర్వశీయ చతుర్థాంకం— కేవలం *Lyric* మార్గాన్ని ఆశ్రయించినట్లు కనుపడుతుందితప్ప నాటకీయంగా ఉండదు.

కాని రవీంద్రుని గీతాలలో అందాలని పుణికిపుచ్చుకొన్న స్త్రీమూర్తిలా దర్శనమిస్తుంది ఊర్వశి. ఆయనదృష్టిలో సృష్ట్యారంభంనుండి మానవుని కాంక్షాదాన్ని కూర్చే సౌందర్యమూర్తిలా సాక్షాత్కరిస్తుంది. ఒకచేత్తో అమృతం మరొకచేత్తో విషం పుచ్చుకొని బయలుదేరుతుం దాయన గీతికలో.

అరవిందుని ఊర్వశి మరొకతరహాలో కన్పడుతుంది. మానవుని కర్తవ్యాన్నుంచి నివారిస్తూ భవిష్యానికి అంధునిగాచేసే సౌందర్యమూర్తిలా ఆమె దర్శనమిస్తుంది.

కాని కృష్ణశాస్త్రి ఊర్వశి అక్కడక్కడా రవీంద్రుని ఊహించిలాలని స్పృశించినా ప్రత్యేక మూర్తిత్వంతో శోభిస్తూంటుంది.

"నీవు తొలిప్రొద్దు చను సంజతీవ సొనవు
నీవు వర్షాశరత్తుల నిబిడసంగమునను నోచమిన
సంధ్యాకుమారివి"
అనటంలో రవీంద్రుని సౌందర్య మూర్తిత్వము ధ్వనితమవుతోంది.
"ఊర్వశీ! ప్రేయసీ! నేడో యుష్మదీయ
చరణ మసృణారుణోదయ సురభి కాంతి
పలుకరించున, సోకునా, తళుకుమునున
ఆరని వెలుంగె నా గీతికాంతికముల
చేర్చికొని కూర్చికొని భవచ్ఛ్రీవిలాస
హాసవాస నావేశము లందికొనగ
రమ్యహిమవాలు కాచ్చనీరాజనముగ
ఈయనా నాసఖి!"

వైదిక ఊర్వశి తన ముగ్ధసౌందర్యంచేత తపస్సంపన్నులని తపస్సమాధినుండి మలచినట్లు వింటాము. కాని కృష్ణశాస్త్రి ఊర్వశి ఆయనకు బ్రహ్మాండమైన ఆవేశాన్ని, ఉద్దీపనాన్ని ఇచ్చినట్లు పై పద్యమువలన వ్యక్తమవుతోంది. అంతేకాదు. తన మానవ పరిచయాన్ని పరిచితమానవత్వాన్ని పాదుగొల్పుతాడామెలో.

"తొలివియోగిని నేనె, తొలిప్రేయసిని నేనె ఆనాటి కీనాటికేను నీదాననే" అన్న గీతాలు ఈ అర్థాన్ని దీపింప చేస్తాయి.

"నునుమబ్బు లేదున్న కొనలపై సోనలా నెలవంక చిరునవ్వు చలువపాట" అని ఆలపించిన పద్యాలలో ఆమె సౌందర్యభారంవలన తాను క్రుంగిపోయి—తిరిగి మహోన్నత్యాన్ని తాకిన అవధులను చూపిస్తాడు.

ఇలా అక్కడక్కడా మానవసామాన్యంగా ఊహించడంవలనే కృష్ణశాస్త్రికొక విశిష్ట సాహితీ స్థానం సంపాద్యమయిందేమో! ఇది పరమరమ్యమైన

కల్పన. దీనివలన సహృదయస్పందనం ఏమాత్రం జారిపోదు.

వారు చెప్పినట్లు ప్రతిభాదోషమే పెద్దది. శబ్దదోషాలు ప్రతిభాభంగానికి సహాయకారులు కానంతసేపు పరవాలేదు. అనుకొన్నంత శబ్దదోషం అయినా యీ కావ్యంలో లేదు. "ఊహాపట్టాంచలములు" అన్న ప్రయోగము వ్యాకరణ సాధువే.

"ఊహః ఘఞ్ అంతః ఊహా స్త్రీత్వాత్ టాప్ తర్కః" అని అభిధాన రాజేంద్రము అన్నాడు.

*Apte* గారి డిక్షనరీలో "ఊహా—*Supplying an ellipsis*" అని ఉన్నది. హిందీ సంస్కృత శబ్దార్థ కౌస్తుభంలో.

"ఊహా—అధ్యాహార. వాక్యమే త్రుటికో పురాకర్నా" అని ఉన్నది.

వాచస్పత్యంలో "ఊహా—స్త్రీ. ఊహ. అ. స్త్రీత్వాత్ టాప్ (1) అధ్యాహారే ఊహాశబ్దార్థే" అని ఉన్నది.

పై ఆధారములవలన వ్యాకరణ సాధుత్వము వ్యక్తమవుతూంది.

"తారలే కనువిచ్చి తమములే ప్రతివిచ్చి"

తారకలు కనువిచ్చుట కంగీకరించిననాడు తమములు ప్రతివిచ్చుటలో అభ్యంతరమేమున్నది? ఈ ప్రయోగము పూర్వమూ—అపూర్వంకూడా.

కాళిదాసుకూడ కుమారసంభవంలో హిమవన్నగప్రాశస్త్యం ఉగ్గడిస్తూ చీకట్లు సూర్యునికిజడిసి కొండ శరణుచొచ్చాయని వర్ణించాడు. విమర్శక శిఖామణులు ఆయన్ని దూయబట్టారు.

ఆ ప్రయోగం సహృదయసమ్మతం అయినప్పుడు ఇదెందుకు కాదు?

"నీ హృదంతికములో" బదులు హృదంతికమున అనుట సంప్రదాయమే. అంతమాత్రంచేత హృదంతికములో అని అనరాదని చెప్పలేముకదా! కవులప్రయోగపద్ధతినిబట్టి విభక్త్యర్థాలు మారుతూంటాయి. "నూతిలో నెలువడ గోమలిందిగిచె" అనుట కంటె నూతన్ అని వాడుట సంప్రదాయమన్న ఎంత బాగుండునో దీన్ని ఆక్షేపించడం అంత బాగుంది.

"నిరుపమానాఖాత రత్నాకరా మూల్యరాగ సంపద మెరయును" అఖాత రత్నాకరములు రెండును సమానార్థకములుగ ప్రయోగింపబడలేదు. ఆయన మిత్రుని హృదయం త్రవ్వబడని సాగరమని సహజ రత్నాకరత్వాన్ని వ్యంజింపజేస్తూ వాడారు. సముద్రం త్రవ్వబడిందని మన విశ్వాసం. ఆ నెచ్చెలి హృదయం సహజంగా ఏర్పడ్డసముద్రం. ఆలోతులకుపోయి శ్రమించి త్రవ్వితే తప్ప యందలి రత్నసంపద కనపడదు. అదొక పెద్ద గనిలా ఉన్నదన్నమాట. దీన్నిబట్టి కవి ఎంత భావుకుడో ఊహింపవచ్చును.

సందర్భ శబ్దప్రయోగం తప్పు కావచ్చును. ఆశబ్దాన్ని వింటే మూర్ఖుడైనా మన వ్యాఖ్యానమునే అర్థస్ఫూర్తిని పొందును. అర్థస్ఫూర్తి చెడనంతసేపు—సంధి అయినా సంజ్ఞయు అయినా పరవాలేదు.

ప్రవాసం-ఊర్వశిలో మహోజ్వలంగా ఉండే రెండుమూడు గీతాలను సహృదయలోకానికి వివరించి నా వ్యాసాన్ని ముగిస్తాను. ముచ్చటకి ఈ క్రింది గీతాలు చూడండి.

"ఊర్వశీ! ప్రేయసీ! నేడో యమృతమయి
చరణ కరుణామృతకణమ్మె వొరకు నేమొ
మూడులోకాల సుక మొక్క ముడి నిమిడ్చి
విసరజేనా కాలాంతమే వెనుక త్రోక."
"నీకై శకధ్వాంత నిశ్శబ్దముంజేల్చి
నాకొరకె నాకొరకె నా శర్వరీసతి
కోటి నవమల్లికలు కోటికన్నులువిచ్చి
విరహ తీక్ష్ణ భయంకరమాధురుల నన్న
పలకరించిన చెలీ పులకరించిన బ్రతుకు
వేగిపోవునో ఏమొ ఆగలేనో యేమొ!
నాసఖీ నాసఖీ నే సైపగాలేను."
"నీకుంతలములలో నాకై శిరసులెత్తి
ననుబోల్చుకొన్నవో నను పిల్చుచున్నవో
నటియించు అపూవు లెటు నవ్వుచున్నవో
తురిమి విసరుము వాని నెరుగ నేరని దూర
దూరాలకో రహస్తీరాలకో చెలీ!
కప్పికొందున కనులు! కప్పగల నా యెడద!
నాసఖీ! నాసఖీ! నే సైపగాలేను"

మొదటిపద్యంలో తనకి కనక ఊర్వశి పొందు కల్గితే జరగబోయే పరిణామాన్ని సూచిస్తున్నాడు. త్రిలోకసుఖాన్ని ఒక్కసారిగాపేని ముడివేసి విసురుతాడట. కాలాంతమే వెనక్కిపోవాలికాని దీనికేం లోకాలేదు. ఉజ్వలమైన సుఖాన్ని పొందుతూంటే ఏమానవుడూ కాలగమనాన్ని లెక్కించడు. వాని జ్ఞానమే ఉండదు. ఆ సుఖానంత్యం అంతగా అతన్ని తన్మయుని చేస్తుందన్నమాట. మూడులోకాల సుఖాల్ని ముడివెయ్యడం ఒక చక్కని ఊహ. దాన్ని బ్రహ్మాండంగా పోషిస్తోంది విసరివేయడమనే క్రియ. కాలమే మాత్రం వారి ప్రణయకోపంలో కాలెట్టకూడదని వారి తాత్పర్యం. "నకాలస్తత్ర భవతి" అనే వేదాంత వాక్యస్ఫూర్తి సర్వతోముఖంగా ఇక్కడ జరుగుతోంది.

రెండవ గీతాన్ని చూడండి. ఊర్వశి కేశపాశం దట్టంగా అలముకొన్న చీకట్లలా ఉన్నాయి. ఆ వలుద చీకట్లలో చుక్కలు కోటి మల్లెలు వికసించినట్లు దర్శనమిస్తున్నాయి. అవికూడా భర్తృవియోగంతో బాధపడుతున్నాయి. ఆ విరహార్తమైన చూడ్కులు నాపై ప్రసరిస్తే—అసలే ప్రవాసభారంతో క్రుంగి క్రుశిస్తున్న నేను ఆగగలనా చెలీ! అంటున్నాడు. ఈ భావన ఎంత ఉజ్వలంగా ఉందో చూడండి.

వెంటనే వానిని కొప్పులో తురిమి దూరంగా పారెయ్యమని అర్థిస్తున్నాడు ప్రేయసిని. ఈ కల్పన మరీ అతిలోకంగా ఉంది. ఊర్వశి కేశపాశంలో సవరించుకొన్న పూలులా ఆ తెమస్సంతానంలో చుక్కలు మిలమిల లాడుతున్నాయి. ఊర్వశి తన చెంత నున్నంతసేపూ ఈ నక్షత్రాలు ఇంత మిడిసి పడలేదు. ఆవిడ కొంచెం దూరమయింవనగానే వీటి కెక్కడలేని ఉబ్బు వచ్చింది. అందుకని ఇతన్ని చూచి పరిహసిస్తున్నాయి. ఆ చీకట్లకంటె దట్టంగా నల్లగా ఆమె కేశాలుండేవి. ఆ నక్షత్రాలకంటె ఈ వరలో ఆమె తురిమిన పూలు శోభాయమానంగా ఉండేవి. అందుకని ఆ ఉజ్జ్వలమూర్తిఎదుట తమ ప్రతాపాన్ని చూపించటాని కీవరలో జంకేవి. ఇప్పుడో ప్రవాసభారంతో క్రుంగే కవిని చూచే టప్పటికి నాటికి వేళాకోళంగా ఉంది. "ఏమయ్యో! ఈ వరలో ఊర్వశి చేరించలాకర్షణాలతో మమ్మల్ని ఈసడించావు ఇప్పుడేమైంది నీగతి? అని అంటున్నట్లున్నాయి అతనితో. అందుకని వాటిని వెంటనే విసిరిపారెయ్యమని ప్రేయసిని అర్థిస్తున్నాడు. ఈ కల్పన బాగుండలేదనటానికి ఎవరొప్పుకుంటారు? ఎక్కడ దూహించినా అతిరిలాగే కనిపిస్తాడు.

ఒకసారి కింకపీంద్ర ఘటాపంచాననులు శ్రీ వేంకటశాస్త్రిగారు కాకినాడ కళాశాలకు ఆహూతు లయ్యారు. ఆ రోజుల్లో కృష్ణశాస్త్రి అక్కడ పనిచేసేవారు. అక్కడి ప్రముఖులు కృష్ణశాస్త్రిగారి కవిత్వాన్ని గురించి తమ అభిప్రాయమేమి అని శ్రీ వేంకటశాస్త్రిగారి నడిగారు. అప్పుడాయన చెప్పారుకదా! "ఒకరాజున్నాడు. సాయం సమయంలో వాహ్యాళికి పోయాడు. సరస్సమీపంలో చదికిలి పడ్డాడు. సంజకెంజాయ విరిసింది. ఆ సమయంలో అచ్చటికి వచ్చిన హంసాన్ని ఒకదాన్ని పట్టుకొన్నాడు. "నీకేదైనా మేలు చేస్తాను. నన్ను విడిచిపెట్టు"మని అతన్ని కోరింది. వెంటనే విడిచాడు. విదర్భకు వెళ్ళింది. దమయంతిని చూచింది" ఇంతవరకూ మేము చెప్పాము. చెప్పతాము. ఇక్కడ నుంచీ కృష్ణశాస్త్రి చెపుతాడు. అదీ అతని కవిత్వం" అన్నారట శతావధానులు. సావధానంగా వారాడిన మాట కృష్ణశాస్త్రి కవితాజీవిత వ్యాఖ్యావివరణంగా ఉంది. ఏ అనుభూతినైనా కృష్ణశాస్త్రి తరిమిచి పడితేకాని తోడును తొడిగి దేశానికి వదలడు.

ఈ కావ్యాన్ని ముగిస్తూ నటరాజ సౌందర్యానికి ముగ్ధుడై లల పంకిస్తాడు కవి. ఈ కల్పన మహోదాత్తంగా ఉంది.

"అంతనే కట్టినైపోదునయ్యా -
నిన్ను బోలి పాడబోవుదు; నిన్నుబోలి
నాట్యమాడబోవుదు; లజ్జబోనాడి కాక
ఇంతదాహమ్ము దహియింప ఎట్లు మనుదు?
ఏవిధాన సౌందర్య రసైకజీవి
నిలువనేరుతు నిట నొక్కనిమునమేని
మూమకేన జీవిత శూన్యమార్గముల
త్వదీయ పాదమంజీరముల్ మ్రోయకున్న!
ఆటతో పాటతో నేర్పినట్లు దేవ
ఏనుకూడ నీవలె నటియింపనిమ్ము
ఎడతెగని యాత్ర నెట్లో సాధించువరకు!
ఎట్లో నీదర్శనమ్ము సాధించువరకు!"

శివుడు—జీవలోక ఆనందమూర్తిఅయిన మన్మథుడు—రతిభావాన్ని ఆయనలో నూల్కొల్పటానికి ప్రయత్నిస్తే అమాంతం ఆయున్ని భస్మం చేశాడు. అందుకే పార్వతికికూడా కోపం వచ్చి కఠోరంగా తపస్సు చేసింది. తరువాత ఆమెను స్వయంగా వరించాడు. అంతేకాదు ఆమె సౌందర్యానికి జోహారుచేసి సగం శరీరాన్ని సమర్పించాడు. "అద్యప్రభృత్యవనతాంగి తవాస్మిదాసః" అన్నాడు. ఇంకా ఇంకా ఎన్నెన్నో విలాసవికారాలు చేశాడు, తదనుగుణమైన సంతానాన్ని పొందాడు. కవి ఆయనలో ఉండే అవుకును గట్టిగా పట్టుకొన్నాడు. "ప్రభూ! నేనుకూడా నీకు మల్లే సౌందర్య ఆరాధకుణ్ణి. నన్నుకూడా తవభిముఖుణ్ణిగా - తదంతర్లీనునిగా చెయ్యి - నేను దాన్ని విడచి బ్రతకలేను. నీలో ఐక్యం అయ్యేదాక నాకీతెరువును సాధించిపెట్టు - అని కావ్యాన్ని ముగించడం అతిలోకంగా ఉంది. శివునివలెనే తానుగూడ సతీసమేత శాశ్వతత్వాన్ని బడయాలంటాడు. కాళిదాసుకూడా ఇలాగే మేఘసందేశాన్ని ముగిస్తాడు. ఇంతకంటె కృష్ణశాస్త్రి కావ్యాన్ని గురించి చెప్పడం కావ్యగౌరవాన్ని శంకించడం అవుతుంది కవిత్వమెవరిమిల్లై కాదుకదా!

"తయా కవితయా కింవా తయా వనితయా చకిం
పద విన్యాస మాత్రేణ యయా న హ్రియతేమనః"

# బొమ్మలు

## శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు

గదిలో కూర్చుని రేడియో వింటూంటే శ్రీపతి వచ్చాడు..."ఏం బాబాయ్ అంత శ్రద్ధగా వింటున్నారివేళ?" అంటూ.

"ఏముంది? పాట బాగుందని. కూర్చో" అన్నాను.

వాడింకా చిన్నవాడు — ఈ పాటలు వయసు ముదిరిన మా మనస్సులని పెట్టేబాధలు వాడి కేమిటి తెలుస్తాయి? ఒక్కసారి చంద్రలోకానికి ప్రయాణం చెయ్యవచ్చు; కాస్మోస్‌ని వెంట తరమొచ్చు; ఈ మహాశాస్త్రవిజ్ఞానంతో ఏమైనా చెయ్యొచ్చు... కాని, ఒక్కగంటైనా కాలంలో వెనక్కి ప్రయాణించలేము. భౌతికంగా. ఇలాంటిపాటలూ, ఇతర జ్ఞాపకచిహ్నాలూమాత్రం మిగిలి, ఒక్కొక్కసారి మనస్సుని కొన్ని సంవత్సరాలు వెనక్కి తీసుకునివెళ్తాయి. కొద్దిక్షణాలు ఈ విశాలమైనప్రపంచాన్నీ, దానిలో తన నిస్సహాయతనీ స్మరించుకుని మనస్సు ఏడుస్తుంది...గతించినది గతించిపోయిందని తెలుసుకుని దీనంగా విలపిస్తుంది. అందుకే మాధుర్యం ఒలికించే సుఖపూరితస్మృతులకన్న దుఃఖస్మృతులే ఎక్కువ ఉపకారులు. ఆ క్షణంలో అవి ఏడిపించినా, కొంచెం దూరమయ్యాక, వాటికి దూరంగా అవుతూండడం సంతోషం కలిగిస్తుంది. మధురక్షణాలు దూరం అయినకొద్దీ ఏడిపిస్తాయ్. దీపావళిలాగ అవి సంవత్సరానికో దశాబ్దానికో ఓసారయినా రావు... వాడింకా కుర్రవాడు. ఏం తెల్సునివన్నీ?

వాడు మాట్లాడకుండా కుర్చీలో కూర్చుని పాటలు వింటున్నాడు. నేను నా ఆలోచనలలో సాగుతూంటే సంగీతం ఆగిపోయింది... రేడియో గొంతునొక్కి, "ఏం ఇట్లా వచ్చావ్?" అని అడిగాను.

"చిన్నవిషయంలో నీసలహా అవసరంవచ్చింది బాబాయ్"

పాపం! ఎంత గౌరవం ఇస్తాడు నాకు! ఎవరి వృక్షవృక్షాన్నిబట్టి వారు గత చరిత్రతో సంబంధం లేకుండా మనుష్యులు ఒకణ్ని గౌరవిస్తారు. వీడూ నన్నంతే.

"చెప్పు" అన్నాను.

"నేను పెళ్లిచేసుకోవాల్ట బాబాయ్!"

వాడు చెప్పడానికి భయపడలేదు — సిగ్గుపడ్డాడు. పెళ్ళంటే ఉద్యానవనాలలో నడవడం అనీ, మేఘాలలో తేలిపోవడం అనీ వీళ్ల ఉద్దేశం... ప్రతీయువకుడూ అట్లానే అనుకుంటాడు. కాని ఒక్కసారి తెర తొలగించి వాస్తవికతకి కళ్లు తెరిచాక అందులో నిజాలు తెల్సుకుని...

"అట్లాగా? మరేం!" అన్నాను.

వాడు నవ్వాడు..."అది కాదు. మీ సలహా కావాలి" అన్నాడు.

"పెళ్ళి నీఇష్టమోయ్. అయినా, నువ్వు పెళ్ళిచేసుకుని సుఖపడాలనే నా ఉద్దేశమూను"

"అది సరేలెండి. నాన్నగారేమో రెండు ఫోటోలుమాత్రం ఇచ్చి నన్నేదో ఒకదాన్ని ఎంచుకోమన్నారు"

"ఉత్తమం. వ్యక్తిగతంగావెళ్ళి పిల్లని పరీక్షించడం అంటే మహాఘోరం అనుకో. ఆయన మాటప్రకారం ఏదో ఒకటి నిర్ణయించు"

బహుశా నన్నడగని సలహా ఇచ్చాను.

"అదంతా సరే బాబాయ్. కాని, ఆ రెండు ఫోటోల్లోనూ నేను ఏ ఒకటీ ఎంచుకోలేకుండా ఉన్నాను"

నవ్వుకున్నాను. వాడి తరువాతమాటలు నాకు తెలుసుగా! అందులో ఏది బాగుందని అడుగుతాడు. సౌందర్యం ఎవరికళ్ళకి వారి కోణాన ఉంటుంది. వీడు పాపం నాకళ్ళు నమ్ముతాడు!

వాడు జేబులోంచి రెండు ఫొటోలు తీసి అప్పుడే నా టేబిల్ మీద పడేశాడు. ఈ పని నాకేమీ ఇష్టం లేదు. కాని వాడిని బాధించడం నాకు మరీ ఇష్టం లేదు.

"రెండూ బాగున్నై" అన్నాను.

"అందుకే కష్టం అంతా" — వాడు తేలిపోయాడు.

నిజంగా ఇద్దరు అమ్మాయిలూ చక్కగానే ఉన్నారు. అయితే ఒక అమ్మాయికళ్ళల్లో తాను సౌందర్యవతి ననేభావం ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. భార్య రూపవతి అయినంతమాత్రాన ప్రమాదం లేదు. కాని ఆ సంగతి ఆమెకి తెలిస్తేనే ప్రమాదమంతా.

"నీఉద్దేశం చెప్పు" అన్నాను.

"మీమీద నేను పూచీ పెట్టాను" అన్నాడు శ్రీపతి.

"చాలా కష్టమైన పూచీ.... నేనూ సౌందర్యాలపై తీర్పు చెప్పే వయస్సు దాటిపోయాను..." అన్నాను.

"అందుకే బాబాయ్ మిమ్మల్నడగటం... సముద్రంలో మునిగిపోతూన్నవాడికి దానిసౌందర్యం ఏం తెలుస్తుంది?"

వాడట్లానే మాట్లాడతాడు. అందుకే నాకెంతో అభిమానం వాడంటే...పూచీ పూర్తిగా మీదని పడింది.

నా పరిశీలన తప్పేమోనని మళ్ళీ పరీక్షించి ఆ ఫొటోలలో ఒకదాన్ని వాడిముందుకు త్రోశాను. వాడు చిరునవ్వు నవ్వాడు.

మరికొద్దిరోజులకి వాడిపెళ్ళి అయిపోయింది. వాడిభార్యని పరిచయం చేశాడు—పార్వతి. ఆమెని చూశాక అనుకున్నాను......తప్పక వీడు సుఖిస్తాడని.

ఇదంతా మూడేళ్ళక్రిందట.

* * *

తరవాత ఎన్నో సంఘటనలు జరిగాయి. నాకు ఊరినించి, వాడిపెళ్ళి అయిన మరో నెలకే, బదిలీ అయింది. వాడు ఉద్యోగంకోసం ఉత్తరదేశానికి వెళ్ళిపోయాడు. తరచు ఉత్తరాలుమాత్రం వ్రాశేవాడు.

ఎందుకో ఒక్కసారి జీవితంమీద నాకు విరక్తి కలిగింది. బహుశా రోజూ పదిగంటలు పనిచేయించే ఆఫీస్‌పని మెదడుని పాడుచేసి ఉంటుంది. మూడు నెలలు సెలవు పెట్టి చింతపల్లి బయలుదేరాను. ఆ ఏజన్సీ ఊరులో, ఏకాంతంగా ప్రశాంతంగా గడుపుదామని.

అక్కడ చిన్న గది దొరికింది. అందులో ఉండేవాడని. ఆ ప్రక్కన ఇంకో ఇద్దరు ఉంటూండేవారు. ఒకయువకుడూ, ఒక యువతీ. నేను వెళ్ళిన కొద్దిరోజుల కామె నొకసారి చూశాను—ఎందుకో మనస్సు గుర్తుకోసం బాధపడసాగింది...ఎక్కడో ఆమెనిచూశా నింతకుముందు...

పగలంతా అడవిలో తిరిగి, సాయంత్రం భోజనంచేసి గదికి వచ్చేవాడిని. కనుచూపుమేరలో మానవులు లేనిచోట్లలో గడిపేవాడిని. రాత్రి ఏవో నవల చదివిచదివి పడుకునేవాడిని. మధ్యమధ్య నిద్రిస్తోన్న నా మనస్సు లేచి కూర్చుని అడిగేది... "ఆమె నెక్కడ చూశావ్?" అని. జవాబుకోసం తహతహలాడేవాడిని. *Sub-Consciousness* లోకి జారిన ఆ జవాబు వచ్చేది కాదు.

ఆ సాయంత్రం వర్షం పడసాగింది. వేసవిలో వర్షాలు చింతపల్లికి క్రొత్త ఏమీ కాదు. మూడువేల అడుగుల ఎత్తునఉన్న అక్కడి శీతోష్ణస్థితే అది.

తగ్గాక భోజనానికి వెళ్దామని అనుకున్నాను. ఎనిమిదయేదాకా అలా కురుస్తూనే ఉంది. వాటర్ కోటు తెచ్చుకోలేదు. గొడుగులో నడిచే తడుస్తాను. నిప్పు వెలిగించి పనిమనిషి ఎప్పుడో జారుకున్నాడు.

ఆలోచిస్తూండగా అతను తలుపుతట్టుతూ పిలిచాడు..."మాష్టారూ!" అంటూ.

లోనికిరాగానే, "ఈపూట హోటల్‌కి వెళ్ళకండి. మా ఇంట్లో భోజనం చేద్దురుగాని. రండి" అన్నాడు...పాత మిత్రుడల్లే మాట్లాడాడు.

కేవలం మర్యాదకోసం వద్దన్నాను. చివరికి వెళ్ళక తప్పలేదు. ఆమె వడ్డిస్తోంది: వాళ్ళిద్దరూ అన్నా, చెల్లెళ్లని తెలిసింది. వారి వివరాలన్నీ అడిగాను. నాకు సంబంధంలేని ఊరు వాళ్ళది.

కాని, ఆమె ముఖం చూసినకొద్దీ ఎక్కడో చూచా ననేవిషయం ఇంకా స్ఫుటంగా జ్ఞప్తికి వస్తోంది... కాని ఎక్కడ?

అయితే, ఆమెకళ్ళు దుఃఖంతో బరువెక్కాయనీ, ఆమె ముఖాన్ని బొట్టులేదనీ గ్రహించాక నా ఆలోచనలు సాగలేదు.

* * *

రామారావూ నేనూ స్నేహితులం అవడానికి చాలా కాలం పట్టలేదు. అతను వయస్సుకి నాకంటె చాలా చిన్నవాడు; కాని మంచిభావాలున్న మనిషి. అక్కడే ఏదో ఆఫీసులో పనిచేస్తున్నాడు.

అతని సంభాషణనిబట్టి ఒక్క సంగతిమాత్రం తెల్సుకున్నాను: ఆమె భర్త ఈమధ్యనే పోయాడని.

అనుదినమూ నేనూ అతనూ షికారు పోయే వాళ్ళం. ఆరోజు ఆమెనీ రమ్మన్నాడు. మొదట రానన్నది. తరవాత బయలుదేరింది.

ముగ్గురమూ కొంతదూరం నడిచి ఓచోట కూర్చున్నాము. ఆమె దూరంగా కనిపిస్తున్న కొండలవైపు తదేకంగా చూస్తున్నది. రామారావు నెమ్మదిగా సంభాషణలోకి దిగకుండా తలవంచుకుని గీతలు గీస్తున్నాడు. ఆ మహాప్రశాంత ప్రకృతిసౌందర్యంలో, సెలయేర్లో పరుగులు వేస్తున్నది. ఆమెకంత దుఃఖం ఎందుకు వచ్చిందీ అని ఆలోచిస్తున్నాను నేను.

ఉన్నతమైనచోటునించి కనపడాల్సినట్లు కనిపిస్తున్నాయి దూరంగా కొండలు. స్వేచ్ఛగా ఎగురుతూ సంతోషంగా అరుస్తున్నయ్ పక్షులు.

"ఏమిటి శ్యామలా ఆలోచిస్తున్నావ్?" అన్నాడు రామారావు. శ్యామల మాటలాడలేదు. ఒకసారి ఆమె కళ్లెర్రబడ్డాయేమో ననుకున్నాను.

మరి కొద్దినిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఎందుకో, కాలంలో ప్రయాణంచేస్తున్నట్లు అనిపిస్తూంది. ఎవరికివాళ్ళం ఆలోచనలో పడ్డాము.

"చాలా ప్రశాంతంగా ఉంది కదూ?"

రామారావు మొదలు పెట్టాడు. "ఔను. చాలా" అన్నాను.

"ఈ ప్రకృతినంతటినీ మనంమాత్రం అనుభవిస్తున్నాం... పెద్దపెద్ద పట్టణాలలో దుమ్ములో ధూళిలో నలిగి మనుష్యులు..."

"మనంచేసిన పుణ్యం" అన్నాను.

శ్యామల తలదించకుండా దూరాన శిఖరాలనీ, మేఘాలనీ పరికిస్తున్నది. ఆమెని మాటలాడించాలని ప్రయత్నిస్తూ రామారావు: "ఏమమ్మా... ఏమిటాలోచిస్తున్నావు అంత తీక్షణంగా?" అన్నాడు.

"ఏం లేదన్నయ్యా... నాగురించే నే నాలోచించుకుంటున్నాను. పార్వతి ఏంచేస్తూంటుందా... అని" అన్నదామె.

"నీకా ఆలోచనలిప్పస్తే ఇంకేమీ రావా?"

"ఎలా అన్నయ్యా..." గాద్గదికంగా శ్యామల ఆగి తలవంచుకుంది. నేను మాట్లాడలేదు. ఈ వ్యవహారం రోజురోజుకీ లోతులకి వెళ్తూన్నది.

"ఆమె ఇట్లా అవడానికి కారణం... ఒకమనిషి అని చెప్తే మీరు నమ్మతారా?" రామారావు నాతో అన్నాడు.

"కారణమా... ఎలా?"

"అతనికీ తెలీదేమోలెండి... ఈమె క్లాస్ మేట్ పార్వతి. జరిగినకథ ఏమిటంటే, మా నాన్నగారు చనిపోతూ దీనిపెళ్లి కళ్లచూడాలని పట్టుపట్టారు. దీనికి క్లాస్ మేట్ పార్వతి అనే అమ్మాయి ఉండేది. వాళ్లో సంబంధంకోసం ప్రయత్నిస్తూండగా, మాకాసంగతి తెలియక, మేమూ ఆ సంబంధంకోసం ప్రయత్నించాం.

"పెళ్లికొడుకు చదువుకున్నవాడట. మమ్మల్ని ఫోటో పంపమన్నాడు. మూడోరోజుకి మాసంబంధం కాక, పార్వతిని అతను ఎన్నుకున్నట్లు తెలిసింది.

"నాన్నగారికి రోజురోజుకీ ముదురుతూంది. ఆయనకోసం తొందరపడి. మరో సంబంధం కుదిర్చాము... పెళ్లి అయిపోయింది.

"మరోసంవత్సరం తిరిగేసరికి అతను చనిపోయాడు... ఈమె ఇలా...

నదిలో వేగంగా ప్రయాణిస్తూ ఏదో కొంపకి తగిలి ఢీకొనడానికి తొందరపడే పడవలా నా మనస్సు గింజుకొంటూంది.

"దీనిలో ఇతరుల ప్రమేయం ఏం ఉందండీ?" అన్నాను.

అతను పొడిగా నవ్వాడు: "ట్రాజెడీ (*Tragedy*) అంతా ఉంది...ఆ మొదటి పెళ్ళికొడుకేం చేశాడో తెలుసా? ఒక స్నేహితుణ్ని ఆ రెండు ఫొటోలలోనూ తన కొకటి ఎన్నమన్నాడు. అతను పార్వతిని ఎన్నేడు...మానవ మాత్రులంగదా! అలా నే స్వయంగా ఎన్నుకుని ఉంటే శ్యామలనే ఎంచుకొనేవాడేమో...ఈ పర్యవసానం రాకపోవునేమో నని అనుకుంటూంటాను..."

నా తల తిరుగుతోంది. ఒక్కసారి శ్యామల కళ్ళలోకి చూశాను. అవి నీళ్ళతో నిండి, ఏవో శాపాలనిస్తున్నట్లు కనిపించాయి. ఒక్కసారి ముఖం కప్పుకుని ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

నా జ్ఞానం, నా విశ్రాంతి, నా అహంకారం, నా సౌందర్య పరిశీలన...అన్నీ ప్రచండమారుతంలో ఎగిరి రాళ్ళకి ఢీకొంటున్నాయ్. వెయ్యినోళ్ళతో శ్యామల నన్ను శపిస్తున్నది.

ముఖంనిండా చెమట పోసింది. మూడేళ్ళ క్రిందట నా చేతిలోని ఫొటోలని కాగితాలుగా చూశాను; అంతే. వాటివెనుక రక్తంమాంసంతో కూడిన మనుష్యులున్నారని నే నెన్నడూ అనుకోలేదు. ఈ నిముషంలో ఈ శోకదేవత నా అజ్ఞానాన్ని బయట పెట్టింది.

"ఎందుకండీ అలా ఉన్నారు?...అని అడిగాడు రామారావు. మెత్తని మనస్సనుకుని ఉంటాడు ... "ఎవరికర్మ కెవరు బాధ్యులు చెప్పండి! ఏం చెయ్యగలం?" అన్నాడు.

"కాదులెండి...ఈ విషాదాంతానికి నాంది వేసిన మహానుభావుణ్ని నే"నని ఎట్లా చెప్పడం? మనస్సు దుర్బలంగా ఉండడంమూలాన్నే ఇంత నీచమైనపనులనికూడా చేయించగలదు మనిషిచేత... ఆ దౌర్బల్యంలో అంత బలం ఉంది.

"అతని స్నేహితుడూ ఇంత దారుణమైనఫలితాలుంటాయని ఏమాత్రం అనుకోగలిగినా, అలాటి సహాయం చేశేవాడు కాడేమో" నన్నాను.

"అది నిజమే లెండి...కాని మాకేమనిపిస్తుంది? అతనిమూలంగానే ఇదంతా జరిగిందని కదా?... కష్టంలో ఉన్నవాళ్ళకి దానికి ఒక కారకుణ్ని ఊహించుకోవడమూ కొంత ఉపశమనమే కదూ!"

ఔను......అంతమాత్రాన ఒరిగే అదృష్ట మంతుక్తే!

"ఇంతకీ ఆ స్నేహితు డెవరో తెల్సునా?" ఉండలేక అడిగాను.

"ఎవరైతేనేం లెండి...తెల్సుకోవలసిన అవసరంమాత్రం ఏముంది? అతనిమీద పగ తీర్చుకుంటే మాకేం ఒరుగుతుంది?"

కొంచెం చీకటి పడుతూంది. నా మనస్సులో పూర్తిగా చీకటి పడ్డది. ఇంటికిపోడానికి లేచాం.

ఆరాత్రి అన్నం సయించలేదు. ఉదయం బెడ్డింగ్ సర్దాను.

* * *

శ్రీపతిని ఒకసారి చూడాలని చాలాకాలం నించి అనుకుంటున్నాను. ఈ సంఘటన జరిగాక వాడిని చూసే ఉబలాటం ఎక్కువైంది.

వాడిప్పుడు ఖరగ్‌పూర్‌లో పనిచేస్తున్నాడు—రైల్వేలో. అక్కడికని బయలుదేరాను.

ముందు ఉత్తరం వ్రాశాను.—ఇల్లెక్కడో వ్రాయమని. జవాబుగా టెలిగ్రాం ఇచ్చాడు.

ఆ అడ్రస్ పట్టి వెళ్ళాను.

తలుపుతీసి పార్వతి తెల్లబోయి నిలుచబడింది. అప్పటి కాంతీ, సొగసూ ఆమె కళ్ళలో కనపడక, నేను ఆశ్చర్యంగా చూడసాగాను.

"రండి" అంది పార్వతి. లోపలికి వెళ్ళాను. ఒకగది నాకోసం ఉంచారు. స్నానంచేసి బట్టలు మార్చుకుని అందులో కూర్చున్నాను. పార్వతి బిస్కట్లూ, టీ పట్టుకొచ్చి, "ఆయన సాయంత్రం దాకా రారు. విశ్రాంతి తీసుకోండి" అన్నది.

"నేను బిస్కట్లు తినడంలేదు. టీ ఉంచండి" అన్నాను.

"ఆయన అట్లా చెప్పారు...కొంచెం తినరూ? ...నామీద మళ్ళా ఆయన కోపగిస్తారు. నేను ఇవ్వ లేదనుకుంటారు"

ఆమె ఆదరాన్ని సుళువుగా కాదనలేక పోయాను.

"మరి—నన్ను 'మీరు' అనకండి"

నేను చేసిన పొరపాటుని గ్రహించుకున్నాను. నా నవశ్వేతపు కేశాలు గౌరవాన్ని పొందుతున్నాయ్!

టీ త్రాగి పడుకున్నాను. సాయంత్రం లేచే సరికి శ్రీపతి గొంతుక వినిపిస్తోంది.

"నువ్వు పట్టి మృగానివి... ఆయన మనకి తండ్రివంటివాడు. ఒక్క రాత్రి పనుందంటే అలా అవుతావేం?"

పార్వతి జే అనుకుంటాను... బాధగా, గాద్గదికంగా, ఔను... అనే గొంతుక వినిపించింది.

నా కెవరో బల్లేలతో పొడుస్తున్నట్లయింది. శ్రీపతి... ఆ యువకుడు... ఇంత పశుత్వంతో ప్రవర్తిస్తున్నాడా?

ఇంతలో శ్రీపతి నాగదిలోకే వచ్చి, తెల్లబోయి, "లేచారా బాబాయ్! ఎన్నాళ్ళకి!" అన్నాడు.

ఆ ఆనందింపులో గత క్షణాల చరిత్రని మరిచి పోయాను. ఇద్దరమూ షికారుకని బయలుదేరాము.

అనేక విషయాలని గురించి మాటలాడుకున్నాము. చివరికి వాడి సంగతి వచ్చింది.

"బాగా నే వెళ్తోంది లెండి... దానికి బొత్తిగా నాగరికత లేదు. అన్నీ కల్పించుకుని బాధ పెడుతుంది. మూడేళ్ళనించి ఇంతే బాబాయ్... మనశ్శాంతి లేకుండా చేస్తోంది. ప్రతీ చిన్న విషయానికీ కలుగ జేసుకుంటే ఎట్లా వేగడం చెప్పండి?"

మనస్సప్పుడే కొన్ని సమ్మెటపోట్లుతింది. ఈపోట్లింక చాలా బాధాకరాలు కాలేవు. అందు చేతనే వాడు చెప్పినదంతా నేను నిర్వికారంగా వింటూ ఉండిపోసాగాను.

"నువ్వు కొంచెం సర్దుకోవాలి..." అన్నాను.

వాడు పొడిగా నవ్వాడు. "మీ కన్నీ తెల్సు బాబాయ్ నన్ను గురించి— నేనంత సుళువుగా నిశ్చయానికి వస్తానా బాబాయ్?" అన్నాడు.

"నాకు తెలుసుగా..." అన్నాను.

"అన్నీ చేసి చూశాను. కాని లాభం లేకపోయింది బాబాయ్... చివరకి — తప్పని సరిగా సరిపెట్టుకున్నాను"

"నా మూలంగా నీ మనశ్శాంతి పాడైంది ఆరోజు..." కష్టంగా అంటూన్న నామాటలకి అడ్డం వచ్చి... "మీమీద నేనేమీ నింద వెయ్యడంలేదు బాబాయ్. ఇద్దరిలో మీరు మంచిపిల్లనే నాకోసం ఉద్దేశించారని నాకు తెలుసును. మానవుడు కొంత దాకా ప్రయత్నించి విధికి వదలడం తప్పదు. ఎవర్నన్నా తన దురదృష్టానికి నిందించడం మూర్ఖత్వం..."

ఇంకేమీ మాటలాడ లేదు మేము.

రాత్రి *Night Duty* ఉందని శ్రీపతి వెళ్ళి పోయాడు. భోజనం చేసి ఉత్తరాలు రాస్తూ కూర్చున్నాను.

"ఇక్కడ రేడియో ఉందండీ. మీరు పెట్టుకోండి" అంది పార్వతి. "అట్లానే" అన్నాను.

కాని పాటలు వినేంత తేలికగా లేదు మనస్సు. లైటార్పి పడుకున్నాను—ఆలోచించసాగాను.

కొద్దిసేపట్లో ఎవరో—పార్వతి ఏడుస్తూందని గ్రహించాను. నా క్కాసట్లుగా ఊరుకోలేక పోయాను.

లైటువేసి, ఆమెని పిల్చాను. కొద్దిసేపట్లో వచ్చింది. ముఖాన దుఃఖపు చిహ్నాలు కనపడనే లేదు!

"ఎందుకమ్మా ఏడుస్తున్నావ్?"

"నేనా?... లేదే!..."

"నేను విన్నాను—నిజం దాచకమ్మా. నాచేతిలో ఉండేపని చేస్తాను..."

ఆమె ఆగి ఆగి ఒక్కసారి... "ఒకసారే నా బ్రతుకంతా పాడుచేశారు. ఇంకా ఏం చేస్తారు!" అన్నది.

"నే నిట్లా ఔతుందని కలగన్నానమ్మా?... వాడు నిన్ను బాధ పెడుతున్నాడా?" సాధ్యమైనంత వరకూ తిన్న దెబ్బ దాచుకుంటూ అన్నాను.

"బాధ... రాత్రంతా ఎవరింట్లోనో పడక... నోరెత్తితే దెబ్బలు..."

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది—తక్షణం వెళ్ళిపోయింది.

రాత్రంతా జాగరం చేశాను.

*   *   *

ఉదయం బెడ్డింగ్ సర్ది వెళ్ళటానికి బయలుదేరేను. పార్వతి గుమ్మందాకా వచ్చి నా ప్రయాణ సన్నాహం చూసి తెల్లబోయింది.

"వెళ్తున్నానమ్మా...నీ జీవితంతో ఆట ఆడినందుకు క్షమించు" అన్నాను.

"మీరు అనుకుంటే వెళ్ళొద్దు...రాత్రి తొందరలో అన్నమాటలకి క్షమాపణ చెప్పుకుంటాను...కోపగించకండి" అన్నది పార్వతి తలవంచుకుని.

"మనసారా, పశ్చాత్తాపమే కాని, నీమీద కోపం ఏమీ లేదమ్మా..." అన్నాను.

"అయినా, వెళ్ళవద్దండీ...ఆయన చంపేస్తారు..."

కాళ్ళకి బంధం పడ్డది...వాడొచ్చేదాకా ఆగక తప్పింది కాదు.

కాఫీ తాగుతూంటే, పార్వతే మళ్ళా రాత్రి ప్రసక్తి తెచ్చింది...వారించాను.

ఆ సాయంత్రం ఎన్నో అబద్ధాలాడి, ఇంటికి బయలుదేరాను. రైలెక్కుతూ శ్రీపతితో అతి ప్రయాసమ్మీద అనగలిగాను..."విధికి ఎలానూ వదిలిపెట్టిన నీ జీవితాన్నావె సుఖానికి కొంత వినియోగపడనీ" అని.

రైలులో కొంచెంసేపటికి నిద్ర పట్టింది.

నా గదిలో కూర్చున్నాను...రేడియో వింటున్నాను.

శ్రీపతివచ్చి కుర్చీలో కూర్చుంటూ నా చేతికి రెండు ఫొటోలని ఇచ్చి, "ఈ ఫొటోలు చూడండి బాబాయ్. ఒక అమ్మాయిని పెళ్లి చేసుకోవాలి. నా కళ్ళకంటె మీ కళ్ళని నే నెక్కువగా నమ్ముతాను. ఏ అమ్మాయి బాగుందంటారు?..." అని అడిగాడు.

రెండింటినీ పరిశీలించాను. ఒక ఫొటో ఎంతో చేతనో వాడికి ఇవ్వడానికి నిశ్చయించాను...కాని, ఏదో బలీయమైన శక్తి నా చేతిని రెండో ఫొటో మీదికి సంప్రతూంది. ఏదో మహాశక్తి ఆ భావాన్ని కూడా దూరంచేసి, నా చేతిని పార్వతి ఫొటో దగ్గరకి పంపింది...నవ్వుతూ దాన్నే వాడికిచ్చాను.

పెద్దగాలి వేసింది. రెండో ఫొటో కిటికీలోంచి ఎగిరింది. నేనూ శ్రీపతీ, నవ్వుకున్నాము.

నాకు తెలివివచ్చేసరికి పొలాలూ చెట్లూ కిటికీలోంచి వేగంగా ప్రయాణం చెయ్యడం చూశాను. అటువైపు తిరిగి మళ్లా కళ్లు మూసుకున్నాను.



# విషాదాంత వివాహ ★ ★ ముహూర్తము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమూర్తి

ప్రపంచములో ఎన్నియో రకముల విషాదగాథలను వినియున్నాము. వైవాహిక జీవితమున మహాక్లేశము ననుభవించుచు నశించుచున్న స్త్రీ రత్నములు పలువురున్నారు. నానా విధములుగా, వియోగ దుఃఖములపాలై, కృశించుచున్న యువతీమణులు ఎందరో కలరు. కాని, శ్రీమతి——యొక్క వైవాహిక దుఃఖచరిత్ర అభూతపూర్వము; మహాఘోరము; హృదయ విదారకము. జ్యోతిశ్శాస్త్ర పరిశోధనపరాయణులగు చదువరులకు ఉపయోగపడగల విషయములు కొన్ని ఈ విషాదాంత వివాహ సందర్భములో తెలియవచ్చుటచే, ఈ కథ వ్రాయ బూనితిని.

ఈ క్రిందనున్నదే ఆమె నిరయణరాశి చక్రము. నవాంశకుండలి సయితము ప్రక్కనే చూపబడినది:—

| | | | |
|---|---|---|---|
| | చ | | శ |
| గు | రాశి కుండలి — | | ల కే కు |
| రా | | | |
| | ర శు | బు | |

ప్రశంసలో నుండునది వైవాహిక జీవితమగుటచే, సప్తమభావమును మాత్రము ముఖ్యముగా పరిశీలింతము. ఆ భావములో రాహువున్నాడు. కర్కాటకములో నీచకుజుడు కుటుంబభావములో నుండుట. ఇవి దోషములనవచ్చును. ఐనా, కర్కాటక లగ్నమునకు కుజదోషములేదను అపవాదమొకటి యున్నది. సప్తమాధిపతి శని, పండ్రెండవ రాశిలో నుండి, లగ్నభావములోనే నిలిచినాడు. శుభగ్రహమగు బృహస్పతి సౌభాగ్య స్థానములో నున్నాడు. అర్ధపూర్ణదృష్టి ఈ శనిపై నున్నది. కనుక, శని అశుభుడనలేము. నవమభావములోనున్న కుజునికి సప్తమభావముపైన దృష్టిలేదు. బృహస్పతిపైన కుజుని దృష్టియున్నది కాని, [illegible] పరస్పర [illegible] కదా? నవాంశలో, కుటుంబాధిపతి రవి బలహీనుడు. అంశలగ్నమునకు [illegible] దృష్టియే కలుగదు. [illegible] గ్రహదృష్టి లేదు. [illegible] సప్తమభావము మిశ్రఫలములు కలదని యనవచ్చునేమో? ఇక, చంద్రలగ్నమునుండి సప్తమ స్థానములో [illegible] గ్రహము బుధుడున్నాడు. ఈ బుధుని పైన కుజదృష్టి దోషమనవచ్చును. కాని, ప్రబలమైన గురుదృష్టికి వేలవెచ్చునదా? ఈ యోగములు సప్తమభావ ఫలములు సంపూర్ణముగా చెరచినవనుట మాత్రము కష్టము.

| | | | |
|---|---|---|---|
| కు | బు గు | శ | రా |
| | అంశ కుండలి — | | |
| శు | | | ల ర |
| కే | | చ | |

జన్మనక్షత్రము భరణి. జనన కాలమునకు ఉడుదశా పద్ధతిలో శుక్రమహాదశా శేషము ర సం||, 11 మాసములు, 21 దినములు.

ఇంచుమించుగా, ఇరువదిరెండు సంవత్సరముల వయస్సు వచ్చునప్పటికి చంద్రమహాదశ ముగిసినది. చంద్రుడు లగ్నాధిపతి; సప్తమాధిపతి (శని) కి

లాభస్థానములో నున్నాడు. ఇతనికి లాభస్థానములో బృహస్పతియుండుట. ఈ చంద్రునిపైన పాపగ్రహ దృష్టి కానరాదు. అంతా బాగున్నది; అదృష్ట మొక్కటే కొదవ. జాతకురాలికి వివాహమే కాలేదు. అదిపోగా, ఈ దశలోనే జాతకురాలి తల్లిదండ్రులకు వివాహ విచ్ఛిత్తి అయినది. ధనవంతుల ఇంటి ఏకపుత్రికయగు జాతకురాలి తల్లిని అభాగ్యుడగు తండ్రి పరిత్యజించి, 'చట్టసమ్మతముగా, విడాకులు పుచ్చుకొన్నాడు. జాతకురాలిని, తమ్ములను, తల్లిని సహా, పోషించుబాధ్యత మాతామహులపైన పడినది. కాని, దైవము ఓర్వలేదు. ఆ మాతామహుడు, మాతామహి సహా, ఈ చంద్రదశలోనే పరలోక ప్రయాణము చేసినారు. తరువాత కొన్నాళ్ళకే, గిట్టనివారి ప్రేరణవలననేమి, దాయాదుల కోర్టు వ్యవహారముల వలననేమి, జాతకురాలి తల్లి తన తల్లితండ్రుల ఆస్తిని సర్వస్వమును పోగొట్టుకొన్నది. సంసారము అనాథస్థితికివచ్చి పశుబాట్లపాలయ్యెను. ఈ సౌభాగ్యమంతా చంద్రమహాదశలోనే! లగ్న దశమాధిపతులకు గల పరివర్తన రాజయోగపు ఫలమేమో!

చక్కని తెలివితేటలు కలది జాతకురాలు. మంచివాగ్ధోరణి ఆమెది. కొంతకాలము కళాశాలలో విద్యసాగించి నెగ్గినది. కాని, ముగ్గురు తమ్ములతోకి సంసారమును, అనాథయగు తల్లిని సయితము, పోషించవలసిన భారము దుర్దైవ పరిపాకవశమున తనపైన బడుటచే, ఆ వివేకవతి విధిలేక ఏదో ఉద్యోగము ప్రవేశించి ధనార్జనమునకు పూనుకోవలసి వచ్చెను. తన వివాహము, స్వార్థము, మానుకొని సర్వశక్తుల నుపయోగించి, ధైర్యముతో, పట్టుదలతో, ఆమె సంసారమును కుజమహాదశలో నిర్వహించినది. భర్త ఇంటిలో కాపురము చేయుచున్నయెడల, తమ్ములను, తల్లిని, పోషించుట సామాన్యముగా సాధ్యము కాదు కనుక, యవ్వనపు ఆశలను అణచిపెట్టి జాతకురాలు వివాహప్రస్తావమే తలపెట్టలేదు. గొప్ప స్వార్థత్యాగ మామెది.

రాహుమహాదశ ఆరంభమైనది. సప్తమభావములోనున్న రాహువు ఊరకుండగలడా? ఇంతలో, ఎప్పుడో, వయస్సు ముప్పది సంవత్సరములు దాటినది. వైవాహిక జీవితమును సంపాదించుకోవలెనను ఆశ మనస్సులో చెలరేగకుండ ఆ తరుణి ఎంతకాలము కడపగలదు? కాని, సంసారభారమును నిర్వహించువారు లేరు. పొంగి ప్రవహించుచున్న తారుణ్యము వలని తీయని ఆశ ఒకవైపు, స్వధర్మ నిర్వహణమందలి శ్రద్ధ వేరొకవైపు, ఆమె మనస్సులో ఘర్షణమునకు వచ్చినవి. ఇంతలో, రాహుమహాదశలో సప్తమాధిపతి శని అంతరమురాగా, ఆ స్పర్థలో కడకు ఆశయే గెలిచెను. ముప్పదిఅయిదు సంవత్సరముల వయస్సులో, ఎవడో, దర్శనీయ విగ్రహము కలిగి, నలువది సంవత్సరములు వయస్సుగల అనురూపుడైన పురుషుడొకడు, తగిన అంతస్తులోనున్నవాడు, వివాహము కావలెనని కోరినాడు. దైవవశాత్తుగా జాతకురాలి కంటబడి ఆమె హృదయము నాకర్షించెను. ఇన్ని యేండ్లుగా, ఇనుపకచ్చడాలు కట్టుకొనియున్న ఆ యువతి ధైర్యము పలుచబారినది. ఈ సదవకాశము వ్యర్థపరచుట ఆమె దృష్టిలో యుక్తముగా నుండలేదు. తరువాత అచిరకాలములోనే నిశ్చయము. తటాలున వివాహమునకు వారిరువురు సమ్మతించినారు. కంకణబలము కలిసివచ్చినదని అందరు సంతసించిరి. ఆ పురుషుని జాతకమును పరీక్షించవలెనను శ్రద్ధ ఆమెకు కలుగలేదు. పరీక్ష చేయించినచో, కార్తాంతికులు ఒకటిపోయి ఒకటి చెప్పిరేని, మనస్సునకు లేనిపోని సందేహములు రాగలవు. వివాహమునకు అసాధ్యమనిపించునంత వయస్సువచ్చినది. అందులో, ఆమె పరిస్థితులు సైతము ఆకర్షకములుగా లేవు. తగినవరుడు లభించుట మహాప్రయాస. ఆ వయస్సులో అందకాడు దొరకుట మరింత అపురూపము. ఇట్టి సందర్భములలో సులభముగా, దైవానుకూల్యమువలన, వచ్చినవానిని గూర్చి జాతకాది పరీక్ష చేయుట అసంగతము కదా? వరుడు సయితము జాతకపు పట్టింపులేనివాడే. సాధ్యమైనంత త్వరలో వివాహము జరుపుటే మేలని వారిరువురు నిర్ధరించినారు. అందు పాటులోనున్న ఏ నక్షత్రసూచకుడో, ఏ పురోహితుడో, ముహూర్త మొకటి వారికి సిద్ధపరచి ఇచ్చినారు. వివాహమహోత్సవము మహదానందముతో జరిగినది. ధన్యురాలనైతినని జాతకురాలు సంతసించినది. త్వరలోనే నిషేకమునకు తగిన శుభదినమొకటి చూచుకొని తన సంసారమును తాను చేరుకోవచ్చునని ఆశ.

వికృతి సంవత్సర మాఘశుక్ల దశమినాడు జరిగినదీ వివాహము. నాడు శుక్రవారము; నక్షత్రము మృగశిర. దినశుద్ధిరమ్యముగా నున్నది. గోచారములో జాతకురాలికి ఆరింటి శని, పదునొకొండింటి గురువుగల కాలమది. గురు శని బలము బాగున్నది. ముహూర్తము క్షేమతారలో. ఇంకేమి కావలయును.

ఆనాడు సాయంకాలము 5-30 పి. ఎం. (*I.S.T.*) గంటలవేళ ముహూర్తము. ఉత్తమమని గోధూళి లగ్నమును నిర్ణయించినారు కాబోలు? నిర్ణయించిన కాలమునందే నిర్విఘ్నముగా శుభముహూర్తమును సాధించినారు పురోహితులు. నిరాడంబరముగా, ప్రశాంతముగా, మూడుముళ్లు పడినవి. వధూవరుల అంతస్తునకు, వయస్సునకు, ఆత్రమునకు తగినరీతి వివాహము జయప్రదముగా జరిగినది. జాతకురాలి ఉత్సా

హము పండినది. ఏండ్లకొలదిగా, ఆశలు నెరవేరని నిండు జవ్వనములో నున్న [illegible] క్రమించుచుండెడి యువతి కదా ఆమె ?

ఆ ముహూర్తమునకు స్పష్టగ్రహకుండలి ఈ క్రిందనున్నది. ఉపయుక్తములైన కొన్ని సహమ బిందువులు, ఇంద్రాది నూతన గ్రహములు ఇందు చూపబడినవి.

| | | | |
|---|---|---|---|
| రా 20-20<br>కు 19-35<br>శు 19-32<br>స 14-45<br>VII 11-51 | | X 10-50 | చ 25-36<br>భ. ము. స 29-38 |
| ర 27-1<br>బు 10-10 | (సాయనము)<br>వివాహ<br>ముహూర్తము. | | వి.స. 5-0<br>వ 5-42 (వ) |
| | | | I 12-16<br>యమ 20-12<br>భ స- 23-58 |
| పు.స. 10-61 | వి.మో.స 20-57 | శ 1-17 R<br>ఇ 19-21 R | కే 20-20 |

[సూచన :—

వ = వరుణుడు ; ఇ = ఇంద్రుడు ; యమ = ప్లూటో. భస = భర్తృ సహమము. పు. స. = పుణ్య సహమము. వి. మో. స. = వివాహ మోక్ష సహమము. భ. మృ. స. = భర్తృమృతి సహమము.]

ఈ ముహూర్తపు చక్రమును క్షణమాత్రము గమనించినచో, పాఠకమహాశయుల గుండెయ లవియ గలవు. చిత్తగింపుడు,

కేంద్రములలో శుభగ్రహములు లేవు. గ్రహములే ఉండరాని సప్తమభావములో బుధుడున్నాడు. బుధుడు శుభగ్రహమైనా, ఇది పెండ్లికి మహా దోషము. ఈ క్రింది వాక్యము చూడుడు :—

“ క్రూరోవా, యదివా సౌమ్యో
లగ్నాచ్చంద్రాచ్చ, ఖేచరః,
ఏకోవాయది జామిత్రే,
పత్యుః ప్రాణ హరోభవేత్ ”

(సప్తర్షి మతము).

అందులో బుధుడు కుటుంబాధిపతి. వివాహకాలములో ఇతడ స్తమించుచుండెనని అర్థము !

వివాహమునకు రమారమి ముక్కాలుగంటకు ముందు ఈ బుధునినుండి సార్థకేంద్రదేశము [illegible] సంపుకొన్న చంద్రుడు అబుధ తేజస్సును [illegible] దృష్టిలో లగ్నాధిపతియగు రవికి, కేంద్రదృష్టితో భర్తృస్థానాధిపతియగు శనికి, సంయోగముతో వరుణునికి, అందజేయుటకై పరుగిడుచున్నాడు. ఈ తేజోదానము రవికి 8-30 పి. ఎం. (I st) కి జరుగును. అప్పటికి వివాహపు తంతు ముగిసియుండగలదు. తెల్లవారి 4-52 ఏ. ఎం. (I st) కి శని ఈ తేజస్సును సంపాదించగలడు. అప్పటికి వివాహ సంరంభము శాంతించియుండును. మరునాటి మధ్యాహ్నము 1-40 పి. ఎం (I st) కంటకు ఈ తేజస్సు వరుణగ్రహమును చేరుకోగలదు. ఇక, అప్పుడేమో? వివాహసహమ బిందువు వరుణసంయోగమునే ఆత్రముతో అభిలషించుచుండుట పాఠకమహాశయులు గమనించియుందురు. దైనికచలనమున ఈ బిందువు అప్పటికి వరుణగ్రహ సంయోగమునందే ఉండగలదు. అగుటచే, మహాదోషదూషితుడైన బుధుని తేజశ్శక్తి చంద్రుని దౌత్యముద్వారా లగ్నాధిపతిని (పెండ్లికూతురును), సప్తమాధిపతిని (పెండ్లికుమారుని) కలుసుకొని, తరువాత అచిరకాలమందే, వివాహసహమము పైనున్న వివాహకారి వరుణునితో చేరుకోగలదనుట! ఇది ప్రమాదకారి !

అష్టమస్థానము నొక్కసారి కటాక్షింపుడు. అచట గొప్ప కోలాహలము జరుగుచున్నది. శుక్ర, కుజ, రాహువులచట సమావేశమైనారు. అష్టమ స్థానమును సామాన్యముగా, సౌభాగ్యస్థానమనుట మనవారి సంప్రదాయము. అంగారక వారమును మంగళవారముగా వ్యవహరించినట్లు కాబోలు! వరాహమిహిరాచార్యుడు మాత్రము దీనికి ‘భర్తృ మరణ’ స్థానమనియే నామకరణముచేసినాడు. అట్టి అవాచ్యపుపేరు రుచించక మనవారు దీనికి ఈ ‘మకుట’ పేరు పెట్టిరి. అది యట్లుండనీ.

అచట శుక్రకుజులకు యుద్ధము జరుగుచున్నది. ఆనాడు 9-30 పి. ఎం. (I st) కి [illegible] శుక్ర కుజసంయోగము. గ్రహ యుద్ధము జరుగు దినమును శుభకార్యముల కుపయోగింపరాదని పెద్దలు శాసించినారు శుక్రకుజులు సూర్య కుటుంబములో కాముకీ కాముకులు కదా ? వారి యుద్ధము వివాహ విషయమున లోపముగా పరిగణించ నేల ? అందురేమో. మంచిదే. కాని, ఈ యుద్ధము జరుగుచుండుట పుష్పశయ్యపైన కాదు, భయంకర కాలసర్పము యొక్క ముఖమునుండి ‘భుస్సు’ మని బయలుదేరుచున్న ఘోర విషాగ్ని జ్వాలలలో ! రాహువు ముఖమునకు అత్యంతసమీపమునందే (84 కలలలో), ఇంద్రయముల సరినడుమ, వీరి సంయోగము ! దీనిఫల

మెట్లుంకునో, చదువరులు ఊహించుకోగలరు. అదికాక, ఈ సంయోగము జరుగుట అష్టమ (మృత్యు) స్థానమందు. అష్టమాధిపతి గురువు (దేవపురోహితుడు) నెమ్మదిగా వెనుకనైపున కూర్చుండి పెండ్లిమంత్రములు పాడుచున్నాడు. అపర మంత్రములు కలిపిపాడగలడేమో ఈ మహానుభావుడు! గాంధర్వవివాహములో కలుసుకొన్న తరువాత పండ్రెండు గంటలకే ఈ కాముకీ కాముకులు మహా రాహువు ముఖద్వారమును ప్రవేశించగలరు. వారిని ఈ రాహువు ఏమిచేయగలడో?

వివాహమోక్ష సహమము రాహువునకు పూర్ణ త్రికోణదృష్టిలో నున్నది. అనగా, రాహువునకు ఈ బిందువుపై పరిపూర్ణాభిమానమనుట. వివాహమైన మరుదినమే పత్రికముఖలిరువురు రాహుముఖ ప్రవేశము చేయుచు ఈ బిందువునకు సహా త్రికోణదృష్టికే రాగలరు. మిథునరాశిలోనున్న 'ధర్మ్య మరణ' సహమమునకు బుధుడధికారి. ఇతడు సప్తమభావములో కూర్చుండి మహాయోగి అయినాడు కదా? ఇతని తేజస్సును లగ్నాధిపతియగు రవికి అందచేసిన తరువాత చంద్రుడు ఈ సహమమును పరామర్శించి సప్తమాధిపతికి (శనికి) తేజోదానము చేయవలసియున్నది. వివాహమైనతోడనే. ఏమిటీని యర్థము?

ఏ మహానుభావుడు నిర్ధరించి ఇచ్చెనో ఈ సుముహూర్తమును?

అది యట్లుండె.

'తిథివారర్క్షలగ్నాదేః
శ్రీముక్తం సదసత్ఫలం
తత్సర్వం జాతకాధీనం
న స్వల్పం ఫలదం మతం.'

అను గర్గవాక్యము ప్రకారముగా, వ్యక్తిజాతకము ననుసరించియే కదా ముహూర్త ఫలము వ్యక్తము కాగలదు? వరుని జాతకము మనకు దొరకినది కాదు. వధువు జాతకముతో మాత్రమే సుముహూర్తచక్రమును పోల్చిచూతము కాక. ఆమె జాతకసామగ్రి ఇది :—

| | | |
|---|---|---|
| జన్మదినము | ... | 20—11—1915. |
| జన్మకాలము | ... | 9—43 P.m. (L.M.T.) |
| | | భా. క. |
| జన్మస్థానపు | అక్షాంశలు | 17—28 ఉత్తరము |
| | | గ. 2 కొ. |
| | రేఖాంశ కాలము | 5—14—12 పూర్వము |

| | | | |
|---|---|---|---|
| గు 18-40<br>పె.స. 27-37 | X 25-55 | చ 15-43<br>క.బం.స.<br>28. 28 | భి.భా.స.<br>12-22<br>వి.మో.స<br>26-48 |
| VIII 27-51<br>వ 12-5<br>రా 11-57 | [సాయనము] | | యము 2-51<br>శ 16-4<br>I 28-49 |
| పు.స. 17-16 | పెండ్లికూతురు | | ఇ 2.37<br>కే 11-57<br>పే.స16-25<br>కు 20-58 |
| మా.స.29-38<br>భ.స. 23-55<br>సు 14-54 | బు 13-17<br>ర27-16 | | వి.స. 12-44<br>భ.మ.స.<br>26-43 |

జాతకఫలితముల నట్లుంచి, ఈ సుముహూర్తము మాత్రమెట్లున్నదో, చూతము :—

(i) వివాహలగ్నము జన్మకాలపు కేతు గ్రహ స్థానమందే ఉన్నది. కేతువును మోక్షదాయకుడని కదా మనవారు పిలిచిరి? ఇతడు వివాహమునకు ముక్తి మార్గము చూపించునేమో?

(ii) జన్మకాలములో రాహువుతో చేరి వరుణుడు సప్తమభావములో నున్నాడు. వివాహకాలమున వెదకుకొనిపోయి సప్తమభావమును నికరముగా ఆ జన్మ వరుణస్థానమందే నిలిపినారు ముహూర్తకులు. వియోగప్రియుడు వరుణుడు. వాని ఫలమును కదా సప్తమభావమునకు వీరు ఆహ్వానించుట?

(iii) జాతకములో రవి వృశ్చికాంతమున గండసంధిలోనున్నాడు. ఇతనికే కుటుంబాధిపత్యము. వివాహమునాడు ఈ రవి కుంభరాశిలో 27 వ భాగలో నున్నాడు గదా? విశేషమేమందురా? ఇది జన్మరవికి నిధనకేంద్ర స్థానము. జన్మకుండలిలో అష్టమ (మృత్యు) భావము కుంభరాశిలో 27 భాగలమీద 51 కలలోనున్నది. వివాహకాలపు రవి వివాహానంతరము రమారమి ఇరువది గంటలలో అచ్చటికి చేరుకొగలడనుట భయావహము. కంకణ విసర్జనమైనా కాకమునుపే, కుటుంబాధిపతికి ఇట్టి దురవస్థవచ్చుట ఈ లగ్నకాలపు ఫలము.

(iv) లగ్నములోనున్న మాయావి ఇంద్రుడు జన్మకాల బృహస్పతితో సార్ధకేంద్ర దృష్టిలో నున్నాడని చదువరులు గ్రహించియుందురు. ఇది సన్న్యాసమునకు,——అథవా, కపట సన్న్యాసమునకో——తగిన యోగము. ఇట్టి బృహస్పతికి

ముహూర్తకాలములో మృత్యుస్థానాధిపత్యమిచ్చి, అచట నే అతనికి స్థానము కల్పించినారు ముహూర్తకులు. అతని అధికారమునకు తగిన ఫలమే కదా ఈ ముహూర్తభావునినుండి రాలెగినది ?

(v) జాతకచక్రములో 'భర్తృభాగ్య' సహమమను బిందువు మిథునరాశిలో బుధుని యాజమాన్యములోనున్నది. కాని, ఆ బుధుని ద్వేషించు చున్న వరుణునితో పరిపూర్ణ త్రికోణమైత్రి ఈ బిందువునకు కలదు. పెండ్లికాలమునకు దీనిచలిత స్థానము కర్కాటకరాశిలో $14\frac{1}{2}$ భాగ; అనగా, ముహూర్త కాలపు బృహస్పతికి ఇది స్నేహదృష్టికి వచ్చినదనుట భర్తృభాగ్యము మృత్యుస్థానాధిపతి కటాక్షమునకు లోనైనదని ముహూర్తము సూచించుచున్నది.

మేరువు పూసలవంటి ఈ యోగములు చాలును. చిల్లరదోషముల ప్రశంస ఏల ?

పోనిండు. దైవగతి దుర్నివార్యము. దుష్టగ్రహ వైషమ్యముగల దుర్ముహూర్తమున వివాహముచేసు కొన్న ఆ సీమంతినికి తీరరాని పరితాపము మాత్రమే ఫలమైనది. వివాహమైన మరుదినమే, ఏ ఉల్లాసములలో, ఆ ఉత్సాహములలో, ఏమి పొరపాటు జరిగెనో, ఎవరి బాధ్యతలో, చెప్పజాలము. ఆకస్మికముగా, ఆమె భర్త మోటారుకారు ప్రమాదముపాలై, క్షణములో ఇహలోక యాత్ర చాలించుకొన్నాడు. అప్పటి ఆ యువతి అవస్థ వర్ణింపనలవి కానిది. పెండ్లి పీటలమీద పెట్టించుకొన్న పసుపు పారాణి గుర్తులు మాయకమున్న, వివాహకాలమున అత్యుత్కంఠతో వరునితో మెడలో వేయించుకొన్న పుష్పదామము వాడకయమున్న, భర్తకు ఔర్ధ్వదైహిక క్రియలు చేయవలసివచ్చిన ఆ పెండ్లికూతురు హృదయము ఎన్ని పరియాలై ఏమయ్యెనో, ఊహింపజాలము. ఇంతకన్న మహాఘోరము, హృదయ విదారకము, అను దుర్విధివిలసనమును వినగలమా ? ఇరువదినాల్లు " గంటల కాలమైనా నిలువలేని, స్వప్నప్రాయమైన ఈ సౌమంగల్యముకొరకే నా ! తనయవ్వనము నామె మీాదు గట్టియుండినది? అభాగ్యురాలైన ఆ భర్తను ఆమె స్పృశించియైన ఎరుగునో, ఎరుగదో ? పాపము !

'ఆమె విధి అట్టిది.' అని తేలపలుకుట బహు సులభము. వివాహమునకు ముహూర్తముపెట్టి ఇచ్చి యూ పుణ్యముకట్టుకొన్న వారి విధి ఎట్టిదో ? విషము త్రాళినిచ్చినవారి నీతి యెట్టిదో, ఈ ముహూర్తము నిచ్చినవారి నీతియెట్టిదో యూహించుటకు సందేహము లేదు. అది యట్లుండె.

జాతకములో ఇట్టి ఘోర పరిణామమును సూచించగల దశ యెట్టిదో, విమర్శించుట శాస్త్ర దృష్టిలో ప్రయోజనకారి. రాహుదశలో శన్యంతర మున్నచో, ఈ ఫలములకు చాలునా ? ఇట్టి దశ యెందరికో రాగలదు. స్పష్టలగ్న సాహాయ్యముతో సాయనకుండలిలోని కేవలమైన దశ యెంతమాత్రము సూచింపగలదో చూతము.

జాతకురాలి యోగ్యత గొప్పది. లగ్నాధిపతి చంద్రుడు ఉచ్చగతుడై ఏకాదశ భావములో నున్నాడు. పైగా, వర్గోత్తమాంశ. ఆ చంద్రుని పైన బుధ, వరుణ, గురు, శని, కుజుల దృష్టికలదు. జాతకురాలి హృదయము పుష్పముకంటే మృదువైనది వజ్రముకంటె కఠినమైనది. మంత్రస్థానమందలి బుధునిపై కర్మస్థానమందలి బృహస్పతియొక్క శుభ దృష్టి యుండుటచే, చక్కని వివేకము, ధార్మికచిత్తవృత్తి, మంచి ఆలోచనా శక్తికలవు. బుధచంద్రుల స్నేహదృష్టికి ఫలముగా, ధారాశబుద్ధి, దయాశీలత వచ్చినవి. బుధచంద్రులకు కల వరుణ వేధకారణముగా, ప్రతిభాయుతమగుబుద్ధి, వాదమునకు లొంగని వాక్పాటవము, స్వాతంత్ర్య ప్రియత్వము, స్వాభిమానదృష్టి, వ్యధికరణ స్వభావము, సిద్ధమైనవి. కాని ఈ బుధచంద్రులపై శనికిగల మిత్రదృష్టి పుణ్యమున జాగరూకత, కార్యదక్షత, దూరదృష్టి, సహనశక్తి చేకూరి యున్నవి. అర్జనపటుత్వము, ఆర్థికస్వాతంత్ర్యబుద్ధి, బాధ్యతాయుత ప్రవర్తనము, ఇవి గురుశనుల మిత్రదృష్టి ఫలము.

ఇదంతయు కడురమ్యముగా నున్నది. కాని, సప్తమభావ ఫలము మాత్రము స్పృహణీయముగా లేదు. వరుణ, రాహువులు అందుండుట లోపమే. సప్తమాధిపతి శని లగ్నమందుంట తప్పుగా భావింప రాదు. వైవాహిక జీవితమందు శ్రద్ధ, అనుకూలుడగు భర్త లభించుట, ఇవి రావలసిన ఫలములు. కాని, విశేషమేమనగా, ఈశని లగ్నమున కెంతదూరములో నున్నాడో, రాహు వరుణులు సప్తమభావమునకంతే దూరములో నున్నారు. ఇది యొక విధముగా కర్తరీ దోషమువంటిది. ఆశ, విరహము, ఈ రెండింటి

నడుమ జీవితము అల్లకల్లోలమగుననుట దీని యర్థము. కుజశుక్రులకు చక్రమున త్రికోణదృష్టి యున్నది. దాంపత్య జీవితమునకు తగిన మనఃపరిపాకము, దేహ పాటవము, భావోద్వేగబలత, కాంక్షా ప్రాబల్యము, ఇవి దీని వరప్రసాదము. కాని, ఆ శుక్రుడు అరింట నుండి సౌఖ్యము, భోగము, 'పూజ్య' మను చున్నాడు. ధర్మస్థానమందలి బృహస్పతి గారినుండి ఈ శుక్రునికి కేంద్రవేధ. ఏది ధర్మమునకు కట్టుబడి, సుఖదూరురాలై, మనోవైకల్యము పాలగుట ఈ గురువు నను గ్రహము. బుధుడు విషయ సుఖస్థానములోనుండి వరుణుని కేంద్రవేధకు సరి అయి యున్నాడు. సుఖానుభవము శూన్యము; కారణము బుధుడు, తృతీయాధిపతి. శని గురువులకు కోణములో కుజ వరుణుల కేంద్రములో, లగ్నాధిపతికి (చంద్రునికి) సమసప్తకములోనున్న ఈ సోదర స్థానాధిపతి, అప్రయోజకత్వమో, వ్యధికరణ చిత్తవృత్తియో, అసంకేతిత్యకౌటిల్యమో, ప్రధానగుణముగాకల సోదరుల రక్షణమే తనకు విధ్యుక్త ప్రధానధర్మముగా నిర్ణయించుకొని, దీక్షతో కష్టపడి ఆర్జించిన ద్రవ్యమంతయు వారికొరకై వ్యయపరచుచు, స్వార్థమునుమరచి పోయి జాతకురాలు సుఖదూరురాలైనదని నే నొక్కి చెప్పుచున్నది. మాతృస్థానాధిపతి శుక్రునికి, పితృసహమము నంటుకొనియున్న పితృసహమాధిపతి గురువునకును, కేంద్రవేధ పరస్పరముగానున్నది. వారి నువురికి గిట్టదు. శుక్రుడు లగ్నమునకు సార్థ కేంద్ర స్థానములో షష్ఠభావమును చేరుకొని, ధర్మాధిపతి గురువునుండి కేంద్రవేధపాలై, వివాహసహమమునకు కేంద్రవేధ ఇచ్చుచున్నాడు. సుఖదూరురాలైన తల్లి న్యాయస్థానములో ఆస్తిని కోలుపోయి, అగతిక రాలై, జాతకురాలి వివాహమునకు ప్రతిబంధక సామగ్రి అయినదనుట.

మొత్తముమీద, జాతకురాలిది గొప్ప స్వార్థత్యాగము. మీన గురువు అనుగ్రహమిది. ఇట్టి పరిస్థితులలో, సాధ్యమైనంత త్వరలో ఎవరినో ఒకరిని పెండ్లిచేసుకొని పుట్టిన ఇల్లువదలి 'హాయి' గా సొంత కాపురము చూచు కొందమనుకొనువారే తరుణులలో అనేకులు మనకు ప్రపంచములో సాధారణముగా, కానవచ్చువారు. కాని, స్వబుద్ధి పూర్వకముగా ఈమె నిర్ణయించుకొన్న జీవిత లక్ష్యము యుక్తమా, ఈ నిశ్చయములో వివేకమున్నదా, అను చర్చలో మనకు పనిలేదు. ఎవరెవరికి తోచినరీతి, చదువరులు తామే సిద్ధాంతీకరించవచ్చును.

జాతకచక్రములో గ్రహములున్న విశిష్టభాగల తాత్పర్య మెంత సూటిగా అతుకుచున్నదో, గమనింపుడు. 'ఆదర్శ'ములకు ప్రాధాన్యమిచ్చు భాగలో వ్యధికరణశాలి వరుణుకున్నాడు. శనియున్న భాగ 'ధర్మపరిపాలన శ్రద్ధ'ను సూచించునట్టిది. 'అవివేచన' అను అర్థమిచ్చు భాగలో వివాహసహమము స్థానము నేర్పరచుకొనియుండుట. వివాహకారకుడగు శుక్రుడున్న భాగ 'అనిశ్చయజ్ఞానము' ను తెలుపునట్టిది. రవి (సంకల్పము) పురాతన దుష్కర్మానుభవము'ను తెలుపు గండసంధి ప్రదేశములో నున్నాడు. ఏమి వీని సామరస్యము ? అసామాన్యములైన ఆదర్శములవలన గృహిణీధర్మమునకు భిన్నమైన మార్గములో ధర్మశ్రద్ధ యేర్పడి, వైవాహికజీవిత విషయకమైన అవివేచన, అనిశ్చయ జ్ఞానము, ఫలముగా సంకల్పము ప్రాచీన కర్మానుభవమునకు దారి తీసినదని అర్థమిచ్చును కదా ?

సప్తమాధిపతి శని ధర్మ శ్రద్ధకలవాడగుటచే, వైవాహిక జీవితములో సయితము జాతకురాలు ఎంతో దీక్షతో గృహిణీధర్మమును పాలించియుండుననుటకు సందేహములేదు. కాని, వరుణవేధితులయిన బుధ (బుద్ధి) చంద్రులు (మనుస్సు) శనియొక్క సప్తమాధిపత్యమును త్రోసి రాజుచేసి ప్రవృత్తి వేరుమార్గమునకు ప్రేరేపించినారు. పుణ్యసహమము శనితో సమసప్తక వేధవలన దెబ్బతినినది. వైవాహిక జీవితములో జాతకురాలి పూర్వపుణ్యము పండలేదు. భర్తృమరణ సహమమునకు వరుణుడు సార్థకేంద్ర వేధాస్థానమందే నికరముగా నిలిచియుండుట గమనింపదగిన యోగము.

జన్మకాలపు వాగ్దానములవి. 1951 వ సంవత్సరపు ఫిబ్రవరి మాసమునకు చలితస్థానము లెట్లుండెనో, ఈ క్రింది కుండలి చూపగలదు.

[సూచన :—

| | | |
|---|---|---|
| పు. | అనగా | పుణ్య సహమము. |
| భ. | ,, | భర్తృ సహమము. |
| భ. మ. | ,, | భర్తృ మృతిసహమము |

# గ్రంథ విమర్శనము

## విశాల విశ్వము

[నూరు గీతికలు]

కవికొండల వెంకటరావు. ఇన్నీసుపేట, రాజమండ్రి. వెల 1-4-0.

ఇందులో ఉన్నవి నూరుగీతికలని పుస్తక శీర్షికవల్ల తెలుస్తూందిగాని, ఇవి కేవలం గీతికలే కావు. వీటిలో కొన్ని కథాకావ్యాలుకూడా ఉన్నాయి. ఉదాహరణకు 'రక్తకుల్యగాథ' ఇలాటి కథాకావ్యమే. వీటిలో విశాలమైనవైవిధ్యం ఉండడం వల్ల 'విశాల విశ్వము' అన్న పేరు అన్నివిధాలా సార్థకంగా ఉంది. ఇందులో స్వచ్ఛమైన ప్రకృతి వర్ణనలు, చిన్నచిన్న భావగీతికలు మొదలుకొని శ్రీ వెంకటరావుగారు పూర్వం రచించిన, 'శివరాత్రిప్రభ' దాకా, వివిధమైన రచనలెన్నో కనిపిస్తాయి.

సామాన్యంగా కవికొండలవారి గీతికాసంపుటాలల్లో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. వీటిల్లో చాలా ఉత్తమ గీతికలు మొదలుకొని అతిసామాన్యమైన గీతికలదాకా అన్ని తరహాల రచనలు కలగాపులగంగా కలిసి పోతూంటాయి.

ఈ సంపుటానికి కూడా అలాంటిప్రత్యేకతే వచ్చింది. అయితే ప్రస్తుత సంపుటిలో ఉత్తమ రచనల సంఖ్య చాలా హెచ్చు.

'శివరాత్రిప్రభ' అందరు ఎరిగినదే. దానితో తులతూగజాలే చిన్నగీతికలెన్నో దీనిలో కనిపిస్తాయి. వీటిలోని సారళ్యము, సంక్షేపము-ఒక్కొక్కప్పుడు పాఠకులను మైమరిపించివేస్తాయి. 'పరమసంతోషంబు' అన్న ఈ క్రింది చిన్నిగీతిక దీనికి తార్కాణంగా తీసుకోవచ్చును

"పాడలేకుండుటే-
పరమసంతోషంబు!
నా నీడలో నేను
మౌనుగా కూర్చుండి;—
పాడలేకుండుటే
పరమసంతోషంబు
నా యూహలో నేను
చాయగా నిలుచుండి
పాడలేకుండుటే
పరమసంతోషంబు
నా ప్రేమతో నేను
ఊపిరాడక మిగిలి
పాడలేకుండుటే
పరమసంతోషంబు!"

గోదావరిమీద రచించిన 'ఎరుగవు నన్ను!' అనే ఈ గీతిక వీరి ఛందోవైవిధ్యానికీ, నిశితమైన భావగాంభీర్యానికీ తార్కాణం.

"పోయావనుకున్నాను
నీవు ఏలోకంలోను లేకుండా
ఊరికే నే పోయావనుకున్నాను;
పాయ అంతా నిండిపోయి,
పర్వతాల్లా ఇసక మెట్లడి
వాటుమూసేస్తే ఇదంతా
వట్టిచోటనిపించింది!
నీవు పోయావనుకున్నాను!
లోకంలో నీ ఊరూ పేరూ లేకుండా
పోయావనుకున్నాను!
పాములాగ మెలికలు వడ్డనీరంతా
వస్తుందా! మళ్ళీ- నిరాశ చేసుకున్నాను.
సాముచేసిన కత్తిలాగ మెరిసిపోయిన
వరదంతా-
చూస్తానా? తిరిగి? చూద్దామనుకున్నాను.
ఇసక శుభ్రంగా ఎగిరిపోతే
ఎక్కడైనా దొరకవా?

అని అక్కడే కూర్చుని మేల్కొన్నట్టి
నా మనస్సు నెప్పటిదో—ఏమైందో అదంతా?
ఎందుకుపోగొట్టావు గౌతమా! అంతలేమి?
నీవు తిరిగి వచ్చేసూత్రమా మాత్రం
బోధించిపోయావు కావేమి?
ఇప్పుడు నా యెముకలమీదనించి
ప్రవహిస్తున్నావు!
ఇప్పుడు నా కపాలరంధ్రాల్లోనించి
మట్టి కక్కుస్తున్నావు!—
నీవు తిరిగి వచ్చేసూత్రమా మాత్రం
బోధించి ఉంటేనా?
ఏ తెన్నూ ఎరగని కొత్తనీటిమీద
నా కండెకుగట్టిన నిండు ఆత్మను
ఉబ్బుబ్బూగించి ఉండేవాణ్ణి!
ఊ! ఉత్సాహపడి ఉండేవాణ్ణి!
ఏడుగవు! నన్ను!"

ఈ సంపుటిలో ఇంకా 'దిక్కులేని ఓ మనిషి శవం' 'ననకారు' 'గాక్కని ఉంటాయి!' 'శోక సుక్కు', మొదలైన ఉత్తమరచనలింకా ఎన్నో ఉన్నాయి.

పరిణత కవితాభిమానులందరికీ కవికొండలవారి 'నిశాల విశ్వము' అవశ్య పఠనీయము.

## గాథా సప్తశతిసారము

కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి. కూచిభొట్ల వీరరాఘవస్వామి. సాహితీసమితి తెనాలి. వెల: రూపాయిన్నర.

గాథాసప్తశతి కింతకుపూర్వము శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు మొదలైనవారు రచించిన ఆంధ్రీకృతులున్నాయి.

ఏదైనా కొంత విశేషం చూపించగలిగినప్పుడే మళ్ళీ తెలిగించడం బాగుంటుంది.

ఈ క్రొత్త ఆంధ్రీకృతిలో అలాంటి విశేషమేమీ కనబడదు. ఆంధ్రీకరణంలో గీతాల నడక చాలాచోట్ల కుంటుతూ అర్థసమన్వయానికికూడా అడ్డు తగులుతూంది.

ఈ క్రింది పద్యం మోస్తరుగానైనా సాఫీగా నడిచిపోయే ఆంధ్రీకరణాలిందులో చాలా స్వల్పంగా ఉన్నాయి.

'అనుభవింపుము స్వాధీనమైనదాని
పల్లెటూరిలో నెటనుండి వచ్చు లవణ?
మున్న నయ్యది స్నేహము సున్న యైన,
దానితోఁ బ్రయోజనమేమి? తరుణరసిక!'

## దేశీయ మూలికా వైద్యము

బొమ్మా కేశవులు. ప్రతులకు పక్షవాత వైద్యులు. నెల్లూరు వెల 10 రూపాయలు.

మనదేశంలో మూలికావైద్యం చిరకాలానుగతంగా వస్తున్న చికిత్సాపద్ధతి. పాశ్చాత్య వైద్య వ్యామోహం ప్రబలినకాలంనించీ ఈ పద్ధతిమీద ప్రజాదరం సన్నగిల్లింది. శాస్త్రం తిన్నగా తెలియని సంచికట్టు వైద్యుల అజ్ఞానంకూడా దీనికి కారణమే.

శ్రీ బొమ్మా కేశవులుగారీ గ్రంథంలో దేశంలో సర్వత్ర సులభంగా అందరికీ లభ్యమయ్యే కలబంద, గుంటగలగర, జిల్లేడు మొదలైన ముప్పై అయిదు మూలికలనుగురించిన లక్షణాలు, అవి వాడవలసిన తీరులు, ప్రక్రియలు మొదలైనవన్నీ విస్తరించి వ్రాశారు.

శ్రీ ధరణికోట వెంకటసుబ్బయ్యగారు పీఠికలో సూచించినట్లు ఈ దేశీయములైన మూలికలనుగురించి ఎంతైనా పరిశోధన జరగవలసి ఉన్నది. అటువంటి పరిశోధనకుకూడా ఇది ఎంతైనా సహాయకారి కాగలదు.

గ్రంథరచయిత వంశపారంపర్యంగా తెలుసుకున్న ప్రత్యేక విషయాలు, స్వానుభవము క్రోడీకరించి ఈ గ్రంథం రచించారు.

ఇది ఆయుర్వేద పరిశోధకులకు వైద్యులకు మాత్రమేగాక సామాన్యులకుగూడా ఉపయోగించే ఉత్తమ వైద్య గ్రంథం. గ్రంథకర్తగా రాయామూలికలకు అనేకభాషలలో పర్యాయపదాలు ఇచ్చి ఉండడంవల్లను కొంతవరకు ఆయామూలికలు గుర్తించడానికివీలుపడుతుందిగాని మూలికల రూపచిత్రాలు

కూడా చేర్చిఉంటే ఈ పుస్తకం ఇంకా ఉపయోగకారిగా ఉండేది.

పుస్తకశైలి, చివర చేర్చిన విషయానుక్రమణిక మొదలైనవి పాఠకులకు చాలా సహాయకారులుగా ఉన్నాయి.

ఇంచుమించు అయిదువందల పేజీలు, చక్కని ముద్రణ, గ్రంథప్రాశస్త్యము మొదలైనవి చూస్తే దీని ఖరీదు అంత ఎక్కువని చెప్పడానికి వీలులేదు.

---

## వేదభూగోళము

[రెండవ భాగము]

శ్రీ పత్రవేటి తిప్పాజోస్యులు. యాడికి గ్రామం. అనంతపురం జిల్లా. వెల : 12 రూపాయలు.

దీని పేరేమో వేదభూగోళం. కాని దీనిలో వేదాల్లో ఉన్న భూగోళ విషయాలు, వాటిని గురించిన చర్చ అంతగా కనబడవు.

గ్రంథకర్త పురాణాల్లో ఉన్న భూగోళ విషయాలన్నీ క్రోడీకరించి వాటిని గురించి చాలా విపులంగా వ్రాశారు.

అయితే దీనితోబాటు నేటి కాలపు భూగోళ పద్ధతినిబట్టి ఆయా ప్రదేశాల స్థితిగతులు కూడా జరిగితే చాలా బాగుండేది.

ఇక ఈ పుస్తకంలో కేవలం పురాణోక్తములైన భూగోళవిషయాలేకాక నరకాలు, పితృదేవతలను గురించిన సంగతులు, ప్రార్థనకు సంబంధించిన ఆధ్యాత్మిక భావాలు, సృష్టిక్రమము మొదలైనవెన్నో ఉన్నాయి. ఇవన్నీ చేర్చడంవల్ల ఇది ఇంచుమించు 6 వందల పేజీలు గల పెద్దగ్రంథంగా పెరిగిపోయింది. ఇలా కాకుండా ఒక నిర్దిష్ట రచనా పద్ధతి పెట్టుకుని వ్రాసి ఉంటే ఈ పుస్తకం ఇంకా ఉపయోగకారిగా ఉండేది. కేవలం సాగాసాగా వ్రాసుకుపోవడంవల్ల ఇది పురాణాల్లో ఉన్న కొన్ని భూగోళాది విషయాలు తెలుసుకోదలచినవారికి మాత్రమే ఉపయోగకారిగా పరిణమించింది.

---

## *Sonnets to Eve*

ఆర్. ఎమ్. గల్లా. నలందా పబ్లికేషన్స్. ఫస్ట్ ఫ్లోర్, సమ్మార్, ఎస్. పి. ఎమ్. రోడ్. బొంబాయి. 1. వెల : ఒకరూపాయి.

ఇది 12 సానెట్లు (*Sonnets*) గల చిన్న ఆంగ్లపద్య కావ్య సంపుటి. రచయిత ఊహ విహార సంచారంలో తారసిల్లిన ఆయా నాయికలపై ప్రకటించిన ప్రేమ, వ్యామోహము మొదలైన భావాలే ఈ ఖండకావ్యాల విషయాలు. ఇంతేగాక వీరు నానా, అన్నా కెరణినాల మీదకూడా మరి రెండు సానెట్లు విసిరారు.

ఈ రచనల ధోరణి అంతా ఆంగ్లసాహిత్యంలో 19 శతాబ్ది ఉత్తరార్ధంలో బయలుదేరిన రెండోరకపు ప్రేమకవిత్వానికి మూడోరకపు అనుకరణలా ఉంది.

ఈ క్రింది సానెట్ భాగాన్నిబట్టి వీరిరచనా ధోరణి బాగా పట్టుకోవచ్చును—

*O you who play upon my heartstrings those wan*
*melodies of mad love in sad tune,*
*will you caress me with your lips of poison*
*to an eternal sleep, to an endless swoon ?*
*And will you think of me wilhout mere thinking ?*
*and will you speek to me without mere speaking ?*
*and will you sing to me without mere singing ?*
*and will you sleep with me without mere sleeping ?*

అని ఇది ఇంచుమించుగా ఇదేధోరణిలో ముగిసిపోతుంది.

---